# పరమహంస యోగానంద

# ఒక యోగి ఆత్మకథ


109.22
యోగాన - ఒకయో
137221




Yogoda Satsanga Society of India

FOUNDED 1917

Paramahansa Yogananda



*Paramahansa Yogananda*

# పరమహంస యోగానంద

(1893 జనవరి 5 - 1952 మార్చి 7)

ప్రేమావతార్ (చూడండి పే. 420)

# ఒక యోగి ఆత్మకథ


## పరమహంస యోగానంద

* సౌజన్యం *

కీ॥శే॥ ఆచార్య హరి శివకుమార్
రిటైర్డ్ ప్రొఫెసర్, తెలుగు డిపార్ట్మెంట్
కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్.

ఉపోద్ఘాతం

డబ్ల్యు. వై. ఇవాన్స్-వెంట్జ్, ఎం.ఎ.డి లిట్., డి.ఎస్.సి.,


---

"క్రమశిక్షణ ద్వారా శరీరాన్ని అదుపు చేసుకునే తపస్వుల కన్నను, జ్ఞానమార్గాన్ని అనుసరించే వారికన్నను, కర్మ మార్గాన్నవలంబించే వారికన్నను, యోగి ఉన్నతుడుగా భావించబడుతున్నాడు; ఓ అర్జునా, నువ్వు యోగివి కమ్ము!"

*- భగవద్గీత-VI 46*




Yogoda Satsanga Society of India
FOUNDED 1917
Paramahansa Yogananda

తెలుగు అనువాదం కాపీరైట్ © 2002 సెల్ఫ్-రియలైజేషన్ ఫెలోషిప్

అన్ని హక్కులూ ఆరక్షితమయినవి. పుస్తక సమీక్షల్లో సంగ్రహంగా ఉదాహరించడానికి తప్ప "ఒక యోగి ఆత్మకథ" *(Autobiography of a Yogi)* లో ఏ భాగమూ Self-Realization Fellowship, 3880 San Rafael Avenue, Los Angeles, California 90065-3298, U.S A వారి లిఖితానుమతి లేకుండా ఎలక్ట్రానిక్, యాంత్రిక, తదితరమైన ఫోటో కాపీ, రికార్డింగ్, లేదా ఇన్ఫర్మేషన్ స్టోరేజి రిట్రీవల్ సిస్టంతో సహా-ఎటువంటి సాధనం ద్వారానూ పునరుత్పాదించడంగాని అందజేయడంగాని చేయగూడదు.

**ఒక యోగి ఆత్మకథ**

పూర్తి అసంక్షిప్త ప్రతి

109.22
బొరస/ బసొ3A

ద్వితీయ తెలుగు ప్రచురణ 2002
ద్వితీయ తెలుగు ముద్రణ 2003



**యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా
సెల్ఫ్-రియలైజేషన్ ఫెలోషిప్ వారి
అధికృత ప్రచురణ**

C-69663

ఈ పుస్తకపు "ట్రేడ్‌డ్రెస్" సెల్ఫ్-రియలైజేషన్ ఫెలోషిప్ వారి ట్రేడ్‌మార్కు

ప్రచురణ ముద్రణ
YOGODA SATSANGA SOCIETY OF INDIA
Yogoda Satsanga Math
21, U N Mukherjee Road
Dakshineswar, Kolkata 700 076






పంపిణీదారు
Jaico Publishing House

యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా ఆశ్రమాల్లోనూ,
భారతదేశమంతటా ఉన్న ధ్యాన కేంద్రాలూ మండలుల్లోనూ దొరుకుతుంది

ధన్యులూ పూజనీయులూ

నా గురుదేవులు

**శ్రీశ్రీ స్వామి శ్రీయుక్తేశ్వర్ గిరి** వారి

దివ్య కరకమలాల కు

సమర్పితం

# కృతజ్ఞతలు

ఈ పుస్తకపు [ఆంగ్ల] రాతప్రతిని ముద్రణకు తయారుచేయడంలో విశేషమైన శ్రమ చేసిన మిస్.ఎల్.వి. ప్రాట్ (తారామాత)కు నేను ఎంతో ఋణపడి ఉన్నాను. తను భారతదేశంలో రాసిన యాత్రా దినచర్య పుస్తకం నుండి కొన్ని విషయాలు వాడుకునేందుకు అనుమతించిన మిస్టర్ సి. రిచర్డ్ రైట్‌కు నా కృతజ్ఞతలు. డాక్టరు డబ్ల్యు వై. ఇవాన్స్ వెంట్జ్ గారికి ఈ పుస్తకానికి ఉపోద్ఘాతం రాసినందుకే గాక వారిచ్చిన సూచనలకు, ప్రోత్సాహానికి కూడా కృతజ్ఞతలు తెలియ చేసుకుంటున్నాను.

**అక్టోబరు 28, 1945** **పరమహంస యోగానంద**

# రచయిత గురించి

"పరమహంస యోగానంద వెలకట్టలేని వజ్ర సదృశుడు. అటువంటి మరోవ్యక్తిని ప్రపంచం ఇంతవరకు చూడలేదు. భారతావనికి వన్నెతెచ్చే ఆర్ష ఋషుల, ద్రష్టల ఆదర్శప్రాయుడైన ప్రతినిధిగా ఆయన వెలుగొందారు"

**- శ్రీశ్రీ స్వామి శివానంద**
సంస్థాపకులు, 'దివ్యజీవన సంఘము' ఋషీకేశ్.

"ఈ లోకంలో యోగానందగారి ఉనికి చిమ్మచీకటిలో ఉజ్జ్వలంగా వెలిగే జ్యోతి లాంటిది. అలాటి మహాత్ములు భూమిమీద చాలా అరుదుగా అవతరిస్తారు; మనుషులకు తమ అవసరం నిజంగా ఉన్నప్పుడు."

**- జగద్గురు శంకరాచార్య, శ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి**
కంచి కామకోటి పీఠాధిపతి

1893 సం రం జనవరి 5న, భారతదేశంలోని ఉత్తరప్రదేశ్‌లో గోరఖ్‌పూర్‌లో జన్మించిన శ్రీశ్రీ పరమహంస యోగానందగారు, అన్ని జాతుల అన్ని మతాల జనులు 'ఆత్మ' యొక్క సౌందర్యాన్ని, ఔన్నత్యాన్ని, దివ్యత్వాన్ని సాక్షాత్కరింప చేసుకుని తమతమ జీవితాల్లో వాటిని మరింతగా వ్యక్తపరచడానికి సహాయ పడడంలో తమ జీవితాన్ని గడిపారు.

1915 సం రం లో కలకత్తా విశ్వవిద్యాలయం నుండి పట్టభద్రులైన తరువాత యోగానందులు తమ గురుదేవులు శ్రీశ్రీస్వామి శ్రీయుక్తేశ్వర్‌గిరి వారి వద్ద సన్యాసదీక్ష స్వీకరించారు. సనాతన భారతీయ ధ్యానప్రక్రియ అయిన 'క్రియా యోగాన్ని' ప్రపంచమంతటా వ్యాప్తి చేయడమే యోగానందుల జీవిత కర్తవ్యం అని శ్రీయుక్తేశ్వరులు ముందుగానే జోస్యం చెప్పారు. 1920 సం॥ రంలో అమెరికాలోని బోస్టను నగరంలో జరిగే మత ఉదారవాదుల అంతర్జాతీయ మహాసభకు

భారతదేశ ప్రతినిధిగా రమ్మంటూ వచ్చిన ఆహ్వానాన్ని అంగీకరించి, యోగానందులు అమెరికా వెళ్ళారు.

తన బోధనలకు ప్రసార మాధ్యంగా పనికివచ్చేందుకు శ్రీశ్రీ పరమహంస యోగానంద యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా / సెల్ఫ్-రియలైజేషన్ ఫెలోషిప్ సంస్థను స్థాపించారు. తన రచనల ద్వారానూ, భారత దేశమూ, అమెరికా, ఐరోపాల్లో తన ప్రసంగ-పర్యటనల ద్వారానూ అనేకానేక ఆశ్రమాలూ ధ్యాన కేంద్రాలూ స్థాపించడం ద్వారానూ యోగానందులు వేలాది సత్యాన్వేషకులకు సనాతన యోగ శాస్త్రాన్నీ యోగతత్త్వాన్నీ బోధించి విశ్వజనీనమైన యోగ - ధ్యాన పద్ధతుల్ని అందరికీ అందుబాటులోకి తెచ్చారు. లాస్ ఏంజిలిస్ నగరంలో 1952 మార్చి 7 న పరమహంసజీ 'మహాసమాధి' చెందారు.

శ్రీశ్రీ పరమహంస యోగానందులు ప్రారంభించిన ఆధ్యాత్మిక, సేవా కార్యక్రమాలు నేడు వారి అతి సన్నిహిత ప్రారంభ శిష్యుల్లో ఒకరైన శ్రీశ్రీ దయామాత గారి మార్గదర్శిత్వంలో కొనసాగుతున్నాయి. 1955 సం రం నుండి యోగదా సత్సంగ సొసైటీ / సెల్ఫ్ - రియలైజేషన్ ఫెలోషిప్ సంస్థకు సంఘమాత మరియు అధ్యక్షులుగా పనిచేస్తున్న శ్రీశ్రీదయామాత పరమహంస యోగానంద గురుదేవుల బోధనల ప్రపంచవ్యాప్త ప్రచారానికి వారి అభీష్టాల్నీ, ఆదర్శాల్నీ తు.చ. తప్పకుండా అనుసరిస్తున్నారు.

## **ఒక యోగి ఆత్మకథ** కు ప్రపంచ వ్యాప్త ప్రశంసలు

**ఒక యోగి ఆత్మకథ** నవ శకపు ఉపనిషత్తుగా సంభావించబడుతోంది .. ప్రపంచ వ్యాప్తంగా లక్షలాది సత్యాన్వేషకుల ఆధ్యాత్మిక పిపాసను అది తీర్చింది... "ఒక యోగి ఆత్మకథ" అనే బంగారు పాత్రలో అమరమైన భారతదేశపు సనాతన ధర్మామృతం నిలవ చెయ్యబడింది."

ప్రొఫెసర్ అశుతోష్ దాస్, పిహెచ్.డి., డి.లిట్., కలకత్తా విశ్వవిద్యాలయం

"ఇది ఒక అసాధారణమైన కథ" - 'న్యూయార్క్ టైమ్స్' పత్రిక

"ప్రతి సంవత్సరం ప్రచురించబడే వేలాది పుస్తకాల్లో కొన్ని వినోదాన్ని కలిగిస్తాయి, కొన్ని విజ్ఞానాన్నిస్తాయి, కొన్ని జ్ఞానభిక్ష పెడతాయి. ఒక పాఠకుడికి ఒకే పుస్తకంలో ఈ మూడూ లభిస్తే, అతడు తనని తాను అదృష్టవంతునిగా భావించుకోవాలి. "ఒక యోగి ఆత్మకథ" ఇంకా ఎంతో అరుదైన పుస్తకం - అది మనస్సు యొక్క, ఆత్మయొక్క కిటికీలను తెరుస్తుంది." - ఇండియా జర్నల్

"ఒక ఆకర్షణీయమైన జీవితాన్ని, ఎన్నడూ విని ఉండనంత విశిష్టమైన ఒక వ్యక్తిత్వాన్ని, సాటిలేని శక్తితోనూ స్పష్టతతోనూ ఈ పుస్తకం వెల్లడి చేస్తుంది; పాఠకుడు ఆద్యంతం ఉత్కంఠతో నిండిపోతాడు... కేవలం మానసికమైన, ఆధ్యాత్మికమైన మానవకృషికి మాత్రమే శాశ్వతమైన విలువ ఉన్నదనీ, మానవుడు తన ఆంతరిక శక్తితో భౌతికమైన అవరోధాల నన్నిటినీ జయించగలడనీ ఈ పుటల్లో తిరుగులేని ఋజువు లభిస్తుంది.... ఒక ఆధ్యాత్మిక విప్లవాన్ని తీసుకువచ్చే శక్తి ఈ ప్రముఖమైన జీవితచరిత్ర కుందని మనం ఎంచాలి."

- స్లీప్విగ్ - హోల్స్టీనిష్ టాగస్ పోస్టు, జర్మనీ

"చక్కటి వివరణలతో కూడిన మనోహరమైన గ్రంథం"

- న్యూస్‌వీక్ పత్రిక

"ఒక యోగి ఆత్మకథ వంటి సుందరమైన గాఢమైన సత్యనిష్ఠమైన గ్రంథం నేటి పాఠకుడికి చాలా అరుదుగా లభిస్తుంది.... అది జ్ఞానపూర్ణమైనదీ, ఎన్నో వ్యక్తిగత అనుభవాలతో నిండినది... భౌతిక మరణానంతర జీవితపు రహస్యాలని గూర్చి వర్ణించే అధ్యాయం ఈ పుస్తకంలోని ఎన్నో అద్భుతమైన అధ్యాయాల్లో ఒకటి."

- లా పాజ్, బొలీవియా

"ఆధ్యాత్మిక అస్తిత్వపు మర్మాల్లోకి చాలామంది కంటె లోతుగా చొచ్చుకు పోయిన అరుదైన మేధావి... మన గైడ్ వాటి అద్భుతాల్ని స్పష్టతతోనూ, విశ్వాసంతోనూ, అందంగానూ వర్ణించాడు."

- ప్రొఫెసర్ రేమాండ్ ఎఫ్. పైపర్,
సిరాక్యూజ్ విశ్వవిద్యాలయం, న్యూయార్క్.

"మరణంలేని సాధువుల గురించీ అద్భుతంగా రోగాల్ని నయం చెయ్యడం గురించీ యోగానందులు వర్ణించినా లేక ఆయన భారతదేశపు జ్ఞానాన్ని, యోగవిద్యను గూర్చి చెప్పినా, పాఠకుడు సమ్మోహితుడు అవడం ఖాయం."

డీ వెల్ట్‌వాష్ , జూరిచ్ , స్విట్జర్లాండు.

"ఇది పాఠకుడ్ని వశపరచుకొనే గ్రంథం; ఎందువల్లనంటే, ప్రతి మనిషి హృదయంలో నిద్రాణమైయున్న ఆశల్ని, కోర్కెల్ని ఇది మేలుకొల్పుతుంది."

- 'ఇల్ టెంపొదెల్ లునెడి', రోమ్.

"అతి లలితంగాను అందంగాను చెప్పిన ఆత్మకథల్లో ఇది ఒకటి.... నిజమైన జ్ఞాన భాండాగారం... ఈ పుటల్లో మనం కలుసుకునే మహావ్యక్తులు గొప్ప ఆధ్యాత్మిక జ్ఞానంతో నిండిన ఆప్తమిత్రుల్లా మనకి తరుచు జ్ఞాపకం వస్తూ ఉంటారు; అట్టి మహానుభావుల్లో ఒకరు దేవుడితో మత్తెక్కిన గ్రంథకర్తే.... విశిష్టమైనది... ఒక గొప్ప వ్యక్తి ఆత్మలోకి తొంగిచూసే సువర్ణావకాశం."

డాక్టర్ అన్నావాన్ హెల్మ్‌హోల్ట్జ్, మిన్నెసోటా విశ్వవిద్యాలయం, అమెరికా

"మనల్ని మంత్రముగ్ధుల్ని చేసి, శాశ్వతంగా కదిలించే అగాధమైన విజ్ఞానం"

- 'హాగ్స్ పోస్టు', హాలెండు.

"ప్రఖ్యాతి గాంచిన ఒక యోగి ఆత్మకథలో యోగానందులు, యోగసాధనలో ఉన్నత స్తరాల్లో సాధకుడు పొందే విశ్వచేతనానుభవాన్ని మనం నిర్ఘాంతపోయే మాటల్లో

వర్ణించారు; మానవ స్వభావంలోని వివిధ ఆసక్తికరమైన అంశాల మీద యోగపరమైన, వేదాంతపరమైన దృష్టికోణం నించి అనేక వ్యాఖ్యానాలు చేశారు."

- రాబర్ట్ ఎస్. ఎల్‌వుడ్, పిహెచ్.డి., స్కూల్ ఆఫ్ రెలిజియన్
దక్షిణ కాలిఫోర్నియా విశ్వవిద్యాలయం

"యోగుల ప్రపంచంతో ఈ పునః పరిచయం, భౌతిక వాస్తవాన్ని మించిన యోగి-లోకపు మానసిక ఔన్నత్యం, దాని ఆధ్యాత్మిక క్రమశిక్షణ నాకు అనేక విషయాలు బోధించాయి. ఈ అద్భుత ప్రపంచానికి సంబంధించిన కొంత అవగాహన నాకు కలగ చేసినందుకు నేను మీకు ఋణపడి ఉన్నాను."

- నోబెల్ బహుమాన గ్రహీత థామస్ మాన్

"పరమహంస యోగానంద ఎటువంటి వ్యక్తి అంటే.... ఆయన ఇచ్చిన స్ఫూర్తిని ప్రపంచం నలుమూలల్లోని ప్రజలు భక్తిపూర్వకంగా స్వీకరించారు."

- 'రైడర్స్ రివ్యూ', లండన్

"పరమహంస యోగానందగారితో నేను సమావేశమైన అనుభవం నా జీవితంలోని మరపురాని ఘట్టాల్లో ఒకటిగా నా స్మృతిపథంలో ముద్రితమై ఉంది.... వారి దర్శన ఫలితం అగణితమైనది.... నేను వారి వదనంలోకి చూస్తూ ఉండగా నా కళ్ళు ఒక ప్రకాశంతో మిరుమిట్లు గొలిపినట్టైంది; అది అక్షరాలా వారినుండి ప్రసరించిన ఒక ఆధ్యాత్మిక కాంతి. ఆయన అనంతమైన మార్దవం, అపారమైన దయ నులివెచ్చని ఎండలా నన్ను చుట్టేశాయి... ఆయన ఒక ఆత్మజ్ఞాన సంపన్నుడైనప్పటికీ, ఆయన అవగాహనా, సునిశిత దృష్టి అతి సాధారణ ప్రాపంచిక సమస్యల్లోకి కూడా వ్యాపించి ఉండడం గమనించాను. భారతదేశపు ప్రాచీన విజ్ఞాన సారాన్ని ప్రపంచానికి అందించే నిజమైన భారత రాయబారిని ఆయనలో కనుగొన్నాను."

డాక్టర్ వినయ్ రంజన్ సేన్, అమెరికాకు భారతదేశపు పూర్వ రాయబారి.



# శ్రీశ్రీ పరమహంస యోగానంద గురుదేవుల ఆధ్యాత్మిక వారసత్వ సంపద

పరమహంస యోగానందులు జన్మించి ఒక శతాబ్దం గడిచాక, సమకాలీన ఆధ్యాత్మిక ప్రముఖుల్లో ఒకరుగా గుర్తింపు పొందారు. వారి జీవితంయొక్క, వారు చేసిన బృహత్కార్య క్రమాల యొక్క ప్రభావం పెరుగుతూనే ఉంది. కొన్ని దశాబ్దాల క్రితం ఆయన మతంలోనూ, వేదాంతంలోనూ తీసుకువచ్చిన కొత్త ఆలోచనలూ విధానాలూ ఇప్పుడు విద్య, మానసిక శాస్త్రం, వాణిజ్యం, వైద్యం తదితర మానవ ప్రయత్నరంగాల్లో చోటు చేసుకొంటూ మరింత సమగ్రమైన, మానవతాపూర్ణమైన, ఆధ్యాత్మికమైన జీవన విధానం ఆవిష్కరించటానికి అద్భుతంగా దోహదపడుతున్నాయి.

పరమహంస యోగానందగారి బోధనలు ఈ విధంగా వివిధ రంగాల్లో సృజనాత్మకంగా ఆచరణలోనికి రావడమూ, విభిన్నమైన వేదాంత, ఆధ్యాత్మిక ఉద్యమాల నాయకుల ద్వారా వ్యాఖ్యానింపబడడమూ అన్న సత్యం, వారు చేసిన బోధనలయొక్క దైనందిన జీవితంలో ఉపయోగాన్ని సూచించడమే గాక, ఆయన ఆధ్యాత్మిక వారసత్వం కాలగమనంలో పలచబడడంగాని, ముక్కలు చెక్కలై పోవడంగాని, వక్రీకరింపబడడం గాని జరగకుండా చర్యలు తీసుకోవాల్సిన అవసరాన్ని కూడా నొక్కి చెబుతుంది.

యోగానంద గురుదేవుల్ని గూర్చి వివరాలు ఇచ్చే వివిధ సమాచార స్థానాలు అధికంగా పెరగడంతో, ఆయన జీవితాన్ని, బోధనలను ఒక ప్రచురణ సరిగ్గా అందిస్తుందో లేదో మాకెలా తెలుస్తుందని పాఠకులు తరచు అడుగుతూంటారు. దీనికి జవాబుగా మేం చెప్పేదేమంటే, తన బోధనలను వ్యాపింపచెయ్యడానికి, రాబోయే తరాలకోసం వాటి సమగ్రతను, స్వచ్ఛతను పరిరక్షించడానికి పరమహంస యోగానందులు యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా / సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ అనే సంస్థను స్థాపించారు. ఈ యోగదా సత్సంగ సొసైటీ / సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ యొక్క ప్రచురణల సమితికి నాయకత్వం వహిస్తున్న గురుదేవుల సన్నిహిత శిష్యుల్ని ఆయన ప్రత్యేకంగా ఎంపికచేసి, శిక్షణయిచ్చి తన ప్రసంగాలు, రచనలు, 'యోగదా సత్సంగ పాఠాలు' ఎలా ప్రచురణకి

తయారుచెయ్యాలి అన్న విషయంలో ప్రత్యేక సూచనలు ఇచ్చారు. ఈ ప్రియతమ జగద్గురువుల సార్వజనీన సందేశం తన మూలశక్తితో, ప్రామాణికత్వంతో చిరకాలం వెలుగొందడానికి ఈ యోగాదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా / సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ ప్రచురణల సమితి సభ్యులు గురుదేవులు ఇచ్చిన ప్రత్యేక సూచనలను ఒక పవిత్రమైన బాధ్యతగా స్వీకరించి ఆచరిస్తున్నారు.

తన విశ్వవ్యాప్తమైన ఆధ్యాత్మిక, సేవా కార్యక్రమాలు కొనసాగించేందుకు తాను స్థాపించిన సంస్థను గుర్తించేందుకు వీలుగా పరమహంస యోగానంద గురుదేవులే యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా / సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ అనే ఈ పేరు మరియు (పైన చూపబడిన) యోగదా సత్సంగ సొసైటీ / సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ చిహ్నామూ కల్పించారు. ఇవి అన్ని వై.ఎస్.ఎస్. / ఎస్.ఆర్.ఎఫ్. పుస్తకాల మీద, ఆడియో మరియు వీడియో క్యాసెట్ల మీద, ఫిల్ములు, ఇతర ప్రచురణలమీద ముద్రితమై శ్రీశ్రీపరమహంస యోగానంద గురుదేవులు స్థాపించిన సంస్థనుండే ఇవి వెలువడ్డాయని, వారు తమ బోధనలను ఏ విధంగా అందించాలనుకొన్నారో ఆ విధంగానే నమ్మకంగా అందిస్తున్నవని పాఠకులకు రూఢి పరుస్తాయి.

**- యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా / సెల్ఫ్ - రియలైజేషన్ ఫెలోషిప్**

# ఉపోద్ఘాతం

డబ్ల్యు. వై. ఇవాన్స్ - వెంట్జ్, ఎం.ఏ., డి లిట్., డి ఎస్.సి.
జీసస్ కాలేజి, ఆక్స్‌ఫర్డ్.

*ద టిబెటన్ బుక్ ఆఫ్ ద డెడ్, టిబెట్స్ గ్రేట్ యోగి మిలరెపా, టిబెటన్ యోగ అండ్ సీక్రెట్ డాక్ట్రిన్స్* మొదలైన గ్రంథాల రచయిత

యోగానందగారి 'ఆత్మకథ', భారతదేశపు జ్ఞానసంపన్నుల గురించి ఇంగ్లీషులో వచ్చిన కొద్ది పుస్తకాల్లో ఒకటి కావడంవల్లా, అది కూడా ఒక పత్రికా రచయితో, విదేశీయుడో రాసింది కాకుండా, ఆ జాతి ప్రజల్లోనే ఒకరై పుట్టి పెరిగి, శిక్షణపొంది - టూకీగా చెప్పాలంటే - యోగుల గురించి ఒక యోగే స్వయంగా రాసిన పుస్తకం కావడం వల్లా దీని విలువ ఘనంగా పెరిగింది. ఆధునిక హిందూ సాధువుల అసాధారణ జీవితాలకూ శక్తులకూ ఒక ప్రత్యక్ష సాక్షి కథనమయిన ఈ గ్రంథానికి సకాలికతా విష్కాలికతా కూడా సమకూరిన ప్రాముఖ్యం ఉంది. ఈ విశిష్ట రచయితతో భారతదేశంలోనూ అమెరికాలోనూ కూడా నాకు పరిచయ భాగ్యం కలిగింది; ప్రతి పాఠకుడూ ఈయనకు సముచిత ప్రశంస, కృతజ్ఞతలు తెలుపుకోవాలి. అసామాన్యమైన ఈయన జీవిత వృత్తాంత గ్రంథం, హైందవ మనస్సునూ హృదయాన్నీ భారతదేశపు ఆధ్యాత్మిక సంపత్తినీ లోతులు తరిచి బహిర్గతం చేసింది; ఆ మాదిరి గ్రంథాల్లో ఇది అత్యుత్తమమైనదని నా నిశ్చితాభిప్రాయం; ఇటువంటిది పాశ్చాత్య దేశాల్లో ఇంతవరకు ఎన్నడూ ప్రచురితం కాలేదు.

ఇందులో వర్ణించిన ఋషుల జీవిత చరిత్రల్లో శ్రీయుక్తేశ్వర్‌గారిది ఒకటి. నాకు వారి పరిచయభాగ్యం కలిగింది. 'టిబెటన్ యోగ అండ్ సీక్రెట్ డాక్ట్రిన్స్'* అన్న పుస్తకం ముఖ పత్రంలో ఒక భాగంగా, పూజనీయులైన ఆ సాధుపుంగవుల ఛాయాచిత్రం కూడా ముద్రించడం జరిగింది. శ్రీయుక్తేశ్వర్‌గారిని నేను కలుసుకొన్నది, బంగాళాఖాత తీరంలోని ఒరిస్సా రాష్ట్రంలో, పూరీ నగరంలో. అప్పటికే ఆయన, సాగర తీరాన ప్రశాంతమైన ఒక

---

* ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్, 1958.

ఆశ్రమానికి అధిపతులు; యువక శిష్య బృందానికి ఆధ్యాత్మిక శిక్షణ ఇవ్వడం ఆయన ప్రధాన వ్యాపకం.

అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోనూ, ఉత్తర దక్షిణ అమెరికాల్లోనూ, ఇంగ్లండులోనూ కూడా ఉన్న ప్రజల సంక్షేమంపట్ల ఆయనకు గాఢమైన ఆసక్తి ఉంది. దూరప్రాంతాల్లో జరిగే కార్యకలాపాల గురించి, ముఖ్యంగా కాలిఫోర్నియాలో తమ ముఖ్యశిష్యులైన పరమహంస యోగానందగారు నిర్వహించే కార్యకలాపాల గురించి నన్ను అడిగారు. యోగానందగారిని ఆయన ఎంతగానో ప్రేమించేవారు; పాశ్చాత్య దేశాలకు తమ దూతగా, 1920లో ఈయన్ని పంపింది వారే.

శ్రీ యుక్తేశ్వర్‌గారు మెల్లగా మాట్లాడే సాధుస్వరూపులు; ఆయన ఉనికి ఆహ్లాదం కలిగించేది. తమ అనుచరులు స్వచ్ఛందంగా చూపే గౌరవానికి ఆయన ఎంతో తగినవారు. ఆయన్ని ఎరిగిన ప్రతి వ్యక్తీ - ఆ వ్యక్తి ఏ జాతి వాడయినా సరే - ఆయన్ని అపరిమిత గౌరవ ప్రపత్తులతో చూసేవాడు. నాకు స్వాగతం చెప్పడానికి ఆశ్రమ ప్రవేశ ద్వారం దగ్గర నించున్నప్పటి ఆయన రూపం ఇప్పటికీ నాకు కళ్ళకు కట్టినట్టు ఉంది. ఆయన మంచి ఎత్తరి; నిటారుగా నిలిచే వ్యక్తి. ప్రాపంచిక తాపత్రయాలన్నీ విడిచి పెట్టేసినవారు. కాషాయం వన్నె బట్టలు కట్టుకొన్న తపోమూర్తి ఆయన. ఆయన జుట్టు పొడుగ్గా, కొంతవరకు వంకులు తిరిగి ఉంటుంది. శరీరం మాంసలమై దృఢంగానే ఉంటుంది కాని, సన్నగా, సౌష్ఠవంగా ఉంటుంది. ఆయన అడుగులో మంచి ధాటి ఉంది. ఆయన నివాసస్థానంగా ఎన్నుకున్నది, పవిత్రమైన పూరీ నగరం; ధార్మికులైన హిందువులు, భారతదేశంలో ప్రతి రాష్ట్రం నుంచీ, ప్రసిద్ధమైన "జగన్నాథ" స్వామి ఆలయాన్ని దర్శించడానికి ప్రతిరోజూ అసంఖ్యాకంగా యాత్రకు వస్తారు.

జన్మ కృతార్థంగా ముగిసేటట్టు సాగిందని తెలిసిన శ్రీయుక్తేశ్వర్‌గారు 1936లో జీవన్మరణాలనే పరివర్తనశీలమైన స్థితిలో గోచరించే దృశ్యాల మీంచి చూపు మళ్ళించి, భౌతికంగా కన్ను మూసింది పూరీలో.

శ్రీయుక్తేశ్వర్‌గారి పచ్చీలాన్నీ పవిత్రతనూ ధ్రువపరుస్తూ రాయ గలిగినందుకు నేను నిజంగా సంతోషిస్తున్నాను. ఆయన శిష్యులు పరమహంస యోగానందగారు ఇప్పుడు, యుగ యుగాలవారి కోసం ఆయనను గురించి అభివర్ణించారు. యుక్తేశ్వర్‌గారు జనబాహుళ్యానికి దూరంగా ఉండడంతో తృప్తిపడి, యోగానందగారు వివరించినట్టుగా, శక్తివంచనలేకుండా, ప్రశాంతంగా ఆదర్శ జీవితానికి అంకితమైనవారు.

డబ్ల్యు. వై. ఇవాన్స్ - వెంట్జ్

# విషయ సూచిక

# పటముల సూచిక

రచయిత ముఖచిత్రం (అట్టలోపల)

## ఫొటోల విభాగము-II 430 పేజీ తరువాత

పుట

అధ్యాయం : 1

# మా తల్లిదండ్రులు, నా బాల్య జీవితం

పరమ సత్యాల అన్వేషణ, దానికి తోడుగా ఉండే గురు*శిష్య సంబంధం భారతీయ సంస్కృతికి స్వాభావికమైన లక్షణాలుగా చాలా కాలంగా కొనసాగుతూ వస్తున్నాయి.

నేననుసరించిన మార్గం నన్ను దైవస్వరూపులైన ఒక ఋషి దగ్గరికి నడిపించింది. మహిమాన్వితమైన ఆయన జీవితం అనేక యుగాలకు ఆదర్శంగా నిలిచేటట్టు రూపొందినది. భారతదేశానికి నిజమైన సంపద అయిన మహానుభావుల్లో ఆయన ఒకరు. అటువంటి మహాపురుషులు ప్రతి తరంలోనూ ఆవిర్భవిస్తూ, ప్రాచీనకాలపు ఈజిప్టుకూ బాబిలోనియాకూ పట్టిన గతి భారతదేశానికి పట్టకుండా కాపాడుతూ వచ్చారు.

నా స్మృతిపథంలోని మొట్టమొదటి జ్ఞాపకాలన్నీ ఒకానొక పూర్వ జన్మకు సంబంధించిన గజిబిజి విషయాలతో నిండి ఉన్నవి. చాలా వెనకటి జన్మలో ఎప్పుడో నేను, హిమాలయాలమంచు ప్రదేశాల మధ్య ఒక యోగి†గా జీవించినట్లు సుస్పష్టమైన జ్ఞాపకాలు నా మనస్సులో మెదిలాయి. ఈ గతకాలపు జ్ఞాపకాల మెరుపులే, తెలియని ఏదో ఒక చిత్రమైన సంబంధం ద్వారా, భవిష్యత్తును కూడా లీలా మాత్రంగా నాకు గోచరింపజేశాయి.

---

* "గురు" శబ్దానికి అంధకారమును పారద్రోలెడివాడు (గు=అంధకారము, రు= పారద్రోలెడిది) అని "గురుగీత" లోని 17వ శ్లోకం తగిన అర్థాన్ని ఇచ్చింది.

† భగవత్ ధ్యానానికి సంబంధించిన ప్రాచీన శాస్త్రమైన యోగాన్ని సాధన చేసేవాడు. 'యోగం' అంటే 'కలయిక'. చూడండి అధ్యాయం 26: 'క్రియాయోగ శాస్త్రం'.

పసితనపు నిస్సహాయత వల్ల నేను పొందిన అవమాన భావనలు ఇప్పటికీ నాకు గుర్తే. అప్పట్లో నా నడవలేని స్థితిని, మనస్సులోని భావాల్ని స్వేచ్ఛగా చెప్పలేని స్థితిని ఉక్రోషంగా గుర్తించాను. శారీరకమైన నా అశక్తతను గ్రహించినప్పుడు, నా హృదయంలో ప్రార్థనాభరితమైన తరంగాలు లేస్తూండేవి. గాఢమైన నా ఉద్రేకాలు, భావాలు నా మనసులోనే అనేక భాషల మాటల్లో వ్యక్తమవుతూ ఉండేవి. ఇలా నాలో వివిధ భాషల గందరగోళం ఉంటూ ఉండగా, క్రమక్రమంగా మావాళ్ళ బెంగాలీ మాటలు వినడానికి అలవాటుపడ్డాను. ఆట బొమ్మలకీ కాలివేళ్ళకీ పరిమిత మని పెద్దవాళ్ళు భావించే పసిపిల్లల మనస్సు నిజానికి ఎంత విస్తృతి కలిగినదో!

నేను ఎన్నోసార్లు మంకుపట్టు పట్టి ఏడుస్తూ ఉండేవాణ్ణి; మనసులో అలజడీ, దాన్ని వెళ్ళబోసుకోడానికి అలవికాని శరీరం- ఈ రెండూ దానికి కారణాలు. నా బాధ చూసి ఇంట్లోవాళ్ళు గాభరాపడుతూండడం నాకు గుర్తే. అయితే మా అమ్మ లాలింపులూ, ఏదో పలకాలనీ తప్పటడుగులు వెయ్యాలనీ నేను చేసే తొలి ప్రయత్నాలూ ఇలాంటి సంతోషకరమైన జ్ఞాపకాలు కూడా నాలో ముసురుకొంటూ ఉంటాయి. మామూలుగా ఇట్టే మరుపుకు వచ్చే ఈ తొలి విజయాలే ఆత్మ విశ్వాసానికి సహజమైన ప్రాతిపదికలవుతాయి.

ఈ మాదిరిగా సుదీర్ఘ కాలాల జ్ఞాపకాలు రావడం నా కొక్కడికే జరిగింది కాదు. జీవితం నించి మరణానికీ, మరణం నించి జీవితానికి నాటకీయంగా జరిగే మార్పులకు లోనుకాకుండా ఎందరో యోగులు ఆత్మస్మృతి అవిచ్ఛిన్నంగా నిలుపుకున్నారని వింటాం. మనిషి అంటే కేవలం శరీరమే అయి ఉన్నట్లయితే, ఆ శరీరం నశించిపోతే అతని వ్యక్తిత్వం కూడా నశించిపోతుంది. కాని వేలకొద్ది సంవత్సరాలుగా ప్రవక్తలు చెబుతున్నది కనక నిజమే అయితే, మనిషి ప్రధానంగా భౌతిక రూపములేని సర్వవ్యాపి అయిన ఆత్మ.

చిన్నప్పటి జ్ఞాపకాలు స్పష్టంగా గుర్తుండడం విడ్డూరమయితే కావచ్చు కాని, మరీ అరుదు మాత్రం కావు. అనేక దేశాల్లో నేను పర్యటన చేస్తూండేటప్పుడు సత్యసంధులైన స్త్రీ పురుషులు తమ బాల్య స్మృతులను చెప్పగా విన్నాను.

నేను జనవరి 5, 1893 తేదీన, హిమాలయ పర్వతాలకు సమీపంలో ఈశాన్య భారతంలో ఉన్న గోరఖ్‌పూర్‌లో పుట్టాను. నా జీవితంలో మొదటి ఎనిమిదేళ్ళూ అక్కడ గడిచాయి. మేము ఎనిమిదిమంది తోబుట్టువులం. నలుగురు

మొగ పిల్లలం, నలుగురు ఆడపిల్లలు. అప్పట్లో నా పేరు ముకుంద లాల్ ఘోష్*; మొగపిల్లల్లో రెండోవాణ్ణి; అందరిలో నాలుగో వాణ్ణి.

మా అమ్మా నాన్నా బెంగాలీలు; క్షత్రియకులంవారు. ఇద్దరూ సాధు స్వభావులు. వాళ్ళలో ఒకరి మీద ఒకరికి ఉన్న ప్రేమ ప్రశాంతమైనదీ గంభీరమైనదీ; హుందాతనమున్న ఆ ప్రేమలో అల్పత్వానికి తావులేదు. ఎదిగే ఎనమండుగురు పిల్లల కోలాహలపు జీవితాలు పరిభ్రమించే ప్రశాంత కేంద్రం మా తలి దండ్రుల అద్భుత సామరస్యమే.

నాన్నగారు భగవతీచరణ ఘోష్‌గారు దయాశీలురూ, గంభీరులూ, అప్పుడ ప్పుడు కఠినులూను. పిల్లలం మేము ఆయన్ని అమితంగా ప్రేమిస్తూనే గౌరవ భావంతో కాస్త ఎడంగా ఉంటూండేవాళ్ళం. ఆయన ప్రతిభావంతులైన గణిత శాస్త్రజ్ఞులు, తార్కికులు; ప్రధానంగా బుద్ధిబలాన్ని అనుసరించి సాగేవారు. కాని మా అమ్మ హృదయాల రాణి! ఆవిడ మాకన్నీ ప్రేమతోనే నేర్పింది. ఆవిడ పోయిన తరువాత నాన్నగారు, తమలో ఉన్న మార్దవాన్ని మరింతగా పైకి చూపేవారు. అప్పుడు ఆయన చూసే చూపు తరచుగా మా అమ్మచూపే అనిపించేది.

క్రమశిక్షణ అలవరచడంకోసం మా అమ్మ సందర్భానికి అనువైన కథలను మహాభారతంలోంచి, రామాయణం లోంచి తీసుకుని చెబుతూ ఉండేది. ఇలాంటి సందర్భాల్లో శిక్ష వెయ్యడం, శిక్షణ ఇవ్వడం రెండూ కలిసే ఉండేవి. ఆ విధంగా, మా అమ్మ సాన్నిధ్యంలో మాకు, పిల్లలకు, పవిత్ర గ్రంథాలతో తీపి-చేదుల మొదటి పరిచయం ఏర్పడింది.

నాన్నగారు ఆఫీసునుంచి వచ్చే సమయానికి ఆయనకి గౌరవంగా స్వాగతం చెప్పడం కోసమని మా అమ్మ సాయంత్రం వేళల్లో పిల్లలందరికీ జాగ్రత్తగా బట్టలు వేసేది. భారతదేశంలో ఉన్న పెద్ద కంపెనీల్లో ఒకటిగా పేరుగన్న బెంగాల్-నాగపూర్ రైల్వేలో, ఉపాధ్యక్ష పదవిలాంటి ఉద్యోగంలో ఉండేవారాయన. దాని రీత్యా ఆయనకు ప్రయాణాలు పడుతుండేవి; నా చిన్నతనంలో మా కుటుంబానికి అనేక నగరాలు నివాసాలయ్యాయి.

అవసరాల్లో ఉన్నవాళ్ళని ఆదుకోడం విషయంలో అమ్మ ఎప్పుడూ

---

* 1915లో నేను సనాతనమైన ఆశ్రమ వ్యవస్థానుసారంగా సన్యాసం తీసుకున్నప్పుడు నా పేరు స్వామి యోగానందగా మారింది. 1935లో మా గురుదేవులు 'పరమహంస' అన్న ఉన్నత సాంప్రదాయిక బిరుదు ప్రసాదించారు (చూడండి పే. 288, 496).

ఉదారంగా ఉండేది. నాన్నగారు కూడా దయ చూపించేవారు; కాని ఆ రకంగా చేసే ఖర్చులు ఆదాయవ్యయాల అంచనాకి లోబడే ఉండాలని ఆయన అభిప్రాయం. ఒక పక్షం రోజుల్లో, బీదవాళ్ళకి భోజనాలు పెట్టడంకోసం, అమ్మపెట్టిన ఖర్చు నాన్నగారి నెలసరి రాబడిని మించిపోయింది.

అప్పుడు నాన్నగారు అమ్మతో ఇలా అన్నారు: "నేను నిన్ను కోరేదల్లా ఒక్కటే. దానాల నిమిత్తం నువ్వు చేసే ఖర్చు ఉచితమైన పరిమితిని మించకుండా చూడు!" భర్తగారి సున్నితమైన మందలింపు కూడా అమ్మకు దుఃఖం కలిగించింది. తమ కిద్దరికీ కలిగిన ఈ అభిప్రాయభేదాన్ని గురించి పిల్లలకి చూచాయగా కూడా చెప్పకుండా ఆవిడ, ఒక జట్కా బండిని పిలిపించింది.

"సెలవు. నేను మా పుట్టింటికి వెళ్ళిపోతున్నా" బహు ప్రాచీన కాలం నుంచీ వినిపించే తుది హెచ్చరికే ఇది!

ఆ మాటకి మేము తెల్లబోయి ఏడుపులు మొదలుపెట్టాం. సరిగ్గా ఆ సమయానికి, ఎక్కణ్ణించో పిలిచినట్టు వచ్చాడు మా మామయ్య; వచ్చి నాన్నగారి చెవిలో ఏదో గుసగుసలాడాడు. సందేహం లేదు; యుగయుగాలుగా ఎందరో చేస్తూ వస్తున్న హితోపదేశమే ఇది. దాని మీదట నాన్నగారు, రాజీ ధోరణిలో నాలుగు మాటలు చెప్పిన తరవాత బండిని సంతోషంగా తిప్పి పంపించేసింది అమ్మ. నేను గమనించినంత వరకు, అమ్మకి నాన్నగారికి ఏర్పడిన ఒకేఒక వివాదం అంతటితో ముగిసింది. అయితే వాళ్ళిద్దరికీ స్వభావసహజంగా సాగిన చర్చమాత్రం ఒకటి గుర్తుకు వస్తోంది.

"ఒక్క పదిరూపాయలివ్వండి; పాపం ఓ బీదావిడ వచ్చి అడుగుతోంది," అంది. ఎదటివాళ్ళని ఒప్పించే గుణం అమ్మ చిరునవ్వులో ఉండేది.

"పది రూపాయలెందుకు? ఒక్కటి చాలు." నాన్నగారు తమ అభిప్రాయాన్ని సమర్థించుకోడానికి ఇంకా ఇలా అన్నారు: "మా నాన్న గారూ, తాతయ్యా, నాయనమ్మా హఠాత్తుగా చనిపోయినప్పుడు మొట్టమొదటిసారిగా పేదరికం అంటే ఏమిటో నాకు అప్పుడు అనుభవంలోకి వచ్చింది. బడికి వెళ్ళడానికి కొన్ని మైళ్ళు నడిచిపోవాలంటే పొద్దుటిపూట నా భోజనం ఏమిటో తెలుసా?- ఒక చిన్న అరటి పండు మాత్రమే. తరువాత యూనివర్సిటీలో చదివే రోజుల్లో డబ్బుకోసం ఎంతకటకట అయ్యేదో తెలుసా! డబ్బున్న ఓ జడ్జీగారిని ఆశ్రయించి నెల కొక్క రూపాయి ఇప్పించమని కోరాను. ఇయ్యనన్నాడాయన; ఒక్క రూపాయయినా తనకి ముఖ్యమైందే నన్నాడు."

"ఆయన ఆ రూపాయి ఇయ్యనన్నాడని ఎంత బాధగా తలుచుకుంటున్నారు!" అమ్మ హృదయం తక్షణ తర్కాన్ని ప్రయోగించింది. "తొందరపనిపడ్డప్పుడు పది రూపాయి లివ్వనన్నారని మిమ్మల్ని కూడా ఆవిడ, అలాగే బాధగా తలుచు కోవాలని ఉందా? '

"నువ్వే గెలిచావులే!" ఓడిపోయిన భర్తలందరూ అనాదిగా చేస్తున్న భంగిమే ఒకటి చూపించి, పర్సు తెరిచారాయన. "ఇదుగో పది రూపాయల నోటు. నా శుభాకాంక్షలతో ఆవిడ కియ్యి."

ఏ కొత్త ప్రతిపాదన వచ్చినా మొట్టమొదట, 'వద్దు' అనడం నాన్నగారికి అలవాటు. అంత తొందరగా అమ్మదగ్గర సానుభూతి పొందిన ఆ అపరిచితురాలి విషయంలో ఆయన చూపించిన ధోరణి, మామూలుగా ఆయన కనబరిచే జాగ్రత్తకు ఉదాహరణ. అడిగిన వెంటనే ఒప్పుకోకపోవడమన్నది నిజంగా, "ఆలోచించి నిర్ణయించాలి" అన్న సూత్రాన్ని పాటించడమే. తీసుకొనే నిర్ణయాల విషయంలో ఆయనెప్పుడూ సమంజసంగానూ సమతూకంగానూ ఉండడమే గమనించాను. అసంఖ్యాకమైన నా కోరికలకు కారణాలు చూపిస్తూ ఒకటిరెండు చక్కటి వాదాలతో కనక నేను సమర్థించుకోగలిగినట్లయితే, నేను కోరిందల్లా నెరవేర్చేవారు - సెలవుల్లో ప్రయాణాల కయినా సరే, కొత్త మోటారు సైకిలు కావాలన్నా సరే.

ఆయన పిల్లల్ని చిన్నగా ఉన్నప్పుడు చాలా గట్టి కట్టుబాట్లలో ఉంచేవారు. తమ విషయంలో అయితే ఆయనది కఠోర వ్రతమే. మాట వరసకు చెప్పాలంటే, ఆయనెన్నడూ నాటకాలకు కూడా వెళ్ళలేదు. వివిధ ఆధ్యాత్మిక సాధనల్లోనూ గీతా పారాయణంలోనూ ఆనందం పొందేవారు. విలాసాలనన్నిటినీ విడిచిపెట్టేసి, ఒక్క జత పాత బూట్లతోనే గడుపుకొంటూ, ఇంక పనికిరాని స్థితికి వచ్చేదాకా వాటినే వాడుతుండేవారు. మోటారు కార్ల వాడకం జనంలో బాగా పెరిగిన తరువాత ఆయన కొడుకులు కొనుక్కున్నారు కాని, ఆయన మాత్రం రోజూ ఆఫీసుకు ట్రామ్ బండిలోనే వెళ్తుండేవారు.

అధికారం కోసం డబ్బు కూడబెట్టాలన్న ఆసక్తి నాన్నగారికి లేదు. ఒకసారి ఆయన, కలకత్తా అర్బన్ బ్యాంకును తానే స్థాపించినప్పటికీ, దాంట్లో వాటాలు తీసుకోడానికి నిరాకరించారు. వాటితో లాభం పొందడం ఆయనకి ఇష్టంలేదు. తీరిక వేళల్లో, ఒక పౌరుడిగా తన విధి తాను నిర్వర్తిస్తే చాలనే ఆయన అనుకునే వారు.

నాన్నగారు పదవీ విరమణ చేసిన చాలా సంవత్సరాలకి బెంగాల్-నాగపూర్ రైల్వేవాళ్ళ పుస్తకాల్ని తణిఖీ చెయ్యడానికి ఇంగ్లండు నుంచి ఒక ఎకౌంటెంటు వచ్చాడు. అందులో ఒక విషయం గమనించి ఆయన ఆశ్చర్యపోయాడు. జరిగింది ఏమిటంటే, రైల్వేవారి దగ్గర్నించి నాన్నగారికి బోనస్సు రావలసి ఉంది. బకాయిపడ్డ బోనస్సుకోసం ఆయనెన్నడూ దరఖాస్తు చెయ్యనేలేదట!

"ముగ్గురి పని ఆయనొక్కడు చేశాడు!" అని కంపెనీకి చెప్పాడు ఎకౌంటెంటు. "వెనకటినించి పరిహారంగా ఆయనకి చెల్లించవలసినవి 1,25,000 రూపాయలు." ఆ మొత్తానికి, కంపెనీ కోశాధికారి నాన్నగారికో చెక్కు పంపాడు. ఆయన దృష్టిలో అది ఎంత చిన్న విషయమంటే, ఇంట్లో వాళ్ళకి చెప్పడం కూడా మరిచిపోయారు. తరువాత చాలా కాలానికి మా ఆఖరి తమ్ముడు విష్ణు, నాన్నగారి ఖాతాలో ఆ పెద్ద మొత్తం జమ అయిన సంగతి, బ్యాంకువాళ్ళు పంపిన స్టేట్‌మెంటులో చూసి, దాన్ని గురించి నాన్నగారి నడిగాడు.

"భౌతికమైన లాభాల్ని చూసి పొంగిపోవడం ఎందుకు?" అని జవాబిచ్చా రాయన. "అన్నిటి విషయంలోనూ సమదృష్టి సాధించాలని తలిచేవాడు లాభం వచ్చినప్పుడు పొంగిపోడు, నష్టం వచ్చినప్పుడు కుంగిపోడు. ఈ లోకంలోకి వచ్చేటప్పుడు మనిషి డబ్బు లేకుండానే వస్తాడనీ, పోయేటప్పుడు ఒక్క రూపాయి కూడా పట్టుకుపోడనీ అతనికి తెలిసి ఉంటుంది."

దాంపత్య జీవితంలోని తొలినాళ్ళలో మా అమ్మా నాన్నగారూ కాశీలో ఉండే లాహిరీ మహాశయులనే మహాగురువులకు శిష్యులయారు. సహజంగా నాన్నగారి కుండే తాపస ప్రవృత్తి ఈ సాంగత్యంవల్ల మరింత బలపడింది. అమ్మ ఒకసారి, పెద్దక్క రమకి ఒక గొప్ప విషయం చెప్పింది: "మీ నాన్నగారూ నేనూ భార్యా భర్తలుగా కలిసేది ఏడాది కొక్కసారి మాత్రమే; పిల్లలకోసమని!"

నాన్నగారు లాహిరీ మహాశయుల్ని మొట్టమొదట కలుసుకున్నది, అవినాశ బాబు అనే రైల్వే ఉద్యోగిద్వారా. బెంగాల్ - నాగ్‌పూర్ రైల్వేలోని ఒక బ్రాంచి లైనులో అవినాశ బాబు పనిచేస్తూ ఉండేవారు. గోరఖ్‌పూర్‌లో ఉండే రోజుల్లో ఈ అవినాశబాబు అనేకమంది భారతీయ మునుల కథల్ని మనస్సుకు హత్తుకొనే టట్టుగా నా చిట్టి చెవుల్లో నూరిపోస్తూండేవారు. కథ చెబుతూ చిట్టచివరికి తమ గురువుగారి మహత్తుకు తప్పకుండా జోహార్లు అర్పిస్తూండేవారు.

"మీ నాన్నగారు ఎటువంటి విచిత్ర పరిస్థితిలో లాహిరీ మహాశయులకు శిష్యులయారో ఎప్పుడైనా విన్నావా?" అది వేసవి కాలం; మందంగా ఉండే మధ్యాహ్నం పూట అవినాశ బాబూ నేనూ మా ఇంటి ఆవరణలో కూర్చుని ఉన్నాం. అప్పుడీ చిక్కు ప్రశ్న వేశారాయన. ఏం చెబుతారో వినాలన్న ఆశతో, చిరునవ్వు నవ్వుతూ- తెలియదన్నట్టుగా తల తిప్పాను.

"నువ్వింకా కొన్నేళ్ళకి పుడతావనగా, నేను కాశీ వెళ్ళి మా గురువుగారి దర్శనం చేసుకురావడానికి ఓ వారం రోజులు సెలవిమ్మని, నా పై ఆఫీసరుగార్ని - అంటే మీ నాన్నగారిని అడిగాను. దానికి నన్ను వేళాకోళం చేశారాయన.

" 'మతంలో పడి పిచ్చివాడివవుతున్నావా ఏమిటి?' అని అడిగారు. 'నువ్వు కనక పైకి రాదలుచుకుంటే, ఆఫీసు పనిమీదే దృష్టి పెట్టుకో,' అంటూ హితవు చెప్పారు.

"ఆ రోజు నేను విచారంగా ఇంటిమొహం పట్టి చెట్లగుబుర్లున్న దారిలో నడిచిపోతూంటే, పల్లకీలో వస్తూ మీ నాన్నగారు కనిపించారు. బంట్రోతుల్ని పల్లకీని వెనక్కి పంపించేసి ఆయన నాతో నడక సాగించారు. నన్ను ఓదార్చే ఉద్దేశ్యంతో, లౌకికంగా విజయం సాధించడానికి కృషి చేస్తే కలిగే లాభాలేమిటో చెప్పుకొచ్చారు. కాని నేను దిగులుపడుతూనే ఉన్నాను. 'లాహిరీ మహాశయా! మిమ్మల్ని చూడందే నేను బతకలేను,' అంటూ మొరపెడుతూనే ఉంది నా గుండె, అదే పనిగా.

"ప్రశాంతంగా ఉన్న ఒక పొలం చివరికి సాగింది మా దారి. అక్కడ ఉవ్వెత్తుగా లేచిన కెరటంలా పెరిగిన అడివిగడ్డికి కిరీటం పెట్టినట్టుగా మెరుస్తు న్నాయి సాయంకాలం సూర్యకిరణాలు. అద్భుతమైన ఆ దృశ్య సౌందర్యానికి మేము ముగ్ధులమై నిలబడిపోయాం. ఇంతట్లో, ఆ పొలంలో మాకు కొద్దిగజాల దూరంలోనే మా గురుదేవులు ప్రత్యక్షమయ్యారు."*

" 'భగవతిబాబూ, మీ కింద పనిచేసే ఉద్యోగి విషయంలో మీరు మరీ కఠినంగా ఉన్నారు!' అన్నారాయన. ఆశ్చర్యచకితులమై ఉన్న మా చెవుల్లో ఆయన కంఠస్వరమే మారుమోగింది. ఎంత విచిత్రంగా ప్రత్యక్షమయ్యారో అంత విచిత్రంగానూ అదృశ్య మయ్యారు. నేను మోకరిల్లి, 'లాహిరీ మహాశయా! లాహిరీ

---

* మహాయోగులకుండే అద్భుత శక్తులగురించి అధ్యాయం 30· అలౌకిక ఘటనల నియమం'లో వివరించడం జరిగింది.

మహాశయా!' అంటూ ఆశ్చర్యంతో ఆయన్ని స్మరించాను. మీ నాన్నగారు కొద్ది క్షణాలుపాటు మ్రాన్పడి నిశ్చలురయిపోయారు.

" 'అవినాశ్ బాబూ! సెలవు నీ కివ్వడమే కాదు - నాక్కూడా నేను ఇచ్చుకుంటాను. రేపే బయల్దేరి కాశీ వెళ్దాం. నీ తరపున చెప్పడంకోసం తమ సంకల్పశక్తివల్ల ఇక్కడ ప్రత్యక్షం కాగలిగిన మహాగురువులు - లాహిరీ మహాశయుల్ని గురించి నేను తప్పకుండా తెలుసుకోవాలి! మా ఆవిణ్ణి కూడా తీసుకువెళ్ళి, తమ ఆధ్యాత్మిక పంథాను అనుసరించడానికి మాకు దీక్ష ఇమ్మని ఆయన్ని అడుగుతాను. ఆయన దగ్గిరికి తీసుకువెళ్తావా?'

" 'తప్పకుండా.' నా ప్రార్థన అద్భుతంగా ఫలించినందుకూ, పరిస్థితులు తొందరగా నా కనుకూలంగా మారినందుకూ ఆనందంలో మునిగిపోయాను.

"మర్నాడు సాయంకాలం మీ అమ్మగారూ, నాన్నగారూ, నేనూ కాశీ వెళ్ళడానికి బండి ఎక్కాం. ఆ మర్నాడు అక్కడికి చేరగానే కొంత దూరం గుర్రబ్బండి మీద వెళ్ళి, తరవాత సన్నసన్నటి సందులగుండా నడిచి, ఏకాంతంగా ఉన్న ఇంటిని చేరుకున్నాం గురువుగారు కూర్చునే చిన్న గదిలోకి ప్రవేశించాం. అలవాటుగా ఆయన పద్మాసనంలో స్థిరంగా కూర్చుని ఉన్నారు. వారి ముందు ప్రణమిల్లాం. గుచ్చి చూసే తమ కళ్లని మిలమిల్లాడించి, మీ నాన్నగారి మీద చూపు నిలిపారు. 'భగవతి బాబూ, మీ కింద పనిచేసే ఉద్యోగివిషయంలో మీరు మరీ కఠినంగా ఉన్నారు!' రెండు రోజుల కిందట గడ్డిబీడులో ప్రత్యక్షమై నప్పుడు అన్నమాటలే ఇప్పుడు కూడా ఆయన అన్నారు. ఆ తరువాత, 'అవినాశ్ బాబు నా దగ్గిరికి రావడానికి మీరు అనుమతించినందుకూ అతనితోబాటు మీరు, మీ భార్యా కూడా వచ్చినందుకూ చాలా సంతోషం,' అని కూడా అన్నారు.

"మీ తల్లిదండ్రులకు ఆయన క్రియాయోగం* అనే ఆధ్యాత్మిక సాధనను ఉపదేశించి ఆనందపరిచారు. చిరస్మరణీయమైన ఆ దివ్యదర్శనపు రోజు నుండి సహ-శిష్యులమైన మీ నాన్నగారూ నేనూ ఆప్త మిత్రుల్లా ఉంటున్నాం. నీ పుట్టుక విషయంలో లాహిరీ మహాశయులు గాఢమైన ఆసక్తి చూపించారు. నీ జీవితం ఆయనతో తప్పకుండా ముడిపడి ఉండాలి; మహాగురువుల ఆశీస్సు ఎప్పటికీ వృథా కాదు."

---

* లాహిరీ మహాశయులు బోధించిన యోగ ప్రక్రియ. దీంతో, ఇంద్రియాలు రేపే కల్లోలం శాంతించి ఈ విశ్వచైతన్యమే తాను అన్న గుర్తింపు ఎప్పటికీ పెరుగుతూ ఉండే విధంగా మానవుడు సాధన చెయ్యడానికి అవకాశ మేర్పడుతుంది. (చూడండి అధ్యాయం 26.)

నేను ఈ ప్రపంచంలో అడుగుపెట్టిన కొద్ది కాలానికే లాహిరీ మహాశయులు తనువు చాలించారు. ఆయన ఫొటో ఒకటి అందంగా అలంకరించిన చట్రంలో మా ఇంట్లో ఉండేది. ఆఫీసువాళ్ళు చేసే బదిలీల వల్ల మా నాన్నగారు తిరిగిన ఊళ్ళల్లో అల్లా ఆయన ఫొటో మా పూజా మందిరానికి వన్నె తెస్తూండేది. అమ్మా నేనూ అనేక రోజులు, పొద్దుటా సాయంత్రమూ, తాత్కాలికంగా ఏర్పాటు చేసుకున్న మందిరం దగ్గర ధ్యానం చేస్తూ కూర్చునేవాళ్ళం; సుగంధం గల చందనంలో ముంచిన పూలతో పూజ చేస్తూండే వాళ్ళం; సాంబ్రాణి, గుగ్గిలం ధూపాలు వేసే వాళ్ళం; లాహిరీ మహాశయుల్లో సంపూర్ణంగా వ్యక్తమయిన దైవత్వాన్ని సమైక్య భక్తిప్రపత్తులతో మేము ఆరాధించేవాళ్ళం.

ఆయన ఫొటో నా జీవితం మీద చూపిన ప్రభావం మహత్తరమైనది. నేను పెరుగుతున్న కొద్దీ, ఆ మహాశయుల్ని గూర్చిన భావనకూడా నాతోబాటు పెరుగుతూ వచ్చింది. ధ్యానంలో కూర్చుని ఉండగా, ఆ ఫొటోగ్రాఫులో ఉన్న ఆయన ఆకారం, ఆ చిన్న చట్రంలోంచి బయటికి వచ్చి సజీవరూపం దాల్చి, నా ఎదట కూర్చున్నట్టుగా కనిపించేది తరచు. తేజోమయమైన దేహంతో ప్రకాశిస్తున్న ఆయన పాదాల్ని తాకడానికి నేను ప్రయత్నించినప్పుడు మళ్ళీ అది బొమ్మలా మారిపోయేది. శైశవం గడిచి బాల్యంలోకి ప్రవేశించేటప్పటికి, లాహిరీ మహాశయుల రూపం నా మనస్సులో, చట్రంలో బిగించిన చిన్న బొమ్మ రూపంలోంచి స్ఫూర్తిమంతమైన సజీవ రూపంలోకి మారిపోయింది. ఏదైనా జటిలమైన సమస్య ఎదురైనప్పుడుకాని, సంక్షోభమేర్పడి నప్పుడుకాని తరచుగా ఆయన్ని ప్రార్థిస్తూ ఉండేవాణ్ణి; నాలో ఉపశమనం కలిగించే ఆయన మార్గదర్శకత్వాన్ని గమనించేవాణ్ణి.

ఆయన భౌతికరూపంలో జీవించడం లేదే అని, మొదట్లో బాధపడుతూ ఉండేవాణ్ణి. కాని గోప్యమైన ఆయన సర్వవ్యాపకత్వాన్ని గ్రహించడం మొదలు పెట్టిన తరువాత ఇక బాధపడ్డం మానేశాను. తమను చూడాలని అతిగా ఆదుర్దాపడే శిష్యులకు ఆయన, "రక్తమాంసాలతో నిండిన దేహాన్ని చూడ్డానికి ఎందుకూ రావడం-నేను మీ కూటస్థ (ఆధ్యాత్మిక దృష్టి) శ్రేణిలోనే ఎప్పుడూ ఉండగా?" అని రాస్తూండేవారట.

నాకు ఎనిమిదేళ్ళ వయస్సప్పుడు, లాహిరీ మహాశయుల ఫొటో మూలంగా అద్భుతంగా స్వస్థత చేకూరే భాగ్యం కలిగింది. ఈ అనుభవం నా ప్రేమను మరీ గాఢం చేసింది. బెంగాలులో మా వంశం వారికున్న ఇచ్ఛాపూర్ ఎస్టేటులో ఉండగా నాకు ఏషియాటిక్ కలరా అనే వ్యాధి వచ్చింది. నా మీద ఆశ వదులుకున్నారు;

డాక్టర్లు ఏమీ చెయ్యలేకపోయారు. నా మంచం దగ్గర కూర్చున్న అమ్మ, నాకు తలాపి దిక్కున గోడమీద, పైన ఉన్న లాహిరీ మహాశయుల ఫొటో వేపు చూడమని బెంబేలు పడుతూ సైగ చేసింది.

"మనస్సులో ఆయనకి దండం పెట్టు." ఆవిడకి తెలుసు, దండం పెట్టాలంటే చేతులు ఎత్తడానికి కూడా నేను ఓపిక లేనివాణ్ణని. "నువ్వు కనక నిజంగా నీ భక్తిని చూపించినట్లయితే, మనస్సులోనే ఆయనకు మొక్కినట్లయితే, నిన్నాయన చల్లగా చూస్తారు" అంది.

ఆయన ఫొటోవేపు తదేకంగా చూశాను. అక్కడ మిరుమిట్లుగొలిపే వెలుగు ఒకటి కనిపించింది. అది నా శరీరాన్ని గదినీ చుట్టేసింది. వాంతి అయేటట్లనిపించే లక్షణంతో సహా, లొంగుబాటులోకి రాని ఇతర రోగ లక్షణాలన్నీ మటుమాయమయి పోయాయి; నాకు స్వస్థత చేకూరింది. అమ్మకి గురువుగారిపట్ల ఉన్న అపరిమితమైన విశ్వాసానికి నాలో సంతోషం ఉప్పొంగింది; వెంటనే ఆవిడ పాదాలమీదికి వాలి స్పృశించడానికి కావలసినంత బలం వచ్చేసింది. అమ్మ తన తలను ఆ చిన్న పటానికి పదేపదే ఒత్తుకుంది.

"సర్వవ్యాపకులైన గురుదేవా, మీ తేజస్సు నా బిడ్డను నయంచేసినందుకు మీకు నా ధన్యవాదాలు!"

మామూలుగా ప్రాణాంతకం కావలసిన ఆ జబ్బు చటుక్కున నయమై నేను కోలుకోడానికి కారణమైన తేజఃప్రభను ఆవిడ కూడా చూసినట్టు గ్రహించాను.

నాకున్న అమూల్య వస్తుసామగ్రిలో అన్నిటికంటె విలువైనది ఆ పటమే. లాహిరీ మహాశయులు స్వయంగా ఇచ్చిన ఈ ఫొటో పవిత్రమైన స్పందనల్ని ప్రసరిస్తుంది.

ఈ ఫొటో పుట్టుకకు వెనక అద్భుతమైన కథ ఒకటి ఉంది. దీన్ని మా నాన్నగారి సహశిష్యులైన కాళీకుమార్ రాయ్‌గారు చెప్పగా విన్నాను.

ఫొటోలో పడ్డమంటే మహాశయులకు కిట్టేదికాదు. ఒకసారి, ఆయన వద్దంటున్నా వినకుండా, ఆయన్నీ కాళీకుమార్ రాయ్‌గారితోబాటు శిష్య బృందాన్నీ కలిపి ఫొటో తియ్యడం జరిగింది. అయితే ఆ ఫొటో తాలూకు ప్లేటు చూసిన తరువాత, ఫొటోగ్రాఫరు ఆశ్చర్యపోయాడు. శిష్యులందరి బొమ్మలూ స్పష్టంగా వచ్చాయికాని, లాహిరీ మహాశయుల రూపురేకలు ఉండవలసిన స్థానంలో ఖాళీ

తప్ప మరేమీ కనిపించలేదు. ఈ అద్భుతవిషయాన్ని గురించి విరివిగా చెప్పు కొన్నారు.

గంగాధర బాబనే శిష్యుడు ఒకడు మంచి నైపుణ్యంగల ఫొటోగ్రాఫరు. ఫొటో తియ్యబోతే మాయమైపోయే మహాశయుల రూపం తన కెమేరాను తప్పించుకు పోజాలదని దంభాలు పలికాడు. మర్నాడు పొద్దున అతను తన కెమేరా తీసుకు వచ్చాడు. గురుదేవులు పద్మాసనం వేసుకొని ఒక కొయ్యబల్ల మీద కూర్చుని ఉన్నారు. ఆయన వెనకాల ఒక తెర వేలాడుతోంది. అప్పుడతను, తను తలపెట్టిన పని నెరవేరడానికి అన్ని జాగ్రత్తలూ తీసుకుని, ఆబగా పన్నెండు ఫొటోలు తీశాడు. అయినా తరవాత చూస్తే ప్రతి ప్లేటు మీదా కనిపించేదేమిటి? కొయ్యబల్లా, వెనకాల తెరానూ; అంటే మహాశయుల ఆకారం మాత్రం అయిపులేదు.

గంగాధరబాబుకి కళ్ళవెంట నీళ్ళు వచ్చేశాయి; గర్వం పటాపంచలైంది. మళ్ళీ గురువుగారి దగ్గరికి పరిగెత్తాడు. ఎన్నో గంటలు గడిస్తేనే కాని మహాశ యులు మౌనం వీడలేదు. తరువాత భావగర్భితంగా ఈ వ్యాఖ్య చేశారు:

"నేను ఆత్మస్వరూపుణ్ణి. సర్వవ్యాప్తమైన అగోచరశక్తిని నీ కెమేరా ఫొటో తియ్యగలదా?"

"తియ్యలేదని తెలుసుకున్నానండి. కాని స్వామీ, మీ శరీరాలయం ఫొటో ఒకటి కావాలని భక్తితో కోరుతున్నాను. ఇంత వరకు నా దృష్టి సంకుచితంగా ఉంటూ వచ్చింది. ఆత్మశక్తి మీలో సంపూర్ణంగా ఉంటుందన్న సంగతి ఈనాటి వరకు గ్రహించ లేకపోయాను."

"అయితే రేప్పొద్దున్నే రా; ఫొటో తీసుకుందువుగాని," అన్నారు మహాశయులు.

ఫొటోగ్రాఫరు మళ్ళీ ఫోకస్ చేశాడు. కంటికి కనిపించకపోవడమనే చిత్రమైన ముసుగులో మరుగుపడకుండానే ఈసారి ఆయన పవిత్రరూపం స్పష్టంగా ఫొటోలో పడింది. ఆ మహాయోగి మరొకఫొటో ఎప్పుడూ తీయించుకోలేదు. ఆయన ఇంకోఫోటో ఏదీ నేను చూడలేదు.

ఆ ఫొటోగ్రాఫే ఈ పుస్తకంలో అచ్చువెయ్యడం జరిగింది.* విశ్వజనీనమైన

---

* 206 పేజీ ఎదురుగా ఉన్న 1వ ఫొటో సెక్షనులో చూడండి. అదేచోట తరువాత పేజీలో ఉన్న లాహిరీ మహాశయుల చిత్తరువు కూడా చూడండి. 1935-36లో పరమహంస యోగానంద గారు భారతదేశంలో ఉన్నప్పుడు లాహిరీ మహాశయుల అసలు ఫొటోను బట్టి ఈ చిత్తరువు

రూపంలో ఉండే లాహిరీ మహాశయుల సుందరమైన ఆకృతి చూస్తే ఆయన ఏ జాతివారో వెంటనే తెలియదు. దైవ సంసర్గంవల్ల కలిగిన ఆనందం నిగూఢమైన ఆయన చిరునవ్వులో కొద్దిగా వ్యక్తమవుతోంది. అరవిచ్చిన ఆయన కన్నులు, బయటి ప్రపంచంపట్ల ఆయనకు నామమాత్రమైన ఆసక్తి మాత్రమే ఉన్నట్టుగా తెలుపుతున్నాయి. అవి సగం మూసుకొని ఉండడంలో, ఆంతరికమైన ఆనందంలో మునిగి ఉండటాన్ని సూచిస్తాయి. జిజ్ఞాసువులు చాలామంది ఆయన ఔదార్యాన్ని ఆశించి వచ్చేవారు; లౌకికమైన క్షుద్ర ప్రలోభాలకు లొంగని ఆయనకు, వాళ్ళ ఆధ్యాత్మిక సమస్యలు సంపూర్తిగా అన్ని సమయాల్లోనూ తెలిసే ఉండేవి.

గురుదేవుల పటానికున్న మహిమద్వారా స్వస్థత చేకూరిన కొన్నాళ్ళకు నాకు స్ఫూర్తిమంతమైన ఆధ్యాత్మిక దర్శనం ఒకటి కలిగింది. ఒకనాడు ఉదయం నేను పక్కమీద కూర్చుని స్వాప్నిక చింతనలో మునిగిపోయాను.

"కళ్ళు మూసుకొని ఉన్నప్పుడుండే చీకటికి వెనకాల ఉన్నది ఏమిటి?" అంటూ లోతులు తరిచే ఈ ఆలోచన నా మనస్సులో చొరబడింది. తక్షణమే నా అంతర్దృష్టిలో బ్రహ్మాండమైన మెరుపులాంటి వెలుగు ఒకటి కనిపించింది. కొండ గుహల్లో ధ్యాన ముద్రలో కూర్చుని ఉన్న మునుల దివ్యదేహాలు, నా నుదుటికి లోతట్టునున్న పెద్ద వెలుతురు తెరమీద చిన్నసైజు సినిమా బొమ్మల్లా రూపు గట్టాయి.

"ఎవరు మీరు?" అంటూ బిగ్గరగా అడిగాను.

"హిమాలయ యోగులం," అన్నారు ఆ దివ్య పురుషులు. వారి దివ్యమయిన సమాధానాన్ని వర్ణించడం కష్టం. నా గుండె ఝల్లుమన్నది.

"హిమాలయాలకి వెళ్ళాలనీ, నేను మీ లాగే కావాలనీ ఎంతో ఉవ్విళ్ళూరుతున్నాను!" ఆ దృశ్యం అదృశ్యమైంది. కాని తళతళలాడే ఆ కిరణాలు వలయాలు వలయాలుగా అనంతంగా పెరిగిపోతున్నాయి.

"అద్భుతమైన ఈ వెలుతురు ఏమిటి?"

---

వేయమని ఒక బెంగాలీ చిత్రకారుడికి చెప్పి వేయించారు. తరువాత దానినే వై.ఎస్.ఎస్. ఎస్ ఆర్ ఎఫ్. ప్రచురణలలో వేయవలసిన లాహిరీ మహాశయుల చిత్తరువుగా నిర్ధారించారు. (ప్రస్తుతం ఈ చిత్తరువు లాస్ ఏంజిలిస్‌లోని ఎస్.ఆర్.ఎఫ్. కేంద్రంలో గురుదేవులు కూర్చునే గదిలో ఉంది.)
(ప్రచురణ కర్త గమనిక)



**జ్ఞానప్రభా ఘోష్ (1868 - 1904)**
శ్రీశ్రీ పరమహంస యోగానందగారి తల్లి
శ్రీశ్రీ లాహిరీ మహాశయుల శిష్యురాలు



**భగవతీ చరణ్ ఘోష్ (1853 - 1942)**
శ్రీశ్రీ పరమహంస యోగానందగారి తండ్రి
శ్రీశ్రీ లాహిరీ మహాశయుల శిష్యుడు





(ఎడమ) ఆరేళ్ళ వయస్సులో శ్రీశ్రీయోగానందగారు (కుడి) జితేంద్ర మజుందార్ - చేతిలో
పైస లేకుండా బృందావనం వెళ్లే పరీక్షలో యోగానందగారి సహచరుడు (అధ్యాయం 11)





(ఎడమ) శ్రీ యోగానందగారి చిన్నక్క ఉమ చిన్న వయసులో, గోరఖ్‌పూర్ (కుడి) పెద్దక్క
రమ కుడివైపు చెల్లెలు నళినితో బాల్యం గడిపిన గృహంలో శ్రీశ్రీయోగానందగారు కలకత్తా 1935

"నేను ఈశ్వరుణ్ణి*; నేను వెలుతురును." మేఘాల మర్మర ధ్వనిలా ఉందా స్వరం.

"నీలో కలిసిపోవాలనుంది నాకు!"

మెల్లగా కరిగిపోతున్న పరమానంద పారవశ్యంలో, భగవంతుణ్ణి అన్వేషించాలనే ప్రేరణ శాశ్వత వారసత్వంగా లభించింది నాకు. "ఆయన శాశ్వత నిత్య నూతన ఆనందరూపుడు!" ఈ పారవశ్యం కలిగిన నాటి తరువాత కూడా చాలా కాలం వరకు, దీని తాలూకు స్మృతి నాలో నిలిచిపోయింది.

చిన్నప్పటి జ్ఞాపకం మరొకటి కూడా చెప్పవలసి ఉంది; అక్షరాలా అది చెప్పుకోవలసిందే. ఎందుచేతనంటే, దాని తాలూకు మచ్చ ఈ నాటికీ నా ఒంటిమీద ఉంది. ఒకరోజు పొద్దున, నేనూ మా అక్క ఉమా, మా గోరఖ్‌పూర్ ఇంటి ఆవరణలో ఒక వేపచెట్టుకింద కూర్చుని ఉన్నాం. మాకు దగ్గరలో కొన్ని చిలకలు వేపపళ్ళు తింటున్నాయి. నేను వాటినే తేరిపార చూస్తున్నాను. మధ్య మధ్య వాటి మీదినుంచి చూపు మళ్ళించగలిగినప్పుడల్లా నేను బెంగాలీ వాచక పుస్తకం చదవడానికి అక్క నాకు సాయం చేస్తోంది.

కాలిమీద కురుపువేసిందని చెప్పి ఉమ, ఆయింట్‌మెంటు సీసా ఒకటి తెచ్చింది. అందులో మందు కొంచెం తీసి నా ముంజేతిమీద పూసుకున్నాను.

"బాగున్న చేతికి మందు పుయ్యడమెందుకు?"

"రేపు నాకో కురుపు వేస్తుందని అనిపిస్తోందక్కా! కురుపు వెయ్యబోయే చోట నీ మందు పూసి చూస్తున్నాను."

"ఓరి అబద్ధాలకోరూ!"

"అక్కా, నన్ను అబద్ధాలకోరను; రేప్పొద్దున ఏం జరుగుతుందో చూసి అను." నాకు ఉడుకుబోత్తనం వచ్చింది.

---

* విశ్వపాలకరూపంలో భగవంతుడికి ఉన్న సంస్కృత నామం; ఇది 'ఈశ్ ' అన్న ధాతువునుంచి వచ్చింది- పాలించడం అని దీనికి అర్థం. హిందువుల పవిత్ర గ్రంథాల్లో భగవంతుడికి వెయ్యి పేర్లుంటాయి. వాటిలో ఒక్కొక్కటి ఒక్కొక్క దార్శనిక అర్థచ్ఛాయను సూచిస్తుంది ఎవరి సంకల్పంవల్ల లోకాలన్నీ వ్యవస్థిత చక్రక్రమాల్లో సృష్టి అవుతూ వినాశం చెందుతూ ఉంటాయో అతడే ఈశ్వరనాముడైన భగవంతుడు.

ఉమకి నా మాటమీద నమ్మకం కలగలేదు; అదేమాట మూడు మాట్లు ఎత్తి పొడిచింది. నేను మెల్లిగా జవాబు చెబుతూంటే నా గొంతులో దృఢమైన ప్రతిజ్ఞ ఒకటి ధ్వనించింది :

“నాకున్న సంకల్ప శక్తివల్ల, రేప్పొద్దున్నకి నా చేతిమీద సరిగ్గా ఇదుగో, ఇక్కడ, బాగా పెద్ద కురుపు ఒకటి వెయ్యాలి; నీ కురుపు ఇప్పుడున్న దానికి రెట్టింపు అవాలిగాక!”

తెల్లవారేసరికి, నేను చెప్పినచోట నా చేతిమీద పెద్ద కురుపు ఒకటి కనిపించింది; ఉమ కురుపు రెట్టింపయింది. దాంతో అక్క కెవ్వున అరిచి అమ్మదగ్గరికి పరుగెత్తింది. “ముకుందుడు మంత్రగాడయ్యాడమ్మా!” మాటలకున్న శక్తిని అపకారం చెయ్యడానికి ఎన్నడూ ఉపయోగించవద్దని అమ్మ నన్ను గంభీరంగా హెచ్చరించింది. ఆవిడ సలహాని ఎప్పటికీ గుర్తు పెట్టుకొని అనుసరించాను.

ఆపరేషన్‌చేసి నా కురుపు నయంచేశారు. డాక్టరు కోతపెట్టినచోట అయిన మచ్చ ఈ నాటికీ ఉంది. మనిషి పలికే ఒట్టిమాటకు కూడా ఎంత శక్తి ఉంటుందో అనుక్షణం గుర్తుచేసే మచ్చ నా కుడిచేతిమీద ఉంది.

ఉమతో నేనన్నవి మామూలు మాటలే; నిరపాయమైనవేనని తెలుస్తూనే ఉంది. కాని గాఢమైన ఏకాగ్రతతో అన్న ఆ మాటలకు, బాంబుల్లా పేలడానికీ, అవి ఎంత హానికరమయినప్పటికీ, కచ్చితమైన ఫలితాలు కలిగించడానికీ చాలినంత నిగూఢమైన శక్తి ఉంది. జీవితంలో కష్టాలు తొలగించడానికీ, తద్వారా మచ్చపడకుండానూ తిట్లు రాకుండానూ శస్త్రచికిత్స చేయడానికీ వాక్కులో ఉన్న విస్ఫోటక ప్రకంపన శక్తిని తెలివిగా ఉపయోగించవచ్చునని తరువాత నాకు అర్థమయింది.*

మా కుటుంబం పంజాబులో ఉన్న లాహోరుకు మారింది. అక్కడ కాళికాదేవి† రూపంలో ఉన్న అమ్మవారి పటం ఒకటి సంపాదించాను. ఆ పటం, మా ఇంట్లో

---

* ధ్వనికున్న అనంతమైన శక్తులు, ఓం అనే సృజనాత్మక శబ్దంలోంచే ఉద్భవిస్తాయి. అణుశక్తులకన్నిటికీ వెనకనున్న విశ్వ ప్రకంపన శక్తి ఈ ఓంకారమే. స్పష్టమైన అవగాహనతోనూ గాఢమైన ఏకాగ్రతతోనూ పలికే ఏ మాటకైనా ఫలించే శక్తి ఉంటుంది. ఉత్తేజకరమైన మాటల్ని గట్టిగాగాని మౌనంగాగాని పునశ్చరణ చేసినట్లయితే అవి ఫలిస్తాయని మనోవైజ్ఞానిక చికిత్సకు సంబంధించిన కుయేయిజమ్ వగైరా వైద్య విధానాల్లో గమనించారు; దీని రహస్యం, మనస్సుకున్న ప్రకంపనల రేటును పెంచడంలో ఉంది.

† శాశ్వతురాలైన ప్రకృతిమాత రూపంలో ఉండే భగవంతుడి సంకేతమే కాళి.

బాల్కనీలో నిరాడంబరంగా ఉన్న చిన్న మందిరాన్ని పావనం చేసింది. ఆ పవిత్ర స్థలంలో నేను చేసే ప్రార్థన ఏదైనా సరే ఫలిస్తుందన్న దృఢమైన విశ్వాసం ఒకటి నాలో కలిగింది. ఒకరోజున నేను, ఉమతోబాటు అక్కడ నించుని, ఇద్దరబ్బాయిలు ఎగరేస్తున్న గాలిపడగల్ని గమనిస్తూ ఉన్నాను. వాళ్ళిద్దరూ చెరొక ఇంటి కప్పుమీదా ఉన్నారు. ఆ ఇద్దరి ఇళ్ళకీ మా ఇంటికీ మధ్యలో చాలా ఇరుకు సందు ఉంది.

"అంత నిశ్శబ్దంగా ఉన్నావేం?" అంటూ ఉమ, సరదాగా నన్ను తోసింది.

"ఏం లేదు- నేనూ ఏం కోరితే అది అమ్మవారు ఇవ్వడం ఎంత అద్భుతంగా ఉందో అని ఆలోచిస్తున్నాను."

"అమ్మవారు నీకీ రెండు గాలిపడగలూ ఇస్తుందనుకుంటాను!" అంటూ వేళాకోళంగా నవ్వింది అక్క.

"ఎందుకివ్వదు?" వాటిని సంపాదించడానికి మౌన ప్రార్థనలు ప్రారంభించాను.

భారతదేశంలో గాలిపడగలు ఎగరేయడంలో పోటీలు జరుగుతుంటాయి. వాటి దారాలకి బంక, గాజుపొడి పూస్తారు. ప్రతి ఆటగాడూ, తన పోటీదారు పట్టుకున్న దారాన్ని కోసెయ్యడానికి ప్రయత్నిస్తాడు. తెగిన గాలిపడగ ఇళ్ళ కప్పులమీద తేలిపోతూ ఉంటుంది; దాన్ని పట్టుకోవడంలో బలే సరదా ఉంది. నేనూ ఉమా ఉన్నది, పై కప్పున్న గూడుమాదిరి బాల్కనీ కావడంవల్ల, తెగిన గాలిపడగ మా చేతుల్లోకి రావడం అసంభవంగానే కనిపించింది; దాని దారం ఇంటికప్పు మీద వేలాడుతూ ఉంటుంది.

మా సందుకు అవతల ఉన్న ఆటగాళ్ళు వాళ్ళ పోటీ మొదలు పెట్టారు. ఒక దారం తెగింది; దానికున్న గాలిపడగ, తేలుతూ నా దిశలో వచ్చింది. ఇంతలో హఠాత్తుగా గాలి తగ్గిపోవడంవల్ల, ఆ గాలిపడగ ఒక్క క్షణం అలా నిలిచి పోయింది. ఆ సమయంలో దాని దారం, ఎదురింటి కప్పుమీద ఉన్న నాగజెముడు మొక్కకు తగులుకుంది. దాంతో, నేను పట్టుకోడానికి వీలుగా, పొడుగ్గా చక్కటి వంపు తిరిగింది. నాకు చేజిక్కిన బహుమతిని ఉమకి ఇచ్చాను.

"ఇదేదో అదృష్టవశాత్తు అసాధారణంగా జరిగిందేకాని నీ ప్రార్థనకు ఫలితం మాత్రం కాదు. ఆ రెండో గాలిపడగ కూడా నీ దగ్గిరికి వస్తే, అప్పుడు నమ్ముతాను; నీ మాట!" అంటూంటే, అక్క మాటల్లో కంటె ఆమె నల్లటి కళ్ళలోనే ఎక్కువ ఆశ్చర్యం కనబడింది. నా ప్రార్థన గాఢంగా కొనసాగించాను. బలవంతంగా గుంజడంతో

రెండో ఆటగాడి గాలిపడగ కూడా చటుక్కున తెగిపోయింది. గాలిలో నాట్యం చేస్తూ నావేపు రావడం ప్రారంభించింది. మొదట నాకు సాయం చేసిన నాగజెముడు మొక్కే, ఈ గాలిపడగ దారాన్ని కూడా నేను పట్టుకోడానికి వీలుగా వంపు తిరిగేటట్టు చేసింది. నా రెండో బహుమతిని కూడా ఉమకి ఇచ్చేశాను.

"నిజమేరోయ్! జగన్మాత నీ మాట వింటుంది! ఇదంతా నాకు మాయలా కనిపిస్తోంది!" అంటూ బెదిరిపోయిన లేడిలా రయ్యిన పరిగెత్తేసింది అక్క.

అధ్యాయం : 2

# మా అమ్మ మరణం, విచిత్రమైన రక్షరేకు

మా అమ్మకున్న కోరికల్లోకల్లా పెద్దది, మా అన్నయ్యకి పెళ్ళి చేసెయ్యాలన్నది. "అనంతుడి పెళ్ళాం మొహం కంటబడినప్పుడు ఈ భూమిమీదే స్వర్గం చూస్తాను!" తమ వంశం పరంపరాభివృద్ధిగా సాగాలని ప్రతి భారతీయ హృదయంలోనూ ఉన్నట్టుగానే ఆమెలో ఉన్న గాఢమైన ఆకాంక్షను ఈ విధంగా వ్యక్తం చెయ్యడం తరచుగా వింటూ ఉండేవాణ్ణి.

అనంతుడి పెళ్ళికి నిశ్చయ తాంబూలాలు పుచ్చుకునే నాటికి నేను పదకొండేళ్ళవాణ్ణి. అమ్మ కలకత్తాలో ఉండి, పెళ్ళి ఏర్పాట్లన్నీ సంతోషంగా చేయిస్తోంది. నాన్నగారు నేనూ మట్టుకే ఉత్తర భారతదేశంలో ఉన్న బరైలీలోని మా ఇంట్లో ఉండిపోయాం. లాహోరులో రెండు సంవత్సరాలు పనిచేసాక నాన్నగార్ని బరైలీ బదిలీచేశారు.

అంతకుముందు, మా అక్కలిద్దరికీ - రమకీ ఉమకీ - పెళ్ళిళ్ళయినప్పుడే చూశాను, వివాహ వైభవం. కాని అనంతుడు ఇంటికి పెద్దకొడుకవడంవల్ల, ఈ పెళ్ళికి తలపెట్టిన ఏర్పాట్లు భారీఎత్తున సాగుతున్నాయి. రోజా ఎక్కడెక్కడి నుంచో వచ్చే చుట్టా లనేకమందికి అమ్మ కలకత్తాలో స్వాగతమిస్తోంది. అమ్హరెస్ట్ వీధిలో కొత్తగా మేము తీసుకున్న 50 నెంబరు పెద్ద ఇంట్లో, వాళ్ళందరికీ సుఖంగా బస ఏర్పాటుచేసింది. అన్నీ సిద్ధంగా ఉన్నాయి- విందు భోజనాలకి కావలసిన పదార్థాలు, అన్నయ్య ఆడపెళ్ళి వారింటికి తరలివెళ్ళడాని కొక అందమైన పల్లకి, రంగు రంగుల దీపాల తోరణాలు, భారీసైజు అట్ట ఏనుగులు, ఒంటెలు, ఇంగ్లీషు-స్కాటిష్-భారతీయ వాద్య బృందాలు, వృత్తిరీత్యా వినోదమిచ్చే కళాకారులు, ప్రాచీన పద్ధతిలో వివాహకాండ జరిపించే పురోహితులు.

పెళ్ళి సమయానికి వెళ్ళి మా వాళ్ళందరితోనూ కలవాలని నేనూ మా నాన్నగారూ మంచి ఉత్సాహంగా ఉన్నాం. కాని ఆ వివాహమహోత్సవం నాటికి కొన్నాళ్ళముందు అమంగళ సూచకమైన దర్శనం ఒకటి నాకు కలిగింది.

బ్రైలీలో ఒకనాటి అర్ధరాత్రి. మా బంగళా వసారాలో నేను, మా నాన్నగారి పక్కన పడుకొని ఉండగా, మా మంచానికున్న దోమతెర చిత్రంగా అల్లల్లాడుతూ రెపరెపమనేసరికి నాకు మెలకువ వచ్చింది. పలచని ఆ తెరలు పక్కకి ఒత్తి గిలాయి. ప్రియమైన అమ్మ రూపాన్ని చూశాను.

"మీ నాన్నగారిని లేపు!" ఆవిడ స్వరం గుసగుసమన్నట్టు ఉంది. "మీరు నన్ను చూడాలంటే, తెల్లారగట్ల నాలుగు గంటలకి మొట్టమొదటి బండి ఎక్కి కలకత్తా వచ్చెయ్యండి!" ఛాయామాత్రంగా ఉన్న ఆ రూపం మాయమైంది.

"నాన్నా! నాన్నా! అమ్మ చచ్చిపోతోంది!" నా గొంతులోంచి వెలువడ్డ భయార్తస్వరం నాన్నగారిని వెంటనే లేపేసింది. వెక్కివెక్కి ఏడుస్తూ ఆ దుర్వార్త ఆయనకి చెప్పాను.

"అదంతా నీ భ్రమ; దాన్నేం పట్టించుకోకు," అన్నారు నాన్నగారు, కొత్త పరిస్థితి ఏది ఎదురైనా తిరస్కరించే సహజ ధోరణిలో "మీ అమ్మ ఆరోగ్యం దివ్యంగా ఉంది. చెడువార్త ఏమైనా వస్తే రేపు బయల్దేరి వెళ్ళాం లే!"

"ఇప్పుడు బయల్దేరకపోతే, తరవాత మిమ్మల్ని మీరు క్షమించుకోలేరు," నాలో ఉన్న బాధ ఇంకా కటువుగా పలికించింది. "నేనూ మిమ్మల్ని ఎన్నడూ క్షమించను!"

విషాదపూర్ణమైన ఆ ఉదయం, స్పష్టమైన కబురు తెచ్చింది: "అమ్మకి జబ్బు చేసి ప్రమాదస్థితిలో ఉంది; పెళ్ళి వాయిదా పడింది; వెంటనే వచ్చెయ్యండి."

మాకు మతి చెడిపోయింది. ఇద్దరం బయలుదేరాం. దారిలో బండి మారేచోట ఒక ఊళ్ళో మా మామయ్యల్లో ఒకాయన మమ్మల్ని కలుసుకున్నాడు. భయంకరంగా ఉరుముతూ ఒక రైలు మా వేపు వస్తోంది. మొదట చిన్నగా కనిపించినదే రానురాను పెద్దదవుతూ వచ్చింది. మనస్సులో ఏర్పడ్డ సంక్షోభం మూలంగా, చటుక్కున రైలు పట్టాల కడ్డంగా పడిపోవాలనిపించింది. అప్పుడే అమ్మకి దూరమై పోయినందువల్ల, ఆవిడలేని శుష్క ప్రపంచాన్ని భరించలే ననిపించింది. ఈ లోకంలో అందరిలోకీ నాకు అత్యంత ఆప్తురాలైన స్నేహితు రాలు అమ్మ ఒక్కర్తే అన్నంతగా ప్రేమించాను నేను. చిన్నతనంలో నా కెదురైన

చిన్నచిన్న బాధలన్నిటికీ నాకు ఉపశమనం కలిగించినవి జాలి నింపుకొన్న ఆవిడ నల్లటి కళ్ళే.

"అమ్మ ఇంకా బతికుందా?" మామయ్యని, ఈ ఒక్క చివరి ప్రశ్న అడగడం కోసం ఆగాను.

నా ముఖంలో ఉన్న నిరాశని అర్థంచేసుకోడానికి అట్టేసేపు పట్టలేదాయనకి. "లేకేం? బతికే ఉంది!" అన్నారు. కాని ఆయన మాట, ఒక్క పిసరు కూడా నమ్మలేదు నేను.

మేము కలకత్తాలో మా ఇంటికి చేరడం, దిగ్భ్రాంతి కలిగించే మృత్యు వైచిత్ర్యాన్ని దర్శించడానికే అయింది. నేను కుప్పలా కూలిపోయాను; ప్రాణం దాదాపు పోయిందనిపించే స్థితి ఏర్పడింది. నా మనస్సు సమాధానపడ్డానికి కొన్నేళ్ళు పట్టింది. నా ఆర్తనాదాలు స్వర్గ ద్వారాల్ని ఛేదించి చివరికి ఆ జగజ్జననినే పిలుచుకువచ్చాయి. నా పచ్చిపుండ్లను చివరికి మాన్పగలిగినవి చల్లని ఆ తల్లి పలుకులే :

"జన్మజన్మలుగా, అనేకమంది తల్లుల వాత్సల్యరూపంలో నిన్ను కనిపెట్టు కొని ఉన్నదాన్ని నేను! నువ్వు వెతుకుతున్న ఆ నల్లని కళ్ళను, మాయమైపోయిన ఆ అందమైన కళ్లను, రెండింటినీ నా చూపులో చూడు!"

ఎంతో ప్రేమాస్పదురాలైన అమ్మకు దహనకాండ ముగిసింది. ఆ వెంటనే నేనూ నాన్నగారూ బెరైలీకి తిరిగి వచ్చేశాం. అక్కడ మా ఇంటికి ఎదురుగా ఆకుపచ్చ - బంగారు వన్నెలో మిసమిసలాడే మెత్తని పచ్చిక నేల ఉంది. దానికి నీడనిచ్చేది పెద్ద 'సేవాలి' వృక్షం. నేను ప్రతి రోజూ పొద్దున విచారగ్రస్తుడనయి ఆ చెట్టు దగ్గిరికి సంస్మరణాత్మక తీర్థయాత్ర సాగిస్తూ ఉండేవాణ్ణి. కవితావేశం కలిగిన క్షణాల్లో నాకు అనిపిస్తూ ఉండేది - తెల్లటి ఆ 'సేవాలి' పుష్పాలు, పచ్చని గడ్డితో నిండిన పూజావేదిక మీద, మనఃపూర్వకమైన భక్తిభావంతో ఆత్మార్పణ చేసుకుంటున్నట్టుగా పరుచుకుంటున్నాయని. నా కన్నీటి బిందువులు మంచు కణాలతో కలిసిపోతూ ఉండగా, ఉషస్సులోంచి బయల్వెడలుతున్న మరో లోకపు చిత్రమైన కాంతిని, తరచు గమనిస్తూ ఉండేవాణ్ణి. భగవంతుని కోసం తీవ్రమైన ఆకాంక్ష కలిగినందువల్ల ఏర్పడిన గాఢమైన వేదన నన్ను బాధిస్తూ ఉండేది. హిమాలయాలు నన్ను బలంగా దగ్గరికి లాక్కొంటున్నట్టు అనిపించేది.

ఒకసారి, మా చుట్టం ఒకాయన పవిత్రమైన ఆ కొండ ప్రాంతాల్లో యాత్ర ముగించుకొని బెరైలీలో మమ్మల్ని చూడ్డానికి వచ్చాడు. ఉన్నత పర్వత శ్రేణుల్లో

నివసించే యోగుల్నిగురించి, స్వాముల్ని* గురించి ఆయన చెప్పిన కథలు ఎంతో ఆసక్తిగా విన్నాను.

"హిమాలయాలకి పారిపోదాం," ఒక రోజున, బ్రైలీలో మా ఇంటి యజమాని చిన్నకొడుకు - ద్వారకా ప్రసాద్‌తో అన్నాను నేను. కాని నా మాటలకు అతనికి నా మీద సానుభూతి లేకపోయింది. నాన్న గారిని చూడ్డానికి అంత క్రితమే అక్కడికి వచ్చిన అన్నయ్యకి నా సంగతి చెప్పేశాడు. అయితే అనంతు అన్నయ్య, ఏదో కుర్రనాగన్న వేసుకున్న అసాధ్యమైన పథకమని తేలికగా తీసుకోకుండా, నన్ను అదే పనిగా వెక్కిరించడం మొదలుపెట్టాడు.

"నీ కాషాయ వస్త్ర మేదిరా? అది లేకపోతే నువ్వు స్వామివి కాలేవు మరి!" అని ఆ మాటలతో నాకు చెప్పలేనంత ఉత్సాహం కలిగింది. ఆ మాటలే నా ఊహకొక స్పష్టమైన రూపం ఇచ్చాయి: నేనొక యతినై భారతదేశమంతా సంచరిస్తున్నట్టు. బహుశా అవి, నా పూర్వ జన్మ స్మృతులను మేల్కొలిపి ఉండవచ్చు; ఏమైనప్పటికి, ప్రాచీన కాలంలో ఏర్పడిన సన్యాసాశ్రమానికి చిహ్నమైన వస్త్రాన్ని ఎంత సహజ సులభంగా ధరించగలనో గ్రహించగలిగాను.

ఒకరోజు పొద్దున, ద్వారకతో కబుర్లుచెబుతూ ఉంటే, కొండ మీంచి మంచు బండ అతివేగంగా దిగజారుతున్న మాదిరిగా భగవంతుడి మీద నాకు ప్రేమానుభూతి కలిగింది. ఆ తరువాత నా నోట వెలువడిన వాగ్ధారను అతడు కొంత మట్టుకే ఆలకించాడు; కాని నేను మాత్రం, నా మాటలనే గుండెనిండుగా వింటున్నాను.

ఆవేళ మధ్యాహ్నం నేను, హిమాలయ పాద ప్రదేశంలో ఉన్న నైనిటాల్ వైపు పారిపోయాను. అనంతుడు పంతంపట్టి నన్ను తరుముకొచ్చాడు; నేను విచారంగా, బ్రైలీకి తిరిగి రావలసివచ్చింది. మా వాళ్ళు నాకు అనుమతించిన యాత్ర అల్లా, పొద్దుటిపూట మామూలుగా ఆ 'సేవాలి' చెట్టుదగ్గరికి వెళ్లడం మట్టుకే. నేను పోగొట్టుకొన్న ఇద్దరు తల్లులకోసం- ఒకరు మానవరూపంలో ఉన్నవారు, మరొకరు దేవతారూపంలో ఉన్నవారు- నా గుండె వలవలా ఏడ్చింది.

---

* స్వామి శబ్దానికున్న మూలార్థం, "తన ఆత్మ (స్వ)తో ఏకీభూతుడైనవాడు" అని. అధ్యాయం 24 చూడండి.

అమ్మ మరణంతో కుటుంబంలో ఏర్పడ్డ వెలితి పూడ్చలేనిది. తరువాత జీవించిన నలభై ఏళ్లలోనూ నాన్నగారు మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. ఈ పిల్లలకి తల్లీ - తండ్రీ తామే అయారు. కష్టసాధ్యమైన ఈ పాత్రను నిర్వహించడంలో, ఆయనలో గుర్తించదగినంత మార్దవం పెరిగింది; ఆయన దగ్గర చనువు పెరిగింది. కుటుంబంలోని వివిధ సమస్యల్ని ఆయన ప్రశాంతంగా సూక్ష్మబుద్ధితో పరిష్కరించేవారు. ఆఫీసువేళల తరువాత, ఒక మునిమాదిరిగా, తమ గదిలోకి వెళ్ళిపోయి, ప్రశాంత మధుర చిత్తంతో క్రియాయోగం సాధనచేస్తూ ఉండేవారు. మా అమ్మపోయిన చాలాకాలానికి, నాన్నగారికి కొంత సదుపాయంగా ఉండే టట్టుగా, చిన్నచిన్న పనులు చూడటానికని ఒక ఇంగ్లీషు నర్సును పెడదామని ప్రయత్నించాను. కాని నాన్నగారు తల తిప్పేశారు. "నాకు సేవ అనేది మీ అమ్మతోనే అంతమైంది." ఎక్కడో దూరానికి చూస్తున్న ఆయన కళ్లలో, జీవిత కాలమంతా నెలకొన్న అనురాగం ఉంది. "మరో స్త్రీ ఎవరూ సేవ చెయ్యడానికి నేను ఒప్పుకోను."

అమ్మ పోయిన పద్నాలుగు నెలల తరువాత, ఆవిడ నా పేర అతి ముఖ్యమైన ఉత్తరం ఒకటి రాయించి పెట్టిందన్న సంగతి తెలిసింది. చనిపోయే సమయంలో ఆవిడమంచం దగ్గర ఉన్నవాడు అనంతుడు. ఆవిడ చెప్పినవి అతడు రాసి పెట్టాడు. అయితే ఆ సంగతి, ఒక ఏడాదిలోనే చెప్పాలని అమ్మ చెప్పినప్పటికీ, అన్నయ్య ఆలస్యం చేశాడు. అమ్మ నిర్ణయించిన అమ్మాయిని పెళ్ళి చేసుకోడానికి త్వరలోనే తను, బెరైలీ నుంచి కలకత్తా వెళ్లిపోవాలి. ఆ పరిస్థితిలో, ఒకనాడు సాయంత్రం నన్ను దగ్గరికి పిలిచాడు.

"ముకుందా, నీకు విచిత్రమైన విషయం ఒకటి చెప్పడం ఇష్టంలేక ఇన్నాళ్ళూ వెనకాడుతూ వచ్చాను." అనంతుడి కంఠంలో ఒక రకమైన నిరాశ ధ్వనించింది. "ఇల్లు వదిలిపోవాలని నీకున్న కోరికను ఎగసన దోసినట్లు అవుతుందేమోనని భయపడ్డాను. అయినా, నీలో దైవసంబంధమైన ఉత్సాహం పెల్లుబుకుతూ ఉంది. ఈ మధ్య నువ్వు హిమాలయాలకు పారిపోతూ ఉండగా పట్టుకున్నప్పుడే నే నొక తీర్మానం చేసుకున్నాను. మనఃపూర్తిగా నేను చేసిన వాగ్దానాన్ని ఇక ఏ మాత్రం వాయిదా వెయ్యగూడదనుకున్నాను." ఒక చిన్న పెట్టె, అమ్మ రాయించిన ఉత్తరం ఇచ్చాడు అన్నయ్య.

"నాయనా, ముకుందా! నేను చెప్పే ఈ మాటలే నీకు నా చివరి దీవెన కావాలి!" అంది అమ్మ. "నువ్వు పుట్టిన తరువాత జరిగిన అద్భుత విషయాలు కొన్ని నీకు చెప్పవలసిన సమయం ఇప్పుడు వచ్చింది. నువ్వు పసిపాపగా నా చేతుల్లో ఉన్నప్పుడే, నీకు నిర్ణయమైన జీవిత మార్గమేదో మొట్టమొదటిసారిగా

నాకు తెలిసింది. అప్పుడు నిన్ను, కాశీలో ఉన్న మా గురువుగారి ఇంటికి తీసుకు వెళ్ళాను. అక్కడికి చేరిన శిష్య సమూహానికి వెనక నేను దాదాపు, మరుగుపడి ఉన్నాను. గాఢమైన ధ్యానంలో మునిగిఉన్న లాహిరీ మహాశయుల్ని సరిగా చూడ లేకపోయాను కూడా.

"మహాగురువులు నిన్ను గమనించాలనీ, నిన్ను ఆశీర్వదించాలనీ- నిన్ను జోకొడుతూ - ప్రార్థిస్తున్నాను. మౌనంగా, భక్తి పూర్వకంగా నేను కోరిన కోరిక గాఢంగా పెరిగినప్పుడు లాహిరీ మహాశయులు కళ్ళు తెరిచి నన్ను దగ్గరికి రమ్మని సంజ్ఞ చేశారు. అక్కడున్నవాళ్ళు నాకు దారి ఇచ్చారు; పవిత్రమైన వారి పాదాలకు మొక్కాను. లాహిరీ మహాశయులు నిన్ను ఒళ్ళో కూర్చోబెట్టుకుని, ఆధ్యాత్మిక దీక్ష ఇస్తున్న విధంగా, నీ నుదుటిమీద చెయ్యి పెట్టారు.

" 'చిట్టి తల్లీ, నీ కొడుకు యోగి అవుతాడమ్మా! ఆధ్యాత్మికమైన రైలింజను మాదిరిగా ఇతను, ఎన్నో ఆత్మలను భగవత్ సాన్నిధ్యానికి చేరుస్తాడు.'

"సర్వసాక్షి అయిన గురుదేవులు నా రహస్య ప్రార్థనను మన్నించినందుకు నా గుండె సంతోషంతో ఎగిసిపడింది. నువ్వు పుట్టడానికి కొంత కాలం ముందు, వారు నాకు చెప్పారు - నువ్వు వారి మార్గాన్నే అనుసరిస్తావని.

"తరువాత, నీకు ఒక మహాతేజస్సు కనిపించిన సంగతి నాకూ మీ అక్క - రమకీ తెలుసు బాబూ! నువ్వు మంచం మీద నిశ్చలంగా కూర్చుని ఉండడం, పక్క గదిలోంచి మేము చూశాం. నీ చిన్నారి మొహం ధగధగా వెలిగింది; నీ గొంతులో, భగవంతుణ్ణి అన్వేషించడానికి హిమాలయాలకు వెళ్ళిపోవాలన్న దృఢమైన నిశ్చయం ధ్వనించింది.

"నీ దారి లౌకికమైన ఆశలకి చాలా భిన్నంగా ఉంటుందన్న సంగతి వీటివల్ల తెలుసుకున్నాను నాయనా! నా జీవితంలో జరిగిన వాటిలో అన్నిటికన్న విలక్షణమైన సంఘటన ఒకటి దాన్ని మరీ రూఢి చేసింది - ఆ సంఘటనే, ఈ అంతిమ సమయంలో నే నీ ఉత్తరం రాయించడానికి ప్రేరేపిస్తోంది.

"అదేమిటంటే, పంజాబులో ఒక సాధువుతో జరిగిన సంభాషణ. మన మందరం లాహోరులో ఉంటుండే రోజుల్లో, ఒకనాడు పొద్దున్న పని వాడొకడు నా గదిలోకి వచ్చి ఇలా చెప్పాడు: 'అమ్మగారూ, విచిత్రమైన సాధు*వొకడు వచ్చాడు. "ముకుందుడి తల్లిని చూడాలి నేను" అంటున్నాడు.'

* సన్యాసి; సాధన చేసేవాడు లేదా ఆధ్యాత్మిక శిక్షణ మార్గాన్ని అనుసరించేవాడు.

"ఎంతో సరళమైన ఈ మాటలే, నాలో నిగూఢమైన తీగను దేన్నో మీటినట్లయింది. వెంటనే నేను ఆయన్ని కలుసుకోడానికి వెళ్ళాను. ఆయన కాళ్ళకు మొక్కుతూ, నా ఎదురుగా ఉన్నాయన నిజంగా దైవసాక్షాత్కారం పొందినవాడేనని గ్రహించాను.

" 'అమ్మా, ఈ లోకంలో నువ్విక ఎంతో కాలం ఉండవన్న సంగతి నువ్వు తెలుసుకోవాలని మహాగురువుల కోరిక. మళ్ళీసారి జబ్బుచేసినప్పుడు, నీ కది ప్రాణాంతకమవుతుంది.'* తరువాత ఆయన మౌనం వహించారు. ఆ సమయంలో నా కేమీ భయం వెయ్యకపోగా, ఒక గొప్ప ప్రశాంతత అనుభవంలోకి వచ్చింది. చివరికి మళ్ళీ ఇలా అన్నాడాయన :

" 'ఒక వెండి రక్షరేకును నువ్వు జాగ్రత్తగా దాచాలి. అది నీకు ఈ రోజు ఇవ్వను; నా మాటల్లో నిజం నీకు తెలియడానికి, ఆ రక్షరేకు రేపు నువ్వు ధ్యానం చేసుకునే సమయంలో, దానంతట అది నీ చేతుల్లో రూపుగడుతుంది. నువ్వు చనిపోయేముందు, ఆ రక్షరేకును ఒక ఏడాది పాటు దాచి ఉంచమని నీ పెద్ద కొడుకు-అనంతుడితో చెప్పి, ఆ తరువాత దాన్ని నీ రెండో కొడుకు చేతికి ఇమ్మని తప్పకుండా చెప్పాలి. ఆ రక్షరేకు అర్థమేమిటో, మహాగురువుల ద్వారా ముకుందుడికి తెలుస్తుంది. అతడు ఈ ప్రాపంచికమైన ఆశలన్నిటినీ విడిచి పెట్టేసి ఈశ్వరుడికోసం గాఢంగా అన్వేషణ ఆరంభించే సమయంలో అతని చేతికి అది అందాలి. కొన్నేళ్ళపాటు అతడు దాన్ని అట్టే పెట్టుకున్నాక - దాని ప్రయోజనం నెరవేరినప్పుడు- అది మాయమైపోతుంది. అతడు దాన్ని ఎంతో రహస్యమైన చోట దాచిపెట్టినప్పటికీ అది ఎక్కణ్ణించి వచ్చిందో అక్కడికి పోయి తీరవలసిందే.'

"ఆయనకు నేను భిక్ష† వెయ్యబోయాను; ఎంతో గౌరవ ప్రపత్తులతో ఆయనకు ప్రణామం చేశాను. కాని ఆయన భిక్ష తీసుకోకుండానే, దీవించి వెళ్ళిపోయాడు. మర్నాటి సాయంత్రం నేను చేతులు జోడించి ధ్యానం చేస్తూ ఉండగా, ఆ సాధువు చెప్పినట్టే, నా అరచేతులు రెంటికీ మధ్య రక్షరేకు వెలిసింది.

---

* తన జీవితకాలం స్వల్పమైనదన్న రహస్యజ్ఞానం అమ్మకు ఉండేదన్న సంగతి ఈ మాటల ద్వారా నేను కనిపెట్టినప్పుడు, అనంతుడి పెళ్ళికి ఏర్పాట్లు అంత తొందరగా చెయ్యాలని ఆవిడ పట్టుపట్టడం ఎందుకో మొదటిసారిగా తెలుసుకున్నాను. పెళ్ళికి ముందే ఆవిడ చనిపోయినా, తల్లిగా సహజంగా ఆవిడకు ఉండే కోరిక, ఆ వివాహకాండ చూడాలనే.

† సాధువులకు సాంప్రదాయకంగా, గౌరవభావంతో సమర్పించేది.

రెండేళ్ళకు పైగా నేను దాన్ని బహుజాగ్రత్తగా దాచాను. ఇప్పుడది అనంతుడి దగ్గర ఉంది. నా గురుదేవులు నన్ను పరమాత్ముడి చేతుల్లో పెట్టబోతున్నారు; కనక, నా కోసం నువ్వు బాధపడకు నాయనా, వెళ్ళొస్తాను. జగన్మాత నిన్ను కాపాడుతుంది."

ఆ రక్షరేకు నా ఆధీనంలోకి రావడంతోనే ఒకానొక తేజఃపుంజం నా మీదికి ప్రసరించింది; అణిగిఉన్న జ్ఞాపకాలెన్నో నాలో మేల్కొన్నాయి. ఆ రక్షరేకు గుండ్రంగా, ప్రాచీనకాలంనాటిదిగా, చిత్రంగా ఉంది. దానినిండా సంస్కృత లిపిలో ఏవో అక్షరాలున్నాయి. తాము అదృశ్యంగా ఉండి నన్ను ముందుకు నడిపిస్తూ ఉన్న, నా పూర్వజన్మల గురువుల దగ్గరినుంచి అది వచ్చిందని గ్రహించాను. వాస్తవానికి, దానికి మరొక ప్రాముఖ్యత కూడా ఉంది; కాని రక్షరేకు మహిమను పూర్తిగా ఎవరూ బయటపెట్టగూడదనుకుంటాను.*

---

* (ఈ విధమైన) రక్షరేకన్నది అతీంద్రియ శక్తి ద్వారా ఉత్పన్నమయ్యే వస్తువు దీని రూపం అశాశ్వతమైనది· అటువంటి వస్తువులు చివరికి ఈ లోకంలోంచి అంతర్ధానమై తీరవలసిందే (చూడండి అధ్యాయం 43)

ఈ రక్షరేకు మీద ఒక మంత్రం చెక్కి ఉంది. శబ్దానికీ వాక్కుకీ- అంటే, మానవ కంఠ స్వరానికి- ఉండే శక్తుల్ని గురించి భారతదేశంలో జరిపినంత గాఢ పరిశీలన మరోచోట ఎక్కడా జరగలేదు. విశ్వమంతటా ప్రతిస్పందించే ఓంకార నాద ప్రకంపనకు (బైబిల్‌లోని "శబ్దం" లేదా "అనేక సముద్రాల ఘోష") సృష్టిస్థితిలయాలనే మూడు రూపాలు లేదా గుణాలు ఉన్నాయి (తైత్తిరీయోపనిషత్తు 1 8). మనిషి ఒక మాట పలికినప్పుడల్లా ఓంకారానికున్న ఈ మూడు గుణాల్లోనూ ఒకదాన్ని కార్యరూపంలోకి తెస్తున్నాడన్నమాట. మానవు డెప్పుడూ సత్యమే పలకాలని పవిత్ర గ్రంథా లన్నింటిలోనూ నిర్ణయించిన విధికి (సత్యం వద) ఆధారభూతమైన న్యాయ హేతువు ఇదే.

ఆ రక్షరేకు మీది సంస్కృత మంత్రాన్ని సరిగా ఉచ్చరించినట్లయితే, ఆధ్యాత్మికంగా లాభదాయకమైన ప్రకంపన శక్తి దానికి ఉంటుంది. ఆదర్శ ప్రాయంగా నిర్మించిన సంస్కృత వర్ణమాలలో యాభై అక్షరాలుంటాయి. ప్రతి అక్షరానికి నిర్దిష్టంగా స్థిరమైన ఉచ్చారణ ఒకటి ఉంటుంది లాటిన్ భాష ప్రాతిపదికగా ఏర్పడిన ఆంగ్ల వర్ణమాల సంగతి వేరు. దీంట్లో ఉండే ఇరవయ్యారు అక్షరాలూ వివిధ ధ్వనుల భారాన్ని మొయ్యలేక సతమత మవుతూ ఉంటాయి. వీటిని గురించి జార్జి బెర్నార్డ్ షా మంచి తెలివిగా, సహజ హాస్య స్ఫోరకంగా ఒక వ్యాసం రాశాడు. తనకు అలవాటయిన నిర్దాక్షిణ్య ధోరణిలో శ్రీ షా ("ఇంగ్లీషు భాష కొక ఇంగ్లీషు వర్ణమాలను ప్రవేశపెట్టడానికి అంతర్యుద్ధ మొకటి జరగవలసి వచ్చినా.... నేను దానికి బాధపడను") నలభై రెండు అక్షరాల కొత్త వర్ణమాలను చేబట్టాలని కోరాడు (విల్సన్ రాసిన, న్యూయార్కు ఫిలసాఫికల్

అయితే, చివరికి ఈ రక్షరేకు, నా జీవితంలో ఎంతటి బాధాకరమైన పరిస్థితుల్లో అదృశ్యమైపోయిందో, అది ఆ విధంగా పోవడం నాకొక గురువు దొరికే విషయాన్ని ఎలా చాటి చెప్పిందో ఈ అధ్యాయంలో చెప్పనక్కరలేదు.

కాని, హిమాలయాలు చేరడానికి చేసిన ప్రయత్నాల్లో భంగపడ్డ కుర్రవాడు, తన రక్షరేకు రెక్కలమీద ప్రతీరోజూ దూరదూరాలకు ప్రయాణిస్తూ ఉండేవాడు.

---

లైబ్రరీ ప్రచురణ 'ద మిరాక్యులస్ బర్త్ ఆఫ్ లాంగ్వేజ్' అన్న గ్రంథానికి షా రాసిన తొలిపలుకు చూడండి). ఆ మాదిరి వర్ణమాల, పరిపూర్ణత విషయంలో, సంస్కృత వర్ణమాలకు చేరువగా వస్తుంది. సంస్కృత వర్ణమాలలో యాభై అక్షరాలుండడంవల్ల ఉచ్చారణలో తప్పులు రానివ్వదు;

సింధులోయలో బయల్పడిన కొన్ని సీళ్ళ మూలంగా, సంస్కృత వర్ణమాలను భారత దేశం సెమిటిక్ మూలాలనుంచి "ఎరువు తెచ్చుకుంది" అంటూ కొందరు పండితులు ఇప్పుడు చేస్తున్న వాదాన్ని విడిచిపెట్టేట్టు చేయడం జరిగింది. మొహంజోదారో, హరప్పాలలో ఇటీవల బయల్పడిన కొన్ని గొప్ప హైందవ నగరాలు, "కేవలం ఉజ్జాయింపుగా ఊహించడానికి మాత్రమే వీలయిన యుగానికి మనల్ని తీసుకుపోగల మహత్తర సంస్కృతి కొకదానికి భారత భూమిలో పూర్వ చరిత్ర ఒకటి ఉండి ఉండాలి" అని సాక్ష్యమిస్తున్నాయి (సర్ జాన్ మార్షల్, 'మొహంజోదారో అండ్ ద ఇండస్ సివిలైజేషన్' 1931).

ఈ భూమిమీద, నాగరిక మానవుడికి మహోజ్జ్వలమైన ప్రాచీన చరిత్ర ఉందన్న హిందూవాదం నిజమయినట్లయితే, ప్రపంచంలో అత్యంత ప్రాచీనమైన సంస్కృత భాషే అత్యంత పరిపూర్ణమైన భాష ఎందుకయిందో వివరించడానికి వీలవుతుంది. (పే 149 అధో జ్ఞాపిక చూడండి). ఏషియాటిక్ సొసైటీ వ్యవస్థాపకుడు సర్ విలియం జోన్స్ ఇలా అంటాడు: "సంస్కృత భాషకి - దాని ప్రాచీనత విషయం ఏమైనా - ఒక అద్భుతమైన ఒక నిర్మాణ క్రమముంది; అది గ్రీకు భాషకంటె పరిపూర్ణమైనది, లాటిన్ కంటె విస్తృతమైనది; ఈ రెండిటికంటె ప్రశస్తంగా పరిష్కృతమైనది."

'ఎన్సైక్లోపీడియా అమెరికానా' అన్న విజ్ఞాన సర్వస్వ గ్రంథ సంపుటంలో ఇలా ఉంది, "ప్రాచీన కావ్యాధ్యయనాన్ని పునరుద్ధరించిన తరువాత, పద్దెనిమిదో శతాబ్ది ఉత్తర భాగంలో, (పాశ్చాత్య పండితులు) సంస్కృత భాషాధ్యయనం ప్రారంభించడాన్ని మించిన ప్రముఖమైన సంఘటన సంస్కృతి చరిత్రలో మరొకటి లేనే లేదు. భాషాశాస్త్రం, తులనాత్మక వ్యాకరణం, తులనాత్మక పురాణ కథాశాస్త్రం, మతశాస్త్రం... అన్నవాటి ఉనికికే ఆధారభూతమైనదీ, అధ్యయనం వల్ల వాటిని గాఢంగా ప్రభావితం చేసినదీ సంస్కృత భాషావిష్కారమే."

అధ్యాయం : 3

# రెండు శరీరాలున్న సాధువు

"నాన్నగారూ, నన్నెవరూ బలవంతం చెయ్యకుండానే ఇంటికి వస్తానని నేను మాట ఇచ్చేటట్లయితే, కాశీ చూసి రావడానికి నన్ను వెళ్ళనిస్తారా?"

ప్రయాణాలు చెయ్యడమంటే నాకున్న గాఢమైన అభిలాషకు, మా నాన్న గారు ఎప్పుడోకాని అడ్డుచెప్పేవారు కారు. నేను కుర్రవాడిగా ఉన్నప్పుడే అనేక నగరాలూ యాత్రాస్థలాలూ చూసి రావడానికి నాకు అనుమతి ఇచ్చేవారు. మామూలుగా, ఒకరిద్దరు స్నేహితులు నాకు తోడుగా వచ్చేవారు; మేమందరం మా నాన్నగారు ఇచ్చిన మొదటి తరగతి రైల్వే పాసుల మీద సుఖంగా ప్రయాణాలు చేసేవాళ్ళం. రైల్వే ఉద్యోగిగా ఆయన నిర్వహించే పదవి, మా ఇంట్లో ఉన్న దేశదిమ్మరులకు పూర్తిగా తృప్తికరంగా ఉండేది.

నా కోరిక మన్నించే విషయమై తగిన విధంగా ఆలోచిస్తానని నాన్నగారు మాట ఇచ్చారు. ఆ మర్నాడు నన్ను పిలిచారు; బెరైలీ నుంచి కాశీకి వెళ్ళి తిరిగి రావడానికి వీలుగా ఒక రైల్వే పాసు, కొన్ని రూపాయినోట్లు, రెండు ఉత్తరాలు ఇచ్చారు.

"కాశీలో కేదార్‌నాథ్ బాబు అని, మా స్నేహితుడున్నాడు; అతనికి ఒక సంగతి తెలపవలసి ఉంది. దురదృష్టవశాత్తు, అతని ఎడ్రసు పోయింది. కాని మా ఇద్దరికీ తెలిసిన స్నేహితులు స్వామీ ప్రణవానంద గారని ఆ ఊళ్ళోనే ఉన్నారు; ఆయన ద్వారా నువ్వు ఈ ఉత్తరం అతనికి అందజెయ్యగలవను కుంటాను. ఆ స్వామీ నేనూ ఒకే గురువుగారి శిష్యులం; ఆయన ఆధ్యాత్మికంగా చాలా ఉన్నత స్థితిని అందుకున్నారు. ఆయన దర్శనంవల్ల నీకు మేలు కలుగుతుంది. ఈ రెండో ఉత్తరం నిన్ను ఆయనకి పరిచయం చెయ్యడానికి పనికొస్తుంది."

"ఇదుగో, ఇకనుంచి ఇల్లు విడిచి వెళ్ళిపోవడాలేవీ కుదరవు - గుర్తుంచుకో!" అంటూ ఉంటే నాన్నగారి కళ్ళు మెరిశాయి.

నాకుండే పన్నెండేళ్ళ వయస్సుకు సహజమైన ఉత్సాహంతో (అయితే, కొత్త దృశ్యాలూ కొత్త ముఖాలూ చూడ్డంలో నాకున్న ఆనందాన్ని, కాలం ఎన్నడూ తగ్గించలేదు) బయలుదేరాను. కాశీ చేరిన వెంటనే స్వామివారి నివాసానికి వెళ్ళాను. ముందు తలుపు తెరిచి ఉంది. రెండో అంతస్తులో ఉన్న పొడుగాటి, విశాలమైన గదిలోకి దారి తీశాను. కేవలం ఒక అంగవస్త్రం కట్టుకున్న, కొంచెం లావుపాటి మనిషి ఒకాయన కొద్ది ఎత్తుగా ఉన్న వేదికమీద పద్మాసనం వేసుకుని కూర్చుని ఉన్నారు. ఆయన తలా, ముడతలులేని ముఖమూ శుభ్రంగా నున్నగా ఉన్నాయి. ఆయన పెదవులమీద, పరమానందానుభూతిని సూచించే చిరునవ్వు చిందులాడు తున్నది. పరిచయంలేని చోటికి చొరబడ్డానన్న సంకోచం నాలోంచి తొలగించడానికి ఆయన, ఒక పాత స్నేహితుడిలాగే పలకరించారు.

"బాబా ఆనంద్ [సంతోషం నాయనా!]." స్వాగత సూచకమైన ఈ పలకరింపు, నిండు గుండెతో పసివాడి గొంతులోంచి వెలువడినట్టు ఉంది. నేను వంగి ఆయన పాదాలు స్పృశించాను.

"ప్రణవానంద స్వామిగారు మీరేనాండీ?"

ఆయన తల ఊపారు. "నువ్వు భగవతి బాబుగారి కొడుకువా?" ఆయన మాటలు, నాన్నగారిచ్చిన ఉత్తరాన్ని నా జేబులోంచి తీసి ఇచ్చే వ్యవధి లేకుండానే, బయటికి వచ్చేశాయి. నేను ఆశ్చర్యపోతూనే ఆ పరిచయ పత్రం ఆయనకు అందించాను; కాని అదింక అనవసరమే అనిపించింది.

"కేదార్‌నాథ్ బాబుగారు ఎక్కడున్నారో తెలుసుకుంటాలే, నీ కోసం." ఈస్వాములవారు తమ దివ్యదృష్టితో మళ్ళీ నన్ను ఆశ్చర్యంలో ముంచెత్తారు. ఆ ఉత్తరం వైపు ఒకసారి చూసి మా నాన్నగారిని గురించి ఆప్యాయంగా మాట్లాడారు.

"నేను రెండు పెన్షన్లు అనుభవిస్తున్నాను; నీకు తెలుసా? ఒకటి మీ నాన్న గారి సిఫార్సు వల్ల వచ్చినది - ఒకప్పుడు నేను ఆయన దగ్గిర రైల్వే ఆఫీసులో పనిచేశాను; రెండోది పరమేశ్వరానుగ్రహంవల్ల వచ్చినది - ఆయన సేవలో, జీవితంలో మానవుడిగా నేను చేయవలసిన పనులన్నీ చిత్తశుద్ధితో పూర్తి చేశాను."

ఈ ప్రస్తావన నాకు బొత్తిగా అర్థం కాలేదు. "పరమేశ్వరుడి దగ్గిర నుండి మీకు వచ్చేది ఎలాటి పెన్షనండీ? ఆయన డబ్బేమయినా మీ ఒళ్ళో పడేస్తాడా?"

ఆయన నవ్వారు. "అంటే, గాఢమైన ప్రశాంతి అన్నమాట- ఎన్నో సంవత్సరాలు గాఢంగా ధ్యానం చేసినందుకు నేను పొందిన బహుమానం. ఇప్పుడు నేను డబ్బుకోసం ఆశపడను. నా కున్న కొద్దిపాటి భౌతికావసరాలూ సమృద్ధిగా సమకూరుతున్నాయి. ఈ రెండో పెన్షనుకున్న ప్రాముఖ్యం నీకు ముందు ముందు తెలుస్తుంది."

మా సంభాషణను చటుక్కుని తుంచేసి, స్వామివారు గంభీరమైన నిశ్చల రూపులుగా మారిపోయారు. ఒక నిగూఢమైన వాతావరణం ఆయన చుట్టూ ఆవరించింది. మొట్టమొదట, ఆసక్తికరమైనదేదో గమనించినప్పటి మాదిరిగా ఆయన కళ్ళు మెరిశాయి; తరువాత మందగించాయి. ఆయన అంత మితంగా మాట్లాడినందుకు నేను చిన్నబుచ్చుకున్నాను. మా నాన్నగారి స్నేహితుణ్ణి కలుసుకోడం ఎలాగో అప్పటిదాకా నాకు చెప్పనేలేదు. నా కక్కడ ముళ్ళమీద కూర్చున్నట్టు ఉంది. ఇంక ఏం తోచక, రవ్వంత విసుగుదలతో, మే మిద్దరం మినహా ఖాళీగా ఉన్న ఆ గదిలో, చుట్టూ కలయజూశాను. ఆయన కూర్చున్న బల్లకింద పావుకోళ్ళు నా కంట పడ్డాయి.

"చిన్నబాబూ!* గాభరాపడకు. నువ్వు చూడదలిచినాయన ఒక్క అరగంటలో వచ్చి నిన్ను కలుస్తారు." ఆ యోగి నా మనస్సులో ఉన్నది ఇట్టే కనిపెట్టేస్తున్నారు- ఆ సమయంలో అది, ఏమంత ఎక్కువ కష్టమైన అసాధారణ కార్యం కాదు.

మళ్ళీ ఆయన, అవగాహనకు అందని మౌనంలోకి వెళ్ళిపోయారు. ముప్ఫయి నిమిషాలు గడిచాయన్న సంగతి నా వాచీ తెలిపేసరికి స్వామివారు లేచారు.

"కేదార్‌నాథ్ బాబుగారు గుమ్మం దగ్గరికి వస్తున్నారనుకుంటాను," అన్నారాయన. ఎవరో మేడమెట్లు ఎక్కి వస్తున్న చప్పుడు వినిపించింది. అప్పుడు నాలో, నమ్మజాలనంత ఆశ్చర్యం పెల్లుబికింది; నా ఆలోచనలు గందరగోళంగా పరుగులు తీశాయి; "కబురు చెప్పడానికి ఎవరినీ పంపించకుండానే, నాన్నగారి స్నేహితుణ్ణి ఇక్కడికి పిలిపించడం ఎలా వీలైంది? నేను వచ్చినప్పటి నుంచి ఇప్పటిదాకా ఈ స్వాములవారు నాతో తప్ప మరెవ్వరితోనూ మాట్లాడలేదే!"

ఇక నేను, మంచీ మర్యాదా చూడకుండా గదిలోంచి వచ్చేసి మెట్లు దిగాను. సగం మెట్లు దిగేసరికి సన్నగా, చామన చాయగా, మధ్య తరహా ఎత్తు ఉన్న ఒకాయన్ని కలిశాను. ఆయన తొందరలో ఉన్నట్టున్నారు.

---

* కొందరు భారతీయ సాధువులు నన్ను 'ఛోటా మహాశయా' అని పిలిచేవారు; అది గౌరవ సూచకం.

"కేదార్‌నాథ్ బాబుగారు మీరేనా?" నా గొంతులో ఉద్రేకం నిండింది.

"ఔను, నువ్వు భగవతి బాబుగారి కొడుకువి కదూ- నన్ను కలుసుకోడానికి ఇక్కడ కాచుకొని ఉన్నావు కదూ?" స్నేహపూర్వకంగా చిరునవ్వు నవ్వారాయన.

"ఏమండీ, మీ రిక్కడికి రావడం ఎలా జరిగింది?" చెప్ప శక్యం కాని విధంగా ఆయన అప్పుడు అక్కడ ఉండడంతో నాకు మతిపోయి నట్టయింది; విస్మయం కలిగింది.

"ఇవాళ అన్నీ విచిత్రంగానే జరుగుతున్నాయి. దాదాపు ఒక గంట కిందట నేను గంగలో స్నానం పూర్తి చేసుకునే సమయానికి ప్రణవానంద స్వామిగారు నా దగ్గిరికి వచ్చారు. ఆ సమయంలో నే నక్కడ ఉన్నట్టు ఆయనకు ఎలా తెలిసిందో నాకు తెలియదు.

" 'భగవతి బాబుగారబ్బాయి మీకోసం మా ఇంట్లో ఎదురు చూస్తున్నాడు. మీరు నాతో వస్తారా?' అన్నారు. నేను సంతోషంగా సరే నన్నాను. మే మిద్దరం చెయ్యీ చెయ్యీ పట్టుకుని వస్తూ ఉండగా, పావుకోళ్ళతో నడుస్తున్న ఆ స్వామివారు, ఈ గట్టి బూట్లతో నడిచే నా కన్న చురుగ్గా ముందుకు సాగడం ఆశ్చర్యం కలిగించింది.

" 'మా ఇల్లు చేరుకోడానికి మీకు ఎంతసేపు పడుతుంది?' అంటూ చటుక్కున ఆగి అడిగారు నన్ను, ప్రణవానందులు.

" 'సుమారు అరగంట.'

" 'నా కిప్పుడు వేరే పని ఉంది.' అప్పుడాయన చూసిన చూపులోని మర్మం నా కర్థం కాలేదు. 'మిమ్మల్ని విడిచి నేను వెళ్ళాలి. మీరు వచ్చి నన్ను ఇంట్లో కలుసుకోవచ్చు. భగవతి బాబుగారబ్బాయీ నేనూ అక్కడ మీ కోసం ఎదురు చూస్తూ ఉంటాం.'

" 'అలా కాదు,' అని నేను అడ్డు చెప్పేలోగానే ఆయన టకటకా దూసుకు వెళ్ళిపోయి గుంపులో మాయమై పోయారు. నేను వీలయినంత తొందరగానే ఇక్కడికి నడిచి వచ్చాను."

ఈయన ఇచ్చిన వివరణతో నాలో ఆశ్చర్యం రెట్టింపయింది. ఈ స్వామీజీ మీకు ఎంతకాలం నుంచి తెలుసునని అడిగాను.

"కిందటేడు కొన్నిసార్లు కలుసుకున్నాం. కాని ఈమధ్య కలవలేదు. మళ్ళీ ఇవాళటికి స్నానాల రేవులో కలుసుకున్నందుకు సంతోషించాను."

"నా చెవుల్ని నమ్మలేకపోతున్నాను! నాకుగాని మతిపోతోందా? మీకు ఆయన కలలో కనిపించారా లేకపోతే యధార్థంగా ఆయన్ని చూసి, ఆయన చెయ్యి ముట్టుకుని, ఆయన అడుగుల చప్పుడు విన్నారా?"

"నువ్వు అడగదలుచుకున్నదేమిటో నాకు అర్థం కావడం లేదు!" కోపంతో ఆయన ముఖం జేవురించింది. "నీతో అబద్ధమేమీ చెప్పడం లేదు. నువ్విక్కడ నా కోసం కాసుకుని ఉన్నావన్న సంగతి స్వామీజీ వల్లే తెలుసుకోగలిగానని అర్థమవడం లేదూ?"

"అదేమిటి? ఆయన- ఆ ప్రణవానంద స్వామిగారు- సుమారు ఒక గంట కిందట నేను ఇక్కడికి వచ్చినప్పటినుంచి నా కళ్ళముందు నుంచి కదలలేదే!" అంటూ మొత్తం కథంతా ఆయనకు బడబడా చెప్పేశాను. స్వామీజీకీ నాకూ జరిగిన సంభాషణ కూడా చెప్పాను.

ఆయన కళ్ళు ఆశ్చర్యంతో పూర్తిగా విప్పారాయి. "మనం ఈ భౌతిక ప్రపంచంలో ఉంటున్నామా, కలగంటున్నామా? నా జీవితంలో ఇలాంటి అద్భుతం చూస్తానని నేను ఊహించనే లేదు! ఈ స్వామి ఒట్టి మామూలు మనిషే అనుకున్నాను. ఈయన అదనంగా మరో శరీరం సృష్టించుకుని దాంతో పనులు చేసుకుంటారని ఇప్పుడు తెలుస్తోంది." మే మిద్దరం కలిసి ఆ స్వాముల వారి గదిలోకి ప్రవేశించాం. ఆయన బల్లకింద ఉన్న పావుకోళ్ళ వేపు చూపించారు కేదార్‌నాథ్‌బాబు.

"ఇవిగో, స్నానాల రేవులో ఈ పాంకోళ్ళే వేసుకున్నారీయన," అంటూ గుస గుసలాడారు. "ఇప్పుడు కనిపిస్తున్నట్టే అంగవస్త్రం కట్టుకుని ఉన్నారు."

వచ్చినాయన తమ ముందు మోకరిల్లుతూ ఉండగా, స్వాములవారు ప్రశ్నార్థకమైన చిరునవ్వుతో నా వైపు తిరిగారు.

"ఇదంతా చూసి ఆశ్చర్యపోతా వెందుకు? ఈ దృశ్యమాన ప్రపంచంలో ఉన్న సూక్ష్మమైన ఏకత్వం నిజమైన యోగుల ముందు దాగలేదు. నేను ఈ క్షణంలోనే, దూరంగా కలకత్తాలో ఉన్న నా శిష్యుల్ని కలుసుకుని వాళ్ళతో మాట్లాడ గలను. ఆ విధంగానే వాళ్ళు, సంకల్ప మాత్రంచేత, స్థూల పదార్థంవల్ల కలిగే ప్రతి అవరోధాన్ని అధిగమించగలరు."

ఈ స్వాములవారు తమకు గల దూరదర్శన, దూరశ్రవణ* శక్తుల్ని గురించి

* మానసిక శాస్త్రం ద్వారా యోగులు వెల్లడించిన శాస్త్రనియమాలు చెల్లుబడిని గురించి భౌతికశాస్త్రం, దాని పద్ధతిలో అది రూఢి చేస్తోంది. ఉదాహరణకు, మానవుడికి దూరదర్శన

నాకు తెలియజెప్పడం, నా కిశోర హృదయంలో ఆధ్యాత్మిక ఉద్దీపన కలిగించ డానికి చేసిన ప్రయత్నమే కావచ్చు. కాని దాంతో, నాలో ఉత్సాహం కలగడానికి బదులు భక్తిభావంతో కూడిన భయమే అనుభూతమైంది. భగవంతుడి కోసం నేను సాగించే అన్వేషణ శ్రీ యుక్తేశ్వర్ గారు- అప్పటికింకా నేను ఆయన్ని కలుసుకోనే లేదు- అనే ఒకానొక గురువు ద్వారా కొనసాగించాలన్నది దైవ నిర్ణయమై ఉన్నందువల్ల ప్రణవానందగారిని గురువుగా స్వీకరించడానికి నాలో సుముఖత కలగలేదు. నాకు ఎదురుగా ఉన్నాయన అసలైన ప్రణవానందగారా, లేకపోతే ఆయన ప్రతిరూపమా అని ఆలోచిస్తూ సంశయాత్మకంగా ఆయనవైపు చూశాను. ఆత్మోద్దీపన కలిగించే తమ చూపుని నాపై ప్రసరింపచేయటం ద్వారా, తమ గురుదేవుల గురించి ఉత్తేజపరిచే కొన్ని మాటలు చెప్పడం ద్వారా, ఆ స్వామి వారు నాలో చెలరేగిన గందరగోళాన్ని తొలగించే ప్రయత్నం చేశారు.

"నే నెరిగిన వాళ్ళందరిలోకి లాహిరీ మహాశయులు చాలా గొప్ప యోగి. మానవరూపం ధరించిన దేవుడే ఆయన."

తమ సంకల్పమాత్రం చేత ఒక శిష్యుడే అదనంగా మరో మానవ శరీరాన్ని సృష్టించుకోగలిగినప్పుడు, ఆయన గురువుగారికి సాధ్యంకాని మహిమలంటూ ఏ ముంటాయి అనుకున్నాను.

"గురువుల సహాయం ఎంత అమూల్యమైనదో చెప్తాను విను. నేను ప్రతిరోజూ రాత్రి మరో శిష్యుడితోబాటు, ఎనిమిది గంటలసేపు ధ్యానం చేస్తూ ఉండేవాణ్ణి. పగటిపూట మేము రైల్వే ఆఫీసులో పనిచేయవలసి ఉండేది. ఆ గుమస్తా పనులు చెయ్యడానికి నాకు ఇబ్బంది అనిపించి, నా మొత్తం కాలం భగవంతుడికే

---

శక్తులున్నాయన్న సంగతి, 1934 నవంబరు 26 తేదీన రాయల్ యూనివర్సిటీ ఆఫ్ రోమ్‌లో నిరూపించడం జరిగింది. "డా॥ గిసేప్ కాలిగారిస్ అనే స్నాయువిక మనో విజ్ఞాన శాస్త్రవేత్త (న్యూరో సైకాలజీ ప్రొఫెసరు) ఒక వ్యక్తి శరీరంలోని నిశ్చితమైన కొన్ని భాగాలు చేత్తో ఒత్తాడు. అప్పుడా వ్యక్తి, గోడకు అవతల ఉన్న వ్యక్తుల్నీ, వస్తువుల్నీ సూక్ష్మమైన వివరాలతో సహా వర్ణించి చెప్పాడు. చర్మం మీద నిశ్చితమైన కొన్ని చోట్ల సంచలనం కలిగిస్తే, ఆ వ్యక్తికి అతీంద్రి యానుభూతులు కలుగుతాయనీ, మరో విధంగా చూడలేని వస్తువుల్ని చూడగలుగుతాడనీ డా॥ కాలిగారిస్, అక్కడి ప్రొఫెసర్లకు చెప్పాడు. ఆ వ్యక్తి, గోడవతల ఉన్న వస్తువుల్ని చూసేటట్టు చెయ్యడానికి ప్రొ॥ కాలిగారిస్, అతని రొమ్ముకు కుడివేపు ఒకచోట పదిహేను నిమిషాల పాటు చేత్తో ఒత్తాడు. శరీరంలో కొన్ని నిశ్చిత స్థానాల్ని సంచలింపజేసినప్పుడు మనుషులు, కొన్ని వస్తువుల్ని, అంతకు పూర్వం తాము చూసినా చూడకపోయినా, ఎంత దూరమైనవాటి నయినా చూడగలుగు తారని డా॥ కాలిగారిస్ అన్నాడు."

వినియోగించాలని కోరుకొన్నాను. ఎనిమిదేళ్ళపాటు పట్టుదలగా రాత్రిపూట సగం కాలమంతా, ధ్యానం చేసేవాణ్ణి. నాకు అద్భుతమైన ఫలితాలు కనిపించాయి. బ్రహ్మాండమైన ఆధ్యాత్మికానుభూతులు నా మనస్సును ప్రకాశింపజేశాయి. అయితే నాకూ, ఆ అనంతుడికీ మధ్య ఎప్పుడూ ఒక చిన్న తెర అడ్డు ఉండేది. మనిషికి మించిన లక్ష్యశుద్ధితో సాధన చేసినప్పటికీ కూడా, పరమాత్మలో తిరుగు లేని విధంగా చివరికి ఐక్యమయే అవకాశం నాకు లభించనట్టు కనిపించింది. ఒకనాటి సాయంత్రం లాహిరీ మహాశయుల దర్శనానికి వెళ్ళి ఆయన దివ్య సహాయం కోసం అర్థించాను. రాత్రి తెల్లవార్లూ నేను ఆయన్ని బతిమాలుతూనే ఉన్నాను.

"గురుదేవా, నాలో ఉన్న ఆధ్యాత్మికమైన వేదన ఎంత తీవ్రంగా ఉందంటే, ఆ పరమాత్మను ముఖాముఖిగా కలుసుకోలేకపోతే ఈ జీవితం భరించలేను!"

" 'నేనేం చెయ్యగలను? నువ్వు ఇంకా గాఢంగా ధ్యానం చెయ్యాలి.'

"గురురూప దేవదేవా! నేను మిమ్మల్ని వేడుకుంటున్నాను. నా ఎదురుగా భౌతిక రూపంలో సాక్షాత్కరించిన మిమ్మ్మ చూడగలుగుతున్నాను; కాని మిమ్మల్ని అవధులు లేని మీ విశ్వరూపంలో దర్శించకలిగేటట్టు నన్నాశీర్వ దించండి."

"లాహిరీ మహాశయులు ఆశీర్వాద ముద్రతో చెయ్యి చాపారు. 'ఇప్పుడింక వెళ్ళి ధ్యానం చెయ్యి. నీ గురించి బ్రహ్మ*కు మనవి చేశాను.'

"అప్పుడు నాకు చెప్పలేనంత ఉద్దీపన కలిగింది. ఇంటికి తిరిగి వెళ్ళాను. ఆ రోజు రాత్రి ధ్యానావస్థలో తపించిపోయే నా జీవిత లక్ష్యాన్ని సాధించాను. ఇప్పుడు నిరంతరాయంగా నా ఆధ్యాత్మిక భరణాన్ని అనుభవిస్తున్నాను. ఆనాటి నుంచి మరెన్నడూ, ఆనందమయుడైన ఆ సృష్టి కర్త, ఏ మాయావరణం మాటునా నాకు కనుమరుగు కాలేదు."

ప్రణవానందగారి ముఖం దివ్య తేజస్సుతో ప్రకాశిస్తూ ఉంది. పారలౌకిక ప్రశాంతి నా హృదయంలోకి ప్రవేశించింది; నాలోని భయం పలాయనం చేసింది. ప్రణవానందగారు మరో రహస్యం చెప్పారు నాకు.

"కొన్ని నెలల తరువాత మళ్ళీ ఒకసారి లాహిరీ మహాశయుల దగ్గరికి వెళ్ళాను. నాకు అనంతమైన వరం ప్రసాదించినందుకు ఆయనకు నేను ధన్య

---

* సృష్టికర్త రూపంలో ఉన్న భగవంతుడు, 'విస్తరించడం' అనే అర్థంలో, సంస్కృతంలో వాడుకలో ఉన్న 'బృహ్' అనే ధాతువునుంచి వచ్చినది.

వాదాలు చెప్పడానికి ప్రయత్నించాను. అప్పుడు ఆయనతో మరో విషయం ప్రస్తావించాను.

" 'గురుదేవా, నే నింక ఆఫీసులో పని చెయ్యలేను. దయ ఉంచి నన్ను ఈ చెరనుంచి విడుదల చెయ్యండి. బ్రహ్మదేవుడు నన్ను ఎడతెరిపి లేకుండా మత్తులో ఉంచుతున్నాడు.'

" 'మీ కంపెనీ నించి పెన్షనుకు దరఖాస్తు పెట్టు.'

" 'నా ఉద్యోగ జీవితంలో ఇంత త్వరగా పెన్షనుకు దరఖాస్తు పెట్టడానికి కారణం ఏమని చెప్పను?'

" 'నీకు ఏది అనిపిస్తే అది.'

"ఆ మర్నాడు నేను దరఖాస్తు పెట్టాను. సర్వీసు పూర్తికాక ముందే ఉద్యోగం లోంచి విరమిస్తానంటూ పెన్షను కోరడానికి కారణా లడిగాడు డాక్టరు.

" 'పనిచేస్తుంటే, నా వెన్నులో, నన్ను వివశుణ్ణి చేసే సంచలనం పుడుతోంది. అది నా శరీరమంతటా వ్యాపించి, నా విధులు నేను నిర్వర్తించుకోడానికి అనర్హుణ్ణి చేస్తోంది.'*

"అలా అన్నమీదట, ఆ డాక్టరు, ఇంక నన్నేమీ అడక్కుండా, నాకు పెన్షను మంజూరు చేయవలసిందిగా గట్టిగా సిఫార్సు చేశాడు. అది త్వరలోనే వచ్చింది. నాకు తెలుసు; లాహిరీ మహాశయుల దివ్య సంకల్పం ఆ డాక్టరుద్వారాను- మీ నాన్నగారితో సహా- రైల్వే అధికారుల ద్వారాను బాగా పనిచేసింది. దాంతో వాళ్ళంతట వాళ్ళు, మహాగురువు ఆధ్యాత్మిక ఆదేశాన్ని శిరసావహించి, ఆ ప్రేమ మయుడైన భగవంతుడితో నేను అవిచ్ఛిన్నమైన సాంగత్యం అనుభవించడానికి వీలుగా, నన్ను విముక్తుణ్ణి చేసి స్వేచ్ఛా జీవితం ప్రసాదించారు."

ఈ అసాధారణ విషయం వెల్లడించిన తరువాత ప్రణవానంద స్వామివారు చాలాసేపు, మామూలు అలవాటు ప్రకారం, మౌనంలో ఉండిపోయారు. నేను సెలవు తీసుకొంటూ ఆయన పాదాలు గౌరవపూర్వకంగా స్పృశించినప్పుడు నన్నిలా ఆశీర్వదించారు:

---

* గాఢమైన ధ్యానంలో ఉన్నప్పుడు బ్రహ్మానుభవం కలిగేది మొదట వెనుబామనే గద్దెమీద; తరువాత మెదడులో ఆనందపు వెల్లువ మనల్ని ముంచెత్తుతుంది కాని యోగి అయినవాడు

"నీ జీవితం భౌతిక సుఖాల్ని విడిచిపెట్టి యోగసాధన మార్గంలో సాగుతుంది. నిన్ను మళ్ళీసారి మీ నాన్నగారితో చూస్తాను.' తరవాత కొన్నేళ్ళకు ఈ రెండు జోస్యాలూ ఫలించాయి.*

చీకటి ముసురుతూ ఉండగా, కేదారనాథ్‌బాబు నా పక్కన నడుస్తూ వచ్చారు. మా నాన్నగారిచ్చిన ఉత్తరం ఆయనకు అందించాను. దాన్ని ఆయన వీధి దీపం దగ్గర చదువుకున్నారు.

"వాళ్ళ రైల్వే కంపెనీ కలకత్తా ఆఫీసులో నన్ను ఉద్యోగంలో చేరమని సలహా ఇస్తున్నారు మీ నాన్నగారు. ప్రణవానంద స్వామిగారు అనుభవించే పెన్షన్లలో కనీసం ఒక్కదాని కోసమయినా ఎదురు చూడ్డం ఎంత సంతోషించవలసిన విషయం! కాని అది అసంభవం! నేను కాశీ వదిలి వెళ్ళలేను. నా కింకా రెండు శరీరాలు లేవు కదా!"

---

దాని సూచనలు బయటికి కనబడకుండా అదుపు చేయడం నేర్చుకుంటాడు

నిజానికి, మేము కలుసుకొన్నప్పటికే ప్రణవానందగారు బ్రహ్మ జ్ఞానపూర్ణులైన గురువులు. కాని అంతకు అనేక సంవత్సరాల ముందే ఆయన ఉద్యోగ జీవనంలో చివరి రోజులు గడిచాయి; అప్పటికాయన నిర్వికల్ప సమాధిలో (పేజీలు 308, 514ల్లోని అధోజ్ఞాపికలు చూడండి.) తిరుగులేకుండా కుదురుకోలేదు. పరిపూర్ణం, అచంచలం అయిన ఆ చేతనావస్థలో ఉన్నప్పుడు, ప్రాపంచిక విధుల్లో ఏది నిర్వర్తించడానికైనా, యోగికి కష్టం అనిపించదు.

పదవీ విరమణ చేసిన తరువాత ప్రణవానందగారు, *ప్రణవగీత* అన్న గ్రంథం రాశారు. బెంగాలీ, హిందీ భాషల్లో ఉన్న ఈ వ్యాఖ్యాన గ్రంథం, భగవద్గీత మీద అపార పాండిత్య స్ఫూర్తితో రచించినది.

ఒకటికి మించి ఎక్కువ దేహాల్లో కనిపించే శక్తి ఒక సిద్ధి (యోగశక్తి); దీన్ని గురించి పతంజలి యోగసూత్రాల్లో (పే296 అ జ్ఞా చూడండి) చెప్పాడు. ఒకే మనిషి రెండుచోట్ల ఉండడమనే దృగ్విషయం అనేక యుగాలుగా అనేకమంది సాధువుల జీవితాల్లో కళ్ళకు కడుతూనే వచ్చింది.

* అధ్యాయం 27 చూడండి.

అధ్యాయం : 4

# హిమాలయాలకు పారిపోతుంటే ఆటంకం

"ఏదో ఒక చిన్న వంకపెట్టి నీ తరగతి గదిలోంచి బయటికి వచ్చెయ్యి. ఒక గుర్రబ్బండి కుదుర్చుకో. మా సందులోకి వచ్చేసి, మా ఇంట్లోవాళ్ళెవరి కంటా పడని చోట ఆగు!"

నాతోబాటు హిమాలయాలకి రావాలనుకున్న మా హైస్కూలు స్నేహితుడు అమర్ మిత్తర్‌కి నేనిచ్చిన చివరి సూచన లివి. మేము పలాయనానికి నిర్ణయించు కున్నది ఆ మరుసటి రోజు. మా అన్నయ్య అనంతుడు నన్నొక కంట కని పెడుతూ ఉండటంవల్ల ముందు జాగ్రత్తలు అవసరమయాయి. ఇంటినుంచి పారిపోవాలన్న సంకల్పం నా మనస్సులో ఉన్నట్టు అనుమానించి, ఎలాగయినా సరే నా ప్రయ త్నాలు చెడగొట్టాలని అతను గట్టిగా నిశ్చయించుకున్నాడు. రక్షరేకు నన్ను ఆధ్యాత్మి కంగా ఉత్తేజపరుస్తూ నాలో గుప్తంగా పనిచేస్తూ ఉంది. దివ్యదర్శనాల్లో తరచు నాకు కనిపిస్తూండే గురుదేవుల ముఖాన్ని హిమాలయ మంచు ప్రదేశాల్లో ఎక్కడో ఒకచోట దర్శించగలనని నా ఆశ.

మా నాన్నగారు కలకత్తాకి శాశ్వతంగా బదిలీ అయిన తరువాత మా కుటుంబం అక్కడే ఉంటోంది. పితృస్వామికమైన భారతీయ ఆచారం ప్రకారం అనంతుడు తన భార్యను ఇంటికి తీసుకువచ్చాడు. ఆ ఇంట్లో మిద్దెమీది ఒక చిన్న గదిలో నేను ప్రతి రోజూ ధ్యానం చేసుకుంటూ నా మనస్సును దైవాన్వేషణకు ఆయత్తం చేసుకుంటూ ఉండేవాణ్ణి. మరపురాని ఆ రోజు, అపశకునంలాంటి వానను వెంటబెట్టుకొని వచ్చింది. రోడ్డు మీద బండి చక్రాల చప్పుడు వినిపిం చింది. అమర్ వచ్చేశాడని నేను, గబగబా ఒక దుప్పటీ, చెప్పుల జోడూ, రెండు అంగోస్త్రాలూ, ఒక జపమాలా, లాహిరీ మహాశయుల ఫొటో, భగవద్గీత పుస్తకమూ కలిపి మూటకట్టి మా మూడో అంతస్తు కిటికీలోంచి బయటికి విసిరేశాను. చకచకా

మెట్లు దిగేసి మా మామయ్య పక్కనుంచే వెళ్ళిపోయాను. ఆయన గుమ్మందగ్గర చేపలు కొంటున్నాడు.

"ఏమిటోయ్ సంబరం?" అంటూ నన్ను అనుమానంగా చూశాడు. నేను ఏ మాత్రం తొణక్కుండా ఆయనవేపు ఒక చిరునవ్వు విసిరి సందులోకి నడిచాను. నా మూట తీసుకొని, పన్నాగానికి కావలసినంత జాగ్రత్తా పాటిస్తూ, వెళ్ళి అమర్‌ని కలుసుకొన్నాను. అక్కణ్ణించి మేము చాందినీ చౌక్ బజారుకు వెళ్ళాం. ఇంగ్లీషు వాళ్ళు వేసుకొనే బట్టలు కొనుక్కోడం కోసమని మేము, మావాళ్ళు పాదరు ఖర్చుల కిచ్చిన డబ్బులు కొన్ని నెలలపాటు కూడబెట్టుకొంటూ వచ్చాం. మా అన్నయ్య తెలివయినవాడు; చాలా సులువుగా, మా మీద డిటెక్టివ్ పని చెయ్యగలడు. ఈ సంగతి తెలిసి మేము, యూరోపియన్ వేషాలు వేసుకొని అతని కన్ను కప్పాలని అనుకొన్నాం.

స్టేషనుకు వెళ్ళే దారిలో మేము, మా చుట్టం జ్యోతిన్ ఘోష్ కోసం ఆగాం; అతన్ని నేను జతీన్‌దా అనే పిలిచేవాణ్ణి. అతను కొత్తగా ఆధ్యాత్మిక మార్గంలోకి వచ్చినవాడు; హిమాలయాల్లో ఒక గురువును సంపాదించాలని ఉవ్విళ్ళూరు తున్నాడు. మేము సిద్ధంగా ఉంచిన కొత్త సూటు సింగారించుకొన్నాడు అతను. మా ఎత్తు బాగా పారిందని మురిసి పోయాం! గాఢమైన ఒక ఉత్సాహం మా గుండెల్ని ఆవరించింది.

"మనకింక కావలసినవల్లా కేన్వాసు బూట్లు," అని అంటూ, అడుగున రబ్బరు వేసిన బూట్లు అమ్మకానికి పెట్టిన దుకాణానికి మా స్నేహితుల్ని తీసుకువెళ్ళాను. "తోలుతో చేసినవన్నీ జంతువుల్ని చంపగా తయారయినవే కనక, ఈ పవిత్ర యాత్రలో మన దగ్గిర అలాటివి ఉండకూడదు," అన్నాను. నా భగవద్గీతకున్న తోలు అట్టా, ఇంగ్లండులో తయారైన నా సోలా టోపీ (హెల్మెట్)కి ఉన్న తోలుపట్టీలూ తీసి పారెయ్యడానికి నేను వీధిలో ఆగాను.

స్టేషనులో మేము బర్ద్వాన్‌కు టిక్కెట్లు కొన్నాం. హిమాలయాల దిగువ కొండల్లో ఉన్న హరిద్వారం చేరడానికి అక్కడ రైలు మారాలని నిర్ణయించు కొన్నాం. మాలాగే ఆ రైలుబండి కూడా ఉరకడం మొదలుపెట్టగానే, నాలో ఉన్న ఆశాభావాలను స్నేహితులకు వెల్లడించాను.

"ఒక్కసారి ఊహించుకోండి! గురువులు మనకి దీక్ష ఇస్తారు. మనం సమాధి స్థితి అనుభవం పొందుతాం. అప్పుడు మన శరీరాలకు వచ్చే దివ్యమైన ఆకర్షణ

శక్తివల్ల హిమాలయాల్లో ఉండే క్రూర మృగాలు మన దగ్గిరికి సాధుజంతువుల్లా వస్తాయి. మన లాలింపుకోసం ఎదురుచూస్తూ పులులు, పెంపుడు పిల్లుల్లా ఉంటాయి!"

ఆలంకారికంగానూ, అక్షరాలా రెండు విధాలా - సమ్మోహకరమైన భవిష్యత్పరిస్థితిని చిత్రిస్తూ నేనన్న ఈ మాటలకు అమర్ పెదవుల మీద ఉత్సాహంగా చిరునవ్వు విరిసింది.

కాని జతీన్‌దా చూపు తప్పించాడు; వెనక్కి పరుగులు తీస్తున్న నేలవేపు కిటికీలోంచి చూపు సారించాడు.

"ఉన్న డబ్బు మూడు వాటాలు వెయ్యాలి." చాలాసేపు మౌనంగా ఉన్న తరువాత జతీన్‌దా చేసిన సూచన ఇది. "బర్ద్వాన్‌లో మనం ఎవరి టిక్కెట్టు వాళ్ళే కొనుక్కోవాలి. అలాగయితే, మనమందరం కలిసి పారిపోతున్నామన్న సంగతి స్టేషనులో ఎవరూ కనిపెట్టలేరు," అన్నాడు.

నేను ఏమీ అనుమానించకుండా, అతని సూచనకు ఒప్పుకొన్నాను. మునిమాపు వేళకు మా బండి బర్ద్వాన్‌లో ఆగింది. జతీన్‌దా టిక్కెట్ల ఆఫీసులోకి వెళ్ళాడు. అమరూ నేనూ ప్లాట్‌ఫారం మీద కూర్చున్నాం. పదిహేను నిమిషాల సేపు అలా కాసుకొని ఉండి, అప్పుడింక వృథాగా వాకబులు మొదలుపెట్టాం. అన్నివేపులా వెతుకుతూ, ఎంతో గాభరాగా జతీన్‌దా కోసం పేరుపెట్టి అరవడం మొదలు పెట్టాం. కాని అతను, ఆ చిన్న స్టేషను చుట్టూ ఆవరించిన చీకటిలో కలిసిపోయాడు.

నేనొక విచిత్రమైన స్తబ్ధతకు లోనయ్యాను. నా ధైర్యం పూర్తిగా సడలిపోయింది. నిరుత్సాహపరిచే ఈ దుర్ఘటనను దేవుడే కలగజేసాడా? ఆయన్ని చేరుకోవడం కోసం, మొదటిసారిగా ఎంతో జాగ్రత్తగా పథకం వేసుకుని ఇంటి నుంచి పారిపోయే, ఈ మనోహరమైనసన్నివేశం దారుణంగా భగ్నమయింది.

"అమర్, మనం ఇంటికి వెళ్ళిపోదాం." పసిపిల్లవాడిలా ఏడుస్తూ అన్నాను నేను. "జతీన్‌దా ఇంత నిర్దయగా వెళ్ళిపోవడం మనకి అపశకునం. ఈ ప్రయాణం దెబ్బతినక మానదు," అన్నాను.

"దేవుడిమీద నీకున్న ప్రేమ ఇదేనా? ఒక దగాకోరు స్నేహితుడి చిన్న పరీక్షకే నిలబడలేవా?" అన్నాడు అమర్.

ఇది దేవుడు పెట్టిన పరీక్ష అన్న సంగతి అమర్ మాటల్లో ధ్వనించడంతో నా గుండె కుదుటపడింది. సీతాభోగ్ (అమ్మవారి నైవేద్యం) కూ, మోతీచూర్ (మిఠాయి బూందీ) కూ బర్ద్వాన్ పెట్టింది పేరు; అప్పటికి అవి తిని సేద దీర్చుకున్నాం. మరికొన్ని గంటల్లో, బరైలీమీదుగా హరిద్వారం వెళ్ళడానికి బండి ఎక్కాం. మర్నాడు మొగల్‌సరాయిలో బండ్లు మారడానికి ప్లాట్‌ఫారం మీద కాసుకొని కూర్చుని చాలా ముఖ్యమైన విషయం మాట్లాడుకున్నాం.

"అమర్, కాసేపట్లో రైల్వే ఉద్యోగులు వచ్చి మనని గుచ్చిగుచ్చి ప్రశ్నలు వెయ్యవచ్చు. మా అన్నయ్య తెలివిని నేను ఏ మాత్రం తక్కువగా అంచనా వెయ్యడం లేదు. ఫలితం ఏమైనా సరే, నేను మాత్రం అబద్ధం ఆడను," అన్నాను.

"ముకుందా, నేను నిన్ను కోరేదల్లా నిబ్బరంగా ఉండమని. నేను మాట్లాడు తుంటే నువ్వు నవ్వకు - ఉలకకు, పలకకు!"

ఇంతలోనే ఒక యూరోపియన్ అధికారి వచ్చి నన్ను నిలదీశాడు. ఒక తంతి కాయితం నా ముందు ఆడించాడు; దాంట్లో విషయం నేను వెంటనే గ్రహించ గలిగాను.

"మీరు కోపం వచ్చి ఇంట్లోంచి పారిపోతున్నారా?"

"లేదు!" ప్రశ్నించడానికి అతను ఎన్నుకొన్న మాటలు, నేను గట్టిగా జవాబివ్వ డానికి వీలు కలిగించినందుకు నాకు సంతోషమయింది. అయితే ఆచార విరుద్ధమయిన నా ప్రవర్తనకు కారణం కోపం కాదు, "దైవం కోసం కలిగిన అత్యధిక నిస్పృహ" అని నాకు తెలుసు.

అప్పుడా ఉద్యోగి అమర్ వేపు తిరిగాడు. అప్పుడు వాళ్ళిద్దరి మధ్యా జరిగిన వాగ్వాదం వింటూంటే, ప్రజ్ఞా ప్రదర్శనంలో ఒకరితో ఒకరు పోటీ పడుతున్నట్టు ఉంది. దాంతో, గంభీరంగా ఉండమని మా వాడిచ్చిన సలహా పాటించడం చాలా కష్టమయిపోయింది.

"మూడో వాడెక్కడ?" కంఠస్వరంలో తన అధికారం పూర్తిగా ధ్వనించేటట్టు అడిగాడాయన.

"ఊఁ - నిజం చెప్పండి!" అని రెట్టించాడు.

"అయ్యా, మీరు కళ్ళజోడు ధరించినట్టు కనిపిస్తోంది మరి; ఇక్కడున్నది మే మిద్దరమేనని తెలియడం లేదా?" అంటూ అమర్ నిర్భయంగా చిరునవ్వు నవ్వాడు. "నే నేమీ మాంత్రికుణ్ణి కాను; మూడోవాణ్ణి ఇక్కడ ప్రత్యక్షం చెయ్యలేను," అన్నాడు.

ఈ మొండి జవాబుకు చిరాకు కలిగినట్టుంది ఆ ఉద్యోగికి; మరో వేపు నుంచి దాడి మొదలు పెట్టాడు. "నీ పేరేమిటి?"

"నన్ను థామస్ అంటారు. మా అమ్మ ఇంగ్లీషుది; మా నాన్న క్రైస్తవమతం పుచ్చుకున్న భారతీయుడు."

"మీ స్నేహితుడి పేరేమిటి?"

"థాంప్సన్ అని పిలుస్తాను."

అంతవరకు నాలో అణిచిపెట్టుకున్న కులుకు, దాంతో పై స్థాయికి చేరుకొంది. అదృష్టవశాత్తు, అప్పుడే బయలుదేరడానికి సిద్ధంగా కూత కూస్తున్న రైలుబండి వేపు నడిచాను నేను, వాళ్లతో చెప్పకుండానే. ఎదుటి వాళ్ళ మాటల్ని సులువుగా నమ్మే స్వభావంగల ఆ ఉద్యోగితోబాటు అమర్ కూడా నా వెంట వచ్చాడు. ఉపకారబుద్ధితో ఆయన, యూరోపియన్లు కూర్చునే పెట్టెలోకి ఎక్కించాడు మమ్మల్ని. సగం ఇంగ్లీషు పుట్టుక పుట్టిన కుర్రవాళ్లిద్దరు, నాటు మనుషులకోసం కేటాయించిన పెట్టెలో కూర్చుని ప్రయాణం చేయ్యాలే - అన్న ఆలోచనతో ఆయన మనస్సు నొచ్చుకున్నట్టుంది. ఆయన మర్యాదగా నిష్క్రమించిన తరువాత నేను సీటుకు చేర్లబడి కడుపు చెక్కలయేలా నవ్వాను. మంచి అనుభవజ్ఞుడయిన ఒక యూరోపియన్ అధికారిని బోల్తా కొట్టించామన్న ఉల్లాస భరితమైన సంతృప్తి అమర్ ముఖంలో స్పష్టంగా కనిపించింది.

ఆ రైల్వే ఉద్యోగి తెచ్చిన తంతి కాయితం, ప్లాట్‌ఫారం మీద దొంగచాటుగా చదివేశాను. మా అనంతన్నయ్య దగ్గిరి నుంచి వచ్చిందది. దాంట్లో ఇలా ఉంది: "ఇంగ్లీషు దుస్తులు వేసుకున్న బెంగాలీ అబ్బాయిలు ముగ్గురు ఇంటినుంచి పారిపోయి, మొగల్‌సరాయి మీదుగా హరిద్వారం వెళ్తున్నారు. నేను వచ్చే వరకు వాళ్ళ నక్కడ ఆపుచెయ్యండి. మీ సహాయానికి తగిన పారితోషికం దొరుకుతుంది."

"అమర్, గుర్తులు పెట్టిన టైమ్‌టేబుళ్ళు మీ ఇంట్లో వదిలెయ్యొద్దని చెప్పానా నీకు?" అంటూ యద్దేవా చేస్తూ చూశాను. "అక్కడ మా అన్నయ్య కొకటి కనిపించి ఉంటుంది."

మావాడు సిగ్గుపడుతూ, తప్పు ఒప్పుకొన్నాడు. మేము బెరైలీలో కాసేపు ఆగాం. అక్కడ మా కోసం ద్వారకాప్రసాద్ * కాసుకొని ఉన్నాడు. అనంతన్నయ్య

* ఇతన్ని గురించి 22 పుటలో వచ్చింది.

ఇచ్చిన తంతి చేత్తో పట్టుకొని మమ్మల్ని అక్కడ ఆపెయ్యడానికి గట్టిగా ప్రయత్నించాడు ద్వారక. అయితే మేమిలా పారిపోవాలన్న ప్రయత్నం, ఏదో సరదాకి తలపెట్టింది కాదని వాడికి నచ్చజెప్పాను. మాతోబాటు వాణ్ణి కూడా హిమాలయాలకి వచ్చెయ్యమన్నాం; కాని కిందటిసారిలాగే, వాడు రానన్నాడు.

ఆ రాత్రి మా బండి ఒక స్టేషనులో ఆగి ఉండగా, మరో రైల్వే ఉద్యోగి వచ్చి అమర్‌ని లేపాడు. నే నప్పుడు సగం నిద్రలో ఉన్నాను. ఆయన కూడా, ఈ "థామస్," "థాంప్సన్"ల సంకరజాతి ఆకర్షణలకు లోబడి మోసపోయాడు. ఆ రైలుబండి, తెల్లవారేసరికి మమ్మల్ని విజయవంతంగా హరిద్వారం చేర్చింది. రాచఠీవితో నిలిచిన కొండలు దూరం నుంచి, మమ్మల్ని రమ్మని పిలుస్తున్నాయి. స్టేషనులోంచి బయటికి దూసుకువచ్చి, స్వేచ్ఛగా సంచరిస్తున్న నగర ప్రజల్లోకి వచ్చి పడ్డాం. అనంతన్నయ్య ఎలాగా మా యూరోపియన్ వేషం పసిగట్టేశాడు కనక, మేము చేసిన మొట్టమొదటి పని, బట్టలు మార్చేసి దేశవాళీ దుస్తులు వేసుకోడం, పట్టుబడిపోతామన్న కించ నా మనస్సులో పీకుతూనే ఉంది.

వెంటనే హరిద్వారం విడిచి వెళ్ళిపోవడం మంచిదని, అక్కడికి ఉత్తరాన ఉన్న ఋషీకేశం వెళ్ళడానికి టిక్కెట్లు కొనుక్కున్నాం. చిరకాలంగా ఎంతోమంది మునీశ్వరుల పాదస్పర్శతో పునీతమైన భూమి ఋషీకేశం. అప్పటికే నేను బండి ఎక్కేశాను; అమర్ మాత్రం వెనకబడి, ఇంకా ప్లాట్‌ఫారంమీదే ఉన్నాడు. ఒక పోలీసు కేకతో వాడు రకీమని అక్కడాగిపోయాడు. మాకు ఇష్టంలేకపోయినా మా సంరక్షకుడిగా వెంటదగిలిన ఆ పోలీసు అధికారి, మమ్మల్ని ఒక పోలీసు స్టేషను బంగళాకు నడిపించి, మా దగ్గర ఉన్న డబ్బు స్వాధీనం చేసుకున్నాడు. మా అన్నయ్య వచ్చేదాకా మమ్మల్ని అక్కడ ఆపుచేసి ఉంచడం తన విధి అని మర్యాదగా చెప్పాడు.

తప్పించుకు తిరుగుతున్న మేము చేరదలచిన గమ్యం హిమాలయాలని తెలిసి ఆ అధికారి ఒక విచిత్రమైన కథ చెప్పాడు.

"మీకు సాధువుల పిచ్చి పట్టినట్టుంది. నిన్ననే నే నొక సాధువును చూశాను; ఆయనకంటె గొప్పవాణ్ణి మీ రెన్నటికీ చూడలేరు. నేనూ, నాతో పనిచేసే మరో ఆఫీసరూ, ఐదురోజుల క్రితం మొదటిసారిగా ఆయనకి తారసపడ్డాం. ఒక ఖూనీకోరు కోసం తీవ్రంగా గాలిస్తూ, గంగ ఒడ్డున పహరా కాస్తున్నాం మేము. వాడు బతికుండగానన్నా సరే, చచ్చినా సరే పట్టి తెమ్మని మాకు హుకుము జారీ అయింది. యాత్రికుల్ని దోచుకోడానికి వాడు సాధువులా మారువేషాలు వేస్తాడని

పేరు. మాకు కొంచెం దూరంలో, ఆ నేరస్తుడి పోలికలకు సరిపోయే మనిషి ఒకడు కనిపించాడు. ఆగమని మేము హెచ్చరిక చేసినా ఆ మనిషి ఖాతరు చెయ్యలేదు. అతని మీదపడి పట్టుకోడానికి మేము పరిగెత్తాం. అతని వెనకాలకి వెళ్ళి నా గొడ్డలితో, మంచి బలంగా ఒక్కవేటు వేశాను. దాంతో అతని కుడిచెయ్యి దాదాపు పూర్తిగా ఊడిపడేంతగా తెగిపోయింది.

"నోరు విప్పి అరవడం కాని, దారుణమైన ఆ దెబ్బవేపు చూడ్డం కాని చెయ్యకుండా, ఆ మనిషి ఇంకా చురుగ్గానే నడిచిపోతూండడం మాకు ఆశ్చర్యం కలిగించింది. మేము ఆయన ఎదటికి ఉరికేసరికి, నిదానంగా ఇలా అన్నాడు:

" 'మీరు గాలిస్తున్న ఖూనీకోరు నేను కాదు.'

"దేవుడిలాటి ఒక ఋషిని గాయపరిచానని తెలిసేసరికి అవమానంతో కుంగి పోయాను. ఆయన పాదాల మీద పడి క్షమాపణ చెప్పుకొని, పెద్ద ధారగా చిమ్ముతున్న రక్తాన్ని అరికట్టడానికి నా తలపాగా తీసి ఇచ్చాను.

" 'నాయనా, ఇది నీ వల్ల పొరపాటున జరిగిందని తెలుస్తోంది,' అంటూ ఆ సాధువు నా మీద దయతో ఇలా అన్నాడు : 'వెళ్ళు; నిన్ను నువ్వు తిట్టుకోకు. ప్రేమమయురాలయిన ఆ జగన్మాత నన్ను జాగ్రత్తగా చూసుకుంటోందిలే!' వేలాడుతున్న చేతిని మొండి భుజంలోకి తోశాడాయన. ఆశ్చర్యం! అది వెంటనే అతుక్కుపోయింది; రక్తస్రావం కూడా చిత్రంగా ఆగిపోయింది.

" 'మూడు రోజులు పోయాక నా దగ్గిరికి రండి - అదుగో, ఆ చెట్టు కింద ఉంటాను; గాయం పూర్తిగా మానిపోవడం మీరే చూస్తారు. అప్పుడిక మీరు పశ్చాత్తాపపడనక్కర్లేదు.'

"నిన్న నేనూ, నాతోబాటు పనిచేసే ఆఫీసరూ కలిసి ఆయన చెప్పిన చోటికి ఆత్రంగా వెళ్ళాం. సాధువు అక్కడ ఉన్నాడు. తన చెయ్యి పరీక్షగా చూడనిచ్చాడు మమ్మల్ని. దానిమీద ఒక మచ్చా లేదు, గాయమయిన జాడా లేదు!

" 'నేను ఋషీకేశం మీదగా హిమాలయ నిర్జన ప్రదేశాలకి వెడుతున్నాను.' అంటూ ఆ సాధువు తొందరగా బయలుదేరి వెళ్తూ మమ్మల్ని దీవించాడు. ఆయన పవిత్రతవల్ల నా జీవితం ఉచ్ఛస్థితి నందుకున్నట్టు అనిపిస్తోంది. "

ఆ అధికారి ఎంతో భక్తి ఉట్టిపడేలా తన మాటలు ముగించాడు; ఆయనకు కలిగిన అనుభవం, ఆయన్ని సమూలంగా కదిలించినట్లు కనిపిస్తోంది. ఆ విషయం మా మనస్సుల కెక్కే విధంగా ఆయన, అద్భుతమయిన ఆ వార్త పత్రికలో

అచ్చయిన కాయితం ఒకటి నా చేతికిచ్చాడు. జనంలో సంచలనం కలిగించడానికే ప్రాముఖ్యమిచ్చే వార్తాపత్రికకు (దురదృష్టవశాత్తు, భారత దేశంలో కూడా ఇవి లేకపోలేదు) మామూలయిన స్వానుకూలపద్ధతిలో అతిశయోక్తిగా రాశారు అందులో: దాదాపు ఆ సాధువు తల తెగ్గొట్టినంత పని జరిగిందని సూచించారు.

తనను పీడించినవాణ్ణి క్రీస్తు మాదిరిగా క్షమించగలిగేటంతటి ఒక మహా యోగి దర్శనాన్ని పోగొట్టుకున్నందుకు నేనూ అమరూ విచారించాం. భారత దేశం, గత రెండు శతాబ్దులుగా, భౌతిక సంపత్తి విషయంలో పేదగానే ఉన్నప్పటికీ తరగని గనివంటి దివ్య సంపత్తి మాత్రం దానికి ఉంది; ఈ పోలీసాయనవంటి లౌకిక మానవులకు కూడా, ఆధ్యాత్మికంగా "ఆకాశాన్నంటే మేడలు," సందర్భవశాత్తు దారి పక్కనే ఎదురు పడుతుంటాయి.

అటువంటి అద్భుతమైన కథ చెప్పి మా విసుగు పోగొట్టినందుకు ఆ అధికారికి మేము ధన్యవాదాలు చెప్పాం. తాను మాకంటె అదృష్టవంతుడన్నది అతని సూచన కావచ్చు ; తాను అప్రయత్నంగా, మహనీయుడైన ఒక సాధువును కలుసుకొన్నాడు; కాని మేము చిత్తశుద్ధితో చేసిన అన్వేషణ, ఒక మహాగురువు పాద సన్నిధిని కాకుండా, మొరటైన ఒక పోలీసు స్టేషనులో ముగిసింది.

హిమాలయాలు అంత దగ్గరలో ఉన్నా కూడా మేము బందీలుగా ఉన్నందు వల్ల మాకవి ఎంతో దూరమయాయి. స్వేచ్ఛకోసం నా మనస్సు ఉరకలు వేస్తోందని అమర్‌తో చెప్పాను.

"అవకాశం వచ్చినప్పుడు చల్లగా జారుకుందాం. పవిత్రమైన ఋషీకేశానికి కాలినడకన వెళ్ళగలం," ప్రోత్సాహకరంగా చిరునవ్వు నవ్వాను.

కాని, మా కొక బలమైన ఆధారంగా ఉన్న డబ్బును వాళ్ళు మా దగ్గరినుంచి తీసేసుకోగానే నా జతగాడు నిరాశావాదిగా మారిపోయాడు.

"అల్లాటి ప్రమాదకరమైన అడవి ప్రదేశంలో కనక మనం నడక మొదలెట్టా మంటే చివరికి మనం చేరేది సాధువులుండే చోటికి కాదు - పెద్ద పులుల పొట్టల్లోకి!"

మరి మూడు రోజులకి అనంతుడూ, అమర్ వాళ్ళ అన్నయ్యా వచ్చారు. అమర్ అయితే, తేలికపడ్డ మనస్సుతో వాళ్ళన్నయ్యను ఆప్యాయంగా పలకరించాడు. నేను మాత్రం సమాధానపడలేదు. నా నించి అనంతుడికి లభించినవి తిట్లు తప్ప మరేమీకాదు.

"నీ మనస్సు కెలా అనిపిస్తుందో నాకు తెలుసురా!" అంటూ మా అన్నయ్య నన్ను సముదాయిస్తూ అన్నాడు. "నేను నిన్ను కోరేదల్లా ఒకటే - కాశీలో మంచి జ్ఞాని ఒకాయన ఉన్నాడు ; ఆయన్ని కలుసుకోడానికి నాతో కాశీ రమ్మనీ, నీ కోసం బెంగపెట్టుకున్న నాన్నగారిని చూడ్డానికి కలకత్తా వచ్చి కొన్నాళ్ళు ఉండమనీను. కావలిస్తే తరువాత సాగిద్దువుగాని, ఇక్కడ గురువుకోసం వెదకడం."

ఈ విషయం దగ్గర అమర్, మా మాటల్లో కలగజేసుకుని, నాతో మళ్ళీ హరిద్వారం వచ్చే ఉద్దేశమేమీ తనకి లేదని ఖండితంగా చెప్పాడు. కుటుంబ సంబంధమైన ఆప్యాయత అనుభవిస్తున్నాడు వాడు. కాని నాకు తెలుసు, నేను మాత్రం గురువు కోసం అన్వేషణ మాననని.

మేమంతా కాశీ వెళ్ళే రైలు ఎక్కాం. అక్కడ నా ప్రార్థనకు సాటిలేని, తక్షణ ఫలితం కనిపించింది.

అనంతన్నయ్య తెలివిగా, ముందే ఒక పథకం వేసి ఉంచాడు. హరిద్వారం వచ్చే లోపున, దారిలో కాశీలో ఆగి ఒక పండితుణ్ణి కలుసుకొని, తరవాత నాతో మాట్లాడేటందుకు ఏర్పాటు చేశాడు. నేను సన్యాసి*ని కావాలన్న ఉద్దేశం విరమించు కొనేటట్టు చెయ్యడానికి ప్రయత్నిస్తామని ఆ పండితుడూ ఆయన కొడుకూ అనంతన్నయ్యకి మాట ఇచ్చారు.

అన్నయ్య నన్ను వాళ్ళింటికి తీసుకువెళ్ళాడు. పండితుడుగారి కొడుకు యువకుడే; ముంగిట్లోనే నన్ను మంచి ఉత్సాహంగా పలకరించాడు. నాకు సుదీర్ఘమైన వేదాంతోపన్యాసం ఇచ్చాడు. తనకు, దివ్యదృష్టి వల్ల నా భవిష్యత్తు తెలుసునని నొక్కిచెప్పి, సన్యాసిని కావాలన్న నా ఉద్దేశాన్ని చులకనగా కొట్టి పారేశాడు.

"నీ మామూలు బాధ్యతల్ని విడిచిపెట్టాలన్న పట్టుమీదే కనక నువ్వు ఉన్నట్టయితే, నీ కెప్పుడూ దురదృష్టమే దాపురిస్తుంది; దేవుణ్ణి దర్శించలేవు! ప్రాపంచిక అనుభవాలు లేకుండా నీ పూర్వకర్మ†ను తొలగించుకోలేవు," అన్నా డాయన.

---

* సన్యాసం = సమ్ + ని + అస్ (తోసివెయ్యడం) - అన్ని కర్మలనూ కర్మఫలాలనూ భగవంతుడికి అర్పించడం.

† ఈ జన్మలో కాని, పూర్వజన్మలో కాని చేసిన వెనకటి పనులకు ఫలితాలు; 'చేయడం' అనే అర్థంలో, 'కృ' అనే సంస్కృత ధాతువునుంచి వచ్చింది.

అందుకు సమాధానంగా, భగవద్గీతలో చెప్పిన అమృతవాక్కులు నా నోటి నుంచి వెలువడ్డాయి. " 'ఎంతో దుష్కర్మ మూటగట్టుకున్నవాడు కూడా ఎడ తెరిపి లేకుండా నన్ను ధ్యానించినట్లయితే, అతడు వెనక చేసిన దుష్కర్మల ఫలితాలు శీఘ్రంగా నశిస్తాయి. అతడు ధర్మాత్ముడయి శాశ్వత శాంతినందు కుంటాడు. నన్ను నమ్ముకున్న భక్తు డెవరూ నశించడు. ఇది నిశ్చయమని తెలుసుకో*!' "

అయితే ఆ యువకుడు అంత గట్టిగా జోస్యం చెప్పేసరికి నాలో విశ్వాసం కొద్దిగా సడలింది. అప్పుడు గుండెనిండా భక్తి నింపుకొని మనస్సులో దేవుణ్ణి ఇలా ప్రార్థించాను :

"దయ ఉంచి నా మానసిక ఆందోళన పోగొట్టు - ఇక్కడే, ఇప్పుడే జవాబు చెప్పు - నన్ను సన్యాసిగా బతకమంటావా, సంసారిగానా? నీ ఉద్దేశం చెప్పు!"

ఈ పండితుడు గారి ఇంటి ఆవరణకు వెలుపల ప్రసన్నవదనుడయి ఉన్న ఒక సాధువును గమనించాను. దివ్యదృష్టి కలవాణ్ణని చెప్పుకొనే ఈయనకూ నాకూ తీవ్రంగా జరిగిన సంభాషణను ఆయన వినే ఉంటాడన్నది - నన్ను తన దగ్గరికి పిలవడంతో అర్థమయింది. ప్రశాంతమైన ఆయన కళ్ళలోంచి బ్రహ్మాండ మైన శక్తి ఒకటి వెలువడుతున్నట్టు నాకు అనుభూతి కలిగింది.

"బాబూ, ఆ అజ్ఞాని మాటలు చెవిని పెట్టకు. నీ ప్రార్థనకి జవాబుగా, ఈ జన్మలో నీకు నిర్ణయమైన ఏకైక మార్గం సన్యాసమేనని నీకు నమ్మకంగా చెప్పమని భగవంతుడు నాతో అంటున్నాడు."

కచ్చితమైన పరిష్కారంలా వచ్చిన ఈ సందేశాన్ని వినగానే నాకు ఆశ్చర్యమే కాదు - కృతజ్ఞతాభావం కూడా పెల్లుబికింది. సంతోషంగా చిరునవ్వు నవ్వాను.

"ఆ మనిషి దగ్గర్నించి వచ్చెయ్యి!" అంటూముంగిట్లోంచి "అజ్ఞాని" నన్ను పిలుస్తున్నాడు. ఋషితుల్యుడయిన నా మార్గదర్శకుడు ఆశీర్వాద సూచకంగా చెయ్యి ఎత్తి మెల్లగా వెళ్ళిపోయాడు.

"నువ్వెంత పిచ్చివాడవో ఆ సాధువు అంత పిచ్చివాడు." ఇంత మనోహర మైన వ్యాఖ్య చేసినవాడు తల నెరిసిన పండితుడు. ఆయనా, ఆయన కొడుకూ నా వేపు సానుతాపంగా చూస్తున్నారు. "అతను కూడా దేవుడికోసం అనిశ్చితమైన అన్వేషణలో పడి ఇల్లు విడిచిపెట్టేశాడని విన్నాను."

---

* అధ్యాయం IX.శ్లో. 30-31

నేను ఆ వేపునుంచి తిరిగిపోయాను. ఈ ఇంటివాళ్ళతో నే నింకేమీ మాట్లాడదలుచుకోలేదని అన్నయ్యతో చెప్పేశాను. దాంతో అతను నిరుత్సాహ పడి, వెంటనే వెళ్ళిపోవడానికి ఒప్పుకొన్నాడు. వెంటనే మేము కలకత్తా వెళ్ళే రైలు ఎక్కాం.

"డిటెక్టివుగారూ, నేను ఇద్దరు స్నేహితులతో కలిసి పారిపోయానని మీరు ఎలా కనిపెట్టారూ?" అని అడుగుతూ, సరదాగా నాకు కలిగిన ఆసక్తిని మా తిరుగు ప్రయాణంలో అన్నయ్య దగ్గర బయటపెట్టాను. అతను కొంటెగా నవ్వాడు.

"మీ బళ్ళో, అమర్ క్లాసులోంచి వెళ్ళిపోయాడనీ మళ్ళీ రాలేదనీ తెలిసింది. మర్నాడు పొద్దున్న వాళ్ళింటికి వెళ్ళి, గుర్తులు పెట్టిన రైల్వే టైమ్ టేబులు బయటికి లాగాను. సరిగ్గా అప్పుడే, అమర్ వాళ్ల నాన్నగారు బండిలో బయటికి వెళ్ళబోతూ బండివాడితో మాట్లాడుతున్నారు.

" 'మా అబ్బాయి ఈ పూట బడికి వెళ్ళడానికి నాతో రాడు. మాయమై పోయాడు!' అంటూ బాధగా అన్నారాయన.

" 'మీ అబ్బాయిగారూ మరో ఇద్దరూ తెల్లదొరల బట్టలు వేసుకుని హౌరా స్టేషనులో రైలెక్కారని నాకు తెలిసిన బండివాడు చెప్పగా విన్నానండి. వారి తోలుబూట్లు బండివాడికి బహుమతిగా ఇచ్చారట కూడా!' అన్నాడు ఆ బండివాడు.

"దాంతో నాకు మూడు ఆధారాలు దొరికాయి - టైమ్ టేబులూ, ముగ్గురు కుర్రాళ్ళూ, ఇంగ్లీషువాళ్ళ దుస్తులూ."

ఉల్లాసమూ విసుగుదలా కలిసిన మనస్సుతో, అన్నయ్య బయట పెట్టే సంగతులు వింటున్నాను. బండివాడి విషయంలో మేము చూపించిన ఔదార్యం కొద్దిలో వికటించిందన్నమాట!

"నేను వెంటనే వెళ్ళి టైమ్ టేబుల్‌లో అమర్ గీతలు పెట్టిన ఊళ్ళ స్టేషను మాస్టర్లందరికీ టెలిగ్రాములు ఇచ్చాను. బెరైలీ దగ్గర టిక్కు పెట్టాడు అతను. అంచేత, అక్కడున్న మీ స్నేహితుడు - ద్వారకకి తంతి ఇచ్చాను. తరువాత, కలకత్తాలో మన ఇంటి చుట్టుపక్కల వాకబుచేసిన మీదట తెలిసింది ఏమిటంటే మన జతీన్‌దా ఒకరోజు రాత్రల్లా ఇంటికే రాలేదనీ, మర్నాడు పొద్దున యూరోపియన్ వేషంలో దిగాడనీ తెలిసింది. వాణ్ణి వెతికి పట్టుకుని, భోజనానికి రమ్మని పిలిచాను. నేనొక స్నేహితుడి మాదిరిగా పిలిచేసరికి వాడు కాదనలేక ఒప్పుకొన్నాడు. దారిలో,

వాడికి ఏ మాత్రం అనుమానం రానియ్యకుండా ఒక పోలీసు స్టేషనులోకి తీసుకు వెళ్ళాను. అంతకుముందే నే నక్కడ, భయంకరంగా కనిపించే ఆఫీసర్లని ఏరికోరి ఉంచాను. మేము వెళ్లగానే వాళ్ళు వాణ్ణి చుట్టు ముట్టారు. వాళ్ళ వాడి చూపులకు తట్టుకోలేక జతీన్‌దా, తన వింత నడవడికి సంజాయిషీ చెప్పుకోడానికి ఒప్పు కున్నాడు.

" 'ఆధ్యాత్మికమైన ఉత్సాహంతో మనస్సు తేలిపోతూండగా, హిమాలయా లకు వెళ్ళాలని బయల్దేరాను,' అంటూ చెప్పడం మొదలు పెట్టాడు. 'గొప్ప గురువుల్ని కలుసుకోగల అవకాశం దొరుకుతుందన్న ఆశతో నా మనస్సు నిండి పోయింది. కాని ముకుందుడు, "హిమాలయ గుహల్లో మనం ఆనందంలో తన్మయులమై ఉన్నప్పుడు, పెద్దపులులు మంత్రానికి కట్టుబడ్డట్టుగా అయిపోయి, పెంపుడు పిల్లుల్లా మనచుట్టూ కూర్చుంటాయి," అని అనేసరికి నా ఉత్సాహ మంతా నీరుగారిపోయింది; నుదుట చెమట పట్టేసింది. "అప్పుడేం గతి?" అని వాపోయాను. "ఒకవేళ పులుల క్రూరస్వభావం మా ధ్యానసమాధి శక్తి ప్రభావం వల్ల మారకపోతే మమ్మల్ని అవి, పెంపుడు పిల్లుల్లా దయతో చూస్తాయా?" అన్న ఆలోచన నాలో కలిగింది. ఏదో ఒక పులి పొట్టలోకి నేను బలవంతాన ప్రవేశించినట్టు మనస్సుకు అనిపించింది. అది కూడా పూర్తి శరీరంతో కాదు, శరీరంలోని ఒక్కొక్క భాగమే విడివిడిగా!' "

ప్రయాణం మధ్యలో జతీన్‌దా మాతో చెప్పకుండా మాయమైనందుకు అప్పుడు నాకు కలిగిన కోపం, ఇప్పుడు వచ్చిన నవ్వుతో ఎగిరిపోయింది. అన్నయ్య రైల్లో ఇచ్చిన ఉల్లాసకరమైన ఈ వివరణ, జతీన్‌దా నాకు కలిగించిన బాధనంతనీ పోగొట్టేసింది. కాని ఉన్నమాట చెప్పాలి; ఒక్క రవ్వ తృప్తిలాంటిది కూడా కలిగింది నాకు: జతీన్‌దా కూడా పోలీసుల బెడద తప్పించుకోలేకపోయినందుకు!

"అనంతదా,* నువ్వు గూఢచారివై పుట్టావు!" అంటూ తమాషాగా నేను చూసిన చూపులో కొంత విసుగుదల కూడా లేకపోలేదు. "జతీన్‌దా ప్రవర్తనకు కారణం, ఆత్మరక్షణ చేసుకోవాలన్న సహజ స్వభావమేకాని మాకనిపించినట్టు, మమ్మల్ని మోసం చెయ్యాలని కాదని తెలిసి నాకు సంతోషమయింది, అని అతనితో చెబుతాను."

---

* అతన్ని నే నెప్పుడూ అనంత-దా అనే పిలిచేవాణ్ణి. తమ్ముళ్ళుగాని చెల్లెళ్ళుగాని అన్నగారి పేరు చివర 'దా' అన్న గౌరవ వాచకం చేరుస్తారు.

కలకత్తాలో ఇంటిదగ్గర నాన్నగారు, కనీసం నా హైస్కూలు చదువు పూర్తయే దాకా నయినా తిరిగే కాళ్ళని నిలకడగా ఉంచుకోమని నా మనస్సులో నాటుకొనే టట్లుగా చెబుతూ బతిమాలారు. నేను లేని సమయంలో, వాత్సల్యంతో ఒక తంత్రం పన్ని - ఋషితుల్యులైన స్వామీ కేవలానందగారనే పండితులొకరు రోజూ మా ఇంటికి వచ్చే ఏర్పాటు చేశారు.

"వీరు నీకు సంస్కృతం నేర్పుతారు," అని నాకు చెప్పారు నాన్నగారు.

బాగా చదువుకొన్న దార్శనికుని దగ్గర నాకు శిక్షణ ఇప్పించినట్లయితే, ఆధ్యాత్మికమయిన నా ఆకాంక్షలను తృప్తిపరచవచ్చునని నాన్నగారు ఆశించారు. కాని ఆయన అనుకొన్నది సూక్ష్మంగా తారుమారయింది : మా మాస్టరుగారు నాకు, బుద్ధికి పదునుపెట్టే శుష్క విషయాలు బోధించకపోగా - అందుకు భిన్నంగా - భగవంతుడి సాక్షాత్కారం కోసం నాలో నివురుగప్పిన నిప్పులా ఉన్న ఆకాంక్షను ప్రజ్వలింపజేశారు. నాన్నగారికి తెలియని విషయమేమిటంటే, స్వామి కేవలానంద గారు లాహిరీ మహాశయుల ఉత్కృష్ట శిష్యులన్న సంగతి. సాటిలేని ఆ మహాగురువు లకు శిష్యులు వేలకొద్దీ ఉండేవారు. ఆయనకు గల దివ్యమైన ఆకర్షణ శక్తి అడ్డూ ఆపూ లేనిది కనక, వాళ్ళని ఆయనవైపు ఆకర్షించింది. లాహిరీ మహాశయులు తరుచుగా, కేవలానందగారిని* ఒక ఋషిగా పేర్కొంటూ ఉండేవారని నాకు తరవాత తెలిసింది.

మా ట్యూషన్ మాస్టరుగారి ముఖం, సమృద్ధిగా పెరిగిన వంకుల జుట్టుతో తీర్చిదిద్దినట్టుండేది. నల్లటి ఆయన కళ్ళు, కల్లాకపటం తెలియని పసిపిల్లవాడి కళ్ళ మాదిరిగా నిర్మలంగా ఉండేవి. ఆయన పలచని శరీరంలోని కదలికలన్నీ ప్రశాంతమైన ఆలోచననీ గాంభీర్యాన్నీ ప్రదర్శించేవి. ఎప్పుడూ సౌమ్యంగా, ఎప్పుడూ ప్రేమగా ఉండే ఆయన, అనంత చైతన్యంలో స్థిరంగా నెలకొని ఉన్నవారు. మే

---

* మేము కలుసుకొనే నాటికి కేవలానందగారు సన్యాసం తీసుకోలేదు. ఆయన్ని మామూలుగా "శాస్త్రి మహాశయా" అని పిలుస్తూండేవారు. కాని లాహిరీ మహాశయ, మాస్టర్ మహాశయ (అధ్యాయం:9) అనే పేర్లు వచ్చినప్పుడు గందరగోళం లేకుండా ఉండాలని మా సంస్కృతం మాస్టరుగారి ప్రస్తావన వచ్చినప్పుడు, ఆయనకి సన్యసించిన తరవాత వచ్చిన 'స్వామి కేవలానంద' అన్న పేరే వాడుతున్నాను. ఇటీవల బెంగాలీలో ఆయన జీవిత చరిత్ర వెలువడింది. 1863లో బెంగాలులోని ఖుల్నా జిల్లాలో జన్మించిన కేవలానందగారు కాశీలో తన 68వ ఏట తనువు చాలించారు. ఆయన గృహస్థ నామం అశుతోష్ చటర్జీ.

మిద్దరం కలిసి అనేక గంటల కాలం గాఢమైన క్రియాయోగ సాధనలో ఆనందంగా గడుపుతూండేవాళ్ళం.

కేవలానందగారు ప్రాచీన శాస్త్రాల్లో, అంటే పవిత్ర గ్రంథ విషయాల్లో, అధికారికమైన పరిజ్ఞానం గల ప్రసిద్ధ పండితులు. ఆయన పాండిత్యమే ఆయనకు "శాస్త్రి మహాశయ" అన్న బిరుదు సంపాదించింది. అందరూ ఆయన్ని మామూలుగా ఆ పేరుతోనే పిలుస్తూండేవారు. కాని సంస్కృత పాండిత్యం సంపాదించడంలో నా అభివృద్ధి గమనించదగ్గదేమీ కాదు. నిస్సారమైన వ్యాకరణాన్ని విడిచిపెట్టేసి, ప్రతిసారీ యోగాన్ని గురించీ లాహిరీ మహాశయుల గురించీ మాట్లాడే అవకాశం కోసమే ప్రయత్నిస్తూ ఉండేవాణ్ణి. ఒక రోజున మా మాస్టరుగారు, నా కోరిక మన్నించి లాహిరీ మహాశయుల సన్నిధిలో తాము గడిపిన జీవితానికి సంబంధించిన విషయం ఒకటి చెప్పారు.

"అరుదైన అదృష్టం వల్ల, లాహిరీ మహాశయుల సమీపంలో పదేళ్ళపాటు ఉండే అవకాశం నాకు కలిగింది. రోజూ రాత్రిపూట నా యాత్రకు గమ్యస్థానం, కాశీలో వారి నివాసగృహం. గురువుగారెప్పుడూ మేడమీద మొదటి అంతస్తులో, ముందరున్న చిన్న గదిలో ఉంటూండేవారు. ఆయన ఒక కొయ్యబల్ల మీద పద్మాసనం వేసుకొని కూర్చొని ఉండేవారు. ఆ బల్లకి వెనకాల, చేర్లబడ్డానికి ఒక చెక్క కూడా లేదు. ఎదురుగా ఆయన శిష్యులు, పుష్పమాలాలంకారం మాదిరిగా అర్ధచంద్రాకారంగా కూర్చొనేవారు. ఆయన కళ్ళు బ్రహ్మానందంతో మిలమిలా మెరుస్తూ కదులుతుండేవి. అవి ఎప్పుడూ దూరదర్శన శక్తిగల అంతశ్చక్షువు ద్వారా శాశ్వతానంద గోళంలోకి గుచ్చిగుచ్చి చూస్తూ, సగం మూసుకొని ఉండేవి. ఆయన ఏకబిగిని మాట్లాడటమన్నది అరుదు. ఆయన చూపు, సందర్భానుసారంగా, తమ సహాయం అవసరమున్న ఒక శిష్యుడి మీద కేంద్రీకరించి ఉండేది; అప్పుడు హిమపాతంలా వచ్చిపడే కాంతిని పోలిన ఉపశమన వాక్కులు ధారగా వెలువడు తుండేవి.

"ఆ మహాపురుషుల చూపుతో నాలో, వర్ణించడానికి శక్యం కాని ఒకానొక ఆనందం వెల్లివిరుస్తుండేది. అనంతత్వమనే ఒకానొక మహాపద్మంలోంచి వెలువడ్డ మాదిరిగా, ఆయనలోంచి వచ్చే సుగంధం నాలో నిండిపోయేది. మేము రోజుల తరబడి మాట్లాడుకోకపోయినప్పటికీ, ఆయన సన్నిధిలో ఉండడమే, నా అస్తిత్వా




న్నంతనూ మార్చేసిన మహత్తరమైన అనుభవం. కంటికి సోకని అడ్డంకి ఏదయినా నా ఏకాగ్రతకు భంగం కలిగించేలా ఎదురయినట్లయితే, నేను మా గురువుగారి పాదాల దగ్గర ధ్యానం చేసేవాణ్ణి. అక్కడ నాకు, చాలా సూక్ష్మమైన ఆధ్యాత్మిక స్థితులు కూడా అందుబాటులోకి వచ్చేవి. ఆయనకంటె తక్కువస్థాయి గురువుల దగ్గర మాత్రం అలాటి అనుభూతులు కలిగేవి కావు. ఆ మహానుభావులు ఒక సజీవమైన దేవాలయం; దాని రహస్య ద్వారాలు, భక్తితో ప్రవేశించే శిష్యులందరి కోసం తెరుచుకొని ఉండేవి.

"లాహిరీ మహాశయులు, పవిత్ర గ్రంథాల్ని గురించి పుస్తక పాండిత్యంతో వ్యాఖ్యానించేవారు కారు. అప్రయత్నంగానే ఆయన, 'దివ్య గ్రంథాలయం'లోకి మునిగేవారు. ఆయనలోని సర్వజ్ఞత్వమనే నీటి బుగ్గలోంచి మాటల నురుగూ ఆలోచనల తుంపరలూ పైకి చిమ్ముకొస్తూ ఉండేవి. అనేక యుగాలకు పూర్వం వేదాల్లో* మరుగుపడి ఉన్న గాఢమైన దార్శనిక శాస్త్రాన్ని బయల్పరిచే అద్భుతమైన కీలకం ఆయన దగ్గర ఉండేది. ప్రాచీన గ్రంథాల్లో చెప్పిన వివిధ చేతన స్థాయిల్ని వివరించమని అడిగినప్పుడు, ఆయన చిరునవ్వు చిందిస్తూ అంగీకారం తెలిపేవారు.

" 'నేను ఆ స్థితుల్లోకి ప్రవేశించి నాకు గోచరించింది చెబుతాను మీకు,' అనేవారు. కేవలం గ్రంథాలు బట్టీపట్టేసి తమ అనుభవంలోకి తెచ్చుకోని భావాల్ని వెల్లడించే ఉపాధ్యాయులకూ ఆయనకూ చాలా తేడా ఉండేది.

" 'నీకు అర్థం ఎలా తడుతోందో అలా శ్లోకాలపై వ్యాఖ్యానించు,' అంటూ మితభాషులయిన గురువుగారు దగ్గరున్న ఒక శిష్యుడితో తరచుగా అంటూండే

---

* సనాతనమైన నాలుగు వేదాలకు, ఇప్పటికీ 100 పై చిలుకు ప్రస్థాన గ్రంథా లున్నాయి. ఎమర్సన్ తన 'జర్నల్ 'లో వైదిక భావనకు ఈ విధంగా జోహార్లు అర్పించాడు: "అది ఉష్ణం మాదిరిగాను, రాత్రి మాదిరిగాను,అలలు లేని కడలి మాదిరిగాను మహత్తరమైనది. ఇందులో ప్రతి ధార్మిక భావనా ఉంది; ఉదాత్త కవితాహృదయం గల ప్రతి కవి మనస్సులోనూ పర్యాయక్రమంలో మసిలే మహత్తరమైన నీతులన్నీ ఉన్నాయి... ఈ గ్రంథాన్ని ఉపేక్షించగూడదు. నా మట్టుకు నే నొక్కణ్ణే, అరణ్యంలోనో, సరస్సులో ఒక నావలోనో ఉన్నట్లయితే ప్రకృతిమాత ఇప్పుడు నన్నొక బ్రాహ్మణ్ణే చేస్తుంది; అనంతమైన ఆవశ్యకత, శాశ్వతమైన నష్టపరిహారం, అగాధమైన శక్తి, అఖండమైన మౌనం.. ఇదీ ఆమె ఉద్ఘోష . శాంతి, పరిశుద్ధత, సంపూర్ణ పరిత్యాగం - అన్న సర్వవ్యాధి చికిత్సకాలు, పాపాలన్నిటినీ పరిహరించి, నన్ను అష్టదేవతల్ల ఆనంద ధామానికి తీసుకు వెళ్తాయని ఆమె చెబుతూంది.

వారు. 'నువ్వు సరయిన వ్యాఖ్యానం చెప్పే విధంగా నీ ఆలోచనల్ని నేను ప్రేరేపిస్తాను,' అనేవారు. ఈ ప్రకారంగా లాహిరీ మహాశయులు దర్శించిన సత్యాలు అనేకం గ్రంథస్థం కావడం జరిగింది. వాటిమీద ఎందరో శిష్యులు పెద్దపెద్ద వ్యాఖ్యాన గ్రంథాలు రాశారు.

"గుడ్డి నమ్మకం పెట్టుకోమని గురువుగారు ఎన్నడూ చెప్పలేదు. 'మాట లన్నవి కేవలం పైపై తొడుగులు,' అనే వారాయన. 'ధ్యానంలో నువ్వు పొందే ఆనంద భరితమైన యోగం ద్వారా దేవుడున్నాడనే గట్టి నమ్మకాన్ని సాధించు.'

"శిష్యుడికి ఏ సమస్య ఎదురయినా సరే, దానికి పరిష్కారంగా ఆయన, క్రియాయోగం సాధన చెయ్యమని సలహా ఇచ్చేవారు.

" 'మీకు దారి చూపించడానికి నేను ఈ శరీరంతో లేనప్పుడు కూడా, ఈ యోగకీలకానికున్న సామర్థ్యం పోదు. సిద్ధాంతపరమైన ఆవేశాల సముదాయంగా తలచి, కట్టుదిట్టంగా కవిలెకట్టలో దాచిపెట్టి, తరవాత మరిచిపోవడానికి వీలయినది కాదు ఈ యోగపద్ధతి. క్రియాయోగం ద్వారా నిరంతరాయంగా ముక్తి మార్గంలో ముందుకు సాగు; నువ్వు చేసే సాధనలోనే దీని శక్తి ఇమిడి ఉంది.'

"నా మట్టుకు నేను, పరమాత్మ సాక్షాత్కారం కోసం మానవుడు జరిపే అన్వేషణలో, స్వయంకృషితో ముక్తి సాధించడానికి రూపొందించిన సాధనాల్లో, అన్నిటికంటె పటిష్ఠమైనది క్రియాయోగమేనని భావిస్తాను," అంటూ గంభీరమైన ప్రమాణ వాక్యంతో ముగించారు కేవలానందగారు. "మానవులందరిలోనూ మరుగుపడిఉన్న దేవుడు, క్రియాయోగ పద్ధతిని వినియోగించడం వల్ల లాహిరీ మహాశయుల భౌతిక శరీరంలోనూ, ఆయన శిష్యుల్లో కొందరిలోనూ, మనకు కళ్ళకు కట్టే విధంగా రూపుదాల్చాడు."

కేవలానంద గారు గురువుగారి సాన్నిధ్యంలో ఉన్నప్పుడు ఒకసారి లాహిరీ మహాశయులు చేసిన దివ్యమైన అద్భుతం ఒకటి ఉంది. ఋషితుల్యులైన మా మాస్టరుగారు ఒకనాడు నా కా[illegible] కథ చెప్పారు. ఆయన కళ్ళు, మా కెదురుగా బల్లమీదున్న సంస్కృత పుస్తకాలకు [illegible]ంగా లగ్నమయి ఉన్నాయి.

మా "గురువుగారి శిష్యుల్లో రాము అనే' గుడ్డివాడి మీద నాకు జాలి కలిగింది. తరబ[illegible]సం ఏమయినా చెయ్యాలనిపించి[illegible]ంది. తమలోనే పరమాత్ముడు ఉజ్జ్వలంగా

ప్రకాశిస్తున్న మా గురువుగారికి ఇతడు ఎంతో విశ్వాసపాత్రుడయి సేవ చేస్తున్నాడే, అటువంటి ఇతని కళ్ళలోనే వెలుగు లేకపోవాలా, అనిపించింది. ఒక రోజున రాముతో మాట్లాడ్డానికి ప్రయత్నించాను. కాని అతడు, చేత్తో చేసిన ఒక తాటాకు విసినికర్రతో, గంటల తరబడి ఓపికగా, గురువుగారికి విసురుతూ కూర్చున్నాడు. చివరి కతడు గదిలోంచి బయటికి వెళ్ళిన తరవాత నేనూ వెనకాలే వెళ్ళాను.

" 'రామూ, నీకు కళ్ళుపోయి ఎంతకాలమయింది?'

" 'నేను పుట్టినప్పుడేనండి! ఒక్క క్షణమయినా సూర్యుణ్ణి చూసే అదృష్టం నా కళ్ళకి పట్టలేదండి,' అన్నాడు.

" 'సర్వశక్తిసంపన్నులయిన గురువుగారు నీకు సాయం చెయ్యగలరు. ఒకసారి ఆయనకి మనవి చెయ్యి,' అన్నాను."

"మర్నాడు రాము, బిడియపడుతూ లాహిరీ మహాశయుల దగ్గరికి వెళ్ళాడు. తనకున్న ఆధ్యాత్మిక సర్వసమృద్ధికి తోడుగా భౌతిక సంపద కోరుకోడం, దాదాపు అవమానకర మనిపించేటంతగా భావించాడతడు.

" 'స్వామీ, విశ్వాన్నంతనీ ప్రకాశింపజేసేవాడు మీలో ఉన్నాడు. అంతకంటె తక్కువ కాంతితో వెలిగే సూర్యుణ్ణి చూడగలిగేటట్టుగా ఆ భగవంతుడి వెలుగు నా కళ్ళలోకి వచ్చేటట్టు చెయ్యమని ప్రార్థిస్తున్నాను,' అన్నాడు."

" 'రామూ, నన్ను ఇరకాటంలో పెట్టడానికి ఎవరో ఈ ఎత్తు వేశారు. నయం చేసే శక్తి నాకు లేదు,' అన్నారాయన."

" 'అయ్యా, మీలో ఉన్న పరమాత్ముడు తప్పకుండా నయం చెయ్య గలడండి.'

" 'అది వేరే సంగతి, రామూ! పరమాత్ముడి శక్తికి పరిమితి లేదు ! అటు నక్షత్రాల్నీ, ఇటు శరీరంలో జీవకణాల్నీ నిగూఢమైన తన ప్రాణశక్తితో ప్రజ్వలింప జేసే పరమాత్ముడు నీ కళ్ళకి తప్పకుండా వెలుగు ఇవ్వగలడు,' అంటూ గురువు గారు, రాము ముఖంలో కనుబొమల మధ్య ఉండే బిందువు*ను స్పృశించారు.

---

* "ఒంటి" కన్ను లేదా జ్ఞాననేత్రం ఉండే స్థానం. మామూలుగా మరణ సమయంలో మనిషిలో ఉన్న చైతన్యాన్ని పవిత్రమైన ఆ స్థానానికి లాగెయ్యడం జరుగుతుంది. చనిపోయినవాళ్ళ కళ్ళు పైకి తిరిగి ఉండడానికి కారణం ఇదే.

" ' నీ మనస్సును ఏడు రోజులపాటు అక్కడ కేంద్రీకరింపజేసి ఉంచి, తరుచుగా రామ నామం జపిస్తూ ఉండు. సూర్యుడి తేజోబింబం నీ కోసం ప్రత్యేకంగా ఉదయిస్తుంది,' అన్నారు.

"ఒక్క వారంలో ఆ అద్భుతం జరిగింది. రాము మొట్టమొదటి సారిగా ప్రకృతిమాత సుందర ముఖాన్ని దర్శించాడు. రాము, ఏ ఇతర దివ్య పురుషుడి కంటె కూడా అధికంగా, ఆరాధించే శ్రీరామ నామాన్నే పురశ్చరణ చెయ్య వలసినదిగా సర్వజ్ఞుడు (సద్గురువు) తమ శిష్యుడికి సూచించారు. రాము విశ్వాస మన్నది భక్తితో దున్నిన నేల; అందులో గురువుగారి, శక్తిమంతమూ శాశ్వతమూ అయిన రోగ నివారణ బీజం మొలకెత్తింది," అంటూ కేవలానంద గారు ఒక్క క్షణంపాటు మౌనం వహించారు; తమ గురువుగారి మహిమను మళ్ళీ ప్రస్తుతించారు.

"లాహిరీ మహాశయులు చేసిన అద్భుత చర్యలన్నిటిలోనూ స్పష్టమయే విషయం ఏమిటంటే, తానే వాటికి కారకశక్తి ననుకొనే అవకాశం అహంకారానికి*

---

* ఈ అహంకారం (అంటే, "నేను చేస్తున్నాననే భావన") అన్నది ద్వంద్వానికి లేదా, మనిషికీ అతన్ని సృష్టించినవాడికీ మధ్య గోచరించే వేరుపాటుకు - మూలకారణం. ఈ అహంకారం మానవుల్ని మాయలో పడేస్తుంది; దానివల్ల కర్తే (అహం) 'కర్మ'గా మిథ్యారూపంలో కనిపిస్తాడు. ఒకరు సృష్టిస్తే ఏర్పడ్డవాళ్ళు తామే సృష్టికర్తలమని ఊహించుకుంటారు. (పే 57అ; 341, 354అ. చూడండి).

"నైవ కించి త్కరో మీతి యుక్తో మన్యేత తత్త్వవిత్,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర న్నశ్న గ్నచ్ఛన్ స్వపన్ శ్వసన్
ప్రలపన్ విస్సృజన్ గృహ్ణ న్నున్మిష న్నిమిషన్నపి,
ఇంద్రియా ణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్.

సత్యాలన్నిటిలోకీ పరమమైన సత్యాన్ని నమ్మినవాడు, "నా అంతట నేనేమీ చెయ్యడం లేదు," అనుకొంటాడు; "ఇంద్రియాలతో ఇంద్రియాధీనమైన ప్రపంచం చేస్తున్నదే ఇదంతా," అని నమ్ముతాడు.

గీత, అధ్యా. V.8-9

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః
యః పశ్యతి తథాత్మాన మకర్తారం సపశ్యతి.

నిజానికతడు, అంతటా జరిగేవి ప్రకృతి అలవాటు ప్రకారం జరిగేవని, ప్రతినిధిగా కాక, ఆచరణ ద్వారా ఆత్మ అభ్యాసం కోసం ఉద్దేశించినవనీ గమనిస్తాడు.

అధ్యా. XIII 30

ఎన్నడూ ఇయ్యకపోవడం. లాహిరీ మహాశయులు చికిత్సాకారకమైన మూలశక్తికి తమను తాము అర్పించుకొన్నవారు; అందువల్లే ఆయన, ఆ శక్తిని స్వేచ్ఛగా తమగుండా ప్రసరించేటట్టు చేశారు.

"లాహిరీ మహాశయుల ద్వారా రోగాలు నయమయిన శరీరాలు కూడా అనేకం, చిట్టచివరికి చితిమంటలకు ఆహుతి కాక తప్పలేదు. కాని మౌనంగా ఆయన కలిగించిన ఆధ్యాత్మిక జాగృతీ, ఆయన తీర్చిదిద్దిన క్రీస్తుమాదిరి శిష్యులూ ఎన్నటికీ నశించని అద్భుత మహిమలని చెప్పాలి."

నేను సంస్కృత పండితుణ్ణయితే కాలేదు కాని అంతకన్న దివ్యమైన వాక్య పదీయం బోధించారు నాకు కేవలానందగారు.

అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవా మ్యాత్మ మాయయా.

నేను పుట్టుకలేనివాణ్ణి చావులేనివాణ్ణి నాశరహితుణ్ణి సర్వజీవులకూ అధిపతినీ అయినప్పటికీ మూల విస్మృతిలో తేలి ఆడే ప్రకృతి రూపాలమీద నేను ముద్రించిన మాయవల్లా, నా ఇంద్రజాలంవల్లా నేను వస్తూ పోతూ ఉంటాను.

అధ్యా. IV:6

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మా మేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే.

నన్ను మరుగుపరుస్తూ, వివిధ లీలలు ప్రదర్శించే దివ్యమైన తెరను ఛేదించుకొని పోవడం కష్టసాధ్యం; అయినా నన్ను కొలిచేవాళ్ళు దాన్ని ఛేదించుకొని ముందుకు పోగలుగుతారు.

అధ్యా. VII 14

అధ్యాయం : 5

# "గంధబాబా" అద్భుతాల ప్రదర్శన

"ఈ లోకంలో ప్రతిదానికీ ఒక ఋతువన్నది ఉంది; ఉద్దిష్టమైన ప్రతిదానికీ ఒక సమయమంటూ ఉంది."*

నన్ను నేను ఓదార్చుకోడానికి, సొలమన్ రాజా†కున్న ఈ జ్ఞానం నాకు లేదు. ఇంట్లోంచి కాలు బయట పెడితేచాలు, నా కోసం నిర్ణయింపబడ్డ గురుదేవుల ముఖం ఎక్కడయినా కనిపిస్తుందేమోనని పరిశీలనగా చూసేవాణ్ణి. అయినప్పటికీ నా హైస్కూలు చదువు పూర్తి అయేవరకు నాకు ఆయన తారసపడలేదు.

అమర్‌తోబాటు నేను హిమాలయాలకై పారిపోవడానికీ శ్రీయుక్తేశ్వర్‌గారు నా జీవితంలోకి ప్రవేశించిన సుదినానికీ మధ్య రెండేళ్ళు గడిచాయి. ఈ నడిమి కాలంలో నేను కొందరు సాధువుల్ని - "గంధబాబా" "టైగర్ స్వామి", నగేంద్ర నాథ్ భాదురీ, మాస్టర్ మహాశయుల్నీ - వంగదేశపు విఖ్యాత విజ్ఞానశాస్త్రవేత్త అయిన జగదీశ్ చంద్రబోస్‌నూ కలుసుకొన్నాను.

నేను "గంధబాబా" గారిని కలుసుకోడానికి భూమికలుగా చెప్పదగ్గ అంశాలు రెండున్నాయి; వాటిలో ఒకటి మధురమైనదీ మరొకటి వినోదకరమైనదీ.

"దేవుడు సరళమైనవాడు. తక్కినదంతా జటిలమైనది. ప్రకృతి తాలూకు సాపేక్షప్రపంచంలో నిరపేక్షమైన విలువలకోసం వెతక్కు."

"నేను కాళికాదేవి‡ ఆలయంలో విగ్రహానికి ఎదురుగా మౌనంగా నిలబడి

---

* 'ఎక్లీసియాస్టిస్' 3:1 (బైబిలు, కింగ్ జేమ్స్ పాఠం).

† క్రీ.పూ. పదో శతాబ్దిలో ఇజ్రాయిల్ దేశాన్ని పాలించిన వీర ప్రభువు. పరిపాలనలో అతడు చూపిన వివేకాన్ని బట్టి, ధర్మాన్నిబట్టి ఈనాటికీ అతడి పేరు జ్ఞాని అనే మాటకు పర్యాయపదంగా ప్రసిద్ధి చెందింది.

‡ కాళికాదేవి, ప్రకృతిలోని శాశ్వత నియమానికి ప్రతీక. సాంప్రదాయికంగా ఈమెను, నేలమీద పడుకొని ఉన్న శివదేవుని - లేదా అనంతుని - రూపం మీద నిలబడి ఉన్న చతుర్భుజ

ఉన్నప్పుడు, ఈ దార్శనిక నిష్కర్షలు మృదువుగా నా చెవిని పడ్డాయి. తిరిగి చూసేసరికి, ఒక పొడుగాటాయన కనిపించాడు; ఆయన ధరించిన - లేదా ధరించని - వస్త్రాన్ని బట్టి ఆయన ఒక సంచార సాధువని తెలిసింది.

"మీరు, నా ఆలోచనల్లో ఉన్న వ్యాకులతను నిజంగా కనిపెట్టారు!', అంటూ కృతజ్ఞతాపూర్వకంగా చిరునవ్వు నవ్వాను. కాళికాదేవిలో సంకేతితమైన మాదిరిగా, ప్రకృతిలోని కృపా-భయానక రూపాల జటిలత నా కంటె తెలివైన బుర్రలనే తబ్బిబ్బు చేసింది."

"ఈమె మర్మాన్ని విప్పి చెప్పగలవాళ్ళు బహుకొద్దిమంది! ప్రతి ఆలోచనా పరుడిని, స్ఫింక్స్* వేసే జటిలమైన ప్రశ్నలా సవాలు చేసేవే జీవితంలోని మంచి చెడ్డలు. మానవులు చాలామంది, దాని పరిష్కారానికి ప్రయత్నించకుండానే జీవితాలను కోల్పోతారు; థేబ్స్ రోజుల్లో మాదిరిగా ఇప్పటికీ అదే దండన. కాని అక్కడక్కడ, ఓటమి నంగీకరించని మహోన్నత శిఖరంలా ఒక్కొక్కడు ఒంటరిగా నిలుస్తాడు. ద్వైతంలో ఉన్న మాయ†లో నుంచి అఖండమైన అద్వైత సత్యాన్ని చేజిక్కించుకొంటాడు."

మూర్తిగా చిత్రిస్తారు. ఎందుచేతనంటే, ప్రకృతి - అంటే దృగ్విషయిక ప్రపంచం - కార్యకలాపాలు నిర్గుణ బ్రహ్మనుంచి ఉత్పన్న మవుతాయి. ఈమె నాలుగు చేతులూ నాలుగు మౌలిక లక్షణాలకు ప్రతీకలు : వాటిలో రెండు శుభంకరమైనవి, రెండు వినాశకరమైనవి; ద్రవ్యానికి - అంటే సృష్టికి - మౌలికమైన ద్వంద్వం.

* గ్రీకు పురాణ కథలో వచ్చే రాక్షసి. దీని తల స్త్రీది; శరీరం సింహానిది కాని, కుక్కది కాని; రెక్క లుంటాయి. ఈ రాక్షసి, థేబ్స్ అనే ప్రాచీన గ్రీకు నగరంలో, వచ్చే పోయేవారిని యక్షప్రశ్నలు వేసి, జవాబు చెప్పలేని వాళ్ళను తినేసేదని ప్రసిద్ధి.

† విశ్వభ్రాంతి; దీనికి వాచ్యార్థం "కొలిచేది" అని. మాయ అనేది సృష్టిలోని ఇంద్ర జాల శక్తి; దీనివల్ల అమేయం, అఖండం అయిన పరమాత్మలో పరిమితులూ విభాగాలూ కనిపిస్తూ ఉంటాయి.

'మాయ'ను గురించి ఎమర్సన్ ఈ కింది పద్యం రాశాడు (దాన్ని అతడు Maia అన్న వర్ణక్రమంలో రాశాడు) :

అభేద్యమైన దాన్ని కల్పిస్తుంది మాయ,
లెక్కలేనన్ని సాలెగూళ్ళు అల్లుతూ;
ఉల్లాసకరమైన దాని చిత్రరూపాలు విఫలంకా వెన్నడూ,
ఒకదాని మీ దొకటి పడుతుంటాయి, తెరమీద తెరలా :
మోసపోవడానికి తపించేవాణ్ణి
తప్పకుండా నమ్మిస్తుంది ఈ మోహకారిణి.

"మీరు దృఢ విశ్వాసంతో చెబుతున్నారండి."

"నేను చాలాకాలం, చిత్తశుద్ధిగా అంతఃపరిశీలన అభ్యసించాను; జ్ఞానార్జనకు అత్యంత బాధాకరమైన మార్గమిది. ఆత్మ పరీక్ష చేసుకోడం, తన ఆలోచనల్ని నిర్విరామంగా పరిశీలన చేసుకోడం కఠోరమైన విదారక అనుభవం. అత్యంత ప్రబలమైన అహంకారాన్ని సైతం అది నుగ్గు చేస్తుంది. కాని నిజమైన ఆత్మ విశ్లేషణ ద్రష్టలను తయారుచేయడానికి గణిత శాస్త్రీయంగా పనిచేస్తుంది. 'ఆత్మాభివ్యక్తి' విధానం పేరిట సాగే వైయక్తికాభిప్రాయ ప్రకటనలు, దేవుణ్ణి గురించీ విశ్వాన్ని గురించీ తమకు తోచిన వ్యక్తిగతమైన వ్యాఖ్యానాలు చేయడానికి తమకు హక్కుందని విశ్వసించే అహంకారుల్ని తయారుచేస్తాయి."

"అటువంటి దురహంకార పూరితమైన మౌలికత సమక్షం నుంచి సత్యం వినమ్రంగా వెళ్ళిపోతుందనడంలో సందేహం లేదు." చర్చ నాకు ఆహ్లాదకరంగా ఉంది.

"మనిషి, బడాయిల్లోంచి బయటపడేవరకు శాశ్వత సత్యాన్ని అర్థం చేసు కోలేడు. అనేక శతాబ్దాలుగా పంకిలమై ఉన్న మానవ మనస్సు లెక్కలేనన్ని ప్రపంచ మాయలతో కూడిన దుర్భర జీవితాన్ని సృష్టిస్తోంది. మనిషి మొదట, తనలోని శత్రువులతో జరిపే పెనుగులాటముందు, యుద్ధ భూమిలో జరిగే పోరాటాలు తీసికట్టే అనిపిస్తాయి! ప్రచండ బలప్రయోగంతో జయించడానికి, ఇవేమీ మానవ రూపంలో ఉన్న శత్రువులు కావు! విషవాయువుల్ని వెళ్ళగక్కే అస్త్రాలను బహు నేర్పుగా అమర్చుకొని, అంతటా కమ్ముకొని, నిర్విరామంగా పనిచేస్తుండే, తామసిక కామాలనే ఈ యోధులు, మనల్ని అందరినీ హత మార్చడానికి చూస్తుంటారు. తన ఆదర్శాల్ని భూస్థాపితం చేసి సాధారణ ప్రారబ్ధానికి తలవంచినవాడు ఆలోచనా శూన్యుడు. అతడు నిర్వీర్యుడుగానూ, మూర్ఖుడు గానూ, అవమానకరుడుగానూ తప్ప మరోరకంగా కనిపిస్తాడా?"

"అయ్యా, దిగ్భ్రమ చెందిన జనసామాన్యం మీద మీకు సానుభూతి లేదా?"

ఆ సాధువు ఒక్క క్షణం మౌనం వహించాడు; తరవాత సూటికాని ఈ సమాధాన మిచ్చాడు.

"సర్వ సుగుణాలకీ నిలయుడై అగోచరుడైన భగవంతుణ్ణి ఒక పక్కా, అటువంటి వేమీ లేనట్టు కనిపించే మానవుణ్ణి మరొక పక్కా ప్రేమించడమన్నది, తరచు దిగ్భ్రమ కలిగిస్తూ ఉంటుంది! కాని వ్యూహానికి తగ్గట్టుగానే ఉంటుంది

బుద్ధి కుశలత. అంతఃపరిశోధన, మానవులందరి మనస్సుల్లోని ఏకత్వాన్ని - అంటే స్వార్థపరత్వమనే దృఢబాంధవ్యాన్ని - బయటపెడుతుంది. కనీసం ఈ ఒక్క విషయంలోనైనా మానవుల్లో సోదరభావం వెల్లడి అవుతున్నది. ఈ రకమైన సమత్వాన్ని గ్రహించిన తరవాత, నిర్వైరపాటుతో కూడిన వినమ్రత వస్తుంది. అది, ఆత్మకున్న అన్వేషణ యోగ్యమైన స్వాస్థ్యదాయక శక్తుల్ని గమనించలేని తోటివాళ్ళమీద, కనికరంగా మారుతుంది.

"ప్రపంచం అనుభవించే దుఃఖాల్ని గురించి ప్రతి యుగంలోని సాధువులూ మీలాగే బాధపడ్డారండి."

"సంకుచితమైన తన కష్టంలోనే మునిగిపోయి, ఇతరుల జీవితాల్లోని దుఃఖాలకు స్పందించే శక్తిని కోల్పోయిన వాడు లోతులేని మనిషి" గంభీరంగా ఉన్న ఆ సాధువు ముఖం గమనించగలిగినంతగా ప్రశాంతమయింది. "శస్త్రంతో మాదిరిగా సునిశితంగా ఆత్మవిచ్ఛేదన (లేక ఆత్మానుశీలనం) అభ్యసించిన వాడు, మొత్తం మానవాళి పట్ల జాలి పెరుగుతూండడం గమనిస్తాడు. చెవులు ఊదర గొడుతూ, అధికార పూర్వకంగా అహంకారం వెల్లడించే కోరికల నుంచి అతనికి విముక్తి కలుగుతుంది. అటువంటి నేలలో దైవప్రేమ పుష్పిస్తుంది. చివరికి జీవుడు మరెందుకూ కాకపోయినా - "ఎందుకని? ప్రభూ, ఎందుకని?" అంటూ ఆక్రోశించ డానికి సృష్టికర్త వేపు తిరుగుతాడు. ఎవని ఏకమాత్ర సౌందర్యం మానవుని ఆకర్షించాల్సి ఉందో, ఆ దివ్యుని సమక్షంలోనికి చివరకి బాధ కొరడా దెబ్బలచే తోలుకు రాబడతాడు."

నేనూ ఆ సాధువూ కలకత్తా కాళీఘాట్ ఆలయంలో మాట్లాడుకుంటున్నాం; అద్భుత సౌందర్యానికి పేరుగన్న ఆ దేవాలయాన్ని దర్శించడానికే నేను వెళ్ళాను. అనుకోకుండా తారసపడ్డ ఈ పరిచయస్తుడు, విశిష్టంగా అలంకరించబడిన మందిర శోభను ఒక్కచేతి విదిలింపుతో కొట్టి పారేశాడు.

"ఇటికలూ సున్నమూ, మన చెవులకు సోకే స్వరాలేవీ ఆలపించవు; తన అస్తిత్వపు మానవగానం ఒక్కదానికే గుండె తెరుచుకుంటుంది."

భక్త బృందాలు ఇటూ అటూ సాగుతున్న గుమ్మందగ్గర, మాకు ఆహ్వాన మిస్తున్న ఎండలోకి ఇద్దరం నడిచాం.

"నువ్వు చిన్నవాడివి." ఆ సాధువు సాలోచనగా నన్ను పరిశీలించాడు. "భారత దేశం కూడా చిన్నదే. సనాతన ఋషులు*, ఆధ్యాత్మిక జీవనానికి

---

* ఋషు లంటే "ద్రష్టలు" అని అర్థం; కచ్చితంగా కాలనిర్ధారణచేసి చెప్పడానికి వీలులేనంత సనాతనమైన వేదాలకు కర్తలు వీరు.

సంబంధించి, నిర్మూలించడానికి శక్యంకాని పద్ధతులు ఏర్పరిచి ఉంచారు. వాళ్ళ సనాతన సూక్తులు ఈనాటికీ ఈ దేశానికీ చాలు. శిక్షణాత్మకమైన ఈ బోధలు పాతబడి పోలేదు; భౌతికవాదపు మాయల నెదుర్కొనేందుకు సునిశితమైన సమర్థత కలిగి ఉన్నాయి. ఈ బోధలే భారతదేశాన్ని ఇప్పటికీ తీర్చిదిద్దుతున్నాయి. వేలకొద్ది సంవత్సరాలుగా - తత్తరపాటు పండితులు కాల గణన చేయడానికి ఖాతరుచేసే దానికంటె మిన్నగావే - సంశయాత్మకమైన కాలమే వేదాల విలువను రుజువు చేసింది. దాన్ని నువ్వు వారసత్వంగా తీసుకో."

మంచి వాగ్ధార గల ఆ సాధువుకు నేను, భక్తిపురస్సరంగా వీడ్కోలు చెబుతూ ఉండగా, భవిష్యద్దర్శనం ఒకటి వెల్లడించా డాయన:

"ఈవేళ నువ్విక్కణ్ణించి వెళ్ళిన తరవాత, నీకు అసామాన్యమైన అనుభవం ఒకటి కలుగుతుంది."

నేను దేవాలయ ఆవరణనుంచి బయటికి వచ్చి, తరవాత ఎక్కడికి వెళ్ళాలో నిశ్చయించుకోకుండా తిరుగుతున్నాను. వీధి మలుపు తిరుగుతూ ఒక పాత స్నేహితుడికి ఎదురు పడ్డాను - వాడు ఎల్లాటివాడంటే, అల్లాటి వాళ్ళ సంభాషణ శక్తులు కాలాన్ని ఖాతరు చేయకుండా అనంతంగా సాగుతూనే ఉంటాయి.

"నిన్ను తొందరగా విడిచి పెడతాలే," అంటూ నాకు మాట ఇచ్చాడు వాడు. "మనం విడిపోయినప్పటి నించి ఇప్పటి దాకా ఇన్నేళ్ళూ జరిగిన సంగతు లన్నీ చెప్పేటట్టయితే!" అన్నాడు.

"ఎంత విపరీతం! నే నిప్పుడు వెళ్ళిపోవాలి."

కాని వాడు నా చెయ్యి పట్టేసుకుని, కొన్ని సంగతులు టూకీగా, నా చేత బలవంతాన చెప్పిస్తున్నాడు. ఆవురావురుమంటున్న తోడేలులాగున్నాడు వీడు, అనిపించిది సరదాగా. నేను ఎక్కువసేపు మాట్లాడిన కొద్దీ, వాడు ఇంకా చెప్ప మంటూ పీకుతున్నాడు. వీణ్ణి నేను మర్యాదగా తప్పించుకొనే ఉపాయం చెయ్యమని, మనస్సులో కాళికాదేవికి మనవి చేసుకున్నాను.

మా స్నేహితుడు చటుక్కున వెళ్ళిపోయాడు. అమ్మయ్య, అనుకుని నేను నడక మరింత జోరుచేశాను, ఈ వదరుబోతు పీడ మళ్ళీ తిరగబెడుతుందేమో నన్న భయంతో. వెనకాల తొందరగా వస్తున్న అడుగుల చప్పుడు వినిపించి నా వేగాన్ని పెంచాను. వెనక్కి తిరిగి చూడ్డానికి ధైర్యం చెయ్యలేదు. కాని మావాడు మళ్ళీ ఒక్క ఉదుటున ఉరుక్కొచ్చి నన్ను కలుసుకొని సరదాగా నా భుజం పట్టుకున్నాడు.

"గంధబాబా గురించి నీకు చెప్పడం మరిచిపోయాను; అదుగో ఆ ఇంటికే దయచేశారాయన," అంటూ కొద్ది గజాల దూరంలో ఉన్న ఇంటిని చూపించాడు. "ఆయన్ని తప్పకుండా కలుసుకో; సరదాగా ఉంటుంది. అసామాన్యమైన అనుభవ మేదైనా కలగొచ్చు నీకు. వస్తా," అంటూ ఈసారి నిజంగానే వెళ్ళిపోయాడు.

కాళీఘాట్ ఆలయం దగ్గర సాధువు, సరిగ్గా ఇలాగే చెప్పిన జోస్యం నా మనస్సులో మెదిలింది. కుతూహలంతో నేను ఆ ఇంట్లోకి ప్రవేశించాను. విశాలమైన ఒక హాలులోకి నన్ను తీసుకువెళ్ళారు. అక్కడ, నారింజవన్నె తివాసి మీద అక్కడక్కడ కొందరు బాసెనపట్టు వేసుకుని కూర్చుని ఉన్నారు. భక్తి భావంతో గుసగుసలాడుతున్న మాటలు నా చెవిని పడ్డాయి :

"చిరతపులి చర్మం మీద గంధబాబాని చూడు. వాసనలేని పువ్వుకు దేనికైనా ఆయన, సహజమైన వాసనతెప్పించగలరు. వాడిపోయిన పువ్వును దేన్నయినా, తాజాగా విచ్చుకొన్నట్టు చెయ్యగలరు; లేదా, మనిషి చర్మంలోంచి ఆహ్లాదకరమైన పరిమళం రప్పించగలరు."

నేను సూటిగా సాధువు వేపు చూశాను; ఆయన చురుకైన చూపు నా మీద నిలిచింది. ఆయన బొద్దుగా ఉన్నారు; గడ్డం పెంచారు. ఒంటి ఛాయ నలుపు. పెద్ద పెద్ద కళ్ళు మెరుస్తున్నాయి.

"అబ్బాయి, నిన్ను చూస్తే సంతోషంగా ఉంది. నీకేం కావాలో చెప్పు. ఏదైనా సువాసన కావాలా?"

"ఎందుకండి?" ఆయన నన్నలా అడగడం కుర్రతనంగా అనిపించింది నాకు.

"అలౌకిక రీతిలో సువాసనలను ఆస్వాదించే అనుభవం పొందడానికి."

"వాసనల కోసం దేవుణ్ణి వాడుకోడమా?"

"అయితేనేం? దేవుడు ఎలాగా పుట్టిస్తాడు కదా, సువాసనలు."

"ఔననుకోండి; కాని ఆయన, మనం తాజాగా వాడుకోడానికి తరవాత పారెయ్యడానికి వీలయిన సున్నితమైన పూలు సృష్టిస్తాడు. మీరు సృష్టించగలరా పువ్వులు?"

"ఆ; కాని మామూలుగా సువాసనలే సృష్టిస్తాను చిన్నబాబూ!"

"అయితే సెంటు ఫ్యాక్టరీవాళ్ళ వ్యాపారం పడిపోతుంది."

"వాళ్ళ వ్యాపారం వాళ్ళని చేసుకోనిస్తాలే! భగవంతుడి శక్తిని కళ్ళకి కట్టించడమే నా ఉద్దేశం."

"అయ్యా, భగవంతుణ్ణి రుజువు చెయ్యడం అవసరమాండీ? ఆయన ప్రతి దాంట్లోనూ ప్రతిచోటా అద్భుత శక్తులు చూపించడం లేదా?"

"ఔననుకో, కాని మనం కూడా, ఆయనకు గల అనంతమైన సృజనశక్తిలో వైవిధ్యాన్ని కళ్ళకి కట్టించాలి."

"మీరీ విద్య సాధించడానికి ఎంతకాలం పట్టిందండీ?"

"పన్నెండేళ్ళు."

"సూక్ష్మోపాయాలతో సెంట్లు తయారు చెయ్యడానికా! మహాశయా, కొన్ని రూపాయలు పెడితే పూల అంగట్లో దొరికే సువాసనల కోసం మీరు పన్నెండేళ్ళు వృథా చేస్తూ వచ్చారని నా కనిపిస్తోంది."

"పూలు వాడిపోతే సువాసనలు పోతాయి."

"చావుతోనూ సువాసనలు పోతాయి. కేవలం శరీరానికే ముచ్చట గొలిపేది నే నెందుకు కోరుకోవాలి?"

"వేదాంతిగారూ, నిన్ను చూస్తే నాకు ముచ్చటేస్తోంది. నీ కుడి చెయ్యి ఇలా చాపు." ఆశీర్వదిస్తున్న భంగిమ కనబరిచాడాయన.

నేను గంధబాబాకి కొన్ని అడుగుల దూరంలో ఉన్నాను. నా ఒంటిని తాకేటంత దగ్గరిలో మరొక రెవరూ లేరు. నేను చెయ్యి చాపాను. ఆ యోగి దాన్ని ముట్టుకోలేదు.

"నీకు ఏం వాసన కావాలి?"

"గులాబి."

"అదే వచ్చుగాక."

నా అరచేతి మధ్యలోంచి ఘాటుగా గులాబి వాసన రావడంతో ఆశ్చర్య పోయాను. దగ్గరిలో ఉన్న ఒక పూలకుండీలోంచి, వాసనలేని పెద్ద పువ్వు ఒకటి తీశాను.

"వాసనలేని ఈ పువ్వుకి మల్లిపువ్వు వాసన తెప్పించవచ్చాండీ?"

"అదే వచ్చుగాక."

వెంటనే ఆ పువ్వు రేకుల్లోంచి మల్లిపువ్వు వాసన వచ్చింది. అద్భుత శక్తులు చూపే ఆయనకి ధన్యవాదాలు చెప్పి, ఆయనశిష్యుడి పక్కకి వెళ్ళి కూర్చున్నాను. ఆ శిష్యుడు చెప్పాడు - గంధబాబాగారి అసలు పేరు స్వామీ విశుద్ధానందగారట. ఈయన టిబెట్టులో ఉండే ఒక యోగి దగ్గర, ఆశ్చర్యకరమైన అనేక యోగ రహస్యాలు తెలుసుకొన్నారట. ఆ టిబెట్టుయోగి వయస్సు వెయ్యేళ్ళకు మించిందని నాకు నమ్మకంగా చెప్పాడు.

"ఆయన శిష్యులైన గంధబాబాగారు అన్ని సమయాల్లోనూ, ఇప్పుడు నువ్వు చూసిన మాదిరిగా, కేవలం మాటలతో వాసనలు సృష్టించరు," గురువుగారిని చూసుకొని గర్విస్తూ మాట్లాడాడు ఆ శిష్యుడు. "వ్యక్తుల స్వభావాల్లోని వైవిధ్యానికి తగ్గట్టుగా ఈయన పద్ధతి చాలా మారుతూ ఉంటుంది. ఈయన అద్భుతమైన వ్యక్తి! కలకత్తా మేధావుల్లో చాలామంది ఈయన అనుచరులు."

నేను వాళ్ళలో కలవగూడదని మనస్సులో తీర్మానించుకున్నాను. అక్షరాలా "అద్భుతమైన" వ్యక్తి అనిపించుకునే గురువంటే నాకు కిట్టదు. గంధబాబాగారికి మర్యాదగా ధన్యవాదాలు చెప్పి వెళ్ళిపోయాను. మెల్లగా ఇంటిమొహం పట్టి నడుస్తూ, ఆనాడు జరిగిన మూడు సంఘటనల గురించీ ఆలోచన సాగించాను.

నేను గుమ్మంలోకి వెళ్ళే సరికి మా అక్క, ఉమ ఎదురయింది.

"బలే షోగ్గా తయారవుతున్నావు, సెంట్లు పూసుకుంటూ."

ఒక్క పలుకు కూడా పలకకుండా, ఆమెకు చెయ్యి వాసన చూపించాను.

"ఎంత మంచి గులాబివాసనో! దీనికి అసాధారణమైన ఘాటు ఉంది."

దీంట్లో "ఘాటైన అసాధారణత" ఉందని అనుకుంటూ నేను, చడీ చప్పుడూ లేకుండా, అలౌకిక పద్ధతిలో సుగంధబంధురం చేసిన పువ్వును ఆమె ముక్కు దగ్గర పెట్టాను.

"ఓహ్, మల్లిపువ్వు నాకు చాలా ఇష్టం!" అంటూ పువ్వులాగేసుకుంది ఉమ. తీరా చూస్తే, అది వాసనలేని పువ్వుల్లో ఒక రకం. ఆ సంగతి ఆమెకు బాగా తెలుసు. కాని దాంట్లోంచి, మాటిమాటికీ మల్లిపువ్వు వాసనే వాసన చూస్తూంటే ఆమె ముఖంలో వినోదంతో కూడిన విస్మయం ఆవరించింది. దాంతో నా

అనుమానాలు తొలగిపోయాయి; ఆ వాసనలు నా ఒక్కడికే అలా అనిపించేటట్టుగా, గంధబాబాగారు నన్ను స్వయం సమ్మోహన స్థితికి గురిచేశారేమో అనుకున్నాను కాని, అలా జరగలేదని తెలిసిపోయింది.

తరవాత ఒకసారెప్పుడో, అలకనందుడనే మా స్నేహితుడు, ఈ గంధ బాబాకి ఒక అపురూపశక్తి ఉందన్నాడు. ప్రపంచంలో ఆకలితో నకనకలాడే కోట్లాది ప్రజలకే కనక ఆ శక్తి ఉండి ఉంటే ఎంత బాగుండునో అనిపించింది.

"ఒకసారి బర్ద్వాన్‌లో గంధబాబాగారి ఇంటికి వచ్చిన వందమంది అతిథుల్లో నేనూ ఉన్నాను," అంటూ అలకనందుడన్నాడు. "అదొక బ్రహ్మాండమైన ఉత్సవం. ఈ యోగికి, గాలిలోంచి వస్తువులు సృష్టించే శక్తి ఉందని పేరు. అంచేత నేను నవ్వుతూ, ఆ ఋతువులో దొరకని టాంజిరీన్ నారింజలు సృష్టించమని ఆయన్ని కోరాను. తక్షణమే, అరిటాకు విస్తళ్ళలో వడ్డించిన లూచీలు (పూరీలు) పైకి ఉబ్బి, వాటిలో ఒలిచి పెట్టిన టాంజిరీన్ నారింజలు ఉన్నాయని రుజువు చేశాయి. సంశయిస్తూ నేను కొరికి చూశాను: రుచి చాలా బాగుందనిపించింది."

కొన్నేళ్ళ తరవాత నేను, ఈ గంధబాబాగారు వాటిని ఎలా సృష్టించేవారన్న విషయం, నా అంతస్సాక్షాత్కారం వల్ల తెలుసుకున్నాను. ప్రపంచంలో ఆకలితో అలమటించే కోట్లాది ప్రజలకు ఈ పద్ధతి అందుబాటులో లేకపోవడం ఎంత విచారకరమైన విషయం!

మానవునిలో ప్రతిక్రియ రేకెత్తించే శబ్ద స్పర్శ రూప రస గంధ సంబంధమైన ఇంద్రియోత్తేజకాలు, ఎలక్ట్రాన్, ప్రోటాన్లలోని ప్రకంపనల తారతమ్యాల వల్ల పుడతాయి. ఈ ప్రకంపనలను 'ప్రాణాణువులు' (లైఫ్‌ట్రానులు) క్రమబద్ధీకరిస్తాయి. ఇవి సూక్ష్మమైన ప్రాణశక్తులు, మరొకలా చెప్పాలంటే, విడివిడిగా పంచేంద్రియ సంబంధమైన 'ఆలోచనాపదార్థం' నిండి తెలివితో వ్యవహరించే, పరమాణువు కంటె సూక్ష్మతరమయిన శక్తులు. ఇవి సూక్ష్మమైన ప్రాణశక్తులు; లేదా వేరువేరు పంచతన్మాత్రలతో జ్ఞానపూర్ణమైన - పరమాణువుల కంటె కూడా సూక్ష్మతరమైన - శక్తులు.

గంధబాబాగారు, కొన్ని నిర్దిష్ట యోగాభ్యాసాలవల్ల తనను తాను ప్రాణశక్తికి అనుసంధించుకొని, లైఫ్‌ట్రాన్‌లు (ప్రాణాణువులు) తమ ప్రకంపనాత్మక నిర్మితిని మరోరకంగా మార్చుకోడానికి అనువుగా ప్రచోదన ఇచ్చి, కోరిన ఫలితాన్ని

సాధించగలుగుతున్నాడు. ఆయన చూపించిన వాసన, పండు, తదితర అలౌకిక శక్తులు, ప్రాపంచిక ప్రకంపనాల వాస్తవ వస్తురూప కల్పనలే కాని సమ్మోహనంవల్ల ఉత్పన్నం కావించిన ఆంతరిక సంవేదనలు కావు.

చిన్న ఆపరేషన్లు చేసేటప్పుడు వైద్యులు, మత్తుమందు ఇస్తే అపాయానికి గురికాగల వ్యక్తుల విషయంలో, సమ్మోహన శక్తినే ఒక విధమైన మానసికమైన మత్తుమందుగా ఉపయోగిస్తారు. కాని ఇది, తరచుగా సమ్మోహన స్థితికి గురి అయేవాళ్ళకి హాని చేస్తుంది. కొంతకాలం గడిచేసరికి, వ్యతిరేక మానసిక పరిణామం ఒకటి, మెదడులోని కణాల్ని అస్తవ్యస్తం చేస్తుంది. సమ్మోహనమన్నది ఇతరుల చేతనా పరిధిలోకి అనధికారంగా ప్రవేశించడం.* దీని తాత్కాలిక దృగ్విషయాలకీ దివ్య సాక్షాత్కారం పొందినవాళ్ళు చూపే అద్భుత శక్తులకూ పోలిక లేదు. భగవత్పరమైన జాగృతి పొందిన నిజమైన సాధువులు, సృజనాత్మక విశ్వస్వాప్నికుడికి† అనుగుణంగా శ్రుతి కలిపి, తమ ఇచ్ఛాశక్తితో ఈ స్వాప్నిక ప్రపంచంలో మార్పులు తీసుకువస్తారు.

గంధబాబాగారి లాంటివాళ్ళు ప్రదర్శించే అద్భుత చర్యలు చూసి తీరవలసినవే అయినా, అవి ఆధ్యాత్మికంగా నిరుపయోగమైనవి. వినోదం చేకూర్చడానికి మించి వీటికి వేరే ప్రయోజనం ఏమీ లేకపోవడంవల్ల ఇవి, దేవుడికోసం జరిపే తీవ్రమైన అన్వేషణను పక్కలకి మళ్ళిస్తాయి.

---

* పాశ్చాత్య మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులు చేతననుగురించి సాగించిన పరిశీలనలు చాలా వరకు, అవచేతన మనస్సుకూ, మనోవ్యాధి చికిత్సాశాస్త్రం ద్వారానూ మనోవైజ్ఞానిక విశ్లేషణ ద్వారానూ నయంచేసే మనోవ్యాధులకూ పరిమితమైనవి. సామాన్య మానసిక స్థితులకూ వాటి భావోద్రేక, సంకల్ప విషయిక అభివ్యక్తులకూ మూలాన్ని గురించీ, మౌలిక నిర్మాణాన్ని గురించీ జరిగిన పరిశోధన చాలా స్వల్పం; నిజంగా మౌలికమయిన ఈ విషయాన్ని భారతీయ దర్శన శాస్త్రం ఉపేక్షించలేదు. సాంఖ్య, యోగ శాస్త్రాల్లో సామాన్య మానసిక మార్పుల్లోని వివిధ సంబంధాలనూ, బుద్ధి, అహంకారం, మనస్సు అన్నవాటి స్వాభావిక ప్రకార్యాలనూ సునిశితంగా వర్గీకరించడం జరిగింది.

† "విశ్వంలోని ప్రతి భాగంలోను ఈ విశ్వం ఉన్నది. ఒకే విక్షిప్త పదార్థంతో సమస్తమూ నిర్మించబడినది. ఒక మంచు బిందువులో ప్రపంచం గోళాకృతిలో ఇమిడి ఉంది... అసలైన సర్వవ్యాపకత్వ సిద్ధాంతం ఏమిటంటే భగవంతుడు తన సమస్త అంశముల తోనూ ప్రతీ నాచుమొక్కలోనూ, ప్రతీ సాలెగూడు లోనూ ఉన్నాడని." - ఎమర్సన్, "కాంపెన్సేషన్"లో.

అసామాన్య శక్తుల ఆడంబర ప్రదర్శనను గురువులు నిరసించారు. అబూ సయీద్ అనే పారశీక మార్మికుడు, నీటిమీదా గాలిలోనూ అంతరిక్షంలోనూ తాము ప్రదర్శించగల అద్భుతశక్తుల్ని చూసుకొని గర్వించే కొందరు ఫకీర్లను చూసి నవ్వాడు.

"నీళ్ళలో కప్ప కూడా హాయిగానే ఉంటుంది!" అంటూ మెత్తని మందలింపుతో ఎత్తిపొడిచాడు అబూ సయీద్. "కాకీ, రాబందూ గాలిలో సులువుగా ఎగురుతాయి. సైతాను తూర్పునా పడమటా కూడా ఒకేసారి కనిపిస్తాడు. నిజమైన మానవుడు ఎవడంటే, తన తోటివాళ్ళలోనే ధార్మిక జీవనం గడుపుతూండేవాడూ, క్రయ విక్రయాలు సాగిస్తూనే ఒక్కక్షణం కూడా దేవుణ్ణి మరిచిపోనివాడూ!"* మరో సందర్భంలో ఈ పారశీక దేశికోత్తముడు, ధార్మిక జీవనాన్ని గురించి తనకు గల అభిప్రాయాలు ఇలా చెప్పాడు : "నీ మనస్సులో ఉన్నది పక్కకి పెట్టెయ్యడం (స్వార్థంతో కూడిన కోరికలు, ఆశయాలు); నీ చేతిలో ఉన్నది ఉదారంగా

---

* "క్రయవిక్రయాలు సాగిస్తూనే దేవుణ్ణి ఎన్నడూ మరవకపోవడం!" అంటే, పనిచేసే చెయ్యీ ధ్యానించే హృదయమూ కలిసి సామరస్యంగా పనిచెయ్యాలన్న ఆదర్శం ఇందులో కనబడుతుంది. హిందువులు ఏర్పరచుకొన్న లక్ష్యం, అకర్మణ్యతతోనూ సమాజ విరుద్ధమైన ఆత్మసంకోచనంతోనూ కూడుకొన్న పిరికితనవు "పలాయనం" అని కొందరు పాశ్చాత్య రచయిత లంటారు. అయితే, వేదాల్లో చెప్పిన ప్రణాళిక ప్రకారం మానవ జీవితానికి ఏర్పరచిన నాలుగు ఆశ్రమాలూ జనులందరూ ఆచరించడానికి అనువైన విధంగా, సమతూకంగా రూపొందించినవి; వీటిలో సగంకాలం అధ్యయనానికీ గృహస్థాశ్రమ విధులు నిర్వర్తించడానికీ, తక్కిన సగంకాలం దైవచింతనా, ధ్యానసాధనలు సాగించడానికీ కేటాయించడం జరిగింది. (చూడండి పే. 318అ.)

ఆత్మలో సుస్థిరుడై ఉండడానికి, మనిషికి ఏకాంతం అవసరం; కాని తరవాత, లోకానికి సేవ చేయడం కోసం గురువులు, ప్రపంచంలోకి తిరిగి వస్తారు. పైకి కనిపించే విధంగా ఏ పనీ చెయ్యని సాధువులు సైతం, తమ ఆలోచనల ద్వారానూ పవిత్ర స్పందనల ప్రసారంద్వారానూ ప్రపంచానికి అత్యంత అమూల్యమైన బహుమానాలు ప్రదానం చేస్తూ ఉంటారు. వివేకశూన్యుడైన వాడు ఎంతో శ్రమిస్తూ సాగించే మానవసేవా కార్యకలాపాల వల్ల కలిగే మేలుకన్న, వీరివల్ల ప్రపంచానికి ఇంకా ఎక్కువ విలువైన మేళ్ళు చేకూరతాయి. మహాపురుషులు, ఎవరి పద్ధతిలో వాళ్ళు, తరచుగా తీవ్రమైన ప్రతిఘటనను కూడా లెక్కచెయ్యకుండా, తోటివారిని ఉత్తేజపరచడానికి, ఉద్ధరించడానికి నిస్స్వార్థంగా శ్రమిస్తూ ఉంటారు. హైందవ ధార్మికాదర్శం కాని, సామాజికాదర్శం కాని - ఏ ఒక్కటీ కేవలం నకారాత్మకం కాదు. మహాభారతంలో, "సకలో ధర్మః" అని చెప్పిన 'అహింస', నకారాత్మకమే కావడానికి కారణం, ఇతరులకు సహాయం చెయ్యనివాడు ఏదో ఒక విధంగా వాళ్ళకి హానే చేస్తున్నాడన్న భావన దాంట్లో ఉంది.

ఇతరులకు ఇవ్వడం; ఆపదలు పిడిగుద్దులు వేస్తున్నప్పుడు ఏనాడు చలించక పోవడం!"

కాళీఘాట్ గుడిదగ్గర తటస్థపడ్డ సమదర్శి అయిన మునికాని, టిబెట్టులో శిక్షణపొందిన యోగికాని, గురువుకోసం నాకు గల ఆకాంక్షను తీర్చలేదు. గుర్తించడానికి నా హృదయానికి శిక్షకుడి అవసరం లేదు. ఆంతరిక నిశ్శబ్దం లోంచి దాన్ని తట్టి పిలిచేవారు చాలా అరుదుగా తారసపడడంవల్ల, అట్టి సందర్భాల్లో సహజంగానే అది గట్టిగా 'భళా' అంటూ కేక వేసింది. చివరికి నేను మా గురువుగారిని కలుసుకున్నప్పుడు, ఆయన కేవలం తమ ఆదర్శ మహనీయతవల్లనే నిజమైన మానవుడి ప్రమాణాన్ని ఉద్బోధించారు.

---

కర్మ ప్రవృత్తి మానవ ప్రకృతిలోనే సహజంగా ఉందని చెబుతుంది భగవద్గీత (అధ్యా. III:శ్లో. 4-8). సోమరితనం కేవలం "దుష్కర్మ ప్రవృత్తి".

న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోశ్నుతే,
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥ (4)

నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్,
కార్యతే హ్యవశః కర్మ సర్వ ప్రకృతిజై ర్గుణైః ॥ (5)

కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే ॥ (6)

యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేర్జున,
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే ॥ (7)

నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాపి చ తేన ప్రసిద్ధ్యే దకర్మణః ॥ (8)

అధ్యాయం : 6

# టైగర్ స్వామి

"టైగర్ స్వామిగారి ఎడ్రస్ కనుక్కున్నాను. రేపు ఆయన దర్శనానికి వెడదాం."

సంతోషకరమైన ఈ సూచన చేసినవాడు మా హైస్కూలు స్నేహితుడు, చండి. ఈ స్వామివారు సన్యాసాశ్రమ జీవితానికి పూర్వం, పెద్దపులుల్ని పట్టుకునే వారనీ ఉత్తిచేతులతోనే వాటితో పోట్లాడేవారనీ విన్నాను. ఈయన్ని కలుసుకోవాలని ఎంతగానో ఉవ్విళ్ళూరుతూండేవాణ్ణి. అటువంటి అసాధారణమైన సాహసకృత్యాలంటే పిల్లలకు ఉత్సాహం కలగడం సహజం; అది నాలో గాఢంగా ఉండేది.

శీతాకాలం కావడంవల్ల, మర్నాడు తెల్లవారేసరికి ఇంకా చలిచలిగానే ఉంది; కాని నేనూ చండీ ఉల్లాసంగా నడక సాగించాం. కలకత్తా నగరం బయట భవానీపూర్‌లో వెతికి వెతికి వేసారి చివరికి సరయిన ఇల్లే పట్టుకున్నాం. ఆ ఇంటి తలుపుకి రెండు ఇనప కడియాలు ఉన్నాయి; వాటిని పట్టుకుని నేను చెవులు చిల్లులు పడేలా చప్పుడు చేశాను. ఇక్కడింత రొద అవుతున్నా నౌకరు ఒకడు నిదానంగా నడుచుకుంటూ వచ్చాడు మా దగ్గరికి. రణగొణ ధ్వని చేసే ఆగంతకులు, సాధువుల ఆశ్రమంలోని ప్రశాంతిని భంగపరచలేరన్న భావాన్ని సూచిస్తోంది, వ్యంగ్యంగా అతడు నవ్విన చిరునవ్వు.

మౌనంగా అతడు పెట్టిన చీవాటుకు మనస్సు చివుక్కుమనిపించినా, లోపలికి రమ్మన్నందుకే ధన్యులమనుకున్నాం, నేనూ నా స్నేహితుడూ. అక్కడ చాలాసేపు ఎదురు చూస్తూ కూర్చోడంతో మాకు అనుమానం వచ్చింది. సత్యాన్వేషకుడికి ఓర్పు అవసరమన్నది భారతదేశ సాంప్రదాయిక నియమం; మనః ప్రవృత్తిని పరీక్షించే ఈ ట్రిక్కుని పాశ్చాత్యదేశాల్లోని వైద్యులు, దంత వైద్యులు చాలా తరుచుగా ఉపయోగిస్తూంటారు!

చివరికి ఆ పనివాడు పిలిచాక, చండీ నేనూ ఒక పడగ్గదిలో అడుగుపెట్టాం. ప్రసిద్ధులైన సొహాంగ్ (సోహం) స్వామివారు* పక్కమీద కూర్చుని ఉన్నారు. బ్రహ్మాండమైన ఆయన విగ్రహం కంటబడేసరికి మేము ఏమిటో అయిపోయాం. కళ్ళు ఇంత చేసుకుని, నోట మాట లేకుండా స్తంభించిపోయాం. అంత ఛాతీ కాని, పెద్ద బంతుల్లాటి కండలు తిరిగిన జబ్బలు కాని అంతకుముందెన్నడూ మేము చూడలేదు. మంచి దిట్టంగా ఉన్న మెడపైన, ఆయన ముఖం భీకరంగా ఉన్నప్పటికీ ప్రశాంతంగానే ఉంది. పొడుగాటి ఉంగరాలు తిరిగిన జుట్టు, గడ్డం, మీసాలు దానికి శోభనిస్తున్నాయి. ఆయన నల్లటి కళ్ళలో పావురం మాదిరి, పెద్దపులి మాదిరి లక్షణాలు రెండూ గోచరిస్తున్నాయి. బలమైన నడుము చుట్టూ ఉన్న ఒక్క పులిచర్మం తప్పిస్తే, మొత్తానికి ఆయన దిగంబరంగానే ఉన్నారు.

నేనూ, నా స్నేహితుడూ ఎలాగో మాటలు పెకల్చుకుని, ఆ సన్యాసికి నమస్కారం చేశాం; పులుల్ని లొంగదీసుకోడంలో ఆయనకు గల అసాధారణమైన శౌర్యాన్ని ప్రశంసించాం.

"అడవి జంతువు లన్నింటిలోకి ఎక్కువ భయంకరమైన రాయల్ బెంగాల్ పులుల్ని ఉత్తి పిడికిళ్ళతోనే లొంగదీసుకోడం మీకు ఎలా సాధ్యమైందో, దయచేసి మాకు చెప్పరూ?"

"అబ్బాయిలూ, పులులతో పోట్లాడ్డం అన్నది నాకు చాలా చిన్న విషయం. అవసరమైతే ఈవేళ కూడా ఆ పని చెయ్యగలను," పసివాడిలా నవ్వారాయన. "మీరు పులుల్ని పులుల్లా చూస్తారు; వాటిని పిల్లులుగా నే నెరుగుదును."

"స్వామీజీ, పులులు పిల్లులేనని నా మనస్సు (అవచేతన) కయితే నచ్చజెబు తాననుకోండి, కాని పులులకు నచ్చజెప్పగలనా?"

"బలం కూడా అవసరమన్న మాట నిజమే! పులిని పిల్లిలా ఊహించుకునే పసివాడు దాన్ని గెలుస్తాడని ఎవరూ ఆశించకపోవచ్చు! బలమైన నా చేతులే చాలు నాకు ఆయుధాలుగా."

మమ్మల్ని వెంట బెట్టుకుని పెరట్లోకి వచ్చారాయన. అక్కడ గోడ అంచున ఒక్క గుద్దు గుద్దారు. దాంతో ఒక ఇటిక కిందికి రాలి పడింది. తొస్సి పన్నులా

---

* 'సొహాంగ్' అన్నది ఆయన సన్యాసం తీసుకున్నప్పుడు పెట్టుకొన్న పేరు; జనసామాన్యంలో మాత్రం 'టైగర్ స్వామి' గానే ప్రసిద్ధులు.

కనిపించే గోడ కన్నంలోంచి ఆకాశం ధైర్యంగా తొంగి చూసింది. ఆశ్చర్యంతో వెర్రిచూపులు చూశాను నేను. సున్నంతో గట్టిగా కట్టిన గోడలో ఉన్న ఇటికనే ఒక్క గుద్దుతో రాలగొట్టగలిగిన ఈయన, పెద్దపులుల పళ్ళు రాలగొట్టడంలో సందేహం లేదనిపించింది!

"నాలాగే కొందరికి దేహదారుఢ్యం ఉంటుంది; కాని వాళ్ళకి నిబ్బరమైన నమ్మకం ఉండదు. ఒంటిని మాత్రమే వస్తాదుల్లా పెంచుకొని మనస్సును అలా పెంచుకోనివాళ్ళు, అడవిలో స్వేచ్ఛగా తిరిగే క్రూర మృగం ఏదైనా కంటబడితే చాలు, ఇట్టే కళ్ళు తేలవేస్తారు. సహజమైన ఉగ్రతతో తన స్థావరంలో ఉండే పులికీ, నల్లమందు మరిగిన సర్కస్ జంతువుకీ చాలా తేడా ఉంటుంది!

"భీముడంతటి బలం ఉండి కూడా, రాయల్ బెంగాల్ పులి వచ్చి మీద పడుతుంటే, బెదిరిపోయి ఘోరంగా నిస్సహాయస్థితిలో పడ్డవాళ్ళు చాలామంది ఉన్నారు. ఆ రకంగా తన మనస్సులోనే తానొక పిల్లిమొస్తరుగా బెదిరిపోయే స్థితికి మనిషిని మార్చేసింది పులి. ఒక మోస్తరు బలమైన శరీరం ఉండి, బ్రహ్మాండమైన మనఃస్థైర్యం ఉన్న ఏ వ్యక్తి అయినా పులిజిత్తులను దాని మీదికే ప్రయోగించి, దాని ప్రవృత్తిని పిల్లిలాటి నిస్సహాయ స్థితికి తేగలడు. సరిగ్గా ఇలాగే, ఎన్నిసార్లు చేశానో నేను!"

నా ఎదుట ఉన్న భీమబలుడు, పెద్దపులిని పెంపుడు పిల్లిలా మార్చెయ్యగలగడంలో సందేహం లేదనిపించింది. ఆయన ఏదో ఉపదేశం చేసే ధోరణిలో ఉన్నట్టున్నారు; చండీ నేనూ శ్రద్ధగా వింటున్నాం.

"కండరాల్ని పనిచేయించేది మనస్సు. సమ్మెటతో కొట్టడానికి కావలసిన బలం, దానికి ఉపయోగించిన శక్తిమీద ఆధారపడి ఉంటుంది; మనిషి శారీరక సాధనంగా కనబరిచే బలం, అతని మనస్సులోని ఆక్రమణేచ్ఛ మీదా, ధైర్యం మీదా ఆధారపడి ఉంటుంది. శరీరాన్ని అక్షరాలా, తయారుచేసేదీ, పోషించేదీ మనస్సే. గత జన్మల్లోని సహజాతాల ఒత్తిడి ద్వారానే బలాలయినా బలహీనతలయినా మానవుడి చేతనలోకి మెల్లగా ప్రవేశిస్తాయి. అవి అతని అలవాట్లుగా వ్యక్తమయి, కోరదగిన శరీరంగానో, కోరదగని శరీరంగానో రూపొందుతాయి. బాహ్యమైన బలహీనతకు మూలం మానసికమైనది. విషవలయక్రమంలో, అలవాట్లకు కట్టుబడ్డ శరీరం మనస్సును అడ్డగిస్తూ ఉంటుంది. తన నౌకరు తనను ఆజ్ఞాపించడానికి యజమానే అనుమతించినట్లయితే, ఆ నౌకరు నిరంకుశుడవుతాడు; అలాగే

మనస్సు కూడా శరీరం చెప్పినట్టల్లా లోబడి, దానికి బానిస అవుతుంది."

ఆ స్వామీజీ మా కోరిక మన్నించి, తమ జీవితాన్ని గురించి కొంత చెప్పడానికి అంగీకరించారు.

"మొట్టమొదట్లో నాకున్న పెద్ద కోరికల్లా, పెద్దపులులతో పోట్లాడాలని. నా మనస్సంకల్పం బలిష్ఠమైనదే కాని నా శరీరం దుర్బలంగా ఉండేది."

ఆ మాటకు నాలోంచి ఆశ్చర్యం వ్యక్తమయింది. భీముడులాంటి భుజ బలమున్న ఈయన, ఎన్నడయినా బలహీనత అన్నది ఎరుగునంటే నమ్మలేన ట్లనిపించింది.

"ఆరోగ్యమూ బలమూ చేకూర్చుకోవాలన్న గట్టి పట్టుదలతో, ఆ లోపం పోగొట్టుకున్నాను. రాయల్ బెంగాల్ పులుల్ని నిజంగా లొంగదీసుకునేటట్టు చేసినది నా ఉద్ధత మనోదార్ఢ్యమేనని చెప్పక తప్పదు.

"పూజ్య స్వామీజీ, నే నెప్పటికయినా పెద్దపులులతో పోట్లాడగలనంటారా?' ' అల్లాటి విపరీతమైన కోరిక నా మనస్సులో చొరబడ్డం అదే మొదటిసారీ చివరిసారీ కూడా!

"ఆహా! అంటూ నవ్వారాయన. "కాని, పులులు చాలా రకాలున్నాయి; మానవుల కోరికలనే అడవుల్లో తిరుగుతుంటాయి కొన్ని. మామూలు జంతువుల్ని స్పృహ తప్పేటట్టు కొట్టడంవల్ల ఆధ్యాత్మికంగా లాభమేమీ కలగదు. అంతకంటె, లోపల తిరిగే క్రూరమృగాల్ని జయించు."

"అయ్యా, అడవిపులుల్ని అణిచేసే మీరు, తీవ్రమైన మనోవికారాల్ని అణిచేవారుగా ఎలా మారారో చెప్తారా?"

టైగర్ స్వామి కొంతసేపు మౌనం వహించారు. గతకాలపు దృశ్యాల్ని తిరగ దోడుతున్నట్టుగా, ఆ చూపు ఎటో ప్రసరించింది. మా మనవి మన్నించాలా, వద్దా అన్న కొద్దిపాటి మానసిక సంఘర్షణ ఆయనలో చూడగలిగాను. చివరికి అంగీకార సూచకంగా చిరునవ్వు నవ్వారు.

"నా కీర్తి ఉచ్చస్థితి నందుకొనేటప్పటికి, దానివల్ల నాలో గర్వమదం ఏర్పడింది. పులులతో పోట్లాడటమే కాకుండా, వాటిమీద రకరకాల జిత్తులు ప్రదర్శించాలని కూడా నిశ్చయించుకున్నాను. అడవి జంతువులు పెంపుడు జంతువుల్లా ప్రవర్తించేటట్టు చెయ్యాలని నా ఆశ. నా జిత్తులు బహిరంగంగా

ప్రదర్శించడం మొదలు పెట్టాను; దాంట్లో తృప్తికరమైన విజయం సాధించాను.

"ఒకనాడు సాయంత్రం, మా నాన్నగారు చింతాక్రాంతులై నా గదిలోకి వచ్చారు.

" 'బాబూ, నీకో హెచ్చరిక ఉంది. కార్యకారణాలనే తిరగలి రాళ్ళ మధ్య ఉత్పన్నమయి రాబోయే ముప్పులనుంచి నువ్వు తప్పించుకోవాలని నా కోరిక' అన్నారు."

" 'నాన్నగారూ, విధినిర్ణయవాదులా మీరు? శక్తిమంతమయిన నా కార్యకలాప జలాల్ని మూఢ విశ్వాసంతో కలుషం కానివ్వవలసిందేనా?'

" 'నేను విధినిర్ణయవాదిని కాను, నాయనా. కాని మన పవిత్ర గ్రంథాలు బోధించే న్యాయమైన ప్రతిఫల నియమాన్ని నమ్ముతాను. అడవి జంతువులకు నీ మీద ఆగ్రహం ఉంది; దానివల్ల ఎప్పుడో ఒకనాడు నీకు ముప్పు రావచ్చు.'

" 'నాన్నగారూ, మీ మాటలు వింటుంటే నాకు ఆశ్చర్యంగా ఉంది! పులుల సంగతి మీకు బాగా తెలుసు - అవి అందమైనవే కాని కనికరం లేనివి! ఏమో, ఎవరికి తెలుసు? నా పిడిగుద్దులు, వాటి మొద్దుబుర్రల్లోకి కాస్తంత విచక్షణ జ్ఞానాన్ని ఎక్కిస్తాయేమో! వాటికి సాధువర్తన అలవరచడానికి, అడవిని చక్కదిద్దే బడిలో నేనే హెడ్మాస్టర్ని!

" 'నాన్నగారూ, నన్ను పులుల్ని మచ్చికచేసే వాడిలాగే చూడండి. పులుల్ని చంపేవాడినని ఎన్నడూ అనుకోకండి. నేను చేసే మంచి పనులు నాకు చెరుపు ఎందుకు చేస్తాయి? నా జీవిత మార్గాన్ని మార్చుకోవాలన్న ఆజ్ఞ ఏదీ విధించవద్దని మిమ్మల్ని బతిమాలుకుంటున్నాను.' "

చండీ, నేనూ ఎంతో శ్రద్ధగా వింటున్నాం, వెనకటి సంకటస్థితి అర్థం చేసు కుంటూ. భారతదేశంలో పిల్లలెవరూ తల్లిదండ్రుల కోరికలను తేలికగా తీసిపారేసి చిత్తం వచ్చినట్టు నడుచుకోరు. టైగర్ స్వామిగారు ఇంకా ఇలా చెప్పారు:

"నే నిచ్చే సంజాయిషీని నాన్నగారు, నిర్వికార మౌనం వహించి విన్నారు. విన్న తరవాత గంభీరంగా ఒక విషయం వెల్లడించారు.

" 'నాయనా, జరగబోయేదాన్ని గురించి ఒక సాధువు నోట్లోంచి వచ్చిన అశుభ విషయాన్ని చెప్పక తప్పని పరిస్థితి తెస్తున్నావు. ప్రతి రోజులాగే నిన్న నేను వరండాలో కూర్చుని ధ్యానం చేసుకుంటూ ఉండగా ఆయన వచ్చాడు.

" ' "ప్రియమిత్రమా, కలహప్రియుడైన నీ కొడుక్కి ఒక సందేశం తీసుకు వచ్చాను. వాణ్ణి ఆటవికమైన పనులు మానెయ్యమను. లేకపోతే, ఈసారి పులితో పోట్లాటకు తలపడ్డప్పుడు తీవ్రమైన గాయాలకు గురిఅయి, ఆరునెల్లపాటు ప్రాణాంతకమైన జబ్బుతో బాధపడతాడు. అప్పుడిక వెనకటి నడవడి విడిచిపెట్టి సన్యాసి అవుతాడు." '

"ఈ కథ నా మనస్సు కెక్కలేదు. నాన్నగారు, ఒక మాయదారి ఛాందసుడి మాటల్ని సులువుగా నమ్మేశారని అనుకున్నాను."

తమ మూర్ఖత్వానికి దేనికో కించపడుతున్నట్టుగా ఆయన, సహనం కోల్పోయినవాడి భంగిమ ఒకటి చేస్తూ ఈ విషయం వెల్లడించారు. చాలా సేపటి వరకు గంభీరంగా మౌనం వహించడం చూస్తే, మేమక్కడ ఉన్న సంగతే ఆయన ఎరగనట్టున్నారు. అంతవరకు చెప్పిన కథలో, విడిచి పెట్టిన కొస మళ్ళీ అందుకుని సాగించేసరికి, ఆయన స్వరం హఠాత్తుగా మందగించింది.

"నాన్నగారు హెచ్చరించి అట్టే కాలం కాకముందే, నేను కూచ్ బిహార్ రాజధానికి వెళ్ళాను. ప్రకృతి సౌందర్యంతో నిండిన ఆ ప్రాంతం నాకు కొత్త. విశ్రాంతిగా అక్కడ కొంత మార్పు ఉంటుందని ఆశ పడ్డాను. మామూలుగా ప్రతిచోటా జరిగినట్టుగానే అక్కడ కూడా, వీథుల్లో జనం నన్ను వింతగా చూస్తూ వెంటబడ్డారు. గుసగుసలాడుతూ వాళ్ళు చేసే వ్యాఖ్యానంలో కొన్ని ముక్కలు పట్టుకున్నాను కూడా :

" 'అడవి పులులతో పోట్లాడేవాడు ఈయనే.'

" 'ఈయనవి కాళ్ళా, చెట్ల బోదెలా?'

" 'ఆయన మొహం చూడు! పులిరాజు అవతారమే అయి ఉండాలి!'

"వార్తా పత్రికలు వేసే తుది సంచికల్లా, పల్లెటూరి పిల్లకాయలు ఎలా పనిచేస్తారో తెలుసా! అంతకంటె కూడా ఆలస్యంగా వెలువడే పత్రికల్లా ఆడ వాళ్ళ ప్రసంగ విశేషాలు ఇంటింటికీ ఎంత వడిగా వ్యాపిస్తాయో! ఒక్క కొన్ని గంటల్లోనే, నేను ఊళ్ళో ఉన్నందుకు ఆ నగరమంతటా కోలాహలం చెలరేగింది.

"సాయంత్రం నేను ప్రశాంతంగా విశ్రాంతి తీసుకుంటున్నాను. ఇంతలో, దౌడు తీసే గుర్రాల చప్పుళ్ళు వినిపించాయి. అవి నా బస కెదురుగా వచ్చి ఆగి పోయాయి. తలపాగాలు పెట్టుకున్న పొడుగాటి పోలీసువాళ్ళు కొందరు లోపలికి వచ్చారు.

"నేను ఆశ్చర్యపడ్డాను. 'మానవ చట్టం సృష్టించిన వీళ్ళకి అన్నీ సంభవమైనవే.' అనుకున్నాను. 'నాకు బొత్తిగా ఏమీ తెలియని విషయాల గురించి దండించబోరు కదా, అనిపించింది.' కాని ఈ ఆఫీసర్లు అలవాటు లేనంత అతివినయంతో వంగి నమస్కరించారు.

" 'అయ్యగారూ, కూచ్ బిహార్ యువరాజావారు వారి తరఫున తమకు స్వాగతం ఇవ్వడానికి మమ్మల్ని పంపారు. రేపు పొద్దున్న తమరు రాజమందిరానికి దయచేయవలసిందిగా వారు కోరుతున్నారు.'

"ఈ పిలుపు ఎందుకయి ఉంటుందా అని కొంతసేపు ఆలోచించాను. అస్పష్టమైన ఏ కారణంవల్లనో కాని, ప్రశాంతమైన యాత్రకు ఈ అవరోధం కలిగినందుకు మనస్సు చివుక్కుమనిపించింది. కాని పోలీసులు చూపించే వినమ్రభావం నన్ను కదిలించింది; పోవడానికి ఒప్పుకున్నాను.

"మర్నాడు, నాలుగు గుర్రాలు పూన్చిన అద్భుతమైన బండిని గుమ్మంలోకి తీసుకు వచ్చి అతి మర్యాదలతో నన్ను రాజమందిరానికి తీసుకువెళ్తూ ఉంటే తబ్బిబ్బు అయ్యాను. మలమల మాడ్చే ఎండ నాకు తగలకుండా ఉండాలని ఒక భటుడు, అందంగా అలంకరించి ఉన్న గొడుగు పట్టాడు. నగర వీధుల గుండాను, శివార్లలో ఉన్న వనాల గుండాను కులాసాగా సాగుతూ ఆనందించాను. నాకు స్వాగతం పలకడానికి రాజవంశాంకురమే స్వయంగా, మందిర ద్వారం దగ్గర ఉన్నాడు. బంగారు నగిషీ చేసిన తన ఆసనాన్ని నాకు ఇచ్చి, అంతకంటె సాదా నమూనాలో ఉన్న కుర్చీలో తాను కూర్చుంటూ చిరునవ్వు చిందించాడు.

" 'ఈ మర్యాదంతా నాకు తప్పకుండా ముప్పుతెస్తుంది!' అని, ఆశ్చర్యం పెరుగుతూ ఉండగా అనుకున్నాను. కాసేపు కుశల ప్రశ్నలు జరిగిన తరవాత, యువరాజు ఉద్దేశం బయటపడింది.

" 'మీరు ఉత్తి చేతులతోనే అడవి పులులతో పోట్లాడగలరని మా ఊరంతా పుకారుగా ఉంది. ఇది నిజమేనా?'

" 'అక్షరాలా నిజం.'

" 'నేను నమ్మలేను! పట్నవాసుల తెల్ల బియ్యపన్నం తిని పెరిగిన కలకత్తా బెంగాలీలు మీరు. నిజం చెప్పండి; మీరు పోట్లాడేది, వెన్నుబలం లేని, నల్లమందు మరిగిన జంతువులతోనే కదూ?' ఆయన గొంతు బిగ్గరగా, వెటకారంగా ఉంది; మాటతీరులో ప్రాంతీయమైన యాస కలిసి ఉంది.

"నన్ను అవమానపరిచే ఆయన ప్రశ్నకు నేను జవాబు చెప్పలేదు.

" 'మాకు కొత్తగా పట్టుబడ్డ 'రాజా-బేగం'* అనే పులితో పోట్లాడాలని మిమ్మల్ని సవాలు చేస్తున్నాను. మీరు దాన్ని సరిగా ఎదిరించి, గొలుసుతో కట్టేసి, ఒంటిమీద స్పృహ పోకుండా దాని బోనులోంచి బయటికి రాగలిగితే, ఆ రాయల్ బెంగాల్ పులిని మీరే తీసుకోవచ్చు. అంతేకాక, అనేక వేల రూపాయలు, అనేక ఇతర బహుమతులూ కూడా వస్తాయి. ఒకవేళ మీరు, దాన్ని ఎదుర్కోడానికి ఒప్పుకోకపోతే, మీరు వట్టి దగుల్బాజీ అని మా రాజ్యమంతటా చాటిస్తాను!'

"అవమానకరమైన ఆయన మాటలు తుపాకిగుండ్ల వర్షంలా తగిలాయి. నేనూ కోపంగానే అంగీకారం తెలిపాను. ఆ ఉద్రేకంలో ఆయన కుర్చీలోంచి సగం లేచి, ఒక విషపు నవ్వు నవ్వుతూ మళ్ళీ కుర్చీలో కూలబడ్డాడు; ఆయన్ని చూస్తుంటే, క్రైస్తవుల్ని క్రూరమృగాల మధ్య విడిచిపెట్టి ఆనందించే రోమన్ చక్రవర్తులు గుర్తుకు వచ్చారు నాకు. ఆయన ఇలా అన్నాడు :

" 'పోటీ ఇంకో వారంలో ఏర్పాటవుతుంది. ఆ పులిని ముందుగా చూడటానికి మీకు అనుమతి ఇవ్వలేనందుకు విచారిస్తున్నాను.'

"ఆ మృగానికి నేను వశీకరణ చేస్తాననో, రహస్యంగా నల్లమందు పెట్టడానికి ప్రయత్నిస్తాననో ఆ యువరాజు భయపడ్డాడేమో, నాకు తెలియదు!

"రాజప్రాసాదంనుండి బయటికి వస్తూ, అంతకు ముందున్న రాజోచితమైన ఛత్రం, సర్వాంగకవచంతో సన్నద్ధమైన శకటం ఇప్పుడు లేకపోవడం చూసి, నాలో నేను నవ్వుకున్నాను.

"మరుసటి వారమంతా, రాబోయే కఠిన పరీక్షకు కావలసినట్టుగా నా శరీరాన్నీ మనస్సునూ క్రమపద్ధతిలో సిద్ధం చేసుకున్నాను. నా నౌకరు ద్వారా కొన్ని విచిత్ర మైన కట్టుకథలు కూడా విన్నాను. నాకు ముప్పు వస్తుందని ఒక సాధువు మా నాన్నగారికి జోస్యం చెప్పిన సంగతి ఇక్కడి జనంలో ఎలా వ్యాపించిందో కాని, ప్రచారమైనకొద్దీ చిలవలూ పలవలూ వేసింది. దేవతల శాపం పొందిన ఒక దుష్టశక్తి పులిగా జన్మించి రాత్రిళ్ళు రకరకాల రాక్షసరూపాలు దాలుస్తుందనీ, పగలు మట్టుకు చారల పులిలాగే ఉంటుందనీ అమాయకులైన గ్రామ ప్రజలు నమ్మారు. నన్ను అణగదొక్కడానికి ఏర్పాటయినది ఆ రాకాసిపులేనని భావించారు.

---

* "రాజా-బేగం" - ఆడపులికీ, మగపులికీ కలిపి ఉండేటంత ఉగ్రత దీనికి ఉందని సూచించడానికి ఈ పేరు పెట్టారు.

"వాళ్ళ ఊహల్లో అల్లుకొన్న మరో కథ ఏమిటంటే, జంతువులన్నీ కలిసి పులుల స్వర్గానికి పెట్టుకున్న మొర ఫలించి రాజా-బేగం అవతరించిందట. పులి జాతి కంతకూ తలవంపులు తెస్తున్న వెరపులేని ద్విపాద పశువును శిక్షించడానికి అది సాధనమట! జాలులేని, కోరలు లేని మానవ మాత్రుడొకడు, పంజాలతోనూ బలిష్ఠమైన అవయవాలతోనూ ఉండే పులిని సవాలు చెయ్యడానికి సాహసించడమా! అవమానానికి గురి అయిన పులులన్నిటి విద్వేషవిషమూ సాంద్రీభూతమయి ఏర్పడ్డ శక్తికి, గుప్త నియమాల్ని పనిచేసేటట్టు చేసి, పులుల్ని దండించే గర్విష్ఠిని మట్టు పెట్టడానికి తగినంత చలనం వచ్చిందనీ పల్లెప్రజలు ప్రకటించారు.

"మనిషికీ మృగానికీ మధ్య జరిగే ఈ పోట్లాటకు యువరాజే నిర్వాహకుడిగా వ్యవహరిస్తున్నాడని కూడా నా నౌకరు చెప్పాడు. వేలకొద్దీ ప్రేక్షక జనం పట్టడానికి వీలయిన డేరా, ఆయనే దగ్గరుండి వేయించాడట; తుఫానుకు కూడా తట్టుకో గలిగేటంత దిట్టంగా వేయించాడు. దాని మధ్యలో బ్రహ్మాండమైన బోనులో రాజా-బేగం ఉంది; బోను చుట్టూ కాపుదల గది ఏర్పాటయి ఉంది. బోనులో బందీగా ఉన్న పులి, నెత్తురు తోడుకుపోయేటంత భయంకరంగా గర్జిస్తోంది. దానికి కోపంతో బాటు ఆకలి రగిలించడం కోసం తిండి అడపాతడపా పెడుతూ వచ్చారు. బహుశా, నేనే దానికి విందు భోజనం అవుతానని అనుకొని ఉంటాడు ఆ యువరాజు!

"సాటిలేని ఈ పోటీని గురించి బాగా టముకు వేయించినందువల్ల, నగరంలోవాళ్ళూ బయటివాళ్ళూ కూడా తండోపతండాలుగా వచ్చి టిక్కెట్లు కొనుక్కున్నారు. పోట్లాట జరిగేనాడు, వందలాది జనం, టిక్కెట్లు దొరక్క వెనక్కి తిరిగి వెళ్ళిపోయారు. చాలామంది, డేరా కంతల్లోంచి చొరబడి గేలరీల కింద ఉన్న చోటకు చేరి కిక్కిరిసిపోయారు."

టైగరు స్వామి కథ మంచి పట్టులోకి వస్తూంటే, నాలో ఉద్రేకం పెల్లు బుకుతూ వచ్చింది; చండి కూడా మూగబోయి శ్రద్ధగా వింటున్నాడు.

"ఒక పక్క రాజా-బేగం చెవులు చిల్లులుపడేలా గర్జిస్తోంది; మరోపక్క, కొంచెం కంగారుపడ్డ ప్రేక్షక జనం గోల చేస్తున్నారు. ఆ మధ్యలో నేను ప్రశాంతంగా ప్రవేశించాను. నడుముకు చుట్టి కట్టుకొన్న చిన్న గుడ్డ తప్ప నా ఒంటిని కాసు కోడానికి మరే బట్టలూ లేవు. కాపుదల గది తలుపు గడియ తీసి లోపలికి నిబ్బరంగా వెళ్ళి మళ్ళీ బిగించాను. మనిషి నెత్తురు పసిగట్టింది పులి. చువ్వలు ఫెళఫెళ లాడేటంతగా రొద చేస్తూ ముందుకు ఉరుకుతూ నాకు మహోగ్రంగా స్వాగతం

ఇచ్చింది. జాలీ భయమూ కలగలుపుగా కలిగిన ప్రేక్షకుల్లో నిశ్శబ్దం ఆవరించింది. మహోగ్రమైన క్రూరమృగం ముందు నే నొక గొర్రెపిల్ల మోస్తరుగా కనిపించాను.

"ఒక్క క్షణంలో నేను బోనులోకి ప్రవేశించాను; కాని నేను తలుపు మూస్తూ ఉండగానే రాజా-బేగం నిలువునా నా మీదకి వచ్చిపడింది. నా కుడిచెయ్యి ఘోరంగా చీలుకు పోయింది. పులికి అన్నిటికంటె ఇష్టమైన మానవరక్తం చేతి నుంచి వరదలా ప్రవహించింది. ఆనాడు సాధువు చెప్పిన జోస్యం నిజమవు తున్నట్టు అనిపించింది.

"అంతకు ముందెన్నడూ ఎరగనంత తీవ్రమైన గాయం మొట్టమొదటి సారిగా అవడంతో మెరుపుదెబ్బ తిన్నట్టయి, తక్షణమే నేను తేరుకున్నాను. నెత్తురు ఓడుతున్న వేళ్లు దాని కంటికి కనబడకుండా ఉండాలని, అంగోస్త్రం కింద పెట్టేశాను. ఎడమచేత్తో విసురుగా, ఎముకలు విరిగేలా ఒక్క గుద్దు గుద్దాను. దాంతో పులి వెనక్కి తిరగబడి బోనులో వెనకతట్టున గింగిరాలు తిరిగి మళ్ళీ నా ఎదటికి వచ్చింది. పిడిగుద్దులకు మనం పెట్టింది పేరు; ఆ పిడిగుద్దులతో దాని నెత్తిమీద దబదబా మొత్తాను.

"చాలాకాలం పాటు సారా చిక్కని తాగుబోతుకి మళ్ళీ అది చిక్కితే, మొదటి పీల్పు ఎంత వెర్రెత్తిస్తుందో, రాజా-బేగంకు నెత్తుటి రుచి అంత వెర్రెత్తించింది. మధ్యమధ్య చెవులు గళ్ళుపడేలా గాండ్రిస్తూ కోపంతో రెచ్చిపోతూ నా మీద విరుచుకు పడింది. వాడిగా ఉన్న పంజాలూ కోరలూ గల ఆ పులిముందు నేను, ఒంటిచేత్తో కాసుకోవలసి ఉన్నందు వల్ల దాని వాతపడే పరిస్థితిలో పడ్డాను. అయినా దానికి దిమ్మ తిరిగేటట్టు దెబ్బ తియ్యకపోలేదు. ఇద్దరమూ చావో బతుకో తేల్చుకోవలసినంత తీవ్రంగా పెనుగులాడుతున్నాం. బోను బోనంతా గందరగోళ మయిపోయింది; నెత్తురు అన్ని వైపులకీ చిమ్మేసింది. బాధా కసీ కలిసిన గాండ్రింపులు దాని గొంతులోంచి వెలువడుతున్నాయి.

" 'కాల్చండి!' 'పులిని చంపండి!' అంటూ ప్రేక్షకుల్లోంచి కేకలు వినవచ్చాయి. ఈ పెనుగులాటలో మనిషీ మృగమూ కూడా వడి వడిగా తిరుగుతుండడం వల్ల, రక్షక భటుడు కొట్టిన తుపాకిగుండు గురి తప్పిపోయింది కూడా. నేను నా సంకల్పశక్తి నంతనూ కూడగట్టుకొని భయంకరంగా హుంకరిస్తూ చిట్టచివరి చావుదెబ్బ కొట్టాను. పులి కూలబడిపోయి చడీ చప్పుడూ లేకుండా పడుకుంది.

"పిల్లిలాగ!" అన్నాను మధ్యలో, ఉండబట్టలేక.

నా మాటకు మెచ్చుకుంటున్నట్టుగా నవ్వారు స్వామీజీ. తరువాత, మంచి పట్టుగా సాగుతున్న కథ మళ్ళీ కొనసాగించారు.

"చివరికి రాజా-బేగం ఓడిపోయింది. తరవాత దాని రాజగర్వం మరింత అణిగిపోయింది. గాయాలతో చిట్లిపోయిన నా చేతులతో, జబర్దస్తీగా దాని దవడలు పెగలదీసి, నాటక ఫక్కీలో రంజింపచెయ్యడం కోసం, ఒక్క క్షణం మృత్యుముఖంలో తలదూర్చి ఉంచాను. గొలుసు కోసం చుట్టూ చూశాను. నేల మీదున్న గుట్టలోంచి ఒక గొలుసు లాగి పులి మెడకు బిగించి బోను కడ్డీలకు కట్టాను. విజయోత్సాహంతో గుమ్మం వేపు నడిచాను.

"కాని, రాకాసి పుట్టుక పుట్టిన ఆ రాజా-బేగంకు, పుట్టుమూలానికి తగ్గ రాకాసి బలం ఇంకా ఉంది. బలంగా ఒక్క ఊపుతో గొలుసు తెంపుకొని నా వీపు మీదికి దూకింది. నా భుజం దాని కోరల్లో చిక్కింది; నేను కుప్పకూలి పోయాను కాని మరుక్షణంలోనే దాన్ని నేల మీద పడగొట్టి అణిచిపారేశాను. నిర్దాక్షిణ్యంగా నేను గుద్దిన గుద్దులకు అది ఒళ్ళు తెలిసీ తెలియని స్థితిలో పడింది. ఈసారి దాన్ని ఇంకా జాగ్రత్తగా కట్టిపడేశాను. మెల్లగా బోనులోంచి బయటికి వచ్చాను.

"ఈసారి నాకు కొత్తరకం అరుపులు వినవచ్చాయి; ఆనందంతో అరిచిన అరుపులవి. జన మందరి గొంతులూ కలిసి బ్రహ్మాండమైన ఒకే గొంతుతో అరిచినట్టున్నాయి. నేను తీవ్రంగా గాయపడ్డప్పటికీ, పెట్టిన మూడు షరతులూ పాటించాను - పులికి స్పృహ తప్పేటట్టు చెయ్యడం, గొలుసుతో కట్టిపడెయ్యడం, ఎవరి సహాయమూ అవసరం లేకుండా నా అంతట నేనే బయటికి రావడం. అంతే కాదు; ఆ పొగరుబోతు పులిని దారుణంగా చితగ్గొట్టడమే కాకుండా, ఎంతగా బెదరగొట్టానంటే - సమయానికి చిక్కిన బహుమానంలా దాని నోట్లోకి దూర్చిన తలను కూడా ఉపేక్షించి ఊరుకుందది.

"నా గాయాలకు మందువేసిన తరవాత, పూలదండలు వేసి నన్ను ఘనంగా సన్మానించారు. బంగారు కాసులు అనేకం నా కాళ్ళ దగ్గర జల్లుగా కురిశాయి. నగరం యావత్తు పండుగ జరుపుకొంటున్నంత ఉల్లాసంగా ఉంది. ఎన్నడూ కనీ వినీ ఎరగనంత పెద్ద, క్రూరమైన పులిని చిత్తు చేసినందుకు నా గురించి అన్నిచోట్లా అంతులేకుండా చెప్పుకున్నారు. అన్నమాట ప్రకారం, ఆ రాజా-బేగంను నన్నే తీసుకోమన్నారు. కాని నా కేమీ ఉత్సాహం కలగలేదు. ఒక రకమైన ఆధ్యాత్మిక

పరిణామం నాలో ప్రవేశించింది. నేను పులి బోనులోంచి చివరిసారిగా బయటికి రావడంతోనే, ప్రాపంచికమైన నా ఆశలన్నిటికీ ద్వారం మూసేసినట్టు అనిపించింది.

"తరవాత నాకు కష్టకాలం వచ్చింది. నెత్తురు విషపూరితమైనందువల్ల ఆరునెల్లపాటు మృత్యుముఖంలో ఉన్నాను. కూచ్ బిహార్ విడిచి వెళ్ళడానికి తగినంత స్వస్థత చేకూరగానే, నేను మా స్వగ్రామానికి తిరిగి వచ్చేశాను.

" 'నన్ను ముందుగానే జ్ఞానపూర్ణమయిన మాటలతో హెచ్చరించిన ఆ సాధుపుంగవుడే నా గురువని నేను తెలుసుకున్నాను,' ఈ మాట నాన్నగారికి వినయంగా చెప్పాను. 'ఆయన ఎక్కడున్నారో కనుక్కోగలిగితే ఎంత బాగుండును!' నా కోరిక చిత్తశుద్ధితో కూడినది. కనకనే ఆ సాధువు ఒకనాడు అనుకోకుండా వచ్చారు.

" 'పులుల్ని అణచడం ఇంక చాలు,' ప్రశాంత నిర్భర స్వరంతో అన్నారాయన. 'నాతో రా; మానవ మనస్సనే అడవుల్లో సంచరించే అజ్ఞాన మృగాల్ని అణచడం ఎలాగో నేర్పుతాను. ప్రేక్షకులముందు ప్రదర్శనలివ్వడానికి అలవాటు పడ్డవాడివి; యోగంలో నువ్వు సాధించే ఘనవిజయాల్ని దేవతల ముందు ప్రదర్శించి వాళ్ళకి వినోదం కలిగిద్దువుగాని!'

"ఋషితుల్యులైన ఆ గురువుగారే నన్ను ఆధ్యాత్మిక మార్గంలో ప్రవేశపెట్టారు. చాలాకాలం వాడకం లేక, తుప్పుపట్టి బెట్టుపట్టిన ఆత్మ ద్వారాల్ని తెరిచినవారు ఆయన. నా శిక్షణ నిమిత్తమై త్వరలోనే మే మిద్దరం కలిసి హిమాలయాలకు వెళ్ళిపోయాం."

తుఫానులా సాగిన తమ జీవితాన్ని గురించి మాకు స్థూలంగా చెప్పినందుకు కృతజ్ఞులమై నేనూ, చండీ ఆ స్వామివారి పాదాలకు మొక్కాం. ఆయన దర్శనం కోసం చలిచలిగా ఉండే గదిలో చాలాసేపు కాసుకొని కూర్చున్నందుకు ఫలితం సమృద్ధిగా కలిగిందని నేనూ నా స్నేహితుడూ సంతోషించాం.

అధ్యాయం : 7

# గాలిలో తేలే సాధువు

"ఒక యోగి, భూమికి కొన్ని అడుగుల ఎత్తున గాలిలో తేలడం నిన్న రాత్రి ఒక చిన్న సమావేశంలో చూశాను," అంటూ మా స్నేహితుడు ఉపేంద్ర మోహన్ చౌదరి నాకు గొప్పగా చెప్పాడు.

నేను ఉత్సాహంగా చిరునవ్వు నవ్వాను. "ఆయన పేరు నేను ఊహించ గల ననుకుంటాను. అప్పర్ సర్క్యులర్ రోడ్డులో ఉండే భాదురీ మహాశయులే కదూ?" అని అడిగాను. తాను చెప్పింది నాకు కొత్త సంగతి కాదని తేలి పోవడంతో కొద్దిగా దిగాలుపడుతూ, ఉపేంద్రుడు తల ఊపాడు. సాధువుల గురించి తెలుసు కోడమంటే నాకు ఎంత ఆసక్తి ఉందో మా స్నేహితులకు తెలుసు; ఎప్పటికప్పుడు నన్ను ఒక కొత్తదారి పట్టించడం వాళ్ళకొక సరదా. "ఆ యోగి మా ఇంటికి దగ్గరిలోనే ఉంటారు. ఆయన్ని చూడ్డానికి తరచుగా వెళ్తూనే ఉంటాను." నా మాటలకు ఉపేంద్రుడి ముఖంలో గాఢమైన ఆసక్తి పొడగట్టింది. అప్పుడు నే నింకా చెప్పాను.

"ఆయన అద్భుతమైన యోగక్రియలు చెయ్యడం చూశాను. అష్టాంగ యోగంలో పతంజలి* చెప్పిన రకరకాల ప్రాణాయామాల్ని† ఆయన గొప్పగా సాధన చేశారు. నేనక్కడ ఉండగా ఒకసారి భాదురీ మహాశయులు భస్త్రిక ప్రాణాయామం ఎంత జోరుగా చేశారంటే, గదిలో నిజంగా తుఫాను వచ్చినట్టు అనిపించింది. ఆ తరవాత, ఉరిమే శ్వాసని పూర్తిగా ఆపుచేసి ఉన్నతమైన అధిచేతన‡ స్థితిలో నిశ్చలంగా ఉండిపోయారు. ఆ (శ్వాస) తుఫాను తరవాత వచ్చిన ప్రశాంతత నా మనస్సుపై చెరగని ముద్ర వేసింది."

---

* ప్రాచీన యోగశాస్త్ర వ్యాఖ్యాతల్లో ప్రథముడు.

† శ్వాసను క్రమబద్ధం చేసి ప్రాణశక్తిని అదుపులోకి తెచ్చుకొనే పద్ధతులు. భస్త్రిక ప్రాణాయామం మనస్సును నిలకడగా ఉంచుతుంది.

‡ ఫ్రెంచి మనోవిజ్ఞాన శాస్త్రవేత్తలు పరిశోధనలు జరిపి అధిచేతనను గుర్తించారని సోర్బన్‌లో

"ఆ సాధువు, ఇల్లు విడిచి ఎన్నడూ బయటికి వెళ్ళరని విన్నాను." ఉపేంద్రుడి కంఠంలో కొద్దిగా అపనమ్మకం ధ్వనించింది.

"ముమ్మాటికీ నిజం"! గత ఇరవై ఏళ్ళుగా ఆయన ఇల్లు విడిచి బయటికి రాలేదు. మన పర్వదినాల్లో మాత్రం ఆయన, తమకు తాము పెట్టుకొన్న నియమాన్ని కొద్దిగా సడలించి, గుమ్మం దాటి వీధి దాకా మాత్రం వెళ్తారు! భాదురి మహాశయులు జాలిగుండె కలవారని అందరికి తెలుసు కనక ముష్టివాళ్ళు ఆయన గుమ్మం దగ్గరికి చేరుతూంటారు.

"గురుత్వాకర్షణ శక్తిని ఉల్లంఘించి, గాలిలో ఎలా ఉంటారాయన?"

"నిర్ణీతమైన కొన్ని రకాల ప్రాణాయామాలు చేస్తే, యోగి శరీరానికి స్థూలత్వం పోతుంది. అప్పుడది పైకయినా లేస్తుంది, కప్ప మాదిరిగా కుప్పించి ఎగురుతూ నయినా ఉంటుంది. విధాయకమైన యోగాభ్యాసం చెయ్యని సాధువులు కూడా, గాఢమైన భక్తి పారవశ్య స్థితిలో ఉన్నప్పుడు అలా గాలిలో తేలుతూ ఉంటారని వింటాం."

"ఈయన్ని గురించి ఇంకా తెలుసుకోవాలని ఉంది నాకు. సాయం సమయాల్లో ఆయన జరిపే సమావేశాలకు వెళ్తూ ఉంటావా?" ఉపేంద్రుడి కళ్ళు ఆసక్తితో మిలమిల మెరుస్తున్నాయి.

---

ఉండే ప్రొఫెసర్ జూలే బోయా 1928లో చెప్పాడు. అత్యద్భుతమైన ఈ అధిచేతన, "ఫ్రాయిడ్ భావించిన అవచేతన మనస్సుకు సరిగా వ్యతిరేకమైనది; మానవుణ్ణి కేవలం ఉన్నతజాతి జంతువుగా కాకుండా నిజంగా మానవుడిగా చేసే శక్తులు దీంట్లో ఉన్నాయి," అనికూడా ఆయన అన్నాడు. "ఉన్నతమైన చేతన జాగృతం కావడం అంటే, కుయేయిజం (మనో విశ్లేషణ పరమైన చికిత్సా విధానం) అని కాని, సమ్మోహన శక్తి అని కాని అనుకోగూడదు," అని ఆ ఫ్రెంచి శాస్త్రవేత్త వివరించాడు. అధిచేతన మనస్సు ఉనికిని తాత్త్వికంగా చాలాకాలం కిందటే గుర్తించారు; నిజానికి ఎమర్సన్ 'ఓవర్-సోల్' అని చెప్పింది దీన్ని ఉద్దేశించే; కాని దీన్ని శాస్త్రీయంగా గుర్తించింది మాత్రం మొన్న మొన్ననే. పే. 163 అధోజ్ఞాపిక చూడండి.

"ది ఓవర్ - సోల్" లో ఎమర్సన్ ఇలా రాశాడు : "మనిషి జ్ఞానమంతా, ఉత్తమత్వమంతా నెలకొని ఉండే ఆలయానికి ముఖతలం వంటివాడు. తింటూ, తాగుతూ, మొక్కలు నాటుతూ, లెక్కలు వేస్తూ ఉండే, మనకు తెలిసిన మామూలు మనిషినే మనం సామాన్యంగా మనిషి అని అంటూ ఉంటాం. కాని అతడు తనను తాను సరిగా వ్యక్తపరచుకోలేడు సరికదా, తప్పుగా వ్యక్తపరచుకుంటాడు. అతణ్ణి మనం గౌరవించం; ఏ ఆత్మకైతే అతడు అంగభూతుడో ఆ ఆత్మను గనుక అతడు తన చేతల ద్వారా వ్యక్తపరిస్తే, మనం అతని ముందు మోకరిల్లుతాం... . మనలో ఒక పార్శ్వం గాఢమైన ఆధ్యాత్మికతనూ, భగవంతుని సకల గుణాలనూ అందుకునే అవకాశం కలిగి ఉంటుంది."

"ఆ, తరుచు వెళ్తూనే ఉంటాను. ఆయన జ్ఞానంలోని చమత్కారం నాకు చాలా ఉల్లాసం కలిగిస్తూ ఉంటుంది. అప్పుడప్పుడు నేను అదే పనిగా నవ్వుతూ ఉండడం వల్ల, సమావేశాల్లో గాంభీర్యం సడలిపోతూ ఉంటుంది. అందుకు ఆయనయితే ఏమీ అనుకోరు కాని, శిష్యులు మాత్రం కొరకొరా చూస్తుంటారు!"

ఆ రోజు మధ్యాహ్నం, బడినుంచి ఇంటికి వెళ్తూ, భాదురీ మహాశయుల మఠం మీదగా వెళ్తూ, ఆయన్ని ఒకసారి కలుసుకోవాలని నిశ్చయించుకున్నాను. ఆ యోగిగారు, మామూలు జనానికి అందుబాటులో లేరు. కింది అంతస్తులో ఒక శిష్యుడు కూర్చుని, గురువుగారి ఏకాంతానికి భంగం కలక్కుండా కాపలా కాస్తున్నాడు. ఆ శిష్యుడిలో చండశాసనుడి అంశ కొంచెం ఉంది; ఆయన్ని కలుసుకోడానికి ముందుగా అనుమతి తీసుకున్నావా, లేదా అని అడిగాడు. అతగాడు నన్ను బయటికి నెట్టేసే ప్రమాదం తప్పించడానికా అన్నట్టు, అతని గురువుగారే సరిగా సమయానికి అక్కడికి వచ్చారు.

"ముకుందుడు ఎప్పుడు రావాలనుకుంటే అప్పుడు రానియ్యి," ఆ సాధువు కళ్ళు మెరిసాయి. "నా ఏకాంతవాస నియమం నా సౌకర్యం కోసం ఏర్పాటు చేసుకున్నది కాదు. లౌకిక జీవులకు, తమకున్న భ్రమల్ని పటాపంచలు చేసే నిష్కాపట్యం వచ్చదు. సాధువులు అరుదుగా ఉండడమే కాకుండా, మన అంచనాలని తలకిందులు చేసేవాళ్ళుగా కూడా ఉంటారు. పవిత్ర గ్రంథాల్లో కూడా వాళ్ళగురించి రాసింది తరచు చాలా ఇబ్బంది పెడుతూ ఉంటుంది!"

నేను భాదురీ మహాశయుల వెనక, పై అంతస్తులో ఉన్న ఆయన నివాస భాగానికి వెళ్ళాను. అది ఎంతో నిరాడంబరంగా ఉంది. ఆయన అక్కణ్ణించి కదలడమన్నది చాలా అరుదు. తాము యుగాల కేంద్ర స్థానంలో కుదురుకునే దాకా మహాయోగులు (సాధు పుంగవులు), బయటి ప్రపంచపు గొడవని అంతగా పట్టించుకోరు. ప్రపంచపు గొడవ ఎప్పుడూ అస్తవ్యస్తమే. ఒక మునికి, సంకుచితమైన వర్తమాన కాలంలో జీవించే వాళ్ళు మాత్రమే సమకాలికులని అనుకోడానికి వీలులేదు.

"మహర్షీ, నేను ఎరిగిన వాళ్ళలో, ఎప్పుడూ ఇంట్లోనే ఉండే మొట్టమొదటి యోగి మీరేనండి."

"భగవంతుడు తన సాధువుల్ని ఒక్కొక్కప్పుడు, ఎవరూ ఊహించని చోట పుట్టిస్తాడు; లేకపోతే మనం ఆయన్ని ఒక నియమానికి పరిమితం చేసే సాహసం చేస్తామని!"

ఆ సాధువు, చైతన్యంతో స్పందించే తమ దేహాన్ని పద్మాసనం వేసి బిగించారు. డెబ్బయ్యో పడిలో పడ్డ ఆయనలో, వయస్సు పైబడ్డం వల్ల కాని ఎప్పుడూ కూర్చునే ఉండడంవల్ల కాని మామూలుగా కనిపించే అప్రియమైన చిహ్నాలేవీ కనబడవు. దృఢంగా, నిటారుగా ఉండే దేహం ఆయనది. ప్రతి విషయం లోనూ ఆయన ఆదర్శమూర్తి. సనాతన గ్రంథాల్లో వర్ణించిన మాదిరిగా, ఆయన ముఖం ఋషినే తలపిస్తుంది. ఉన్నతమైన శిరస్సుతో, ఒత్తుగా పెరిగిన గడ్డంతో ఆయన, ఎప్పుడూవెన్ను దృఢంగా, నిటారుగా నిలిపి ఆసీనులయేవారు; ప్రశాంతమైన ఆయన నేత్రాలు సర్వాంతర్యామి మీదే నిలిచి ఉండేవి.

ఆ స్వామివారూ, నేనూ ధ్యానస్థితిలోకి వెళ్ళాం. ఒక గంట తరవాత ఆయన మృదుస్వరానికి నాకు స్పృహ వచ్చింది.

"నువ్వు తరచుగా మౌనంలోకి వెళ్తూ ఉంటావు. కాని అనుభవం* సంపాదించావా?" ధ్యానం కన్న భగవంతుణ్ణే ఎక్కువగా ప్రేమించాలన్న విషయం ఆయన నాకు గుర్తు చేశారు. "ప్రక్రియే లక్ష్యమనుకుని పొరపాటు పడకు."

ఆయన నాకు కొన్ని మామిడిపళ్ళు పెట్టారు: ఆయన గంభీర స్వభావంలోనే నాకు ఆహ్లాదకరంగా కనిపించే హాస్యప్రియత్వం ఉంది. ఆ ధోరణిలో ఆయన ఇలా అన్నారు : "జనానికి సాధారణంగా, ధ్యాన యోగం (భగవంతుడితో కలయిక) కంటె జలయోగం (తిండి తినడం) అంటేనే ఇష్టం."

యోగపరంగా ఆయన ప్రయోగించిన శ్లేషకు నేను విరగబడి నవ్వాను.

"ఎంత బాగా నవ్వుతావో!" అన్నారు. ప్రేమతో కూడిన వెలుగు ఆయన చూపులో తళుక్కుమంది. ఆయన ముఖమయితే ఎప్పుడూ గంభీరంగా ఉంటుంది; కాని ఆనంద పారవశ్యంతో కూడిన చిరునవ్వు ఒకటి దాంట్లో రవ్వంత పొడగడుతూ ఉంటుంది. సువిశాలమైన ఆయన నేత్ర పద్మాల్లో దివ్యహాసం దాక్కొని ఉంటుంది.

"ఆ ఉత్తరాలు, ఎక్కడో దూరంగా ఉన్న అమెరికా నుంచి వచ్చాయి," బల్లమీద ఉన్న కొన్ని లావుపాటి కవర్లను చూపిస్తూ అన్నారాయన. "యోగం మీద ఆసక్తి గల సభ్యులున్న కొన్ని సంఘాలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ ఉంటాను. కొలంబస్ కన్న ఉత్తమమైన దిగ్దర్శన జ్ఞానమున్న ఆ సభ్యులు, భారత దేశాన్ని కొత్తగా కనుక్కొంటున్నారు! వాళ్ళకి సాయం చెయ్యడం నాకు సంతోష

---

* భగవంతుణ్ణి యథార్థంగా దర్శించడం.

కరమైన విషయం. పగటి వెల్తురు లాగే, యోగశాస్త్ర జ్ఞానం కూడా, పొందదలిచిన వాళ్ళందరికీ ఉచితంగా లభిస్తుంది.

"మానవులు మోక్షం పొందడానికి సారభూతమైనదిగా ఋషులు దర్శించిన దాన్ని పాశ్చాత్యుల కోసం పలచన చెయ్యనక్కరలేదు. బాహ్యానుభవం వేరయినా ఆత్మ మట్టుకు ఒకే తీరుగా ఉన్న పాశ్చాత్యులు కాని, ప్రాచ్యదేశాలవాళ్ళు కాని క్రమశిక్షణతో కూడిన ఏదో ఒక యోగ పద్ధతిని అభ్యాసం చెయ్యకపోతే బాగు పడరు."

ఆ సాధువు ప్రశాంతమైన తమ చూపును నా మీద నిలిపారు. ఆయన మాటల్లో, భవిష్యత్తును సూచించే అస్పష్టమైన ఉపదేశం ఉందన్న సంగతి నేను అప్పుడు గ్రహించలేదు. ఎప్పుడో ఒకనాడు నేను భారతదేశపు దివ్య బోధనలను అమెరికాకు తీసుకు వెళ్తానని, తరచుగా మాట వరసకు చేసే సూచనలకు పూర్తి అర్థం, ఇప్పుడే - ఈ మాటలు రాస్తూ ఉన్నప్పుడే తెలుస్తోంది.

"మహాఋషీ ప్రపంచానికి లాభం కలగడానికి, యోగశాస్త్రాన్ని గురించి మీరొక పుస్తకం రాస్తే బాగుండు ననిపిస్తోంది."

"నేను శిష్యుల్ని తయారుచేస్తున్నాను. వాళ్ళూ వాళ్ళ శిష్యపరంపరా, సజీవ గ్రంథాలుగా పనికి వస్తారు. కాల ప్రభావాన జరిగే సహజ విచ్ఛిత్తులకూ, విమర్శకుల అసహజ వ్యాఖ్యానాలకు బలికాకుండా నిలిచే గ్రంథాలు వారే."

సాయంకాలం ఆయన శిష్యులు వచ్చేవరకు ఆ యోగి దగ్గర నేను ఒక్కణ్ణే ఉన్నాను. భాదురీ మహాశయులు ప్రసంగం ప్రారంభించారు; ఆయన ప్రసంగాలు సాటిలేనివి. వినేవాళ్ళ మనస్సుల్లో ఉండే చెత్తనంతా తుడిచిపెట్టేసి దేవుడి వేపు తేలుతూ పోయేటట్టు చేసే ప్రశాంతమైన వరద వెల్లువ మాదిరిగా ప్రసంగించా రాయన. ఆయన స్వచ్ఛమైన బెంగాలీలో, మనస్సుకు హత్తుకుపోయే నీతికథలు చెప్పారు.

ఈ సాయంత్రం భాదురీ మహాశయులు, మీరాబాయి జీవితానికి సంబం ధించిన వివిధ తాత్త్విక విషయాల్ని వివరించారు. మీరాబాయి మధ్య యుగంలో జీవించిన రాజపుటానీ రాజకుమారి; సాధుసజ్జన సాంగత్యం కోసం ఈమె రాజభోగాల్ని కూడా విడిచిపెట్టేసింది. సనాతన గోస్వామి అనే గొప్ప సన్యాసి ఒకాయన, ఈమె ఆడది కాబట్టి దర్శనమివ్వడానికి నిరాకరించాడు. దానికి ఈమె ఇచ్చిన జవాబుతో ఆయనే తలవంచుకొని ఈమె పాదాల దగ్గరికి రావలసి వచ్చింది.

"మీ స్వాములవారికి చెప్పండి," అన్న దామె, "ఈ విశ్వంలో దేవుడు తప్ప మరో మగవాడెవరూ ఉన్నట్టు నాకు తెలియదు; ఆయన ముందు మన మందరం ఆడవాళ్ళం కామా?" (ఏకైక సృష్టికర్త దేవుడేననీ, ఆయన సృష్టి అంతా స్తబ్ధమైన మాయ తప్ప మరేమీ కాదనీ పవిత్ర గ్రంథాలు వెల్లడించే భావన).

మీరాబాయి ఆనంద పారవశ్యంతో అనేక కీర్తనలు కట్టింది; వాటిని ఈనాటికీ భారత దేశంలో పదిలపరుచుకుంటారు. వాటిలో ఒకటి కింద అనువదిస్తాను:

"ప్రతినిత్యం స్నానంచేస్తేనే దేవుడు సాక్షాత్కరించేటట్టయితే
వెంటనే నేను తిమింగలాన్నవుతాను, అఖాతంలో;
దుంపలూ పళ్ళూ తిన్నంత మాత్రాన తెలిసేటట్టయితే ఆయన,
నేను మేకజన్మ ఎత్తితేనే బాగుండు ననుకుంటాను;
జపమాల తిప్పితేనే ఆయన బయటపడతాడంటే
పెద్ద పూసల మాలతోనే జపాలు చేస్తాను;
రాతిబొమ్మలకు మొక్కడంవల్లనే ఆయన తెరమరుగు విడుస్తాడంటే
పాషాణమయమైన పర్వతాన్నే పూజిస్తాను సవినయంగా;
పాలు తాగితేనే ఆయన్ని ఒంటబట్టించుకోవచ్చునంటే
ఎన్నో పాడిదూడలకూ పసిపిల్లలకూ ఆయనీపాటికి తెలిసిపోయే ఉండాలి;
సతిని విడిచిన మాత్రాన దేవుడికి పిలుపందుతుందంటే
వేలకొద్దీ జనం నపుంసకులయిపోరా మరి?
మీరాబాయికి తెలుసు, దేవుణ్ణి కనుక్కోడానికి
తప్పకుండా ఉండవలసింది, ప్రేమ ఒక్కటేనని."

భాదురీ మహాశయులు యోగాసనంలో కూర్చుని ఉండగా, చాలా మంది విద్యార్థులు, ఆయన పక్కన ఉన్న పాంకోళ్ళలో రూపాయలు పెట్టారు. భారత దేశంలో సంప్రదాయ ప్రకారంగా భక్తితో ఇలా సమర్పించడమన్నది, శిష్యుడు తన భౌతిక సంపత్తిని గురువుగారి పాదాలముందు అర్పిస్తాడన్న దానికి సూచన.

కృతజ్ఞత చూపే స్నేహితులెవరంటే, తన వారి అవసరాలు చూసుకునేందుకు మారువేషం ధరించిన భగవంతుడే!

"స్వామీ, మీరు అద్భుతమైనవారు!" ఒక శిష్యుడు ఈ ఋషి పుంగవుల దగ్గర సెలవు తీసుకుంటూ భక్తిపూర్వకంగా అన్నాడు. "భగవంతుణ్ణి అన్వేషించడం కోసం, మాకు జ్ఞానోపదేశం చెయ్యడం కోసం మీరు సంపదలూ సౌఖ్యాలూ అన్నీ త్యాగం చేసేశారు!" భాదురీ మహాశయులు చిన్నతనంలో, ఏకైక లక్ష్యంతో యోగమార్గంలోకి ప్రవేశించేటప్పుడు, పెద్దలిచ్చిన గొప్ప సంపదను విడిచిపెట్టేశారన్నది లోకప్రసిద్ధం.

"విషయాన్ని తారుమారు చేస్తున్నావు నువ్వు!" ఆ యోగి ముఖంలో మెత్తటి మందలింపు ఉంది. "నేను అనంతమైన ఆనందంతో కూడిన విశ్వసామ్రాజ్యం కోసం పనికిమాలిన రూపాయలూ, కొన్ని చిల్లరమల్లర సుఖాలూ మట్టుకే విడిచి పెట్టేశాను. అటువంటప్పుడు నేను, నా కేమీ లేకుండా చేసుకోడమేమిటి? ఒక గొప్ప నిధిని ఇతరులతో పంచుకోడంలో ఉన్న ఆనందం నాకు తెలుసు. అది కూడా ఒక త్యాగమేనా? కురచ చూపుగల లోకులే నిజమైన త్యాగపురుషులు! ఒక గుప్పెడు ప్రాపంచికమైన ఆటబొమ్మల కోసం, అనమానమైన దివ్య సంపదల్ని త్యాగం చేస్తున్నారు!"

త్యాగాన్ని గురించిన ఈ విరోధాభాస దృష్టికి నాలో నేను నవ్వుకున్నాను - గర్విష్ఠులైన కోటీశ్వరులను అనుకోని త్యాగపురుషులుగా మార్చేసి, సాధువయిన ఏ బిచ్చగాడి నెత్తినయినా కుబేర కిరీటం పెట్టేటట్టుగా ఉందిది.

"భగవంతుడు ఏర్పరిచిన జీవిత క్రమం, బీమా కంపెనీ కంటె కూడా తెలివిగా మన భవిష్యత్తును అమిర్చి ఉంచుతుంది," స్వామివారు పలికిన తుది పలుకులు, తమ విశ్వాసాన్ని స్వయంగా అనుభవసిద్ధం చేసుకొన్న మీదట వెలువడినవి. "ఈ ప్రపంచం, బయట భద్రత ఉండి లోపల అశాంతి అలుము కొన్న విశ్వాస పరులతో నిండి ఉంది. కటువుగా ఉండేవాళ్ళ ఆలోచనలు వాళ్ళ నుదుటి మీది మచ్చల్లాటివి. తొలిసారిగా ఊపిరి ఆడినప్పటినుంచి మనకు గాలీ పాలూ కల్పించినవాడికి, తన భక్తులకు ఏ రోజుకు కావలసినవి ఆ రోజు అమర్చి పెట్టడం ఎల్లాగో తెలుసు."

బడి విడిచిపెట్టిన తరవాత ఆ సాధువుగారి దర్శనానికి వెళ్ళడం కొనసాగి స్తూనే వచ్చాను. నేను 'అనుభవం' సంపాదించడంలో ఆయనెంతో ఉత్సాహంతో విశ్వబ్ధంగా తోడ్పడ్డారు. ఒకనాడు ఆయన రామ మోహన్ రాయ్ రోడ్డుకు మకాం మార్చేశారు. అది మా ఇంటి పరిసరాలకి చాలా దూరం. ఆయన మీద అభిమానం

గల శిష్యులొకాయన. 'నగేంద్ర మఠం'* అన్న పేరుతో ఆయనకోసం ఒక ఆశ్రమం కట్టించారు.

నా ఆత్మకథని అనేక సంవత్సరాలు ముందుకి తీసుకు పోయేదయి నప్పటికీ, భాదురీ మహాశయులు నాతో అన్న చివరి మాటలు గురించి ఇక్కడ చెప్పాలి. నేను పాశ్చాత్య దేశాలకు బయలుదేరడానికి కొద్దిగా ముందు, ఆయనను కలిసి వీడ్కోలు దీవెనల కోసం ఆయన ముందు మోకరిల్లాను.

"నాయనా, అమెరికా వెళ్ళు. సనాతన భారతదేశం ఘనతని నీకు కవచంగా తీసుకువెళ్ళు. విజయం నీ నుదుట రాసి ఉంది. దూరదేశాల సజ్జనులు నిన్ను బాగా ఆదరిస్తారు."

---

* ఆయన పూర్తిపేరు నగేంద్రనాథ్ భాదురీ.

క్రైస్తవ ప్రపంచంలోని, "గాలిలో తేలే యోగు"ల్లో, 17-శతాబ్ది నాటి కూపర్టినోలోని సెంట్ జోసెఫ్ ఒకడు. ఆయన చేసిన యోగక్రియలను కళ్ళారా చూసి చెప్పినవాళ్ళు దండిగా ఉన్నారు సెంట్ జోసెఫ్ మతిమరుపుమనిషిగా పైకి కనిపించేవాడు : కాని ఆ మతిమరుపు నిజానికి దివ్యస్మరణ తోటి ఆశ్రమవాసులు ఆయన్ని అందరితోబాటు కలిసి ఒకే బల్లదగ్గర భోజనానికి కూర్చోనిచ్చేవారు కాదు ; పింగాణీ పళ్ళాలతో సహా ఆయన గాలిలో పైకెప్పుడాకా తేలిపోతాడని. ఈ సాధువు, ఎక్కువసేపు ఎప్పుడూ భూమి మీద ఉండలేకపోవడంవల్ల ప్రాపంచిక విధులు నిర్వర్తించడానికి అనర్హుడయిన ఏకైక వ్యక్తి అన్నది నిజం : ఒక పవిత్ర విగ్రహం కంటబడితే చాలు, సెంట్ జోసెఫ్ గాలిలో నిటారుగా తేలిపోవడం తరచు జరుగుతుండేది : ఇద్దరు సాధువులు, ఒకరు శిలారూపం లోనూ మరొకరు రక్తమాంసాలతోనూ, గాలిలో పైన, కలిసి గుండ్రంగా తిరుగుతూ కనిపించేవాళ్ళట.

మహోన్నతాత్మురాలు - ఆవిలాలో ఉండే సెంట్ తెరిసాకు శరీరం, పైకి తేలిపోవడం చాలా ఇబ్బందిగా ఉండేదట. సంస్థాపరమైన కార్యభారాలు నిర్వర్తించ వలసి ఉన్నందువల్ల గాలిలో "పైకి తేల్చే" అనుభవాలు రాకుండా ఉండడానికి విఫలప్రయత్నాలు చేసింది "కాని ప్రభువు మరో విధంగా చేయదలచినప్పుడు చిన్నచిన్న జాగ్రత్తలు నిష్ఫలమయేవి." అని రాసిందామె సెంట్ తెరిసా భౌతికకాయం, స్పెయిన్‌లోని ఆల్బా అనే ఊళ్ళో చర్చిలో ఉంది. ఇది నాలుగు శతాబ్దాలుగా చెక్కుచెదరకుండా ఉంది : దీనికి తోడు పూలవాసనలు కూడా గుబాళిస్తూ ఉంటాయి. ఈ స్థలంలో లెక్కలేనన్ని అలౌకిక ఘటనలు సంభవించాయి.

అధ్యాయం : 8

# భారత దేశపు గొప్ప శాస్త్రవేత్త, జగదీశ్ చంద్ర బోసు

"జగదీశ్‌చంద్ర బోసు కనిపెట్టిన నిస్తంత్రీ పరికరాలు మార్కొనీ వాటికంటె ముందటివే."

రెచ్చగొట్టేటట్టున్న ఈ వ్యాఖ్యానం చెవిని పడగానే, దారి పక్కన నిలబడి శాస్త్ర చర్చ జరుపుతున్న ఆచార్యుల బృందానికి దగ్గరగా వెళ్ళాను. వాళ్ళతో కలవడానికి నాలో కలిగిన ప్రేరణ జాతి దురహంకారమే అయితే దానికి నేను విచారించవలసిందే. కాని కేవలం అధిభౌతికశాస్త్రంలోనే కాకుండా భౌతికశాస్త్ర రంగంలో కూడా భారతదేశం ప్రముఖ పాత్ర వహించగలదన్న విషయానికి సాక్ష్యం ఉందంటే, దాని మీద నాకు గాఢమైన ఆసక్తి లేదని చెప్పలేను.

"అంటే మీ అభిప్రాయం ఏమిటండీ?"

ప్రొఫెసరుగారు నా కోరిక మన్నించి ఇలా వివరించారు: "నిస్తంత్రీ సంయోజకాన్నీ, విద్యుత్ తరంగాల వక్రీభవన సూచక పరికరాన్నీ మొట్టమొదట కనిపెట్టిన వాడు జగదీశ్ చంద్రబోసు. కాని ఈ భారతీయ శాస్త్రవేత్త, తాను కనిపెట్టినవాటి మీద వ్యాపారంచేసి డబ్బు గడించడానికి పూనుకోలేదు. త్వరలోనే ఆయన, నిర్జీవ ప్రపంచం మీంచి సజీవ ప్రపంచం మీదికి దృష్టి మళ్ళించారు. వృక్షశరీరధర్మ శాస్త్రజ్ఞుడుగా ఆయన కనిపెట్టిన విప్లవాత్మకమైన విషయాలు భౌతిక శాస్త్రవేత్తగా సాధించిన విప్లవాత్మక విజయాలను మించిపోయాయి."

ఆయనకు నేను మర్యాదగా కృతజ్ఞతలు తెలిపాను. ఆయన ఇంకా ఇలా అన్నారు: "ఈ ప్రఖ్యాత శాస్త్రవేత్త మాతోబాటే ప్రెసిడెన్సీ కళాశాలలో ఆచార్యులుగా పనిచేస్తున్నారు."

మర్నాడు నేను, ఆ ఋషితుల్యుల నివాసానికి వెళ్ళి దర్శించాను. ఆయన ఇల్లు మా ఇంటికి దగ్గరిలోనే ఉంది. చాలా కాలంగా నేను ఆయన్ని దూరంనుంచే

గౌరవభావంతో చూస్తూ ఉండేవాణ్ణి. ఎక్కువగా ఇతరులతో కలవని, గంభీరులైన ఈ వృక్ష శాస్త్రవేత్త నన్ను ఆదరపూర్వకంగా పలకరించారు. ఆయన మంచి రూపసి; దృఢకాయులు, ఏభయ్యో పడిలో ఉన్నారు. జుట్టు ఒత్తుగా ఉంటుంది. నుదురు విశాలం. కలలు కనేవాడి కళ్ళలా, పరధ్యానంగా ఉండే కళ్ళు ఆయనవి. ఆయన కంఠస్వరంలోని నైశిత్యం, ఒక జీవితకాలంలో అలవడిన శాస్త్రీయమైన అలవాటును తెలియజేస్తోంది.

"ఈమధ్యనే నేను, పాశ్చాత్యదేశాల్లో ఉన్న వైజ్ఞానిక సంఘాల్ని సందర్శించే యాత్ర పూర్తి చేసుకొని తిరిగి వచ్చాను. ప్రాణు†లన్నిటిలోనూ ఉన్న అవిభాజ్య మైన ఏకత్వాన్ని ప్రదర్శించే విధంగా నేను కనిపెట్టిన సున్నితమైన పరికరాలపట్ల, ఆ సంఘాల సభ్యులు గాఢమైన ఆసక్తి కనబరిచారు. బోస్ క్రెస్కోగ్రాఫ్‌కు ఉన్నదాన్ని కోటిరెట్లు పెద్దగా చేసి చూపించే బ్రహ్మాండమైన శక్తి ఉంది. సూక్ష్మ దర్శిని అయితే కొన్నివేల రెట్లు మాత్రమే పెద్దగా చేసి చూపిస్తుంది; అయినప్పటికీ అది జీవశాస్త్రాభి వృద్ధికి గొప్పగా తోడ్పడింది. ఈ క్రెస్కోగ్రాపు లెక్కలేనన్ని మార్గాల్ని ఆవిష్కరి స్తుంది."

"మహాశయా, ప్రాక్పశ్చిమ దేశాల స్నేహ సమాగమం త్వరితం చెయ్యడానికి నిరాకారమైన శాస్త్ర హస్తాలతో మీరు అమోఘమైన కృషి చేశారండి," అన్నాను.

"నేను కేంబ్రిడ్జిలో చదువుకున్నాను. సిద్ధాంతాన్నంతనీ సునిశితమైన ప్రయోగాత్మక పునఃపరిశీలనకు గురిచేసే పాశ్చాత్య పద్ధతి ఎంతో హర్షించ దగ్గది! తూర్పు దేశాల వారసత్వంగా నాకు సంక్రమించిన అంతః పరిశీలనా శక్తికి, ఈ అనుభవిక ప్రక్రియ తోడయింది. ఆ రెండూ కలిసి చాలాకాలంగా మూగవోయి ఉన్న ప్రాకృతిక రాజ్యాల మౌనాల్ని తొలగించడానికి నాకు తోడ్పడ్డాయి. మొక్కలకు సున్నితమైన నాడీమండలం ఉందని, అవి భిన్నమైన భావోద్రేకాలకు గురి అవుతూ ఉంటాయని నా క్రెస్కోగ్రాఫ్† తాలూకు వివరణ పట్టికలు, ఎంతో సంశయశీలుడైన వ్యక్తికి కూడా, నిరూపించి చూపిస్తాయి. ప్రేమ, ద్వేషం, ఆనందం, భయం, సంతోషం, బాధ, ఉద్రిక్తత, మైకం, లెక్కలేనన్ని ఇతర ఉత్తేజకాలూ జంతువులన్నిటికీ ఎంత సర్వసామాన్యమైనవో, మొక్కలకు కూడా అంత సర్వసామాన్యమైనవి."

---

* "శాస్త్రం యావత్తూ లోకాతీతమైనది; లేకపోతే అది గతించిపోతుంది. వృక్షశాస్త్రం ఇప్పుడు సరయిన సిద్ధాంతాన్ని సాధిస్తోంది - పరబ్రహ్మ అవతారాలు ఇప్పుడు ప్రకృతి చరిత్రకు సంబంధించిన పార్యాంశాలవుతాయి." -ఎమర్సన్

† Crescere అనే లాటిన్ ధాతువునుంచి వచ్చింది : 'పెంపొందించడం' అని దీనికి అర్థం. ఈ క్రెస్కోగ్రాఫూ ఇతర పరికరాలూ కనిపెట్టినందుకు బోసుకు 1917లో 'సర్' బిరుదు నిచ్చారు.

"ప్రొఫెసరుగారూ! మీరు రంగంలోకి ప్రవేశించకముందు, సృష్టి అంతా ప్రాణంతో స్పందించడమన్నది కేవలం కవుల కల్పన అనిపించేది. వెనక, నాకు తెలిసిన సాధువు ఒకాయన, ఎన్నడూ పువ్వులు కోసేవారు కారు. 'గులాబి పొదకున్న సౌందర్య గర్వాన్ని నేను హరించనా? మొరటుగా చెయ్యి చేసుకుని దాని దర్జాకు భంగం కలిగించనా?' అంటూ సానుభూతి పూర్వకంగా ఆయన పలికిన మాటలు మీ ఆవిష్కరణల ద్వారా అక్షరాలా రుజువయాయి."

"సత్యానికి కవి సన్నిహితుడు; కాని శాస్త్రజ్ఞుడు దాంతో మొరటుగా వ్యవహరిస్తాడు. ఒకనాడు ఎప్పుడయినా నా ప్రయోగశాలకు వచ్చి, క్రెస్కోగ్రాఫుకున్న తిరుగులేని శక్తిని గమనించు."

ఆయన ఆహ్వానాన్ని కృతజ్ఞతతో అందుకొని బయటికి వచ్చాను. తరవాత, ఆ వృక్షశాస్త్రవేత్త ప్రెసిడెన్సీ కాలేజీనించి వెళ్ళిపోయారని, కలకత్తాలో ఒక పరిశోధన కేంద్రం స్థాపించడానికి పథకం వేస్తున్నారని విన్నాను.

బోస్ సంస్థ ప్రారంభించినప్పుడు జరిగిన సమర్పణోత్సవానికి నేను హాజర యాను. ఉత్సాహవంతులైన వందలాది జనం ఆ సంస్థ ఆవరణలో విహరించారు. విజ్ఞానశాస్త్రానికి నూతన నిలయమైన ఈ సంస్థ భవనం కళా నైపుణ్యానికి, ఆధ్యాత్మిక ప్రతీకతకూ ముగ్ధుణ్ణి అయ్యాను. దీని ముఖద్వారం, దూరాన ఎక్కడో కొన్ని శతాబ్దాలుగా పాడుబడి ఉన్న దేవాలయ శిథిలాల్లోంచి తెచ్చినది. ఒక తామర* కొలను వెనక, కాగడా పట్టిన స్త్రీమూర్తి శిల్పం ఉంది. అమరజ్యోతిని ధరించే వ్యక్తిగా స్త్రీపట్ల భారతీయులకున్న గౌరవాన్ని ఇది తెలియ జేస్తుంది. ఒక తోటలో చిన్న దేవాలయం ఉంది. అది భౌతిక విషయాలకు అతీతుడైన నిరాకారుడికి అంకిత మైనది. అందులో విగ్రహమేదీ ప్రతిష్ఠ కాకపోవడం, భగవంతుడి నిరాకారతను సూచిస్తుంది.

ఆ మహోత్సవంలో బోసు ఇచ్చిన ఉపన్యాసం, దైవప్రేరితులైన సనాతన ఋషుల నోటి నుంచి వెలువడ్డట్టుగా ఉంది:

"ఈనాడు నేను ఈ సంస్థను కేవలం ఒక ప్రయోగశాలగా మాత్రమే కాకుండా, ఒక దేవాలయంగా అంకితం చేస్తున్నాను," భక్తి శ్రద్ధాభరితమైన ఆయన గాంభీర్యం, జనంతో కిక్కిరిసి ఉన్న ప్రేక్షక మందిరం మీద, కంటికి కనరాని

---

* తామరపువ్వు భారతదేశంలో సనాతనమైన దైవీసంకేతం; విచ్చుకొంటున్న దీని రేకులు, ఆత్మ వికాసాన్ని సూచిస్తాయి. ఇది పుట్టేది బురదలోనే అయినా స్వచ్ఛమైన సౌందర్యంతో పెరగడం, శుభప్రదమైన ఆధ్యాత్మిక వాగ్దానాన్ని సూచిస్తుంది.

ఆచ్ఛాదనలా భాసించింది. "నా పరిశోధన కృషిలో, నా దారి అనుకోకుండా, భౌతిక శాస్త్రానికీ శరీరధర్మశాస్త్రానికీ మధ్య సరిహద్దు ప్రాంతంలోకి సాగింది. సజీవ జగత్తుకూ నిర్జీవ జగత్తుకూ మధ్య సరిహద్దు రేఖలు మాయమవడమే కాక అవి కలిసిపోయే స్థానాలు బయల్పడటం గమనించి ఆశ్చర్యపోయాను. నిర్జీవ పదార్థం జడేతరంగా, అసంఖ్యాక శక్తుల చర్యకు గురిఅయి సంస్పందిస్తున్నట్లు గోచరించింది.

"లోహాల్నీ, మొక్కనూ, జంతువునూ ఒకే సామాన్య సూత్రం కిందికి తేవడానికి సార్వత్రికమైన ప్రతిచర్య ఒకటి పనిచేస్తున్నట్టు కనిపిస్తుంది. ఇవన్నీ ప్రధానంగా ఒకే విధమైన అలసట, కుంగుదల లక్షణాలను కనబరచడమే కాక, అలసట నుంచి తేరుకోడానికీ పెరుగుదల పొందడానికీ, మరణ సంబంధమైన శాశ్వత జడత్వం వహించడానికీ గల అవకాశాలను కూడా కనబరిచాయి. అత్యద్భుతమైన ఆ సాధారణీకరణంతో ఆశ్చర్యంలో మునిగి, నా ఫలితాల్ని - అంటే, ప్రయోగాల్లో వెల్లడి అయిన ఫలితాల్ని - గొప్ప ఆశాభావంతో రాయల్ సొసైటీ వారి ముందు ఉంచాను. కాని అక్కడికి వచ్చిన శరీరధర్మశాస్త్రవేత్తలు, నేను నా పరిశోధనల్ని, వాళ్ళ సంరక్షణలో ఉన్న రంగంలోకి అక్రమంగా చొరబడనివ్వకుండా, నాకు తప్పకుండా విజయాన్ని చేకూర్చగల భౌతిక శాస్త్రానికే పరిమితం చేసుకోడం మంచిదని సలహా ఇచ్చారు. నేను అనుకోకుండా, అపరిచితమైన కులవ్యవస్థలోకి చొరబడి, దాని మర్యాదకు భంగం కలిగించాను.

"అజ్ఞానాన్ని విశ్వాసంతో కలిపి గందరగోళపరిచే దైవశాస్త్రపరమైన పక్షపాతం కూడా ఒకటి అనుకోకుండా పనిచేస్తోంది. నిరంతర పరిణామశీలమైన సృష్టి రహస్యంతో మనల్ని ఆవరించి ఉన్న భగవంతుడు, ప్రశ్నించి తెలుసుకోవాలన్న కోరిక కూడా మనలో పాదుగొలిపాడన్న విషయాన్ని తరచుగా మరిచిపోతూంటాం. నేను అనేక సంవత్సరాల పాటు ఇతరుల అపార్థానికి గురి అయినమీదట, విజ్ఞాన శాస్త్రాన్ని ఆరాధించే శాస్త్రవేత్తల జీవితం, అంతులేని సంఘర్షణ అని తెలుసుకున్నాను. లాభనష్టాల్నీ జయాపజయాల్నీ ఒక్కటిగానే భావించి, జీవితాన్ని అతడు భక్తిపూర్వకంగా అర్పణచేసుకోవాలి.

"కొంతకాలానికి, ప్రపంచంలో ఉన్న ప్రముఖ వైజ్ఞానిక సంఘాలు నా సిద్ధాంతాల్నీ ఫలితాల్నీ అంగీకరించాయి; విజ్ఞానశాస్త్రానికి భారతీయులు చేసిన దోహదాన్ని గుర్తించాయి. ఏదో స్వల్పమైనది, లేదా గిరిగీసి పెట్టినది, భారతీయమైన మనస్సుకు ఎన్నడయినా తృప్తి నియ్యగలదా? ఈ దేశం, అవిచ్ఛిన్నమైన సజీవ సంప్రదాయంవల్లా, పునరుజ్జీవన శక్తివల్లా లెక్కలేనన్ని మార్పులకు లోనయి మళ్ళీ

సర్దుబాట్లు చేసుకుంది. భారతీయు లెప్పుడూ, పక్కన ఉన్న తాత్కాలిక లాభాల్ని విడిచిపెట్టి జీవితంలో అత్యున్నత ఆదర్శాల్ని అందుకోడానికే - అదికూడా, నిష్క్రియాత్మకమైన త్యాగంద్వారా కాక, సక్రియాత్మకమైన సంఘర్షణ ద్వారా సాధించడానికే - దీక్ష వహిస్తూ వచ్చారు. ఏమీ సాధించకుండా, సంఘర్షణకు నిరాకరించే దుర్బలుడికి త్యాగం చెయ్యడానికి ఏమీ ఉండనే ఉండదు. కష్టించి పనిచేసి జయం పొందినవాడే విజయవంతమైన తన అనుభవ ఫలాల్ని ప్రపంచానికి అందించి దాన్ని సుసంపన్నం చెయ్యగలడు.

"జడపదార్థం చూపించే ప్రతిచర్య గురించి బోస్ ప్రయోగశాలలో ఇప్పటికే జరిగిన కృషీ, మొక్కల జీవితంలో వెల్లడి అయిన అనుకోని కొత్త విషయాలూ భౌతిక శాస్త్రంలోనూ, జంతుశరీరధర్మశాస్త్రంలోనూ వ్యవసాయశాస్త్రంలోనూ చివరికి మనోవిజ్ఞానశాస్త్రంలో సైతం, ఎంతో విస్తృతమైన పరిశోధనరంగాల్ని ఆవిష్కరించింది. ఇంతవరకు పరిష్కరించడానికి వీలుకావనుకున్న సమస్యలన్నిటినీ ఇప్పుడు ప్రయోగాత్మక పరీక్షాపరిధిలోకి తీసుకురావడం జరిగింది.

"అయితే ఘనవిజయమన్నది కఠోరమైన సునిశితత్వం సాధించనిదే చేకూరదు. అందుచేతనే నేను రూపొందించిన అత్యధిక సూక్ష్మగ్రాహక యంత్రాలూ పరికరాలూ ఒక వరసలో పొడుగ్గా, ఈనాడు మందిర ప్రవేశ విభాగంలో మీ ముందు నిలిచి ఉన్నాయి. భ్రాంతి కలిగించే ఆభాసకు వెనక అగోచరంగా ఉండే వాస్తవాన్ని తెలుసుకోడానికి కావలసిన సుదీర్ఘ ప్రయత్నాల్ని గురించి, మానవ పరిమితుల్ని అధిగమించడానికి అవసరమైన అనవరత పరిశ్రమ, పట్టుదల, ప్రతిభలను గురించి తెలుపుతాయవి. భ్రాంతులకు వెనక ఉండే సత్యసూత్రాల్ని బయల్పరచగల నిజమైన ప్రయోగశాల మనస్సు అన్న సంగతి, సృజనాత్మక శాస్త్రవేత్త లందరికీ తెలుసు.

"ఇక్కడ ఇచ్చే ఉపన్యాసాలు కేవలం, ఇతరులు కనిపెట్టి చెప్పిన వాటిని చిలకపలుకుల్లా అప్పగించేటట్టు ఉండవు. ఈ ప్రయోగశాలలో మొట్టమొదటి సారిగా కనుక్కొని, కళ్ళకు కట్టించే కొత్త ఆవిష్కరణల్ని ప్రకటిస్తాయవి. ఈ సంస్థ పక్షాన అప్పుడప్పుడు నియతకాలికంగా వెలువడే ప్రచురణల ద్వారా, భారతీయుల కృషి ప్రపంచానికంతకీ అందుతుంది. అవి ప్రజాసంపద అవుతాయి. పేటెంటు హక్కులు ఏర్పరచుకోడం ఎన్నడూ జరగదు. విజ్ఞానాన్ని వ్యక్తిగత లాభంకోసం మాత్రమే వినియోగించే అపవిత్ర కార్యం మనం ఎన్నడూ చెయ్యకుండా ఉండాలని మన జాతీయ సంస్కృతి ఆదేశిస్తుంది.

"ఈ సంస్థలో సదుపాయాలు, వీలున్నంత వరకు, అన్ని దేశాల నుంచి వచ్చిన కార్యకర్తలకూ అందుబాటులో ఉంటాయని కూడా ఆశిస్తున్నాను. ఈ రూపంలో, నా దేశ సంప్రదాయాల్ని కొనసాగించడానికి నేను ప్రయత్నిస్తున్నాను. ఇరవై ఐదు శతాబ్దాలకు పూర్వమే భారతదేశం ప్రాచీనమైన నలందా, తక్షశిలా విశ్వవిద్యాలయాలలో, ప్రపంచంలో అన్ని ప్రాంతాలనుంచి వచ్చిన విద్యార్థుల్ని చేర్చుకొన్నది.

"విజ్ఞానశాస్త్రమన్నది ప్రాచీ, ప్రతీచీ దేశాలకు వేటికీ పరిమితం కాకుండా సార్వత్రికత విషయంతో అంతర్జాతీయతను సంతరించుకొన్నదైనప్పటికీ కూడా భారతదేశం, మహత్తర కృషి చెయ్యడానికి ప్రత్యేకంగా తగినది.* పైకి పరస్పర విరుద్ధాలుగా కనిపించే యథార్థాల రాశిలో ఒక కొత్త వ్యవస్థను నిరూపించగల భారతీయుల ఉజ్జ్వల కల్పనాశక్తిని ఏకాగ్రత అనే అలవాటు అదుపులో ఉంచుతున్నది. ఈ నిగ్రహమే అపారమైన ఓర్పుతో మనస్సును సత్యాన్వేషణ మీద నిలిపే శక్తిని ప్రసాదిస్తోంది."

ఆ శాస్త్రవేత్త చెప్పే చివరి మాటలు వింటుంటే నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. కాలాన్నీ చారిత్రకుల్నీ కూడా సమానంగా కలవరపెట్టే ఈ "ఓర్పు" భారత దేశానికి మారుపేరు కాదా?

---

* పదార్థం అణుఘటనం వల్ల ఏర్పడిందని ప్రాచీన హిందువులకు బాగా తెలుసు. భారతీయ షడ్దర్శనాల్లో 'వైశేషికం' ఒకటి. ఈ వైశేషిక పదం, సంస్కృతంలో 'విశేషస్' అనే ధాతువు నుంచి వచ్చింది : అంటే "అన్యైక విశిష్టత" అని దీనికి అర్థం. సనాతన వైశేషిక దార్శనికుల్లో ఔలూక్యుడు ప్రముఖుడు. ఈయనకే కణాదుడన్న పేరు కూడా ఉంది. కణాదుడంటే 'కణాల్ని తినేవాడు' అని అర్థం. ఈయన 2800 సంవత్సరాల కిందట జన్మించాడు.

1934 ఏప్రిల్ నెలలో వెలువడిన 'ఈస్ట్-వెస్ట్' పత్రిక సంచికలో తారామాత రాసిన వ్యాసంలో దర్శన సారాంశాన్ని ఈ విధంగా పొందుపరచడం జరిగింది : "ఆధునిక 'అణు వైశేషికం సిద్ధాంతం' విజ్ఞానశాస్త్ర రంగంలో కొత్తగా వేసిన ముందడుగు అని, సాధారణంగా అందరూ భావిస్తూ ఉన్నప్పటికీ, 'అణుభక్షకు'డైన కణాదుడు, దీన్ని చాలా కాలం కిందటే అద్భుతంగా వ్యాఖ్యానించాడు. 'అణుస్' అనే సంస్కృత శబ్దాన్ని ఆంగ్లంలో 'ఆటం' అని చక్కగా అనువదించవచ్చు. గ్రీకు భాషలో దీనికి, 'విడగొట్టరానిది' అని వాచ్యార్థం. క్రీస్తుకు పూర్వం, వైశేషిక దర్శనానికి వెలువడ్డ ఇతర శాస్త్రీయ వ్యాఖ్యల్లో కింద పేర్కొన్న అంశాల్ని కూడా చేర్చడం జరిగింది : (1) సూదుల్ని అయస్కాంతం ఆకర్షించడం, (2) మొక్కల్లో జలప్రసరణం, (3)జడం, నిర్మాణరహితం అయిన ఆకాశం లేదా ఈథర్, సూక్ష్మశక్తుల్ని ప్రసారం చెయ్యడానికి ఆధారం

పరిశోధన కేంద్రం ప్రారంభోత్సవం జరిగిన నాటి తరవాత, త్వరలోనే మళ్ళీ వెళ్ళాను నేను. ఆ మహాశాస్త్రవేత్త, తామిచ్చిన మాట గుర్తుంచుకొని, నన్ను, ప్రశాంతమైన తమ ప్రయోగశాలకు తీసుకువెళ్ళారు.

"ఈ ఫెర్న్ మొక్కకు క్రెస్కోగ్రాఫు తగిలిస్తాను; దీని వర్ధక శక్తి బ్రహ్మాండంగా ఉంటుంది. ఇదే అనుపాతంలో నత్తనడకను కనక పెంచి చూస్తే, ఆ పురుగు ఎక్స్‌ప్రెస్ బండిలా ప్రయాణం చేస్తున్నట్టు కనిపిస్తుంది."

పెద్దగా కనిపించేటట్టు పెంచిన ఫెర్న్ మొక్క నీడ పడుతున్న తెరమీద చూపు నిలిపి ఉంచాను. సూక్ష్మమైన జీవన చలనాలు ఇప్పుడు స్పష్టంగా కనిపిస్తున్నాయి. సమ్మోహితమైన నా కళ్ళముందే ఆ మొక్క, మెల్ల మెల్లగా పెరుగుతోంది. బోసు మహాశయులు, ఒక చిన్న లోహపు కడ్డీతో ఆ ఫెర్న్ మొక్క కొనను తాకారు. తాకీ తాకడంతోనే, మూకాభినయంలా సాగుతున్న పెరుగుదల చటుక్కున ఆగిపోయింది. కడ్డీ తీసెయ్యగానే, లయబద్ధంగా సాగే పెరుగుదల మళ్ళీ కొన సాగింది.

"బయటి నుంచి ఏ కొద్దిపాటి జోక్యం కలిగినా సరే, సున్నితమైన కణజాలాలకి అది ఎలా హానికరమవుతుందో చూశావు," అన్నారు బోసు మహాశయులు. "ఇదుగో, నే నిప్పుడు మత్తుమందు ఇస్తాను చూడు; ఆ తరవాత దానికి విరుగుడు ఇస్తాను."

మత్తుమందు ఫలితంగా పెరుగుదల అంతా ఆగిపోయింది; విరుగుడు ఇచ్చేసరికి మళ్ళీ మొదలయింది. తెరమీద కనిపిస్తున్న పరిణామాత్మక భంగిమలు

---

కావడం, (4) అన్ని రకాల వేడికీ సౌరాగ్నే కారణం, (5) అణు విపరిణామానికి ఆ వేడే కారణం, (6) భూమి అణువుల్లో ఉండే ఆకర్షణ గుణమే గురుత్వాకర్షణ శక్తికి కారణం; వేటినైనా కిందికి లాక్కొనే శక్తి దీనివల్లే వచ్చింది. (7) అన్ని శక్తులకూ ఉండే చలన స్వభావం; దీనికి మూలకారణం శక్తివ్యయం లేదా చలనం తిరిగి పంపిణీ కావడం, (8) అణు విఘటనం ద్వారా విశ్వప్రళయం, (9) ఉష్ణ కిరణాలూ కాంతికిరణాలూ చాలా చిన్న కణాలుగా ప్రసరించడం; ఈ కణాలు మనం ఊహించలేనంత వేగంతో (ఆధునిక 'విశ్వకిరణ' సిద్ధాంతం) అన్ని వేపులకూ దూసుకుపోతాయి, (10) దేశకాలాల సాపేక్షత.

[7]ప్రపంచోత్పత్తికి మూలం స్వాభావికంగా - అంటే, వాటి తాత్త్విక విశేషతల రీత్యా శాశ్వతమైన అణువులని చెబుతుంది వైశేషిక దర్శనం. ఈ అణువులకు అవిరామమైన స్పందన గతి ఉన్నట్టుగా భావించారు. అణువు చిన్నసైజు సూర్యమండలమన్న సంగతి ఇటీవల కనుక్కొన్నారు కాని, వైశేషిక మీమాంసకులకు అది కొత్త విషయమేమీ కాదు. వీరు కాలాన్ని గణితపరంగా విభజిస్తూ పోయి, ఒక అణువు తన ప్రదేశ పరిమాణం (Unit of Space) లో తాను తిరగడానికి పట్టే సమయాన్ని అన్నిటికంటె తక్కువ కాల పరిమాణం (Unit of time)గా చెప్పారు.

"చలన చిత్ర" కథ కంటె కూడా ఎక్కువగా నన్ను ఆకట్టుకొన్నాయి. బోసు మహాశయులు (ఇక్కడ విలన్ పాత్రధారిగా) ఆ ఫెర్న్ మొక్కకు ఒకచోట, పదునైన పరికరం ఒకటి గుచ్చారు; వెంటనే ఆ మొక్క గిలగిలా కొట్టుకోడంతో ఎంత బాధపడుతోందో తెలిసింది. కాడలో కొంత మేరకు ఆయన కత్తి గుచ్చే సరికి మొక్క విపరీతంగా విలవిల్లాడిపోతున్నట్టు నీడలో కనిపించింది. చివరికి మరణ యాతన ముగిసిపోయి చలనం లేకుండా అయిపోయింది.

"మొదట, ఒక పెద్ద చెట్టుకు మత్తుమందు ఇచ్చి అంటుకట్టి విజయం సాధించాను. మామూలుగా, అటువంటి వనస్పతులు, ఉన్నచోటునించి కదిలించే సరికి తొందరగా చచ్చిపోతాయి," ఆ ప్రాణరక్షణ వ్యూహాన్ని నెమరువేసుకొంటూ సంతోషంగా చిరునవ్వు నవ్వుకొన్నారు జగదీశ్ చంద్రబోసుగారు. "చెట్లకు ఒక (రస) ప్రసరణ వ్యవస్థ ఉందని సున్నితమైన నా పరికరాలు తయారుచేసిన రేఖాపటాలు నిరూపించాయి; వాటిలో ఉండే జీవరస చలనాలు, జంతు శరీరాల్లో రక్త సంచరణానికి సమానమైనవి. ఈ జీవరసం పైకి ఎలా ఎక్కుతుందో, మామూలుగా ఒక దీపపు వత్తిలోకి నూనె ప్రవహించే మాదిరి యాంత్రిక ఆకర్షణ పద్ధతిలో వివరించడం సాధ్యం కాదు. ఈ దృగ్విషయం, సజీవ కణాలు పనిచేసే తీరువల్ల ఏర్పడుతోందని, క్రెస్కోగ్రాపు ద్వారా వెల్లడి అయింది. చెట్టు దిగువ వరకు వ్యాపించి ఉండే స్తూపాకారపు గొట్టం నుంచి సర్పిలాకార తరంగాలు వెలువడతాయి; ఈ గొట్టం నిజంగా గుండెకాయలా పనిచేస్తుంది. లోతుగా చూసిన కొద్దీ, బహురూపాత్మకమైన ప్రకృతిలో ప్రతి ఒక్క రూపమూ, ఏక రూపాత్మకమైన ఒక ప్రణాళికతో ముడిపడి ఉన్నదన్న విషయం స్పష్టంగా సాక్షీభూతమవుతూ ఉంటుంది.

ఈ మహాశాస్త్రవేత్త మరో బోస్ పరికరం వేపు చూపించారు.

"ఒక తగరపు ముక్క మీద ప్రయోగాలు చేసి చూపిస్తానుండు. లోహాల్లో జీవశక్తి, బయటినుంచి కలిగే ప్రేరణలను బట్టి అనుకూలంగా గాని, ప్రతికూలంగా గాని ప్రతిక్రియలు చూపిస్తుంది. సిరా గుర్తులు వివిధ ప్రతిచర్యల్ని నమోదు చేస్తాయి చూడు."

అణుఘటనం తాలూకు స్వాభావిక తరంగాల్ని నమోదుచేసిన గ్రాఫును తదేక దృష్టితో తిలకించాను. ఆ ప్రొఫెసరుగారు తగరానికి మత్తు మందు ఇచ్చి నప్పుడు స్పందనాత్మక లేఖనాలు ఆగిపోయాయి. ఆ లోహం మళ్ళీ మెల్లగా మామూలు స్థితికి వస్తుంటే అవి పునఃప్రారంభమయాయి. ఆయన విషసంబంధ

మైన ఒక రసాయనాన్ని దానికి పూసారు. ఒక పక్క తగరం ముక్క కొన విల విల్లాడుతూ ఉండగా, పట్టికమీదున్న ముల్లు చావుకబురు చల్లగా చెప్పింది. శాస్త్రవేత్త ఇలా అన్నారు:

"కత్తెరలు, యంత్రాలు వంటివాటికి ఉపయోగించే ఉక్కులాంటి లోహాలు అలసటకు గురి అవుతాయనీ, నియతకాలికమైన విశ్రాంతి కనక పొందితే వాటి సామర్థ్యం మళ్ళీ పెరుగుతుందనీ బోస్ పరికరాలు నిరూపించాయి. విద్యుత్ ప్రవాహాలుకాని, భారీ ఒత్తిడికాని కలిగించడం వల్ల లోహాల్లోని జీవనాడికి తీవ్రంగా హాని కలగడమే కాకుండా అది పూర్తిగా అంతరించిపోతుంది."

అలుపులేని బుద్ధికుశలతకు ప్రశంసనీయమైన ప్రమాణంగా గదిలో నాలుగు పక్కలా అమర్చి ఉన్న ఎన్నో రకాల పరికరాలను నేను చూశాను.

"అయ్యా, అద్భుతమైన మీ యంత్రసామగ్రిని పూర్తిగా వినియోగించుకొని భారీ వ్యవసాయాన్ని త్వరత్వరగా అభివృద్ధిచెయ్యకపోవడం విచారకరమైన విషయం. మొక్కల పెరుగుదలకు దోహదంచేసే రకరకాల రసాయనిక ఎరువుల ప్రభావాన్ని చూపించడానికి, వాటిలో కొన్నిటి మీద ప్రయోగశాలలో త్వరగా ప్రయోగాలు జరపడం సులభంగా సాధ్యం కాదాండీ?"

"నువ్వు చెప్పింది నిజం. ముందుతరాల వాళ్ళు బోస్ పరికరాల్ని రక రకాలుగా ఉపయోగించుకుంటారు. శాస్త్రవేత్తకు, సమకాలిక పురస్కారం లభించడ మన్నది అరుదు; సృజనాత్మక సేవలో కలిగే ఆనందం ఒక్కటి దక్కితే చాలు."

ఓటమి నెరగని ఆ మునికి మనసారా కృతజ్ఞతలు తెలుపుకొని సెలవు తీసుకున్నాను. "ఆశ్చర్యం కలిగించే ఆ మేధావి అసాధారణ ప్రజ్ఞాపాటవసారం హరించిపోవడమంటూ ఉంటుందా?" అని మనస్సులో అనుకున్నాను.

కాలం గడిచినా అది తరిగిపోలేదు. బోసుగారు, 'రిసొనెంట్ కార్డియోగ్రాఫ్' [స్పందనల లేఖిని] అనే జటిలమైన పరికరాన్ని కనిపెట్టి, భారతదేశంలోని మొక్కల మీద లెక్కలేనన్ని ప్రయోగాలు చేశారు. వీటి పర్యవసానంగా ఉపయోగకరమైన మందులకు సంబంధించి, ఊహించనంత పెద్ద ఔషధ తయారీ పద్ధతి వెల్లడి అయింది. ఒక సెకనులో వందో వంతు కాలాన్ని కూడా గ్రాఫుమీద సూచించే విధంగా, ఒక్క పిసరు కూడా తేడా రానంత కచ్చితంగా పనిచేసే కార్డియోగ్రాఫ్‌ను తయారు చెయ్యడం జరిగింది. మొక్కలకూ జంతువులకూ మానవులకూ శరీర నిర్మాణంలో ఉండే అత్యంత సూక్ష్మమైన నాడీస్పందనల్ని రిసొనెంట్ రికార్డులు లెక్కకడతాయి. తన కార్డియోగ్రాఫ్ ముందుముందు, జంతువుల్ని కాకుండా

మొక్కల్ని కోసి చూడడానికి ఉపయోగపడుతుందని ఆ ప్రసిద్ధ వృక్షశాస్త్రవేత్త జోస్యం చెప్పారు.

"ఒక మొక్కకూ ఒక జంతువుకూ వేసిన మందువల్ల కలిగే ఫలితాల రికార్డింగ్ లను పక్కపక్కన చూసినప్పుడు, అవి అచ్చూమచ్చూ ఒక్కలాగే ఉండడం ఆశ్చర్యం కలిగించింది," అన్నారాయన. "మనిషిలో ఉన్న ప్రతి ఒక్కటీ ముందుగానే మొక్కల్లో కనిపించింది. మొక్కలమీద చేసే పరిశోధన, జంతువులకూ మనుషులకూ కలిగే బాధల్ని తగ్గించడానికి సాయపడుతుంది."

చాలా ఏళ్ళ తరవాత, మొక్కల విషయంలో మొట్టమొదటిసారిగా బోసు కనిపెట్టిన విషయాలు, ఇతర శాస్త్రవేత్తల పరిశోధనల్లో బలపడ్డాయి. 1938లో కొలంబియా విశ్వవిద్యాలయంలో జరిగిన కృషి గురించి 'ద న్యూయార్క్ టైమ్స్' పత్రిక ఇలా రాసింది :

> "నరాలు మెదడునుంచి శరీరంలోని ఇతర భాగాలకు సందేశాలు పంపేటప్పుడు చిన్న చిన్న విద్యుత్ తరంగాలు ఉత్పన్నమవుతాయని, గడిచిన కొన్ని సంవత్సరాల్లో నిర్ధారణ అయింది. ఈ విద్యుత్ తరంగాల్ని సున్నితమైన విద్యున్మాపకాలతో (గాల్వనో మీటర్లతో) గణించి, వాటిని ఆధునిక పరివర్ధక పరికరంతో కొన్ని లక్షల రెట్లవరకు పెంపుచేసి చూపించడం జరిగింది. ఈ విద్యుత్ తరంగాలు గొప్పవేగంతో పోతూ ఉండడంవల్ల, బతికున్న జంతువుల్లో కాని మనిషిలో కాని నాడీతంతువుల గుండా, ఇవి ఎలా సాగుతాయో పరిశీలించడానికి ఇప్పటి దాకా తృప్తికరమైన పద్ధతి ఏదీ కనబడలేదు."
>
> "తరచుగా, బంగారుచేపల తొట్టెల్లో వేసే మంచినీటి నిటెల్లా మొక్క తాలూకు పొడుగాటి ఏకకణాలు, వస్తుతః ఏకనాడీ తంతువుల్ని పోలి ఉంటాయని డా॥ కె. ఎస్. కోల్, హెచ్.జె. కర్టిస్ రాశారు. అంతే కాకుండా, నిటెల్లా తంతువులకు ఉద్రేకం కలిగించినప్పుడు, ఒక్కవేగం విషయంలో తప్ప తక్కినవాటన్నిటిలోనూ అవి, జంతువులోనూ మనిషిలోనూ ఉండే నాడీ తంతువులకు అన్ని విధాలా సమానంగా విద్యుత్ తరంగాల్ని ప్రసరింపజేస్తాయని వారు కనుక్కొన్నారు. మొక్కలో ఏర్పడే, నాడీ సంబంధ మైన విద్యుత్ తరంగాలు జంతువుల్లో ఏర్పడేవాటికన్న చాలా తక్కువ వేగం ఉన్నవని గమనించడం జరిగింది. అందువల్ల కొలంబియా కార్యకర్తలు, నరాల్లోని విద్యుత్ తరంగాల గతిని మంద గొడి చలన చిత్రాలుగా ఫొటోలు తియ్యడానికి, కొత్తగా కనిపెట్టిన ఈ విషయాన్ని ఒక సాధనంగా చేబట్టారు.'
>
> "మనస్సుకూ పదార్థానికీ మధ్య సరిహద్దుకు చాలా దగ్గరగా ఉన్న గుప్త రహస్యాల్ని తెలుసుకోడానికి ఈ నిటెల్లా మొక్క, ఒక రకమైన రొజెట్టా

రాయిలా ఉపకరించవచ్చు." [రొజెట్టా అనే వాడు నెపోలియన్ సేనలో ఒక అధికారి; అతనికి ఈజిప్టులో దొరికిన ఒక రాయిమీద, ఒకే విషయం మూడు లిపుల్లో రాసి ఉంది. దీనివల్ల ప్రాచీన ఈజిప్టు దేశపు లిపుల్ని చదవడానికి వీలయింది].

విశ్వకవి రవీంద్రనాథ్ టాగూరు, ఆదర్శప్రాయుడైన ఈ భారతీయ శాస్త్రవేత్తకు చాలా సన్నిహిత మిత్రుడు. ఈయన్ని సంబోధిస్తూ ఆ వంగదేశపు మధుర గాయకుడు ఇలా గానం చేశాడు*:

"హే తపస్వి డాకో తూమి సామమంత్రే జలదగర్జనే,
"ఉత్తిష్ఠత! నిబోధిత!" డాకో శాస్త్ర అభిమానీజీనే -
పాండిత్యేర్ పండతర్క హతే, సుబృహత్ విశ్వతలే
డాకో మూఢ దాంభికేరే, డాక్ దావ్ తబ్ శిష్యదలే -

---

* బెంగాలీ మూలంలో రవీంద్రనాథ్ టాగూరు రాసిన గీతాన్ని మన్ మోహన్ ఘోష్ ఇంగ్లీషులోకి అనువదించి, శాంతి నికేతనం నుంచి వెలువడే 'ద విశ్వభారతి క్వార్టర్లీ' అనే పత్రికలో ప్రచురించాడు.

టాగూరు తన కవితలో పేర్కొన్న సామమనేది నాలుగు వేదాల్లో ఒకటి. తక్కిన మూడూ: ఋగ్వేదం, యజుర్వేదం, అధర్వవేదం. ఈ పవిత్ర గ్రంథాల్లో, సృష్టికర్త అయిన దేవుణ్ణి బ్రహ్మతత్త్వంగా అభివర్ణించడం జరిగింది. ప్రతి ఒక్క మానవుడిలో, ఈయన్ని జీవాత్మ అంటారు. బ్రహ్మ శబ్దం 'బృహ్' ధాతువునుంచి వచ్చింది. ఈ ధాతువుకు, "విస్తరించడం" అని అర్థం. దివ్యశక్తి దానంతట అది పెరగడం, అంటే సృజనాత్మక కార్యకలాపంలోకి దూకడం అనే వైదికార్థాన్ని తెలియజేస్తుంది ఇది. ఈ విశ్వం, సాలీడు గూడు మాదిరిగా, ఆయన సత్తాలోంచే వివర్తం చెందుతుందని (వికురుతే) చెబుతారు. ఎరుకతో, ఆత్మను బ్రహ్మపదార్థంతో లీనం చేయడం - అంటే జీవాత్మను పరమాత్మతో ఐక్యం చెయ్యడమే - వేదాల మొత్తం సారమని చెప్పవచ్చు.

వేదాల సారసంగ్రహమైన 'వేదాంతం' అనేకమంది పాశ్చాత్య ఆలోచనా పరులకు స్ఫూర్తి నిచ్చింది. ఫ్రెంచి చారిత్రకుడయిన విక్టర్ కూజ్యాఁ (Victor Cousin) ఇలా అంటాడు: "ప్రాచ్య దేశాల తత్త్వశాస్త్ర మహాగ్రంథాల్ని అన్నిటికన్న మిన్నగా, భారతదేశ గ్రంథాల్ని - మనం సావధానంగా చదివినప్పుడు, ప్రాచ్యదేశాల తత్త్వశాస్త్రం ముందు మోకరిల్లకుండానూ, మానవజాతికి తొలికాలపు ఉనికిపట్టయిన ఆ ప్రాంతం, సర్వోత్తమ తత్త్వశాస్త్రానికి కాణాచి అని గమనించకుండానూ ఉండలేనంతటి గాఢమైన... అనేక సత్యాల్ని, వాటిలో మనం కనిపెడతాం." ష్లెగెల్ ఇలా అంటాడు : "గ్రీకు తత్త్వవేత్తలు ప్రతిపాదించిన వివేక ఆదర్శవాదం - యూరోపియన్ల సర్వోన్నత తత్త్వశాస్త్రం - కూడా, ప్రాచ్య ఆదర్శవాదానికున్న జీవిత సమృద్ధిముందూ జీవశక్తిముందూ, మధ్యందిన మార్తాండుడి ముందు మినుకుమినుకు మంటూండే ప్రామీథియన్ విస్ఫులింగంలా కనిపిస్తుంది. (గ్రీకు పురాణ కథల్లో వచ్చే ప్రామిథ్యూస్

ఏకత్రే దాఁ డాక్ తారా తవ హోమహుతాగ్ని ఘిరాయా.
బార్‌బార్ ఏ భారత్ ఆస్నాతే ఆసూక్ ఫిరాయా
నిష్ఠాయ, శ్రద్ధాయ, ధ్యానే - బసూక్ సే అప్రమత్తచిత్తే
లోభహీన ద్వంద్వహీన శుద్ధశాంత గురుర్‌వేదీతే."

[ఓ తపస్వీ, సామవేద మంత్రాల మేఘగంభీర గర్జనతో, "ఉత్తిష్ఠత! నిబోధిత!" అంటూ మేల్కొలుపు. శాస్త్రాభిమానులైన జనాన్ని, కుతర్కాలతో కీచులాడుకొనే పండితుల్ని పిలిచి, వ్యర్థ తర్కాల్ని విడిచిపెట్టమని చెప్పు. ఆ మూఢ దాంభికుల్ని, సువిశాలమైన ప్రపంచంలోకి రావడానికి ప్రేరేపించు. నీ శిష్య బృందాన్ని కూడా ఆహ్వానించు; వాళ్ళు నీ యజ్ఞవేదికకు నలువైపులా ఒకే కట్టుగా నిలవాలి; దాంతో మన భారతదేశం తన సత్యస్వరూపాన్ని తిరిగి పొంది కర్తవ్య నిష్ఠతో, శ్రద్ధతో, ధ్యానంతో అప్రమత్త చిత్తురాలయి లోభహీన, ద్వంద్వహీన, శుద్ధ, శాంత రూపం పొంది విశ్వగురుస్థానాన్ని మళ్ళీ అలంకరించాలి].

---

ప్రస్తావన ఉందిక్కడ; ఇతడు మానవ జాతికి సహాయం చెయ్యడం కోసం సూర్యుడి దగ్గర్నించి నిప్పు దొంగిలించుకు వచ్చాడు).

భారతదేశపు అపార సాహిత్యంలో, గ్రంథకర్తృత్వం ఆరోపించి ఉండని గ్రంథాలు వేదాలే ('విద్ ' అనే ధాతువుకు, 'తెలుసుకోడం' అని అర్థం). వేద మంత్రాలు అపౌరుషేయాలనీ (ఋగ్వేదం X, 90, 9), అవి "అతిప్రాచీన కాలం" నుంచి పారం పర్యంగా వస్తున్నవనీ ఉత్తరోత్తరా కొత్త భాషను ధరించాయనీ (iii, 39, 2) ఋగ్వేదం చెబుతోంది. "ద్రష్ట" లయిన ఋషులకు, యుగయుగాంతరాల్లో దైవప్రేరణవల్ల వెల్లడి అయిన ఈ వేదాలకు నిత్యత్వం, అంటే "కాలాబాధితమైన ప్రామాణికత" ఉందని చెబుతారు.

వేదాలు నాదరూపంలో వెలువడి ఋషులకు "నేరుగా వినిపించినవి."(శ్రుతి), అవి ప్రధానంగా, మంత్ర పాఠరూపంలో ఉన్న సాహిత్యం. అందుచేత వేదాల్లో ఉన్న 1,00,000 మంత్రాలూ (రెండేసి పాదాలున్నవి) అనేక వేల సంవత్సరాల పాటు బ్రాహ్మణ పురోహితుల మౌఖిక పఠన పాఠనాల వల్ల పరంపరాగతంగా వచ్చినవేకాని ఎవరో రాసి పెట్టినవి కావు. కాయితమూ రాయీ, ఈ రెండూ కాల గతిలో నశించే అవకాశమున్నవే. ఒకరి దగ్గరి నుంచి మరొకరి దగ్గరికి అందించడానికి, భౌతిక పదార్థం కంటె మనస్సే బాగా తగిన సాధనమని ఋషులు తెలుసుకొన్నారు. కనక, వేదాలు అనేక యుగాలుగా నిలిచి ఉన్నాయి. "హృదయ ఫలకాల్ని" మించగలిగినవి మరేమున్నాయి?

వేద శబ్దాలకున్న ఒక నిర్దిష్టక్రమాన్ని (ఆనుపూర్వి) గమనించి, ధ్వనుల సంయోజనకూ (సంధి) అక్షరాల పరస్పర సంబంధానికి (సనాతన) ఏర్పడిన ధ్వనిశాస్త్ర నియమాల్ని అనుసరించి, కంఠస్థం చేసుకొన్న పాఠాల శుద్ధతను కొన్ని నిష్కృష్ట గణితశాస్త్ర పద్ధతుల్లో నిరూపించి బ్రాహ్మణులు, వేదాల మౌలిక పరిశుద్ధతను అత్యంత ప్రాచీన కాలం నుంచి పరిరక్షిస్తూ వచ్చారు. వైదికశబ్దంలోని ప్రతి అక్షరమూ కూడా విలక్షణత ఉన్నది, ఫలప్రదమైనది. (చూ.పే. 418 అ).

అధ్యాయం : 9

# ఆనందభరిత భక్తుడు, ఆయన విశ్వప్రేమలీల

"చిన్నబాబూ, కూర్చో, నా జగన్మాతతో మాట్లాడుతున్నాను."

అప్పటికే నేను విస్మితుడిగా, భయం భయంగా గదిలోకి ప్రవేశించాను. దివ్యమైన మాస్టర్ మహాశయుల రూపం కళ్ళు మిరుమిట్లు గొలిపేలా ఉంది. పట్టులాంటి తెల్లటి గడ్డంతోనూ మిలమిల మెరిసే విశాల నేత్రాలతోనూ ఆయన పవిత్రత రూపుగట్టిన అవతారమూర్తిలా భాసించారు. పైకెత్తి ఉన్న చుబుకమూ జోడించి ఉన్న చేతులూ చూడగానే, నేనక్కడికి మొదటిసారిగా వస్తూనే ఆయన ధ్యానానికి భంగం కలిగించిన విషయం స్పష్టమయింది.

పరవశమైన మాటలతో కూడిన ఆయన పలకరింపు, నా స్వభావంలో అంత వరకు నాకు అనుభవమయిన వాటన్నిటికంటె అత్యంత తీవ్రమైన ప్రభావం కలిగించింది. మా అమ్మ చనిపోవడంతో, ఎడబాటువల్ల కలిగిన క్షోభ ఒక్కటే నా దుఃఖానికి పరాకాష్ఠగా భావించాను. ఇప్పుడు నాకు, జగన్మాతతో ఎడబాటు కలిగిందే అన్న స్పృహ నా అంతరాత్మకు చెప్పరాని వేదన అయింది. నేను ఏడుస్తూ నేలమీద ఒరిగిపోయాను.

"చిన్నబాబూ, మనస్సు కుదుటపరుచుకో!" అంటూ ఆ సాధువు సాను భూతితో బాధపడ్డారు. మహాసముద్రంలో ఏకాకి అయిపోయినవాడిలా ప్రాణం దక్కించుకోడానికి, వారి పాదాలనే ఒక తెప్పగా భావించి గట్టిగా పట్టేసుకున్నాను.

"మహాత్మా, మీరే నాకు మధ్యవర్తిగా సహాయం చెయ్యాలి! జగన్మాతకు నామీద ఏమైనా అభిమానం ఉందో లేదో అడగండి!"

ఒకరి గురించి తాను కలగజేసుకొని చెబుతాననే పవిత్రమైన వాగ్దానం అంత సులువుగా చేసేదేమీ కాదు. ఆయన మౌనం వహించారు.

మాస్టర్ మహాశయులు జగన్మాతతో చాలా చనువుగా మాట్లాడుతున్నారన్న విషయంలో సందేహానికి తావులేనంత గట్టి నమ్మకం కలిగింది నాకు. ఇప్పుడు ఈ క్షణంలో, ఈ సాధువు నిర్దిష్ట దృష్టికి గోచరమవుతున్న జగన్మాతను నా కళ్ళు చూడలేకపోవడం గాఢమైన అవమానంగా అనిపించింది. మెల్లగా ఆయన మందలిస్తున్నా కూడా వినిపించుకోకుండా నేను పడి ఆయన పాదాలు పట్టుకొని ఆయన, దయతో నా గురించి జగన్మాతను వేడాలని మరీ మరీ వేడుకున్నాను.

"నీ కోరిక జగన్మాతకు విన్నవిస్తాను." మాస్టర్ మహాశయులు దయతో కూడిన చిరునవ్వుతో మెల్లగా జవాబు తెలిపారు.

ఆ కొద్ది మాటల్లో ఎంత శక్తి ఉందని! బంధనంలో ఒక్కసారిగా విడుదలైనట్లు నాకు విముక్తి అనుభూతమయింది.

"మహాశయా! మీ ఇచ్చిన మాట మరిచిపోకండి! అమ్మవారి జవాబుకోసం మళ్ళీ త్వరగానే వస్తాను!" ఒక్క క్షణం క్రితం, కన్నీళ్ళు తెరుచుకు వచ్చిన దుఃఖంతో పూడిపోయిన గొంతులో ఇప్పుడు ఆశావహమైన ఆనందం ధ్వనించింది.

పొడుగాటి మేడమెట్లు దిగుతూ వెనకటి జ్ఞాపకాల్లో మునిగిపోయాను. మాస్టర్ మహాశయుల ప్రస్తుత నివాసం - ఆమ్హెర్స్ట్ వీధిలోని 50 నంబరు ఇల్లు - ఒకప్పుడు మేం ఇంటిల్లిపాదీ ఉన్న ఇల్లు; అమ్మ చనిపోయింది ఇక్కడే. కంటికి దూరమైన అమ్మకోసం నా మానవ హృదయం ఘోషించింది ఇక్కడే. మళ్ళీ ఈనాడు ఇక్కడే, జగన్మాత కనబడనందుకు నా అంతరాత్మ. శిలువ వేసినంత బాధతో విలవిల్లాడిపోయింది. పావనమైన గోడలు! నన్ను బాధించిన గాయాలకీ, చివరి ఉపశమనానికీ మౌనసాక్షులివి.

మా ఇంటికి తిరిగి వెళ్తూ ఉంటే నా అడుగుల వడి పెరిగింది. ఇష్టమైన నా చిన్న గదిలో ఏకాంతంగా, పదిగంటల వరకు ధ్యానంలో ఉండిపోయాను. భారతదేశపు వెచ్చని రాత్రిపూట అలుముకొన్న చీకటిని పటాపంచలు చేస్తూ అద్భుతమైన దృశ్యం ఒకటి హఠాత్తుగా వెలుగొందింది.

వెలుగులు వెదజల్లుతూ జగన్మాత నా ఎదురుగా నిలిచింది. మృదువుగా చిరునవ్వు చిందిస్తున్న ఆవిడ ముఖం, రూపుగట్టిన సౌందర్యమే.

"ఎప్పుడూ నిన్ను ప్రేమిస్తూనే వచ్చాను! ఎప్పటికీ నిన్ను ప్రేమిస్తూనే ఉంటాను!"

దివ్యస్వరాలు ఇంకా గాలిలో ఆడుతూ ఉండగానే ఆమె అంతర్ధానమై పోయింది.

మర్నాడు పొద్దున నేను, మాస్టర్ మహాశయుల్ని రెండోసారి దర్శించే సమయానికి సూర్యుడుదయించాడు కాని ఇంకా మర్యాద కోణాన్ని తాకలేదు. గాఢమైన స్మృతులతో కూడిన ఆ ఇంటి మేడమెట్లు ఎక్కుతూ నాలుగో అంతస్తులో ఉన్న గదికి చేరాను. గది తలుపు మూసి ఉంది. తలుపు గుబ్బమీద ఒక గుడ్డ చుట్టి ఉంది. ఆ సమయంలో మహాశయులు ఏకాంతం కోరుతున్నా రనిపించింది. ఏం చెయ్యడానికీ పాలుపోక, నేను గుమ్మం ముందర నించుని ఉండగా, మాస్టర్ మహాశయులే స్వయంగా తలుపు తెరిచారు. ఆయన పవిత్ర పాదాలముందు మోకరిల్లాను. నాలోని దివ్యానందాన్ని మరుగుపరిచి, కేవలం సరదాకోసం నా ముఖంలో గాంభీర్యం తెచ్చిపెట్టుకున్నాను.

"వచ్చేశానండీ - చాలా పెందరాళే వచ్చానని ఒప్పుకుంటాను - మీ సందేశం కోసం! జగన్మాత నా గురించి ఏమయినా చెప్పిందాండీ?"

"కొంటె చిన్నబాబూ!"

మరోమాట అననేలేదాయన. నేను తెచ్చిపెట్టుకున్న గాంభీర్యం ఆయనకి నమ్మకం కలిగించినట్టు లేదు.

"అంత గుట్టు ఎందుకండీ? అలా మాట తప్పిస్తున్నారేం? సాధువు లెప్పుడూ సూటిగా చెప్పరా?" బహుశా నేను కొంచెం రెచ్చిపోయి మాట్లాడా ననుకుంటాను.

"నువ్వు నన్ను పరీక్షించక తప్పదా?" ప్రశాంతమైన ఆయన కళ్ళలో అవగాహన నిండుగా ఉంది. "నిన్న రాత్రి పదిగంటలకి, సౌందర్యమయి అయిన జగన్మాత స్వయంగా నీ కిచ్చిన హామీకి అదనంగా ఈరోజు పొద్దున నేను ఒక్క ముక్కయినా చేర్చవలసిన అవసరముందా?"

నా అంతరాత్మ వరద వెల్లువను అరికట్టి ఉంచే ద్వారాలు మాస్టర్ మహాశయుల ఆధీనంలో ఉన్నాయి. మళ్ళీ నేను ఆయన పాదాలముందు మోకరిల్లాను. ఈసారి నా కన్నీళ్ళు ఆనందంవల్ల పెల్లుబికినవే కాని, వెనకటిలా బాధవల్ల వెలువడ్డవి కావు.

"భక్తితో నువ్వు పిలిచిన పిలుపు, ఆ అపార దయామయికి అందలేదను కున్నావా? ఎడబాటు సహించలేక నువ్వు వేసిన కేకకు, మానవ రూపంలోనూ

దేవతారూపంలోనూ కూడా నువ్వు ఆరాధించిన, దేవుడి మాతృభావం మారు పలకకుండా ఉండదు."

చిన్న ప్రార్థనతోనే పరమాత్మ సమ్మతిని మధురంగా పొందగలిగిన ఈ నిరాడంబర సాధువు ఎవరు? ఈ లోకంలో ఈయన నిర్వహించే పాత్ర అతి సామాన్యమైనది; నాకు తెలిసినవారందరిలోకి అత్యంత వినయసంపన్నునికి తగ్గట్టుగా ఉంది. అమ్హెరెస్ట్ వీధిలో ఉన్న ఈ ఇంట్లో మాస్టర్ మహాశయులు* మగ పిల్లలకోసం ఒక చిన్న హైస్కూలు నడిపారు. కటువైన మాట ఒక్కటి కూడా ఆయన పెదవి దాటి వచ్చేది కాదు. ఆయన క్రమశిక్షణలో నియమాలకి, చేతి బెత్తాలకి చోటులేదు. నిజానికి, నిరాడంబరమైన ఈ తరగతి గదుల్లో ఉన్నత గణిత శాస్త్రమూ పాఠ్య పుస్తకాల్లో ఉండని ప్రేమరసాయనశాస్త్రమూ బోధించేవారు.

చెవికెక్కని ఉపదేశాలతో కాకుండా ఆధ్యాత్మిక సంపర్కంతోనే ఆయన తమ జ్ఞానాన్ని వ్యాప్తిచేసేవారు. జగన్మాత మీది పరిశుద్ధ భక్తిపారవశ్యంలో మునిగి పోయిన ఆయన, చిన్నపిల్లవాడి మాదిరిగా, బాహ్యమైన మర్యాద సూచనలేవీ అపేక్షించేవారు కారు.

"నేను నీ గురువును కాను; ఆయన కొద్దికాలం తరవాత వస్తారు," అని చెప్పారు నాకు. "ఆయన మార్గదర్శకత్వంలో, ఇపుడు నీవు భక్తి, ప్రేమల పరంగా పొందే భగవదనుభూతులు ఆయన ప్రగాఢ జ్ఞానపరమైన అనుభూతులుగా నీలో రూపాంతరితమవుతాయి."

నేను ప్రతిసాయంత్రం పెందరాళే అమ్హెరెస్ట్ వీధికి వెళ్తూండేవాణ్ణి. పూర్తిగా నిండిన మాస్టరు మహాశయుల దివ్యానుభవ చషకం నుండి ఆనందామృత బిందువులు నిత్యం నా మీదకి పొంగి పొర్లాలని చూసేవాణ్ణి. ఇంతకు ముందెప్పుడూ నేను, అత్యంత గౌరవభావంతో మోకరిల్లలేదు; ఇప్పుడు మాస్టర్ మహాశయుల పాదస్పర్శతో పావనమైన నేలమీద నడవడం కూడా అపరిమిత భాగ్యంగా అనిపించింది.

"మహాశయా, మీ కోసం ప్రత్యేకంగా అల్లిన ఈ సంపెంగ పూలమాల ధరించండి." ఒకనాడు సాయంత్రం నేను పూలమాల ఒకటి తీసుకువెళ్ళాను.

---

* ఆయన్ని మామూలుగా, గౌరవసూచకమైన ఈ పేరుతోనే పిలిచేవారు. ఆయన అసలు పేరు మహేంద్రనాథ్ గుప్త. ఆయన రచించిన పుస్తకాల మీద ఉత్తి 'M' (ఎం) అనే రాసుకొనేవారు.

కాని ఆయన వద్దు వద్దంటూ, సిగ్గుపడుతూ దూరంగా జరిగిపోయారు. చివరికి నేను నొచ్చుకోడం గమనించి, చిరునవ్వుతో అంగీకారం తెలిపారు.

"మన మిద్దరం ఆ తల్లి భక్తులమే కనక, నువ్వు, నాలో నివసించే ఆ తల్లికి కానుకగా, నా దేహాలయం మీద ఆ మాల వెయ్యవచ్చు." ఆయన విశాల ప్రకృతిలో, రవ్వంత అహంకారానికి చోటు లేదు.

"మా గురువుగారి వల్ల శాశ్వతంగా పావనమైన దక్షిణేశ్వర కాళికాలయానికి వెళ్దాం, రేపు." ఈ సాధువు, క్రీస్తువంటి గురువర్యులయిన శ్రీరామకృష్ణ పరమహంస శిష్యులు.

ఆ మర్నాడు పొద్దున, గంగానదిలో నాలుగు మైళ్ళు ప్రయాణం చేయడానికి పడవమీద బయలుదేరాం. తొమ్మిది గుమ్మటాలతో విరాజిల్లుతున్న కాళి కాలయం లోకి ప్రవేశించాం. అందులో వెండితో చేసిన తామర పువ్వుమీద, జగజ్జనని విగ్రహం, శివుడి విగ్రహం ఉన్నాయి. తామర పువ్వు కున్న వెయ్యి రేకులూ అతి నేర్పుగా చెక్కి ఉన్నాయి. మాస్టర్ మహాశయులు మంత్రముగ్ధులై నట్టుగా భాసించారు. ప్రేమ మయి అయిన జగన్మాత అనంత ప్రణయలీలలో ఆయన నిమగ్నులయిపోయారు. ఆయన ఆ అమ్మవారి పేరు గానం చేస్తుంటే భావోద్రిక్తమైన నా హృదయం, ఆ తామర పువ్వులాగే, వెయ్యి రేకులుగా విడివడిపోయినట్లనిపించింది.

తరవాత మే మిద్దరం, పవిత్రమయిన ఆ ఆలయ ప్రాంగణంలో తిరుగుతూ ఝావుక (ఈత) చెట్ల తోపులో ఆగాం. ఈ చెట్లనుంచి సహజంగా కారే పాలు, మాస్టర్ మహాశయులు అందిస్తున్న అమృతధారకు ప్రతీకగా ఉన్నాయి. ఆయన దైవప్రార్థనలు కొనసాగుతూనే ఉన్నాయి. గులాబివన్నె రేకలుండే ఝావుక పుష్పాలమధ్య నేను, గడ్డినేలమీద అత్యంత నిశ్చలంగా కూర్చున్నాను. తాత్కాలికంగా ఈ శరీరంలోంచి బయల్పడి దివ్యలోకాల్లో విహరించాను.

దక్షిణేశ్వరం సందర్శించడానికి మాస్టర్ మహాశయులతో కలిసి నేను చేసిన యాత్రల్లో ఇది మొదటిది. మాతృభావంలో, లేదా దివ్య కరుణామయిభావంలో భగవంతుడి మాధుర్యాన్ని ఆయన దగ్గరే నేను చవిచూశాను. ఆ సాధువు శిశు హృదయానికి పితృభావం, లేదా దివ్యన్యాయభావం రుచించదు. కఠినమూ అమిత ప్రయాసాత్మకమూ గణితబద్ధమూ అయిన తీర్పరితనం ఈయన సాధుస్వభావానికి సరిపడేది కాదు.

ఒకనాడు ప్రార్థనల్లో నిమగ్నులై ఉన్న ఆయన్ని ప్రేమతో గమనిస్తున్నప్పుడు, "స్వర్గంలో ఉండే దేవదూతలకు ఈయన, భూమి మీద ప్రతిరూపం," అనిపించింది. ఆక్షేపణకాని, విమర్శకాని స్పర్శామాత్రంగా కూడా సోకకుండా ఈయన, ఆద్య స్వచ్ఛతతో చిరకాలంగా పరిచయమైన కళ్ళతో ప్రపంచాన్నంతనీ పరిశీలించేవారు. ఈయన శరీరం, మనస్సు, వాక్కు, చేతలు అన్నీ ఆత్మ సారళ్యంతో అప్రయత్నంగా సామరస్యం పొందాయి.

ఈయన మామూలుగా, ఎవరికయినా సలహా ఇచ్చేటప్పుడు, తమ వ్యక్తిత్వానికి ప్రాధాన్యమియ్యకుండా, "మా గురుదేవులు నా కిలా చెప్పారు," అని చెప్పి జోహార్లు అర్పిస్తూ ముగించేవారు. మాస్టర్ మహాశయులకు శ్రీరామకృష్ణులతో తాదాత్మ్యం ఎంత ప్రగాఢంగా ఉండేదంటే, ఆయన తమ ఆలోచనల్ని వేటినీ తమ సొంతంగా గణించేవారే కాదు.

ఒకనాడు సాయంత్రం ఆయనా నేనూ చెయ్యీ చెయ్యీ కలుపుకొని ఆయన బడి ఉన్న వీధిలో తిరుగుతున్నాం. ఇంతలో అక్కడికి, ఆయన పరిచయస్థుడొకడు వచ్చాడు. అతడు వట్టి ధూర్తుడు; అతని రాకతో నా ఆనందం సన్నగిలింది. అతను చాలాసేపు ఏవేవో మాట్లాడుతూ మమ్మల్ని ఊదరగొట్టేశాడు.

"ఇతను నీకు సంతోషం కలిగించడం లేదని గ్రహించాను" అంటూ నాతో రహస్యంగా అన్నారాయన. ఆ వచ్చిన దురహంకారి తన సొదికి తానే ముగ్ధుడై ఉన్నందువల్ల ఈ మాటలు అతని చెవిని పడలేదు. "దీన్ని గురించి జగన్మాతకు చెప్పాను; మన దుస్థితి ఆమె గ్రహించింది. అదుగో, అక్కడున్న ఎర్రరంగు ఇంటి దగ్గరికి మనం వెళ్ళేసరికి, అతనికి బాగా తొందరపని ఒకటి జ్ఞాపకం చేస్తానని ఆవిడ మాట ఇచ్చింది," అన్నారు.

మాకు విముక్తి ప్రసాదించే చోటుమీదే నిలిచిపోయాయి నా కళ్ళు. అతను సరిగా ఎర్రగేటు దగ్గరికి వచ్చినవాడల్లా, కారణమేమీ లేకుండానే తిరిగి వెళ్ళి పోయాడు. చెప్పే వాక్యం పూర్తి చెయ్యనూ లేదు, వెళ్ళొస్తానని మాతో చెప్పనూ లేదు. కల్లోలిత వాతావరణంలో మళ్ళీ శాంతి నెలకొంది.

మరో రోజున నేను హౌరా రైల్వే స్టేషను దగ్గర ఒంటరిగా నడుస్తున్నాను. ఒక గుడి దగ్గర, తప్పెట్లూ తాళాలూ కొడుతూ గొంతు చించుకొంటూ భజన చేస్తున్న ఒక చిన్న బృందాన్ని చూసి నేను మనస్సులో విమర్శించుకొంటూ క్షణ కాలం నిలిచిపోయాను.

"దేవుడి పవిత్ర నామాన్ని వీళ్ళు ఎంత భక్తి శూన్యంగా, యంత్రం మాదిరిగా పునశ్చరణ చేస్తున్నారు!" అనుకున్నాను. ఇంతలో హఠాత్తుగా, మాస్టర్ మహాశయులు నా వేపు గబగబా వస్తూండడం చూసి ఆశ్చర్యపోయాను.

"అయ్యా, మీరిక్కడున్నారేమిటి?"

ఆ సాధువు నా ప్రశ్న పట్టించుకోకుండా, నా ఆలోచనకు జవాబిచ్చారు. "చిన్నబాబూ, భగవన్నామం, అజ్ఞానుల నోట్లోంచి వచ్చినా జ్ఞానుల నోట్లోంచి వచ్చినా మధురంగానే ఉంటుంది కదూ?" అంటూ ఆప్యాయంగా నన్ను దగ్గరికి తీసుకున్నారు. ఆయన 'ఇంద్రజాలిక తివాసీ' మీద నన్ను కరుణామయి సన్నిధికి తీసుకువెళ్ళిపోయారని గ్రహించాను.

"నువ్వు కొన్ని బైస్కోపులు చూస్తావా?" ఒకనాడు మధ్యాహ్నం, విరాగులైన మాస్టర్ మహాశయుల నోట్లోంచి ఈ ప్రశ్న రావడం నాకు చిత్రంగా అనిపించింది; బైస్కోపు అన్నమాట భారతదేశంలో ఆ రోజుల్లో, సినిమాలకు వాడేవారు. నేను సరే నన్నాను; ఆయన వెంబడి ఉంటే చాలు, ఏ పరిస్థితుల్లో ఉన్నా నాకు సంతోషమే. వడివడిగా నడిచి కలకత్తా విశ్వవిద్యాలయం ముందరి తోట దగ్గరికి వచ్చాం. 'గోల్‌డిఘీ' అనే చెరువు దగ్గరున్న బల్ల చూపించారాయన.

"కొన్ని నిమిషాలు ఇక్కడ కూర్చుందాం. ఎక్కడయినా విశాల జలాశయం కనిపిస్తే ధ్యానంచెయ్యమని మా గురువుగారు చెప్పారు. ఇక్కడ దీనికున్న ప్రశాంతత, దేవుడి అపార శాంతిని మనకు జ్ఞాపకం చేస్తుంది. సమస్త వస్తు జాలమూ ఈ నీళ్ళలో ప్రతిఫలించినట్టుగానే, ఈ విశ్వమంతా విశ్వమానస సరోవరంలో ప్రతిబింబిస్తూ ఉంటుంది. అలాగని మా గురుదేవు*లు తరచు అంటూండేవారు."

కాసేపట్లో మేము యూనివర్సిటీ హాలులోకి ప్రవేశించాం; అక్కడ ఒక ఉపన్యాసం జరుగుతోంది. అప్పుడప్పుడు లాంతరు స్లైడ్లు వేసి చూపిస్తున్నప్పటికీ, ఆ ఉపన్యాసం చాలా నిరుత్సాహ జనకంగా ఉంది; చూపించే స్లైడ్లు కూడా అంత నిరాసక్తికరంగానూ ఉన్నాయి.

మాస్టరుగారు నన్ను చూడమనే బైస్కోపు ఇదన్నమాట!" నాలో ఆలోచనలో ఓర్పు నశించింది, కాని నా ముఖంలో విసుగుదల కనబరిచి ఆయన్ని నొప్పించ దలచలేదు. కాని ఆయన నావేపు వంగి రహస్యంగా ఇలా చెప్పారు:

---

* ఒక వ్యక్తియొక్క ఆధ్యాత్మిక బోధకుడికి సాధారణంగా వాడే సంస్కృత శబ్దం. 'గురు' శబ్దంతో 'దేవ' శబ్దం కలసినప్పుడు గాఢమైన భక్తి శ్రద్ధలు వెల్లడి అవుతాయి. ఆంగ్లంలో దీన్ని నేను కేవలం 'మాస్టర్' అని అనువదించాను.

"చిన్నబాబూ, నీకు ఈ బైస్కోపు నచ్చనట్టవుపిస్తోంది. ఈ సంగతి జగన్మాతకి చెప్పాను; ఆవిడకి మనిద్దరి మీదా పూర్తిగా సానుభూతి ఉంది. ఇప్పుడు ఎలక్ట్రిక్ దీపాలు పోతాయనీ, మనం ఈ గదిలోంచి వెళ్ళిపోయే వరకూ మళ్ళీ వెలగవనీ చెబుతున్నది."

ఆయన గుసగుసలు పూర్తి అయేసరికి హాలంతా చీకటయిపోయింది. ఉపన్యాసమిచ్చే ప్రొఫెసరుగారి బొంగురు గొంతు ఆశ్చర్యంతో ఒకసారి నిశ్శబ్ద మయింది; అప్పుడిలా అన్నారాయన. "ఈ హాల్లో ఎలక్ట్రిక్ సిస్టంలో ఏదో లోప మున్నట్టుంది."

అప్పటికి నేనూ మాస్టర్ మహాశయులూ గడపదాటేస్తున్నాం. నడవలోంచి వెనక్కితిరిగి చూస్తే హాల్లో మళ్ళీ దీపాలు కనిపించాయి.

"చిన్నబాబూ, ఆ బైస్కోపు నీకు నిరాశ కలిగించింది కదూ! అయితే మరో రకమైనది నీకు నచ్చుతుందనుకుంటాను." ఆయనా నేనూ యూనివర్సిటీ భవనానికి ఎదురుగా ఉన్న దారిలో నించుని ఉన్నాం. నా గుండెమీద ఆయన మెల్లగా తట్టారు.

వెంటనే పరివర్తనాత్మకమైన నిశ్శబ్దం ఒకటి ఆవరించింది. ఆధునికమైన "టాకీలు" శబ్ద పరికరాలు చెడిపోయినప్పుడు మూక చలన చిత్రాల్లా ఎలా మారిపోతాయో అల్లా ప్రపంచంలోని కోలాహలాన్నంతని అతి విచిత్రమైన అలౌకిక ఘటనద్వారా దివ్యహస్తం అణిచేసింది. కాలి నడకని వెళ్ళేవాళ్ళూ, సాగిపోతున్న ట్రాలీ కార్లూ, మోటారు బండ్లూ, ఎడ్లబండ్లూ, ఇనప పట్టాలున్న జట్కా బండ్లూ - అన్నీ చడీ చప్పుడూ లేకుండా సాగిపోతున్నాయి. సర్వవ్యాపక మైన దృష్టి ఉన్నట్టుగా నేను, నాకు వెనకవేపూ పక్కలా ఉన్న దృశ్యాల్ని కూడా, ఎదురుగా ఉన్న వాటి మాదిరిగానే చూశాను. కలకత్తాలో ఆ చిన్న బస్తీలో జరుగుతున్న కార్యకలాపాల దృశ్యమంతా నా కళ్ళముందు నిశ్శబ్దంగా సాగి పోతోంది. పలచని బూడిద పొరకింద మసక మసకగా కనిపించే నిప్పుకాంతి లాంటి మృదుకాంతి ఒకటి ఆ విశాల దృశ్యమంతా పరుచుకుంది.

నా శరీరం, అనేకమైన నీడల్లో ఒక నీడలా తప్ప, అంతకుమించి గోచరించ లేదు. అయితే తక్కిన నీడలు మూగగా ముందుకూ వెనక్కూ చెదిరిపోతూ ఉంటే, నా నీడ మాత్రం నిలకడగా ఉంది. కొందరు కుర్రవాళ్ళు, నా స్నేహితులు, నావేపు వచ్చికూడా ముందుకు సాగిపోయారు. వాళ్ళు సూటిగా నావేపు చూసినప్పటికీ నన్ను గుర్తు పట్టలేదు.

ఈ అనుపమ మూగ ప్రదర్శన నాకొక అనిర్వచనీయమైన ఆనందాతిశయాన్ని కలిగించింది. ఏదో ఊటచెలమలోంచి వెలువడే ఆనందామృతాన్ని సేవించాను. ఇంతలో హఠాత్తుగా, మాస్టర్ మహాశయులు నా రొమ్ముమీద తట్టినట్లు తెలిసింది. నాకు ఎంత ఇష్టంలేకపోయినా ప్రపంచపు గందరగోళం మళ్ళీ చెవుల్లో పడింది. కలలో తేలిపోతూండేవాణ్ణి నిర్దయగా మేల్కొలిపినట్లుగా అల్లాడిపోయాను. అతీంద్రియానంద మధువును నాకు అందకుండా దాచేశారు.

"చిన్నబాబూ, నీకు రెండో బైస్కోపు* నచ్చినట్టు కనిపిస్తోంది." చిరునవ్వు చిందిస్తున్నారు ఆ సాధువు. నేను కృతజ్ఞతతో ఆయన పాదాల ముందు మోకరిల్లబోయాను. "నువ్విప్పుడా పని చెయ్యకూడదు!" అన్నారాయన. "దేవుడు నీ దేహాలయంలో కూడా ఉన్నాడని నీకు తెలుసు. జగజ్జననిని నీ చేతులతో నా పాదాలు తాకనియ్యను!" నిరాడంబరులైన మాస్టర్ మహాశయులూ నేనూ జనసమ్మర్దంగల పేవ్‌మెంటు నుంచి వచ్చి మెల్లగా నడిచిపోతూండడం కనక ఎవరయినా గమనించినట్లయితే మే మిద్దరం మంచి నిషాలో ఉన్నామని అనుమానించి ఉండేవారు. అలుముకుంటున్న ఆ సాయంకాలపు నీడలు కూడా మాతోబాటు దివ్యానందంతో మత్తెక్కి ఉన్నాయి.

ఆయన దయను గూర్చి రాయడానికి అసమగ్రమైన ఈ మాటలతో ప్రయత్నిస్తున్నప్పుడు నాకు అనిపిస్తోందీ - మాస్టర్ మహాశయులకూ, నా జీవిత మార్గంలో తారసపడ్డ ఇతర సాధు పుంగవులకూ, కొన్నేళ్ళ తరవాత నేను ఒక పాశ్చాత్య దేశంలో, దైవభక్తులుగా తమ జీవిత విశేషాలను రాస్తానని ముందుగా తెలిసే ఉండవచ్చునని. వారికి భవిష్యత్తు ముందే తెలిసి ఉండడం నాకు ఆశ్చర్యం కలిగించే విషయమేమీ కాదు; అలాగే ఇంతవరకు చదువుతూ వచ్చిన నా పాఠకులకు కూడా ఆశ్చర్యం కలిగించదనుకుంటాను.

సరళమైన విశ్వప్రేమమయ భావనద్వారా, అన్ని మతాల సాధువులూ దైవ సాక్షాత్కారం పొందారు. కేవల పరబ్రహ్మ నిర్గుణం, అంటే "గుణాలు లేనిదీ," అచింత్యం, అంటే "ఆలోచనకు అందనిదీ," కావడం వల్ల, మానవుల ఆలోచనా

---

* వెబ్‌స్టర్ న్యూ ఇంగ్లీష్ డిక్షనరీ (1934)లో బైస్కోపు (bio-scope) అన్న పదానికి అరుదైన నిర్వచనం ఉంది : "జీవిత దృశ్యం ; అటువంటి దృశ్యాన్ని కల్పించేది." దీన్ని బట్టి, మాస్టర్ మహాశయులు ఎన్నుకున్న పదం చిత్రంగా నప్పింది.

ఆకాంక్షా ఆ పరబ్రహ్మాకూ జగజ్జననిగా ఒక మూర్తిమత్వమిస్తూ వచ్చాయి. వేదాల్లోనూ భగవద్గీతలోనూ వివరించిన విధంగా, సాకారదైవ భావననూ కేవల నిరాకార బ్రహ్మ భావననూ సమ్మేళనం చేయడం, హిందూతత్త్వ చింతన సనాతన కాలంలోనే సాధించిన విజయం. ఈ "పరస్పర విరుద్ధాల సమన్వయం" హృదయాన్నీ బుద్ధినీ కూడా తృప్తిపరుస్తుంది; భక్తీ జ్ఞానమూ ప్రధానంగా ఒకటే. ప్రపత్తి - అంటే దేవుణ్ణి "ఆశ్రయించడం," శరణాగతి - అంటే "దేవుడి దయనే నమ్ముకొని తనను తాను అర్పించుకోడం," అన్నవి నిజంగా, పరమోన్నత జ్ఞాన సాధనకు మార్గాలు.

మాస్టర్ మహాశయులకూ ఇతర సాధువులందరికీ ఉండే వినయం, దేవుణ్ణే ఏకైక ప్రాణంగానూ న్యాయమూర్తిగానూ భావించి, ఆయన మీదే సంపూర్ణంగా ఆధారపడి ఉన్నామన్న (శేషత్వం) గుర్తింపువల్ల ఏర్పడినది. భగవంతుడి స్వరూపమే ఆనందం కాబట్టి, ఆయనతో భావైక్యం పొందినవాడు సహజమైన అపరిమి తానందం అనుభవిస్తాడు. "ఆత్మా, సంకల్పశక్తీ పొందే భావావేశాల్లో మొదటిది ఆనందం."*

పసిపిల్లలకు సహజమైన హృదయంతో జగన్మాతను చేరే అన్ని యుగాల భక్తులూ, ఆవిడ ఎప్పుడూ తమతో ఆడుకొంటూనే ఉంటుందని ధ్రువపరుస్తారు. మాస్టర్ మహాశయుల జీవితంలో, ముఖ్యమైన సందర్భాల్లోనూ ముఖ్యంకాని సందర్భాల్లోనూ కూడా, దివ్యలీలలు కళ్ళకు కడుతూ వచ్చాయి. దేవుడి దృష్టిలో పెద్దా చిన్నా అన్న తేడా లేదు. అంత పరిపూర్ణ నైపుణ్యంతో ఆయన సూక్ష్మమైన

---

* సెంట్ జాన్ ఆఫ్ ద క్రాస్ ప్రీతిపాత్రుడయిన ఈ క్రైస్తవ సాధువు 1591లో కన్ను మూశాడు: 1859లో ఈయన భౌతికకాయాన్ని బయటికి తవ్వి తీసినప్పుడు ఏ మాత్రం చెడిపోకుండా కనిపించింది.

సర్ ఫ్రాన్సిస్ యంగ్ హజ్బెండ్ ( అట్లాంటిక్ మంత్లీ', డిసెంబరు 1936) తనకు కలిగిన విశ్వానందానుభవాన్ని గురించి ఇలా చెప్పాడు : "ఉల్లాసం కన్నా ఉత్సాహం కన్నా ఎంతో ఎక్కువ ఆనందానుభూతి నాకు కలిగింది. ఒకానొక ఆనందాతిరేకంతో నా ఒళ్ళు నాకు తెలియలేదు. వర్ణించనలవి కాని, దాదాపు భరించ శక్యంకాని ఈ ఆనందానుభూతి కలగడంతో, ప్రపంచానికి సారభూతమైన మంచితనం కూడా నాకు అవగాహన అయింది మనుషులు అంతరంగంలో మంచివాళ్ళే ననీ వాళ్ళలో కనిపించే చెడు పైపైది మాత్రమేననీ, కాదనడానికి వీలులేనంత గట్టిగా నమ్మకం కుదిరింది "

అణువునే కనక నిర్మించి ఉండకపోతే ఆకాశం, అభిజిత్తూ స్వాతీవంటి నక్షత్రాల్ని సగర్వంగా అలంకరించుకొని ఉండగలిగేదా? ఇది "ముఖ్యమైనది", అది "ముఖ్యం కానిది" అన్న విచక్షణలు దేవుడి కసలు తెలియనే తెలియవు; లేకపోతే, ఒక సూది కనక లేకపోతే మొత్తం విశ్వమంతా కుప్పగూలిపోయేది!

అధ్యాయం : 10

# గురుదేవులు శ్రీయుక్తేశ్వర్ గారిని కలుసుకోడం

"దేవుడి మీది ప్రగాఢ విశ్వాసం ఏ అలౌకిక ఘటన నయినా జరిపించ గలదు - చదవకుండా పరీక్ష ప్యాసవడం ఒక్కటి తప్ప." ఏమీ తోచనప్పుడు ఒకసారి నేను తీసుకొన్న "స్ఫూర్తిదాయకమైన" పుస్తకాన్ని, వెంటనే వెగటుపుట్టి మూసేశాను.

"రచయిత చెప్పిన మినహాయింపు చూస్తే, దేవుడిమీద ఆయన గారికి బొత్తిగా విశ్వాసం లేనట్టు కనిపిస్తోంది," అనుకున్నాను. "పాపం వెర్రివాడు; నడిరాత్రి వెలిగే చమురు దీపం మీదే గొప్ప గౌరవమున్నవాడు!"

నేను హైస్కూలు చదువు పూర్తి చేస్తానని, వెనకే మా నాన్నగారికి మాట ఇచ్చాను. కాని నేను శ్రద్ధపట్టినట్టు నటించలేను. నెలలు గడుస్తున్న కొద్దీ నేను క్లాసులో కనిపించడం మరింత తక్కువయింది; కలకత్తా స్నానాల రేవుల్లో నిర్జన ప్రదేశాలకు వెళ్ళడం ఎక్కువయింది. ఆ రేవుల్నే ఆనుకొని ఉన్నాయి శ్మశానాలు. ముఖ్యంగా రాత్రిపూట భయంకరంగా ఉండే ఈ శ్మశానాలు యోగిని బాగా ఆకట్టుకుంటాయని అంటారు. మరణం లేని మహత్తత్త్వాన్ని అన్వేషించేవాడు కొన్ని బోడిపుర్రెల్ని చూసి బెదిరిపోగూడదు. రకరకాల ఎముకలు చెల్లాచెదరుగా ఉండే నైరాశ్య నిలయంలోనే, మానవజీవితం ఎంత అపరిపూర్ణ మయినదో స్పష్టమవుతుంది. ఈ విధంగా నేను చేసే అర్ధరాత్రి జాగరణలు స్వభావరీత్యా, విద్యార్థులు చేసే జాగరణలకు భిన్నమైనవి.

హిందూ హైస్కూల్లో సంవత్సరాంత పరీక్షలు జరిగేవారం గబగబా దగ్గర పడుతోంది. ఈ పరీక్షాకాలం, శ్మశానవాటికలాగే సుపరిచితమైన భయోత్పాతాన్ని కలిగిస్తుంది. అయినా నా మనస్సు ప్రశాంతంగానే ఉంది. పిశాచాలకు జంకకుండా నే నక్కడ, తరగతి గదుల్లో కంటబడని జ్ఞానాన్ని తవ్వి తీస్తున్నాను. కాని నాకు,

ప్రణవానందస్వామివారిలా, ఒకే సమయంలో రెండుచోట్ల సులువుగా కనబడే నేర్పు లేదు. అయితే భగవంతుడు ఆ సంకటస్థితిని గమనించి నన్ను దాంట్లోంచి బయటపడేస్తాడన్నది నా ఆలోచన (దురదృష్టవశాత్తు, కొందరికిది తర్కవిరుద్ధంగా కనిపించవచ్చు). కష్టాలు వచ్చినప్పుడు భగవంతుడి లీలావిశేషం, వివరించడానికి వీలుకాని విధంగా, వెయ్యి దృష్టాంతాల్లో కళ్ళకు కట్టినప్పుడు వాటిమూలంగా భక్తుడికి హేతురాహిత్యం ఏర్పడుతుంది.

"ఓ, ముకుందా! ఈ మధ్య బొత్తిగా కనిపించడమే మానేశావు!" ఒకనాడు మధ్యాహ్నం నా సహాధ్యాయి ఒకడు నన్ను గడ్‌పార్ రోడ్డులో పలకరించాడు.

"అరే, నంటూ! నేను స్కూల్లో కనిపించకపోవడం నన్ను తప్పకుండా ఇరకాటంలో పెట్టేలా ఉందిరా," అంటూ, స్నేహపూర్వకంగా చూస్తున్న నంటూ దగ్గర నా బాధ వెళ్ళబెట్టుకున్నాను.

నంటూ మంచి తెలివైన విద్యార్థి. వాడు నా మాటకి కులాసాగా నవ్వాడు నా అవస్థ చూస్తే ఎవరికయినా నవ్వు రాకపోదు.

"చివరి పరీక్షలకి నువ్వు బొత్తిగా తయారుకాకుండా ఉన్నావు!" అన్నాడు వాడు. "నేను నీకు సహాయం చెయ్యాలనుకుంటాను!"

ఈ మామూలు మాటలే ఒక దివ్యమైన వాగ్దానాన్ని నా చెవుల్లో వేశాయి· మంచి హుషారుగా మా స్నేహితుడి ఇంటికి వెళ్ళాను. మాస్టర్లు పరీక్షలో ఇవ్వవచ్చు నని తన కనిపించిన రకరకాల ప్రశ్నలకు సమాధానాలు, వాడు నాకు స్థూలంగా చెప్పుకొచ్చాడు.

"ఈ ప్రశ్నలు, ఆత్మవిశ్వాసంతో పరీక్షకి వెళ్ళే కుర్రాళ్ళని చాలామందిని, పరీక్షల్లో బోల్తాకొట్టిస్తాయి. నా సమాధానాలు గుర్తుంచుకో; దెబ్బతినకుండా బయటపడతావు నువ్వు."

నేను అక్కణ్ణించి బయల్దేరేసరికి రాత్రి చాలా గడిచిపోయింది. అప్పటి కప్పుడు పట్టించుకున్న పాండిత్యంతో పిటపిటలాడిపోతూ, రాబోయే గడ్డు రోజుల్లో ఆ పాండిత్యం అలాగే నిలిచి ఉండాలని భక్తితో ప్రార్థన చేశాను. నంటూ, నా పరీక్షకున్న అనేక పాఠ్యవిషయాలు నాకు బోధించాడు; కాని ఆ తొందరలో, టైము చాలకపోవడం వల్ల, నా సంస్కృతం కోర్సు సంగతి మరిచి పోయాడు. ఈ పొరపాటును దేవుడికి భక్తిపూర్వకంగా గుర్తు చేశాను.

మర్నాడు పొద్దున, లయబద్ధంగా కదంతొక్కుతూ నడుస్తూ, కొత్తగా గడించిన జ్ఞానాన్ని ఒంటబట్టించుకుంటూ షికారుకు బయల్దేరాను. నేను అడ్డదారి పట్టి, ఒక మూల ఒత్తుగా పెరిగిన గడ్డిమొక్కల్లో పడి పోతూఉండగా విడివిడిగా పడిఉన్న కొన్ని అచ్చుకాయితాల మీద నా కళ్ళు పడ్డాయి. విజేతలా గబుక్కున ముందుకు దూకాను; సంస్కృత శ్లోకాలు నా చేతికి చిక్కాయి! వాటికి విడమరిచి అర్థాలు చెప్పించుకోడానికి ఒక పండితుణ్ణి వెతికిపట్టుకున్నాను. ఆయన గంభీరస్వరం, ఆ ప్రాచీన భాషకున్న అపరిమిత మాధుర్యంతో గాలిని నింపేసింది.*

"అసాధారణమైన ఈ శ్లోకాలు నీ సంస్కృత పరీక్షకి పనికొచ్చే అవకాశం లేదు," ఆ పండితుడు అపనమ్మకంగా అన్నాడు.

అయితే, ఆ కవిత్వంతో ఏర్పడ్డ పరిచయమే, ఆ మర్నాడు జరిగే సంస్కృత పరీక్షలో నేను ప్యాసవడానికి సాయపడింది. వివేచనాత్మకంగా నంటూ చేసిన సహాయంవల్ల నేను తక్కిన పాఠ్యవిషయాల్లో కూడా అత్తెసరు మార్కులు తెచ్చుకుని పరీక్ష గట్టెక్కాను.

ఇచ్చినమాట నిలబెట్టుకుని నేను సెకండరీ స్కూల్ కోర్సు పూర్తిచేసి నందుకు నాన్నగారు సంతోషించారు. నంటూ ఇంటికి వెళ్ళడం విషయంలోనూ, చెత్తకుప్ప పక్కనుంచి అలవాటులేని దారిలో నడిచివెళ్ళడం విషయంలోనూ నాకొక దారి చూపించినందుకు భగవంతుడికి కృతజ్ఞతలు చెప్పుకొన్నాను. నన్ను ఆదుకోడా నికి సమయోచితంగా తాను వేసిన పథకాన్ని ఆయన సరదాగా రెండు రకాలుగా వ్యక్తం చేశాడు.

పరీక్ష హాళ్ళలో దేవుడి ప్రాముఖ్యాన్ని నిరసించిన రచయితగారి పుస్తకం - వెనక నేను చదవకుండా విడిచిపెట్టేసినది - మళ్ళీ నా కంట బడింది. నిశ్శబ్దంగా నాలో నేను చేసుకున్న వ్యాఖ్యానానికి ముసిముసి నవ్వు ఆపుకోలేకపోయాను:

---

* "సంస్కృత" మంటే, "మెరుగు దిద్దినది, సంపూర్ణమైనది" అని అర్థం. ఇండో యూరోపియన్ భాషలన్నిటికీ సంస్కృతం పెద్దక్క. దీని అక్షరలిపిని "దేవనాగరి" అంటారు; అంటే "దేవతానిలయం" అని వాచ్యార్థం. ప్రాచీన భారతదేశపు భాషా శాస్త్రవేత్త పాణిని, గణితశాస్త్రీయంగానూ మనోవైజ్ఞానికంగానూ సంస్కృతానికున్న పరిపూర్ణతను ప్రశంసిస్తూ "నా వ్యాకరణం తెలిసినవాడు దేవుణ్ణి తెలుసుకుంటాడు," అన్నాడు. నిజానికి, భాషోత్పత్తిక్రమానికి మూలం కనుక్కొనేవాడు చివరికి సర్వజ్ఞుడవుతాడు.

" పీనుగుల మధ్య కూర్చుని దైవప్రార్థన చెయ్యడం, హైస్కూలు డిప్లమో సంపాయించడానికి అడ్డదారి అని కనక నేనీయనకి చెప్పవలసి వస్తే, ఈయన గారి మనస్సులో గందరగోళం ఇంకా పెరిగిపోయేది!"

నా కొత్త ఘనత కారణంగా ఇప్పుడు, ఇంట్లోంచి వెళ్లిపోవడానికి బాహాటం గానే పథకం వేస్తున్నాను. జితేంద్ర మజుందార్ * అనే స్నేహితుడితో కలిసి వెళ్లి కాశీలో ఉన్న శ్రీ భారత్ ధర్మ మహామండల్ వాళ్ళ ఆశ్రమంలో చేరి, ఆధ్యాత్మిక మైన శిక్షణ పొందాలని నిశ్చయించుకున్నాను.

మా కుటుంబంతో ఎడబాటు వస్తుందన్న ఆలోచనతో ఒకనాడు నేను బెంగపడిపోయాను. అమ్మ పోయినతరవాత ఇంట్లోవాళ్ళమీద, ముఖ్యంగా మా తమ్ముళ్ళు - సనందుడి మీదా విష్ణు మీదా మా చివరి చెల్లెలు తామూ మీదా నా ఆప్యాయత గాఢంగా పెరిగింది. వెంటనే నా ఏకాంత స్థలానికి పరిగెత్తాను ఒడుదుడుకులతో కూడిన నా ఆధ్యాత్మిక సాధనలోని అనేక దృశ్యాలకు ఆ అటకే ప్రత్యక్ష సాక్షి. రెండు గంటల సేపు నా కన్నీరు వరదలై పారిన తరవాత, అన్నిటినీ క్షాళనం చేసే ఒకానొక అజ్ఞాతశక్తివల్ల నాలో ఒక విలక్షణమైన పరివర్తన వచ్చినట్టు అనిపించింది. అనుబంధాలన్నీ† అదృశ్యమయిపోయాయి; స్నేహితులందరినీ మించిన స్నేహితుడైన భగవంతుణ్ణే అన్వేషించాలన్న నిర్ణయం బాగా బలపడింది

"చివరిసారిగా ఒక్క కోరిక కోరుతున్నాను. నన్నూ, నీకోసం తపించే అన్న దమ్ముల్నీ అక్కచెల్లెళ్ళనీ విడిచిపెట్టి వెళ్ళకు," నాన్నగారి దీవెన కోసం నేను ఆయన ఎదుట నించునేసరికి ఆయన దిగాలుపడి ఇలా అన్నారు.

"నాన్నగారూ, మీ మీద నా కెంత ప్రేమ ఉందో ఎలా చెప్పగలను? కాని ఈ భూమిమీద నాకు పరిపూర్ణులైన తండ్రిని ప్రసాదించిన జగత్పిత మీదున్న ప్రేమ ఇంకా ఎక్కువయినది. ఇంతకంటె ఎక్కువ దివ్యమైన జ్ఞానం పొంది, ఎప్పుడో ఒకనాడు మళ్ళీ తిరిగిరావడానికి నన్నిప్పుడు వెళ్లనియ్యండి."

---

* సమయం వచ్చేసరికి పులుల మీద రోతపుట్టిన జతీన్‌దా (జోతీన్ ఘోష్) కా డితను

† ప్రేమించే బంధువులతోబాటు మనకు వరాలన్నీ ప్రసాదించే - ఆ మాటకు వస్తే, ఈ జీవితాన్నే ప్రసాదించిన - దేవుణ్ణి అన్వేషించడానికి భక్తుడికి సంసారబంధం అవరోధం కలిగించేటట్లయితే అటువంటి అనుబంధం 'మాయ' అని హిందువుల పవిత్ర గ్రంథాలు ఉద్బోధిస్తున్నాయి ఏసుక్రీస్తు కూడా అలాగే చెప్పాడు. "నాకంటె తన తల్లినిగాని తండ్రినిగాని ఎక్కువగా ప్రేమించేవాడు నావాడు కావడానికి అర్హుడు కాడు." - మత్తయి 10.37 (బైబిలు)

నాన్నగారు అనిష్టంగా ఇచ్చిన అనుమతితో, అప్పటికే కాశీలో ఆశ్రమంలో ఉన్న జితేంద్రని కలుసుకోడానికి బయల్దేరాను. నేను వెళ్ళగానే, ఆశ్రమాధిపతి అయిన స్వాములవారు - దయానందులు నన్ను సాదరంగా పలకరించారు. ఆయన పడుచుప్రాయంలో ఉన్నవారు. పొడుగ్గా, సన్నగా, ఆలోచనాపరులుగా కనిపించే ఆ స్వామివారి మీద నాకు సదభిప్రాయం కలిగింది. అందమైన ఆయన ముఖంలో, బుద్ధుడిలో ఉన్న మాదిరి ప్రశాంతత ఉండేది.

ఈ కొత్త నివాసంలో ఒక అటక ఉన్నందుకు నేను సంతోషించాను. ఉదయ సంధ్య వేళా పొద్దుటి పూటా అక్కడ గడపడానికి వీలు కల్పించుకున్నాను. ధ్యాన సాధన గురించి ఏమీ తెలియని ఆ ఆశ్రమవాసులు, నాకున్న సమయ మంతా ఆశ్రమ నిర్వహణ విధులు నిర్వర్తించడానికే వినియోగించాలని అనుకునే వారు. మధ్యాహ్నంపూట నేను వాళ్ళ ఆఫీసులో చేసే పనికి మెచ్చుకునేవారు.

“దేవుణ్ణి అంత తొందరగా పట్టుకోడానికి ప్రయత్నించకు!” ఒకనాడు పొద్దున నేను అటకమీదికి వెళ్తూ ఉండగా నా వెంట వచ్చిన ఆశ్రమ సహవాసి చేసిన పరిహాసం ఇది. నేను దయానందగారి దగ్గరికి వెళ్ళాను; గంగానదివేపు ఉన్న తమ చిన్న గదిలో ఏదో పనిలో మునిగి ఉన్నారాయన.

“స్వామీజీ, ఇక్కడ నేను చెయ్యవలసింది ఏమిటో నాకు తెలియకుండా ఉంది. దేవుడి ప్రత్యక్ష దర్శనం కావాలని ఆకాంక్షిస్తున్నాను. ఆయన లేనిదే, సంస్థ సభ్యత్వంతోకాని, మత విశ్వాసంతో కాని, సత్కార్యాలతోకాని నాకు తృప్తి కలగదు.”

కాషాయవస్త్రధారి అయిన ఆ స్వాములవారు ఆప్యాయంగా నా వెన్ను తట్టారు. ఉత్తుత్తి కోపం నటిస్తూ, పక్కనున్న శిష్యుల్ని కొందర్ని మందలించారు. “ముకుందుణ్ణి ఇబ్బంది పెట్టకండి. మన పద్ధతులు క్రమంగా నేర్చుకుంటాడు లెండి.”

నేను మర్యాదగా నా సంశయాన్ని మరుగుపరిచాను. విద్యార్థులు గదిలోంచి వెళ్ళిపోయారు; ఆయన మందలింపుకి వాళ్ళేమీ కుంగిపోయినట్టు కనిపించలేదు. దయానందులు, ఆ తరవాత ఇంకా చెప్పారు నాకు:

“ముకుందా, మీ నాన్నగారు ప్రతినెలా వరస తప్పకుండా నీకు డబ్బు పంపిస్తున్నట్టున్నారు. ఆ డబ్బు ఆయనకి తిప్పి పంపెయ్యి; నీ కిక్కడ ఏమీ అక్కర్లేదు. ఇంక నీ క్రమశిక్షణ కోసం రెండో సూచన; అది నీ భోజనం గురించి. నీకు ఆకలి వేస్తున్నప్పుడు కూడా, ఆ సంగతి చెప్పకు.”

నా కంట్లో ఆకలి మిలమిల్లాడిందేమో నాకయితే తెలియదు. నాకు ఆకలిగా ఉందన్న సంగతిమట్టుకు బాగా తెలుసు. కాని ఆశ్రమంలో వేళ తప్పకుండా మొదటిసారి భోజనం పెట్టే సమయం మాత్రం మధ్యాహ్నం పన్నెండు గంటలు. మా ఇంట్లో అయితే తొమ్మిదిగంటల వేళకి సుష్ఠుగా ఫలహారం చెయ్యడం నాకు అలవాటు.

ప్రతిరోజూ ఈ మూడుగంటల వ్యవధి మాత్రం మరింత దుర్భరమవుతోంది. కలకత్తాలో అయితే, ఒక్క పదినిమిషాల ఆలస్యానికి నేను వంటవాణ్ణి తిట్టేసే వాణ్ణి; ఇప్పుడా రోజులు గతించాయి. ఇక ఆకలిని అదుపులో పెట్టడానికి ప్రయత్నించాను; ఇరవై నాలుగు గంటల ఉపవాసం పూర్తి చేశాను. మర్నాడు మధ్యాహ్నం ఎప్పుడవుతుందా అని రెట్టింపు ఉత్సాహంతో ఎదురు చూస్తున్నాను

"దయానందుల బండి ఆలస్యంగా వస్తుంది; ఆయన వచ్చేదాకా మన మెవరం భోంచెయ్యం." జితేంద్ర ఘోరమయిన ఈ వార్త తెచ్చాడు. రెండు వారాలపాటు ఊళ్ళోలేని స్వాములవారికి స్వాగత సూచకంగా రుచికరమైన వంటకాలెన్నో సిద్ధంగా ఉన్నాయి. ఆకలి పుట్టించే వాసన ఆశ్రమమంతటా నిండి ఉంది. వేరే ఏమీ దొరకనప్పుడు, నిన్నటిరోజున ఉపవాసమున్నానన్న గర్వం తప్ప, మరేముంటుంది మింగడానికి?

"దేవుడా, బండి తొందరగా రప్పించు!" దయానందులు నా నోరు కట్టెయ్యడానికి విధించిన నియమంతో, దివ్యప్రదాత అయిన భగవంతుడికి ఏమీ ప్రమేయం లేదని అనుకున్నాను. భగవంతుడి దృష్టి మరో చోట ఉంది. కుంటు కుంటూ నడుస్తున్న గోడగడియారం గంటలు గడిపేసింది. మా స్వాముల వారు గుమ్మంలో అడుగుపెట్టే వేళకి చీకటి పడుతోంది. నేను పట్టరాని సంతోషంతో ఆయనకి స్వాగతం చెప్పాను.

"దయానందులు ముందు స్నానంచేసి ధ్యానం చేసుకుంటారు; ఆ తరవాతే మనం వడ్డన చేసేది." జితేంద్రుడు అపశకునపు పక్షిలా మళ్ళీ నా దగ్గరికి తయారయాడు.

నేను దాదాపు స్పృహ తప్పిపోయే స్థితిలో ఉన్నాను. ఖాళీగా ఉండడం కొత్తయిన నా చిన్నారి కడుపు ఆవురావురుమంటూ టొకాయిస్తోంది. నేను చూసిన క్షామబాధితుల చిత్రాలు, నా ముందు పిశాచాల్లా అల్లాడుతున్నాయి.

"కాశీలో మరుసటి ఆకలిచావు, ఈ క్షణంలోనే ఈ ఆశ్రమంలో సంభవించ బోతోంది," అనుకున్నాను. ఆ ప్రమాదం, తొమ్మిదిగంటల వేళకి తప్పిపోయింది. అమృతతుల్యమైన తియ్యని పిలుపు! నా జీవితంలోని పరిపూర్ణ ఘడియల్లో ఒకటిగా ఆ రాత్రి భోజనం నా జ్ఞాపకాల్లో నేటికీ చాలా స్పష్టంగా నిలిచి ఉంది.

నేను భోజనంలో ఎంత గాఢంగా మునిగిపోయినప్పటికీ, దయానందులు పరధ్యానంగా భోంచేస్తున్నారన్న సంగతి గమనించకపోలేదు. నేను కోరే మాదిరి భౌతిక సుఖాలకు ఆయన అతీతులయినట్టున్నారు.

"స్వామీజీ, మీకు ఆకలి వెయ్యలేదా?" నేను సుష్టుగా భోంచేసి నందుకు సంతోషపడుతూ, పరన మందిరంలో ఆయనతోబాటు ఒంటరిగా ఉన్నాను.

"వేసింది!" అన్నారు. "గత నాలుగు రోజులూ తిండీ తీర్థం లేకుండా గడిపాను. రైలు ప్రయాణాల్లో నే నెన్నడూ తినను; ఐహిక వాంఛలతో కూడిన ప్రజల నుంచి వెలువడే విభిన్న ప్రకంపనలతో నిండి ఉంటాయి రైళ్ళు. మాబోటి సన్యాసులకు విధించిన శాస్త్ర*నియమాల్ని నేను తూచా తప్పకుండా పాటిస్తాను.

"వ్యవస్థాపరమైన పనికి సంబంధించిన సమస్యలు కొన్ని నా మనస్సులో ఉన్నాయి. అంచేత ఈ రాత్రి భోజనం మీద మనస్సు పెట్టలేదు. తొందరే ముంది? రేపు గుర్తు పెట్టుకొని సరిగా భోంచేస్తాలే," అంటూ ఉల్లాసంగా నవ్వారాయన. ఉక్కిరిబిక్కిరి చేస్తున్నట్టుగా నాలో లజ్జ వ్యాపించింది. కాని గడిచిన రోజంతా నేను అనుభవించిన హింస, అంత సులువుగా మరిచిపోలేకపోయాను. నేను మరో ప్రశ్న అడగడానికి పూనుకొన్నాను.

---

* స్థూలంగా "శాస్త్రాలు"గా చెప్పబడే పవిత్ర గ్రంథాలు నాలుగు రకాలుగా ఉన్నాయి: శృతి, స్మృతి, పురాణ మరియు తంత్ర గ్రంథాలు. ధార్మిక, సాంఘిక జీవితానికి సంబంధించిన అన్ని అంశాలను గూర్చి, ఇంకా చట్టము, వైద్యము, వాస్తు, లలిత కళలు వగైరా అనేక రంగాలకు సంబంధించిన విషయాలు ఈ సమగ్ర గ్రంథాల్లో ఉన్నాయి. వీటిలో శృతులు ' వేరుగా వినబడ్డవి లేక స్వయం ప్రకటితమైనవి. అవే వేదాలు. 'జ్ఞప్తిలో ఉంచుకోబడ్డ' విషయాలయిన స్మృతులు కాలాంతరంలో ప్రపంచంలోకెల్లా అతి పెద్ద ప్రబంధ కావ్యాలు (epic poems) రామాయణ, మహాభారతములుగా రాయబడ్డాయి. అష్టాదశ సంఖ్యలో నున్న పురాణములు వాస్తవానికి ప్రతీకాత్మక కథలు. తంత్రం అనే మాటకి వాచ్యార్థం 'కర్మకాండ' అని; ఈ తాంత్రిక గ్రంథాలు విస్తృతమైన ప్రతీకల ద్వారా గంభీరమైన సత్యాన్ని తెలియ జేస్తాయి.

"స్వామీజీ, మీ ఆదేశం నాకు గందరగోళం కలిగిస్తోంది. అన్నం పెట్టమని నేను ఎన్నడూ అడగననుకోండి, నా కెవరూ ఏం పెట్టరనుకోండి; నేను ఆకలితో మాడి చావవలసిందే."

"అయితే చావు!" ఈ భయంకరమైన సలహా, గాలిని చీల్చుకుంటూ వినవచ్చింది. "చావవలసే ఉంటే, చావు ముకుందా! దైవబలం వల్లనే కాని తిండి బలంవల్ల బతుకుతానని ఎన్నడూ నమ్మకు! పుష్టినిచ్చే పదార్థాలన్నీ సృష్టించినవాడు ఆయన. ఆకలి పుట్టించినవాడు ఆయన. తన భక్తుడి పాలనా పోషణా ఆయన తప్పకుండా చూసుకుంటాడు. అన్నం నిన్ను బతికిస్తోందని కాని, డబ్బు పోషిస్తోందని కాని మనుషులు పోషిస్తున్నారని కాని అనుకోకు. ఆ ప్రభువు నీ ఊపిరి కాస్తా లాగేస్తే అవేమన్నా నీకు సాయపడతాయా? అవి కేవలం ఆయన ఉపకరణాలు మాత్రమే. నీ కడుపులో ఆహారం జీర్ణమవుతున్నది ఏదో నీ నేర్పువల్లనా? నీ విచక్షణా ఖడ్గాన్ని ఉపయోగించు ముకుందా! ఉపకరణ బంధాల్ని ఛేదించి, ఏకైక కారణమైన భగవంతుణ్ణి దర్శించు!"

నిశితమైన ఆయన మాటలు నాలో, మూలుగలోతుల్లోకి, దూసుకు పోవడం గమనించాను. దైహికావసరాలు ఆత్మను పరాజితం చేస్తాయన్న పాతకాలపు భ్రమ పటాపంచలైంది. పరమాత్మ సర్వసమృద్ధిని అప్పుడే అక్కడే చవిచూశాను. వారణాసి ఆశ్రమంలో నేర్చుకొన్న ఈ గుణపాఠం ఉపయోగాన్ని రుజువుచేసే సందర్భం, అనంత యాత్రగా సాగిన నా అనంతర జీవితంలో, ఎన్ని అపరిచిత నగరాల్లో వచ్చిందో!

కలకత్తా నుంచి వచ్చేటప్పుడు నాతో వచ్చిన ఒకేఒక విలువైన వస్తువు, మా అమ్మ దగ్గర్నించి నాకు సంక్రమించిన వెండి రక్షరేకు - నా చిన్నప్పుడు మా అమ్మకి ఒక సాధువు ఇచ్చినది. కొన్నేళ్ళుగా దాన్ని నేను కాపాడుకుంటూ, ఇప్పుడు ఆశ్రమంలో నా గదిలో జాగ్రత్తగా దాచిపెట్టాను. ఒకనాడు పొద్దున నేను, రక్షరేకును మళ్ళీ ఒకసారి చూసుకొని ఆనందిద్దామని తాళంవేసిన పెట్టె తెరిచాను. సీలు వేసిన కవరును ఎవరూ తాకనయినా లేదు; కాని రక్షరేకు మాయమయింది! అది పోయినందుకు ఎంతో బాధపడుతూ, కవరు చింపి చూసుకొని, నేను పొరపాటు పడ్డానికి అవకాశం లేదని రూఢి చేసుకున్నాను. ఆ సాధువు జోస్యం చెప్పిన ప్రకారమే, ఆయన శూన్యంలోంచి తెప్పించి ఇచ్చినది తిరిగి శూన్యంలోనే కలిసిపోయింది.

దయానందుల అనుయాయులతో నా సంబంధం క్రమంగా చెడిపోతూ వచ్చింది. కావాలని నేను వాళ్ళకి దూరంగా ఉంటున్నందువల్ల నొచ్చుకొని, వాళ్ళా

నాకు దూరమయారు. ఏ ఆశయంతో నేను ఇంటినీ, ప్రాపంచికమయిన ఆశల్నీ అన్నిటినీ వదులుకుని దైవధ్యాన నిష్ఠకు కట్టుబడి ఉన్నానో ఆ ఆశయమే అన్ని వేపులనించీ నిస్సారమైన విమర్శకు గురిఅవుతూ వచ్చింది.

ఆధ్యాత్మిక పరివేదనతో మనసు వ్యథచెందింది. భగవంతుడు నాకొక సమాధానం అనుగ్రహించేవరకు ప్రార్థన చెయ్యాలని నిశ్చయించుకుని, ఒక ఉషోదయాన నేను నా అటకమీదకి వెళ్ళాను.

“దయామయి జగన్మాతా, దివ్యదర్శనాల ద్వారా నువ్వయినా నాకు జ్ఞానబోధ చెయ్యి; లేకపోతే నువ్వు పంపే గురువుద్వారానయినా బోధించు!”

గంటల తరబడిగా నేను వెక్కివెక్కి ఏడుస్తూ పెట్టుకొన్న మొరకు సమాధానం రాలేదు. ఇంతలో హఠాత్తుగా, అనంతమైన ఒక వలయాకార మండలంలోకి నన్ను సశరీరంగా లేవనెత్తినట్టు అనిపించింది.

“నీ గురువు ఈరోజునే వస్తున్నాడు!” దివ్యమైన ఒక స్త్రీ కంఠస్వరం అన్ని వేపులనుంచి అవ్యక్తంలోంచి వినవచ్చింది.

ఇంతలో ఒక నిర్దిష్ట ప్రదేశంనుంచి కేక వినిపించడంతో నా అతీంద్రియానుభూతి పటాపంచలైంది. వంటింట్లోంచి, హాబు అనే మారుపేరుగల యువ పురోహితుడు పిలుస్తున్నాడు నన్ను.

“ముకుందా, ఇంక ధ్యానం చాలు! నువ్వో పనిమీద వెళ్ళాలి!”

మరోనాడయితే నేను అసహనంగా జవాబు ఇచ్చి ఉండేవాణ్ణి; ఇప్పుడు మాత్రం కన్నీళ్ళతో ఉబ్బిన మొహం తుడుచుకుని అణకువగా అతని మాట మన్నించాను. హాబుతో కలిసి, ఎక్కడో దూరంగా బెంగాలీ బస్తీలో ఉన్న బజారుకు బయల్దేరాను. బజారులో మేము సరుకులు కొనడం పూర్తి అయేసరికి సూర్యుడింకా నడినెత్తికి రాలేదు. ఇల్లాళ్ళు, గైడ్లు, పురోహితులు, సాదాబట్టలు కట్టుకున్న వితంతువులు, హుందాగా ఉండే బ్రాహ్మణులు, ఎక్కడపడితే అక్కడ కనిపించే ఆంబోతులతోను మంచి రద్దీగా ఉన్న వీధిలో ముందుకు చొచ్చు కుంటూ వెళ్ళాం. నేను హాబూ అలా సాగిపోతూ ఉండగా, అతిసాధారణమైన ఒక సన్నటి సందువేపు తల తిప్పి చూశాను.

ఆ సందు చివర, స్వాములవారి మాదిరిగా కాషాయవస్త్రాలు ధరించిన క్రీస్తువంటి మహాపురుషులొకరు నిశ్చలంగా నిలబడి ఉన్నారు. ఆ క్షణంలోనే

కాక, యుగయుగాలుగా కూడా నాకు తెలిసినవారిలా కనిపించారాయన. ఒక్క క్షణం, నా చూపు ఆబగా ఆయన మీదే నిలిచింది. కాని ఇంతలోనే మళ్ళీ మనస్సులో ఒక శంక పుట్టింది.

"దేశాటనం చేసే ఈ సన్యాసిని చూసి, ఎవరో నీకు తెలిసినాయన అనుకొని పొరపడుతున్నావు; కలలు కనేవాడా, ముందుకు నడు," అనుకున్నాను.

పది నిమిషాలయేసరికి నా పాదాలు బాగా తిమ్మిరెక్కేసినట్టు అనిపించింది. కాళ్ళు రాళ్ళయిపోయినట్టయి, అడుగు ముందుకు పడనియ్యలేదు. ఎంతో శ్రమపడి వెనక్కి తిరిగాను; వెంటనే నా పాదాలు మళ్ళీ మామూలుగా అయిపోయాయి. తరవాత మళ్ళీ ఇటు తిరిగాను; ఆ చిత్రమైన బరువు మళ్ళీ నన్ను అణిచేసింది.

"ఆ సాధువుగారు అయస్కాంత శక్తితో నన్ను దగ్గరికి లాక్కుంటున్నారు!" ఇలా అనిపించేసరికి నా దగ్గరున్న పొట్లాలు హాబూ చేతుల్లో పెట్టేశాను. అతను నేను వేసే 'తప్పు'టడుగులు ఆశ్చర్యంగా గమనిస్తూనే ఉన్నాడు. ఇప్పుడు విరగబడి నవ్వాడు.

"ఏమయింది నీకు? పిచ్చెక్కిందా?"

నాలో పొంగే భావావేశం అతనికి తగిన జవాబివ్వకుండా అడ్డుకుంది. మారుపలక్కుండా అక్కణ్ణించి పరుగెత్తాను.

పాదాలకు రెక్కలు మొలిచినవాడి మాదిరిగా, అడుగులు గాలిలో తేలిపోతూ ఉండగా ఆ సన్నటి సందు దగ్గరికి చేరాను. నేనున్న వేపే నిలకడగా చూస్తున్న ప్రశాంతమూర్తి చటుక్కున నా కంట బడ్డారు. ఆత్రంగా కొన్ని అడుగులు వేసేసరికి ఆయన పాదాల దగ్గరున్నాను.

"గురుదేవా!" వెయ్యి దివ్యదర్శనాల్లో నా కళ్ళకు కట్టిన దివ్యముఖబింబం ఇదే. కొనదేరిన గడ్డంతో, గిరజాల జుట్టుతో సింహాన్ని తలపించే తల! శుభదృష్టి ప్రసరించే ఈ కళ్ళు, రాత్రివేళల్లో నేను అస్తవ్యస్తమైన ఆలోచనలతో విషాదంలో మునిగి ఉన్నప్పుడు నా వేపు గుచ్చిగుచ్చి చూస్తుండేవి; వాటిలో నాకు, పూర్తిగా అర్థంకాని ఆశాభావమేదో పొడగడుతూ ఉండేది.

"నా తండ్రీ! వచ్చేశావా!" అంటూ గురుదేవులు, ఆనందంతో తబ్బిబ్బయి వణుకుతున్న గొంతుతో, బెంగాలీ భాషలో మళ్ళీమళ్ళీ అన్నారు. "ఎన్నేళ్ళు కాచుకొని ఉన్నాను బాబూ నీ కోసం!"

మే మిద్దరం మౌనంలో ఐక్యమయ్యాం. మాటలు బొత్తిగా అనవసరమని పించాయి. అనర్గళ వాక్ప్రవాహం, నిశ్శబ్ద సంగీతంలో గురువు హృదయం నుంచి నేరుగా శిష్యుడిలోకి ప్రవహించింది. నా గురుదేవులు దైవ సాక్షాత్కారం పొందిన వారనీ నన్ను వారు దైవసన్నిధికి చేరుస్తారనీ నిరాక్షేపమైన అంతర్దృష్టివల్ల తెలుసు కున్నాను. ఈ జీవితంలో అలుముకున్న చీకటి, గతజన్మల జ్ఞాపకాలనే చిరు పొద్దుపొడుపుతో అదృశ్యమయిపోయింది. నాటకీయ కాలం! చక్రగతిలో ఆవృత్తమయే గతం, వర్తమానం, భవిష్యత్తులు ఆ కాల-నాటక దృశ్యాలు. ఈ పవిత్ర పాద సన్నిధిలో నన్ను గమనించిన తొలిరోజు ఇది కాదు!

గురుదేవులు నా చెయ్యి పట్టుకుని, ఆ ఊళ్ళో రాణామహల్ బస్తీలో ఉన్న ఒక ఇంటికి తీసుకువెళ్ళారు. క్రీడాకారుడి మాదిరిగా బలిష్ఠదేహులయిన ఆయన నడక దృఢగతిలో సాగింది. పొడుగ్గా, నిటారుగా ఉన్న ఆయనకి అప్పటికి ఏభై ఐదేళ్ళున్నప్పటికీ యువకుడిలా మంచి చురుగ్గా, సత్తువతో ఉన్నారు. ఆయన కళ్ళు నల్లగా, విశాలంగా, ప్రగాఢమైన జ్ఞానంతో నిండి, అందంగా ఉన్నాయి. కొద్దిగా వంకులు తిరిగిన జుట్టు, ఆయన ముఖగాంభీర్యానికి మార్దవం చేకూర్చింది. బలం సాధుత్వంతో సూక్ష్మరూపంలో మేళవించింది.

గంగకు ఎదురుగా ఉన్న, ఆ ఇంటి రాతి బాల్కనీలోకి మేము వెడుతూ ఉండగా, ఆయన ఆప్యాయంగా ఇలా అన్నారు :

"నా ఆశ్రమాలూ, నా సర్వస్వమూ నీ కిచ్చేస్తాను."

"స్వామీ, నేను వచ్చింది కేవలం జ్ఞానంకోసం, దైవసాక్షాత్కారం కోసం. నేను మీ దగ్గర పొందగోరే నిధులు అవీ!"

మా గురుదేవులు మళ్ళీ మాట్లాడేలోగా, భారతదేశ సాయం సంధ్య చటు క్కున అరతెర జార్చింది. ఆయన కళ్ళలో లోతు అందని ఆర్ద్రత నిండి ఉంది.

"నీకు బేషరతుగా నా ప్రేమ అందిస్తాను."

అమూల్యమైన వాక్కులు! ఆయన ప్రేమకు రుజువు, మళ్ళీ నా చెవిని పడ్డానికి, తరవాత పావు శతాబ్ది పట్టింది. ఆయన పెదవులు భావోద్రేకాన్ని ఎరగవు; మహా సముద్రంలాంటి ఆయన హృదయానికి ఒప్పినది మౌనమే.

"నువ్వు కూడా అలాగే బేషరతుగా నాకు ప్రేమ అందిస్తావా?" శిశుసహజ మైన నమ్మకం నింపుకొన్న కళ్ళతో ఆయన నాకేసి చూశారు.

"గురుదేవా, మిమ్మల్ని అనంతకాలం శాశ్వతంగా ప్రేమిస్తాను."

"కోర్కెల్లోకి తృష్ణల్లోకీ గుప్తంగా వేళ్ళుపారిన మామూలు ప్రేమ స్వార్థంతో కూడుకున్నది. కాని దివ్యప్రేమ షరతులు లేనిదీ, ఎల్లలు లేనిదీ, మార్పులేనిదీ. స్థిరపరిచే లక్షణం గల విశుద్ధ ప్రేమ స్పర్శతో మానవ హృదయ చాంచల్యం మటుమాయమయిపోతుంది." నమ్రతతో, ఆయన ఇంకా ఇలా అన్నారు : "నే నెప్పుడైనా దైవ సాక్షాత్కార స్థితినించి దిగజారుతున్నట్టు కనక నీకు కనిపిస్తే నువ్వు నా తల ఒళ్ళో పెట్టుకొని, మనమిద్దరం కొలిచే విశ్వప్రేమమయుడైన భగవంతుడి సన్నిధికి మళ్ళీ నన్ను తీసుకువస్తానని మాట ఇయ్యి."

చీకటి ముసురుతూ ఉండగా ఆయన లేచి, నన్ను లోపలి గదిలోకి తీసుకు వెళ్ళారు. మే మిద్దరం మామిడిపళ్ళూ బాదం మిఠాయీ తింటూ ఉండగా, నా స్వభావం తమకు బాగా సన్నిహితంగా తెలుసునన్న సంగతి ఆయన మా సంభాషణ క్రమంలో అలవోకగా తెలియజేశారు. సహజమైన నమ్రతతో అద్భుతంగా మేళవించిన ఆయన జ్ఞానసంపత్తికి విస్మితుణ్ణి అయాను.

"నీ రక్షరేకు కోసం విచారించకు. దాని అవసరం తీరిపోయింది.' గురు దేవులు, దివ్యదర్పణం మాదిరిగా నా యావజ్జీవిత ప్రతిబింబాన్ని ఆకట్టుకున్నారు

"గురుదేవా, ప్రత్యక్ష వాస్తవమయిన మీ సన్నిధి ఇచ్చే ఆనందం ఏ సంకేతం ఇస్తుంది?"

"ఆశ్రమంలో నువ్వు సుఖంగా లేవు కాబట్టి అక్కణ్ణించి మారిపోవలసిన సమయం వచ్చింది."

అంతవరకు నా జీవితానికి సంబంధించిన సంగతులేవీ నేను ఆయన దగ్గర ప్రస్తావించలేదు; ఇప్పుడవి అనావశ్యకాలనిపించాయి. ఆయన సహజమైన సరళవైఖరిని బట్టి, తమ దివ్యదృష్టికి నేను ఆశ్చర్యం వెలిబుచ్చాలని ఆయన కోరడం లేదని గ్రహించాను.

"నువ్వు తిరిగి కలకత్తా వెళ్ళాలి. నీ సర్వమానవ ప్రేమ పరిధిలోంచి చుట్టా ల్నెందుకూ మినహాయించడం?"

ఆయన సూచనకు నాకు దిగులు కలిగింది. మావాళ్ళు నన్ను తిరిగిరమ్మంటూ ఉత్తరాల్లో అనేకసార్లు వెల్లడించిన కోరికను నేను మన్నించనప్పటికీ నేను తిరిగి వస్తాననే, వాళ్ళు జోస్యం పలుకుతూ వచ్చారు. " పిల్లపక్షిని అధిభౌతిక ఆకాశంలో

విహరించనియ్యండి," అని వ్యాఖ్యానించాడొకసారి అనంతన్నయ్య. "ఆ దట్ట మయిన వాతావరణంలో వాడి రెక్కలు అలిసిపోతాయి. మళ్ళీ ఇంటివేపు దిగివచ్చి, రెక్కలు ముడుచుకొని అణకువగా ఇంటిపట్టున విశ్రాంతి తీసుకోడం చూడక పోము." నన్ను నిరుత్సాహపరిచే ఈ ఉపమానం ఇంకా నా మనస్సులో ఉన్నందు వల్ల ఏమయినా సరే, కలకత్తావేపు పోనేకూడదని నిర్ధారణ చేసుకున్నాను.

"స్వామీ, నేను ఇంటికి మాత్రం తిరిగి వెళ్ళనండి. కాని మీ వెంట ఎక్కడి కయినా సరే వస్తాను. మీ పేరూ చిరునామా ఇవ్వండి."

"స్వామి శ్రీయుక్తేశ్వర్‌గిరి. నా ముఖ్యమైన ఆశ్రమం శ్రీరాంపూర్‌లో రాయ్‌ఘాట్ సందులో ఉంది. మా అమ్మని చూసి కొన్నాళ్ళిక్కడ ఉండి వెళ్దామని వచ్చాను."

దేవుడు తన భక్తులతో ఆడే ఆట ఎంత చిత్రంగా ఉంటుందోనని ఆశ్చర్య పోయాను. శ్రీరాంపూర్ కలకత్తాకి పన్నెండుమైళ్ళలో ఉంది. కాని ఆ ప్రాంతాల్లో ఎక్కడా మా గురువుగారు నాకు అగపడలేదు. మేము కలుసుకోడానికి, లాహిరీ మహాశయుల జ్ఞాపకాలతో పావనమైన ప్రాచీన కాశీ (వారణాసి) నగరానికి ప్రయా ణం కట్టవలసి వచ్చింది. బుద్ధుడు, శంకరాచార్యులు,* తదితర యోగీశ్వరుల పాదస్పర్శతో పవిత్రమైంది ఈ నేల.

"నువ్వు నాలుగు వారాల్లో నా దగ్గరికి వస్తావు," మొట్టమొదటిసారిగా, శ్రీయుక్తేశ్వర్‌గారి కంఠస్వరం కఠినంగా వినిపించింది. "నీ మీద నాకున్న అనంత మైన ఆప్యాయతను గురించి నీ కిప్పుడు చెప్పాను కనక, నిన్ను చూసినందుకు నా సంతోషం కనబరిచాను కనక, నా కోరికను నువ్వు తిరస్కరించవచ్చు

---

* భారతదేశపు దార్శనికులందరిలోకి గొప్పవారయిన శంకరాచార్యులవారు (శంకరులు) గోవిందయతి శిష్యులు; గోవిందయతి గౌడపాదులవారి శిష్యులు. గౌడపాదాచార్యుల 'మాండూక్య కారిక'కు శంకరులు రాసిన వ్యాఖ్యానం సుప్రసిద్ధమైనది. తిరుగులేని తర్కంతోనూ రమ్యమైన ప్రసన్న శైలిలోనూ శంకరులు, వేదాంత తత్త్వాన్ని కచ్చితంగా అద్వైత (రెండు కానటువంటి, ఏకేశ్వరతత్త్వ) పరంగా వ్యాఖ్యానించారు. ఈ మహాద్వైతి భక్తిపరమైన స్తోత్రాలు కూడా రచించారు. అమ్మవారికి వీరు చెప్పిన 'దేవ్యపరాధ క్షమాపణ స్తోత్రం'లో మకుటం ఇలా ఉంటుంది "కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి" : దుర్మార్గులైన కొడుకులు ఎందరో ఉన్నప్పటికీ దుర్మార్గురాలైన తల్లి ఎక్కడా ఉండదు.

శంకరుల శిష్యుడైన సనందనుడు బ్రహ్మ సూత్రా లకు (వేదాంత తత్త్వం) భాష్యం రాశాడు. దాని రాతప్రతి అగ్నికి ఆహుతి అయిపోతే (దాన్ని ఒక్కసారి తిలకించిన) శంకరులు, దాంట్లో ఉన్న ప్రతిమాటా తిరిగి శిష్యుడికి అప్పజెప్పారు 'పంచపాదిక' అన్న పేర ప్రసిద్ధమైన ఈ గ్రంథాన్ని ఈ నాటికీ పండితులు అధ్యయనం చేస్తూ ఉంటారు.

ననుకుంటున్నావు. మళ్ళీసారి మనం కలుసుకున్నప్పుడు, నువ్వే నాకు తిరిగి ఆసక్తి కలిగించవలసి ఉంటుంది. నిన్నంత సులువుగా శిష్యుడిగా చేర్చుకోను; నా కఠిన శిక్షణకు విధేయుడవై పూర్తిగా తల ఒగ్గాలి."

నేను మొండిపట్టు మీద మౌనంగా ఉన్నాను. గురుదేవులు నా కష్టాన్ని తొందరగానే కనిపెట్టారు.

"మీ చుట్టాలు నిన్ను చూసి నవ్వుతారంటావా?"

"నేను తిరిగి వెళ్లను."

"నువ్వు ముప్ఫై రోజుల్లో తిరిగి వెడతావు."

"ఎన్నడూ జరగదు."

---

సనందనుడనే ఈ శిష్యుడికి మరో కొత్తపేరు రావడానికి చక్కటి సంఘటన ఒకటి జరిగింది. ఒకనాడు ఏటి ఒడ్డున కూర్చుని ఉన్న సనందనుడికి, అవతలి ఒడ్డునుంచి శంకరులు తనను పిలుస్తూ ఉండడం వినిపించింది. వెంటనే అతను నీళ్ళలోకి దిగాడు. అతని విశ్వాసానికీ పాదాలకూ కూడా ఊతగా శంకరులు తమ సంకల్పబలంతో, సుళ్ళు తిరిగే ఆ ఏటిలో తామరపూల బారు ఒకటి సృష్టించారు; అతను వాటి మీంచి నడుచు కుంటూ వెళ్ళి అవతలి ఒడ్డుకు చేరాడు. అప్పటినుంచీ ఆ శిష్యుడికి 'పద్మపాదు'డనే పేరు వచ్చింది.

పంచపాదికలో పద్మపాదుడు తన గురుదేవులకు భక్తిప్రపత్తులతో బహుధా జోహార్లు అర్పించాడు. శంకరులే స్వయంగా చక్కగా ఇలా రాశారు. "సద్గురువును పోల్చదగినది ఈ మూడు లోకాల్లోనూ మరొకటి లేదు. పరుసవేది అన్నది నిజంగా ఉందనే అనుకున్నప్పటికీ అది ఇనుమును బంగారంగా మార్చగలదే కాని మరో పరుసవేదిగా మార్చలేదు. కాని పరమపూజనీయుడైన గురువు అలా కాకుండా, తన పాదాల్ని ఆశ్రయించిన శిష్యుణ్ణి తనంతవాణ్ణే చేస్తాడు. అంచేత సద్గురువు సాటిలేనివాడే కాదు, లోకాతీతుడు."

మహాభక్తుడు, జ్ఞాని, కర్మిష్ఠి - ఈ మూడు వ్యక్తిత్వాల అరుదైన సమాహారమే ఆది శంకరుల వ్యక్తిత్వం. కేవలం 32 సంవత్సరాలు మాత్రమే జీవించి నప్పటికీ జీవితంలో చాలా భాగం భారతదేశంలో అన్ని భాగాల్లో దుష్కర పర్యటన చేస్తూ తన అద్వైత సిద్ధాంతాన్ని వ్యాప్తి చెయ్యడంలోనే గడిపారాయన. పాదచారియైన ఆ యువ సన్యాసి పెదవుల నుండి జాలువారే సాంత్వనకరమైన జ్ఞాన ప్రవాహాన్ని స్వీకరించడానికి వేలాది శ్రోతలు ఆత్రుతగా గుమిగూడేవారు

ఆది శంకరుల సంస్కరణయుతమైన ఉత్సాహంలో ప్రాచీన సన్యాస మఠామ్నాయాన్ని పునర్వ్యవస్థీకరించడం కూడా ఉంది. (చూ.పే. 289-90). దక్షిణాన శృంగేరిలోనూ, తూర్పున పూరీలోనూ, పశ్చిమాన ద్వారకలోనూ, ఉత్తరాన బదరీనాథ్‌లోనూ నాలుగుచోట్ల నాలుగు మఠాల్ని నెలకొల్పారు.

ఆ మహా అద్వైతి స్థాపించిన ఆ నాలుగు మఠాలకి రాజుల మొదలు సామాన్య జనుల వరకు ఎందరో భూరి విరాళాలు ఇచ్చారు. సంస్కృత వ్యాకరణం, తర్కం, వేదాంతం అక్కడ చేరిన విద్యార్థులకు ఉచితంగా బోధించ బడతాయి. దేశం నాలుగు చెరగులా నాలుగు మఠాలు

మా వివాదంలో బింకం సడలకుండానే, నేను ఆయన పాదాలకు భక్తి పురస్సరంగా ప్రణామం చేసి అక్కణ్ణించి వెళ్ళిపోయాను. అర్ధరాత్రి చీకట్లో ఆశ్రమం వేపు నడిచి వెళ్తూ, అలౌకిక ఘటనగా జరిగిన ఈ సమాగమం ఇలా విరసంగా ఎందుకు ముగిసిందా అని వితర్కించుకున్నాను. మాయ అనే తక్కెడ సిబ్బులు రెండూ ప్రతి సంతోషాన్ని ఒక దుఃఖంతో సమానంచేసి తూస్తాయి పరివర్తన కారకాలయిన, గురుదేవుల చేతివేళ్ళకు నా కిశోర హృదయం ఇంకా మెదువు కాలేదు.

మర్నాడు పొద్దున, ఆశ్రమవాసుల్లో నా మీద పెడసరభావం మరింత పెరగడం గమనించాను. వాళ్ళు క్రమం తప్పని మొరటు ప్రవర్తనతో నా రోజు లన్నీ కంటక ప్రాయం చేశారు. మూడు వారాలు గడిచాయి. బొంబాయిలో జరిగే ఒక సమావేశం నిమిత్తం దయానందులు ఆశ్రమం విడిచి వెళ్లారు. నా నిస్సహాయ జీవితం నరకమయిపోయింది. అంతా నా మీద విరుచుకు పడ్డారు. "ముకుందుడు పరాన్న భుక్కు. ఆశ్రమంలో పడి తింటాడు. కాని దానికి తగినంత పని చెయ్యడు" ఈ వ్యాఖ్యానం చాటునుంచి విని నా డబ్బు నాన్నగారికి తిప్పి పంపెయ్యమన్న సలహా పాటించినందుకు మొట్టమొదటి సారిగా విచారించాను. గుండె బరువెక్కి పోవడంతో నాకున్న ఒకే ఒక స్నేహితుడు - జితేంద్ర దగ్గరికి వెళ్ళాను.

"నేను వెళ్ళిపోతున్నాను. దయానందులు తిరిగి వచ్చిన తరవాత ఆయనకి నా క్షమాపణలు తెలియజెయ్యి."

"నేనూ వచ్చేస్తాను. ఇక్కడ ధ్యానంచేసుకోడానికి నేను చేసే ప్రయత్నాలన్నీ నీ వాటికి మించి ఫలించడం లేదు," జితేంద్రుడు దృఢ నిశ్చయంతో అన్నాడు.

"ఈమధ్య నేను క్రీస్తు*లాటి యోగీశ్వరుల్ని కలుసుకున్నాను. శ్రీరాంపూర్‌లో ఆయన దర్శనం చేసుకుందాం."

ఈ విధంగా "పక్షి", ప్రమాదకరమైన రీతిలో కలకత్తాకి దగ్గరలో "దిగడానికి" తయారయింది.

---

పెట్టడంలో ఆది శంకరుల ధ్యేయం ఈ విశాల భారతావనిలో ధార్మిక జాతీయ ఐక్యత వృద్ధి చెందడం.

* క్రీస్తు శబ్దం ఒక చైతన్యాన్ని సూచిస్తుంది. అది సత్ - తత్ - ఓం లో 'తత్' శబ్ద బోధకమూ, 'తండ్రి - కుమార - పరిశుద్ధాత్మ' (Father - Son - Holy Ghost) లో 'కుమార' శబ్ద బోధకమూనయిన విశ్వవ్యాప్త ప్రచోదక బుద్ధి (Christ Intelligence). దీనినే కృష్ణ చైతన్యము, క్రీస్తు చైతన్యము, కూటస్థ చైతన్యము అని కూడా అంటారు. యోగం ద్వారా ఆచైతన్య స్థితిని పొందిన వారందరూ యోగి-క్రీస్తులే.

అధ్యాయం : 11

# చేతిలో పైసలేని కుర్రవాళ్ళిద్దరు బృందావనంలో

"నాన్నగారు నీకు వారసత్వం సంక్రమించకుండా చేస్తే సరిపోతుంది ముకుందా! జీవితాన్ని ఎంత తెలివితక్కువగా వృథా చేసుకుంటున్నావు!" పెద్దన్న-తరహా హితోపదేశం ఒకటి నా చెవుల్ని ఊదర గొడుతోంది.

జితేంద్రుడూ నేనూ అప్పుడే తాజాగా రైలుదిగి (మాట వరసకి ఇలా అంటున్నానే కాని, ఒళ్ళంతా దుమ్ము కొట్టుకుపోయి ఉన్నాం) అనంతన్నయ్య ఇంటికి వచ్చాం. అతను కలకత్తానించి బదిలీ అయి, పురాతన నగరమైన ఆగ్రాకి ఈమధ్యే వచ్చాడు. అతను ప్రభుత్వంవారి పబ్లిక్ వర్క్స్ శాఖలో సూపర్వయిజింగ్ ఎకౌంటెంటు.

"అన్నయ్యా, నేను వారసత్వం భగవంతుడి దగ్గర్నించి కోరుతున్నానని నీకు బాగా తెలుసు."

"ముందు డబ్బు; ఆ తరవాతే దేవుడు! ఏమో, ఎవరికి తెలుసు; జీవితం చాలాకాలం సాగవచ్చు."

"దేవుడే ముందు; డబ్బు ఆయన బానిస! ఏమో, ఎవరు చెప్పగలరు? జీవితం స్వల్పకాలంలోనే ముగిసిపోవచ్చు."

టకీమని నే నిచ్చిన ఎదురు జవాబు, అప్పటి అవసరాన్ని బట్టి అలా వచ్చిందే కాని, జరగబోయేది ముందే మనస్సుకు తోచి అన్నది కాదు. (పాపం, అనంతన్నయ్య జీవితం నిజంగా స్వల్ప కాలంలోనే ముగిసిపోయింది).*

"ఇదంతా ఆశ్రమంలో ఒంటబట్టిన తెలివి కాబోలు! అయినా, నువ్వు కాశీ విడిచి వచ్చేసినట్టు కనిపిస్తోంది," అనంతుడి కళ్ళు తృప్తితో మిలమిలా

---

* చూడండి అధ్యాయం : 25.

మెరిశాయి. నా రెక్కలు, సంసారమనే గూటిలో భద్రంగా ముడుచుకొని ఉండేలా చెయ్యాలని అతను ఇంకా ఆశపడుతున్నాడు.

"కాశీలో నా మజిలీ వృథా కాలేదు! నా మనస్సు ఆశించినది నా కక్కడ దొరికింది! కాని నీ పండితుడివల్లా, ఆయన కొడుకువల్లా మాత్రం కాదని నిశ్చయంగా తెలుసుకో!"

అనంతుడు వెనకటి సంగతి గుర్తు చేసుకుంటూ నాతోబాటు నవ్వాడు. తాను ఎంపికచేసిన, "దివ్యదృష్టిగల" కాశీ పండితుడు ఒట్టి హ్రస్వదృష్టి గలవాడన్న సంగతి ఎప్పుడో ఒప్పుకోవలసి వచ్చింది.

"మరి నీ ముందాలోచన లేమిటి, తిరుగుడుమారి తమ్ముడూ?"

జితేంద్ర నన్ను ఆగ్రా రావడానికి ప్రోత్సహించాడు. ఇక్కడున్న తాజ్‌మహల్ అందాలు చూస్తాం," అని చెప్పాను. "ఆ తరవాత, కొత్తగా నాకు కనిపించిన గురువుగారి దగ్గరికి వెళ్తాం; ఆయనకి శ్రీరాంపూర్‌లో ఆశ్రమం ఉంది."

అనంతుడు, మాకు సుఖంగా ఉండేలా ఆతిథ్యం ఏర్పాటు చేశాడు. అతని కళ్ళు సాలోచనగా నా మీద నిల్చి ఉండడం, సాయంత్రం నాలుగుసార్లు గమనించాను.

"ఆ చూపు నాకు తెలుసు!" అనుకున్నాను. "ఏదో కుట్ర పన్నడం మొదలయింది!"

పొద్దుట మా ఫలహారాల సమయంలో అది బయట పడింది.

"అయితే, నాన్నగారి ఆస్తితో ప్రమేయం లేకుండా నువ్వు స్వతంత్రంగా ఉండగలవన్న మాట!" నిన్నటి సంభాషణ బాణాలు మళ్ళీ సంధిస్తున్నప్పుడు, అనంతుడి చూపులో అమాయకత ఉంది.

"నేను దేవుడిమీదే ఆధారపడి ఉన్న సంగతి నాకు స్పృహలో ఉంది."

"మాటలు తేలికే! జీవితం నిన్ను ఇంతవరకు కాపాడింది. నీ కూటికీ గూటికీ, ఆ భగవంతుడి అదృశ్య హస్తం మీద ఆధారపడవలసిన పరిస్థితే వస్తే - ఎంత దురదృష్టం! త్వరలోనే నువ్వు వీధుల్లో బిచ్చమెత్తుకోవలసి వస్తుంది."

"ఎన్నడూ జరగదు! దేవుణ్ణి కాదని, దారిని పోయేవాళ్ళ మీద విశ్వాస ముంచను! తన భక్తుడికోసం ఆయన, భిక్షాపాత్ర ఒక్కటే కాదు, వెయ్యి వనరులు కల్పించగలడు."

"కవిత్వం వెలగబెడుతున్నావే! ఒకవేళ నేను, నీ డాబుసరి వేదాంతాన్ని ఈ భౌతిక ప్రపంచంలో పరీక్షకి పెడతానంటా ననుకో!"

"ఒప్పుకుంటాను! దేవుణ్ణి ఆలోచనాజగత్తుకే పరిమితం చేస్తావా?"

"సరే, చూద్దాం; నా దృక్పథాన్ని విశాలం చెయ్యడానికో లేక ధ్రువపరచ డానికో నీ కీవేళ అవకాశం వస్తుంది." నాటక ఫక్కిలో ఒక్క క్షణం ఆగి, తరవాత మెల్లగా, గంభీరంగా మాట్లాడాడు.

"ఈ పూట నిన్నూ, నీ తోటి విద్యార్థి జితేంద్రనీ దగ్గర్లో ఉన్న బృందావన మనే ఊరు పంపాలనుకుంటున్నాను. మీరు ఒక్క రూపాయి కూడా వెంట తీసుకెళ్ళ కూడదు; అన్నంకాని, డబ్బుకాని ఎవర్నీ అడుక్కో కూడదు; మీ ఇబ్బంది ఎవ్వరికీ చెప్పకూడదు; తిండి తినకుండా ఉండాకూడదు, బృందావనంలో చిక్కుబడిపోనూ కూడదు. ఈ పరీక్షలో ఏ ఒక్క నియమాన్నీ మీరకుండా, మీరు కనక ఈ రోజు రాత్రి పన్నెండు గంటలలోగా ఇక్కడ నా బంగళాకి తిరిగివస్తే, నా కంటె ఆశ్చర్యపోయేవాడు ఆగ్రా మొత్తంలో మరొకడు ఉండడు!"

"నీ సవాలుకు ఒప్పుకుంటున్నాను." నా మాటల్లోకాని, గుండెలో కాని జంకన్నది ఏ కోశానా లేదు. భగవంతుడు అప్పటికప్పుడు చూపించే కృప తాలూకు జ్ఞాపకాలు కృతజ్ఞతా భరితంగా నా మనస్సులో మెదిలాయి; లాహిరీ మహాశయుల చిత్రపటానికి చేసుకొన్న విన్నపంతో ప్రాణాంతకమైన కలరా జబ్బు నాకు నయ మవడం, లాహోర్‌లో ఇంటి కప్పుమీద రెండు గాలి పడగలు నాకు బహుమతిగా చిక్కడం, బెరైలీలో ఉన్నప్పుడు నేను నిరుత్సాహంగా ఉన్న సమయంలో, సరిగా సమయానికి రక్షరేకు దొరకడం, కాశీలో పండితుడి ఇంటి ఆవరణకు బయట ఒక సాధువుద్వారా నిశ్చయాత్మకమైన సందేశం ఒకటి రావడం, జగన్మాత దివ్య దర్శనం, ఆవిడ ప్రియవాక్కులు, నా హైస్కూలు డిప్లమా సంపాయించడానికి వీలుగా చివరి క్షణంలో నాకు దారి దొరకడం, జీవితమంతా కంటున్న కలల పొగ మంచులోంచి నా గురుదేవుల దర్శనభాగ్యమనే పరమోత్కృష్టమైన వరం లభించడం - ఇవన్నీ గుర్తుకు వచ్చాయి. ఈ ప్రపంచపు భీకర సంగ్రామ రంగాల్లో నా "వేదాంతం", ఏ ఒక్క పోరాటాన్ని ఎదుర్కోజాలదని అన్నా ఒక్కనాటికి ఒప్పుకోను!

"నీ ఒప్పుదల మెచ్చుకోదగ్గది. ఇప్పుడే మిమ్మల్ని రైలెక్కించడానికి వస్తాను," అన్నాడు అనంతుడు.

జితేంద్రుడు నోరు వెళ్లబెట్టాడు. అన్నయ్య వాడివేపు తిరిగి ఇలా అన్నాడు: "నువ్వుకూడా తోడు వెళ్ళాలి - ఇందుకు సాక్షిగానూ, బహుశా తోడుగా బాధలకు గురికావడానికీనూ!"

తరవాత ఒక అరగంటలో నాకూ జితేంద్రకీ, ఒకవైపు ప్రయాణానికి టిక్కెట్లు చేతికి వచ్చాయి. స్టేషనులో ఒక మూల మమ్మల్ని తనిఖీ చేసుకోడానికి అవకాశం ఇచ్చాం. మే మెక్కడా దాపరికంగా డబ్బు తీసుకువెళ్ళడం లేదని తొందర గానే తృప్తిపడ్డాడు అనంతుడు ; మా సాదా పంచెలు అవసరమైన వాటిని తప్ప మరేమీ మరుగుపరచలేదు.

దేవుడి మీది విశ్వాసం, డబ్బులాంటి గంభీరమైన విషయాల మీద దాడి చేసేసరికి మా స్నేహితుడు ఆక్షేపణ తెలుపుతూ ఇలా అన్నాడు. "అనంతా, కాపుదల కోసం ఒకటి రెండు రూపాయలియ్యి నాకు. దురదృష్టం ఎదురయితే అప్పుడు నీకు టెలిగ్రాం ఇయ్యగలుగుతాను."

"జితేంద్రా!" నా నోట్లోంచి వచ్చిన మాట కటువుగా, మందలింపులా ఉంది.

"చివరి కాపుదల కోసం నువ్వేమయినా డబ్బు తీసుకునేటట్టయితే ఈ పరీక్షకు నేను రాను!"

"డబ్బుల గలగలలో ఏదో భరోసా ఉంటుంది." నేను కఠినంగా హెచ్చరించే సరికి జితేంద్రుడు ఇంతకుమించి ఏమీ అనలేదు.

"ముకుందా, నేను హృదయంలేనివాణ్ణి కాను." అనంతుడి గొంతులోకి మార్దవం చొరబడింది. అతన్ని బహుశా అంతరాత్మ మందలిస్తున్నట్టుంది. చేతిలో పైసలేని కుర్రవాళ్ళ నిద్దరిని పరిచయంలేని పట్నానికి పంపుతున్నందువల్ల కావచ్చు; మతపరంగా తనకున్న సంశయశీలతవల్లనైనా కావచ్చు. "అదృష్టవశాన లేక భగవత్కృపవలన నువ్వు ఈ బృందావన పరీక్షలో కనక నెగ్గితే నన్ను నీ శిష్యుడిగా స్వీకరించి ఉపదేశమిమ్మని అడుగుతాను."

ఈ వాగ్దానంలో ఒక అసందర్భం ఉంది. అయితే సంప్రదాయ విరుద్ధమైన ఆ సందర్భానికి తగ్గట్టుగానే ఉంది. పెద్దన్న చిన్నవాళ్ళకి తలవంచడమన్నది భారతీయ కుటుంబంలో అరుదు; చిన్నవాళ్ళు తండ్రి తరవాత అంత గౌరవమూ విధేయతా అతనికే చూపిస్తారు. కాని నే నేమీ వ్యాఖ్యానించడానికి వ్యవధి లేదు; మా బండి బయల్దేరబోతోంది.

రైలుబండి మైళ్ళకు మైళ్ళు సాగిపోతూంటే జితేంద్రుడు, దిగులు మొహం పెట్టుకొని మాటా పలుకూ లేకుండా కూర్చుని ఉన్నాడు. చివరికి కదిలాడు. ముందుకు వాలి, సున్నితమైన ఒకచోట, బాగా నొప్పి పుట్టేలా నన్ను గిల్లాడు.

"భగవంతుడు మనకి తరవాతి భోజనం ఏర్పాటుచేస్తాడన్న సూచన ఏదీ నాకు కనిపించడం లేదు!"

"ఓయి అనుమానం మనిషీ, నిబ్బరంగా ఉండు. దేవుడు మనతోటే పని చేస్తున్నాడు.

"అదేదో ఆయన త్వరగా చేసేటట్టు ఏర్పాటు చెయ్యగలవా? ముందు పరిస్థితి తలుచుకునేసరికే కరకరా ఆకలి వేస్తోంది. నేను కాశీ విడిచిపెట్టి వచ్చింది తాజ్ సమాధి చూడ్డానికే కాని నేను సమాధి కావడానికి కాదు!"

"ధైర్యం తెచ్చుకో జితేంద్రా! మొట్టమొదటి సారిగా మనం బృందావనంలో దైవ సంబంధమైన అద్భుతాలు చూడనక్కర్లేదూ? కృష్ణ భగవానుడి పాదస్పర్శతో పవిత్రమైన ప్రదేశంలో మనం నడవబోతున్నామన్న ఆలోచనతోనే నేను గాఢమైన ఆనందంలో మునిగి ఉన్నాను."

మా రైలుపెట్టె తలుపు తెరుచుకుంది; ఇద్దరు మగవాళ్ళు వచ్చి కూర్చున్నారు. దీని తరవాత రైలు ఆగబోయే చోటే చివరిది.

"అబ్బాయిలూ, బృందావనంలో మీ కెవరయినా స్నేహితులున్నారా?" నా ఎదురుగా కూర్చున్న అపరిచితవ్యక్తి, మా విషయంలో ఆసక్తి తీసుకుని మమ్మల్ని ఆశ్చర్యపరిచారు.

"మీ కనవసరం!" మొరటుగా నా కళ్ళు తిప్పేశాను.

"బహుశా మీరు, ఆ చిత్తచోరుడి* మోహంలో పడి ఇళ్ళనుంచి పారిపోతున్నా రనుకుంటాను. నా మట్టుకు నేనూ భక్తిభావం గలవాణ్ణే. మీకు భోజనమూ, మలమల మాడ్చే ఈ ఎండనుండి రక్షణ కల్పించే వసతీ సమకూరేలా చూడడం నా అనివార్య కర్తవ్యంగా స్వీకరిస్తాను."

"వద్దండి. మమ్మల్ని వదిలెయ్యండి; మీరు చాలా దయగలవారు. కాని మేము ఇంట్లోంచి పారిపోయి వచ్చామనుకోడంలో మాత్రం మీరు పొరపాటు పడ్డారు."

అటుతరవాత సంభాషణ ఏమీ జరగలేదు; బండి అడంగుకు చేరి ఆగింది. నేనూ జితేంద్రా ప్లాట్‌ఫారం మీదికి దిగేసరికి మా తోటి ప్రయాణికులు మా ఇద్దరి చేతులూ పట్టుకొని ఒక గుర్రబ్బండిని పిలిచారు.

మేము ఒక పెద్ద ఆశ్రమం ముందు బండి దిగాం. ఆ ఆశ్రమం, చక్కగా తీర్చిదిద్దిన ఆవరణలో పచ్చటి చెట్లమధ్య అలరారుతోంది. మా ఉపకారులు

---

* హరి, భక్తులకు ప్రియమైన శ్రీకృష్ణుడి పేరు.

ఇక్కడివారికి తెలిసినవాళ్ళేనని స్పష్టమయింది; చిరునవ్వు చిందిస్తున్న కుర్రవాడొకడు ఏమీ వ్యాఖ్యానించకుండా మమ్మల్ని ఒక సావిట్లోకి తీసుకువెళ్ళాడు. కాసేపట్లో, హుందాతనం ఉట్టిపడుతున్న ఒక వృద్ధురాలు వచ్చి మమ్మల్ని కలుసుకున్నారు.

"గౌరీమాఁ, యువరాజులు రాలేకపోయారు," వారిలో ఒకరు ఆశ్రమ అతిథేయినితో అన్నారు "చివరి క్షణంలో, వాళ్ళ కార్యక్రమాలు మారిపోయాయి. అందుకు ఎంతో విచారం వెలిబుచ్చారు. అయినా మేము వేరే ఇద్దరు అతిథుల్ని తీసుకొచ్చాం. మేము రైల్లో కలుసుకోగానే, వీళ్ళు కృష్ణభగవానుడి భక్తులుగా నన్ను ఆకర్షించారు."

"వెళ్ళొస్తాం బాబూ!" అంటూ, మాకు పరిచితులైన ఇద్దరూ గుమ్మం వేపు నడిచారు. "దైవానుగ్రహముంటే మళ్ళీ కలుసుకుందాం."

"మీ రిక్కడికి రావడం చాలా సంతోషం," మాతృసహజమైన రీతిలో గౌరీ మాత చిరునవ్వు నవ్వారు. "మీరు రావడానికి ఇంతకన్న మంచిరోజు లేదు. ఈ రోజు, ఆశ్రమం రాజపోషకు లిద్దరు వస్తారని ఎదురు చూస్తూ ఉన్నాం. నా వంట మెచ్చుకునేవాళ్ళు లేకపోతే ఎంత విచారించవలసి వచ్చేది?"

మధురమైన ఈ మాటలు జితేంద్ర మీద ఆశ్చర్యకరంగా పనిచేశాయి; కళ్ళ నీళ్ళు పెట్టేసుకున్నాడు. బృందావనంలో తనకు ఎదురవుతుందని భయపడ్డ పరిస్థితి, రాజోచితమైన స్వాగతంగా మారిపోయింది. అందుచేత మానసికంగా సర్దుబాటు చేసుకోడం కష్టమైపోయింది వాడికి. గౌరీమాత వాడివేపు కుతూహలంగా చూశారు; కాని ఏమీ వ్యాఖ్యానించ లేదు. బహుశా, ఇలాటి కుర్రతనపు చేష్టలు ఆవిడకు తెలిసే ఉంటాయి.

భోజనం వేళ అయిందని కబురు అందింది. గౌరీమాత మమ్మల్ని భోజన శాలకు తీసుకువెళ్ళారు. వంటకాల సువాసనలతో ఘుమఘుమలాడుతూ ఉందక్కడ. పక్కనున్న వంటింట్లోకి అదృశ్యమయా రావిడ.

ఈ క్షణం కోసం నేను ముందునుంచీ ఎదురు చూస్తున్నాను. జితేంద్ర ఒంటిమీద సరయిన చోటు ఒక్కటి చూసి ఒక్క గిల్లు గిల్లాను. వాడు రైల్లో నన్ను, ఎంత నొప్పి పెట్టేలా గిల్లాడో నేనూ అంత నొప్పి పెట్టేలా గిల్లాను.

"ఓయి అనుమానం మనిషీ, దేవుడు అన్ని ఏర్పాట్లు చేస్తాడు - అదీ తొందర గానే సుమా!" గౌరీమాత ఒక విసినికర్రతో తిరిగి వచ్చారు. కంబళీవంటి చిత్రాసనాలమీద మేము ఆసీనులమవగా, ప్రాచ్య సాంప్రదాయ పద్ధతిలో ఆమె

మాకు మెల్లిగా విసరడం ప్రారంభించారు. ఆశ్రమ విద్యార్థులు సుమారు ముప్ఫై రకాల వంటకాలతో ఇటూ అటూ తిరిగారు. దీన్ని మామూలు "భోజనం" అనడం కంటె "మృష్టాన్న భోజనం" అనడం సబబు. ఈ భూమి మీద పడ్డాక నేనూ జితేంద్రా అంత రుచిగల వంటకాలు ఎన్నడూ రుచి చూసి ఎరగం.

"రాజభోజనానికి తగ్గ వంటకాలివి, మాతాజీ! మీ రాజపోషకులకు, ఈ విందుకు రావడం కంటె అవసరమైన పని ఏం పడిందో నేను ఊహించలేను. జీవితాంతం మనస్సులో నిలిచే జ్ఞాపకం ప్రసాదించారమ్మా!"

అనంతుడు పెట్టిన షరతు మూలంగా నోరు మూసుకొని ఉండ వలసిన మేము, మా ధన్యవాదాలకు రెండు రకాల ప్రాముఖ్యం ఉందన్న సంగతి ఆ దయామయికి వివరించలేకపోయాం. కనీసం మా చిత్తశుద్ధి వెల్లడి అయింది. ఆవిడ ఆశీస్సులతోబాటు, ఆశ్రమానికి మళ్ళీ రమ్మన్న ఆహ్వానం కూడా అందు కొని మేము బయటికి వచ్చాం.

బయట వేడి దారుణంగా ఉంది. నేనూ నా స్నేహితుడూ ఆశ్రమం గేటు దగ్గరున్న పెద్ద కడిమిచెట్టు నీడలో తలదాచుకున్నాం. తరవాత ఘాటు ఘాటుగా సంభాషణ జరిగింది; జితేంద్ర మళ్ళీ అనుమానాల్లో పడ్డాడు.

"నువ్వు నన్ను పెద్ద చిక్కులోకి లాగావు! మధ్యాహ్న భోజనం మనకి కాకతాళీయంగా దొరికింది! కాని ఊళ్ళో చూడదగ్గ చోట్లు ఎలా చూస్తాం, మన దగ్గర ఒక్క పైసా లేకుండా? మళ్ళీ నువ్వు అనంతుడి ఇంటికి ఎలా తీసుకు వెళ్తావు నన్ను?"

"ఇప్పుడు నీ కడుపు నిండింది కనక, దేవుణ్ణి ఇట్టే మరిచి పోయావు." నా మాటలు కటువుగా అయితే లేవుగాని నింద మోపుతున్నట్టుగా ఉన్నాయి. దేవుడి దయను మనుషులు ఎంత తొందరగా మరిచి పోతారు! తన ప్రార్థనల్లో కొన్నయినా ఫలించగా చూడని మనిషంటూ ఉండడు.

"నీలాంటి పిచ్చివాడితో కలసి రావడం ఎంత బుద్ధితక్కువో నేను మరిచి పోను!"

"నిబ్బరంగా ఉండు జితేంద్రా! మనకు తిండి పెట్టిన ఆ భగవంతుడే బృందావనం చూపించి ఆగ్రాకు తిరిగి పంపిస్తాడు."

ముచ్చట గొలిపే ముఖ కవళికలుగల సన్నటి యువకు డొకడు గబగబా నడుస్తూ మా దగ్గరికి వచ్చాడు. చెట్టు దగ్గర ఆగిపోయి, నా ముందు వంగి నమస్కరించాడు.

"ప్రియమిత్రమా, మీరూ మీ స్నేహితుడూ ఈ ఊరికి కొత్త అయి ఉండాలి. మీకు ఆతిధ్యం ఇవ్వడానికి ఊరు చూపించడానికీ నాకు అనుమతి ఇవ్వండి."

భారతీయుడి ముఖం పాలిపోవడమన్నది చాలా అరుదు; కాని జితేంద్రుడి ముఖంలో కత్తివాటుకు నెత్తుటి చుక్క లేదు.

అతను చెయ్యదలచిన సహాయాన్ని నేను మర్యాదగా తిరస్కరించాను.

"మీరు నన్ను నిజంగా వెళ్ళగొట్టడం లేదు కదూ?" మరే పరిస్థితిలోనో అయితే ఆ అపరిచితుడి వ్యాకులతకు మాకు నవ్వు వచ్చి ఉండేది.

"ఎందుక్కాదు?"

"మీరు నా గురువులు," విశ్వాసాన్ని నింపుకొన్న అతని కళ్ళు నా కళ్ళలోకి చూశాయి. మధ్యాహ్నం ధ్యానంచేసుకొనే వేళ, శ్రీకృష్ణ భగవానుడు నాకు దర్శనమిచ్చి, సరిగా ఈ చెట్టు కిందే ఇద్దరు పరిత్యక్త వ్యక్తుల ఆకారాల్ని నాకు చూపించాడు. వాటిలో ఒకటి మీది గురుదేవా, నేను ధ్యానసమయంలో తరచుగా మీ మూర్తినే చూస్తుండే వాణ్ణి. సవినయంగా నే నందిచ్చే సేవల్ని మీరు స్వీకరిస్తే ఎంతో ఆనందిస్తాను!"

"మీరు నన్ను కనుక్కున్నందుకు నాక్కూడా సంతోషంగానే ఉంది. దేవుడు గాని, మనుషులుకాని మమ్మల్ని పరిత్యజించలేదు!" నేను, నా ఎదుట ఆత్రంగా చూస్తున్న వ్యక్తి ముఖంలోకి చూసి చిరునవ్వు నవ్వుతూ నిశ్చలంగా ఉన్నప్పటికీ, మనస్సులోనే భగవంతుడి దివ్య చరణాలకు మొక్కుకున్నాను.

"మిత్రులారా, ఒక్కసారి మీరు మా ఇంటిని పావనం చెయ్యరూ?"

"మీరు దయగలవారే; కాని అలా చెయ్యడానికి కుదరదు. ఇప్పటికే మేము, ఆగ్రాలో మా అన్నయ్యకి అతిధులుగా ఉన్నాం."

"పోనీ కనీసం, మీతో కలిసి బృందావనంలో తిరిగానన్న జ్ఞాపకాలన్నా నాకు మిగిలేటట్టు అనుగ్రహించండి."

నేను సంతోషంగా ఒప్పుకొన్నాను. ఆ యువకుడి పేరు ప్రతాప్ చటర్జీ అని చెప్పాడు. ఒక గుర్రబ్బండిని పిలిచాడు. మేము మదన మోహన ఆలయమూ తక్కిన కృష్ణాలయాలూ దర్శించాం. మా ఆలయ సేవలు పూర్తి అయేసరికి చీకటి పడింది.

" నేను సందేశ్ తీసుకొచ్చే దాకా ఆగండి." ప్రతాప్, రైలు స్టేషను దగ్గర ఒక దుకాణంలోకి వెళ్ళాడు. వెనకటికన్న ఇప్పుడు చల్లగా, జనసమ్మర్దంగా ఉన్న

విశాలమైన వీధిలో నేనూ జితేంద్రా పచార్లు చేశాం. కొంతసేపటిదాకా మా స్నేహితుడు తిరిగి రాలేదు; చివరికి బోలెడు మిఠాయిలు మాకు కానుకగా తెచ్చాడు.

"ఈమాత్రం పుణ్యం చేసుకోడానికి దయతో నన్ను అనుగ్రహించండి," కొన్ని రూపాయల కట్ట, ఆగ్రాకి అప్పుడే కొన్న రెండు టిక్కెట్లు చూపిస్తూ బతిమాలుతున్నట్టుగా చిరునవ్వు నవ్వాడు ప్రతాప్. వాటిని స్వీకరించడంలో నేను చూపిన భక్తిశ్రద్ధలు భగవానుని అదృశ్య హస్తానికే చెందుతాయి. అనంతుడు ఎంత ఎగతాళి చేసినప్పటికీ, దాని ఔదార్యం, అవసరాన్ని ఎంతో మించిపోలేదా?

స్టేషనుకు దగ్గరిలో ఒక ఏకాంత ప్రదేశం చూసుకున్నాం.

"ప్రతాప్, మీకు క్రియాయోగం నేర్పుతాను; ఆధునిక కాలంలో అందరి కన్న గొప్ప యోగి అయిన లాహిరీ మహాశయుల దిది. ఆయన యోగవిద్యే మీకు గురువు."

ఒక్క అరగంటలో దీక్ష ముగిసింది. " 'క్రియ' నీకు చింతామణి*," అన్నాను కొత్త శిష్యుడితో. "పద్ధతి సులువైందని నువ్వు గమనించే ఉంటావు. మనిషి ఆధ్యాత్మిక పరిణామాన్ని త్వరితం చేసే నేర్పు దీనికి ఉంది. దేహధారణ చేసే అహంకారం, మాయ నుంచి విముక్తి పొందడానికి పది లక్షల సంవత్సరాలు పడుతుందని భారతీయ పవిత్ర గ్రంథాలు చెబుతున్నాయి. క్రియాయోగం ద్వారా, సహజమైన ఈ కాలావధి చాలా వరకు తగ్గిపోతుంది. జగదీశ్‌చంద్ర బోసు మన కళ్ళకు కట్టించినట్టు, మొక్క పెరుగుదలను మామూలు రేటుకు మించి త్వరితం చెయ్యడానిక వీలున్నట్టు, మనిషి మానసిక వికాసాన్ని కూడా శాస్త్రీయ సాధనల ద్వారా త్వరితం చెయ్యవచ్చు. నీ సాధనలో నిష్ఠగా ఉండు; గురువులందరికీ గురువయినవాణ్ణి చేరతావు నువ్వు."

"ఎంతో కాలంగా నేను వెతుకుతున్న ఈ యోగ ప్రక్రియను పొందడం నాకెంతో సంతోషంగా ఉంది," అన్నాడు ప్రతాప్ సాలోచనగా. "ఈ ప్రక్రియ ఇంద్రియ బంధనాల నుంచి నాకు విముక్తి కలిగించి, ఉచ్చస్థితులకు తీసుకు వెడుతుంది. 'నేడు నాకు శ్రీకృష్ణ భగవానుని దర్శనం అయిందంటే దాని అర్థం నాకు అతి గొప్పమేలు కలుగుతుందనే."

మేము కొంతసేపు నిశ్శబ్ద అవగాహనలో కూర్చున్నాము. ఆ తరవాత స్టేషన్‌లోకి వెళ్ళాం. రైలు ఎక్కుతూ ఉండగా, నా కెంతో ఆనందం కలిగింది

---

* కోరికలు తీర్చే శక్తిగల పురాణ ప్రసిద్ధమైన మణి; భగవన్నామాలలో ఇదొకటి.

కాని జితేంద్రుడికి ఈ రోజు కన్నీళ్ళ రోజు. ప్రతాప్‌కు నేను ఆప్యాయంగా వీడ్కోలు చెబుతూ ఉండగా నా మిత్రు లిద్దరికీ మధ్య మధ్య ఎక్కెక్కి ఏడుపులు వచ్చాయి. ప్రయాణంలో మళ్ళీ మరోసారి జితేంద్రుడు దుఖంలో మునిగాడు. ఈసారి తనకోసం కాదు; తన పరిస్థితి గురించి.

"భగవంతుడి మీద నా విశ్వాసం, గాఢతలేకుండా ఎంత పైపైన ఉంది! నా గుండె బండబారింది! ఇక ముందెప్పుడూ దేవుడి రక్షణను శంకించను!"

అర్ధరాత్రి కావస్తోంది. చేతిలో పైస లేకుండా వెళ్ళిన "సిండరెల్లాలు" ఇద్దరూ అనంతుడి పడగ్గదిలోకి ప్రవేశించారు. తను వేళాకోళంగా చేసిన జోస్యమే నిజ మయింది. అతని ముఖంలో కనిపించిన ఆశ్చర్యం చూసి తీరవలసిందే. నేను మాట్లాడకుండా, బల్లమీద రూపాయి కాయితాలు కురిపించాను.

"జితేంద్రా, నిజం చెప్పు," అనంతుడి గొంతులో వేళాకోళం ఉంది. "ఈ కుర్రవాడు ఎక్కడా దారి దోపిడీకి దిగలేదు కదా?"

కాని కథ విడివడుతున్న కొద్దీ మా అన్నయ్య, శాంతపడుతూ వచ్చి తరవాత గాంభీర్యం వహించాడు.

"అవసరాన్ని బట్టి లబ్ధి ఉంటుందనే సూత్రం (డిమాండ్ - సప్లయి సూత్రం) నే ననుకున్నదానికన్న సూక్ష్మమైన స్తరాల్లో కూడా పని చేస్తుంది," ఇంతకు ముందెన్నడూ పొడగట్టని ఆధ్యాత్మిక ఉత్సాహంతో అన్నాడు అనంతు అన్నయ్య. ప్రాపంచిక జనుల ధనాగారాల పట్ల, కూడపెట్టే ధోరణి పట్ల నీకుండే విముఖత్వం నా కిప్పుడు మొదటిసారిగా అర్థమవుతోంది."

అంత అపరాత్రి వేళ కూడా, అప్పటికప్పుడు తనకి క్రియాయోగ దీక్ష* ఇమ్మని మా అన్నయ్య పట్టుబట్టాడు. "గురు" ముకుందుడు, ఒకే రాత్రి, ఇద్దరు ఆయాచిత "శిష్యు"ల బాధ్యత వహించవలసి వచ్చింది.

మర్నాడు పొద్దున ముందురోజు కరువైన, సామరస్యంతో ఫలహారాలు చేశాం. నేను జితేంద్రుడి వైపు చూసి చిరునవ్వు నవ్వాను. "నీ తాజ్ సందర్శనం ఎగర గొట్టనులే. తాజ్ మహల్ చూసి శ్రీరామ్‌పూర్‌కు బయల్దేరుదాం."

---

* ఆధ్యాత్మిక ఉపదేశం; సంస్కృతంలో 'దీక్ష్' అనే ధాతువు నుంచి వచ్చింది; తాను అంకితం కావడం అని దీనికి అర్థం.

అనంతుకు వీడ్కోలు చెప్పి నేనూ నా స్నేహితుడూ ఆగ్రాకు ఘనత చేకూర్చిన తాజ్‌మహల్‌కు వచ్చి ఎదురుగా నించున్నాం. ఎండలో కళ్ళు మిరుమిట్లు గొలిపే తెల్లటి ఆ పాలరాతి కట్టడం, సంపూర్ణ సౌష్ఠవానికి నిదర్శనంగా నిలిచింది. నల్లని తమాల వృక్షాలు, మిలమిల మెరిసే పసరిక నేల, ప్రశాంతమైన నీటి మడుగు, దానికి చక్కని దృశ్యం సమకూర్చాయి. విలువైన రాళ్ళు పొదిగి లతలు చెక్కిఉన్న భాగాలు, లోపల అద్భుతంగా ఉన్నాయి. గోధుమ, ఊదా రంగుల పాలరాళ్ళలోంచి సున్నితమైన పూలగుత్తులు, కాయితం చుట్టల్లాంటివి బయటికి వస్తున్నట్టుగా చెక్కడం జరిగింది. గుమ్మటంనుంచి వచ్చే దీపకాంతి షాజహాన్ చక్రవర్తి సమాధి మీదా, ఆయన రాజ్యానికీ హృదయానికీ కూడా రాణి అయిన ముంతాజ్ - ఇ - మహల్ సమాధి మీదా ప్రసరిస్తోంది.

దృశ్యాలు చూడటం ఇక చాలు! నేను నా గురువుగారికోసం తహతహలాడు తున్నాను. కాసేపటికి నేనూ జితేంద్రుడూ దక్షిణదిశగా బెంగాల్ వేపు సాగే రైల్లో ప్రయాణం చేస్తున్నాం.

"ముకుందా, కొన్ని నెలలుగా నేను మావాళ్ళని చూడలేదు. నా మనస్సు మార్చుకున్నాను; బహుశా తరవాత ఎప్పుడో నేను శ్రీరాంపూర్‌లో మీ గురువు గారి దర్శనం చేసుకుంటాను."

కొంచెం సున్నితంగా చెప్పాలంటే, ఊగిసలాట మనస్తత్వం గల నా స్నేహితుడు నన్ను కలకత్తాలో వదిలిపెట్టి పోయాడు. నేను లోకల్ ట్రెయిన్‌లో, ఉత్తర దిశగా పన్నెండు మైళ్ళ దూరంలో ఉన్న శ్రీరాంపూర్ వెళ్ళాను.

కాశీలో గురువుగారిని కలిసి అప్పటికి సరిగా ఇరవై ఎనిమిది రోజులయిం దన్న సంగతి గ్రహించేసరికి ఆశ్చర్యం వేసింది. "నువ్వు నాలుగు వారాల్లో వస్తావు నా దగ్గరికి!" ప్రశాంతంగా ఉన్న రాయ్‌ఘాట్ సందులో వారి ఆశ్రమం ముంగిట్లో అడుగుపెట్టాను - గుండె దడదడలాడుతోంది. భారతదేశపు జ్ఞానావతారుల సన్నిధిలో, తరవాత పదేళ్ళలో ఎక్కువ భాగం గడపడానికి నేను మొట్టమొదటి సారిగా ఆ ఆశ్రమంలో అడుగుపెట్టాను.

అధ్యాయం : 12

# గురుదేవుల ఆశ్రమంలో గడిచిన కాలం

"వచ్చేశావు," బాల్కనీ ఉన్న గదిలో నేలమీద పులిచర్మం మీద కూర్చున్న శ్రీయుక్తేశ్వర్‌గారు నన్ను పలకరించారు. ఆయన కంఠస్వరం ముక్తసరిగా ఉంది. ఆయన తీరు భావోద్రేకరహితంగా ఉంది.

"ఔను గురుదేవా, మిమ్మల్ని అనుసరించడానికి వచ్చాను," మోకరిల్లి ఆయన పాదాలు ముట్టుకున్నాను.

"అదెలా సాధ్యం? నా కోరికల్ని నువ్వు ఉపేక్షిస్తావు."

"ఇకముందు అలా జరగదు గురూజీ! మీ కోరికే నాకు శాసనం!"

"బాగుంది! అలా అయితే నీ జీవితానికి బాధ్యత వహించగలను."

"మన: పూర్తిగా ఆ భారం మీ మీదే పెడుతున్నాను గురుదేవా!"

"అయితే నా మొదటి కోరికగా, నువ్వు మీ వాళ్ళ దగ్గరికి తిరిగి వెళ్ళు. నువ్వు కలకత్తాలో కాలేజీలో చేరి చదువు కొనసాగించాలని నేను కోరుతున్నాను."

"మంచిది గురుదేవా!" నా గాభరాని మరుగుపరిచాను. ఈ మొండి పుస్తకాలు ఏళ్ల తరబడి నన్ను వెంబడిస్తూనే ఉంటాయా? మొదట్లో నాన్నగారూ ఇప్పుడు శ్రీయుక్తేశ్వర్‌గారూ!

"ఎప్పుడో ఒకనాడు నువ్వు పడమటి దేశాలకు వెడతావు. అపరిచితుడైన హిందూ బోధకుడికి విశ్వవిద్యాలయ పట్టం ఒకటి ఉన్నట్లయితే అక్కడి ప్రజలు, భారతదేశపు సనాతన విజ్ఞానాన్ని ఆకళించుకోడానికి మరింత సుముఖంగా ఉంటారు."

"ఈ విషయం మీకే బాగా తెలుసు గురూజీ!"

నా విచారం తొలగిపోయింది. పడమటి దేశాలగురించి ఆయన చేసిన ప్రస్తావన, నాకు గజిబిజిగా, ఊహకు అందకుండా ఉంది. కాని అణకువగా ఉండి

గురువుగారిని సంతోషపెట్టడం నాకు చాలా ముఖ్యమైన తక్షణ కర్తవ్యం.

"దగ్గరగా కలకత్తాలో ఉంటావు; నీకు సమయం చిక్కినప్పుడు ఇక్కడికి వస్తూ ఉండు."

"వీలుంటే, ప్రతిరోజూ వస్తాను స్వామీ! నా జీవితంలో ప్రతి ఒక్క విషయం లోనూ మీ అధికారాన్ని కృతజ్ఞతతో అంగీకరిస్తాను - కాని ఒక్క షరతు."

"చెప్పు."

"దైవసాక్షాత్కారం కలిగిస్తానని మీరు నాకు మాట ఇయ్యాలి!"

ఆ తరవాత ఒక గంటసేపు వాగ్యుద్ధం జరిగింది. గురువుగారు ఇచ్చిన మాట బోటుకాగూడదు; అదంత తేలిగ్గా ఇచ్చేది కాదు. ఇలాటి వాగ్దానంలో, విస్తారమైన ఆధ్యాత్మిక మార్గాల్ని ఆవిష్కరిస్తానన్న గూఢార్థం ఇమిడి ఉంటుంది. ఏ గురువయినా, సృష్టికర్తను సాక్షాత్కరించమని అడిగేటట్టయితే, అంతకు ముందు అతడు ఆయనతో అంత చనువు ఏర్పరుచుకొని ఉండాలి! శ్రీయుక్తేశ్వర్ గారికి భగవంతుడితో ఉన్న తాదాత్మ్యాన్ని నేను పసిగట్టాను; ఆయన శిష్యుడిగా ఈ లాభం కోసం పట్టుబట్టాలని నిశ్చయించుకొని ఉన్నాను.

"బలవంతంగా రాబట్టుకొనే స్వభావం నీది!" ఆ తరవాత, దయతో కూడిన తుదిమాటగా, గురువుగారి సమ్మతి వచ్చింది :

"నీ కోరికే నా కోరిక; కానియ్యి."

నా హృదయం మీద, జీవిత పర్యంతం కమ్ముకొని ఉన్న మబ్బును తొల గించినట్టయింది. ఇహపరాల్లో ఒక దారీ తెన్నూ లేకుండా నేను చేస్తున్న అన్వేషణ అంతటితో అయిపోయింది. ఇప్పుడు నాకు ఒక సద్గురువు సన్నిధిలో శాశ్వతమైన ఆశ్రయం దొరికింది.

"రా, ఆశ్రమం చూపిస్తాను నీకు," గురుదేవులు వ్యాఘ్రాసనం మీంచి లేచారు. చుట్టుపక్కల పరకాయిస్తూ, ఒక గోడమీద, మల్లెపూల దండ వేసిన పటం ఒకటి చూశాను.

"లాహిరీ మహాశయులు!" ఆశ్చర్యపోయి అన్నాను.

"ఔను, నా గురుదేవులు!" శ్రీయుక్తేశ్వర్‌గారి గొంతులో భక్తి భావం ఉట్టి పడింది. "మనిషిగానూ, యోగిగానూ ఆయన చాలా గొప్పవారు. నేను చేసిన జీవిత పరిశీలనల పరిధిలోకి వచ్చిన గురువులందరిలోకి ఆయన మహనీయులు."

సుపరిచితమైన ఆ పటం ముందు నేను నిశ్శబ్దంగా తల వంచాను. పసి తనంలోనే నన్ను దీవించి, ఈ క్షణం వరకు నన్ను ముందుకు నడిపిస్తూ వచ్చిన

ఆ అద్వితీయ పరమ గురుదేవులకు నా ఆత్మ జోహార్లు అర్పించింది.

గురువుగారు ముందు నడుస్తూ దారి చూపిస్తూండగా, ఇంట్లోనూ బయట దొడ్లోనూ తిరిగాను. మంచి విశాలంగా, ఎప్పుడో చాలాకాలం కిందట కట్టు దిట్టంగా, భారీ ఎత్తు స్తంభాలతో పెద్దగా కట్టిన ఆశ్రమ భవనం, మండువా చుట్టూ ఉంది. బయటి గోడలు నాచుపట్టి ఉన్నాయి; మర్యాదలేకుండా ఆశ్రమంలోకి వచ్చి మకాం పెట్టిన పావురాలు, బూడిద రంగు మిద్దెమీద రెక్కలు ఆడిస్తు న్నాయి. పనసచెట్లు, మామిడిచెట్లు, అరటిచెట్లు ఉన్న పెరటిదొడ్డి చూడ ముచ్చటగా ఉంది. ఈ రెండంతస్తుల భవనంలో పైనున్న గదులకు, చిన్న పిట్టగోడలతో ఉన్న బాల్కనీలు, దొడ్డికి మూడువైపులా కనిపించేట్టు ఉన్నాయి. కింది అంతస్తులో, వరసగా ఉన్న స్తంభాల మీద ఎత్తుగా పైకప్పు ఉన్న విశాల మయిన హాలు ఉంది; దీన్ని ముఖ్యంగా, ఏటేటా వచ్చే దుర్గాపూజ ఉత్సవాలకు వాడతారని గురువుగారు అన్నారు. శ్రీయుక్తేశ్వర్‌గారు కూర్చునే గదికి వెళ్ళడానికి సన్నటి మేడమెట్లు ఉన్నాయి; వారి గది బాల్కనీ వీధివేపు ఉంది. ఆశ్రమంలో అమర్చిన సామానంతా నిరాడంబరంగా ఉంది. అన్నీ పరిశుభ్రంగా, ఉపయోగకరంగా ఉన్నవే. పాశ్చాత్య ఫక్కీలో కుర్చీలు, బెంచీలు, మేజాలు కూడా కనిపించాయి.

ఆ రాత్రికి నన్నక్కడ ఉండిపొమ్మని కోరారు గురువుగారు. కాయగూరలతో వండిన కూరతో భోజనం పెట్టారు. ఆశ్రమంలో శిక్షణ పొందుతున్న శిష్యులిద్దరు వడ్డన చేశారు.

"గురూజీ, మీ జీవితాన్ని గురించి కొంచెం చెప్పండి." ఆయన కూర్చున్న పులిచర్మానికి దగ్గరగా, ఒక తుంగచాపమీద కూర్చున్నాను. బాల్కనీకి బయట ఉన్న నక్షత్రాలు స్నేహితుల్లా దగ్గరగా ఉన్నట్టు అనిపిస్తున్నాయి.

"నా సంసారనామం ప్రియనాథ్ కరార్. నే నిక్కడే, శ్రీరాంపూర్‌లో పుట్టాను.* నాన్నగారు సిరిసంపదలున్న వ్యాపారి. ఇప్పుడు నా ఆశ్రమంగా ఉన్న, తాతలనాటి ఈ భవనాన్ని ఆయన నా కిచ్చారు. యథావిధిగా నేను బడికి వెళ్ళింది తక్కువ. నా కది మందగొడిగాను, లోతులేనట్టుగాను అనిపించేది. యౌవనంలో అడుగు పెట్టిన తొలినాళ్ళలోనే నేను సంసార బాధ్యతలు పైన వేసుకున్నాను. నాకో కూతు రుంది, పెళ్ళయింది. మధ్య జీవితంలో నాకు లాహిరీ మహాశయుల మార్గదర్శిత్వ భాగ్యం కలిగింది. నా భార్య చనిపోయిన తరవాత సన్యాసం తీసుకున్నాను. శ్రీయుక్తేశ్వర్ గిరి† అనే కొత్తపేరు వచ్చింది. ఇంతింత మాత్రమే నా జీవిత వృత్తాంతాలు."

---

* శ్రీయుక్తేశ్వర్‌గారు 1855 మే 10 తారీఖున పుట్టారు.

† 'యుక్తేశ్వర్' అంటే, "ఈశ్వరుడితో ఐక్యమైనవాడు' అని అర్థం. 'గిరి' అన్నది, సనాతనమైన పది సన్యాసాశ్రమ శాఖల్లో ఒకదాని పేరు

ఆత్రంతో చూస్తున్న నా ముఖంలోకి చూసి నవ్వారు గురువుగారు. జీవిత కథాసంగ్రహాలన్నిటి లాగే, ఆయన మాటలు నాకు, బాహ్య యధార్థాల్ని తెలిపాయి కాని, లోపలి మనిషిని బయలుపరచలేదు.

"గురూజీ, మీ చిన్నప్పటి కథలు కొన్ని వినాలని ఉంది."

"కొన్ని చెబుతాను - ప్రతిదానికీ ఒక నీతి ఉంది!" శ్రీయుక్తేశ్వర్‌గారి కళ్ళు హెచ్చరికతో మిలమిల్లాడాయి. "మా అమ్మ ఒకసారి నన్ను బెదిరించడానికి, ఒక చీకటి గదిలో దెయ్యముందని భయపెట్టింది. నేను వెంటనే అక్కడికి వెళ్ళి చూసి, దెయ్యం కనిపించలేదని నిరాశగా చెప్పాను. మరెన్నడూ అమ్మ నాకు దెయ్యాల కథ చెప్పి భయపెట్ట లేదు. ఇందులో నీతి : నీ భయానికి కారణమైన దానికి ఎదుటపడి చూడు; అది నిన్నింక ఇబ్బంది పెట్టదు.

"నా జ్ఞాపకాల్లో మరొకటి ఏమిటంటే - మా పక్కింటివాళ్ళ గజ్జి కుక్క నాకు కావాలన్న కోరిక. ఆ కుక్క కోసం కొన్ని వారాలపాటు ఇంట్లో గందరగోళం చేసిపారేశాను. అంతకన్న కంటికి ఇంపుగా ఉండే కుక్కల్ని ఇస్తామన్నా నేను వినిపించుకోలేదు. ఇందులో నీతి : మోహం మనుషుల్ని గుడ్డివాళ్ళని చేస్తుంది. మనం కోరుకునే వస్తువు చుట్టూ అది, ఊహాకల్పితమైన అందమైన ఆకర్షణ ఒకటి ఏర్పరుస్తుంది.

"మూడో కథ, కుర్రవాడి మనస్సు మలచడానికి ఎలా వీలుగా ఉంటుందో తెలిపేది. మాటవరసకు, మా అమ్మ చేసిన వ్యాఖ్య ఒకటి విన్నాను : 'ఒకడి కింద నౌకరీకి కుదిరినవాడు బానిస' అని. ఆ సంగతి నా మనస్సులో ఎంత గాఢంగా నాటుకుందంటే, నాకు పెళ్ళయిన తరవాత కూడా ఉద్యోగాలన్నిటినీ నిరాకరించాను. కుటుంబానికి ఉన్న డబ్బు భూమి మీద పెట్టుబడి పెట్టి ఖర్చులు గడుపుకొనేవాణ్ణి. ఇందులో నీతి : మంచివి, ప్రోత్సాహకరములయిన సూచనలు పిల్లల సూక్ష్మగ్రహణశక్తిగల చెవులకు ఎక్కేటట్టు చెయ్యాలి. వాళ్ళకు చిన్నప్పుడు ఏర్పడే అభిప్రాయాలు లోతుగా నాటుకొని చాలాకాలం ఉంటాయి."

గురుదేవులు ప్రశాంత మౌనంలో నిమగ్నులయారు. దాదాపు నడిరాత్రి వేళ వన్నాక నవ్వటి మంచం దగ్గరికి తీసుకువెళ్ళారు. గురుదేవుల ఆశ్రమంలో ఆ మొట్టమొదటి రాత్రి నాకు గాఢంగా, మధురంగా నిద్ర పట్టింది.

మర్నాడు పొద్దునే నాకు క్రియాయోగ దీక్ష ప్రసాదించడానికి శ్రీయుక్తేశ్వర్ గారు నిశ్చయించారు. అంతకు పూర్వమే నేను, లాహిరీ మహాశయుల శిష్యులిద్దరి దగ్గర క్రియాయోగ దీక్ష పొందాను; వారిలో ఒకరు మా నాన్నగారు, రెండో

వారు నాకు సంస్కృతం నేర్పిన స్వామి కేవలానందగారు. అయితే గురు దేవులకు పరివర్తక శక్తి ఉంది; వారి స్పర్శతోనే, లెక్కలేనన్ని సూర్యబింబాలు కళ్ళు మిరుమిట్లు గొలుపుతూ ఒక్కుమ్మడిగా జ్వాజ్వల్యమాన మవుతున్నట్టుగా, ఒకానొక మహా తేజస్సు నా మీద ప్రసరించింది. అనిర్వచనీయమైన ఆనందపు వెల్లువ ఒకటి నా హృదయాన్ని నింపేసి అంతరాంతరాల్లోకి వ్యాపించింది.

ఆశ్రమం విడిచిపెట్టి వెళ్ళడానికి నన్ను నేను సిద్ధం చేసుకునే సరికి మర్నాటి మధ్యాహ్నం దాటిపోయింది.

"నువ్వు ముప్ఫై రోజుల్లో తిరిగి వెడతావు." నేను కలకత్తాలో మా ఇంటి గుమ్మంలో అడుగుపెడుతూ ఉండగా, గురుదేవుల జోస్యం ఫలించిన సంగతి మనస్సులో మెదిలింది. ఆకాశంలో "ఎగిరే పక్షి" మళ్ళీ గూటికి చేరడం గురించి మా చుట్టాలు సూటిపోటి మాటలంటారేమోనని నేను భయపడ్డాను గాని, అటు వంటి దేమీ జరగలేదు.

నేను నా అటకమీదికి ఎక్కి, ఒక సజీవ వ్యక్తిని చూస్తున్నట్టుగా ఆప్యా యంగా చూసుకున్నాను. "నా ధ్యానాలకూ, నా కన్నీళ్ళకూ నా సాధనలో నాకు ఎదురయిన తుఫానులకూ సాక్షివి నువ్వే. ఇప్పుడు నేను గురుదేవులు అనే ఓడ రేవుకు చేరుకున్నాను."

"బాబూ, మనకు ఉభయతారకంగా జరిగిందానికి సంతోషంగా ఉంది." ప్రశాంతమైన సాయంసంధ్య వేళ నేనూ నాన్నగారూ కలిసి కూర్చున్నాం. "ఒకప్పుడు నేను మా గురుదేవుల్ని అత్యద్భుతంగా దర్శించినట్టుగానే నువ్వూ మీ గురువుగారిని దర్శించావు. లాహిరీ మహాశయుల పవిత్ర హస్తం మన జీవితాల్ని కాపాడుతూంది. మీ గురువుగారు, మనకి అందుబాటులో లేకుండా హిమాలయాల్లో ఉండే సాధువు కారని, మనకి దగ్గరిలోనే ఉన్నవారని రుజువయింది. నా ప్రార్థనలు ఫలించాయి: దేవుడికోసంచేసే అన్వేషణలో నువ్వు నా కంటికి శాశ్వతంగా దూరం కాలేదు."

నేను మళ్ళీ చదువుకోవసాగిస్తానని నాన్నగారు సంతోషించారు. దానికి తగిన ఏర్పాట్లు చేశారాయన. ఆ మర్నాడు నేను, కలకత్తాలో ఉన్న స్కాటిష్ చర్చ్ కాలేజిలో ప్రవేశించాను.

నెలలకునెలలు సంతోషదాయకంగా వడివడిగా గడిచాయి. నేను కాలేజి తరగతి గదుల్లో బొత్తిగా కనిపించి ఉండనని సూక్ష్మగ్రాహులైన పాఠకులు ఈపాటికి అనుమానించి ఉంటారనడంలో సందేహం లేదు. శ్రీరాంపూర్ ఆశ్రమం ఆకర్షణ

వాకు నిగ్రహించుకోజాలని దయింది. నేను నిరంతరం అక్కడే ఉంటున్నందుకు గురుదేవులు ఏమీ వ్యాఖ్య చెయ్యకుండా నా ఉనికిని అంగీకరించారు. ఆయన విద్యాలయాల గురించి ప్రస్తావించడం పక్కతు కావడంవల్ల నా మనస్సు తేలిక పడింది. నేను విద్వాంసుడిగా తయారవడానికి మలిచినవాణ్ణి కానన్న సంగతి స్పష్టమే అయినప్పటికీ సమయానుగుణంగా కనీసపు పాస్ మార్కులు తెచ్చుకో గలుగుతూ ఉండేవాణ్ణి.

ఆశ్రమంలో నిత్యజీవితం సాఫీగా సాగిపోయేది; దాంట్లో మార్పు ఎప్పుడో కాని వచ్చేది కాదు. మా గురుదేవులు వేకువవేళకు ముందే నిద్ర లేచేవారు. పక్కమీద పడుక్కొని ఉండిగాని, ఒక్కొక్కప్పుడు కూర్చొని ఉండిగాని సమాధి* స్థితిలోకి వెళ్ళేవారు. గురుదేవులు మేల్కొన్నారన్న సంగతి ఇట్టే తెలిసిపోయేది: పెద్దగా ఆయన పెట్టే గుర్రు† చటుక్కున ఆగిపోయేది. ఒకటి రెండు నిట్టూర్పులు; బహుశా శారీరకమైన కదలిక కావచ్చు. ఆ తరవాత నిశ్శబ్దమైన శ్వాస రహిత స్థితి; ఆయన గాఢమైన యోగానందంలో నిమగ్నులయి ఉండేవారు.

తరవాత, ఫలహారాల కార్యక్రమం ఉండేది కాదు; మొదట గంగ ఒడ్డున చాలా దూరం నడవాలి. మా గురువుగారితో పొద్దుటిపూట నడిచిన ఈ నడకలు ఇప్పటికీ ఎంత వాస్తవంగా, ఎంత స్పష్టంగా మనసులో ఉన్నాయో! జ్ఞాపకాల్ని అలవోకగా నెమరువేసుకుంటే చాలు; నేను గురుదేవులపక్కనే ఉన్నట్టు తరచు అనిపిస్తూ ఉంటుంది. ఉదయభానుడు ఏటికి వెచ్చదనం కలిగిస్తున్నాడు; జ్ఞానా ధికారంతో నిండిన ఆయన కంఠస్వరం ఖంగుమని మోగుతున్నది.

స్నానం; ఆ తరవాత మధ్యాహ్న భోజనం. గురుదేవులు ఏరోజు కారోజు ఇచ్చే సూచనల ప్రకారం జాగ్రత్తగా వంట చేయడమన్నది శిష్యుల్లో కుర్రవాళ్ళ బాధ్యత. మా గురుదేవులు శాకాహారి. అయితే, సన్యాసం తీసుకోకముందు ఆయన గుడ్లు, చేపలు తినేవారు. ఎవరి శరీర తత్త్వానికి పడే సాదా భోజనం వారు చెయ్యా లన్నదే ఆయన శిష్యులకు ఇచ్చిన సలహా.

గురువుగారు చాలా మితంగా తినేవారు; తరచుగా ఆయన, అన్నంలో పసుపు కలిపిగాని, బీటుదుంపల రసంగాని, పాలకూరగాని వేసుకొని, పైన

* వ్యుత్పత్త్యర్థం, "కలపడం; మనస్సును ధ్యేయ వస్తువులో లయం చేయడం" అని. సమాధి అనేది పరమానందమయమైన అధిచేతన స్థితి. ఈ స్థితిలో యోగి, జీవాత్మ పరమాత్మల ఐక్యానుభూతి పొందుతాడు.

† గుర్రుపెట్టడమన్నది, సంపూర్ణమైన విశ్రాంతి పొందినట్టుగా సూచన అని శరీరధర్మ శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

గేదెనెయ్యి చిలకరించుకొని తినేవారు. మరోనాడు, చిక్కుడు గింజలో సెనగలో కలిపి వండిన కూరలు తినేవారు. భోజనానికి చివర, పాయసంతోబాటు మామిడి పళ్ళుగాని, నారింజపళ్ళుగాని తినేవారు; లేదా పనసతొనల రసం తాగేవారు.

ఆయన దర్శనం చేసుకోదలచినవాళ్ళు మధ్యాహ్నంపూట వచ్చేవారు. ప్రశాంతమైన ఆశ్రమంలోకి ప్రాపంచిక జనులు అదేపనిగా వస్తూ ఉండేవారు. మా గురుదేవులు వచ్చినవాళ్ళనందరినీ మర్యాదగా, దయతో ఆదరించేవారు. తాను ఈ దేహమనికాని, అహంకారమనికాని భావించుకోకుండా సర్వవ్యాప్త మయిన ఆత్మగా సాక్షాత్కారం పొందిన సద్గురువు, మానవులందరిలోనూ స్పష్టమైన సమరూపతను దర్శిస్తాడు.

సాధువుల నిష్పక్షపాతానికి మూలకందం జ్ఞానం. మాయాముఖాకృతుల మార్పిడివల్ల ఇకెన్నడూ ప్రభావితులు కారు; అజ్ఞానుల న్యాయనిర్ణయ శక్తిని గందరగోళపరిచే రాగద్వేషాలకు వారిక అధీనులు కారు. శ్రీయుక్తేశ్వర్‌గారు అధికార ప్రాబల్యంగలవాళ్ళకూ డబ్బుగలవాళ్ళకూ నైపుణ్యం కలవారికీ ప్రత్యేక ప్రాముఖ్యం ఇయ్యనూ లేదు; ఇతరులను పేదరికంవల్లకాని చదువుకోకపోవడం వల్లకాని చిన్నచూపు చూడనూలేదు. సత్యవాక్కులు ఒక పిల్లవాడి నోటినించి వచ్చినా గౌరవభావంతో వింటారు; ఒక్కొక్కప్పుడు దాంభిక పండితుణ్ణి బహిరంగంగా ఉపేక్షిస్తారు.

రాత్రి భోజనం ఎనిమిది గంటలకి. అప్పుడప్పుడు అతిథులక్కడ తచ్చా డుతూ ఉండేవారు. మా గురుదేవులు అతిథుల్ని వదిలి ఒంటరిగా భోంచేసే ప్రయత్నం ఎన్నడూ చెయ్యలేదు; ఆయన ఆశ్రమానికి వచ్చినవాళ్ళెవరూ ఆకలితో కాని అసంతృప్తితోకాని తిరిగి వెళ్ళడం ఎన్నడూ జరగలేదు. అనుకోని అతిథులు వచ్చినందుకు శ్రీయుక్తేశ్వర్‌గారు ఎన్నడూ గాభరాపడనూ లేదు; నిరుత్సాహం చెందనూ లేదు. సద్యఃస్ఫూర్తితో ఆయన శిష్యులకు ఇచ్చే సూచనల వల్ల కొద్దిపాటి ఆహార పదార్థాలతో సమృద్ధిగా విందు జరిగేది. అయినా ఆయన పొదుపరి; ఆయన దగ్గరున్న కొద్దిపాటి డబ్బు చాలావాటికి సరిపడేది. "నీకున్న దాంట్లోనే సుఖంగా ఉండు," అంటూండేవారు తరచు. "విచ్చలవిడిగా ఖర్చు చేస్తే తరవాత దుఃఖ పడతావు." ఆశ్రమంలో జరిగే వేడుకల విషయంలో నయితేనేం, భవన నిర్మాణ విషయంలోనయితేనేం, మరమ్మత్తుల విషయంలో నయితేనేం, మరే పనుల విషయంలోనయినా గురుదేవుల సృజనాత్మక ప్రతిభలో మౌలికత వ్యక్తమవుతూ ఉండేది.

ప్రశాంత సాయంసమయాల్లో తరచుగా, గురుదేవుల ప్రసంగాలు జరుగుతూ ఉండేవి; అవి అక్షయ సంపదలు. ఆయన పలికిన ప్రతి పలుకూ జ్ఞానంతో చికిలిచేసినట్టుండేది. ఆయన చెప్పే తీరులో మహోదాత్తమైన ఆత్మవిశ్వాసం ప్రస్ఫుటమవుతూ ఉండేది: ఇది అద్వితీయమైనది. నా అనుభవంలోకి వచ్చినంత వరకు, ఎవ్వరూ ఎన్నడూ మాట్లాడని తీరులో మాట్లాడేవారాయన. తమ ఆలోచనల్ని మాటలనే బాహ్యమైన దుస్తులు ధరించడానికి అనుమతించేముందు ఆయన విచక్షణ అనేసున్నితపు త్రాసులో తూచేవారు. భౌతికరూపంలో సైతం సర్వవ్యాపకమైన సత్యసారం, ఆయనలోంచి, ఆత్మ ప్రసరింపజేసే సుగంధంలా వెలువడుతూ ఉండేది. సజీవంగా ఆవిర్భవించిన పరమేశ్వర సన్నిధానంలో ఉన్నానన్న స్పృహ నాకు ఎప్పుడూ ఉండేది. ఆయన దివ్యత్వపు భారం, ఆయన ఎదుట ఎప్పుడూ నా తల వంగేటట్టుచేసేది.

శ్రీయుక్తేశ్వర్‌గారు సమాధిమగ్నులవుతున్నారన్న సంగతి అతిథులు పసిగట్టినట్లయితే, ఆయన వెంటనే వాళ్ళతో ఇష్టాగోష్ఠి జరిపేవారు. ఏదో ఒక భంగిమ ప్రదర్శించడంకాని, అంతర్ముఖత్వాన్ని చాటుకోడంకాని ఆయనకు చేతకావు. ఎప్పుడూ బ్రహ్మానందస్థితిలో మగ్నులై ఉన్నందువల్ల, సమాధికి ప్రత్యేకంగా సమయమేమీ ఆయనకు అక్కర్లేదు. ఆత్మసాక్షాత్కారం పొందిన యోగి, ధ్యానమనే మెట్టు ఏనాడో దాటేసి ఉంటాడు. "కాయ కాసినప్పుడు పువ్వు రాలి పోతుంది" కాని శిష్యులు ఒక ఆదర్శంగా తీసుకోడం కోసమని సాధువులు, ఆధ్యాత్మిక సాధన ప్రక్రియల్ని పాటిస్తూ ఉంటారు.

అర్ధరాత్రి కావస్తోందంటే, మా గురువుగారు చిన్న పిల్లవాడికి సహజమైన మాదిరిగా మగత నిద్రలోకి వెళ్తుండడం కద్దు. పక్క విషయంలో పట్టింపులేవీ లేవు. ఆయన తరచుగా, తలగడ లేకుండా కూడా, ఒక సన్నటి బల్లమీద పడుకొనేవారు. సాధారణంగా పులిచర్మం ఆసనంమీద కూర్చున్నప్పుడు ఆ బల్ల ఆయనకి ఆసరాగా ఉండేది.

రాత్రి తెల్లవార్లూ తాత్త్విక చర్చ జరగడం అరుదైన విషయమేమీ కాదు ఏ శిష్యుడయినా గాఢమైన ఆసక్తితో ఆ అవకాశం కల్పించవచ్చు. అప్పుడు నాకు అలసటే అనిపించేది కాదు; నిద్రపోవాలన్న కోరికే ఉండేది కాదు. గురుదేవుల ఉజ్జ్వల వాక్కులే చాలు. "ఓహో, తెల్లవారుతున్నదే! గంగ ఒడ్డున నడక సాగిద్దాం పదండి." రాత్రిపూట జరిగే ఆధ్యాత్మికబోధన కాలాలు అనేకం ఇలా ముగిశాయి

శ్రీయుక్తేశ్వర్ దగ్గరి అంతేవాసిత్వంలో తొలి నెలలు ఉపయోగకరమైన పాఠం ఒకటి నేర్పాయి: "దోమను జయించడం ఎలా?" మా ఇంట్లో అయితే మా

వాళ్ళు రాత్రిపూట దోమతెరలు కట్టుకుంటూ ఉండేవారు. జాగ్రత్త కోసం ఏర్పడ్డ ఈ ఆచారాన్ని శ్రీరాంపూర్ ఆశ్రమంలో పాటించకపోవడం చూసి నేను నిరుత్సాహ పడ్డాను. ఆశ్రమంలో ఈ కీటకాలు లేక కాదు; సమృద్ధిగా నివాసం చేసేవి; తల నుంచి పాదాల దాకా నన్ను ఒళ్ళంతా కుట్టేసేవి. గురువుగారు నా మీద జాలి పడ్డారు.

"నువ్వో దోమతెర కొనుక్కో; అలాగే నాక్కూడా ఒకటి కొను," ఆయన నవ్వుతూ ఇంకా ఇలా అన్నారు: "నువ్వు నీ ఒక్కడికోసమే కొనుక్కునేటట్టయితే దోమలన్నీ నా మీదికి వచ్చి పడతాయి!"

నేను అత్యంత కృతజ్ఞతతో ఆయన మాట పాటించాను. నేను శ్రీరాం పూర్‌లో గడిపిన ప్రతి రాత్రీ, మా గురువుగారు, దోమతెరలు కట్టమని చెబుతూ ఉండేవారు.

ఒకనాడు దోమలు ఒక మబ్బులా మా మీదికి కమ్ముకొచ్చాయి. అయినా గురువుగారు రోజూలా, తెరలు కట్టమని చెప్పలేదు. ఉత్సాహంగా ఆ కీటకాలు చేస్తున్న రొద వింటూంటే బెదురుపుట్టింది. నా పక్కమీదికి వెళ్ళి, వాటిని మంచి చేసుకోడానికి ఒక ప్రార్థన విన్నవించుకున్నాను. ఇలా ఒక అరగంట గడిచిన తరవాత, గురుదేవుల దృష్టిని ఆకర్షించడానికని చిన్నగా దొంగదగ్గు దగ్గాను. దోమకాట్లతో, ముఖ్యంగా రక్తదాహం తీర్చుకొంటూ గాయక మశకం చేసే రొదతో, నాకు పిచ్చెత్తిపోతుందేమో అనుకున్నాను.

నా దగ్గుకు జవాబుగా గురువుగారిలో కదలిక ఏమీ కనిపించలేదు. నేను జాగ్రత్తగా ఆయన దగ్గరికి చేరాను. ఆయన ఊపిరి తీసుకోడం లేదు. ఆయన యోగసమాధిలో ఉండగా దగ్గరినుంచి గమనించడం నాకు ఇదే మొదటిసారి; దాంతో నాకు భయం పట్టుకొంది.

"ఆయన గుండె ఆగిపోయి ఉండాలి!" నేను ఆయన ముక్కు కింద ఒక అద్దం పెట్టాను. శ్వాస తాలూకు ఆవిరి ఏదీ కనిపించలేదు. నా అభిప్రాయాన్ని మరోసారి రూఢి చేసుకోడానికి, ఆయన నోరూ ముక్కురంధ్రాలూ కొన్ని నిమిషాల పాటు నా వేళ్ళతో మూసి ఉంచాను. ఆయన ఒళ్ళు చల్లగా, నిశ్చలంగా ఉంది. అప్పుడు ఏం చెయ్యాలో తెలియక, ఎవరినయినా సహాయానికి పిలుద్దామని గుమ్మం వేపు తిరగాను.

"ఓహో! ఒక కొత్త పరిశోధకుడు తయారవుతున్నాడన్నమాట! అయ్యో, నా ముక్కు!" గురువుగారి కంఠస్వరం నవ్వుతో కంపిస్తోంది. "వెళ్ళి పడుక్కోవేం? ప్రపంచమంతా నీ కోసం మారాలా? నువ్వే మారు : దోమల్ని గురించిన స్పృహ వదుల్చుకో."

నేను పిల్లిలా నా పక్కదగ్గరికి తిరిగి వెళ్ళాను. ఒక్క కీటకం కూడా నా దగ్గరికి రావడానికి సాహసించలేదు. పూర్వం దోమతెరల వాడకానికి గురువుగారు అంగీకరించింది నన్ను సంతోషపెట్టడానికే నన్న సంగతి గ్రహించాను; ఆయనకు దోమల భయం లేదు. యోగశక్తి వల్ల ఆయన, దోమలు తమను కుట్టకుండా ఆపగలరు; లేకపోతే, ఆయన తలుచుకుంటే, ఆంతరికంగా అభేద్యులై ఉండ గలరు.

"ఆయన నాకోసం ఇది ప్రదర్శించారు. నేను కృషిచేసి సాధించవలసిన యోగస్థితి అది," అనుకున్నాను. నిజమైన యోగి, అధిచేతన స్థితిలోకి ప్రవేశించి దాన్ని నిలుపుకొనే సామర్థ్యం కలవాడు. కీటకాల రొద, కళ్ళు మిరుమిట్లు గొలిపే పగటి వెలుతురు వంటివి అసంఖ్యాకంగా మన మనస్సును చికాకుపరుస్తాయి ఈ భూమి మీద అవి లేకపోవడమన్నది ఎన్నడూ లేదు. నిజమైన యోగి వాటిని లెక్క పెట్టడు. సమాధిలోని ప్రథమావస్థలో (సవికల్పస్థితి) యోగి, బాహ్య ప్రపంచపు ఇంద్రియ బోధలన్నిటినీ అటకాయించేస్తాడు. అప్పుడు ఆయనకు బహూకృతిగా తొలుతటి ఈడెన్ స్వర్గం కంటె కూడా సుందరమైన అంతర్లోకాల నాదాలు వినిపిస్తాయి; దృశ్యాలు కనిపిస్తాయి.*

గుణపాఠం నేర్పగల ఈ దోమలు, నేను ఆశ్రమంలో మరో ఆరంభపాఠం నేర్చుకోడానికి ఉపకరించాయి. అది ప్రశాంతమైన సాయం సంధ్య వేళ, మా గురుదేవులు ప్రాచీన పవిత్ర గ్రంథాల్ని గురించి సాటిలేని రీతిగా వ్యాఖ్యానం చేస్తున్నారు. ఆయన పాద సన్నిధిలో పరిపూర్ణమైన ప్రశాంతిని అనుభవిస్తున్నాను నేను. మొరటు దోమ ఒకటి, రమణీయమైన ఈ వాతావరణంలోకి ప్రవేశించి నా దృష్టి మళ్ళించడానికి పాల్పడింది. విషపూరితమైన సూదిలాంటి తన తొండాన్ని కసుక్కున నా తొడలోకి గుచ్చేసరికి, దానిమీద కసి తీర్చుకోడానికి నేను చటుక్కున చెయ్యి ఎత్తాను. కాని దానికి మరణదండన విధించకుండా ఆపేశాను. సరిగా ఆ సమయానికి నాకు, అహింసనుగురించి పతంజలి చెప్పిన సూత్రం గుర్తుకు వచ్చింది.†

---

* యోగి తన బాహ్య జ్ఞానేంద్రియాల్ని ఉపయోగించకుండానే చూడడం, రుచి చూడడం వాసన గ్రహించడం తాకడం, వినడం అన్నవి చెయ్యడానికి అతనికి సామర్థ్యం కలిగించే సర్వవ్యాపక శక్తుల్ని గురించి 'తైత్తిరీయ ఆరణ్యకం'లో ఇలా వర్ణించటం జరిగింది: "గుడ్డివాడు ముత్యానికి చిల్లి పొడిచాడు; వేళ్ళు లేనివాడు దాంట్లోకి దారం ఎక్కించాడు; మెడలేనివాడు దాన్ని ధరించాడు, నాలికలేనివాడు దాన్ని పొగిడాడు."

† "అహింసలో పరిపూర్ణత సాధించినవాడి సమక్షంలో (ఏ జీవిలోనూ) శత్రుభావం కలగదు" (అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః) - యోగసూత్రాలు II 35

"పని పూర్తి చెయ్యలేదేం?"

"గురుదేవా! జీవహింసను సమర్థిస్తారా?"

"లేదు. కాని ఇప్పటికే నువ్వు, నీ మనస్సులో చావుదెబ్బ కొట్టావు."

"నాకు అర్థం కాలేదు."

"అహింస అని చెప్పడంలో పతంజలి ఉద్దేశం, చంపాలన్న 'కోరిక'ను తొలగించడం." నా మనస్సులోని ఆలోచనల్ని, తెరిచిపెట్టిన పుస్తకం చదివినట్టే గ్రహించేవారు శ్రీయుక్తేశ్వర్‌గారు. "అహింసను అక్షరాలా పాటించడానికి అసాకర్యంగా ఉండేలా ఏర్పాటయింది ఈ ప్రపంచం. మనిషి హానికరమైన జీవుల్ని నాశనం చెయ్యక తప్పని స్థితి వస్తే రావచ్చు. కాని అదే మాదిరిగా, కోపం, ద్వేషం తెచ్చుకోక తప్పని స్థితి మట్టుకు రాదు. ఈ మాయా ప్రపంచపు గాలి పీల్చుకొనే హక్కు జీవరాశులన్నిటికీ ఉంది. సృష్టి రహస్యాన్ని కనుక్కున్న సాధువు, ప్రకృతి యొక్క దిగ్భ్రమ కలిగించే అసంఖ్యాక అభివ్యక్తులతో సామరస్యం కలిగి ఉంటాడు. హింసాభిలాషను కనక జయించినట్లయితే అందరూ ఈ సత్యాన్ని అవగాహన చేసుకోవచ్చు."

"గురూజీ, క్రూర జంతువును చంపడానికి బదులు, తాను బలికావడానికి సిద్ధంకావాలా?"

"అక్కర్లేదు. మానవదేహం అమూల్యమైనది. విలక్షణమైన మెదడూ వెన్నులో షట్చక్రాలూ ఉన్న కారణంగా దానికి, పరిణామాత్మకమైన విలువ అన్నిటికన్న ఎక్కువ ఉంది. ఉన్నతస్థితి నందుకొన్న భక్తుడు పరమేశ్వరుడి సర్వోన్నత స్వరూప రీతులను సంపూర్ణంగా అవగాహన చేసుకోడానికీ అభివ్యక్తీకరించడానికీ సామర్థ్యం కలిగిస్తాయి ఇవి. క్రిందిస్థాయి జీవికి దేనికీ అటువంటి ఏర్పాటు లేదు. ఒక వ్యక్తి ఒక జంతువును కాని, మరే జీవినయినాకాని తప్పని సరిగా చంపవలసి వచ్చినట్లయితే అతడు స్వల్పమైన పాపానికి ఒడిగట్టవలసి వస్తుందన్నది నిజమే. కాని నిష్ప్రయోజనంగా మానవదేహ నాశం కావించడం కర్మ సిద్ధాంత నియమాన్ని తీవ్రంగా ఉల్లంఘించినట్లేనని ధర్మశాస్త్రాలు ఘోషిస్తాయి."

మనస్సు తేలికపడి నిట్టూర్చాను. మనిషికి పుట్టుకతో వచ్చిన సహజాతాల్ని ధర్మశాస్త్రాలు అన్ని సమయాల్లోనూ బలపరచవు.

నాకు తెలిసినంతవరకు గురువుగారు, చిరుతపులికికాని, పులికికాని ఎన్నడూ ఎదురుపడలేదు. అయితే ఒకసారి, భయంకరమైన నాగుబాము ఒకటి ఆయన ఎదుటికి వచ్చింది. కాని, ఆయన ప్రేమకు వశమై పోయిందది. ఈ

సంఘటన పూరీలో, సముద్రపు ఒడ్డున మా గురువుగారికున్న ఆశ్రమం దగ్గర జరిగింది. శ్రీయుక్తేశ్వర్‌గారి దగ్గర కడపటి కాలంలో శిష్యరికం చేసిన ప్రఫుల్లుడనే కుర్రవాడు ఆ సమయంలో ఆయన దగ్గర ఉన్నాడు.

"మేము ఆశ్రమం దగ్గర ఆరుబయట కూర్చుని ఉన్నాం," అంటూ చెప్పాడు ప్రఫుల్లుడు. "దగ్గరలో ఒక నాగుబాము కనిపించింది. చూస్తేనే వణుకు పుట్టేటంత భయంకరమైన ఆ పాము నాలుగడుగుల పొడుగుంది. అది మా వేపు వడివడిగా వస్తూ కోపంగా పడగ విప్పింది. గురువుగారు దాన్ని చూసి, ఒక పసిపిల్లవాణ్ణి చేరబిలుస్తున్నట్టుగా నవ్వారు. ఆయన తాళబద్ధంగా చప్పట్లు కొడుతూండడం చూసి నేను గాభరా పడిపోయాను.* భయంకరమైన ఆ పాముకు వినోదం కలిగిస్తున్నారు! నేను మనస్సులో తీవ్రంగా ప్రార్థనలు చేస్తూ నిశ్శబ్దంగా ఉండి పోయాను గురువుగారికి చాలా చేరువగా వచ్చిన తరవాత ఆ పాము నిశ్చలంగా నిలిచి పోయింది; ఆయన లాలింపు వైఖరికి అక్కష్టమయినట్టుంది. భీతావహంగా ఉన్న పడగ క్రమంగా ముడుచుకుపోయింది. అది శ్రీయుక్తేశ్వర్‌గారి కాళ్ళ సందులోకి దూరి, అక్కణ్ణించి పొదల్లోకి పోయి అదృశ్యమయింది.

"గురువుగారు చేతులెందుకు ఆడించారో, పాము కాటెందుకు వెయ్యలేదో అప్పట్లో నాకు అర్థం కాలేదు," అంటూ ముగించాడు ప్రఫుల్లుడు. "మన గురుదేవులు, ఏ ప్రాణివల్ల కలిగే ప్రమాద భయానికయినా సరే అతీతులని తరవాత గ్రహించాను."

నేను ఆశ్రమంలో ఉన్న తొలి నెలల్లో ఒకనాటి మధ్యాహ్నం, శ్రీయుక్తేశ్వర్‌గారి కళ్ళు నా మీద నిల్పి, గుచ్చిగుచ్చి చూస్తూండడం గమనించాను.

"నువ్వు చాలా బక్కగా ఉన్నావు ముకుందా."

ఆయన చేసిన వ్యాఖ్య నా మనస్సుకు గుచ్చుకుంది; గుంటలు పడ్డ నా కళ్ళూ, ఆర్చుకుపోతున్న శరీరమూ నాకు నచ్చవు. కాని అవి చాలా కాలంగా పీడిస్తున్న అజీర్ణవ్యాధివల్ల చిన్నప్పటినించి వెంటాడుతున్నాయి. ఎన్నో టానిక్కుల సీసాలు మా ఇంట్లో నా గదిలో షెల్ఫుమీద అలాగే పడిఉన్నాయి; వాటిలో ఒక్కటీ నాకు సాయపడలేదు. అస్వస్థమైన శరీరంతో బతికి లాభమేమిటని, విచారగ్రస్తుణ్ణయి నాలో నేను అప్పుడప్పుడు ప్రశ్నించుకునేవాణ్ణి.

"మందులకు పరిమితులున్నాయి; దివ్యమైన సృజనాత్మక ప్రాణశక్తికి అటువంటిది ఏదీ లేదు. ఇది నమ్ము. నువ్వు ఆరోగ్యంగా, బలంగా తయారవుతావు."

* తాచుపాము తన పరిధిలో కదులుతున్నదాన్ని దేన్నయినా టక్కున కొట్టగలదు. చాలా సందర్భాల్లో, పూర్తిగా కదలకుండా ఉండడం ఒక్కటే క్షేమకరం.

గురుదేవుల మాటల మీద నాకు తక్షణమే విశ్వాసం కలిగింది; వాటిలోని సత్యాన్ని నా జీవితానికి వర్తింపజేసి విజయం సాధించగలనన్న నమ్మకం నాకు కలిగించాయి. (జబ్బులు నయంచేసే వాళ్లలో చాలా మంది దగ్గరికి నేను వెళ్ళాను కాని) మరొకరెవరూ నాలో అంత గాఢమైన విశ్వాసం కలిగించలేదు.

రోజురోజుకూ నాకు బాగా ఆరోగ్యం, బలం పెరిగాయి. శ్రీయుక్తేశ్వర్‌గారి గుప్తమైన ఆశీస్సు ద్వారా, ఒక్క రెండు వారాల్లో, అంతకుముందు ప్రయత్నించి నప్పటికీ సాధించలేనంత బరువు పెరిగింది. నా ఉదరవ్యాధులు శాశ్వతంగా మటుమాయమయ్యాయి.

ఆ తరవాత మరికొన్ని సందర్భాల్లో మా గురుదేవులు, మధుమేహం, మూర్ఛ, క్షయ, పక్షవాతం వంటి జబ్బులతో బాధపడే వాళ్ళకు దివ్యశక్తితో నయం చెయ్యడం కళ్ళారా చూసే భాగ్యం కలిగింది.

"చాలా ఏళ్ళ కిందట నేను కూడా బరువు పెరగాలని తపించేవాణ్ణి," నన్ను నయంచేసిన కొన్నాళ్ళకి గురువుగారు నాకు చెప్పారు : "ఒకసారి తీవ్రంగా జబ్బుచేసి కోలుకుంటున్న సమయంలో, కాశీలో లాహిరీ మహాశయుల్ని దర్శించాను."

" 'గురుదేవా, నాకు చాలా జబ్బుగా ఉంటోందండి; బరువు చాలా పౌన్లు తగ్గిపోయాను.'

" 'యుక్తేశ్వర్,* నీకు నువ్వే జబ్బు తెచ్చుకున్నావన్న సంగతి కనిపిస్తూనే ఉంది; ఇప్పుడు నువ్వు బక్కగా ఉన్నాననుకుంటున్నావు.'

"నే నాశించిన దానికి చాలా విరుద్ధమైన సమాధాన మిది; అయితే ఆ తరవాత మా గురుదేవులు ప్రోత్సాహకరంగా ఇలా అన్నారు :

" 'చూద్దాం. రేపటికి నీకు తప్పనిసరిగా మెరుగనిపిస్తుందని నా విశ్వాసం.'

"ఆయన నాకు రహస్యంగా నయం చేస్తున్నారన్న సంగతికి సూచనగా ఆయన మాటల్ని గ్రహించింది, గ్రహించడానికి సిద్ధంగా ఉన్న నా మనస్సు. మర్నాడు పొద్దున ఆయన దర్శనానికి వెళ్ళి, 'గురుదేవా, ఈ రోజు ఒంట్లో బాగా మెరుగ్గా ఉందండి,' అంటూ సంబరపడుతూ చెప్పాను.

---

* నిజానికి లాహిరీ మహాశయులు ఆయన్ని సంబోధించింది "ప్రియా" (మా గురువుగారి పేరులో మొదటి భాగం) అనేకాని "యుక్తేశ్వర్" (సన్యాసం తీసుకొన్న తరవాత పెట్టిన పేరు; మా గురువుగారు లాహిరీ మహాశయుల జీవిత కాలంలో ఈ పేరు పెట్టుకోలేదు) అని కాదు. ఈ పుస్తకంలో ఇక్కడా, మరి కొన్ని ఇతర చోట్లా, రెండు పేర్లుంటే పాఠకులకు గందరగోళంగా ఉంటుందని, "యుక్తేశ్వర్" అన్న పేరే వాడడం జరిగింది. పే 139 చూడండి.

"నిజంగా! ఈ రోజు నీలో నువ్వే సత్తువ నింపుకున్నావు.'

" 'కాదు గురుదేవా! నాకు సాయంచేసినవారు మీరు. కొన్ని వారాల తర వాత నాకు ఏ మాత్రమయినా సత్తువ రావడం ఇదే మొదలు.'

" 'నిజమే. నీ జబ్బు చాలా తీవ్రంగానే ఉండేది. నీ శరీరం ఇంకా బలహీనం గానే ఉంది; అది రేపు ఎలా ఉంటుందో ఎవరు చెప్పగలరు?'

"ఆ బలహీనత మళ్ళీ వచ్చే అవకాశం ఉందన్న ఆలోచనే నాలో వణుకు భయం పుట్టించింది. మర్నాడు పొద్దున, ఈ శరీరాన్ని లాహిరీ మహాశయుల ఇంటికి చేరవెయ్యడమే అసాధ్యమనిపించింది.

" 'గురుదేవా, మళ్ళీ జబ్బుగా ఉందండి.'

"మా గురుదేవుల చూపు దురవగాహంగా ఉంది. 'అంటే, మళ్ళీ జబ్బు తెచ్చుకున్నావన్నమాట.'

"నాలో ఓర్పు నశించింది. 'గురుదేవా, రోజురోజుకూ మీరు నన్ను హేళన చేస్తూ వస్తున్నారని ఇప్పుడు గ్రహించాను. నేను చెప్పిన నిజమైన సంగతులు మీ రెందుకు నమ్మరో అర్థం కావడం లేదు,' అన్నాను.

" 'నిన్ను మార్చి మార్చి ఒకసారి బలహీనంగానూ మరోసారి బలంగానూ చేస్తున్నవి నిజంగా నీ ఆలోచనలే.' గురువుగారు నావేపు ఆప్యాయంగా చూశారు. 'నీ ఆరోగ్యం, నీ అవచేతన మనస్సులో సాగే ఆలోచనల్ని కచ్చితంగా ఎలా అనుసరిస్తోందో నువ్వే చూశావు. ఆలోచన అనేది విద్యుత్తులాగా, భూమ్యాకర్షణ లాగానే ఒకానొక శక్తి. మానవుడి మనస్సు పరమేశ్వరుడి సర్వశక్తిమంతమైన చైతన్యంలో ఒక విస్ఫులింగం. శక్తియుక్తమైన నీ మనస్సు అత్యంత గాఢంగా దేన్ని విశ్వసిస్తే అది జరిగి తీరుతుందని నీకు నిరూపించగలను.

"లాహిరీ మహాశయులు వ్యర్థంగా ఏదీ మాట్లాడరని తెలిసి నేను, అత్యంత శ్రద్ధాభక్తులతో, కృతజ్ఞతతో ఆయనతో ఇలా అన్నాను : 'గురుదేవా, ఇప్పుడు నేను బాగా ఉన్నాననీ, నా వెనకటి బరువు నాకు వచ్చిందనీ అనుకుంటే అవి కూడా జరుగుతాయా?'

" 'అలాగే జరుగుతాయి; ఈ క్షణంలోనే.' గురుదేవులు గంభీరంగా అన్నారు; ఆయన చూపు నా కళ్ళమీదే కేంద్రీకరించి ఉంది.

"తక్షణమే నాలో బలమే కాకుండా బరువు కూడా పెరిగినట్లు అనిపించింది. లాహిరీ మహాశయులు మౌనం వహించారు. మరికొన్ని గంటల సేపు ఆయన

పాద సన్నిధిలో కూర్చొని, మా అమ్మ ఉంటున్న ఇంటికి వెళ్ళాను; నేను కాశీ వెళ్ళినప్పుడల్లా అక్కడే ఉంటుంటాను.

" 'నాయనా, ఏమయిందిరా నీకు? ఒంటికి నీరు పట్టి ఉబ్బిందా ఏమిటి?' అంటూ అమ్మ తన కళ్లని తాను నమ్మలేకపోయింది. నా ఒళ్ళు జబ్బు చెయ్యక ముందు ఎంత నిండుగా, దృఢంగా ఉండేదో ఇప్పుడూ అలా ఉంది.

"నా బరువు తూచుకుని చూస్తే, ఒక్క రోజులోనే యాభై పౌన్లు పెరిగిన సంగతి గమనించాను; అది ఎప్పటికీ అలానే ఉండిపోయింది. నా బక్కపలచటి శరీరాన్ని చూసిన స్నేహితులూ పరిచయస్థులూ ఒక్కసారి తెల్లబోయారు. వాళ్ళలో కొందరు, ఈ అలౌకిక ఘటన ఫలితంగా తమ జీవిత విధానాన్ని మార్చుకుని లాహిరీ మహాశయులకు శిష్యులయారు.

"బ్రహ్మజ్ఞులైన మా గురుదేవులు, ఈ ప్రపంచం, సృష్టికర్త ఘనీభూత స్వప్నం తప్ప మరేమీ కాదని ఎరుగుదురు. దివ్య స్వాప్నికుడైన పరమేశ్వరుడితో తమకున్న ఏకత్వం స్పృహలో ఉన్నందువల్ల ఆయన భౌతిక ప్రపంచపు స్వప్నాణువుల్ని తమ ఇచ్ఛానుసారంగా ప్రకటితం చెయ్యడంకాని, లుప్తం చెయ్యడం కాని, లేదా తాము కోరిన మార్పు ఏదైనా తీసుకురావడంకాని చెయ్య గలుగు తున్నారు."*

"సృష్టి అంతా నియమబద్ధమైనది. విజ్ఞానశాస్త్రవేత్తలు కనిపెట్టగల, బాహ్య జగత్తులో పనిచేసే సూత్రాల్ని ప్రకృతి నియమాలు అని అంటున్నారు. కాని గుప్తమైన ఆధ్యాత్మికస్థాయిల్నీ, గూఢమైన అంతశ్చేతనమూ పాలించే సూక్ష్మ నియమాలు కూడా ఉన్నాయి; ఈ సూత్రాలు యోగశాస్త్రం ద్వారానే తెలుసుకోగలిగినవి. పదార్థం నిజస్వభావం తెలుసుకోగలవాడు ఆత్మ సాక్షాత్కారం పొందిన సద్గురువే కాని భౌతికశాస్త్రజ్ఞుడు కాదు. అటువంటి జ్ఞానంవల్లనే క్రీస్తు, ఒక సేవకుడికి, తన శిష్యుడు తెగ్గోసిన చెవిని మళ్ళీ ఇప్పించాడు."†

---

* "మువ్వు ప్రార్థించేటప్పుడు వేటిని కోరతావో అవి నీకు వస్తాయనీ, వాటిని నువ్వు పొందుతావనీ నమ్ము" - మార్కు 11 24. (బైబిలు) బ్రహ్మైక్యం పొందిన యోగులు తాము పొందిన దివ్యోపలబ్ధుల్ని, ప్రగతి సాధించిన శిష్యులకు పూర్తిగా బదిలీ చెయ్యగలవారు; ఈ సందర్భంలో లాహిరీ మహాశయులు శ్రీయుక్తేశ్వర్ గారికి అలాగే బదిలీ చేశారు.

† వాళ్ళలో ఒకడు ప్రధాన యాజకుని సేవకుణ్ణి కొట్టి వాడి కుడిచెవి తెగ్గోశాడు. అయితే ఏసు, వాళ్ళను తాళమని చెప్పి, వాడి చెవి ముట్టుకొని నయం చేశాడు."

\- లూకా 22.50-51 (బైబిలు).

మా గురువుగారు పవిత్ర గ్రంథాల్ని వ్యాఖ్యానించడంలో సాటిలేనివారు నాకు అత్యంత సంతోషకరమైన జ్ఞాపకాలు అనేకం ఆయన ప్రసంగాలకు సంబంధించినవే. రత్నాలు పొదిగిన ఆభరణాలవంటి ఆయన ఆలోచనలు, అశ్రద్ధ లేదా మూఢత్వం అనే బూడిదపాలు కాలేదు. నాలో కుదురులేక శరీరంలో కొద్దిగా కదిలిక కనిపించినా, కొద్దిగా పరధ్యానంగా ఉన్నా చాలు, మా గురుదేవుల వ్యాఖ్యానం తక్షణమే ఆగిపోయేది.

"నువ్విక్కడ లేవు," అన్నారు శ్రీయుక్తేశ్వర్‌గారు, ఒకనాటి మధ్యాహ్నం తాము చెబుతున్నది ఆపేసి. ఆయన ఎప్పటిలాగానే నా మనోగతిని నిర్దాక్షిణ్యంగా గమనిస్తూ వస్తున్నారు.

"గురూజీ!" నా స్వరంలో అభ్యంతరం ధ్వనించింది.

"నేను కదలలేదు; నా కనురెప్పలు ఆడలేదు; మీరు చెప్పిన ప్రతీమాటా మళ్ళీ వినిపించగలను!"

"అయినా పూర్తిగా నా దగ్గర లేవు. నువ్వు చెప్పిన అభ్యంతరం వల్ల, నీ మనోవీధిలో నువ్వు మూడు సంస్థల్ని సృష్టిస్తున్నావన్న సంగతి చెప్పక తప్పదం లేదు. ఒకటి సమతల ప్రదేశంలో వనస్థల ఆశ్రమం; ఇంకొకటి ఒక కొండమీద, మరొకటి సముద్రపు ఒడ్డున."

నిజానికి అస్పష్టంగా రూపొందిన ఆ ఆలోచనలు నా అవచేతన మనస్సులో లేకపోలేదు. క్షమార్పణ వేడుకొంటున్నట్టుగా ఆయన వేపు చూశాను.

"అలవోకగా చేసే ఆలోచనల్ని కూడా ఆకళించుకొనే గురువుగారి దగ్గర నేను చెయ్యగలిగేది ఏముంది?"

"నువ్వు నా కా హక్కు ఇచ్చావు. నీకు సంపూర్ణమైన ఏకాగ్రత లేకపోతే నేను వ్యాఖ్యానిస్తున్న సూక్ష్మసత్యాల్ని అవగాహన చేసుకోడం కష్టం. అవసర మయితే తప్ప నేను ఇతరుల మనసుల్లోని ఏకాంతతకు భంగం కలిగించను. మనిషికి తన ఆలోచనల్లో రహస్యంగా సంచరించే సహజమైన హక్కు ఉంది. పిలవనిదే పరమేశ్వరుడూ అందులోకి ప్రవేశించడు; నేనూ చొరబడ్డానికి సాహసించను."

"మీకు ఎప్పటికీ స్వాగతమే, గురుదేవా!"

"వాస్తుకళా సంబంధమైన నీ కలలు తరవాత ఫలిస్తాయిలే. ఇది అధ్యయనానికి సమయం!"

ఈ విధంగా మా గురుదేవులు, సందర్భవశాత్తు, నా జీవితంలో మూడు ముఖ్యమైన సంఘటనలు జరగబోతున్నాయని తమకు తెలిసిన విషయం, తమకు సహజమైన నిరాడంబర పద్ధతిలో వెల్లడించారు. కిశోర ప్రాయం నుంచి నాకు

వివిధ దృశ్యాల్లో మూడు భవనాల ఆకృతులు అస్పష్టంగా అవుపిస్తూ ఉండేవి. ఈ మూడుదర్శనాలూ శ్రీయుక్తేశ్వర్ గారు సూచించిన వరసలోనే భౌతికరూపం ధరించాయి. మొదట, రాంచీలో ఒక సమతల ప్రదేశంలో మగ పిల్లలకోసం యోగ విద్యాలయం స్థాపించడం జరిగింది; తరవాత లాస్ ఏంజిలిస్ లో ఒక కొండమీద అమెరికా ప్రధాన కార్యాలయం నెలకొల్పడం జరిగింది; ఆ తరవాత కాలిఫోర్నియా లోని ఎన్సినీటస్‌లో పసిఫిక్ మహాసముద్రానికి ఎదురుగా ఆశ్రమం స్థాపించడం జరిగింది.

"ఫలానా ఫలానా సంఘటనలు జరుగుతాయని నేను జోస్యం చెబుతున్నాను," అంటూ గురుదేవులు ఎన్నడూ దంభాలు పలకలేదు. అలా కాకుండా, "ఇది జరగవచ్చునేమో కదూ?" అంటూ సూచన చేసేవారు. ఆయన నిరాడంబర వాక్కు, భవిష్యాన్ని జోస్యంగా చెప్పే శక్తిని మరుగు పరిచేది. అన్నదాన్ని వెనక్కి తీసుకోడమన్నది లేదు; కొద్దిగా తెరమరుగుగా ఆయన చెప్పిన జోస్యాలు తప్పుగా ఎన్నడూ రుజువు కాలేదు.

శ్రీ యుక్తేశ్వర్‌గారు మితభాషులు; వైఖరిలో యధార్థత ఉండేది. అస్పష్టత కాని, కలలుకనే స్వభావంకాని ఆయనలో ఏ కోశానా లేదు. ఆయన కాళ్ళు నేలమీదే నిలదొక్కుకుని ఉండేవి; ఆయన తల స్వర్గధామంలోనే కుదురుకొని ఉండేది. వ్యవహారదక్షులైన వాళ్ళు ఆయన ప్రశంసకుపాత్రులయేవారు. "సాధుత్వమంటే మూగతనం కాదు! దివ్యానుభూతులు అశక్తుణ్ణి చేసేవేమీ కావు!" అంటారాయన. "క్రియాశీలకమైన సద్గుణాభివ్యక్తి తీక్ష్ణమైన బుద్ధికి ప్రేరకమవుతుంది."

మా గురుదేవులు అధిభౌతిక క్షేత్రాల్ని గురించి చర్చించడానికి విముఖులు. ఆయన ప్రసరించే ఒకేఒక "అద్భుత" ప్రభ పరిపూర్ణమైన పరళత్వం. సంభాషణ చేసేటప్పుడాయన, ఆశ్చర్యం కలిగించే ప్రస్తావన లేవీ రాకుండా చూసేవారు; పనిలో ఆయన విలక్షణత స్వేచ్ఛగా అభివ్యక్తమయేది. చాలామంది బోధకులు అలౌకిక ఘటనల గురించి మాట్లాడేవారే కాని చేసి చూపించగలిగింది శూన్యం; శ్రీయుక్తేశ్వర్ గారు సూక్ష్మ నియమాల గురించి చెప్పడం అరుదు; కాని వాటిచేత తమ సంకల్పానుసారంగా రహస్యంగా పని చేయించేవారు.

"ఆత్మ సాక్షాత్కారం పొందినవాడు ఆంతరిక ప్రేరణ పొందితేనే కాని అలౌకిక అద్భుత చర్య ఏదీ చెయ్యడు," అని వివరించారు గురుదేవులు. "దేవుడు తన సృష్టి రహస్యాలు విచక్షణ రహితంగా వెల్లడి కావాలని ఆశించడు.* అలాగే

* "పవిత్రమైనదాన్ని కుక్కలకు వెయ్యకు; నీ ముత్యాల్ని పందుల ముందు విసరకు; అలా కూక విసిరితే, వాటిని కాళ్ళతో తొక్కేసి, మళ్ళీ నీ మీదికి ఎదురు తిరిగి, నిన్ను చీల్చేస్తాయి." - మత్తయి 7.6 (బైబిలు).

ప్రపంచంలో ప్రతివ్యక్తికీ తనస్వతంత్రేచ్ఛ మీద, పరాధీనం చెయ్యరాని హక్కు ఉంది. ఏ సాధువూ ఆ స్వాతంత్ర్యానికి భంగం కలిగించడు.

శ్రీయుక్తేశ్వర్‌గారిలో అలనాటుగా కనిపించే మౌనం, ఆయన పొందిన గాఢమైన ఈశ్వరానుభూతులవల్ల కలిగినది. ఆత్మ సాక్షాత్కారం పొందని బోధకుల దినాలను ఆక్రమించుకునే 'దివ్య దర్శన' సంబంధమైన అంతులేని ప్రసంగాలకు ఆయన వద్ద సమయం లేదు. హిందూ పవిత్ర గ్రంథాల్లో ఇలా చెప్తారు: " మెరక నీటివంటి మందబుద్ధుల్లో చిన్నచిన్న ఆలోచనచేపలే మహా సంక్షోభం కలిగిస్తాయి మహాసముద్రాలవంటి మనస్సుల్లో దివ్యప్రేరణల తిమింగలాలు ఏ సంచలనమూ కలిగించవు."

మా గురుదేవుల నిరాడంబరత అనే ఆచ్ఛాదన కారణంగా, ఆయన సమకాలికుల్లో చాలా కొద్దిమందే, ఆయనను మానవాతీతులుగా గుర్తించారు. "తన జ్ఞానాన్ని మరుగుపరచలేనివాడు మూర్ఖుడు" అన్ననానుడి, పరమజ్ఞానులు శాంతమూర్తులు అయిన మా గురుదేవులకు ఎన్నడూ వర్తించదు.

శ్రీయుక్తేశ్వర్‌గారు, తక్కిన వాళ్ళందరిలాగే మానవ మాత్రులుగా జన్మించినప్పటికీ దేశకాలాలకు నియంత అయిన పరమేశ్వరుడితో తాదాత్మ్యం సాధించారు. నరుడు నారాయణుడు కావడానికి దాటరాని అడ్డంకి ఏదీ ఆయనకు అవుపించలేదు. మనిషిలో ఆధ్యాత్మిక సాహసికత లేకపోవడం తప్ప, వేరే అడ్డంకి ఏదీ లేదని నేను క్రమంగా గ్రహించాను.

శ్రీయుక్తేశ్వర్‌గారి పవిత్ర పాదస్పర్శ తగిలినప్పుడల్లా నా ఒళ్ళు పులకిస్తుండేది. గురువుతో భక్తిపూర్వకమైన స్పర్శ కలగడంవల్ల శిష్యుడు ఆధ్యాత్మిక ఆకర్షణ శక్తి పొందుతాడు; సూక్ష్మ విద్యుత్ప్రవాహం ఒకటి జనిస్తుంది. భక్తుడి మెదడులో ఉండే అవాంఛనీయమైన అభ్యాస సంస్కారాలు విద్యుదాఘాతం పొందుతాయి. అతని ప్రాపంచిక ప్రవృత్తుల గాళ్ళు చెదిరి లాభకరమవుతాయి. కనీసం క్షణికం గానయినా మాయను కప్పిఉన్న రహస్య ఆచ్ఛాదనం తొలగడం, పరమానంద మనే వాస్తవికత తళుక్కుమనడం జరగవచ్చు. నేను భారతీయపద్ధతిలో మా గురుదేవులకు ఎప్పుడు ప్రణామం చేసినా, నా శరీరమంతటా మోక్షప్రదమైన కాంతి ప్రసరించేది.

"లాహిరీ మహాశయులు మౌనంగా ఉన్నప్పుడూ లేదా కచ్చితంగా మతానికి సంబంధించని విషయాలు ముచ్చటించేటప్పుడు కూడా వారు నాకు అనిర్వచనీయమైన జ్ఞాన ప్రసారం చేశారని తెలుసుకున్నాను," అన్నారు గురువుగారు నాతో.

ఆ విధంగానే శ్రీయుక్తేశ్వర్‌గారు నన్ను ప్రభావితుణ్ణి చేశారు. నేను దిగులుగా గాని ఉదాసీనమైన మనస్సుతోకాని ఆశ్రమంలోకి ప్రవేశిస్తే నా వైఖరి తెలియకుండానే మారిపోయేది. కేవలం మా గురుదేవుల దర్శనంతోనే ఉపశమనం కలిగించే ప్రశాంతత నాకు లభించేది. ఆయన సన్నిధిలో ప్రతిరోజూ ఆనందంలో, శాంతిలో, జ్ఞానంలో ఒక్కొక్క కొత్త అనుభవం కలుగుతుండేది. దురాశవల్లనో కోపంవల్లనో మానవికమైన అనుబంధంవల్లనో భ్రాంతిలో పడ్డట్టుగాని భావోద్రేకంతో ఉత్తేజితులై ఉన్నట్టుగాని ఆయన నాకెన్నడూ కనిపించలేదు.

"మాయ అనే చీకటి చప్పుడు చెయ్యకుండా దగ్గరికి వస్తోంది; లోపలింటికి త్వరగా పోదాం, పద!" హెచ్చరికగా చెప్పే ఈ మాటలతో గురుదేవులు, క్రియా యోగ సాధన చెయ్యవలసిన అవసరాన్ని తమ శిష్యులకు నిరంతరం గుర్తు చేసేవారు. అప్పుడప్పుడు ఒక్కొక్క కొత్త విద్యార్థి, యోగసాధన చెయ్యడానికి తనకున్న అర్హత విషయంలో సందేహాలు వెలిబుచ్చేవాడు.

"గతాన్ని మరిచిపో," అంటూ శ్రీయుక్తేశ్వర్‌గారు అతన్ని సముదాయించేవారు. "మనుష్యులందరి గతజీవితాలూ అనేక లజ్జాకర విషయాలతో నల్లబడ్డవే. మనిషి దైవీభావనలో దృఢంగా నెలకొనే వరకు మానవ ప్రవర్తనను ఎన్నటికీ నమ్మడానికి వీలులేదు. నువ్వు కనక ఇప్పుడు ఆధ్యాత్మిక కృషి చేస్తున్నట్లయితే ఇకముందు ప్రతిదీ మెరుగవుతుంది."

ఆశ్రమంలో గురువుగారిదగ్గర చిన్నచిన్న శిష్యులు ఎప్పుడూ ఉంటుండేవారు. వాళ్ళ బౌద్ధిక, ఆధ్యాత్మిక శిక్షణ ఆయన యావజ్జీవితాసక్తి. ఆయన గతించడానికి కొద్దికాలం ముందుకూడా, ఆరేళ్ళ వయస్సుగల కుర్రవాళ్ళ నిద్దరినీ, పదహారేళ్ళ వయస్సుగల కుర్రవాణ్ణి ఒకణ్ణీ ఆశ్రమవాసానికి స్వీకరించారు. ఆయన వర్దీలో ఉన్న వాళ్ళందరికీ జాగ్రత్తగా శిక్షణ ఇచ్చారు; ఈ విధంగా 'శిష్య', 'శాసన' (శిక్షణ) శబ్దాలు రెంటికీ వ్యుత్పత్తిలోనే కాకుండా ఆచరణరీత్యా కూడా పరస్పర సంబంధ మేర్పరచడం జరిగింది.

ఆశ్రమవాసులు గురుదేవులను అభిమానించేవారు; గౌరవించేవారు; ఒక్కసారి చిన్నగా చప్పట్లు చరిస్తే చాలు, ఆత్రంగా వచ్చి ఆయన పక్కన నిలబడేవారు. ఆయన మనఃస్థితి గంభీరమై అంతర్ముఖులయినప్పుడు, మాట్లాడడానికి ఎవ్వరూ సాహసించేవారు కాదు; ఆయన నవ్వు ఉల్లాసంగా ధ్వనించినప్పుడు మాత్రం ఆయన తమ సొంతమే అన్నట్టు చూసేవారు పిల్లలు.

శ్రీయుక్తేశ్వర్‌గారు తమకోసం ఏదయినా పని చేసిపెట్టమని ఇతరుల్ని అడగడం అరుదు; ఏ శిష్యుడు చేసే సహాయమైనా సంతోషంగా చెయ్యకపోతే

స్వీకరించేవారు కాదు. శిష్యులెప్పుడయినా, ఆయన బట్టలు ఉతికే అవకాశ భాగ్యాన్ని కనక మరిచిపోతే గురుదేవులే స్వయంగా ఉతుక్కొనేవారు.

ఆయన మామూలుగా వేసుకొనే బట్టలు, సాంప్రదాయికంగా సన్యాసులు ధరించే కాషాయవస్త్రాలు. ఆశ్రమంలో ఉన్నప్పుడాయన, యోగుల సంప్రదాయాన్ని అనుసరించి, పులి చర్మంతోనో జింక చర్మంతోనో కుట్టిన, తాళ్ళులేని బూట్లు వేసుకొనేవారు.

శ్రీయుక్తేశ్వర్‌గారు ఇంగ్లీషు, ఫ్రెంచి, బెంగాలీ, హిందీ ధారాళంగా మాట్లాడే వారు; సంస్కృతంలో మంచి పరిజ్ఞానముంది. ఇంగ్లీషు, సంస్కృతం నేర్చుకోడానికి తాము నేర్పుగా రూపొందించిన కొన్ని సులభ పద్ధతుల్లో చిన్న విద్యార్థులకు మంచి ఓపికగా నేర్పేవారు.

గురుదేవులకు తమ శరీరంమీద ఆపేక్ష ఉండేది కాదు కాని, దాని విషయంలో జాగ్రత్తగా ఉండేవారు. దేవుడు శారీరక మానసిక స్వస్థతల ద్వారానే సరిగా అభివ్యక్తమవుతాడని చెప్పేవారు. అతిగా ఉన్నవన్నీ నిరాకరించేవారు. దీర్ఘకాలం ఉపవాసం చెయ్యదలచిన ఒక శిష్యుణ్ణి చూసి నవ్వుతూ మా గురుదేవులు, "కుక్కకి ఒక ఎముక వెయ్యగూడదూ?"* అన్నారొకసారి.

శ్రీయుక్తేశ్వర్‌గారి ఆరోగ్యం అద్భుతంగా ఉండేది. ఆయనకు సుస్తీ చెయ్యగా ఎన్నడూ చూడలేదు నేను.† తమ శిష్యులు వైద్యుల్ని సంప్రదించదలిస్తే లౌకికాచారాన్ని మన్నించడం కోసం ఆయన, వాళ్ళకు అందుకు అనుమతి ఇచ్చేవారు. "భౌతిక పదార్థానికి వర్తించే విధంగా దేవుడు ఏర్పరిచిన నియమాల ద్వారా వైద్యులు తాము చేసే వైద్యం సాగించాలి," అనేవారాయన. అయితే మానసిక వైద్యానికున్న ఘనతను ప్రశంసిస్తూ ఆయన, తరచుగా ఇలా అనేవారు: "అన్నిటి కన్న గొప్పగా క్షాళన చేసేది జ్ఞానం." ఆయన శిష్యులకు ఇలా చెప్పారు:

"విశ్వాసఘాతకుడైన స్నేహితుడిలాంటిది శరీరం. దానికి ఇయ్యవలసినంత మట్టుకే ఇయ్యండి; అంతకు మించి వద్దు. కష్టం, సుఖం అనేవి అస్థిరమైనవి. ఈ ద్వంద్వాల ప్రాబల్యం నుంచి బయటపడడానికి ప్రయత్నిస్తూనే వాటి నన్నిటినీ

---

* ఉపవాసమనేది ఆదర్శవంతమైన సహజ క్షాళన పద్ధతి అని మా గురుదేవులు ఆమోదించారు; కాని ప్రత్యేకించి ఈ శిష్యుడికి మాత్రం ఒంటిమీద ధ్యాస ఎక్కువ.

† నేను ఆయన దగ్గర లేనప్పుడు ఒకసారి కాశ్మీరులో ఆయన జబ్బు పడ్డారు. (పే. 263 చూడండి).

నిబ్బరంగా ఓర్చుకోండి. జబ్బూ స్వస్థతా కూడా ప్రవేశించే ద్వారం ఊహ. మీకు జబ్బుగా ఉన్నప్పుడయినా సరే, జబ్బు అనే వాస్తవాన్ని నమ్మకండి; గుర్తింపు పొందని ఆ సందర్శకుడు పలాయనం చిత్తగిస్తాడు!"

మా గురువుగారి శిష్యుల్లో వైద్యులు చాలామంది ఉన్నారు. "శరీర ధర్మ శాస్త్రం చదివినవాళ్ళు ఇంకా ముందుకు సాగి ఆత్మజ్ఞానాన్ని శోధించాలి," అని వాళ్ళకు చెప్పేవారాయన. "శరీర యంత్రానికి సరిగా వెనకాల సూక్ష్మమైన ఆధ్యాత్మిక తంత్రం ఒకటి దాక్కొని ఉంది."*

శ్రీయుక్తేశ్వర్‌గారు తమ శిష్యుల్ని, ప్రాచ్య పాశ్చాత్యదేశాల సుగుణాల్ని ఇముడ్చుకొన్న జీవంతమైన మేళనకర్తలుగా నడుచుకోమని సలహా ఇచ్చేవారు. ఆయనయితే బాహ్యమైన అలవాట్లలో పాశ్చాత్య ఫక్కీ నిర్వాహకులు; అంతరంగంలో ప్రాచ్యఫక్కీ ఆధ్యాత్మికవాది. పాశ్చాత్యుల అభ్యుదయశీలక, ప్రతిభా సంపన్న, ఆరోగ్యప్రదమైన పంథాలనూ అనేక శతాబ్దుల కాలంగా ప్రాచ్యదేశాల ఘనత నిలిపిన ధార్మిక ఆదర్శాలనూ ప్రశంసించేవారాయన.

క్రమశిక్షణ నాకు కొత్తకాదు. ఇంటిదగ్గర నాన్నగారు క్రమశిక్షణలో కచ్చితంగా ఉండేవారు; అనంతుడయితే తరుచు కఠినంగా ఉండేవాడు. కాని శ్రీ యుక్తేశ్వర్‌గారి శిక్షణ 'తీవ్రం' అనాలి తప్ప మరోరకంగా చెప్పడానికి వీల్లేదు. క్షణికమైన విషయాల్లోనయితేనేం, మామూలు నడవడి తాలూకు సూక్ష్మ వైవిధ్యాల విషయంలోనయితేనేం, పరిపూర్ణతాప్రియులైన మా గురుదేవులు తమ శిష్యుల్ని తీవ్రంగా విమర్శించేవారు.

---

* శరీర ధర్మశాస్త్రంలో నోబెల్ బహుమానం పొందిన, సాహసవంతుడైన వైద్య శాస్త్రజ్ఞుడు ఛార్లెస్ రాబర్ట్ రిషే ఇలా రాశాడు: "అధిభౌతిక శాస్త్రం ఇంతవరకు ఒక శాస్త్రంగా అధికారికంగా గుర్తింపు పొందలేదు. అయినా ఇకముందు పొందుతుంది... మనకు ఇంద్రియ జ్ఞానమిచ్చేవి కేవలం ఐదు జ్ఞానేంద్రియాలు మట్టుకే కాదనీ, ఇతర మార్గాల్లో కూడా ఒక్కొక్కప్పుడు, వాస్తవికతాశకలం ఒకటి తెలివిని చేరుతూ ఉంటుందనీ నేను ఎడిన్‌బర్గ్‌లో 100 మంది శరీర ధర్మశాస్త్రజ్ఞుల ఎదుట నొక్కి చెప్పగలిగాను. ...ఒక యథార్థం అరుదు అయినంత మాత్రాన అది ఉండదని చెప్పడం సరికాదు. ఒక విషయాన్ని అధ్యయనం చెయ్యడం కష్టమయినంత మాత్రాన, దాన్ని అర్థం చేసుకోక పోవడానికదే కారణమవుతుందా?... పరుసవేది కోసం వెదకడం భ్రాంతి మూలకమన్న హేతువుతో రసాయనశాస్త్రాన్ని ఈసడించే వాళ్ళ మాదిరిగానే అధిభౌతిక శాస్త్రాన్ని గుహ్యవిద్యగా ఈసడించేవాళ్ళు కూడా తమ తెలివితక్కువతనానికి తాము సిగ్గుపడతారు... శాస్త్రనియమాల విషయంలో సర్వత్ర, సర్వదా ప్రయోగశీలకమైనవైన లావోజియర్, క్లాడ్ బెర్నార్డ్, పాశ్చర్ అన్న వాళ్ళవే ఉన్నాయి. అందుచేత మానవ చింతనలో పరివర్తన తీసుకురాబోయే ఈ నవీన శాస్త్రానికి స్వాగతం పలుకుతున్నాను."

"చిత్తశుద్ధి లేని సభ్యత విగ్రీహమైన సుందరాంగి వంటిది." అన్నారొకసారి సందర్భవశాత్తు, ఆయన. "సభ్యతలేని ఋజుత్వం, వైద్యుడి కత్తిలాగ, పనికి వచ్చేదే కాని అప్రియమైనది. మర్యాదతో కూడిన నిష్కాపట్యం సహాయకరమైనదేకాక, ప్రశంసనీయమైనది కూడా."

గురుదేవులు నా ఆధ్యాత్మిక ప్రగతి విషయంలో తృప్తిపడ్డట్టే కనిపించేవారు; ఎప్పుడోకాని దాన్ని ప్రస్తావించకపోవడమే నేనలా అనుకోడానికి కారణం. ఇతర విషయాల్లో మట్టుకు ఆయన చివాట్లు నా చెవులకు కొత్త కావు. పరధ్యానం, అప్పుడప్పుడు దిగాలుపడి ఉండడం, మర్యాదకు సంబంధించిన నియమాలు కొన్ని పాటించకపోవడం, తీరువు లేకుండా అప్పుడప్పుడు పనిచెయ్యడం - ఇవే నా పెద్ద అపరాధాలు.

"మీ నాన్న భగవతిగారి కార్యకలాపాలు ఎంత కట్టుదిట్టంగా, ఎంత తీరువుగా ఉంటాయోచూడు," అని మా గురువుగారన్నా రొకనాడు. లాహిరీ మహాశయుల శిష్యులయిన వీరిద్దరూ, నేను మొదటిసారి శ్రీరాంపూర్ ఆశ్రమానికి వెళ్ళిన కొద్ది రోజులకే కలుసుకొన్నారు. మా నాన్నగారూ, మా గురువుగారూ ఒకరినొకరు గాఢంగా అభిమానించారు. వీరిద్దరూ యుగయుగాంతరాలకు కూడా క్షయంకాని ఆధ్యాత్మిక ఆధార శిలల పునాదుల మీద రమ్యమైన అంతర్జీవిత హర్మ్యాన్ని నిర్మించుకున్నారు.

నా చిన్నప్పుడు, కొద్దికాలం నాకు చదువుచెప్పిన ఒక మాస్టరుగారి దగ్గర తప్పుడు పాఠాలు కొన్ని ఒంటబట్టించుకున్నాను. శిష్యుడయిన వాడు లౌకిక విధుల నిర్వహణ కోసం ఎక్కువగా శ్రమపడవలసిన అవసరం లేదని నాకు చెప్పడం జరిగింది. నేను నా పనుల్ని ఉపేక్షించడం గాని, అజాగ్రత్తగా చెయ్యడం గాని జరిగినప్పుడు నన్ను మందలించలేదు. మానవ ప్రకృతికి, అల్లాటి బోధలు ఒంటబట్టించుకోడం చాలా సులువుగా కనిపిస్తుంది. అయితే గురుదేవుల కఠిన శిక్షణలో, బాధ్యతారాహిత్యమనే ఇంపైన భ్రమల్లోంచి త్వరగానే బయట పడ్డాను.

"ఈ లోకానికి పనికిరాని అతిమంచి వాళ్ళు పరలోకానికి అలంకారాలుగా ఉన్నారు," అన్నారు శ్రీయుక్తేశ్వర్ గారొకనాడు. "ఈ భూమిమీద ఉచితంగా లభించే గాలి పీలుస్తున్నంతకాలం, కృతజ్ఞతా పూర్వకమైన సేవ చెయ్యవలసిన బాధ్యత మనమీద ఉంటుంది. ఊపిరి అవసరంలేని సమాధి స్థితినిపూర్తిగా సాధించినవాడు మాత్రమే ప్రాపంచిక విధులనుంచి విముక్తి పొందుతాడు," అని చెబుతూ ఆయన, "నువ్వు అంతిమ పరిపూర్ణత్వం సాధించినప్పుడు ఆ విషయం నీకు తెలియజెయ్యకుండా ఉండను," అన్నారు పాడిగా.

మా గురుదేవులు లంచానికి లొంగరు, ప్రేమ లంచానికైనా సరే! నాలాగ, ఆయనదగ్గిర శిష్యరికం చెయ్యడానికి మనఃపూర్వకంగా అంగీకరించినవారెవరి విషయంలోనూ ఆయన మెతకతనం చూపించలేదు. గురువుగారికి నాకూ చుట్టూ ఆయన విద్యార్థులుకాని పరిచయంలేని పరాయివాళ్ళు ఉన్నా సరే, మేము ఏకాంతంగా ఉన్నా సరే ఆయన ఎప్పుడూ దాపరికం లేకుండా మాట్లాడుతూ చెడామడా చివాట్లుపెట్టేవారు. లోతులేనితనంలోకి గాని, నిలకడలేనితనంలోకి గాని పొరపాటునైనా రవంత జారితే, ఆయన చివాట్లు తప్పేవి కావు. అహంకారాన్ని అణగ్గొట్టే ఈ మాదిరి వ్యవహారవిధానం సహించడం కష్టమే అయినప్పటికీ, నాలో ఉన్న మానసికమైన ఎగుడుదిగుళ్ళను చదును చెయ్యడానికి శ్రీయుక్తేశ్వర్‌గారిని అనుమతించాలన్నదే మార్చరాని నా తీర్మానం. నాలో ఈ గొప్ప మార్పుకోసం ఆయన శ్రమిస్తూంటే, చాలా సార్లు ఆయన వేసే క్రమశిక్షణా-సమ్మెట దెబ్బల భారానికి నేను కంపించేవాణ్ణి.

"నా మాటలు నీకు నచ్చకపోతే నువ్వు ఎప్పుడయినాసరే స్వేచ్ఛగా వెళ్ళిపోవచ్చు," అని హామీ ఇచ్చారు గురుదేవులు. "నీ అభివృద్ధి తప్ప నేను నీ దగ్గిర మరేమీ కోరను. నీకు లాభం కలుగుతోందనిపిస్తేనే ఉండు."

నా గర్వాన్ని సమ్మెట దెబ్బలతో అణిచేసినందుకు నేనాయనకి ఎంతో కృతజ్ఞుణ్ణి. ఆలంకారికంగా చెప్పాలంటే, నా దవడకున్న పలువరసలో ప్రతి పుప్పి పన్నూ కనిపెట్టి పీకేస్తున్నారాయన, అని ఒక్కొక్కప్పుడు అనిపించేది నాకు. అహంభావాన్ని సమూలంగా తొలగించాలంటే మొరటుగా తప్ప మరే విధంగా నయినా కష్టమే. ఆ అహంకారం పోయిన తరువాతే భగవత్ప్రవేశానికి అవరోధాలు లేని మార్గమేర్పడుతుంది. స్వార్థంతో బండబారిన గుండెల్లోకి చొరబారడానికి దేవుడు చేసే ప్రయత్నం వృథాయే అవుతుంది.

శ్రీయుక్తేశ్వర్ గారి సహజావబోధం తీక్ష్ణంగా ఉండేది. ఆయన తరచు, అవతలి వ్యక్తి చెప్పిన మాటలతో నిమిత్తంలేకుండా, అతను బయటపెట్టని ఆలోచనలకు జవాబు ఇస్తూ ఉండేవారు. ఒక మనిషి వాడిన మాటలూ వాటి వెనక ఉన్న వాస్తవమైన ఆలోచనలూ భిన్నధ్రువాలు అయి ఉండవచ్చు. "మనుషుల పదాడంబరంవల్ల కలిగే గందరగోళానికి వెనక ఉన్న ఆలోచనల్ని ప్రశాంతత ద్వారా అనుభూతం చేసుకోడానికి ప్రయత్నం చెయ్యి," అన్నారు మా గురు దేవులు.

దివ్యమైన అంతర్దృష్టివల్ల బయల్పడే విషయాలు ప్రాపంచిక జీవుల చెవులకు తరచు కటువుగా ఉంటాయి. పైపై మెరుగులతో సరిపెట్టుకొనే విద్యార్థుల

అభిమానాన్ని ఆయన చూరగొనలేదు. ఎప్పుడూ కొద్ది సంఖ్యలోనే ఉండే తెలివైన విద్యార్థులు మాత్రం ఆయన్ని ప్రగాఢమైన భక్తితో ఆరాధించేవారు.

ఆయన మాట అంత కటువుగానూ నిందాత్మకంగానూ ఉండి ఉండకపోతే భారతదేశంలో ఎక్కువమంది శిష్యులు వెతుక్కుంటూ ఏరికోరి వచ్చేది శ్రీ యుక్తేశ్వర్‌గారి దగ్గరికేనని నొక్కి చెప్పగలను.

"నా దగ్గరికి తర్ఫీదుకు వచ్చిన వాళ్ళ విషయంలో నేను కఠినంగా ఉంటాను," అని నా దగ్గర ఒప్పుకొన్నారాయన. "అది నా పద్ధతి. దాన్ని ఒప్పుకో, మానుకో, అందులో నేను రాజీపడను. కాని నువ్వు నీ శిష్యులతో ఇంతకంటె దయగా ఉంటావు అది నీ పద్ధతి. కాఠిన్యమనే నిప్పుల్లోనే కాల్చి శుద్ధి చెయ్యడానికి ప్రయత్నిస్తాను నేను! ఇవి, సగటు సహనశక్తికి మించి మలమల మాడుస్తాయి. ప్రేమతో కూడిన సౌమ్యమార్గం కూడా మార్పు తీసుకువస్తుంది. విజ్ఞతతో ప్రయోగించినట్లయితే కఠోర పద్ధతులూ కోమల పద్ధతులూ కూడా సమంగా ఫలప్రదమైనవే." ఆయన ఇంకా ఇలా అన్నారు. "నువ్వు పై దేశాలకి వెళ్తావు; అక్కడ అహంకారం మీద మొరటుగా తీసే దెబ్బల్ని హర్షించరు. రాజీపడడానికి అనుకూలమైన నిదానం, ఓరిమి సమృద్ధిగా లేనిదే ఏ గురువూ భారతదేశ సందేశాన్ని పాశ్చాత్యదేశాల్లో వ్యాప్తి చెయ్యలేడు." (గురుదేవుల మాటల్ని నేను అమెరికాలో ఎంత తరచుగా గుర్తు చేసుకున్నానో చెప్పనుగాక చెప్పను!). వాస్తవాన్ని బయల్పరిచే మా గురుదేవుల వాక్కు, ఆయన భూమిమీద ఉన్న కాలంలో అధిక సంఖ్యలో శిష్యులు ఏర్పడకుండా అటంకపరిచినప్పటికీ, నానాటికీ అధికమవుతున్న, చిత్తశుద్ధిగల శిష్యుల మూలంగా ఆయన ఆత్మ ఈనాటికీ ప్రపంచంలో జీవిస్తోంది. అలెగ్జాండరు వంటి యోధులు భూమిమీద సార్వభౌమాధికారం కోసం పాకులాడుతారు; శ్రీయుక్తేశ్వర్‌గారి వంటి గురువులు అంతకన్న విశాలమైన సామ్రాజ్యాన్ని - మానవ హృదయాల్లో జయిస్తారు

తమ శిష్యుల లోపాల్లో చిన్నవాటినీ పట్టించుకోనవసరంలేని వాటినీ ఉత్పాతాన్ని సూచించేటంత తీవ్రంగా ఎత్తి చూపడం గురుదేవుల అలవాటు. ఒకనాడు మా నాన్నగారు శ్రీయుక్తేశ్వర్‌గారి దర్శనం కోసం శ్రీరాంపూర్ వచ్చారు. నాన్నగారు నా గురించి మెప్పుగా నాలుగు మాటలు విందామని ఆశించి ఉండవచ్చు. కాని నాలో ఉన్న లోపాల్ని వరసపెట్టడం వినేసరికి అదిరిపోయారు. వెంటనే నా దగ్గరికి వచ్చారు.

"మీ గురువుగారి మాటల్ని బట్టి నువ్వు పూర్తిగా ధ్వంసమయావని అనుకో వలసి వస్తోంది!" కన్నీళ్ళకి నవ్వుకీ మధ్య అవస్థలో ఉన్నారు నాన్నగారు.

ఆ సమయంలో శ్రీయుక్తేశ్వర్‌గారి అసంతుష్టికి కారణం ఒక్కటే - ఒకతన్ని ఆధ్యాత్మిక మార్గంలోకి మార్చే విషయమై, గురువుగారు ఆ పని వద్దని సౌమ్యంగా సూచించినప్పటికీ నేను అందుకు ప్రయత్నిస్తూ ఉండడమే. నేను రోషంగా గబగబా గురువుగారి దగ్గరికి వెళ్ళాను. చేసిన తప్పు తెలిసినవారిలా, నన్ను చూసి కళ్ళు కిందికి వాల్చుకున్నారు. ఆ దివ్య సింహం నా ఎదుట అంత సౌమ్యంగా ఉండగా చూడడం అదొక్కసారే. ఆ ఏకైక క్షణాన్ని పూర్తిగా ఆనందించాను.

"స్వామీ, మా నాన్నగారిదగ్గర నా గురించి అంత నిర్దయగా మాట్లాడి ఆయన విస్తుపోయేటట్టు ఎందుకు చేశారు? అది న్యాయమేనా?"

"ఇంకెప్పుడూ అలా చెయ్యను," శ్రీయుక్తేశ్వర్‌గారి కంఠస్వరం క్షమాపణ చెప్పుకొంటున్నట్టుగా ఉంది.

చటుక్కున నేను నిరాయుధుణ్ణి అయిపోయాను. ఆ మహానుభావులు తప్పు ఎంత వెంటనే ఒప్పుకున్నారు! అయితే గురుదేవులు మళ్ళీ ఎన్నడూ నాన్నగారి మనశ్శాంతిని పోగొట్టలేదు. కాని ఆయన ఎప్పుడనుకుంటే అప్పుడు, ఎక్కడనుకుంటే అక్కడ, నన్ను నిర్దాక్షిణ్యంగా చీల్చి చెండాడుతూ ఉండేవారు.

శ్రీ యుక్తేశ్వర్‌గారు ఆమూలాగ్రంగా ఇతరుల్ని విమర్శిస్తూ ఉండేటప్పుడు తరచుగా కొత్త శిష్యులు కూడా ఆయనతో కలుస్తూ ఉండేవారు. గురువు గారంతటి జ్ఞానులు మరి! దోషంలేని వివేకమూర్తులు మరి! కాని ఒకరిమీద దెబ్బతియ్యాలని చూసేవాడు తాను కాపుదల లేకుండా ఉండగూడదు. ఒకరిలో తప్పులు పట్టే ఈ శిష్యులే, విమర్శ అనే తమ అమ్ముల పొదిలోంచి గురుదేవులు కొన్ని బాణాలు వాళ్ళవేపు దూసుకువెళ్ళేలా బహిరంగంగా వదిలిన వెంటనే ఆయన దగ్గర్నించి పలాయనం చిత్తగించేవారు.

"మెత్తని మందలింపులకే ఎదురుతిరిగే సున్నితమైన మానసిక బలహీనతలు, సున్నితంగా తాకేలోగానే ఎదురుతిరిగే, రుజాగ్రస్తమైన శరీరావయవాల వంటివి," పలాయనంచేసే వాళ్ళగురించి శ్రీయుక్తేశ్వర్ గారు సరదాగా చేసిన వ్యాఖ్య ఇది.

చాలామంది శిష్యులకు గురువు గురించి ముందుగా ఊహించుకొన్న అభిప్రాయాలు కొన్ని ఉండడంతో, వాటినిబట్టి వాళ్ళు ఆయన మాటల్నీ చేతల్నీ నిర్ణయిస్తూ ఉంటారు. అటువంటి వ్యక్తులు, శ్రీయుక్తేశ్వర్‌గారిని తాము అర్థం చేసుకోలేదనీ తరచుగా ఫిర్యాదు చేస్తూ ఉంటారు.

"మీరు దేవుణ్ణే అర్థం చేసుకోరు!" అంటూ ఒక సందర్భంలో నేను మాటకు మాట జవాబిచ్చాను. "ఒక సాధువు మీకు అర్థం కావడమే జరిగితే మీరే ఒక సాధువవుతారు!" సృష్టిలో కోటానుకోట్ల రహస్యాలు దురవగాహంగా ఉండగా సాధువుల అగాధమైన ప్రకృతి ఒక్కటి తక్షణమే అర్థంకావాలని కోరడానికి సాహసించవచ్చా?

శిష్యులు వచ్చేవారు; సాధారణంగా వెళ్ళిపోయేవారు. సులువైన దారికోసం - అంటే, తక్షణ సానుభూతికోసం, తన యోగ్యతలకు ఆహ్లాదకరమైన గుర్తింపు కోసం - తపించిపోయే వాళ్ళకి ఈ ఆశ్రమంలో అది కనిపించేది కాదు. గురుదేవులు తమ శిష్యులకు ఆశ్రయం, అనేక యుగాలపాటు సంరక్షణ ఇస్తూండేవారు. కాని చాలామంది శిష్యులు లోభుల మాదిరిగా తమ అహంకారానికి తృప్తి కూడా కావాలని కోరేవారు. వినయం అలవరచుకోడానికి బదులుగా జీవితంలో ఎదురయే లెక్కలేనన్ని అవమానాలకే ప్రాముఖ్యమిచ్చి వెళ్ళిపోయారు వాళ్ళు. శ్రీయుక్తేశ్వర్ గారి తీక్ష్ణ కిరణాలు - అంటే, బహిరంగంగా లోపలికి చొచ్చుకు వెళ్ళే ఆయన జ్ఞాన సూర్యరశ్మి - వాళ్ళ ఆధ్యాత్మిక రుగ్మతకు భరించ జాలనంత శక్తివంతమైనవి. వాళ్ళు తమను పొగడ్తతో మరుగుపరుస్తూ అజ్ఞాన మనే కలత నిద్రలో ఉండనిచ్చే తక్కువస్థాయి గురువును చూసుకునేవారు.

గురుదేవుల దగ్గర నేనున్న తొలినాళ్ళలో, పదిమంది ముందు ఆయన పెట్టే చివాట్లంటే ఒక రకం భయం పట్టుకుంది. అయితే ఆయన, మాటల రూపంలో చేసే ఆ శస్త్రచికిత్సలు, తర్ఫీదు ఇమ్మని నా మాదిరిగా తమను కోరిన వ్యక్తులమీదే ప్రయోగించేవారని త్వరలోనే గ్రహించాను. అందుకు గింజుకునే విద్యార్థి ఎవరయినా అభ్యంతరం చెబితే మట్టుకు శ్రీయుక్తేశ్వర్ గారు, మనస్సులో ఏమీ నొచ్చుకోకుండా మౌనం వహించేవారు. ఆయన మాట లెన్నడూ, వ్యక్తిగతంగా వర్తించేటట్లు కాకుండా జ్ఞానసంపన్నమై ఉండేవికాని, ఆగ్రహోదగ్రంగా ఉండేవి కావు.

గురుదేవుల చివాట్లు ఉత్తిపుణ్యానికి వచ్చినవాళ్లకి ఎన్నడూ తగిలేవి కావు; వాళ్ళ లోపాలు కొట్టవచ్చినట్టు ఉన్నప్పటికీ వాటిని గురించి ఆయన వ్యాఖ్యానించడం అరుదు. కాని తమ సలహాకోసం వచ్చిన విద్యార్థుల విషయంలో మట్టుకు శ్రీయుక్తేశ్వర్‌గారు తమమీద గురుతరమైన బాధ్యత ఉందని భావించే వారు. అహంకారం చొరబారిన మానవులు అనే ముడిఖనిజాన్ని మార్చడానికి పూనుకొన్న గురువే నిజంగా ధైర్యశాలి! సాధువు సాహసం, మాయా జాలంలో ఇరుక్కొని కలవరపడే ప్రజలమీద-అంటే, తడుములాడుకొనే గుడ్డివాళ్ళలాటి ప్రాపంచిక జనులమీద - కలిగిన కరుణలో పాదుకొని ఉంటుంది.

నేను నాలో ఉన్న ఉడుకుబోతుతనాన్ని పోగొట్టుకున్న తరవాత నా మీద పడే తిట్లలో స్పష్టంగా తగ్గుదల కనిపించింది. గురుదేవులు అత్యంత సూక్ష్మ రీతిలో కరిగి కరుణాన్వితులయారు. కొంతకాలానికి నేను మామూలుగా మానవ మూర్తిమత్త్వం తన కాపుదలకోసం అడ్డుపెట్టుకొనే హేతువాద విధేయత, అవచేతన* మనస్సులోని మినహాయింపు అనే ప్రతిగోడనూ కూలగొట్టాను. దానికి ఫలితంగా నాకు లభించిన బహుమానం, అప్రయత్నంగానే మా గురుదేవులతో సామరస్యం ఏర్పడడం. అప్పుడు నేను, ఆయన, మనిషిమీద నమ్మక ముంచినవారని, మంచి చెడ్డలు ఆలోచించేవారని, గుప్తంగా ప్రేమించేవారని కనిపెట్టాను. అయితే, బయటికి కనబరిచే స్వభావం లేనివారవడంవల్ల ఆప్యాయమైన మాట ఒక్కటీ అనేవారు కారు.

నా మట్టుకు నా తత్త్వం ప్రధానంగా భక్తిపరమయినది. జ్ఞానపూర్ణులయిన మా గురుదేవులు భక్తిలేనివారి మాదిరిగా పైకి కనిపించినప్పటికీ, ముఖ్యంగా నిరుత్సాహజనకమైన ఆధ్యాత్మిక గణితరీతిలో ఆయన తమ భావాల్ని వ్యక్తం చేస్తూండడం నన్ను కలవరపెట్టేది. కాని నేను ఆయన స్వభావానికి తగినట్టుగా ఉంటూ వచ్చినకొద్దీ దేవుడిమీద నాకున్న భక్తి†తత్పరత తగ్గకపోగా, మరింత పెరిగిందని కనిపెట్టాను. ఆత్మ సాక్షాత్కారం పొందిన గురువుకు తన దగ్గరున్న రకరకాల శిష్యుల్లో వారివారి ప్రధానమైన మొగ్గునుబట్టి సహజ మార్గాల్ని అను సరించి వాళ్ళకు మార్గదర్శకత్వం వహించే సామర్థ్యం పూర్తిగా ఉంటుంది.

శ్రీయుక్తేశ్వర్‌గారితో నా సంబంధం కొంతవరకు, మాటల్లో వ్యక్తంకాని విధంగా ఉన్నప్పటికీ దానికి గుప్తమైన ధారాళత ఉండేది. నోటి మాటకు ఉపయోగం లేకుండా చేస్తూ ఆయన మౌనంగానే నాలో ఆలోచన రేకెత్తింపజేసేవారు. మౌనంగా ఆయన పక్కన కూర్చుని ఉండగా ఆయన అనుగ్రహం నా మీద వర్షించడం తరచు నాకు అనుభవంలోకి వచ్చేది.

---

* రబ్బీ ఇజ్రాయల్ హెచ్. లెవింథాల్ న్యూయార్కులో ఇచ్చిన ఒక ఉపన్యాసంలో, "మన చేతనకూ అవచేతనకూ కిరీటం వంటిది అధిచేతన," అన్నాడు. "మనలో లోలోపల ఒక చెత్తకుప్ప, ఒక కోశాగారం కూడా మరుగుపడి ఉన్నాయని ఎఫ్. డబ్ల్యు. హెచ్. మయర్స్ అనే ఇంగ్లీషు మనోవిజ్ఞాన శాస్త్రవేత్త చాలా ఏళ్ళకిందట అన్నాడు. అధిచేతనకు సంబంధించిన నవ్య మనోవిజ్ఞానశాస్త్రం, మానవ స్వభావంలోని అవచేతననే కేంద్రంగా చేసుకొని పరిశోధనలన్నీ సాగించే మనోవిజ్ఞానశాస్త్రానికి భిన్నంగా, కోశాగారం మీద - అంటే, మానవుల మహనీయ, నిస్స్వార్థ వీరోచిత కృత్యాల్ని వివరించగల ఏకైక మండలం మీద దృష్టి కేంద్రీకరిస్తుంది."

† దేవుణ్ణి చేరే ప్రధాన మార్గాల్లో రెండు : జ్ఞానం, భక్తి.

గురుదేవుల విష్పక్షపాతమైన న్యాయం, నేను కాలేజిలో చదివేటప్పుడు మొదటి సంవత్సరం వేసవి సెలవుల్లో నాకు స్పష్టంగా కనబడింది. నేను శ్రీరాం పూర్‌లో గురుదేవుల సన్నిధిలో అవిచ్ఛిన్నంగా కొన్ని నెలలు గడిపే అవకాశం కోసం ఎదురుచూస్తున్న రోజులవి.

నేను ఉత్సాహంగా ఆశ్రమానికి వచ్చినందుకు సంతోషిస్తూ శ్రీయుక్తేశ్వర్ గారు, "ఆశ్రమం వ్యవహారాలన్నీ నువ్వు నడపవచ్చు" అన్నారు. "అతిథి మర్యాదలు చెయ్యడం, ఇతర శిష్యుల పని అజమాయిషీ చెయ్యడం నీ విధులు."

ఒక పక్షం రోజుల తరవాత, తూర్పు బెంగాలునుంచి వచ్చిన కుమార్ అనే పల్లెటూరి పిల్లవాణ్ణి ఆశ్రమ శిక్షణకు స్వీకరించడం జరిగింది. మంచి తెలివైన ఆ కుర్రవాడు త్వరలోనే గురుదేవుల అభిమానాన్ని చూరగొన్నాడు. కారణమేమిటో ఎవరికి అంతుబట్టలేదుగాని, శ్రీయుక్తేశ్వర్‌గారు ఆ కొత్త శిష్యుడి విషయంలో విమర్శారహితమైన వైఖరి అవలంబించారు.

"ముకుందా, నీ పనులు కుమార్‌ని చెయ్యనియ్యి. తుడవడం, వంట చెయ్యడం నువ్వు చెయ్యి." కొత్త కుర్రవాడు వచ్చిన నెల్లాళ్ళకి గురుదేవులు నాకీ ఆదేశాలు ఇచ్చారు. తనను నాయకత్వపు హోదాకు పెంచే సరికి కుమార్, నిరంకుశ మైన పెత్తనం చలాయించడం మొదలుపెట్టాడు. తక్కిన శిష్యులు మనసులో తిరుగుబాటు వైఖరి అవలంబించి, రోజువారీ విషయాల్లో సలహాకు నా దగ్గరికే వచ్చేవారు. ఈ పరిస్థితి మూడు వారాలపాటు సాగింది; అప్పుడు కుమార్‌కూ గురుదేవులకూ మధ్య జరిగిన సంభాషణ నాకు చాటునుంచి వినబడింది.

"ముకుందుడు అసాధ్యుడు!" అన్నాడా కుర్రవాడు. "మీరు నన్ను అజమాయిషీదారుగ చేశారు. అయినా తక్కినవాళ్ళందరూ అతని దగ్గరికే వెళ్ళి, అతను చెప్పిన మాటే వింటున్నారు."

"అందుకే అతనికి వంటింటిపనీ నీకు కచేరీ సావడిపనీ అప్పజెప్పాను. కాబట్టి యోగ్యుడైన నాయకుడికి సేవ చెయ్యాలన్న కోరికేకాని అధికారం చలాయించాలన్న కోరిక ఉండదని నువ్వు గ్రహించవచ్చు." శ్రీయుక్తేశ్వర్‌గారి వాడి మాటలు కుమార్‌కి కొత్త. "నువ్వు ముకుందుడి స్థానం నీకు కావాలని కోరావు. కాని యోగ్యతద్వారా దాన్ని నిలుపుకోలేక పోయావు. వంటవాడికి సహాయకుడిగా నువ్వు మొదటచేసిన పనిలోకే తిరిగి వెళ్ళు.

గర్వాన్ని అణిచే ఈ సంఘటన జరిగిన తరవాత గురుదేవులు కుమార్ విషయంలో అకారణమైన అనురాగంతో వెనకటి వైఖరి అవలంబించారు. ఆకర్షణలోని మర్మాన్ని ఎవరు ఛేదించగలరు? మా గురుదేవులు కుమార్‌లో

మనోహరంగా పైకి చిమ్మే ఉత్సాహ జలనిధిని కనిపెట్టారు; కాని తోటి శిష్యుల విషయంలో కనబరచడానికి మాత్రం ఆ ఉత్సాహం పెల్లుబకదు మరి! కొత్త కుర్రవాడు సహజంగా గురుదేవులకు ఇష్టుడయినప్పటికీ నేనేమీ దిగులు పడలేదు. మహాపురుషుల్లో కూడా ఉండే వ్యక్తిగత విచిత్ర నైజాలు జీవన విధానానికి ఒక క్లిష్టతని, ఆకర్షణని ఆపాదింప చేస్తాయి. నా స్వభావం చిన్నచిన్న విషయాలచేత ప్రభావితం కాదు. నేను శ్రీయుక్తేశ్వర్ గారి దగ్గర పొందగోరినది, పైపై పొగడ్తలకన్న గొప్ప లాభం.

ఒకనాడు కుమార్ నాతో నిష్కారణంగా విషం కక్కుతూ మాట్లాడాడు; నేను చాలా నొచ్చుకున్నాను.

"నీ తల పేలిపోయేటంతగా పొగరెక్కిపోతోంది!" అంటూ, నే నొక హెచ్చరిక కూడా చేశాను; దాంట్లో సత్యం నా అంతఃకరణకు స్ఫురించింది: "నువ్వు కనక నీ పద్ధతులు మార్చుకోకపోతే, ఎప్పుడో ఒకనాడు నిన్ను ఆశ్రమంనుంచి వెళ్ళి పొమ్మని చెబుతారు."

కుమార్ హేళనగా నవ్వుతూ, నే నన్న మాటలు, అప్పుడే గదిలో అడుగు పెట్టిన గురుదేవుల దగ్గర వల్లించాడు. ఇక తిట్లు తినవలసివస్తుందని అనుకుంటూ నేను ఒక మూల నక్కాను.

"ముకుందుడు చెప్పింది నిజమే కావచ్చు." గురుదేవులు ఆ అబ్బాయికి ఇచ్చిన జవాబు, అసాధారణ రీతిలో స్నేహరహితంగా ఉంది.

ఒక ఏడాది తరవాత, కుమార్ తన బాల్యం గడిపిన ఊరు చూసి వద్దామని వెళ్ళాడు. గురుదేవులు మౌనంగా తెలిపిన అసమ్మతిని అతను ఉపేక్షించాడు; శ్రీయుక్తేశ్వర్‌గారు తమ శిష్యుల రాకపోకలను ఎన్నడూ అధికారం చూపించి అదుపులో పెట్టలేదు. కొద్ది నెలల్లో తిరిగి శ్రీరాంపూర్ వచ్చే నాటికి ఆ అబ్బాయిలో కొట్టవచ్చినట్టు మార్పు కనిపించింది. ప్రశాంతంగా ప్రకాశించే ముఖంతో రాజసం ఉట్టిపడే కుమార్ లేడిక; కొత్తగా అనేక చెడ్డ అలవాట్లు చేసికొన్న సాధారణ పల్లెటూరి పడుచువాడొకడు మా ముందు నిలబడ్డాడు.

గురుదేవులు నన్ను పిలిచారు; ఆ కుర్రవాడు ఇప్పుడు ఆశ్రమ, సన్యాస జీవితాలకి తగ్గవాడు కాడన్న యథార్థాన్ని భగ్నహృదయంతో చెబుతూ నాతో చర్చించారు.

"ముకుందా, రేపే ఆశ్రమం విడిచి వెళ్ళమని కుమార్‌కు చెప్పే పని నీకు అప్పగిస్తున్నాను; నే నది చెయ్యలేను." శ్రీయుక్తేశ్వర్‌గారి కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

కాని వాటిని త్వరగానే ఆపుకొన్నారు. "ఆ అబ్బాయి నా మాట విని, ఊరికి వెళ్ళకుండా, చెడుసావాసాలు చెయ్యకుండా ఉంటే ఇంత అధోగతికి పోయేవాడు కాడు. నా రక్షణ తిరస్కరించాడు. కఠిన ప్రపంచమే ఇంకా అతనికి గురువుగా ఉండాలి."

కుమార్ వెళ్ళిపోవడం నా కేమీ సంతోషం కలిగించలేదు; గురుదేవుల అభిమానాన్ని సంపాదించే శక్తిగలవాడు ప్రాపంచిక ప్రలోభాలకు అంత సులువుగా ఎలా లోబడిపోయాడా అని విచారించాను. మద్యంవల్లా మగువవల్లా సుఖానుభవం పొందడమన్నది ప్రకృతిసిద్ధంగా జీవించే మనిషిలో పాదుకొని ఉన్నది. వాటిని మెచ్చుకోడానికి సున్నితమైన గ్రహింపుశక్తి అవసరం లేదు. ఇంద్రియ ప్రలోభాలు ఎప్పటికీ పచ్చగా ఉండే గన్నేరు మొక్క లాంటివి; సువాసన వెద జల్లుతూ, గులాబి వన్నెపూలు గల ఆ మొక్కలో ప్రతి భాగమూ విషపూరిత మైనది.* స్వస్థత చేకూర్చే లోకం లోలోపల ఉంటుంది; ఏ సుఖంకోసం బయట వెయ్యి వైపుల మనం గుడ్డిగా వెతుకుతూ ఉంటామో ఆ సుఖం, ఆ లోకంలో ప్రకాశిస్తూ ఉంటుంది.

"తీక్ష్ణమైన బుద్ధి రెండువేపులా పదునున్న కత్తిలాంటిది," అని వ్యాఖ్యానించారు గురుదేవు లొకసారి, కుమార్ ఉజ్జ్వల ప్రతిభనుగురించి ప్రస్తావిస్తూ. దాన్ని కత్తిలా, నిర్మాణాత్మకంగా అజ్ఞానమనే కురుపును కొయ్యడానికి కాని, విధ్వంసాత్మకంగా తల తెగ్గోసుకోడానికి కాని ఉపయోగించవచ్చు. ఆధ్యాత్మిక నియమం తప్పించుకోడానికి వీలులేనిదన్న సంగతిని మనస్సు అంగీకరించిన తరవాత మాత్రమే బుద్ధి సరయిన మార్గంలో సాగుతుంది."

మా గురుదేవులు అందరినీ తమ పిల్లల మాదిరిగానే ఆదరిస్తూ, శిష్యుల తోటీ శిష్యురాళ్ళతోటీ కూడా స్వేచ్ఛగా కలిసిమెలిసి ఉండేవారు. ఆత్మపరంగా వాళ్ళలో సమానత్వాన్ని గ్రహించి వాళ్ళమధ్య విచక్షణ చూపించడంకాని, పక్ష పాతం చూపించడంకాని చేసేవారు కాదు.

"నిద్రలో, నువ్వు ఆడో మొగో నీకు తెలియదు," అన్నారాయన. "స్త్రీ రూపం ధరించిన పురుషుడు స్త్రీ కానట్టే స్త్రీ పురుషులుభయులుగానూ రూపధారణ చేసే ఆత్మ, మార్పు లేకుండానే ఉండిపోతుంది. ఆత్మ భగవంతుడి నిర్వికార, నిర్గుణ ప్రతిరూపం.

* "మానవుడు జాగ్రదవస్థలో ఇంద్రియసుఖాలు అనుభవించడానికి లెక్కలేనన్ని ప్రయత్నాలు చేస్తూ ఉంటాడు. ఇంద్రియాలన్నీ అలసిపోయినప్పుడు చేతికందిన సుఖాన్ని కూడా మరిచిపోయి, తన స్వాభావమయిన ఆత్మలో విశ్రాంతి అనుభవించడానికి నిద్రపోతాడు." అని రాశారు, మహావేదాంతి శంకరాచార్యులవారు. "ఆ విధంగా, అతీంద్రియానందం సాధించడం చాలా సులువు, ఎప్పుడూ రోతతోనే అంతమయే ఇంద్రియ సుఖాలకంటె అది చాలా శ్రేష్ఠమైనది."

శ్రీయుక్తేశ్వర్‌గారు స్త్రీలను ఎన్నడూ పరిహరించనూ లేదు, వాళ్ళను "పురుషుడి పతనానికి" కారకులుగా నిందించనూ లేదు. స్త్రీలు కూడా పురుషుల ఆకర్షణను ఎదుర్కోవలసి ఉంటుంది. ప్రాచీన కాలపు మహాభక్తుడు, ఒకాయన స్త్రీలను "నరకానికి ద్వారం"గా చెప్పడానికి కారణమేమిటని నేనొకసారి గురుదేవుల్ని అడిగాను.

"చిన్నప్పుడు ఒకమ్మాయి ఆయన మనశ్శాంతికి చాలా భంగకరంగా ఉండి ఉండాలి," అని జవాబిచ్చారు మా గురుదేవులు, ఘాటుగా. "లేకపోతే ఆయన, స్త్రీని కాకుండా, తనలోని ఆత్మనిగ్రహంలోని లోపాలను గర్హించి ఉండేవాడు."

చూడ్డానికి వచ్చిన వ్యక్తి ఎవరయినా మనోవికార ద్యోతకమైన కథ ఏదైన చెప్పడానికి సాహసించేటట్లయితే గురుదేవులు గంభీరంగా మౌనం వహించేవారు. "అందమైన ముఖం రెచ్చగొట్టే కొరడాలాంటిది; దాంతో దెబ్బలు తినే స్థితి తెచ్చుకోకండి," అని శిష్యులకు చెప్పారాయన. "ఇంద్రియాలకు బానిసలయిన వాళ్ళు ప్రపంచంలో ఆనందం ఎలా పొందగలరు? అసహ్యమైన బురదలో పొర్లాడుతున్నప్పుడు, ప్రపంచపు సూక్ష్మ సుగంధాలు వాళ్ళకు సోకవు. పాంచభౌతిక సుఖాలకు లోబడ్డ మనిషికి సున్నితమైన విచక్షణలన్నీ నశిస్తాయి."

మాయాప్రేరితమైన కామలాలసనుంచి బయటపడడానికి ప్రయత్నించే విద్యార్థులకు, శ్రీయుక్తేశ్వర్‌గారు వాళ్ళని ఓర్పుగా అర్థంచేసుకొని, తగిన సలహా ఇచ్చేవారు.

"ఆబకు కాకుండా, ఆకలికి న్యాయమైన ప్రయోజనం ఉన్నట్టే తృప్తిపరచ జాలని కోరికల్ని రేపడానికి కాకుండా, కేవలం వంశాభివృద్ధి కోసమే ప్రకృతి, కామ ప్రవృత్తిని నెలకొల్పింది," అన్నారాయన. "చెడ్డకోరికల్ని ఇప్పుడు నాశనం చెయ్యి; లేకపోతే అవి, నీ సూక్ష్మ శరీరం భౌతికకోశం నుంచి విడివడ్డ తరవాత కూడా నీతోనే ఉంటాయి. శరీరం, వాటిని నిగ్రహించలేనంత బలహీనంగా ఉన్నప్పటికీ మనస్సు ఎప్పుడూ నిరోధిస్తూ ఉండాలి. వాటి ఆకర్షణ కనక, క్రూరమైన శక్తితో నీ మీద దాడి చేస్తున్నట్లయితే నిష్పాక్షిక విశ్లేషణతోనూ అజేయమైన సంకల్పబలంతోనూ దాన్ని జయించాలి. ప్రకృతి సహజమైన ప్రతి వాంఛనూ జయించవచ్చు.

"మీ శక్తుల్ని పదిలపరుచుకోండి. ఇంద్రియాలనే ఉపనదులన్నింటినీ తనలో కలుపుకొనే విశాలమైన మహాసముద్రంలా ఉండండి. ప్రతినిత్యం మళ్ళీమళ్ళీ వచ్చే ఇంద్రియ వాంఛలు మీ అంతరంగంలో ఉన్న శాంతిని తొలిచేస్తాయి. అవి జలాశయాని

కున్న బెజ్జాలలాంటివి; దానిలోని అమృతతుల్యమైన జలాన్ని భౌతికత్వమనే ఎడారి నేలలో వ్యర్థమయ్యేట్టు చేస్తాయవి. చెడుకోర్కె యొక్క బలీయమైన ప్రచోదక ప్రేరణ మానవుడి సంతోషానికి మహాశత్రువు. ఆత్మ నిగ్రహ సింహంలా ఈ ప్రపంచంలో తిరగండి; ఇంద్రియ దౌర్బల్యాలనే కప్పలు మిమ్మల్ని లోకువకట్టి ఆట పట్టించకుండా చూసుకోండి!"

నిజమైన భక్తుడు సహజాత నిర్బంధాలన్నిటినుంచి చివరికి విముక్తి పొందు తాడు. మానవ ప్రేమకోసం తనకుగల అవసరాన్ని కేవలం పరమేశ్వరుడి కోసం ఆకాంక్షగా - అది సర్వవ్యాప్తమయినందువల్ల ఏకమాత్ర ప్రేమగా - పరివర్తన చేస్తాడు.

శ్రీయుక్తేశ్వర్‌గారి తల్లిగారు కాశీలో రాణామహల్ బస్తీలో ఉంటుండేవారు నాకు మొట్టమొదట శ్రీయుక్తేశ్వర్‌గారి దర్శనం అయింది కాశీలోనే. ఆవిడ సౌమ్యురాలు, దయామయి అయినప్పటికీ కూడా దృఢమైన నిశ్చితాభిప్రాయాలు ఏర్పరచుకొన్న వ్యక్తి. ఒకనాడు నేను, ఆ తల్లీకొడుకూ మాట్లాడుకొంటూ ఉండగా ఆవిడ ఇంటి బాల్కనీలో నించుని గమనించాను. గురుదేవులు తమకు స్వాభావి కమైన పద్ధతిలో శాంతంగా, యుక్తియుక్తంగా మాట్లాడుతూ ఏ విషయమో ఆమెకు నచ్చజెప్పడానికి ప్రయత్నిస్తున్నారు. ఆవిడ విసురుగా తల తిప్పడాన్ని బట్టి, ఆయన ఆవిడకి నచ్చజెప్పలేకపోయారని స్పష్టమైంది.

"వద్దు, వద్దు నాయనా; ఇక వెళ్ళిపో! నీ జ్ఞానోపదేశాలు నాకు కాదు! నేను నీ శిష్యురాల్ని కాను!"

శ్రీయుక్తేశ్వర్‌గారు మరింక వాదించకుండా, తిట్లు తిన్న పిల్లవాడిలా వెనక్కి తగ్గారు. ఆవిడ యుక్తియుక్తంకాని మనస్స్థితుల్లో ఉన్నప్పుడు కూడా తల్లిమీద ఆయనకున్న గొప్ప గౌరవాన్ని చూసి ముగ్ధుణ్ణి అయాను. ఆవిడ దృష్టిలో తన కొడుకు, చిన్నపిల్లవాడేకాని ఋషికాడు. ఈ చిన్న సంఘటనకు ఒక ఆకర్షణ ఉంది; లోపల వినయం గాను, బయట ఎంచరాని విధంగాను ఉండే మా గురుదేవుల అసాధారణ స్వభావం మీద ఇది ఒక పక్కనుంచి వెలుగు ప్రసరింప జేసింది.

సన్యాసం తీసుకొన్న వ్యక్తి విధ్యుక్తంగా లౌకికబంధాలనుంచి విడివడ్డ తరవాత వాటిని నిలుపుకోడానికి సన్యాసధర్మనియమాలు అనుమతించవు గృహస్థుకు విధ్యుక్తమైన పూజాపురస్కారాలవంటి కర్మకాండ నిర్వర్తించ గూడదు అయినప్పటికీ, సనాతన సన్యాసాశ్రమాన్ని పునర్వ్యవస్థీకరించిన శంకరులు, ఈ నియమాన్ని పట్టించుకోలేదు. ప్రేమాస్పదురాలైన తమ తల్లిగారు కాలంచేసి నప్పుడు

ఆయన, పైకెత్తిన తమచేతిలో దివ్యాగ్ని పుట్టేటట్టుచేసి దాంతో ఆవిడ దేహాన్ని దహనంచేశారు.

శ్రీయుక్తేశ్వర్‌గారు కూడా నిర్బంధాల్ని ఉపేక్షించడం, అంత ఘనంగా కాకపోయినా అంతకన్న తక్కువ స్థాయిలో వెల్లడి అయింది. తల్లిగారు గతించిన తరవాత ఆయన, కాశీలో పవిత్రమైన గంగానది ఒడ్డున దహనకాండ ఏర్పాటు చేయించి, గృహస్థ ధర్మం ప్రకారం అనేకమంది బ్రాహ్మణులకు సంతర్పణ చేయించారు. సంకుచితమైన అనుబంధాల్ని అధిగమించడానికి సన్యాసులకు తోడ్పడ్డంకోసం ఉద్దేశించినవి శాస్త్రీయమైన నిషేధాలు. శంకరులు, శ్రీయుక్తేశ్వర్‌గారు తమ అస్తిత్వాన్ని వైయక్తికతారహితమైన చిచ్ఛక్తిలో సంపూర్ణంగా విలీనం చేసుకొన్నారు; నియమాన్ని ఆశ్రయించుకొని రక్షణ పొందవలసిన అవసరం వారికి లేదు. ఒక్కొక్కప్పుడు ఒకానొక గురువు, విధికి ఏర్పడ్డ రూపం కన్న, దాని నియమం ఘనమైనదని నిరూపించడం కోసం, కావాలని దాన్ని ఉపేక్షిస్తాడు. ఆ విధంగా ఏసుక్రీస్తు, విశ్రాంతి రోజున ధాన్యం కంకులు కోశాడు. అనివార్య విమర్శకులకు ఆయన ఇలా చెప్పాడు: "విశ్రాంతి రోజు (సబ్బత్) ఏర్పడ్డది మనిషికోసంకాని, మనిషి విశ్రాంతిరోజుకోసం కాదు."*

పవిత్ర గ్రంథాలు తప్పించి, శ్రీయుక్తేశ్వర్‌గారు చదివింది స్వల్పం. అయినప్పటికీ ఆయనకు అత్యంత అర్వాచీనమైన వైజ్ఞానిక ఆవిష్కరణలు, జ్ఞానపరమైన ఇతర ప్రగతులు తప్పనిసరిగా పరిచయమై ఉండేవి.† అద్భుత సంభాషణా చాతురులైన ఆయన, తమ అతిథులతో, అనేక విషయాల గురించి కులాసాగా చర్చలు జరిపేవారు. మా గురుదేవులు సద్యఃస్ఫూర్తి, నోరారా నవ్వే నవ్వు ప్రతి చర్యకూ జీవం పోసేవి. తరచు గంభీరంగా ఉన్నప్పటికీ, గురుదేవులు విషాదంగా ఎన్నడూ ఉండేవారు కారు. బైబిలు‡నుంచి ఉదాహరిస్తూ, "ఈశ్వరాన్వేషణ చెయ్యడానికి మనుషులు 'తమ ముఖాల్ని వికృతం చేసుకోనక్కరలేదు," అన్నారాయన. "దైవసాక్షాత్కారం పొందడమంటే అన్ని దుఃఖాలకీ అంత్యక్రియ జరిపించడమే నన్న సంగతి గుర్తుంచుకోండి."

---

* మార్కు 2.27 (బైబిలు).

† గురుదేవులు కోరుకున్న తక్షణం, ఏ వ్యక్తి మనస్సులోనయినా శ్రుతి మేళవించుకొనేవారు. (పతంజలి యోగసూత్రాలు III:19 శ్లోకంలో చెప్పిన ఒకానొక యోగశక్తి: 'ప్రత్యయస్య పరచిత్త జ్ఞానం'). మానవరూపంలో ఉన్న రేడియోగా ఆయనకు గల శక్తుల్ని, ఆలోచనా స్వభావాన్ని 15 అధ్యాయంలో వివరించడం జరిగింది. (చూ.పే. 199-200)

‡ మత్తయి 6 16 (బైబిలు).

ఆశ్రమానికి వచ్చిన తాత్త్వికులు, ఆచార్యులు, న్యాయవాదులు, విజ్ఞాన శాస్త్రవేత్తల్లో కొందరు మొట్టమొదటిసారిగా వచ్చినప్పుడు, తామొక చాదస్తపు మతాభిమానిని కలుసుకోబోతున్నామనే భావించేవారు. అప్పుడప్పుడు, అహంకారంతో కూడిన ఒక చిరునవ్వువల్ల కాని, తెచ్చిపెట్టుకున్న ఓర్పుతో చూసిన ఒక చూపువల్లకాని, ఆ కొత్తగా వచ్చినవాళ్ళు ఆయన దగ్గిర ఆశించినదల్లా రుచీపచీలేని నాలుగు ఉపదేశవాక్యాలకు మించి మరేమీ లేదన్న సంగతి వెల్లడి అయేది. కాని శ్రీయుక్తేశ్వర్‌గారితో మాట్లాడిన తరవాత, తాము కృషిచేసిన తమతమ ప్రత్యేక రంగాల్లో ఆయనకు సునిశితమైన పరిజ్ఞానం ఉన్న సంగతి కనిపెట్టిన ఆ ఆగంతుకులకు, అక్కణ్ణించి వెళ్ళాలంటే మనసు ఒప్పేది కాదు.

మామూలుగా మా గురుదేవులు, అతిథులతో సౌమ్యంగా, స్నేహపూర్వకంగా వ్యవహరించేవారు; ఆయన ఇచ్చే స్వాగతం సౌహార్దంతో ముగ్ధుల్ని చేసేది. కాని దురహంకారమనే మొండి జబ్బుగలవాళ్ళకు మాత్రం బలవర్ధకమైన అఘాతాలు (Shocks) తగులుతూ ఉండేవి. వాళ్ళకు గురుదేవుల్లో కనిపించేది నిరుత్సాహజనకమైన ఉపేక్ష లేదా బలీయమైన వ్యతిరేకత; అయితే మంచు, లేకపోతే ఇనుము

ఒకమాటు ప్రఖ్యాత రసాయనశాస్త్రవేత్త ఒకరు శ్రీయుక్తేశ్వర్ గారితో హోరాహోరీగా తర్కవితర్కాలు చేశారు. దేవుణ్ణి పసిగట్టడానికి విజ్ఞానశాస్త్రం ఏ సాధనాన్నీ తయారుచెయ్యలేదు కాబట్టి దేవుడు ఉన్నాడన్న సంగతి తాము ఒప్పుకోమని చెప్పారు.

"అంటే, పరమాత్మను మీ శోధననాళికల్లో పట్టి పరీక్షించడంలో, కారణం చెప్పలేనంతగా విఫలమయ్యారన్నమాట!" గురుదేవుల చూపు తీవ్రంగా ఉంది. "నేను ఒక కొత్త ప్రయోగం సిఫార్సు చేస్తాను; ఎడతెరిపి లేకుండా మీ ఆలోచనల్ని ఇరవై నాలుగు గంటలపాటు పరీక్షించండి. ఆ తరవాత దేవుడు లేకపోవడం గురించి మీరు ఆశ్చర్యపోరు."

ఒక ప్రసిద్ధ విద్వాంసుడు కూడా ఇలాగే దెబ్బతిన్నాడు. ఆయన ఆశ్రమానికి మొట్టమొదటిసారిగా వచ్చినప్పుడు జరిగిందిది. ఆయన మహాభారతంలోంచి ఉపనిషత్తుల*లోంచి, శంకరాచార్యులవారి భాష్యాలలోంచి అనేక భాగాలు విని పిస్తూంటే ఇంటివాసాలు కూడా మారుమోగాయి.

---

* వేదాంతము (వాచ్యార్థము - "వేదముల యొక్క చివరి భాగములు")గా తెలియబడే ఉపనిషత్తులు హిందూమతానికి సైద్ధాంతిక పునాదిగా పనిచేసే సారసంగ్రహములు. నాలుగు వేదాలలోనూ కొన్ని భాగాలలో ఇవి ఉన్నాయి. షోపెన్ హోవర్ అనే జర్మను పండితుడు, వేదాంతి ఉపనిషత్తులలోని "లోతైన, మౌలికమైన, మహోన్నతమైన" ఆలోచనలను ప్రశంసిస్తూ ఇలా

"మీ మాటలు వినడానికి ఎదురుచూస్తున్నాను," అంతవరకు నిశ్శబ్దమే ఆవరించి ఉందన్నట్టుగా ఉంది, శ్రీయుక్తేశ్వర్‌గారి కంఠస్వరంలో వెల్లడి అయిన జిజ్ఞాస. ఆ విద్వాంసుడు తికమకపడ్డాడు.

"ఇతరులు చెప్పినవి కోకొల్లలుగా ఉన్నాయి," ఆ వచ్చినాయనకు కాస్త దూరంలో, మామూలుగా నేను కూర్చునే మూలనే కూర్చున్నాను; గురుదేవుల మాటలకు సంతోషం పట్టలేక వంకరలు తిరిగిపోయాను. "కాని ప్రత్యేకించి మీ జీవిత విశిష్టతనుబట్టి మీరు అందించే మౌలిక వ్యాఖ్య ఏమిటి? మీరు ఏ పవిత్ర గ్రంథాన్ని ఒంటబట్టించుకొని మీ సొంతం చేసుకున్నారు? ఈ చిరంతన సత్యాలు మీ స్వభావాన్ని ఏయే రకాలుగా పునరుద్ధరించాయి? ఇతరుల మాటల్నే యాంత్రికంగా మారుపలుకుతూ గ్రామఫోన్‌లా ఉంటే చాలనుకుంటున్నారా?"

"ఓడిపోయాను!" చిన్నబోయిన ఆయన ముఖం నవ్వు పుట్టించేలా ఉంది. "నాకు అంతరికానుభవం ఏమీ లేదు." ఆధ్యాత్మిక కోమా (coma, అపస్మారం) బదులు వివేచనాయుతంగా పెట్టే కామా (comma, పుస్తక పరిజ్ఞానం) పరిహారంగా పనికిరాదన్న సంగతి, బహుశా ఆయన, మొట్టమొదటిసారిగా గ్రహించారు.

శిక్షితుడయిన ఆ విద్వాంసుడు వెళ్ళిపోయిన తరవాత మా గురుదేవులు ఇలా వ్యాఖ్యానించారు: "అనుభవశూన్యులైన ఈ పండితమ్మన్యులు దీపందగ్గర చదివి చదివి చమురు కంపుకొడుతుంటారు. వేదాంతమంటే కేవలం బుద్ధి వికాసం కోసం అనాయాసంగా చేసే వ్యాయామం లాంటిదనుకుంటారు. వాళ్ళు తమ ఉదాత్తభావనలను, బాహ్యాచర్య తాలూకు మొరటుతనానికి కాని, మందలిస్తూ ఉండే ఏ ఆంతరిక శిక్షణకుకాని సంబంధంలేని విధంగా జాగ్రత్తగా ఏర్పరచుకొంటారు!"

కేవల పుస్తక పరిజ్ఞానానికున్న నిష్ఫలత గురించి గురుదేవులు ఇతర సందర్భాల్లో నొక్కి వక్కాణించేవారు.

"పెద్ద పెద్ద మాటలు వాడడం, ఒక విషయం బాగా అవగాహన చేసుకోవడం ఒకటేనని పొరబడకండి," అని వ్యాఖ్యానించారాయన. "ఒక్కొక్క శ్లోకమే మెల్లగా ఒంటబట్టించుకుంటూ చదివేటట్లయితే, ఆంతరిక అనుభవసాధనపట్ల కోరిక రగుల్కొల్పడానికి పవిత్ర గ్రంథాలు బాగా సాయపడతాయి. లేకపోతే, కేవలం

---

అన్నాడు : "నా దృష్టిలో గడచిన శతాబ్దులకంటె ఈ శతాబ్దపు (ప్రజల) గొప్ప అదృష్టమేమిటంటే (పశ్చిమ దేశాల్లో లభించే ఉపనిషత్తుల అనువాదాల ద్వారా) వేదాలకి దారి దొరకడం.

మెదడుకు పనిచెప్పేటట్లు నిరంతరం సాగే అధ్యయనానికి ఫలితంగా అహం భావం, కృత్రిమ సంతృప్తి, ఒంటబట్టని విజ్ఞానం ఏర్పడవచ్చు."

శ్రీయుక్తేశ్వర్‌గారు, పవిత్ర గ్రంథాల పరిజ్ఞానం పెంపొందించుకునే విషయంలో తమకు కలిగిన అనుభవం ఒకటి చెప్పారు. ఇది జరిగింది, తూర్పు బెంగాలులో అడవిలో ఒక ఆశ్రమంలో; అక్కడ ఆయన, దబ్రూ వల్లభ్ అనే ప్రసిద్ధ గురువు అనుసరించే శిక్షణ విధానాన్ని గమనించారు. ఒక రకంగా సులువుగా, మరోరకంగా కష్టంగాను ఉండే ఆయన పద్ధతి సనాతన భారత దేశంలో సామాన్యమైనదే.

దబ్రూ వల్లభ్‌గారు ఏకాంత వనప్రదేశంలో తమ శిష్యుల్ని చుట్టూ కూర్చో పెట్టుకున్నారు. పవిత్రగ్రంథమైన భగవద్గీత వాళ్ళముందు తెరిచి పెట్టి ఉంది వాళ్ళు ఒక శ్లోకంమీద అరగంటసేపు నిలకడగా చూపు నిలిపి ఉంచి ఆ తరవాత కళ్ళు మూసుకున్నారు. మరో అరగంట గడిచిపోయింది. గురువుగారు దానిమీద టూకీగా వ్యాఖ్యానం చేశారు. ఒక గంటసేపు వాళ్ళు నిశ్చలంగా ధ్యానంచేశారు చివరికి గురువుగారు మాట్లాడారు.

"శ్లోకం అర్థం చేసుకున్నారా?"

"చేసుకున్నానండి," ఆ శిష్య బృందంలో ఒకడు నొక్కి చెప్పడానికి సాహసించాడు.

"లేదు; పూర్తిగా కాదు. శతాబ్దుల తరబడిగా భారతదేశానికి పునర్యౌవ్వనం ప్రసాదించడానికి ఈ మాటలకు శక్తినిచ్చిన ఆధ్యాత్మిక జీవశక్తిని అన్వేషించు." మౌనంలో మరోగంట గడిచిపోయింది. గురువుగారు శిష్యుల్ని పంపేసి శ్రీయుక్తేశ్వర్‌గారి వేపు తిరిగారు.

"మీకు భగవద్గీత తెలుసా?"

"తెలియదండి; నా కళ్ళూ నా మనస్సూ ఆ పుస్తకం పుటల్లో చాలాసార్లు పరిగెత్తాయేకాని, నిజంగా తెలియదండి."

"వందలకొద్దీ జనం, దీనికి వేరుగా సమాధానం ఇచ్చారు!" ఆ మహాసాధువు ఆశీఃపురస్సరంగా మా గురుదేవుల వేపు చిరునవ్వు నవ్వారు. "పవిత్రగ్రంథ సంబంధమైన సంపదను బయటికి ప్రదర్శించడంలో నిమగ్నుడైనవాడికి, అమూల్యమైన ముత్యాలకోసం మౌనంగా లోపలికి మునగడానికి సమయం ఏముంటుంది?'

శ్రీయుక్తేశ్వర్‌గారు తమ శిష్యుల అధ్యయనాన్ని కూడా ఏకాగ్ర చిత్తంతో కూడిన అదే తీవ్రపద్ధతిలో సాగేటట్టు నడిపించేవారు. "జ్ఞానాన్ని ఒంటబట్టించు కునేది తనలో ఉన్న అణువణువుద్వారానే కాని కళ్ళతోకాదు," అన్నారాయన. "ప్రగాఢ విశ్వాసం కేవలం నీ మెదడులో మాత్రమేకాక నీ అస్తిత్వమంతటా వ్యాప్తమై ఉన్ననాడు నువ్వు దాని అర్థం ఫలానా ఏమో అని సంకోచిస్తూ చెప్పవచ్చు." ఆధ్యాత్మికసిద్ధికి పుస్తకపరిజ్ఞానాన్ని అవసరమైన ఒక మెట్టుగా పరిగణించవలసిన ధోరణి ఏదీ విద్యార్థిలో పొడగట్టకుండా నిరుత్సాహపరిచేవారు.

"ఋషులు ప్రగాఢమైన జ్ఞానాన్ని ఒక్కొక్క వాక్యంలో ఇమిడ్చి రాస్తే, విద్వాంసులు వాటిని వ్యాఖ్యానించడంలో తరతరాలుగా పూర్తిగా నిమగ్నులై ఉన్నారు," అన్నారాయన. "అంతులేని సాహిత్య వివాదం మందబుద్ధులకే. 'దేవుడున్నాడు' - కాదు 'దేవుడు' అన్న ఆలోచన కన్న మిన్నగా మోక్షప్రదమైన మరొక ఆలోచన ఏముంది?"

కాని మానవుడు సరళతవేపు అంత సులభంగా మళ్ళడు. బుద్ధివాది "దేవుణ్ణి" ధ్యేయంగా పెట్టుకోడం అరుదు; అంతకన్న పాండిత్య ప్రదర్శనల మీదే దృష్టి నిలుపుతాడు. తాను అటువంటి పాండిత్యం గడించగలిగినందుకు అతని అహం సంతుష్టి చెందుతుంది.

లౌకికమైన తమ హోదానుకాని సంపత్తినికాని సగర్వంగా స్పృహలో ఉంచు కొన్న వాళ్ళు, మా గురుదేవుల సాన్నిధ్యంలో, తమకు ఉన్న వాటికితోడు విన యాన్ని కూడా చేర్చుకోడం సంభవం. ఒకసారి, స్థానికంగా ఉండే మేజిస్ట్రేటుగారు ఒకరు, పూరీలో సముద్రతీరాన ఉన్న ఆశ్రమంలో ఇంటర్వ్యూ కావాలని కోరారు. పరమ కర్కోటకుడని పేరు పొందిన ఆయనగారు, తలుచుకుంటే మా ఆశ్ర మాన్ని మాకు కాకుండా చెయ్యగల అధికారం ఉన్నవాడు. ఈ యథార్థాన్ని నేను మా గురుదేవులకుచెప్పాను. కాని ఆయన నిశ్చలంగా కూర్చున్నారు; వచ్చినాయన్ని పలకరించడానికి లేవనైనా లేవలేదు.

నేను కొద్దిగా గాభరాపడుతూ తలుపుదగ్గర కూర్చున్నాను. శ్రీయుక్తేశ్వర్ గారు, మేజిస్ట్రేటుగారికోసం కుర్చీ తెమ్మని కూడా నాకు చెప్పలేదు; ఆయనగారు కూర్చోడానికి ఒక కొయ్యపెట్టెతోనే సరిపెట్టుకోవలసి వచ్చింది. తన ప్రాముఖ్యాన్ని ఇక్కడ యథావిధిగా గుర్తిస్తారన్న సహజమైన ఆశకూడా సఫలం కాలేదు.

తరవాత ఆధ్యాత్మిక చర్చ ఒకటి జరిగింది. ఆ అతిథి అడుగడుగునా, పవిత్ర గ్రంథాలకు తప్పుడు వ్యాఖ్యానాలు చేస్తూ వచ్చాడు. ఆయన చెప్పే వాటిలో తప్పులు పెరిగేకొద్దీ కోపం కూడా పెరుగుతూ వచ్చింది.

"నేను ఎం.ఏ. పరీక్షలో మొదటిస్థానం సంపాదించానని తెలుసామీకు?" అని అడిగాడు. హేతుబుద్ధి ఆయన్ని విడిచిపెట్టింది; అయినప్పటికీ ఆయన ఇంకా అరవగలుగుతున్నాడు.

"మేజిస్ట్రేటుగారూ, ఇది మీ కోర్టుగది కాదన్న సంగతి మరిచిపోతున్నారు" అని జవాబిచ్చారు గురుదేవులు తాపీగా. "మీ కుర్రతనపు మాటల్నిబట్టి, మీ కాలేజి చదువు చెప్పుకోదగ్గదేమీ కాదని అనిపిస్తుంది. ఏమయినప్పటికీ యూనివర్సిటీ డిగ్రీకీ వైదిక సాక్షాత్కారానికీ ఏమీ సంబంధం లేదు. సాధువుల్ని ఎకౌంటెంట్ల మాదిరిగా ప్రతి సంవత్సరంలోనూ జట్లు జట్లుగా తయారుచెయ్యడం జరగదు."

కొంతసేపు మాటా పలుకూ లేకుండా కొయ్యబారి ఉన్న తరవాత ఆయన కులాసాగా నవ్వాడు.

"స్వర్గలోకపు మేజిస్ట్రేటుకు ఎదురుపడడం ఇదే నాకు మొదలు,' అన్నాడాయన. తరవాత ఆయన, తనలో అంతర్భాగమై పోయిన న్యాయశాస్త్ర పరిభాషను గుప్పిస్తూ, తనను "పరివీక్షార్థక" (ప్రొబేషనరీ) శిష్యుడిగా స్వీకరించమని లాంఛన పూర్వకంగా అభ్యర్థించాడు.

లాహిరీ మహాశయులలాగే శ్రీయుక్తేశ్వర్‌గారు కూడా అనేక సందర్భాల్లో సన్యాసం తీసుకోదలచిన "అపరిపక్వ" శిష్యుల్ని నిరుత్సాహ పరిచేవారు. "దైవ సాక్షాత్కారం పొందనివాడు కాషాయవస్త్రం ధరించడం సమాజాన్ని తప్పుదారి పట్టిస్తుంది," అన్నారు గురుదేవులిద్దరూ. "సన్యాసానికి బాహ్యమైన చిహ్నాల్ని మరిచిపొండి; అవి మీలో మిథ్యాహంకారం కలిగించి హాని చెయ్యవచ్చు. మీరు నిబ్బరంగా ప్రతిరోజూ సాధించే ఆధ్యాత్మిక ప్రగతికన్న ముఖ్యమైంది మరొకటి లేదు; అందుకు క్రియాయోగాన్ని ఉపయోగించండి."

మనిషి విలువను కొలవడానికి సాధువు సునిశ్చితమైన ఒకే ఒక ప్రమాణాన్ని ఉపయోగిస్తాడు; ప్రపంచపు మారుతూ ఉండే కొలబద్దలకు అది భిన్నమైనది (వాళ్ళ దృష్టిలో ఎంతో వైవిధ్యం కల్గి ఉన్నామనుకునే) మానవుల్ని గురువు రెండే రెండు తరగతులుగా విభజిస్తాడు: దేవుణ్ణి అన్వేషించని అజ్ఞానులూ, అన్వేషించే జ్ఞానులూ అని.

మా గురుదేవులు తమ ఆస్తి వ్యవహారాల నిర్వహణకు సంబంధించిన వివరాల్ని స్వయంగానే చూసుకునేవారు. అన్యాయానికి వెనకాడని వ్యక్తులు కొందరు ఆయనకు పెద్దలనుంచి సంక్రమించిన భూమిని స్వాధీనంచేసుకోడానికి అనేక సందర్భాల్లో ప్రయత్నం చేశారు. దృఢనిశ్చయంతోనూ న్యాయస్థానంలో దావాల

ద్వారానూ శ్రీయుక్తేశ్వర్‌గారు ప్రతి ప్రత్యర్థినీ ఓడించారు. బిచ్చ మెత్తుకొనే గురువుగా గాని, తమ శిష్యులకు భారంగాగాని ఎన్నడూ బతకడం ఇష్టంలేక ఆయన బాధా కరమైన ఈ అనుభవాలకు తల ఒగ్గవలసి వచ్చింది.

భయావహమైన నిర్మొహమాటం గల మా గురుదేవులు లౌక్యసంబంధమైన కపటాలు ఎరక్కపోవడానికి ఒక కారణం, ఆయనకు గల ఆర్థిక స్వాతంత్ర్యం. తమను పోషించేవాళ్ళని పొగడవలసి ఉన్న గురువుల మాదిరిగా కాకుండా మా గురుదేవులు, ఇతరుల సంపద తాలూకు బాహ్యప్రభావాలు కాని, సూక్ష్మ ప్రభావాలు కాని తమ మీద పనిచెయ్యనివారు. ఏ అవసరానికైనా సరే ఆయన ఒకర్ని డబ్బు అడగడంగాని, సూచనగా చెప్పడంగాని నేను ఎన్నడూ వినలేదు. శిష్యులందరికీ ఆయన ఆశ్రమ శిక్షణ ఉచితంగానే లభించేది.

ఒకనాడు కోర్టు సమన్లు అందించడానికి కోర్టు ఉద్యోగి ఒకడు శ్రీరాంపూర్ ఆశ్రమానికి వచ్చాడు. కనాయి అనే శిష్యుడూ నేనూ అతన్ని గురుదేవుల సన్నిధికి తీసుకువెళ్ళాం.

శ్రీయుక్తేశ్వర్‌గారి పట్ల ఆ ఉద్యోగి చూపిన ధోరణి దారుణంగా ఉంది. "మీరు ఈ ఆశ్రమం నీడలోంచి వచ్చి కోర్టు గదిలో న్యాయమైన గాలి పీల్చు కునేటట్లయితే మీ ఒంటికి మంచిది," అన్నాడతను తిరస్కార భావంతో.

నేను ఓర్చుకోలేకపోయాను. "అమర్యాదగా మరొక్కమాట బయటికి వచ్చిందా, నువ్వు మట్టి కరుస్తావు!" అంటూ అతన్ని ఎదిరిస్తూ ముందుకు వెళ్ళాను.

కనాయి కూడా ఆ ఉద్యోగిమీద అరిచాడు. "నీచుడా! ఈ పవిత్రమైన ఆశ్రమంలోకి వచ్చి అవాకులూ చెవాకులూ పేల్తావా?"

కాని గురుదేవులు, తనను తిట్టేవాణ్ణి కాయడానికి ఎదురుగా వచ్చి నిలబడ్డారు. "ఏమీ లేనిదానికి అలా ఆవేశపడకండి. ఇతను తన న్యాయమైన విధి నిర్వర్తిస్తున్నాడు."

ఆ ఉద్యోగి తనకు ఎదురైన విభిన్న ఆదరాలకు చకితుడై, గౌరవ పురస్స రంగా క్షమాపణ చెప్పుకొని అక్కణ్ణించి ఉడాయించాడు.

ఉగ్ర సంకల్పశక్తిగల ఒక ఆధ్యాత్మిక ప్రతిభాసంపన్నుడు లోపల అంత శాంతంగా ఉండగలగడం గమనిస్తే ఆశ్చర్యం కలిగింది. దయ చూపించే సందర్భంలో పువ్వుకన్న మెత్తన, నియమాలకు ముప్పు వాటిల్లే సందర్భంలో వజ్రం కంటె కఠినం

[వజ్రాదపి కఠోరాని మృదూని కుసుమాదపి] - భగవద్భక్తుల గురించి వేదాల్లో చెప్పిన ఈ సూక్తి ఆయనకు బాగా ఒప్పింది.

బ్రౌనింగ్ కవి చెప్పినట్టుగా, "తాము చీకట్లో ఉన్నందువల్ల వెలుతురును ఓపలేనివాళ్ళు" ఈ ప్రపంచంలో ఎప్పుడూ ఉంటూనే ఉన్నారు. అప్పుడప్పుడు బయటివాడొకడు, తాను ఊహించుకొన్న ఏదో ఒక ఇబ్బందికి ఉద్రేకపడి శ్రీ యుక్తేశ్వర్‌గారిని నిందించేవాడు. మనస్సు చెదరని మా గురుదేవులు, అతని ఆరోపణలో సత్యలేశమేదైనా ఉందేమో చూడడానికి ఆత్మ విమర్శ చేసుకొంటూ అతను చెప్పేది వినమ్రంగా వినేవారు. ఇటువంటి సంఘటనలు, గురుదేవుల అద్వితీయమైన సూక్తుల్లో ఒకదాన్ని నాకు గుర్తుకు తెస్తాయి: "కొందరు ఇతరుల తలలు తెగ్గోసి తాము ఎత్తుగా కనబడాలని చూస్తారు!"

సాధువులో వ్యక్తమయే అమోఘమైన ప్రశాంతత, ఏ ఉపదేశమూ కలిగించ లేని ప్రభావం కలిగిస్తుంది. "కోపం నిదానంగా వచ్చేవాడు బలవంతుడి కన్నా బలిష్ఠుడు; తన ఆత్మను తాను పాలించుకొనేవాడు. ఒక పట్నాన్ని పట్టుకున్న వాడికన్నా గొప్పవాడు."*

రాజతేజో విరాజమానులైన మా గురుదేవుల మనస్సు కీర్తిమీద కాని, లౌకిక లబ్ధిమీదకాని కేంద్రీకరించి ఉండి ఉంటే ఆయన సులువుగా ఒక రాజాధిరాజో ప్రపంచాన్ని గడగడలాడించే యోధుడో అయి ఉండేవారని తరచు అనుకుంటూ ఉండేవాణ్ణి. వాటి బదులు ఆయన, కోపం, అహంభావం అనే ఆంతరిక దుర్గాల్ని కూలగొట్టడానికి పూనుకొన్నారు; వాటి పతనమే మానవుడి ఔన్నత్యానికి నిదర్శనం

* సామెతలు 16.32 (బైబిలు)

అధ్యాయం : 13

# నిద్రపోని సాధువు

"హిమాలయాలకు వెళ్ళడానికి నన్ను అనుమతించండి. ఎడతెగని ఏకాంతం లో సంతత దైవానుసంధానం సాధించాలని ఆశిస్తున్నాను."

ఒకసారి మా గురుదేవులతో నేను కృతఘ్నతాపూర్వకమైన ఈ మాటలు నిజంగానే అన్నాను. అప్పుడప్పుడు భక్తుడికి కలిగే అనూహ్యమైన భ్రాంతి ఒకటి నన్ను లోబరుచుకున్నమీదట, ఆశ్రమ విధులన్నా కాలేజి చదువులన్నా నాలో ఓరిమి తగ్గుతూ వచ్చింది. నేను ఈ ప్రతిపాదన చేసే నాటికి శ్రీయుక్తేశ్వర్ గారితో పరిచయమై ఆరునెలలే కావడం, నా తప్పుకు ఒక్క రవ్వ పరిహారం అయిఉండ వచ్చు. అప్పటికింకా నేను ఆయన మహోన్నత మూర్తిమత్వాన్ని పరిశీలించనేలేదు.

" హిమాలయాల్లో చాలామంది కొండవాళ్ళుంటారు; అయినా వాళ్ళకి దైవ దర్శనానుభవం ఉండదు," మా గురుదేవుల సమాధానం మెల్లగా, సరళంగా వినవచ్చింది. "నిశ్చేతనమైన కొండవద్దకన్న దైవసిద్ధి పొందిన మనిషిదగ్గర జ్ఞానం ఆర్జించడం ఉత్తమం."

నా గురువు తామే కాని కొండ కాదన్న విషయం గురుదేవులు స్పష్టంగా సూచించినప్పటికీ కూడా నేను మళ్ళీ నా కోరిక వెల్లడించాను. గురుదేవులు నాకు సమాధానం అనుగ్రహించలేదు. ఆయన మౌనాన్ని అంగీకారంగా తీసుకున్నాను - ప్రమాదకరమైనా అనుకూలమైన అర్థం.

ఆ రోజు సాయంత్రం కలకత్తాలో మా ఇంట్లో ప్రయాణానికి చేసుకోవలసిన ఏర్పాట్లలో మునిగిపోయాను. ఒక గొంగడిలో కొన్ని వస్తువులు మూట గడుతూ ఉండగా, కొన్నేళ్ల కిందట నా అటకమీది కిటికీలోంచి బయటికి జారవిడిచిన, అదే మాదిరి మూట నాకు గుర్తుకు వచ్చింది. హిమాలయాలకు వెళ్దామని నేను చేసిన పలాయనం, గ్రహస్థితి బాగాలేక విఫలమయినట్టుగా ఈసారి కూడా విఫలం

కాదుకదా అనిపించింది. మొదటిసారి నాలో ఆధ్యాత్మిక ఉత్సాహం పరవళ్ళు తొక్కింది; కాని ఈ రోజు రాత్రి, మా గురుదేవుల్ని విడిచి వెళ్తున్న సంగతి తలుచు కుంటే నా మనస్సు పీకుతోంది.

మర్నాడు పొద్దున, స్కాటిష్ చర్చి కాలేజిలో మా సంస్కృతం ప్రొఫెసర్ బిహారి పండిత్‌గారిని పట్టుకున్నాను.

"ఏమండీ, లాహిరీ మహాశయుల శిష్యుల్లో ఒక గొప్పాయనతో మీకు స్నేహం ఉందని చెప్పారు. దయఉంచి నాకు ఆయన ఎడ్రసు ఇయ్యండి," అని అడిగాను.

"రామగోపాల్ మజుందార్ సంగతే కదూ నువ్వంటున్నది! ఆయన్ని నేను 'నిద్రపోని సాధువు' అంటుంటాను. ఆయనెప్పుడూ పరమానందానుభూతిలో మెలుకువగానే ఉంటారు. ఆయన ఇల్లు తారకేశ్వర్ దగ్గర రణబాజ్‌పూర్‌లో ఉంది."

ఆ పండితులకు కృతజ్ఞతలు చెప్పి వెంటనే తారకేశ్వర్‌కు బయలుదేరి రైలెక్కాను. హిమాలయాల్లో ఏకాంతంగా ధ్యానం చేయడానికి 'నిద్రపోని సాధువు గారి దగ్గర అనుమతి తీసుకుని నా శంకలను నివృత్తి చేసుకోవాలనుకున్నాను రామగోపాల్ మజుందార్‌గారు బెంగాలులో మారుమూల గుహల్లో అనేక సంవత్స రాలపాటు క్రియాయోగ సాధన చేసిన తరవాత ఆత్మ సాక్షాత్కారం కలిగిందని బిహారి పండితులు చెప్పారు.

తారకేశ్వర్‌లో ప్రఖ్యాతమైన ఒక గుడికి దారి తీశాను. క్రైస్తవుల్లో కేథలిక్కులు ఫ్రాన్సులో లూర్ద్ అన్న పవిత్రస్థలమంటే ఎంత శ్రద్ధా భక్తులు చూపిస్తారో హిందు వులు ఈ గుడి అంటే అంతటి భక్తిభావం చూపిస్తారు. తారకేశ్వర్‌లో జబ్బుల్ని నయంచేసే అలౌకిక ఘటనలు అసంఖ్యాకంగా జరిగాయి. వాటిలో ఒకటి మా కుటుంబంలోవాళ్ళలోనే ఒకరికి అనుభవమయింది.

మా పెద్ద పినతల్లి ఒకసారి ఇలా చెప్పింది: "ఆ గుళ్ళో ఒక వారం రోజులు కూర్చుని, కటిక ఉపవాసం చేస్తూ, మీ శారద బాబయ్యగారి మొండి జబ్బు ఒకటి నయంకావాలని కోరుతూ ప్రార్థన చేశాను. ఏడో రోజున నా చేతిలో ఒక మొక్క ప్రత్యక్షమైంది! దాని ఆకులతో కషాయం కాచి మీ బాబయ్యగారికి ఇచ్చాను తక్షణమే ఆయన జబ్బు మాయమయిపోయింది. మళ్ళీ ఎన్నడూ రాలేదు."

పవిత్రమైన తారకేశ్వర మందిరంలోకి ప్రవేశించాను. అక్కడ గర్భగుడిలో ఒక గుండ్రాయి తప్ప మరేమీలేదు. ఆద్యంతాలులేని దాని పరిధి అనంతుడైన ఆ పరమేశ్వరుణ్ణే సముచితంగా సూచిస్తోంది. భారతదేశంలో చదువుకోని రైతుకు కూడా అనంత విశ్వానికి సంబంధించిన అమూర్తకల్పనలు అర్థమవుతాయి

నిజానికి, అతను అమూర్తకల్పనల్లోనే జీవిస్తున్నాడని అప్పుడప్పుడు పాశ్చాత్యులు అతన్ని నిందించారు!

ఆ సమయంలో నా మనఃస్థితి ఎంత తీవ్రనిష్ఠతో ఉందంటే, ఆ శిలా చిహ్నం ముందు తలవంచడానికి కూడా ఇష్టం లేకపోయింది. దేవుణ్ణి అన్వేషించ వలసింది ఆత్మలోనే అని అనుకున్నాను.

దేవుడిముందు మోకరిల్లకుండానే ఆ గుళ్ళోంచి బయటికి వచ్చి దగ్గరలో ఉన్న రణబాజ్‌పూర్ గ్రామంవేపు విసవిసా నడుచుకుంటూ వెళ్ళాను. దారి సరయినదేనన్న నమ్మకం లేదు. దారినిపోయే బాటసారిని అడిగేసరికి అతను చాలాసేపు ఆలోచనలో పడ్డాడు.

"నాలుగుదారుల కూడలి వచ్చినప్పుడు కుడివేపు తిరిగి ముందుకు సాగు," అన్నాడు చివరికి, తన మాటకి తిరుగులేదన్నట్టు.

అతని మాట పట్టుకుని, కాలవగట్ల వెంబడే దారితీశాను. చీకటి పడింది. అడవిలో ఉన్న పల్లెశివార్లలో మిణుగురు పురుగుల మెరుపులతోను, దగ్గరలో ఉన్న గుంటనక్కల అరుపులతోనూ సంచలనం కనిపిస్తోంది. వెన్నెల పలచగా, నాకేమీ కొరగాకుండా ఉంది; రెండు గంటల సేపు తడబడుతూ నడిచాను.

ఆవు మెడలో గంట ఒకటి నాకు స్వాగతం పలికింది. పదేపదే నేను వేసిన కేకలకు చివరకు ఒక రైతు నా దగ్గరికి వచ్చాడు.

"నేను రామగోపాల్ బాబుగారికోసం వెతుకుతున్నాను."

"అటువంటాయనెవరూ మా పల్లెలో లేడు," అంటున్న అతని గొంతులో చిరాకు కనిపించింది. "నువ్వు అబద్ధాలాడే పత్తేదారువయి ఉంటావు."

రాజకీయమైన గొడవలతో ఇబ్బందిపడ్డ అతని మనస్సులో అనుమానం లేకుండా చెయ్యాలన్న ఆశతో, అతని మనస్సుకు హత్తుకునేలా నేను నా దీనావస్థను వివరించాను. ఆయన తనింటికి తీసుకువెళ్ళాడు నన్ను; ఆదర పురస్సరంగా ఆతిథ్యమిచ్చాడు.

"రణబాజ్‌పూర్ ఇక్కడికి చాలా దూరం," అన్నా డాయన, "నాలుగు వీధుల మొగలో నువ్వు ఎడమవేపు తిరగవలసింది; కుడివేపు కాదు."

ఇంతకు ముందు నాకు దారి చెప్పినవాడు నిజంగా బాటసారుల కొక పీడే, అనుకున్నాను దిగులుగా. ముతకబియ్యపు అన్నం, పప్పుదినుసు, బంగాళా

దుంపలూ అరటికాయలూ కలిపి వండిన కూరలతో భోజనంచేసి, పక్క దొడ్లో ఉన్న చిన్న గుడిసెలో పడుక్కోడానికి వెళ్ళాను. దూరాన పల్లెప్రజలు, గట్టిగా మద్దెళ్ళూ, తాళాలూ వాయిస్తూ పాటలు పాడుతున్నారు. ఆ రాత్రంతా సరిగా నిద్రే పట్టలేదు. ఏకాంతవాసం చేసే రామగోపాల్ యోగిగారి దగ్గరికి నాకు దారి చూపించమని గాఢంగా ప్రార్థన చేశాను.

తొలిసంజె వెలుగురేకలు గుడిసె కంతలగుండా పొడుచుకు వస్తున్న సమయంలో రణబాజ్‌పూర్‌కు బయలుదేరాను. వరిచేలకు అడ్డబడి, సూదుల్లా గుచ్చుకనే ఎండుమోళ్ళు తొక్కుకుంటూ, ఎండిపోయిన బంకమట్టి గుట్టలకు ప్రదక్షిణలు చేస్తూ నడక సాగించాను. అక్కడక్కడ దారిని పోయే రైతు ఒకడు కన బడడం, నేను చేరవలసిన చోటు ఇంక "ఒక్క కోసెడు మాత్రమే (రెండు మైళ్ళు)" ఉందని చెప్పడం జరుగుతుండేది. ఆరు గంటల్లో సూర్యుడు విజయోత్సాహంతో నడినెత్తికి వచ్చాడు కాని, నేను రణబాజ్‌పూరుకు ఎప్పటికీ ఒక కోసెడు దూరంలోనే ఉంటాననిపించడం మొదలయింది.

మిట్టమధ్యాహ్నానికి నా లోకమింకా అంతులేని వరిచేనే. ఎండవేడికి నేను దాదాపు వడగొట్టి పడిపోయే స్థితికి వచ్చాను. ఇంతలో ఒకాయన నిదానంగా అడుగుతీసి అడుగువేస్తూ నా దగ్గిరికి వస్తూండడం గమనించాను. నా మామూలు ప్రశ్న మళ్ళీ వెయ్యడానికి పూనుకోలేదు; "ఒక్క కోసెడు మాత్రమే" అన్న జవాబు వినివిని విసుగెత్తి, మళ్ళీ అదే వినవలసి వస్తుందేమోనని.

ఆ అపరిచితులు నా పక్కన ఆగారు. పొట్టిగా, సన్నగా ఉన్నారు. సూదుల్లా గుచ్చిగుచ్చి చూసే, అసాధారణమైన రెండు నల్లటి కళ్ళు మినహాగా ఆయన రూపంలో ఆకట్టుకునేది ఏదీ లేదు.

"నేను రణబాజ్‌పూర్ విడిచి వెళ్ళాలనుకున్నాను. నువ్వు ఉద్దేశించిన ప్రయో జనం మంచిది. అంచేత నీకోసం కాసుకొని ఉన్నాను," నేను కొయ్యబారి చూస్తుంటే ఆయన నా ముఖంలోకి వేలు ఆడిస్తూ అన్నారు. "గడుసుగా, చెప్పా పెట్టాకుండా నా మీదికి వచ్చిపడొచ్చుననుకున్నావు కదూ? అయినా ఆ ప్రొఫెసరు బిహారికి, నా ఎడ్రస్ నీకు ఇచ్చే హక్కు లేదు."

ఈ మహాపురుషుల ముందు నన్ను నేను పరిచయం చేసుకోడం కేవలం అధిక ప్రసంగం కిందికి వస్తుందని, నాకు లభించిన ఇటువంటి ఆదరానికి కొద్దిగా నొచ్చుకుంటూ మాటా పలుకూ లేకుండా నిలబడిపోయాను. ఆ తరవాత అకస్మాత్తుగా ఆయన వ్యాఖ్య వెలువడింది.

"చెప్పు, దేవుడు ఎక్కడున్నాడనుకుంటున్నావు?"

"అదేమిటండి, నాలోనూ అంతటానూ ఉన్నాడు!" నాలోని గాభరా నా ముఖం మీద కూడా కొట్టొచ్చినట్టు కనపడిందనడంలో సందేహం లేదు.

"అంతటా వ్యాపించి ఉన్నవాడు, కదూ?" ఆ సాధువు ముసిముసిగా నవ్వారు. "అయితే చిన్నబాబూ, నిన్న నువ్వు తారకేశ్వర ఆలయంలో అనంతుడైన సర్వేశ్వరుడికి చిహ్నమైన రాతి లింగానికి ఎందుకు మొక్కలేదు మరి?* నీ గర్వమే నీ శిక్షకు కారణమయి, కుడి ఎడమల తేడా పట్టించుకోని బాటసారిచేత నిన్ను తప్పుదారి పట్టించింది. ఈ రోజు కూడా నీకు ఇబ్బంది తప్పలేదు!"

నేను మనఃపూర్తిగా ఒప్పుకున్నాను; నా ఎదురుగా కనిపిస్తున్న అతిసామాన్య శరీరంలో సర్వవ్యాపకమయిన కన్ను మరుగుపడి ఉన్నందుకు ఆశ్చర్యపోయాను. ఆ యోగి శరీరంనుంచి ఆరోగ్యప్రదమైన శక్తి ఒకటి వెలువడింది; ఎండ మలమల మాడుస్తున్న పొలంలో అప్పటికప్పుడు నాకు సేదదీరింది.

"దేవుణ్ణి తెలుసుకోడానికి తను పట్టిన దారి ఒక్కటి తప్ప మరేదీ లేదని అనుకోడానికే భక్తుడు మొగ్గు చూపిస్తాడు," అన్నారాయన. "మనకు లాహిరీ మహాశయులు చెప్పినట్టుగా, దివ్యత్వాన్ని లోపలే కనుక్కోగలిగేటట్టు చేసే యోగ విద్య అన్నిటికన్న ఉత్తమమైన మార్గమనడంలో సందేహం లేదు. కాని ఈశ్వరుణ్ణి లోపల కనిపెట్టిన తరవాత, త్వరలోనే బయట కూడా దర్శిస్తాం. తారకేశ్వర్‌లోనూ ఇతర చోట్లా ఉన్న పవిత్రమందిరాల్ని ఆధ్యాత్మిక శక్తికి కేంద్ర స్థానాలుగా మన్నిస్తూండడం సముచితమైన పని."

ఆ సాధువుగారి మందలింపు ధోరణి మాయమైంది; ఆయన కళ్ళు కరుణతో ఆర్ద్రమయినాయి. ఆయన నా భుజం తట్టారు.

"యువకయోగీ, నువ్వు మీ గురువుగారి దగ్గిర్నించి పారిపోతున్నావన్నది స్పష్టమవుతోంది. నీకు అవసరమయిందల్లా ఆయన దగ్గిర ఉంది; నువ్వు తిరిగి ఆయన దగ్గిరికి వెళ్ళాలి," అని చెప్పి, "కొండలు నీకు గురువు కాలేవు," అంటూ రెండు రోజుల కిందట శ్రీయుక్తేశ్వర్‌గారు వెల్లడించిన అభిప్రాయాన్నే ఈయనా వెల్లడించారు.

"కొండల మీదే ఉండాలన్న నిర్బంధం, విశ్వవిధానం ప్రకారం, గురువులకు ఏమీ లేదు." వెటకారంగా నావేపు చూశారాయన. "హిందూ దేశంలోనూ టిబెట్టు

---

* "దేనిముందూ తలవంచనివాడు తన బరువు తాను మోసుకోలేడు" - డాస్టొవ్‌స్కీ, 'ద పొసెస్డ్' అన్న నవలలో.

లోనూ ఉన్న హిమాలయాలకు సాధువుల మీద గుత్తాధికారం లేదు. తనలోనే కనిపెట్టడానికి పూనుకోనిదాన్ని ఎవడూ, తన శరీరాన్ని ఇక్కడికి అక్కడికి రవాణా చేసి కనిపెట్టలేడు. ఆధ్యాత్మిక వికాసంకోసం నేల చివరి అంచులకు సైతం వెళ్ళడానికి భక్తుడు పూనుకొన్నప్పుడు, అతని గురువు దగ్గిరలోనే దర్శనమిస్తాడు."

మారుమాటలేకుండా నేను ఒప్పుకున్నాను; కాశీ ఆశ్రమంలో నేను ప్రార్థన చెయ్యడం, ఆ తరవాత జనసమ్మర్దంగా ఉన్న ఒక సందులో శ్రీయుక్తేశ్వర్ గారిని కలుసుకోడం గుర్తువచ్చాయి.

"నువ్వు తలుపు మూసుకొని ఒంటరిగా ఉండడానికి అనువుగా ఏదైనా ఒక చిన్న గది ఏర్పాటుచేసుకోగలవా?"

"చేసుకోగలనండి." ఈ సాధువుగారు సామాన్య విషయంలోంచి ప్రత్యేక విషయంలోకి, గాభరా పెట్టేటంత వేగంగా వచ్చేశారనిపించింది.

"అదే నీ గుహ," ఆ యోగి నా మీద ప్రసరించిన జ్ఞానోద్దీప్తమైన దృష్టిని నే నెన్నడూ మరిచిపోలేదు. "అదే నీ పవిత్రమైన పర్వతం. నువ్వు దైవ సామ్రాజ్యాన్ని దర్శించగల చోటు అదే."

ఆయన పలికిన సరళమైన ఈ మాటలు, హిమాలయాలపట్ల యావజ్జీవితం నాకున్న పిచ్చిని ఆ క్షణంలోనే పటాపంచలు చేశాయి. మలమల మాడుతున్న వరిపొలంలో నేను, కొండల్ని గురించీ ఎడతెగని మంచు గురించీ కనే కలలోంచి మేలుకున్నాను.

"చిన్నబాబూ, నీ దైవతృష్ణ మెచ్చుకోదగ్గది. నీ మీద ఎంతో ప్రేమ పుడుతోంది నాకు." రామగోపాల్‌గారు నా చెయ్యి పట్టుకొని నడిపించారు; అడవిలో చెట్లు లేకుండా వెల్లడిగా ఉన్నచోట ఒక ఏకాంత కుటీరానికి తీసుకువెళ్ళారు. అక్కడి మట్టి ఇళ్ళకు కొబ్బరాకుల కప్పులు వేసి ఉన్నాయి; ప్రవేశ ద్వారాల్ని గ్రామీణ పద్ధతిలో తాజా పూలతో అలంకరించారు.

ఆ సాధువు నన్ను తమ చిన్న కుటీరందగ్గర, నీడ పట్టునున్న వెదుళ్ళ మంచె మీద కూర్చోబెట్టారు. ఆయన నాకు తీపి కలిపిన నిమ్మరసమిచ్చి ఒక పటిక బెల్లంముక్క పెట్టిన తరవాత మేము, ఆయన గదిలోకి వచ్చి పద్మాసనం వేసుకుని కూర్చున్నాం. నాలుగు గంటలసేపు ధ్యానం జరిగింది. నేను కళ్ళు తెరిచాను. వెన్నెట్లో వెలుగుతున్న ఆ యోగి రూపం ఇంకా నిశ్చలంగానే ఉంది మనిషి కేవలం తిండివల్లే బతకడన్న సంగతి నేను నా పొట్టకి గట్టిగా గుర్తుచేస్తూ ఉండగా, రామగోపాల్‌గారు ఆసనం మీంచి లేచారు.

"నువ్వు నకనకలాడుతున్నావని తెలుస్తోంది. భోజనం తొందరగానే సిద్ధమవు తుంది," అన్నారాయన.

అక్కడున్న మట్టిపొయ్యిలో నిప్పు రాజేశారు. కాస్సేపట్లో మేము, పొడుగాటి అరిటాకుల్లో వడ్డించిన అన్నం, పప్పు తినడం ప్రారంభించాం. వంట పనుల్లో నే నాయనకి సహాయం చెయ్యడానికి పూనుకొంటే ఆయన మర్యాదగా వద్దన్నారు. "అతిథి దేవోభవ" అన్న శ్రుతి వాక్యాన్ని భారతదేశం నిష్ఠగా అనాదిగా పాటిస్తూ వస్తోంది. అనేక దేశాల్లో పల్లె ప్రాంతాల్లో అతిథులకు అటువంటి మర్యాదే ఇస్తూండడం, ఉత్తరోత్తరా నేను చేసిన ప్రపంచయాత్రల్లో చూసి ముగ్ధుణ్ణి అయాను. అయితే, పట్నంలో ఉండేవాడికి, పరిచయంలేని ముఖాలు అతి విరివిగా ఉంటాయి కనక అతిథి సత్కారాభిలాష బండబారుతుంది.

చిన్న అడవి పల్లెలో ఏకాంతంలో ఆ యోగివర్యుల సన్నిధిలో కూర్చుని ఉన్నప్పుడు జనసందోహాలన్నవి దాదాపు ఊహకందనంత దూరమనిపించాయి. ఆ కుటీరం గది ఒక చల్లని వెలుగులో చిత్రంగా ప్రకాశిస్తున్నది. రామగోపాల్ గారు చిరిగిన కంబళ్ళు నేలమీద పరిచి నాకు పక్కవేశారు. తాము మాత్రం ఒక తుంగ చాపమీద కూర్చున్నారు. ఆయన ఆధ్యాత్మిక ఆకర్షణకు ముగ్ధుణ్ణి అయి, ఒక కోరిక విన్నవించడానికి సాహసించాను.

"అయ్యా, మీరు నాకు సమాధిస్థితి ఎందుకు ప్రసాదించరు?"

"నాయనా, దివ్యానుసంధానం కలిగించడం నాకూ సంతోషమే; కాని అది కలిగించవలసినవాణ్ణి నేను కాదు," ఆ సాధువు, అరమోడ్చిన కన్నులతో నావేపు చూశారు. "మీ గురువుగారు త్వరలో నీ కా అనుభవం ప్రసాదిస్తారు. నీ శరీరం దానికింకా తయారు కాలేదు. ఎక్కువ విద్యుద్బలం (ఎలక్ట్రికల్ వోల్టేజి) వల్ల చిన్న బల్బు ఎలా పేలిపోతుందో, అలాగే నీ నరాలు కూడా విశ్వవిద్యుత్ప్రవాహాన్ని భరించడానికి సిద్ధంగా లేవు. ఇప్పటికిప్పుడే నేను నీకు బ్రహ్మానందానుభవాన్ని కలిగించినట్లయితే, నీలో కణకణం నిప్పులమీద ఉన్నట్టుగా అయి మాడి పోతావు."

ఆ యోగివర్యులు సాలోచనగా ఇంకా ఇలా అన్నారు : "లెక్కలోకి రాదగని వాణ్ణి, ఏదో కాస్తంత ధ్యానం చేసినవాణ్ణి - దేవుణ్ణి సంతోష పెట్టడంలో కృతార్థుణ్ణి అయానో లేదో, కడపటి తీర్పునాటికి ఆయన దృష్టిలో నాకు ఏపాటి విలువ ఉంటుందోనని నేను అనుకుంటూంటే, నువ్వు నా దగ్గిర బ్రహ్మజ్ఞానం కోరు తున్నావు."

"అయ్యా, మీరు చాలా కాలంగా దేవుణ్ణి అనన్యభక్తితో అన్వేషించడం లేదా?"

"నేను అట్టే చెయ్యలేదు. బిహారి నా జీవితాన్ని గురించి నీకు కొంచెం చెప్పి ఉంటాడు. ఇరవై ఏళ్ళపాటు నేను ఒక రహస్య గుహలో రోజుకు పద్దెనిమిది గంటల చొప్పున ధ్యానం చేశాను. ఆ తరవాత అంతకన్న దుర్గమమైన గుహకి మారి, అక్కడ ఇరవై అయిదేళ్ళు ఉన్నాను; రోజుకు ఇరవైగంటలు యోగ సమాధిలో ఉండేవాణ్ణి. ఎప్పుడూ ఈశ్వర సాన్నిధ్యంలోనే ఉన్నందువల్ల నాకు నిద్ర అవసరమ యేది కాదు. నా శరీరం మామూలు అవచేతనస్థితిలో వచ్చే అసంపూర్ణ ప్రశాంతికన్న అధిచేతనస్థితిలో వచ్చే సంపూర్ణ ప్రశాంతిలోనే ఎక్కువ విశ్రాంతి పొందేది.

"కండరాలు నిద్రలో విశ్రాంతి పొందుతాయి; కాని గుండె, ఊపిరితిత్తులు, రక్తప్రసరణమండలం ఎడతెరిపి లేకుండా పనిచేస్తూనే ఉంటాయి; వాటికి విశ్రాంతి దొరకదు. అధిచేతనస్థితిలో ఉన్నప్పుడు అంతరింద్రియాలన్నీ విశ్వశక్తి చేత విద్యుత్ప్రేరితాలయి, తాత్కాలికంగా నిశ్చలస్థితిలో ఉండిపోతాయి. ఈ పరిస్థితుల్లో నాకు ఏళ్ళతరబడిగా నిద్రే అవసరం లేకపోయింది." ఆయన ఇంకా ఇలా అన్నారు. "నువ్వు కూడా నిద్రకు స్వస్తిచెప్పే కాలం వస్తుంది."

"అమ్మయ్యో! అంత ఎక్కువకాలం ధ్యానం చేసికూడా మీరు, ఈశ్వరాను గ్రహాన్ని గురించి నమ్మకం పెట్టుకోలేకపోతున్నారన్నమాట!" అని వ్యాఖ్యానించాను, ఆశ్చర్యపోతూ. "అటువంటప్పుడు మాలాంటి దుర్బల మానవుల మాట ఏం కావాలి?"

"ఇదుగో బాబూ, దేవుడంటే అనంతత్వమేనని తెలియడం లేదూ? నలభై ఐదేళ్ళ ధ్యానంతోనే ఆయన్ని సంపూర్ణంగా తెలుసుకోగలమనుకోడం దురాశే అని చెప్పొచ్చు. అయితే, కొద్దిపాటి ధ్యానం చేసినా కూడా అది మనని ఘోరమైన మృత్యుభయంనుంచీ, మరణానంతరస్థితుల భయం నుంచీ రక్షిస్తుందని బాబాజీ మనకి హామీ ఇచ్చారు. నీ ఆధ్యాత్మిక ఆదర్శాన్ని చిన్నచిన్న పర్వతాల మీద నిలపకు. నిర్నిబద్ధమైన భగవత్ప్రాప్తి అనే లక్ష్య నక్షత్రంమీదే లగ్నం చెయ్యి. నువ్వు కష్టపడి కృషిచేస్తే దాన్ని అందుకుంటావు."

భావి అవకాశానికి ముగ్ధుణ్ణి అయి, ప్రబోధాత్మకమయిన మరికొన్ని విషయాలు చెప్పమని ఆయన్ని కోరాను. ఆయన, లాహిరీ మహాశయుల గురు వర్యులైన బాబాజీని మొట్టమొదటిసారి కలుసుకోడాన్ని గురించిన అద్భుతమైన కథ చెప్పారు నాకు.* ఇంచుమించు అర్ధరాత్రివేళ రామగోపాల్‌గారు మౌనంలోకి

* 386-88 పేజీలు చూడండి.

వెళ్ళిపోయారు; నేను నా కంబళ్ళమీద పడుకున్నాను. కళ్ళు మూసుకున్నప్పుడు తళతళలాడే మెరుపులు కనిపించాయి; నాలో ఉన్న విశాలాకాశం కాంతిని కరిగిపోసిన గదిలా ఉంది. కళ్ళు తెరిచాను; కళ్ళు మిరుమిట్లు గొలిపే ఆ కాంతిని అప్పుడు కూడా గమనించాను. ఆ కుటీరం గది, అంతర్దృష్టితో నేను చూస్తున్న అనంత బ్రహ్మాండంలో అంతర్భాగమైపోయింది.

"నిద్రపోవేం?" అడిగారు యోగివర్యులు.

"అయ్యా, నేను కళ్ళు మూసినా తెరిచినా కూడా నా చుట్టూ మెరుపులు తళతళలాడుతూంటే ఎలా నిద్రపోగలను?"

"ఈ అనుభవం కలగడం నీకు ఆశీఃప్రసాదం. ఆధ్యాత్మిక తేజః ప్రసరణలు సులువుగా కనిపించవు," ఆ సాధువు ఆప్యాయంగా మరికొన్ని మాటలు చెప్పారు.

తెల్లారగట్ల రామగోపాల్‌గారు నాకు పటికబెల్లం ముక్కలు పెట్టి, నన్నింక బయలుదేరమని చెప్పారు. నా చెంపలమీదగా కన్నీళ్ళు కారుతూ ఉండగా ఆయనదగ్గర సెలవు తీసుకోడానికి కూడా నాకు మనస్సు ఒప్పలేదు.

"నిన్ను ఉత్తిచేతులతో వెళ్ళనియ్యను," ఆ యోగి మార్దవం ఉట్టిపడేలా అన్నారు. "నీకు ఏదో ఒకటి చేస్తాను."

ఆయన చిరునవ్వు నవ్వి నావేపు నిలకడగా చూశారు. నేలకు పాతుకుపోయి నట్టుగా నేను కదలిక లేకుండా అయిపోయాను; ఆ సాధుపుంగవుల దగ్గరినుంచి ప్రసరించే శాంతి ప్రకంపనలు నా అస్తిత్వాన్ని ముంచెత్తాయి. ఏళ్ళతరబడి అడపా తడపా నన్ను బాధపెడుతూ ఉన్న వెన్నునొప్పి తక్షణమే మటుమాయమయింది.

పునరుజ్జీవితుణ్ణి అయి, తేజోమయమైన ఆనందసాగరంలో స్నానం చేసి - మరింక ఏడవలేదు. రామగోపాల్‌గారి పాదాలు తాకి, అడవిలో అడుగుపెట్టాను. తారకేశ్వర్ చేరేదాకా, చెట్ల గుబురుల్లోంచీ ఎన్నో వరిపొలాల మధ్యనుంచీ దారి చేసుకుంటూ ముందుకు సాగాను.

అక్కడ ప్రఖ్యాతమైన ఆలయాన్ని రెండోసారి దర్శించి, లింగం ముందు సంపూర్ణంగా సాష్టాంగ ప్రణామం చేశాను. ఆ గుండ్రటిరాయి నా అంతర్దృష్టిలో పెరిగిపెరిగి బ్రహ్మాండ గోళాలుగా విస్తరించింది: వలయంలో వలయం, మండలంలో మండలం - అన్నిటా దైవత్వం తొణికిసలాడుతున్నది.

మరో గంటకి నేను సంతోషంగా, కలకత్తా వెళ్ళడానికి రైలు ఎక్కాను. ఇక నా ప్రయాణాలు ముగిసిపోయాయి; ఉన్నత పర్వతాల్లో కాదు, మహోత్తుంగ హిమవన్నగం వంటి మా గురుదేవుల సన్నిధిలో.

అధ్యాయం : 14

# విశ్వచేతవామభవం

"వచ్చేశాను గురూజీ," నా మాటలకన్న సిగ్గుతో చిన్నబోయిన నా ముఖమే ఎక్కువ చెబుతోంది.

"వంటింట్లోకి వెళ్ళి ఏమైనా తినడానికి చూసుకుందాం పద," మాకు ఎడ బాటు కలిగించినవి కేవలం కొన్ని గంటలేకాని రోజులు కావన్నంత మామూలుగా ఉంది శ్రీయుక్తేశ్వర్‌గారి ధోరణి.

"గురుదేవా, నా విధులు విడిచిపెట్టి ఇక్కణ్ణించి అకస్మాత్తుగా వెళ్ళిపోయి మీకు నిరాశ కలిగించి ఉంటాను; నా మీద మీకు కోపం వస్తుందేమో అనుకున్నాను."

"లేదు, లేనేలేదు! కోపమన్నది తీరని కోరికలవల్లే పుడుతుంది. నేను ఎవరి దగ్గర్నించీ ఏమీ ఆశించను; అంచేత వాళ్ళు చేసే పనులు నా ఆశలకు వ్యతి రేకంగా ఉండలేవు. నిన్ను నా అవసరాలకెన్నడూ వాడుకోను; నీ నిజమైన సంతోషమే నాకు సంతోషం."

"గురుదేవా; దివ్యప్రేమగురించి అస్పష్టంగానే వింటాం; కాని ఈనాడు మీ దివ్యస్వరూపంలోనే దానికి వాస్తవమైన నిదర్శనం కనిపిస్తోంది నాకు! బయట ప్రపంచంలో, తండ్రికూడా, తాను అప్పగించిన పనిని కొడుకు చెప్పా చెయ్యకుండా వదిలిపెట్టిపోయినట్లయితే ఆ కొడుకును సులువుగా క్షమించడు. కాని మీరు నేను అరగొరగా విడిచి వెళ్ళిపోయిన అనేక పనులవల్ల ఎంతో అసౌకర్యానికి గురి అయి కూడా రవ్వంత విసుగయినా చూపించలేదు."

మేము ఒకరి కళ్ళలోకి ఒకరం చూసుకున్నాం; వాటిలో కన్నీళ్ళు మెరుస్తు న్నాయి. ఒకానొక ఆనంద తరంగం నన్ను ముంచెత్తింది. ఈశ్వరుడు నా గురు దేవుల రూపంలో, నా హృదయంలోని స్వల్పమైన ప్రేమల్ని అవధులులేని విశ్వప్రేమ సీమలుగా విస్తరింపజేస్తున్నాడన్న సంగతి నాకు స్ఫురించింది.

కొన్నాళ్ళ తరవాత ఒకరోజు పొద్దున నేను మా గురుదేవులు మామూలుగా కూర్చునే గదికి దారితీశాను. ఖాళీగా ఉన్న ఆ గదిలో ధ్యానం చేసుకోవాలని నా ఉద్దేశం; కాని చెప్పుచేతల్లో లేని నా ఆలోచనలు, మెచ్చుకోదగ్గ నా ఉద్దేశంతో సహకరించడంలేదు. వేటగాణ్ణి చూసిన పక్షుల్లా చెల్లాచెదరవుతున్నాయవి.

"ముకుందా!" దూరంగా ఉన్న బాల్కనీ నుంచి శ్రీయుక్తేశ్వర్‌గారి గొంతు వినిపించింది.

నా ఆలోచనల్లాగే నాలో కూడా తిరుగుబాటు ధోరణి తలెత్తింది. "గురువుగారెప్పుడూ నన్ను ధ్యానం చెయ్యమని చెబుతూంటారు. తీరా నేను తమ గదిలోకి ఎందుకువచ్చానో తెలిసికూడా ఆయన చెడగొట్టగూడదు," అని గొణుక్కున్నాను.

ఆయన మళ్ళీ పిలిచారు నన్ను; నేను మొండికేసి, చప్పుడు చెయ్యకుండా ఊరుకున్నాను. మూడోసారి ఆయన గొంతులో మందలింపు కూడా మిళితమై ఉంది.

"నేను ధ్యానం చేసుకుంటున్నానండీ," అభ్యంతరం చెబుతున్న ధోరణిలో అరిచాను.

"తుఫానులో ఆకుల్లా చెదిరిపోయిన మనసుతో నువ్వెలా ధ్యానం చేస్తున్నావో నాకు తెలుసులే! ఇలా నా దగ్గరికి రా," అంటూ కేకవేశారు గురువుగారు.

భంగపడి, బయటపడి, విచారంగా ఆయన దగ్గరికి వెళ్ళాను.

"వెర్రినాయనా, నీకు కావలసింది కొండలు ఇయ్యలేవు," గురుదేవులు బుజ్జగింపుగా, ఓదార్పుగా పలికారు. ఆయన చల్లనిచూపు అంతుతెలియనంత లోతుగా ఉంది. "నీ హృదయాభిలాష నెరవేరుతుంది."

శ్రీయుక్తేశ్వర్‌గారు గూఢంగా మాట్లాడడం అరుదు; నేను కలవరపడ్డాను. ఆయన నా గుండెకు పై భాగంలో సుతారంగా చేత్తో తట్టారు.

నా శరీరం కదలకుండా పాతుకుపోయింది; నా ఊపిరితిత్తుల్లోంచి నా శ్వాస, ఏదో ఒక పెద్ద అయస్కాంతంతో బయటికి లాగేసినట్లయింది. నా ఆత్మా, మనస్సూ తక్షణమే వాటి భౌతికబంధాల్ని కోల్పోయి, ద్రవరూప కాంతి కిరణాల మాదిరిగా నాలో ప్రతి రంధ్రంలోంచీ బయటికి ప్రసరించాయి. నాలో ఉన్న కండ నిర్జీవమైపోయినట్టు ఉన్నా, అంతకు ముందెన్నడూ నేను అంతటి సంపూర్ణ చైతన్యంతో తొణికిసలాడలేదని నాకు కలిగిన ప్రగాఢ స్పృహవల్ల తెలుసుకున్నాను.

నా స్పృహ ఇంక ఒక శరీరానికి సంకుచితంగా కట్టుబడి ఉండకుండా, చుట్టూ ఉన్న అణువులకు కూడా విస్తరించింది. దూరాన వీధుల్లో ఉన్న జనం, నా దూరపరిధి మీదే మెల్లగా కదులుతున్నట్టు అనిపించింది. మట్టిలోని ఒక మంద పారదర్శకత ద్వారా మొక్కలవేళ్ళూ చెట్లవేళ్ళూ భూమిలోంచి స్పష్టంగా కనిపించాయి; వాటి జీవరస ప్రవాహాన్ని కూడా గమనించాను.

చుట్టుపక్కల ప్రదేశమంతా నా ముందు బట్టబయలుగా ఉంది. మామూలుగా ఎదుటఉన్న వాటిని మాత్రమే చూడగల నా చూపు ఇప్పుడు అన్నిటినీ చూడగలిగేటట్టుగా, విస్తృత వలయాకార దృష్టిగా మారింది. నా తలకు వెనకభాగం ద్వారా, రాయ్‌ఘాట్ సందుకు దిగువున దూరంగా నడుస్తున్న మనుషుల్ని చూశాను తెల్లటి ఆవు ఒకటి తాపీగా నడిచి వస్తూండడం కూడా గమనించాను. అది తెరిచిపెట్టిన ఆశ్రమం గేటును చేరినప్పుడు, భౌతికమైన నా రెండు కళ్ళతోనూ చూస్తున్నట్టుగానే దాన్ని పరిశీలించాను. అది ముంగిలి బయటి ఇటిక గోడ వెనక్కి సాగిపోయిన తరవాత కూడా స్పష్టంగానే చూశాను.

అన్ని వైపులా కనిపిస్తున్న నా సర్వదిగ్దర్శక దృష్టికి సోకిన వస్తువులన్నీ కంపిస్తూ చురుకుగా సాగే చలనచిత్రాల మాదిరిగా స్పందించాయి. నా శరీరం, గురుదేవుల శరీరం, స్తంభాల ముంగిలి, గృహోపకరణములు, నేల, చెట్లు, ఎండ అప్పుడప్పుడు తీవ్రంగా అల్లల్లాడి చివరికి కరిగిపోయి ఓ కాంతి సముద్రమయి పోయాయి గ్లాసుడు నీళ్ళలో వేసిన పంచదార గడ్డలు, గ్లాసు కుదిపినప్పుడు కరిగిపోయినట్లుగా అన్నిటినీ ఏకంచేసే కాంతి, పర్యాయక్రమంలో స్థూలరూపంలోకి మారుతోంది ఈ రూపాంతరణ క్రియలు సృష్టిలోని కార్యకారణ సూత్రాన్ని వెల్లడి చేస్తున్నాయి

నా ఆత్మ తాలూకు ప్రశాంత అనంత తీరాల మీదికి ఒకానొక ఆనంద సాగరం వెల్లువలా పొంగి వచ్చింది. పరమాత్మ స్వరూపం అక్షయ ఆనందమన్న అనుభవం పొందాను; ఆయన దేహం అసంఖ్యాకమైన కాంతికణజాలాలు. నాలో వెల్లుబికుతున్న దివ్యప్రభ పట్నాల్నీ, ప్రపంచ ఖండాల్నీ, భూమినీ, సూర్యమండలాన్నీ, నక్షత్ర మండలాన్నీ, సూక్ష్మనీహారికల్నీ తేలి ఆడే ఆ బ్రహ్మాండాల్నీ చుట్టుముట్టడం మొదలు పెట్టింది. రాత్రివేళ దూరాన కనిపించే నగరంలా, మందకాంతితో వెలుగొందే సమస్త జగత్తూ నా అస్తిత్వపు అనంతత్వంలోనే మిణుకుమిణుకు మంటున్నది. స్ఫుటంగా చెక్కినట్టున్న గోళాకార పరిరేఖలకు అవతల మిరుమిట్లు గొలుపుతున్న కాంతి, దూరపు అంచులదగ్గర కొద్దిగా మందగించింది. అక్కడ నేను, ఎన్నటికీ తరగని మృదు లావణ్యాకాంతిని దర్శించాను. మాటల్లో చెప్పలేనంత

సుసూక్ష్మమైనదది; గ్రహరూపాలు అంతకన్న స్థూలమైన కాంతితో ఏర్పడ్డవి.*

శాశ్వత ఆకరమయిన పరమాత్మనుంచి ప్రసారితమైన కిరణాల దివ్య విక్షేపం, నక్షత్ర వీధులుగా ప్రజ్వలిస్తూ వర్ణించనలవిగాని ప్రభలుగా రూపాంతరిత మవుతోంది. సృజనశీలక కిరణాలు నక్షత్రమండలాలుగా ఘనీభవించి, ఆ తరవాత పారదర్శక జ్వాలలుగా కరిగిపోవడం మళ్ళీమళ్ళీ చూశాను. లయబద్ధమైన విపర్యయంవల్ల కోటానుకోట్ల లోకాలు నిర్మల కాంతిలోకి ప్రవేశించాయి. అటు మీదట అగ్ని ఆకాశంగా మారింది.

తేజోమండల కేంద్రాన్ని నా గుండెలో సహజావబోధ గ్రహణ బిందువుగా గుర్తించాను. వాలోని కేంద్రకం నుంచి వెలువడుతున్న ఉద్దీప్తప్రభ విశ్వనిర్మితిలో ప్రతి భాగానికీ ప్రసరిస్తోంది. అమరత్వాన్ని ప్రసాదించే ఆనందమయ అమృతం, పాదరసంలా ప్రవహిస్తూ నాలో అణువణువునా స్పందించింది. పరమేశ్వరుడి సృజనాత్మక స్వరం విశ్వ చలనయంత్ర ప్రకంపనమయిన ఓంకారం†గా ప్రతి ధ్వనిస్తూ ఉండడం విన్నాను.

హఠాత్తుగా నా ఊపిరితిత్తుల్లోకి శ్వాస తిరిగివచ్చింది. నా అనంత అపరిమి తత్వాన్ని కోల్పోయానని గ్రహించి, దాదాపు భరించలేనంతగా నిస్పృహ చెందాను. చిచ్ఛక్తికి సులువుగా వసతి కల్పించలేని, అవమానకరమయిన శరీరపంజరానికి నేను మళ్ళీ బందీనయాను.

వ్యర్థజీవితం గడిపే కుర్రవాడిలా నేను బ్రహ్మాండ గృహంనుంచి పారిపోయి సంకుచితమైన ఒక సూక్ష్మపరిధిలో నన్ను నేను బందీని చేసుకున్నాను.

మా గురుదేవులు నా ఎదురుగా నిశ్చలంగా నించుని ఉన్నారు; చాలాకాలం గాఢమైన ఆకాంక్షతో నేను అన్వేషిస్తూ వచ్చిన విశ్వచేతనానుభవాన్ని (సమాధి స్థితిని) నాకు ప్రసాదించినందుకు ఆయన పాదాల ముందు కృతజ్ఞతతో సాష్టాంగ దండ ప్రణామం చెయ్యబోయాను. అప్పుడాయన నన్ను నిటారుగా నిలబెట్టి ప్రశాంతంగా ఇలా అన్నారు :

"నువ్వు పరమానందంతో మరీ అంత మితిమించి మత్తెక్కి పోగూడదు. ప్రపంచంలో నీ కోసం ఇంకా చాలాపని ఉండిపోయింది. రా, బాల్కనీ తుడుద్దాం; ఆ తరవాత అలా గంగ ఒడ్డున తిరిగి వద్దాం."

---

* సృష్టికి సారభూతమయిన కాంతినిగురించి 30 అధ్యాయంలో వివరించడం జరిగింది.

† "ఆదిలో శబ్దం ఉండేది; ఆ శబ్దం ఈశ్వరుడివద్ద ఉండేది; ఆ శబ్దమే ఈశ్వరుడు." - యోహాను 1:1 (బైబిలు).

నే నొక చీపురుకట్ట తెచ్చాను. గురుదేవులు నాకు సంతులిత జీవన రహస్యం బోధిస్తున్నారని తెలుసుకున్నాను. శరీరం తన దైనందిన విధులు నిర్వర్తిస్తూ ఉండగా ఆత్మ, విశ్వసృష్టిలోని అగాధాల్ని గురించి చింతన చేస్తూ తరిచి చూస్తూ ఉండాలి.

తరవాత శ్రీయుక్తేశ్వర్‌గారూ నేనూ బయట తిరగడానికి బయలు దేరే టప్పటికి ఇంకా నేను, మాటల్లో చెప్పజాలని ఆనందంలో తన్మయుణ్ణయి ఉన్నాను. మా ఇద్దరి శరీరాల్నీ, కేవలం వెలుతురే మూలభూతంగా గల నదీ తీరంలో రోడ్డుమీద నడుస్తున్న రెండు సూక్ష్మచిత్రాలుగా దర్శించాను.

"జగత్తులో ప్రతిరూపాన్నీ ప్రతిశక్తినీ క్రియాశీలకంగా నిలిపేది పరమేశ్వరుడి దివ్యశక్తి; అయినప్పటికీ ఆయన, ప్రకంపనశీలమైన భౌతిక లోకాలకు ఆవల ఆనందమయమైన అకల్పిత శూన్యంలో సర్వోత్కృష్టంగా నిస్సంగుడై ఉంటాడు,"* అని వివరించారు గురుదేవులు.

"భూమి మీద ఆత్మసిద్ధి సాధించినవాళ్ళు అదే మాదిరి రెండు విధాల జీవనం గడుపుతారు. ప్రపంచంలో తమ పనిని చిత్తశుద్ధితో నిర్వర్తిస్తూనే లోలోపలి పరమానందంలో నిమగ్నులై ఉంటారు.

---

* "తండ్రి అయిన పరమాత్మ ఎవ్వరిగురించీ తీర్పు ఇవ్వడు; కాని తీర్పు ఇచ్చే పని అంతా తన 'కుమారు'డికి అప్పగించాడు." - యోహాను 5:22. (బైబిలు). "మానవుడెవడూ ఏనాడూ దేవుణ్ణి చూడలేదు; కేవలం, జగత్పిత హృదయంలో ఉండే, ఆయన ఏకైక పుత్రుడు మాత్రం ఆయన్ని గురించి చాటి చెప్పాడు." - యోహాను 1·18. "దేవుడు ఏసుక్రీస్తు ద్వారా అన్నిటినీ సృష్టించాడు." -ఇఫేసియన్స్ 3:9. "నన్ను నమ్ముకొన్నవాడు కూడా నేను చేసే పనులన్నీ చేస్తాడు; నేను మా తండ్రి దగ్గిరికి వెళ్ళిపోతాను కాబట్టి అతడు ఇంతకన్న గొప్ప పనులు చేస్తాడు." - యోహాను 14 12. "జగత్పిత నా పేరున పంపే సుఖప్రదుడైన పరిశుద్ధాత్మ మీకు అన్నిటినీ బోధిస్తాడు; నేను మీకు చెప్పినవాటినన్నిటినీ ఆయన మీకు జ్ఞాపకం చేస్తాడు." - యోహాను 14.26 (బైబిలు).

బైబిలులో చెప్పిన ఈ మాటలు దేవుడి త్రిరూపాత్మక ప్రకృతి అయిన తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ (హిందువుల పవిత్ర గ్రంథంలో చెప్పిన సత్, తత్, ఓం) అన్న మూడింటినీ సూచిస్తాయి. జగత్పిత అయిన దేవుడు ప్రకంపనశీలమయిన సృష్టికి అతీతంగా ఉండే కేవల అవ్యక్తుడు. కుమార రూపుడైన దేవుడు ప్రకంపన శీలమైన సృష్టికి 'లోపల' ఉండే క్రీస్తు చైతన్యం (బ్రహ్మ లేదా కూటస్థ చైతన్యం). ఈ క్రీస్తు చైతన్యమే ఎవరూ సృష్టించని అనంత స్వరూపుడి "ఏకైక సృష్టి" లేదా ఏకైక ప్రతిబింబం. సర్వవ్యాపకమైన క్రీస్తు చైతన్యం తాలూకు బాహ్యాభివ్యక్తి, దానికి "సాక్షి" (ప్రకటన 3·14) అయిన ఓంకారం, అంటే 'శబ్దం', లేదా 'పరిశుద్ధాత్మ' : ఇది అదృశ్య దివ్యశక్తి, ఏకైక కర్త, ప్రకంపన ద్వారా సృష్టినంతనూ నిలిపే ఏకైక కారణశక్తి, చాలనశక్తి ఆనందమయమై సుఖప్రదాయకమైన, ఓంకారం ధ్యానంలో వినిపిస్తుంది; భక్తుడికి "అన్ని విషయాల్నీ జ్ఞాపకం" చేస్తూ, చరమ సత్యాన్ని వెల్లడిచేస్తుంది.

"ఈశ్వరుడు మానవులందరినీ తన ఉనికికున్న అపరిమితానందంలోంచి సృష్టించాడు. మానవులు, బాధాకరంగా శరీరం కలిగించే అడ్డంకుల్ని ఎదుర్కొం టున్నప్పటికీ భగవంతుడు, తన రూపంలో తయారయిన మానవులు చివరికి ఇంద్రియావబోధాలన్నింటికీ అతీతంగా నిలబడి తనలో ఐక్యం కావాలని ఆశిస్తాడు."

ఈ విశ్వచేతనాదృశ్యం నాకు శాశ్వత గుణపాఠాలు నేర్పింది. నా ఆలోచనల్ని ప్రతిరోజూ నిశ్చలంచేస్తూ, నా శరీరం భౌతికపదార్థమైన భూమిపైన సంచరించే మాంసాస్థికల ముద్ద అనే భ్రాంతిపూర్వకమైన దృఢవిశ్వాసంలోంచి బయట పడ్డాను. ఊపిరీ, నిలకడలేని మనస్సూ కాంతి సముద్రాన్ని కల్లోలపరిచి భూమి, ఆకాశం, మనుషులు, జంతువులు, పక్షులు, చెట్లూ వంటి భౌతికపదార్థ రూపాలనే కెరటాల్ని పుట్టించే తుఫానులవంటివన్న సంగతి గమనించాను. ఆ తుఫానుల్ని శాంతింపజేస్తే తప్ప అనంత సత్తను ఒకే కాంతిగా దర్శించగలగడం జరగదు.

ఈ రెండు సహజ సంక్షోభాల్నీ నేను ఎంత తరచుగా శాంతపరిస్తే అంత తరచుగా, తుఫాను అణిగిపోయిన తరవాత స్థిమితంగా ఒకటిగా కలిసిపోయే సముద్ర తరంగాల మాదిరిగా అసంఖ్యాకమైన సృష్టి తరంగాలు తేజస్సాగర రూపంలోకి మారిపోవడం గమనిస్తూ వచ్చాను.

విశాలమైన దృశ్యాలు తనను తబ్బిబ్బు చెయ్యనంతటి స్థాయివరకు శిష్యుడు ధ్యానంవల్ల మనస్సును గట్టిపరుచుకున్నప్పుడు గురువు తన శిష్యుడికి విశ్వచేతనానుభవం ప్రసాదిస్తాడు. కేవలం ప్రజ్ఞా సంబంధమైన సంకల్పంకాని, నిష్కాపట్యం కాని చాలవు. యోగసాధనవల్లా భక్తివల్లా తగినంతగా విస్తృతి చెందిన చైతన్య మొక్కటే, సర్వవ్యాపకత్వంవల్ల కలిగే ముక్తిప్రదమైన ఆఘాతానికి తట్టుకొనే టట్టుగా మనిషిని తయారు చెయ్యగలదు.

చిత్తశుద్ధిగల భక్తుడికి దివ్యానుభూతి సహజంగానే తప్పనిసరిగా వస్తుంది. అతని గాఢమైన ప్రార్థన, ఆపడానికి వీలులేనంత శక్తితో దేవుణ్ణి ఆకర్షించడం మొదలుపెడుతుంది. ఆ ఆకర్షణ తీవ్రతవల్ల ఈశ్వరుడు అన్వేషకుడి చైతన్య పరిధిలోకి విశ్వదర్శనంగా ఆకృష్టుడవుతాడు.

తరవాత కొంత కాలానికి, "సమాధి" అన్న పేరుతో నేను ఈ కిందిపద్యం రాశాను; దాని శోభను ఇలా అభివర్ణించడానికి ప్రయత్నించాను:

మటుమాయమయినాయి వెలుగు నీడల తెరలు.
హరించిపోయింది ప్రతి దుఃఖబాష్పం,

గతించి పోయాయి క్షణికానంద ఉషోదయాలు.
తొలగిపోయింది ఇంద్రియాల క్షీణ మరీచిక.
నశించిపోయాయి, అద్వైత-వెండితెర మీద
మిథ్యాఛాయలయిన రాగద్వేషాలు, ఆరోగ్య అనారోగ్యాలు, జీవన్మరణాలు.
నిలిచిపోయింది మాయాఝుంఝ
గాఢ సహజావబోధ మంత్రదండ చాలనంతో.
లేవు నాకిక వర్తమాన భూతభవిష్యత్తులు,
నిత్యుణ్ణయి, సర్వవ్యాపకుణ్ణయి, నేనే, నేనే, ప్రతిచోటా.
గ్రహాలు, నక్షత్రాలు, నీహారికాపుంజం, భూమి,
ప్రళయకాల ఉత్పాతాల అగ్నిపర్వత విజృంభాలు.
సృష్టికి ఉపకరించే మండుతున్న కొలుములు.
చప్పుడులేని ఎక్స్-రేల మంచుదిబ్బలు, మండుతున్న ఎలక్ట్రాన్ వరదలు,
మనుషులందరి ఆలోచనలూ, వెనక, ఇప్పుడు, ఇకముందటి వాళ్ళవీ,
ప్రతి గడ్డిపోచా, నేనూ, మానవజాతీ,
విశ్వధూళిలో ప్రతి ఒక్క కణం,
కోపం, పేరాస, మంచి, చెడు, మోక్షం, కామం,
మింగేశానన్నిటినీ, మార్చేశానన్నిటినీ
నా ఏకైక అస్తిత్వంలో ప్రసరించే ఒక సువిశాల రక్త మహా సముద్రంగా.
రగులుతున్న ఆనందం, ధ్యానంవల్ల తరచు వెల్లుబికి
నీళ్ళు నిండిన నా కళ్ళను మిరుమిట్లుగొలుపుతూ
పేలి పరమానంద అమరజ్వాలలయి,
హరించింది నా కన్నీళ్ళని, నా దేహాన్ని, నావాటి నన్నిటినీ.
నువ్వే నేను, నేనే నువ్వు.
జ్ఞానం, జ్ఞాత, జ్ఞేయం అన్నీ ఒక్కటే.
కుదుటబడ్డ, ఎడతెగని పులకింత, శాశ్వతమైన, జీవంతమైన,
నిత్య నూత్నమైన శాంతి.
ప్రతీక్ష ఊహకు అందనంతగా ఆనందించదగ్గది, 'సమాధి' పరమానందం!
కాదిది అచేతనావస్థ
కానేకాదు మనసుకు మత్తుమందు, ఇచ్ఛానుసారం తిరోగమించే
వీలులేకుండా,
విస్తరిస్తుంది నా చేతనాసీమను సమాధి
నశ్వర దేహ పరిమితులకు అతీతంగా,
అనంతకాలపు దూరాతిదూర చరమావధిదాకా.
విశ్వసాగరాన్ని నేను,
గమనిస్తున్నాను నాలో తేలుతూపోతున్న చిన్నారి అహాన్ని.
వినిపించాయి అణువుల సచల మర్మరధ్వనులు;
నల్లని నేల, పర్వతాలు, లోయలు, అదుగో, వాటిని కరిగించి పోసిన ద్రవం!

మారుతున్నాయి పారే సముద్రాలు నీహారికాబాష్పాలుగా.
ధ్వనిస్తోంది ఓంకారం ఆ ఆవిరులమీద, అద్భుతంగా తెరుస్తూ వాటి
మునుగుల్ని.
బయల్పడిఉన్నాయి మహాసాగరాలు, మెరిసే ఎలక్ట్రాన్లు,
విశ్వమృదంగం* చివరి ముక్తాయింపుతో,
అదృశ్యమై స్థూలకాంతులు సర్వవ్యాపకానందపు శాశ్వతకిరణాలుగా
మారేదాకా.
వచ్చాను ఆనందంనుంచి, జీవిస్తాను ఆనందంకోసమే, కరిగిపోతాను
పవిత్రానందంలోనే.
పానం చేస్తాను మహామనస్సాగరంగా, సృష్టితరంగా లన్నిటినీ,
ఘనం, ద్రవం, ఆవిరి, వెల్తురు, తెరలు నాలుగూ
లేచిపోయాయి పైపైకి.
అన్నిటిలో నేను, ప్రవేశించాను మహిమాన్వితమైన నేనులోకి,
తొలగిపోయాయి శాశ్వతంగా, మర్త్యస్మృతి క్షణిక క్షీణ ఛాయలు;
నిష్కళంకంగా ఉంది నా మానసాకాశం, కిందా ముందూ పైపైనా
నిత్యత్వమూ నేనూ, సమైక్యమైన ఒక్క కిరణం.
ఒక్క చిన్ని నవ్వుబుడగని, నేను
అయిపోయాను ఆనందసాగరంగా.

శ్రీయుక్తేశ్వర్‌గారు నాకు, పరమానందకరమైన ఆ అనుభవాన్ని ఇచ్చాను సారంగా ఆవాహనచెయ్యడం ఎలాగో, ఇతరులకు,† వాళ్ళ సహజావబోధ మార్గాలు తగిన విధంగా అభివృద్ధిచెందినప్పుడు, ఆ అనుభవం కలిగించడం ఎలాగో నాకు నేర్పారు.

మొదటిసారి అనుభవమయిన తరవాత నేను, ఉపనిషత్తులు దేవుణ్ణి "అత్యంత ఆస్వాదయోగ్యం" అనే అర్థంలో 'రస'మని ["రసో వై సః" తైత్తిరీయం] - ఎందుకు చెబుతాయో ప్రతిరోజూ గ్రహిస్తూ కొన్ని నెలల పాటు తాదాత్మ్యస్థితిని పొందుతూ ఉండేవాణ్ణి. అయినప్పటికీ ఒకనాడు పొద్దున్న గురుదేవుల్ని ఇలా అడిగాను :

" నేను దేవుణ్ణి ఎప్పుడు చూస్తానో తెలుసుకోవాలని ఉందండి."

"నువ్వు చూశావు."

---

* సృష్టినంతనూ బహిర్ముఖంచేసే 'ఓంకారం' లేదా, సృజనాత్మక ప్రకంపనమైన 'శబ్దం'

† ప్రాచ్య పాశ్చాత్యదేశాల్లో కొంతమంది క్రియాయోగులకు నేను ఈ విశ్వదర్శనానుభవం కలిగించాను. వాళ్ళలో ఒకరు శ్రీ జేమ్స్ జె లిన్; ఆయన సమాధిలో ఉన్న దృశ్యం ఫోటో సెక్షన్ -II లో 12వ పేజీలో ఉంది.

"లేదు లేదండి. నేనలా అనుకోడం లేదు!"

మా గురుదేవులు చిన్నగా నవ్వుతున్నారు. "ఈ విశ్వంలో పరిశుభ్రమైన ఒక మూల, ఒక సింహాసనాన్ని అలంకరించిన పూజనీయుడైన ఒక వ్యక్తిని చూడాలనిమట్టుకు నువ్వు ఆశించడంలేదనే నమ్ముతున్నాను! అయితే, ఎవరయినా భగవంతుడి సాక్షాత్కారం పొందినందుకు రుజువుగా అద్భుత శక్తులు కలగాలని నువ్వు ఊహిస్తున్నట్టు కనిపిస్తోంది. అలా కాదు. ఒకడు విశ్వాన్ని అంతనీ అదుపు చెయ్యగల శక్తి సంపాదించి ఉండవచ్చు - అయినప్పటికీ ఈశ్వరుడు చిక్కకుండానే ఉండవచ్చు. ఆధ్యాత్మిక ప్రగతిని బాహ్యశక్తుల ప్రదర్శననిబట్టి కాకుండా, కేవలం ధ్యానంలో కలిగే ఆనందగాఢతనుబట్టి మాత్రమే గణించాలి.

"నిత్య నూతనానందమే దేవుడు. ఆయన అక్షరుడు; ఇకముందు సంవత్స రాల్లో నువ్వు ధ్యానసాధన కొనసాగిస్తూ పోయినకొద్దీ ఆయన అనంతమైన చాతుర్యంతో నిన్ను మాయచేస్తూ ఉంటాడు. దైవసాక్షాత్కారం పొందే మార్గం కనుక్కున్న నీలాంటి భక్తుడు మరేసుఖంకోసమూ దేవుణ్ణి వదులుకోడు; ఆయన పోటీనిగురించిన ఆలోచనకే అతీతంగా, మోహంలో పడేస్తాడు.

"ప్రాపంచిక సుఖాలతో ఎంత తొందరగా విసిగిపోతామో! భౌతిక వస్తువుల కోసం కలిగే కోరికకు అంతులేదు; మనిషి ఎన్నడూ పూర్తిగా తృప్తిపడలేడు; ఒక గమ్యం తరవాత మరో గమ్యానికి పాకులాడతాడు. అతడు అన్వేషించే "ఆ మరొకటి" ఈశ్వరుడే; శాశ్వతానందాన్ని ప్రసాదించగలవాడు ఆయనొక్కడే.

"బాహ్య కామనలు మనని లోపలున్న 'స్వర్గం' నుంచి తరిమేస్తాయి; అవి కేవలం ఆత్మానందపాత్రను అభినయించే మిథ్యాసుఖాల్ని మాత్రమే చేకూరుస్తాయి పోయిన స్వర్గాన్ని దైవధ్యానం ద్వారా తొందరగా తిరిగి పొందడం జరుగుతుంది. దేవుడు, ముందుగా ఊహించడానికి వీలులేని నిత్యనూతనత్వం కావడంవల్ల ఆయనంటే మనకెన్నడూ విసుగుపుట్టదు. అనంతకాలమంతటా సంతోషభరితంగా వైవిధ్యం చూపించే పరమానందం మనకు ఎక్కసం కావడం సాధ్యమా?"

"ఈశ్వరుడు అవగాహనకు అతీతుడని సాధువులు ఎందుకు అంటారో ఇప్పుడు తెలుసుకున్నానండి. ఆయన్ని అంచనా వెయ్యడానికి చిరంతన జీవితం కూడా చాలదు."

"అది నిజం; కాని ఆయన సన్నిహితుడూ ప్రియుడూ కూడా. క్రియా యోగం వల్ల మనస్సు ఇంద్రియావరోధాల్ని తొలగించేసిన తరవాత ధ్యానం, దేవుణ్ణి రెండు విధాల నిదర్శనాలతో నిరూపిస్తుంది. మనలో అణువణువుకూ నమ్మకం

కలిగించే విధంగా అనుభూతమయే నిత్యనూతనానందం ఆయన ఉనికికి నిదర్శనం. అంతేకాకుండా, కలిగిన ప్రతి కష్టానికీ ఆయన దగ్గర్నించి, అవసరమైన సమాధానం, తక్షణ మార్గనిర్దేశరూపంలో ధ్యానంలో లభిస్తుంది."

"గురూజీ, మీరు నా చిక్కు విప్పేశారన్నది స్పష్టమయింది," కృతజ్ఞతాభరితంగా చిరునవ్వు నవ్వాను. "నేను దేవుణ్ణి దర్శించానని ఇప్పుడు తెలుసు కున్నాను; ఎలాగంటే, మామూలుగా నా పనులు నేను చేసుకునే సమయాల్లో, ధ్యానంలో కలిగినప్పటి ఆనందం, అవచేతనా రూపంగా మళ్ళీ నాకు కలిగినప్పు డల్లా ప్రతి విషయంలోనూ, చిన్నచిన్న వివరాలతో సహా, నేను సరయిన దారి పట్టేటందుకు, సూక్ష్మపద్ధతిలో నన్ను ముందుకు నడిపించడం జరుగుతోంది."

"దైవసంకల్పంతో ఐక్యానుసంధానం చెయ్యడమెలాగో తెలుసుకునే వరకు మానవజీవితం దుఃఖభూయిష్ఠంగానే ఉంటుంది; ఆయన నిర్ణయించిన 'సరయిన దారి' అహంభావపూరితమైన తెలివిని తరచుగా గాభరాపెడుతూ ఉంటుంది," అన్నారు గురుదేవులు.

" దేవుడొక్కడే తప్పులేని సలహా ఇస్తాడు; ఆయన తప్ప మరెవ్వరు మొయ్య గలరు ఈ బ్రహ్మాండభారాన్ని?"

అధ్యాయం : 15

# గోబిపువ్వు దొంగతనం

"గురుదేవా, మీకో బహుమతి! ఈ పెద్ద గోబిపూలు (కాలీఫ్లవర్లు) ఆరూ నా చేతులతో నేను నాటినవండి; చంటిబిడ్డని సాకే తల్లిలా జాగ్రత్తగా చూసు కుంటూ వాటి పెరుగుదలని గమనిస్తూ వచ్చాను." నేను సలక్షణమైన ఆడంబరంతో ఆ కూరగాయల బుట్టని గురుదేవులకు బహూకరించాను.

"చాలా సంతోషం!" శ్రీయుక్తేశ్వర్‌గారి చిరునవ్వులో మెప్పుతో కూడిన ఆత్మీయత ఉంది. "వాటిని నీ గదిలో ఉంచు; రేపు ప్రత్యేకమైన విందుకు నాకు అవసరమవుతాయవి."

కాలేజి వేసంగి సెలవులు, గురుదేవులకు సముద్రపు ఒడ్డున గల ఆశ్రమంలో ఆయన దగ్గర గడువుదామని అప్పుడే నేను పూరీకి వచ్చాను. మా గురుదేవులూ వారి శిష్యులూ కలిసి కట్టిన, ఆహ్లాదకరమైన ఆ చిన్న రెండంతస్తుల ఆశ్రమం బంగాళాఖాతానికి ఎదురుగా ఉంది.

మర్నాడు పొద్దున, ఉప్పటి సముద్రపు గాలులతోటీ ప్రశాంతమైన ఆశ్రమ ఆకర్షణతోటీ సేద దీర్చుకుని, పెందలాడే నిద్ర లేచాను. మా గురుదేవుల మధుర స్వరం పిలుస్తోంది; నాకు ప్రీతిపాత్రమైన గోబిపూల వేపు ఒకసారి చూసుకొని వాటిని నా మంచంకింద పొందికగా పేర్చి పెట్టాను.

"రా, సముద్రపొడ్డుకు పోదాం," గురుదేవులు దారి తీశారు; చాలామంది యువశిష్యులూ నేనూ చెదిరిపోయిన గుంపులా ఆయన వెంట నడిచాం. మా గురుదేవులు సున్నితమైన విమర్శా ధోరణిలో మమ్మల్ని పరిశీలించారు.

"మన పాశ్చాత్య సోదరులు, నడిచేటప్పుడు సాధారణంగా ఒక క్రమపద్ధతి ననుసరించడం గర్వకారణంగా భావిస్తారు. మీరుకూడా ఇప్పుడు రెండు వరసల్లో కవాతు చెయ్యండి; ఒకరితో ఒకరు లయబద్ధంగా అడుగు వేస్తూ ఉండండి." మేము

ఆ ప్రకారం చేస్తూ ఉండగా, శ్రీయుక్తేశ్వర్‌గారు మా మీదే కన్నుంచి, "బాబులూ నడవండి ముందుకీ వెనక్కీ, అందంగా వరసకట్టి అడుగడుక్కీ," అంటూ పాడడం ప్రారంభించారు. గురుదేవులు తమ యువ శిష్యులతో సమానంగా చకచకా సునాయాసంగా అంగవెయ్యడం చూస్తుంటే ముగ్ధుణ్ణి కాక మానలేదు.

"ఆగండి!" మా గురువుగారి కళ్ళు నా కళ్ళలోకి చూశాయి. "ఆశ్రమం దొడ్డి తలుపు మరిచిపోకుండా తాళం వేశావా?"

"వేశాననుకుంటానండి."

శ్రీయుక్తేశ్వర్‌గారు కొన్ని నిమిషాలసేపు మౌనంగా ఉన్నారు. ఆయన పెదవుల మీద చిరునవ్వు కొంతమట్టుకు బిగబట్టి ఉంది. "లేదు, నువ్వు మరిచి పోయావు," అన్నారాయన చివరికి. "భౌతిక విషయాల్లో అజాగ్రత్తకి దైవచింతనని సాకుగా తీసుకోకూడదు. ఆశ్రమాన్ని భద్రపరచడంలో నీ విధిని ఉపేక్షించావు. నిన్ను శిక్షించాలి."

ఆ తరవాత, "నీ గోబిపువ్వులు ఆరూ త్వరలో అయిదయిపోతాయి," అని ఆయన అన్నప్పుడు అస్పష్టంగా పరాచకమాడుతున్నారనుకున్నాను.

గురుదేవులు ఉత్తరువుల మేరకు మేము వెనక్కి తిరిగి నడక సాగించాం; ఆశ్రమం దగ్గరికి వచ్చాం.

"కాస్సేపు విశ్రాంతి తీసుకోండి. ముకుందా, మనకి ఎడంవేపున ప్రహరీ వేపు చూడు; దానికి అవతలున్న రోడ్డు గమనించు. ఇప్పుడు ఒకతను అక్కడికి వస్తాడు; నిన్ను దండించడానికి ఉపయోగపడే సాధనం అతను."

అర్థంకాని ఈ వ్యాఖ్యానాలకి నాకు కలిగిన విసుగును మరుగుపరుచు కున్నాను. కాస్సేపట్లో రోడ్డుమీద ఒక రైతు కనిపించాడు; అర్థం లేని చేష్టలతో చేతులు విసురుగా తిప్పుతూ వికారంగా తైతక్కలాడుతున్నాడు. కుతూహలంతో, దాదాపు చేష్టలుడిగినట్టయిపోయి ఆ వినోదకరమైన దృశ్యానికే కళ్ళప్పగించేశాను. ఆ మనిషి రోడ్డుమీద నడుస్తూ మాకు కనుమరుగయిపోయే చోటికి వచ్చేటప్పటికి, శ్రీయుక్తేశ్వర్‌గారు అన్నారు, "ఇప్పుడతను వెనక్కి తిరుగుతాడు."

వెంటనే ఆ రైతు తన దిశ మార్చి ఆశ్రమం వెనక వేపుకి దారి తీశాడు. ఇసకదారికి అడ్డబడివచ్చి, దొడ్డి గుమ్మంవేపునుంచి ఆశ్రమంలోకి ప్రవేశించాడు. మా గురుదేవులు అన్నట్టే, నేను దానికి తాళం వెయ్యలేదు. కాస్సేపట్లో అతను నేను ఎంతో అపురూపంగా చూసుకునే గోబిపువ్వుల్లో ఒకటి పట్టుకుని బయటికి

వచ్చాడు. చేజిక్కిన దానివల్ల వచ్చిన దర్జాతో పెద్దమనిషి తరహాగా నడుచుకుంటూ పోయాడు.

బయల్పడుతున్న ఈ ప్రహసనంలో నా పాత్ర, తబ్బిబ్బయిన వంచితుడి పాత్రలా కనిపించినప్పటికీ ఆగ్రహంగా అతన్ని వెంబడించలేనంతగా మాత్రం నన్ను కలవరపరచలేదు. రోడ్డు చేరడానికి నేను సగం దూరం వెళ్ళానో లేదో, గురుదేవులు నన్ను వెనక్కి పిలిచారు. ఆయన విరగబడి నవ్వుతూ ఆపాదమస్తకం ఊగిపోతున్నారు.

"పాపం! ఆ వెర్రివాడు ఒక్క గోబిపువ్వు కోసం ఊఁ, ఉవ్విళ్ళూరుతున్నాడు," అని వివరించారాయన, నవ్వు మధ్యలో, "అంత అజాగ్రత్తగా ఉంచిన నీవాటిలో అతనికొకటి దక్కితే బాగుంటుందనుకున్నాను!"

వెంటనే నా గదికి ఉరికాను. కూరగాయలమీదే చూపు నిలిపిన ఆ దొంగ, గొంగడిమీద బట్టబయలుగా పడి ఉన్న నా బంగారపు ఉంగరాల్ని, వాచీని, డబ్బును తాకనైనా తాకలేదని గమనించాను. దాని బదులు, అలవోకగా చూస్తే కంటబడ కుండా ఉండేట్టు పూర్తిగా మరుగున ఉన్న గోబిపూల బుట్ట దగ్గరికి మంచం కిందినించి పాకుతూ వెళ్ళాడు; మనసులో ఉన్న ఒకేఒక కోరికను దాంతో తీర్చు కున్నాడు.

ఆనాడు సాయంత్రం, ఈ సంఘటనను గురించి విప్పిచెప్పమని శ్రీయుక్తే శ్వర్‌గారిని అడిగాను (ఇందులో గాభరా పెట్టే సంగతులు కొన్ని ఉన్నాయని నాకు అనిపించింది).

మా గురుదేవులు మెల్లగా తల ఊపారు, "ఎప్పుడో ఒకనాడు నువ్వు అర్థం చేసుకుంటావు. మరుగునపడిఉన్న ఈ నియమాల్ని కొన్నిటిని విజ్ఞానశాస్త్రం త్వరలోనే కనిపెడుతుంది."

కొన్నేళ్ళ తరవాత రేడియో* వింతలు హఠాత్తుగా బయల్పడి ప్రపంచాన్ని ఆశ్చర్యంతో ముంచెత్తినప్పుడు, గురుదేవుల జోస్యం నా మనస్సులో మెదిలింది. దేశకాలాల్ని గురించిన పాతకాలపు భావాలు తుడిచిపెట్టుకుపోయాయి. ఎవ్వరి ఇల్లూ కూడా, లండనో కలకత్తాయో ప్రవేశించలేనంత ఇరుకు ఏమీ కాదు! మానవుడి

* 1939లో రూపొందించిన రేడియో సూక్ష్మదర్శిని, అప్పటివరకు అజ్ఞాతంగా ఉన్న కిరణాల కొత్తలోకాన్ని ఆవిష్కరించింది. "స్వతహాగా మానవుడూ, జడపదార్థమని చెప్పే రకరకాల ద్రవ్యాలూ కూడా ఎడతెరిపిలేకుండా కిరణాల్ని ప్రసారం చెయ్యడం జరుగుతుంది; వాటిని ఈ పరికరం

సర్వవ్యాపకత్వం తాలూకు ఒక అంశానికి నిర్వివాదమైన నిదర్శనం ముందు అత్యంత మందబుద్ధి కూడా వికాసం చెందింది.

గోబిపువ్వు ప్రహసనం "ఇతివృత్తాన్ని" రేడియో సామ్యంతో బాగా అర్థం చేసుకోవచ్చు. మా గురుదేవులు మానవరూపంలో ఉన్న పరిపూర్ణమైన రేడియో. ఆలోచనలన్నవి ఆకాశంలో సంచరించే అత్యంత సూక్ష్మ ప్రకంపనలకు మించి మరేమీ కావు. ప్రతివేపు నుంచీ వెలువడుతుండే వేలాది కార్యక్రమాల్లోంచి మనకి కావలసిన సంగీత కార్యక్రమాల్ని, సరిగా ట్యూన్ చేసిన రేడియో అందుకునేటట్టుగా, శ్రీయుక్తేశ్వర్‌గారు, లోకంలో మానవ మనస్సులు ప్రసారం చేసే లెక్కలేనన్ని ఆలోచనల్లోంచి ఒకానొక (ఒక గోబిపువ్వు కోసం వెంపరలాడుతున్న ఆ వెర్రిబాగుల వాడి) సుసంగతమైన ఆలోచనలను సూక్ష్మగ్రహణశక్తితో కని పెట్టారు. సముద్రపు ఒడ్డున షికారుకు వెళ్తున్న సమయంలో ఆ రైతుకున్న చిన్న కోరిక తెలుసుకోగానే దాన్ని తీర్చాలని సంకల్పించారు. రోడ్డుమీద తైతక్క లాడుతూ వస్తున్న మనిషిని, అతను శిష్యుల కనుచూపుమేరలోకి రాకముందే, శ్రీయుక్తేశ్వర్ గారి దివ్యచక్షువు కనిపెట్టింది. ఆశ్రమం తలుపుకి తాళం వెయ్యడం విషయంలో నా మతిమరుపు,

---

'చూస్తుంది' అని రాసింది 'అసోసియేటెడ్ ప్రెస్' పత్రిక. "మానసిక ప్రసారాన్నీ (టెలిపతీ), రెండో చూపునూ, యోగదృష్టినీ నమ్మేవాళ్ళకు, ఒక వ్యక్తినుంచి మరో వ్యక్తికి నిజంగా ప్రసరించే అదృశ్య కిరణాల ఉనికికి మొట్టమొదటి శాస్త్రీయ నిదర్శనం ఈ ప్రకటనలో కనిపిస్తుంది. ఈ రేడియో పరికరం వాస్తవానికి, రేడియో స్పందన వర్ణపటదర్శిని మామూలు వర్ణపటదర్శిని (స్పెక్ట్రోస్కోప్) నక్షత్రాలు ఏర్పడ్డానికి కారణభూతమైన రకరకాల అణువుల్ని కళ్ళకి కట్టించినట్టు గానే ఈ పరికరం, చల్లని నిస్తేజ పదార్థాన్ని కళ్ళకి కట్టిస్తుంది ... మనిషి దగ్గర నుంచీ జీవపదార్థాలన్నిటినుంచీ వచ్చే అటువంటి కిరణాల ఉనికిని శాస్త్రజ్ఞులు చాలా ఏళ్ళుగా అనుమాని స్తూనే వచ్చారు. వాటి ఉనికిని ఈనాడు మొట్టమొదటి ప్రయోగాత్మక నిదర్శనం కనిపించింది. ప్రకృతిలో ప్రతి అణువూ ప్రతి పరమాణువూ ఎడతెరిపిలేని ఒక రేడియో ప్రసారకేంద్రం అని ఈ ఆవిష్కరణవల్ల తెలుస్తోంది. ఆ ప్రకారంగా, ఒకప్పుడు మనిషిగా ఉన్న పదార్థం చచ్చిపోయిన తరవాత కూడా తన సూక్ష్మకిరణాల్ని విడుదలచెయ్యడం కొనసాగిస్తూనే ఉంటుంది. ఆ కిరణాల అలపొడవులు, ఇప్పుడు ప్రసారంలో ఉపయోగించే చిన్న రేడియో తరంగాలకన్న చిన్నవాటి మొదలుకొని పెద్దతరంగాలకన్న పెద్దవాటి వరకు ఉంటూంటాయి. ఈ తరంగాల కలగలుపు దాదాపు ఊహించలేనిది. ఇలాటివి లక్షోపలక్షలు ఉన్నాయి. చాలా పెద్ద పరమాణువు ఒక్కటి, ఒకే సమయంలో 10,00,000 వేరువేరు అలపొడవుల్ని విడుదల చెయ్యవచ్చు. ఈ రకమైన విడుదైన అలపొడవులు, రేడియో తరంగాలంత సులువుగానూ వడిగానూ ప్రయాణం చేస్తాయి.... మనకి పరిచయమైన వెలుతురు కిరణాలకీ ఈ కొత్త రేడియో కిరణాలకీ, ఆశ్చర్యం కలిగించే భేదం ఒకటుంది. అదేమిటంటే, నిశ్చలమైన పదార్థంనుంచి వెలువడుతుండే ఈ రేడియో తరంగాలు వేలాది సంవత్సరాలపాటు అలా వెలువడుతూనే ఉంటాయి."

నా విలువైన శాకాల్లో ఒకటి నాకు దక్కకుండా చెయ్యడానికి గురుదేవులకు సదుపాయమైన మిష కల్పించింది.

ఆ విధంగా గ్రాహక పరికరంలా పనిచేసిన తరవాత శ్రీయుక్తేశ్వర్‌గారు ప్రబలమైన తమ సంకల్పశక్తిద్వారా, బ్రాడ్ కాస్టర్‌గా - అంటే ప్రేషక పరికరంగా పనిచేశారు.* ఆ ప్రకారంగా తమ పాత్ర నిర్వహిస్తూ ఆయన, ఆ రైతు వెనక్కి తిరిగి వెళ్ళి ఒకేఒక కాలీఫ్లవర్ కోసం ఒకానొక గదిలోకి ప్రవేశించేటట్లు నిర్దేశించడంలో కృతకృత్యులయారు.

సహజావబోధం (అంతర్జ్ఞానం, లేదా అంతఃస్ఫురణ) ఆత్మ చూపించే ముందు దారి; ఇది, మనిషి మనస్సు ప్రశాంతంగా ఉన్న క్షణాల్లో అతనిలో సహజంగానే కనిపిస్తుంది. దాదాపు ప్రతి ఒక్కరికీ ఏదో ఒక సందర్భంలో, వివరించ డానికి శక్యంకాని విధంగా, జరగబోయేది ముందుగానే సరిగా "స్ఫురించడం," తమ ఆలోచనల్ని మరో మనిషికి కచ్చితంగా బదిలీచెయ్యడంలాంటి అనుభవం కలిగే ఉంటుంది.

అలజడులు లేని, లేదా అశాంతి "ఒత్తిడి" నుంచి విముక్తమయిన మానవ మనస్సుకు, సహజావబోధమనే యాంటినా ద్వారా, జటిలమైన రేడియో యంత్రాలు చేసే పనులన్నిటినీ చేసే శక్తి ఉంటుంది; అంటే, ఆలోచనారూప సందేశాలు పంపడం, అందుకోడం, అక్కర్లేనివాటిని రానివ్వకపోవడం చెయ్యగలుగుతుందన్న మాట. రేడియో ప్రసార కేంద్ర శక్తి అది వినియోగించుకోగలిగిన విద్యుచ్ఛక్తి పరిమాణంచేత నియంత్రితమైనట్టుగానే మానవరూపంలో ఉన్న రేడియో సామర్థ్యం, ప్రతి ఒక్క వ్యక్తికీ ఉన్న సంకల్పశక్తి ప్రమాణంమీద ఆధారపడి ఉంటుంది.

అన్ని ఆలోచనలూ విశ్వంలో శాశ్వతంగా ప్రకంపిస్తూ ఉంటాయి. సిద్ధ పురుషుడైనవాడు గాఢమైన ఏకాగ్రతతో, బతికున్నవాడివయినా చనిపోయిన వాడివయినా సరే - ఏ మనిషి ఆలోచనలనయినా సరే - పసిగట్టగలుగుతాడు ఆలోచనలన్నవి నైయక్తికంగా కాక, విశ్వవ్యాప్తంగా వేరూనినవి. సత్యాన్ని దర్శించడమే కాని సృష్టించడం శక్యం కాదు. మనిషికి కలిగే తప్పుడు ఆలోచన ఏదయినా అతని వివేకంలో ఉన్న లోపానికి ఫలితం; ఆ లోపం పెద్దదయినా కావచ్చు, చిన్న దయినా కావచ్చు. అంతర్వాణి ఇచ్చే అమోఘమయిన సలహా విరూపం చెందకుండా వినగలిగేటందుకు మనస్సును శాంతపరచడమే యోగశాస్త్రం లక్ష్యం.

రేడియో, టెలివిజను, దూరంగా ఉన్న మనుషుల ధ్వనినీ ఆకారాన్నీ

---

* పే 331 లో అధోజ్ఞాపిక చూడండి.

తక్షణమే లక్షోపలక్షల ఇళ్ళలోకి తెస్తున్నాయి : మానవుడు సర్వవ్యాపకమైన ఆత్మ అన్నదానికి ఇది, వైజ్ఞానికమైన మొట్టమొదటి అస్పష్ట సూచన. అహంకారం మనిషిని బానిసని చేసుకోడానికి అత్యంత పాశవిక పద్ధతుల్లో కుట్ర పన్నుతున్నప్పటికీ అతడు ప్రధానంగా సర్వవ్యాపకమైన ఆత్మేకాని ఎక్కడో ఒక చోటికి కట్టుబడ్డ శరీరం మాత్రం కాదు.

"అత్యంత అపూర్వమైన, అత్యద్భుతమైన, అత్యంత అసంభావ్యంగా పైకి కనిపించే దృగ్విషయాలు ఇకముందు వెల్లడి కావచ్చు; అవి ఒకసారి స్థిరపడ్డ తరవాత, వాటిని చూసి, గడిచిన శతాబ్దిలో విజ్ఞానశాస్త్రం మనకి నేర్పినదంతా చూసి మనమిప్పుడు ఎంత ఆశ్చర్యపోతున్నామో అంతకుమించి మాత్రం ఆశ్చర్యపోము," అని ఉద్ఘాటించాడు, శరీరశాస్త్రంలో నోబెల్ బహు మానం అందుకున్న ఛార్లెస్ రాబర్ట్ రిషే.* "మన మీనాడు ఆశ్చర్యపడకుండా అంగీకరించే దృగ్విషయాలు మనలో ఆశ్చర్యం రేకెత్తించకపోవడానికి కారణం అవి మనకి అర్థమై ఉండడమేనని భావించడం జరిగింది. కాని అసలు సంగతి ఇది కానేకాదు. అవి మనకి ఆశ్చర్యం కలిగించకపోవడానికి కారణం, అవి మనకి అర్థమై ఉండడం కాదు' అవి మనకి పరిచితమై ఉండడం. అలా కాకపోతే, మనకి అర్థం కానిదల్లా ఆశ్చర్యం కలిగించాలంటే ప్రతిదీ ఆశ్చర్యమే కలిగించాలి - గాలిలోకి విసిరిన రాయి కిందికి పడడం, సిందూరపు కాయ సిందూరపు చెట్టు కావడం, వేడిచేసి నప్పుడు పాదరసం వ్యాకోచించడం, అయస్కాంతం ఆకర్షించిన ఇనుము, ఇలాటివన్నీ.

"ఈనాటి విజ్ఞానశాస్త్రం తేలికయిన విషయం.... మన సంతతివాళ్ళు కనుక్కోబోయే అత్యద్భుత సత్యాలు ఇప్పుడు కూడా మన చుట్టూ ఉన్నాయి; మన కళ్ళలోకి తేరిపారి చూస్తున్నాయని చెప్పొచ్చు. అయినా మనం వాటిని చూడం. మనం వాటిని చూడమని చెబితే చాలదు; వాటిని చూడాలని ఆశించం. దానికి కారణమేమిటంటే, అనుకోని, అపరిచితమైన యథార్థమేదయినా కన పడితే వెంటనే దాన్ని మనం, గడించిన జ్ఞానంలో సర్వసామాన్యాల చట్రాల్లో ఇమడ్చడానికి పూనుకొంటాం. ఎవరయినా ఇంకా పరిశోధన చెయ్యడానికి సాహసిస్తారంటే ఈసడిస్తాం."

నమ్మశక్యంకాని విధంగా నా గోబిపువ్వు ఒకటి దొంగతనమయిన కొన్నాళ్ళకి నవ్వొచ్చే సంఘటన ఒకటి జరిగింది. కావలసిన కిరసనాయిలు దీపం ఒకటి కనిపించలేదు. అంతకుముందే గురుదేవుల సర్వజ్ఞ యోగదృష్టిని ప్రత్యక్షంగా చూసిన తరవాత, ఈ దీపాన్ని కనిపెట్టడం చిన్న పిల్లల ఆటకింద ఆయన చూపిస్తారని అనుకున్నాను.

---

* 'అవర్ సిక్స్త్ సెన్స్' అన్న పుస్తకం రాసినాయన (లండన్ : రైడర్ అండ్ కంపెనీ).

గురుదేవులు నేను ఆశించినదాన్ని గమనించారు. తెచ్చిపెట్టుకున్న అతి గాంభీర్యంతో ఆశ్రమవాసులందరినీ నిగ్గదీసి అడిగారు. శిష్యుల్లో ఒక కుర్రవాడు దొడ్లో నూతి దగ్గరికి వెళ్ళడానికి దీపం తీసుకువెళ్ళానని చెప్పాడు.

శ్రీయుక్తేశ్వర్‌గారు, "దీపంకోసం నూతి దగ్గర చూడండి," అని గంభీరంగా సలహా ఇచ్చారు.

చటుక్కున అక్కడికి ఉరికాను; దీపం లేదు. మొహం వేలాడేసుకుని మా గురువుగారి దగ్గరికి తిరిగి వచ్చాను. ఇప్పుడాయన పగలబడి నవ్వుతున్నారు, నా భ్రమ తొలగిపోయినందుకు అనుతాపమేమీ లేకుండా.

"ఇదేం బాగాలేదు; మాయమైన దీపం దగ్గరికి నిన్ను పంపించలేకపోయాను నేను సోది చెప్పేవాణ్ణి కాకపోతిని!" మిలమిల్లాడుతున్న కళ్ళతో, ఆయన ఇంకా అన్నారు, "కనీసం సరయిన షెర్లాక్ హోమ్స్‌నయినా కాను!"

గురుదేవులు తమ శక్తుల్ని, ఎవరయినా సవాలు చేసినప్పుడుకాని, స్వల్ప విషయంలో కాని ఎన్నడూ ప్రదర్శించరని గ్రహించాను.

కొన్ని వారాలు ఆనందంగా చకచకా గడిచిపోయాయి. శ్రీయుక్తేశ్వర్‌గారు మతసంబంధమైన ఊరేగింపు ఒకటి జరపాలని పథకం వేస్తున్నారు. ఊళ్ళోనూ పూరీ సముద్రపు ఒడ్డునా శిష్యుల్ని తీసుకువెళ్ళి ఊరేగింపు నడిపించమని ఆయన నన్ను అడిగారు. పండుగ రోజున (కర్కాటక సంక్రమణం) తెల్లవారినప్పటినించే ఎండ మలమలమాడుస్తూ వచ్చింది.

"గురూజీ, కాళ్ళకి చెప్పులు లేని విద్యార్థుల్ని నిప్పులా కాలుతున్న ఇసకలో ఎలా నడిపించమంటారు?" అని అడిగాను నిరాశగా.

"నీకో రహస్యం చెబుతాను," అన్నారు గురుదేవులు. "ఈశ్వరుడు ఆకాశం లోకి మబ్బుల గొడుగు పంపిస్తాడు; మీరంతా సుఖంగా నడుస్తారు." నేను సంతోషంగా ఊరేగింపు ఏర్పాటుచేశాను; మా బృందం సత్సంగ* పతాకంతో ఆశ్రమంనుంచి బయలుదేరింది. శ్రీయుక్తేశ్వర్‌గారు రూపకల్పన చేసిన ఈ పతాకంలో ఏకైక† నేత్రం చిహ్నం ఉంది; అదే సహజావబోధం తాలూకు దూరదర్శక దృష్టి.

* 'సత్' అన్నదానికి వాచ్యార్థం, "అస్తిత్వం"; కాబట్టి "సారం, సత్యం"; 'సంగ' శబ్దానికి అర్థం "కూటమి." శ్రీయుక్తేశ్వర్‌గారు తమ ఆశ్రమ వ్యవస్థను సత్సంగమని పిలిచేవారు; అంటే "సత్యంతో సాంగత్యం" అన్నమాట.

† "కాబట్టి నీది ఒక్కటే కన్ను అయినట్లయితే (నీ దృష్టి ఏకాగ్రమయినట్లయితే) నీ ఒళ్ళంతా వెలుగుతోనే నిండుతుంది." - మత్తయి 6.22 (బైబిలు) గాఢంగా ధ్యానం చేసే

మేము ఆశ్రమంవిడిచి బయటికి వచ్చామో లేదో, ఏదో ఇంద్రజాలం చేసి నట్టుగా, ఆకాశమంతా మేఘాలతో నిండిపోతూ వచ్చింది. అందరూ సంభ్ర మాశ్చర్యాలు ప్రకటించగా, నగర వీధుల్నీ మలమల మాడుతున్న సముద్రతీరాన్నీ చల్లబరుస్తూ సన్నటి జల్లు కురిసింది.

రెండు గంటల ఊరేగింపు సమయంలో సేద దీర్చేటట్టుగా జల్లులు పడుతూనే ఉన్నాయి. మా బృందం ఆశ్రమానికి తిరిగివచ్చిన తక్షణమే మబ్బులూ వానా మటుమాయమయాయి.

"దేవుడు మనకోసం ఎంత ఇదవుతాడో చూడు!" అన్నారు. గురుదేవులు, నేను కృతజ్ఞత తెలియజేసిన తరవాత. "ఈశ్వరుడు అందరికీ పలుకుతాడు; అందరికీ పనిచేస్తాడు. నా ప్రార్థనునుబట్టి వాన కురిపించినట్టుగానే ఆయన, ఏ భక్తుడి హృదయాభిలాషనయినా సరే తీరుస్తాడు. దేవుడు తమప్రార్థనల్ని ఎంత తరచుగా మన్నిస్తాడో చాలా అరుదుగా గ్రహిస్తారు మనుషులు. ఆయన ఏ కొద్దిమంది మీదో పక్షపాతం చూపించడు; సంపూర్ణ విశ్వాసంతో తనని ఆశ్రయిం చిన వాళ్ళందరి ప్రార్థనలూ ఆలకిస్తాడు. సర్వాంతర్యామి అయిన తమ తండ్రి*కి గల ప్రేమతోకూడిన దయమీద ఆయన బిడ్డలకు అచంచల విశ్వాసం ఉండాలి.

శ్రీయుక్తేశ్వర్‌గారు ఏడాదికి నాలుగు ఉత్సవాలు జరిపేవారు - విషువత్తు లకూ సంక్రమణాలకూ. దూరంలోనూ దగ్గరలోనూ ఎక్కడెక్కడున్న విద్యార్థులూ అప్పుడు ఆయనదగ్గరికి చేరేవారు. మకర సంక్రాంతి ఉత్సవం శ్రీరాంపూర్‌లో జరిగింది; నేను హాజరయిన ఆ మొట్టమొదటి ఉత్సవం నాకు శాశ్వతమైన దీవెన అందించింది.

కాళ్ళకి చెప్పులు లేకుండా వీధుల్లో పొద్దుటిపూట ఊరేగింపుతో ఉత్సవం ఆరంభమయింది. వందమంది విద్యార్థుల కంఠస్వరాలు మధురమైన సంకీర్తన లతో ఖంగున మోగాయి. సంగీతజ్ఞులు కొందరు పిల్లంగోవి, ఖోల్ కర్తాల్ (మద్దెలలూ తాళాలూ) వాయించారు. భగవంతుడి పావన నామ సంకీర్తనంతో మారుమోగే టట్టుగా మేముచేసే భజన తమకు పిలుపుగా ఎంచుకొని, నిస్సారమైన పనులన్నీ

---

సమయంలో నుదుటికి నడుమ ఒంటికన్ను లేదా జ్ఞాననేత్రం అవుపడుతుంది సర్వదర్శకమైన ఈ కంటిని గురించి పవిత్ర గ్రంథాల్లో మూడోకన్ను అనీ, తూర్పుచుక్క అనీ, లోపలికన్ను అనీ, స్వర్గంనుంచి దిగివస్తున్న పావురమనీ, శివుడికన్ను అనీ, సహజావబోధ (అంతర్జ్ఞాన) నేత్రమనీ ఇంకా ఇలా రకరకాలుగా ప్రస్తావించారు.

* "చెవి నిచ్చినవాడు వినడా? కన్ను కల్పించినవాడు చూడడా?... మనిషికి జ్ఞానం నేర్పేవాడు తాను తెలుసుకోడా?" - సామ్స్ 94 9 10 (బైబిలు).

విడిచిపెట్టి సంతోషంగా బయటికి వచ్చిన ఉత్సాహవంతులైన ఊరి జనం, దారి పొడుగునా పూలు చల్లారు. ఆ దీర్ఘ పర్యటన ఆశ్రమం ముంగిట్లో సమాప్తమయింది అక్కడ మేము, మా గురుదేవుల చుట్టూ నిలబడ్డాం; మేడమీది బాల్కనీల్లో ఉన్న విద్యార్థులు మా మీద బంతిపూలు కురిపించారు.

చాలామంది అతిథులు, సెనగలూ నారింజతొనలూ కలిపిచేసిన ఫలహారం తీసుకోడానికి మేడమీదికి వెళ్ళారు. నేను ఆ రోజు వంటపని చేస్తున్న సోదర శిష్యుల బృందం దగ్గరికి దారితీశాను. అటువంటి పెద్ద సమారాధనలకి అన్నం ఆరుబయట పెద్ద పెద్ద గుండిగలతో వండాల్సి వచ్చేది. తాత్కాలికంగా వేసిన ఇటిక పొయ్యిల్లోంచి వచ్చే పొగ కన్నీళ్ళు తెప్పిస్తోంది; కాని మా పనికి మేము కులాసాగా నవ్వుకున్నాం. భారతదేశంలో మతసంబంధమైన ఉత్సవాల్ని ఒక బెడదగా ఎన్నడూ భావించరు; ప్రతి భక్తుడూ తన వంతు తను సంతోషంగా చేస్తాడు - డబ్బిచ్చిగాని, బియ్యమూ కాయగూరలూ ఇచ్చి గాని, స్వయంగా నడుంకట్టి పనిచేసిగాని. కాస్సేపట్లో గురువుగారు, సంతర్పణకి సంబంధించిన వివరాలు పర్యవేక్షిస్తూ, మా మధ్య నిలబడ్డారు. ఆయన ప్రతిక్షణం ఏదో ఒక పనిలో మునిగి ఉండేవారు; అయినా అత్యంత శక్తిమంతుడైన యువ శిష్యుడితో సమానంగా పనిచేసేవారు.

రెండో అంతస్తులో సంకీర్తనం (బృందగానం) జరుగుతోంది; పక్కన హార్మణీ, మద్దెలా వాయిస్తున్నారు. దాన్ని మెచ్చుకుంటూ విన్నారు శ్రీయుక్తేశ్వర్ గారు; ఆయన సంగీతజ్ఞానం సునిశితం, పరిపూర్ణం.

"వాళ్ళ శ్రుతి తప్పింది," గురుదేవులు వంటవాళ్ళని వదిలేసి సంకీర్తన బృందంలో చేరారు. మళ్ళీ శ్రావ్యత ధ్వనించింది; ఈసారి సరిగా వాయించారు

సామవేదంలో సంగీతశాస్త్రాన్ని గురించిన, ప్రపంచంలో అత్యంత ప్రాచీన మైన విషయాలు ఉన్నాయి. భారతదేశంలో సంగీతాన్నీ, చిత్రకళనూ నాటకాన్నీ దివ్యకళలుగా పరిగణిస్తారు. శాశ్వత త్రిమూర్తులయిన బ్రహ్మవిష్ణు మహేశ్వరులు మొట్టమొదటి సంగీతకారులు. విశ్వనర్తకుడయిన నటరాజ రూపంలో శివుడు, విశ్వసృష్టి స్థితిలయాల ప్రక్రియల్లో అనంత ప్రకారాల తాళలయల్ని సృష్టించి నట్టూ బ్రహ్మ తాళాలు వాయించినట్టూ విష్ణువు మృదంగం వాయించినట్టూ పవిత్ర గ్రంథాల్లో చెప్పడం జరిగింది.

జ్ఞానానికి అధిదేవత అయిన సరస్వతి, తంత్రీ వాద్యాలన్నిటికీ తల్లి అయిన వీణను చేతబట్టి వాయిస్తున్నట్టుగా చిత్రించడం జరిగింది. విష్ణువు అవతారాల్లో

ఒకడయిన కృష్ణుడు పిల్లంగోవి ఊదుతున్నట్టు హిందూ కళలో చిత్రించారు; దానిమీద అతడు, మాయాజాలంలో సంచరించే మానవాత్మల్ని తమ నిజమైన నివాసానికి తిరిగిరమ్మని పిలుస్తున్నట్టుగా ఆనంద పారవశ్యం కలిగించే పాట వాయిస్తాడు.

హిందూ సంగీతానికి ఆధారభూతమయినవి రాగాలు లేదా సంగీత స్వర గ్రామాలు. ఆరు మూలరాగాలూ 126 జన్యరాగాలుగా విడివడ్డాయి. వాటిని రాగిణులూ (భార్యలు) పుత్రులూ అంటారు. ప్రతి రాగానికీ కనీసం ఐదు స్వరాలుంటాయి : ప్రధాన స్వరం (వాది లేదా రాజు), అనుషంగిక స్వరం (సమవాది లేదా మహామంత్రి), సహాయక (అనువాది, సేవక) స్వరాలు, విరుద్ధ (వివాది, శత్రు) స్వరం.

మూలరాగాలు ఆరింటిలో ప్రతి ఒక్కదానికీ రోజులో ఒక నిశ్చిత సమయానికీ, సంవత్సరంలో ఒక నిశ్చిత ఋతువుకూ, ఒకానొక విశిష్ట శక్తిని చేకూర్చే అధిదేవతకూ పొసగుదల ఉంటుంది. ఆ విధంగా, (1) హిందోళరాగం - విశ్వప్రేమ భావాన్ని కలిగించడానికి వసంత కాలఉషోదయాన వింటారు. (2) దీపకరాగం - దయాభావాన్ని మేల్కొల్పడానికి వేసవి కాలంలో సాయంత్రంపూట ఆలపించడం జరుగుతుంది; (3) మేఘరాగం - ధైర్యం కలిగించడానికి వానా కాలంలో మిట్ట మధ్యాహ్నం ఆలపించవలసినది; (4) భైరవరాగం - ప్రశాంతత సాధించడానికి ఆగస్టు, సెప్టెంబరు, అక్టోబరు నెలల్లో పొద్దుటిపూట వినిపించేది; (5) శ్రీరాగం - పరిశుద్ధ ప్రేమను పొందడానికి శరదృతువులో మునిమాపు వేళల్లో గానం చెయ్యడానికి నిర్దిష్టమైంది; (6) మాల్కోసురాగం - శౌర్యం రేకెత్తించడానికి చలికాలం అర్ధరాత్రి వేళల్లో వింటారు.

ప్రకృతికీ మనిషికీ మధ్యగల నాదమైత్రి తాలూకు ఈ నియమాల్ని సనాతన ఋషులు కనిపెట్టారు. ప్రకృతి 'ఆదినాదం' లేదా 'స్పందనశీలశబ్దం' అయిన ఓంకారానికి ఘనీభూత రూపకల్పన కావడంచేత మానవుడు కొన్ని నిర్దిష్ట మంత్రాల్ని* ప్రయోగించి ప్రాకృతిక ప్రత్యక్ష విషయాలన్నిటి మీదా నియంత్రణాధి

---

* ప్రకృతిమీద అధికారం గల మంత్రోచ్చారణల్ని గురించిన ప్రస్తావనలు అన్ని దేశాల ప్రజల జానపద వాఙ్మయంలోనూ ఉన్నాయి. వానకోసం, గాలి కోసం అమెరికన్ ఇండియన్‌లు శాబ్దిక క్రతువులు కనిపెట్టారు. హైందవ సంగీత విద్వాంసుల్లో మహనీయుడైన తాన్‌సేన్, తన గాన శక్తితో మంటను ఆర్పగలిగాడు. కాలిఫోర్నియా ప్రకృతి శాస్త్రజ్ఞుడు ఛార్లెస్ కెలాగ్, 1926 లో నిప్పుమీద నాదప్రకంపనకు గల ప్రభావాన్ని, న్యూయార్క్ అగ్నిమాపక దళం వాళ్ళముందు ప్రదర్శించాడు. "పరిమాణాన్ని విస్తృతంగా పెంచి చేసిన ఫిడేలుకమాను లాంటిదాన్ని ఒక

కారం సంపాదించగలుగుతాడు. పదహారో శతాబ్దంలో అక్బరు చక్రవర్తి దగ్గర ఆస్థాన సంగీత విద్వాంసుడుగా ఉన్న మియాఁ తాన్‌సేన్‌కు గల అద్భుత శక్తుల్ని గురించి చారిత్రక పత్రాలు మనకు తెలియజేస్తాయి. సూర్యుడు నడినెత్తిని ఉన్న సమయంలో, రాత్రి పూట ఆలపించే రాగం ఒకటి వినిపించమని చక్రవర్తి ఆదేశించి నప్పుడు తాన్‌సేన్, ఉదాత్త స్వరంతో ఒక మంత్రం జపించాడు; దానివల్ల తక్షణమే రాజప్రాసాద పరిసరాలన్నిటా చీకటి అలుముకు పోయింది.

భారతీయ సంగీతం, స్వరశ్రేణిని (ఆక్టేవ్) ఇరవై రెండు శ్రుతులుగా లేదా అర్ధస్వరాంశాలుగా విభజించింది. ఈ సూక్ష్మ స్వర విరామాలు, సంగీతాభివ్యక్తిలో సునిశితమైన ఛాయలు ఏర్పడ్డానికి అవకాశమిస్తాయి. పన్నెండు అర్ధస్వరాలుగల పాశ్చాత్య వర్ణ స్వరగ్రామం (క్రొమాటిక్ స్కేల్)తో వీటిని సాధించడానికి వీలులేదు స్వరశ్రేణిలోని ఏడు మూల స్వరాల్లో ప్రతి ఒక్కదానికీ హిందూ పురాణాల్లో, ఒక రంగుతోనూ, ఒక పక్షికూతతోనూ లేదా జంతువు అరుపుతోనూ సంబంధం నిరూపించడం జరిగింది - 'స'కి ఆకుపచ్చ వన్నెతోనూ నెమలితోనూ; 'రి'కి ఎరుపు తోనూ చాతకపక్షితోనూ; 'గ'కి బంగారు వన్నెతోనూ మేకతోనూ; 'మ'కి పసుప్పచ్చ కత్తుకలిసిన తెలుపుతోనూ క్రౌంచపక్షితోనూ; 'ప'కి నలుపుతోనూ కోకిలతోనూ 'ధ'కి పసుప్పచ్చ వన్నెతోనూ గుర్రంతోనూ; 'ని'కి అన్ని వన్నెల కలగలుపుతోనూ ఏనుగుతోనూ సంబంధం నిరూపించారు.

[ "షడ్జం మయూరో వదతి, గావస్త్వృషభభాషిణః,
అజావికంతు గాంధారం, క్రౌంచః క్వణతి మధ్యమం
పుష్ప సాధారణే కాలే పికఃకూజిత పంచమం,
ధైవతం హేషతే వాజీ, నిషాదం బృంహతే గజః."

- 'అమరకోశః', నాట్యవర్గః - 1 : 184, 185]

భారతీయ సంగీతంలో డెబ్బైరెండు 'తాట'ల్ని లేదా మేళకర్త రాగాల్ని పేర్కొన్నారు. స్థిరమైన సాంప్రదాయిక రాగాల్ని ఒకదాన్ని ఆశ్రయించుకొని దానిచుట్టూ అనంతంగా అనేకమైన స్వరాలు కల్పించడానికి సంగీత విద్వాంసుడికి సృజనాత్మకమైన అవకాశం ఉంటుంది; అతను ఒకానొక విషయవస్తువు తాలూకు

---

అల్యూమినియం ట్యూనింగ్ ఫోర్క్‌కి అడ్డంగా ఇటూ అటూ గబగబా ఆడించి, తీవ్రమయిన రేడియో స్థాయీ ధ్వనిలాంటి కీచుస్వరాన్ని పలికించాడు. గుల్లగా ఉన్న ఒక గాజు గొట్టంలో ఎగిరెగిరి పడుతున్న రెండడుగుల ఎత్తుగల పసుప్పచ్చటి గ్యాస్‌మంట, ఆరంగుళాల ఎత్తుకు తగ్గి గిలగిలకొట్టుకుంటూ నీలిమంటగా మారింది. అలాగే ఆ కమానుతో మళ్ళీ మరోసారి చేసేటప్పటికి కీచుస్వరంతో మరోసారి ప్రకంపన వెలువడి మంటని ఆర్పేసింది "



నగేంద్రనాథ్ భాదురి
"గాలిలో తేలే సాధువు"



స్వామి కేవలానంద
యోగానందగారి ప్రియమైన సంస్కృతాధ్యాపకులు

1



స్వామి ప్రణవానంద
"రెండు శరీరాలున్న సాధువు". వారణాసి



మాస్టర్ మహాశయ
"ఆనందభరిత భక్తుడు"

స్వామి ప్రణవానంద
"రెండు శరీరాలున్న సాధువు", వారణాసి

మాస్టర్ మహాశయ
'ఆనందభరిత భక్తుడు'



పరమహంస యోగానందగారి కుటుంబ నివాసం,
గడ్‌పార్ రోడ్డు, కలకత్తా



యోగానందగారు
హైస్కూలు విద్యార్థిగా
(నిలబడినవారు)
ఆయన అన్నయ్య అనంత్
(కూర్చున్నవారు)



**శ్రీశ్రీ స్వామి శ్రీయుక్తేశ్వర్ గిరి (1855 - 1936)**

"జ్ఞానావతార్"; శ్రీశ్రీలాహిరీ మహాశయుల శిష్యులు;
పరమహంస యోగానందగారి గురువు
YSS-SRF క్రియాయోగులందరికీ పరమగురువు.



పద్మాసనంలో స్వామి శ్రీయుక్తేశ్వర్ గిరి



స్వామి శ్రీయుక్తేశ్వరుల సముద్ర తీర ఆశ్రమం, పూరి, ఒరిస్సా



యోగదా సత్సంగ సొసైటీ శాఖామఠం, ఆశ్రమం, పాలనాభవనం, రాంచి



శ్రీశ్రీ మహావతార్ బాబాజీ

శ్రీశ్రీ లాహిరీ మహాశయుల గురుదేవులు



**హిమాలయాల్లో బాబాజీ గుహ**

బాబాజీ అప్పుడప్పుడు ఉండే ఈ గుహ రాణీఖేత్ సమీపంలో ఉంది శ్రీ శ్రీ లాహిరీ మహాశయుల మనవడైన శ్రీ ఆనందమోహన్ లాహిరీ (తెల్లదుస్తుల్లో ఉన్నవారు) మరో ముగ్గురు భక్తులతో ఈ గుహను దర్శించినప్పుడు.



**శ్రీ శ్రీ లాహిరీ మహాశయ**

"నేను ఆత్మస్వరూపుణ్ణి, సర్వవ్యాప్తమైన అగోచరశక్తిని నీ కెమెరా ఫోటో తియ్యగలదా?"

లాహిరీ మహాశయుల బొమ్మను ఫోటో ఫిల్ములో బంధించేందుకు అనేక విఫల ప్రయత్నాలు జరిగిన మీదట ఆ యోగావతారులు తన 'దేహాలయా'న్ని ఫోటో తియ్యడానికి అనుమతించారు. "ఆ మహాయోగి మరొక ఫోటో ఎప్పుడూ తీయించుకోలేదు. ఆయన ఇంకో ఫోటో ఏదీ నేను చూడలేదు," అని రాశారు శ్రీ శ్రీ పరమహంస యోగానందగారు



**శ్రీశ్రీ లాహిరీ మహాశయ (1828 - 1896)**

“యోగావతార్’: శ్రీశ్రీ మహావతార్ బాబాజీ వారి శిష్యులు

శ్రీశ్రీ స్వామి శ్రీ యుక్తేశ్వర్‌గారి గురువు



అక్టోబరు 1920, బోస్టను, యు.ఎస్.ఎ. ప్రపంచ మత ఉదారవాదుల మహాసభలకు హాజరైన
కొందరు ప్రతినిధులతో శ్రీశ్రీ యోగానందగారు



శ్రీ శ్రీ యోగానందగారు - వేదికపై - యోగతరగతి నిర్వహిస్తూ
డెన్వర్, కొలరాడో, యు ఎస్ ఎ, 1924



శ్రీశ్రీ పరమహంస యోగానందగారు "వైట్‌హౌస్" వద్ద
అమెరికా అధ్యక్షుడు ప్రెసిడెంట్ కూలిడ్జ్‌గారు శ్రీశ్రీ యోగానంద గారికి
వైట్‌హౌస్‌లో స్వాగతమిచ్చారు; బయటికి వస్తున్నప్పుడు సెక్రటరీ జాన్ బాల్‌ఫోర్‌తో.



లూథర్ బర్బాంక్ మరియు శ్రీశ్రీ యోగానందగారు,
శాంతారోజా కాలిఫోర్నియా 1924.



శ్రీశ్రీ యోగానందగారు, ఫిల్ హార్మోనిక్ ఆడిటోరియం, లాస్ ఏంజిలిస్, కాలిఫోర్నియా, 1925, యోగం మీద ప్రసంగిస్తూ.



యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా / సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్, అంతర్జాతీయ ప్రధాన కార్యాలయం, మౌంట్ వాషింగ్టన్, లాస్ ఏంజిలిస్, కాలిఫోర్నియా - 1925లో శ్రీశ్రీ పరమహంస యోగానందగారు స్థాపించినది.



శ్రీ శ్రీయుక్తేశ్వర్ గిరి స్వామి వారు, శ్రీశ్రీ యోగానందగారు
కలకత్తా 1935

స్థాయీభావం మీద మనస్సును కేంద్రీకరింపజేసి, తన మౌలిక ప్రతిభగల పరిమితుల వరకూ దానికి అలంకారాలు తీర్చిదిద్దుతాడు. హిందూ సంగీత విద్వాంసుడు, అమిర్చి పెట్టిన స్వరసంగతుల్ని చదవడు. ప్రతి వాద్యకచేరీలోనూ అతను, స్థూలమైన రాగస్వరూపానికి కొత్త దుస్తులు అలంకరిస్తాడు; తరచుగా, ఒకే ఒక సంగతికి కట్టుబడి ఉంటూ దాని సునిశిత సూక్ష్మ స్వర వైవిధ్యాల్నీ తాళ వైవిధ్యాల్నీ అన్నిటినీ పునశ్చరణచేసి వాటికి బలం చేకూరుస్తాడు. పాశ్చాత్య సంగీత రచయితల్లో బాక్ (Bach)కు, వంద సంకీర్ణ పద్ధతుల్లో విభిన్నతలు చూపే పునరుక్త నాదానికి గల అందమూ శక్తీ తెలుసు.

సంస్కృత సాహిత్యం 120 తాళాల్ని, అంటే కాల ప్రమాణాల్ని వివరించింది. హైందవ సంగీతానికి సాంప్రదాయిక మూలపురుషుడయిన భరతుడు ఏట్రింత పక్షి పాటలో ముప్ఫై రెండు రకాల తాళాల్ని విడమరిచి చెప్పాడు. తాళం లేక లయకు మూలం మానవుడి ఒంటి కదలికల్లో ఉన్నది - నడకలో కనిపించే 'ద్వికాలం', నిద్రపోతున్నప్పుడు శ్వాసించే పద్ధతిలో 'త్రికాలం' అంటే ఊపిరి తీసుకునే కాలం ఊపిరి విడిచే కాలానికి రెట్టింపు.

భారతదేశం సనాతన కాలం నుంచీ, మానవ కంఠస్వరాన్ని పరిపూర్ణమైన ధ్వని పరికరంగా గుర్తిస్తోంది. అందువల్ల హైందవ సంగీతం, చాలావరకు మూడు స్వరస్థాయిల శ్రేణికి (మంద్ర, మధ్య, తారస్థాయిలు) పరిమితం చేసుకుంది. ఆ కారణంవల్లనే స్వరసంగతి (ఏకకాలంలో వెలువడే స్వరాల మధ్య సంబంధం) కన్న స్వరమాధుర్యానికి (అనుక్రమ స్వరాల మధ్య సంబంధానికి) ప్రాముఖ్యమివ్వడం జరిగింది.

హిందూ సంగీతం ఆత్మాశ్రయమైన, ఆధ్యాత్మికమైన, వైయక్తిక కళ; స్వర మేళన విభవం కన్న పరమాత్మతో వైయక్తిక సామరస్యం సాధించడం దాని లక్ష్యం. భారతదేశంలో ప్రఖ్యాత గీతాలన్నీ దైవ భక్తులు కూర్చినవే. సంగీత విద్వాంసుణ్ణి సంస్కృతంలో "భాగవతుడు' అంటారు; అంటే "భగవంతుణ్ణి కీర్తించేవాడు" అని అర్థం.

సంకీర్తనలు లేదా సంగీత సభలు, యోగవిద్యకు లేదా ఆధ్యాత్మిక శిక్షణకు స్ఫూర్తిమంతమైన రూపాలు; వీటికి గాఢమైన ఏకాగ్రతా, బీజప్రాయమైన ఆలోచనలోనూ నాదంలోనూ మనస్సును లగ్నం చెయ్యడం-ఈ రెండూ అవసరమవుతాయి. మానవుడు స్వయానా 'నాదబ్రహ్మ' ('సృజనాత్మక శబ్దం')కు అభివ్యక్తి కాబట్టి, ధ్వని అతనిమీద ప్రబలమైన సద్యఃప్రభావాన్ని ప్రదర్శిస్తుంది; అతని

షట్చక్రాల్లో* ఒకదాన్ని అది తాత్కాలికంగా స్పందనశీలంగా జాగృతం చేస్తుంది ఆనందభరితమైన ఆ క్షణాల్లో అతనికి, తనకు మూలమైన దివ్య స్వరూపం లీలగా స్మృతికి వస్తుంది.

పండుగ రోజున శ్రీయుక్తేశ్వర్‌గారి రెండో అంతస్తులో జరుగుతున్న సంకీర్తనం, కింద ఆవిర్లు కక్కుతున్న గుండిగల మధ్య పని చేస్తున్న వంటవాళ్ళకి కూడా ఉత్తేజం కలిగిస్తోంది. తోటి శిష్యులూ నేనూ ఆనందాతిశయంతో, చేతులతో తాళం వేస్తూ ఆ పల్లవిలు అందుకున్నాం.

పొద్దుగూకే వేళకి కొన్ని వందలమందికి కిచిడీ, కూర, పరమాన్నాలతో సంతర్పణ పూర్తి చేశాం. ముంగిట్లో ఆరుబయట జంబుఖానాలు పరిచాం కొద్దిసేపట్లో, శ్రీయుక్తేశ్వర్‌గారి నోటినించి వెలువడే జ్ఞానోపదేశాల్ని ప్రశాంతంగా ఆలకించడానికి, చుక్కలు మెరిసే ఆకాశం కింద అందరూ ఆసీనులయారు ఆయన బహిరంగోపన్యాసాలు క్రియాయోగవైశిష్ట్యాన్నీ, ఆత్మగౌరవం, ప్రశాంతత దృఢనిశ్చయం, సాదా భోజనం, క్రమబద్ధమైన వ్యాయామంగల జీవితానికీ ఉన్న విలువనూ నొక్కి చెబుతాయి.

---

* నిగూఢమైన సుషుమ్నానాడీ కేంద్రాల్ని (చక్రాలు, సూక్ష్మరూపమైన పద్మాలు) మేల్కొల్పడమే యోగి పవిత్ర లక్ష్యం. బైబిలు కొత్త నిబంధన గ్రంథంలో "ప్రకటన" అనే అధ్యాయంలో ఏసుప్రభువు యోహానుకూ సన్నిహితులైన ఇతర శిష్యులకూ బోధించిన ఒకానొక యోగశాస్త్రానికి ప్రతీకాత్మకమైన నిరూపణ ఉందన్న సంగతి పాశ్చాత్య భాష్యకారులు అర్థం చేసుకోలేరు యోహాను (ప్రకటన 1 20) "ఏడు నక్షత్రాల మర్మం", "ఏడు సంఘాలు ' పేర్కొన్నాడు· ఈ ప్రతీకలు, మేధో మేరు దండాక్షంలో ఏడు "బోను తలుపులు"గా యోగశాస్త్ర గ్రంథాల్లో వర్ణించిన ఏడు తేజఃపద్మాల్ని సూచిస్తాయి. దైవనియోజితమైన ఈ "నిర్గమన ద్వారాల" గుండా యోగి, శాస్త్రీయమైన ధ్యానంవల్ల శరీరమనే బందిఖానా నుంచి తప్పించుకుని తిరిగి చిదాత్మగా తన నిజస్వరూపాన్ని తాలుస్తాడు (అధ్యాయం 26 చూడండి).

మెదడులో "వెయ్యి రేకుల తామరపువ్వు" అని చెప్పే ఏడో కేంద్రం, అనంత చైతన్య రూపుడైన పరమాత్మ సింహాసనం. ఆధ్యాత్మిక జ్ఞానానుభవ స్థితిలో యోగి, బ్రహ్మను లేదా దేవుణ్ణి పద్మజుడిగా దర్శిస్తాడు; పద్మజుడంటే, "తామరపువ్వులో పుట్టినవాడని అర్థం "

"పద్మాసనం" అని అనడానికి కారణం, సాంప్రదాయికమైన ఆ ఆసనంలో యోగి, మేధో మేరుదండ కేంద్రం తాలూకు వివిధ వర్ణభాసితమైన పద్మాల్ని చూస్తాడు. ఒక్కొక్క పద్మానికి ఒక్కొక్క సంఖ్యలో, ప్రాణశక్తితో రూపొందిన రేకులు లేదా కిరణాలు ఉంటాయి. ఈ పద్మాల్ని చక్రాలు అని కూడా అంటారు.

ఆ తరవాత శిష్యుల్లో కొందరు కొన్ని దైవస్తోత్రాలు గానం చేశారు; గాఢ తత్పరత కలిగించే సంకీర్తనంతో సమావేశం సమాప్తమయింది. పది గంటల నుంచి అర్ధరాత్రి వరకూ ఆశ్రమవాసులు వంట పాత్రలన్నీ తోమి, ముంగిలి ఖాళీ చేశారు. గురుదేవులు నన్ను దగ్గరికి పిలిచారు.

"ఈరోజు, ఉత్సవసన్నాహాల్లో వారం రోజులపాటూ నువ్వు ఆనందంగా చేసిన శ్రమకు నాకు సంతోషంగా ఉంది. నువ్వు నా దగ్గర ఉండాలని ఉంది; ఈ రాత్రి నువ్వు నా పక్కలో పడుకోవచ్చు."

నాకు వస్తుందని ఎన్నడూ అనుకోని మహదవకాశమిది. మేము కొంతసేపు గాఢమైన దివ్య ప్రశాంతస్థితిలో కూర్చున్నాం. ఇక నిద్రకు ఉపక్రమిస్తూ మేము పడుకున్న సుమారు పది నిమిషాలకి గురుదేవులు లేచి మామూలు దుస్తులు వేసుకోడం ప్రారంభించారు.

"ఏమిటి గురుదేవా?" గురుదేవుల పక్కన పడుకుని నిద్రపోవడంలో గల ఆనందం, హఠాత్తుగా అవాస్తవికంగా పొడగట్టింది.

"సరైన రైలుబండి తప్పిపోయిన విద్యార్థులు కొందరు కాస్సేపట్లో ఇక్కడికి వస్తారనుకుంటాను. భోజనం సిద్ధంచేసి పెట్టుకుందాం."

"గురూజీ, అర్ధరాత్రి ఒంటిగంటకి ఎవ్వరూ రారండీ!"

"నువ్వు పడుకో; ఇంతవరకు చాలా కష్టపడి పనిచేశావు. నేను మట్టుకు వంట చెయ్యడానికి వెడుతున్నాను."

శ్రీయుక్తేశ్వర్‌గారి కంఠంలో స్థిరనిశ్చయం పొడగట్టేసరికి నేను చటుక్కున పైకి గెంతి, ఆయన వెనకాలే వంటగదికి వెళ్ళాను; రోజూ వాడుకునే ఆ చిన్న వంటగది, రెండో అంతస్తులో లోపలి బాల్కనీని ఆనుకుని ఉంది. కాస్సేపట్లో బియ్యం, పప్పూ ఉడుకుపట్టాయి.

మా గురుదేవులు ఆప్యాయంగా చిరునవ్వు నవ్వారు, "ఈవేళ రాత్రి నువ్వు అలసటనీ, కష్టతర కార్యభయాన్నీ జయించావు; ఇక ముందెన్నడూ వాటివల్ల నువ్వు ఇబ్బంది పడవు."

ఇలా ఆయన, యావజ్జీవిత ఆశీర్వచనాలు పలుకుతూ ఉండగానే ముంగిట్లో అడుగుల అలికిడి వినిపించింది. నేను పరిగెత్తుకుంటూ కిందికి వెళ్ళి, వచ్చిన విద్యార్థి బృందాన్ని లోపలికి ప్రవేశపెట్టాను.

"తమ్ముడూ, ఈ సమయంలో గురువుగారిని ఇబ్బంది పెట్టాలంటే మనస్సు ఎంత పీకుతోందో తెలుసా! రైలు వేళల విషయంలో మేము పొరపాటు చేశాం కాని గురుదేవుల దర్శనం చేసుకోకుండా తిరిగి ఇంటికి వెళ్ళలేమనిపించింది" అన్నారొకాయన.

"మీ కోసమే చూస్తున్నారాయన; మీ కోసం వంట కూడా చేస్తున్నారు'

శ్రీయుక్తేశ్వర్‌గారి స్వాగత స్వరం ఖంగున మోగింది. దిమ్మెరపోయిన అతిథుల్ని వంటింట్లోకి తీసుకు వెళ్లాను. మిలమిలా మెరుస్తున్న కళ్ళతో గురుదేవులు నావేపు తిరిగారు.

"విషయాలు సరిపోల్చి చూసుకోవడం పూర్తి అయింది కనక మన అతిథులు నిజంగానే బండి తప్పిపోయారన్న విషయంలో నువ్వు తృప్తిపడ్డావనుకుంటాను"

ఒక అరగంట తరవాత నేను, దేవుడిలాటి గురువుగారి పక్కన నిద్రపోయే భాగ్యానికి ఆనందంగా ఎదురుచూస్తూ ఆయన వెంబడే, ఆయన పడగ్గదికి వెళ్ళాను.

అధ్యాయం : 16

# గ్రహాల్ని ఓడించడం

"ముకుందా, నువ్వు జ్యోతిష సంబంధమైన [గ్రహదోష నివారకమయిన] దండ కడియం ఒకటి ఎందుకు సంపాదించకూడదూ?"

" నేను సంపాదించాలా గురుదేవా? జ్యోతిషశాస్త్రంమీద నాకు నమ్మకం లేదండి."

"నమ్మకమన్నది కాదిక్కడ ప్రశ్న: ఏ విషయాన్ని గురించి అయినా మనిషి ఏర్పరుచుకోవలసిన శాస్త్రీయ దృక్పథం, ఆ విషయం సత్యమా కాదా అన్నది. గురుత్వాకర్షణ నియమం న్యూటన్ తరవాత ఎంత సమర్థంగా పనిచేస్తోందో ఆయనకు ముందుకూడా అలాగే పని చేసింది. మానవుడి నమ్మకమనే అనుమతి ఉంటేనే కాని విశ్వనియమాలు పనిచెయ్యలేని పరిస్థితి ఉంటే ఈ విశ్వం గందర గోళమయిపోయి ఉండును.

"తెలిసీ తెలియని పండితమ్మన్యులు సనాతనమైన ఖగోళశాస్త్రాన్ని అప్రతిష్ఠ పాలు చేశారు. జ్యోతిషశాస్త్రం, గణితశాస్త్రీయంగానూ* తాత్త్వికంగానూ కూడా, గాఢమైన అవగాహన ఉన్నవాళ్ళు తప్ప తక్కినవాళ్ళు సరిగా గ్రహించలేనంత విశాలమయినది. అజ్ఞానులు ఆకాశ-పుటల్ని తప్పుగా చదివి, అక్కడ అక్షరాల బదులు

---

* సనాతన హిందూ గ్రంథాల్లో ఉన్న ఖగోళశాస్త్ర సంబంధమైన ప్రస్తావనల్ని బట్టి పండితులు, గ్రంథకర్తల కాలాన్ని నిర్ధారణ చెయ్యగలుగుతున్నారు. ఋషుల శాస్త్రీయవిజ్ఞానం ఎంతో మహత్తరమైనది. జ్యోతిష సంబంధమైన వ్రతాదికాలు జరిపేందుకు శుభలగ్నాలు నిర్ణయించడానికి వీలైన, ఔపయోగికమైన విలువగల ఖగోళశాస్త్ర పరిజ్ఞానంలో హిందువులు క్రీ పూ. 3100 నాటికే ఎంతో అభివృద్ధి సాధించారు. ఈ సంగతి సూచించే సునిశితమైన ఖగోళశాస్త్ర విషయాలు మనకు కౌషీతకి బ్రాహ్మణంలో కనిపిస్తాయి. 1934 ఫిబ్రవరి నెల ఈస్ట్-వెస్ట్' పత్రికలో ప్రచురించిన తారామాత రాసిన ఒక వ్యాసంలో జ్యోతిషాన్ని గురించి

పిచ్చిగీతల్నే చూస్తే, ఈ అపరిపూర్ణ ప్రపంచంలో ఆశించగలిగేది అంతే. అందుచేత ఇలాటి 'జ్ఞాను'లతో బాటు జ్ఞానాన్ని కూడా తీసిపారెయ్యకూడదు.

"సృష్టిలో భాగాలన్నీ ఒకదానితో ఒకటి ముడిపడి ఉన్నవి; వాటి ప్రభావాల్ని పరస్పరం మార్చుకుంటూ ఉంటాయి. విశ్వానికున్న సంతులిత లయ ఈ పరస్పర ఆదానప్రదానాల్లో నెలకొని ఉంది." అంటూ మా గురుదేవులు ఇంకా ఇలా అన్నారు "మనిషి, తన మానవ ప్రకృతినిబట్టి రెండు రకాల శక్తుల్ని ఎదుర్కోవాలి- ఒకటి, పృథివ్యాపస్తేజోవాయురాకాశాలనే పంచభూతాల కలయిక వల్ల తనలో ఏర్పడ్డ కల్లోలాలు; రెండోది, ప్రకృతిలోని బాహ్య విఘటన శక్తులు. మానవుడు తన నశ్వరత్వంతో పెనుగులాడుతూ ఉన్నంతకాలం, భూమ్యాకాశాల్లో జరిగే అసంఖ్యాకమైన పరిణామాలవల్ల ప్రభావితుడవుతూనే ఉంటాడు.

"జ్యోతిష మన్నది, గ్రహాల ఉద్దీపనలకు మనిషిలో కలిగే ప్రతిస్పందనల్ని వివరించే శాస్త్రం. నక్షత్రాలకు, గ్రహాలకు ఉద్దేశపూర్వకమైన మిత్రభావంకాని, శత్రుభావంకాని ఉండవు; అవి కేవలం అనుకూల, ప్రతికూల కిరణాల్ని ప్రసరిస్తూ ఉంటాయంతే. వాటంతట అవి మానవులకు మేలూ చెయ్యవు, కీడూ చెయ్యవు కాని ప్రతి మనిషీ గతంలో తాను గతి కల్పించిన కార్యకారణ సంతులనాల బాహ్య పరిక్రియకు అవి నియమబద్ధమైన ఒక మార్గాన్ని ఏర్పరుస్తాయి.

---

లేదా వైదిక ఖగోళ శాస్త్ర గ్రంథావళిగురించి ఇలా ఉంది : "భారతదేశాన్ని ప్రాచీన దేశాలన్నిటికీ అగ్రస్థానంలో నిలిపి, విజ్ఞానాన్వేషకులకు దాన్ని పవిత్ర యాత్రాస్థలంగా చేసిన శాస్త్రీయ విజ్ఞానం దాంట్లో ఉంది. 'బ్రహ్మగుప్త' అనే పేరుతో ఖగోళశాస్త్ర గ్రంథం ఒకటి ఉంది. ఇందులో, మన సూర్యమండలంలో ఉన్న గ్రహాల సూర్యకేంద్రక చలనం, భూభ్రమణమార్గ వక్రత, భూమికున్న గోళాకృతి, చంద్రుడి పరావర్తన కాంతి, ప్రతిరోజూ భూమి తన అక్షంమీద చేసే పరిభ్రమణం పాలపుంతలో స్థిరనక్షత్రాల ఉనికి, గురుత్వాకర్షణ నియమంవంటివే కాక, కోపర్నికస్, న్యూటన్‌ల కాలం వరకు పాశ్చాత్య ప్రపంచానికి తెలియని వైజ్ఞానిక యథార్థాల్ని ఎన్నిటినో ఈ గ్రంథంలో చర్చించడం జరిగింది.

"పాశ్చాత్య గణితశాస్త్రాభివృద్ధికి అమూల్యంగా ఉపకరించిన "అరబ్బీ అంకెలు" అనేవి భారతదేశం నుంచి అరబ్బుల ద్వారా యూరప్‌కు తొమ్మిదో శతాబ్దంలో వచ్చాయి. భారతదేశంలో ఈ అంకలేఖన ప్రణాళిక ప్రాచీన కాలంలోనే రూపొందింది. భారతదేశపు అపార వైజ్ఞానిక వారసత్వాన్ని గురించి మరికొంత సమాచారం ఈ కింది గ్రంథాల్లో కనిపిస్తుంది. సర్ పి.సి. రాయ్ రాసిన 'హిస్టరీ ఆఫ్ హిందూ కెమిస్ట్రీ', బి.ఎన్.సీల్ రాసిన 'పాజిటివ్ సైన్సెస్ ఆఫ్ ఏన్షెంట్ హిండూస్', బి కె సర్కార్ రాసిన 'హిందూ ఎచీవ్‌మెంట్స్ ఇన్ ఎగ్జాక్ట్ సైన్స్', ఆయనే రాసిన 'ద పాజిటివ్ బాక్‌గ్రౌండ్ ఆఫ్ హిందూ సోషియాలజీ', యు.సి. దత్ రాసిన 'మెటీరియా మెడికా ఆఫ్ ద హిండూస్'."

"ఫలానా రోజున, ఫలానా సమయంలో ఒక పసివాడు పుట్టాడంటే, ఖగోళ కిరణాలు గణితశాస్త్రపరంగా అతని వైయక్తిక కర్మకు కచ్చితంగా అనుగుణమై ఉన్న సమయంలో అతను పుట్టాడన్నమాట. మార్చడానికి వీలులేని అతని గతాన్నీ, దానివల్ల భవిష్యత్తులో సంభవమయే ఫలితాల్నీ వెల్లడించే అతని జాతకం సవాలు చేసే ప్రతిరూపమన్నమాట. సహజావబోధం ఉన్నవాళ్ళే జాతక చక్రాన్ని సరిగా అన్వయంచేసి చెప్పగలరు; వీళ్ళు బహుకొద్ది.

"పసివాడు పుట్టిన సమయంలో ఆకాశంలో ప్రస్ఫుటంగా ప్రకటితమయ్యే సందేశం, విధిని - అంటే వెనకటి మంచి చెడ్డల కర్మఫలాల్ని - నొక్కిచెప్పడానికి కాదు; విశ్వబానిసత్వం నుంచి బయటపడాలన్న ఇచ్ఛ మనిషిలో రగుల్కొల్ప డానికే. తాను చేసినదాన్ని తాను మార్చుకోగలడు. అతని జీవితంలో ఇప్పుడు ఏయే ఫలితాలు కనిపిస్తున్నాయో వాటికి మూలకారకుడు అతనే కాని మరెవరూ కాదు. అతను ఏ పరిమితినైనా అధిగమించగలడు; కారణమేమిటంటే అసలా పరిమితిని తన కర్మలద్వారా ఏర్పరచుకున్నవాడు తానే కనక, అతనికి గ్రహ ఒత్తిళ్ళకు లొంగని ఆధ్యాత్మిక వనరులు ఉన్నాయికనక.

"జ్యోతిషంమీద మూఢభక్తి మనిషిని, యాంత్రిక మార్గదర్శకత్వంమీద గుడ్డిగా ఆధారపడే మరమనిషిగా తయారుచేస్తుంది. కాని వివేకవంతుడు తన భక్తి ప్రపత్తులను సృష్టిమీదినుంచి సృష్టికర్తమీదికి మళ్ళించి తన గ్రహాల్ని ఓడిస్తాడు - అంటే తన గతాన్ని వమ్ము చేస్తాడు. పరమాత్మతో తనకు గల ఏకత్వాన్ని అతను ఎంత ఎక్కువగా గ్రహిస్తుంటే భౌతిక ప్రపంచం అతని మీద ప్రాబల్యం వహించడం అంతగా తగ్గుతూ ఉంటుంది. ఆత్మ ఎప్పుడూ స్వేచ్ఛగా ఉండేదే; దానికి పుట్టుక లేదు; కనక చావూలేదు. గ్రహ నక్షత్రాలు దానిమీద ఆధిపత్యం వహించలేవు. మనిషి ముఖ్యంగా ఆత్మ. ఒక శరీరం 'కలిగి' ఉన్నాడు. అతను తానెవరో సరిగా తెలుసుకొన్నప్పుడు నిర్బంధకాల్ని అన్నిటినీ విడిచిపెట్టేస్తాడు. అతను ఆధ్యాత్మిక విస్మృతి అనే తన సాధారణ స్థితిలో గందరగోళంలో పడి ఉన్నంతకాలం పరిసర నియమం తాలూకు సూక్ష్మ శృంఖలాల్లో చిక్కుకునే ఉంటాడు.

"దేవుడంటే సామరస్యం : దేవుడితో ఐక్యానుసంధానం పొందిన భక్తుడు ఏ పనీ తప్పుగా చెయ్యడు. అతని కార్యకలాపాలు జ్యోతిష నియమానుసారంగా సరిగా, సహజంగా జరగవలసిన సమయంలోనే జరుగుతాయి. గాఢంగా ప్రార్థన, ధ్యానం చేసిన తరవాత అతనికి దివ్య చైతన్యంతో సంపర్కమేర్పడుతుంది; ఆంతరికమైన ఆ రక్షణశక్తిని మించిన గొప్పశక్తి మరొకటి ఏదీ లేదు."

"అయితే, గురుదేవా, నన్ను జ్యోతిష సంబంధమైన దండకడియం వేసు కోమని ఎందుకంటున్నారు?" చాలాసేపు మౌనం వహించిన తరవాత నేను ఈ ప్రశ్న వెయ్యడానికి సాహసించాను: అంతవరకు నేను శ్రీయుక్తేశ్వర్‌గారి గంభీరమైన వ్యాఖ్యానాన్ని ఒంటబట్టించుకోడానికి ప్రయత్నించాను; అందులో భావాలన్నీ నాకు చాలా కొత్త.

"ప్రయాణికుడు తన గమ్యం చేరుకున్నప్పుడు మాత్రమే తన మ్యాప్‌లు తీసిపారెయ్యడం సబబు. ప్రయాణం చేస్తున్నప్పుడు, అనువుగా ఉండే అడ్డదారిని ఉపయోగించుకుంటాడు. మానవుడు మాయలో ప్రవాసముండే కాలాన్ని తగ్గించ డానికి సనాతన ఋషులు అనేక మార్గాలు కనిపెట్టారు. జ్ఞానసాధనంతో నేర్పుగా సర్దుబాటు చెయ్యగల కొన్నికొన్ని యాంత్రిక లక్షణాలు కర్మసూత్రంలో ఉన్నాయి

"ఏదో ఒక విశ్వనియమోల్లంఘనవల్లనే మానవులకు కష్టాలు వస్తూంటాయి మనిషి ఈశ్వరుడి సర్వశక్తి మత్వాన్ని నిరాదరించకుండానే ప్రకృతి నియమాల్ని పాటించాలని పవిత్రగ్రంథాలు సూచిస్తున్నాయి. 'ప్రభూ, నిన్నే నమ్ముకున్నాను నువ్వు నాకు సహాయం చెయ్యగలవని నాకు తెలుసు; అయినా నేను చేసిన ఏ తప్పయినా సరిదిద్దుకోడానికి నేను కూడా శాయశక్తులా ప్రయత్నం చేస్తాను,' అని చెప్పాలతను. ప్రార్థనవల్ల, సంకల్పశక్తివల్ల, ధ్యానయోగంవల్ల, సాధుసత్పు రుషులతో సంప్రదింపువల్ల, జ్యోతిషసంబంధమైన కడియాలు వేసుకోడంవల్ల - అనేక సాధనాల ద్వారా, వెనకటి తప్పులవల్ల కలిగిన దుష్ఫలితాల్ని చాలా వరకు తగ్గించుకోవచ్చు; లేదా నశింపు చేసుకోవచ్చు.

"పిడుగుపాటువల్ల తగిలే అదురుదెబ్బకు తట్టుకోడానికి ఇంటికి రాగితీగ అమర్చినట్టుగానే దేహమనే దేవాలయాన్ని కూడా కొన్ని పద్ధతుల్లో కాపాడుకో వచ్చు.

"విద్యుత్, అయస్కాంత వికిరణాలు ఈ విశ్వంలో అవిచ్ఛిన్నంగా ప్రస రిస్తూ ఉన్నాయి; మనిషి శరీరానికి అవి మంచీ చెయ్యవచ్చు, చెరుపూ చెయ్యవచ్చు. అనేక యుగాల కిందట మన ఋషులు, సూక్ష్మమైన విశ్వకిరణ ప్రభావాల దుష్ఫలితాల్ని పోగొట్టే సమస్యనుగురించి ఆలోచన చేశారు. స్వచ్ఛమైన లోహాలు గ్రహాల ప్రతికూలాకర్షణలకు శక్తిమంతమైన ప్రతిక్రియ చేసే సూక్ష్మకాంతిని విడుదల చేస్తాయని కనిపెట్టారు. కొన్ని ఓషధుల మేళనాలు కూడా సహాయకరంగా ఉంటాయని తేలింది. అన్నిటికన్న బాగా పనిచేసేవి, రెండు క్యారెట్లకు తక్కువ బరువులేని నిఖార్సయిన రత్నాలు.

"జ్యోతిషశాస్త్రానికి వ్యవహారానుకూలంగా, దుష్ప్రభావాల్ని నిరోధించే ఉపయోగాలు ఉన్నాయి; కాని వాటినిగురించి భారతదేశానికి వెలుపల జరిగిన పరిశీలన మాత్రం చాలా తక్కువ. చాలామందికి తెలియని యథార్థం ఒకటి ఏమిటంటే, సరయిన రత్నాలు, లోహాలు, ఓషధులు, కావలసిన బరువు ఉంటేను, వాటిని ధరించినప్పుడు అవి చర్మాన్ని తాకుతూ ఉంటేను తప్ప వాటివల్ల ప్రయోజనం ఉండదు."

"గురుదేవా, నేను తప్పకుండా మీ సలహా పాటించి ఒక కడియం సంపాదిస్తాను. గ్రహాల్ని ఓడించడమన్న ఆలోచన నాకు చిత్రంగా ఉంది."

"సాధారణ ప్రయోజనాలకయితే నేను, బంగారం, వెండి, రాగితో చేసిన కడియం వేసుకోమంటాను. కాని ఒక నిర్దిష్ట ప్రయోజనంకోసం నువ్వు వెండీ, సీసంతో చేసింది సంపాదించాలి," అని చెప్తూ శ్రీయుక్తేశ్వర్‌గారు జాగ్రత్తకోసం కొన్ని సూచనలు కూడా చేశారు.

"గురుదేవా, 'నిర్దిష్టప్రయోజనం' అనడంలో మీ అభిప్రాయం ఏమిటి?"

"గ్రహాలు త్వరలో నీ మీద 'అమిత్ర' భావం చూపించబోతున్నాయి ముకుందా. భయపడకు; నీకు కాపుదల ఉంటుంది. సుమారు ఒక నెల్లాళ్ళలో నీ కాలేయం నిన్ను చాలా బాధపెడుతుంది. లెక్క ప్రకారం ఆ జబ్బు ఆర్నెల్ల పాటు ఉండాలి. కాని నువ్వు వేసుకొనే జ్యోతిష సంబంధమైన కడియం, ఆ కాలాన్ని ఇరవైనాలుగు రోజులకు తగ్గించేస్తుంది."

ఆ మర్నాడు నేనొక కంసాలిని పట్టుకుని, త్వరలోనే కడియం సంపాదించి వేసేసుకున్నాను. నా ఆరోగ్యం అద్భుతంగా ఉంది; గురుదేవుల జోస్యం నా మనస్సులోంచి ఎప్పుడో తొలగిపోయింది. గురువుగారు శ్రీరాంపూర్ నుంచి కాశీ వెళ్ళారు. మా సంభాషణ జరిగిన తరవాత ముప్ఫై రోజులకి, నా కడుపులో కాలేయం దగ్గర హఠాత్తుగా నొప్పి వచ్చింది. అప్పటినించి కొన్ని వారాలపాటు యమబాధ పడ్డాను. గురువుగారిని ఇబ్బందిపెట్టడం ఇష్టంలేక, ఈ పరీక్ష ధైర్యంగా ఒంటరిగానే తట్టుకోవాలనుకున్నాను.

కానీ ఇరవై మూడు రోజుల యమయాతన నా పట్టుదలని సడలించేసింది. కాశీకి రైలెక్కాను. అక్కడ శ్రీయుక్తేశ్వర్‌గారు అసాధారణమైన ఆప్యాయతతో నన్ను పలకరించారేకాని, ఆంతరంగికంగా నా బాధలు చెప్పుకోడానికి అవకాశం ఇవ్వలేదు. ఆనాడు కేవలం ఆయన దర్శనం*కోసం చాలామంది భక్తులు వచ్చారు.

---

* ఒక సాధువును కేవలం చూసినంతమాత్రాన్నే లభించే అనుగ్రహం.

జబ్బుతో బాధపడుతూ, నా సంగతి పట్టించుకునేవాళ్ళు లేక, అలా ఒక మూల కూర్చున్నాను. రాత్రి భోజనాలు అయాక కాని అతిథులు వెళ్ళలేదు. అప్పుడు మా గురుదేవులు ఆ ఇంటికి అష్టభుజాకారంలో ఉన్న బాల్కనీలోకి రమ్మని పిలిచారు.

"నీ కాలేయం జబ్బుగురించి వచ్చి ఉంటావు." శ్రీయుక్తేశ్వర్ గారి చూపు నన్ను తప్పించుకుంది; ఆయన అడపాతడపా, పడుతున్న వెన్నెలకు అడ్డువస్తూ ఇటూ అటూ పచార్లు చేస్తున్నారు. "ఏది, ఇలా చూణ్ణియ్యి; నువ్వు ఇరవై నాలుగు రోజుల్నించి బాధపడుతున్నావు కదూ?"

"ఔనండి."

"పొట్టకు సంబంధించి నేన్నీకు నేర్పిన వ్యాయామం చెయ్యి."

"నే నెంత విపరీతంగా బాధపడుతున్నానో తెలిస్తే మీరు నన్నా వ్యాయామం చెయ్యమని అనేవారు కాదు గురుదేవా!" అయినప్పటికీ ఆయన మాట మన్నించ డానికి కొద్దిగా ప్రయత్నించాను.

"నొప్పి ఉందంటున్నావు నువ్వు; నీ కేమీ లేదంటున్నాను నేను. అటువంటి వైరుధ్యాలు ఎలా ఉంటాయి?" మా గురుదేవులు నావేపు గుచ్చి గుచ్చి చూశారు

నేను అప్రతిభుణ్ణయాను; నొప్పి మాయమయేసరికి ఆనందం పట్టలేక పోయాను. కొన్ని వారాలపాటు దాదాపు కంటికి కునుకు లేకుండా చేసిన ఎడతెగని యమబాధ మటుమాయమయిందని అనుభవమయింది. అటువంటి బాధ నా కెన్నడూ రానేలేదన్నట్టుగా, ఆయన మాటలతోనే మాయమయింది.

కృతజ్ఞతాబద్ధుణ్ణయి, నేను ఆయన పాదాలముందు వాలబోతున్నాను చటుక్కున ఆయన నన్ను ఆపారు.

"మరీ పసిపిల్లాడివయిపోకు. లేచి, గంగమీద పడుతున్న వెన్నెల అందం చూసి ఆనందించు," అన్నారాయన. కాని ఆయన పక్కన నేను మౌనంగా నించుని ఉన్నప్పుడు, గురుదేవుల కళ్ళు సంతోషంతో మిలమిల్లాడాయి. నాకు స్వస్థత చేకూర్చినవాడు భగవంతుడే కాని తాము కాదన్న అనుభూతి నాకు కలగాలని ఆయన ఆశిస్తున్నట్టుగా, ఆయన వైఖరినిబట్టి గ్రహించాను.

నేను నిజంగా ఒక మానవాతీత మహాపురుషునితో కలిసి జీవించానన్న విషయాన్ని మరొక్కమారు తెలుసుకొన్న ఆ రోజుకి - కాలగర్భంలో కలిసిపోయినా

శాశ్వతంగా జ్ఞాపకముండే ఆ రోజుకి - గుర్తుగా ఆ బరువైన వెండి, సీసం దండ కడియాన్ని ఈ నాటికీ ధరిస్తున్నాను. తరవాత కొన్ని సందర్భాల్లో నేను, రోగ విముక్తి కోసం నా స్నేహితుల్ని శ్రీయుక్తేశ్వర్‌గారి దగ్గరికి తీసుకు వెళ్ళినప్పుడు ఆయన, రత్నాలు ధరించమని కాని కడియం* వేసుకోమనికాని తప్పకుండా చెప్పేవారు; వాటిని వాడడం జ్యోతిషశాస్త్రజ్ఞానంవల్ల కలిగిన లాభమంటూ మెచ్చుకునేవారు.

జ్యోతిషశాస్త్రాన్ని గురించి నాకు చిన్నప్పటినించీ వ్యతిరేకాభిప్రాయం ఉండేది. దానికి కారణం కొంతవరకు, చాలామంది దాన్ని గుడ్డిగా అనుసరిస్తున్నారన్న సంగతి నేను గమనించడం ఒకటి; "నువ్వు మూడుసార్లు పెళ్ళి చేసుకుంటావు; రెండుసార్లు భార్యను పోగొట్టుకుంటావు," అంటూ మా ఇంటి సిద్ధాంతిగారు జోస్యం చెప్పడం ఒకటి. వివాహత్రయానికి బలి కాబోయే మేకలా బాధపడుతూ ఈ విషయాన్ని గురించి నేను తీవ్రంగా ఆలోచించాను.

"నీ రాత ఎలా ఉంటే అలా జరుగుతుందని సరిపెట్టుకోడం మంచిది," అని వ్యాఖ్యానించాడు మా అనంతు అన్నయ్య. "నువ్వు చిన్నతనంలో మూడుసార్లు ఇల్లు విడిచి హిమాలయాలవేపు పారిపోతావనీ కాని బలవంతంమీద నిన్ను తిరిగి తీసుకొస్తారనీ నీ జాతకంలో రాసి ఉంది. సరిగా అలాగే జరిగింది. నీ పెళ్ళి విషయంలో చెప్పిన జోస్యం కూడా అలాగే నిజమయి తీరుతుంది," అన్నాడు.

ఈ జోస్యం పూర్తిగా అబద్ధమని ఒకనాటి రాత్రి నాకు స్పష్టంగా అంతఃస్ఫురణ కలిగింది. నా జాతకం రాసిన కాగితంచుట్టను కాల్చేసి, దాని బూడిద ఎత్తి ఒక కాగితం సంచీలో పోసి, దానిమీద ఇలా రాశాను; "పూర్వకర్మ బీజాల్ని దివ్యజ్ఞానాగ్నిలో కాలిస్తే కనక అవి మళ్ళీ మొలకెత్తలేవు." ఆ సంచీ, స్పష్టంగా కంటబడేచోట పెట్టాను. అనంతుడు వెంటనే నా ప్రతిఘటన వ్యాఖ్యను చదివాడు.

"నువ్వు జాతకం కాయితాన్ని కాల్చినంత సులువుగా సత్యాన్ని నాశనం చెయ్యలేవు," అంటూ వెటకారంగా నవ్వాడు మా అన్నయ్య.

నేను పెద్దవాణ్ణి కాకముందు, మా వాళ్ళు నాకు పెళ్ళి చెయ్యడానికి మూడుసార్లు ప్రయత్నంచెయ్యడం యథార్థమే. దేవుడిమీద నాకున్న ప్రేమ, గతాన్ని బట్టి జ్యోతిషం ఇచ్చే ప్రోత్సాహంకన్న చాలా ఎక్కువన్న సంగతి తెలిసి నేను, ప్రతిసారీ వాళ్ళ పథకాలకు† లోబడకుండా తప్పుకున్నాను.

---

* పే. 303లో అధోజ్ఞాపిక చూడండి.

† మావాళ్ళు నా కిచ్చి పెళ్ళి చెయ్యాలని చూసిన పెళ్ళికూతుళ్ళలో ఒకమ్మాయికి, ఆ తరవాత మా పినతండ్రిగారి అబ్బాయితో పెళ్ళి అయింది. అతని పేరు ప్రభాస్‌చంద్ర ఘోష్

"మానవుడి ఆత్మ సాక్షాత్కారం ఎంత ఎక్కువ గాఢమైతే అంత ఎక్కువగా అతడు తన సూక్ష్మ ఆధ్యాత్మిక స్పందనలతో విశ్వాన్నంతనీ ప్రభావితం చేస్తాడు: తాను మాత్రం దృగ్విషయిక చాంచల్యానికి అంత తక్కువగా ప్రభావితుడవుతాడు" గురుదేవులు చెప్పిన ఈ మాటలు తరచుగా జ్ఞప్తికి వస్తూ నాకు ఉత్తేజం కలిగిస్తూ ఉండేవి.

అప్పుడప్పుడు నేను, గ్రహస్థితుల్ని బట్టి నా జీవితంలో అత్యంత దుష్కాలాలేవో గ్రహించి చెప్పమని జ్యోతిష్కుల్ని అడుగుతుండేవాణ్ణి. అయినా ఆ కాలాల్లో నేను ఏ పని తలపెట్టినప్పటికీ దాన్ని నెరవేరుస్తూ ఉండేవాణ్ణి. అటువంటి సమయాల్లో అసాధారణమైన కష్టాల్ని ఎదుర్కొంటేనే కాని, ఆ తరవాత విజయం సిద్ధించేది కాదన్నమాట నిజం. కాని దైవరక్షణ మీద విశ్వాసం, మానవుడికి దేవుడిచ్చిన సంకల్పబలాన్ని సరిగా ఉపయోగించుకోడం అన్నవి రెండూ గ్రహస్థితుల ప్రభావాల కన్న ఎక్కువ బలమైనవన్న నా ప్రగాఢ విశ్వాసం సమర్థనీయ మైనదేనని ఎప్పుడూ ఋజువవుతూ ఉండేది.

ఒకడి జననకాలంలో ఉన్న గ్రహస్థితికి అర్థం, మానవుడు తన గతం చేతిలో కీలుబొమ్మ అని కాదని నేను తెలుసుకున్నాను. నిజానికది అతనికి గర్వ కారణం కాగలదు. మానవుడు అన్ని రకాల పరిమితుల్నించి బయటపడాలన్న సంకల్పం అతనిలో రగుల్కొల్పడానికి గ్రహనక్షత్రాలు కూడా ప్రయత్నిస్తున్నాయి. భగవంతుడు ప్రతి మనిషినీ ఆత్మగా సృష్టించాడు; ప్రత్యేక వ్యక్తిత్వం ప్రసాదించాడు కాబట్టి స్తంభంగానో పరాన్నభుక్కుగానో తాత్కాలిక పాత్ర నిర్వహిస్తున్నప్పటికీ విశ్వవ్యవస్థ కది ఆవశ్యకమైనది. అతడు సంకల్పించినట్లయితే వెంటనే అంతిమ స్వేచ్ఛ సంపాదించగలడు; ఇది ఆంతరిక విజయాలమీదనే కాని బాహ్య విజయాల మీద ఆధారపడదు.

శ్రీయుక్తేశ్వర్‌గారు ఇప్పటి యుగానికి* 24,000 సంవత్సరాలు ఆయన చక్రాన్ని అన్వయింపజేసే గణితశాస్త్ర విధానాన్ని కనిపెట్టారు. ఈ చక్రాన్ని రెండుగా విభజించి ఒకటి ఆరోహణ చాపంగాను, రెండోది అవరోహణ చాపంగాను పేర్కొన్నారు. ఒక్కొక్క చాపం కాలపరిమితి 12,000 సంవత్సరాలు. ప్రతి చాపంలోనూ 'కలి, ద్వాపర, త్రేతా, సత్య' యుగాలనే నాలుగు యుగాలుంటాయి. ఈ నాలుగు

---

శ్రీ ఘోష్ యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియాకు ఉపాధ్యక్షులుగా సేవచేస్తూ 1975 జనవరి 24న కన్ను మూశారు (ప్రచురణకర్త గమనిక)

* ఈ అయన చక్రాల్ని గురించి శ్రీయుక్తేశ్వరస్వామివారు 'కైవల్య దర్శనం' (ద హోలీ సైన్స్) అనే పుస్తకం మొదటి భాగంలో వివరించడం జరిగింది (యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా ప్రచురణ)

యుగాల్ని గ్రీకులమతానుసారంగా లోహ, కాంస్య, రజత, స్వర్ణ యుగాలని అంటారు.

మా గురుదేవులు రకరకాల లెక్కలు కట్టి, ఆరోహణచాపంలోని కడపటి 'కలియుగం' అంటే లోహయుగం, క్రీ శ. 500 ప్రాంతంలో మొదలయిందని నిర్ధారణ చేశారు. 1200 సంవత్సరాల కాలపరిమితిగల ఈ లోహయుగం, భౌతికవాద ప్రధానమైన కాలం. క్రీ.శ. 1700 ప్రాంతంలో ముగిసింది. ఆ సంవత్సరం 'ద్వాపర యుగం' ఆరంభమయింది. దీని కాలపరిమితి 2,400 సంవత్సరాలు. ఈ యుగం విద్యుచ్ఛక్తి అణుశక్తుల వికాసానికి టెలిగ్రాఫ్, రేడియో, విమానాలవంటి దేశ వ్యవధానాన్ని హరింపజేసే యంత్రాలకూ ప్రాముఖ్యం వహించే యుగం.

3 600 సంవత్సరాల కాలంగల 'త్రేతాయుగం' క్రీ.శ. 4,100లో మొదలవుతుంది. టెలిపతీ (మానసిక ప్రసారం) ప్రసారాలగురించి, కాల వ్యవధానాన్ని హరింపజేసే ఇతర సాధనాలగురించి జనసామాన్యానికి తెలిసి ఉండడం ఈ యుగ లక్షణం. ఆరోహణచాపంలో కడపటి యుగమైన 'సత్యయుగం' కాల పరిమితి 4,800 సంవత్సరాలు. ఈ యుగంలో మానవమేధ సర్వోత్కృష్టంగా వికాసం చెందుతుంది; మానవుడు దైవనిర్ణీత పథకానికి అనుకూలంగా పని చేస్తాడు.

ప్రపంచానికి అప్పుడు, 4800 సంవత్సరాల అవరోహణ స్వర్ణయుగంతో ఆరంభమయే 12,000 సంవత్సరాల అవరోహణ చాపం మొదలవుతుంది (క్రీ.శ. 12,500); క్రమశః మానవుడు అజ్ఞానంలోకి దిగజారిపోతాడు. ఈ కాల చక్ర భ్రమణాలు, దృగ్గోచర విశ్వం తాలూకు వైషమ్య సాపేక్షతారూపకమైన 'మాయ' ప్రదర్శించే శాశ్వత ఆవృత్తులు.* మానవుల్లో, సృష్టికర్తతో తమకున్న విడదీయరాని

---

* ఇప్పటి ప్రపంచం ఆయుర్దాయం, శ్రీయుక్తేశ్వర్‌గారు చెప్పిన 24 000 సంవత్సరాల ఆయనచక్రం కన్న చాలా దీర్ఘమైన విశ్వచక్రంలోని కలియుగంలో ఒక అంతర్భాగంగా హిందువుల శాస్త్ర గ్రంథాలు నిర్ణయించాయి. ఈ గ్రంథాల్లో చెప్పిన విశ్వచక్రం కాలవిస్తృతి 430 05,60,000 సంవత్సరాలు. ఇది ఒక సృష్టికల్పంగా లెక్కకు వస్తుంది. అంటే సృష్టికి ఒక దినం. ఇది ఇప్పటిరూపంలో మన గ్రహమండలానికి నిర్ధారణచేసిన ఆయుఃప్రమాణ మన్నమాట. ఋషులు ఇచ్చిన ఇంత పెద్ద సంఖ్య సౌరసంవత్సరం పొడుగుకూ 'పై' (అంటే, ఒక వృత్తం చుట్టుకొలతకూ వ్యాసానికీ ఉండే అనుపాతం : 3 1416) గుణిజానికీ ఉన్న సంబంధం మీద ఆధారపడి ఉంది.

ప్రాచీన ద్రష్టల దృష్టిలో అఖండ బ్రహ్మాండం ఆయుర్దాయం 314, 15900,00,00 000 సౌర సంవత్సరాలు; అంటే "ఒక బ్రహ్మాయుగం"

హిందూ పవిత్ర గ్రంథాల్లో, మనం నివసించే భూమిలాంటి గ్రహం లయం కావడానికి కారణాలు రెండు చెప్పారు: లోకంలో ఉండేవాళ్ళు మొత్తమంతా పూర్తిగా మంచివాళ్ళయినా అయిపోవడం, లేదా పూర్తిగా చెడ్డవాళ్ళయినా అయిపోవడం. ఈ రెండింటిలో ఏ ఒక్కదానివల్ల

దివ్య ఏకత్వాన్ని గురించిన స్పృహ పెరిగినకొద్దీ, వాళ్ళు ఒకరి తరవాత ఒకరు మాయాద్వంద్వం నుంచి విముక్తి పొందుతారు.

గురుదేవులు, జ్యోతిషశాస్త్ర విషయంలోనే కాక, ప్రపంచ ధార్మిక గ్రంథాల విషయంలో కూడా నా అవగాహనను విస్తృతం చేశారు. పవిత్ర గ్రంథాల్ని ఆయన మనస్సనే నిర్మల ఫలకంమీద పెట్టి, సహజావబోధయుక్తమైన తర్కమనే శస్త్రంతో విశ్లేషిస్తూ ఉండేవారు; ప్రవక్తలు మౌలికంగా వ్యక్తంచేసిన సత్యాల్లోంచి పండితుల దోషాల్నీ ప్రక్షిప్తాల్నీ ఏరేస్తూ ఉండేవారు.

"చూపును ముక్కుకొన మీద నిలపాలి." భగవద్గీతలో ఉన్న ఒక శ్లోకానికి* తప్పుడు వ్యాఖ్యానమిది. ప్రాచ్య పండితులూ పాశ్చాత్య అనువాదకులూ చాలా మంది దీన్ని అంగీకరించారు. గురుదేవులు దీన్ని వేళాకోళంగా విమర్శిస్తూ ఉండేవారు.

"యోగి అనుసరించే మార్గమే వింత మార్గం. దానికి తోడు అతన్ని మెల్ల కన్ను తెప్పించుకోమని కూడా సలహా ఇవ్వడమెందుకు?" అనేవారు. 'నాసికాగ్రం' అన్నదానికి సరయిన అర్థం, 'ముక్కుకు మూలమైన స్థానం' అనే కాని 'ముక్కు కొన' అని కాదు. కనుబొమల మధ్య ఆధ్యాత్మిక దృష్టికి స్థానమైన చోట ముక్కు మొదలవుతుంది."†

సాంఖ్య యోగం‡లో ఒక సూత్రంలో ఇలా ఉంది: "ఈశ్వరా సిద్దేః§ ("సృష్టికి

---

నయినా ప్రళయం సంభవించవచ్చు నన్నారు. ఈ విధంగా లోకమానవం ఒకానొక శక్తిని ఉద్భూతం చేస్తుంది. ఆ శక్తి, భూమ్యాకారంలో సంఘటితమయి ఉన్న బంధితాణువుల్ని విడుదల చేస్తుంది.

ఇదుగో, ప్రపంచ ప్రళయం రాబోతోందంటూ అప్పుడప్పుడూ భయంకరమైన ప్రకటనలు ప్రచురిస్తూ ఉంటారు. అయినప్పటికీ గ్రహచక్రభ్రమణాలు ఒక క్రమబద్ధమయిన దివ్య ప్రణాళిక ప్రకారం కొనసాగుతూనే ఉన్నాయి. భూప్రళయమేదీ కనుచూపుమేరలో లేదు; ప్రస్తుత రూపంలో మన గ్రహానికి ఇంకా అనేకమైన ఆరోహణ, అవరోహణ అయనచక్రాలు గడవవలసి ఉన్నాయి

* అధ్యాయం IV 13.

† "ఒంటికి వెలుతురు కన్ను : కనక నీది ఒక్కటే కన్నయితే నీ ఒళ్ళంతా వెలుతురులో నిండినదే అవుతుంది; కాని నీ కన్ను చెరుపయితే నీ ఒళ్ళు కూడా అంతా చీకటితో నిండి ఉంటుంది. కనక నీలోఉన్న వెలుతురు చీకటి అయిపోకుండా చూసుకో." - లూకా 11 34-35 (బైబిలు).

‡ హిందూ తత్త్వశాస్త్రంలోని షడ్దర్శనాల్లో ఒకటి. ప్రకృతితో మొదలుకొని పురుషుడి (ఆత్మ) వరకు ఉండే ఇరవైఐదు తత్త్వాల పరిజ్ఞానం ద్వారా విముక్తి పొందవచ్చునని సాంఖ్యం ప్రబోధిస్తుంది.

§ సాంఖ్యదర్శన సూత్రాలు, 1.92.

అధినేత, అనుమాన ప్రమాణంచేత కనుక్కోడానికి వీలయినవాడు కాడు!' లేదా "ఈశ్వరుణ్ణి నిరూపించడానికి ప్రమాణం లేదు"). ముఖ్యంగా ఈ సూత్రం మీద ఆధారపడి చాలామంది విద్వాంసులు, దర్శన శాస్త్రాన్నంతనీ నాస్తికవాదం అనేస్తున్నారు.

"ఈ శ్లోకంలో నాస్తికగుణం లేదు," అని వివరించారు శ్రీ యుక్తేశ్వర్ గారు. "అందులో సూచించేదల్లా, తుది నిర్ణయాలన్నిటికీ ఇంద్రియ జ్ఞానం మీదే ఆధారపడి ఉండే అజ్ఞానికి ఈశ్వరుణ్ణి నిరూపించే ప్రమాణం అజ్ఞాతంగానే ఉంటుందని; కాబట్టి దానికి అస్తిత్వంలేదని. ధ్యానోత్పన్నమైన అచంచల అంతర్దృష్టి గల నిజమైన సాంఖ్య దర్శనానుయాయులు, ఈశ్వరుడు ఉన్నాడనీ, తెలుసుకోడానికి వీలయినవాడనీ కూడా గ్రహిస్తారు."

మా గురుదేవులు క్రైస్తవుల బైబిలును చక్కని స్పష్టతతో వ్యాఖ్యానించేవారు. బైబిలులోని అమృతతత్త్వాన్ని దర్శించగలగడం, "స్వర్గం, భూమి గతించిపోతాయి కాని నా మాటలు మట్టుకు గతించిపోవు"* అంటూ ముందెవ్వరూ పలకనంత నిష్కర్షగా, అత్యంత హర్షదాయకంగా క్రీస్తు చేసిన ప్రవచనంలోని సత్యాన్ని అవగాహన చేసుకోడం నేను నేర్చుకున్నది, క్రైస్తవమత సభ్యత్వంతో ప్రమేయంలేని మా హైందవ గురుదేవుల దగ్గిర.

భారతదేశపు మహాగురువులు, క్రీస్తుకు ఉత్తేజం కలిగించిన దివ్యాదర్శాల్నే అనుసరించి తమ జీవితాల్ని మలుచుకున్నారు. ఈ మహాపురుషులు, ఆయన తనవాళ్ళుగా చాటుకొన్న ఆత్మబంధువులు : "స్వర్గంలో ఉన్న నా తండ్రి ఇచ్ఛను అనుసరించే ప్రతివ్యక్తీ నాకు సోదరుడు, సోదరి, తల్లి.' † క్రీస్తు ఇంకా ఇలా అన్నాడు: "నా మాట ననుసరించి మీరు ముందుకు సాగితేనే మీరు నిజంగా నాకు శిష్యులు; అప్పుడు మీకు సత్యం అవగతమవుతుంది; ఆ సత్యం మీకు విముక్తి కలిగిస్తుంది."‡ అందాకా స్వేచ్ఛాజీవులయి, తమకు తామే ప్రభువులయి ఏకైక జగత్పితనుగురించి ముక్తిదాయకమైన జ్ఞానాన్ని ఆర్జించుకొన్న, క్రీస్తువంటి, భారతీయ యోగిపుంగవులు అమరబంధుకోటిలో అంతర్భాగమే.

---

* మత్తయి 24 35 (బైబిలు)

† మత్తయి 12 50 (బైబిలు)

‡ యోహాను 8 31-32. సెంట్ జాన్ ఇలా ధ్రువపరిచాడు : "తనను స్వీకరించిన వాళ్ళందరికీ ఆయన దేవుడి కుమాళ్ళు కాగల శక్తి ఇచ్చాడు తన పేరు మీద విశ్వాసముంచిన వాళ్ళకి సైతం ఇచ్చాడు (సర్వవ్యాపక కూటస్థ చైతన్యంలో స్థిరపడ్డవాళ్ళకి సైతం ఇచ్చాడు) '

- యోహాను 1 12 (బైబిలు)

"ఆదాము, అవ్వల కథ నాకు కొరుకుడు పడకుండా ఉందండి!" అన్నా నొక రోజున. వ్యంగ్యాత్మక కథలతో సతమతమవుతున్న తొలి కాలంలో కొంత ఉద్రేకంతోనే అన్నాను. "నేరం చేసిన జంటనే కాకుండా అప్పటికింకా పుట్టని ముందు తరాల అమాయకుల్ని కూడా ఎందుకు శిక్షించాడు దేవుడు?"

గురుదేవులకు నా అజ్ఞానంకంటె కూడా నా మాటల్లో తీవ్రతకే నవ్వు వచ్చింది. "సృష్టిప్రకరణం (జెనిసిస్) చాలా గహనమైన ప్రతీకలతో కూడి ఉన్నది కేవలం శబ్దార్థ వివరణవల్ల అవగాహన కాదు," అని వివరించారు. "దాంట్లో చెప్పిన 'జీవనవృక్షం' మానవదేహం. వెనుబాము, తలకిందులుగా ఉండే చెట్టు లాంటిది మనిషి తలవెంట్రుకలు దానికి వేళ్ళు; అంతర్వాహక బహిర్వాహక నాడులు దానికి కొమ్మలు. నాడీమండలమనే వృక్షానికి మనం అనుభవించి ఆనందించదగ్గ ఫలాలు చాలా కాస్తాయి. శబ్ద స్పర్శరూప రసగంధాలనే ఇంద్రియ జ్ఞానాలే ఆ ఫలాలు మనిషి వీటిని హక్కుభుక్తం చేసుకోవచ్చు. కాని అతనికి, 'తోటమధ్య'లో అంటే దేహం 'మధ్యలో' ఉన్న 'ఆపిల్' పండు, అంటే లైంగికానుభవం, నిషిద్ధం.*

"అందులో చెప్పిన 'సర్పం', లైంగిక నాడుల్ని ఉద్రేకపరిచే వెనుబాములోని శక్తిని, సూచిస్తుంది. 'ఆదాము' వివేకానికి సంకేతం; 'అవ్వ' అనుభూతికి సంకేతం ఏ మనిషిలోనయినా భావోద్రేకాన్ని అంటే స్త్రైణ స్పృహను, కామవాంఛ లోబరుచు కున్నట్లయితే అతని వివేకం, అంటే ఆదాము నశించక తప్పదు.†

"దేవుడు తన సంకల్పబలంతో స్త్రీ పురుష శరీరాల్ని రూపొందించి మానవ జాతిని సృష్టించాడు. ఈ కొత్తజాతికి ఆయన, తన మాదిరి 'నిష్కళంక' రీతిలో లేదా దివ్యరీతిలో పిల్లల్ని సృష్టించే శక్తి ప్రసాదించాడు.‡ అంతవరకు వ్యష్టిగా పరమాత్మ ఆవిర్భావం సహజాతబద్ధమై, సంపూర్ణ తార్కిక వివేక శక్తులు లేని

* "మనం తోటలో ఉన్న చెట్లపండ్లు తినవచ్చు ; కాని తోట మధ్యలో ఉన్న చెట్టు పండు మాత్రం మీరు తినగూడదనీ, మీలో ఏ ఒక్కరూ కూడా దాన్ని ముట్టుకోగూడదనీ లేకపోతే చనిపోతారనీ దేవుడు చెప్పాడు." - జెనిసిస్ 3·2-3 (బైబిలు).

† "నాకు తోడుగా ఉండడానికి నువ్విచ్చిన ఆడది ఆ చెట్టుపండు నాకు ఇచ్చింది నేను తిన్నాను ఆ పాము నన్ను మభ్యపెట్టింది, నేను తిన్నాను అందా ఆడది" - జెనిసిస్ 3 12-13 (బైబిలు).

‡ ఆ ప్రకారంగా దేవుడు మనిషిని తనకు ప్రతిరూపంగా సృష్టించాడు· దేవుడి రూపంలోనే అతన్ని సృష్టించాడు; స్త్రీ పురుషుల్ని సృష్టించాడు. దేవుడు వాళ్ళని దీవించాడు; వాళ్ళతో ఇలా చెప్పాడు : ఫలవంతులై వంశాభివృద్ధి చెయ్యండి. భూమిని సుసంపన్నం చెయ్యండి దాన్ని లోబరుచుకోండి." - జెనిసిస్ 1.27-28 (బైబిలు).

జంతువుకే పరిమితమై ఉంది. అందువల్ల భగవంతుడు మొట్టమొదట మానవ శరీరాల్ని సృష్టించి, వాటికి సాంకేతికంగా ఆదాము, అవ్వ (ఏడమ్ అండ్ ఈవ్) అని పేర్లు పెట్టాడు. ఊర్ధ్వగతిలో లాభకరమైన పరిణామం కోసం రెండు జంతువుల ఆత్మల్ని లేదా దివ్యసారాన్ని వాళ్ళలోకి ప్రవేశపెట్టాడు.*

ఆదాములో, అంటే పురుషుడిలో, వివేకం ప్రాధాన్యం వహించింది. అవ్వలో, అంటే స్త్రీలో, అనుభూతి ప్రాధాన్యం వహించింది. ఆ ప్రకారంగా భౌతిక లోకాలకు ఆధారభూతమై ద్వంద్వం లేదా ధ్రువత్వం అభివ్యక్తమయింది. పశు ప్రవృత్తిపరమైన కుండలినీశక్తి మానవ మనస్సును ఏమార్చనంతకాలం వివేకం, అనుభూతి పరస్పర సహకారంతో ఆనంద స్వర్గధామంలో విహరిస్తాయి.

"కనక, మానవ శరీరం, కేవలం జంతువులనుంచి పరిణామ ఫలితంగా ఏర్పడ్డది కాదు; దేవుడి విశిష్ట సృష్టిద్వారా ఉత్పన్నమయినది. జంతురూపాలు సంపూర్ణ దివ్యత్వాన్ని వ్యక్తం చెయ్యలేనంత స్థూలమైనవి. మానవుడికి మెదడులో సర్వజ్ఞతా శక్తిసంపన్నమైన 'సహస్రారకమలం', వెన్నులో సున్నితంగా జాగృతమైన షట్చక్రాలు - విశిష్టంగా ప్రసాదించడం జరిగింది.

"తొలుత సృష్టించిన జంటలో నెలకొన్న దేవుడు, లేదా దివ్యచేతన, మానవ ఇంద్రియానుభూతులన్నిటినీ అనుభవించమని, చెప్పడం జరిగింది - ఒక్క కామ వాసనల్ని తప్ప.† వంశవృద్ధికోసం, మానవులు హీనస్థాయి జంతుపద్ధతికి బందీలవకుండా ఉండడం కోసమే వీటిని నిషేధించడం జరిగింది. అవచేతన మనస్సులో పశుప్రవృత్తి సంబంధమైన వాసనలు మళ్ళీ తలఎత్తకుండా చెయ్యడం కోసం దేవుడు చేసిన హెచ్చరికను మనిషి చెవిని పెట్టలేదు. ఆదాము, అవ్వ సంతానోత్పత్తి కోసం జంతు సహజమైన మార్గాన్ని అనుసరించి, పరిపూర్ణ మూల మానవుడికి సహజమైన స్వర్గానందస్థితి నుంచి పతనమయారు. "తాము నగ్నంగా ఉన్నామని తెలిసి"నప్పుడు, దేవుడు హెచ్చరించినట్టుగానే, వాళ్ళలో అమరత్వబోధ నశించింది. శారీరకమైన పుట్టుక తరవాత శారీరకమైన గిట్టుక రావాలన్న భౌతికశాస్త్ర నియమానికి వాళ్ళు బానిసలయిపోయారు.

---

* "దేవుడు నేలమీది మట్టితో మనిషిని తయారుచేశాడు; అతని ముక్కు రంధ్రాల్లోకి ఊపిరి ఊదాడు ; అప్పుడు మనిషి జీవించే ఆత్మ అయాడు." - జెనిసిస్ 2 7 (బైబిలు)

† "అప్పుడు సర్పం (లైంగిక శక్తి) భూమి మీదున్న జంతువులన్నిటికన్న (శరీరంలోని ఇంద్రియాలన్నిటికన్న) చాలా సూక్ష్మంగా (చతురంగా, ధూర్తంగా) తయారయింది " - జెనిసిస్ 3 1 (బైబిలు).

"అవ్వకు 'సర్పం' ఇవ్వజూపిన 'మంచి - చెడ్డ'ల జ్ఞానం మాయలో మర్త్యులు అనుభవించి తీరవలసిన ద్వంద్వ భావాత్మకమైన, లేదా పరస్పర విరుద్ధమైన అనుభవాల్ని సూచిస్తుంది. మానవుడు, స్త్రీ - పురుష చైతన్యం లేక అనుభూతి వివేకాల్ని దుర్వినియోగం చేసినందువల్ల భ్రాంతిలో పడి, దివ్య స్వయంసమృద్ధి అనే స్వర్గవాటికలోకి ప్రవేశించే హక్కు కోల్పోయాడు.* తన 'తల్లిదండ్రుల్ని' అంటే ద్వంద్వప్రకృతిని ఏకీకృత సామరస్యానికి, అంటే ఈడెన్ వాటికకు, చేర్చి అక్కడ పునఃప్రతిష్ఠ చెయ్యవలసిన వ్యక్తిగతమైన బాధ్యత ప్రతి మానవుడి మీదా ఉంది '

శ్రీయుక్తేశ్వర్‌గారు తమ ప్రసంగాన్ని ముగించగానే నేను, జెనిసిస్ గ్రంథం పుటలవేపు కొత్త గౌరవంతో చూశాను.

"పూజ్య గురుదేవా, ఆదాము అవ్వల సంతానంగా వారిపట్ల నెరవేర్చవలసిన సముచితమైన కర్తవ్యం నా హృదయంలో ఇప్పుడు మొట్టమొదటిసారిగా స్పందిస్తోంది."†

---

* ప్రభువైన దేవుడు ఈడెన్‌లో తూర్పువైపున ఒక తోట పెంచాడు. తాను రూపొందించిన మానవుణ్ణి అక్కడ ఉంచాడు." - జెనిసిస్ 2-8 "అందువల్ల ప్రభువైన దేవుడు, ఏ నేలమీది మట్టితో అతన్ని చేశాడో ఆ నేలనే తవ్వుకోమని వెంటనే అతన్ని ఈడెన్ తోటలోంచి పంపేశాడు" - జెనిసిస్ 3 23

† హిందువుల "ఆదాము - అవ్వల" కథ శ్రీమద్భాగవతమనే సనాతన పురాణ గ్రంథంలో వర్ణించడం జరిగింది. మొట్టమొదటి పురుషుణ్ణి స్త్రీనీ (భౌతిక రూపంలో ఉండడంవల్ల) స్వాయంభువ మనువు ("సృష్టికర్తలోంచి పుట్టిన మనిషి") అనీ అతని భార్య శతరూప అనీ పిలిచేవారు వారి సంతానం ఐదుగురికీ ప్రజాపతులతో (స్థూల శరీరరూప ధారణకు సమర్థులైన పూర్ణ జీవులు) అంతర్వివాహం జరిగింది. ఈ ప్రథమ దివ్య కుటుంబాల నుంచి మానవజాతి ఉద్భవించింది.

క్రైస్తవ పవిత్ర గ్రంథాల్ని అత్యంత గాఢమైన ఆధ్యాత్మిక అంతర్దృష్టితో శ్రీయుక్తేశ్వర్‌గారు వ్యాఖ్యానించినట్టుగా ప్రాచ్యదేశాల్లోకాని పాశ్చాత్యదేశాల్లో కాని మరొకరు వ్యాఖ్యానించినట్టుగా నే నెన్నడూ వినలేదు " ' నేనే మార్గం నేనే సత్యం నేనే జీవం : నా ద్వారానే తప్ప మరొక విధంగా ఎవ్వడూ తండ్రి దగ్గిరికి చేరడు.' (యోహాను 14 6) వంటి వాక్యాల్లో క్రీస్తు చెప్పిన మాటలకు దైవ శాస్త్రజ్ఞులు తప్పుడు వ్యాఖ్యానాలు చేశారు," అని చెప్పారు మా గురుదేవులు "తానొక్కడే దేవుడి కుమారుడన్న అభిప్రాయం క్రీస్తుకు ఎన్నడూ లేదు ; కాని మానవుడు ఎవడైనా సరే మొట్టమొదట 'కుమార' తత్త్వంగా రూపుగట్టకపోతే అంటే సృష్టిలో కార్యప్రేరకమైన కూటస్థ చైతన్యంగా రూపుదాల్చకపోతే, నిర్గుణ పరబ్రహ్మను, అంటే సృష్టికి అతీతంగా ఉన్న పరమపితను చేరుకోలేడు. కూటస్థ చైతన్యంతో సంపూర్ణ ఏకీభావం సాధించిన ఏసు అంతకు చాలా కాలం క్రితమే అతని అహంభావం కరిగిపోయినందువల్ల ఆ చైతన్యంతో తాదాత్మ్యం చెందాడు "

---

"దేవుడు...ఏసుక్రీస్తు ద్వారా సమస్త వస్తువులూ సృష్టించాడు" (ఎఫేసియన్స్ 3 9) అని పాల్ రాసినప్పుడూ, "అబ్రహాం కన్న ముందు కూడా నే నున్నాను" (యోహాను 8 58) అని ఏసుక్రీస్తు అన్నప్పుడూ, ఆ మాటల్లో సారాంశం, వ్యక్తిత్వలయమే. చూ.పే. 190 అధోజ్ఞాపిక.

ఒక రకమయిన ఆధ్యాత్మిక పిరికితనం వల్ల చాలమంది ప్రాపంచిక జనులు కేవలం ఒక మనిషి మాత్రమే "దేవుని కుమారుడు" అనే సౌఖ్యప్రదమైన నమ్మకం పెంపొందించుకుంటారు. వాళ్ల తర్కమేమిటంటే "క్రీస్తుది విశిష్టమైన జన్మ సామాన్య మానవుణ్ణయిన నేను ఆయన్ని ఎలా అనుకరించగలను? ' అని. కాని, అందరూ దివ్యంగానే సృష్టించబడ్డారు· ఏదో ఒకనాడు క్రీస్తు ఇచ్చిన ఈ ఆజ్ఞని అందరూ పాటించవలసినదే, "అందుచేత, స్వర్గములోని మీ తండ్రి పరిపూర్ణు డయినట్లుగా, మీరునూ పరిపూర్ణులు కండి". (బైబిలు, మత్తయి 5 48) "ఆహా, మనము దైవ కుమారులముగా పిలువబడడానికి, దేవుడు మనమీద ఎటువంటి ప్రేమను కురిపించాడో కదా! ' I యోహాను 3.1 (బైబిలు).

కర్మ సిద్ధాంతాన్ని గురించి, దానికి పర్యవసానమైన పునర్జన్మ సిద్ధాంతాన్ని గురించి అవగాహన బైబిలులో అనేక సందర్భాల్లో కనబరచడం జరిగింది చూడండి. పే. 458లో అధో జ్ఞాపిక 565-66 మరియు 43వ అధ్యాయం. ఉదా : "ఒకడి నెత్తురు పారించినవాడు, ఆ మనిషి వల్లనే తన నెత్తురు ఓడుస్తాడు.' (జెనిసిస్ 9 6) ప్రతి హంతకుడూ "మనిషివల్లనే ' తను చావాలంటే, ఈ ప్రతిక్రియా ప్రక్రియకు సహజంగా, అనేక సందర్భాల్లో ఒక జీవితంకన్న ఎక్కువ కాలం అవసరం. ఈ కాలపు పోలీసు వాళ్ళు అంత చురుకుగా లేరు.

క్రైస్తవ జ్ఞేయవాదులూ (నాస్టిక్స్) క్లెమెంట్ ఆఫ్ అలెగ్జాండ్రియా, సుప్రసిద్ధుడైన ఓరిజెన్ (ఇద్దరూ 3వ శతాబ్దివారే), సెంట్ జెరోమ్ (5వ శతాబ్ది)లతో సహా అసంఖ్యాకులైన క్రైస్తవ ధర్మ ప్రచారకులు ప్రతిపాదించిన పునర్జన్మ సిద్ధాంతాన్ని తొలికాపు క్రైస్తవ ధర్మ సంప్రదాయవాదులు అంగీకరించారు. ఈ సిద్ధాంతాన్ని ధర్మ విరుద్ధమని మొట్టమొదట ప్రకటించినది, క్రీ శ. 553 లో కాన్స్టాంటినోపిల్‌లో ఏర్పాటయిన రెండో పరిషత్తు ఈ పునర్జన్మ సిద్ధాంతం మనిషి తక్షణ మోక్షం పొందేందుకు కృషి చెయ్యాలని ప్రోత్సహించడానికి అలవికానంత ఎక్కువ దేశ, కాల వ్యవధి ఇస్తోందని ఆ రోజుల్లో క్రైస్తవులు భావించారు కాని సత్యాన్ని అణిచిపెట్టడంవల్ల అనేకమైన పొరపాట్లు జరిగి చిరాకుపెడతాయి. ఎంతో విశిష్టంగా సంపాదించి, ఎంతో త్వరగా శాశ్వతంగా పోగొట్టుకొనే "ఒక జీవిత కాలాన్ని" లక్షలాది జనం, ప్రపంచంలో తాము సుఖించడానికి వినియోగించుకున్నారే కాని, దేవుణ్ణి అన్వేషించడానికి వినియోగించుకోలేదు మానవుడు దేవుడి కుమారుడుగా తన హోదాను తిరిగి సప్రయత్నంగా సాధించేవరకు ఈ భూమి మీద మళ్ళీమళ్ళీ పుడుతూ ఉండవలసిందే - ఇది సత్యం

అధ్యాయం : 17

# శశి, మూడు నీలాలు

"నువ్వూ మా అబ్బాయీ శ్రీయుక్తేశ్వర స్వామి గారి గురించి ఎంతో గొప్పగా తలుస్తున్నారు గనక ఆయన్నోసారి చూస్తాను నేను," అన్నారు డా నారాయణ చందర్ రాయ్‌గారు. ఆయన కంఠస్వరంలో మందబుద్ధుల ముచ్చట చెల్లించే ధోరణి ధ్వనించింది. అయితే, అవతలివాళ్ళని తన మతంలోకి మార్చడానికి ప్రయత్నించే ప్రచారకుడు పాటించే సత్సంప్రదాయాన్ని అనుసరించి నేను, నా కోపాన్ని పైకి కనిపించకుండా చేసుకున్నాను.

పశువైద్యులుగా ఉన్న డా॥ రాయ్‌గారు, పక్కా, అజ్ఞేయవాది (అగ్నాస్టిక్). ఆయన చిన్న కొడుకు సంతోష్, వాళ్ళ నాన్న గారి విషయంలో కాస్త శ్రద్ధ తీసుకోమని నన్ను ప్రాధేయపడ్డాడు. ఇంతవరకు నా అమూల్యమైన సహాయం అదృశ్యంగానే ఉంటూ వచ్చింది.

ఆ మర్నాడు డా॥ రాయ్ నాతో శ్రీరాంపూర్ ఆశ్రమానికి వచ్చారు. తమను కలుసుకోడానికి గురుదేవులు ఆయనకి అనుమతి ఇచ్చిన తరవాత, వారు కలిసిన కొద్దిసేపూ ఇద్దరి మధ్యా మాటామంతీ లేకుండానే గడిచిపోయింది. చూడవచ్చినాయన హఠాత్తుగా లేచి వెళ్ళి పోయారు.

"చనిపోయినవాణ్ణి ఆశ్రమానికెందుకు తీసుకురావడం?" అంటూ నావేపు పట్టిపట్టి చూశారు గురుదేవులు, ఆ కలకత్తా సంశయాళువు వెళ్ళిపోయాక తలుపు మూసెయ్యగానే.

"గురుదేవా, ఆ డాక్టరుగారు సలక్షణంగా జీవించే ఉన్నారు కదండీ!"

"కాని త్వరలో చనిపోతాడు."

ఆ మాటకు నేను అదిరిపడ్డాను. "ఆయన కొడుక్కిది పెద్ద దెబ్బ అవుతుంది. వాళ్ళ నాన్నగారి భౌతికవాద భావాల్ని మార్చడానికి టైము వస్తుందని సంతోష్

ఆశిస్తున్నాడు. ఆయనకి ఎలాగయినా మీరు సాయం చెయ్యాలని వేడుకుంటున్నాను."

"సరే - నీకోసం." గురుదేవుల ముఖంలో ఉత్సాహమేమీ లేదు.

"ఈ పొగరుబోతు గుర్రాల డాక్టర్‌కి మధుమేహం బాగా ముదిరింది; ఆ సంగతి ఇతనికి తెలియదు. పదిహేనురోజుల్లో మంచం పడతాడు. ఇంక ఇతని పని అయిపోయినట్టేనని వదిలేస్తారు వైద్యులు; ఇతను ఈ లోకం విడిచిపోవడానికి సహజంగా నిర్ణయమైన కాలం, ఈ వేళటికి ఆరు వారాలు. అయినా నువ్వు కలగజేసుకున్నావు కాబట్టి ఆ రోజున కోలుకుంటాడు. కాని ఒక్క షరతు; అతను గ్రహశాంతికోసం దండకడియం ఒకటి వేసుకునేటట్టు చెయ్యాలి. అయితే ఆపరేషను చెయ్యబోయేముందు గుర్రం ఎంత తీవ్రంగా విజృంభించి ప్రతిఘటిస్తుందో, అంత తీవ్రంగానూ అతను దాన్ని ప్రతిఘటిస్తాడనడంలో సందేహం లేదు," అంటూ ముసిముసిగా నవ్వారు గురుదేవులు.

డాక్టరుగారు దండకడియం వేసుకునేటట్టుగా బుజ్జగించి ఒప్పించడానికి, నేనూ సంతోషూ ఎలా ఒడుపులు వెయ్యాలా అని నేను ఆలోచిస్తూ ఉండగా శ్రీయుక్తేశ్వర్‌గారు మరికొన్ని రహస్యాలు వెల్లడించారు.

"ఆరోగ్యం మెరుగయిన తరవాత ఆయన్ని మాంసం తినొద్దని చెప్పు. అయినా నీ సలహా చెవిని పెట్టడనుకో; ఇంకో ఆరు నెల్లలో, తన ఆరోగ్యం అద్భుతంగా ఉందని అనుకునే రోజుల్లోనే చటుక్కున రాలిపోతాడు," అని చెబుతూ మా గురుదేవులు, ఆయుర్దాయంలో ఈ ఆరునెల్ల పొడిగింపూ నువ్వు బతిమాలడం వల్లనే మంజూరయింది," అని కూడా అన్నారు.

మరుసటి రోజున, కడియం చెయ్యడానికి ఒక కంసాలికి పురమాయించమని సంతోష్‌కు చెప్పాను. ఒక వారానికల్లా అది సిద్ధమైంది. కాని డా॥ రాయ్‌గారు దాన్ని వేసుకోనన్నారు.

"నా ఆరోగ్యం భేషుగ్గా ఉంది. జ్యోతిషానికి సంబంధించిన ఈ మూఢ విశ్వాసాలతో నన్ను మభ్యపెట్టలేవు." డాక్టరుగారు నావేపు కొరకొరా చూశారు.

గురుదేవులు ఈయన్ని మొండికేసిన గుర్రంతో పోల్చడం సబబుగానే ఉందన్న సంగతి గుర్తుకు వచ్చి నవ్వుకున్నాను. మరో ఏడు రోజులు గడిచాయి; డాక్టరుగారు హఠాత్తుగా జబ్బు పడ్డారు. దాంతో ఆయన మెత్తబడి, కడియం వేసుకోడానికి ఒప్పుకున్నారు. మరో రెండు వారాలకి, ఆయనకి వైద్యం చేస్తున్న డాక్టరు, ఆయన మీద ఇంక ఆశ లేదని నాతో చెప్పాడు. మధుమేహం వల్ల లోలోపల కలిగే భయంకరమైన దుష్పరిణామాలు వివరించాడు.

నేను తల ఆడించాను. "ఒక నెల్లాళ్ళు జబ్బుతో బాధపడ్డ తరవాత డా॥ రాయ్‌గారికి మెరుగవుతుందని మా గురువుగారు చెప్పారండి," అన్నాను.

ఆ డాక్టరు నా మాట నమ్మలేనట్టుగా నావేపు చూశారు. మరో పదిహేను రోజుల తరవాత ఆయన నన్ను కలిసి క్షమించమనే ధోరణిలో ఇలా అన్నారు:

"డాక్టర్ రాయ్‌గారు పూర్తిగా కోలుకున్నారు!" అంటూ ఆశ్చర్యం ప్రకటించారు. "నా అనుభవంలో ఇంతకన్న ఆశ్చర్యకరమైంది మరొకటి లేదు. ఇక రేపోమాపో అనిపించేటట్టున్నవాడు ఇంత చిత్రంగా కోలుకోడం ఎన్నడూ చూడలేదు మీ గురువుగారు నిజంగా రోగాలు నయం చేసే ప్రవక్త అయి ఉండాలి!'

డా రాయ్‌గారిని ఒకసారి కలుసుకొని, మాంసం కలవని భోజనం చెయ్యమని శ్రీయుక్తేశ్వర్‌గారు ఇచ్చిన సలహా మళ్ళీ గుర్తుచేసి వచ్చిన తరవాత ఆరు నెలలదాకా ఆయన్ని చూడలేదు. ఒకనాడు సాయంత్రం నేను మా ఇంటి వసారాలో కూర్చుని ఉండగా, ఆయన మా ఇంటిదగ్గర కాసేపు మాట్లాడిపోదామని ఆగారు.

"మీ గురువుగారికి చెప్పు; తరచు మాంసం తింటూండడం వల్లే నేను పూర్తిగా బలం పుంజుకున్నానని. పథ్యాన్ని గురించి ఆయనకున్న శాస్త్ర విరుద్ధమైన అభిప్రాయాలు నా మీద పనిచెయ్యలేదు." నిజమే; డాక్టర్ రాయ్‌గారు ఆరోగ్యం రూపుగట్టినట్టున్నారు.

కాని ఆ మర్నాడే సంతోష్ పక్క వీధిలోఉన్న వాళ్ల ఇంటినించి నా దగ్గరికి పరిగెత్తుకుంటూ వచ్చి, "నాన్నగారు పొద్దునే పోయారు!" అని చెప్పాడు.

గురుదేవులతో నాకున్న అనుభవాల్లో అతి విచిత్రమైన వాటిలో ఇది ఒకటి. ఆ పొగరుబోతు పశువైద్యుడు ఎంత అపనమ్మకంగా ఉన్నప్పటికీ గురుదేవులు ఆయనకి నయంచేశారు; ఆయన ఆయుర్దాయాన్ని మరో ఆరు నెలలు పొడిగించారు. నేను ప్రాధేయపడి కోరినందువల్లే ఇది జరిగింది. భక్తుల గాఢమయిన ప్రార్థనలు మన్నించడంలో శ్రీయుక్తేశ్వరులు చూపే దయకు అవధులు ఉండేవి కావు.

మా కాలేజి స్నేహితుల్ని గురుదేవుల దర్శనానికి తీసుకురావడం నాకు గర్వకారణంగా ఉండేది. వాళ్ళలో చాలామంది, మత విషయపరమైన సంశయశీలత అనే, విద్యావంతుల షోకు ముసుగును - కనీసం ఆశ్రమంలో! - తీసి పక్కకు పెట్టేసేవారు.

మా స్నేహితుల్లో ఒకడు శశి. చాలాసార్లు వారం చివరి సెలవు రోజులు శ్రీరాంపూర్‌లో హాయిగా గడిపేవాడు. గురుదేవులకు వాడంటే వల్లమాలిన ఇష్టం కలిగింది. కాని వాడి ఆంతరంగిక జీవితం విచ్చల విడిగా, అడ్డదిడ్డంగా ఉన్నం దుకు ఆయన నొచ్చుకునేవారు.

"శశీ, నువ్వు కనక సరిగా మారకపోతే, ఇంకొక్క ఏడాదిలో నీకు చాలా పెద్ద జబ్బు చేస్తుంది." శ్రీయుక్తేశ్వర్‌గారు మా స్నేహితుడివేపు, ఆప్యాయతతో కూడిన ఆగ్రహంతో చూశారు. "దీనికి ముకుందుడు సాక్షి; ముందే హెచ్చరించ లేదని తరవాత నన్ననకు."

శశి నవ్వాడు. "గురుదేవా, నాలాంటి దురదృష్టవంతుడి విషయంలో దేవుడు దయతలిచేలా చేసే భారం మీమీదే పెడుతున్నాను! నా అంతరాత్మ అంగీక రిస్తోంది, కాని నా మనస్సు బలహీనంగా ఉంది. ఈ లోకంలో మీ రొక్కరే నాకు రక్షకులు; మరి దేన్నీ నేను నమ్మను."

"కనీసం రెండు కారెట్ల నీలం ఒకటి ధరించాలి నువ్వు. అది నీకు సాయ పడుతుంది."

"అది కొనే తాహతు నాకు లేదండి. అయినా గురుదేవా, కష్టం వస్తే మీరు తప్పకుండా నన్ను కాపాడతారని సంపూర్ణంగా విశ్వసిస్తున్నాను."

"ఇంకో ఏడాదిలో నువ్వు మూడు నీలాలు తెస్తావు," అని చెబుతూ శ్రీయుక్తేశ్వర్‌గారు, "అప్పుడింక వాటితో పని ఉండదు," అని కూడా అన్నారు.

తరచుగా కొద్ది మార్పులతో ఈ సంభాషణ జరుగుతూ ఉండేది. నవ్వొచ్చే నిరాశతో, " నేను మారలేను!" అంటుండేవాడు శశి. "అయినా గురుదేవా, మీ మీద నాకున్న విశ్వాసం, రాయికన్న నాకు అమూల్యమయింది!"

ఒక ఏడాది గడిచింది. ఒకనాడు మా గురుదేవులు కలకత్తాలో నరేన్‌బాబు అనే శిష్యుడి ఇంట్లో ఉండగా నేను ఆయన దర్శనానికి వెళ్ళాను. పొద్దుట సుమారు పది గంటలవేళ, శ్రీయుక్తేశ్వర్‌గారూ నేనూ రెండో అంతస్తులో కూర్చుని ఉండగా వీధి గది తలుపు తెరుచుకున్న అలికిడి అయింది. గురుదేవులు బింకంగా నిటారుగా మారారు.

"ఆ వచ్చినవాడు శశి," అన్నారు గంభీరంగా. "ఇప్పటితో ఏడాది గడిచి పోయింది. అతని ఊపిరితిత్తులు రెండూ చెడిపోయాయి. అతను నా మాట లెక్కపెట్టలేదు. నే నిప్పుడు చూడదలుచుకోలేదని అతనికి చెప్పు."

శ్రీయుక్తేశ్వర్‌గారి నిష్ఠురతకు నేను కొంచెం కొయ్యబారి, గబగబా మెట్లు మీంచి కిందికి పరిగెత్తాను. శశి మెట్లెక్కుతున్నాడు.

"ఓ ముకుందా! గురువుగారు ఇక్కడే ఉన్నారనుకుంటాను. నా మనసు కలా అనిపించింది."

"ఉన్నారు. కాని ఇప్పుడెవరూ ప్రశాంతికి భంగం కలిగించడం ఆయనకు ఇష్టం ఉండదు."

శశికి గభాలున కళ్ళనీళ్ళు వచ్చాయి. నన్ను దూసుకుంటూ పైకి వెళ్ళాడు శ్రీయుక్తేశ్వర్‌గారి కాళ్ళమీద పడి, అందమైన మూడు నీలాలు అక్కడ పెట్టాడు

"సర్వజ్ఞులైన గురుదేవా, నాకు ఊపిరితిత్తులకు సంబంధించిన క్షయరోగం వచ్చిందని డాక్టర్లు అంటున్నారు. ఇంక మూడునెల్లే ఆయుర్దాయ ముందంటు న్నారు. మీ సహాయం కోసం సవినయంగా ప్రాధేయపడుతున్నాను; మీరు నయం చెయ్యగలరని నాకు తెలుసు!"

"నీ జీవితాన్ని గురించి ఆందోళనపడ్డానికి ఇప్పటికే కాస్త ఆలస్యం కాలేదూ? నీ మణులు నువ్వు తీసుకువెళ్ళిపో; వాటి ఉపయోగం అయిపోయింది." ఆ తరవాత గురుదేవులు మాటాపలుకూ లేకుండా బింకంగా కూర్చున్నారు. మధ్యమధ్య ఆ అబ్బాయి దయతలచమని ఆక్రందన చేస్తున్నాడు.

రోగనివారణ చేసే దివ్యశక్తి మీద శశికి ఉన్న విశ్వాసం ఎంత గాఢమైనదో కేవలం పరీక్షించడానికే శ్రీయుక్తేశ్వర్‌గారు ఇలా చేస్తున్నారన్న దృఢవిశ్వాసం నా అంతర్బుద్ధికి స్ఫురించింది. బింకంగా గడిచిన ఒక గంట తరవాత, గురుదేవులు తమ కాళ్ళ దగ్గిర పడిఉన్న కుర్రవాడి మీద జాలి చూపులు ప్రసరించినప్పుడు నేను ఆశ్చర్యపోలేదు.

"లే శశీ! పరాయివాళ్ళింట్లో ఎంత కల్లోలం చేస్తున్నావు నువ్వు! ఈ నీలాలు దుకాణంలో తిరిగి ఇచ్చెయ్యి. వాటివల్ల అనవసరపు ఖర్చు ఇప్పుడు. అయితే గ్రహశాంతికి పనికివచ్చే కడియం తెచ్చి వేసుకో. భయపడకు; కొద్ది వారాల్లో నీకు నయమవుతుంది."

కన్నీళ్ళతో తడిసి ముద్దయిన శశి ముఖంలో విరిసిన చిరునవ్వు, నానిన నేలమీద చటుక్కున పడ్డ ఎండలా ఉంది. "గురుదేవా, డాక్టర్లు చెప్పిన మందులు వాడమంటారా?"

"నీ ఇష్టం - తాగినా సరే, పారబోసినా సరే; ఏదైనా పరవాలేదు. సూర్యుడూ చంద్రుడూ ఒకరి స్థానంలోకి మరొకరు మారడం ఎంత అసంభవమో, నువ్వు క్షయవల్ల చనిపోవడం అంత అసంభవం," అని చెప్పి శ్రీయుక్తేశ్వర్‌గారు చటుక్కున, "నేను మనస్సు మార్చుకోకముందే వెళ్ళిపో ఇంక!"

గాభరాగా వంగి నమస్కారంచేసి గబగబా వెళ్ళిపోయాడు మా స్నేహితుడు. ఆ తరవాతి వారాల్లో వాణ్ణి చూడ్డానికి నేను చాలాసార్లు వెళ్ళాను; కాని వాడి పరిస్థితి రానురాను మరీ దిగజారిపోతుండడం చూసి నివ్వెరపోయాను.

"శశికి ఈ రాత్రి గడవదు," అంటూ వైద్యుడన్న మాటలూ, దాదాపు ఎముకల గూడులా దిగనారిపోయిన వాడు కనిపిస్తున్న తీరూ చూసి ఉండబట్టలేక నేను హుటాహుటిని బయలుదేరి శ్రీరాంపూర్ వెళ్ళాను. నేను కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ చెప్పిన సమాచారమంతా ఉదాసీనంగా విన్నారు.

"నన్ను ఇబ్బంది పెట్టడానికి ఎందుకొస్తావిక్కడికి? శశి కోలుకుంటాడని నేను హామీ ఇవ్వడం నువ్వు విన్నావే!"

నేను అత్యంత భక్తిశ్రద్ధలతో ఆయనకు ప్రణామంచేసి గుమ్మం దగ్గరికి వెళ్ళాను. శ్రీయుక్తేశ్వర్‌గారు వీడుకోలు మాట ఏమీ చెప్పకుండా మౌనంలోకి వెళ్ళిపోయారు. రెప్పలార్పని ఆయన కళ్ళు అరవిచ్చి ఉన్నాయి; ఆయన చూపు లోకాంతరానికి పయనించింది.

వెంటనే నేను కలకత్తాలో శశి ఇంటికి వెళ్ళాను. మావాడు మంచం మీద కూర్చుని పాలు తాగుతూ ఉండడం చూసి ఆశ్చర్యపోయాను.

"ముకుందా! ఎంత అద్భుతం జరిగిందనుకున్నావు!" నాలుగు గంటల కిందట ఈ గదిలో గురుదేవుల ఉనికి నాకు అనుభవమయింది; వెంటనే నా భయంకర రోగ లక్షణాలన్నీ మటుమాయమయాయి. ఆయన దయవల్ల, నాకు పూర్తిగా బాగయినట్టు అనిపిస్తోంది."

కొద్ది వారాల్లో శశి బాగా ఒళ్ళు చేశాడు. అదివరకు ఎన్నడూ లేనంతగా వాడి ఆరోగ్యం మెరుగుపడింది.* అయితే రోగం నయమైన మీదట వాడి వైఖరిలో కృతఘ్నత మిళితమైంది; మళ్ళీ శ్రీయుక్తేశ్వర్ గారిని దర్శించడం అరుదైపోయింది! ఒకనాడు వాడు నాతో అన్నాడు. తన వెనకటి జీవన విధానానికి గాఢంగా పశ్చాత్తాప పడుతూ, గురుదేవుల ఎదుట పడాలంటే ముఖం చెల్లడం లేదని అన్నాడు.

---

* 1936లో శశి ఆరోగ్యం ఇప్పటికీ అద్భుతంగానే ఉందని ఒక స్నేహితుడు చెప్పగా విన్నాను.

అయితే, శశికి వచ్చిన జబ్బు ఒక పక్క వాడి సంకల్పశక్తిని దృఢంచేసి మరోపక్క వాడి నడతకు చెరుపుచేసి విరుద్ధ ఫలితాలు చూపించిందని నాకు నిర్ధారణ అయింది.

స్కాటిష్ చర్చి కాలేజిలో నా మొదటి రెండేళ్ళ చదువూ పూర్తి కావచ్చింది తరగతి గదుల్లో నా హాజరు అరుదయిపోయింది. నేను సాగించిన కొద్దిపాటి చదువూ ఇంట్లో పోరులేకుండా చేసుకోడానికే. నా ప్రయివేటు ట్యూటర్లు ఇద్దరూ యథావిధిగా వస్తూండేవారు; నేను మాత్రం యథావిధిగా గైర్‌హాజరు· నా విద్యాభ్యాస జీవితంలో కనిపించే క్రమబద్ధత ఇదొక్కటే అనుకుంటాను!

భారతదేశంలో కాలేజిలో రెండేళ్ళ చదువు పూర్తిచేసి ఉత్తీర్ణులయితే ఇంటర్మీడియట్ ఆర్ట్స్ డిప్లమా వస్తుంది ఆ తరవాత విద్యార్థి, మరో రెండేళ్ళు బి.ఏ. డిగ్రీకోసం ఎదురు చూడవచ్చు.

ఇంటర్మీడియట్ ఆర్ట్స్ చివరి పరీక్షలు అరిష్టంలా ఎదుట కనిపిస్తున్నాయి వెంటనే పూరీ పరిగెత్తాను. మా గురుదేవులు కొన్ని వారాలుగా అక్కడుంటున్నారు పోన్లే, నువ్వు చివరి పరీక్షలకి వెళ్ళక్కర్లేదని ఆయన అంటారేమోనని రవ్వంత ఆశపడుతూ, నేనా పరీక్షలకి బొత్తిగా సిద్ధంకాకుండా ఉన్నానన్న సంగతి ఆయనకి నివేదించుకున్నాను.

శ్రీయుక్తేశ్వర్‌గారు చిరునవ్వు నవ్వుతూ నన్ను సముదాయించారు. "నువ్వు మనసారా ఆధ్యాత్మిక సాధన చేశావు. అంచేత కాలేజి చదువు ఉపేక్షించకుండా ఉండలేకపోయావు. వచ్చేవారం మాత్రం జాగ్రత్తగా పుస్తకాల్లో మునిగి ఉండు ఓటమి లేకుండా గండం దాటతావు."

అప్పుడప్పుడు నాలో సహేతుకంగా తల ఎత్తే సందేహాల్ని అణిచేసుకుంటూ కలకత్తాకు తిరిగి వచ్చాను. నా బల్లమీదున్న పుస్తకాల గుట్టను పరకాయిస్తూ నట్టడివిలో దారి తప్పిన బాటసారిలా ఆందోళన పడ్డాను.

చాలాసేపు ధ్యానం చేసిన మీదట నాకు శ్రమను తగ్గించే ఉత్తేజం కలిగింది. ప్రతి పుస్తకం అలవోకగా తెరిచి, ఎదుట కనిపించిన పుటలు మాత్రమే చదువుతూ వచ్చాను. ఇలా రోజుకు పద్దెనిమిది గంటల చొప్పున వారం రోజులపాటు ఈ పద్ధతి కొనసాగించే సరికి కంఠస్థం చెయ్యడమన్న కళలో నేను ఆరితేరానని పించింది.

అడ్డాదిడ్డిగా కనిపించే నా దైవాధీనం చదువును, పరీక్ష హాళ్ళలో గడిచిన ఆ తరవాతి రోజులే సబబని నిరూపించాయి. పరీక్షలన్నీ ప్యాసయాను, వెంట్రుక

వాసిలో ప్రమాదం తప్పించుకొని. నా స్నేహితులూ మా ఇంట్లో వాళ్ళూ కురిపించిన అభినందనల్లో, నమ్మశక్యం కానిదేదో జరిగినప్పుడు కనబరిచే ఆశ్చర్యం కూడా పొడగట్టింది.

పూరీనుంచి తిరిగివచ్చిన తరవాత శ్రీయుక్తేశ్వర్‌గారు నన్ను ఆనంద చకితుణ్ణి చేశారు.

"ఇంక నీ కలకత్తా చదువు అయిపోయింది. యూనివర్సిటీ చదువులో చివరి రెండేళ్ళూ నీకు ఇక్కడే, శ్రీరాంపూర్‌లో సాగేటట్టు చూస్తాను."

నేను బిత్తరపోయాను. "గురుదేవా, ఈ ఊళ్ళో బాచిలర్ ఆఫ్ ఆర్ట్స్ కోర్సు లేదండి," అన్నాను. ఉన్నత విద్య బోధించే ఏకైక సంస్థ అయిన శ్రీరాంపూర్ కాలేజిలో రెండేళ్ళ ఇంటర్మీడియట్ కోర్సే ఉంది.

గురువుగారు కొంటెగా చిరునవ్వు నవ్వారు. "నీ కోసం బి.ఏ. కాలేజి పెట్టాలని చందాలు పోగు చెయ్యడానికి తిరగాలంటే ఈ ముసలి తనంలో నా వల్ల కాదు. ఈ పని మరొకరి ద్వారా ఏర్పాటు చేయించాలనుకుంటాను."

రెండు నెలల తరవాత శ్రీరాంపూర్ కాలేజి అధ్యక్షులు ప్రొఫెసర్ హోవెల్స్, నాలుగేళ్ళ కోర్సు నడపడానికి కావలసిన నిధులు సంపాదించడంలో తాము కృతకృత్యులమయామని బహిరంగంగా ప్రకటించారు. శ్రీరాంపూర్ కాలేజి, కలకత్తా విశ్వవిద్యాలయానికి పూర్తి అనుబంధ శాఖ అయింది. శ్రీరాంపూర్‌లో బి.ఏ. తరగతిలో చేరిన తొలుతటి విద్యార్థుల్లో నేనొకణ్ణి.

"గురుదేవా, నా మీద మీ కెంత దయండీ! కలకత్తా విడిచిపెట్టి శ్రీరాంపూర్‌లో మీకు దగ్గరగా ఉండాలని ఎంతకాలం నుంచో ఉవ్విళ్ళూరుతున్నాను. పెదవి కదపకుండా మీరు చేసిన సహాయానికి ప్రొఫెసర్ హోవెల్స్‌గారు మీకు ఎంత ఋణపడి ఉన్నారో ఆయనకు తెలియదు!"

శ్రీయుక్తేశ్వర్‌గారు, తెచ్చిపెట్టుకున్న బింకంతో నావేపు చూపు సారించారు. "ఇప్పుడు నువ్వు రైళ్ళలో గంటలకొద్దీ గడపవలసిన అవసరం ఉండదు. నీ చదువుకు ఎంత తీరిక చిక్కుతుందో! బహుశా నువ్వు చివరి క్షణంలో కంఠస్థం చెయ్యడం తగ్గించి సరైన విద్యార్థివవుతావనుకుంటాను."

కాని ఎంచేతనో ఆయన కంఠస్వరంలో విశ్వాసం కొరవడింది.*

---

* శ్రీయుక్తేశ్వర్‌గారు, చాలామంది ఋషులలాగే, ఆధునిక విద్యలోని భౌతికవాద ధోరణికి విచారించేవారు. సంతోషం కోసం ఆధ్యాత్మిక నియమాల్ని ప్రబోధించడం కాని, 'దేవుడి మీది

భయం'తో - అంటే సృష్టికర్తపట్ల భయ భక్తులతో - జీవితం సాగించడంలోనే జ్ఞానం ఉందని బోధించడంకాని చేసే విద్యాలయాలు చాలా తక్కువ.

మానవుడు కేవలం "ఉన్నత స్థాయి జంతువు" అంటూ ఈనాడు కళాశాలల్లోనూ ఉన్నత పాఠశాలల్లోనూ చెప్పగా వినే కుర్రవాళ్ళు తరచు నాస్తికులవుతూ ఉంటారు. వాళ్ళు ఆత్మ శోధన ఏమీ చెయ్యరు : తమ మూల ప్రకృతిని "దేవుడి ప్రతిరూపం"గా పరిగణించరు. ఎమర్సన్ ఇలా అన్నాడు : "మన లోపల ఏముందో అదే బయట చూడగలుగుతాం. మనకు దేవుళ్ళెవరూ తటస్థపడడం లేదంటే, మనమెవర్నీ లోపల నిలుపుకోకపోవడమే దానికి కారణం." తన పశు ప్రకృతి ఒక్కటే వాస్తవంగా భావించేవాడు దివ్యాభిలాషలకు దూరమవుతాడు.

మానవ అస్తిత్వానికి పరమాత్మను కేంద్ర బిందువుగా చూపని విద్యావ్యవస్థ 'అవిద్య' నేర్పుతున్నట్టే - అంటే మిథ్యాజ్ఞానాన్ని బోధిస్తున్నట్టే లెక్క. "నేను సంపన్నుణ్ణి అనీ వస్తు సంపాదనతో అభివృద్ధికి వచ్చాననీ, నా కింకేదీ అవసరం లేదనీ అంటావు నువ్వు. కాని నీకు తెలియదు - నువ్వు వట్టి దిక్కుమాలిన వాడివనీ, దౌర్భాగ్యుడివనీ, దరిద్రుడివనీ, గుడ్డివాడివనీ, దిగంబరుడివనీ." (రివలేషన్ 3-17) (బైబిలు)

ప్రాచీన భారత దేశంలో కుర్రవాళ్ళ విద్యాభ్యాసం ఆదర్శవంతంగా ఉండేది. తొమ్మిదేళ్ళ వయస్సులో విద్యార్థిని గురుకులం (గురువుల కుటుంబ నివాసమే విద్యాలయం)లో "పుత్రుడిగా" చేర్చుకునేవారు. "ఈ కాలపు కుర్రవాడు తనకున్న టైములో [ఏడాదికి] ఎనిమిదోవంతు మాత్రమే పాఠశాలలో గడుపుతాడు; కాని భారతీయుడు అన్ని వేళలా అక్కడే గడుపుతాడు,' అని రాస్తారు ప్రొఫెసర్ ఎస్ వి. వెంకటేశ్వర, 'ఇండియన్ కల్చర్ త్రూ ఏజెస్ (సంపుటి 1; లాంగ్మన్స్ గ్రీన్ అండ్ కంపెనీ) అన్న గ్రంథంలో "ఆ రోజుల్లో ఐకమత్యమూ బాధ్యతతో కూడిన ఆరోగ్యకరమైన అనుభూతి ఉండేది. స్వావలంబన వ్యక్తిత్వ వికాసాల సాధనకు సంపూర్ణావకాశం ఉంటుండేది అత్యుత్తమ సంస్కారం, తనకు తానుగా విధించుకొన్న క్రమశిక్షణ, విధివిధేయత, నిస్స్వార్థ కృషి, త్యాగబుద్ధి ఆత్మగౌరవం, ఇతరుల మీద గౌరవం ఉంటుండేవి. ఉన్నత ప్రమాణంలో విద్యాసంబంధమైన హుందాతనం, ఔదార్య స్పృహ, మానవ జీవిత పరమార్థ దృష్టి ఉండేవి."

అధ్యాయం : 18

# మహమ్మదీయ గారడివాడు

"కొన్నేళ్ళ క్రితం, నువ్విప్పుడుంటున్న ఈ గదిలోనే ఒక మహ్మదీయ గారడి వాడు నా ఎదుట నాలుగు అలౌకిక ఘటనలు ప్రదర్శించాడు!"

శ్రీయుక్తేశ్వర్‌గారు మొట్టమొదటిసారి నాకొత్త బసకు వచ్చినప్పుడు చెప్పిన సంగతి ఇది. శ్రీరాంపూర్ కాలేజిలో చేరీ చేరగానే నేను దగ్గరలో ఉన్న 'పాంథీ'* అనే వసతి గృహంలో ఒక గది తీసుకున్నాను. అది పాతకాలపు పద్ధతిలో కట్టిన ఇటిక కట్టుబడి భవనం; గంగానదికి అభిముఖంగా ఉంది.

"గురుదేవా, ఎంత చిత్రంగా కలిసింది! కొత్తగా అలంకారాలు దిద్దుకున్న ఈ గోడలు పాత జ్ఞాపకాలతో అంత ప్రాచీనమైనవా?" కొద్దిపాటి ఉపకరణ సామగ్రితో సాదాగా ఏర్పాటయి ఉన్న నా గది చుట్టూ, కొత్తగా రేకెత్తిన ఆసక్తితో కలయజూశాను.

"అది చాలా పెద్ద కథ," అంటూ పాత జ్ఞాపకాలతో చిరునవ్వు నవ్వారు గురుదేవులు. ఆ ఫకీరు† పేరు అఫ్జల్ ఖాను. అనుకోకుండా తారసపడ్డ ఒక హిందూయోగి ద్వారా అసాధారణమైన శక్తులు సంపాదించాడతను.

" 'నాయనా, దాహంగా ఉంది; కాసిని మంచినీళ్ళు తెచ్చిపెట్టు.' దుమ్ము కొట్టుకుపోయి ఉన్న ఓ సన్యాసి ఒకనాడు అఫ్జల్‌ను ఇలా కోరాడు. తూర్పు బెంగాలులో ఒక కుగ్రామంలో జరిగిందది. అప్పటికి అఫ్జల్ చిన్న కుర్రవాడు.

" 'స్వామీ, నేను మహమ్మదీయుడను. మీరు హిందువులై ఉండి, నా చేత్తో ఇచ్చే నీళ్ళు ఎలా తాగుతారు?'

---

* విద్యార్థుల వసతి గృహం : బాటసారి, జ్ఞానాన్వేషకుడు అనే అర్థంగల 'పాంథ' శబ్దం నుంచి వచ్చింది.

† ముస్లింయోగి : అరబ్బీ భాషలో, దరిద్రుడనే అర్థంగల 'ఫకీర్' శబ్దం నుంచి వచ్చింది. దీని మూలార్థం దారిద్ర్యవ్రతనిష్ఠుడని.

" 'నీ సత్యసంధత నన్ను ముగ్ధుణ్ణి చేస్తోంది నాయనా! అంటరానితనం లాంటి పాపిష్ఠి సంకుచిత నియమాల్ని నేను పాటించను. వెళ్ళు, తొందరగా నీళ్ళు తీసుకురా.'

"అఫ్జల్ భక్తిశ్రద్ధలకు ఆ యోగి వాత్సల్య దృక్కులు కానుకలయాయి.

" 'వెనకటి జన్మల్లో నువ్వు సత్కర్మలు చేశావు,' అన్నాడాయన గంభీరంగా. 'నీకు నే నొక యోగప్రక్రియ నేర్పుతాను. దాని ద్వారా నీకు, అగోచర మండలాల్లో ఒకదాని మీద అధికారం చిక్కుతుంది. ఆ మహత్తర శక్తుల్ని నువ్వు సదుద్దేశ్యాలకే వినియోగించాలి; స్వార్థ బుద్ధితో మాత్రం ఎన్నడూ వినియోగించకు సుమా విచారకరమైన విషయం ఏమిటంటే, పూర్వజన్మల నుంచి నువ్వు విధ్వంసక ధోరణులనే విత్తనాలు కొన్ని వెంట తెచ్చుకున్నావు. సరికొత్త పాడు పనులనే నీళ్ళు పోసి ఆ విత్తనాలు మొలకెత్తేలా మాత్రం చెయ్యకు. జటిలమైన నీ పూర్వ కర్మానుసారంగా, నువ్వీ జన్మలో యోగసాధన ఫలితాల్ని శ్రేష్ఠమైన మానవాభ్యుదయ లక్ష్యాలకే వినియోగించవలసి ఉంది.'

"బిత్తరపోయిన ఆ కుర్రవాడికి జటిలమైన యోగప్రక్రియ ఒకటి ఉపదేశించి, ఆ గురువు అంతర్ధానమయాడు.

"అఫ్జల్ ఇరవై ఏళ్ళపాటు ఆ యోగప్రకియను చిత్తశుద్ధితో సాధన చేశాడు అతని అద్భుత చర్యలు ఎక్కడెక్కడివాళ్ళనీ ఆకర్షించడం మొదలుపెట్టాయి. అతని వెంట ఎప్పుడూ ఒక అశరీరాత్మ తోడు ఉండేదనుకుంటాను. దాన్ని అతను 'హజరత్' అని పిలిచేవాడు. ఈ అశరీరాత్మ అతను కోరిన ఏ చిన్న కోరికనయినా సరే నెరవేరుస్తూ ఉండేది.

"గురువు చేసిన హెచ్చరికను విస్మరించి, అఫ్జల్ తన శక్తుల్ని దుర్వినియోగం చెయ్యడం ప్రారంభించాడు. అతడు ఏ వస్తువునయినా ఒకసారి ముట్టుకుని మళ్ళీ అక్కడ పెట్టేస్తే చాలు, కాసేపట్లో ఆ వస్తువు అయిపులేకుండా అదృశ్యమయి పోయేది. జనాన్ని గాభరాపెట్టే ఈ పర్యవసానం వల్ల అతను ప్రతి చోటికీ, రాగూడని అతిథి అయాడు!

"అతను కలకత్తాలో పెద్దపెద్ద నగల దుకాణాలకు అప్పుడప్పుడు వెళ్తూ ఉండేవాడు; ఏదో కొనడానికి వచ్చినవాడిలా కనిపించేవాడు. అతను ఏదైన ఒక నగ పట్టుకున్నాడంటే, అతను దుకాణంలోంచి బయటికి రాగానే ఆ నగ మాయమయిపోయేది.

"అఫ్జల్ వెంట తరచుగా వందలకొద్దీ విద్యార్థులు చుట్టుముట్టి ఉండేవారు. అతని రహస్యాలేవయినా నేర్చుకోవచ్చునన్న ఆశ వాళ్ళని అలా ఆకర్షించేది. అప్పుడప్పుడా ఫకీరు, వాళ్ళని తనతోపాటు ప్రయాణానికి రమ్మని పిలుస్తూండేవాడు. రైల్వే స్టేషనులో ఎలాగో ఒక టిక్కెట్ల బొత్తి ముట్టుకొనే అవకాశం కల్పించుకునేవాడు. దాన్ని మళ్ళీ గుమాస్తా దగ్గరికి నెట్టేసి, 'నా మనస్సు మార్చుకున్నాను. అవి ఇప్పుడు కొనను' అనేవాడు కాని అఫ్జల్ సపరివారంగా బండి ఎక్కగానే కావలసిన టిక్కెట్లు అతనికి చిక్కేవి.*

"ఈ దోపిడీలవల్ల క్రోధావేశాలు చెలరేగేవి; బెంగాలీ నగల వ్యాపారులూ టిక్కెట్ల అమ్మకందార్లూ గుండె పగిలి బేజారెత్తిపోయేవారు! అఫ్జల్‌ను అరెస్టు చెయ్యాలని చూసిన పోలీసులు కూడా నిస్సహాయులయారు; తన నేరం పట్టుబడే సాక్ష్యాధారం ఏదైనా ఉంటే, 'హజరత్, దీన్ని తీసెయ్' అని అఫ్జల్ అంటే చాలు, అది కాస్తా అదృశ్యమయిపోయేది."

శ్రీయుక్తేశ్వర్‌గారు తమ ఆసనం మీంచి లేచి, గంగానదికి ఎదురుగా ఉన్న నా గది బాల్కనీలోకి నడిచారు. అంతమందిని గాభరా పెట్టిన ఆ ముస్లిం ఫకీరును గురించి ఇంకా వినాలన్న కుతూహలంతో నేను కూడా ఆయన వెనకాల వెళ్ళాను.

"ఈ పాంథ భవనం ఒకప్పుడు మా స్నేహితుడిది. అఫ్జల్‌తో అతనికి పరిచయమైంది. ఒకసారి ఇక్కడికి తీసుకువచ్చాడు. మా స్నేహితుడు నాతోబాటు మరో ఇరవై మంది ఇరుగుపొరుగువాళ్ళని రమ్మని పిలిచాడు. నే నప్పుడు బాగా కుర్రవాణ్ణి. ఆ ఫకీరు చేసే అద్భుతచర్యలు చూడాలని ఆసక్తి కలిగింది." గురుదేవులు నవ్వారు. "నేను విలువైనదేదీ ఒంటిమీద లేకుండా ముందే జాగ్రత్త పడ్డాను! అఫ్జల్ నావేపు కుతూహలంగా చూశాడు. ఆ తరవాత ఇలా అన్నాడు:

" 'నీ చేతులు మంచి బలంగా ఉన్నాయి. మెట్లు దిగి తోటలోకి వెళ్ళు; అక్కడో నున్నటిరాయి తీసుకుని, దానిమీద సుద్దముక్కతో నీ పేరు రాయి; తరవాత దాన్ని నీ సత్తువకొద్దీ గంగలోకి దూరంగా విసిరెయ్యి.'

"అలాగే చేశాను. ఆ రాయి దూరంగా ఉన్న నీటి అలల్లో అదృశ్యమయిన తరవాత, ఆ మహమ్మదీయుడు మళ్ళీ ఇలా చెప్పాడు :

" 'ఈ ఇంటి ముంగిలి దగ్గర ఒక కుండనిండా గంగాజలం పొయ్యి.'

---

* అఫ్జల్‌ఖాన్ దోపిడీకి గురి అయిన వ్యాపార సంస్థల్లో తమ కంపెనీ, బెంగాల్ - నాగపూర్ రైల్వే కూడా ఒకటని, తరవాత ఒకసారి మా నాన్నగారు నాకు చెప్పారు.

"నేను నీళ్ళకుండతో తిరిగి వచ్చిన తరవాత ఆ ఫకీరు, 'హజరత్, ఆ రాతిని ఈ కుండలో పెట్టు!' అన్నాడు.

"వెంటనే రాయి కనిపించింది. దాన్ని పైకి తీశాను. దానిమీద నా సంతకం నేను రాసినప్పుడు ఎంత స్పష్టంగా ఉందో ఇప్పుడూ అలాగే ఉంది.

"గదిలో ఉన్న వాళ్ళలో బాబు* అని నా స్నేహితుడొకడు ఉన్నాడు. అతను బరువైన పాతకాలపు బంగారపు గడియారం గొలుసుతో సహా చేతికి పెట్టుకొని ఉన్నాడు. ఫకీరు వాటిని వాపిరిగొట్టులా తడిమి చూశాడు. అంతే; చటుక్కున అవి మాయమయాయి!

"బాబుకు కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. 'అఫ్జల్, దయచేసి మా పెద్దలనాటి అమూల్య వస్తువు మళ్ళీ నాకు తిరిగి ఇచ్చెయ్యి!'

"ఆ మహమ్మదీయుడు కొంచెంసేపు ఉలుకూ పలుకూ లేకుండా కూర్చున్నాడు. ఆ తరవాత అన్నాడు: 'ఇనప్పెట్టెలో నీకు ఐదువందల రూపాయలు ఉన్నాయి. అవి తెచ్చి నా కియ్యి; నీ గడియారం ఎక్కడ దొరుకుతుందో అప్పుడు చెబుతాను.'

"వెంటనే బాబు వెర్రెత్తినవాడిలా ఇంటికి పరిగెత్తాడు. కాసేపట్లో తిరిగి వచ్చి అఫ్జల్‌కు కావలసిన డబ్బు చేతిలో పెట్టాడు.

"'మీ ఇంటి దగ్గరున్న చిన్నవంతెన దగ్గరికి వెళ్ళు,' అని పురమాయించాడు ఫకీరు. 'హజరత్‌ను పిలిచి, నీ గడియారమూ గొలుసూ తెచ్చి ఇమ్మని అడుగు.'

"బాబు అక్కణ్ణించి ఉరికాడు. తిరిగి వచ్చేటప్పుడు మాత్రం, ఒంటిమీద విలువైన వస్తువేదీ లేకుండా నిశ్చింతగా నవ్వుకుంటూ వచ్చాడు.

"'చెప్పిన ప్రకారం నేను హజరత్‌ను పిలిచాను,' అని చెప్పాడతను. 'నా గడియారం గాలిలో దొర్లుకుంటూ వచ్చి నా కుడిచేతిలో పడింది! మళ్ళీ మిమ్మల్ని ఇక్కడ కలుసుకోడానికి వచ్చేముందు దాన్ని ఇనప్పెట్టెలో పెట్టి తాళం వేసి మరీ వచ్చాను!'

"గడియారానికి బదులుగా జబర్దస్తీగా డబ్బు వసూలు చేసుకున్న ఈ సుఖాంత-విషాదాంత నాటకానికి సాక్షులైన బాబు స్నేహితులు, అఫ్జల్‌ను చీదరించుకుంటూ చూశారు. అప్పుడతను బుజ్జగింపు ధోరణిలో ఇలా అన్నాడు:

* శ్రీయుక్తేశ్వర్‌గారి స్నేహితుడి పేరు నాకు గుర్తు రావడంలేదు; అందుచేత ఉత్తినే "బాబు" అని రాస్తున్నాను.

" 'మీకు కావలసిన పానీయం ఏదైనా ఒకటి చెప్పండి; హజరత్ దాన్ని తెచ్చి ఇస్తాడు.'

"కొందరు పాలు అడిగారు; తక్కినవాళ్ళు పళ్ళరసాలు అడిగారు. డీలాపడ్డ బాబు విస్కీ కావాలని అడిగినపప్పుడు నేను ఏమంత ఆశ్చర్య పోలేదు! ఫకీరు వెంటనే పురమాయింపు చేశాడు. ఆజ్ఞాబద్ధుడైన హజరత్, సీలువేసిన పెట్టెల్ని వెంటనే దిగుమతి చేశాడు; అవి కిందికి దిగివచ్చి దబ్బున నేలకు తగిలాయి. ప్రతి ఒక్కరికీ తమకు కావలసిన పానీయం దొరికింది.

"నాలుగో అద్భుత ప్రదర్శనావకాశం మా ఆతిథేయికి ఆహ్లాదం కలిగించి దనడంలో సందేహం లేదు; అఫ్జల్ అప్పటికప్పుడు మధ్యాహ్నభోజనాలు ఏర్పాటు చెయ్యడానికి సంసిద్ధత ప్రకటించాడు!

" 'చాలా ఖరీదైన వంటకాలు పురమాయిద్దాం,' అన్నాడు బాబు, దిగులుగా. 'నా ఐదువందల రూపాయలకీ సరిపోయేటట్టు అనేక రకాల వంటకాలు కావాలి. ప్రతి పదార్థం బంగారపు పళ్ళాల్లో వడ్డించాలి!'

"ప్రతివాడూ తనకు కావలసినవేవో చెప్పగానే ఆ ఫకీరు హజరత్‌ను మళ్ళీ పిలిచాడు. గలగలా చప్పుడు మొదలయింది; బంగారపు పళ్ళాలు శూన్యంలోంచి మా కాళ్ళ దగ్గిరికి దిగివచ్చాయి. వాటినిండా, రకరకాల దినుసులతో జాగ్రత్తగా వండిన కూరలు, వేడివేడి రొట్టెలు (లూచీలు), ఆ ఋతువులో ఎక్కడా కనిపించని రకరకాల పళ్ళు అమిర్చి ఉన్నాయి. పదార్థాలన్నీ మంచి రుచిగా ఉన్నాయి. ఒక గంటసేపు తృప్తిగా విందు ఆరగించిన తరవాత మేము గదిలోంచి బయటికి రావడం మొదలుపెట్టాం. పళ్ళాలు దొంతరపెడుతున్నట్టుగా బ్రహ్మాండమైన చప్పుడు వినిపించడంతో మేము వెనక్కి తిరిగి చూశాం. తళతళ లాడే బంగారపు పళ్ళాల జాడ కూడా లేదక్కడ; ఎంగిళ్ళు కూడా లేవు."

"గురుదేవా," అంటూ, ఆయన మాటకి అడ్డు తగిలాను. "ఆ అఫ్జల్, బంగారపు పళ్ళాలవంటి వస్తువులు అంత సులువుగా సంపాదించ గలిగినప్పుడు పరాయివాళ్ళ ఆస్తికోసం వెంపర్లాడడం ఎందుకండి?"

"ఆ ఫకీరు ఆధ్యాత్మికంగా ఎక్కువ అభివృద్ధి సాధించలేదు," అంటూ వివరించారు శ్రీయుక్తేశ్వర్‌గారు. "ఒకానొక యోగప్రక్రియ వల్ల అతనికి ఒక సూక్ష్మమండలంలోకి ప్రవేశం కలిగింది. అందులో ఏ కోరిక అయినా తక్షణం

నెరవేరుతుంది. హజరత్ అనే ఒక సూక్ష్మమండల జీవి సహాయంతో అతడు బలిష్ఠమైన తన సంకల్పశక్తితో చేసే ఒకానొక చర్యవల్ల ఆకాశశక్తి (ఈథరిక్ ఎనర్జీ) నుంచి ఏ వస్తువుకు సంబంధించిన అణువుల నయినా సరే ఆకర్షించ గలిగేవాడు అయితే ఆ విధంగా సూక్ష్మశక్తితో రూపొందించిన వస్తువులు నిర్మాణపరంగా క్షణభంగురమైనవి; వాటిని అట్టే కాలం నిలిపి ఉంచలేము.* అఫ్జల్ అప్పటికీ లౌకిక సంపదకోసం వెంపరలాడేవాడు; ఎంతో కష్టపడి సంపాదించవలసి వచ్చినా ఎక్కువగా భరోసా పెట్టుకోదగినంత మన్నిక ఉన్నదదీ.

నేను నవ్వాను. "అది కూడా ఎప్పుడో, తెలియకుండానే మాయమవుతుంది లెండి!"

"అఫ్జల్ దైవసాక్షాత్కారం పొందినవాడు కాదు." గురుదేవులు ఇంకా చెప్పారు. "చిరస్థాయిగాను, శ్రేయస్కరంగాను ఉండే అలౌకిక అద్భుత చర్యలు నిజమైన సాధువులే చెయ్యగలరు. వారు, సర్వశక్తి సంపన్నుడైన సృష్టికర్తతో ఐక్యానుసంధానం పొంది ఉండడమే దానికి కారణం. అఫ్జల్ చాలా మామూలు మనిషి. కాని మర్త్యులైన మానవులు సాధారణంగా చనిపోయిన తరవాత కాని ప్రవేశించలేని సూక్ష్మమండలంలోకి చొచ్చుకుపోయే అసాధారణ శక్తి మాత్రం అతనికి ఉంది."

" పరలోకానికి, మనల్ని ఆకట్టుకొనే లక్షణాలు కొన్ని ఉన్నాయన్న సంగతి ఇప్పుడు అర్థమవుతోంది గురుదేవా."

గురుదేవులు అంగీకరించారు. "ఆనాటి తరవాత మరెన్నడూ అఫ్జల్‌ని నేను చూడలేదు. కాని కొన్నేళ్ళకి బాబు మా ఇంటికి వచ్చాడు. ఆ మహమ్మదీయుడు తన తప్పు ఒప్పుకొంటూ చేసిన బహిరంగ ప్రకటన ఒక పత్రికలో అచ్చయింది నాకది చూపిద్దామని తీసుకువచ్చాడు. అఫ్జల్ చిన్నతనంలో ఒక హిందూ గురువు దగ్గర ఉపదేశం పొందాడని చెప్పానే, ఆ విషయాలు దాంట్లోనే తెలిశాయి.

ఆ పత్రికాప్రకటనలో చివరి భాగం సారాంశం, శ్రీయుక్తేశ్వర్ గారికి గుర్తుకు వచ్చిన ప్రకారం ఇలా ఉంది : "అఫ్జల్‌ఖాన్ అనే నేను, పశ్చాత్తాప ప్రకటనగానూ, అలౌకికమైన అద్భుత చర్యలు చేసే శక్తులు సంపాదించాలని చూసేవాళ్ళకి ఒక హెచ్చరికగానూ ఈ ముక్కలు రాస్తున్నాను. దేవుడి దయవల్లా, మా గురుదేవుల

* సూక్ష్మశక్తితో సృష్టించిన నా వెండి రక్షరేకు, చివరికి ఈ లోకం నుంచి అదృశ్యమయి నట్టుగానే (అధ్యాయం 43 లో సూక్ష్మలోకాన్ని వర్ణించడం జరిగింది).

దయవల్లా నాకు సంక్రమించిన అద్భుత శక్తుల్ని చాలా ఏళ్ళపాటు నేను దుర్వినియోగం చేస్తూ వచ్చాను. అహంకారంతో మదించాను; సాధారణ నీతి నియమాలకు నేను అతీతుణ్ణని భావించాను. కాని చివరికి నా అంతిమ న్యాయ నిర్ధారణ రోజు దగ్గరపడింది.

"ఈమధ్య కలకత్తా అవతల ఒక రోడ్డుమీద ఒక ముసలాయన తారస పడ్డాడు. ఆయన బాధగా కుంటుతూ నడుస్తున్నాడు; ఆయన చేతిలో బంగారం లాంటి దేదో మిలమిలా మెరుస్తోంది. నా మనస్సులో లోభం తల ఎత్తింది, ఆయనతో ఇలా అన్నాను:

" 'నేను అఫ్జల్‌ఖాన్ అనే గొప్ప ఫకీర్ని. నీ చేతిలో ఉన్నదేమిటి?'

" 'నాకున్న వస్తుసంపద అల్లా ఈ బంగారం గుండు ఒక్కటే; ఇది ఫకీరు కెందుకూ పనికి రాదు. అయ్యా నా కుంటితనం పోగొట్టమని మిమ్మల్ని వేడు కుంటున్నాను.'

" నేను ఆ గుండు తాకి, జవాబు చెప్పకుండా వెళ్ళిపోయాను. ఆ ముసలాయన కుంటుకుంటూ నా వెంట పడ్డాడు. కాసేపట్లో, 'నా బంగారం పోయింది బాబోయ్!' అంటూ అరవడం మొదలుపెట్టాడు.

" నే నదేమీ పట్టించుకోకపోవడంవల్ల, ఆయన హఠాత్తుగా గట్టిగా ఉరిమాడు; దుర్బల శరీరుడు అంత గట్టిగా అరవడం విడ్డూరమే అనిపించింది.

" 'గుర్తుపట్టలేదా నన్ను?'

"నోట మాటలేకుండా నిలబడిపోయాను. దుర్బలుడైన ఈ ముసలి కుంటి వాడు, చాలా చాలా సంవత్సరాల కిందట నాకు యోగవిద్య ఉపదేశించిన మహాయోగే కాని మరొకడు కాడని, తరుణం మించిపోయాక గుర్తించినందుకు నిశ్చేష్టుణ్ణే అయాను. ఆయన నిటారుగా నిలబడ్డారు. తక్షణమే ఆయన శరీరం మంచి దృఢంగా, పడుచుతనంతో నిండినట్టు పొడగట్టింది.

"నా గురుదేవుల చూపులు నిప్పులు కక్కుతున్నాయి. 'నువ్వు నీ శక్తుల్ని పీడిత ప్రజలకు సాయపడ్డానికి కాకుండా, మామూలు దొంగలా వాటిమీద బతుకుతూ దుర్వినియోగం చెయ్యడం నా కళ్ళతోనే చూశాను! ఇక నీ శక్తులన్నిటినీ ఉపసంహరిస్తున్నాను; హజరత్ ఇప్పుడు నీ దగ్గర్నించి విడుదలయిపోయాడు. ఇంక నువ్వంటే బెంగాలుకు భయం ఉండదు.'

"నేను ఉద్విగ్న స్వరంతో హజరత్‌ను పిలిచాను; మొట్టమొదటి సారిగా, అతడు నా అంతర్దృష్టికి గోచరించడం మానేశాడు. కాని హఠాత్తుగా ఒక నల్లటి ముసుగు తొలగిపోయింది, నా పాపిష్ఠి జీవితం స్పష్టంగా కళ్ళకు కట్టింది.

" 'గురుదేవా, చాలాకాలంగా నాలో ఉన్న భ్రాంతిని తొలగించడానికి ఇలా వచ్చినందుకు మీకు కృతజ్ఞతలు చెప్పుకొంటున్నాను.' ఆయన కాళ్ళమీద పడి ఏడ్చేశాను. 'లౌకికమైన నా అభిలాషలన్నీ విడిచిపెట్టేస్తానని ప్రతిజ్ఞ చేస్తున్నాను నా వెనకటి పాపాల పరిహారానికి, ఏ కొండల్లోకో పోయి ఏకాంతంగా దైవధ్యానం చేసుకుంటాను.'

"మా గురుదేవులు నన్ను దయతో చూశారు. 'నీ చిత్తశుద్ధి నా మనస్సుకు తెలుస్తోంది,' అన్నారు చివరికి. 'నీ తొలుతటి ఏళ్ళ నిశ్చల విధేయతవల్లా ఇప్పటి నీ పశ్చాత్తాపంవల్లా నీ కొక వరం ఇస్తాను. నీ ఇతర శక్తులన్నీ ఇప్పుడు పోయాయి కాని, నీకు తిండీ గుడ్డా కావలసినప్పుడు మాత్రం హజరత్‌ను పిలిచి ఇమ్మంటే ఇప్పటికీ ఇస్తాడు. ఏకాంత పర్వత ప్రాంతాలకు పోయి, దివ్యజ్ఞానం పొందడానికి నిండు మనస్సుతో సాధన చెయ్యి'

"మా గురుదేవులు అంతర్ధానమయారు. కన్నీళ్ళతో, ఆలోచనలతో ఒంటరిగా మిగిలిపోయాను. ఓ ప్రపంచమా, ఇక సెలవు! ఆ విశ్వప్రేమమయుడి క్షమాభిక్ష అన్వేషించడానికి వెళ్ళిపోతున్నాను."

అధ్యాయం : 19

# కలకత్తాలో ఉన్న గురుదేవులు శ్రీరాంపూర్‌లో కనిపించడం

"నాస్తిక శంకలు నన్ను తరచుగా చుట్టుముడుతుంటాయి. అయినా, ఆత్మకు సంభావ్యమైన విషయాల్లో మనం ఇంతవరకూ అనుభూతం చేసుకోనివి ఉండే అవకాశం ఉందికదా అన్న ఊహ అప్పుడప్పుడు నన్ను వేధిస్తూ ఉంటుంది. వాటి గురించి అన్వేషించకపోతే మానవుడు తన వాస్తవ భాగ్యానికి దూరమవటం లేదూ?"

ఈ మాటలు అన్నవాడు దిజేన్‌బాబు. 'పాంథీ' వసతి గృహంలో అతను నాతోబాటు ఒకే గదిలో ఉండేవాడు. మా గురుదేవుల్ని దర్శించడానికి రమ్మని నేను ఆహ్వానించినప్పుడు అతనన్న మాటలవి.

"శ్రీయుక్తేశ్వర్‌గారు నీకు క్రియాయోగ దీక్ష ఇస్తారు," అంటూ నేను, "అది, దివ్యమైన ఆంతరిక విశ్వాసంద్వారా ద్వంద్వ ప్రకృతివల్ల కలిగే సంక్షోభాన్ని అణచివేస్తుంది," అన్నాను.

ఆవేళ సాయంత్రం దిజేన్, నాతోబాటు ఆశ్రమానికి వచ్చాడు. గురుదేవుల సన్నిధిలో మా స్నేహితుడికి ఎంత ఆధ్యాత్మిక ప్రశాంతి లభించిందంటే, అప్పటి నుంచి అతను తరచుగా ఆశ్రమానికి రావడం మొదలైంది. నిత్యజీవితంలో చేసుకొంటూ ఉండే చిల్లరమల్లర పనులు, మన గాఢమైన అవసరాల్ని తీర్చలేవు; ఎందువల్లనంటే, మనిషికి సహజంగా జ్ఞానం సంపాదించాలన్న తృష్ణ కూడా ఉంటుంది. శ్రీయుక్తేశ్వర్‌గారి మాటలవల్ల దిజేన్‌కు, అశాశ్వతమైన జన్మలో ఉన్న క్షుద్రమైన అహంకారం కన్న మరింత సత్యమైన ఆత్మను తనలో అన్వేషించాలన్న ప్రేరణ కలిగింది.

నేనూ దిజేన్, ఇద్దరమూ శ్రీరాంపూర్ కాలేజిలో బి.ఏ. కోర్సు చదువుతున్నందువల్ల క్లాసులు అయిపోయిన వెంటనే ఆశ్రమానికి నడుచుకుంటూ కలిసివెళ్ళే అలవాటు అయింది మాకు. మేము ఆశ్రమానికి దగ్గర పడుతూ ఉండగా శ్రీయుక్తేశ్వర్‌గారు ఆశ్రమం రెండో అంతస్తు బాల్కనీలో నిలబడి చిరునవ్వుతో మమ్మల్ని ఆహ్వానిస్తూ ఉండడం తరచు చూసే వాళ్ళం.

ఒకనాడు మధ్యాహ్నం మేము గుమ్మంలోకి వెళ్ళేటప్పటికి, ఆశ్రమవాసుల్లో కనాయి అనే విద్యార్థి మాకు ఎదురుపడి, నిరుత్సాహం కలిగించే వార్త చెప్పాడు.

"గురుదేవులు ఇక్కడ లేరు; అర్జంటుగా కలకత్తా రమ్మని కబురొచ్చింది."

మర్నాడు గురుదేవులు దగ్గర్నించి నాకో పోస్టుకార్డు వచ్చింది. "నేను బుధవారం పొద్దున కలకత్తాలో బయల్దేరుతున్నాను. నువ్వూ దిజేనూ పొద్దున తొమ్మిదిగంటల బండికి శ్రీరాంపూర్ స్టేషన్‌కి వచ్చి కలుసుకోండి," అని రాశారు.

బుధవారం పొద్దున సుమారు ఎనిమిదిన్నరకు శ్రీయుక్తేశ్వర్‌గారి దగ్గర్నించి మానసిక సందేశం ఒకటి నా మనస్సులో పదేపదే మెరిసింది: "నా కిక్కడ ఆలస్యమయింది; తొమ్మిదిగంటల బండికి రాకండి."

అప్పటికే బయల్దేరడానికి బట్టలు వేసుకుని సిద్ధంగా ఉన్న దిజేన్‌కు ఈ తాజా కబురు చెప్పాను.

"నువ్వూ నీ అంతఃప్రేరణా!" అంటున్న మా స్నేహితుడి గొంతులో కొద్దిగా చీదరింపు ధ్వనించింది. "గురువుగారు రాసిందాన్నే నమ్ముతాను నేను."

నేను భుజాలు ఎగరేసి విశ్రాంతిగా కూర్చున్నాను. దిజేన్ కోపంగా గొణుక్కుంటూ గుమ్మందాటి దభీమని తలుపువేశాడు.

గది కొద్దిగా చీకటిగా ఉండడంవల్ల నేను వీధివేపు కిటికీకి దగ్గరగా జరిగాను. కిటికీలోంచి వస్తున్న కొద్దిపాటి సూర్యకాంతి హఠాత్తుగా పెరిగి పోయి తీక్షంగా ప్రకాశించింది; కిటికీ ఇనప చువ్వలు పూర్తిగా మాయమైపోయాయి. మిరుమిట్లు గొలుపుతున్న ఈ నేపథ్యంలో, శ్రీయుక్తేశ్వర్‌గారి భౌతికరూపం స్పష్టంగా ప్రత్యక్షమైంది!

ఆశ్చర్యంతో అదిరిపడి, కూర్చున్న కుర్చీలోంచి లేచి ఆయన ముందు మోకరిల్లాను. సాంప్రదాయిక పద్ధతిలో నేను, గురుదేవుల పాదాలకు గౌరవ పురస్సరంగా నమస్కరిస్తూ ఆయన పాదరక్షలు ముట్టుకున్నాను. ఈ జత నాకు తెలిసినదే; కాషాయరంగు అద్దిన కేన్వాసుతో చేసినది; దాని అడుగుభాగం

తాళ్ళతో చేసింది. ఆయన వేసుకున్న కాషాయంరంగు బట్ట నా ఒంటికి రాసుకుంది. ఆ బట్ట స్పర్శ మాత్రమే కాకుండా, ఆయన బూట్లమీది గరుకుతనం, వాటిలో ఆయన కాలివేళ్ళ ఒత్తిడి కూడా స్పష్టంగా నా చేతులకు తగిలింది. ఒక్కమాట నోట పెగలడానికి కూడా వీలుకానంతగా కొయ్యబారి, లేచి నించుని ప్రశ్నార్థకంగా ఆయనవేపు తేరిపారి చూశాను.

"నువ్వు నా మానసిక సందేశం అందుకున్నందుకు సంతోషించాను," గురుదేవుల కంఠస్వరం ప్రశాంతంగా, చాలా స్వాభావికంగా ఉంది. "ఇప్పుడు కలకత్తాలో నా పని పూర్తి అయింది; పదిగంటల బండిలో శ్రీరాంపూర్‌లో దిగుతాను." అన్నారు.

నేనింకా తెల్లబోయి మూగగా చూస్తుంటే, శ్రీయుక్తేశ్వర్‌గారు ఇంకా ఇలా అన్నారు : "ఇది నా ఛాయారూపం కాదు; నా రక్తమాంసాలతో నిండి ఉన్న నిజరూపం. లోకంలో చాలా అరుదైన ఈ అనుభవం నీకు కలిగించమని ఈశ్వరాజ్ఞ. నన్ను స్టేషన్‌లో కలుసుకో; ఇప్పుడు నేను వేసుకున్న దుస్తుల్లోనే మీకు ఎదురు రావడం, నువ్వూ దిజేనూ చూస్తారు. నా ముందుండే తోటి ప్రయాణికుడు - వెండి మరచెంబు పట్టుకువచ్చే చిన్న కుర్రవాడు."

మా గురుదేవులు మర్మర స్వరంతో దీవిస్తూ నా తలమీద రెండు చేతులూ పెట్టారు. "తబే ఆసి",* అన్న మాటలతో ఆయన ముగిస్తూ ఉండగా, చిత్రమైన ఒక మర్మరధ్వని విన్నాను.† ఆయన శరీరం క్రమంగా మిరుమిట్లు గొలిపే కాంతిలో కరిగిపోవడం మొదలయింది. చుట్టచుడుతున్న ఒక కాయితంలాగ, మొదట ఆయన పాదాలూ, కాళ్ళూ అదృశ్యమయాయి; ఆ తరవాత మొండెమూ, తలా. ఆయన నా జుట్టు మీద సుతారంగా ఉంచిన వేళ్ళ స్పర్శ చిట్టచివరిదాకా నాకు తెలుస్తూనే ఉంది. ఆ ఉజ్జ్వలకాంతి కరిగిపోయింది; నా ఎదురుగా చువ్వల కిటికీ, పలచని ఎండపొడా మినహా మరేమీ మిగలలేదు.

ఒకవేళ నేను భ్రమకు గురికాలేదు కదా, అని వితర్కించుకుంటూ సగం మగతలో ఉండిపోయాను. కాసేపట్లో, ముఖం వేలాడేసుకుని, దిజేన్ గదిలోకి చక్కా వచ్చాడు.

"గురువుగారు తొమ్మిదిగంటల బండిలోనూ రాలేదు, తొమ్మిదిన్నర బండి

* "వెళ్ళొస్తా" అని బెంగాలీలో చెప్పే తీరు దీనికి వాచ్యార్థం, "అప్పటికి వస్తా" అని; ఇందులో ఆశావహమైన వైరుధ్యం ఉంది.

† శరీర కోశాణువులు విఘటనం చెందినప్పుడు వచ్చే విలక్షణమైన శబ్దం.

లోనూ రాలేదు," అంటూ మా స్నేహితుడు, ముఖం కొంచెం చిన్న బుచ్చుకుని చెప్పాడు.

"రా! ఆయన పదిగంటల బండిలో వస్తారని నాకు తెలుసు," అంటూ నేను దిజేన్ చెయ్యి పుచ్చుకుని, రానని ఎంత మొరాయించినా పట్టించుకోకుండా, నాతో లాక్కెళ్ళాను. పదినిమిషాల్లో స్టేషన్‌లో అడుగుపెట్టాం; అప్పుడే బండి వచ్చి ఆగబోతోంది.

"బండి మొత్తమంతా గురుదేవుల దివ్యప్రభతో నిండిపోయింది! అరుగో, అక్కడున్నారు!" అంటూ ఆనందంగా గొంతెత్తి పలికాను.

"నువ్వలా కలగంటున్నావు!" దిజేన్ వెటకారంగా నవ్వాడు.

"మన మిక్కడే కాసుకొని ఉందాం." మా గురుదేవులు అక్కడికి ఎలా వస్తారో, ఆ వివరాలన్నీ మా స్నేహితుడికి చెప్పాను. నా వర్ణన పూర్తిచేసేసరికి, శ్రీయుక్తేశ్వర్‌గారు కంటబడ్డారు; కొద్దిసేపటి క్రితం నేను చూసిన బట్టలే వేసుకొని ఉన్నారు. వెండి మరచెంబు పట్టుకొని వస్తున్న ఒక చిన్న కుర్రవాడి వెనకాల మెల్లగా నడుచుకుంటూ వస్తున్నారు.

నమ్మశక్యముకాని ఈ విచిత్రమైన అనుభవంతో భయం ఒక అలలా నాలో వ్యాపించింది ఒక్క క్షణం. భౌతిక వాద పూరితమైన ఇరవయ్యో శతాబ్దం నా నుంచి జారిపోతున్నట్టు అనిపించింది. ఏసుక్రీస్తు సముద్రంమీద పీటరుకు ప్రత్యక్షమైన పనాతన కాలంలోకి వెళ్ళిపోయానా?

ఆధునిక యోగి-క్రీస్తు శ్రీయుక్తేశ్వర్‌గారు, దిజేనూ నేనూ నోట మాట లేకుండా నిలబడి ఉన్న చోటికి వస్తూ, మా స్నేహితుడి వేపు చూసి చిరునవ్వు చిందిస్తూ ఇలా అన్నారు :

"నీక్కూడా ఒక వర్తమానం పంపాను; కాని నువ్వు దాన్ని గ్రహించుకోలేక పోయావు."

దిజేన్ మౌనం వహించాడు; కాని నావేపు అనుమానంగా, వాడిగా చూశాడు. మేము గురుదేవుల్ని ఆశ్రమందాకా దిగబెట్టిన తరవాత నేనూ మా స్నేహితుడూ శ్రీరాంపూర్ కాలేజికి వెళ్ళిపోయాం. దిజేన్ వీధిలో ఆగిపోయాడు; అతనిలో అణువణువు నుంచీ నామీద క్రోధం పెల్లుబుకుతోంది.

"అయితే, గురువుగారు నాకు వర్తమానం పంపారు! అయినా నువ్వు దాన్ని దాచిపెట్టావు! దీనికి నువ్వు సంజాయిషీ చెప్పుకోవాలి!"

"నీ మనస్సనే అద్దం, గురుదేవుల సూచనల్ని నువ్వు గ్రహించలేనంత చంచలంగా ఊగిసలాడుతూంటే నే నేమైనా చెయ్యగలనా?" అంటూ ఎదురు ప్రశ్న వేశాను.

దిజేన్ మొహంలో కోపం ఎగిరిపోయింది. "నువ్వు చెప్పేది అర్థమైంది," అంటూ పశ్చాత్తాపంతో అన్నాడు. "కాని, దయతలిచి ఒక్క సంగతి వివరంగా చెప్పు; వెండి చెంబు పట్టుకొచ్చిన కుఱ్ఱాడి సంగతి నీకు ఎలా తెలిసింది?"

ఆరోజు పొద్దున బోర్డింగ్ హౌస్‌లో గురుదేవులు అద్భుతంగా ప్రత్యక్షమైన విషయం మా స్నేహితుడికి చెప్పాను; నేను ఆ కథ పూర్తి చేసేసరికి శ్రీరాంపూర్ కాలేజి వచ్చేసింది.

"మన గురువుగారి శక్తుల్ని గురించి నే నిప్పుడు విన్న వృత్తాంతాన్ని బట్టి చూస్తే, ప్రపంచంలో ఏ యూనివర్సిటీ అయినా ఒట్టి చిన్న పిల్లకాయల బడే అనిపిస్తోంది,"* అన్నాడు దిజేన్.

---

* "నే నింతవరకు రాసిందంతా గడ్డిపరకకన్న విలువైందేమీ కాదని నాకు వెల్లడి అయిన విషయాలు తెలియబరిచాయి," అన్నాడు "ప్రిన్స్ ఆఫ్ స్కాలాస్టిక్స్" (తత్త్వశాస్త్రాధిపతి)గా ప్రసిద్ధుడైన సెంట్ థామస్ ఎక్వినాస్. 'సమ్మా థియొలాజియే' అన్న గ్రంథం పూర్తి చెయ్యమంటూ తన అంతరంగిక కార్యదర్శి, మనసుపడుతూ చేసిన విన్నపాలకు ఆయన ఇచ్చిన సమాధానమిది.

1273లో ఒకనాడు నేపుల్స్ చర్చిలో సామూహిక ప్రార్థన జరుగుతూ ఉండగా, సెంట్ థామస్‌కు గాఢమైన ఆత్మజ్ఞానం అనుభూతమైంది. ఆ దివ్య జ్ఞాన మహిమ ఆయన్ని ఎంత ఆనందభరితుణ్ణి చేసిందంటే, అప్పటినుంచి ఆయన బౌద్ధికమైన తర్కవితర్కాలమీద ఏ మాత్రం ఆసక్తి చూపించలేదు.

అలాగే, సోక్రటీస్ (ప్లేటో 'ఫేడ్రస్'లో) మాటలు గమనించండి : "నా మట్టుకు నాకు తెలిసిందల్లా, నా కేమీ తెలియదనే."

అధ్యాయం : 20

# మేము కాశ్మీరు వెళ్ళలేదు

"నాన్నగారూ, వేసవి సెలవుల్లో హిమాలయాల దిగువ కొండలకు నాతో బాటు రమ్మని, గురువుగారినీ మరో నలుగురు స్నేహితుల్నీ పిలుద్దామనుకుంటున్నాను. కాశ్మీరుకు ఆరు రైల్వే పాస్‌లూ, మా ప్రయాణం ఖర్చులకు సరిపడే డబ్బూ ఇస్తారా?"

నే ననుకున్నట్టుగానే, నాన్నగారు మనసారా నవ్వారు. "నువ్వీ కాకమ్మ కథ చెప్పడం ఇది మూడోసారి. కిందటి వేసంగుల్లోనూ అంతకు ముందు వేసంగుల్లోనూ ఇలాగే అడగలేదూ నువ్వు? చివరి క్షణంలో శ్రీయుక్తేశ్వర్‌గారు రామంటారు."

"నిజమే నాన్నగారూ, కాశ్మీరు విషయంలో మా గురువుగారు ఖచ్చితంగా మాట ఎందుకివ్వడంలేదో నాకు అర్థం కాకుండా ఉంది.* కాని నే నప్పుడే మీ దగ్గర పాస్‌లు తీసేసుకున్నానని చెబితే, ప్రయాణానికి ఆయన ఒప్పుకుంటారని ఎందుకో అనిపిస్తోంది నాకు."

అప్పటికయితే నాన్నగారికి నమ్మకం కలగలేదు. కాని ఆ మర్నాడు ఆయనే కొన్ని పరిహాసాలతో నన్ను ఆటపట్టించిన తరవాత ఆరు పాస్‌లూ ఒక పది రూపాయల నోట్ల కట్టా నా చేతి కిచ్చారు.

"నీ ఉత్తుత్తి ప్రయాణానికి ఇలాంటి ఆధరువులేవీ అక్కర్లేదనుకుంటాను. అయినా ఇవిగో!" అని వ్యాఖ్యానించారు నాన్నగారు.

ఆరోజు మధ్యాహ్నం నేను దండుకున్నవి తెచ్చి శ్రీయుక్తేశ్వర్‌గారి ముందు ప్రదర్శించాను. నా ఉత్సాహం చూసి ఆయన చిరునవ్వు చిందించారే కాని, మాట

---

* అంతకుముందు రెండు వేసంగుల్లోనూ కాశ్మీరు రావడానికి ఇష్టంలేక పోవడానికి కారణం గురుదేవులు చెప్పకపోయినప్పటికీ, అక్కడ తాము జబ్బు పడ్డానికి సమయం ఇంకా ఆసన్నం కాలేదన్న సంగతి ముందుగా ఆయనకు తెలిసి ఉండడమే కావచ్చు. చూ పే 263 అ

మట్టుకు ఎటూ తేల్చలేదు : "నాకూ రావాలనే ఉంది; చూద్దాం." వారి ఆశ్రమంలోని చిన్న శిష్యుడయిన కనాయిని మాతో రమ్మని అడిగినప్పుడు ఆయన ఏమీ వ్యాఖ్యానించలేదు.

మరో ముగ్గురు స్నేహితుల్ని కూడా మాతో రమ్మని చెప్పాను - రాజేంద్రనాథ్ మిత్రా, జోతిన్ ఆడీ, మరో అబ్బాయి. మరుసటి సోమవారంనాడు బయల్దేరాలని నిర్ణయమైంది.

శని, ఆదివారాలు రెండు రోజులూ కలకత్తాలో ఉండిపోయాను; మా చుట్టాలబ్బాయి పెళ్ళి తతంగమంతా కలకత్తాలో మా ఇంట్లోనే జరుగుతోంది. నా సామాను తీసుకుని, సోమవారం పొద్దుట శ్రీరాంపూర్‌లో దిగాను. రాజేంద్ర ఆశ్రమ ద్వారం దగ్గర నన్ను కలుసుకున్నాడు.

"గురుదేవులు బయటికి షికారుకు వెళ్ళారు. ఆయన రామంటున్నారు."

ఆ మాటకు నాకు ఎంత విచారం కలిగిందో అంత పట్టుదల కూడా పెరిగింది. కాశ్మీరు వెళ్ళడానికి నేను వేసిన పథకాలు భ్రమతో కూడినవని అపహాస్యం చేసేందుకు నాన్నగారికి మూడోసారి అవకాశం నేనివ్వను.

రాజేంద్ర ఒప్పుకున్నాడు; ఒక నౌకరును సంపాదించడానికి నేను ఆశ్రమం నుంచి వెళ్ళాను. గురుదేవులు లేకుండా, కనాయి ప్రయాణం కట్టడని నాకు తెలుసు; పైగా మా సామాను కాపలా కాయడానికి ఎవరో ఒకరు అవసరం. బిహారి నా మనస్సులో మెదిలాడు. అతను వెనక మా ఇంట్లో నౌకరు. ఇప్పుడు శ్రీరాంపూర్‌లో ఒక ఉపాధ్యాయుడి దగ్గర పనిచేస్తున్నాడు. నేను వడివడిగా నడుస్తూ పోతుండగా, శ్రీరాంపూర్ కోర్ట్ హౌస్ దగ్గరున్న క్రిస్టియన్ చర్చికి ఎదురుగా గురుదేవులు తారసపడ్డారు.

"ఎక్కడికెళ్తున్నావోయ్?" శ్రీయుక్తేశ్వర్‌గారి ముఖంలో చిరునవ్వన్నమాటే లేదు. "గురుదేవా, మనమనుకున్న ప్రకారం ప్రయాణం చెయ్యడానికి మీరూ కనాయీ రావడంలేదని విన్నాను. బిహారికోసం వెతుకుతున్నాను. కిందటేడు, కాశ్మీరు చూడ్డానికి అతనెంతో మనసుపడ్డాడనీ, జీతంలేకుండా పనిచేస్తానని కూడా అన్నాడనీ మీకు జ్ఞాపకం ఉండే ఉంటుంది."

"ఔను, జ్ఞాపకముంది. అయినా బిహారి, రావడానికి ఒప్పుకుంటాడని అనుకోను."

దాంతో నా సహనం సన్నగిలింది. "సరిగా ఈ అవకాశం కోసమే అతను ఆత్రంగా ఎదురు చూస్తున్నాడండి!" అన్నాను.

మా గురుదేవులు మౌనంగా మళ్ళీ నడక సాగించారు. నేను కాసేపట్లోనే స్కూలు మాస్టరుగారి ఇల్లు చేరుకున్నాను. బిహారీ ముంగిట్లోనే తారసపడ్డాడు అతని పలకరింపులోని ఆప్యాయత నేను కాశ్మీరు పేరు చెప్పేసరికి చటుక్కున మాయమయింది. క్షమార్పణ చెప్పుకుంటున్నట్టుగా ఏదో గొణిగి యజమాని ఇంట్లోకి దూరాడు. నేను అరగంట సేపు అక్కడే పడిగాపులు పడి ఉన్నాను బిహారీ ఆలస్యానికి కారణం, ప్రయాణం ఏర్పాట్లు చేసుకుంటూ ఉండడమేకాని మరేం కాదని అంతసేపూ నన్ను నేను సమాధానపరచుకుంటున్నాను. చివరికి వీధి తలుపు తట్టాను.

"బిహారీ దాదాపు అరగంట క్రితం, వెనకమెట్ల మేడమెట్లు దిగి వెళ్ళిపోయాడు" అని చెప్పాడొకాయన. రవ్వంత చిరునవ్వు ఆయన పెదవుల మీద తొణికిస లాడింది.

అక్కణ్ణించి దిగాలుపడి వస్తూ, బిహారీని మాతో రమ్మని పిలవడంలో ఏమైనా బలవంతం చేస్తున్నట్లు ఉందా, లేకపోతే గురుదేవుల అదృశ్య ప్రభావం ఏమైనా పనిచేస్తోందా అని తర్కించుకున్నాను. చర్చి దాటి వెళ్తూ మళ్ళీ మా గురుదేవుల్ని కలిశాను; ఆయన నావేపే మెల్లగా నడుచుకుంటూ వస్తున్నారు నేనేం చెప్తానో వినకుండానే ఆయన ఇలా అన్నారు :

"అయితే బిహారీ రాడన్నమాట! మరిప్పుడు నీ ప్రయత్నమేమిటి?" అదుపాజ్ఞలు పెట్టే తండ్రికి లొంగకూడదని నిశ్చయించుకున్న మొండి పిల్లవాడి మనస్థితి కలిగింది నాకు. "మా బాబయ్యని, తన దగ్గర పనిచేసే లాల్‌ధారి అనే నౌకర్ని పంపించమని అడుగుతానండి."

"కావాలంటే మీ బాబయ్యని కలుసుకో," అన్నారు శ్రీయుక్తేశ్వర్‌గారు ముసిముసిగా నవ్వుతూ. "కాని వెళ్ళినందుకు నువ్వు సంతోషిస్తావని మాత్రం నా కనిపించడం లేదు."

ఆ మాటకు నేను కీడు శంకించినా, నాలో తిరుగుబాటుతనం తల ఎత్తింది· గురువుగారిని విడిచిపెట్టి శ్రీరాంపూర్ కోర్ట్ హౌస్‌లో అడుగు పెట్టాను. మా బాబయ్య శారదా ఘోష్ అక్కడ గవర్నమెంటు ప్లీడరు. ఆయన నాకు ఆప్యాయంగా స్వాగతమిచ్చారు.

"ఈవేళ నేను కొంతమంది స్నేహితులతో కలిసి కాశ్మీరుకు బయల్దేరు తున్నాను," అని చెప్పాను. "ఈ హిమాలయ యాత్రకోసం ఎన్నో ఏళ్ళ నుంచి ఎదురు చూస్తున్నాను," అన్నాను.

"చాలా సంతోషం ముకుందా. నీ ప్రయాణం మరింత సుఖంగా జరగడానికి నేను చెయ్యగలిగింది ఏమన్నా ఉందా?"

ఆదరపూర్వకమైన ఈ మాటలతో నాలో ఉత్సాహం పెల్లుబికింది. "బాబయ్యా, నువ్వు మీ నౌకరు లాల్‌ధారీని పంపించగలవా?"

నా ఈ చిన్న విన్నపం భూకంపం పుట్టించినంత పని చేసింది. మా బాబయ్య కుర్చీలోంచి విసురుగా లేచేసరికి, కుర్చీ తిరగబడి, బల్లమీది కాయితాలు అన్ని వేపులకీ చెల్లాచెదరుగా ఎగిరిపోయి, కొబ్బరి చిప్పతో చేసిన, ఆయన పొడుగాటి హుక్కాగొట్టం చటుక్కున కిందపడి పెద్ద రణగొణధ్వని అయింది.

"ఓరి స్వార్థపరుడా! ఎంత విపరీతపు ఆలోచన! నా నౌకర్ని కాస్తా నువ్వు నీ విలాసయాత్రకి తీసుకుపోతే, ఇక్కడ నా అవసరాలు చూసేవాళ్ళెవర్రా?" అంటూ కోపంతో ఊగిపోతూ అరిచాడాయన.

నా ఆశ్చర్యాన్ని బయటపడనివ్వకుండా, సౌమ్యుడైన మా బాబయ్యలో హఠాత్తుగా వచ్చిన ఈ మార్పు, ఈవేళంతా జరిగిన అగమ్యగోచరమైన సంఘటన లకు మరొకటి తోడయినట్టు భావించాను. కోర్టు ఆఫీసు నుంచి నేను తిరుగు మొగం పట్టడంలో హుందాతనం కంటె వేగమే ఎక్కువగా ఉంది.

నేను ఆశ్రమానికి తిరిగి వచ్చేశాను. అక్కడ మా స్నేహితులు నా కోసం ఆశతో ఎదురుచూస్తూ గుమిగూడి ఉన్నారు. గురుదేవుల ధోరణి ఏ మాత్రం అంతుబట్టకపోయినా, తగినంత గుప్తమైన కారణం ఏదో ఉండి ఉంటుందన్న నమ్మకం నాలో పెరుగుతూ వచ్చింది. గురుదేవుల సంకల్పాన్ని నిరోధించే ప్రయత్నం చేసినందుకు నాలో పశ్చాత్తాపం నిండింది.

"ముకుందా, మరి కాసేపు నా దగ్గిర ఉండవా?" అని అడిగారు శ్రీ యుక్తేశ్వర్‌గారు. "రాజేంద్రానూ తక్కినవాళ్ళూ వెంటనే బయల్దేరవచ్చు; వాళ్ళు కలకత్తాలో నీ కోసం కనిపెట్టుకుని ఉంటారు. కలకత్తా నుంచి కాశ్మీరుకు సాయంత్రం బయల్దేరే ఆఖరిబండి అందుకోడానికి చాలా వ్యవధి ఉంటుంది."

"గురుదేవా, మీరు లేకుండా వెళ్ళడం నాకు ఎంతమాత్రం ఇష్టం లేదండి," అన్నాను దిగులుగా.

నేనన్న మాట రవ్వంతకూడా పట్టించుకోలేదు మా స్నేహితులు. ఒక గుర్రబ్బండి తీసుకువచ్చి సామానంతా వేసుకుని వెళ్ళిపోయారు. నేనూ కనాయీ గురుదేవుల పాదసన్నిధిలో ప్రశాంతంగా కూర్చున్నాం. ఒక్క అరగంటసేపు మౌనం దాల్చిన తరవాత గురుదేవులు లేచి, రెండో అంతస్తు భోజనాల గదివేపు వెళ్ళారు

"కనాయీ, ముకుందుడికి అన్నం వడ్డించు. అతని బండి కాసేపట్లో బయల్దేరుతుంది."

నేను కూర్చున్న కంబళి ఆసనంమీంచి లేస్తూ, హఠాత్తుగా వికారం పుట్టి కడుపులో దారుణంగా దేవేస్తూ ఉండడంవల్ల తూలిపోయాను. కత్తితో పొడుస్తున్నట్టుగా కడుపులో తీవ్రంగా పోట్లు రావడంతో, వన్నెవరో దారుణమైన నరక కూపంలోకి హఠాత్తుగా విసిరిపారేసినట్టు అనిపించింది. గుడ్డిగా తడుముకుంటూ వెళ్ళి గురువుగారి ముందు కుప్పగూలిపోయాను. నాలో భయంకరమైన ఏషియాటిక్ కలరా లక్షణాలన్నీ కనిపించాయి. శ్రీయుక్తేశ్వర్‌గారూ, కనాయీ నన్ను కూర్చునే గదిలోకి మోసుకువెళ్ళారు.

"గురుదేవా, నా ప్రాణాన్ని మీ అధీనం చేస్తున్నాను," అంటూ బాధగా అరిచాను; నా శరీరంలోంచి ప్రాణం తొందరగా పోతున్నట్లు అనిపించడమే దానికి కారణం.

శ్రీయుక్తేశ్వర్‌గారు నా తలను తమ ఒళ్ళో పెట్టుకుని దివ్య కారుణ్యంతో నా నుదుటి మీద నిమురుతూ ఇలా అన్నారు :

"చూశావా, ఇప్పుడు నీ స్నేహితులతోబాటు స్టేషనులో ఉండి ఉంటే ఏమయ్యేది? సరిగా ఈ సమయంలో ప్రయాణం పెట్టుకోవడం విషయంలో నువ్వు నా నిర్ణయాన్ని శంకించబట్టే విచిత్రమైన ఈ విధంగా నిన్ను ఆదుకోవలసి వచ్చింది." అన్నారాయన.

చివరికి నేను అర్థం చేసుకున్నాను. మహాపురుషులు తమ శక్తుల్ని బహిరంగంగా ప్రదర్శించడం సముచితం కాదని భావించబట్టే, ఈనాటి సంఘటనల్ని సామాన్య ప్రేక్షకుడు చాలా స్వాభావికంగా పరిగణిస్తాడు. మా గురుదేవుల జోక్యం కనిపెట్టడానికి వీలులేనంత సూక్ష్మమైనది. ఆయన బిహారిద్వారాను, మా బాబయ్య ద్వారాను, రాజేంద్రద్వారాను, తదితరుల ద్వారాను తమ సంకల్పాన్ని అగోచరంగా నెరవేర్చారు. బహుశా నేను మినహా ప్రతి ఒక్కరూ, ఈ సంఘటనల్ని తర్కసంగతంగాను, సామాన్యంగాను భావించారనుకుంటాను.

శ్రీయుక్తేశ్వర్‌గారు సామాజిక కర్తవ్యపాలనలో ఎన్నడూ విఫలురు కానందు వల్ల, ఆయన కనాయిని పంపి ఒక డాక్టర్ని పిలిపించి, మా బాబయ్యకి కూడా కబురుచేశారు.

"గురుదేవా, మీరే నాకు నయం చెయ్యగలరు. ఇప్పుడు ఏ డాక్టరువల్లా నయంకాని పరిస్థితిలో ఉన్నాను," అన్నాను.

"బాబూ, ఈశ్వరకృప నిన్ను కాపాడుతోంది. డాక్టర్నిగురించి నువ్వేమీ దిగులుపడకు; నిన్నీ పరిస్థితిలో చూడడాయన. నీకు ఇప్పటికే నయమై పోయిందిలే."

గురుదేవుల పలుకులతో ఆ తీవ్రమైన బాధ విరగడయిపోయింది. నేను లేచి కూర్చున్నాను. త్వరలోనే డాక్టరుగారు వచ్చారు. నన్ను జాగ్రత్తగా పరీక్ష చేశారు.

"నువ్వు చాలా దారుణమయిన బాధ అనుభవించి ఉంటావని అనిపిస్తోంది. ప్రయోగశాలలో పరీక్ష చెయ్యడానికి నేను కొన్ని మచ్చులు తీసుకువెళ్తాను," అన్నారాయన.

మర్నాడు పొద్దున హడావిడిగా వచ్చారు డాక్టరుగారు. నేను ఉత్సాహంగా లేచి కూర్చున్నాను.

"బాగుంది, బాగుంది. ప్రాణంమీదికి రానివాడిలాగే, చిరునవ్వు చిందిస్తూ బాతాఖానీ కొడుతున్నావు," అంటూ నా చేతిమీద తట్టారాయన. "నేను తీసుకు వెళ్ళిన మచ్చులు పరీక్షించి నీకు వచ్చిన జబ్బు ఏషియాటిక్ కలరా అని కనిపెట్టిన తరవాత నిన్ను ప్రాణాలతో చూస్తానని అనుకోలేదు. నువ్వు అదృష్టవంతుడివి నాయనా! రోగనివారణ చేసే దివ్యశక్తులు గల గురువుగారు నీ కున్నారు! ఆ విషయం నాకు రూఢి అయింది!"

నేను మనసారా అంగీకరించాను. ఆ డాక్టరుగారు వెళ్ళిపోయే ప్రయత్నంలో ఉండగా, రాజేంద్రా ఆడీ గుమ్మంలో కనిపించారు. గదిలో డాక్టర్నీ, ఒక్కరవ్వ నీరసపడ్డట్టు కనిపిస్తున్న నా ముఖాన్నీ చూసిన తరవాత, వాళ్ళ ముఖాల్లో ఉన్న కోపం కాస్తా సానుభూతిగా మారిపోయింది.

"మన మనుకున్న ప్రకారం నువ్వు కలకత్తా బండికి రాకపోయేసరికి మాకు కోపం వచ్చింది. ఏమైనా జబ్బు చేసిందా?"

"ఔను," మా స్నేహితులు తెచ్చిన సామాను, నిన్నటి యథాస్థానంలో పెడుతూ ఉంటే నేను నవ్వు ఆపుకోలేకపోయాను.

"బయల్దేరిందో ఓడ స్పెయిన్‌కు చేరాలని
తిరిగొచ్చింది వెంటనే అడంగుకు చేరకుండానే!"

అన్న పద్యం చదివాను.

గురుదేవులు గదిలోకి వచ్చారు. ఖాయిలాచేసి కోలుకుంటున్నవాడు తీసుకునే చొరవతో, ఆయన చెయ్యి ఆప్యాయంగా పట్టేసుకున్నాను.

'గురూజీ, నా పన్నెండో ఏట మొదలు, చాలాసార్లు హిమాలయాలకు వెళ్ళాలని ప్రయత్నాలు చేశాను; కాని సాగలేదు. చివరికి, మీ దీవెనలు లేనిదే పార్వతీదేవి* నన్ను చేరనివ్వదని నమ్మకం కుదిరింది!"

---

* "పర్వత సంబంధమైనది" అన్నది శబ్దార్థం. పురాణాల్లో, పార్వతీ దేవిని హిమాలయ పర్వతరాజు [హిమవంతుడు] కూతురిగా వర్ణించడం జరిగింది. ఆయన నివాసం, టిబెట్టు సరిహద్దులో ఉన్న ఒకానొక శిఖరం. చేరడానికి శక్యం కాని ఆ శిఖరానికి దిగువన సాగే ప్రయాణికులు, దూరంగా మంచుతో ఏర్పడ్డ గుమ్మటాలూ బురుజాలతో ఒక పెద్ద రాజ ప్రసాదం మాదిరిగా కనిపించే మంచు కొండలూ చూసి విస్మయానందభరితులవుతారు

పార్వతీ, కాళి, దుర్గ, ఉమ, తదితర దేవతలు జగన్మాత భిన్న స్వరూపాలు' ఒక్కొక్క ప్రయోజనాన్ని అనుసరించి ఒక్కొక్క నామసంకేతం ఏర్పడింది. దేవుడు లేదా శివుడు తన పరాప్రకృతి అయిన అతీతస్థితి కారణంగా సృష్టికార్య విషయంలో క్రియారహితుడయి ఉంటాడు. ఆయన తన శక్తి (క్రియాశీల శక్తి)ని తన "సతు"లకు అప్పగించడం జరిగింది, బ్రహ్మాండంలో అనంతమైన వివరాలు అభివ్యక్తమయేటట్టు చేసేవారు, ఈ సృజనాత్మక "నారీ" శక్తులే

హిమాలయాలు శివుడికి నివాసస్థానమని చెబుతాయి పురాణ గాథలు. హిమ లయాల్లో పుట్టిన నదులకు అధిష్ఠాత్రిగా, గంగాదేవి దివి నుంచి భువికి దిగింది. అందువల్లే గంగ స్వర్గం నుంచి దిగివచ్చి, "యోగీశ్వరేశ్వరుడూ" త్రిమూర్తుల్లో లయం ద్వారా పునర్జీవనమిచ్చే శివుడి జటాజూటం ద్వారా భూమికి అవతరించిందని కావ్యాల్లో చెబుతారు. భారతీయుల షేక్స్పియర్ మహాకవి కాళిదాసు, హిమాలయాల్ని "పరమశివుడి అట్టహాసరూపం"గా అభివర్ణించాడు ద లెగసీ ఆఫ్ ఇండియా" (భారతదేశ వారసత్వం; ఆక్స్‌ఫర్డ్) అనే గ్రంథంలో ఎఫ్. డబ్ల్యు. థామస్ ఇలా రాస్తాడు : "శివుడి తెల్లటి పలువరసను పాఠకుడు ఎలాగో ఊహించుకోగలగవచ్చు. కాని, అతడు, ఉత్తుంగ శిఖరాయమానమైన పర్వతలోకాన్ని అధిష్ఠించిన పరమేశ్వర స్వరూపాన్నీ, దివినుంచి దిగివచ్చిన గంగ ఉరకలువేస్తున్న శివజటాజూటాన్నీ, ఆపైనున్న సిగపువ్వు మాదిరి చంద్రబింబాన్నీ అనుభూతం చేసుకుంటేనే తప్ప ఆయన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకోలేడు."

హిందూ చిత్రకళలో తరచుగా, నల్లటి జింకచర్మం కట్టుకున్నట్టుగా శివుణ్ణి చిత్రిస్తూండడం కద్దు రాత్రిపూట చీకటికీ, అగోచరతకూ అది ప్రతీక. ఆ 'దిగంబరుడు' ధరించే ఏకైక వస్త్రం

---

అదే. తనదన్నది ఏదీ లేకుండా, అన్నీ తనవే అయిన ఈశ్వరుడి గౌరవార్థం, శైవశాఖీయుల్లో కొందరు ఒంటిమీద ఏమీ ధరించకుండానే ఉంటారు.

కాశ్మీరులో విలసిల్లిన సాధుకోటిలో, 14వ శతాబ్దిలో జీవించిన లల్లాయోగీశ్వరి ఒకతె. ఆ శివభక్తురాలు దిగంబరి. ఆవిడ సమకాలికుల్లో పంశయాళువొకడు, ఆవిడ దిగంబరిగా ఉండడానికి కారణమేమిటని అడిగాడు. "ఎందుకుండగూడదు? నా కిక్కడ మగవాళ్ళెవళ్ళూ కనిపించడం లేదు," అంటూ వాడిగా జవాబిచ్చిందావిడ. కొద్దిగా తీవ్రమైన ఆవిడ ఆలోచనా దృష్టిలో, ఈశ్వరానుభూతి లేనివాడు "మగవాడు" అని అనిపించుకోడానికి అర్హుడు కాడన్నమాట. ఆవిడ క్రియాయోగానికి సన్నిహితమైన యోగవిద్య ఒకటి సాధనచేసింది. ముక్తిని ప్రసాదించడంలో దానికి గల శక్తిని ఆవిడ అనేక పద్యాల్లో ప్రస్తుతించింది. వాటిలో ఒకదాన్ని ఇక్కడ అనువదిస్తాను:

ఏ దుఃఖహాలాహలం తాగలేదు నేను?
చావుపుట్టుకల చక్రగతులెన్నెన్నో నావి.
ఆహో, అమృతంతో నిండింది నా పాత్ర
శ్వాసప్రక్రియా సాధన ఫలాన్ని పొంది.

ఆవిడ మానవసహజమైన మరణానికి గురికాకుండా, తన దేహాన్ని అగ్నికి ఆహుతి చేసింది. తరవాత, శోకతప్తులైన పురజనుల ముందు బంగారు దుస్తులు ధరించి సజీవంగా ప్రత్యక్షమైంది - చిట్టచివరికి ఒంటినిండా బట్టకట్టుకొని.

అధ్యాయం : 21

# మేము కాశ్మీరు వెళ్ళాం

"ఇప్పుడు నీకు ప్రయాణం చెయ్యడానికి తగినంత బలం వచ్చింది. నేను నీతో కాశ్మీరు వస్తాను," అన్నారు శ్రీయుక్తేశ్వర్‌గారు; కలరా అద్భుతంగా నయమై నేను కోలుకున్న రెండు రోజుల తరవాత.

ఆ రోజు సాయంత్రం మా జట్టు ఆరుగురం కలిసి ఉత్తరదేశానికి వెళ్ళే బండి ఎక్కాం. మేము తీరుబాటుగా ఆగిన మొట్టమొదటి ఊరు సిమ్లా; హిమాలయ పర్వతాలనే సింహాసనం మీద కుదురుగా కూర్చున్న నగరరాణి ఇది. అద్భుతమైన దృశ్యాల్ని చూసి ఆనందిస్తూ ఏటవాలు వీధుల్లో సంచరించాం.

"ఇంగ్లీషు స్ట్రాబెరీలున్నాయి," అని అరుస్తూ ఒక ముసలామె, అందమైన ఆరుబయటి అంగడి వీధిలో కూర్చుని ఉంది.

చిత్రమైన ఆ చిన్నచిన్న ఎర్రటి పళ్ళమీద గురుదేవులకు ఆసక్తి కలిగింది. ఆయన ఒక పెద్ద బుట్టెడు పళ్ళుకొని, పక్కనున్న నాకూ కనాయికీ పెట్టారు. ఒక పండు రుచి చూసి వెంటనే తుపుక్కున నేలమీద ఉమ్మేశాను.

"పులుపు రొడ్డండి సార్! స్ట్రాబెరీలు నాకు ఒక్కనాటికి నచ్చవు!"

మా గురుదేవులు నవ్వారు. "ఆఁహాఁ, నీకు నచ్చుతాయవి - అమెరికాలో. అక్కడొకరి ఇంటికి నువ్వు భోజనానికి వెళ్ళినప్పుడు, నీకు ఆతిథ్యమిచ్చే ఆవిడ, వాటిలో పంచదారా మీగడావేసి ఇస్తుంది. ఆ పళ్ళని ఆవిడ ఫోర్కుతో బాగా ఎనిపిన తరవాత నువ్వు రుచి చూసి, 'ఎంత రుచిగల స్ట్రాబెరీలు!' అంటావు. అప్పుడు నీకు గుర్తు వస్తుంది, సిమ్లాలో ఈ రోజు.

(శ్రీయుక్తేశ్వర్‌గారు చెప్పిన జోస్యం నా మనస్సులోంచి తొలగిపోయింది. కాని చాలాఏళ్ళ తరవాత, నేను అమెరికాలో అడుగుపెట్టిన కొత్తలో మళ్ళీ మనస్సులో మెదిలింది. మెసాచుసెట్స్‌లోని వెస్ట్ సోమర్విల్‌లో మిసెస్ ఆలిస్ టి.

హేస్ అనే ఆవిడ ఇంట్లో భోజనానికి పిలిస్తే వెళ్ళాను. భోజనాల బల్లమీద స్ట్రాబెరీల డిసర్ట్ పెట్టినప్పుడు, మా ఆతిథేయిని ఒక ఫోర్కు తీసుకొని, బెరీ పండ్లకు మీగడా పంచదారా కలిపి, వాటిని బాగా ఎనిపింది. "ఈ పండు కాస్త పుల్లగా ఉంటుంది; దీన్నిలా చేస్తే మీకు నచ్చుతుందనుకుంటాను," అన్నదామె. నేను నోరుపట్టినంత తీసి పెట్టుకున్నాను. "ఎంత రుచిగల స్ట్రాబెరీలు!" అంటూ ఆశ్చర్యం ప్రకటించాను. వెంటనే, సిమ్లాలో మా గురుదేవులు చెప్పిన జోస్యం అగాధమైన నా స్మృతిగహ్వారం లోంచి బయల్పడింది. దైవానుసంధానశీలకమైన ఆయన మనస్సు చాలాకాలం కిందటే, భవిష్యదాకాశంలో సంచరించే కర్మ సంబంధమైన కార్యక్రమాన్ని కనిపెట్టి నందుకు నేను అప్రతిభుణ్ణయాను).

త్వరలోనే మా బృందం సిమ్లా విడిచి, రావల్పిండి బండి ఎక్కింది. అక్కడ మేము జోడుగుర్రాలు పూన్చిన గూడు బండి ఒకటి శ్రీనగర్ రానుపోను ప్రయాణానికి ఒక వారం రోజులపాటు అద్దెకు తీసుకుని బయల్దేరాం. శ్రీనగర్ కాశ్మీరుకు రాజధాని. మేము ఉత్తరదిశకు ప్రయాణం సాగించిన రెండోనాడు హిమాలయాల నిజమైన విస్తారం మా కంటబడింది. మా బండికున్న ఇనప చక్రాలు, మలమల మాడుతున్న రాతిగొట్టు బాటల్లో కీచుమని రొదచేస్తూ సాగుతూ ఉండగా, ఆ పర్వతశోభలో మారుతున్న తరుశ్రేణుల రామణీయకతకు మేమంతా ముగ్ధుల మయిపోయాం.

"గురుదేవా, మీ పావన సాహచర్యంలో ఈ మనోహరదృశ్యాలు చూస్తూ ఎంతో ఆనందిస్తున్నానండి," అంటూ గురుదేవులతో అన్నాడు ఆడీ. ఆ ప్రయాణానికి నేను ఆతిథేయిగా వ్యవహరిస్తున్నందువల్ల, ఆడీ మెప్పుకి నాలో రవ్వంత ఉల్లాసం పెల్లుబికింది. శ్రీయుక్తేశ్వర్‌గారు నా ఆలోచన పసిగట్టారు; నావేపు తిరిగి గుసగుసలాడారు :

"నిన్ను నువ్వు ఉబ్బేసుకోకు; ఆడీ, మనని విడిచిపెట్టి పోయి ఒక సిగరెట్టు కాల్చుకురావడానికి దొరికే అవకాశాన్ని తలుచుకుని ముగ్ధుడవుతున్నంతగా ఈ ప్రకృతి దృశ్యానికి ముగ్ధుడవడం లేదు," అన్నారాయన.

నేను అదిరిపడ్డాను. గొంతు తగ్గించి గురుదేవులతో ఇలా అన్నాను, "గురుదేవా, మీరు దయచేసి ఇలాటి వెగటు మాటలతో మా పొత్తు చెడగొట్టకండి. ఆడీ ఒక దమ్ముకోసం ఆరాటపడుతున్నాడంటే నేను ఒక్కనాటికి నమ్మను." మామూలుగా, ఎవరూ అదుపుచెయ్యడానికి లొంగని మా గురుదేవుల వేపు అనుమానంగా చూశాను నేను.

"సరేలే, నేను ఆడీతో ఏమీ అనను," అంటూ గురుదేవులు ముసిముసిగా

న్నారు. "కాని నువ్వే కాసేపట్లో చూస్తావు; మన బండి ఆగినప్పుడు అతను ఆ అవకాశం జారనివ్వడు."

మా బండి ఒక చిన్న బిడారు సత్రం (కారవాన్ సరాయి) దగ్గరికి చేరుకుంది. మా గుర్రాలకి నీళ్ళు పట్టడానికి తోలుకు వెడుతున్నాడు బండివాడు. అపుడు ఆడీ అడిగాడు, "గురుదేవా నేను కాసేపు బండిలో బండివాడితో పాటు కూర్చుంటే మీకేమైనా అభ్యంతరమాండి? నాకు కొంచెం బయటిగాలి పీల్చుకోవాలని ఉంది."

శ్రీయుక్తేశ్వర్‌గారు అనుమతి ఇచ్చారు. కాని, "అతనికి కావలసింది స్వచ్ఛమైన గాలి కాదు, స్వచ్ఛమైన దమ్ము," అన్నారాయన నాతో.

బండి మళ్ళీ బయల్దేరి, దుమ్ము రోడ్లమీద రొదచేసుకుంటూ ముందుకు సాగింది. గురుదేవుల కళ్ళు మిలమిల మెరుస్తున్నాయి; ఆయన నాతో అన్నారు:

"బండి తలుపులోంచి మెడ సారించి స్వచ్ఛమైన గాలితో ఆడీ చేస్తున్న దేమిటో చూడు."

ఆయన చెప్పినట్లు చేశాను. ఆడీ, రింగులు రింగులుగా సిగరెట్టు పొగ వదిలే కార్యక్రమంలో ఉండగా చూసి దిగ్భ్రాంతి చెందాను. క్షమార్పణ కోరుతున్న ట్టుగా శ్రీయుక్తేశ్వర్‌గారి వేపు చూశాను.

"మీరే రైటండి; ఎప్పటిలాగే. ఆడీ ప్రకృతి దృశ్యంతోబాటు పొగనికూడా ఆస్వాదిస్తున్నాడు." మా స్నేహితుడు దాన్ని బండివాడి దగ్గర తీసుకుని ఉంటాడు; ఆడీ కలకత్తానుంచి సిగరెట్లేమీ తీసుకురాలేదని నాకు ముందే తెలుసు.

నదులూ, లోయలూ నిటారుగా నిలిచిన కొండ కొమ్ములూ, అసంఖ్యాక మైన పర్వత శ్రేణులూ గల దృశ్యాలు చూసి ఆనందిస్తూ గజిబిజి దారిగుండా ప్రయాణం సాగించాం. ప్రతి రాత్రీ మే మొక నాటు సత్రం దగ్గర ఆగి అన్నాలు వండుకునే వాళ్ళం. నేను భోంచేసినప్పుడల్లా నిమ్మరసం తీసుకోవాలని పట్టుబడుతూ శ్రీయుక్తేశ్వర్‌గారు, నా పథ్యం విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. అప్పటి కింకా నీరసంగానే ఉన్నాను. బరబరలాడే ఆ బండి కచ్చితంగా మా అసౌకర్యం కోసమే తయారై ఉన్నప్పటికీ - అప్పటికింకా నేను నీరసంగానే ఉన్నా - రోజు రోజుకీ ఆరోగ్యం మెరుగవుతోంది.

మేము మధ్య కాశ్మీరుకు చేరువవుతూ ఉండగా, పద్మ సరోవరాల దివ్య లోకం, నీటిమీద తేలే తోటలు, అందాల గుడ్డపందిళ్ళు వేసిన నావ ఇళ్ళు, అనేక

వంతెనలుగల జీలంనది, పూలు పరిచినట్టున్న గడ్డి మైదానాలు, వీటన్నిటినీ చుట్టిఉన్న హిమాలయాలు చూడబోతున్నామన్న ఆనందం మా హృదయాల్లో నిండింది.

మేము శ్రీనగర్‌కు వెళ్ళే దారికి ఇటూఅటూ ఉన్న పొడుగాటి చెట్లు స్వాగతం పలుకుతున్నాయి. ఎత్తయిన కొండల నేపథ్యంలో ఉన్న రెండంతస్తుల సత్రంలో మేము గదులు తీసుకున్నాం. అక్కడ నీటి కుళాయిల సౌకర్యం లేదు; దగ్గరలో ఉన్న నూతిలోంచి నీళ్ళు తోడుకునే వాళ్ళం. వేసవి వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది : వెచ్చటి పగళ్ళూ చిరుచలి రాత్రులూ.

శ్రీనగర్‌లో శంకరాచార్య స్వామివారి ప్రాచీన ఆలయానికి యాత్ర చేశాం. ఆకాశంలో ఉవ్వెత్తుగా నిలిచిన ఆ గిరిశిఖరాశ్రమం మీదికి చూపు సారించి తదేకంగా చూస్తున్నప్పుడు నేను దివ్యానంద సమాధి స్థితిలోకి వెళ్ళిపోయాను. ఎక్కడో ఒక దూరదేశంలో కొండమీద నెలకొన్న ఒక భవనం తాలూకు దృశ్యం నాకు గోచరమయింది; శ్రీనగర్‌లో మహోన్నతంగా నెలకొన్న ఆ శంకరాచార్య ఆలయం రూపాంతరం చెందుతూ, అనేక సంవత్సరాల అనంతరం నేను అమెరికాలో స్థాపించిన సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ ప్రధాన కార్యస్థాన భవనంగా మారినట్టు దర్శనమయింది (నేను మొట్టమొదట కాలిఫోర్నియాలో లాస్ ఏంజిలిస్‌ను సందర్శించి మౌంట్ వాషింగ్టన్ కొండ కొమ్మునున్న పెద్ద భవనాన్ని చూసినప్పుడు, అంతకు పూర్వం ఎప్పుడెప్పుడో, కాశ్మీరులోనూ ఇతర చోట్లా నాకు కలిగిన అంతర్దర్శనాన్ని బట్టి వెంటనే దాన్ని గుర్తు పట్టాను).

శ్రీనగర్‌లో కొన్నాళ్ళు ఉన్నాం ; ఆ తరవాత ఎనభై ఐదు వందల అడుగుల ఎత్తున ఉన్న గుల్మార్గ్ (పూల దారులు)కు బయలుదేరాం. నేను మొట్ట మొదటిసారిగా భారీ గుర్రం మీద స్వారి చేసింది అక్కడే. రాజేంద్ర చిన్న గుర్రం ఎక్కాడు; కాని దానికి వడివడిగా పోవాలన్న ఆరాటం ఎక్కువ. చాలా నిటారుగా ఉండే ఖిలన్ మార్గ్‌లోనే పైకి పోవడానికి సాహసించాం మేము; అయితే ఆ దారి పుట్టగొడుగుచెట్లు దండిగా ఉండే దట్టమైన అడవిగుండా సాగింది, అక్కడ మంచు కప్పిన దారులు తరచు ప్రమాదకరంగా ఉంటాయి. కాని రాజేంద్రుడి చిట్టిగుర్రం, నా భారీ గుర్రానికి చాలా ప్రమాదకరమైన మలుపుల్లో కూడా, ఒక్క చిటికెసేపు విశ్రాంతి నివ్వలేదు. పోటీలో కలిగే సంబరం తప్ప మరేమీ ఎరగని రాజేంద్రుడి గుర్రం, అలుపూసొలుపూ లేకుండా మునుముందుకు సాగుతూనే ఉంది.

హైరాణ పెట్టిన మా పందేనికి మనోహరమైన దృశ్యరూపంలో బహుమానం

దొరికింది. ఈ జన్మలో మొట్టమొదటిసారిగా, హిమాచ్ఛాదితమైన ఉత్తుంగ హిమాలయాల్ని అన్ని వేపులనుంచీ చూశాను; ధ్రువ ప్రాంతపు పెద్దపెద్ద ఎలుగు బంట్ల స్థూలాకృతుల మాదిరిగా దొంతులు పేర్చినట్లు ఉన్నాయి ఆ కొండలు. సూర్యకాంతి ప్రసరించిన నీలాకాశ నేపథ్యంలో అనంతదూరాలకు వ్యాపించి ఉన్న మంచు కొండల్ని అవలోకిస్తూ ఆనందాతిరేకంతో విందులు చేసుకున్నాయి నా కళ్ళు.

తళతళ మెరిసే మంచుకొండవాలుల్లో, కుర్రకారు సావాసగాళ్ళతో నేను ఆనందంగా దొర్లాను; మేమంతా పెద్ద దళసరి కోట్లు ధరించి ఉన్నాము. మా దిగుదల ప్రయాణంలో, దూరాన విశాలమైన ఒక పసుప్పచ్చ పూల తివాసీ చూశాం; వెలవెలబోయిన కొండల స్వరూపాన్ని పూర్తిగా మార్చేస్తోందది.

మా విహారయాత్రల్లో ఆ తరవాత సందర్శించినది జహంగీర్ చక్రవర్తి, షాలిమార్‌లోనూ నిశాత్‌లోనూ నిర్మించిన ప్రఖ్యాత "విలాస ఉద్యానవనాలు." నిశాత్ బాగ్‌లోని పురాతన భవనం, సూటిగా సహజమైన ఒక జలపాతం మీద నిర్మించినది. కొండల మీంచి ఉరకలువేస్తూ వచ్చి పడుతున్న ఉద్ధృత ప్రవాహాల్ని, ఉపాయంగా పన్నిన యంత్ర సాధనాలతో క్రమబద్ధం చేసి, వన్నెవన్నెల డాబాల మీంచి పారేటట్టూ, కళ్ళు మిరుమిట్లు గొలిపే పూలమళ్ళ మధ్య కారంజీలోకి నీళ్ళు చిమ్మేటట్టూ చేశారు. నీటి ప్రవాహం ఆ భవనంలోకి చాలా గదుల్లోకి కూడా ప్రవేశిస్తుంది. చివరికొక వనదేవతలా, దిగువనున్న సరస్సులోకి దిగివచ్చి పడుతుంది. గులాబీలు, మల్లెలు, కలవలు, స్నాప్ డ్రాగన్లు, పాన్సీలు, లవెండర్లు గసగసాలు - ఒకటేమిటి, రకరకాల పూలు స్వేచ్ఛగా వన్నెలు వెదజల్లుతూ ఉంటాయి విశాలమైన ఉద్యానవనాల్లో. చినార్, సైప్రస్, చెరీ చెట్లు తీర్చిదిద్దినట్టున్న వరసల్లో పచ్చల ఒడ్డాణం పెట్టినట్టుంటాయి; వాటి కవతల హిమాలయోత్తుంగ శిఖరాలు కఠోర తపస్సులో ఉన్నట్టుంటాయి.

కాశ్మీరు ద్రాక్షలనే పళ్ళు కలకత్తా వాళ్ళకి అపురూపం. కాశ్మీరులో మాకోసం ద్రాక్షపళ్ళ విందు ఎదురుచూస్తూ ఉంటుందని చెబుతూవచ్చిన రాజేంద్రుడు, అక్కడ పెద్ద ద్రాక్షతోటలేవీ అవుపడక, నిరాశ చెందాడు. వాడి నిరాధారమైన ఆశకు నేను అడపాదడపా వాణ్ణి దెప్పిపొడుస్తూనే వచ్చాను.

"ఓహ్, పీకలమొయ్యా ద్రాక్షపళ్ళు తినేసి నేను నడవలేకపోతున్నాను!" అనేవాణ్ణి "కంటికి కనబడని ద్రాక్షపళ్ళు నాలో సారా కాచేస్తున్నాయి!" ఆ తరవాత విన్నాం, తియ్య ద్రాక్షలు కాశ్మీరుకు పడమట, కాబూలులో సమృద్ధిగా పండుతాయని. చివరికి 'రబ్డీ' (బాగా గడ్డకట్టించిన పాలు)తో తయారుచేసి, పిస్తాపప్పు గుండ్లతో పరిమళం తెప్పించిన ఐస్‌క్రీమ్‌తోనే మేము సరిపెట్టుకున్నాం.

మేము 'షికారా'లనే చిన్న పడవల్లో తిరిగాం; ఈ పడవల్లో నీడ ఇవ్వడానికి, ఎరుపు కసీదాలు కుట్టిన గుడ్డ పందిళ్ళున్నాయి. దాల్ సరస్సుకు జలమయమైన సాలెగూడు వంటి కాలవలు అల్లుకొని ఉన్నాయి. వాటిలో చాలాసార్లు తిరిగాం. ఇక్కడ నీటిమీద తేలే తోటలు లెక్కలేనన్ని ఉన్నాయి. కొయ్యబాదులూ మట్టీ పెట్టి నాటురకంగా తయారుచేసిన ఈ తోటలు చూసి దిగ్భ్రమ చెందుతాం; విశాలమైన నీళ్ళమధ్య కూరగాయలూ, పుచ్చకాయలూ పెరుగుతూ కనిపించడమే పెద్ద విడ్డూరం. అప్పుడప్పుడు ఒక్కొక్క రైతు కనిపిస్తూ ఉంటాడు; 'నేలకు పాతుకుపోయి ఉండడ' మంటే రోత పుట్టి కాబోలు, తన నల్చదరం "భూమి"ని, అనేక శాఖలు గల ఆ సరస్సులో మరో కొత్తచోటికి లాక్కుపోతూ ఉంటాడు.

ఈ అంతస్తుల లోయలో ప్రపంచం అందాలన్నీ సూక్ష్మరూపంలో ఆవిర్భవించినట్టు అవుపిస్తాయి. కాశ్మీర పట్టమహిషికి కొండలే కిరీటం, సరస్సులు పుష్పహారాలు, పూలు పాదరక్షలు. తరవాత కాలంలో నేను అనేక దేశాల్లో పర్యటించిన తరవాత, కాశ్మీరును ప్రపంచంలోకల్లా అందమైన ప్రకృతి దృశ్యాలు గల ప్రదేశంగా తరచు ఎందుకంటూ ఉంటారో అవగాహన చేసుకున్నాను. స్విట్జర్లాండ్‌లోని ఆల్ప్స్ పర్వతాలకు, స్కాట్లండ్‌లోని లాచ్ లోమండ్‌కు, అద్భుతమైన ఇంగ్లీషు సరస్సులకు ఉన్న అందాలు కొన్ని దానికి ఉన్నాయి. కాశ్మీరు వచ్చే అమెరికా యాత్రికుడికి, అలాస్కాలోని ఎగుడుదిగుడు కొండల శోభనూ డెన్వర్ సమీపంలో ఉన్న పైక్ శిఖరాన్నీ గుర్తుకు తెచ్చేవి చాలా ఉన్నాయి.

ప్రకృతి దృశ్యాలు అందాల పోటీలో ప్రథమ బహుమతికి నేను, మెక్సికోలోని జోఖిమిల్కో అద్భుత దృశ్యాన్నికాని, కాశ్మీరులోని సరస్సుల్ని కాని పోటీకి నిలబెడతాను. జోఖిమిల్కోలోని అనేక జలదారులలో ఉల్లాసంగా తిరిగే చేపల నడుమ మబ్బులూ, కొండలూ, పాప్లర్‌చెట్లూ ప్రతిఫలిస్తూ ఉంటాయి. కాశ్మీరు సరస్సులు అందాల కన్నెలయితే, వాటిని తీవ్రంగా ఒక కంట కనిపెట్టి వాటికి కాపుదల కల్పించేవి హిమాలయాలు. ఈ ప్రదేశాలు రెండూ భూమిమీదున్న మనోహర ప్రదేశాలన్నిటిలోకి అత్యుత్తమంగా నా మనస్సులో ప్రముఖంగా నిలిచిపోతాయి.

అయినప్పటికీ, యెల్లోస్టోన్ జాతీయ ఉద్యానమూ కొలరాడోలోని గ్రాండ్ కాన్యానూ మరియు అలాస్కా ప్రదర్శించే అద్భుతాలూ దర్శించినప్పుడు నేను అప్రతిభుణ్ణి అయాను. లెక్కలేనన్ని ఉడుకునీటి బుగ్గలు, దాదాపు గడియారం పనిచేసేటంత క్రమబద్ధతతో, గాలిలో ఉవ్వెత్తుగా ఎగజిమ్ముతూ ఉండడం భూమిమీద, బహుశా ఒక్క యెల్లోస్టోన్ ప్రాంతంలో తప్ప మరెక్కడా చూడమనుకుంటాను. ఈ అగ్నిపర్వత ప్రాంతంలో ప్రకృతి, పూర్వసృష్టి తాలూకు నమూనా ఒకటి విలిపి ఉంచింది: ఉష్ణగంధకం ఊటలూ, విమలక, నీలమణి వర్ణాల

మడుగులూ, ఉద్వృతమైన నీటి బుగ్గలూ, స్వేచ్ఛగా తిరుగుతుండే ఎలుగు బంట్లూ, తోడేళ్ళూ, అడవిదున్నలూ, ఇతర వన్యప్రాణులూ అవుపిస్తాయి. వ్యోమింగ్ రోడ్ల వెంబడి మోటారుకారులో ప్రయాణించేస్తూ "డెవిల్స్ పెయింట్ పాట్" (రాకాసి రంగుల బాన) అనే, బుడగలు వచ్చే ఉడుకుడుకు బురదనేల వరకు సాగుతూ, గలగలలాడే నీటి ఊటల్నీ, ఎగిసిపడే నీటి బుగ్గల్నీ, ఆవిరి కారంజీల్నీ గమనిస్తూ ఉన్నప్పుడు, యెల్లోస్టోన్‌కున్న విశిష్టతనుబట్టి, అది ప్రత్యేక బహుమతి పొందడానికి అర్హమైందని చెప్పాలనిపించేది.

కాలిఫోర్నియాలో యోస్‌మైట్‌లో ఉన్న పురాతన సతత హరిత శంక్వాకార వృక్షాలు రాచఠీవితో, భారీ స్తంభాలు ఆకాశంలో పైపైకి చొచ్చుకుపోతున్నట్టుగా సాగిపోతూ, దివ్యనైపుణ్యంతో రూపకల్పన చేసిన సహజమైన ఆకుపచ్చ గుడి గోపురాలు. ప్రాచ్య ప్రపంచంలో అద్భుతమైన జలపాతాలు ఉన్నప్పటికీ, కెనడా సరిహద్దున న్యూయార్కులో ఉన్న నయాగరా ఉద్వృత సౌందర్యానికి వాటిలో ఏదీ దీటురాదు. కెంటకీలో ఉన్న బ్రహ్మాండమైన గుహ, న్యూ మెక్సికోలో ఉన్న కార్ల్స్‌బాడ్ కొండ గుహలూ చిత్రమైన గంధర్వలోకాలు. గుహల పై కప్పులనుంచి కిందికి వేలాడుతూ కింది నీళ్ళలో ప్రతిబింబించే పొడుగాటి సున్నపురాతి స్తంభాలు, మానవుడు ఊహించిన పరలోక సౌందర్యాన్ని ప్రకాశింపజేస్తాయి.

కాశ్మీరులో, అందానికి ప్రపంచ ప్రఖ్యాతి పొందిన ప్రజలు చాలామంది, యూరోపియన్లంత తెల్లగానూ ఉంటారు; వాళ్ళలాగే మొక్కట్లు, అస్థినిర్మాణమూ ఉంటాయి; చాలామందికి నీలికళ్ళూ లేతవన్నె జుట్టూ ఉంటాయి. పాశ్చాత్య దుస్తులు ధరించినప్పుడు వాళ్ళు అమెరికన్లలా కనిపిస్తారు. హిమాలయాల చల్లదనం కాశ్మీరీలకు, ఎండ ఉడుకుకు ఉపశమనం కలిగించి శరీరచ్ఛాయ లేతవన్నెలో ఉండేటట్టు చేస్తుంది. భారతదేశపు ఉష్ణమండల అక్షాంశరేఖల వెంబడి దక్షిణాన దిగువకు ప్రయాణం చేసేవాళ్ళు, రానురాను మరింత నలుపు దేరినవాళ్ళను చూస్తారు.

కాశ్మీరులో కొన్ని వారాలపాటు ఆనందంగా గడిపిన తరవాత, శ్రీరాంపూర్‌లో కాలేజి తెరిచే రోజులు దగ్గర పడడంతో నేను బెంగాలు తిరిగి వెళ్ళడానికి ఏర్పాట్లు చేసుకోవలసి వచ్చింది. శ్రీయుక్తేశ్వర్‌గారు, కనాయి, ఆడీ శ్రీనగర్‌లో మరికొన్నాళ్ళపాటు ఉండిపోవలసి వచ్చింది. నేను బయలుదేరడానికి కొద్దిగా ముందు గురుదేవులు, తమ దేహం కాశ్మీరులో బాధకు గురికావలసి వస్తుందని సూచనగా తెలియజేశారు.

"గురుదేవా, మీ ఆరోగ్యం నిక్షేపంలా ఉంది," అన్నాను నేను అభ్యంతరం తెలుపుతూ.

"నేను ఈ లోకాన్ని వదిలేసే అవకాశం కూడా లేకపోలేదు," అన్నారాయన.

"గురూజీ! ఇప్పుడప్పుడే ఈ దేహాన్ని విడిచిపెట్టనని మాట ఇవ్వండి. మీరు లేకుండా గడుపుకోడానికి నేను బొత్తిగా సిద్ధపడలేదు," అంటూ ప్రాధేయపూర్వకంగా ఆయన పాదాల మీద పడ్డాను.

శ్రీయుక్తేశ్వర్‌గారు మౌనం వహించారు; కాని దయార్ద్రదృష్టితో ఆయన నవ్విన చిరునవ్వువల్ల ఆయన నాకు భరోసా ఇచ్చినట్టనిపించింది. మనస్సు ఒప్పకపోయినా ఆయన్ని విడిచి వెళ్ళిపోయాను.

"గురుదేవులు ప్రమాదకరమైన జబ్బులో ఉన్నారు." ఆడీ ఇచ్చిన ఈ తంతి, నేను శ్రీరాంపూర్‌కు తిరిగివచ్చిన కొన్నాళ్ళకు నాకు అందింది.

"గురుదేవా, మీరు నన్ను విడిచి వెళ్ళనని మాట ఇమ్మని మిమ్మల్ని కోరుకున్నాను. మీరు దయచేసి దేహాన్ని నిలుపుకోండి; లేకపోతే నేను కూడా చచ్చిపోతాను," అంటూ నేను, వ్యగ్రంగా మా గురుదేవులకు ఒక తంతి ఇచ్చాను.

"నీ కోరికే నెరవేరనియ్యి." కాశ్మీరునుంచి గురుదేవుల సమాధానమిది.

కొన్నాళ్ళలో ఆడీ దగ్గర్నించి ఉత్తరం వచ్చింది; అందులో, గురుదేవులు కోలుకున్నారని రాశాడు. ఆ మరుసటి పక్షంలో శ్రీరాంపూర్‌కు తిరిగి రాగానే గురుదేవుల దేహాన్ని చూద్దునుకదా, బరువుతగ్గి చిక్కి సగమయారు. నా కెంతో దుఃఖం కలిగింది.

శ్రీయుక్తేశ్వర్‌గారు, శిష్యుల అదృష్టంవల్ల, వాళ్ళ పాపాల్లో చాలా మట్టుకు కాశ్మీరులో ఆయనకు వచ్చిన తీవ్రజ్వరాగ్నిలో దగ్ధం చేసేశారు. జబ్బును భౌతికంగా బదలాయింపు చేసే ఆధ్యాత్మికపద్ధతి, బాగా ఉన్నత స్థితికి చేరుకున్న యోగులకు తెలుసు. బలహీనుడు పెద్ద బరువు మోసుకోడానికి బలమయినవాడు సాయపడవచ్చు; ఆధ్యాత్మికంగా ఉత్కృష్టస్థితి నందుకున్న అతీత మానవుడు, కర్మ సంబంధమైన భారాల్లో కొంతభాగం తాను వహించి తన శిష్యుల శారీరక మానసిక బాధల్ని కనీస స్థాయికి తగ్గిస్తాడు. ధనవంతుడొకడు, వ్యర్థుడైన తన కొడుకు చేసిన పెద్ద అప్పు తాను తీర్చేసి దానివల్ల కలిగే విపత్కర పరిణామాలనుంచి అతన్ని ఎలా రక్షిస్తాడో, అదే విధంగా గురువు, తన శిష్యుల దైన్యాన్ని తగ్గించడానికి తన శారీరక సంపదలో కొంత భాగాన్ని ఇచ్ఛాపూర్వకంగా త్యాగం చేస్తాడు.*

* థెరిసా నాయిమన్ (చూ.పే.461)తో సహా అనేకమంది క్రైస్తవ సాధువులకు ఈ విధంగా ఆత్మశక్తితో వ్యాధుల్ని బదిలీచేసుకోవడం తెలుసు.

ఒకానొక రహస్య యోగపద్ధతి ద్వారా సాధువు తన మనస్సునూ సూక్ష్మ దేహాన్నీ పీడిత వ్యక్తి మనస్సుతోనూ సూక్ష్మదేహంతోనూ అనుసంధానం చేస్తాడు ఆ జబ్బు పూర్తిగాగాని కొంతమట్టుకుగాని యోగి భౌతికరూపానికి సంక్రమించడం జరుగుతుంది. అయితే యోగి, దేహమనే పొలంలో దేవుడనే పంటను కోసి కుప్పవేసుకున్నందువల్ల ఇక ఆ దేహంతో ఆయనకి ప్రమేయం ఉండదు. ఇతరుల బాధలు తొలగించడానికి ఆయన దాన్ని జబ్బుపడనిచ్చినా, కాలుష్యానికి లోను కాజాలని ఆయన మనస్సు ఎటువంటి ప్రభావానికీ లోనుకాదు. అటువంటి సహాయం చెయ్యగలుగుతున్నందుకు తాము అదృష్టవంతులమని అనుకుంటారు. చివరికి మోక్షం పొంది ఈశ్వర సాయుజ్యం సాధించడమంటే, నిజానికి, మానవ శరీరం దాని ప్రయోజనాన్ని పూర్తిగా నెరవేర్చేటట్టు చూడడమే; అప్పుడు యోగి దాన్ని తనకు ఉచితమని తోచిన విధంగా చేస్తాడు.

ఆధ్యాత్మిక సాధనాల ద్వారా నయితేనేమి, జ్ఞానోపదేశం ద్వారా నయితేనేమి, సంకల్పశక్తివల్ల నయితేనేమి, ఒకరికున్న జబ్బును శారీరకంగా బదలాయించడం వల్ల నయితేనేమి, మానవజాతి దుఃఖాల్ని నివృత్తి చెయ్యడమే లోకంలో గురువు చేసే పని. గురువు, తాను కోరుకున్నప్పుడల్లా అధిచేతన స్థితికి వెళ్ళిపోయి శారీరక రుగ్మతను విస్మరించగలుగుతాడు; ఒక్కొక్కప్పుడు తన శిష్యులకొక ఆదర్శం నిరూపించడంకోసం శారీరక బాధను గంభీరంగా ఓర్చుకోదలుస్తాడు. ఇతరుల జబ్బుల్ని తాను వహించడంవల్ల యోగి, వాళ్ళకోసం కర్మసంబంధమైన కార్యకారణ నియమాల్ని పాటిస్తాడు. ఈ నియమం యాంత్రికంగా లేదా గణిత శాస్త్రీయంగా పనిచేస్తుంది; దివ్యజ్ఞానం కలిగిన వ్యక్తులు, అది పనిచేసే తీరు తెన్నులను శాస్త్రీయంగా నిర్దేశించగలరు.

ఒక యోగి మరొక వ్యక్తికి ఉన్న జబ్బు నయంచేసినప్పుడల్లా తాను జబ్బు పడవలసిన అవసరం, ఆధ్యాత్మిక నియమాన్నిబట్టి ఏమీ ఉండదు. ఆధ్యాత్మికంగా స్వస్థత చేకూర్చే వ్యక్తికి ఏ హానీ కలక్కుండా ఉండే విధంగా తక్షణ నివారణ కలిగించే వివిధ పద్ధతులు సాధువుకు తెలిసి ఉండడంవల్ల ఆ పరిజ్ఞానం ద్వారానే సాధారణంగా జబ్బులు నయం చెయ్యడం జరుగుతుంది. అయితే ఎప్పుడో ఒక్కొక్క సందర్భంలో మాత్రం గురువు, తన శిష్యుల్లో ప్రగతి పరిణామాన్ని అతిత్వరితంగా రప్పించాలని ఆశించినప్పుడు, వాళ్ళ అవాంఛనీయ కర్మఫలంలో చాలాభాగం తన శరీరానికి సంక్రమింపజేసుకొని స్వచ్ఛందంగా అనుభవిస్తాడు.

అనేకమంది చేసిన పాపాలకు ఏసుక్రీస్తు తనను పరిహారంగా నిరూపించు కున్నాడు. తనకున్న దివ్యశక్తులకు* క్రీస్తు, కార్యకారణ సంబంధమైన సూక్ష్మ విశ్వనియమంతో ఇచ్ఛాపూర్వకంగా సహకరించి ఉండకపోయినట్లయితే శిలువ వెయ్యడంవల్ల చనిపోవలసిన స్థితికి ఒక్కనాటికి లోనయ్యేవాడు కాడు. ఆ ప్రకారంగా ఆయన ఇతరుల కర్మఫలాల్ని, ముఖ్యంగా తన శిష్యుల కర్మఫలాల్ని, తనమీద వేసుకొన్నాడు. ఈ విధంగా వాళ్ళు అత్యంతపరిశుద్ధులై, ఉత్తరోత్తరా తమకు సిద్ధించే సర్వవ్యాపక చైతన్యాన్ని లేదా హోలీ ఘోస్ట్‌ను (పరిశుద్ధాత్మను) ధరించ డానికి అర్హత పొందారు.†

కేవలం ఆత్మసాక్షాత్కారం పొందిన గురువు మాత్రమే తన ప్రాణశక్తిని బదిలీ చెయ్యడంకాని, ఇతరుల జబ్బుల్ని తన శరీరంలోకి రప్పించుకోడం కాని చెయ్యగలడు. మామూలు మనిషి, రోగనివారణ చేసే ఈ యోగపద్ధతిని అవలం బించలేడు; అతనలా చెయ్యడం ఆశించదగ్గది కూడా కాదు. ఎంచేతంటే, అనారోగ్యమైన శరీర సాధనం, గాఢమైన ధ్యానానికి అవరోధం. మానవుడు తన శరీరాన్ని మంచి స్థితిలో ఉంచుకోడం అతని విధ్యుక్తధర్మంగా హైందవ పవిత్ర గ్రంథాలు ఘోషిస్తాయి; లేకపోతే అతని మనస్సు భక్తితత్పరమైన ఏకాగ్రతలో కుదురుగా నిలబడలేదు.

అయితే అత్యంత దృఢమైన మనస్సు మాత్రం శరీర బాధలన్నిటినీ అధిగ మించి ఆత్మసాక్షాత్కారం సిద్ధింపజేసుకో గలదు. అనేకమంది సాధువులు అనారో గ్యాన్ని ఖాతరు చెయ్యకుండా దైవాన్వేషణలో విజయం పొందారు. సెంట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అసిసీ తాను జబ్బులతో తీవ్రంగా బాధపడుతూ ఉండి కూడా ఇతరులకు నయం చేశాడు; అంతే కాదు, చచ్చిపోయిన వాళ్ళను బతికించాడు కూడా.

వెనక నాకు తెలిసిన భారతీయ సాధువు కొకాయనకు తొలినాళ్ళలో ఒంట్లో సగభాగం వరకు పుండ్లతో నిండిపోయి ఉండేది. ఆయనకు మధుమేహ వ్యాధి ఎంత తీవ్రంగా ఉండేదంటే, పట్టుమని పదిహేను నిమిషాలపాటు నిలకడగా ఒకచోట కూర్చోలేకపోయేవాడు. కాని ఆయన ఆధ్యాత్మిక ఆకాంక్ష మాత్రం దుర్నిరోధమైనది. "ప్రభూ, నా శిథిలాలయంలోకి వస్తావా నువ్వు?" అంటూ

* ఇక శిలువ వెయ్యడానికి తీసుకువెళ్ళారనగా క్రీస్తు ఇలా అన్నాడు : "నేను నా తండ్రిని ఇప్పుడు ప్రార్థించలేననీ, ఆయన ఇప్పటికిప్పుడు నాకు పన్నెండు సైనికదళాలకు మించి దేవ దూతల్ని ఇవ్వడనీ అనుకుంటున్నారా? కాని అలా జరిగినట్లయితే పవిత్రగ్రంథాల్లో చెప్పింది నెరవేరడం ఎలా? అది నెరవేరకుండా ఉండడం ఎలా?" - మత్తయి 26.53-4 (బైబిలు).

† యాక్ట్స్ 1 8, 2:1-4 (బైబిలు).

ప్రార్థించేవాడు అనంతమైన సంకల్పశక్తి పాటవంతో ఆ సాధువు క్రమక్రమంగా, రోజుకు పద్దెనిమిది గంటలపాటు పద్మాసనంలో కూర్చుని సమాధిలో తన్మయుడై ఉండే స్థితికి వచ్చాడు. "మూడేళ్ళు గడిచేసరికి, ఆ అనంతజ్యోతి నాలో మహోజ్జ్వలంగా ప్రకాశించడం గమనించాను. ఆ తేజస్సుకు ఆనందిస్తూ మైమరిచిపోయాను దైవకృపవల్లనే నా శరీరం సంపూర్ణారోగ్యం పొందిందని, ఆ తరవాత గమనించాను" అని నాకు చెప్పారాయన.

భారతదేశంలో మొగలు సామ్రాజ్య స్థాపకుడైన బాబరు చక్రవర్తి (1483-1530)కి సంబంధించి చరిత్ర ప్రసిద్ధమైన రోగనివారణ సంఘటన ఒకటి ఉంది. ఆయన కొడుకు హుమాయూన్ తీవ్రంగా జబ్బు పడ్డాడు. ఆ జబ్బు తనకు వచ్చి, తన కొడుకు బతికి బయటపడాలన్న దృఢ నిశ్చయంతో సంతప్తహృదయుడై ప్రార్థించా డా తండ్రి. హుమాయూన్* కోలుకున్నాడు.; బాబరు వెంటనే జబ్బు పడ్డాడు; తన కొడుక్కి వచ్చిన జబ్బుతోనే ఆయన చనిపోయాడు.

మహాపురుషులకు శాండో† మాదిరి ఆరోగ్యం, బలం ఉండాలని చాలా మంది నమ్మకం. ఈ ఊహ నిరాధారమైనది. జీవితకాలమంతా చెక్కు చెదర కుండా ఉన్న ఆరోగ్యం ఆంతరిక జాగృతిని సూచిస్తుందనడానికి ఎలా వీలులేదో, అలాగే రోగిష్ఠి శరీరం ఉన్న మాత్రాన ఒక సద్గురువుకు దివ్యశక్తులు లేవని చెప్పడానికి కూడా వీలులేదు. సద్గురువును గుర్తుపట్టడానికి వీలయిన అర్హతలు ఆధ్యాత్మికమైనవే కాని, శారీరకమైనవి కావు.

ఆధ్యాత్మిక విషయాలమీద ధారాళంగా మాట్లాడడం కాని, రాయడం కాని చేసేవాడు సద్గురువై ఉంటాడని, తబ్బిబ్బయిన పాశ్చాత్య సాధకులు అనేకమంది

---

* హుమయూన్ అక్బరు చక్రవర్తికి తండ్రి మొదట్లో అక్బరు చక్రవర్తి ఇస్లాం మతోన్మాదంతో హిందువుల్ని హింసించాడు. ఆ తరవాత ఆయన, "నాలో జ్ఞానం పెరిగేకొద్దీ నేను అవమానంతో కుంగిపోయాను," అన్నాడు. "దివ్యలీలలు ప్రతి మతంవాళ్ళ మందిరాల్లోనూ సంభవిస్తాయి." భగవద్గీతను పారశీక భాషలోకి అనువదించే ఏర్పాటు చేశాడతను అంతే కాకుండా, రోమ్ నుంచి అనేకమంది జెసూయిట్ పాదరీలను తన ఆస్థానానికి ఆహ్వానించాడు అక్బరు. ఈ కింద పేర్కొన్న సూక్తి క్రీస్తు చెప్పినట్టుగా పొరపాటు పడ్డాకూడా, అభిమాన పురస్సరంగా ఉదాహరించాడు (అక్బరు కొత్తగా నిర్మించిన ఫతేపూర్ సిక్రి నగరంలో విజయ తోరణం మీద చెక్కించినది): " మేరీ కుమారుడు ఏసు (ఆయన ఆత్మకు శాంతి లభించుగాక ) ఇలా అన్నాడు: 'ఈ ప్రపంచం ఒక వంతెన; దానిమీంచి సాగిపో; కాని దానిమీద ఇల్లు కట్టకు "

† "ప్రపంచంలో అందరికన్న బలిష్ఠు"డిగా పేరుగన్న ఒక జర్మన్ క్రీడాకారుడు (మరణం 1925).

పొరపాటున అనుకుంటూ ఉంటారు. అయితే ఎవరయినా సద్గురువని చెప్ప డానికి నిదర్శనం, తన సంకల్పానుసారంగా ఊపిరిలేకుండా ఉండే స్థితికి (సవికల్ప సమాధి) వెళ్ళే సామర్థ్యంలోనూ మార్పుచెందని ఆనందాన్ని (నిర్వికల్ప సమాధి) సాధించడంలోనూ కనిపిస్తుంది.* కేవలం ఈ ఉపలబ్ధులవల్ల మాత్రమే మానవుడు, 'మాయ' అనే ద్వంద్వోపేతమైన విశ్వభ్రాంతిని తాను జయించినట్టు నిరూపించు కోవచ్చునని ఋషులు చెప్పారు. "ఏకం సత్" ("ఉండేది ఒకే ఒకటి") అంటూ అనుభూతి అగాధాల్లోంచి గొంతెత్తి చెప్పేవాడు అతనొక్కడే.

> "అజ్ఞానం కారణంగా ద్వంద్వ భావం ఉన్నప్పుడే సమస్త వస్తువుల్నీ ఆత్మకు భిన్నంగా చూస్తాడు," అని రాశారు, అద్వైత మహా ప్రవక్త ఆచార్య శంకరులు. "ప్రతిదీ ఆత్మగానే అవగతమైనప్పుడు, ఒక్క అణువును కూడా ఆత్మకు భిన్నంగా దర్శించడం జరగదు... మేలుకున్న తరవాత కల ఎలా ఉండదో అచ్చం అలాగే, సత్యాన్ని గురించిన జ్ఞానం ఉదయించినప్పుడు, శరీరానికున్న మిథ్యాత్వంవల్ల అనుభవించవలసిన పూర్వకర్మ ఫలాలన్న వేవీ ఉండవు."

మహాగురువులు మాత్రమే శిష్యుల కర్మను తాము వహించగలరు. శ్రీయుక్తేశ్వర్ గారు, తమ శిష్యులకు ఆ విచిత్రరీతిలో సహాయపడడానికి తమలోని చిచ్ఛక్తి నుంచి అనుమతిపొంది ఉంటేనే కాని శ్రీనగర్ †లో జబ్బుపడి ఉండేవారు కాదు.

---

* చూ.పే. 308; 514 అధోజ్ఞాపిక.

† కాశ్మీర రాజధాని శ్రీనగర్‌ను అశోక చక్రవర్తి క్రీ.పూ. మూడో శతాబ్దిలో నిర్మించాడు. అక్కడాయన 500 మఠాలు కట్టించాడు. తరవాత వెయ్యి సంవత్సరాలకు హ్యూయెన్‌త్సాంగ్ అనే చైనా యాత్రికుడు కాశ్మీరు దర్శించిన నాటికి వాటిలో ఇంకా 100 మఠాలు నిలిచి ఉన్నాయి. ఫాహియాన్ (ఐదో శతాబ్ది) అనే మరో చైనా రచయిత, పాటలీపుత్రం (ఇప్పటి పాట్నా) లో అశోకుడు నిర్మించిన విశాల రాజప్రసాదం శిధిలాలు చూసి, వాస్తుకళలోనూ అలంకరణ శిల్పకళలోనూ ఆ నిర్మాణానికి గల అద్భుత సౌందర్యాన్నిబట్టి అది, "మానవమాత్రుల చేతుల్లో తయారయింది కాదు" అనిపిస్తుందని రాశాడు.

పాటలీపుత్ర నగరానికి ఆకర్షకమైన చరిత్ర ఉంది. బుద్ధ భగవానుడు క్రీ.పూ. ఆరో శతాబ్దిలో దర్శించినాటికి ఈ ప్రదేశంలో అనామకమైన ఒక చిన్నకోట ఉండేది. ఆయన దీని భవిష్యత్తును గురించి జోస్యం చెబుతూ, "ఆర్య జాతి జనులు ఏయే దూరప్రాంతాల్లో నివసిస్తారో, వర్తకులు ఏయే దూరప్రాంతాలకు ప్రయాణిస్తారో అక్కడివరకు ఈ పాటలీ పుత్రమే ప్రధాన నగరమవుతుంది, అన్ని రకాల వస్తువుల క్రయవిక్రయాలకూ కేంద్రమవుతుంది." (మహాపరినిర్వాణ సూత్రం) అన్నాడు. రెండు శతాబ్దుల తరవాత ఈ పాటలీపుత్రం చంద్రగుప్త మౌర్యుడి విశాల సామ్రాజ్యానికి రాజధాని అయింది; ఆయన మనమడు అశోకుడు ఈ నగరానికి ఇతోధిక వైభవాన్ని శోభనూ చేకూర్చాడు.

దైవాజ్ఞల్ని పాలించడానికి సమకూరిన సునిశితమైన జ్ఞానంలో దైవానుసంధాన పరాయణులైన మా గురుదేవుల్ని మించినవాళ్ళు అరుదు.

బాగా చిక్కిపోయిన ఆయన శరీరాన్ని చూసి సానుభూతితో నాలుగు ముక్కలు అనడానికి నేను సాహసించినప్పుడు, మా గురుదేవులు ఉల్లాసంగా ఇలా అన్నారు :

"దీని లాభాలు దీనికున్నాయి; కొన్నేళ్ళుగా వేను వేసుకోని కొన్ని చిన్న 'గంజీ' (లోపలి చొక్కా) ల్లోకి ఇప్పుడు దూరగలుగుతున్నాను!"

గురుదేవుల చమత్కారం, వారి గలగల నవ్వూ వింటూంటే సెంట్ ఫ్రాన్సిస్ డి సేల్స్ అన్న మాటలు నాకు గుర్తు వచ్చాయి : "దుఃఖించే సాధువు సాధువే కాడు!"

అధ్యాయం : 22

# రాతిబొమ్మ గుండె

"పతివ్రత అయిన హిందూ స్త్రీగా, నేను మా ఆయన్ని గురించి ఫిర్యాదు చేసుకోదలచలేదు. కాని భౌతికవాదపరమైన ఆయన అభిప్రాయాలు మార్చుకోగా చూడాలని తపిస్తున్నాను. నా ధ్యానం గదిలో ఉన్న సాధువుల పటాలు చూసి వెక్కి రించడం ఆయనకో సరదా. ఒరే తమ్ముడూ, నువ్వాయన విషయంలో సాయం చెయ్యగలవని నాకు గాఢమైన విశ్వాసం ఉంది. చేస్తావా మరి?"

మా పెద్దక్క రమ, బతిమాలుకుంటూ నావేపు చూసింది. కలకత్తాలో గిరీశ్ విద్యారత్న సందులో ఉన్న వాళ్ళింటికి వెళ్ళి నేను కాసేపు కూర్చున్నప్పుడు జరిగిందిది. ఆమె వెల్లడించిన కోరిక నా మనస్సు కరిగించింది; ఎంచేతంటే నా చిన్నతనంలో ఆమె నా మీద గాఢమైన ఆధ్యాత్మిక ప్రభావాన్ని ప్రసరింప జేసింది; అంతే కాకుండా, అమ్మ పోవడంతో మా కుటుంబంలో ఏర్పడ్డ వెలితి పూరించడానికి ఆమె ఎంతో ఆప్యాయంగా ప్రయత్నించింది.

"అక్కయ్యా, నేను చెయ్యగలిగిందల్లా చేస్తాను," అంటూ నేను చిరునవ్వు నవ్వాను; మామూలుగా ఆమె ముఖంలో కనిపించే ప్రశాంతతకూ ఉల్లాసానికీ భిన్నంగా ఇప్పుడు స్పష్టంగా అవుపిస్తున్న విషాదాన్ని తొలగించాలని నా ఆతురత.

దీనికొక దారి చూపించమని నేనూ రమా కాసేపు మౌనంగా ప్రార్థన చేశాం. అప్పటికి ఒక ఏడాదికిందట మా అక్క తనకి 'క్రియాయోగ' దీక్ష ఇమ్మని నన్ను అడిగింది; దాంట్లో ఆమె చెప్పుకోదగినంత ప్రగతి సాధించింది.

లోపలినుంచి ఒక ప్రేరణ నన్ను వశపరుచుకుంది. "రేపు నేను దక్షిణేశ్వరంలో కాళికాదేవి గుడికి వెళ్తున్నాను. నువ్వు కూడా నాతో రా. మీ ఆయన్ని కూడా మనతో రావడానికి ఒప్పించు. ఆ పవిత్ర క్షేత్రంలోని స్పందనల్లో జగన్మాత ఆయన హృదయాన్ని స్పృశిస్తుందని నా కనిపిస్తోంది. కాని ఆయన్ని మనం రమ్మనడానికి కారణం మట్టుకు బయటపెట్టకు," అన్నాను.

అక్కయ్య ఆశపడుతూ ఒప్పుకుంది. మర్నాడు పొద్దున, రమా వాళ్ళాయన నాతో రావడానికి సిద్ధంగా ఉన్న సంగతి తెలిసి సంతోషించాను. మా గుర్రబ్బండి అప్పర్ సర్క్యులర్ రోడ్డునుంచి దక్షిణేశ్వర్‌కు సాగిపోతూ ఉండగా మా బావగారు సతీశ్‌చంద్రబోసుగారు, ఆధ్యాత్మిక గురువుల యోగ్యతను అపహాస్యం చేస్తూ కులికిపోయారు. రమ లోపల్లోపల ఏడుస్తోందని గమనించాను.

"అక్కయ్యా, హుషారుగా ఉండాలి నువ్వు!" అంటూ ఆమె చెవిలో గొణిగాను "తన వెక్కిరింతకు మనం ఉడుక్కుంటామన్న నమ్మకంతో తృప్తి పడే అవకాశం మీ ఆయనకి ఇయ్యకు."

"ముకుందా, పనికిమాలిన బడాయికోరుల్ని ఎలా మెచ్చుకుంటావు నువ్వు?" అంటూ అడుగుతున్నాడు సతీశ్. "సాధువు కంటబడ్డమే నాకు వెలపరంగా ఉంటుంది. ఉంటే ఎముకలపోగు లాగయినా ఉంటాడు, లేకపోతే ఏనుగ్గున్నలా బలిసిపోయయినా ఉంటాడు!"

నేను విరగబడి నవ్వాను - దీనికి సతీశ్ చిరాకు పడ్డాడు. మొహం ముడుచుకుని గమ్మున కూర్చున్నాడు. మా బండి దక్షిణేశ్వర ఆలయం ఆవరణలోకి ప్రవేశించేసరికి ఆయన వెటకారంగా పళ్ళు ఇకిలించాడు.

"ఈ విహారయాత్ర, బహుశా నన్ను మార్చడానికి వేసిన పథకమనుకుంటాను."

నేను దానికి జవాబు చెప్పకుండా పక్కకి తిరిగేసరికి, ఆయన నా చెయ్యి పట్టుకున్నాడు.

"ఇదుగో, కుర్ర సన్యాసిగారూ, దేవాలయం అధికారులతో మాట్లాడి మన మధ్యాహ్న భోజనాలకి తగ్గ ఏర్పాట్లు చెయ్యడంమాత్రం మరిచిపోకండి!' గుడి పూజారులతో ఎటువంటి సంభాషణా చేసే అవసరం తనకు లేకుండా చేసుకోవాలనుకున్నారు సతీశ్ గారు.

" నే నిప్పుడు ధ్యానం చేసుకోబోతున్నాను. మీ భోజనంగురించి దిగులు పడకండి," అని కరుకుగా జవాబిచ్చాను. "ఆ సంగతి అమ్మవారు చూసుకుంటుంది."

"నా కోసం అమ్మవారు ఒక్క పని కూడా చేస్తుందన్న నమ్మకం నాకు లేదు. కాని నా భోజనానికి నిన్నే బాధ్యుణ్ణి చేస్తున్నాను." సతీశ్ గారి మాటల్లో బెదిరింపు ఉంది.

కాళికాదేవి (ప్రకృతిమాత రూపంలో ఉన్న దేవుడు) విశాలమైన ఆలయానికి ముందు భాగంలోని ముఖమంటపంలోకి నే నొక్కణ్ణే సాగాను. ఒక స్తంభం దగ్గిర పీడపట్టు చూసుకుని పద్మాసనం వేసుకుని కూర్చున్నాను. అప్పటికే సుమారు ఏడుగంటలయి ఉంటుంది. కాని, మరి కాస్సేపట్లో బాగా పొద్దెక్కి ఎండ మాడ్చేస్తుంది.

నేను భక్తితత్పరుణ్ణయి సమాధి స్థితిలోకి వెళ్తూ ఉన్నకొద్దీ బాహ్య స్పృహ తగ్గుతూ వచ్చింది. నా మనస్సు కాళికాదేవి మీద ఏకాగ్రంగా నిలిచింది. దక్షిణేశ్వర ఆలయంలో ఉన్న ఆ అమ్మవారి విగ్రహం, రామకృష్ణ పరమహంస అనే మహాగురువుల ఆరాధనమూర్తిగా ప్రత్యేకత సంతరించుకొన్నది. సంతప్త హృదయంతో ఆయన చేసే విన్నపాలకు సమాధానంగా ఆ శిలావిగ్రహం, తరచు సజీవరూపం దాల్చి ఆయనతో మాట్లాడుతూ ఉండేది.

"శిలారూపిణివైన మౌన మాతృమూర్తీ, నీ ప్రియభక్తులు రామకృష్ణుల విన్నపాన్ని మన్నించి అప్పుడు జీవన్మూర్తి వయావు. నీ కోసం పరితపించే ఈ కొడుకు ఆక్రందనల్ని ఎందుకు ఆలించవమ్మా?" అంటూ ప్రార్థించాను.

దివ్య ప్రశాంతితోబాటు నాలో ఉత్సాహం అపరిమితంగా పెరిగింది. అయినా ఐదుగంటలు గడిచిపోయాయి; నేను అంతర్దృష్టితో దర్శిస్తున్న కాళీమాత నాకు సమాధానమివ్వలేదు; నేను ఒక్కరవ్వ నిరాశపడ్డాను. ఒక్కొక్కప్పుడు, ప్రార్థనలు ఫలించడంలో ఆలస్యం చెయ్యడం దేవుడు పెట్టే పరీక్ష. కాని చివరికి, తదేక నిష్ఠగల భక్తుడు ఇష్టదేవతగా తనను ఏ రూపంలో కొలుస్తాడో ఆ రూపం లోనే దర్శన మిస్తాడాయన. భక్తి తత్పరుడైన క్రైస్తవుడు ఏసును చూస్తాడు; హిందువు కృష్ణుణ్నో కాళికాదేవినో చూస్తాడు; ఒకవేళ అతని ఆరాధన నిరాకారుడివేపు తిరిగితే విరాట్‌జ్యోతిని దర్శిస్తాడు.

నేను అనిష్టంగానే కళ్ళు తెరిచి చూశాను; మధ్యాహ్న కాలనియమాన్ని అనుసరించి ఒక పూజారి ఆలయ ద్వారాలు మూసేస్తున్నాడు. ముఖమంటపంలో ఉన్న నా ఏకాంత స్థలంనుంచి లేచి ముంగిట్లో అడుగుపెట్టాను. అక్కడ నేలమీద పరిచిఉన్న రాయి మిట్టమధ్యాహ్నం ఎండకు మలమల మాడుతోంది; నా అరికాళ్ళు మంటెత్తిపోతున్నాయి.

"జగన్మాతా," అంటూ నేను మౌనంగా ఆక్షేపణ తెలిపాను. "నువ్వు ఇంత వరకు నాకు దర్శనమిచ్చావు కావు; ఇప్పుడు మూసిన తలుపుల వెనక దాక్కుని ఉన్నావు. ఈ రోజు నేను మా బావగారి తరఫున నీకు ప్రత్యేక ప్రార్థన చెయ్యాలని అనుకున్నాను."

మనస్సులో నేను చేసిన విన్నపానికి వెంటనే స్వీకృతి లభించింది. మొదట నా బాధను మటుమాయం చేస్తూ వెన్ను వెంబడి, పాదాలకింద ఆహ్లాదకరమైన చలవ అల ఒకటి పాకి వచ్చింది. ఆ తరవాత, ఆ ఆలయం పరిమాణం బ్రహ్మాండంగా పెరిగిపోయి నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. దాని విశాల ద్వారం మెల్లిగా తెరుచుకొని కాళికాదేవి శిలావిగ్రహాన్ని ఆవిష్కరించింది. క్రమంగా ఆ విగ్రహం సజీవరూపంగా మారింది; చిరునవ్వు చిందిస్తూ ఆ తల్లి పలకరింపుగా తల ఊపింది చెప్పనలవి కాని ఆనందంతో నన్ను పులకరింపజేసింది. కంటికి కనిపించని ఒక పిచికారీతో లాగేసినట్టుగా నా ఊపిరితిత్తుల్లోంచి శ్వాస బయటికి వచ్చేసింది. నా శరీరం జడప్రాయం కాకపోయినా అతినిశ్చలమయిపోయింది.

ఆ తరవాత నా చైతన్యం ఆనంద తన్మయత్వంతో విస్తారమయింది నా ఎడమవేపు గంగానది మీద అనేక మైళ్ళ దూరం స్పష్టంగా చూడగలిగాను అంతే కాకుండా గుడి వెలుపల దక్షిణేశ్వర క్షేత్రమంతా కళ్ళకు కట్టింది. భవనాలన్నిటి గోడలూ పారదర్శకంగా ప్రకాశించాయి; వాటిగుండా నేను, దూర భూముల్లో సంచరిస్తున్న జనాన్ని గమనించాను.

నేను ఊపిరి లేకుండా ఉన్నప్పటికీ, నా శరీరం చిత్రంగా ప్రశాంత స్థితిలో ఉండిపోయినప్పటికీ, నేను చేతులూ కాళ్ళూ స్వేచ్ఛగా కదపగలిగాను. కొన్ని నిమిషాలసేపు కళ్ళు మూస్తూ తెరుస్తూ ప్రయోగం చేశాను; మూసినా తెరిచినా కూడా దక్షిణేశ్వర దృశ్యాన్ని యావత్తు స్పష్టంగా చూశాను.

ఎక్స్ - రే కిరణాల మాదిరిగా, ఆధ్యాత్మిక దృష్టి అన్ని రకాల పదార్థాల్లోకీ చొచ్చుకుపోతుంది; ప్రతిచోటా దివ్యనేత్రమే కేంద్రం; దాని కెక్కడా పరిధి ఉండదు ఎండకు మాడుతున్న ఆ ముంగిట్లో నించుని ఉండగా నే నొక విషయం కొత్తగా గ్రహించాను: వాస్తవానికి స్వప్నమై, నీటి బుడగ మాదిరిగా నిరాధారమై ఉన్న భౌతిక ప్రపంచంలో చిక్కుకుపోయి దేవుడి భ్రష్టసంతానంగా జీవించడం మానేసిన మానవుడు తన అనంత సామ్రాజ్యాన్ని మళ్ళీ పొందుతాడు. సంకుచిత మూర్తిమత్వంలో కుదించుకుపోయిన మానవుడికి పలాయన వాదమే శరణ్యమయినట్లయితే, సర్వవ్యాపకత్వంతో పోల్చదగ్గ పలాయనం మరొకటి ఉండే అవకాశం ఉందా?

దక్షిణేశ్వరంలో నాకు కలిగిన పవిత్రానుభవంలో అసాధారణంగా విస్తరిల్లిన వస్తువులల్లా ఆలయమూ అమ్మవారి విగ్రహమూ. తక్కిన వాటిలో ప్రతి ఒక్కటీ తెలుపూ నీలమూ ఇంద్ర ధనుస్సులోని రంగులూ గల స్నిగ్ధ కాంతి పరివేషంతో

కూడి ఉన్నప్పటికీ వాటి మామూలు పరిమాణాల్లోనే కనిపించాయి. నా శరీరం గాలిలో తేలిపోవడానికి సిద్ధంగా వాయుపదార్థంతో ఏర్పడినట్టు అనిపించింది. నా భౌతిక పరిసరాల స్పృహతోనే నా చుట్టూ చూసుకుంటూ, ఆనందమయమైన దివ్య దర్శనానికి వ్యాఘాతం కలిగించకుండా కొన్ని అడుగులు వేశాను.

గుడి గోడల వెనక పవిత్రమైన మారేడుచెట్టు మొండ్ల కొమ్మల కింద కూర్చుని ఉన్న మా బావగారిని చటుక్కున చూశాను. ఆయన ఆలోచనల ధోరణిని అప్రయత్నంగానే తెలుసుకోగలిగాను. ఆయన మనస్సులో, దక్షిణేశ్వర పవిత్ర వాతావరణ ప్రభావంవల్ల కొంతమట్టుకు ఉదాత్తస్థితి నందుకున్నప్పటికీ నా గురించి నిర్దాక్షిణ్యమైన ఆలోచనలే సాగుతున్నాయి. నేను సూటిగా, ఆ అమ్మవారి దివ్య మంగళ విగ్రహం వేపు తిరిగాను.

"జగన్మాతా, మా అక్కయ్య భర్తలో ఆధ్యాత్మికంగా పరివర్తన తీసుకు వస్తావా మువ్వు?" అని ప్రార్థించాను.

ఇంతవరకు మౌనంగానే ఉన్న ఆ సౌందర్య రూపిణి చివరికి నోరువిప్పి మాట్లాడింది, "నీ కోరిక నెరవేరుతుంది!"

సతీశ్ వేపు సంతోషంగా చూశాను, నేను. ఏదో ఒక ఆధ్యాత్మిక శక్తి పని చేస్తోందని సహజ ప్రవృత్తివల్ల తెలిసి ఉన్నట్టుగా ఆయన, నేలమీద కూర్చున్న చోటునుంచి రోషంగా లేచాడు. ఆయన గుడివెనక నుంచి పరుగెత్తుకుంటూ వస్తున్నాడు; తన పిడికిలి ఎత్తి చూపిస్తూ నన్ను సమీపిస్తున్నాడు.

సర్వగ్రాహకమైన దృశ్యం అదృశ్యమయింది. అమ్మవారి దివ్య మంగళమూర్తి అవుపించడం మానేసింది; ఆ ఆలయం పారదర్శకత పోగొట్టుకొని తిరిగి మామూలు పరిమాణాన్ని పొందింది. మళ్ళీ నా ఒళ్ళు, సూర్యుడి ప్రచండ కిరణాలకు మలమల మాడుతోంది. ముఖ మంటపం నీడలోకి ఒక్క గంతు వేశాను, సతీశ్ మండిపడుతూ నన్నక్కడికి వెంబడించాడు. నా గడియారం చూసుకున్నాను. ఒంటిగంటయింది; దివ్య దర్శనం గంటసేపు ఉందన్నమాట.

"ఓయి తెలివితక్కువ నాయనా, కాళ్ళు మెలివేసుకుని కళ్ళు తేలవేసుకుని గంటలగ్గంటలు కూర్చున్నావక్కడ. నిన్ను గమనిస్తూ అటూ ఇటూ తిరుగుతున్నాను. మన భోజన మెక్కడోయ్? ఇప్పుడు గుడి మూసేశారు; గుడి అధికారులికి మువ్వు మన సంగతి చెప్పకపోతివి; మన భోజనాల ఏర్పాటుకు టైముచాలా మించిపోయింది!"

అమ్మవారి సాక్షాత్కారంతో కలిగిన ఉత్కృష్టస్థితి నాలో ఇంకా ఉంది "జగన్మాతే మన కడుపు నింపుతుంది!" అన్నాను.

"ఇదుగో, ఇదే చెబుతున్నాను; ముందు ఏర్పాట్లేమీ లేకుండా, నీ జగన్మాత మన కిక్కడ భోజనం పెడుతుందేమో నేనూ చూస్తా!" అంటూ అరిచాడు సతీశ్.

ఆయన ఆ మాట లింకా అన్నాడోలేదో, గుడి పూజారి ఒకాయన ముంగిలికి అడ్డుపడి మా దగ్గరికి వచ్చాడు.

"బాబూ," అంటూ నా కేసి చూసి అన్నాడు : "గంటల తరబడి మీరు ధ్యానం చేసుకుంటూ ఉండగా మీ ముఖం ప్రశాంతంగా ప్రకాశిస్తూ ఉండడం గమనిస్తూ వచ్చాను. ఈ రోజు పొద్దున మీరు రావడం చూసి మీ అందరి భోజనానికి సమృద్ధిగా సరిపడే పదార్థాలు తీసి పక్కకి పెట్టాలన్న కోరిక కలిగింది నాకు ముందుగా అడగని వాళ్ళకి అన్నం పెట్టడం మా ఆలయ నియమాలకి విరుద్ధం అయినా మీ విషయంలో దానికి మినహాయింపు ఇచ్చాను."

నే నాయనకి ధన్యవాదాలు చెప్పి సతీశ్ కళ్ళలోకి సూటిగా చూశాను ఆయన లోపల్లోపల పశ్చాత్తాప పడుతూ కళ్ళుదించుకుని భావోద్రేకంతో సిగ్గుపడి పోయాడు. ఆ కాలంలో రాని మామిడిపళ్ళతో సహా, మాకు మృష్టాన్న భోజన పదార్థాలు వడ్డించినప్పుడు, మా బావగారి ఆకలి అతి స్వల్పమేనని గమనించాను ఆలోచనా సముద్రంలో లోతుగా మునుగుతూ ఆయన తబ్బిబ్బు అయిపోయాడు.

కలకత్తాకి మా తిరుగు ప్రయాణంలో, సతీశ్ ముఖంలో బింకం సడలి పోయింది; అప్పుడప్పు డాయన నావేపు బుజ్జగింపు ధోరణిలో చూస్తూ వచ్చాడు అయితే ఆ గుడి పూజారి, సతీశ్ చేసిన సవాలుకు జవాబు ఇవ్వడానికే అన్నట్లుగా మమ్మల్ని భోజనానికి రమ్మన్న క్షణం నుంచి మళ్ళీ ఒక్క మాట కూడా మాట్లాడ లేదాయన.

ఆ మర్నాడు మధ్యాహ్నం మా అక్కయ్యగారింటికి వెళ్ళి కలుసుకున్నాను నన్ను ఆప్యాయంగా పలకరించింది.

"ఒరే తమ్ముడూ! ఎంత అద్భుతం జరిగిందిరా! నిన్న సాయంత్రం మా ఆయన నా ఎదుట పైకి ఏడ్చేశారు.

" ప్రియదేవీ,* నన్ను మార్చడానికి మీ తమ్ముడు వేసిన పథకం నాలో పరివర్తన తీసుకువచ్చినందుకు ఎంత ఆనందంగా ఉందో చెప్పడానికి మాటలు

* దేవత': వాచ్యార్థం 'ప్రకాశించేది' అని; సంస్కృత ధాతువు 'దివ్ = ప్రకాశించు' నుండి

చాలవు. నేను నీకు చేసిన అన్యాయాలన్నిటినీ ఇప్పుడు చక్కదిద్దుకుంటాను. ఈ రోజు రాత్రినించి మన పెద్ద పడగ్గదిని పూజా మందిరంగానే వాడుకుందాం; నువ్వు ధ్యానం చేసుకునే చిన్నగది మనకు పడకటిల్లవుతుంది. మీ తమ్ముణ్ణి వెక్కిరించి నందుకు నేను నిజంగా విచారిస్తున్నాను. ఇంతకాలమూ నేను అవమాన కరంగా ప్రవర్తిస్తూ వచ్చినందుకు నేను ఆధ్యాత్మికమార్గంలో అభివృద్ధి సాధించే దాకా ముకుందుడితో మాట్లాడ్డం మానేసి నన్ను నేను శిక్షించుకుంటాను. ఇప్పటి నించి నేను జగన్మాతను గాఢంగా ధ్యానిస్తూ అన్వేషిస్తాను; ఎప్పుడో ఒకనాడు నేను తప్పకుండా ఆవిడ సాక్షాత్కారం పొందాలి!'

చాలా ఏళ్ళ తరవాత (1936లో) ఢిల్లీలో సతీశ్ గారిని చూడడానికి వెళ్ళాను. ఆత్మసాక్షాత్కార సాధనలో గొప్ప అభివృద్ధిని సాధించడం, జగన్మాత ఆయనకి దర్శనం ప్రసాదించడం తెలిసి నేను అపరిమితంగా ఆనందించాను. సతీశ్ తీవ్రమైన జబ్బుతో బాధపడుతూ ఉన్నా, పగలంతా ఆఫీసు పనితోనే సరి పోతున్నా, ప్రతిరాత్రీ ఎక్కువభాగం గాఢమైన ధ్యానంలోనే రహస్యంగా గడుపుతూ ఉండడం గమనిం చాను, నేను ఆయన దగ్గర బసచేసినప్పుడు.

మా బావగారి ఆయుర్దాయం ఎక్కువగా ఉండదన్న ఆలోచన ఒకటి వచ్చింది నాకు. నా మనస్సులో ఉన్నది గ్రహించింది రమ.

"తమ్ముడూ, నేను బాగున్నాను, మా ఆయన జబ్బులో ఉన్నారు. అయి నప్పటికీ, హిందూ పతివ్రతగా, మొట్టమొదట పోయేదాన్ని నేనేనని నీకు తెలియాలి.* నేను పోవడానికి ఇక అట్టేకాలం పట్టదు."

ఆమె అశుభం పలికినందుకు నేను అదిరిపడినప్పటికీ ఆ మాటల్లో చేదు నిజం ఉందని గ్రహించాను. తాను ఈ జోస్యం చెప్పిన సుమారు పద్దెనిమిది నెల్లకి ఆమె కన్ను మూసినప్పుడు నేను అమెరికాలో ఉన్నాను. మా చివరి తమ్ముడు విష్ణు ఆ తరవాత నాకు వివరాలు తెలియజేశాడు.

"రమ చనిపోయేనాటికి తనూ సతీశ్ బావగారూ కలకత్తాలో ఉన్నారు. ఆ రోజు పొద్దున తను పెళ్ళికూతురి ముస్తాబు చేసుకుంది.

" 'ఈ ప్రత్యేకమైన ముస్తాబు దేనికి?' అని సతీశ్ గారు అడిగారు.

---

* భర్తకు తాము చిత్తశుద్ధితో సేవ చేసినందుకు నిదర్శనంగా భర్తకన్న భార్యే ముందు పోవడం, లేదా " సేవావిధులు నిర్వహిస్తూ కన్ను ముయ్యడం" ఆధ్యాత్మిక ప్రగతికి చిహ్నమని విశ్వసిస్తుంది హిందూ ధర్మపత్ని.

“ ‘ఈ భూమిమీద మీకు సేవ చెయ్యడానికి ఇదే నాకు చివరి రోజు,’ అని రమ సమాధానం. తరవాత కాస్సేపటికి తనకి గుండెపోటు వచ్చింది. వైద్య సహాయం కోసం కొడుకు బయటికి పరిగెడుతుంటే తను ఇలా చెప్పింది:

“ ‘బాబూ, నన్ను వదిలి వెళ్ళకు. దానివల్ల లాభం లేదు. డాక్టరు రాకముందే నేను వెళ్ళిపోతాను.’ తరవాత పదినిమిషాలకి రమ, భక్తి పూర్వకంగా భర్త పాదాలు పట్టుకొని, బాధ లేకుండా, హాయిగా, పూర్తి స్పృహతో దేహాన్ని విడిచింది.

“భార్య గతించిన తరవాత సతీశ్‌లో చాలా వైరాగ్యం వచ్చింది,” అంటూ ఇంకా చెప్పాడు విష్ణు. “ఒకనాడు ఆయనా నేనూ, చిరునవ్వు చిందిస్తున్న రమ ఫోటోగ్రాపు కేసి చూస్తున్నాం.

“ ‘ఎందుకా చిరునవ్వు?’ అంటూ చటుక్కున పైకి అనేశారు సతీశ్‌గారు భార్య ఎదురుగానే ఉందన్నట్టు. ‘నా కన్న ముందుగా వెళ్ళిపోయే ఏర్పాటు చేసుకున్నందుకు నువ్వు తెలివైన దాన్ననుకుంటున్నావు. నువ్వు నాకు దూరంగా అట్టేకాలం ఉండలేవని నిరూపిస్తాను; త్వరలోనే నిన్ను కలుసుకుంటాను.’

“ఇది జరిగేనాటికి సతీశ్‌గారు జబ్బునుంచి పూర్తిగా కోలుకున్నప్పటికీ, ఆయన ఆరోగ్యం అద్భుతంగానే ఉన్నప్పటికీ, ఈ ఫోటోముందు ఆ విచిత్ర వ్యాఖ్య చేసిన కొన్నాళ్ళకే ఆయన చనిపోయారు; కారణమేదీ పైకి కనిపించలేదు.”

ఈ విధంగా మా అక్కయ్య రమా, ఆవిడ భర్తా - సాధారణ ప్రాపంచిక వ్యక్తిగా ఉండి, దక్షిణేశ్వరంలో మౌన సాధువుగా మారిపోయిన సతీశ్‌గారూ - ఇద్దరూ ముందుగా చెప్పి గతించారు.

అధ్యాయం : 23

# విశ్వవిద్యాలయపట్ట ప్రాప్తి

"నువ్వు నీ తత్త్వశాస్త్ర పాఠ్యగ్రంథాలు చదవడం నిర్లక్ష్యం చేస్తున్నావు. పరీక్షల్లో గట్టెక్కడానికి అనాయాసమయిన అంతఃప్రేరణ మీద ఆధారపడు తున్నట్టుంది. కాని నువ్వు కనక, ఒక విద్యార్థిమాదిరిగా కష్టపడి చదవకపోయి నట్లయితే నువ్వు పాస్ కాకుండా ఉండేలా చూస్తాను."

శ్రీరాంపూర్ కాలేజిలో ప్రొఫెసర్ డి.సి. ఘోషాల్‌గారు నాతో కఠినంగా మాట్లాడుతూ అన్న మాటలివి. ఆయన, తరగతిలో పెట్టే చివరి రాత పరీక్షలో కనక నేను తప్పినట్లయితే చిట్టచివరి పరీక్షలకు కూర్చోడానికి నేను అనర్హుణ్ణి అవుతాను. ఈ నియమాలు ఏర్పరచింది కలకత్తా విశ్వవిద్యాలయ విద్యా విభాగం; దాని అనుబంధ శాఖల్లో శ్రీరాంపూర్ కాలేజి ఒకటి. భారతీయ విశ్వవిద్యాలయాల్లో ఒక విద్యార్థి బి.ఏ. చివరి పరీక్షల్లో ఏ ఒక్క సబ్జెక్టులో ఉత్తీర్ణుడవకపోయినా, ఆ మరుసటి సంవత్సరం మరల మొత్తం 'అన్ని' సబ్జెక్టుల్లోనూ పరీక్షకు కూర్చోవాలి.

శ్రీరాంపూర్ కాలేజిలో మా అధ్యాపకులు మామూలుగా నన్ను దయతో చూసేవారు; అయితే దాంట్లో రవంత సరిహాసం కూడా లేకపోలేదు. "ముకుందుడు మత విషయంలో కాస్త మితిమించి మత్తెక్కి ఉన్నాడు," అని తేల్చి పారేస్తూ, తరగతి గదిలో వాళ్ళు వేసే ప్రశ్నలకు జవాబులు చెప్పడానికి ఇబ్బంది కూడా నాకు లేకుండా చేసేవారు. చివరి రాత పరీక్షలు నన్ను బి.ఏ. పరీక్షార్థుల పట్టికలోంచి తప్పిస్తాయని నమ్ముకున్నారు. నా తోటి విద్యార్థులు నా గురించి ఇచ్చిన తీర్పు, "పిచ్చి సన్యాసి" అని వాళ్ళు నాకు పెట్టిన మారుపేరులోనే వెల్లడి అయింది.

తత్త్వశాస్త్రంలో నేను తప్పుతానన్న ప్రొఫెసర్ ఘోషాల్‌గారి బెదిరింపును వమ్ముచెయ్యడానికి నేను తెలివిగా ఒక ఎత్తు వేశాను. ఇక చివరి పరీక్ష ఫలితాలు బహిరంగంగా ప్రకటిస్తారనగా, ప్రొఫెసర్ గదిలోకి వెళ్ళేటప్పుడు నాతోబాటు ఒక సహాధ్యాయిని కూడా రమ్మన్నాను.

"నువ్వు కూడా రా; నాకో సాక్షి కావాలి," అన్నాను మా వాడితో. "ఆ ప్రొఫెసరుగారి నమ్మకాన్ని వమ్ముచేయడంలో నేను విఫలుణ్ణయితే నా కెంతో నిరాశ కలుగుతుంది."

నా పేపరుకు ఆయనిచ్చిన మార్కులెన్నో చెప్పమని నేను అడిగినప్పుడు ప్రొఫెసర్ ఘోషాల్‌గారు తల ఆడించారు.

"పాసయిన వాళ్ళలో లేవు నువ్వు," అన్నారాయన ఏదో సాధించానన్న గర్వంతో. తమ బల్లమీదున్న పెద్ద కాయితాల బొత్తి కెలికి చూశారు. "నీ పేపరు లేనే లేదిక్కడ; ఏమయినా, పరీక్షకి గైర్‌హాజరు కావడంవల్ల నువ్వు ఫెయిలయావు."

నేను ముసిముసిగా నవ్వాను. "సార్, నేను హాజరయానండీ! పోనీ, ఆ కట్టలో నేను వెతుక్కోనాండీ?"

ఆ ప్రొఫెసరుగారు ఇరకాటంలో పడి, నాకు అనుమతి ఇచ్చారు. నా హాజరు పట్టీ నంబరు తప్ప, మరే గుర్తూ లేకుండా నేను జాగ్రత్తపడ్డ పేపరును తొందర గానే పట్టుకున్నాను.

"ఎర్రజెండా" లాంటి నా పేరు ఆయన్ని హెచ్చరిస్తూ అక్కడ లేకపోవడం వల్ల ఆ ప్రొఫెసరుగారు, పాఠ్యపుస్తకాల్లోంచి ఉదాహరించిన ముక్కలతో నా సమాధానాల్ని అందంగా అలంకరించకపోయినప్పటికీ, వాటికి ఆయన ఎక్కువ మార్కులే ఇచ్చారు.*

నేను ప్రయోగించిన యుక్తి కనిపెట్టి, "ఇది వట్టి, సిగ్గుచేటు అదృష్టం!" అంటూ ఉరిమారాయన. అయినా, "బి.ఏ. ఫైనల్స్‌లో నువ్వు ఫెయిలవడం ఖాయం!" అంటూ తమ ఆశాభావం వెలిబుచ్చారు.

నేను ఇతర విషయాల్లో జరిగే పరీక్షలకోసం కొంత స్నేహితుల చేత చెప్పించు కున్నాను. ముఖ్యంగా, నాకు ప్రియమిత్రుడయిన మా శారద బాబయ్య గారబ్బాయి ప్రభాస్ చంద్రఘోష్ నాకు చాలా చెప్పాడు. అవస్థపడుతూ కాస్త ఊగిసలాడినా, మొత్తంమీద నేను చివరి పరీక్షలన్నింటిలోనూ పాసవడానికి రావలసిన కనీసపు మార్కులు తెచ్చుకుని ఎలాగో బయటపడ్డాను.

---

* ప్రొఫెసర్ ఘోషాల్‌గారికి నాకూ గల సంబంధం సజావుగా లేకపోవడానికి కారణం ఆయన తప్పేమీ కాదనీ, కేవలం క్లాసుల్లో నా గైర్‌హాజరేననీ నా తప్పు ఒప్పుకొని ఆయనకు న్యాయం చెయ్యక తప్పదు.

ప్రొఫెసర్ ఘోషాల్ గారు అపారమైన తత్త్వశాస్త్ర జ్ఞానంగల గొప్ప వక్త. అనంతర కాలంలో మేము సౌహార్దపూర్వకమైన పరస్పరావగాహనకు వచ్చాం.

నాలుగేళ్ళు కాలేజి చదువు పూర్తయిన తరవాత, ఇక నేను బి.ఏ. పరీక్షలకు కూర్చోడానికి అర్హుణ్ణి అయాను. అయినప్పటికీ ఆ అవకాశాన్ని వినియోగించు కోగలనని కలలో కూడా అనుకోలేదు. బి.ఏ. డిగ్రీకి కలకత్తా విశ్వవిద్యాలయం పెట్టే కఠిన పరీక్షలముందు, శ్రీరాంపూర్ కాలేజి చివరి పరీక్షలు చిన్న పిల్లల ఆటల్లాంటివి. దాదాపు ప్రతిరోజూ నేను శ్రీయుక్తేశ్వర్‌గారి దర్శనానికి వెళ్తూండడం వల్ల తరగతి గదుల్లోకి ప్రవేశించడానికి నాకు టైమే మిగలలేదు. అక్కడ నా సహాధ్యాయులు, నేను గైర్‌హాజరయినప్పటి కంటె హాజరయినప్పుడే ఆశ్చర్యం ప్రకటించేవారు.

పొద్దున తొమ్మిదిన్నరకి సైకిలెక్కి బయల్దేరడంతోనే దాదాపు ప్రతిరోజూ నా దినచర్య మొదలయేది. ఒక చేత్తో, గురుదేవులకు అర్పించడానికి, మా 'పాంథీ' వసతిగృహంలోని తోటలో పూసిన పూలు కొన్ని పట్టుకువెళ్ళేవాణ్ణి. గురుదేవులు నన్ను ఆప్యాయంగా పలకరిస్తూ మధ్యాహ్న భోజనానికి ఉండి పొమ్మనేవారు. ఇక ఆ రోజుకు కాలేజికి వెళ్ళడమనే బెడద తప్పినందుకు సంతోషిస్తూ, ఆయన ఆహ్వానాన్ని తప్పకుండా హుషారుగా అంగీకరించేవాణ్ణి. శ్రీయుక్తేశ్వర్‌గారి సాటిలేని జ్ఞానోపదేశాలు ఆలకిస్తూనో, ఆశ్రమ విధుల్లో సాయపడుతూనో ఆయనతో గంటల తరబడి గడిపిన తరవాత, మనస్సు ఒప్పకపోయినా ఏ నడిరాత్రి వేళకో బయల్దేరి 'పాంథీ' వసతిగృహానికి వెళ్తూ ఉండేవాణ్ణి. ఒక్కొక్కప్పుడు, రాత్రి అంతా గురుదేవుల దగ్గరే ఉండిపోయేవాణ్ణి; ఆనందంగా ఆయన సంభాషణలో ఎలా మునిగిపోయే వాణ్ణంటే, చీకటి వేకువగా మారిందెప్పుడో కూడా గమనించేవాణ్ణి కాదు.

ఒకనాడు రాత్రి పదకొండు గంటలవేళ నేను నా గదికి తిరుగు ప్రయాణం కట్టే ప్రయత్నంలో బూట్లు తొడుక్కుంటూ ఉండగా, గురుదేవులు గంభీరంగా ఇలా అడిగారు :

"నీ బి.ఏ. పరీక్ష లెప్పుడు మొదలవుతాయి?"

"ఇంక ఐదు రోజుల్లోనండి."

"నువ్వు వాటికి తయారుగానే ఉన్నావనుకుంటాను."

భయంతో కొయ్యబారిపోయి, ఒక బూటు గాలిలోకి ఎత్తిపట్టుకున్నాను. "గురుదేవా, ఇన్నాళ్ళూ నాకు అధ్యాపకుల దగ్గరికంటె మీ దగ్గరే గడిచిపోయాయని మీకు తెలుసు. అలాంటప్పుడు, ఆ కఠినమైన పరీక్షలకి వెళ్ళి నాటకం ఆడడానికి నే నెలా సిద్ధపడతాను?" అంటూ అభ్యంతరం చెప్పాను.

శ్రీయుక్తేశ్వర్‌గారి కళ్ళు నా కళ్ళలోకి గుచ్చిగుచ్చి చూశాయి. "నువ్వు వెళ్ళి తీరవలసిందే." ఆయన కంఠస్వరం నిష్ఠురంగా, అనుల్లంఘ్యమైన శాసనంలా

ధ్వనించింది. "మీ నాన్నగారికీ తక్కిన చుట్టాలకీ, ఆశ్రమజీవితానికి నువ్విచ్చే ప్రాముఖ్యాన్ని విమర్శించడానికి మనం కారణం కల్పించగూడదు. నువ్వు పరీక్షలకి హాజరవుతానని నాకు మాట ఇయ్యి చాలు; నువ్వు రాయగలిగినంత బాగా సమాధానాలు రాయి."

కన్నీళ్ళు, ఆపుకోడానికి వీలుకాకుండా నా మొహం మీద ధారకట్టి కారుతున్నాయి. గురుదేవుల ఆజ్ఞ సబబుగా లేదనీ, ఆయన ఆసక్తి - టూకీగా చెప్పాలంటే - కాలదోషం పట్టినటువంటిదనీ అనిపించింది నాకు.

"మీరు కావాలంటే నేను తప్పకుండా హాజరవుతాను," అన్నాను వెక్కి వెక్కి ఏడుస్తూ. "కాని సరిగా తయారుకావడానికి వ్యవధి లేదండి," అని చెబుతూ "ప్రశ్నలకు రాయవలసిన సమాధానాల్లో, మీ ఉపదేశాలతోనే కాయితాలు నింపేస్తాను!" అని నాలో నేను గొణుక్కున్నాను.

ఆ మర్నాడు నేను మామూలు వేళకి ఆశ్రమంలో అడుగుపెట్టినప్పుడు నే నిచ్చే పూలగుత్తి విచారగ్రస్తుణ్ణయి శ్రీయుక్తేశ్వర్‌గారికి సమర్పించాను. నా విషాద రూపం చూసి నవ్వారాయన.

"ముకుందా, పరీక్షలోకానీ మరోచోటకానీ దేవుడు నిన్నెప్పుడయినా తప్పించాడా?"

"లేదండి," అన్నాను నేను ఉత్సాహంగా, కృతజ్ఞతాపూర్వకమైన స్మృతులు నాలో మళ్ళీ ఉత్సాహం కలిగిస్తూ వెల్లువలా పెల్లుబికాయి.

"కాలేజి గౌరవాలకోసం పాకులాడకుండా నిన్ను అడ్డుకున్నది దైవాన్వేషణ పరమైన తపనేకాని సోమరితనం కాదు," అన్నారు గురుదేవులు కనికరంతో. కాసేపు మౌనం వహించిన తరవాత ఇలా ఉదాహరించారు. మీరు మొట్టమొదట దేవుడి రాజ్యాన్నీ ఆయన ధర్మాన్నీ అన్వేషించండి; అటుమీదట ఇవన్నీ మీకు అదనంగా సమకూర్చడం జరుగుతుంది.' "*

గురుదేవుల సన్నిధిలో నా బరువులన్నీ తేలిపోవడం వెయ్యోసారి నాకు అనుభవమయింది. ఆ మధ్యాహ్న భోజనం మేము పెందలాడే ముగించుకున్న తరవాత నన్ను 'పాంథీ'కి తిరిగి వెళ్ళమని సలహా ఇచ్చారు ఆయన.

"నీ స్నేహితుడు రమేశ్‌చంద్ర దత్తు ఇంకా మీ వసతి గృహంలోనే ఉంటున్నాడా?"

---

* మత్తయి 6:33 (బైబిలు)

"ఉంటున్నాడండి."

"అతన్ని కలుసుకో. పరీక్షల్లో నీకు సాయపడ్డానికి ఈశ్వరుడు అతనికి ప్రేరణ ఇస్తాడు."

"మంచిదండి; కాని రమేశ్ మామూలప్పటికంటె ఎక్కువగా చదువులో మునిగి ఉన్నాడు. మా క్లాసుకు గౌరవకారకుడతను; పైగా అతని కోర్సు, తక్కిన వాళ్లందరి దానికన్న ఎక్కువ భారమైనది."

గురుదేవులు నా అభ్యంతరాలన్నీ తోసి పారేశారు. "రమేశ్ నీ కోసం వెసులుబాటు చేసుకుంటాడు. ఇంక వెళ్ళు."

నేను సైకిలు తొక్కుకుంటూ 'పాంథీ'కి వెళ్ళాను. వసతిగృహం ఆవరణలో నేను కలిసిన మొట్టమొదటి వ్యక్తి, విద్వాంసుడైన రమేశే. అన్ని రోజులూ అతనికి తీరికే అన్నట్టు, నేను వెనకాడుతూ కోరిన కోరికను అతను సౌహార్దంతో అంగీకరించాడు.

"తప్పకుండా! నీకు కావలసిన సాయం చెయ్యడానికి నేను సిద్ధం," అంటూ అతను, ఆ రోజూ, ఆ తరవాత మరికొన్ని రోజులూ, గంటల తరబడి నాకు రకరకాల సబ్జెక్టులు చెప్పాడు.

"ఇంగ్లీషు సాహిత్య పరీక్షలో చాలా ప్రశ్నలు, చైల్డ్ హెరాల్డ్ ప్రయాణం చేసిన దారికి సంబంధించి ఉంటాయని నా నమ్మకం," అన్నాడు నాతో. "మనం వెంటనే అట్లాస్ ఒకటి సంపాదించాలి."

నేను వెంటనే మా శారద బాబయ్యగారింటికి ఉరికి అట్లాసొకటి ఎరువు తెచ్చాను. బైరన్ సృష్టించిన కల్పిత కథానాయకుడు యాత్రలో సందర్శించిన ప్రదేశాల్ని యూరప్ మాప్‌లో గుర్తు పెట్టాడు రమేశ్.

అతను నాకు చదువు చెప్పగా వినడంకోసం మా సహాధ్యాయులు కొందరు చుట్టూ మూగారు. "రమేశ్ నీకు తప్పుడు సలహా ఇస్తున్నాడు," అంటూ వ్యాఖ్యానించాడు వాళ్ళలో ఒకడు, ఒక తడవ మా చదువు పూర్తి కాగానే. "మామూలుగా, ప్రశ్నల్లో సగం మాత్రమే పుస్తకాల మీద వస్తాయి; తక్కిన సగం రచయితల జీవితాలకు సంబంధించి వస్తాయి."

నేను ఇంగ్లీషు సాహిత్య పరీక్షకి కూర్చున్నప్పుడు, మొదటిసారిగా ప్రశ్నల మీద నా చూపు పడగానే, కృతజ్ఞతతో వెలువడ్డ కన్నీళ్లు నా చెక్కిళ్ళ మీంచి జారిపడుతూ నా పేపరును తడిపేశాయి. క్లాస్ మానిటర్ నా బల్ల దగ్గరికి వచ్చి సానుభూతిగా పలకరించాడు.

"రమేశ్ నాకు సాయపడతాడని మా గురుదేవులు ముందుగానే నాకు జోస్యం చెప్పారు," అని వివరించాను. "చూడు, రమేశ్ నాకు సూచించిన ప్రశ్నలే ఇక్కడ పరీక్షాపత్రం మీద ఉన్నాయి!" అంటూ ఇంకా ఇలా అన్నాను. "నా అదృష్టంవల్ల, ఈ సంవత్సరం బ్రిటిష్ రచయితల మీద చాలా తక్కువ ప్రశ్న లున్నాయి; వాళ్ళ జీవితాలు, నాకు సంబంధించినంతవరకు, అతి గహనంగా రహస్యపు ముసుగులో మరుగుపడి ఉన్నాయి."

నేను తిరిగి వెళ్ళేటప్పటికి మా బోర్డింగ్ హౌస్ అరుపులతో దద్దరిల్లి పోయింది. రమేశ్ చెప్పే చదువుమీద నమ్మకం పెట్టుకున్నందుకు నన్ను హేళన చేస్తూ వచ్చిన కుర్రాళ్ళు ఇప్పుడు అభినందనలతో నా చెవులు దాదాపు దద్దరిల్లి పోయేటట్టు చేశారు. పరీక్షల వారం రోజులూ నేను వీలున్నంత ఎక్కువసేపు రమేశ్‌తోనే గడిపాను; ప్రొఫెసర్లు పరీక్షలో ఇస్తారని తనకనిపించిన ప్రశ్నలు తయారుచేసి పెట్టాడతను. రోజు రోజుకూ రమేశ్ ప్రశ్నలు, దాదాపు అవే మాటల్లో పరీక్షాపత్రాల్లో ప్రత్యక్షమవుతూ వచ్చాయి.

అద్భుత అలౌకిక చర్యలాంటిదేదో జరుగుతోందనీ, పరధ్యానపు "పిచ్చి సన్యాసి" పరీక్షల్లో గట్టెక్కేసే అవకాశం కనిపిస్తోందనే ఒక వార్త విస్తృతంగా ప్రచారమయింది. ఇందులో యథార్థాలు కప్పిపుచ్చడానికి నేనే ప్రయత్నమూ చెయ్యలేదు. కలకత్తా విశ్వవిద్యాలయం విద్వాంసులు తయారుచేయించిన ప్రశ్నల్ని మార్చడానికి అధికారం ఇక్కడి అధ్యాపకులకు లేదు.

ఆంగ్లభాషాసాహిత్య పరీక్షనుగురించి ఆలోచిస్తూ ఒకనాడు పొద్దున, నేనో ఘోరమైన తప్పు చేశానని గ్రహించాను. కొన్ని ప్రశ్నలు రెండు భాగాలుగా ఇచ్చారు: 'ఎ' కాని 'బి' కాని; 'సి' కాని 'డి' కాని. నేను ఒక్కొక్క భాగంలో ఒక్కొక్క ప్రశ్న ఎన్నుకోడానికి బదులు, మొదటి భాగంలోనే రెండు ప్రశ్నలకూ జవాబులు రాసి అజాగ్రత్తవల్ల రెండో భాగాన్ని పట్టించుకోలేదు. ఆ పేపరులో నేను తెచ్చుకోగల ఎక్కువ మార్కులు 33 - పాస్ కావడానికి రావలసిన 36 మార్కులకన్న మూడు మార్కులు తక్కువ.

వెంటనే గురుదేవుల దగ్గరికి పరిగెత్తి, నా బాధలు వెళ్ళబోసుకున్నాను

"గురుదేవా, నేను క్షమించరాని తప్పు చేశాను. రమేశ్‌ద్వారా దేవుడి ఆశీస్సులు పొందడానికి నేను అర్హుణ్ణి కాను; నేను పూర్తిగా పనికి మాలినవాణ్ణి."

"హుషారుగా ఉండు, ముకుందా," అన్నారు గురుదేవులు. శ్రీయుక్తేశ్వర్ గారి స్వరంలో మార్దవం, నిశ్చింత కనిపిస్తున్నాయి. ఆయన నీలాకాశం వేపు వేలు

చూపించారు. "అంతరిక్షంలో సూర్యచంద్రులు తమ స్థానాలు మార్చుకోడమయినా జరగొచ్చుకాని, డిగ్రీ సంపాదించడంలో నువ్వు ఫెయిల్ కావడం జరగదు."

ప్రశాంత మనఃస్థితిలో నేను ఆశ్రమంనుంచి బయటికి వచ్చాను; అయితే నేను పాస్ కాగలగడం గణితశాస్త్రీయంగా అనూహ్యంగానే కనిపిస్తోంది. ఒకటి రెండుసార్లు బెదురుబెదురుగా ఆకాశంలోకి చూశాను. దినరాజు తన మామూలు కక్ష్యలో సురక్షితంగానే కనిపించాడు.

నేను 'పాంథీ' చేరేసరికి, మా సహాధ్యాయి ఒకడు అన్నమాట నా చెవిని పడింది : "ఇంగ్లీషు సాహిత్యంలో పాస్ కావడానికి రావలసిన మార్కు మొట్ట మొదటిసారిగా ఈ సంవత్సరం తగ్గించారని నా కిప్పుడే తెలిసింది."

నేను ఆ అబ్బాయి గదిలోకి జోరుగా పరిగెత్తేసరికి, అతను కంగారు పడిపోతూ చూశాడు. నే నతన్ని ఆత్రంగా ప్రశ్నించాను.

"జెడదారి సన్యాసీ," అని నన్ను చూసి నవ్వుతూ, "చదువు సంధ్యల మీద ఇంత హఠాత్తుగా ఆసక్తి పుట్టుకొచ్చిందేం నాయనా? చివరి క్షణంలో ఇలా గోల పెట్టడం దేనికి? కాని పరీక్ష పాసవడానికి రావలసిన మార్కు ఇప్పుడే 33కు తగ్గించడం మాత్రం నిజం," అన్నాడతను.

ఆనందంగా నాలుగు ఉరుకుల్లో నా గదిలోకి వచ్చి పడ్డాను. మోకాళ్ళ మీదికి వాలి, ఆ పరమేశ్వరుడి గణితశాస్త్ర పరిపూర్ణతలకు జోహారులర్పించాను.

రమేశ్ద్వారా నాకు దారి చూపిస్తున్నట్టు స్పష్టంగా అనుభూతమవుతున్న ఒకానొక ఆధ్యాత్మిక శక్తి ఉనికి స్ఫురణలో ఉండడంతో ప్రతిరోజూ నేను ఆనందంతో పులకితుణ్ణయాను. బెంగాలీ భాష కోర్సుకు సంబంధించిన పరీక్ష విషయంలో చెప్పుకోదగ్గ సంఘటన ఒకటి జరిగింది. ఒకనాడు పొద్దున, ఆ కోర్సులో నాకు చదువుచెప్పిన రమేశ్ పరీక్ష హాలుకు వెళ్ళడానికి బోర్డింగ్ హౌస్ నుంచి బయలుదేరుతూ ఉండగా నన్ను పిలిచాడు.

"రమేశ్ నీ కోసం అరుస్తున్నాడు," అన్నాడొక క్లాసుమేటు చిరాకుగా. "వెనక్కి వెళ్ళకు; పరీక్ష హాలుకు వెళ్ళడానికి ఆలస్యమయిపోతుంది."

అతని సలహా పట్టించుకోకుండా, బోర్డింగ్ హౌస్‌కు పరిగెత్తాను.

"మామూలుగా మన బెంగాలీ కుర్రాళ్ళు బెంగాలీ పరీక్షలో సులువుగా పాసయిపోతారు," అన్నాడు రమేశ్. "కాని ఈ ఏడాది ప్రొఫెసర్లు, పాఠ్య పుస్తకాల మీద ప్రశ్నలడిగి విద్యార్థుల్ని 'ఊచకోత' కొయ్యాలని ఎత్తు వేసినట్టుగా ఇప్పుడే నా మనస్సుకు తట్టింది." ఆ తరవాత అతను, పంథొమ్మిదో శతాబ్దంలో ప్రసిద్ధుడైన

విద్యాసాగర్ అనే బెంగాలీ ప్రజాహితకారుడి జీవితంలోంచి రెండు కథలు టూకీగా చెప్పాడు.

నేను రమేశ్‌కు ధన్యవాదాలు చెప్పి సైకిలెక్కేసి గబగబా పరీక్ష హాలుకు వెళ్ళాను. అక్కడ బెంగాలీ పరీక్షాపత్రంలో రెండు భాగాలుండడం గమనించాను మొదటి ప్రశ్న ఏమిటంటే : "విద్యాసాగరుల దానధర్మాలకు రెండు ఉదాహరణలు రాయండి."* అని. అంతకుముందే గడించిన జ్ఞానాన్ని నేను సమాధాన పత్రంమీదికి బదలాయింపు చేస్తూ, రమేశ్ చివరి క్షణం పిలుపును ఖాతరు చేసినందుకు దేవుడికి చిన్నగా ధన్యవాదాలు చెప్పుకున్నాను. విద్యాసాగరుల ఉపకారాలు (ఇప్పుడు నాకు చేసింది కూడా కలుపుకొని) కనక నాకు తెలిసి ఉండకపోతే నేను బెంగాలీ పరీక్షలో పాసయి ఉండేవాణ్ణి కాదు.

పత్రంలో రెండో ప్రశ్న ఇది : "నిన్ను ఎక్కువగా ఉత్తేజపరిచిన ఒక వ్యక్తి జీవితాన్ని గురించి బెంగాలీలో ఒక వ్యాసం వ్రాయుము." పాఠక మహాశయా నా కథావస్తువుకు నేను ఎన్నుకున్న వ్యక్తి ఎవరో మీకు వేరే చెప్పనక్కర్లేదు. పేజీ వెంబడి పేజీగా నేను మా గురుదేవుల స్తుతితో నింపేస్తూ ఉంటే, మీ ఉపదేశాలతోనే కాయితాలు నింపేస్తానని గొణుక్కుంటూ చెప్పిన జోస్యం నిజమవుతున్నదని గ్రహించి చిన్నగా నవ్వుకున్నాను.

తత్త్వశాస్త్రంలో నా కోర్సుగురించి రమేశ్‌ను అడగబుద్ధి కాలేదు. శ్రీయుక్తేశ్వర్ గారి సన్నిధిలో చాలాకాలం పొందిన శిక్షణ మీద విశ్వాసముంచి పాఠ్య పుస్తక వివరణల్ని ఉపేక్ష చేసేశాను. నా పేపర్లలో అన్నిటికన్న ఎక్కువ మార్కులు వచ్చింది తత్త్వశాస్త్రం పేపరులోనే. మిగిలిన సబ్జెక్ట్ లన్నింటిలో అత్తెసరు మార్కులే వచ్చాయి.

స్వార్థరహితుడైన మా స్నేహితుడు రమేశ్, ప్రసంసనీయమైన శ్రేణిలో పట్టం పొందాడని రాయడం నాకు ఆహ్లాదకరమైన విషయం.

నేను పట్టభద్రుణ్ణి అయినందుకు నాన్నగారు ముసిముసి నవ్వులు నవ్వుకున్నారు. "నువ్వు పాసవుతావని అనుకోనేలేదు, ముకుందా," అని ఉన్నమాట చెప్పేశారు. "మీ గురువుగారి దగ్గిరే ఎక్కువకాలం గడిపేస్తుంటావు." మా నాన్నగారు పైకి చెయ్యని విమర్శను నిజానికి గురుదేవులు సరిగానే కనిపెట్టారు.

---

* ఆ ప్రశ్నలో వాక్య నిర్మాణం ఎలా ఉందో నాకు కచ్చితంగా గుర్తు లేదు: కాని నాకు విద్యాసాగరుల గురించి రమేశ్ చెప్పిన రెండు కథలకూ సంబంధించిందేనని గుర్తు ఉంది

పండిత ఈశ్వరచంద్రగారికి ఉన్న విద్వత్తువల్ల 'విద్యాసాగర్' (విద్యలో సముద్రంవంటి వారు) అన్న బిరుదుతోనే ఆయన బెంగాలులో విఖ్యాతులయారు.

నా పేరు వెనక బి.ఏ. డిగ్రీ చూసుకునే రోజు ఎప్పటికయినా వస్తుందన్న నమ్మకం చాలా ఏళ్ళపాటు లేదు నాకు. అది భగవత్ప్రసాదంగా వచ్చిందన్న ఆలోచన లేకుండా నేను ఆ డిగ్రీని ఉపయోగించడం అరుదు; ఏదో నిగూఢమైన కారణాలవల్ల నా కా డిగ్రీ ప్రసాదించడం జరిగింది. కాలేజిలో చదువు కున్నవాళ్ళు, తాము దిగమింగిన జ్ఞానంలో చాలా కొద్దిగా మాత్రమే, పట్టభద్రులైన తరవాత తమకు మిగిలిందని అంటూండడం అప్పుడప్పుడు వింటూంటాను. వాళ్ళు ఆ విధంగా ఒప్పుకోడం, విద్యావిషయంలో నిస్సందేహంగా నాకున్న లోపాలకు ఒక్కరవ్వ ఊరట కలిగిస్తుంది.

1915 జూన్ నెలలో నేను కలకత్తా విశ్వవిద్యాలయం నుంచి డిగ్రీ తీసుకున్ననాడు మా గురుదేవుల పాదాలమీద వాలి, ఆయన ప్రాణశక్తి*లోంచి నా ప్రాణ శక్తిలోకి ప్రసరించిన ఆశీస్సులన్నింటికీ ఆయనకు కృతజ్ఞతలు తెలుపుకొన్నాను.

"లే ముకుందా," అన్నారాయన అనునయంగా, "సూర్యచంద్రుల స్థానాల్ని మరో విధంగా మార్చడం కంటె నిన్ను పట్టభద్రుణ్ణి చెయ్యడమే ఎక్కువ సౌకర్యంగా కనిపించి ఉంటుంది ఈశ్వరుడికి!"

---

* ఇతరుల మనసుల్ని, సంఘటన ఘటననూ ప్రభావితం చేసే శక్తి, ఒక 'విభూతి' (యోగశక్తి). పతంజలి యోగసూత్రాల్లో మూడో అధ్యాయంలో 24 శ్లోకంలో దీన్ని వివరించాడు. ఈ శక్తి, "సార్వజనీన సానుభూతి"కి ఫలితమని తెలియజేస్తుంది అది

ఈశ్వరుడు మానవుణ్ణి తన సర్వశక్తిమంతమైన రూపంలో సృష్టించాడని పవిత్ర గ్రంథాలన్నీ చెపుతాయి. విశ్వంమీద నియంత్రణ ప్రకృతికి అతీతమైనదన్నట్టు కనిపిస్తుంది కాని దానికి తన పుట్టుకకు మూలం భగవంతుడనే "సరయిన స్పృహ" (సమ్యక్ స్మరణ) సాధించిన ప్రతి ఒక్కడిలోనూ అటువంటి శక్తి అంతర్గతంగా సహజంగా ఉంటుంది. అహంకారమూ, వ్యక్తిగత వాంఛల రూపంలో అది తల ఎత్తడమూ శ్రీయుక్తేశ్వర్‌గారి మాదిరిగా భగవత్సాక్షాత్కారం పొందిన వాళ్ళలో ఉండవు. నిజమైన గురువుల కార్యకలాపాలు 'ఋతం' అనే సహజ ధార్మికతకు అప్రయత్నంగానే అనురూపంగా ఉంటాయి. ఎమర్సన్ మాటల్లో చెప్పాలంటే, మహాపురుషు లందరూ, "ధర్మపరాయణులు కావడం కాదు, వారే 'ధర్మస్వరూపు' లవుతారు; అప్పుడు సృష్టి లక్ష్యం నెరవేరుతుంది ఈశ్వరుడు బాగా ప్రసన్నుడవుతాడు."

దైవసాక్షాత్కారం పొందిన మనిషి ఎవరయినా సరే, అలౌకిక ఘటనలు ప్రదర్శించ గలడు, సూక్ష్మమైన సృష్టి నియమాల్ని క్రీస్తువలె అతడు అర్థంచేసుకోడమే దానికి కారణం కాని సద్గురువు లందరూ అద్భుత శక్తుల్ని ప్రయోగించాలని తల పెట్టరు. (చూ. 296 అధోజ్ఞాపిక) ప్రతి సాధువూ తన రీతిలో తాను దేవుణ్ణి ప్రతిబింబింపజేస్తూ ఉంటాడు; ఏ రెండు ఇసుక రేణువులూ కచ్చితంగా ఒకదాన్నొకటి పోలకుండా ఉండే ఈ ప్రపంచంలో ఈ మాదిరి వ్యక్తిత్వాభివ్యక్తి మౌలికమైనది.

దైవజ్ఞానం పొందిన సాధువుల్ని గురించి అపవాదంలేని సూత్రాలు రూపొందించడం కుదరదు, కొందరు అద్భుత అలౌకిక చర్యలు ప్రదర్శిస్తారు, కొందరు ప్రదర్శించరు కొందరు నిష్క్రియులుగా ఉంటే మరికొందరు (ప్రాచీన భారత దేశంలోని జనకమహారాజు, సెంట్ తెరిసా ఆఫ్ అవిలా లాంటివాళ్ళు) బృహత్ కార్యకలాపాల్లో తలమునకలై ఉంటారు; కొందరు ఉపదేశిస్తారు, సంచారం చేస్తారు, శిష్యుల్ని స్వీకరిస్తారు. కాని మరికొందరు నీడమాదిరిగా నిశ్శబ్దంగానూ వినమ్రంగానూ జీవితాలు గడుపుతారు. ప్రతి సాధువుకూ వేరువేరు లిపిలో రాసి పెట్టి ఉన్న రహస్యమైన కర్మలిఖితాల్ని లౌకిక విమర్శకుడెవడూ చదవలేడు.

అధ్యాయం : 24

# నేను సన్యాసం తీసుకోడం

"గురుదేవా, నేను బెంగాల్-నాగపూర్ రైల్వేలో నిర్వాహక ఉద్యోగానికి ఒప్పుకుంటే బాగుంటుందని నాన్నగారు ఆత్రంగా ఉన్నారు. కాని నేను, వద్దని కచ్చితంగా చెప్పేశాను," అంటూ నేను, "స్వామీ, మీరు నాకు సన్యాసదీక్ష ఇయ్యరా?" అని ఆశగా అర్థిస్తూ, మా గురుదేవులవేపు చూశాను. వెనకటి సంవత్సరాల్లో నేను ఇదే కోరిక కోరినప్పుడు ఆయన, నా నిశ్చయం ఎంత దృఢమైందో పరీక్షించడానికి, దాన్ని నిరాకరించారు. అయితే ఈనాడు, కరుణార్ద్ర దృష్టితో చిరునవ్వు నవ్వారు.

"మంచిది, రేపే నీకు సన్యాసదీక్ష ఇస్తాను," అంటూ ప్రశాంతంగా ఇంకా ఇలా అన్నారు, "నువ్వు సన్యాసం తీసుకోవాలన్న కోరిక విడవకుండా ఉన్నందుకు నాకు సంతోషంగా ఉంది. 'నువ్వు దేవుణ్ణి నీ వేసవి [పడుచుతనం] అతిథిగా ఉండమని ఆహ్వానించకపోతే, నీ జీవితపు చలికాలం [ముసలితనం]లో ఆయన నీ దగ్గిరికి రాడు.' అని తరచుగా అనేవారు లాహిరీ మహాశయులు."

"ప్రియ గురుదేవా, పూజనీయులైన మీ మాదిరిగానే నేను కూడా సన్యాసిగా ఉండాలన్న కోరికను ఎన్నడూ విడిచిపెట్టలేను." అపారమైన అభిమానంతో ఆయన వేపు చూసి చిరునవ్వు నవ్వాను.

"పెళ్ళికానివాడు దైవసంబంధమయినవాటికోసం ఆరాటపడతాడు; ఆయన్ని ఎలా సంతోషపెట్టాలా అని చూస్తాడు: కాని పెళ్ళయినవాడు ప్రాపంచిక విషయాల గురించి ఆరాటపడతాడు; తన పెళ్ళాన్ని ఎలా సంతోషపెట్టాలా అని చూస్తాడు."* ఒక రకమైన ఆధ్యాత్మిక శిక్షణ పొందిన తరవాత పెళ్ళి చేసుకున్న మా స్నేహితుల్లో చాలామంది జీవితాల్ని నేను విడమరిచి చూశాను. వాళ్ళు లౌకిక బాధ్యతల సముద్రంలో ప్రయాణం మొదలుపెట్టి, గాఢంగా ధ్యానం చెయ్యాలని చేసుకున్న తీర్మానాల్ని మరిచిపోయారు.

---

* I కొరింథియన్లు 7:32-33 (బైబిలు)

జీవితంలో దేవుడికి రెండోస్థానం* [అప్రధానమైన స్థానం] కేటాయించడమన్నది నా ఊహకు అందని విషయం. చడీ చప్పుడూ లేకుండా, జన్మజన్మాంతరాల్లో మనిషికి తన కానుకలు కురిపిస్తూ బ్రహ్మాండానికంతకూ ఏకైక స్వామి అయినవాడు ఆయనే. ఆ కానుకలకు ప్రతిగా మానవుడు, ఆయనకి ఇవ్వదగిన కానుక ఒకే ఒకటి - అది తన ప్రేమ; దాన్ని ఇవ్వడానికయినా మానడానికయినా అతనికి అధికారం ఉంది.

సృష్టిలో అణువణువునా ఉన్న తన ఉనికిని గోప్యంగా కప్పి ఉంచడానికి అంతు లేని శ్రమ తీసుకోడంలో సృష్టికర్తకు ఒకే ఒక ఉద్దేశ్యం, ఒకే సున్నితమైన కోరిక, ఉండి ఉంటుంది - మానవుడు స్వతంత్ర సంకల్పంతో మాత్రమే తనను అన్వేషించాలని. సర్వశక్తిమత్వమనే ఉక్కు పిడికిలిని నమ్రత అనే ఏ ముఖమల్ తొడుగులో మరుగుపరచలేదాయన?

ఆ మర్నాడు, నా జీవితంలో ఎన్నటికీ మరుపురాని రోజు. నాకు బాగా గుర్తు; ఆహ్లాదకరమైన ఆ రోజు గురువారం. 1915 జూలై నెల. కాలేజిలో నేను పట్టభద్రుణ్ణి అయిన కొద్దివారాలకే. శ్రీరాంపూర్ ఆశ్రమం లోతట్టు బాల్కనీలో గురుదేవులు, తెల్లటి ఒక కొత్త పట్టుబట్టను కాషాయ వన్నె అద్దకం రంగులో ముంచారు; సన్యాసులు కట్టుకొనే బట్టలకు సాంప్రదాయికంగా వాడే వన్నె ఇది. బట్ట ఆరిన తరవాత, సన్యాసి పరిధానంగా, గురుదేవులు దాన్ని నాకు కప్పారు.

"ఒకనాటికి నువ్వు పడమటి దేశాలకి వెళ్తావు; అక్కడి వాళ్ళు పట్టును పసందు చేస్తారు," అన్నారాయన. "అందువల్ల మామూలుగా అందరూ కట్టుకొనే నూలు బట్టకు బదులు, ఒక గుర్తుగా, నీ కోసం పట్టుబట్ట ఎంపిక చేశాను."

భారతదేశంలో సన్యాసులు పేదరికాన్ని ఆదర్శంగా తీసుకుంటారు కాబట్టి పట్టుబట్ట కట్టుకున్న స్వామి లవుపించడం అరుదు. అయితే చాలా మంది యోగులు పట్టుబట్టలు కట్టుకోడానికి కారణం, అది నూలుబట్టకన్న ఎక్కువగా, శరీరంలోని కొన్ని సూక్ష్మ (విద్యుత్) ప్రవాహాల్ని సంరక్షించగలిగి ఉండడమే.

"తతంగాలు నాకు కిట్టవు," అన్నారు శ్రీయుక్తేశ్వర్‌గారు. "విద్వత్ (కర్మ కాండలేని) రీతిలో నీకు సన్యాసదీక్ష ఇస్తాను."

'వివిదిష' అనే సాంగోపాంగ సన్యాసదీక్షలో అగ్నికార్యం కూడా ఒకటి ఉంటుంది; ఈ ప్రక్రియలో ప్రతీకాత్మకంగా అంత్యక్రియలు జరుగుతాయి.

* "దేవుడికి రెండోస్థానం ఇచ్చేవాడు, ఆయనకు ఏ స్థానమూ ఇవ్వనివాడే" - రస్కిన్.

శిష్యుడి భౌతికకాయం మరణించినట్టూ దాన్ని జ్ఞానజ్వాలలో దహనం చేసినట్టూ పరిగణిస్తారు. కొత్తగా దీక్ష ఇచ్చిన సన్యాసికి ఒక మంత్రం ఉపదేశిస్తారు; ఉదాహరణకు : "ఆ ఆత్మ బ్రహ్మ" (అయమాత్మా బ్రహ్మ)* అని కాని, "నువ్వే అది" (తత్త్వమసి) అనికాని, "ఆయనే నేను" (సోహం) అని కాని. అయితే శ్రీయుక్తేశ్వర్‌గారు నిరాడంబరతాప్రియులు కనక, లాంఛనప్రాయమైన కర్మకాండలన్నీ కట్టిపెట్టి నన్నొక కొత్తపేరు ఎన్నుకోమని మాత్రమే అన్నారు.

"నీకు నువ్వే ఎన్నిక చేసుకునే హక్కు ఇస్తాను," అన్నారు చిన్నగా నవ్వుతూ.

"యోగానంద,"† అని చెప్పాను. ఒక్క క్షణం ఆలోచించి. ఈ పేరుకు అర్థం, "యోగం ద్వారా పొందే ఆనందం" అని.

"తథాస్తు ముకుందలాల్ ఘోష్ అనే కుటుంబ వ్యవహారం నామం విడిచిపెట్టేసి, ఇకనుంచి నిన్ను, సన్యాసాశ్రమ సంప్రదాయంలో 'గిరి' శాఖకు చెందిన యోగానందుడిగా పిలుస్తారు."

శ్రీయుక్తేశ్వర్‌గారి ముందు నేను మోకరిల్లి, ఆయన నా కొత్త పేరు పలకడం మొట్టమొదటిసారిగా వింటున్నప్పుడు నా హృదయం కృతజ్ఞతతో పెల్లుబికిపోయింది. ఆనాటి కుర్ర ముకుందుడు ఒకనాటి కెప్పటికో స్వామి యోగానందగా పరివర్తన చెందాలని ఎంత ప్రేమగా, ఎంత శ్రమకోర్చి హైరాణ పడ్డారు! ఆనంద భరితుణ్ణయి నేను, స్వామి శంకరుల‡ (శంకరాచార్యులవారు) సుదీర్ఘ సంస్కృత స్తోత్రం (నిర్వాణషట్కం)లోంచి కొన్ని శ్లోకాలు చదివాను :

"మనో బుద్ధ్యహంకార చిత్తాని నాహం
న చ శ్రోత్ర జిహ్వే న చ ఘ్రాణ నేత్రే

---

* అంటే, "ఈ ఆత్మ పరబ్రహ్మ' అని అర్థం. ఈ పరబ్రహ్మ ఒకరు సృష్టించినది కాదు పూర్తిగా నిర్విశేషమైనది ('నేతి, నేతి' . ఇదికాదు, ఇది కాదు). కాని వేదాంతంలో దీన్ని తరుమగా సత్-చిత్-ఆనందం'గా పేర్కొంటారు.

† "యోగానంద" అన్నది స్వాముల్లో బాగా వినిపించే పేరే

‡ శంకరుల్ని తరుమగా శంకరాచార్యులవారని అంటారు; ఆచార్యులంటే మత గురువులు శంకరుల కాలాన్ని గురించి పండితుల్లో వివాదాలు జరుగుతూ ఉంటాయి. ఈ అద్వితీయ అద్వైతి క్రీ పూ. ఆరో శతాబ్దిలో జీవించారని కొన్ని లిఖిత ఆధారాలు సూచిస్తాయి ఆనందగిరి అనే ముని క్రీ.పూ. 44-12 అన్న తేదీలు ఇస్తున్నాడు; శంకరులు క్రీ.శ. ఎనిమిదో శతాబ్దం లేక తొమ్మిదో శతాబ్దం ప్రారంభంలో వారని పాశ్చాత్య చారిత్రకులు అంటారు. ఎన్నో యుగాలకి సంబంధం!

న చ వ్యోమ భూమి ర్నతేజో న వాయుః
చిదానందరూపః శివోహం శివోహం.

న మృత్యు ర్న శంకా న మే జాతిభేదః
పితా నైవ మే నైవ మాతా న జన్మ
న బంధు ర్న మిత్రం గురుర్నైవ శిష్యః
చిదానందరూపః శివోహం శివోహం.

అహం నిర్వికల్పో నిరాకారరూపో
విభుర్వ్యాప్య సర్వత్ర సర్వేంద్రియాణాం
న చాసంగతం నైవ ముక్తి ర్నమేయః
చిదానందరూపః శివోహం శివోహం.

ప్రతి స్వామి, భారతదేశంలో చిరంతన కాలంగా మన్ననలందుకుంటూ వస్తున్న సన్యాస మఠామ్నాయానికి చెంది ఉంటాడు. కొన్ని శతాబ్దాల కిందట శంకరాచార్యులవారు దీన్ని పునర్వ్యవస్థీకరించి [మఠామ్నాయ మహానుశాసనం] ఇప్పుడున్న రీతిలోకి మార్చారు. ఆనాటినించి పూజనీయులైన మఠాధిపతుల అవిచ్ఛిన్న పరంపర (వారిలో ప్రతి ఒక్కరికీ పరంపరాగతంగా 'జగద్గురు శంకరాచార్య' అనే బిరుదు ఉంటుంది)[1] దీనికి ఆధిపత్యం వహిస్తూ వస్తోంది. ఈ సన్యాస మఠామ్నాయంలో చాలామంది - బహుశా పదిలక్షలమంది - స్వాములు ఉన్నారు; అందులో ప్రవేశించడానికి వారు పాటించవలసిన నియమం, సన్యాసులైన వారి దగ్గరే దీక్ష తీసుకోడం. ఈ ప్రకారంగా, సన్యాస మఠామ్నాయంలోని స్వాములందరూ, గురు

---

* పూరీలో ఉన్న సనాతనమైన గోవర్ధన మఠానికి అధిపతులు, జగద్గురు శంకరాచార్యుల వారు, పూజ్యపాదులు కీ.శే. భారతీకృష్ణ తీర్థులు 1958లో మూడు నెల్లపాటు అమెరికా సందర్శించారు. శంకరాచార్యులలో ఒకరు పాశ్చాత్య దేశాల్లో సంచారం చెయ్యడమన్నది ఇదే మొదలు చారిత్రక ప్రాముఖ్యం వహించే ఆయన యాత్రను ప్రోత్సహించిన సంస్థలు పరమహంస యోగానందులు స్థాపించిన యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్. జగద్గురువులు అమెరికాలోని ప్రముఖమైన విశ్వవిద్యాలయాల్లో ప్రసంగాలు చేశారు. ప్రఖ్యాత చారిత్రకుడు, డా॥ ఆర్నాల్డ్ టాయిన్బీతో ప్రపంచశాంతిని గురించి ఏర్పాటు చేసిన చర్చలో పాల్గొన్నారు.

1959లో పూరీ శంకరాచార్యులు, యోగదా సత్సంగ స్వాములిద్దరికి సన్యాసదీక్ష ఇవ్వడంలో, యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా / సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ గురువుల ప్రతినిధిగా వ్యవహరించమని కోరుతూ అధ్యక్షురాలు శ్రీశ్రీ దయామాత పంపిన ఆహ్వానాన్ని అంగీకరించారు. పూరీలో యోగదా సత్సంగ ఆశ్రమంలో ఉన్న శ్రీయుక్తేశ్వర మందిరంలో ఈ దీక్ష నిర్వహించారు. (ప్రచురణకర్త గమనిక).

సార్వభౌములైన ఆది ("మొట్ట మొదటి") శంకరాచార్యుల వారి నుంచే తమ ఆధ్యాత్మిక పరంపర మొదలైనట్టు భావిస్తారు. వీరు పేదరికాన్నీ (వస్తు సంపదపట్ల నిర్మమత్వం), బ్రహ్మ చర్యాన్నీ మఠాధిపతి పట్ల విధేయతనూ పాటిస్తామని ప్రతిజ్ఞ చేస్తారు. కేతలిక్ క్రైస్తవుల మఠామ్నాయ పద్ధతులు కూడా చాలా విధాల, అంతకన్న ప్రాచీనమైన భారతీయ సన్యాస పద్ధతుల్ని పోలి ఉంటాయి. ప్రతి స్వామీ తన కొత్త పేరుకు చివర, మఠామ్నాయం లోని పది ఉపవిభాగాల్లోనూ ఒకదానితో తనకున్న ఔపచారిక సంబంధాన్ని సూచించే పదం ఒకటి చేర్చుకుంటాడు. ఈ 'దశనామి' విభాగాల్లో ఒకటి 'గిరి' (కొండ) శాఖ; శ్రీయుక్తేశ్వర్‌గారూ వారివల్ల నేనూ, ఈ శాఖకు చెందిన వాళ్ళం. తక్కిన శాఖల్లో కొన్ని : 'సాగర' (సముద్రం) 'భారతి' (భూమి), 'పురి' (ప్రదేశం), 'సరస్వతి' (ప్రకృతి జ్ఞానం), 'తీర్థ' (పుణ్యస్థలం) 'అరణ్య' (అడవి) శాఖలు.

సాధారణంగా 'ఆనంద' శబ్దంతో అంతమయే స్వాముల సన్యాసాశ్రమ నామం ఒకానొక నిర్దిష్ట మార్గంలో, స్థితిలో, లేదా ఒక దివ్య విశిష్టత ద్వారా తను మోక్షం సాధించాలన్న ఆశయాన్ని సూచిస్తుంది; ప్రేమ, జ్ఞానం, వివేకం, భక్తి, సేవ, యోగం వంటివి ఆ దివ్య విశిష్టతలలో కొన్ని. స్వాముల నామాంత భాగం ప్రకృతితో సామరస్యాన్ని సూచిస్తుంది.

మానవజాతి కంతకీ నిస్స్వార్థంగా సేవ చెయ్యాలనీ వ్యక్తిగత సంబంధాల్నీ ఆకాంక్షల్నీ విడిచిపెట్టాలనీ ఏర్పరచుకొన్న ఆదర్శంవల్ల చాలామంది స్వాములు భారతదేశంలోకాని అప్పుడప్పుడు విదేశాల్లో కాని, మానవసేవలోనూ విద్యా సంబంధమైన కార్యకలాపాల్లోనూ చురుకుగ పాల్గొంటూ ఉంటారు. కుల, మత వర్గ, వర్ణ, లింగ, జాతి విద్వేష దురభిమానాలన్నిటినీ విడిచిపెట్టి, స్వామి, మానవ సౌభ్రాత్ర నియమాల్ని పాటిస్తాడు. కేవల పరబ్రహ్మైక్యమే అతని లక్ష్యం. హంసః (నేను ఆయనే) అన్న భావనతో జాగ్రత చైతన్యాన్నీ సుప్త చైతన్యాన్నీ నింపుకుని, సంతుష్ట మనస్కుడయి ఈ ప్రపంచంలో విహరిస్తాడు, కాని ఈ ప్రపంచానికి చెందడు. అప్పుడే అతనికి 'స్వామి' - 'స్వ' అంటే ఆత్మ; దాంతో ఐక్యం కావడానికి యత్నించేవాడు స్వామి - అన్న బిరుదు సార్థక మవుతుంది.

శ్రీయుక్తేశ్వర్ గారు స్వామీ యోగీ కూడా. పూజనీయమైన సన్యాసాశ్రమ సంప్రదాయానికి చెంది, స్వామి అయినవాడల్లా యోగి కానక్కరలేదు. దైవ సాక్షాత్కారం కోసం శాస్త్రీయమైన ఒక పద్ధతిని సాధన చేసేవారు ఎవరయినా యోగే. ఆయన పెళ్ళయినవాడు కావచ్చు, పెళ్ళి కానివాడు కావచ్చు; లౌకిక బాధ్యతలు గలవాడు కావచ్చు, ఔపచారికమయిన మత సంబంధాలు గలవాడు కావచ్చు.

ఒక స్వామి కేవలం శుష్కమైన తర్కవాదాన్ని, ఉదాసీనమైన పరిత్యాగమార్గాన్నీ

అనుసరించడం సంభవమే. కాని యోగి కచ్చితమైన నియమానుసార సాధనలో నిమగ్నుడై, దాని ద్వారా మనస్సునూ శరీరాన్నీ క్రమశిక్షణలో పెట్టుకొని క్రమంగా ఆత్మ విముక్తి సాధిస్తాడు. ఆవేశ హేతువుల వల్లనో విశ్వాసంవల్లనో దేన్నీ గుడ్డిగా నమ్మకుండా యోగి, సనాతన ఋషులు ప్రప్రథమంగా గుర్తించి సాకల్యంగా పరీక్షించి చెప్పిన అభ్యాసాల్ని సాధనచేస్తాడు. భారతదేశంలో ప్రతియుగంలోనూ యోగవిద్య నిజంగా విముక్తి సాధించిన, నిజమైన యోగి-క్రీస్తుల్ని తయారు చేసింది.

ప్రతి శాస్త్రం మాదిరిగానే యోగవిద్య, ప్రతి దేశం ప్రజలూ, ప్రతి కాలం ప్రజలూ సాధన చెయ్యదగ్గది. యోగవిద్య పాశ్చాత్యులకు "ప్రమాదకరమైనది" లేదా "నప్పనిది" అంటూ అజ్ఞానులైన రచయితలు కొందరు ప్రతిపాదించిన సిద్ధాంతం పూర్తిగా అసత్యమేకాక, చిత్తశుద్ధి గల విద్యార్థు లనేకమంది యోగ విద్యవల్ల అనేక లాభాలు పొందడానికి వీలు లేకుండా ఘోరంగా నిరోధించినది.

యోగవిద్య ఆలోచనల సహజ సంక్షోభాన్ని అదుపులో పెట్టే ఒకానొక పద్ధతి; లేకపోతే ఆ సంక్షోభం సత్యమైన తమ ఆత్మస్వరూపాన్ని దర్శించనివ్వకుండా, మానవులందరినీ అన్ని దేశాలవాళ్ళనీ నిష్పక్షపాతంగా నిరోధిస్తుంది. రోగనివారక మైన సూర్యకాంతి మాదిరిగా, యోగవిద్య, తూర్పు దేశాలవాళ్ళకీ పడమటి దేశాల వాళ్ళకీ కూడా సమానంగా లాభం కలిగిస్తుంది. చాలామంది ఆలోచనలు నిలకడ లేనివీ, చపలమైనవీ; కనక మనస్సును అదుపులో పెట్టే యోగశాస్త్రం యొక్క ఆవశ్యకత ఎంతైనా ఉంది.

పురాతన ఋషిపుంగవుడు పతంజలి*, యోగశాస్త్రాన్ని నిర్వచిస్తూ "ఒకటి విడిచి ఒకటి చొప్పున చైతన్యంలో లేచే తరంగాల్ని శమింపజేయడం" అన్నాడు.† యోగసూత్రాలు' అనే పేరుతో ఆయన సంగ్రహంగా రాసిన మహాగ్రంథం

---

* పతంజలి క్రీ.పూ. రెండో శతాబ్దివాడని చాలామంది విద్వాంసులు అంటున్నప్పటికీ ఆయన కాలం కచ్చితంగా తెలియకుండానే ఉంది. ఋషులు బహుసంఖ్యాకమైన విషయాలెన్నిటి గురించో గ్రంథాలు రాశారు ; వారి అంతర్దృష్టి ఎంత గాఢమంటే, ఎన్ని యుగాలకయినా సరే, వాటికి కాలదోషం పట్టించగల శక్తి లేదు; అయినప్పటికీ ఆ ఋషులు తమ గ్రంథాల్లో తమ జీవితకాలాన్ని పేర్కొనడానికి కాని, తమ మూర్తిమత్త్వాల ముద్రలు వాటిమీద వెయ్యడానికి కాని ఏమీ ప్రయత్నించకపోవడంతో తరవాతి చారిత్రకులకు విభ్రాంతి కలిగింది. తమ స్వల్ప జీవితకాలాలు **అనంతజీవితంలో** మెరిసే మెరుపుల్లా తాత్కాలిక ప్రాముఖ్యం కలిగినవేనని, సత్యం కాలాతీతమని, దానిమీద వ్యాపారముద్ర వెయ్యడం అసాధ్యమని, అదేమీ తమ సొంత ఆస్తి కాదని వారికి తెలుసు.

† "యోగశ్చిత్తవృత్తినిరోధః" (**యోగసూత్రాలు** 1.2) అన్నదాన్ని "మనోభావ వికారాల నిలుపుదల" అని కూడా అనువదించవచ్చు. చింతనశీలతను సూచించే సమగ్ర పదం 'చిత్తం': ప్రాణశక్తులు, మానస సత్త (మనస్సు లేదా ఇంద్రియ స్పృహ), అహంకారం (నేను, నాది అనే

హిందూషడ్దర్శనాల్లో ఒకటి. పాశ్చాత్య తత్త్వ శాస్త్రాలకు భిన్నంగా, హిందూ షడ్దర్శ నాల్లో, కేవలం సిద్ధాంతపరమైన బోధలే కాకుండా ఆచరణ సాధ్యమైనవి కూడా పొందుపరిచి ఉన్నాయి. హిందూదర్శనాలు, ఊహకు అందే తత్త్వమీమాంసాపరమైన ప్రశ్నలన్నిటికీ సమాధానాలు అన్వేషించిన మీదట, శాశ్వత బాధానివృత్తినీ అక్షయ ఆనందాన్నీ కలిగించడానికి తోడ్పడే నిర్దిష్టమైన ఆరు శాస్త్రాల్ని రూపొందించాయి.

ఆరు దర్శన శాస్త్రాల్లోకీ* యోగసూత్రాల్లో, ప్రత్యక్ష సత్యదర్శన సాధనకు ఉపకరించే అత్యంత సమర్థమైన పద్ధతులున్నాయని, తరవాతి కాలపు 'ఉపనిష త్తులు' ఉద్ఘోషించాయి. ఆచరణ సాధ్యమైన యోగ ప్రక్రియల ద్వారా మానవుడు, ఊహాపోహల ఊసరక్షేత్రాల్ని శాశ్వతంగా విడిచిపెట్టి సత్యసారాన్ని అనుభవంలో ప్రత్యక్షీకరించుకుంటాడు.

పతంజలి యోగశాస్త్రాన్ని 'అష్టాంగయోగ'†మంటారు. అందులో మొదటి మెట్లు : (1) యమం : నైతికవర్తన, (2) నియమం : మత ధర్మానుష్ఠానం. ఇతరుల్ని బాధపెట్టకపోవడం (అహింస), ఎప్పుడూ సత్యాన్ని పాటించడం (సత్యం), దొంగతనం చెయ్యకపోవడం (అస్తేయం), ఇంద్రియాల్ని నిగ్రహించు కోడం (బ్రహ్మచర్యం), దేనికీ ఆశపడకపోవడం (అపరిగ్రహం) అన్న వాటితో 'యమం' నెరవేరుతుంది. శారీరక మానసిక పరిశుద్ధత (శౌచం), అన్ని పరిస్థితు ల్లోనూ తృప్తి (సంతోషం), స్వయం శిక్షణ (తపం), ఆత్మని అధ్యయనం చెయ్యడం లేక ఆత్మవిచారణ (స్వాధ్యాయం), దేవుడిమీద గురువుమీద భక్తి (ఈశ్వర ప్రణిధానం) 'నియమం' కిందికి వస్తాయి.

---

భావం), బుద్ధి (సహజావబోధాత్మకమైన జ్ఞానం) ఇందులోకే వస్తాయి. 'వృత్తి' (దీనికి వాచ్యార్థం, "సుడిగుండం") అనేది, మానవుడి చైతన్యంలో నిరంతరం పైకి లేస్తూ కిందికి పడుతూ ఉండే ఆలోచన, ఆవేశతరంగాల్ని సూచిస్తుంది. 'నిరోధ' మంటే శమింపజేయడం, నిలుపుదల, అదుపులో ఉంచడం అని అర్థం.

* ఆస్తిక (వేద ప్రమాణాన్ని అంగీకరించే) దర్శనాలు ఆరూ ఇవి : సాంఖ్యం, యోగం, వేదాంతం, మీమాంస, న్యాయం, వైశేషికం.

† ఇదీ బౌద్ధుల అష్టాంగమార్గమూ ఒకటి కావు. మానవ ప్రవర్తనకు మార్గదర్శకంగా బౌద్ధమతంలోని "అష్టాంగమార్గం" ఇలా ఉంది : 1) సరయిన ఆదర్శాలు (సమ్యక్ దృష్టి 2) సరయిన ఉద్దేశ్యం (సమ్యక్ సంకల్పం), 3) సరయిన మాట (సమ్యక్ వాక్కు), 4) సరయిన చేత (సమ్యక్ కర్మ), 5) సరయిన బతుకుతెరువు (సమ్యక్ ఆజీవం), 6) సరయిన కృషి (సమ్యక్ వ్యాయామం), 7) (ఆత్మను గురించి) సరయిన జ్ఞాపకం (సమ్యక్ స్మృతి), 8) సరయిన సాక్షాత్కారం (సమ్యక్ సమాధి.)

తరవాతి మెట్లు ఏవంటే : (3) ఆసనం (సరయిన భంగిమ) : వెన్నెముకను నిటారుగా నిలిపి శరీరాన్ని నిలకడగా, ధ్యానానికి అనువైన సుఖాసనంలో ఉంచాలి; (4) ప్రాణాయామం (సూక్ష్మమైన ప్రాణప్రవాహాలను అదుపులో ఉంచు కోడం); (5) ప్రత్యాహారం (జ్ఞానేంద్రియాల్ని బయటి వస్తువుల మీంచి వెనక్కి మళ్ళించుకోడం).

చివరి మెట్లు అసలు యోగం కిందికివచ్చే అంగాలు: (6) ధారణ (ఏకాగ్రత), మనస్సును ఒకే ఆలోచనమీద నిలిపి ఉంచడం; (7) ధ్యానం (దైవచింతన), (8) సమాధి (అధిచేతనానుభవం). ఈ అష్టాంగయోగ మార్గం, అంతిమ లక్ష్యమైన కైవల్యానికి చేరుస్తుంది; అందులో యోగి, బుద్ధిగ్రాహ్యతకు అతీతంగా ఉండే సత్యాన్ని సాక్షాత్కారింపజేసుకుంటాడు.

"ఎవరు గొప్ప? స్వామా, యోగా?" అని ఎవరయినా అడగవచ్చు. దేవుడితో ఐక్యాన్ని సాధిస్తే, వివిధ మార్గవిభేదాలు వెంటనే అదృశ్యమవుతాయి. అయితే 'భగవద్గీత' మాత్రం, యోగంలోని పద్ధతులు సర్వాంగీణమైనవని చెబుతుంది. వీటి ప్రక్రియలు, సన్యాసజీవితం వేపు మొగ్గుచూపే ఏ కొద్దిమంది మాదిరిగానో కేవలం కొన్ని తరహాల మనుషుల కోసం, కొన్ని మనస్తత్వాల మనుషుల కోసం ఉద్దేశించినవి కావు; సాధకుడు ఏదో ఒక విశిష్ట సంప్రదాయానికి బద్ధుడై ఉండ వలసిన ఆవశ్యకత యోగంలో లేదు. యోగశాస్త్రం విశ్వజనీనమైన ఆవశ్యకతను నెరవేరుస్తుంది కాబట్టి దానికి సహజమైన విశ్వజనీన ఆకర్షణ ఉంది.

నిజమైన యోగి ప్రపంచంలో విధివిధేయుడయి ఉండిపోవచ్చు : అక్కడ అతను నీటిమీద వెన్నముద్ద లాంటివాడు; అంతేకాని, క్రమశిక్షణలేని మానవ సముదాయం మాదిరిగా, గిలకొట్టకుండా ఉంచిన, ఇట్టే నీళ్ళు కలపడానికి వీలయిన పాలవంటివాడు కాదు. మానవుడు, అహంకారజన్యమైన వాంఛల పట్ల మానసికమైన అనాసక్తిని నిలుపుకొంటూ, దైవనిర్ణీతమైన ఉపకరణంగా సుముఖతతో, జీవితంలో తన పాత్రను తాను నిర్వహిస్తూ ఉన్నట్లయితే, లౌకిక బాధ్యతలు నెరవేర్చడమన్నది మనిషిని దేవుణ్ణించి దూరం చెయ్యనక్కరలేదు. అయితే అందుకు మనిషి మానసికంగా, అహంకార జనితమైన కోరికల్లో చిక్కు కొని ఉండకుండా, తనను దేవుని ఉపకరణంగా మనసారా భావించుకొంటూ జీవితంలో తన పాత్ర నిర్వహించాలి.

ఈనాడు అమెరికన్, యూరోపియన్, లేదా హైందవేతర దేహాల్లో జీవిస్తున్న మహాపురుషులు ఎందరో ఉన్నారు; వీరు 'యోగి', 'స్వామి' అన్న మాటలు సైతం ఎన్నడూ విని ఉండకపోయినప్పటికీ, ఆ పదాలకు నిదర్శనంగా నిలిచే ఆదర్శ

ప్రాయులు. మానవజాతికి తాము చేసిన నిస్వార్థ సేవవల్లనయితేనేమి, కామ వాసనల్నీ ఆలోచనల్నీ అదుపులో ఉంచుకోడంవల్లనయితే నేమి, ఏకోన్ముఖమైన దైవప్రేమవల్లనయితే నేమి మహత్తరమైన ఏకాగ్రతా సాధన శక్తులవల్ల నయితేనేమి వీరంతా ఒక విధంగా యోగులే; యోగలక్ష్యాన్ని - ఆత్మ నిగ్రహాన్ని - నిలుపు కొన్నవారు. వీరికి కనక, మనస్సునూ జీవితాన్నీ ఇప్పటికన్న సస్పృహ దిశలో నడిపించగల యోగమనే నిర్దిష్ట శాస్త్రాన్ని బోధించినట్లయితే ఇంకా ఉన్నతస్థితుల్ని అందుకోగలుగుతారు.

పాశ్చాత్య రచయితలు కొందరు, యోగశాస్త్రాన్ని పైపైని తడిమి తప్పుగా అర్థం చేసుకున్నారు. కాని అటువంటి విమర్శకులెన్నడూ దాన్ని సాధన చేసిన వాళ్ళు కారు. యోగశాస్త్రానికి అర్పించిన వివేకవంతమయిన నివాళులలో స్విట్జ ర్లాండ్ దేశపు ప్రఖ్యాత మనస్తత్త్వవేత్త డా॥ సి.జి. యూంగ్ * చేసిన ప్రశంసలు చెప్పుకోదగ్గవి.

"ఏ మతపద్ధతి అయినా 'శాస్త్రీయ' మైనదని చెప్పుకోగలిగినప్పుడు, పశ్చిమ దేశాల్లో కూడా దానికి ప్రజల ఆదరం లభిస్తుందని కచ్చితంగా నమ్మవచ్చు. యోగం ఈ ఆశ నెరవేరుస్తుంది," అంటాడు డా॥ యూంగ్. "కొత్తమీద కలిగే మోజు, తెలిసీ తెలియనివాళ్ళ వ్యామోహం సంగతి అలా ఉంచి, యోగవిద్యకు చాలామంది అనుయాయు లేర్పడడానికి మంచి కారణం ఉంది. అదుపులో ఉంచుకోదగ్గ అనుభవాన్ని ఇస్తుందిది; ఈ విధంగా, శాస్త్రప్రమాణానికి కావలసిన 'యథార్థాల అవసరాన్ని తీరుస్తుంది; ఇంతే కాకుండా, జీవితంలో ప్రతి దశకూ వర్తించే విధంగా దీనికి గల వ్యాప్తి గాఢతలవల్లా, ప్రాచీనతవల్లా, సిద్ధాంత పద్ధతులవల్లా, ఎన్నడూ కలలో కూడా అనుకోని వాటిని ఇది సాధ్యంచేసి నిరూపించవచ్చు.

"మతపరంగాగాని, తాత్త్వికంగాగాని చేసే ప్రతి సాధనకూ, మనో వైజ్ఞానిక క్రమశిక్షణ అనేదే అర్థం; అంటే అది మానసికారోగ్యశాస్త్ర పద్ధతి అన్నమాట యోగం†లో చెప్పే బహువిధాలైన కేవల శరీర వ్యాయామ పద్ధతులకు కూడా శరీరారోగ్యశాస్త్రమనే అర్థం; మామూలు కసరత్తుకన్న శ్వాస ప్రశ్వాస అభ్యాసాల

* 1937లో జరిగిన 'ఇండియన్ సైన్సు కాంగ్రెసు' సమావేశాల్లో డా. యూంగ్ పాల్గొన్నారు వీరికి కలకత్తా విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేటు ప్రదానం చేసింది.

† డా॥ యూంగ్ ఇక్కడ ప్రస్తావిస్తున్నది 'హఠయోగం' గురించి. ఆరోగ్యం కోసం దీర్ఘ ఆయుర్దాయం కోసం సాధనచేసే, శరీర భంగిమలకూ ప్రక్రియలకూ సంబంధించిన ప్రత్యేక శాఖ ఇది. హఠయోగం ఉపయోగకరమైనదే. దీనివల్ల అద్భుతమైన శారీరక ప్రయోజనాలు కలుగుతాయి. కాని ఈ యోగవిధానాన్ని ఆత్మవిమోచనకు యోగులు అరుదుగా అవలంబిస్తారు.

కన్న గొప్పదిది; ఇది కేవలం యాంత్రికం, శాస్త్రీయం మాత్రమే కాకుండా తాత్త్వికం కూడా కావడమే దానికి కారణం. శరీర, భాగాల శిక్షణలో ఇది, వాటిని సంపూర్ణాత్మతో అనుసంధానం చేస్తుందన్నది సుస్పష్టమే; ఉదాహరణకు, ప్రాణాయామ సాధనలో, ప్రాణమన్నది ఊపిరే కాకుండా బ్రహ్మాండంలోని విశ్వ సంచాలక శక్తి కూడా.

"యోగానికి ఆధారభూతమైన భావనల్ని గ్రహించుకోకుండా చేసే యోగ సాధన వ్యర్థం. శారీరక, ఆధ్యాత్మిక భావనల్ని రెంటినీ ఇది, అసాధారణ రీతిలో, ఒకదాంతో ఒకటి సంపూర్ణంగా మిళితం చేస్తుంది.

"ఈ భావాల్నీ ప్రక్రియల్నీ రూపొందించిన, అనేక వేల సంవత్సరాల అవిచ్ఛిన్న సంప్రదాయ ఫలంగా అవసరమైన ఆధ్యాత్మిక పునాదులు ఏర్పడ్డ తూర్పు దేశాల్లో, యోగశాస్త్రం, శరీరాన్నీ మనసునూ సమైక్యం చేసే సంపూర్ణ, సముచిత పద్ధతి అని, వాటి సమైక్యాన్ని ప్రశ్నించే తావు లేదని నేను నిస్సంకోచంగా విశ్వసించ గలను. ఈ సమైక్యం, చైతన్యాన్ని అధిగమించే అతీంద్రియ సహజావబోధాల్ని సాధ్యంచేసే మానసికావస్థను కల్పిస్తుంది."

భగవత్స్వరూపమైన ప్రకృతిని బాహ్యంగా జయించడం ఎంత అవసరమో ఆత్మ సంయమమనే అంతర్విజ్ఞానం కూడా అంత అవసరమని గ్రహించే రోజు పడమటిదేశాలకు దగ్గరపడుతోంది. పదార్థమనేది వాస్తవానికి ఘనీభూతశక్తి అని శాస్త్రీయంగా ప్రస్తుతం నిర్వివాదమైన సత్యం వల్ల మానవుల మనస్సులు శాంతపడి, విశాలమయే రోజు అణుయుగంలో వస్తుంది. రాళ్ళూ లోహాలవంటి పదార్థాలలోని శక్తులకన్న మహత్తరమైన శక్తుల్ని మానవమనస్సు తనలోంచే విడుదల చెయ్యగలదు; చేసి తీరాలి కూడా; లేకపోతే కొత్తగా బంధవిముక్తి పొందిన భౌతిక అణు (రాక్షస) శక్తి ప్రపంచంమీద విరుచుకుపడి పిచ్చిగా నాశనం చేస్తుంది. ఆటంబాంబుల గురించి మానవజాతికి గల ఆందోళనవల్ల కలిగే పరోక్షలాభం, బహుశా, యోగ శాస్త్రం*పట్ల ప్రయోజనాత్మకమైన ఆసక్తి కావచ్చు; ఇది (యోగవిద్య) నిజంగా, "బాంబు దెబ్బకు ధ్వంసంకాని గూడు."

---

* తెలియనివాళ్ళు చాలామంది, యోగాన్ని 'హఠయోగం'గా చెబుతారు: లేదా అద్భుత శక్తులు సంపాదించడానికి ఉపకరించే క్షుద్రమైన రహస్య కాండగల "ఇంద్రజాలం"గా పరిగణిస్తారు. అయితే యోగాన్ని గురించి విద్వాంసులు ముచ్చటించేటప్పుడు, యోగసూత్రాల్లో (వీటిని పతంజలి సూత్రాలని కూడా అంటారు) లేదా 'రాజయోగం'లో ప్రవచించిన శాస్త్రాన్నే ఉద్దేశించి చెబుతారు. ఆ గ్రంథంలో పొందుపరిచిన దార్శనిక భావనలు ఎంత అద్భుతమైనవంటే, భారత

---

దేశపు మహామనీషుల్లో కొందరు వాటిమీద ఉత్తేజకరమైన వ్యాఖ్యానాలు రచించారు అటువంటి వారిలో ఒకరు పరమజ్ఞాని సదాశివేంద్రులు (490 అధోజ్ఞాపిక చూడండి).

వేదప్రమాణాన్ని అంగీకరించే తక్కిన ఐదు సనాతన ఆస్తిక దర్శనాల మాదిరిగానే యోగసూత్రాలు కూడా పటిష్ఠమైన దార్శనిక శోధనకు నైతిక పరిశుద్ధత అనే "ఇంద్రజాలాన్ని" (యమ నియమాది విధులను) తప్పనిసరిగా ఉండవలసిన ప్రాథమికావసరంగా పరిగణిస్తాయి పాశ్చాత్య దేశాల్లో నిష్కర్షగా విధించని ఈ వ్యక్తిగత సాధన, భారతీయ షడ్దర్శనాలకు శాశ్వత శక్తిని ప్రసాదించింది విశ్వాన్ని పరిరక్షించే బ్రహ్మాండ వ్యవస్థ (ఋతం) మానవ భవితవ్యాన్ని నిర్ణయించే నైతిక వ్యవస్థకు భిన్నమైనది కాదు. విశ్వజనీనమైన నైతిక నియమాల్ని పాటించ డానికి సుముఖంగా లేనివాడు, సత్యాన్ని అన్వేషించడానికి దృఢసంకల్పుడు కానివాడే

యోగసూత్రాలు' 3వ పాదంలో యోగసంబంధమైన వివిధ అలౌకిక శక్తుల్ని (విభూతులు సిద్ధులు) పేర్కొడం జరిగింది. నిజమైన జ్ఞానం ఎప్పుడూ శక్తే యోగమార్గాన్ని నాలుగు దశలుగా విభజించారు: ఒక్కొక్కదానికి ఒక్కొక్క విభూతిని ప్రత్యేకంగా వర్ణించారు. ఒకానొక శక్తిని సాధించిన తరవాత యోగి, ఆ నాలుగింటిలోనూ ఒక దశను దాటినట్టు తెలుసుకుంటాడు స్వాభావికమైన శక్తులు బహిర్గతం కావడం, యోగవిద్య శాస్త్రీయతకు నిదర్శనం, ఇందులో ఒకరి "ఆధ్యాత్మిక ప్రగతి 'ని గురించి భ్రమతో కూడిన ఊహలు చెయ్యడం నిషిద్ధం రుజువు కావాలి

ఆత్మతో ఐక్యమే ఏకైక లక్ష్యం కావాలి కాని విభూతులు సంపాదించడం కాగూడదని అవి కేవలం పవిత్ర మార్గంలో పడే పుష్పాలు మాత్రమేనని పతంజలి సాధకుణ్ణి హెచ్చరిస్తాడు శాశ్వత ప్రదాతను అన్వేషించాలి కాని ఆయన ప్రసాదించే సిద్ధుల్ని కాదు: స్వల్ప ఉపలబ్ధులలో తృప్తిపడే అన్వేషకుడికి దేవుడు దర్శనమియ్యడు. అందువల్ల సాధనచేసే యోగి తన సిద్ధుల్ని వినియోగించుకోకుండా జాగ్రత్తపడతాడు; లేకపోతే అవి, మిథ్యాహంకారం కలిగించి కైవల్య చరమావస్థకు చేరకుండా పక్కదారి పట్టిస్తాయి.

యోగి తన అనంత లక్ష్యాన్ని చేరినప్పుడు విభూతులు ప్రదర్శించవచ్చు; ప్రదర్శించక పోవచ్చు: అది అతని ఇచ్ఛానుసారం. అప్పుడతని చర్యలు అలౌకిక ఘటనాపరమయినా కాక పోయినా - కర్మబంధం లేకుండానే జరుగుతాయి. వ్యక్తిపరమైన అహంకారమనే అయస్కాంతం ఇంకా ఉన్నచోటే, కర్మ అనే ఇనపరజనును ఆకర్షించడం జరుగుతుంది.

అధ్యాయం : 25

# అన్నయ్య అనంతుడు, చెల్లెలు నళిని

"అనంతుడింక బతకడు; ఈ జన్మకు అనుభవించవలసిన కర్మ తీరి పోయింది."

ఒకనాడు పొద్దున నేను గాఢమైన ధ్యానంలో మునిగి ఉండగా, ఈ కఠినమైన మాటలు నా అంతశ్చేతనలోకి చేరాయి. నేను సన్యాసం తీసుకున్న కొత్తలో, నా జన్మస్థలమైన గోరఖ్‌పూర్‌లో ఉన్న మా అనంతన్నయ్యకి అతిథిగా వెళ్ళాను. హఠాత్తుగా ఏదో జబ్బుచేసి మంచం పట్టాడతను; నేను ప్రేమగా అతనికి ఉపచారాలు చేశాను.

గంభీరమైన ఈ అంతర్ఘోషణ నన్ను దుఃఖంలో ముంచేసింది. నా కళ్ళ ముందే అన్నయ్యని తీసుకుపోబోతూంటే నేను నిస్సహాయుడిగా చూస్తూ ఉండాలంటే, గోరఖ్‌పూర్‌లో అట్టేకాలం ఉండడం నాకు దుర్భరమనిపించింది. నన్ను అర్థంచేసుకోకుండా బంధువులు విమర్శ చేస్తున్నప్పటికీ నాకు దొరికిన మొదటి ఓడ ఎక్కి భారతదేశాన్ని విడిచిపెట్టాను. ఆ ఓడ బర్మా, చైనా సముద్రంగుండా జపాను చేరింది. నేను కోబేలో దిగి, కొన్నాళ్ళక్కడ గడిపాను. దుఃఖంతో గుండె బరువెక్కి ఉన్నందువల్ల బయట తిరిగి ఏవీ చూడాలని కూడా అనిపించలేదు.

భారతదేశానికి తిరుగు ప్రయాణంలో మా ఓడ షాంఘై చేరింది. అక్కడ, ఓడలో వైద్యుడిగా పనిచేసే డా॥ మిశ్రాగారు, కళాత్మకమైన వస్తుసామగ్రి అమ్మే దుకాణాలకు తీసుకువెళ్ళి చూపించారు. శ్రీయుక్తేశ్వర్‌గారికీ, మా ఇంట్లో వాళ్ళకీ, స్నేహితులకీ బహూకరించడంకోసం రకరకాల కానుకలు ఎంపికచేశాను. అనంతుడికోసం, ఒక వెదురుగడ మీద నగిషీలు చెక్కి ఉన్న పొడుగాటి వస్తువొకటి కొన్నాను. చైనా వాడయిన అమ్మకందారు ఆ వస్తువును నా చేతికి ఇచ్చీ ఇయ్యగానే నేనుదాన్ని నేలమీదికి జారవిడిచి, "చచ్చిపోయిన అన్నయ్యకోసం కొన్నానిది!" అని పలపించాను.

అన్నయ్య ఆత్మ సరిగా ఆ క్షణంలోనే శరీరంలోంచి విడుదల అయి అనంతంలో కలిసిపోయిందన్న స్పష్టమయిన అనుభూతి ఒకటి కలిగింది నాకు. నేను కొన్న జ్ఞాపకచిహ్నం, కింద పడ్డంవల్ల, అశుభ సూచనగా ఫళుక్కున విరిగింది. వెక్కివెక్కి ఏడుస్తూ, విరిగిన వెదురు ముక్కమీద ఇలా రాశాను : "ఇప్పుడులేని ప్రియమైన అనంతన్నయ్యకోసం."

నాతో ఉన్న డాక్టరు వెటకారంగా నవ్వుతూ నన్ను గమనిస్తూనే ఉన్నాడు.

"కన్నీళ్ళు పెట్టుకోకండి. ఆయన పోయారని మీకు రూఢి అయే దాకా కన్నీళ్ళు రాల్చడమెందుకు?"

మా ఓడ కలకత్తా చేరినప్పుడు, డా॥ మిశ్రా మళ్ళీ నా వెంట వచ్చారు. నన్ను పలకరించడానికని, మా చిన్న తమ్ముడు విష్ణు ఓడరేవు దగ్గర ఎదురు చూస్తున్నాడు.

"అనంతన్నయ్య ఈ జన్మ కడతేర్చుకుపోయాడని నాకు తెలుసు" అన్నాను విష్ణుతో, వాడేమీ చెప్పడానికి వ్యవధి ఇవ్వకుండానే. "అనంతుడు ఎప్పుడు పోయాడో నాకూ ఈ డాక్టరుగారికీ చెప్పు."

విష్ణు తేదీ చెప్పాడు ; నేను షాంఘైలో కానుకలు కొన్న రోజే అది.

అప్పుడు డా॥ మిశ్రాగారన్నారు :

"చూడండి ! ఈ సంగతి బయటెక్కడా పొక్కనివ్వకండి! లేకపోతే, ఇప్పటికే ఎంతో పెద్దగా ఉన్న వైద్యవిద్యలో మానసిక ప్రసారం కూడా చేర్చి ఇంకో ఏడాది ఎక్కువ చదివిస్తారు ప్రొఫెసర్లు!" గడ్‌పార్ రోడ్డులో ఉన్న ఇంట్లో నేను అడుగుపెట్టే సరికి నాన్నగారు ఆప్యాయంగా కౌగలించుకున్నారు. "వచ్చావా," అన్నారు నాన్నగారు మృదువుగా. ఆయన కళ్ళలోంచి రెండు పెద్ద నీటిబొట్లు రాలాయి మామూలుగా పైకి తొణకని నాన్నగారు, తమ వాత్సల్యాన్ని ఇంతకు ముందెన్నడూ ఈ రకంగా బయటికి కనబరచలేదు. పైకి గంభీరులైన తండ్రి, లోలోపల కరిగిపోయే తల్లి గుండె గలవారు. కుటుంబ విషయాలన్నిటిలోనూ ఆయన ఇలా ద్విపాత్రాభినయం చేస్తూ తల్లిగా, తండ్రిగా వ్యవహరించారు.

అనంతుడు పోయిన కొన్నాళ్ళకే, మా చిన్న చెల్లెలు నళిని దైవోపశమనం వల్ల మృత్యుముఖంలోంచి బయటపడింది. ఆ కథ చెప్పే ముందు, మా చిన్నప్పటి సంగతులు కొన్ని ముచ్చటిస్తాను.

నాకూ నళినికీ మధ్య చిన్నప్పటి అనుబంధం మరీ అంత సంతోషకరమైందని చెప్పడానికి లేదు. నేను బక్కగా ఉండేవాణ్ణి; తను నా కంటె బక్క పలి

చగా ఉండేది. అలా ఉన్నందుకు నేను మా చెల్లెల్ని తరచు ఏడిపిస్తూ ఉండేవాణ్ణి; దానికి అజ్ఞాతమైన ప్రేరణ ఏమిటో గుర్తుపట్టడానికి మనోవిజ్ఞాన శాస్త్రవేత్తలకు ఏమంత కష్టం కాదు. తను ఇచ్చే ఎదురు జవాబులు కూడా కుఱ్ఱకారుకు సహజమైనంత ఘాటుగాను కుండ బద్దలు కొట్టినట్టు ఉండేవి. ఒక్కొక్కప్పుడు అమ్మ కలగజేసుకునేది, నా చెంపమీద (నేనే పెద్దవాణ్ణి కనక) సుతారంగా ఒక్కటి అంటించి, మా పిల్ల తగువుల్ని అప్పటిమట్టుకు సర్దుబాటు చేసేది.

నళినికి చదువు అయిపోయాక, డా॥ పంచానన్ బోస్ కిచ్చి పెళ్ళి చెయ్యడానికి నిశ్చయమైంది. యోగ్యుడయిన ఈ యువకుడు కలకత్తాలో డాక్టరు. సుదీర్ఘమైన పెళ్ళి తతంగాలన్నీ సకాలంలోనే జరిగాయి. పెళ్ళి నాటి రాత్రి నేను, మా కలకత్తా ఇంట్లో, నట్టింట్లో కులాసాగా ముచ్చట్లాడుకుంటున్న పెద్ద బంధువర్గంతో కలిసి కూర్చున్నాను. పెళ్ళికొడుకు, నిండుగా బంగారపు జరీగల తలగడా మీదికి వాలి కూర్చున్నాడు. ఆయన పక్కనే కూర్చుంది నళిని. ముచ్చటైన బచ్చలపండు వన్నె పట్టుచీర కూడా ఆమె బక్కతనాన్ని పూర్తిగా మరుగుపరచలేకపోయింది. నేను మా కొత్త బావగారి తలగడా నైపుచేరి స్నేహపూర్వకంగా పళ్ళు ఇకిలించాను. పెళ్ళిరోజు దాకా ఆయన నళినిని చూడలేదు; పెళ్ళి లాటరీలో తనకి దక్కే దేమిటో చివరికి తెలిసిందప్పుడే. నా సానుభూతి అందుకున్న డా॥ బోస్ సిగ్గు పడుతూ నళినివేపు చూపించి, "ఇదేమిటంటావ్?" అని నా చెవిలో గొణికాడు.

"ఏమిటేమిటి డాక్టర్? మీ పరిశీలనకోసం ఓ ఎముకలగూడు!"

ఏళ్ళు గడిచేకొద్దీ, డా॥ బోసు మా కుటుంబానికి అప్పుడవుతూ వచ్చాడు; ఒంట్లో నలతచేసినప్పుడల్లా మావాళ్ళు ఆయన దగ్గరికే వెళ్ళేవాళ్ళు. ఆయనా నేనూ దగ్గరి స్నేహితులమయాం; ఇద్దరం కలిసి వేళాకోళం చేసేవాళ్ళం - ఎవరినో చెప్పనక్కర్లేదు - సాధారణంగా నళిని మీదే మా విసుర్లు.

ఒకనాడు నాతో అన్నారు మా బావగారు : "వైద్యులకు విస్మయం కలిగించే సంగతిది. బక్కపలచటి మీ చెల్లెలిమీద ఎన్నో ప్రయోగాలు చేసి చూశాను - కాడ్‌లివర్ ఆయిలు, వెన్న, మాల్టు, తేనె, చేపలు, మాంసం, గుడ్లు, టానిక్కులు. అయినా, అంగుళంలో నూరోవంతు కూడా ఒళ్ళు చెయ్యలేదు ఈవిడ."

కొన్నాళ్ళ తరవాత నేను బోసుగారింటికి వెళ్ళాను. అక్కడ నా పనికి ఐదు నిమిషాలే పట్టింది. నేను తిరిగి వచ్చేస్తున్నాను; నళిని చూడ్డం లేదనే అనుకున్నాను. నేను వీధిగుమ్మం దగ్గరికి వచ్చేసరికి ఆమె గొంతు వినిపించింది; ఆప్యాయంగానే ఉన్నా, ఆజ్ఞాపిస్తున్నట్టు ఉందది.

"అన్నయ్యా, ఇలా రా. ఈసారి నన్ను తప్పించుకుపోలేవు. నీతో మాట్లాడా లనుకుంటున్నాను."

నేను మెట్లెక్కి తన గదికి వెళ్ళాను. తన కళ్ళలో నీళ్ళు చూసి ఆశ్చర్య పోయాను.

"అన్నయ్యా, మన పాత కోపతాపాలన్నీ మరిచిపోదాం. ఇప్పుడు నువ్వు ఆధ్యాత్మికమార్గంలో నిలదొక్కుకున్నావు. నేను కూడా అన్ని విధాలా నీలా కావాలనుకుంటున్నా." అని చెప్పి, కొంచెం ఆశగా ఇలా అంది: "నువ్విప్పుడు పుష్టిగా కనిపిస్తున్నావు. నాకు కాస్త సాయం చెయ్యవూ? మా ఆయన నా దరిదాపులకే రావటంలేదు; నేను ఆయన కోసం ఎంత ఇదయితే ఏం లాభం? నేనిలా సన్నగా, ఏ ఆకర్షణా లేకుండా ఉన్నప్పటికీ, దైవసాక్షాత్కార సాధనలో మాత్రం ముందుకు పోవాలన్నదే నా ముఖ్యమైన కోరిక."

ఆమె విన్నపం నా గుండెను కరిగించింది. మా కొత్త స్నేహం నిలకడగా పెరిగింది. ఒకనాడు తను నాకు శిష్యురాలినవుతా నన్నది.

"నువ్వెలా అనుకుంటే అలా తర్ఫీదు ఇయ్యి నాకు. టానిక్కుల మీదకన్న దేవుడిమీదే నమ్మకముంచుతాను." పట్టెడుమందులు పోగుచేసి కిటికీలోంచి బయటి కుళ్ళు కాలవలోకి విసిరి పారేసింది.

ఆమె విశ్వాసాన్ని పరీక్షించడానికని, భోజనంలో చేపలూ మాంసమూ గుడ్లూ మానెయ్యమన్నాను.

నళిని నేను పెట్టిన నిషేధాలన్నీ కచ్చితంగా పాటిస్తూ, ఎన్నో రకాల ఇబ్బందులు వచ్చినా కూడా, కేవలం శాకాహారమే తింటూ కొన్ని నెలలు గడిపిన తరవాత నేనోసారి చూడ్డానికి వెళ్ళాను.

" చెల్లాయ్, నువ్వు ఆధ్యాత్మిక నియమాల్ని నిష్ఠగా పాటిస్తున్నావు· నీకు వచ్చే బహుమతి దగ్గరలోనే ఉంది," అంటూ కొంటెగా చిరునవ్వు నవ్వాను. "నీకు ఎంత లావవాలని ఉంది? మన అత్తయ్య ఉందే - కొన్నేళ్ళుగా తన పాదాలు తను చూసుకోలేకపోతున్నావిడ - ఆవిడంత లావు అవాలని ఉందా?"

"ఉఁహుఁ! నీ అంత లావు అవాలి."

నేను గంభీరంగా ఇలా అన్నాను : "దేవుడి దయవల్ల, నేనెప్పుడూ నిజమే

చెబుతూ ఉన్నాను కనక, ఇప్పుడూ నిజమే చెబుతున్నాను.* దేవుడి ఆశీస్సుల ద్వారా, ఈ రోజునుంచి నీ శరీరం నిజంగా మార్పుచెందుతుంది. ఒక్క నెల్లాళ్ళలో, నాకున్నంత బరువు రావాలి నీ శరీరానికి."

నా గుండెలోంచి వెలువడ్డ ఈ మాటలు నిజమయాయి. ఒక్క ముప్పై రోజులకల్లా, నళిని బరువు నా బరువుతో సమానమయింది. కొత్తగా వచ్చిన గుండ్రతనంతో ఆమెకు మంచి అందం వచ్చింది. దాంతో వాళ్ళాయన ఆమెను గాఢంగా ప్రేమించాడు. అమంగళంతో ఆరంభమయిన వాళ్ళ దాంపత్యం ఆదర్శంగా చెప్పుకోదగ్గంత హాయిగా పరిణమించింది.

నేను దేశంలో లేనప్పుడు నళినికి సన్నిపాతజ్వరం (టైఫాయిడ్) వచ్చిందని, నేను జపానునుంచి తిరిగి రాగానే తెలిసింది. హుటాహుటిని వాళ్ళింటికి ఉరికి సన్నగా పుల్లగా అయిపోయిన నళినిని చూసి కొయ్యబారిపోయాను. ఆమె అపస్మారంలో ఉంది.

"ఈ జబ్బువల్ల మీ చెల్లాయి మనస్సు కలతచెందకముందు 'ముకుందన్నయ్య ఉండి ఉంటే నాకిలా అయేది కాదు,' అంటూండేది తరచు," అన్నారు మా బావగారు. "ఇతర డాక్టర్లకీ నాకూ రవ్వంత ఆశకూడా కనిపించడం లేదు. టైఫాయిడ్‌తో అన్నాళ్ళు బాధపడింది చాలక, ఇప్పుడు రక్త విరేచనాలు మొదలయాయి," అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు ఆయన.

నా ప్రార్థనలతో భూమ్యాకాశాలు దద్దరిల్లేటంతగా విశ్వప్రయత్నం చేశాను. నాతో పూర్తిగా సహకరించే ఆంగ్లో ఇండియన్ నర్సు నొకామెను ఏర్పాటుచేసి,

* ఎప్పుడూ అలవాటుగా నిజం చెప్పేవాళ్ళకి, తాము ఏది అంటే అది జరిగే శక్తి వస్తుందని హిందూ పవిత్ర గ్రంథాలు ఘోషిస్తున్నాయి. వాళ్ళ హృదయంలోంచి వెలువడ్డమాట జరిగి తీరుతుంది ("సత్య ప్రతిష్ఠాయాం క్రియా ఫలాశ్రయత్వం" - యోగసూత్రాలు-2.36)

లోకాలు సత్యంమీద నిర్మించినవి కాబట్టి, పవిత్ర గ్రంథాలన్నీ దాన్ని శ్రేష్ఠగుణంగా కీర్తించాయి; ఏ మనిషయినా సరే, దానివల్ల తన జీవితాన్ని అనంత శక్తితో అనుసంధానం చేసుకోవచ్చు నన్నాయి. "సత్యమే భగవంతుడు," అని గాంధీగారు తరచు అంటూండేవారు. ఆలోచనలో, మాటలో, చేతలో పూర్ణ సత్యం కోసమే ఆయన జీవితమంతా శ్రమించారు. సత్యమనే ఆదర్శం హిందూ సమాజాన్ని యుగయుగాలుగా అనుప్రాణితం కావిస్తూ వస్తోంది

"ఈ భూమిమీద ఏది ఇచ్చినా సరే బ్రాహ్మణులు అబద్ధమాడరు," అంటారు మార్కోపోలో. భారతదేశంలో న్యాయమూర్తిగా పనిచేసిన విలియం స్లీమన్ అనే ఇంగ్లీషువాడు 'జర్నీ త్రూ ఔధ్ ఇన్ 1849-59' అనే గ్రంథంలో అంటాడు : "ఒక్క మనిషి అబద్ధం చెప్పడం మీద ఆధారపడి అతని ఆస్తికి కాని, స్వేచ్ఛకుకాని సంబంధించిన కేసులు వందలకొద్దీ వచ్చాయి నా దగ్గరికి కాని అతడు, ససేమిరా అబద్ధం చెప్పనన్నాడు."

రకరకాల యోగచికిత్సా పద్ధతులు మా చెల్లిమీద ప్రయోగించాను. నెత్తురు విరేచనాలు కట్టేశాయి.

కాని డా॥ బోసు విచారగ్రస్తంగా తల ఆడించారు. "పోవడానికింక ఆమెలో రక్తమే లేదు."

"తప్పకుండా కోలుకుంటుంది," అన్నాను, దృఢంగా జవాబిస్తూ. "ఏడు రోజుల్లో తన జ్వరం తగ్గిపోతుంది."

ఒక వారం తిరిగేసరికి నళిని కళ్ళువిప్పి, ఆప్యాయంగా గుర్తుపట్టి నావేపు చూస్తూ ఉంటే నాకు ఒళ్ళు పులకించింది. ఆ రోజు మొదలు తను త్వరత్వరగా కోలుకుంది. తన మామూలు బరువు తనకి వచ్చినప్పటికీ, దాదాపు ప్రాణాంతకమైన ఆ జబ్బు కలిగించిన హానికి బాధాకరమైన గుర్తుగా, కాళ్ళు పడిపోయాయి వైద్యనిపుణులయిన భారతీయులూ ఇంగ్లీషువాళ్ళూ కూడా ఆమెను, ఆశ వదులుకోవలసిన అవిటి దానికింద తేల్చి చెప్పేశారు.

ఆమె ప్రాణంకోసం, ప్రార్థన ద్వారా నిర్విరామంగా నేను సాగించిన యుద్ధం, నన్ను బాగా నీరసపెట్టేసింది. శ్రీయుక్తేశ్వర్‌గారి సహాయం కోసం నేను శ్రీరాం పూర్ వెళ్ళాను. నళిని దుస్థితి చెప్పేసరికి ఆయన గాఢంగా సానుభూతి ప్రకటించారు.

"ఒక్క నెల గడిచేసరికి మీ చెల్లాయి కాళ్ళు మామూలుగా అవుతాయి" అంటూ ఆయన, "చిల్లు చెయ్యని, రెండు క్యారెట్ల ముత్యం ఒకటి సంపాదించి దాన్ని ఒక కొలికికి అమిర్చి, చర్మానికి తగిలేటట్టుగా ఒక పట్టీతో కట్టుకోమను."

నేను ఆనందంగా ఒక నిట్టూర్పు విడిచి ఆయన పాదాలకు సాష్టాంగ నమస్కారం చేశాను.

"స్వామీ, మీరు దేశికచక్రవర్తులు; ఆమె కోలుకుంటుందని మీరన్నమాట ఒక్కటి చాలు. కాని, మీరు కాదూ కూడదంటే మాత్రం ఒక ముత్యం సంపాయించి ఇస్తాను."

గురుదేవులు తల ఆడించారు. "ఔను. అలాగే చెయ్యి." ఆయన నళినిని ఎన్నడూ చూసినవారు కారు; కాని ఆమె శారీరక, మానసిక లక్షణాలు సరిగ్గా వర్ణించి చెప్పారు.

"స్వామీ, ఇది జ్యోతిష సంబంధమైన పరిశీలనా? ఆమె పుట్టిన రోజుకాని సమయంకాని మీకు తెలియదే!"

శ్రీ యుక్తేశ్వర్‌గారు చిరునవ్వు నవ్వారు. "అంతకన్న లోతయిన జ్యోతిషం ఉంది, పంచాంగాలూ గడియారాలూ చెప్పే సాక్ష్యం మీద ఆధారపడదది. ప్రతి మనిషీ సృష్టికర్త లేదా విరాట్ పురుషుడి అంశ; అతనికి సూక్ష్మశరీరం ఒకటీ స్థూల శరీరం ఒకటీ ఉంటాయి. మానవనేత్రం భౌతికరూపాన్నే చూస్తుంది; కాని అంతశ్చక్షువు మరింత గాఢంగా చొచ్చుకుపోతుంది; ప్రతి మనిషీ ఒక అంతర్భాగంగానూ ప్రత్యేక వ్యక్తిగానూ ఏర్పడిఉన్న బ్రహ్మాండ స్వరూపంలోకి కూడా చొచ్చుకుపోయి చూస్తుంది."

నేను కలకత్తాకు తిరిగివచ్చి నళినికోసం ఒక ముత్యం* కొన్నాను. ఒక నెల అయేసరికి, పడిపోయిన ఆమె కాళ్ళు పూర్తిగా నయమయిపోయాయి.

మా గురుదేవులకు హృదయపూర్వకమైన తన కృతజ్ఞత అందజెయ్యమని చెప్పింది చెల్లాయి. నేను చెప్పిన కబురు ప్రశాంతంగా విన్నారాయన. కాని నేను సెలవు తీసుకుని వెళ్ళబోతుండగా ఆయన భావగర్భితమైన వ్యాఖ్య ఒకటి చేశారు.

"మీ చెల్లాయికి అసలు పిల్లలే పుట్టరని చాలామంది డాక్టర్లు చెప్పారు. ఇక కొన్నేళ్ళలో తను ఇద్దరు కూతుళ్ళని కంటుందని కచ్చితంగా చెప్పు."

ఆ తరవాత కొన్నేళ్ళకి నళినికి ఒక కూతురు పుట్టి ఆనందపరిచింది; మరి కొన్నేళ్ళకి మరో కూతురు కూడా కలిగింది.

---

* ముత్యాలూ రత్నాలూ లోహాలు కొన్ని ఓషధులూ మనిషి ఒంటికి తగిలి ఉన్నట్లయితే అవి శరీర కణాలమీద విద్యుదయస్కాంత ప్రభావం చూపిస్తాయి. కొన్ని మొక్కల్లోనూ లోహాల్లోనూ రత్నాల్లోనూ కూడా ఉండే కర్బనమూ ఇతర లోహమూలకాలూ మానవశరీరంలోనూ ఉన్నాయి. ఈ విషయాల్లో ఋషులు కనిపెట్టినవాటిని, ఎప్పుడో ఒకనాడు, శరీరశాస్త్రవేత్తలు కూడా ధ్రువపరుస్తారు. విద్యుత్ ప్రాణప్రవాహాలతో, సంవేదనశీలకమైన మానవశరీరం, ఈనాటికీ అన్వేషించని అనేక రహస్యాలకు కేంద్రం.

రత్నాలకూ లోహపుకడియాలకూ శరీరంలోని రోగాల్ని నయంచేసే విలువ ఉన్నప్పటికీ, శ్రీయుక్తేశ్వర్‌గారు వాటిని సిఫార్సు చెయ్యడానికి మరో కారణం కూడా లేకపోలేదు. సద్గురువులు తాము రోగనివారకులుగా కనిపించాలని ఆశించరు : దేవుడే రోగనివారకుడు. అంచేత సాధువులు, ఈశ్వరుడి దగ్గర్నించి తాము సవినయంగా అందుకున్న శక్తుల్ని తరచు, రకరకాల ముసుగుల్లో మరుగు పరుస్తారు. సాధారణంగా మానవుడు, ప్రత్యక్ష వస్తువులమీదే విశ్వాసం పెట్టుకుంటాడు; రోగం నయం కావడానికని మా గురుదేవుల దగ్గరికి ఎవరయినా వచ్చినప్పుడు, ఆయన వాళ్ళకి దండకడియం వేసుకోమనో, రత్నం ధరించమనో సలహా ఇస్తుండేవారు; వాళ్ళలో విశ్వాసం రగుల్కొల్పడానికీ, వాళ్ళ దృష్టిని తమ మీంచి మళ్ళించడానికీ అలా చేస్తూ ఉండేవారు. కడియాలకూ రత్నాలకూ విద్యుదయస్కాంత సంబంధమైన రోగనివారక శక్తులు అంతర్గతంగా ఉన్నప్పటికీ, వాటితోబాటు గురుదేవుల గుప్తమైన ఆధ్యాత్మిక ఆశీర్వాదాలు కూడా కలిసి ఉండేవి.

అధ్యాయం : 26

# క్రియాయోగ శాస్త్రం

ఈ పుటల్లో నేను తరచుగా ప్రస్తావిస్తూ వచ్చిన క్రియాయోగశాస్త్రం, మా గురుదేవులకు గురువులయిన లాహిరీ మహాశయుల ద్వారా ఆధునిక భారత దేశంలో విస్తృతంగా పదిమందికీ తెలియవచ్చింది. క్రియా శబ్దానికి సంస్కృత మూలధాతువు 'కృ': అంటే, చెయ్యడం, ప్రతిస్పందించడం అని అర్థం. కార్య కారణాల ప్రకృతినియమమైన 'కర్మ' శబ్దంలోనూ అదే ధాతువు కనిపిస్తుంది. ఈ ప్రకారంగా క్రియాయోగం "ఒకానొక చర్యద్వారా, లేదా కాండ (క్రియ) ద్వారా పరమాత్మతో పొందే కలయిక (సంయోగం)" అవుతుంది. ఈ ప్రక్రియను నిష్ఠగా సాధనచేసే యోగి, కర్మనుంచి - అంటే కార్యకారణ సమతౌల్యాల నియమబద్ధ శృంఖలం నుంచి - క్రమక్రమంగా విముక్తి పొందుతాడు.

యోగసంబంధమైన కొన్ని ప్రాచీన నిషేధాల మూలంగా, జనబాహుళ్యం కోసం ఉద్దేశించిన పుస్తకంలో క్రియాయోగానికి పూర్తి వివరణ ఇయ్యగూడదు నేను. అసలయిన యోగప్రక్రియను, "యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా/ సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్"* వారి దగ్గర అధికారం పొందిన క్రియావంతుడి (క్రియాయోగి) దగ్గరే నేర్చుకోవాలి. ఇక్కడ మాత్రం స్థూలమైన ప్రస్తావన చాలు

క్రియాయోగమన్నది, మనిషి రక్తంలో ఉన్న కర్బనాన్ని హరింపజేసి ఆక్సిజన్ [ప్రాణవాయువు/ఆమ్లజని]తో నింపే ఒకానొక మానసిక - శారీరక ప్రక్రియ మెదడులోనూ వెనుబాములోనూ ఉన్న కేంద్రాల్ని నవశక్తితో నింపడానికి, ఈ

---

* తన తర్వాత సంస్థ (యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా / సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్)కి అధ్యక్షులు మరియు ఆధ్యాత్మిక నాయకులుగా వచ్చేవారికి, అర్హత పొందిన విద్యార్థులకు క్రియాయోగం నేర్పడానికీ, క్రియాయోగ దీక్ష ఇవ్వడానికీ, లేదా ఆ పని చెయ్యడానికి యోగదాలో దీక్షపొందిన ఒక సన్యాసిని నియమించడానికీ యోగానందగారు అధికారం ఇచ్చారు ఈ క్రియాయోగశాస్త్రం నిరంతరవ్యాప్తి, ఆయన తన యోగదా పాఠాల ద్వారా జరిగే ఏర్పాటు చేశారు. ఈ పాఠాలు రాంచీలోని యోగదా ఆశ్రమం నుంచి లభిస్తాయి చూ.పే. 637 (ప్రచురణకర్త గమనిక)

అదనపు ఆక్సిజన్ అణువులు, ప్రాణశక్తి ప్రవాహంగా మారిపోతాయి. ఒంట్లో కలుషరక్తం జమకాకుండా ఆపి, యోగి కణజాలాల క్షయాన్ని తగ్గించడంకాని ఆపెయ్యడం కాని చేస్తాడు. ప్రగతి సాధించిన యోగి, తన శరీర కణాల్ని శక్తిగా మార్చేస్తాడు. ఎలిజా, ఏసు, కబీరు, ఇతర ప్రవక్తలూ, క్రియాయోగాన్నో ఆ మాదిరి మరో ప్రక్రియనో ఉపయోగించడంలో పరిపూర్ణమైన ప్రావీణ్యము కలవారు. దాంతో వారు తమ శరీరాల్ని తమ సంకల్పానుసారంగా ప్రత్యక్షమూ చేసేవారు, అదృశ్యమూ చేసేవారు.

క్రియాయోగం సనాతనమైన శాస్త్రం. లాహిరీ మహాశయులు దాన్ని మహా గురుదేవులైన బాబాజీ దగ్గరినించి పొందారు. ఇది అంధయుగాల్లో మరుగున పడిపోయిన తరవాత, బాబాజీ ఈ ప్రక్రియను పునరుద్ధరించి సులభగ్రాహ్యం చేశారు. బాబాజీ దీనికి సులువుగా క్రియాయోగం అని పేరు పెట్టారు.

"ఈ పంధొమ్మిదో శతాబ్దంలో నేను నీద్వారా ప్రపంచానికి అందిస్తున్న ఈ క్రియాయోగం, కొన్నివేల ఏళ్ళ కిందట కృష్ణుడు అర్జునుడికి ఉపదేశించిన, ఉత్తరోత్తరా పతంజలికీ, క్రీస్తుకూ, సెంట్ జాన్‌కూ సెంట్‌పాల్‌కూ తదితర శిష్యులకూ తెలిసిఉన్న శాస్త్రానికి పునరుద్ధరణమే," అన్నారు బాబాజీ.

భగవద్గీతలో కృష్ణభగవానుడు క్రియాయోగాన్ని రెండుసార్లు ప్రస్తావించాడు. ఒక శ్లోకంలో ఇలా ఉంది : "పీల్చేగాలిని విడిచే గాలిలో వేల్చి, విడిచే గాలిని పీల్చేగాలిలో వేల్చి, రెండు శ్వాసల్నీ తటస్థీకరిస్తున్నాడు యోగి ; ఆ ప్రకారంగా అతడు ప్రాణాన్ని గుండెనుంచి విడుదల చేసి, ప్రాణశక్తిని తన అదుపులో ఉంచుకుంటాడు."* దీని తాత్పర్యమేమిటంటే; "యోగి, ఊపిరితిత్తులూ గుండె చేసే పనిని నెమ్మదిచేసి, దానిద్వారా అదనంగా ప్రాణం (ప్రాణశక్తి) సరఫరా అయేటట్టు చేసుకుని, శరీరంలో తరుగుదలను [జీవకణ క్షయాన్ని] అరికడతాడు; అంతే కాకుండా అతడు, అపానాన్ని (విసర్జక ప్రవాహం) అదుపు చేసుకోడంవల్ల ఒంట్లో పెరుగుదలకు సంబంధించిన మార్పుల్ని కూడా అరికడతాడు; ఈ ప్రకారంగా, తరుగుదలనూ పెరుగుదలనూ నిలుపుచేసి, యోగి, ప్రాణశక్తిని అదుపులో ఉంచుకోడం నేర్చుకుంటాడు."

---

* అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేపానం తథాపరే
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః. భగవద్గీత VI 29

గీతలో మరో శ్లోకం* ఇలా చెబుతోంది : ఏముని, మోక్షపరాయణుడై కనుబొమల మధ్య బిందువు మీద చూపు నిలపడంవల్లా, ముక్కుల్లోనూ ఊపిరి తిత్తుల్లోనూ [ఆడే] ప్రాణ అపానవాయువుల సమప్రవాహాల్ని తటస్థీకరించడం వల్లా బాహ్యవిషయాలనుంచి వెనక్కి తగ్గగలుగుతాడో; ఇంద్రియ సంయోజితమైన మనస్సునూ బుద్ధిని అదుపు చెయ్యగలుగుతాడో; కోరికనూ, భయాన్నీ, కోపాన్నీ పారదోలగలుగుతాడో, ఆ ముని (ధ్యానయోగి) శాశ్వతంగా విముక్తుడవుతాడు

నాశరహితమైన ఈ యోగాన్ని, వెనకటి ఒక అవతారంలో, ప్రాచీన జ్ఞాని అయిన వివస్వతుడికి ఉపదేశించినవాణ్ణి నేనేననీ, ఆ వివస్వతుడు మహాధర్మ శాసకుడైన మనువుకు ఉపదేశించాడనీ కూడా కృష్ణుడు చెబుతాడు.† ఆ మనువు‡ సూర్యవంశ స్థాపకుడైన ఇక్ష్వాకుడికి ఉపదేశం చేశాడు. ఈ విధంగా ఋషులు రాజయోగాన్ని ఒకరి దగ్గరినుంచి మరొకరికి అందిస్తూ, భౌతికవాద యుగాలు§ వచ్చేవరకూ కాపాడారు. ఆ తరవాత, పురోహితుల గోపనప్రవృత్తి వల్లా మానవుడి ఉపేక్షవల్లా ఈ పవిత్ర విద్య క్రమంగా అందుబాటులో లేకుండా పోయింది.

యోగవిద్యకు ప్రప్రథమ శాస్త్రకారుడైన ప్రాచీన ఋషి పతంజలి, క్రియా యోగాన్ని రెండుసార్లు పేర్కొంటూ ఇలా రాశాడు: "శరీర వ్యాయామం, మనో

---

* స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాంతరే భ్రువోః
ప్రాణాపానౌ సమౌకృత్వా నాసాభ్యంతరచారిణౌ.
యతేంద్రియ మనోబుద్ధి ర్మునిర్మోక్షపరాయణః
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః. - భగవద్గీత V 27-28

శ్వాసగురించి శాస్త్రీయ వివరణలు మరికొన్ని పే. 602-04 ల్లో చూడండి

† ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయం
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేబ్రవీత్
ఏవం పరంపరా ప్రాప్త మిమం రాజర్షయో విదుః
స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప - భగవద్గీత IV 1-2

‡ మానవధర్మశాస్త్రాలు లేదా మనుస్మృతి రచించిన ప్రాక్ చారిత్రక కాలపు గ్రంథకర్త శాసనబద్ధం చేసిన ఈ సామాన్యధర్మవ్యవస్థలు భారత దేశంలో ఈనాటికీ అమలులో ఉన్నాయి

§ హిందూ పవిత్ర గ్రంథాల లెక్కల ప్రకారం భౌతికవాద యుగాల ఆరంభం, క్రీ పూ 3102లో జరిగింది అయన చక్రంలోని అవరోహణ క్రమంలో వచ్చే చివరి ద్వాపరయుగమూ విశ్వ చక్రంలోని కలియుగమూ ఆ ఏటనే ఆరంభమయాయి. పే. 219-20ల్లోని అధోజ్ఞాపిక చూడండి. 10 000 ఏళ్ళ కిందట మానవజాతి అసభ్యమైన శిలాయుగంలో జీవించేదని నమ్మే మానవ శాస్త్రవేత్తలు చాలామంది, లెమూరియా, అట్లాంటిస్, భారతదేశం చైనా, జపాను,

విగ్రహం, ఓంకారం మీద ధ్యానం కలిసి క్రియాయోగ మవుతుంది."* ధ్యానంలో వినవచ్చే ఓంకారమనే యథార్థమైన విశ్వనాదమే దేవుడని అంటాడు పతంజలి.† ఓంకారం సృజనశీలక శబ్దబ్రహ్మం; స్పందనాత్మక బ్రహ్మాండ చాలకయంత్ర ధ్వని; ఈశ్వర సత్తకు ప్రత్యక్ష సాక్షి ‡ యోగసాధన కొత్తగా మొదలుపెట్టినవాడు సైతం, అద్భుతమైన ఓంకార నాదాన్ని త్వరలోనే తనలోపల వినవచ్చు. ఆనంద మయమైన ఈ ఆధ్యాత్మిక ప్రోత్సాహంతో అతడు, తాను ఊర్ధ్వలోకాలతో సంపర్కం పెట్టుకున్నానని నమ్మగలుగుతాడు.

క్రియాయోగ ప్రక్రియ, అంటే ప్రాణశక్తి నియంత్రణ గురించి పతంజలి రెండోసారి ఇలా ప్రస్తావించాడు : "ఉచ్ఛ్వాస నిశ్వాసాల గతిని విచ్ఛేదించడం ద్వారా జరిగే ప్రాణాయామంవల్ల ముక్తి సాధించవచ్చు."§

సెంట్‌పాల్‌కు క్రియాయోగం, లేదా ఆ మాదిరి మరో ప్రక్రియ తెలుసు; దాని ద్వారా ఆయన, ప్రాణశక్తి ప్రవాహాల్ని ఇంద్రియాల్లోకి వదలడంకాని, ఆపడం కాని చెయ్యగలుగుతూండేవాడు. అంచేతే ఆయన ఇలా అనగలిగాడు : "క్రీస్తంటే మనకున్న పరమానందం మీద ఒట్టు వేసి చెబుతున్నాను, నేను రోజూ చని పోతూంటాను." ** సెంట్ పాల్ (సాధారణంగా ఇంద్రియ జగత్తువేపు సాగుతూ,

---

ఈజిప్టు మెక్సికో దేశాల్లోనూ అనేక ఇతర దేశాల్లోనూ విస్తృతంగా వ్యాప్తమైన అత్యంత ప్రాచీన నాగరికతల్ని "కట్టుకథల" కింద కొట్టి పారేస్తారు.

* [తపఃస్వాధ్యా యేశ్వర ప్రణిధానాని క్రియాయోగః] యోగసూత్రాలు 2 1 క్రియా యోగమన్న మాట వాడడంలో పతంజలి, ఉత్తరోత్తరా బాబాజీ ఉపదేశించిన ప్రక్రియనికాని, దాదాపు అలాటి మరో ప్రక్రియనికాని ఉద్దేశించి ఉండవచ్చు. మొత్తానికి పతంజలి, ప్రాణశక్తిని అదుపులో పెట్టే కచ్చితమైన ఒకానొక ప్రక్రియను చెబుతున్నాడన్న విషయం యోగసూత్రాల్లో ఆయన చెప్పిన 2.49 సూత్రం (దీన్ని ఇక్కడే మరోచోట ఉదాహరించడం జరిగింది) వల్ల రుజువవుతోంది

† [తస్య వాచకః ప్రణవః] అందులోనే 1 27

‡ "దేవుడు చేసిన సృష్టి ఆదికి విశ్వసనీయమైన, సత్యమైన సాక్షి ఆమెన్,' ఈ సంగతులు చెబుతోంది." - రివలేషన్ 3 14 (బైబిలు). "ఆదిలో ఉంది శబ్దం, ఆ శబ్దం దేవుడివద్ద ఉంది, ఆ శబ్దమే దేవుడు... అన్నీ ఆయన (శబ్దం లేదా ఓం) చేసినవే, ఆయన లేనిదే సృష్టిఅయినదేదీ సృష్టిఅయి ఉండేది కాదు." - యోహాను 1 :1-3 (బైబిలు). వేదాల్లో చెప్పిన 'ఓం కారం, టిబెటన్ల హుం గానూ, ముస్లిముల 'ఆమీన్'గానూ, ఈజిప్టువారూ గ్రీకులూ రోమన్లూ యూదులూ, క్రైస్తవులూ అనే 'ఆమెన్'గానూ అయింది. హీబ్రూ భాషలో దీనికి 'నిశ్చయమైన, విశ్వాసం గల అవి అర్థం

§ [తస్మిన్ సతి శ్వాసప్రశ్వాసయో ర్గతివిచ్ఛేదః ప్రాణాయామః] - యోగ సూత్రాలు 2 49

** I కోరింథియన్లు 15 31 (బైబిలు) "మనకున్న పరమానందం" అన్నదే సరియైన అనువాదం; సాధారణంగా అనువదించే "మీకున్న పరమానందం" కాదు. ఇక్కడ పాల్ క్రీస్తు చైతన్యపు విశ్వజనీనతను గూర్చి చెబుతున్నాడు.

తద్వారా సత్యమనే ఆభాస దానికి కల్పిస్తూ ఉండే) తన శారీరక ప్రాణశక్తిని ఒకానొక ప్రక్రియ ద్వారా అంతర్ముఖంగా కేంద్రీకరింపజేసి ప్రతిరోజూ కూటస్థ చైతన్యం (క్రీస్తు చైతన్యం)లో మునిగి ఆనందిస్తూ యోగపరమైన నిజమైన తాదాత్మ్యాన్ని అనుభవిస్తూ ఉండేవాడు. ఆ ఆనందావస్థలో, మాయా ప్రపంచపు ఇంద్రియ భ్రాంతులకు సంబంధించినంతవరకు, తాను "చచ్చినవాడి" కిందే జమ అనీ, లేదా వాటినుంచి విముక్తుణ్ణి అయాననీ ఆయనకు స్పృహలో ఉండేది.

దైవసంసర్గపు ఆరంభస్థితుల్లో (సవికల్ప సమాధి) భక్తుడి చైతన్యం 'విశ్వాత్మ'లో విలీనమవుతుంది; అతని ప్రాణశక్తిని శరీరం లోంచి లాగేసినట్టు అవుతుంది. అప్పుడా శరీరం "చచ్చిపోయి"నట్టుగా కదలిక లేకుండానూ బిర్రబిగిసీ ఉన్నట్టు కనిపిస్తుంది. తాను చైతన్యం స్తంభించిన శారీరక స్థితిలో ఉన్నానన్న స్పృహ యోగికి పూర్తిగా ఉంటుంది. అయితే, ఉన్నత స్థితులకు (నిర్వికల్ప సమాధి) పురోగమిస్తున్న కొద్దీ అతడు, శారీరక నిశ్చలత లేకుండానే, మామూలు జాగృత చేతనావస్థలోనూ తనను నిర్బంధించే లౌకిక విధుల మధ్యలోనూ కూడా దైవాను సంధానం చేస్తాడు.*

"క్రియాయోగం, మానవ పరిణామాన్ని త్వరితం చెయ్యడానికి ఉపకరించే సాధనం," అని తమ శిష్యులకు వివరించారు శ్రీయుక్తేశ్వర్‌గారు. "విశ్వచైతన్య రహస్యం శ్వాస నియంత్రణతో గట్టిగా ముడిపడి ఉన్నదని సనాతన యోగులు కనిపెట్టారు. ప్రపంచ జ్ఞానభాండారానికి భారతదేశం ప్రసాదించిన విశిష్ట, వినాశ రహిత బహూకృతి ఇది. సాధారణంగా, గుండె చేసే పని కొనసాగేటట్టు చెయ్యడంలో నిమగ్నమై ఉండే ప్రాణశక్తి, అంతకన్న పెద్ద పనులు చెయ్యడానికి స్వేచ్ఛ పొంది ఉండాలి; ఈ స్వేచ్ఛ పొందడానికి, నిరంతరాయంగా సాగే శ్వాసను శాంతపరిచి, నిలపగలిగే పద్ధతిని అనుసరించాలి.

క్రియాయోగి తన ప్రాణశక్తిని, వెన్నుబాములోని ఆరు కేంద్రాల్ని (ఆజ్ఞా విశుద్ధ, అనాహత, మణిపూర, స్వాధిష్ఠాన, మూలాధారాలనే షట్చక్రాల్ని) చుట్టి కిందినించి పైకీ పైనించి కిందికీ పరిభ్రమించేటట్టు మానసికంగా నిర్దేశిస్తాడు. ఈ ఆరు చక్రాలూ విరాట్పురుషుడికి సంకేతమయిన రాశిచక్రంలోని పన్నెండు రాశులకు సమానం. మానవుడి సున్నితమయిన వెన్నుబాముచుట్టూ అరనిమిషం

---

* 'వికల్ప'మనే సంస్కృత పదానికి 'భేదం, తాదాత్మ్య రాహిత్యం' అని అర్థం. సవికల్పం "భేదంతో కూడుకున్న సమాధి స్థితి," నిర్వికల్పం "భేదం లేని" సమాధి స్థితి. అంటే సవికల్ప సమాధిలో భక్తుడు, భగవంతుడికంటె తాను భిన్నంగా ఉన్నానన్న అనుభూతి కొద్దిగా నిలుపు కొంటాడు; నిర్వికల్ప సమాధిలో ఆ పరమాత్మతో తాదాత్మ్యం అనుభవిస్తాడు.

పేపు పరిభ్రమించే శక్తి, అతని పరిణామంలో సూక్ష్మప్రగతిని సాధ్యం చేస్తుంది; ఒక్క క్రియకు పట్టే ఆ అరనిమిషం కాలం, ఒక సంవత్సరంలో జరిగే ప్రకృతి సహజమైన ఆధ్యాత్మిక వికాసానికి సమానం.

సర్వద్రష్ట అయిన ఆధ్యాత్మిక నేత్రమనే సూర్యుడి చుట్టూ పరిభ్రమించే ఆరు (ధ్రువత్వగణన రీత్యా పన్నెండు) ఆంతరిక నక్షత్ర రాశులు గల మానవుడి సూక్ష్మశరీర వ్యవస్థకు భౌతిక సూర్యుడితోనూ పన్నెండు నక్షత్ర రాశులతోనూ పరస్పర సంబంధమున్నది. ఆ ప్రకారంగా మానవులందరూ, ఒక ఆంతరిక విశ్వంవల్లా ఒక భౌతిక విశ్వంవల్లా ప్రభావితులవుతూ ఉంటారు. మానవుడి లౌకిక పారలౌకిక పరిసరం, పన్నెండేసి సంవత్సరాల ఆవృత్తుల్లో అతన్ని, అతని సహజమార్గంలో ముందుకు నెట్టుతుందని సనాతన ఋషులు కనిపెట్టారు. మానవుడు తన మెదడు పరిపూర్ణ వికాసం పొందేటట్టు చెయ్యడానికీ, విశ్వ చైతన్యాన్ని పొందడానికీ పదిలక్షల సంవత్సరాల సహజ, వ్యాధిరహిత పరిణామం అవసరమని పవిత్ర గ్రంథాలు నొక్కి చెబుతాయి.

ఎనిమిదిన్నర గంటల కాలం సాధనచేసిన వెయ్యి క్రియలు యోగికి, ప్రకృతి సహజమైన పరిణామంలో వెయ్యి సంవత్సరాల్లో వచ్చే ఫలితాన్ని ఒక్క రోజులో కలిగిస్తాయి; 3,65,000 సంవత్సరాల పరిణామం ఒక్క ఏడాదిలో వస్తుంది. ఈ ప్రకారంగా, పదిలక్షల సంవత్సరాల్లో ప్రకృతి తీసుకువచ్చే ఫలితాన్నే క్రియా యోగి, ప్రతిభావంతమైన స్వయంకృషితో మూడేళ్ళలో సాధించగలడు. అయితే, గాఢంగా వికాసం సాధించిన యోగులు మాత్రమే క్రియాయోగమనే అడ్డదారి తొక్కగలరు. అటువంటి యోగులు, ఒక గురువు మార్గదర్శకత్వంలో, గాఢ సాధనవల్ల జనించే శక్తికి తట్టుకోడానికి, తమ శరీరాన్ని మెదడునూ జాగ్రత్తగా సిద్ధంచేసుకుంటారు.

ఆరంభదశలో ఉన్న క్రియాయోగ సాధకుడు, రోజుకు రెండుసార్ల చొప్పున, పద్నాలుగు మొదలు ఇరవై నాలుగు సార్ల వరకు మాత్రమే యోగసాధన చేస్తాడు. కొందరు యోగులు ఆరేళ్ళలోకాని, పన్నెండేళ్ళలో కాని, ఇరవైనాలుగేళ్ళలోకాని, నలభైఎనిమిదేళ్ళలోకాని విముక్తి సాధిస్తారు. ఒకవేళ, ఏ యోగి అయినా సంపూర్ణ సాక్షాత్కారం సాధించక ముందే చనిపోయినట్టయితే, వెనకటి క్రియాసాధన బాపతు సత్కర్మను తనవెంట తీసుకుపోతాడు; కొత్త జన్మలో అతడు స్వాభావికం గానే అంతిమ లక్ష్యం వేపు ఆకృష్టుడవుతాడు.

సగటు మనిషి శరీరం ఏభై వాట్ల కరెంటు బల్బులాంటిది; ఆ శరీరం, అత్యధిక క్రియాసాధనవల్ల ఉత్పన్నమయే లక్షకోట్ల వాట్ల శక్తిని ఇముడ్చుకోలేదు.

సులభంగానూ, నిర్దుష్టంగాను ఉండే క్రియాయోగ పద్ధతుల్ని క్రమక్రమంగా, నియమానుసారంగా పెంచుతూ సాధన చెయ్యడంవల్ల, మనిషి శరీరం రోజు రోజుకూ సూక్ష్మరూపంలో పరివర్తన చెందుతూ ఉంటుంది; చివరికది పరమాత్ముడి, ప్రధమ భౌతిక, క్రియాశీలక అభివ్యక్తి అయిన విశ్వశక్తి తాలూకు అనంత సామర్థ్యాన్ని అభివ్యక్తం చెయ్యడానికి తగి ఉంటుంది.

క్రియాయోగానికీ, తప్పుదారి పట్టిన ఉత్సాహవంతులు కొందరు చేస్తే అశాస్త్రీయమైన శ్వాసనియంత్రణాభ్యాసాలకీ ఎంత మాత్రం పోలిక లేదు. ఊపిరిని బలవంతంగా ఊపిరితిత్తుల్లో బిగబట్టి ఉంచడం అసహజమే కాకుండా, నిస్సందేహంగా అసౌఖ్యమయింది కూడా. కాని క్రియాసాధనలో అలా కాకుండా మొదటినించి కూడా ప్రశాంతతానుభూతులు కలుగుతాయి; అంతేకాక, వెను బాములో పునరుత్పాదక ఫలితాన్నిచ్చే ఉపశమనకారక సంవేదనలు కూడా తోడయి ఉంటాయి.

ఈ సనాతన యోగప్రక్రియ శ్వాసను మనోద్రవ్యంగా మార్చేస్తుంది. ఆధ్యాత్మిక ప్రగతి ద్వారా ఎవరయినా, శ్వాసను ఒక మనోభావనగా - అంటే మనస్సు చేసే ఒక పనిగా - ఒక స్వప్నశ్వాసగా గుర్తుపట్టగలుగుతారు.

మానవుడి శ్వాసక్రియ ప్రమాణానికి అతని చైతన్య స్థితులలోని మార్పులకు గణితపరమైన సంబంధాన్ని నిరూపించడానికి అనేక దృష్టాంతాలు చూపించ వచ్చు. అత్యంత సంకీర్ణమైన బుద్ధి సంబంధమైన తర్కవాదాల్ని ఆలకిస్తూ ఉండడం, అతిసున్నితమైన లేదా అతి కఠినమైన అంగవిన్యాసం చేస్తూ ఉండడం వంటి సందర్భాల్లో తన మనస్సును పూర్తిగా ఒకదాని మీద లగ్నంచేసి ఉన్నవాడు చాలా మెల్లగా శ్వాసిస్తాడు; ఇది దానంతటది అది జరుగుతుంది. మనోలగ్నత మందశ్వాస మీద ఆధారపడి ఉంటుంది; భయం, కామం, క్రోధం అనే హానికర మైన భావావేశస్థితులకు తప్పనిసరిగా తోడై వచ్చేవి త్వరిత శ్వాసలూ విషమ శ్వాసలూ మనిషి సగటున నిమిషానికి 18 సార్ల చొప్పున ఊపిరి తీసుకుంటే, మనశ్చాంచల్యం గల కోతి 32 సార్ల చొప్పున తీసుకుంటుంది. దీర్ఘ ఆయుర్దాయా నికి పేరుగన్న ఏనుగు, తాబేలు, పామువంటి జీవుల శ్వాసక్రియ ప్రమాణం మనిషి శ్వాసక్రియ ప్రమాణం కన్న తక్కువ. మాటవరసకు, మూడువందల ఏళ్ళవరకు బతికే అవకాశమున్న రాకాసి తాబేలు నిమిషానికి 4 సార్లే శ్వాసిస్తుంది.

నిద్రవల్ల కలిగే పునరుజ్జీవన ఫలితాలకు కారణం, మనిషికి తన ఒంటిమీదా ఊపిరిమీదా తాత్కాలికంగా స్పృహ లేకపోవడమే. నిద్రపోతున్నవాడు యోగి అవుతాడు; ప్రతి రాత్రీ అతను, శారీరక స్పృహ నుంచి తనను తాను విడుదల

చేసుకుని, తన ప్రాణశక్తిని ప్రధానమైన మెదడు భాగంలోనూ వెనుబాము కేంద్రాలనే ఆరు ఉపశక్తిజనకస్థానా (సబ్ డైనమో)లలోనూ ఉన్న ఉపశమనకారక ప్రవాహాల్లో లీనం చేస్తూ, అనుకోకుండానే యోగక్రియ చేస్తూ ఉంటాడు. ప్రాణులన్నిటినీ పోషించే విశ్వశక్తి, నిద్రపోతున్నవాణ్ణి, అతనికి తెలియకుండానే తిరిగి ప్రాణశక్తితో నింపుతుంది.

స్వచ్ఛందయోగి, సులువైన, సహజ ప్రక్రియ ఒకటి ఉద్దేశపూర్వకంగా సాధన చేస్తాడు; నిద్రపోతున్నవాడిలో మందగతిలో అసంకల్పితంగా సాగేటట్లు మాత్రం కాదు. క్రియాయోగి తన శరీర కణాలన్నిటినీ అక్షయ కాంతితో నింపి పరిపుష్టంకావించడానికీ తద్వారా వాటిని ఆధ్యాత్మికంగా అయస్కాంతీకరించిన స్థితిలో ఉంచడానికీ ఈ ప్రక్రియను వినియోగిస్తాడు. శాస్త్రీయంగా, శ్వాసక్రియ అనవసరమయేటట్టు చేస్తాడు; అంతే కాకుండా (తన సాధన సమయాల్లో) నిద్ర, అపస్మారం, లేదా చావువంటి వ్యతిరేక స్థితుల్లోకి పోకుండా ఉంటాడు.

మాయకు లోబడి, అంటే ప్రాకృతిక నియమానికి లోబడి ఉన్న మనుషుల్లో ప్రాణశక్తి ప్రవహించేది బాహ్యప్రపంచంవేపు; ఆ ప్రవాహాలు వృథా అవుతుంటాయి, ఇంద్రియ భోగాల్లో దుర్వినియోగ మవుతుంటాయి. క్రియాసాధన ఈ ప్రవాహాన్ని వెనక్కి మళ్ళిస్తుంది; ప్రాణశక్తిని మానసికంగా అంతర్జగత్తుకు నడిపించి, అది వెనుబాములోని సూక్ష్మశక్తులతో తిరిగి ఐక్యమయేటట్టు చెయ్యడం జరుగుతుంది. ఈ విధంగా ప్రాణశక్తిని పునఃపూరణం చెయ్యడంవల్ల యోగి శరీరంలోనూ మెదడులోనూ ఉన్న కణాలు ఆధ్యాత్మిక అమృతంతో పునర్నవం చెందుతాయి.

సరయిన ఆహారం, సూర్యకాంతి, సమంజసమైన ఆలోచనల ద్వారా, ప్రకృతినీ దాని దివ్యప్రణాళికనూ అనుసరించి నడుచుకునే మానవులు పది లక్షల సంవత్సరాల్లో ఆత్మ సాక్షాత్కారం పొందుతారు. మెదడు స్వరూపంలో కనీసం స్వల్పమైన మెరుగుదల తీసుకురావాలన్నా కూడా పన్నెండు సంవత్సరాల ఆరోగ్యవంతమైన మామూలు జీవనం అవసరం; మెదడనే ఇంటిని విశ్వచైతన్యావతరణకు సరిపడేటట్లుగా పరిశుభ్రం చెయ్యాలంటే పదిలక్షల సంవత్సరాలు పడుతుంది. అయితే క్రియాయోగి, ఒక ఆధ్యాత్మిక శాస్త్రాన్ని అనుసరించి, అతిదీర్ఘ కాలం ప్రకృతి నియమాల్ని జాగ్రత్తగా అనుసరించవలసిన అవసరం తనకు లేకుండా చేసుకుంటాడు.

ఆత్మను శరీరానికి బంధించే ఊపిరితాడు చిక్కుముడి విప్పుతూ క్రియాయోగం, ఆయుర్దాయం పెంచడానికీ చైతన్యాన్ని అనంతం వరకూ విస్తరింప

జెయ్యడానికీ ఉపకరిస్తుంది. ఈ యోగప్రక్రియ, మనస్సుకూ భౌతిక బంధాల్లో చిక్కుపడ్డ ఇంద్రియాలకూ మధ్య సాగే పెనుగులాటలోంచి బయటపడేట్టు చేసి, భక్తుడు తన శాశ్వత రాజ్య వారసత్వాధికారాన్ని తిరిగి పొందేటట్టుగా స్వేచ్ఛ ప్రసాదిస్తుంది. అప్పుడు అతను తన అసలు స్వరూపం, శరీర కోశ బంధానికి కాని, ఊపిరికికాని - అంటే, గాలికీ ప్రకృతి భౌతిక నిర్బంధాలకూ మర్త్య మానవుడు బానిస అయి ఉండడానికి చిహ్నమైన శ్వాసకుకాని - కట్టుబడి ఉన్నది కాదని తెలుసుకుంటాడు.

తన శరీరంమీదా మనస్సుమీదా తానే ఆధిపత్యం వహించినవాడై క్రియా యోగి చివరికి, "చివరి శత్రువు"* అయిన మృత్యువు మీద విజయం సాధిస్తాడు

"మనుషుల్ని కబళించే మృత్యువును కబళించు నువ్వు:
మృత్యువే కనక మరణిస్తే, అటుపై మరణించడమే ఉండదు."†

అంతఃపరిశీలన లేదా "మౌనంలో కూర్చోడం" అన్నది శాస్త్రీయమైన పద్ధతి కాదు; ప్రాణశక్తిచేత ముడిపడిఉన్న మనస్సునూ ఇంద్రియాల్నీ బలవంతంగా విడదియ్యడానికి చేసే ప్రయత్నమిది. తిరిగి దివ్యత్వం పొందడానికి ప్రయత్నిస్తూ ఉండే ధ్యానశీలత గల మనస్సును ప్రాణశక్తి ప్రవాహాలు నిరంతరం ఇంద్రియాల వేపు వెనక్కి లాగుతూనే ఉంటాయి. ప్రాణశక్తి ద్వారా మనస్సును 'నేరుగా' అదుపులోకి తెచ్చుకునే క్రియాయోగం, అన్నిటికన్న సులువయినదీ, ఫలవంత మయినదీను. అనంతాన్ని చేరుకోడానికి ఇది అనువైన అత్యంత శాస్త్రీయమైన మార్గం కూడా. దేవుణ్ణి చేరడానికి ఉద్దేశించిన దైవశాస్త్రమార్గం నిదానమూ, అనిశ్చితమూ అయిన "ఎద్దుబండి" బాట; దానికి భిన్నంగా క్రియాయోగాన్ని "విమాన" మార్గం అనడం న్యాయం.

---

* "నాశనంకావలసిన చివరి శత్రువు మృత్యువు." - I కొరింథియనులు 15 6 (బైబిలు) పరమహంస యోగానందగారి మరణానంతరం ఆయన భౌతికకాయం చెడిపోకుండా ఉండడం ఆయన పూర్ణసిద్ధి పొందిన క్రియాయోగి అని నిరూపించింది. పే 611 చూడండి. అయితే చనిపోయిన తరవాత శారీరక అవినాశాన్ని మహాపురుషులందరూ ప్రదర్శించరు. అటువంటి అలౌకిక చర్యలు ఏదో ఒక ప్రత్యేక ప్రయోజనం కోసం మాత్రమే జరుగుతాయని హిందూ పవిత్ర గ్రంథాలు చెబుతాయి. పరమహంస యోగానందగారి విషయంలో ఆ "ప్రత్యేక ప్రయోజనం," పాశ్చాత్యులు యోగశాస్త్రం విలువ తెలుసుకుని దాన్ని ఒప్పుకోడమే నన్నదాంట్లో సందేహం లేదు పాశ్చాత్య లోకానికి సేవలందించమని బాబాజీ, శ్రీయుక్తేశ్వర్‌లూ యోగానంద గార్ని ఆదేశించారు. తన జీవితంలోనూ మరణంలోనూ కూడా యోగానందులు ఆ ఆదేశాన్ని శిరసావహించారు. (ప్రచురణకర్త గమనిక) పే 389 అధోజ్ఞాపిక చూడండి.

† షేక్స్పియర్ : సానెట్ 146.

యోగశాస్త్రం అన్నిరకాల ధారణ, ధ్యాన ప్రక్రియల అనుభవహేతువు మీద ఆధారపడ్డది. భక్తుడు తన సంకల్పానుసారంగా ప్రాణ విద్యుత్ ప్రవాహాల్ని దర్శన, శబ్ద, ఘ్రాణ, రసన, స్పర్శేంద్రియాలనే ఐదు టెలిఫోన్లలోకి పోకుండా ఆపనూ గలుగుతాడు, వాటిలోకి పంపనూ గలుగుతాడు. ఈ ఇంద్రియ సంబంధ భేదనశక్తి సంపాదించిన యోగి, తన మనస్సును సంకల్పానుసారంగా దివ్యలోకాలతో కాని భౌతిక ప్రపంచంతోకాని ఇట్టే కలపవచ్చునని గ్రహించగలుగుతాడు. మరింక తన సంకల్పానికి వ్యతిరేకంగా ప్రాణశక్తి అతన్ని, రౌడీ సంవేదనలకూ అశాంతి పరమైన ఆలోచనలకూ నిలయమైన పార్థివ మండలానికి లాక్కురావడం జరగనే జరగదు.

పురోభివృద్ధిచెందిన క్రియాయోగి జీవితం, పూర్వకర్మల ఫలితాల వల్లకాక, కేవలం ఆత్మ నిర్దేశాలవల్లే ప్రభావితమవుతుంది. ఈ ప్రకారంగా భక్తుడు, సామాన్య జీవితంలోని అహంకార పూర్వకమైన మంచీ చెడూ కర్మల విలంబిత, పరిణామాత్మక ఉపదేశాల్నించి తప్పించుకుంటాడు - గరుడవేగ హృదయులకు ఇవి ఆటంకాలుగా, నత్తనడకల్లా ఉంటాయి.

ఆత్మ నిర్దేశానుసార జీవనమనే అత్యుత్తమపద్ధతి యోగికి స్వేచ్ఛ ప్రసాదిస్తుంది. అహంకార కారాగారం నుంచి విముక్తుడై అతను సర్వవ్యాపకత్వమనే గాఢ వాయువును ఆస్వాదిస్తాడు. దానికి భిన్నంగా, ప్రకృతి సహజమైన జీవనమనే దాస్యం అతన్ని, అవమానకరమైన గతిలోకి నడిపిస్తుంది. తన జీవితాన్ని కేవలం పరిణామాత్మక వ్యవస్థకు బద్ధం చేసుకున్నప్పుడు మానవుడు, ప్రకృతినించి తొందరగా విడివడే అధికారం పొందలేడు. తన శరీరాన్నీ మనస్సునూ శాసించే నియమాల్ని ఉల్లంఘించకుండానే అతను జీవించినప్పటికీ, అంతిమ విముక్తి పొందడానికతనికి, మాయావేషాల్లో జన్మలెత్తుతూ పదిలక్షల సంవత్సరాల కాలం గడపవలసి వస్తుంది.

కాబట్టి, వెయ్యేవేల సంవత్సరాలనగానే తిరుగుబాటు ధోరణిలో చూసే వాళ్ళకి, ఆత్మ వ్యక్తిత్వ సాధనకోసం శారీరక, మానసిక తాదాత్మ్యాల నుంచి విడివడే యోగి శీఘ్రఫలసాధనకు అనుసరించే పద్ధతుల్ని సిఫార్సు చెయ్యడం జరుగుతోంది. ఆత్మ సంగతి అలా ఉంచి, కనీసం ప్రకృతితో కూడా సామరస్యం లేకుండా జీవించే సామాన్య మానవుడి విషయంలో ఈ సంఖ్యాపరిధి ఇంకా చాలా విస్తరిస్తుంది; అతను అసహజమైన ఎండమావుల వెంటబడిపోతూ, తన ఆలోచనలతోనూ శరీరంతోనూ, ఆహ్లాదకరమైన ప్రకృతి నియమాల్ని ఉల్లంఘిస్తూ ఉంటాడు.

అతనికి పదికి మరో పది లక్షల ఏళ్ళు కలిపినా కూడా విముక్తి సాధించడానికి వ్యవధి చాలదు.

సంస్కారంలేని మనిషి, తన శరీరం ఒక రాజ్యమనీ ఆత్మ అనే చక్రవర్తి దాన్ని పాలిస్తున్నాడనీ, కపాల సింహాసనాన్ని ఆయన అధిష్ఠించి ఉండగా షట్చక్రాలనే సామంత రాజప్రముఖులు ఆయన దగ్గర కొలువై ఉంటారనీ - అంటే చైతన్య మండలాలు ఆయన్ని పరివేష్టించి ఉంటాయనీ - గ్రహించడం అరుదూ కావచ్చు గ్రహించకనే పోవచ్చు. ఈ దైవరాజ్య వ్యవస్థకు విధేయులైన పౌరులు అనేకమంది ఉన్నారు : ఇరవై ఏడువేల లక్షల కోట్ల కణాలు (ఇవి స్వయంచాలితంగా భాసిస్తున్నప్పటికీ నిస్పందేహంగా ప్రజ్ఞ కలిగి, శారీరకమైన వృద్ధి, రూపాంతరణ, క్షయాలనే విధులన్నీ నిర్వర్తిస్తూ ఉండేవి), ఐదుకోట్ల అంతస్తరీయ ఆలోచనలూ, భావోద్రేకాలూ, అరవై ఏళ్ళ సగటు జీవితంలో మానవుడి చైతన్యంలో పాటూపోట్ల మాదిరిగా మారుతూ వచ్చే వివిధావస్థలూనూ.

ఆత్మ సమ్రాట్టుకు వ్యతిరేకంగా, మానవదేహంలోనయినా మనస్సులోనయినా, వ్యాధిరూపంలోగాని అవివేకరూపంలోగాని వ్యక్తమయే ప్రత్యక్షమైన తిరుగుబాటుకు కారణం, ఆయనకు విధేయులైన పౌరులు తలపెట్టే రాజద్రోహం కాదు; మానవుడు తనకు దక్కిన వ్యక్తిత్వాన్ని లేదా స్వతంత్రేచ్ఛను, పూర్వమో ప్రస్తుతమో, దుర్వినియోగం చెయ్యడమే. ఆ స్వతంత్రేచ్ఛ అతనికి ఆత్మతోబాటు ఇచ్చినదే; అంతేకాదు, ఇచ్చింది మళ్ళీ వెనక్కి తీసుకోడానికి వీలులేకుండా ఇచ్చినదే.

మానవుడు తుచ్ఛమైన అహంకారంతో మమేకమై, ఆలోచనలు చేసేవాడూ సంకల్పించేవాడూ, అనుభూతిపొందేవాడూ, అన్నం జీర్ణం చేసేవాడూ, తనను సజీవంగా ఉంచేవాడూ తానేనని అనుకుంటూ ఉంటాడుకాని, తన సాధారణ జీవితంలో తాను వెనకటి చేత (కర్మ)లకూ ప్రకృతికీ, లేదా పరిసరానికీ కీలు బొమ్మను తప్ప మరేమీ కానని ఆలోచించుకుని (ఆ ఆలోచన కూడా రవ్వంత చాలు) అంగీకరించడు. ప్రతి మనిషి తాలూకు బౌద్ధిక ప్రతిస్పందనలూ, అనుభూతులూ చిత్తవృత్తులూ, అలవాట్లూ కేవలం వెనకటి హేతువులకు ఫలితాలే; హేతువులు ఈ జన్మలోవయినా కావచ్చు, ఏ పూర్వజన్మలోవయినా కావచ్చు. అయితే, అటువంటి ప్రభావాలన్నిటికీ అతీతంగా, సమున్నతంగా ఉంటుంది, రాజాధిరాజ సమమైన ఆత్మ. క్రియాయోగి స్వల్పకాలికమైన సత్యాన్నీ స్వాతంత్ర్యాన్నీ తిరస్కరించి మాయావరణ మంతటినీ దాటి విముక్త జీవుడవుతాడు. మానవుడు జీవించే ఆత్మేకాని నశించే శరీరం కాదని ప్రపంచంలోని పవిత్ర గ్రంథాలన్నీ

ఉద్ఘోషిస్తాయి; ఈ పవిత్ర గ్రంథాలు చెప్పే ఉద్ఘోషని నిరూపించడానికి అతనికి క్రియాయోగంలో ఒక పద్ధతి దొరుకుతుంది.

"బాహ్య కర్మకాండ అజ్ఞానాన్ని నాశనం చెయ్యలేదు; ఎంచేతంటే, అవి రెండూ పరస్పర విరుద్ధమైనవి కావు," అన్నారు ఆచార్య శంకరులు, 'శ్లోక శతకం' లో. "అనుభవం ద్వారా కలిగిన జ్ఞానం ఒక్కటే అజ్ఞానాన్ని నాశనం చేస్తుంది.... ఆత్మ విచారం వల్ల తప్ప మరే సాధనం ద్వారానూ జ్ఞానం ఉదయించదు. ' నే నెవర్ని? ఈ జగత్తు ఎలా పుట్టింది? దీనికి కర్త ఎవరు? దీనికి భౌతిక హేతువు ఏమిటి?' అంటూ, ఈ మాదిరిగానే విచారణ సాగాలి." ఈ ప్రశ్నలకు బుద్ధి సమాధానం చెప్పలేదు; అంచేతనే ఋషులు, ఆధ్యాత్మిక విచార ప్రక్రియగా యోగాన్ని రూపొందించారు.

నిజమైన యోగి, తన ఆలోచనల్నీ ఇచ్ఛాశక్తినీ అనుభూతుల్నీ విషయ వాంఛలతో తప్పుగా ఏకీభావం పెట్టుకోకుండా అరికట్టి, మేరుదండ మందిరాల్లో నెలకొని ఉన్న అధిచేతన శక్తులతో మనస్సును ఐక్యంచేసి, దేవుడు నిర్ణయించిన రీతిగా ప్రపంచంలో బతుకుతాడు; ప్రారబ్ధ ప్రభావోద్రేకాలవల్లకాని, మానవ అవివేకమూలకమైన నూతన ప్రేరణలవల్ల కాని ప్రేరితుడు కాడతడు. సర్వోత్తమ ఆకాంక్షను సఫలీకృతం కావించుకొని అతడు, అక్షయానందమయుడైన పరమాత్మ చరమాశ్రయంలో సుక్షేమంగా ఉంటాడు.

యోగవిద్యకున్న అమోఘ, క్రమానుగత సాఫల్యశక్తిగురించి ప్రస్తావిస్తూ కృష్ణుడు, దాన్ని శాస్త్రోక్తంగా సాధన చేసిన యోగిని ఈ విధంగా ప్రశంసిస్తాడు:

"శారీరక క్రమశిక్షణ సాధనచేసే తపస్వుల కన్న గొప్పవాడు యోగి; జ్ఞాన మార్గాన్నికాని, కర్మమార్గాన్ని కాని అనుసరించే వాళ్ళకన్న కూడా గొప్పవాడు; కాబట్టి, ఓ శిష్యా! అర్జునా! నువ్వు యోగివి అవు!"*

---

* [ తపస్విభ్యోధికో యోగీ జ్ఞానిభ్యోపి మతోధికః
కర్మభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున.] - భగవద్గీత VI 46

శ్వాసించకపోవడంవల్ల శరీరంమీదా మనస్సు మీదా పడే అసాధారణమైన నూతన శక్తి దాయకమైన ప్రభావాల్ని కనిపెట్టడం, ఆధునిక విజ్ఞానశాస్త్రం ఇప్పుడిప్పుడే ప్రారంభిస్తోంది. న్యూయార్కులో ఉన్న కాలేజ్ ఆఫ్ ఫిజీషియన్స్ అండ్ సర్జన్స్‌లో పనిచేసే డా॥ అల్విన్ ఎల్. బరాచ్ శ్వాసకోశాలకు స్థానికంగా విశ్రాంతినిచ్చే వైద్య పద్ధతి ఒకటి రూపొందించాడు; దీనివల్ల క్షయరోగ పీడితులు చాలామందికి ఆరోగ్యం చేకూరుతోంది. ఊపిరి ఒత్తిడిని సరిసమానం చేసే గది (ఈక్వలైజింగ్ ప్రెషర్ ఛాంబర్)ని ఉపయోగించడంవల్ల రోగి ఊపిరి తీసుకోడం

భగవద్గీతలో పదేపదే ప్రశంసిస్తూ వచ్చిన నిజమైన "అగ్ని కార్యం" క్రియా యోగమే. యోగి మానవ సంబంధమైన తన అభిలాషల్ని అసదృశుడైన దేవుడికి అర్పిస్తూ అద్వైతహోమాగ్నిలో హవనం చేస్తాడు. భూత, వర్తమానవాంఛలన్నీ దివ్య ప్రేమాగ్నిలో హుతమయే నిజమైన, యోగ సంబంధమైన అగ్నికార్యం ఇదే. ఆ పరమాగ్ని జ్వాల మానవోన్మాద హవిస్సు నంతనీ అందుకొంటుంది; కల్మషక్షాళనం జరిగి, మానవుడు పరిశుద్ధుడవుతాడు. ఆలంకారికంగా చెప్పాలంటే ఎముకలు కోరిక కండ నుంచి విడివడి, కర్మ అనే అస్థిపంజరం సూక్ష్మక్రిమినాశకు డైన జ్ఞాన సూర్యుడి కిరణాలతో క్షాళితమయి, మానవుడి ముందు దేవుడి ముందు కూడా నిరపరాధియై, మనిషి చివరికి పరిశుద్ధుడవుతాడు.

---

ఆపెయ్యగలుగుతున్నాడు. 1947 ఫిబ్రవరి 1తేదీ నాటి 'న్యూయార్క్ టైమ్స్' పత్రికలో, డా॥ బరాచ్ చెప్పినది ఇలా పేర్కొన్నారు : "శ్వాస ఆగిపోవడంవల్ల కేంద్ర నాడీవ్యవస్థ మీద కలిగే ప్రభావం చాలా ఆసక్తికరమైనది శరీరం చివరి భాగాల్లో ఉండే స్వయంచాలకమైన కండరాల్ని కదపాలన్న కోరిక చాలా తగ్గిపోతుంది. చేతులు కదపకుండాను, భంగిమ మార్చకుండాను కూడా రోగి, గంటల తరబడి ఆ గదిలో పడుకొని ఉండవచ్చు. స్వయంప్రేరితమైన శ్వాసక్రియ ఆగిపోయినప్పుడు రోగికి, పొగ తాగాలన్న కోరిక మాయమవుతుంది రోజుకు రెండేసి పెట్టెల సిగరెట్లు కాల్చే అలవాటున్న వాళ్ళకు కూడా ఆ కోరిక పుట్టదు. అనేక సందర్భాల్లో అటువంటి స్థితిలో కలిగే విశ్రాంతి ఏ విధంగా ఉంటుందంటే, రోగికి మనస్సును రంజింపజేసేవి ఏవీ అవసరం కావు. ఈ వైద్యం విలువను బహిరంగంగా రూఢిచేస్తూ డా॥ బరాచ్, 1951లో ఇలా అన్నాడు, "ఇది ఊపిరితిత్తులకు మాత్రమే కాక, శరీరమంతకూ విశ్రాంతి ఇస్తుంది మనస్సు విషయంలో ఇది మరీ స్పష్టం. మాట వరసకి, గుండె చేసే పనిలో మూడోవంతు తగ్గిపోతుంది రోగులు ఆందోళన పడడం మానేస్తారు. ఎవరికీ విసుగు పుట్టదు "

ఈ యథార్థాల్ని బట్టి యోగులకు, మానసికంగాగాని శారీరకంగాగాని నిర్విరామ కార్య కలాపాలు జరపాలన్న అభిలాషలేకుండా సుదీర్ఘకాలాలు నిశ్చలంగా కూర్చోడం ఎలా సాధ్యమవు తుందో గ్రహించడం మొదలు పెడతారు. అటువంటి ప్రశాంత స్థితిలో మాత్రమే ఆత్మ తిరిగి దేవుడి దగ్గరికి వెళ్ళేదారి కనుక్కుంటుంది శ్వాసించకపోవడంవల్ల నిర్దిష్టమైన కొన్ని లాభాలు పొందడానికి, మామూలు మనిషికయితే ఈక్వలైజింగ్ ప్రెషర్ ఛాంబర్ తప్పకుండా ఉండవలసిన అవసరం ఉన్నప్పటికీ, యోగికి మాత్రం, శారీరకంగానూ మానసికంగానూ ఆత్మజ్ఞానపరంగానూ లాభాలు పొందడానికి క్రియాయోగం తప్ప మరేమీ అక్కరలేదు.

అధ్యాయం : 27

# రాంచీలో యోగవిద్యాలయ స్థాపన

"సంస్థాపరమైన పని అంటే నీకు కిట్టదేం?"

గురుదేవుల ప్రశ్న నన్ను కొద్దిగా చకితుణ్ణి చేసింది. సంస్థలనేవి "కందిరీగల పుట్టలు" అని ఆ రోజుల్లో నాకు దృఢమైన విశ్వాసం ఉండేదన్న సంగతి నిజమే.

"అది కేవలం, మెప్పుకు నోచుకోని శ్రమండి!" అన్నాను, సమాధానంగా. "నాయకుడు ఏ పని చేసినా, చెయ్యకపోయినా కూడా విమర్శకు గురి అవుతూ ఉంటాడు."

"దివ్యమైన 'పనీర్' (జున్ను) అంతా నీ కొక్కడికే దక్కాలనుకుంటున్నావా?" మా గురుదేవుల ఎదురు సవాలుకు వాడిచూపు ఒకటి తోడయింది. "ఉదార హృదయులైన గురువుల పరంపర ఒకటి, తమ జ్ఞానాన్ని ఇతరులకు అందించాలని సంకల్పించి ఉండకపోతే, నువ్వుకాని మరొకరుకాని, యోగం ద్వారా దైవానుసంధానం సాధించగలరా?" అంటూ ఇంకా ఇలా అన్నారు : "దేవుడు తేనె అయితే సంస్థలు తేనెపట్లు; రెండూ అవసరమే. 'ఆత్మ' లేనిదే ఏ 'రూప'మైనా వ్యర్థమేననుకో; అయినా నువ్వు, ఆధ్యాత్మికామృతంతో నిండి ఉండే చురుకయిన తేనెపట్లు ఎందుకు ఏర్పాటు చెయ్యగూడదు?"

ఆయన సలహా నన్ను గాఢంగా కదిలించింది. నేను పైకేమీ జవాబు చెప్పలేదు. కాని ఒక దృఢమైన నిశ్చయం నా మనస్సులో ఏర్పడింది : మా గురుదేవుల పాద సన్నిధిలో నేను తెలుసుకున్న ముక్తిప్రదమైన సత్యాల్ని నేను, నా శక్తిమేరకు, తోటివాళ్ళకు తెలియజెబుతాను. భగవంతుణ్ణి ఇలా ప్రార్థించాను:

"ఈశ్వరా, నా భక్తి గర్భగుడిలో నీ ప్రేమను ఎప్పటికీ ప్రకాశించనియ్యి. అన్ని హృదయాల్లోనూ నీ ప్రేమను నేను మేల్కొల్పగలిగేలా చెయ్యి!"

ఇదివరలో ఒకసారి, నేను సన్యాసం తీసుకోకముందు, శ్రీయుక్తేశ్వర్‌గారు

నే నెన్నడూ ఆశించని విధంగా వ్యాఖ్యానించారు:

"నీ ముసలితనంలో, భార్య సాంగత్యంలేని లోటు ఎంత ఉంటుందో నీకు" అన్నారాయన. "తన భార్యాబిడ్డల్ని పోషించడానికి, ఉపయోగపడే పనిలో ఉన్న వాడు దేవుడి దృష్టిలో, మెచ్చుకోదగ్గ పాత్ర నిర్వహిస్తున్నట్టేనని ఒప్పుకుంటావా?"

ఆ మాటలకు నేను భయకంపితుణ్ణి అయి, "గురుదేవా, ఈ జన్మలో నాకున్న కోరికల్లా ఆ విశ్వప్రియుడి కోసమేనని మీకు తెలుసు," అంటూ ఆక్షేపణ తెలిపాను.

గురుదేవులు వినోదంగా నవ్వారు; దాన్నిబట్టి ఆయన ఆ మాటలు కేవలం నన్ను పరీక్షించడానికే అన్నారని గ్రహించాను.

"ఇదుగో, మామూలు సంసార విధుల్ని విడిచిపెట్టేవాడు, అంతకన్న బాగా పెద్ద సంసారానికి సంబంధించిన ఏదో ఒక రకం బాధ్యత చేబడితేనే తప్ప, తను చేసింది న్యాయమని నిరూపించుకోలేడు. ఈ మాట గుర్తుంచుకో," అని చెప్పారు మెల్లిగా.

పిల్లలకు సరయిన విద్య నేర్పాలన్న ఆదర్శం నా కెప్పుడూ చాలా ప్రియమైన విషయమే. కేవలం శరీరాన్నీ బుద్ధినీ అభివృద్ధి చెయ్యడానికి ఉద్దేశించిన మామూలు విద్యాబోధనకు వస్తున్న శుష్క ఫలితాల్ని నేను స్పష్టంగా చూస్తూనే వచ్చాను. నైతిక, ఆధ్యాత్మిక విలువల్ని గ్రహించలేకపోయినట్లయితే ఎవ్వరూ సంతోషాన్ని పొందలేరు; అయినప్పటికీ నియత విద్యా ప్రణాళికల్లో అవి లేవు. కుర్రవాళ్ళ సంపూర్ణ మానవత్వ వికాసానికి తోడ్పడే విద్యాలయం ఒకటి స్థాపించాలని నేను నిర్ణయించుకున్నాను. ఆ ఆశయ సాధనకు నేను చేసిన మొదటి పని, బెంగాలు గ్రామీణ ప్రాంతంలో దిహికా అనే చోట ఏడుగురు పిల్లలతో విద్యాలయం ప్రారంభించడం.

మరో ఏడాదికి, 1918లో, కాసిం బజార్ మహారాజా సర్ మణీంద్రచంద్ర నందిగారి చలవవల్ల, శీఘ్రవృద్ధి చెందుతున్న మా విద్యార్థి బృందాన్ని రాంచీకి తరలించగలిగాను. కలకత్తాకు సుమారు రెండు వందల మైళ్ళ దూరంలో, బీహారులో ఉన్న ఈ పట్నం, భారతదేశంలోని అత్యంత ఆరోగ్యప్రదమైన వాతావరణం గల ప్రదేశాల్లో ఒకటి. రాంచీలో ఉన్న కాసిం బజార్ రాజభవనం, కొత్త విద్యాలయానికి ప్రధాన భవనం అయింది; ఈ విద్యాలయానికి నేను 'యోగదా సత్సంగ బ్రహ్మచర్య విద్యాలయం'* అని పేరు పెట్టాను.

---

* విద్యాలయం అంటే బడి. బ్రహ్మచర్యం అన్నదిక్కడ, వైదిక ప్రణాళికలో మానవ జీవితానికి నిర్ణయించిన నాలుగు దశల్లోనూ ఒకటి. ఆ నాలుగూ ఇవి : (1) బ్రహ్మచారిదశ,

ప్రాథమిక, ఉన్నత పాఠశాల తరగతులు రెంటికీ నే నొక కార్యక్రమం ఏర్పరిచాను. అందులో వ్యవసాయ, పారిశ్రామిక, వాణిజ్య విషయాలూ ఇతర విద్యావిషయాలూ కూడా చేర్చడం జరిగింది. ఋషుల విద్యాబోధనాశయాల్ని అనుసరించి, తరగతి బోధన చాలావరకు ఆరుబయటే జరిగే ఏర్పాటు చేశాను (ఋషుల వన్యాశ్రమాలు, భారతీయ బాలకులకు లౌకిక, ఆధ్యాత్మిక విద్యలు రెండూ బోధించే ప్రాచీన విద్యా పీఠాలు).

రాంచీ విద్యార్థులకు ధ్యానయోగ పద్ధతీ, ఆరోగ్యానికీ శారీరక వికాసానికీ తోడ్పడే అద్వితీయ "యోగదా" విధానమూ నేర్పడం జరుగుతోంది; ఈ యోగదా అభ్యాసాల నియమాల్ని నేను 1916లో కనిపెట్టాను.

మనిషి శరీరం విద్యుద్ఘటం (ఎలక్ట్రిక్ బ్యాటరి) లాంటిదని గ్రహించి నేను, మానవ సంకల్పమనే ప్రత్యక్ష సాధనం ద్వారా దాన్ని మళ్ళీ శక్తితో నింపవచ్చునని తార్కికంగా వివేచించాను. సంకల్పించడమన్నది లేకుండా ఏ రకమైన చర్యా సాధ్యం కాదు కనక, మానవుడు, భారమైన ఉపకరణంతోకాని యాంత్రికమైన వ్యాయామాభ్యాసాలతోకాని కాకుండా తన బలాన్ని తిరిగి పెంపొందించుకోడానికి మూలచాలకమైన సంకల్ప శక్తిని వినియోగించుకోవచ్చు. తేలికయిన "యోగదా" పద్ధతుల ద్వారా అపరిమితంగా సరఫరా అయే విశ్వశక్తితో తమలో (మెడుల్లా అబ్లాంగేటాలో కేంద్రీకరించి) ఉన్న ప్రాణశక్తిని సంకల్పపూర్వకంగా, తక్షణమే నింపుకోవచ్చు.

రాంచీలో విద్యార్థులు "యోగదా" శిక్షణకు చక్కగా సుముఖత చూపారు; ప్రాణశక్తిని శరీరంలో ఒక భాగం నుంచి మరో భాగానికి మార్చడానికీ, కష్టసాధ్యమైన ఆసనాల్లో సుస్థిరంగా కూర్చోడానికీ కావలసిన అసాధారణ సామర్థ్యం పెంపొందించుకున్నారు. శక్తి సంపన్నులయిన అనేకమంది వయోజనులు కూడా తమకు సాటిరానంతగా, శారీరక బలానికీ సహనశక్తికీ సంబంధించిన అసాధారణ కృత్యాలు ప్రదర్శించారు.

---

(2) లౌకిక బాధ్యతలు వహించే గృహస్థ దశ; (3) వానప్రస్థ దశ, (4) లౌకిక బంధాలు ఏమీ లేకుండా వనవాసం చేస్తూకాని, సంచారం చేస్తూకాని గడిపే సన్యాసి దశ ఆదర్శవంతమైన ఈ జీవిత ప్రణాళికను ఆధునిక భారతదేశంలో విరివిగా పాటించనప్పటికీ, ఇప్పటికీ దీన్ని నిష్ఠగా పాటించేవాళ్ళు చాలామందే ఉన్నారు. ఈ నాలుగు ఆశ్రమాల్నీ నిష్ఠగా, ఒక గురువు యావజ్జీవిత మార్గదర్శకత్వం కింద గడుపుతూ ఉంటారు

రాంచీలో ఉన్న యోగదా సత్సంగ విద్యాలయాన్ని గురించి మరికొంత సమాచారం 40 అధ్యాయంలో ఇవ్వడం జరిగింది.

మా చిన్నతమ్ముడు విష్ణుచరణ్ ఘోష్* రాంచీ విద్యాలయంలో చేరాడు ఉత్తరోత్తరా అతను, ప్రసిద్ధ వ్యాయామశాస్త్రజ్ఞుడయాడు. అతనూ అతని శిష్యుల్లో ఒకడూ కలిసి 1938 - 9 లో, పాశ్చాత్య దేశాల్లో పర్యటిస్తూ బలాన్నీ కండరాల నియంత్రణనూ నిరూపించే ప్రదర్శనలు ఇచ్చారు. న్యూయార్క్‌లోని కొలంబియా విశ్వవిద్యాలయం, అమెరికా యూరప్‌లలోని ఇతర విశ్వవిద్యాలయాల ఆచార్యులు శరీరంమీద మనస్సుకు గల ప్రాబల్యాన్ని నిరూపించే, వీరి ప్రదర్శనలు చూసి చకితులయారు.

రాంచీలో మొదటి సంవత్సరం ముగిసేనాటికి, విద్యాలయంలో చేరడానికి వచ్చినవాళ్ళ దరఖాస్తుల సంఖ్య రెండువేలకు పెరిగింది. కాని అప్పటికి కేవలం ఆశ్రమ విద్యాలయంగా మాత్రమే ఉన్న ఆ పాఠశాల వందమందికే వసతి కల్పించ గలిగింది. పగటిపూట వచ్చే విద్యార్థులకు కూడా త్వరలోనే బోధనకు ఏర్పాట్లు చేయడం జరిగింది.

విద్యాలయంలో నేను, చిన్న పిల్లలకు తల్లిగానూ తండ్రిగానూ కూడా వ్యవహరించవలసి వచ్చేది; దాంతోబాటు వ్యవస్థాపరమైన ఇబ్బందులకు కూడా చాలావాటికి తట్టుకోవలసి వచ్చేది. క్రీస్తు మాటలు నాకు తరచుగా గుర్తొస్తూ ఉండేవి. "నా కోసమూ సువార్త కోసమూ ఇంటిని కాని, అన్నదమ్ముల్ని కాని, అక్కచెల్లెళ్ళని కాని, తండ్రినికాని, తల్లిని కాని, భార్యనుకాని, పిల్లల్నికాని, భూముల్ని కాని విడిచిపెట్టినవాడు ఈ లోకంలో హింసలకు గురికావడంతో బాటు, ఇప్పుడు నూరంతలుగా ఇండ్లను, అన్నదమ్ముల్ని, అక్కచెల్లెళ్ళని, తల్లుల్ని, పిల్లల్ని, భూముల్ని, పరలోకంలో నిత్యజీవితాన్ని పొందనివాడూ లేడన్నది నిశ్చయం."†

ఈ మాటలకు శ్రీయుక్తేశ్వర్‌గారు ఇలా వ్యాఖ్యానం చెప్పారు: "సమిష్టిగా సమాజం ("ఇప్పుడు నూరంతలుగా ఇండ్లను, అన్నదమ్ముల్ని") పట్ల గురుతరమైన బాధ్యత వహించడంకోసం, పెళ్ళి కుటుంబపోషణా వంటి మామూలు జీవితానుభవాల్ని వదులుకొనే భక్తుడు, అపార్థం చేసుకునే తత్త్వంగల ప్రపంచం పెట్టే హింసలకు తరచుగా గురి అయ్యే అవకాశం గల పని చేస్తుంటాడు. అటువంటి గురుతర బాధ్యతల స్వీకారం వల్ల భక్తుడు స్వార్థాన్ని జయించి దైవకృపకు పాత్రుడవుతాడు."

ఒకనాడు మా నాన్నగారు, వాత్సల్యంతో ఆశీర్వదించి వెళ్ళడానికి రాంచీకి వచ్చారు; బెంగాల్ - నాగపూర్ రైల్వేలో ఆయన ఇప్పించదలచిన ఉద్యోగాన్ని

* విష్ణు చరణ్ ఘోష్, 1970 జూలై 9న కలకత్తాలో చనిపోయారు.

† మార్కు 10 29-30 (బైబిలు).

నేను తిరస్కరించి ఆయన్ని నొప్పించినందువల్ల, చాలా కాలంగా ఆ ఆశీర్వాదం నాకు అందకుండా ఉంచారు.

"అబ్బాయి! నువ్వెంచుకున్న నీ జీవితమార్గానికి నే నిప్పుడు సమాధాన పడ్డాను. హాయిగా, ఉత్సాహంగా ఉన్న కుర్రవాళ్ళ మధ్య నిన్ను చూస్తుంటే నాకు సంతోషం కలుగుతోంది. నిర్జీవమైన రైల్వే టైమ్ టేబుళ్ళ అంకెల్లోకన్న ఇక్కడే ఉంది నీ అసలయిన స్థానం." నా వెంట ఉన్న పన్నెండుమంది పిల్లలవేపు చెయ్యి ఊపారాయన. "నాకున్న వాళ్ళు ఎనమండుగురే పిల్లలు; అయినా నీ పరిస్థితి నే నర్థం చేసుకోగలను!" అన్నారాయన, మిలమిల మెరిసే కళ్ళతో.

మాకున్న ఇరవయి ఎకరాల మంచి సారవంతమైన భూమిలో విద్యార్థులూ ఉపాధ్యాయులూ నేనూ రోజూ కొంతసేపు చొప్పున తోటపని, ఆరుబయట ఇతర పనులు చేస్తూ ఆనందించేవాళ్ళం. మాకు పెంపుడు జంతువులు చాలా ఉండేవి; ఒక లేడి పిల్లతో సహా. మా పిల్లలు దాన్ని ముద్దు చేశారు. నేను కూడా అదంటే ఎంత మనసుపడేవాణ్ణంటే, అది నా గదిలోనే పడుక్కోడానికి అనుమతిం చాను. తూరుపురేక లారే వేళ ఆ చిట్టిపాప, పొద్దుటి లాలింపుకోసం నా పక్కదగ్గిరికి గునగునా నడుస్తూ వచ్చేది.

ఒకనాడు, ఏదో పనిమీద రాంచీ ఊళ్ళోకి వెళ్ళవలసి వచ్చి, మామూలు వేళకంటె ముందే లేడిపిల్లకి పాలు పట్టాను. నేను మళ్ళీ తిరిగి వచ్చేదాకా దానికి ఏమీ పట్టవద్దని కుర్రవాళ్ళకి చెప్పాను. కాని ఒక కుర్రవాడు, నా మాట పట్టించు కోకుండా, దానికి బోలెడు పాలు పట్టేశాడు. సాయంత్రం నేను తిరిగి వచ్చేసరికి దుర్వార్త వినవచ్చింది: "పాలు ఎక్కువ పట్టడంవల్ల లేడిపిల్ల ప్రాణం పోయే స్థితిలో ఉందని."

కళ్ళలో నీళ్ళు తిరుగుతూ ఉండగా, మృతప్రాయమై ఉన్న ఆ లేడిపిల్లని ఒళ్ళో పెట్టుకుని, దాని ప్రాణం కాపాడమని దీనంగా దేవుణ్ణి ప్రార్థించాను. కొన్ని గంటల తరవాత ఆ చిట్టిలేడి కళ్ళు విప్పింది; లేచి నించుని నీరసంగా అడుగులు వేసింది. విద్యాలయమంతా ఆనందంతో పరవళ్ళు తొక్కింది.

కాని ఆనాటి రాత్రి గంభీరమైన గుణపాఠం ఒకటి తెలియ వచ్చింది, నే నెన్నడూ మరిచిపోలేనిదది. రాత్రి రెండు గంటలవరకు, లేడిపిల్ల దగ్గరే మెలకువగా కూర్చున్నాను; ఆ తరవాత నిద్ర పట్టేసింది. లేడిపిల్ల కలలో కనిపించి నాతో మాట్లాడింది:

"నన్ను పట్టి ఉంచేస్తున్నారు; నన్ను పోనివ్వండి; నన్ను పోనివ్వండి!"

"సరే," అన్నాను కలలో.

వెంటనే మేలుకున్నాను; "ఏమర్రోయ్ పిల్లలూ! లేడి చచ్చిపోతోంది!" అని అరిచాను. పిల్లలు నా దగ్గరికి ఉరుక్కొచ్చారు.

గదిలో, నేను లేడిపిల్లను పడుకోబెట్టిన చోటికి పరిగెత్తాను. అది లేవడానికి చిట్టచివరి ప్రయత్నం ఒకటి చేసి, నా వేపు తూలి, ప్రాణం విడిచి నా కాళ్ళ దగ్గర కూలింది.

జంతువుల భవితవ్యాల్ని నడిపించి క్రమబద్ధం చేసే 'సమస్త కర్మ' ప్రకారం ఆ లేడి జీవితం అంతటితో ముగిసిపోయింది; ఉత్తమ జన్మకు పురోగమించ డానికి అది సిద్ధంగా ఉంది. నా గాఢమైన అనుబంధంవల్లా - అది స్వార్థంలో కూడిందని తరవాత గ్రహించాను - ఎంతో శ్రద్ధగా చేసిన ప్రార్థనలవల్లా దాన్ని జంతురూప పరిమితుల్లో ఆపి ఉంచగలిగాను; కాని దాని ఆత్మ, విడుదల కోసం పెనుగులాడుతోంది. ఆ లేడి ఆత్మ, ప్రేమతో కూడిన నా అనుమతి లేకుండా పోనూపోదు, పోనూలేదు కనక, కలలో నన్ను బతిమాలుకుంది. నేను ఒప్పుకోగానే వెళ్ళిపోయింది.

నాకు విచారమంతా తొలగిపోయింది. తన బిడ్డలు, సృష్టిలో ప్రతిదాన్నీ తనలోని ఒక భాగంగానే ఎంచి ప్రేమించాలనీ, చావు అన్నిటినీ అంతంచేస్తుందనే మాయలో పడి బాధపడగూడదనీ భగవంతుడు కోరతాడని నేను మరొకసారి గ్రహించాను. అజ్ఞాని అయిన మనుష్యుడు, తన ప్రియమిత్రుల్ని శాశ్వతంగా మరుగుపరుస్తున్నట్టుగా బాహ్యదృష్టికి గోచరించే అలంఘ్యమయిన మరణ కుడ్యాన్ని మాత్రమే దర్శిస్తాడు. కాని ఇతరుల్ని ఈశ్వరుడి అభివ్యక్తులుగా ప్రేమించే నిస్సంగుడు, తన ప్రేమ పాత్రులు మరణించినప్పుడు వాళ్ళు క్షణ కాలం తెప్పరిల్ల డానికి వీలుగా ఈశ్వరానందం పొందడానికి మాత్రమే తిరిగి వెళ్ళారని అర్థం చేసుకుంటాడు.

రాంచీ విద్యాలయం, చిన్నగా నిరాడంబరంగా మొదలయినదల్లా ఇప్పుడు బీహారులోనూ బెంగాలులోనూ సుప్రసిద్ధమైన సంస్థగా అభివృద్ధి చెందింది విద్యాలయ శాఖలనేకం, ఋషుల విద్యాబోధనాదర్శాల్ని పరిరక్షించడంలో ఆనందం పొందేవాళ్ళు అందించిన స్వచ్ఛంద విరాళాలతో పనిచేస్తున్నాయి. మిద్నపూర్‌లోనూ లక్ష్మణపూర్‌లోనూ శాఖావిద్యాలయాలు స్థాపించడం జరిగింది; అవి బాగా వర్ధిల్లుతున్నాయి.

రాంచీ కేంద్రకార్యస్థానం, స్థానిక పేదవాళ్ళకు ఉచితంగా వైద్యులసేవలు, మందులు ఇవ్వడం కోసం వైద్య విభాగం ఒకటి నిర్వహిస్తోంది. ఆటల పోటీల్లో కూడా విద్యాలయం పేరు తెచ్చుకుంది. ఇక విద్యారంగంలో, చాలామంది రాంచీ పట్టభద్రులు, ఆ తరవాతి విశ్వవిద్యాలయ జీవితంలో తమ ప్రతిభ నిరూపించు కున్నారు.

గత మూడు దశాబ్దుల్లోనూ తూర్పుదేశాల నుంచీ పడమటిదేశాల నుంచీ కూడా ప్రఖ్యాత స్త్రీపురుషులు అనేకమంది వచ్చి ఈ విద్యాలయాన్ని సందర్శించడం దీనికొక గౌరవం. కాశీలో ఉండే "రెండు శరీరాల సాధువు" స్వామి ప్రణవానంద గారు 1918లో రాంచీ వచ్చి కొన్ని రోజులు ఉన్నారు. చెట్లకింద నడిచే తరగతుల కమనీయ దృశ్యాన్ని తిలకిస్తున్నప్పుడూ, సంజెవేళ చిన్నచిన్న కుర్రవాళ్ళు యోగ ధ్యానంలో నిశ్చలంగా కూర్చుని ఉండడం గమనించి నప్పుడూ ఆయన గాఢంగా చలించారు.

"కుర్రవాళ్ళకు సరయిన శిక్షణ ఇవ్వడానికి లాహిరీ మహాశయులు ఉద్దేశించిన ఆదర్శాల్ని ఈ సంస్థలో అమలుజరపడం చూస్తుంటే, నా హృదయంలో ఆనందం కలుగుతోంది. దీనికి మా గురుదేవుల ఆశీస్సులు ఉండుగాక!" అన్నారాయన.

నా పక్కనే కూర్చున్న ఒక చిన్న కుర్రవాడు, ఆ మహాయోగిని ఒక ప్రశ్న అడగడానికి సాహసించాడు.

"అయ్యా, నేను సన్యాసి నవుతానా? నా జీవితం దేవుడికే అంకితమవు తుందా?" అని అడిగాడు.

స్వామి ప్రణవానందగారు మృదువుగా చిరునవ్వు చిందించినా, ఆయన కళ్ళు భవిష్యత్తులోకి గుచ్చిగుచ్చి చూస్తున్నాయి.

"బాబూ, నువ్వు పెద్ద అయేసరికి, నీ కోసం ఒక చక్కని కన్నెపిల్ల ఎదురు చూస్తూ ఉంటుంది." (ఆ అబ్బాయి సన్యాసం తీసుకోవాలని కొన్నేళ్ళపాటు పథకం వేసుకుని, చివరికి పెళ్ళి చేసేసుకున్నాడు).

స్వామి ప్రణవానందగారు రాంచీ సందర్శించిన కొంత కాలానికి కలకత్తాలో ఆయన తాత్కాలికంగా బసచేసిన ఇంటికి, మా నాన్నగారితో కలిసి నేను కూడా వెళ్ళాను. "తరవాత, మీ నాన్నగారితోబాటు చూస్తాను నిన్ను." అంటూ ప్రణవానందగారు చాలా ఏళ్ళ కిందట చెప్పిన జోస్యం చటుక్కున నా మనస్సుకు స్ఫురించింది.

నాన్నగారు స్వాములవారి గదిలో అడుగుపెట్టగానే, ఆ మహాయోగి తమ ఆసనం మీంచి లేచి, ఆయన్ని ప్రేమపూర్వకమైన గౌరవంతో ఆలింగనం చేసుకున్నారు.

"భగవతిగారూ, మీ గురించి మీరు ఏం చేస్తున్నారు? మీ అబ్బాయి అనంతంలోకి వేగంగా దూసుకుపోతూండడం గమనించలేదా?" అంటూ ప్రణవానంద గారు నన్ను మా నాన్నగారి ఎదుట మెచ్చుకుంటూ ఉంటే నాకు సిగ్గు వేసింది. ఆయన ఇంకా ఇలా అన్నారు, " 'బనత్, బనత్, బన్‌జాయ్'* అంటూ మన గురుదేవులు ఎంత తరచుగా అంటూండేవారో గుర్తు చేసుకోండి. కనక, క్రియాయోగ సాధన ఆపకుండా కొనసాగించి తొందరగా దివ్యసన్నిధికి చేరండి."

నేను మొదటిసారి కాశీ వెళ్ళి దర్శించినప్పుడు ఎంతో ఆరోగ్యంగా, బలంగా కనిపించిన ప్రణవానందగారి శరీరంలో ఇప్పుడు వృద్ధాప్యం స్పష్టంగా కనబడుతోంది. అయితే ఆయన, ఆసనం వేసుకొని కూర్చున్నప్పుడు మాత్రం వెన్నుబద్ద చక్కగా నిటారుగా నిలబడి ఉంటున్నది.

నేను సూటిగా ఆయన కళ్ళలోకి చూస్తూ ఇలా అడిగాను; "స్వామీజీ, వయస్సు పైబడుతున్నట్టు మీకు అనిపిస్తోందో లేదో చెప్పండి; శరీరం నీరసపడుతూంటే మీ ఈశ్వరానుభూతుల్లో ఏమయినా తగ్గుదల కనిపిస్తోందా?"

ఆయన చిద్విలాసంగా చిరునవ్వు చిందించారు. "ఆ పరమ ప్రియతముడు, వెనకటికన్న ఇప్పుడే నాకు బాగా చేరువ అయాడు." ఆయన పరిపూర్ణ విశ్వాసం నా మనస్సునూ ఆత్మనూ ముంచెత్తివేసింది. ఆయన ఇంకా ఇలా అన్నారు· "నేనిప్పటికీ రెండు పెన్షన్లు అనుభవిస్తున్నాను - ఒకటి, ఇక్కడున్న భగవతిగారి ద్వారా వచ్చింది; రెండోది పై నుంచి వచ్చింది." ఆకాశంవేపు వేలు చూపిస్తూ ఆ సాధువు, కొద్దిసేపు ఆనంద సమాధిలో స్తంభీభూతులయారు; ఆయన ముఖం దివ్యతేజస్సుతో ప్రకాశించింది. నా ప్రశ్నకు సమృద్ధిగా లభించిన సమాధానమది!

ప్రణవానందగారి గదిలో చాలా మొక్కలూ విత్తనాల పొట్లాలూ ఉండడం చూసి, అవి ఎందుకోసమని అడిగాను.

"నేను కాశీనుంచి శాశ్వతంగా వచ్చేశాను," అన్నారాయన. "ఇప్పుడు

---

* లాహిరీ మహాశయులకు ప్రియమైన వ్యాఖ్యల్లో ఇది ఒకటి తమ శిష్యుల్ని, ధ్యానంలో పట్టుదలతో కృషిచెయ్యమని ప్రోత్సహించడానికి ఆయన ఇలా అంటూండేవారు. దీని అర్థం ఏమిటంటే : " చేస్తూ, చేస్తూ, ఒకరోజు 'అయిపోయింది." దీని భావం తీసుకుని ఇలా స్వేచ్ఛానువాదం చేసుకోవచ్చు : "శ్రమిస్తూ, శ్రమిస్తూ, చూడు! అదిగో! దివ్య లక్ష్యం"

హిమాలయాలకి ప్రయాణంలో ఉన్నాను. నా శిష్యుల కోసం అక్కడొక ఆశ్రమం ఏర్పాటు చేస్తాను. ఈ విత్తనాలతో పాలకూరా మరికొన్ని కూరగాయలూ పండుతాయి. నా ప్రియశిష్యులు, ఆనందమయమైన దైవయోగంలో కాలం గడుపుతూ సాదాగా జీవిస్తారు. ఇంకేమీ అక్కర్లేదు."

మా నాన్నగారు తమ సహాధ్యాయిని, మళ్ళీ కలకత్తా ఎప్పుడు వస్తారని అడిగారు.

"ఇక రాను," అని జవాబిచ్చారు ఆ సాధువు. "నాకు ప్రియమైన కాశీని శాశ్వతంగా విడిచిపెట్టి నేను హిమాలయాలకు వెళ్ళే సంవత్సరం ఇదేననీ, అక్కడే నేను దేహత్యాగం చేస్తాననీ లాహిరీ మహాశయులు చెప్పారు."

ఆయన మాటలకు నా కళ్ళలో నీళ్ళు నిండాయి; కాని ఆ స్వాములవారు ప్రశాంతంగా చిరునవ్వు నవ్వారు. జగన్మాత ఒడిలో సురక్షితంగా కూర్చున్న చిన్న దివ్యశిశువును తలపించారాయన. ఒక మహాయోగి సంపూర్ణ స్వాధీనంలో ఉన్న సర్వోత్తమ ఆధ్యాత్మిక శక్తుల మీద వయోభారం దుష్ప్రభావమేమీ ప్రసరించదు. సంకల్పానుసారంగా ఆయన కాయకల్పం చేసుకోగల స్థితిలో ఉంటారు కాని ఒక్కొక్కప్పుడు ముసలితనం రాకుండా అరికట్టడానికి పూనుకోకపోవడం కద్దు. కర్మఫలభోగంలో మిగిలిపోయిన స్వల్పాంశాల్ని మరో కొత్త జన్మలో అనుభవించే అవసరం లేకుండా చేసుకోడానికి, కాలం కలిసివచ్చే సాధనంగా ఇప్పటి దేహాన్నే ఉపయోగించుకుని, భౌతికస్థాయిలో కర్మను క్షయం కానిస్తారు.

ఆ తరవాత కొన్ని నెలలకి, సనందుడనే మా పాత స్నేహితుణ్ణి కలుసుకున్నాను; ప్రణవానందగారి సన్నిహిత శిష్యుల్లో ఒక డతను.

"మా పూజ్య గురుదేవులు వెళ్ళిపోయారు," అంటూ ఏడుస్తూ చెప్పాడు. "ఆయన ఋషీకేశం దగ్గర ఒక ఆశ్రమం స్థాపించి, మాకు ప్రీతిగా శిక్షణ ఇచ్చారు. మేము చక్కగా కుదుటబడి ఆయన సన్నిధిలో త్వరత్వరగా ఆధ్యాత్మిక ప్రగతి సాధిస్తున్న తరుణంలో ఒకనాడు ఋషీకేశం నుంచి పెద్ద జనసమూహాన్ని పిలిచి సంతర్పణ చెయ్యాలని తీర్మానించారు. అంత ఎక్కువమంది ఎందుకని నే నాయన్ని అడిగాను.

" 'ఇదే నా చివరి పండుగ వేడుక,' అన్నారాయన. ఆయన మాటల్లో అంతరార్థాలు నేను పూర్తిగా అర్థం చేసుకోలేదు.

భారీ ఎత్తున వంటలు చేయడానికి ప్రణవానందగారు సాయపడ్డారు. 2,000 మందికి సంతర్పణ చేశాం. సంతర్పణ ముగిసిన తరవాత ఆయన ఎత్తుగా

ఉన్న ఒక వేదిక మీద కూర్చుని అనంత పరబ్రహ్మాను గురించి ఉత్తేజకరమైన ఉపన్యాసం ఇచ్చారు. అది ముగిసిన తరవాత, అన్ని వేల మంది సమక్షంలో, ఆయన నావేపు తిరిగారు; నేను వేదికమీద ఆయన పక్కనే కూర్చున్నాను. అసాధారణ పటిమతో నాతో ఇలా అన్నారు :

" 'సనందన్, సిద్ధంగా ఉండు; ఈ చట్రాన్ని తన్నేస్తున్నాను.'*

"ఒక్క క్షణం స్తంభించిపోయి, 'గురుదేవా, ఆ పని చెయ్యకండి! దయచేసి, ఆ పని చెయ్యకండి!" అంటూ గట్టిగా అరిచాను. నా మాటలకి ఆశ్చర్యపోతూ జనం నిశ్శబ్దంగా ఉండిపోయారు. ప్రణవానందగారు నా వేపు చిరునవ్వు నవ్వారు కాని ఆయన కళ్ళు అప్పటికే శాశ్వత పరబ్రహ్మాను అవలోకిస్తున్నాయి.

" 'స్వార్థపరుడివి కాకు; నా కోసం దుఃఖించకు,' అన్నారాయన. ' నేను చాలాకాలంగా, సంతోషంగా మీ కందరికీ సేవచేస్తూ వచ్చాను; ఇప్పుడు దీనికి ఆనందించు; నాకు శుభం కలగాలని కోరుకో. నా విశ్వప్రేమమయుడి దగ్గరికి పోతున్నాను' అన్నారాయన. అని, ఇంకా నా చెవిలో గుసగుసలాడారు, 'త్వరలోనే మళ్ళీ పుడతాను. కొద్దికాలంపాటు అనంతానందాన్ని అనుభవించిన తరవాత భూమికి తిరిగి వచ్చి బాబాజీని† చేరతాను. నీకు త్వరలోనే తెలుస్తుంది.'

"ఆయన మళ్ళీ అరిచారు, 'సనందన్, ఇదుగో! రెండో క్రియా యోగం‡ ద్వారా చట్రాన్ని తన్నేస్తున్నాను."

"మా ముందు సముద్రంలా కనిపించే ముఖాలవైపు చూసి ఆశీర్వదించారు తరవాత, తమ దృష్టిని జ్ఞాననేత్రం వేపు లోపలికి సారించి నిశ్చలంగా అయారు ఆయన తన్మయస్థితిలో ధ్యానం చేస్తున్నారని విస్మిత జనసమూహం అనుకుంటూ

---

* అంటే శరీరాన్ని విడిచిపెట్టడం.

† లాహిరీ మహాశయుల గురువులు. ఇప్పటికీ జీవించి ఉన్నారు (33 అధ్యాయం చూడండి)

‡ యోగదా పద్ధతిలో క్రియాయోగంలో సాధనచేస్తూ, ఉన్నత తరమైన క్రియాయోగ ప్రక్రియలలో దీక్ష పొందినవారికి ప్రణవానందులు ప్రయోగించిన ప్రక్రియ మూడవ క్రియాయోగ దీక్షగా అవగతమవుతుంది. లాహిరీ మహాశయులు ప్రణవానందులకు దీక్ష ఇచ్చినప్పుడు, ఆయన రెండవక్రియగా ఆ యోగావతారుల దగ్గర్నించి దీక్ష పొందారు. ఈ క్రియ మీద ఆధిపత్యం సంపాదించిన సాధకుడు తన శరీరాన్ని సస్పృహగా ఏ సమయంలోనైనా విడిచిపెట్టడానికీ తిరిగి దానిలో ప్రవేశించడానికీ సమర్థుడయి ఉంటాడు. ఉన్నతస్థితినందిన యోగులు కడసారిగా శరీరాన్ని విడిచి పెట్టేటప్పుడు - వారికాక్షణం తప్పనిసరిగా ముందుగానే తెలుస్తుంది - ఈ క్రియా ప్రక్రియని ఉపయోగిస్తారు.

ఉండగా, అప్పటికే ఆయన, దేహపంజరాన్ని విడిచిపెట్టేశారు; తమ ఆత్మను విశాల విశ్వాంతరాళంలోకి దూకించేశారు. పద్మాసనంలో ఉన్న ఆయన శరీరాన్ని శిష్యులు తాకి చూశారు; కాని అప్పటికే ఒళ్ళు చల్ల బడింది. కొయ్యబారిన శరీరం మట్టుకే మిగిలింది; అద్దెకున్నవాడు అమరలోక తీరానికి పలాయనం చేశాడు.

సనందుడు చెప్పేది పూర్తి అవుతూంటే నేను అనుకున్నాను : "ఈ 'రెండు శరీరాల సాధువు'గారు జీవితంలోనే కాక మరణంలో కూడా నాటకీయత ప్రదర్శించారు! '

ప్రణవానందగారు మళ్ళీ ఎక్కడ పుడతారని అడిగాను.

"ఆ సమాచారాన్ని పవిత్ర రహస్యంగా పరిగణిస్తున్నాను," అని జవాబిచ్చాడు సనందుడు. " నే నది ఎవరికీ చెప్పగూడదు. బహుశా నువ్వు దాన్ని మరోరకంగా తెలుసుకోవచ్చు."

చాలా ఏళ్ళ తరవాత స్వామి కేశవానంద*గారి దగ్గర ఆ విషయం తెలుసుకున్నాను. ప్రణవానందగారు, చనిపోయిన కొన్నేళ్ళకి కొత్త దేహంతో జన్మించి హిమాలయాల్లో బదరీనారాయణకు వెళ్ళారని, అక్కడ మహావతార బాబాజీ సన్నిధిలో ఉండే సాధుబృందంలో కలిశారని తెలిసింది.

---

ప్రాణ సంబంధ నక్షత్ర మోక్ష 'ద్వారం' అయిన కూటస్థ ఆధ్యాత్మిక నేత్రం ద్వారా మహా యోగులు లోనికి బయటికి వస్తూ పోతూ ఉంటారు క్రీస్తు ఇలా అన్నాడు . "నేను ద్వారమును, నా ద్వారాలోనికివచ్చిన ఏ వ్యక్తి అయిననూ రక్షింపబడుతాడు, లోనికీ బయటికీ వెళ్తాడు, గ్రాసమును కనుగొంటాడు. దొంగ (మాయ) కేవలము దొంగిలించుటకు, చంపుటకు నాశనము చేయుటకు మాత్రమే వస్తాడు; నేను (కూటస్థ చైతన్యం) వారు జీవనము కలిగి యుండుటకునూ, దానిని అతి సమృద్ధిగా కలిగియుండుటకునూ వచ్చాను," (యోహాను 10 9-10, బైబిలు)

* నేను కేశవానందగారిని కలుసుకోడం గురించి పే. 505-06 ల్లో వివరించడం జరిగింది.

అధ్యాయం : 28

# కాశీ పునర్జన్మించడం, కమక్కోబడడం

"నీళ్ళలోకి దిగకండి. బకెట్లు ముంచుకుని స్నానాలుచేద్దాం."

నేను మా రాంచీ కుర్రవాళ్ళకు చెప్పిన మాటలివి; దగ్గరలో ఉన్న కొండకు వెళ్ళడానికి నాతోబాటు ఎనిమిదిమైళ్ళు నడుచుకుంటూ వచ్చారు వాళ్ళు. ఎదురుగా ఉన్న నీటి మడుగును చూస్తుంటే మమ్మల్ని రమ్మని పిలుస్తున్నట్లే ఉంది అది; కాని నా మనస్సులో దానిమీద ఒక రకం విరక్తి కలిగింది. చాలామంది పిల్లలు బకెట్లు ముంచుకోడం మొదలు పెట్టారు; కాని కొందరు కుర్రవాళ్ళు చల్లటినీళ్ళు కలిగిస్తున్న వ్యామోహానికి లోబడిపోయారు. వాళ్ళిలా నీళ్ళలో మునిగారో లేదో, పెద్దపెద్ద నీటిపాములు వాళ్ళ చుట్టూ అల్లల్లాడాయి. ఏం అరుపులు! ఏం చిందులు! మడుగులోంచి బయటపడ్డానికి వాళ్ళు చూపిన ఆత్రం ఎంత వినోదం కలిగించిందో!

చేరవలసిన చోటుకి చేరిన తరవాత మేము ఆనందంగా వనభోజనం చేశాం. నేను ఒక చెట్టుకింద కూర్చున్నాను; కుర్రవాళ్ళు నా చుట్టూ కూర్చున్నారు. నేను ఉత్తేజకరమైన మనఃస్థితిలో ఉండడం చూసి వాళ్ళు ప్రశ్నల వర్షం కురిపించారు.

"ఏమండీ, నేను ఎప్పటికీ వైరాగ్య మార్గంలో మీతోనే ఉంటానా? చెప్పండి స్వామీజీ?" అని అడిగాడు ఒక కుర్రవాడు.

"ఆఁ హఁ! ఉండవు," అన్నాను, "నిన్ను బలవంతంగా ఇంటికి లాక్కెళ్ళిపోతారు; తరవాత నువ్వు పెళ్ళి చేసుకుంటావు."

నమ్మశక్యం కాక, అతను నే నన్నదానికి తీవ్రంగా అభ్యంతరం చెప్పాడు " నేను చచ్చిపోతేనే, వాళ్ళు నన్ను ఇంటికి తీసుకుపోయేది," అన్నాడు (కాని కొద్ది

మాసాల్లోనే అతని తల్లిదండ్రులు వచ్చి, అతను ఏడ్చి మొరాయించినా లెక్కచెయ్యకుండా లాక్కెళ్ళి పోయారు. కొన్నేళ్ళ తరవాత పెళ్ళి కూడా చేసుకున్నాడతను).

చాలా ప్రశ్నలకి నేను జవాబులు ఇచ్చిన తరవాత, కాశీ అనే కుర్రవాడు ప్రశ్న అడిగాడు. అతను పన్నెండేళ్ళవాడు; చాలా తెలివయిన విద్యార్థి; అతనంటే అందరికీ ఇష్టం.

"స్వామీజీ, నా అదృష్టం ఎలా ఉంటుందండి?" అని అడిగాడు.

"త్వరలో చనిపోతావు నువ్వు," పట్ట శక్యంకాని శక్తి ఏదో పట్టుపట్టి నా నోటివెంట ఈ మాటలు అనిపించినట్టు తోచింది.

ఈ ప్రకటన నాకూ, తోటివారికి విస్మయాన్ని అమిత దుఃఖాన్ని కల్గించింది. అసందర్భ ప్రలాపం చేసే కుర్రవాడిలాగా నన్ను నేను తిట్టుకుని, మరే ప్రశ్నలకూ జవాబు లియ్యనని చెప్పేశాను.

మేము విద్యాలయానికి తిరిగి వెళ్ళిన తరవాత కాశీ నా గదికి వచ్చాడు.

"నేను చచ్చిపోతే, తిరిగి నేను పుట్టినప్పుడు నన్ను మీరు కనుక్కుని మళ్ళీ ఆధ్యాత్మిక మార్గంలోకి తీసుకువస్తారాండీ?" అంటూ ఏడుస్తూ అడిగాడు.

కష్టమైన ఈ అసాధారణ బాధ్యతను నేను నిరాకరించక తప్పలేదు. కాని ఆ తరవాత కొన్ని వారాలపాటు కాశీ, నన్ను గట్టిగా ఒత్తిడి చేశాడు. అతను ఆశ వదులుకునేటంతగా అధైర్యపడడం చూసి, చివరికి ఓదార్చాను.

"సరే," నని మాట ఇచ్చాను. "పరమాత్ముడు నాకు సహాయ పడితే, నిన్ను కనుక్కోడానికి తప్పకుండా ప్రయత్నం చేస్తాను."

వేసంగి సెలవుల్లో నేను చిన్న ప్రయాణం మీద బయలుదేరాను. కాశీని నాతోబాటు తీసుకు వెళ్ళలేకపోతున్నందుకు విచారించి, నేను బయలుదేరే ముందు కాశీని నా గదికి పిల్చి, ఎవరు ఎంతగా ఒప్పించడానికి పూనుకున్నా సరే, ఈ విద్యాలయ ఆధ్యాత్మిక స్పందనల వాతావరణంలోనే ఉండమని జాగ్రత్తగా చెప్పాను. అతను కనక ఇంటికి వెళ్ళక పోయినట్లయితే రాగల ప్రమాదాన్ని తప్పించుకోవచ్చునని ఎందుకో నాకు అనిపించింది.

నేను ఇలా వెళ్ళానో లేదో, కాశీ తండ్రి రాంచీలో దిగాడు. ఆయన తన కొడుకు సంకల్పాన్ని భగ్నం చెయ్యడానికి పదిహేనురోజుల పాటు ప్రయత్నించాడు;

కాశీ, వాళ్ళమ్మని చూడ్డానికి ఒక్కసారి కలకత్తా వచ్చి నాలుగురోజులు ఉంటే చాలు, మళ్ళీ తిరిగి రావచ్చునని చెప్పాడు. కాశీ ఒకే పట్టు మీద తిరస్కరిస్తూ వచ్చాడు. చివరికి ఆ తండ్రి, పోలీసుల సహాయంతో తన కొడుకును తీసుకు పోతానని చెప్పాడు. ఈ బెదిరింపుతో కాశీ ఆందోళన పడ్డాడు; విద్యాలయాన్ని గురించి ఏ దుష్ప్రచారం జరగడానికయినా తాను కారకుడు కావడం అతనికి ఇష్టం లేదు. వెళ్ళడం తప్ప అతనికి గత్యంతరం కనిపించలేదు.

కొన్నాళ్ళ తరవాత నేను రాంచీకి తిరిగి వచ్చాను. కాశీని ఏ రకంగా తీసుకు పోయిందీ వినగానే నేను కలకత్తా వెళ్ళే బండి ఎక్కాను. అక్కడ ఒక గుర్రబ్బండి కట్టించుకున్నాను. ఆశ్చర్యమేమిటంటే, ఆ బండి, గంగానది మీద ఉన్న హౌరా బ్రిడ్జిని దాటిపోతూ ఉండగా నేను చూసిన మొదటి వ్యక్తులు కాశీ తండ్రీ, ఇతర బంధువులూ; వాళ్ళు సంతాపసూచకమైన బట్టలు కట్టుకొని ఉన్నారు. మా బండివాణ్ణి ఆపమని అరిచి, గబుక్కున బండిలోంచి ఉరికి, అభాగ్యుడైన ఆ తండ్రివేపు తేరిపార చూశాను.

"హంతక మహాశయా, నా కుర్రవాణ్ణి చంపేశారు మీరు!" అంటూ కొంత మట్టుకు అనుచితంగానే అరిచాను.

కాశీని బలవంతంగా కలకత్తాకు తీసుకువచ్చి తప్పు చేశానని అప్పటికే గ్రహించాడు ఆ తండ్రి. అక్కడున్న కొద్ది రోజుల్లోనూ ఆ అబ్బాయి, కలుషితమైన ఆహారం తిని, కలరా వచ్చి చనిపోయాడు.

కాశీ మీద నాకున్న వాత్సల్యమూ, పోయిన తరవాత మళ్ళీ అతన్ని కనుక్కుంటానని చేసిన వాగ్దానమూ నన్ను రాత్రింబగళ్ళు వెంటాడుతున్నాయి. నేను ఎక్కడికి వెళ్ళినా సరే, అతని ముఖం నా కళ్ళముందు ఆడుతూనే ఉంది. పోయిన మా అమ్మకోసం, చాలాకాలం కిందట ఎలా అన్వేషించానో అలాగే అతని కోసం కూడా చిరస్మరణీయమైన అన్వేషణ మొదలు పెట్టాను.

భగవంతుడు నాకు వివేచన శక్తి ఇచ్చినందుకు దాన్ని నేను తప్పకుండా వినియోగించాలనీ, ఆ అబ్బాయి సూక్ష్మశరీరం ఉనికిని తెలుసుకోడానికి వీలైన సూక్ష్మ నియమాల్ని కనిపెట్టడానికి నాకుగల శక్తుల్ని సంపూర్ణంగా కూడగట్టుకొని అందుకు శ్రమించాలనీ అనిపించింది. అతను తీరని కోరికలతో స్పందిస్తున్న ఆత్మ; సూక్ష్మ మండలాల్లో అనేక లక్షల ప్రకాశమానమైన ఆత్మల మధ్య ఎక్కడో ఒక కాంతిపుంజంగా తేలుతున్నాడని గ్రహించాను. స్పందనశీల కాంతుల రూపంలో ఉన్న అనేక ఇతర ఆత్మలతో కూడి ఉన్న అతనితో సంపర్కం పెట్టుకోడం ఎలాగ?

ఒక రహస్య యోగప్రక్రియను ఉపయోగించి, నా కనుబొమల మధ్య అంతర్బిందువయిన ఆధ్యాత్మిక నేత్రమనే* "మైక్రోఫోన్" ద్వారా, కాశీ ఆత్మకు నా ప్రేమను ప్రసారం చేశాను. కాశీ త్వరలోనే భూమికి తిరిగి వస్తాడనీ, నేను కనక అవిచ్ఛిన్నంగా అతనికి నా పిలుపును ప్రసారం చేసినట్లయితే అతని ఆత్మ జవాబు ఇస్తుందనీ సహజావబోధాత్మకమయిన అనుభూతి పొందాను. కాశీ పంపించే అత్యల్ప ఆవేగాన్ని కూడా నా వేళ్ళలోనూ ముంజేతుల్లోనూ వెన్నులోనూ అనుభూతం చేసుకోవచ్చునని నాకు తెలుసు. అతను ఈ పాటికి ఏ తల్లి గర్భంలోనో పిండంగా శరీరధారణ చేసి ఉంటాడన్న నమ్మకం నాకు కలిగింది; అందుచేత అతనున్న స్థలం ఏ దిశగా ఉందో కనుక్కోడానికి పైకెత్తిన నా చేతుల్ని గ్రాహకాలు (ఏంటిన్నాలు)గా ఉపయోగిస్తూ తరచు నేను గుండ్రంగా తిరుగుతూ ఉండేవాణ్ణి. ఏకాగ్రతా సంధానితమైన నా హృదయమనే రేడియోలో అతని నించి వచ్చే ప్రతిస్పందనను అందుకోవాలని ఆశించాను.

కాశీ చనిపోయిన తరవాత ఆరు నెలలపాటు నే నీ యోగ ప్రక్రియను తరగని ఉత్సాహంతో నిలకడగా సాధన చేశాను. ఒకనాడు పొద్దున, కలకత్తాలో జనసమ్మర్దంగా ఉన్న బౌ బజార్ అనే పేటలో కొంతమంది స్నేహితులతోబాటు నడుస్తూ, మామూలు పద్ధతిలో చేతులు పైకి ఎత్తాను. మొట్టమొదటిసారిగా ప్రతిస్పందన వచ్చింది. నా వేళ్ళలోంచీ అరిచేతుల్లోంచీ విద్యుదావేగాలు లోపలికి ప్రసరిస్తూ ఉండడం కనిపెట్టి పులకించి పోయాను. ఆ విద్యుత్ ప్రవాహాలు నా చైతన్యంలోని ఒకానొక గహనాంతర స్థానం నుంచి అత్యంత ప్రబలమైన ఆలోచనగా రూపాంతరం చెందాయి. "నేను కాశీని, నేను కాశీని; నా దగ్గరికి రండి!"

నేను హృదయమనే రేడియో మీద ఏకాగ్రత నిలిపినప్పుడు, ఆ ఆలోచన దాదాపుగా నా చెవికి వినవచ్చింది. కాశీకి† సహజ లక్షణమైన కొద్దిపాటి బొంగురు

---

* కనుబొమల మధ్య బిందువు నుండి పంపబడిన సంకల్పశక్తి (will) ఆలోచనకు ప్రసార సాధనము హృదయము మీద నిశ్చలముగా కేంద్రీకృతమైన మనిషి అనుభూతి శక్తి (fee ing) దాన్ని మానసిక రేడియోగా మార్చి, తద్వారా ఇతరులు - (దగ్గరిలోని వారైనా దూరంలోని వారైనా) - పంపే సందేశాల్ని గ్రహించేలా చేస్తుంది టెలిపతి లో ఒకని మనసులోని ఆలోచనల సూక్ష్మ ప్రకంపనలు సూక్ష్మ ఆకాశం (astral ether) గుండాను, తర్వాత స్థూల భూ సంబంధమైన ఆకాశం (ether) గుండానూ పంపబడి, విద్యుత్తు తరంగాల్ని సృష్టిస్తాయి. ఈ విద్యుత్తరంగాలు రెండవ వాని మనసులో ఆలోచనా తరంగాలుగా రూపొందుతాయి.

† ప్రతి ఆత్మా పరిశుద్ధ స్థితిలో, సర్వజ్ఞత్వ మున్నదే. కాశీ ఆత్మ కాశీ అనే పిల్లవాడి సహజ లక్షణాలన్నీ గుర్తుంచుకుంది; కనక నే నతన్ని గుర్తు పట్టేలా చెయ్యడానికని అతని బొంగురు గొంతును అనుకరించింది.

గొంతుతో గుసగుసలాడుతున్నట్టుగా పిలిచిన పిలుపును మళ్ళీమళ్ళీ విన్నాను నా స్నేహితుడొకడి చెయ్యి గుంజి పట్టుకుని ఆనందంగా చిరునవ్వు నవ్వాను.

"కాశీ ఎక్కడున్నదీ నేను తెలుసుకున్నట్టు అనిపిస్తోంది!"

నేను గిరగిరా తిరగడం ప్రారంభించాను; నా స్నేహితులూ దారిని పోయే జనమూ చోద్యంగా చూస్తున్నారు. నేను దగ్గరిలో ఉన్న ఒక సందువేపు తిరిగి ఉన్నప్పుడు మాత్రమే నా వేళ్ళలో విద్యుత్తరంగాలు జల్లుమనిపిస్తున్నాయి. ఆ సందుకు 'సర్పెంటైన్ లేన్' (పాము సందు) అన్న పేరు సరిగానే సరిపోయింది నేను తక్కిన వేపులకు తిరిగినప్పుడు ఆ సూక్ష్మ విద్యుత్ ప్రవాహాలు అంతరించాయి.

"ఆఁహాఁ! కాశీ ఆత్మ, ఈ సందులో ఒక ఇంట్లో ఒక తల్లి కడుపులో ఉందన్నమాట!" అనుకున్నాను.

నేనూ నా స్నేహితులూ సర్పెంటైన్ లేన్‌లోకి నడిచాం; పైకెత్తి ఉన్న నా చేతుల్లో స్పందనలు బలమయి, వెనకటికన్న స్పష్టమయాయి. ఏదో ఒక అయస్కాంత శక్తి పనిచేసి నన్ను రోడ్డుకు కుడివక్కకు లాగేసింది. ఒక ఇంటి గుమ్మం దగ్గరికి వెళ్ళేసరికి నా కాళ్ళు స్తంభించిపోవడం చూసి ఆశ్చర్యపోయాను. ఊపిరి కూడా బిగబట్టేసి గాఢమైన ఉద్రేకంతో తలుపు తట్టాను.

ఒక పనిమనిషి వచ్చి తలుపు తీసింది; అయ్యగారు ఇంట్లోనే ఉన్నారని చెప్పింది. ఆయన రెండో అంతస్తు నుంచి మెట్లు దిగివచ్చి సంగతి ఏమిటన్నట్టుగా నావేపు చిరునవ్వు నవ్వారు. నేను అడగదలుచుకున్న ప్రశ్న ఎలా ఉండాలో మనస్సులో ఇంకా అనుకోనే లేదు; అది ఒక రకంగా సంగతమూ మరో రకంగా అసంగతమూ కూడా.

"ఏమండీ, మీరూ మీ భార్యా, సంతానం కలుగుతుందని సుమారు ఆరు నెలల నుంచి ఎదురుచూస్తున్నారా? దయచేసి చెప్పండి."*

---

* చాలామంది మానవులు భౌతికంగా మరణించిన తరవాత, సూక్ష్మలోకంలో 500 నుంచి 1000 సంవత్సరాల వరకు ఉంటుంటారు కాని, జన్మకూ జన్మకూ మధ్య ఇంత వ్యవధి ఉండాలన్న నిశ్చిత నియమం ఏదీ లేదు (43 అధ్యాయం చూడండి). భౌతిక శరీరంలోకాని, సూక్ష్మ శరీరంలోకాని ఒక మనిషికి కేటాయించిన జీవితకాలం, అతని కర్మానుసారంగా పూర్వ నిర్ధారితమై ఉంటుంది.

చావూ, "చిన్న చావు" అనిపించుకునే నిద్రా కూడా మర్త్యులకు ఆవశ్యకమైనవే ఆత్మ సాక్షాత్కారం పొందని జీవిని ఇవి, ఇంద్రియ బంధనాల నుంచి తాత్కాలికంగా విముక్తం చేస్తాయి. మానవుడి మౌలిక ప్రకృతి ఆత్మ కనక, అతడు నిద్రలోనూ చావులోనూ తన

“ఔనండి, నిజమే.” నేను సాంప్రదాయికమైన కాషాయ వస్త్రాలు ధరించిన సన్యాసినని గమనించిన ఆయన మర్యాదగా, “మా సంగతులు మీకు ఎలా తెలిశాయో దయచేసి చెబుతారా?” అని అడిగారు.

కాశీని గురించీ, నే నిచ్చిన వాగ్దానం గురించీ విన్న మీదట ఆయన ఆశ్చర్య చకితుడై, నా వృత్తాంతం నమ్మాడు.

“పసిమి ఛాయగల అబ్బాయి పుడతాడు మీకు,” అని చెప్పాను. “అతని ముఖం వెడల్పుగా ఉంటుంది; నుదుటికి పైన ఒక సుడి ఉంటుంది. అతని ప్రవృత్తి ఆధ్యాత్మికతవేపు మొగ్గి ఉంటుంది,” అని చెప్పాను. పుట్టబోయే బిడ్డకు కాశీ పోలికలు ఉంటాయని నాకు నిశ్చయంగా అనిపించింది.

తరవాత పసివాణ్ణి చూడ్డానికి వెళ్ళాను. అతనికి ‘కాశీ’ అన్న పాతపేరే పెట్టారు తల్లిదండ్రులు. ఆ పసితనంలో కూడా అతనిలో, నా రాంచీ ప్రియ శిష్యుడి పోలికలు కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి. పిల్లవాడు నన్ను చూస్తూనే ఆప్యాయత కనబరిచాడు; గతంలోని ఆకర్షణ ఇప్పుడు రెండింతలుగా పెల్లుబికింది.

చాలా ఏళ్ళ తరవాత, కిశోరావస్థలో ఉన్న ఆ పిల్లవాడు, నేను అమెరికాలో ఉన్నప్పుడు నాకు ఉత్తరం రాశాడు. సన్యాస మార్గంలో సాగాలని తాను గాఢంగా అభిలషిస్తున్నట్టు వివరించాడు. నే నతన్ని, హిమాలయాల్లో ఉన్న ఒక గురువు దగ్గరికి పంపించాను; పునర్జన్మ ఎత్తిన కాశీని శిష్యుడిగా స్వీకరించారాయన.

---

అశరీరత్వాన్ని పునరుజ్జీవింపజేసే జ్ఞాపికలు కొన్ని పొందుతాడు.

హిందూ పవిత్ర గ్రంథాల్లో చెప్పిన ప్రకారం, సమతులన కర్మనియమం, చర్యా ప్రతిచర్యలకూ, కార్యకారణాలకూ, బీజావాప ఫలోపలబ్ధులకూ సంబంధించినది. ప్రతి మనిషీ తన నైసర్గిక ధర్మ (ఋతం) వర్తనలో, తన ఆలోచనల ద్వారానూ చేతల ద్వారానూ తన భవితవ్యాన్ని తానే మలుచుకుంటాడు. తెలివిగానో తెలివితక్కువగానో అతడు చాలనంచేసిన విశ్వశక్తులు ఒక బిందువు దగ్గర మొదలైన వృత్తపరిధి తప్పనిసరిగా ఆ బిందువు దగ్గరికే తిరిగి వచ్చి వృత్తం పూర్తి అయినట్టుగా ఆరంభకేంద్రమైన అతని దగ్గరికి తప్పనిసరిగా తిరిగి రావాలి. “ఈ ప్రపంచం ఒక గణిత సమీకరణంలా కనిపిస్తుంది; నువ్వు దాన్ని ఎలా తిప్పు - దానంతట అది సమతులనం చేసుకుంటుంది. నిశ్శబ్దంగానూ నిశ్చయంగానూ, ప్రతి రహస్యమూ వెల్లడి అవుతుంది· ప్రతి నేరానికీ శిక్ష పడుతుంది, ప్రతి సుగుణానికీ బహుమతి వస్తుంది; ప్రతి అన్యాయానికీ పరిహారం లభిస్తుంది.” (ఎమర్సన్ కాంపెన్సేషన్ లో) జీవిత అసమానతల వెనక ఉన్న కర్మను న్యాయసూత్రంగా అవగాహన చేసుకున్నప్పుడు, మానవ మనస్సులో దేవుడిమీదా మానవుడిమీదా ఉన్న ఆగ్రహం తొలగిపోవడానికి అది తోడ్పడుతుంది. (పే 225 అధోజ్ఞాపిక చూడండి).

అధ్యాయం : 29

# రవీంద్రనాథ్ టాగూరు, నేను విద్యాలయాల్ని పోల్చిచూడడం

"ఆత్మాభివ్యక్తికి సహజమైన రూపంలో, పక్షులు పాడినంత అవలీలగా పాడడం రవీంద్రనాథ్ టాగూరుగారు నేర్పారు మాకు."

మా రాంచీ విద్యాలయంలో చదివే పధ్నాలుగేళ్ళ కుర్రవాడు భోలానాథ్ చెప్పిన సంగతి ఇది. ఒకనాడు పొద్దున, అతను పాడిన శ్రావ్యమైన పాటలకు నేను అభినందించినప్పుడు చెప్పాడిది. ఎవరైనా అడిగినా అడక్కపోయినా ఆ అబ్బాయి తియ్యటి పాటలు అలా పాడుతూ ఉండేవాడు. అంతకుముందు అతను బోల్పూరులో టాగూరుగారి "శాంతి నికేతనం" అనే ప్రసిద్ధ విద్యాలయంలో చదివాడు.

"రవీంద్రుల పాటలు చిన్నప్పటినించీ నా పెదవులమీద ఆడుతూనే ఉన్నాయి," అన్నాను అతనితో. "అక్షరాలు రాని రైతులతో సహా, బెంగాలీ లందరూ ఆయన మహోన్నత కవిత్వానికి ముచ్చటపడతారు."

భోలా, నేనూ కలిసి టాగూరు పాటలు కొన్ని కలిసి పాడుకున్నాం. ఆయన కొన్నివేల భారతీయ కవితలకు స్వరకల్పన చేశారు; వాటిలో కొన్ని ఆయన రాసినవీ కొన్ని పూర్వకవులవీ.

"రవీంద్రనాథ్‌గారు సాహిత్యానికి నోబెల్ బహుమానం తీసుకున్న కొత్తలో నేను ఆయన్ని కలుసుకున్నాను," అన్నాను నేను, పాటలు పాడడం అయిన తరవాత. "ఆయన్ని కలుసుకోవాలన్న ఆసక్తి నాకు కలగడానికి కారణమేమి టంటే సాహిత్య విమర్శకులకు బుద్ధిచెప్పి పంపడంలో ఆయనకున్న నిష్కపటమైన సాహసం నాకు నచ్చింది," అంటూ ముసిముసిగా నవ్వుకున్నాను.

భోలాకు ఆసక్తి కలిగి, ఆ వృత్తాంతం చెప్పమన్నాడు నన్ను.

"బెంగాలీ కవిత్వంలో కొత్తశైలి ప్రవేశపెట్టినందుకు, టాగూరును పండితులు తీవ్రంగా విమర్శించారు.," అంటూ ప్రారంభించాను. "ఆయన, పండితుల హృదయాలకు ప్రీతిపాత్రమైన లాక్షణిక నియమాల్ని పట్టించుకోకుండా, వాడుక భాషాప్రయోగాలూ కలిపి రాసేశారు. పూర్వులు అంగీకరించిన సాహిత్య రూపాల్ని లెక్కచెయ్యకుండా, ఆయన పాటలు, గాఢమైన దార్శనిక సత్యాన్ని హృదయానికి హత్తుకునే మాటల్లో పొందుపరుస్తాయి.

పలుకుబడి గల ఒక విమర్శకుడు ద్వేషంతో రవీంద్రనాథ్‌ను 'తన కూతల్ని అచ్చులో రూపాయికి అమ్మిన పిట్టకవి' అని ఆయన్ని అన్నాడు; కాని టాగూరుకు ప్రతీకారం తీర్చుకునే అవకాశం త్వరలోనే వచ్చింది; ఆయన తమ గీతాంజలి (ప్రార్థన గీతాలు)ని తామే ఇంగ్లీషులోకి అనువాదం చేసిన వెంటనే పాశ్చాత్య సాహితీలోకం మొత్తం ఆయనకు నివాళు లర్పించింది. ఒకప్పుడు ఆయన్ని విమర్శించినవాళ్ళతో సహా, ఒక రైలుబండి పట్టేటంతమంది పండితులు ఆయనకి అభినందనలు అందించడానికి శాంతి నికేతనం వెళ్ళారు.

"రవీంద్రులు, కావాలనే చాలాసేపు జాప్యంచేసి మరీ కలుసుకున్నారు అతిథుల్ని. తరవాత, వాళ్ళు చేసే పొగడ్తల్ని, నిర్వికారంగా మౌనం వహించి విన్నారు. చివరికి, వాళ్ళు అలవాటుగా ఉపయోగించే విమర్శాయుధాల్ని వాళ్ళ మీదికే ఎదురు తిప్పారు.

" 'మహాశయులారా, మీ రిక్కడ నా మీద కురిపిస్తున్న ప్రశంసల సుగంధ వర్షమూ, వెనకటి మీ తృణీకార దుర్గంధమూ పొందికలేకుండా కలిశాయి. నాకు నోబెల్ బహుమానం రావడానికీ మీలో ప్రశంసాశక్తులు సునిశితం కావడానికీ ఏమైనా సంబంధం ఉండి ఉంటుందా? నే నిప్పటికీ - వంగదేవాలయంలో మొదట నా వినయపుష్పాలు అర్పించినప్పుడు మీకు ఆగ్రహం కలిగించిన కవినే.'

"టాగూరుగారి నిర్భయమైన మందలింపు వృత్తాంతాన్ని వార్తా పత్రికలు ప్రకటించాయి. పొగడ్తకి లొంగిపోని ఆ వ్యక్తి నిష్కపటంగా అన్న ఆ మాటలు నాకు బాగా నచ్చాయి," అంటూ ఇంకా చెప్పాను. "రవీంద్రుల కార్యదర్శి సి.ఎఫ్. ఆండ్రూస్*గారు నన్ను కలకత్తాలో ఆయనకు పరిచయం చేశారు; ఆండ్రూస్ గారు సాదాగా బెంగాలీ పంచె కట్టుకునేవారు. టాగూరుగారిని ఆయన ప్రేమ పురస్సరంగా 'గురుదేవులు' అని పిలిచేవారు."

---

* మహాత్మాగాంధీ సన్నిహితుడైన ఆంగ్ల రచయిత, ప్రకాశకుడు.

"రవీంద్రులు నన్ను ఆదరపూర్వకంగా పలకరించారు. ఆయన వ్యక్తిత్వంలో ఆకర్షణ, సంస్కారం, నాగరికత తొణికిసలాడుతున్నాయి. ఆయన సాహిత్య పరిచయాన్ని గురించి నే నడిగిన ప్రశ్నకు జవాబు ఇస్తూ ఆయన, తాము ప్రధానంగా ప్రభావితులైనది మన పురాణేతిహాసాల వల్లా, పద్నాలుగో శతాబ్ది నాటి విద్యాపతి అనే కవి రచనలవల్లా అని చెప్పారు."

ఈ జ్ఞాపకాలతో ఉత్తేజితుణ్ణి అయి, ప్రాచీన వంగగీతానికి టాగూరు రూపకల్పన చేసిన, "ఆమారే ఏ ఘరే, ఆప్నార్ కరే గృహదీపఖాని జాలో' [నా ఇంట్లో నీ చేత్తో గృహదీపం వెలిగించు; అంటే, నీ ప్రేమదీపాన్ని వెలిగించు] అంటూ పాడడం మొదలుపెట్టాను. భోలా నేనూ అనందంగా పాడుకుంటూ విద్యాలయ భూముల్లో విహరించాం.

రాంచీ విద్యాలయాన్ని స్థాపించిన రెండేళ్ళకి, రవీంద్రుల దగ్గర్నించి నాకొక ఆహ్వానం వచ్చింది; మా విద్యాబోధనాదర్శాల్ని కలిసి ముచ్చటించుకోడానికి నన్ను శాంతినికేతనానికి వచ్చి కలుసుకోమని కోరారు. నేను సంతోషంగా వెళ్ళాను. నేను వెళ్ళేసరికి ఆ మహాకవి తమ పఠన మందిరంలో కూర్చుని ఉన్నారు. మేము మొట్ట మొదట కలుసుకున్నప్పుడు అనిపించినట్టే ఇప్పుడు కూడా, ఆయన రూపం, ఏ చిత్రకారుడయినా ఉత్తమ పురుషాకృతిని చిత్రించడానికి ఆదర్శంగా కోరేటంత ప్రస్ఫుటంగా ఉందని అనిపించింది. కులీనత ఉట్టిపడే విధంగా, శిల్పకారుడు తీర్చి దిద్దినట్టున్న ముఖానికి చుట్టూ పొడుగాటి జుట్టు, వంకుల వంకుల గడ్డమూ ఉన్నాయి. విశాలమైన దయార్ద్రనేత్రాలూ, దివ్యదరహాసమూ; అక్షరాలా సమ్మోహ పరిచే వేణునాదం వంటి కంఠస్వరమూ, దృఢంగానూ, నిటారు గాను, గంభీరంగాను ఉండే ఆయన రూపం, దాదాపు స్త్రీసహజమైన మార్దవాన్నీ శిశుసహజమైన ఆనంద మయ స్వచ్ఛందతనూ మేళవించినట్టు ఉంది. కవిని గురించిన ఏ ఆదర్శభావనా ఈ సౌమ్య గాయకునిలో కంటె మరెవరిలోనూ సముచితంగా రూపుగట్టలేదు

కాస్సేపట్లో టాగూరుగారూ నేనూ, ఛాందసానికి తావులేని ఆదర్శాలతో స్థాపించిన మా విద్యాలయాల్ని ఒక దాంతో ఒకటి పోల్చి పరిశీలించడంలో మునిగిపోయాం. ఆరుబయట చదువు చెప్పడం, నిరాడంబరత, కుర్రవాడి సృజన శీలతకు సమృద్ధిగా అవకాశం కల్పించడం వంటి సమాన లక్షణాలు చాలా ఉన్నట్టు కనిపెట్టాం. అయితే రవీంద్రులు, సాహిత్య, కవిత్వ అధ్యయనానికీ, భోలా విషయంలో వెనక నేను గమనించినట్టుగా సంగీతం ద్వారానూ గానంద్వారానూ ఆత్మాభివ్యక్తికీ చెప్పుకోదగినంత ప్రాముఖ్యం ఇచ్చారు. శాంతినికేతన విద్యార్థులు మౌనకాలాలు

పాటించడం మట్టుకు జరుగుతోంది కాని, వాళ్ళకి ప్రత్యేక యోగాభ్యాసం ఏదీ నేర్పడం లేదు.

రాంచీలో విద్యార్థులందరికీ నేర్పే, శక్తి సంవర్ధక "యోగదా" అభ్యాసాల గురించీ, యోగధారణ పద్ధతుల గురించి నేను వివరిస్తుంటే ఆ మహాకవి, ప్రశంసాసూచకమైన శ్రద్ధతో విన్నారు.

టాగూరుగారు, చిన్నప్పటి తమ చదువులో ఎదురైన సంఘర్షణను గురించి నాకు చెప్పారు. "ఐదో తరగతి తరవాత నేను బళ్ళోంచి పారిపోయాను," అంటూ నవ్వుతూ చెప్పారు. ఈయనకు జన్మసిద్ధంగా వచ్చిన, కవి సహజమైన కోమలత్వానికీ, నిస్సారమూ నిరంకుశమూ అయిన పాఠశాల వాతావరణానికీ ఎలాగూ సరిపడదన్న సంగతి వెంటనే అర్థం చేసుకున్నాను.

"అంచేతే నేను, నీడనిచ్చే చెట్లకింద, విశాలాకాశం కింద శాంతి నికేతనం స్థాపించాను," అందమైన తోటలో చదువుకుంటున్న చిన్న పిల్లల గుంపు వేపు చూపించారాయన. "పిల్లవాడు పువ్వుల మధ్యా పాటలు పాడే పక్షుల మధ్యా తన సహజ వాతావరణంలో ఉంటాడు. అక్కడే వాడు తన వ్యక్తిగత ప్రతిభ తాలూకు గుప్త సంపదను మరింత సులువుగా వ్యక్తం చెయ్యవచ్చు. నిజమైన విద్యాబోధన, లోపల ఉన్న అనంత జ్ఞాననిధిని బయటికి తీసుకురావడానికి సాయపడుతుందే కాని బయటి వనరుల నుంచి లోపలికి ఎక్కించి దట్టించడం జరగదు."*

దాంతో నేను ఏకీభవిస్తూ, "మామూలు బళ్ళలో, గణాంక వివరాలూ చారిత్రక యుగాలూ వంటి ప్రత్యేక పద్యాలవల్ల, కుర్రవాళ్ళకుండే ఆదర్శాత్మక, వీరపూజా సంబంధమైన సహజాతాలు శుష్కించిపోతున్నాయి," అన్నాను.

ఆ మహాకవి, తమ తండ్రిగారు దేవేంద్రనాథ్‌గారి గురించి ప్రేమ పురస్సరంగా చెప్పారు; శాంతినికేతన స్థాపనకు స్ఫూర్తినిచ్చినవారు ఆయన.

"నాన్నగారు, సారవంతమైన ఈ భూమిని నాకు బహూకరించారు; దీంట్లో అంతకు పూర్వమే ఆయన ఒక అతిథి గృహం, దేవాలయం నిర్మించారు," అని

* "ఆత్మ అనేకసార్లు జన్మించి ఉండడంవల్ల, లేక హిందువులు చెప్పినట్లుగా అనేక వేల జన్మల్లో అస్తిత్వ మార్గాన ప్రయాణించేసి'... అది (ఆత్మ) తెలుసుకోని విషయం లేదు; అందుచేత తనకు ముందే తెలిసిన ఆ సంగతులను అది స్మరణకు తెచ్చుకోగలగడంలో ఆశ్చర్యంలేదు. (తనకా సంగతులు ముందే తెలుసు)... విచారణా, గ్రహింపు, నిజానికి జ్ఞప్తికి తెచ్చుకోవడం తప్ప వేరేమీ కాదు." ఎమర్సన్ - "రిప్రజెంటేటివ్ మెన్" (Representative Men)

చెప్పారు రవీంద్రులు. "ఇక్కడ నా విద్యాబోధన ప్రయోగాన్ని 1901లో, ఒక్క పదిమంది కుర్రవాళ్ళతో ప్రారంభించాను. నోబెల్ బహుమానంతో వచ్చిన ఎనిమిది వేల పౌన్ల డబ్బూ ఈ విద్యాలయ నిర్వహణకే ఖర్చయింది."

"మహాఋషి"గా పేరొందిన దేవేంద్రనాథ్ టాగూరుగారు, అత్యంత గణనీయులైన వ్యక్తి; ఈ సంగతి ఆయన 'ఆత్మకథ' చదివి గ్రహించవచ్చు. మంచి పడుచు వయస్సులో ఆయన రెండేళ్ళపాటు హిమాలయాల్లో ధ్యానంలో గడిపారు. ఆయన తండ్రి ద్వారకానాథ్ టాగూరుగారు, ప్రజాహితంగా చేసిన దానధర్మాల వల్ల వంగదేశమంతకూ మాన్యులయారు. ఈ ఆదర్శ వంశవృక్షం నుంచి మేధావి కుటుంబం ఉద్భవించింది. రవీంద్రులు ఒక్కరే కాదు; ఆయన బంధువు లందరూ కూడా సృజనాత్మక అభివ్యక్తికి పేర్నెకెక్కినవారు. ఆయన సోదరుల కుమారులు గగనేంద్రులూ అవనీంద్రులూ భారతదేశపు అగ్రశ్రేణి చిత్రకారులుగా చెప్పుకోదగ్గవారు.* రవీంద్రుల సోదరులు ద్విజేంద్రులు, గాఢ ద్రష్ట అయిన దార్శనికులు; పక్షులూ వన్యప్రాణులూ కూడా ఆయన్ని అభిమానించేవి.

ఆ రోజు రాత్రికి నన్ను అతిథిగృహంలో ఉండిపొమ్మని కోరారు రవీంద్రులు. ఆ సాయంత్రం మొగసాలలో కవీంద్రులూ తదితరుల బృందమూ ఉన్న దృశ్యాన్ని చూసి ముగ్ధుణ్ణి అయాను. కాలచక్రం వెనక్కి తిరిగింది: నా ఎదుట ఉన్న దృశ్యం ప్రాచీనమైన ఒక ఆశ్రమంలా ఉంది - ఆనందమయుడైన ఆ గాయకుడి చుట్టూ ఆయన భక్తులు పరివేష్టించి ఉన్నారు; వారి చుట్టూ దివ్యప్రేమ పరివేషం ప్రకాశిస్తోంది. ప్రతి స్నేహగ్రంధినీ టాగూరుగారు, సామరస్య తంతువులతో అల్లారు. ఎన్నడూ ఒత్తిచెప్పే తత్త్వంలేని ఆయన, ఒకానొక అనివార్య ఆకర్షణతో హృదయాన్ని లోబరుచుకున్నారు. ఈశ్వరుడి ఉద్యానంలో కుసుమిస్తున్న అరుదైన కవితాప్రసూనం సహజ పరిమళంతో ఇతరుల్ని ఆకర్షిస్తోంది!

రవీంద్రులు, తాము కొత్తగా రచించిన ఉత్కృష్ట కవితలు కొన్ని, శ్రావ్యమైన స్వరంతో పాడి వినిపించారు. చాలామట్టుకు ఆయన పాటలూ నాటికలూ, విద్యార్థుల ఆహ్లాదంకోసం రాసినవి; వాటిని శాంతినికేతనంలోనే రచించారు. ఆయన పద్యాల్లో నాకు కనిపించిన సొగసు ఏమిటంటే, దాదాపు ప్రతి పంక్తిలోనూ దేవుణ్ణి ప్రస్తావిస్తూ

* తన అరవయ్యో పడిలో రవీంద్రుడు కూడా చిత్రకళని చాలా నిష్ఠగా అభ్యసించాడు. ఆయన గీసిన చిత్రాలు కొంతకాలం క్రితం ఐరోపాలోని ముఖ్యనగరాల్లోనూ న్యూయార్కులోనూ ప్రదర్శించబడ్డాయి.

ఉన్నప్పటికీ ఆయన పవిత్ర నామాన్ని చాలా అరుదుగా పలకడం. "గానం చేసే టప్పుడు కలిగే ఆనందంలో మత్తెక్కి, నన్ను నేనే మరిచి పోయి, నాకు ప్రభువునైన నిన్ను, మిత్రమా అని పిలుస్తుంటాను" [సురేర్ ఘోరే ఆప్నా కే జా-ఈభూలే, బంధూ బలే డాకి మోర్ ప్రభూకే] అని రాశారాయన.

ఆ మర్నాడు మధ్యాహ్న భోజనం అయిన తరవాత మహాకవిగారి దగ్గర, తప్పనిసరిగా, సెలవు తీసుకున్నాను. అప్పటి ఆయన చిన్న విద్యాలయం ఇప్పుడు విశ్వభారతి* పేరుతో ఒక అంతర్జాతీయ విశ్వవిద్యాలయంగా వృద్ధిచెంది, అనేక దేశాల విద్యార్థులకు ఇక్కడ ఆదర్శవంతమైన వాతావరణం లభిస్తున్నందుకు నాకు ఆనందంగా ఉంది.

"ఎక్కడ నిర్భయంగా ఉంటుందో మనస్సు, ఎక్కడ ఎత్తున
నిలుస్తుందో శిరస్సు
ఎక్కడ స్వేచ్ఛ ననుభవిస్తుందో జ్ఞానం;
ఇరుకిరుకు గదులపెట్టె మాదిరి అడ్డుగోడలతో ఎక్కడ
ముక్కలుకాక ఉంటుందో ప్రపంచం;
మాటలు సత్యగర్భంలోంచి వెలువడేది ఎక్కడో;
అలుపెరగని పరిశ్రమ పరిపూర్ణతవేపు చేతులు చాపేది ఎక్కడో;
వివేక నిర్మల స్రవంతి, తుచ్ఛ ఆచారాల నిస్సార
మరు భూమిలో ఇంకిపోకుండా ఉండేది ఎక్కడో;
ఎప్పటికీ విస్తరిస్తూనే ఉండే ఆలోచనగా, చర్యగా, మనస్సును
నువ్వెక్కడ నడిపిస్తూ ఉంటావో;
ఆ స్వాతంత్ర్య స్వర్గసీమలో, తండ్రీ, మేల్కొనేలా చెయ్యి నా దేశాన్ని!†

- రవీంద్రనాథ్ టాగూరు

---

* ఆత్మీయుడైన ఈ మహాకవి 1941లో మరణించి నప్పటికీ, ఆయన స్థాపించిన విశ్వభారతి సంస్థ ఈనాటికీ వృద్ధి చెందుతోంది 1950 సం।రం జనవరిలో శాంతినికేతన్ నుండి 65మంది అధ్యాపకులు విద్యార్థులు రాంచీలోని యోగదా సత్సంగ విద్యాలయంలో పదిరోజులు గడిపి వెళ్ళారు.

† ప్రఖ్యాత పండితుడు సర్ ఎస్ రాధాకృష్ణన్ రాసిన "రవీంద్రనాథ్ టాగూర్ తత్త్వ విచారము (మాక్మిలన్ 1918)లో ఈ మహాకవిని గూర్చిన చక్కటి విశ్లేషణ ఉంది.

అధ్యాయం : 30

# అలౌకిక ఘటనల నియమం

ప్రసిద్ధ నవలా రచయిత లియో టాల్‌స్టాయ్* 'ముగ్గురు సాధువులు' అనే ఆహ్లాదకరమైన జానపద కథ ఒకటి రాశారు. ఆయన స్నేహితుడు నికొలాస్‌రోరిక్, దాన్ని ఈ ప్రకారం సంక్షేపించి చెప్పాడు :

"ఒక ద్వీపంలో ముగ్గురు ముసలి సాధువులు నివసిస్తూ ఉండేవారు. వాళ్ళు ఎంత నిరాడంబరులంటే, వాళ్ళు చేసే ఏకైక ప్రార్థన ఇలా ఉండేది: 'మేము ముగ్గురం, నువ్వు ముగ్గురివి - మా మీద దయ ఉంచు!' ఈ అకృత్రిమమయిన ప్రార్థన సమయంలో గొప్ప అలౌకిక ఘటనలు జరిగాయి.

"స్థానిక మతగురువు† ఒకడు, ఈ ముగ్గురు సాధువుల గురించి, అంగీకార యోగ్యంకాని వాళ్ళ ప్రార్థనను గురించి విన్నాడు, విధివిహితమైన ప్రార్థనలు వాళ్ళకి నేర్పడంకోసం వాళ్ళని కలుసుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఆ దీవికి చేరి వాళ్ళ దైవప్రార్థన హుందాగా లేదని చెప్పి ఆచారప్రకారంగా చేసే ప్రార్థనలు వాళ్ళకి చాలా నేర్పాడు. తరవాత ఆ బిషప్పు ఒక నావ ఎక్కి వెళ్ళిపోయాడు. ఆ నావ వెనకాల ఉజ్జ్వల కాంతి ఒకటి వెంబడించి వస్తూండడం గమనించాడు. ఆ కాంతి దగ్గరపడేసరికి ముగ్గురు సాధువుల్నీ పోల్చాడాయన; ఆ ముగ్గురూ నావను అందుకోనే

---

* టాల్‌స్టాయ్‌కి మహాత్మాగాంధీకి అనేక ఆదర్శాల్లో పోలిక ఉంది. వీరిద్దరూ అహింసా విషయంమీద ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకున్నారు. "హింసను (హింసతో) ఎదుర్కోకండి" (మత్తయి 5:39) అన్నదాన్నే క్రీస్తు ప్రధాన బోధగా పరిగణించాడు టాల్‌స్టాయ్ హింసను దానికి తార్కికంగా వ్యతిరేకమైన ఉపయుక్తమైన 'మంచి'తో అంటే ప్రేమతోనే "ఎదుర్కో" వాలి.

† ఈ కథకు చారిత్రక ఆధారం ఒకటి ఉన్నట్టు కనిపిస్తోంది; మత గురువు ఆ ముగ్గురు సాధువుల్నీ, ఆర్కేంజల్ నుంచి స్లొవెట్స్కీ మఠానికి వెళ్ళడానికి నౌకలో ప్రయాణం చేస్తూ ద్వినా నది ముఖద్వారం దగ్గర కలుసుకున్నాడని సంపాదకీయ గమనికవల్ల తెలుస్తోంది.

ప్రయత్నంలో, ఒకరి చెయ్యి ఒకరు పట్టుకొని కెరటాల మీద పరిగెత్తుతూ వస్తున్నారు.

" 'మీరు మాకు నేర్పిన ప్రార్థనలు మరిచిపోయాం., మళ్ళీ చెప్పమని మిమ్మల్ని అడగడానికి గబగబా వచ్చేశాం,' అని అరిచారు వాళ్ళు, మత గురువు దగ్గరికి చేరగానే.

"ఆశ్చర్యచకితుడయిన మతగురువు, తల అడ్డంగా తిప్పాడు. 'ప్రియతములారా,' అంటూ వాళ్ళని సవినయంగా సంబోధిస్తూ, 'మీ పాత ప్రార్థనతోనే జీవితం కొనసాగించండి!' అని జవాబిచ్చాడు.' "

ఆ ముగ్గురు సాధువులూ నీటిమీద ఎలా నడిచారు?

క్రీస్తు, శిలువవేసిన తన శరీరాన్ని ఎలా పునరుత్థానం చేశాడు?

లాహిరీ మహాశయులూ శ్రీయుక్తేశ్వర్‌గారూ అలౌకిక చర్యలు ఎలా చేశారు?

అణుయుగావిర్భావంతో ప్రపంచ మానసపరిధి ఆకస్మికంగా విస్తరించినప్పటికీ, ఆధునిక విజ్ఞానశాస్త్రంలో ఇప్పటికి కూడా దీనికి సమాధానం లేదు. "అసంభవం" అనే పదానికి మానవ శబ్దజాలంలో ప్రాముఖ్యం తగ్గుతోంది.

ఈ భౌతిక ప్రపంచం, సాపేక్షతాద్వంద్వతల సూత్రమనే ఒకే ఒక మాయా మౌలిక నియమం మీద నడుస్తోందనే వైదిక ధర్మగ్రంథాలు ఘోషిస్తున్నాయి. ఏకైక జీవుడయిన భగవంతుడు కేవల అద్వితీయుడు. సృష్టిలో వేరుగానూ నానా రూపాలలోనూ ప్రత్యక్షం కావడానికి ఆయన మిధ్యావరణాన్ని లేదా అవాస్తవమైన ముసుగును ధరిస్తాడు. భ్రాంతి జనకమైన ఈ ద్వంద్వ ఆవరణయే మాయ.* ఆధునిక కాలంలోని గొప్ప వైజ్ఞానిక ఆవిష్కరణలు అనేకం సనాతన ఋషుల ఈ సులభ ప్రకటనను ధ్రువపరిచాయి.

న్యూటన్ గమన నియమం, "మాయ" తాలూకు నియమమే. "ప్రతి ఒక్క చర్యకూ సమానమూ విరుద్ధమూ అయిన ప్రతిచర్య ఎప్పుడూ ఉంటుంది; ఏ రెండు వస్తువుల పరస్పర చర్యలయినా ఎప్పుడూ సమానంగా, ఒకదానికొకటి వ్యతిరేక దిశలో సాగుతూంటాయి." ఈ ప్రకారంగా చర్యా, ప్రతిచర్యా సరిగ్గా సమానంగా ఉంటాయి. "ఒకే ఒక బలం ఉండడం అసంభవం; సమానంగానూ వ్యతిరేకంగానూ రెండు బలాలు ఉండాలి; అలా ఎప్పుడూ ఉంటున్నాయి కూడా."

ప్రాతిపదికలైన ప్రాకృతిక కార్యకలాపాలు, అవి మాయలోంచి పుట్టినవేనన్న సంగతిని బయలుపరుస్తున్నాయి. ఉదాహరణకు, విద్యుత్తు, ఆకర్షణ వికర్షణల

* 54, 57 పుటల్లో అధోజ్ఞాపిక చూడండి.

దృగ్విషయం, దాని ఎలక్ట్రాన్‌లూ ప్రోటాన్లూ (ఋణ విద్యుదణువులూ ధనవిద్యుదణువులూ) పరస్పర విరుద్ధమైన విద్యుత్ శక్తులు. మరో ఉదాహరణ: భౌతిక పదార్థంలో పరమ సూక్ష్మకణమైన పరమాణువు (ఆటం) భూమి మాదిరిదే; ధన, ఋణ ధ్రువాలుగల అయస్కాంతం. ఈ భౌతిక ప్రపంచం యావత్తూ ధ్రువత్వ నిరంకుశాధికారానికి లోబడి ఉన్నది; భౌతిక శాస్త్రానికికాని, రసాయన శాస్త్రానికి కాని, మరేశాస్త్రానికికాని సంబంధించిన ఏ నియమమూ, స్వతసిద్ధమైన వ్యతిరేక సూత్రాలు లేదా విరుద్ధ సూత్రాలు లేకుండా లేదు.

అటువంటప్పుడు భౌతికశాస్త్రం, సృష్టికి స్వరూపమూ, నిర్మాణమూనయిన మాయకు అతీతంగా నియమాలు రూపొందించలేదు. ప్రకృతే మాయ; కాబట్టి ప్రకృతిశాస్త్రం, దాని అనివార్య సహజగుణంతో వ్యవహరించక తప్పదు. దాని పరిధిలో అది, శాశ్వతమూ అక్షయమూ; భవిష్యత్ విజ్ఞాన శాస్త్రవేత్తలు, అసంఖ్యాకమైన దాని వివిధాకృతుల్లో ఏదో ఒకదాన్ని అన్వేషించడానికి మించి మరేమీ చెయ్యలేరు. ఆ విధంగా విజ్ఞానశాస్త్రం, చరమతత్త్వాన్ని చేరుకోలేక ఎప్పటికీ ప్రవాహస్థితిలోనే ఉండిపోతుంది; నిజానికది, అప్పటికే సిద్ధంగా ఉండి పనిచేస్తున్న విశ్వానికి సంబంధించిన నియమాల్ని ఆవిష్కరించడానికి తగినదే కాని, నియమ నిర్ణేతా ఏకైక సూత్రధారీ అయిన పరమాత్మను కనుక్కోడానికి అశక్తమయినది. గురుత్వాకర్షణ, విద్యుత్తుల ఘనమైన అభివ్యక్తులయితే తెలియవచ్చాయి కాని అసలు గురుత్వాకర్షణ, విద్యుత్తు అన్నవి ఏమిటో ఏ మర్త్యుడూ ఎరగడు.*

వేల సంవత్సరాలుగా ప్రవక్తలు మానవ జాతికి అప్పగించినపని మాయను అధిగమించాలన్నదే. సృష్టిలోని ద్వంద్వానికి అతీతుడై సృష్టికర్త ఏకత్వాన్ని దర్శించడమే మానవుడి సర్వోన్నత లక్ష్యంగా భావించడం జరిగింది. విశ్వభ్రాంతిని పట్టుకుని పాకులాడేవాళ్ళు దాని ధ్రువత్వ నియమాన్ని - అంటే ఆటూ పోటూ, లేవడమూ పడడమూ, పగలూ రాత్రీ, సుఖమూ దుఃఖమూ, మంచీ చెడూ, పుట్టుకా చావూ అన్నవాటిని - అంగీకరించక తప్పదు. మనిషికి కొన్నివేల మానవ జన్మలు గడిచి వచ్చిన తరవాత ఈ చక్రగతిక్రమం, వేదనాభరితమైన ఒక రకం విసుగుదలను కలిగిస్తుంది; అప్పుడతను, మాయామయ నిర్బంధాల వెలుపలికి ఆశగా దృష్టి సారించడం మొదలుపెడతాడు.

---

* గొప్ప ఆవిష్కర్త అయిన మార్కొనీ, చరమతత్త్వాలముందు శాస్త్ర అసమగ్రతను అంగీకరిస్తూ ఇలా చెప్పాడు : "జీవితాన్ని పరిష్కరించడం విషయంలో విజ్ఞానశాస్త్రానికి గల అసమర్థత అద్వితీయమైనది. విశ్వాసమే కనక లేక పోయినట్లయితే ఈ యథార్థం నిజంగా భయంకరంగా ఉండేది. మనిషి ఆలోచనకు ఎదురయే సమస్యల్లో అన్నిటికన్న ఎక్కువగా ఎప్పుడూ వేధించే సమస్య జీవిత రహస్యమేనన్నది నిశ్చయం."

మాయ అనే ముసుగును తొలగించడమంటే, సృష్టి రహస్యాన్ని ఛేదించడమన్న మాట. ఈ విధంగా విశ్వాన్ని వశ్నీకరించేవాడే నిజమైన ఏకేశ్వరోపాసకుడు. తక్కినవాళ్ళందరూ ధర్మవిరుద్ధమైన విగ్రహాల్ని ఆరాధిస్తున్నవాళ్ళే. మనిషి, ప్రకృతి లాలూకు ద్వంద్వతామాయలకు అధీనుడై ఉన్నంతకాలం, ద్వంద్వ ముఖాలు గల మాయే అతనికి ఆరాధ్య దేవత; ఏకైక సత్యదైవాన్ని అతను తెలుసుకోడు.

మాయ అనే ప్రపంచ భ్రాంతి, మనుషుల్లో అవిద్యగా పొడచూపుతుంది; అవిద్య అంటే, "జ్ఞానం కానిది," అజ్ఞానం, మాయ. ఈ 'మాయ' లేదా 'అవిద్య' తార్కిక దృఢవిశ్వాసంవల్లకాని విశ్లేషణవల్ల కాని ఎన్నడూ నాశనం కాజాలదు; కేవలం నిర్వికల్ప సమాధి అనే ఆంతరిక స్థితిని సాధించడం ద్వారా మాత్రమే నాశనమవుతుంది. బైబిలు పాత నిబంధన గ్రంథ ప్రవక్తలూ అన్ని దేశాల ద్రష్టలూ మునులూ ఆ చైతన్య స్థితిలో ఉండే పలికారు.

ఎజెకీల్ * ఇలా అన్నాడు : "తరవాత ఆయన నన్ను గుమ్మం దగ్గరికి తీసుకు వచ్చాడు. ఆ గుమ్మం సైతం తూర్పువేపు ఉంది : ఇజ్రాయెల్ దేవుడి శోభ తూర్పు దిక్కు మంచి ప్రసరించింది : ఆయన స్వరం సముద్ర ఘోషలా ఉంది: ఆయన శోభతో ప్రకాశించింది భూమి". నుదుటిమీద (తూర్పు) ఉన్న దివ్య నేత్రం ద్వారా, యోగి, "అనేక సముద్రాల" దివ్యఘోష అనే శబ్దాన్ని లేదా ఓంకారాన్ని వింటూ తన చైతన్యాన్ని సర్వవ్యాపకత్వంలోకి ప్రయనింప చేస్తాడు: ఈ ఓంకారమే, సృష్టిలోని ఏకైక సత్తకు కారకమైన కాంతి ప్రకంపన.

విశ్వంలోని అనేక కోట్ల నిగూఢ రహస్యాలలో అతి అద్భుతమైనది కాంతి. శబ్ద తరంగాల సంచారానికి గాలికాని ఇతర భౌతిక వాహకాలు కాని అవసర మవుతాయి. కాని కాంతి తరంగాలు, శబ్ద తరంగాల మాదిరిగా కాకుండా, రోదసి లోని అంతర్నక్షత్ర శూన్యంగుండా స్వేచ్ఛగా సంచరిస్తాయి. తరంగ సిద్ధాంతం ప్రకారం కాంతికి అంతర్గ్రహ వాహకంగా పనిచేస్తుందని చెప్పే, పరికల్పితమైన ఈథర్‌ను కూడా ఐన్‌స్టైన్ చెప్పిన కారణాల వల్ల పరిహరించ వచ్చు; రోదసికున్న జ్యామితీయ గుణధర్మాలు, ఈథర్ సిద్ధాంతం అనవసరమయేటట్టు చేస్తాయని అన్నాడాయన. వీటిలో ఏ ఒక్క పరికల్పన ప్రకారమైనా కూడా కాంతి, ప్రాకృతిక దృశ్యమానరూపాల్లో ఏ ఒక్కదానికన్న అయినా అత్యంత సూక్ష్మంగానూ భౌతిక ఆలంబన రహితంగానూ ఉంటుంది.

ఐన్‌స్టైన్ బృహత్తర భావనల్లో సాపేక్షతా సిద్ధాంతంలో ప్రాముఖ్యం వహించేది కాంతివేగం - సెకనుకు 1,86,000 మైళ్ళు. మానవుడి పరిమిత మనస్సుకు

---

* ఎజెకీల్ : 43.1-2 (బైబిలు)

సంబంధించినంతవరకు, ప్రవాహశీలకమైన విశ్వంలో ఏకైక స్థిరరాశి కాంతివేగమేనని ఆయన గణితశాస్త్రపరంగా నిరూపించారు. మానవుల దేశ, కాల ప్రమాణాలన్నీ ఏకైక "నిరపేక్షం" అయిన కాంతివేగం మీదే ఆధారపడి ఉంటాయి. ఇంతకు పూర్వం అనుకుంటూ వచ్చినట్టుగా, దేశకాలాలు వేరువేరు శాశ్వత కారకాలు కావు అవి సాపేక్షమైన, పరిమితి కారకాలు. వాటికి నియత మాపన మాన్యతలు కాంతివేగ ప్రమాణాన్ని బట్టే లభిస్తాయి.

కాలం, పరిణామాత్మక సాపేక్షతగా రోదసిలో చేరడంవల్ల దాని సరైన స్వభావం ఇప్పుడు వెల్లడి అయింది : సరళమైన సందిగ్ధతాసారమే అది. ఐన్‌స్టైన్, కొన్ని సమీకరణాల కలంపోట్లతో, ఒక్క కాంతిని మినహాయించి, తక్కిన ప్రతి స్థిరసత్యాన్నీ విశ్వంనుంచి బహిష్కరించేశాడు.

ఉత్తరోత్తరా రూపొందించిన ఏకీకృత క్షేత్ర సిద్ధాంతం (యూనిఫైడ్ ఫీల్డ్ థియరీ)లో ఆ మహనీయ భౌతికశాస్త్రవేత్త, గురుత్వాకర్షణ, విద్యుదయస్కాంత తత్వాల నియమాల్ని కేవలం ఒకే ఒక్క గణిత సూత్రంలో పొందుపరిచే ప్రయత్నం చేశాడు. బ్రహ్మాండ స్వరూపాన్ని, ఒకే నియమం మీద ఆధారపడ్డ వివిధ రూపాంతరాలుగా సంక్షేపించిన ఐన్‌స్టైన్, అనేక యుగాల్ని అడ్డంగా దాటిపోయి, సృష్టికి గల ఏకైక స్వరూపం, బహురూపధారణ చేసే మాయ అని ప్రకటించిన ఋషుల సరసకు చేరాడు.*

నవశకానికి నాంది పలికిన సాపేక్షతా సిద్ధాంతాన్ని ఆధారం చేసుకొనే పరమాణువును అన్వేషించగల అవకాశాలు గణితశాస్త్రపరంగా బయలుపడ్డాయి. అణువనేది శక్తేకాని పదార్థంకాదని చెప్పడమే కాక, ఆ అణుశక్తి మూలతః మనోద్రవ్యమని ఈనాడు గొప్పగొప్ప శాస్త్రవేత్తలు ధైర్యంగా నొక్కి చెబుతున్నారు.

"భౌతికశాస్త్రం ఛాయా లోకానికి సంబంధించినదన్న యథార్థమైన గ్రహింపు, అత్యంత గణనీయంగా పేర్కోదగ్గ అభివృద్ధులలో ఒకటి," అని రాశాడు సర్ ఆర్థర్ స్టాన్లీ ఎడింగ్టన్, 'ది నేచర్ ఆఫ్ ది ఫిజికల్ వరల్డ్'† (భౌతిక ప్రపంచ స్వభావం)

* విద్యుదయస్కాంత సిద్ధాంతానికి భూమ్యాకర్షణ సిద్ధాంతానికి మధ్య నున్న సంబంధం (link) ఒక గణితశాస్త్రపరమైన సూత్రం (Unified Field Theory) ద్వారా వ్యక్తం చెయ్యవచ్చునని ఐన్‌స్టైన్ గాఢంగా విశ్వసించాడు. ఈ పుస్తకం వ్రాయబడే సమయానికి ఆ సూత్రం సాధించడంలో నిమగ్నమయి ఉన్నాడు. తన పని పూర్తి చెయ్యకుండానే ఆయన గతించినప్పటికీ, నేడు ఎందరో భౌతికశాస్త్రవేత్తలు అటువంటి ఒక సంబంధము ఉత్తరోత్తరా కనుగొనగలమనే భావిస్తూ ఐన్‌స్టైన్ విశ్వాసంతో ఏకీభవిస్తున్నారు. - ప్రచురణకర్త గమనిక

† మాక్మిలన్ కంపెనీ

అనే గ్రంథంలో. "భౌతికశాస్త్ర ప్రపంచంలో మనం, పరిచిత జీవిత నాటకం తాలూకు ఛాయాచిత్ర ప్రదర్శనను గమనిస్తాం. ఛాయారూపమైన నా చేతిముడుసు, ఛాయారూపమైన టేబులు మీద ఆనుకుని ఉండగా, ఛాయారూపమైన సిరా, ఛాయారూపమైన కాయితం మీద ప్రవహిస్తూ ఉంటుంది. ఇదంతా ప్రతీకాత్మకం, ప్రతీకగానే విడిచిపెడతాడు దాన్ని, భౌతికశాస్త్రజ్ఞుడు. తరవాత వస్తాడు, మనస్సనే రసవాది; ఈ ప్రతీకల్ని అతను రూపాంతరణ చేస్తాడు. .... చివరికి స్థూలంగా చెప్పాలంటే, "ప్రపంచ మూలద్రవ్యం మనో ద్రవ్యమే!"

ఇటీవల ఎలక్ట్రాన్ మైక్రోస్కోప్ (ఋణ విద్యుదణు సూక్ష్మదర్శిని) రూపొం దించిన మీదట, అణువులకు సారభూతమయిన కాంతికీ ప్రకృతికి అనివార్యమైన ద్వంద్వతకూ నిశ్చితమైన నిదర్శనం లభించింది. 1937లో, అమెరికన్ ఎసోసియేషన్ ఫర్ ది ఎడ్వాన్స్‌మెంట్ ఆఫ్ సైన్స్ అన్న సంస్థవారి సమావేశంలో జరిగిన, ఎలక్ట్రాన్ మైక్రోస్కోప్ ప్రయోగ ప్రదర్శనను గురించి 'ది న్యూయార్క్ టైమ్స్' పత్రిక ఇలా రాసింది :

> "ఇంత వరకు పరోక్షంగా ఎక్స్‌రేలనే కిరణాల ద్వారా మాత్రమే తెలిసిన, టంగస్టన్ స్ఫటికాకృతి, ఒక ఫ్లోరసెంట్ స్క్రీన్ (వెల్తురు తెర) మీద స్ఫుటంగా నిలిచింది. ఘనాకారం గల అంతరజాలకం (స్పేస్ లాటిస్)లో తొమ్మిది అణువులు వాటివాటి సరైన స్థానాల్లో ఉన్నాయి: అంటే ఒక్కొక్క మూల ఒక్కొక్క అణువు చొప్పున, మధ్య మరొకటి. టంగ్‌స్టన్ స్ఫటిక జాలకంలోని అణువులు వెల్తురు తెరమీద, జ్యామితీయమైన నమూనాలో అమర్చిన కాంతి బిందువులుగా పొడ గట్టాయి. స్ఫటిక ఘనరూపమైన కాంతిలో తాడనం చేస్తున్న గాలి సూక్ష్మ కణాల్ని, నర్తిస్తున్న కాంతి బిందువులుగా గమనించవచ్చు కదులుతున్న నీటిమీద మిలమిల మెరిసే సూర్యకాంతి బిందువుల్ని పోలి ఉంటాయి ఇవి.
>
> "ఎలక్ట్రాన్ సూక్ష్మదర్శిని సూత్రాన్ని మొట్టమొదట 1927లో, న్యూయార్క్ నగరంలోని బెల్ టెలిఫోన్ ప్రయోగశాలల్లో పనిచేసే డా॥ క్లింటన్ డేవిస్‌సన్, డా॥ లెస్టర్ హెచ్. జెర్మర్ కనిపెట్టారు. ఎలక్ట్రాన్‌కు ద్వంద్వ ప్రకృతి ఉందనీ, కణగుణాన్నీ తరంగగుణాన్నీ కూడా కనబరుస్తుందనీ వారు కనుక్కొన్నారు.* తరంగగుణం, ఎలక్ట్రాన్‌కు కాంతి గుణాన్నిచ్చింది. కటకం (లెన్స్) ద్వారా కాంతిని కేంద్రీకరింప జేసిన మాదిరిగానే ఎలక్ట్రాన్‌లను కూడా కేంద్రీకరింపజేసే సాధనంకోసం అన్వేషణ మొదలయింది.

---

* అంటే, పదార్థమూ శక్తీ రెండూ అన్నమాట.

"భౌతిక ప్రకృతి పరిధికంతకూ ద్వంద్వ వ్యక్తిత్వముందని నిరూపించిన, ఎలక్ట్రాన్‌కున్న జెకిల్ - హైడ్ లక్షణాన్ని (ద్వంద్వ ప్రవృత్తిని) కనిపెట్టినందుకు గాను డా॥ డేవిస్‌సన్, భౌతికశాస్త్రంలో నోబెల్ బహుమానం అందుకున్నాడు.

'ద మిస్టీరియస్ యూనివర్స్'* (అంతుబట్టని విశ్వం) అన్న గ్రంథంలో సర్ జేమ్స్ జీన్స్, "జ్ఞానప్రవాహం, యాంత్రికంకాని వాస్తవంవేపు ప్రయాణిస్తోంది ఇప్పుడు విశ్వం, ఒక గొప్ప యంత్రంలా కాక, ఒక గొప్ప భావనలా గోచరించడం మొదలవుతోంది," అని రాశాడు.

ఈ విధంగా ఇరవయ్యో శతాబ్ది విజ్ఞానశాస్త్రం, అనాది వేదపారంలా ధ్వనిస్తోంది.

కనక, భౌతిక విశ్వమనేది ఏదీ లేదనీ, 'మాయే' దాని పడుగుపేకలనీ తెలిపే దార్శనిక సత్యాన్ని మానవుడు, విజ్ఞాన శాస్త్రం ద్వారా తెలుసుకోవాల్సి ఉంటే అలాగే తెల్సుకోనివ్వండి. వాస్తవమనే భ్రాంతి కలిగించే, దాని ఎండమావులన్నీ విశ్లేషణలో కరిగిపోతాయి. తనకు భరోసా ఇచ్చే, భౌతిక జగత్పరమయిన ఆధారాలు ఒకదాని తరవాత ఒకటిగా తనకింద కుప్పగూలిపోతూ ఉంటే మానవుడు తన విగ్రహారాధక ఆలంబనను - అంటే, "నేను తప్ప మరే దేవుళ్ళూ నీకు ఉండ కూడదు,"† అన్న దైవాజ్ఞను తాను ఉల్లంఘించానన్న విషయాన్ని - అస్పష్టంగా గ్రహిస్తాడు.

ద్రవ్యరాశికీ శక్తికీ గల సమానత్వాన్ని, తన ప్రఖ్యాత సమీకరణంలో సమీక్షిస్తూ ఐన్‌స్టైన్, పదార్థంలోని ఏ ఒక్క కణంలోని శక్తి అయినా, దాని ద్రవ్యరాశిని - అంటే బరువును - కాంతివేగ వర్గంతో గుణిస్తే వచ్చే ఫలితానికి సమానమని నిరూపించాడు. పదార్థ కణాల నాశనం ద్వారానే అణుశక్తుల్ని విడుదలచెయ్యడం జరిగింది. పదార్థం "మృతి" అణుయుగానికి జన్మ ఇచ్చింది.

కాంతివేగం గణితశాస్త్రీయమైన ఒక ప్రమాణం లేదా స్థిరరాశి కావడానికి కారణం, సెకనుకు 1,86,300 మైళ్ళ వేగంలో నిరపేక్షమైన విలువ ఒకటి ఉందని కాదు; వేగంతోబాటు ద్రవ్యరాశి కూడా పెరుగుతూ ఉండే భౌతిక వస్తువు ఏదీ కూడా కాంతివేగానికి చేరుకోలేకపోవడమే దానికి కారణం. మరోరకంగా చెప్పాలంటే ద్రవ్యరాశి అనంతంగా ఉన్న భౌతిక వస్తువు మాత్రమే కాంతివేగానికి సమాన వేగం పొందగలదు.

---

* కేంబ్రిడ్జి యూనివర్సిటీ ప్రెస్

† ఎక్సోడస్ 20.3 ( బైబిలు)

ఈ భావన మనల్ని, అలౌకిక ఘటనల నియమం దగ్గరికి చేరుస్తుంది.

ఇచ్ఛానుసారంగా తమ శరీరాల్నీ ఇతర వస్తువుల్నీ దృశ్యమానంకాని అదృశ్యం కాని చెయ్యగలిగి, కాంతివేగంతో సంచరించగలిగి, ఏ భౌతిక రూపాన్నయినా సరే తక్షణమే ప్రత్యక్షం కావించడానికి సృజనాత్మక కాంతి కిరణాల్ని ఉపయోగించ గలిగిన సిద్ధపురుషులు నియమానుసారమైన నిబంధనను నెరవేర్చి ఉంటారు: వారి ద్రవ్యరాశి అనంతం.

పరిపూర్ణ యోగి చైతన్యం సంకుచిత శరీరంతో కాకుండా, విశ్వ స్వరూపంతోనే అప్రయత్నంగా ఏకాత్మకమయి ఉంటుంది. గురుత్వాకర్షణ అన్నది, న్యూటన్ చెప్పిన "బలం" (ఫోర్స్) అయినా, ఐన్‌స్టైన్ చెప్పిన "జడత్వ ఆవిర్భావం" (మానిఫెస్టేషన్ ఆఫ్ ఇనర్షియా) అయినా భార ధర్మాన్ని ప్రదర్శించాలన్న నిర్బంధం యోగులకు విధించజాలనిది; ఇక్కడ భారధర్మమంటే, భౌతిక వస్తువులన్నిటికీ భేదాన్ని సూచించే గురుత్వాకర్షణ స్థితి. తనను తాను సర్వవ్యాపకమయిన ఆత్మగా ఎరిగిన వాడు దేశకాలాల్లోని దేహపరిమితులకు బద్ధుడై ఉండడు. 'సోహం' శక్తి ముందు బంధనాలు పటాపంచలయిపోతాయి.

"వెలుతురు ఉండుగాక! వెంటనే వెలుతురు వచ్చింది."* విశ్వాన్ని సృష్టించ డానికి దేవుడిచ్చిన మొదటి ఆదేశం, నిర్మాణపరంగా ఆవశ్యకమయిన కాంతిని ఆవిర్భవింపజేసింది. ఈ పదార్థేతర వాహకం తాలూకు కిరణాల మీదనే దైవ సాక్షాత్కారాలన్నీ ఆవిర్భవిస్తాయి. దేవుడు జ్వాలగానూ కాంతిగానూ సాక్షాత్క రిస్తాడన్న విషయాన్ని ప్రతి యుగంలోని భక్తులూ ధ్రువపరుస్తారు. "ఆయన కళ్ళు అగ్నిజ్వాలల మాదిరిగా ఉన్నాయి," అంటాడు సెంట్ జాన్. "... అంతే కాకుండా, ఆయన ముఖాకృతి ప్రచండ భానుతేజంలా ఉంది."†

పూర్ణధ్యానం ద్వారా తన చైతన్యాన్ని సృష్టికర్తలో లయం చేసిన యోగి, జగత్సారాన్ని కాంతిగా (ప్రాణశక్తి స్పందనలుగా) దర్శిస్తాడు. అతని దృష్టిలో, జలకల్పన కారకమైన కాంతి కిరణాలకీ భూకల్పన కారకమైన కాంతి కిరణాలకీ భేదం ఉండదు. పదార్థ స్పృహనుంచీ, దేశం (స్పేస్) తాలూకు మూడు పరిమాణాల నుంచీ నాలుగో పరిమాణమైన కాలం నుంచీ విముక్తుడైన యోగి తన కాంతి రూప దేహాన్ని, భూమి, నీరు, అగ్ని, వాయువుల కాంతి కిరణాలమీదగా గాని, వాటిగుండా గాని సమాన సౌలభ్యంతో మరో చోటికి బదిలీ చేస్తాడు.

---

* జెనిసిస్ 1-3 (బైబిలు)

† రివలేషన్ 1 14-16 (బైబిలు)

"కాబట్టి నీది ఒక్కటే కన్ను అయినట్లయితే, నీ దేహమంతా 'కాంతితో నిండి' ఉంటుంది"* ముక్తిప్రదమైన దివ్య చక్షువుమీద దీర్ఘకాలం నిలిపిన ఏకాగ్రత పదార్థానికీ దాని గురుత్వాకర్షణ భారానికీ సంబంధించిన భ్రాంతులన్నిటినీ యోగి నశింపజేసేటట్లు చేసింది. విశ్వాన్ని అతను, ఈశ్వరుడు సృష్టించినట్టే మూలత, అభేదమైన కాంతిపుంజంలాగే - చూస్తాడు.

"దృశాబింబాలు (ఆప్టికల్ ఇమేజెస్), మామూలు హాఫ్‌టోన్ (అర్ధబిందు) చికిలిపని చిత్రాలు రూపొందే సూత్రం మీదే ఏర్పడతాయి; అంటే, కంటికి కనిపించనంత చాలా చిన్నచిన్న చుక్కలతో ఏర్పడతాయి.... నేత్రపటలం (రెటీనా) సూక్ష్మగ్రాహ్యత ఎంత గొప్పదంటే, సరైన తీరు కాంతిని అతిస్వల్ప పరిమాణాల్లో ఉపయోగించుకుని దర్శన సంవేదనను కలిగిస్తుంది," అంటాడు, హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో పనిచేసే డా॥ ఎల్.టి. ట్రోలాండ్.

సృష్టి సారాన్ని కాంతిగా అనుభూతం చేసుకున్న ఏ వ్యక్తికయినా సరే అలౌకిక ఘటనల నియమం పనిచేస్తుంది. సర్వవ్యాపక కాంతి అణువుల్ని ఇంద్రియ గోచర రూపంగా తక్షణమే ప్రక్షేపించడానికి యోగి, కాంతి దృగ్విషయాల గురించి తనకు గల దివ్యజ్ఞానాన్ని ఉపయోగించ గలుగుతాడు. ప్రక్షేపణ వాస్తవరూపం (ఒక చెట్టు, ఒక మందు, ఒక మానవదేహం; ఏదైనా సరే) యోగి అభిలాషను బట్టి, అతని సంకల్పశక్తినిబట్టి, మానస దర్శనశక్తిబట్టి నిర్ణయమవుతుంది.

రాత్రివేళ మనిషి స్వప్నచేతన స్థితిలోకి ప్రవేశించి, పగటిపూట తన చుట్టూ ఆవరించి ఉండే, అహంభావపరమైన తప్పుడు పరిమితుల నుంచి తప్పించుకు పోతాడు. నిద్రలో అతనికి, అతని మనస్సుకున్న సర్వశక్తిమత్త్వం ఎప్పటికీ పునరావర్తనమయే విధంగా ప్రదర్శితమవుతూ ఉంటుంది. కలలో, ఏనాడో చనిపోయిన అతని స్నేహితులూ బహుదూరపు ఖండాలూ చిన్ననాటి పునరుత్థిత దృశ్యాలూ అన్నీ అవుపిస్తాయి.

మనుషులందరూ కొన్ని కలలో స్వల్పకాలం అనుభవించే పరిమితులు లేని స్వేచ్ఛాచైతన్యం దైవానుసంధానంలో ఉన్నయోగుల నిత్య మనఃస్థితి దేశ కాలాలకు అధిపతి అయి, వ్యక్తిగత ఉద్దేశాలేవీ పెట్టుకోకుండా, సృష్టికర్త తనకు ప్రసాదించిన సృజనాత్మక ఇచ్ఛాశక్తిని ఉపయోగించుకొంటూ యోగి, భక్తుడు చిత్తశుద్ధితో చేసిన ఏ ప్రార్థననైనా సరే ఫలింపజేయడానికి, విశ్వంలోని కాంతి అణువుల్ని పునర్వ్యవస్థితం చేస్తాడు.

---

* మత్తయి 6-22 (బైబిలు)

"మానవుణ్ణి మన రూపంలో, మన లక్షణాలతో తయారుచేద్దాం. సముద్రంలో ఉన్న చేపలమీద, గాలిలో పక్షులమీద, పశువులమీద, సమస్త భూమి మీద, నేలమీద పాకే ప్రతి జీవిమీదా వాళ్ళకు అధికారం ఇద్దాం, అనుకొన్నాడు దేవుడు."*

ఈ ప్రయోజనం కోసమే మనిషినీ సృష్టినీ చెయ్యడం జరిగింది : ఈ విశ్వం మీద తన ఆధిపత్యాన్ని తెలుసుకొని మాయకు అధికారిగా అతడు పెరగాలని.

1915 సంవత్సరంలో, నేను సన్యాసం తీసుకొన్న కొద్దికాలం తరవాత, ఒక చిత్రమైన దర్శనం కలిగింది. దాని ద్వారా నాకు చైతన్యంలోని సాపేక్షతల అవగాహన కలిగింది; 'శాశ్వత కాంతి' ఏకత్వాన్ని స్పష్టంగా చూడగలిగాను. ఒకనాడు పొద్దున, గడ్‌పార్ రోడ్డులో ఉన్న నాన్నగారి ఇంట్లో, నా చిన్న అటక గదిలో కూర్చుని ఉండగా నాకు ఈ దర్శనం కలిగింది. అప్పటికి కొన్ని నెలలుగా, మొదటి ప్రపంచ యుద్ధం యూరప్‌లో చెలరేగుతూ ఉంది; అధిక సంఖ్యలో సంభవిస్తున్న మరణాల్ని గురించి నేను దిగులుగా ఆలోచిస్తూ ఉన్నాను.

నేను ధ్యానంలో కళ్ళు మూసుకునే సరికి, నా చైతన్యం హఠాత్తుగా, ఒక యుద్ధనౌకమీద ఆధిపత్యంవహించి ఉన్న ఒక కెప్టెన్ శరీరం లోకి బదిలీ అయింది. అటు ఒడ్డున ఉన్న ఫిరంగులూ ఇటు ఓడ ఫిరంగులూ ఒకదానిమీద ఒకటి కాల్పులు జరుపుతూ ఉండగా ఆకాశం దద్దరిల్లిపోతోంది. ఒక పెద్ద ఫిరంగిగుండు వచ్చి మా మందుగుండు కొట్టుకు తగిలి, నా ఓడను బద్దలు చేసింది. ఈ పేలుడులో బతికిన కొద్దిమంది నావికులతోబాటు నేను కూడా నీళ్ళలోకి దూకాను.

గుండె దడదడలాడుతూ ఉండగా, నేను సురక్షితంగా ఒడ్డుకు చేరాను కాని దురదృష్టం! చెదురుపాటుగా వచ్చిపడ్డ గుండు ఒకటి నా ఛాతీలోకి దూసుకు పోయింది. నేను మూలుగుతూ నేలమీద పడ్డాను. నా శరీరమంతా పక్షవాతం వచ్చినట్టుగా అయింది. అయినా తిమ్మిరెక్కిన కాలు తెలుస్తూనే ఉన్నట్టుగా, నాకు శరీరం మీద స్పృహ తెలుస్తూనే ఉంది.

"చివరికి, మృత్యుదేవత రహస్య పదవిన్యాసం నన్ను అందుకొంది," అను కున్నాను. కడపటి నిట్టూర్పుతో నేను అచేతన స్థితిలోకి జారిపోబోతూ ఉండగా, ఆశ్చర్యం! నేను గడ్‌పార్ రోడ్డులోని ఇంటి గదిలో పద్మాసనంలో కూర్చుని ఉన్నానని గమనించాను.

ఛాతీలో తుపాకిగుండు లేని శరీరాన్ని తిరిగి పొందినందుకు నేను ఆనంద భరితుణ్ణయి, దాన్ని చేతులతో తట్టి, గిల్లి చూసుకుంటూ ఉంటే, నా కళ్ళలోంచి

* జెనిసిస్ 1·26 (బైబిలు)

ఆనంద బాష్పాలు ధారగా స్రవించాయి. నేను బతికే ఉన్నానని రూఢి చేసుకోడానికి ముందుకూ వెనక్కూ ఉయ్యాల ఊగాను; ఊపిరి పీలుస్తూ విడుస్తూ చూసుకున్నాను. నన్ను నే నిలా అభినందించుకుంటూ ఉండగా, నా చైతన్యం మళ్ళీ రక్తసిక్తమైన సముద్ర తటాన పడిఉన్న కెప్టెన్ శవంలోకి బదిలీ అయిపోయింది అంతా గందరగోళమయి పోయింది నా మనస్సు.

"ప్రభూ, నేను చనిపోయానా బతికున్నానా?" అంటూ ప్రార్థించాను.

కళ్ళు మిరుమిట్లు గొలిపే మహోజ్జ్వల కాంతి ఒకటి క్షితిజమంతటా నిండింది. మృదువైన మర్మరధ్వని ప్రకంపన ఒకటి మాటలుగా మారింది·

"బతుక్కయినా చావుకయినా కాంతితో ప్రమేయమేమిటి? నా కాంతి బింబంతో నిన్ను సృష్టించాను. చావుపుట్టుకల సాపేక్షతలు విశ్వ స్వప్నానికి చెందినవి నీ స్వప్నాతీత సత్తను దర్శించు! మేలుకో నాయనా, మేలుకో!"

మానవుడి జాగృతిలో మెట్లు మెట్లుగా, ఈశ్వరుడు తన సృష్టిలోని రహస్యాల్ని, సరైన సమయంలో, సరైనచోట ఆవిష్కరించడానికి విజ్ఞానశాస్త్రవేత్తల్ని ఉత్తేజపరుస్తూ ఉంటాడు. ఈ విశ్వాన్ని, దైవప్రజ్ఞతో సంచాలితమయ్యే కాంతి అనే ఏకైక శక్తికి వివిధరూపాల అభివ్యక్తిగా గ్రహించడానికి అనేక ఆధునిక ఆవిష్కరణలు మానవుడికి తోడ్పడతాయి. చలనచిత్రం, రేడియో, టెలివిజన్ రేడార్, కాంతి విద్యుద్ఘటం (ఫొటో ఎలక్ట్రిక్ సెల్) - ఆశ్చర్యకరమైన "విద్యున్నేత్రం" (ఎలక్ట్రిక్ ఐ), పరమాణు శక్తులు అనే అద్భుతాలన్నీ కాంతికున్న విద్యుదయస్కాంత దృగ్విషయం మీద ఆధారపడ్డవే.

చలనచిత్రకళ ఏ అలౌకిక ఘటననయినా చిత్రీకరించగలదు. ప్రభావోత్పాదక దృశ్య దృక్కోణం నుంచి, ట్రిక్ ఫొటోగ్రఫీకి వశంకాని అద్భుతమంటూ ఏదీ లేదు. మానవుణ్ణి, స్థూలమైన భౌతికకాయం నుంచి లేస్తున్న పారదర్శక సూక్ష్మ శరీరంగా చూడవచ్చు; అతను నీళ్ళ మీద నడవగలడు, చనిపోయిన వాళ్ళను తిరిగి బతికించవచ్చు, వికాసాల్లోని సహజక్రమాన్ని ముందు వెనకలు చెయ్యవచ్చు. దేశకాలాల్ని అస్తవ్యస్తం చేసి పారెయ్యవచ్చు. నేర్పరి అయినవాడు ఛాయాచిత్ర బింబాల్ని తన ఇష్టం వచ్చినట్టు కూర్చవచ్చు; నిజమైన సిద్ధ పురుషుడు వాస్తవమైన కాంతి కిరణాలతో చేసే మాదిరిగానే దృష్టి విభ్రమాలు సాధించవచ్చు.

సజీవ సాదృశ్యంగల బింబాల్ని ప్రదర్శించే చలన చిత్రాలు, సృష్టికి సంబంధించిన అనేక సత్యాల్ని కళ్ళకు కట్టిస్తాయి. విశ్వ (చలనచిత్ర) దర్శకుడు తన నాటకాలు తనే రాసుకుంటాడు; అనేక శతాబ్దాల వేడుక కోసం, భారీ సంఖ్యలో పాత్రల్ని సమకూరుస్తాడు. అనంతత్వమనే అంధకార శిబిరంలోంచి ఆయన

యుగయుగాంతరాల ఫిల్ములగుండా తన కాంతి కిరణాల్ని ప్రసరింపజేస్తాడు; మహాకాశమనే తెరమీద బొమ్మలు పడుతూ ఉంటాయి.

సినిమా బొమ్మలు వాస్తవాలుగా కనిపించినప్పటికీ, అవి కేవలం వెలుగు నీడల కలయికలు మాత్రం అయినట్టు విశ్వసంబంధమైన రూపాలు కూడా వాస్తవికతా భ్రాంతి కలిగిస్తాయి. అసంఖ్యాక జీవరాశులు గల గ్రహగోళాలు, ఒకానొక విశ్వచలనచిత్రంలోని ఆకృతులే తప్ప మరేమీ కావు. మానవుడి జ్ఞానేంద్రియా లైదింటికీ తాత్కాలికంగా నిజమనిపించే ఈ అనిత్య దృశ్యాలు, మానవ చైతన్యమనే తెరమీద, అనంత సృజనాత్మక కిరణం ప్రసరింపజేసినవే.

సినిమా ప్రేక్షకుడు తలపైకి ఎత్తి, తెరమీది బొమ్మలన్నీ నిరాకారమైన ఒక కాంతి కిరణం ద్వారానే కనిపిస్తున్నట్టు చూడవచ్చు. వన్నెవన్నెల జగన్నాటకం కూడా అదేమాదిరిగా, ఒక విశ్వమూలం తాలూకు ఏకైక శ్వేతకాంతినుంచే వెలువడుతోంది. దేవుడు తన పిల్లలకోసం, అనూహ్యమైన చాతుర్యంతో తన గ్రహ ప్రదర్శనశాలలో "అధికతమ బ్రహ్మాండ" వినోదాన్ని ప్రదర్శిస్తున్నాడు; వాళ్ళనే నటీనటుల్నీ ప్రేక్షకుల్నీ చేస్తున్నాడు.

ఒకనాడు నేను, యూరప్ యుద్ధరంగాలకు సంబంధించిన న్యూస్ రీల్ చూడ్డానికి ఒక సినిమా హాల్లోకి ప్రవేశించాను. పాశ్చాత్యంలో మొదటి ప్రపంచ యుద్ధం ఇంకా చెలరేగుతూనే ఉంది; మారణ కాండను ఆ న్యూస్‌రీల్ ఎంత వాస్తవికంగా చూపించిందంటే, నేను హృదయ వ్యథతో హాల్లోంచి బయటికి వచ్చేశాను.

"ప్రభూ, అటువంటి బాధను నువ్వెందుకు అనుమతిస్తావు?" అని ప్రార్థించాను.

నాకు అత్యంత ఆశ్చర్యం కలిగే విధంగా, నిజమైన యూరప్ యుద్ధరంగాల అంతర్దర్శన రూపంలో, తక్షణమే నాకు సమాధానం వచ్చింది. చచ్చిపోయిన వాళ్ళతోటీ, పోతూ ఉన్న వాళ్ళతోటీ నిండిఉన్న దృశ్యాలు, ఏ న్యూస్‌రీల్ ప్రదర్శన కయినా ఎంతో మించి ఉండేటంత భయంకరంగా ఉన్నాయి.

"పట్టిపట్టి చూడు!" అంటూ ఒక మృదుస్వరం, నా అంతశ్చేతనతో పలికింది. "ఇప్పుడు ఫ్రాన్సులో నటిస్తున్న ఈ దృశ్యాలు, వెలుగు నీడల సయ్యాటలు తప్ప మరేమీ కావని గమనిస్తావు. ఇవి విశ్వచలనచిత్ర దృశ్యాలు; ఒక నాటకంలో అంతర్నాటకంలా - ఇంతకుముందు నువ్వు చూపిన సినిమా న్యూస్ రీల్ ఎంత నిజమైనదో ఇవి అంత నిజమైనవి, లేదా అది ఎంత అబద్ధమైనదో అవి అంత అబద్ధమైనవి."

నా గుండె ఇంకా కుదుటబడలేదు. దివ్యవాణి ఇంకా చెప్పింది: "సృష్టి వెలుగూ నీడా - రెండూను; లేకపోతే బొమ్మ రావడం అసంభవం. మాయా పరమైన మంచిచెడ్డలు, ఒకదాని తరవాత మరొకటి ఎప్పటికీ ప్రాబల్యం పొందుతూనే ఉంటాయి. ఈ లోకంలో, ఆనందం అనంతంగానే కనక ఉండి ఉంటే, మానవుడు ఎన్నడయినా మరొకదాన్ని కోరుకుంటాడా? బాధలేనిదే, తాను తన నిత్య నివాసాన్ని విడిచిపెట్టానన్న సంగతి గుర్తు చేసుకోడానికి ఒక్క నాటికి ప్రయత్నించడు. బాధ అనేది జ్ఞాపకానికి ములుగఱ్ఱ. దీన్ని తప్పించు కొనే ఉపాయం జ్ఞానం. మరణమనే విషాదం అవాస్తవం; దాన్ని తలుచుకొని గడగడలాడేవాళ్ళు, రంగస్థలం మీద జరుగుతున్న నాటకంలో తన మీదికి పేల్చింది ఖాళీ తూటాయే అయినా జడుసుకొని ప్రాణంవిడిచే అవివేకపు నటుడిలాంటి వాళ్ళు. నా పిల్లలు వెలుతురు మొలకలు; వాళ్ళు ఎల్లకాలం మాయలోనే నిద్రపోతూ ఉండరు."

నే నంతకుముందు, మాయను గురించి ధార్మిక గ్రంథాల్లో రాసినవి చదివే ఉన్నప్పటికీ, సొంతగా కలిగిన అంతర్దర్శనానుభవంతోనూ దాంతోబాటు విన వచ్చిన అనునయ వాక్యాలతోనూ కలిగినంత గాఢమైన అంతర్దృష్టి ఆ గ్రంథాలవల్ల కలగలేదు. సృష్టి అనేది కేవలం, బృహత్తరమైన ఒక చలన చిత్రమే ననీ తన సత్త (ఉనికి) దాంట్లో కాకుండా దానికి అతీతమైనదాంట్లో ఉందనీ చివరికి నమ్మకం కుదుర్చుకొన్ననాడు, ఎవరి విలువలయినా సమూలంగా మారిపోతాయి.

నేను ఈ అధ్యాయం రాయడం పూర్తిచేసిన తరవాత, నా పక్కమీద పద్మాసనం వేసుకుని కూర్చున్నాను. నా గదిలో,* షేడ్లుగల రెండు దీపాలనుంచి వెలుతురు పలచగా పడుతోంది. నా చూపు పైకి లేపుతూ గది కప్పువేపు చూశాను: అక్కడ చుక్కలు తీర్చినట్టు, సన్నసన్నని ఆవాల వన్నె వెలుగులు కానవచ్చాయి; అవి రేడియం మాదిరి కాంతితో, మిణుకుమిణుకుమంటూ వణుకుతూ ఉండడం గమనించాను. వానజల్లులాంటి అసంఖ్యాకమైన కాంతిశలాకలు, ఒకచోట కూడి పారదర్శక స్తంభాకృతి పొంది మెల్లగా నా మీద పడుతున్నాయి.

వెంటనే నా భౌతికదేహం తన స్థూలత్వాన్ని కోల్పోయి సూక్ష్మదేహంగా మారిపోయింది. పక్కను అంటీ అంటకుండా, బరువులేని నా దేహం, ఒకోసారి ఎడమవేపుకీ ఒకోసారి కుడివేపుకీ కొద్దికొద్దిగా కదులుతూ తేలుతున్నట్టు అనిపించింది. గది చుట్టూ కలియజూశాను; ఫర్నిచరూ గోడలూ మామూలుగానే ఉన్నాయి; కాని ఆ చిన్న కాంతిపుంజం ఎన్ని రెట్లు పెరిగిపోయిందంటే, గదిలో కప్పు అవుపడకుండా పోయింది. నేను ఆశ్చర్యచకితుణ్ణే అయాను.

* కాలిఫోర్నియా, ఎన్సినీటస్‌లోని సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ ఆశ్రమంలో (ప్రచురణ కర్త గమనిక).

"ఇదే బ్రహ్మాండ చలనచిత్ర యంత్రాంగం." కాంతిలోంచే వెలువడు తున్నట్టుగా, ఒక స్వరం పలికింది. "నీ పక్కబట్టల తెల్లటి తెరమీద తన కిరణాన్ని ప్రసరింపజేస్తూ నీ దేహచిత్రాన్ని రచిస్తోంది. చూడు, నీ రూపం, కాంతి తప్ప మరేం కాదు!"

నేను నా చేతులవేపు చూసుకుని ముందుకూ వెనక్కూ ఆడించాను. అయినా వాటి బరువు నాకు తెలియలేదు. ఒకానొక ఆనంద పారవశ్యం నన్ను ముంచెత్తేసింది. నా శరీరంగా రూపు గడుపుతున్న విశ్వకాంతి స్తంభం, సినిమా హాల్లో ప్రొజెక్షన్ బూత్‌లోంచి పారుతూ తెర మీద బొమ్మల్ని రూపు గట్టించే కాంతి కిరణాలకు దివ్యప్రత్యుత్పాదనలా పొడగట్టింది.

నా శరీర చలనచిత్రానుభవం, మసక వెలుతురుగల ప్రదర్శనశాల వంటి నా పడగ్గదిలో, చాలాసేపు పొందాను. అంతకు పూర్వం నాకు అనేక అంతర్దర్శ నాలు కలక్కపోలేదు; కాని ఇది వాటన్నిటికన్న విశిష్టమైనది. స్థూల శరీర భ్రాంతి పూర్తిగా తొలగిపోవడంతోను, సమస్త వస్తువుల సత్త్వమూ కాంతేనన్న అనుభూతి గాఢంకావడంతోనూ నేను పైకి, స్పందనశీలమైన ప్రాణాణువుల (లైఫ్‌ట్రాన్‌ల) ప్రవాహం వేపు చూసి :

"దివ్యజ్యోతీ, నా ఈ వినమ్ర దేహ చిత్రాన్ని దయచేసి నీలో కలిపేసుకో; ఎలిజాని జ్వాలారథంలో స్వర్గానికి తీసుకుపోయినట్టు,"* అని వినయపూర్వకంగా అన్నాను. ఈ ప్రార్థన ఎవరినయినా చకితుల్ని చేస్తుందన్నది స్పష్టం; కిరణం

---

* II కింగ్స్ 2·11 (బైబిలు).

అలౌకిక ఘటన ("మిరకిల్") అనేది సామాన్యంగా నియమరహితంగా గాని నియమానికి అతీతంగాగాని వచ్చే ఫలితంగా లేదా జరిగే ఘటనగా భావిస్తారు. కాని సునిశితంగా వ్యవస్థితమై ఉన్న విశ్వంలో సంభవించే ఘటనలన్నీ నియమానుసారంగా జరిగేవీ నియమానుసారంగా వివరించగలిగినవీను. మహాసిద్ధ పురుషుని అలౌకిక శక్తులనేవి, అతని ఆంతరిక చైతన్య జగత్తులో పనిచేసే సూక్ష్మనియమాల యథార్థావగాహన ననుసరించి సహజంగా సహచరించేవే.

ప్రతిదీ అలౌకిక ఘటనే నన్న గంభీరమైన అర్థంలో తప్పితే దేన్నీ "అలౌకిక ఘటన"గా చెప్పకూడదు మనలో ప్రతి ఒక్కరూ సంక్లిష్టంగా వ్యవస్థితమైన శరీరంతో రూపొంది ఉండడమూ నక్షత్రాల మధ్య రోదసిలో గుడిసుళ్ళు తిరుగుతూండే భూమిమీద మనని ఉంచడమూ - ఏమైనా అతిసామాన్యమైన విషయాలా? లేకపోతే అత్యలౌకిక ఘటనలా?

ఏసుక్రీస్తు, లాహిరీ మహాశయుల వంటి మహాప్రవక్తలు సాధారణంగా చాలా అలౌకిక ఘటనలు ప్రదర్శిస్తారు. అటువంటి మహానుభావులు మానవ జాతి కళ్యాణం కోసం, విస్తృతమూ కఠినమూ అయిన ఆధ్యాత్మిక లక్ష్యసాధనకు కృషి చెయ్యవలసి ఉంటుంది. కష్టాల్లో ఉన్నవారికి

అదృశ్యమయింది. నా శరీరానికి మళ్ళీ మామూలు బరువు వచ్చి పక్కలో కూల బడింది. మిరుమిట్లు గొలిపే గది కప్పునున్న దీపసమూహాలు అల్లల్లాడి ఆరిపోయాయి బహుశా నేను ఈ లోకాన్ని విడిచిపెట్టి వెళ్ళే సమయం ఇంకా ఆసన్నం కానట్టుంది.

"పైగా, నా అహంకారానికి ఎలిజాకి రవ్వంత కోపం కూడా రావచ్చు " అనుకున్నాను తాత్త్వికదృష్టితో.

---

అలౌకిక శక్తితో సాయపడ్డం దాంట్లో ఒక భాగంగా కనిపిస్తుంది (పే 285 అధోజ్ఞాపిక చూడండి) కుదర్చడానికి వీలుకాని జబ్బులకూ పరిష్కరించడానికి వీలుకాని మానవ సమస్యలకూ దైవాజ్ఞలు అక్కరపడతాయి కపెర్నహూమ్‌లో ఒక పెద్దమనిషి చావుబతుకుల్లో ఉన్న తన కొడుక్కి నయం చెయ్యమని కోరినప్పుడు ఏసుక్రీస్తు, ఇలా అన్నాడు · "మీరు సూచక క్రియలనూ అద్భుతాలనూ చూస్తే కాని నమ్మరు.' అని తరవాత అన్నాడు : "నీ దారిన నువ్వు వెళ్ళు నీ కొడుకు బతుకుతాడు' - యోహాను 4 46-54 (బైబిలు)

ఈ అధ్యాయంలో నేను, భౌతిక లోకాలకు ఆధారభూతమైన భ్రాంతిజనక ఇంద్రజాల శక్తి అయిన మాయకు వేదాల్లో ఇచ్చిన వ్యాఖ్యను వివరించాను. అణు "పదార్థం లో అసత్తు అనే "ఇంద్రజాలం" వ్యాపించి ఉంటుందని పాశ్చాత్య విజ్ఞానశాస్త్రం ఇప్పటికే కనిపెట్టింది అయితే, ప్రకృతి మట్టుకే కాకుండా, మనిషి కూడా (తన మర్త్యత్వపరంగా) మాయకు లోబడి ఉంటాడు; అంటే, సాపేక్షతా సిద్ధాంతం, పరస్పర వైరుధ్యం ద్వంద్వత, విలోమం, వ్యతిరేక స్థితులు అన్న వాటికి లోబడి ఉంటాడు.

మాయను గురించిన సత్యం ఋషులొక్కరికే అర్థమయిందని ఊహించుకోగూడదు బైబిలు పాత నిబంధన గ్రంథం ప్రవక్తలుమాయను సాతాను (హిబ్రూలో, "శత్రువు")' అన్న పేరుతో వ్యవహరించారు గ్రీకు టెస్టమెంటులో సాతానుకు సమానార్థకంగా డయబోలస్ లేదా డెవిల్ (దయ్యం) అన్న పదం వాడారు. సాతాను లేదా మాయ, ఏకైక నిరాకార సత్యాన్ని మరుగుపరచడానికి అనేకానేక రూపాలు కల్పించే బ్రహ్మాండ ఇంద్రజాలకుడు భగవంతుడి ప్రణాళికలోనూ ఆట (లీల)లోనూ సాతాను లేదా మాయకున్న ఏకైక ప్రయోజనం మానవుణ్ణి పరమాత్మనుంచి పదార్థానికీ సత్తునుంచి అసత్తుకూ మళ్ళించడానికి ప్రయత్నించడం.

మాయను క్రీస్తు, దయ్యమనీ, హంతకుడనీ, అబద్ధాలకోరు అనీ కళ్ళకు కట్టించే విధంగా వర్ణిస్తాడు. "దయ్యం... ఆది మంచీ హంతకుడే, అతని నివాసం సత్యంలో లేదు; అతనిలో సత్యం లేకపోవడమే దానికి కారణం అతను ఏదైనా అబద్ధం చెబితే, తనంతట తానే చెబుతాడు ఎంచేతంటే అతను అబద్ధాలకోరు; అతనే దాన్ని కల్పిస్తాడు " (యోహాను 8 44).

"దయ్యం ఆది మంచీ పాపం చేస్తూనే ఉన్నాడు. ఈ కారణంగా దేవుడి కుమారుడి ఆవిర్భావం జరిగింది; అతడు దయ్యం చేసే పనులు నాశనం చెయ్యడానికి." (I యోహాను 3 8). అంటే స్వయంగా మానవుడి సత్తలోనే ఉన్న కూటస్థ చైతన్యం (అంటే, క్రీస్తు చైతన్యం) ఆవిర్భావం, భ్రాంతుల్ని లేదా "దయ్యం పనుల్ని" అలవోకగానే నాశనం చేస్తుంది మాయ "ఆది నుంచీ" ఉండడానికి కారణం భౌతిక ప్రపంచాల్లో అది నిర్మాణాత్మకంగా అంతర్గతమై ఉండడమే ఇవి ఎప్పటికీ మార్పుకు లోనవుతూనే ఉంటాయి; ఈ పరివర్తనశీలత దైవ పరివర్తన రాహిత్యానికి విరుద్ధమైనది.

అధ్యాయం : 31

# పూజ్య మాతతో సమావేశం

"పూజ్యమాతాజీ, పసితనంలో నన్ను దీవెనలతో అనుగ్రహించినవారు అవతార పురుషులైన మీ పతిదేవులు. వారు మా తల్లిదండ్రులకీ, నా గురుదేవులైన శ్రీయుక్తేశ్వర్‌గారికి కూడా గురువులు. కనక, మీ పావన జీవనంలోని సంఘటనలు కొన్ని వినే మహదావకాశం నాకు ఇస్తారా?"

లాహిరీ మహాశయులు జీవిత సహధర్మచారిణి అయిన శ్రీమతి కాశీమణి గారిని ఇలా అడిగాను. కొద్దికాలం కాశీలో ఉండే అవకాశాన్ని వినియోగించుకుని ఈ పూజ్యురాలిని దర్శించాలని ఎంత కాలంగానో ఉన్నకోరిక ఇప్పుడు తీర్చుకుంటున్నాను.

లాహిరీ కుటుంబంవారి నివాస గృహంలో, ఆవిడ నాకు ఆదరపూర్వకంగా స్వాగతమిచ్చారు; ఆ ఇల్లు కాశీలో గరుడేశ్వర మొహల్లా అనేపేటలో ఉంది. వయస్సు పైబడినప్పటికీ ఆవిడ, ఆధ్యాత్మికసుగంధాన్ని వెదజల్లే పద్మంలా ఉన్నారు. ఆవిడది మధ్యరకం శరీరం; పసిమి చాయ, సన్నని మెడ, కాంతిమంతమైన విశాల నేత్రాలు.

"రా నాయనా, నువ్వు రావడం చాలా సంతోషం. మేడమీదికి రా."

కాశీమణిగారు తమ పతిదేవులతో కొంతకాలం కాపురమున్న ఒక చిన్న గదిలోకి దారి తీశారు. సాటిలేని ఆ మహానుభావులు, దాంపత్యమనే మానవ నాటకంలో తమ పాత్ర నిర్వహించడానికి దిగివచ్చి పావనం చేసిన మందిరాన్ని దర్శించడం నా భాగ్యంగా భావించాను. ఆ దయామయి నన్ను తమ పక్కనే ఒక మెత్తమీద కూర్చోబెట్టుకున్నారు.

"నేను మావారి దివ్యమహత్వాన్ని గ్రహించడానికి చాలా ఏళ్ళు పట్టింది," అంటూ ప్రారంభించా రావిడ. "ఒకనాడు రాత్రి, ఈ గదిలోనే నాకు స్పష్టమైన కల ఒకటి వచ్చింది. వెలుగులు విరజిమ్మే దేవదూతలు, ఊహకు అందనంత సుకుమారంగా, నాకు పైన, గాలిలో తేలుతున్నారు. ఆ దృశ్యం ఎంత వాస్తవికంగా

ఉందంటే, నాకు వెంటనే మెలుకువ వచ్చింది; చిత్రంగా, గది అంతా కళ్ళు మిరుమిట్లు గొలిపే కాంతితో నిండిపోయింది.

"మావారు పద్మాసనంలో ఉండి, గది మధ్యలో గాలిలో తేలుతున్నారు, దేవదూతలు అయన్ని చుట్టి ఉన్నారు. వారు వినయ విధేయతలతో చేతులు జోడించి మావారికి మొక్కుతున్నారు.

"అపరిమితంగా ఆశ్చర్యచకితురాల్ని అయి, నే నింకా కలగంటూనే ఉన్నానని సమాధాన పడ్డాను.

" 'నువ్వు కలగనడం లేదు. నీ నిద్ర విడిచిపెట్టు - ఎప్పటికీ, ఎల్లప్పటికీ' అంటూ వారు మెల్లగా నేలకు దిగివస్తూ ఉండగా, వారి పాదాల దగ్గిర మోకరిల్లాను.

" 'గురుదేవా,' అంటూ అరిచాను. 'మీకు మరీమరీ మొక్కుతాను! ఇంత కాలం మిమ్మల్ని నా భర్తగా భావించినందుకు క్షమిస్తారా నన్ను? నే నింతకాలం దివ్యజాగృతి పొందినవారి పక్కనే ఉంటూ, అజ్ఞానంతో నిద్రలో ఉండిపోయానని తెలుసుకుని సిగ్గుతో చచ్చిపోతున్నాను. ఈ పూటనుంచి మీరు నాకు భర్త కారు నా గురుదేవులు. ఈ అల్పాత్మురాలిని మీ శిష్యురాలిగా స్వీకరిస్తారా?'*

"గురుదేవులు నన్ను మృదువుగా స్పృశించారు. 'పవిత్రాత్మా, లే! నిన్ను స్వీకరించడమైంది.' వారు దేవదూతలవేపు చూపించారు. 'ఈ పావన సాధుపుంగవు లొక్కొక్కరికే ప్రణామం చెయ్యి.'

"నేను ప్రణామాంజలులు అర్పించడం పూర్తి అయిన తరవాత, ఆ దేవదూతల కంఠస్వరాలన్నీ కలసి సామవేదగానంలా ధ్వనించాయి.

" 'దివ్యపురుష సహధర్మచారిణీ, నువ్వు ధన్యజీవివి. నీ కివే మా నమస్సులు' అంటూ వారు నా పాదాలకు నమస్కరించారు. కాని ఆశ్చర్యం! వారి తేజో రూపాలు చటుక్కున మాయమయాయి. గది చీకటి అయిపోయింది.

"గురుదేవులు నన్ను క్రియాయోగ దీక్ష తీసుకోమన్నారు.

" 'తప్పకుండా. ఆ అదృష్టం ఇంతదాకా పొందకపోయినందుకు విచారిస్తున్నాను.'

" 'అప్పటికింకా కాలం పరిపక్వం కాలేదు,' అంటూ లాహిరీ మహాశయులు ఓదార్పుగా చిరునవ్వు నవ్వారు. 'నీ కర్మను నువ్వు చాలా మట్టుకు నశింపజేసు

---

* "అతడు దేవుడికోసమే, ఆమె అతనిలోని దేవుడికోసమే." - మిల్టన్.

కోడానికి నేను గోప్యంగా సాయపడ్డాను. నువ్విప్పుడు సుముఖంగా, సిద్ధంగా ఉన్నావు.'

"వారు నా నుదుటిని తాకారు. సుళ్ళు తిరిగే వెలుతురు ముద్దలు కనిపించాయి; ఆ వెలుతురు క్రమక్రమంగా నీలోపల వర్ణంగల ఆధ్యాత్మిక నేత్రంగా మారింది, దాని చుట్టూ బంగారు కడియం, మధ్యలో తెల్లటి ఐదు మొనల నక్షత్రం ఏర్పడ్డాయి.

" 'నీ చైతన్యం ఈ నక్షత్రం గుండా అనంత సామ్రాజ్యంలోకి చొచ్చుకు పోయేటట్టు చెయ్యి.' నా గురుదేవుల గొంతులో ఒక కొత్త స్వరం ధ్వనించింది, దూరం నుంచి వినవచ్చే సంగీత మార్దవంలా.

"అనేక అంతర్దృశ్యాలు - ఒకదాని తరవాత మరొకటి, నా ఆత్మ సాగర తీరాల మీద విరిగిపడే సముద్రపు నురగలా కనిపించాయి. ఆ సర్వదిగ్దర్శక గోళాలన్నీ చివరికి ఆనంద సాగరంలో కరిగిపోయాయి. అంతులేకుండా అలలు అలలుగా ఉప్పొంగుతున్న ఆ ఆనందసాగరంలో నన్ను నేను మరిచిపోయాను. కొన్ని గంటల తరవాత నాకు బాహ్య స్పృహ వచ్చినప్పుడు, గురుదేవులు నాకు క్రియాయోగ దీక్ష ఇచ్చారు.

"ఆ రాత్రి మొదలు లాహిరీ మహాశయులు, మరెన్నడూ నా గదిలో నిద్ర పోలేదు; ఆ తరవాత వారు, అసలు నిద్రపోలేదు. రాత్రీ పగలూ కూడా మేడ కింది ముందరి గదిలోనే శిష్యులతోబాటు ఉండిపోయారు."

ఇంతమట్టుకు చెప్పి ఆ పుణ్యశీల మౌనం వహించారు. ఆ మహాయోగితో ఆవిడకుగల సంబంధానికి ఉన్న విశిష్టతను గ్రహించి, మరికొన్ని జ్ఞాపకాలు చెప్పమని ఆవిణ్ణి అడగడానికి సాహసించాను.

"అబ్బాయి, నువ్వు ఆబగా ఉన్నావు. అయినా ఇంకొక్క కథ చెబుతాను," అంటూ సిగ్గుగా చిరునవ్వు నవ్వారావిడ. "నా గురు-పతి దేవుల విషయంలో నేను చేసిన పాపం ఒకటి నీ దగ్గిర చెప్పుకుంటాను. నాకు దీక్ష ఇచ్చిన కొన్ని నెలలకి, నేను ఏకాకినైపోయినట్టూ నా సంగతి ఎవరూ పట్టించుకోనట్టూ బాధ పడడం మొదలుపెట్టాను. ఒకనాడు పొద్దున లాహిరీ మహాశయులు, ఏదో వస్తువు తీసుకువెళ్లడంకోసం ఈ చిన్న గదిలోకి వచ్చారు. నేనూ గబగబా వారి వెనకాలే వచ్చాను. నన్ను మాయ కమ్మేసినందువల్ల ఆయనతో కఠినంగా మాట్లాడాను:

" 'ఎంతసేపూ మీరు మీ శిష్యులతోనే కాలక్షేపం చేస్తూంటారు. పెళ్ళాం పిల్లల గురించి మీ బాధ్యతల మాట ఏమిటి? ఇంట్లోవాళ్ళకోసం ఇంకొంచెం డబ్బు సంపాయించాలన్న ధ్యాసే మీకు లేకుండాపోయిందని నా విచారం.'

"గురుదేవులు ఒక్క క్షణం నావేపు చూశారు; అంతే! అప్పుడే అదృశ్య మయారు. భయాశ్చర్యాలు పెనవేసుకొని పోగా, గదిలో అన్నివేపులనుంచి ప్రతి ధ్వనిస్తున్న స్వరం ఒకటి విన్నాను :

" 'అంతా శూన్యం; కనబడ్డం లేదూ? నాలాంటి శూన్యం నీకోసం సంపద లెలా సంపాయించగలదు?'

" 'గురూజీ,' అని పిలిచాను. 'లక్షమాట్లు క్షమాపణ చెప్పుకుంటాను మీకు! నా పాపిష్టి కళ్ళు మిమ్మల్ని చూడలేకపోతున్నాయి; మీ పావన రూపంలో నాకు దర్శన మియ్యండి.'

" 'ఇక్కడున్నాను.' ఈ జవాబు పైనించి వచ్చింది. కళ్ళు పైకెత్తి చూద్దును కదా. గురుదేవులు గాలిలో సాక్షాత్కరించి ఉన్నారు; వారి తల గది కప్పును తాకుతోంది. చూసేవాళ్ళ కళ్ళు పోయేటంత తీవ్రమైన మంటల్లా ఉన్నాయి వారి కళ్ళు. భయంతో వజవజ వణుకుతూ, వారు ప్రశాంతంగా నేలకు దిగి వచ్చిన తరవాత ఏడుస్తూ, వారి పాదాలమీద పడిపోయాను.

" 'దివ్యసంపత్తిని అన్వేషించు; పనికిమాలిన ముచ్చిబంగారాన్ని కాదు లోపలి నిధిని కూర్చుకున్నాక, బయటి సంపత్తులు ఎప్పుడూ వస్తూ ఉండడం నువ్వే చూస్తావు," అన్నారు వారు. ఆ తరవాత, 'నా ఆధ్యాత్మిక సంతానంలో ఒకడు, నీ పోషణకోసం కొంత సమకూరుస్తాడు.'

"నా గురుదేవుల మాటలు సహజంగా నిజమయాయి: ఒక శిష్యుడు చెప్పు కోదగినంత మొత్తం మా కుటుంబం కోసం ఏర్పాటుచేశాడు."

కాశీమణిగారు అద్భుతమైన తమ అనుభవాలు నాకు చెప్పినందుకు ధన్య వాదాలు తెలిపాను.* ఆ మర్నాడు నేను మళ్ళీ ఆవిడ ఇంటికి వెళ్ళి తిన్‌కొడీ, దుకొడీ లాహిరీలతో దార్శనిక చర్చ చేస్తూ చాలా గంటలసేపు ఆనందంగా గడిపాను సాధుస్వభావులయిన వీరిద్దరూ, భారతదేశపు మహాయోగులయిన లాహిరీ మహా శయుల పుత్రులు; వీరు తండ్రిగారి ఆదర్శాల అడుగు జాడల్లోనే నడిచారు ఇద్దరిదీ పసిమి చాయ; ఎత్తరులు, దృఢకాయులు; బవిరి గడ్డాలూ మృదుస్వరాలూ కలిగినవారు; ఆచారవిచారాల్లో పాతకాలపు పద్ధతులు కనిపిస్తాయి.

లాహిరీ మహాశయుల భార్య ఒక్కరే ఆయనకు శిష్యురాలు కారు. మా అమ్మతో సహా, ఇంకా కొన్ని వందలమంది ఉన్నారు. ఒకసారి ఒక శిష్యురాలు

* ఈ పూజ్య మాతృశ్రీ 1930 మార్చి 25న కాశీలో గతించారు.

ఆయన ఫోటో ఒకటి కావాలని గురువుగారిని అడిగింది. ఆవిడకు ఒక కాపీ ఇస్తూ, ఆయన ఇలా అన్నారు: "దీన్ని నువ్వు రక్షగా తలిస్తే అలాగే ఉంటుంది; లేకపోతే ఉత్తి బొమ్మే."

ఆ తరవాత కొన్నాళ్ళకి, ఈవిడా, లాహిరీ మహాశయుల కోడలూ కలిసి భగవద్గీత చదువుతూ ఉండడం తటస్థించింది. భగవద్గీత బల్లమీద పెట్టుకున్నారు. బల్ల వెనకాల గురువుగారి ఫొటో గోడకు వేలాడుతూ ఉంది. ఇంతలో మహా ప్రచండమైన ఉరుములూ మెరుపులతో గాలివాన మొదలయింది; పిడుగులు పడుతున్నాయి.

"లాహిరీ మహాశయా, మమ్మల్ని రక్షించండి!" అంటూ, ఆ ఆడవాళ్ళిద్దరూ పటం ముందు తలవాల్చి మొక్కారు. బల్లమీదున్న పుస్తకం మీద పిడుగు వచ్చి పడింది; కాని భక్తురాళ్ళిద్దరూ చెక్కు చెదరలేదు.

"మలమల మాడ్చే ఆ వేడి నుంచి కాపాడ్డానికి నా చుట్టూ మంచు దుప్పటి చుట్టినట్టు అనిపించింది," అని చెప్పింది శిష్యురాలు.

అభయ అనే శిష్యురాలి విషయంలో లాహిరీ మహాశయులు రెండు అలౌకిక అద్భుతాలు చేశారు. ఆవిడా, ఆవిడ భర్తా - ఈయన కలకత్తాలో లాయరు - కలిసి గురువుగారి దర్శనం కోసం ఒకనాడు కాశీకి బయలుదేరారు. రోడ్డు మీద రద్దీ ఎక్కువగా ఉండడంవల్ల, వాళ్ళ బండి ఆలస్యమయింది; వాళ్ళు కలకత్తాలో హౌరా మెయిన్ స్టేషన్‌కు చేరేసరికి, కాశీకి వెళ్ళే రైలు బయలు దేరడానికి సిద్ధంగా కూత వేస్తోంది.

టిక్కెట్ ఆఫీసు దగ్గిర అభయ ప్రశాంతంగా నించుంది.

"లాహిరీ మహాశయా, ఈ రైలు ఆపమని మిమ్మల్ని వేడుకుంటున్నాను!" అంటూ నిశ్శబ్దంగా ప్రార్థించింది. "మిమ్మల్ని చూడ్డానికి ఇంకో రోజు ఆలస్యమయితే కాచుకోడానికి పడే బాధ నేను భరించలేను."

బుసలు కొడుతున్న ఆ ట్రెయినుకు, చక్రాలు గిరగిరా తిరుగుతూనే ఉన్నాయి కాని ముందుకు సాగడమే లేదు. ఈ చిత్రం చూడడం కోసం, ఇంజినీరూ ప్రయాణికులూ ప్లాట్‌ఫారం మీదికి దిగారు. ఇంతలో, ఇంగ్లీషు రైల్వే గార్డు ఒకడు, అభయా వాళ్లాయనా ఉన్నచోటికి వచ్చాడు. ఆచారానికి విరుద్ధంగా ఆ గార్డు, వాళ్ళకి సాయం చెయ్యడానికి ముందుకు వచ్చాడు. "బాబూ, డబ్బు నా కివ్వండి. మీరు రైలెక్కుతూ ఉంటే నేను మీ టిక్కెట్లు కొని తెస్తాను" అన్నాడతను.

ఈ దంపతులు బండిలో కూర్చుని టిక్కెట్లు ఇలా అందుకున్నారో లేదో బండి మెల్లగా ముందుకు సాగడం మొదలయింది. ఇంజినీరూ ప్రయాణికులూ ఆందోళనగా బండిలోకి ఎగబడి, వాళ్ళవాళ్ళ స్థానాల్లోకి వచ్చి పడ్డారు. బండి ఎలా బయలుదేరిందో తెలియకపోవడం అటుంచి, అసలు మొదట ఎందుకు ఆగిందో కూడా తెలియలేదు.

కాశీలో లాహిరీ మహాశయుల ఇంటికి చేరి, నిశ్శబ్దంగా గురువుగారి ముందు మోకరిల్లి, ఆయన పాదాలు పట్టుకోడానికి ప్రయత్నించింది అభయ.

"మనసు కుదుట బరుచుకో, అభయా," అన్నారాయన. "నన్ను ఇబ్బంది పెట్టడం నీ కెంత ఇష్టం! తరవాతి బండిలో రాలేకపోదువనా!"

అభయ, చిరస్మరణీయమైన మరో సందర్భంలో లాహిరీ మహాశయుల్ని దర్శించింది. ఈసారి ఆయన సహాయం కావలసింది ట్రెయిను గురించి కాదు, సంతానం గురించి.

"నా తొమ్మిదో సంతానం బతికి బట్టకట్టేలా మీరు దీవించాలని నా ప్రార్థన. ఎనమండుగురు పిల్లలు పుట్టారు నాకు; అందరూ పుట్టగానే జారిపోయారు" అన్నదామె.

గురువుగారు సానుభూతితో చిన్నగా నవ్వారు. "ఈసారి పుట్టబోయే సంతానం బతుకుతుంది. నేను చేసే సూచనలు శ్రద్ధగా పాటించు. ఆడపిల్ల పుడుతుంది, రాత్రిపూట. తెల్లారేదాకా చమురుదీపం వెలుగుతూండేలా చూసుకో. నిద్రపోతూ దీపాన్ని కొండెక్క నివ్వకు."

అభయకు ఆడపిల్ల పుట్టింది; రాత్రిపూటే; సర్వద్రష్టలైన గురుదేవులు ముందుగా గ్రహించి చెప్పినట్టే, కచ్చితంగా. దీపంలో చమురు నింపుతూ ఉండమని ఆ తల్లి దాదికి పురమాయించింది. ఆ ఆడవాళ్ళిద్దరూ కంటికి కునుకు రాకుండా తెల్లారగట్ల దాకా మేలుకునే ఉన్నారు; కాని చివరికి నిద్ర పోయారు. దీపం కొండెక్కే స్థితికి వచ్చింది; వెలుగు సన్నగా అల్లల్లాడుతోంది. ఇంతలో, పడగ్గది తలుపు పెద్ద చప్పుడు చేస్తూ గభాలున తెరుచుకుంది. ఆడవాళ్ళు అదిరిపడి మేలుకున్నారు. ఎదురుగా లాహిరీ మహాశయుల రూపం చూసి ఆశ్చర్యపోయారు.

"అభయా, చూడు, కొంచెం ఉంటే దీపం కొండెక్కేదే!" అంటూ ఆయన దీపం వేపు చూపించేసరికి, చమురు పొయ్యడానికి దాది చటుక్కున లేచింది. దీపం మళ్ళీ నిండుగా వెలిగిన తరవాత గురుదేవులు అదృశ్యమయారు. తలుపు మూసుకుంది. కంటి కవుపడే సాధనం ఏదీ లేకుండానే గడియ పడింది.

అభయ తొమ్మిదో సంతానం బతికింది; 1935లో నేను వాకబు చేసేనాటికి ఆమె కులాసాగానే ఉంది.

లాహిరీ మహాశయుల శిష్యుల్లో, పూజ్యులు కాళీకుమార్‌రాయ్‌గారు, గురుదేవుల సన్నిధిలో తాము గడిపిన జీవితాన్ని గురించి మనోహరమైన వివరాలు నాకు అనేకం చెప్పారు.

"కాశీలో, వారింట్లో నేను తరచు, వరసగా వారాల తరబడి అతిథిగా ఉండేవాణ్ణి" అన్నారు రాయ్‌గారు. "చాలామంది సాధు సజ్జనులూ దండి స్వాములూ* మా గురుదేవుల పాదసన్నిధిని కూర్చోడానికి ప్రశాంతమైన రాత్రివేళ వస్తూండే వారు. ఒక్కొక్కప్పుడు వారు, ధ్యానానికీ వేదాంతానికీ సంబంధించిన విషయాలు ముచ్చటించుకుంటూ ఉండేవారు. తెల్లారగట్ల మళ్ళీ వెళ్ళిపోయేవారు, ఈ మాన్య అతిథులు. నేను అన్నిసార్లు వారింటికి వెళ్ళానుకాని, ఒక్కసారి కూడా వారు నడుము వాల్చడం చూడలేదు."

"గురుదేవుల సాంగత్యం ఏర్పడ్డ తొలి రోజుల్లో ఒకసారి, మా యజమాని ప్రతిఘటనను నేను ఎదుర్కోవలసి వచ్చింది," అంటూ ఇంకా చెప్పారు రాయ్‌గారు. "ఆయన భౌతికవాదంలో పాతుకుపోయిన మనిషి."

" 'మత పిచ్చిగాళ్ళు నా దగ్గిర పని చెయ్యక్కర్లేదు,' అంటూ ఎగతాళి చేసేవాడు. 'ఎప్పుడయినా నీ దంభాచారి గురువును కలుసుకోడమే జరిగితే ఆయన జ్ఞాపకం ఉంచుకొనేలా కొన్ని మాటలు చెబుతాను.' అన్నాడాయన.

"ఈ బెదిరింపు నా నిర్ణీత కార్యక్రమాన్ని ఆపలేకపోయింది; నేను దాదాపు ప్రతి సాయంత్రమూ నా గురుదేవుల సన్నిధిలో గడిపాను. ఒకనాడు రాత్రి మా యజమాని నా వెంబడి వచ్చి గురుదేవులు కూర్చునే గదిలోకి మొరటుగా చొరబడ్డాడు. అతను చెబుతానన్న మాటలు అనేసెయ్యడానికే తలపెట్టాడనడంలో సందేహం లేదు. అతను కూర్చోగానే లాహిరీ మహాశయులు, అక్కడున్న సుమారు పన్నెండుమంది శిష్యుల్ని చూసి ఇలా అడిగారు :

" 'మీ రో బొమ్మ చూస్తారా?'

* బ్రహ్మదండ సూచకంగా చేతిలో వెదురు కర్రను సాంప్రదాయికంగా తీసుకువెళ్ళే ఒక సాధువర్గంలో సభ్యులు. మనిషిలోని వెన్నుబామును బ్రహ్మదండంగా భావిస్తారు. నిద్రాణమైన ఏడు మేరుదండ కేంద్రాల్ని మేల్కొలిపి ఉత్తేజితపరచటాన్నే, భగవంతుని చేరే నిజమైన మార్గంగా పరిగణిస్తారు.

"మేము తల ఊపిన తరవాత వారు, గదిని చీకటి చెయ్యమన్నారు. 'ఒకరి వెనకాల ఒకరు గుండ్రంగా కూర్చుని, మీకు ముందున్న వ్యక్తి కళ్ళమీద చేతులు పెట్టండి,' అన్నారు వారు.

"మా యజమాని కూడా, అయిష్టంగానే అయినా, గురుదేవుల సూచనల్ని పాటిస్తూ ఉండడం చూసి నేనేమీ ఆశ్చర్యపోలేదు. కొన్ని నిమిషాల తరవాత మేము చూస్తున్నది ఏమిటో చెప్పమన్నారు, లాహిరీ మహాశయులు.

"గురుదేవా, అందమైన ఒక స్త్రీ కనిపించిందండి. ఆవిడ ఎర్రంచు చీర కట్టుకుని 'ఏనుగు చెవి' మొక్కదగ్గిర నించుని ఉంది' అన్నాను. తక్కిన శిష్యులందరూ కూడా అలాగే వర్ణించారు. గురుదేవులు మా యజమాని వేపు తిరిగారు. 'ఆమెను గుర్తుపట్టారా?' అన్నారు.

" 'గుర్తు పట్టానండి,' అన్నాడతను. అతని స్వభావానికి అలవాటు లేని కొత్త ఉద్రేకాలతో పెనుగులాడుతున్నట్టు స్పష్టమవుతోంది. 'నాకు మంచి భార్య ఉన్నా కూడా, ఈ మనిషికోసం తెలివితక్కువగా డబ్బు ఖర్చు పెట్టేస్తున్నాను. నేనిక్కడికి వేరే ఉద్దేశాలతో వచ్చినందుకు సిగ్గు పడుతున్నాను. నన్ను క్షమించి మీ శిష్యుడిగా స్వీకరిస్తారా?' అని అడిగాడు.

" 'ఆరు నెల్లపాటు నువ్వు మంచి నైతిక జీవితం గడిపేటట్టయితే నిన్ను స్వీకరిస్తాను,' అని, ఇంకో ముక్క కూడా అన్నారు, 'లేకపోతే నీకు దీక్ష ఇవ్వవల్సిన అవసరం రాదు నాకు.'

"మూడు నెల్లదాకా వ్యామోహాన్ని నిగ్రహించుకున్నాడు మా యజమాని ఆ తరవాత ఆవిడతో మళ్ళీ సంపర్కం కొనసాగించాడు. తరవాత రెండు నెల్లకు చనిపోయాడు. గురుదేవులు గోప్యంగా చెప్పిన జోస్యాన్ని అప్పుడర్థం చేసుకున్నాను "

లాహిరీ మహాశయులకు త్రైలింగస్వామి అనే సుప్రసిద్ధులైన స్నేహితులు ఉండేవారు; ఆయన వయస్సు మూడువందల ఏళ్ళకి పైబడి ఉండేదని ప్రతీతి ఈ యోగులిద్దరూ తరచుగా ఒకచోట కూర్చుని ధ్యానం చేస్తూ ఉండేవారు త్రైలింగ స్వాముల ప్రతిష్ఠ ఎంతగా వ్యాపించిందంటే, ఆయన చేసిన ఆశ్చర్య జనకమైన అలౌకిక చర్యలకు సంబంధించిన ఏ కథ అయినా సత్య దూరమని ఏ హిందువూ శంకించడు. ఏసుక్రీస్తే కనక ఈ లోకానికి తిరిగివచ్చి తన దివ్య శక్తులు ప్రదర్శిస్తూ న్యూయార్కు వీధుల్లో తిరుగుతూ ఉంటే, కొన్ని దశాబ్దుల కిందట త్రైలింగస్వాములు కాశీలో జనసమ్మర్దంగల సందుల్లో నడుస్తూ జనంలో ఎంత ఆశ్చర్యం కలిగించారో అంత ఆశ్చర్యమూ ఇప్పుడు కలుగుతుంది. కాల ప్రవాహం

కోతలకు గురికాకుండా భారత (తీర) దేశాన్ని సురక్షితం చేసిన సిద్ధుల్లో ఆయన ఒకరు.

ఈ స్వామి అనేక సందర్భాల్లో ఎంతో ప్రాణాంతకమైన విషాలు తాగడం, అయినా దుష్ఫలితాలు కలక్కపోవడం చూశారు జనం. ఆయన గంగానది మీద తేలుతూ ఉండడం వేలాది జనం చూశారు; వాళ్ళలో కొందరు ఇప్పటికీ బతికున్నారు. ఆయన వరసగా కొన్ని రోజులపాటు నీటిమీద కూర్చుని ఉండే వారట; లేకపోతే, ఏటి కెరటాల్లో మునిగి అతి దీర్ఘకాలం మరుగున ఉండే వారట. మలమలమాడే రాతి పలకలమీద, నిర్దయుడైన భారతీయ సూర్యుడి ధాటికి పూర్తిగా వెల్లడి అయిన స్వామివారి నిశ్చలదేహం, మణికర్ణికాఘట్టంలో ఒక సామాన్య దృశ్యం.

ఈ అసాధారణ కృత్యాల ద్వారా త్రైలింగస్వామి, మానవజీవితం, ఆక్సిజన్ మీదకాని నిశ్చిత పరిస్థితులమీదా ముందు జాగ్రత్తల మీదా కాని ఆధారపడ వలసిన అవసరం లేదని మానవులకు బోధించదలిచారు. ఆయన నీళ్ళపైన ఉన్నా లోపల ఉన్నా, ఆయన శరీరం ప్రచండ సూర్యకిరణాల్ని సవాలు చేసినా చెయ్యకపోయినా, తాము జీవించినది దివ్యచైతన్యంవల్లనేనని నిరూపించా రాయన: మృత్యుదేవత ఆయన్ని తాకలేకపోయింది.

ఆ యోగి, ఆధ్యాత్మికంగానే కాకుండా శారీరకంగా కూడా ఘనులే. ఆయన బరువు మూడువందల పౌన్లకు మించి ఉండేది : ఆయన జీవితంలో ఏడాదికో పౌను! ఆయన తినడం అరుదు కావడంతో ఇది మరింత ఆశ్చర్యం కలిగించింది. అయితే సిద్ధపురుషుడు, మామూలు ఆరోగ్య సూత్రాల్ని అన్నిటినీ తాను కోరుకున్నప్పుడు సులువుగా ఉపేక్షిస్తాడు; దానికి ఏదో ఒక ప్రత్యేక కారణం ఉంటుంది; ఆ కారణం, అతనికే తప్ప మరొకరికి తెలియనంత సూక్ష్మంగా ఉంటుంది.

విశ్వ మాయాస్వప్నం నుంచి మేలుకొని, ఈ ప్రపంచాన్ని దివ్యమానసం లోని ఒక భావంగా అనుభూతి కావించుకొన్న మహాయోగులు, శరీరంతో ఏం కోరుకుంటే అది చెయ్యగలరు; దాన్ని వారు, ఘనీభూత శక్తికి కార్యసాధక రూపంగా తెలుసుకొని ఉంటారు. పదార్థమనేది ఘనీభూతమైన శక్తి తప్ప మరేమీ కాదని భౌతిక శాస్త్రవేత్తలు ఇప్పుడయితే అవగాహన చేసుకుంటున్నారు కాని, పూర్ణసిద్ధి పొందిన యోగులు, పదార్థ నియంత్రణ విషయంలో, సిద్ధాంతం నుంచి ఆచరణకు విజయవంతంగా సాగారు.

త్రైలింగస్వామి ఎప్పుడూ పూర్తిగా దిసిమొలతో ఉండేవారు. విసుగెత్తిన కాశీ పోలీసులు ఆయన్ని, ఇబ్బందుల్లో పెట్టే పిల్లవాడిగా పరిగణించేవారు. ఈడెన్ తోటలో ఉన్న వెనకటి ఆదాము మాదిరిగానే ఈ 'సహజస్వామి'కి తమ నగ్నత స్పృహలో ఉండేది కాదు. కాని పోలీసుల కది స్పృహలో ఉండేది. అందువల్ల ఆయన్ని మర్యాదగా జైలుకు తీసుకువెళ్ళారు. దాంతో కలవరం పుట్టింది. కాసే పట్లోనే, త్రైలింగస్వామివారి భారీ శరీరం, దాని సహజ పరిమాణమంతతో, జైలు పైకప్పులమీద కానవచ్చింది. అప్పటికీ భద్రంగానే తాళంపెట్టి ఉన్న ఖైదుకొట్టు అందులోంచి ఆయన తప్పించుకున్న విధానానికి ఆధారమేదీ చూపించలేదు

న్యాయదేవత కళ్ళకు గంతలుంటాయి; త్రైలింగస్వామి విషయంలో, ఓటమిని ఎదుర్కొన్న పోలీసులు, ఆమె ఆదర్శాన్నే అనుసరించదలిచారు.

ఆ మహాయోగి, మౌనాన్ని* ఒక అభ్యాసంగా నిలుపుకుంటూ వచ్చారు. గుండ్రటి మొహం, పెద్ద పీపాలాంటి పొట్ట ఉన్నప్పటికీ త్రైలింగస్వామి, ఎప్పుడో అరుదుగా తినేవారు. వారాల తరబడి తిండి లేకుండానే ఉండి తరవాత, భక్తులు తమకు సమర్పించిన పెరుగు, కుండల కొద్దీ తాగేవారు. ఒకసారి ఒక సందేహ శీలుడు, త్రైలింగస్వామిని దాంభికుడిగా బయటపెడదామని నిర్ణయించుకున్నాడు గోడలకు వెల్లవేసే సున్నపు నీళ్ళు ఒక పెద్ద బాల్చీనిండా తెచ్చి స్వామి ముందు పెట్టాడు.

"స్వామీ," అంటూ దొంగభక్తి చూపిస్తూ ఆ భౌతికవాది, "మీ కోసం కొంచెం పెరుగు తెచ్చాను. దయచేసి సేవించండి," అన్నాడు.

త్రైలింగస్వామి ఏ మాత్రం వెనకాడకుండా, సలసల మరుగుతున్న సున్నపు నీటిని కడబొట్టువరకు, గేలన్లకొద్దీ తాగేశారు. మరికొద్ది నిమిషాల్లో ఆ దుష్కరుడు విలవిల్లాడుతూ నేలమీద పడ్డాడు.

"రక్షించండి స్వామీ, రక్షించండి. నేను నిప్పులమీదున్నాను. నా కుటిల పరీక్షకు క్షమించండి," అంటూ అరిచాడు.

మహాయోగి మౌనం చాలించారు. "దుర్మార్గుడా, నీ ప్రాణం, నా ప్రాణం ఒక్కటేనని, నాకు విషమిచ్చినప్పుడు గ్రహించలేదు నువ్వు. సృష్టిలో ప్రతి అణువులో

---

* ఆతడు 'ముని' (లేక monk) :- ఆధ్యాత్మిక నిశ్శబ్దం లేక మౌనం పాటించడం వల్ల సంస్కృతంలో ముని' శబ్దం (గ్రీకు భాషలోని 'మోనోస్' (ఏకాంతి ఒంటరి) అనే మాటకు దగ్గర ఆంగ్ల శబ్దాలు మాంక్ (monk) మరియు మోనిజమ్ (monism) ఈ 'మోనోస్' నించి పుట్టాయి.

ఉన్నట్టే భగవంతుడు నా పొట్టలో కూడా ఉన్నాడన్న జ్ఞానమే నాకు లేకపోయి ఉంటే, ఆ సున్నం నన్ను చంపేసి ఉండేది. ఎవరు చేసింది వారికే బెడిసికొడుతుందనే దాని దివ్యార్థం ఇప్పుడు తెలుసుకున్నావు కనక, ఇంకెప్పుడూ ఇల్లాటి పన్నాగాలు ఎవరి మీదా పన్నకు."

త్రైలింగస్వామి మాటలతో స్వస్థుడై ఆ పాపి చల్లగా జారుకున్నాడు.

బాధ తిరుగుముఖం పట్టడం, ఆ యోగి సంకల్పంవల్ల కాక, సృష్టి సుదూరతమ గోళాన్నిసైతం పరిచాలనం చేసే ధర్మసిద్ధాంతం* పనిచెయ్యబట్టి జరిగింది. త్రైలింగస్వామి మాదిరిగా దైవసాక్షాత్కారం పొందిన వ్యక్తుల విషయంలో దైవ నియమం పనిచేయడం తక్షణమే జరుగుతుంది; ఆ వ్యక్తులు అవరోధాలు కలిగించే అహంకార ప్రతికూల ప్రవాహాలన్నిటినీ శాశ్వతంగా బహిష్కరించి ఉంటారు.

ధార్మికత కుండే స్వయంచాలితమైన సర్దుబాట్ల మీద విశ్వాసం ఉంచితే (త్రైలింగస్వామిని చంపబోయినవాడి విషయంలో మాదిరిగా, తరచుగా అనుకోని విధంగా ప్రతిఫలమిస్తూ) మానవ అన్యాయంపట్ల మనకు కలిగే తొందరపాటు ఆగ్రహాన్ని అది ఉపశమింపజేస్తుంది. "ప్రతీకారం నాది, నేను తీర్చుకుంటాను, అంటాడు ప్రభువు"† మానవుడి క్షుద్ర సాధనాల అవసర మేమిటి? తిరుగుదెబ్బ తియ్యడానికి విశ్వమే సరిగా పన్నాగం పన్నుతుంది.

దైవన్యాయం, ప్రేమ, సర్వజ్ఞత్వం, అమరత్వం అన్నవాటికి గల అవకాశాన్ని మందబుద్ధులు నమ్మరు. "ధార్మిక గ్రంథాల నిరాధార కల్పనలు!"అంటారు; ఇలాటి అవివేక దృష్టిగల మనుషులు, బ్రహ్మాండదృశ్యాన్ని చూసి విస్మయం చెందకుండా, తమ జీవితాల్లో విషమఘటనా పరంపరను నడిపిస్తారు; చివరికది వాళ్ళని, జ్ఞానాన్వేషణకు నిర్బంధ పెడుతుంది.

ఆధ్యాత్మిక నియమానికున్న సర్వశక్తిమత్త్వాన్ని ఏసుక్రీస్తు, తాను జెరూసలెంలో విజయవంతంగా అడుగుపెట్టే సందర్భంలో ప్రస్తావించాడు. ఆయన శిష్యులూ జనబాహుళ్యమూ ఆనందనినాదం చేస్తూ, "స్వర్గానికి శాంతి, సర్వోన్నతుడికి శోభ" అంటూ అరిచినప్పుడు కొందరు ఫారిసీలు (ఛాందస పురోహితులు), హుందాతనం

---

* పోల్చి చూడండి, II కింగ్స్ 2 19-24 (బైబిలు) జెరిఖోలో ఎలిషా "జలశోధన" (హీలింగ్ ద వాటర్స్) అనే అలౌకిక అద్భుత చర్య ప్రదర్శించిన తరవాత కొందరు పిల్లలు ఆయన్ని హేళన చేశారు. "అప్పుడు అడవిలోంచి రెండు ఆడ ఎలుగుబంట్లు చొరబడి వచ్చి (వాళ్ళలో) నలభై (మీద) ఇద్దరు పిల్లల్ని చీల్చేశాయి."

† రోమన్స్ 12·19 (బైబిలు)

లేని ఆ దృశ్యాన్ని గురించి ఫిర్యాదు చేశారు. "స్వామీ, మీ శిష్యుల్ని చివాట్లు పెట్టండి," అన్నారు.

కాని ఏసుక్రీస్తు జవాబిస్తూ, తన శిష్యుల నోళ్ళు నొక్కేటట్లయితే, "తక్షణమే రాళ్ళు అరుస్తాయి"* అన్నాడు.

ఫారిసీల్ని ఇలా మందలించడంలో ఏసుక్రీస్తు, దైవీన్యాయం కేవలం ఒక ఆలంకారిక కల్పనకాదనీ, సాధుప్రవృత్తిగల వ్యక్తి నాలికని మొదలంటూ చీల్చేసినప్పటికీ, సృష్టికి ఆధారభూతమైన విశ్వవ్యవస్థలోనే ఆయన మాట వినవస్తుందనీ ఆయనకు రక్ష లభిస్తుందనీ సూచిస్తున్నాడు.

ఏసుక్రీస్తు ఇలా అన్నాడు : "సాధువర్తనుల నోళ్ళు మూయించాలనుకుంటున్నారా? అంతకన్న, ఎవరిమహిమనూ సర్వవ్యాపకత్వాన్నీ రాళ్ళు సైతం కీర్తిస్తున్నాయో ఆ దేవుడి గొంతు కూడా నులిమెయ్యాలని ఆశించండి మీరు. స్వర్గంలో శాంతిని కీర్తిస్తూ జనం వేడుక చేసుకోగూడదంటారా? భూమి మీద యుద్ధాలు జరిగినప్పుడే వాళ్ళు అసంఖ్యాకులుగా కూడి తమ సమైక్యాన్ని వ్యక్తం చేసుకోవాలని వాళ్ళకి సలహా ఇస్తారా? అయితే ఓ ఫారిసీల్లారా, భూమి పునాదులు పడగొట్టడానికి మీ ఏర్పాట్లు మీరు చేసుకోండి; ఏమంటే, సృష్టిలోని దివ్యసామరస్యాన్ని నిరూపించడానికి సాధుసజ్జనులేకాక రాళ్ళూ భూమీ నీరూ నిప్పూ గాలీ, మీ మీదికి విజృంభిస్తాయి."

క్రీస్తువంటి యోగిపుంగవులైన త్రైలింగస్వామివారి దయ, ఒకసారి మా మేనమామ మీద ప్రసరించింది. ఒకనాడు పొద్దున మా మామయ్య, కాశీలో ఒక రేవులో భక్తబృందం మధ్య ఉన్న స్వామిని చూశాడు. ఎలాగో దారి చేసుకుని గుంపులోకి చొరబడి త్రైలింగస్వామికి చాలాదగ్గరగా వెళ్ళి, సవినయంగా ఆయన పాదాలు ముట్టుకోగలిగాడు. బాధాకరమైన తన మొండిరోగం నుంచి తక్షణమే విముక్తి కలగడం చూసి ఆశ్చర్యపోయాడు.†

ఈ మహాయోగి శిష్యుల్లో సజీవులై ఉన్నట్టు తెలిసిన ఏకైక శిష్యురాలు శాంకరీమాయి జీవ్.‡ త్రైలింగస్వామి శిష్యుల్లో ఒకరి కుమార్తె అయిన ఈవిడ

---

* లూకా 19·37-40 (బైబిలు)

† త్రైలింగస్వామి, తదితర సిద్ధపురుషుల జీవితాలు మనకు ఏసుక్రీస్తు మాటల్ని జ్ఞాపకం చేస్తాయి : "నమ్మేవాళ్ళనే ఈ సూచనలు అనుసరించి వస్తాయి: నా పేరు (కూటస్థ చైతన్యం) మీద వాళ్ళు దెయ్యాల్ని విడిపిస్తారు· వాళ్ళు కొత్త భాషలో మాట్లాడతారు, పాముల్ని ఎత్తి పట్టుకుంటారు, వాళ్ళు ప్రాణాంతకమైనది ఏది తాగినా, అది వాళ్ళకు హాని చెయ్యదు : వాళ్ళు జబ్బు మనుషుల మీద చేతులు వేస్తారు, వాళ్ళు కోలుకుంటారు." - మార్కు 16.17-18 (బైబిలు)

‡ బెంగాలీ భాషలో గౌరవ సూచకం 'జీవ్.'

బాగా చిన్నప్పటినించి స్వామివారి తర్ఫీదు పొందారు. ఈవిడ నలభై ఏళ్ళపాటు, వరసగా బదరీనాథ్, కేదారనాథ్, అమరనాథ్, పశుపతినాథ్ క్షేత్రాల దగ్గరి హిమా లయ గుహల్లో ఏకాంతంగా నివసించారు. 1826లో పుట్టిన ఈ బ్రహ్మచారిణికి ఇప్పుడు నూరేళ్ళకి మించి ఉంటాయి. అయినా ఈవిడ, వయస్సు పై బడినట్టు కనిపించదు; నల్లటి జుట్టూ ముత్యాలవంటి పలువరసా ఆశ్చర్యకరమైన దార్ఢ్యమూ నిలుపుకొన్నారు. కొన్నేళ్ళకోసారి ఈవిడ, నియతకాలికంగా జరిగే పుష్కరాల్లో పాల్గొడానికని, ఏకాంతవాసం నుంచి బయటికి వస్తూ ఉంటారు.

ఈ సాధ్వి లాహిరీ మహాశయుల దర్శనానికి తరచు వెళ్తూ ఉండేవారు. ఒకనాడు ఈవిడ, కలకత్తాకుదగ్గరలో ఉన్న బారక్‌పూర్ పేటలో లాహిరీ మహా శయుల పక్కన కూర్చుని ఉండగా, మహాగురువులైన బాబాజీ, మెల్లగా గదిలోకి వచ్చి తామిద్దరితోటీ ముచ్చటించారని ఆవిడ చెప్పారు. "అమరులైన ఆ మహా గురువులు అప్పుడొక తడిబట్ట కట్టుకుని ఉన్నారు. ఏట్లో ఒక మునక వేసి అప్పుడే వచ్చినట్టు," అంటూ జ్ఞాపకం చేసుకున్నారు. "ఆధ్యాత్మికోపదేశం ఒకటి చేసి నన్ను దీవించారు వారు."

ఒకానొక సందర్భంలో త్రైలింగస్వామి కాశీలో, లాహిరీ మహాశయులకు ఒక బహిరంగ సమావేశంలో గౌరవాభినందనలు తెలపడం కోసం తమ మౌనవ్రతాన్ని విరమించారు. త్రైలింగస్వామి శిష్యుల్లో ఒకరు దీనికి అభ్యంతరం తెలిపారు.

"గురుదేవా, తాము స్వాములూ సన్యాసులూ అయి ఉండి, ఒక గృహస్థుకు అంత గౌరవం ఎందుకివ్వాలి?"

దానికి త్రైలింగస్వామి జవాబు ఇచ్చారు, "నాయనా, లాహిరీ మహాశయులు దివ్య మార్జాల కిశోరం లాంటివారు : ఆ జగన్మాత తనని ఎక్కడ ఉంచితే అక్కడే ఉంటున్నారు. దేని కోసం నేను - నా గోచీ గుడ్డతో సహా - ప్రతిదీ విడిచి పెట్టేశానో, ఆ పరిపూర్ణ సాక్షాత్కారాన్ని ఆయన సంసారిగా తమ పాత్ర తాము విధ్యుక్తంగా నిర్వహిస్తూనే సిద్ధింపజేసుకున్నారు.

అధ్యాయం : 32

# చనిపోయిన రాముణ్ణి బ్రతికించడం

"ఇప్పుడు లాజరు అనే ఆయన జబ్బుగా ఉన్నాడు.... ఆ సంగతి ఏసు విన్నప్పుడు, ' జబ్బు చావు కోసం వచ్చింది కాదు; దేవుడి మహిమ కోసం, దానివల్ల దేవుని కుమారుడు కూడా మహిమాన్వితుడు కావడం కోసం వచ్చింది', అన్నాడు."*

శ్రీయుక్తేశ్వర్‌గారు ఒకనాడు వెచ్చటి పొద్దుటి వేళ, శ్రీరాంపూర్ ఆశ్రమం బాల్కనీలో, క్రైస్తవ పవిత్ర గ్రంథాల్ని వ్యాఖ్యానిస్తూ ఉన్నారు. గురుదేవుల ఇతర శిష్యులు కొందరితోబాటు నేనుకూడా, కొద్దిమంది మా రాంచీ విద్యార్థులతో అక్కడున్నాను.

"ఈ సందర్భంలో ఏసు, తనను దేవుడి కుమారుడుగా చెప్పుకున్నాడు ఆయన నిజంగా దేవుడితో ఏకాత్ముడయి ఉన్నప్పటికీ, ఇక్కడ ఆయన ప్రస్తావనకు వ్యక్తిపరంకాని గంభీరమైన ప్రాముఖ్యం ఉంది," అని వివరించారు మా గురుదేవులు "దేవుడి కుమారుడంటే, మనిషిలో ఉన్న కూటస్థ చైతన్యం లేదా దివ్యచైతన్యం 'మర్త్య' డెవడూ దేవుణ్ణి మాహిమాన్వితుణ్ణి చెయ్యలేడు. మానవుడు తన సృష్టికర్తకు ఇయ్యగల ఒకే ఒక గౌరవమల్లా, ఆయన్ని అన్వేషించడం; మానవుడు తనకి తెలియని అమూర్తత్వాన్ని మహిమాన్వితం చెయ్యలేడు. ఋషుల తలల చుట్టూ ఉండే 'దివ్యప్రభ' లేదా కాంతి పరివేషం, దైవారాధన చెయ్యడానికి వారికి గల శక్తికి ప్రతీకాత్మక సాక్ష్యం.

చనిపోయిన లాజరు తిరిగి లేవడానికి సంబంధించిన అద్భుతకథను చదవడం శ్రీయుక్తేశ్వర్‌గారు కొనసాగించారు. కథ ముగిసిన తరవాత చాలాసేపు మౌనం వహించారు; పరిశుద్ధ గ్రంథం ఆయన మోకాలిమీద తెరిచే ఉంది.

"నాకు కూడా అలాటి అలౌకిక ఘటన ఒకటి చూసే భాగ్యం కలిగింది."

---

* యోహాను 11.1-4 (బైబిలు)

అన్నారు మా గురుదేవులు చివరికి, గంభీర భావయుక్తంగా. "లాహిరీ మహాశయులు, నా స్నేహితుణ్ణి, ఒకణ్ణి, చచ్చిపోయిన తరవాత మళ్ళీ బ్రతికించారు."

నా పక్కనున్న కుర్రవాళ్లు గాఢమైన ఆసక్తితో చిరునవ్వు నవ్వారు. వేదాంతం ఒకటే కాకుండా, ఆయన తమ గురువుగారి దగ్గర పొందిన అద్భుతమైన అనుభవాల్ని గురించిన ఏ కథ అయినా సరే, శ్రీయుక్తేశ్వర్‌గారిచేత చెప్పించుకుని, విని ఆనందించడానికి నాలో కూడా బాలకసహజమైన కోరిక ఇంకా తొంగి చూస్తూనే ఉంది.

"నా స్నేహితుడు రాముడూ, నేనూ ఒకరిని విడిచి ఒకరం ఉండే వాళ్ళం కాము," అంటూ మొదలుపెట్టారు గురుదేవులు. "అతను బిడియస్తుడూ, ఒంటరితనం కోరేవాడూ కావడంవల్ల, పగటి శిష్యబృందం ఉండని నడిరాత్రికీ తెల్లవారుజాముకూ మధ్య సమయంలోనే మా గురువుగారు లాహిరీ మహాశయుల్ని దర్శించడానికి వస్తూండేవాడు. నేను రాముడికి ప్రాణస్నేహితుణ్ణి కావడంచేత, తన గాఢమైన ఆధ్యాత్మికానుభవాల్ని చాలా మట్టుకు నాకు చెబుతూ ఉండేవాడు. ఆదర్శవంతమైన అతని సాంగత్యంలో నాకు ఉత్తేజం కలిగింది." మా గురుదేవుల ముఖం పాత జ్ఞాపకాలతో మార్దవమయింది.

"రాముడికి అకస్మాత్తుగా తీవ్రమైన పరీక్ష పెట్టడం జరిగింది," అంటూ చెప్పారు శ్రీయుక్తేశ్వర్‌గారు. "అతనికి ఏషియాటిక్ కలరా జబ్బు వచ్చింది. జబ్బు తీవ్రంగా ఉన్న సమయాల్లో వైద్యుల సేవ పొందడానికి మా గురువుగారు ఎన్నడూ అభ్యంతర పెట్టలేదు కాబట్టి, ఇద్దరు ప్రత్యేక వైద్యనిపుణులను పిలవడం జరిగింది. జబ్బు మనిషికి ఆదరాబాదరాగా ఉపచారం చేస్తున్న సమయంలో, లాహిరీ మహాశయుల్ని సహాయం చెయ్యమని గాఢంగా ప్రార్థిస్తూ ఉండేవాణ్ణి. ఆయన ఇంటికి పరిగెత్తి ఏడుస్తూ పరిస్థితి విన్నవించాను.

" 'రాముణ్ణి డాక్టర్లు చూస్తున్నారు గదా, బాగవుతాడు.' అంటూ మా గురువుగారు కులాసాగా చిరునవ్వు నవ్వారు.

"గుండె తేలికపడి, నేను తిరిగి మా స్నేహితుడి దగ్గరికి వెళ్ళాను. వెళ్ళి చూసేసరికి, అతను కొనఊపిరితో ఉన్నాడు." 'గంటా రెండుగంటలకన్న బతకడు' అన్నాడొక వైద్యుడు నాతో, నిస్పృహ వ్యక్తం చేస్తూ. మళ్ళీ లాహిరీ మహాశయుల దగ్గరికి పరిగెత్తాను.

" 'వైద్యులు చిత్తశుద్ధితో పనిచేసేవాళ్ళు. రాముడు బాగవుతాడని నా నమ్మకం.' గురువుగారు కులాసాగా పంపించేశారు నన్ను.

"నేను రాముడిదగ్గరికి తిరిగి వెళ్ళేసరికి, అప్పటికే డాక్టర్లు వెళ్ళిపోయారు వాళ్ళలో ఒకాయన నా కో చీటి రాసి పెట్టాడు : 'మాకు చేతనయినంతా చేశాం కాని ఇతని పరిస్థితి ఆశాజనకంగా లేదు.'

"మా స్నేహితుడిలో నిజంగా చావుకళ కనిపిస్తోంది. లాహిరీ మహాశయుల మాటలు నిజం కాకుండా ఎలా పోగలవో నాకు అర్థం కాలేదు; అయినా, త్వరత్వరగా కడబడుతున్న రాముడి ప్రాణం, 'అంతా అయిపోయింది,' అంటూ మనస్సుకు సూచిస్తూనే ఉంది. ఆ విధంగా నేను విశ్వాస శంకలనే ఆటుపోటు కెరటాలమధ్య అల్లాడిపోతూ, నేను చెయ్యగలిగినంత బాగా, అతనికి ఉపచారం చేశాను. అతను సత్తువ కూడదీసుకుని ఇలా అన్నాడు :

" 'యుక్తేశ్వర్, గురువుగారి దగ్గరికి వెళ్ళి, నేను పోయానని చెప్పు. అంత్య క్రియలు జరిగేలోగా నా దేహాన్ని దీవించమని అడుగు.' ఈ మాటలతో రాముడు బరువుగా నిట్టూర్చి ప్రాణం విడిచాడు.*

"నేను ఒక గంటసేపు అతని మంచం దగ్గర ఏడ్చాను. ఎప్పుడూ ప్రశాంతిని కోరుకునే అతడు, ఇప్పుడు చావులో పూర్తి చిరశాంతి పొందాడు. ఇంకో సహాధ్యాయి లోపలికి వచ్చాడు; నేను తిరిగి వచ్చేదాకా అతన్ని ఇంట్లో ఉండమని చెప్పాను సగం దిమ్మెరపోయి, కాళ్ళీడ్చుకుంటూ గురుదేవుల నివాసానికి మళ్ళీ వెళ్ళాను

" 'రాముడెలా ఉన్నా డిప్పుడు?' లాహిరీ మహాశయుల ముఖంలో చిరునవ్వులు విరుస్తున్నాయి.

"మహాశయా, ఎలా ఉన్నాడో మీరే కాస్సేపట్లో చూస్తారు, అంటూ ఆవేశం వెళ్ళగక్కాను. 'ఇంకొన్ని గంటల్లో, స్మశానానికి తీసికెళ్ళే ముందు అతని కట్టెను చూద్దురుగాని,' అంటూ వలవలా ఏడ్చేశాను.

" 'యుక్తేశ్వర్, మనసు చిక్కబట్టుకో, ప్రశాంతంగా కూర్చుని ధ్యానం చెయ్యి గురుదేవులు సమాధిలోకి వెళ్ళిపోయారు. మధ్యాహ్నం, రాత్రి ఎడతెగని మౌనంలోనే గడిచిపోయాయి; నేను మనస్సు కుదుట బరుచుకోడానికి ఎంత గింజుకున్నా ఫలితం లేకపోయింది.

ఉషోదయవేళ లాహిరీ మహాశయులు ఓదార్పుగా నావేపు చూశారు 'నువ్వింకా ఆందోళనగానే ఉన్నట్టు కనిపిస్తున్నావు. రాముడికి ఏదో ఒక మందు

* కలరా వ్యాధిగ్రస్తుడు చివరి క్షణం దాకా పూర్తి స్పృహతో చురుకుబుద్ధిలో ఉండే అవకాశం ఉంది.

ధ్యానంలో ప్రత్యక్ష పాఠం చదివి నా మంచి ఆశీస్సులు ఇచ్చానే ఎందుకు చెప్పలేదూ?" అంటూ గురుదేవులు మళ్ళీ ఆముదం పోసిఉన్న దీపం ప్రమిదకేసి చూపించారు. 'ఆ ప్రమిదలో ఉన్న నూనెలో ఒక చిన్న పుల్ల ముంచి ఏడు చుక్కలు రాముడి నోట్లో వెయ్యి.'

"గురుదేవా! అతను నిన్న మధ్యాహ్నమనగా చచ్చిపోయాడు. ఇప్పుడీ నూనె తీసుకెళ్ళి లాభమేమిటి?" అంటూ అభ్యంతరం చెప్పాను.

"'ఫరవాలేదు, నేను చెప్పినట్టు చెయ్యి.' నా గురువుగారి ఉల్లాసం నాకు అర్థంకాకుండా ఉంది; అప్పటికింకా నేను, వియోగం నుంచి తేరుకోలేదు. కొంచెం నూనె తీసుకుని రాముడి దగ్గరకు వెళ్ళాను.

"నా స్నేహితుడి శరీరం మృత్యువు పిడికిలిలో, బిగుసుకుపోయి ఉండడం చూశాను. అతని భయంకర స్థితిని పట్టించుకోకుండా, నా కుడి చేతి చూపుడు వేలితో అతని పెదాలు తెరిచి, ఎడం చేత్తో ఒక బిరడా తీసుకుని బిగపట్టుకున్న పళ్ళమీద ఒక్కొక్క చుక్కే నూనె వేశాను. చల్లటి పెదాలకు ఏడో చుక్క తగిలేసరికి, రాముడు గజగజా వణికిపోయాడు. అతను విస్మయంగా లేచి కూర్చుంటూ ఉండగా అరికాళ్ళనుంచి తలదాకా ఉన్న కండరాలన్నీ ఒక్కసారి కదలాడిపోయాయి.

"'ఒక ప్రచండ కాంతిలో లాహిరీ మహాశయుల్ని చూశాను' అని అరిచాడతను. 'ఆయన సూర్యుడిలా వెలిగిపోతున్నారు. "లే, నీ నిద్ర కట్టిపెట్టు" అని నన్ను ఆజ్ఞాపించారు. "యుక్తేశ్వర్‌తో బాటు వచ్చి నన్ను కలుసుకో."'

"రాముడు బట్టలు కట్టుకోడం, ప్రాణాంతకమైన జబ్బు తరవాత కూడా గురువుగారింటికి నడిచిరావడానికి తగినంత బలంగా ఉండడం చూసి నా కళ్ళని నేను నమ్మలేకపోయాను. అక్కడతను, కృతజ్ఞతా పూర్వకంగా కన్నీళ్ళు విడుస్తూ లాహిరీ మహాశయుల ముందు సాగిలపడ్డాడు.

"గురువుగారు ఉల్లాసంతో తన్మయులయారు. ఆయన కళ్ళు నాకేసి కొంటెగా చూస్తూ మిలమిల మెరిశాయి.

"'యుక్తేశ్వర్, ఇకనుంచి నువ్వు ఎక్కడికెళ్ళినా, ఓ ఆముదం సీసా తప్పకుండా తీసుకువెళ్ళడం మానవుగదా! నువ్వు శవాన్ని చూసినప్పుడల్లా ఈ నూనె వేసెయ్యి. ఏడు చుక్కల ఆ దీపం నూనె యముడి బలాన్ని తప్పకుండా భగ్నం చెయ్యాలసిందే!'

" 'గురూజీ, నన్ను వేళాకోళం చేస్తున్నారు. నా కర్థం కావడం లేదు; నా పొరపాటు ఎక్కడ ఉందో చూపించండి.'

" 'రాముడు బాగవుతాడని నేను నీకు రెండుసార్లు చెప్పాను; అయినా నువ్వు నన్ను పూర్తిగా నమ్మలేకపోయావు,' అని విప్పి చెప్పారు లాహిరీ మహాశయులు. 'డాక్టర్లు అతనికి నయం చెయ్యగలుగుతారని నా ఉద్దేశం కాదు. వాళ్ళు హాజరుగా ఉన్నారనే నేను చెప్పింది. నేను డాక్టర్లతో జోక్యం చేసుకో దలుచుకోలేదు; వాళ్ళు కూడా బతకాలి కదా మరి.' ఆనందం ప్రతిధ్వనించే స్వరంలో మా గురువుగారు ఇంకా ఇలా అన్నారు, 'ఎప్పటికీ ఇది తెలుసుకో; డాక్టరు ఉండుగాక, లేకపోవుగాక, సర్వశక్తిమంతుడైన పరమాత్మ ఎవ్వరికయినా నయం చెయ్యగలడు.'

" 'నా పొరపాటు తెలిసి వచ్చిందండి,' అని పశ్చాత్తాపంతో నా తప్పు ఒప్పుకున్నాను. 'మీ రనే చిన్నమాటకు బ్రహ్మాండం యావత్తు కట్టుబడి ఉంటుందని ఇప్పుడు తెలిసింది.' "

శ్రీయుక్తేశ్వర్‌గారు ఈ అద్భుతకథ ముగించగానే, రాంచీ కుర్రవాళ్ళలో ఒకడు, ఒక ప్రశ్న అడగడానికి సాహసించాడు. పైగా, ఒక పిల్లవాడు ఆ ప్రశ్న వెయ్యడం ఇంకా సహజం.

"మహాశయా, మీ గురువుగారు ఆముదం ఎందుకు పంపారండి?' అని అడిగాడు.

"అబ్బాయ్, ఆ చమురు ఇవ్వడానికి ప్రత్యేకమైన అర్థం ఏమీ లేదు నేను వారి దగ్గరనుంచి భౌతికమైనదేదో ఆశించినందువల్ల లాహిరీ మహాశయులు నాలో ఇంకా ఎక్కువ విశ్వాసాన్ని మేలుకొలపడానికి, వస్తురూపమైన చిహ్నంగా దగ్గరిలో ఉన్న చమురును ఎన్నుకున్నారు. నేను కొంతవరకు శంకించినందువల్ల ఆయన రాముణ్ని చనిపోనిచ్చారు. కాని, మామూలుగా చివర వచ్చే మరణమనే జబ్బును రాముడికి నయం చెయ్యవలసి వచ్చినా కూడా, గురువుగారు తమ శిష్యుడు బాగవుతాడని చెప్పారు కాబట్టి అతడు బాగయి తీరాలని ఆయనకు తెలుసు!"

శ్రీయుక్తేశ్వర్‌గారు పిల్లకాయల్ని పంపేసి, నాకు తమ పాదాల దగ్గర ఉన్న గొంగడి ఆసనం చూపించారు.

అసాధారణమైన గాంభీర్యంతో ఆయన ఇలా అన్నారు, "యోగానందా పుట్టినప్పటినించీ నీ చుట్టూ, లాహిరీ మహాశయుల ప్రత్యక్షశిష్యులు ఉంటూ

ఉన్నారు. ఆ మహాగురువులు, మహిమాన్వితమైన తమ జీవితం కొంతవరకు ఏకాంతంలో గడిపారు, పైగా, తమ ఉపదేశాల ప్రచారం కోసం ఎటువంటి సంస్థ నెలకొల్పడానికయినా ఆయన గట్టిగా అనుమతి నిరాకరిస్తూ వచ్చారు. అయినా విశిష్టమైన జోస్యం ఒకటి చెప్పారు.

" ' నేను పోయిన తరవాత సుమారు ఏభై ఏళ్ళకి, పడమటి దేశాల్లో యోగ విద్య పట్ల కలగబోయే గాఢమైన ఆసక్తి కారణంగా, నా జీవిత వృత్తాంతం ఒకటి రాయడం జరుగుతుంది. యోగవిద్యా సందేశం భూగోళాన్ని చుట్టేస్తుంది. సర్వమానవ సోదరత్వాన్ని - అంటే, మానవజాతి ఏకైక పరమపిత ప్రత్యక్ష దర్శనం మీద ఆధారపడ్డ ఐకమత్యాన్ని - నెలకొల్పడానికి తోడ్పడుతుందది,' అని చెప్పారు.

"నాయనా, యోగానందా, ఆ సందేశాన్ని వ్యాప్తి చెయ్యడంలోనూ ఆయన పవిత్ర జీవితాన్ని గురించి రాయడంలోనూ నీ వంతు పని నువ్వు చెయ్యాలి," అన్నారు.

1895లో లాహిరీ మహాశయులు పోయిన తరవాత, ఈ పుస్తకం పూర్తి అయిన 1945 సంవత్సరానికి ఏభై ఏళ్ళు గతించాయి. పైగా, విప్లవాత్మకమైన అణుశక్తుల నూతన యుగాన్ని కూడా ఈ 1945 వ సంవత్సరమే ప్రవేశపెట్టడం గమనించి చకితుణ్ణి కాకుండా ఉండలేను. ఆలోచనాశీలమైన మనస్సులన్నీ ఇప్పుడు, ముందెన్నడూ లేనంతగా శాంతిసోదరత్వాల తక్షణ సమస్యలవేపు మళ్ళుతున్నాయి; అది జరగనినాడు, భౌతిక బలాన్ని వినియోగించడం ఇంకా కొనసాగిస్తూనే ఉంటే, సమస్యలతోబాటు మనుషులందరినీ కూడా తుడిచి పెట్టేస్తుందది.

కాలప్రభావంవల్లనో బాంబులవల్లనో, మానవజాతీ దాని నిర్మాణాలూ నామ రూపాలు లేకుండా మాయమయినప్పటికీ సూర్యుడు తన గతి తప్పడు; చుక్కలు యథావిధిగా మింటిని కావలికాస్తూనే ఉంటాయి. విశ్వనియమాన్ని తాత్కాలికంగా నిలుపుదల చెయ్యడంకాని, మార్చడంకాని సాధ్యం కాదు; మానవుడు దాంతో సామరస్యం పొందితే మంచిది. ఈ బ్రహ్మాండం, బలానికి వ్యతిరేకమయితే, సూర్యుడు అంతరిక్షంలో ఇతర గోళాలతో యుద్ధానికి తలపడకుండా, నక్షత్రాలు తమ చిన్నారి ఏలుబడి సాగించడానికి అవకాశ మివ్వడం కోసం విధివిధేయంగా శ్రమిస్తుంటే మనం ఆయుధాన్ని పిడికిట బట్టడంవల్ల లాభమేమిటి? దాంట్లోంచి నిజంగా శాంతి ఏమయినా వస్తుందా? విశ్వస్నాయువులకు బలం చేకూర్చేది సుహృద్భావమే కాని క్రౌర్యం కాదు; శాంతిగా జీవించే మానవజాతి అనంతమైన విజయఫలాల్ని తెలుసుకుంటుంది; ఈ ఫలాలు, నెత్తుటి నేలలో పెంచి పోషించిన ఏ ఇతర ఫలాలకన్నయినా మధురంగానే ఉంటాయి.

కార్యసాధకమైన ఐక్యరాజ్య సమితి, మానవ హృదయాల సహజ అనామిక సమితిగా ఉంటుంది. ప్రాపంచిక వేదన ఉపశమనానికి అవసరమైన ఔదార్య సానుభూతులూ సునిశిత అంతర్దృష్టీ మానవుల గాఢతమమైన ఏకత్వాన్ని -అంటే, దేవుడితో గల సంబంధాన్ని గురించిన పరిజ్ఞానంవల్లనే కాని, కేవలం భిన్నత్వాల గురించి జరిపే బుద్ధిపరమైన పర్యాలోచనలవల్ల సిద్ధించవు. సోదరత్వం ద్వారా శాంతి స్థాపన అనే ప్రపంచ పరమోన్నత ఆదర్శాన్ని సాధించడానికి, పరమాత్మతో జీవాత్మకు ఐక్యానుసంధానం చేకూర్చే యోగశాస్త్రం కాలక్రమాన అన్ని దేశాల్లోనూ అందరు జనులకూ వ్యాపిస్తుంది.

భారతదేశానికి మరే ఇతరదేశంకన్నా ప్రాచీనమైన నాగరికత ఉన్నప్పటికీ దాని మనుగడలోని అద్భుతలీల, ఏ విధంగా చూసినా యాదృచ్ఛిక మేమీ కాదనీ భారతదేశం ప్రతి తరంలోనూ తానుకన్న మహాపురుషుల ద్వారా అందించిన శాశ్వత సత్యాలమీద భక్తివల్ల చేకూరిన విజయాల్లోని తార్కికమైన ఒక సంఘటనేననీ గమనించిన చారిత్రకులు మృగ్యం. కేవలం మనుగడ కొనసాగుతూండడం ద్వారాను, యుగాలు (ఎన్ని యుగాలో, తలమాసిన పండి తులు మనకి నిజంగా చెప్పగలరా?) గతించినా, తాను గతించకపోవడం ద్వారాను భారతదేశం, కాలం సవాలుకు ఏ దేశప్రజలూ ఇయ్యజాలని సరైన సమాధానం ఇచ్చింది.

బైబిలులోని ఒక కథలో అబ్రహాం, ప్రభువును* ప్రార్థిస్తూ, సొడోమ్ నగరంలో పదిమంది ధర్మపరులు కనిపించినట్లయితే ఆ నగరాన్ని నాశనం చెయ్యకుండా విడిచిపెట్టమని విన్నపం చేశాడు. దానికి సమాధానంగా ప్రభువు "ఆ పదిమంది గురించి నేను దాన్ని నాశనం చెయ్యను," అన్నాడు. ఈ కథకు, భారతదేశం కాలగర్భంలో కలిసి విస్మృతమైపోకుండా తప్పించుకోడాన్నిబట్టి, కొత్త అర్థం వస్తుంది. యుద్ధతంత్రాల్లో నైపుణ్యం కలిగి, ఒకప్పుడు భారతదేశానికి సమకాలికంగా వర్ధిల్లిన ప్రాచీన ఈజిప్టు, బాబిలోనియా, గ్రీసు, రోముల బలిష్ఠ సామ్రాజ్యాలు గతించి పోయాయి.

దేశం బతికేది తన భౌతిక ఉపలబ్ధులవల్ల కాక, అక్కడి మహాపురుషుల వల్లనే నన్న సంగతి ప్రభువిచ్చిన సమాధానంలో స్పష్టమవుతోంది.

అర్ధభాగం ముగియకముందే రెండుసార్లు రక్తరంజితమైన ఈ ఇరవయ్యో శతాబ్దంలో ఆ దివ్యవాక్కులు మళ్ళీ వినిపించుగాక : లంచానికి లోబడని న్యాయ

---

* జెనిసిస్ 18.23-32.

మూర్తి - ఆ భగవంతుడి దృష్టిలో గొప్పవాళ్ళనిపించుకోదగ్గ పదిమందిని కన్న ఏ దేశమూ నశింపు ఎరగదు.

అటువంటి ప్రేరణల్ని మన్నిస్తూ భారతదేశం, కాలం కౌటిల్యాల్ని అనేకం ఎదుర్కోడంలో తానేమీ తెలివితక్కువది కాదని నిరూపించుకుంది. ఆత్మసాక్షాత్కార సిద్ధి పొందిన మహానుభావులు ప్రతి శతాబ్దంలోనూ ఈ నేలను పావనం చేశారు. లాహిరీ మహాశయులూ, శ్రీయుక్తేశ్వర్‌గారివంటి ఆధునిక ఋషీశ్వరులు, మానవుడి సుఖానికి దేశం దీర్ఘాయుష్యానికి ఆత్మసాక్షాత్కార సాధక శాస్త్రమయిన యోగవిద్యా పరిజ్ఞానం ప్రాణావశ్యకమైనదని ఎలుగెత్తి చాటుతారు.

లాహిరీ మహాశయుల జీవితాన్ని గురించీ ఆయన విశ్వజనీన సిద్ధాంతం గురించి ఇంతవరకు అచ్చులో వచ్చిన సమాచారం చాలా స్వల్పం. మూడు దశాబ్దాలుగా నేను, భారతదేశంలోనూ అమెరికాలోనూ యూరప్ లోనూ, వారిచ్చిన ముక్తిప్రదమైన యోగసందేశం పట్ల గాఢమైన, హృదయపూర్వకమైన ఆసక్తి ఉండడం గమనిస్తూ వచ్చాను. ఈనాడు, ముందే ఆయన జోస్యం పలికినట్టు, ఆ యోగీశ్వరుల జీవితాన్ని గురించిన లిఖిత వృత్తాంతం ఒకటి అవసరముంది.*

లాహిరీ మహాశయులు 1828 సెప్టెంబరు 30 తేదీన, సనాతన పారంపర్యం గల ధర్మనిష్ఠాపరమైన బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. ఈయన జన్మ స్థలం ఘుర్ణీ గ్రామం; ఇది బెంగాలులో, కృష్ణనగర్‌కు దగ్గర నదియా జిల్లాలో ఉంది. ఈయన, శ్రీమతి ముక్తకాశీగారి ఏకైక పుత్రులు. ఈ ఇల్లాలు, పూజ్యు లయిన గౌర్ మోహన్ లాహిరీగారి రెండో భార్య (మొదటి భార్య, ముగ్గురు కొడుకుల్ని కన్న తరవాత ఒక యాత్రలో మరణించారు). పిల్లవాడి చిన్నతనంలోనే తల్లి కన్నుమూసింది; ఆవిడ, "యోగిరాజు"గా పవిత్ర గ్రంథాల్లో పేర్కొనే శివుడి పరమభక్తురాలన్న అర్థవంతమైన యథార్థానికి మించి, ఆవిడ గురించి మరేమీ తెలియదు.

లాహిరీ మహాశయుల పూర్తిపేరు శ్యామాచరణ్ లాహిరీ. చిన్నతనంలో ఈయన ఘుర్ణీలో పెద్దలు కట్టిన ఇంట్లోనే గడిపారు. మూడు నాలుగేళ్ళ వయస్సప్పుడు

---

* 'శ్రీశ్రీ శ్యామాచరణ్ లాహిరీ మహాశయ' అన్న పేరుతో స్వామి సత్యానంద బెంగాలీలో రాసిన చిన్న జీవిత చరిత్ర 1941లో వెలువడింది.

ఈ అధ్యాయంలో లాహిరీ మహాశయుల్ని గురించి రాయడానికి అందులోంచి కొన్ని భాగాలు అనువాదం చేశాను.

ఈయన ఇసకలోకి దూరి ఒక విధమైన యోగాసనంలో కూర్చుని ఉండడం, తల తప్ప తక్కిన శరీరమంతా ఇసకలో కప్పబడి ఉండడం తరచు కనిపించేది.

1833 చలికాలంలో, పక్కనున్న జలంగీ నది ప్రవాహమార్గం మళ్ళడంవల్ల లాహిరీ కుటుంబం వారి ఆస్తి ధ్వంసమై గంగానదీ గర్భంలో కలిసిపోయింది. లాహిరీ వంశంవారు కట్టించిన శివాలయం ఒకటి, వారి ఇంటితో బాటుగా, ఏట్లో కలిసిపోయింది. శివలింగాన్ని మాత్రం భక్తుడొకడు, సుళ్ళు తిరుగుతున్న నీళ్ళలోంచి బయటికి తెచ్చి కొత్త ఆలయంలో ప్రతిష్ఠించాడు; ఆచోటు నిప్పుడు ఘుర్ణీ శివస్థలమని అంటారు.

గౌర్ మోహన్ లాహిరీగారూ వారి కుటుంబమూ ఘుర్ణీ విడిచిపెట్టేసి కాశీవాసు లయారు. తండ్రిగారు, వెంటనే అక్కడొక శివాలయం నిర్మించారు. వారు వైదిక నిష్ఠానుసారంగా గృహస్థ ధర్మం నిర్వర్తించేవారు; దేవతార్చన, దానం, స్వాధ్యాయం యథావిధిగా చేసేవారు. ధర్మపరాయణులూ విశాలహృదయులూ వారు. అయితే, ఉపయోగకరమైన ఆధునిక భావప్రవాహాన్ని వారు ఉపేక్షించలేదు.

బాల లాహిరీ, కాశీ అధ్యయన బృందాల్లో హిందీ, ఉర్దూ పాఠాలు నేర్చుకున్నాడు. జయనారాయణ ఘోషాల్‌గారు నడిపిన బడికి వెళ్ళి సంస్కృతం, బెంగాలీ ఫ్రెంచి, ఇంగ్లీషు నేర్చుకున్నాడు. ఈ బాలయోగి నిశిత వేదాధ్యయ నానికి పూనుకొని నాగభట్టు అనే మహారాష్ట్ర పండితుడితో సహా అనేకమంది బ్రాహ్మణ పండితులు పరిషత్తులకు హాజరయి పవిత్ర గ్రంథాలగురించి వాళ్ళు చేసే చర్చలు వింటూండే వాడు.

శ్యామాచరణుడు దయాశీలుడు; సాధు స్వభావుడు, సాహస యువకుడు సహచరులందరికీ ఇష్టుడు. మంచి ఆరోగ్యంగా, బలిష్ఠంగా ఉన్న శరీరానికి ఒడ్డూ పొడుగూ ఒకదానికొకటి సరిపడేటట్టు ఉండేవి; ఈతలోనూ శరీర వ్యాయామం లోనూ అందరినీ మించినవాడు.

శ్యామాచరణ్ లాహిరీగారికి 1846లో శ్రీమతి కాశీమణితో వివాహమయింది ఈవిడ దేవ్ నారాయణ్ సన్యాల్‌గారి కూతురు. ఆదర్శ భారత గృహిణి కాశీమణి గారు, తమ ఇంటి పనులన్నీ సంతోషంగా చేసుకుంటూ అతిథుల్ని ఆదరించడం బీదవాళ్ళకి సేవచెయ్యడం వంటి గృహస్థ ధర్మాలు నిర్వహించేవారు. వీరి దాంపత్య ఫలాలుగా సౌమ్యమూర్తులయిన ఇద్దరు కొడుకులూ - తిన్‌కౌడీ, దుకౌడీ - ఇద్దరు

కూతుళ్ళూ పుట్టారు. ఇరవై మూడో ఏట, 1851లో, లాహిరీ మహాశయులు బ్రిటిష్ గవర్నమెంటువారి మిలిటరీ ఇంజినీరింగ్ డిపార్ట్‌మెంటులో ఎకౌంటెంట్ ఉద్యోగం చేబట్టారు. ఉద్యోగకాలంలో ఆయన చాలా పదోన్నతులు పొందారు. ఈ ప్రకారంగా ఆయన, భగవంతుడి దృష్టిలో మహాపురుషులు కావడమే కాకుండా, ప్రపంచంలో ఒక ఆఫీసు ఉద్యోగిగా సామాన్య పాత్ర నిర్వహించిన చిన్న మానవ నాటకంలో కూడా కృతార్థులయారు.

ఆ ఇంజనీరింగ్ డిపార్ట్‌మెంటువారు లాహిరీ మహాశయుల్ని వివిధ సమయాల్లో, గాజీపూర్, మీర్జాపూర్, నైనిటాల్, దానాపూర్, కాశీల్లో ఉన్న తమ ఆఫీసులకు బదిలీ చేశారు. తండ్రిగారు చనిపోయిన తరవాత ఆయనే మొత్తం కుటుంబ సభ్యుల బాధ్యత వహించారు. వాళ్ళకోసం ఆయన, కాశీకి సమీపంలో, వేరుపాటుగా ఉన్న గరుడేశ్వర్ మొహల్లాలో ఒక ఇల్లు కొన్నారు.

తాము ఈ భూమి మీద మళ్ళీ అవతరించడానికిగల ప్రయోజనం నెరవేరడం లాహిరీ మహాశయులు చూసింది, ముప్ఫై మూడో ఏట. హిమాలయాల్లో రాణీఖేత్ సమీపంలో తమ మహాగురువులు - బాబాజీని కలుసుకొని, వారి దగ్గర క్రియాయోగ దీక్ష పొందారు.

ఈ శుభ సంఘటన జరిగింది లాహిరీ మహాశయులు కొక్కరికే కాదు; మానవజాతి కంతకీ సౌభాగ్య సమయమది. వాడుకలో లోపించి లేదా చిరకాలంగా అదృశ్యమై ఉన్న సర్వోన్నత యోగవిద్యను మళ్ళీ వెలుగులోకి తెచ్చిన శుభతరుణమది.

పురాణ కథలో దాహాతురుడైన భగీరథుడనే భక్తుడికోసం గంగ,* ఆకాశం

---

* హిందువులకు పవిత్ర నది అయిన గంగామాత జలాలు, ఎప్పటికీ హిమాచ్ఛాదితమై ఉండి నిశ్శబ్దం ఆవరించిన హిమాలయాల్లోని ఒక మంచు గుహలో మంచి పుడతాయి. అనేక శతాబ్దుల కాలంలో వేలాది సాధుసత్పురుషులు గంగకు సమీపంలో ఉండి ఆనందించారు; ఆ నదీ తీరాల వెంబడి వారు, శుభాశీస్సుల దివ్యప్రభ ఒకటి విడిచి వెళ్ళారు. (పే. 254 అధోజ్ఞాపిక చూడండి.)

గంగానది కున్న ఒకానొక అసాధారణ గుణం - బహుశా దానికొక్క దానికే ఉన్న విలక్షణత - నిష్కల్మషత్వం. క్రిముల్ని బతకనివ్వకపోవడమనే మార్పులేని లక్షణం వల్ల దాంట్లో ఏ సూక్ష్మక్రిములూ బతకవు. అనేక లక్షలమంది హిందువులు, స్నానానికీ తాగడానికీ ఆ ఏటి నీళ్ళు వాడుతూనే ఉంటారు కాని, దానివల్ల వాళ్ళకి ఎటువంటి హానీ కలగదు ఈ యధార్థం

నుంచి భూమికి దిగివచ్చి దివ్యజలాలందించినట్టు, 1861లో క్రియాయోగమనే స్వర్గంగ, హిమాలయ రహస్య గహ్వరం నుంచి సామాన్య జనపదాలకు ప్రవహించడం మొదలుపెట్టింది.

---

ఆధునిక శాస్త్రవేత్తలకు విస్మయం కలిగిస్తూ ఉంటుంది. వాళ్ళలో ఒకరు, డా॥ జాన్ హోవర్డ్ నార్త్రాప్ - 1946లో రసాయనశాస్త్రంలో నోబెల్ బహుమతి పొందిన వారిలో ఒకడు - ఇలా చెప్పాడు : "గంగానదిలో కాలుష్యాలు చాలా కలుస్తాయని మనకి తెలుసు. అయినా భారతీయులు దాంట్లో నీళ్ళు తాగుతారు; దాంట్లో ఈతలాడతారు; అయినా జబ్బుపడ్డం కనిపించదు." అంటూ ఆయన, "బహుశా, జీవాణుభుక్కు (బాక్టీరియోఫేజ్) ఆ నదిని పరిశుద్ధం చేస్తూ ఉండొచ్చు." నని ఆశాభావం వెలిబుచ్చాడు.

ప్రాకృతిక దృగ్విషయాలన్నిటిపట్లా వేదాలు పూజ్యభావం పాదుకొలుపుతాయి. సెంట్ ఫ్రాన్సిస్ ఆఫ్ అసిసీ, "ఎంతో ఉపయోగకరంగా, వినయంగా, పవిత్రంగా, అమూల్యంగా ఉన్న మన 'సోదరి నీటి'ని సృష్టించినందుకు, ప్రభువుకు జయమవుగాక!" అంటూ కీర్తించడాన్ని భక్తినిరతుడై హిందువు చక్కగా అర్థం చేసుకుంటాడు.

అధ్యాయం : 33

# ఆధునిక భారతదేశపు యోగి-క్రీస్తు (యోగీశ్వరులు) బాబాజీ

బదరీనారాయణ క్షేత్రానికి సమీపంలో ఉన్న ఉత్తర హిమాలయ ప్రాంతం, బాబాజీ ఉనికితో ఈనాటికీ పునీతమవుతున్నది. బాబాజీ లాహిరీ మహాశయుల గురుదేవులు. ఏకాంతవాసులయిన ఈ మహానుభావులు అనేక శతాబ్దులుగా - బహుశా అనేక సహస్రాబ్దులుగా - తమ భౌతికరూపాన్ని నిలుపుకొంటున్నారు. మరణంలేని బాబాజీ అవతార పురుషులు. సంస్కృతంలో అవతరించడం అంటే, "కిందికి దిగడం" అని అర్థం. అవతార శబ్దంలో 'అవ' అనే ఉపసర్గకు "కిందికి" అనీ, 'తౄ' అనే ధాతువుకు "దాటడం" అనీ అర్థాలు. హిందూ పవిత్ర గ్రంథాల్లో ఈ అవతార శబ్దం, దైవం భౌతిక శరీరరూపంలోకి దిగిరావడం అన్న అర్థాన్ని సూచిస్తుంది.

"బాబాజీ ఆధ్యాత్మిక స్థితి మానవావగాహనకు అందనిది," అని నాకు వివరించా రొకసారి శ్రీయుక్తేశ్వర్‌గారు. "మానవుల కుంచిత దృష్టి, ఈ మహాతీత నక్షత్రంలోకి చొరబారలేదు. అవతార పురుషుడి సంసిద్ధిని చిత్రించబోవడం కూడా వ్యర్థప్రయత్నమవుతుంది. అది అనూహ్యమైనది."

ఆధ్యాత్మిక ప్రగతిలోని ప్రతి దశనూ ఉపనిషత్తులు సునిశితంగా వర్గీకరించాయి. సిద్ధుడు ("పరిపూర్ణత పొందినవాడు") జీవన్ముక్త ("జీవించి ఉండగానే విముక్తి పొంది ఉన్నవాడు") స్థితి నుంచి పరాముక్త ("సర్వోత్కృష్ట స్వతంత్రుడు" - మృత్యుంజయుడు) స్థితికి పురోగమించి ఉంటాడు. చివర చెప్పిన ఈ పరాముక్తుడు మాయాబంధంలోంచీ జన్మపరంపరావృత్తిలోంచీ పూర్తిగా బయటపడి ఉంటాడు. అందువల్ల పరాముక్తుడు తిరిగి భౌతిక శరీరం పొందడమనేది సకృత్తు. ఒకవేళ భౌతిక రూపంలో ఇలా తిరిగి రావడమే సంభవిస్తే అటువంటి వ్యక్తి అక్షరాలా అవతార పురుషుడే; ప్రపంచానికి దివ్యమయిన దీవెనలు కురిపించడానికి దైవనిర్ణీతమైన

సాధనమే. అవతారపురుషుడు విశ్వ వ్యవస్థకు బద్ధుడు కాడు; తేజోబింబంగా గోచరించే అతడి పరిశుద్ధ దేహం ప్రకృతికి ఏ విధంగానూ ఋణపడి ఉండదు

సాధారణ దృష్టికి, అవతారమూర్తి రూపంలో అసాధారణమైనదేదీ అవుపించక పోవచ్చు. కాని ఒక్కొక్క సందర్భంలో దానికి నీడా పడదు, నేలమీద అడుగు జాడా పడదు. అంధకారాన్నించీ భౌతిక దాస్యాన్నించీ పొందిన ఆంతరిక స్వేచ్ఛకు బాహ్యమైన ప్రతీకలవంటి నిదర్శనాలివి. ఆటువంటి దైవ-మానవుడొక్కడే చావుపుట్టుకల సాపేక్షతల వెనక ఉన్న సత్యాన్ని ఎరిగి ఉంటాడు. ఎంతగానో అపార్థానికి గురిఅయిన ఉమర్ ఖయ్యాం 'రుబాయత్' అనే అమర గ్రంథంలో ఈ విముక్త మానవుణ్ణే గురించి ఇలా గానం చేశాడు :

"ఆహా, కళలు తరగని నా ఆనంద చంద్రబింబం,
ఉదయిస్తోంది మళ్ళీ దివ్యేందు బింబం;
ఎంత తరచుగా ఉదయిస్తూ అన్వేషిస్తూ ఉంటుందో ఇకముందు
ఇదే ఉద్యానంలో - వ్యర్థంగా నా కోసం!"*

"కళలు తరగని ఆనంద చంద్రబింబం," అంటే భగవంతుడు; శాశ్వత ధ్రువతార; కాలక్రమ మెన్నడూ తప్పనివాడు. మళ్ళీ ఉదయిస్తున్న "దివ్యేందు బింబం" అంటే బాహ్యప్రపంచం; నియతకాలిక పునరావర్తన నియమానికి బద్ధమయినది. ఈ పారశీక ద్రష్ట ఆత్మసాక్షాత్కారం ద్వారా ఈ భూమిమీద నిర్బంధ పునర్జన్మల శృంఖలాలు తెంచుకొని శాశ్వతంగా విముక్తి సాధించినవాడు ఇక్కడ భూమి అన్నది : ప్రకృతి అనే "ఉద్యానం" లేదా మాయ. "ఎంత తరచుగా ఉదయిస్తూ అన్వేషిస్తూ ఉంటుందో ఇక ముందు - వ్యర్థంగా నా కోసం!" పూర్తిగా లుప్తమయిన దానికోసం విస్మయంతో అన్వేషించే విశ్వం ఎంత నిస్పృహ చెందు తుందో పాపం!

క్రీస్తు తన విముక్తిని గురించి మరో రకంగా చెప్పాడు. "ఒకానొక లేఖరి వచ్చి ఆయనతో ఇలా అన్నాడు - స్వామీ, మీరు ఎక్కడికి వెళ్తే అక్కడికల్లా మీ వెంట వస్తాను. అందుకు క్రీస్తు ఇలా అన్నాడు - గుంట నక్కలకు బొర్రెలున్నాయి. గాలిలో ఎగిరే పక్షులకు గూళ్ళున్నాయి; కాని మనుష్య కుమారుడికి తలదాచు కోడానికయినా చోటు లేదు."†

* ఎడ్వర్డ్ ఫిట్జ్‌జెరాల్డ్ అనువాదాన్ని అనుసరించి.

† మత్తయి 8:19-20 (బైబిలు)

అంతటా తానే అయి ఉండేటట్లు విస్తరించి ఉన్న క్రీస్తును ఆత్మ సాధనలో తప్ప మరోవిధంగా అనుసరించగలరా?

కృష్ణుడు, రాముడు, బుద్ధుడు, పతంజలి ప్రాచీన భారతీయ అవతార పురుషులు. దక్షిణ భారతీయ అవతారమూర్తి అయిన అగస్త్యుడి గురించి, చెప్పుకోదగ్గంత కావ్యసాహిత్యం తమిళంలో బయలుదేరింది. క్రీస్తు శకారంభానికి ముందూ ఆ తరవాతి శతాబ్దాల్లోనూ కూడా ఈయన అలౌకిక ఘటనలు అనేకం ప్రదర్శించాడు. ఆయన ఈనాటికీ భౌతిక రూపాన్ని నిలుపుకొనే ఉన్నట్టు ప్రతీతి.

ప్రత్యేక విధుల నిర్వహణలో ప్రవక్తలకు తోడ్పడ్డమే భారతదేశంలో బాబాజీ ధ్యేయం. ఈ విధంగా ఈయన, పవిత్ర గ్రంథాల వర్గీకరణ ప్రకారం మహావతారు లనిపించుకోడానికి అర్హులు. సన్యాసుల మఠామ్నాయాన్ని పునర్వ్యవస్థీకరించిన శంకరాచార్యుల వారికీ* మధ్య యుగంలో ప్రసిద్ధుడైన గురువు కబీరుకూ తామే యోగదీక్ష ఇచ్చినట్టు చెప్పారు ఈయన. పందొమ్మిదో శతాబ్దిలో ఈయన శిష్యుల్లో ప్రముఖులు, మనకు తెలిసినంత వరకు, విస్మృతమయిన క్రియాకళని పునరుజ్జీవితం చేసిన, లాహిరీ మహాశయులు.

బాబాజీకి క్రీస్తుతో ఎప్పుడూ సన్నిహిత సంబంధముంటూనే ఉంది. వీరిద్దరూ కలసి ముక్తిప్రదమయిన స్పందనలను ప్రసరింపజేస్తూనే ఉంటారు. అంతేకాకుండా వీరు, ఈ యుగంలో మోక్షప్రాప్తి కోసం ఒక ఆధ్యాత్మిక ప్రక్రియకు రూపకల్పన చేశారు. ఒకరు సశరీరులుగాను, మరొకరు అశరీరులు గాను ఉన్న ఈ సంపూర్ణ జ్ఞానసిద్ధులు చేసే పని ఏమిటంటే : యుద్ధాలనూ జాతివిద్వేషాలనూ మతపరమయిన పక్షపాతాన్నీ ప్రయోగించినవాళ్ళకే బెడిసికొట్టే భౌతికవాద దుష్పరిణామాలనూ విడిచిపెట్టవలసిందిగా ప్రపంచ దేశాలను ప్రోత్సహించడం. ఆధునిక యుగ ధోరణి బాబాజీకి బాగా తెలుసు; ముఖ్యంగా పాశ్చాత్య నాగరికతలోని క్లిష్టతల ప్రభావం ఇంకా బాగా తెలుసు. అంతేకాదు, యోగపరమయిన ఆత్మ విమోచన పద్ధతులను ప్రాచ్య, పాశ్చాత్య దేశాలన్నిటా సమంగా వ్యాప్తి చెయ్యవలసిన అవసరాన్ని గ్రహించారాయన.

బాబాజీని గురించి ఎక్కడా ఎటువంటి చారిత్రక ప్రస్తావనా లేకపోయినందుకు మనం ఆశ్చర్యపోనక్కరలేదు. ఈ పరమోత్కృష్ట గురుదేవులు ఏ శతాబ్దిలోనూ

---

* చారిత్రకంగా గోవిందయతి శిష్యులని తెలుస్తున్న శంకరులు, కాశీలో బాబాజీ దగ్గర క్రియాయోగ దీక్ష పొందారు. ఈ వృత్తాంతం లాహిరీ మహాశయులతోను, స్వామి కేవలానందగారి తోను ముచ్చటిస్తూ బాబాజీ ఈ అద్వైతవాదిలో సమాగమానికి సంబంధించిన ఆకర్షకమయిన వివరాలు అనేకం చెప్పారు.

ఎన్నడూ బహిరంగంగా దర్శనమియ్యలేదు. తప్పుడు వ్యాఖ్యానాలు చేసే ప్రచారాడంబరానికి వీరి సహస్ర వర్ష ప్రణాళికలో స్థానం లేదు. ఏకైక నీరవశక్తి అయిన సృష్టికర్త మాదిరిగానే బాబాజీ వినమ్రంగా మరుగున ఉండి పనిచేస్తూ ఉంటారు.

క్రీస్తు, కృష్ణుడు వంటి మహా ప్రవక్తలు ఒకానొక విలక్షణమయిన ఆసక్తికరమయిన ప్రయోజనంకోసం భూమిపై అవతరిస్తూ ఉంటారు; వచ్చినపని నెరవేరడంతోటే నిష్క్రమిస్తూ ఉంటారు. బాబాజీవంటి ఇతర అవతారపురుషులు, చరిత్రలో ప్రసిద్ధికెక్కే ప్రముఖమైన ఒక మహా సంఘటనకు కాక, కొన్ని శతాబ్దుల తరబడి నిదానంగా సాగే మానవ పరిణామాత్మక ప్రగతికి సంబంధించిన పని చేపడతారు అటువంటి మహాపురుషులు జనసామాన్యం స్థూలదృష్టికి అతీతంగా తెర మరుగున ఉంటారు. ఇచ్ఛానుసారంగా కనుమరుగయే శక్తి వారికి ఉంటుంది. ఈ కారణాలవల్లా తమనుగురించి ఎవరికీ ఏమీ చెప్పవద్దని శిష్యుల్ని మామూలుగా హెచ్చరిస్తూ ఉండడంవల్లా చాలామంది ఆధ్యాత్మిక మహామేరు సదృశులు ప్రపంచానికి అజ్ఞాతంగానే ఉండిపోతారు. ఈ పుటల్లో నేను ఇయ్యదలచినది కేవలం, బాబాజీ జీవితాన్ని గురించిన సూచన మాత్రమే; బహిరంగంగా తెలపడానికి తగినవీ సహాయకరమైనవీ అని బాబాజీ తలచిన కొన్ని వాస్తవాలు మాత్రమే.

బాబాజీ కుటుంబాన్ని గురించికాని, జన్మస్థలాన్ని గురించికాని చరిత్రకారునికి ప్రీతిపాత్రమయే పరిమితి విధించే వాస్తవాలేవీ వెల్లడి కాలేదు. ఆయన మాట్లాడేది సాధారణంగా హిందీలో; కాని ఏ భాషలో నయినా అవలీలగా మాట్లాడగలరు. ఈయన బాబాజీ* అన్న సరళమైన పేరు పెట్టుకొన్నారు. ఇది కాక లాహిరీ మహాశయుల శిష్యులు ఇచ్చిన గౌరవ బిరుదులు ఇవి : మహాముని బాబాజీ, మహారాజ్ (పరమానందమగ్నులయిన సాధువు), మహాయోగి (యోగులందరి లోకీ గొప్పవారు), త్ర్యంబక బాబా లేక శివబాబా (శివుడి అవతారమనే అర్థంలో). అన్ని బంధాల నుంచీ విముక్తులయిన ఈ మహా గురువుల గోత్రనామాలేవో తెలియకపోతే నష్టమేమిటి?

"ఎప్పుడయినా, ఎవరయినా భక్తితో బాబాజీ పేరు పలికినట్లయితే ఆ భక్తుడికి తక్షణమే ఆధ్యాత్మిక అనుగ్రహం లభిస్తుంది," అన్నారు లాహిరీ మహాశయులు.

---

* బాబాజీ (పూజ్యులయిన తండ్రిగారు) అనేది సామాన్యమైన బిరుదు. భారత దేశంలో చాలామంది గురువులను "బాబాజీ' అని పిలుస్తారు. కాని లాహిరీ మహాశయుల గురువులయిన బాబాజీ మాత్రం వాళ్ళలోవారు కారు ఈ మహావతారుల ఉనికిని గురించి లోకానికి మొట్టమొదటిసారిగా వెల్లడి అయింది 1946లో, ఆటోబయోగ్రఫీ ఆఫ్ ఎ యోగీ (ఒక యోగి ఆత్మకథ) ద్వారా.

మృత్యుంజయులయిన ఈ మహాగురువుల దేహం మీద వయస్సును తెలిపే చిహ్నా లేవీ ఉండవు; పాతికేళ్ళకు మించని యువకుడిలా కనిపిస్తారు. పసిమిచాయ, నడితరం పుష్టీ ఎత్తూ గల బాబాజీ సుందర దృఢకాయం దృగ్గోచర మయే తేజస్సును ప్రసరింపజేస్తూ ఉంటుంది. ఆయన కళ్ళు నల్లటివి; ప్రశాంతంగా, ప్రేమార్ద్రతతో ప్రసన్నంగా ఉంటాయి. నిగనిగలాడే ఆయన పొడుగాటి జుట్టు రాగి వన్నెలో ఉంటుంది. ఒక్కొక్కప్పుడు బాబాజీ ముఖంలో లాహిరీ మహాశయులకు ఎంత దగ్గరిపోలిక కనిపిస్తుందంటే కడపటి ఏళ్ళలో లాహిరీ మహాశయులు, యువ కుడిలా కనిపించే బాబాజీకి తండ్రిగా కూడా చెలామణి కాగలిగేటట్టు ఉండేవారు.

ఋషితుల్యులయిన నా సంస్కృతభాషాధ్యాపకులు స్వామి కేవలానంద గారు బాబాజీతో కొంతకాలం హిమాలయాల్లో గడిపారు.

"సాటిలేని ఈ పరమ గురువులు, తమ బృందంతో కలిసి హిమాలయాల్లో ఒక చోటినుంచి మరో చోటికి సంచరిస్తూ ఉంటారు," అన్నారు కేవలానందగారు నాతో. "ఆయనతోబాటు ఉండే చిన్న బృందంలో, ఆధ్యాత్మికంగా గొప్ప ప్రగతి సాధించిన అమెరికన్ శిష్యులు ఇద్దరున్నారు. ఒక ప్రదేశంలో కొంత కాలమున్నాక బాబాజీ, 'డేరా డండా ఉఠావో' ('ఇంక బిచాణా ఎత్తేద్దాం') అంటారు. ఆయన చేతిలో ఎప్పుడూ ఒక 'దండం' (వెదురు కర్ర) ఉంటుంది. ఆయన మాటలు, తమ బృందం తక్షణమే మరో చోటికి మారడానికి సూచన. ఆయన ప్రతి మాటూ సూక్ష్మయాన పద్ధతిని అనుసరించరు; ఒక్కొక్కప్పుడు ఒక కొండ మీంచి మరో కొండ కొమ్ము మీదికి కాలినడకనే వెళ్తూంటారు.

"బాబాజీ కోరినప్పుడే ఆయన ఇతరులకు కనబడడం కాని వాళ్ళు ఆయన్ని గుర్తు పట్టడం కాని జరుగుతుంది. వేరువేరు భక్తులకు ఆయన, కొద్దిపాటి తేడాగల వేరువేరు రూపాల్లో కనిపించినట్టుగా చెప్తారు - ఒక్కొక్కప్పుడు గడ్డం, మీసాలతో; మరొకప్పుడు అవి లేకుండా. చ్యుతిలేని ఆయన దేహానికి ఆహార మక్కర్లేదు; అంచేత ఆ మహాగురువులు అరుదుగా భోజనం చేస్తారు. సందర్శించే శిష్యులపట్ల సాంఘిక మర్యాదకోసం ఆయన, అప్పుడప్పుడు పళ్ళో, పాలూ నెయ్యీ పోసి వండిన పరమాన్నమో తీసుకునేవారు.

"బాబాజీ జీవితంలోని ఆశ్చర్యకరమయిన సంఘటనలు రెండు తెలుసు నాకు," అంటూ చెప్పుకొచ్చారు, కేవలానందగారు. "ఒకనాటి రాత్రి ఆయన శిష్యులు, పవిత్రమయిన వైదిక క్రతువు ఒకటి చెయ్యడానికి, భగభగా పెద్ద మంట మండుతున్న హోమకుండం చుట్టూ కూర్చుని ఉన్నారు. ఉన్నట్టుండి గురువుగారు, మండుతున్న కట్టె ఒకటి తీసుకొని, హోమకుండానికి పక్కనే ఉన్న ఒక శిష్యుడి భుజం మీద కొట్టారు.

" 'స్వామీ, ఎంత క్రూరం!' అన్నారు ఆక్షేపణగా, అక్కడే ఉన్న లాహిరీ మహాశయులు.

" 'అయితే ఇతను, తన పూర్వకర్మ ఫలానుసారంగా నీ కళ్ళముందే కాలి బూడిద అయిపోతూంటే చూస్తూంటావా?'

"ఈ మాటలతో బాబాజీ, శిష్యుడి వికృత భుజం మీద ఉపశమన దాయక మయిన తమ చెయ్యి వేశారు. 'ఈ రాత్రి నిన్ను బాధాకరమయిన మృత్యువు నుంచి తప్పించాను. నిప్పు సెగవల్ల ఈ కొద్దిపాటి బాధతో కర్మనియమం నెరవేరింది' అన్నారాయన.

"మరో సందర్భంలో బాబాజీ పవిత్ర బృందం దగ్గరికి ఒక ఆగంతకుడు రావడంవల్ల ప్రశాంతతకు భంగం కలిగింది. గురుదేవులు బసచేసిన చోటికి దగ్గరగా, చేరడానికి దాదాపు అశక్యమయిన కొండ కొనకొమ్ముకు ఆశ్చర్యం కలిగించేటంత నేర్పుతో అతడు ఎక్కివచ్చాడు.

" 'స్వామీ, బాబాజీ అనే మహానుభావులు మీరే అయి ఉండాలి.' ఆ వ్యక్తి ముఖంలో మాటలకందని భక్తి ప్రపత్తులు వెలుగొందాయి. 'మీ కోసం, చేర రాని ఈ కోనుగుట్టల్లో నెలలు తరబడిగా అంతులేకుండా వెతుకుతున్నాను. నన్ను తమ శిష్యుడిగా స్వీకరించమని వేడుకొంటున్నాను,' అన్నాడు.

"మహాగురువులు మారు పలకకపోయేసరికి అతడు, కొండ కొమ్ముకు దిగువునున్న బండల వరసవేపు చూపించాడు. 'మీరు నన్ను స్వీకరించని పక్షంలో ఈ కొండమీంచి దూకేస్తాను. దైవాన్వేషణలో నేను మీ గురుత్వం పొందలేక పోయినట్లయితే నా జీవితం నిరర్థకం.'

" 'అయితే దూకు,' అన్నారు బాబాజీ, ఏ మాత్రం ఉద్రేకం లేకుండా. 'నీ ప్రస్తుత పరిస్థితిలో నిన్ను నేను స్వీకరించలేను.'

"వెంటనే ఆ మనిషి కొండమీంచి దూకేశాడు. అది చూసి శిష్యులు కొయ్యబారిపోయారు. బాబాజీ వాళ్ళవేపు చూసి, ఆ ఆగంతకుడి కాయాన్ని తీసుకు రమ్మని చెప్పారు. చితికిన కాయాన్ని తెచ్చి శిష్యులు ఎదురుగా పెట్టగానే మహా గురువులు, దాని మీద తమచెయ్యి వేశారు. వెంటనే, చనిపోయినవాడు కళ్ళు విప్పి సర్వశక్తిమంతుడయిన గురుదేవుల ముందు సవినయంగా సాష్టాంగ దండ ప్రణామం చేశాడు.

" 'ఇప్పుడు పనికొస్తావు నువ్వు, శిష్యరికానికి,' అంటూ బాబాజీ, మళ్ళీ బతికిన శిష్యుడివేపు ఆప్యాయంగా చూశారు. 'కఠినమయిన పరీక్షను ధైర్యంగా

ఎదుర్కొని కృతార్థుడివయావు నువ్వు.* చావన్నది మరి మళ్ళీ తాకదు నిన్ను; నువ్విప్పుడు మా అమరబృందంలో ఒకడివి,' అన్నారు. ఆ తరవాత, అలవాటు ప్రకారం, 'దేరా దండా ఉఠావో' అంటూ బయలుదేరమన్నారు. మరుక్షణంలో వారి బృందమంతా కొండమీంచి మాయమయింది."

అవతారపురుషుడు సర్వవ్యాపకమయిన ఆత్మలో వసిస్తాడు. నాలుగు దిశల మధ్యదూరభావం ఆయనకు ఉండదు. కాబట్టి బాబాజీ శతాబ్దాల తరబడిగా తమ భౌతికరూపాన్ని నిలుపుకోడానికి ప్రేరణ కలిగించిన ఒకే ఒక కారణం ఏమిటంటే: మానవజాతికి గల సాధ్యాలకు వాస్తవ నిదర్శనం ఒకటి చూపించాలన్న కోరిక. దైవత్వాన్ని మాంసల (మానవ) రూపంలో దర్శించే అవకాశం కనక మనిషికి లేకపోయినట్లయితే, మర్త్యత్వాన్ని అధిగమించలేమనే భారమైన మాయా భ్రాంతి అతన్ని అణచిపెట్టి ఉంచుతుంది.

ఏసుక్రీస్తుకు తన జీవితక్రమ మేమిటో మొదటి నుంచి తెలుసు. తన జీవితంలోని ప్రతి ఒక్క సంఘటననూ ఆయన అనుభవించింది తన కోసమూ కాదు కర్మనిర్బంధం వల్లా కాదు; చింతనాపరులయిన మానవుల ఉద్ధరణ కోసమే వాటిని అనుభవించాడు. మత్తయి, మార్కు, లూకా, యోహాను అనే సువార్తికులు (ఇవాంజిలిస్టులు) నలుగురూ భావితరాలవారి ఉపయోగార్థం ఆ అద్భుత జీవిత నాటకాన్ని గ్రంథస్థం చేశారు.

భూతభవిష్యద్వర్తమానాల సాపేక్షత కూడా బాబాజీకి లేదు. ఆయనకు తమ జీవిత దశలన్నీ మొదటి నుంచి తెలుసు. మానవుల పరిమిత అవగాహన శక్తికి అనుగుణంగా బాబాజీ, తమ దివ్యజీవన చర్యలనేకం, ఒకరు లేదా అంతకన్న ఎక్కువమంది సమక్షంలో నిర్వహించారు. ఆ విధంగా, శారీరకమైన అమరత్వానికున్న అవకాశాన్ని తాము ప్రకటించడానికి సమయం ఆసన్నమయిందని బాబాజీ భావించినప్పుడు లాహిరీ మహాశయుల శిష్యులొకరు వారి సన్నిధిలో ఉండడం తటస్థించింది. తామిచ్చే హామీ ఇతర అన్వేషక హృదయాలకు స్ఫూర్తి నిస్తుందన్న ప్రసిద్ధి చివరికి పొందాలని బాబాజీ, శ్రీరామగోపాల్ మజుందార్‌గారు ఉండగా ఈ హామీ ప్రకటించారు. మహాత్ములెప్పుడూ తమ మాటలు చెబుతూ, పైకి

* విధేయతకు సంబంధించిన పరీక్ష. జ్ఞానపూర్ణులయిన గురుదేవులు, 'దూకు,' అనగానే ఆ వ్యక్తి విధేయుడయి దూకేశాడు. దాని కతను వెనకాడి ఉంటే, బాబాజీ గురుత్వం పొందలేని జీవితం నిరర్థకమని భావిస్తున్నట్లుగా తను చెప్పిన మాటలు అబద్ధమని రుజువయ్యేవి. అంతే కాదు, గురువుమీద తనకు సంపూర్ణమయిన విశ్వాసం లేదన్న సంగతి బయట పెట్టుకునేవాడు. అందువల్ల ఈ పరీక్ష కఠినమూ అసాధారణమూ అయినప్పటికీ అప్పటి స్థితిలో అదే సరయినది.

సహజంగా కనిపించే జీవిత వ్యాసంగాల్లో పాల్గొంటూ ఉంటారు - ఇది కేవలం మానవ శ్రేయస్సుకోసం. క్రీస్తు కూడా ఇలా అన్నాడు : "తండ్రీ. నా మనవి నువ్వెప్పుడూ ఆలకిస్తూనే ఉంటావని నాకు తెలుసు : కాని నువ్వే నన్ను పంపావన్న విషయంలో చుట్టూ ఉన్న వాళ్ళకి నమ్మకం కలగాలని వాళ్ళ కోసమే ఈ మాట చెప్పాను."*

రణబాజ్‌పూర్‌లో, "నిద్రపోని సాధువు"† అయిన రామగోపాల్ మజుందార్ గారిని సందర్శించిన సందర్భంలో ఆయన, బాబాజీని తాము మొట్టమొదటి సారి కలుసుకోడానికి సంబంధించిన అద్భుత కథ ఇలా చెప్పారు:

"కాశీలో లాహిరీ మహాశయుల పాదసన్నిధిలో కూర్చోడం కోసం ఒక్కొక్కప్పుడు నేను, ఏకాంతగుహను విడిచి వస్తూ ఉండేవాణ్ణి," అన్నారు రామగోపాల్ గారు నాతో. "ఒకనాడు నడిరాత్రివేళ వారి శిష్యబృందంతో బాటు కూర్చుని ధ్యానం చేసుకొంటూ ఉండగా గురుదేవులు ఆశ్చర్యకరమయిన కోరిక ఒకటి కోరారు.

" 'రామగోపాల్, వెంటనే నువ్వు దశాశ్వమేధ ఘట్టానికి వెళ్ళు,' అన్నారు లాహిరీ మహాశయులు.

"వెంటనే నేను ఆ ఏకాంత ప్రదేశానికి వెళ్ళాను. ఆ రాత్రివేళ వెన్నెలతోను మిలమిల మెరిసే చుక్కలతోను ప్రకాశిస్తున్నది. కొంతసేపు ఓపికగా, మౌనంగా కూర్చున్నాను. ఇంతలో నా పాదాలకు దగ్గరిలోనే ఉన్న ఒక పెద్ద రాతిపలక మీద నా చూపు నిలిచింది. అది మెల్లమెల్లగా లేచినప్పుడు, దానికింద భూమిలో ఒక గుహ ఉన్నట్టు వెల్లడి అయింది. ఏ అజ్ఞాత సాధనంవల్లనో పైకి లేచిన రాయి కదలడం మానేసిన తరవాత, ఆశ్చర్యం కలిగించేటంత అందమయిన ఒక యువతి ఆచ్ఛాదిత రూపం, ఆ గుహలోంచి బయటికి వెలువడి గాలిలో తేలింది. చుట్టూ మృదువయిన కాంతి పరివేషం గోచరిస్తూ ఉండగా ఆమె, మెల్లగా నేలకు దిగి వచ్చి ఒకానొక పారవశ్యంలో మునిగి ఉండి నా ముందు నిశ్చలంగా నిలిచారు. చివరి కామె కదిలి మెల్లగా ఇలా అన్నారు :

---

* యోహాను 11 41-42 (బైబిలు)

† తారకేశ్వర ఆలయం ముందు నేను తలవంచలేదని గమనించిన సర్వవ్యాపి యోగిపుంగవులు (అధ్యాయం 13).

" 'నేను మాతాజీని* - బాబాజీ చెల్లెల్ని. ఈ రాత్రి గొప్ప ప్రాముఖ్యం గల ఒక విషయాన్ని చర్చించడానికి ఆయన్నీ లాహిరీ మహాశయుల్నీ నా గుహ దగ్గరికి రమ్మని కోరాను.'

"ఇంతలో, వెండిమబ్బును పోలిన కాంతిపుంజం ఒకటి గంగానది మీద త్వరితగతిని తేలుతూ వస్తున్నట్టు కనిపించింది. పారదర్శకం కాని నీళ్ళమీద దాని అద్భుత ప్రభ ప్రతిఫలిస్తోంది. అది దగ్గరికి వచ్చి వచ్చి, కళ్ళు మిరుమిట్లు గొలిపే మెరుపుతో మాతాజీ సరసన నిలిచి వెంటనే లాహిరీ మహాశయుల మానవ రూపాన్ని ధరించింది. ఆ మహాయోగిని పాదాలకు వినమ్రులయి నమస్కరించా రాయన.

"నేను దిగ్భ్రమ నుంచి ఇంకా తేరుకోకముందే ఆకాశంలో పరిభ్రమిస్తూ వస్తున్న ఒక అలౌకిక తేజోబింబాన్ని చూసి మరింత ఆశ్చర్యపోయాను. వడివడిగా దిగుతూ ఆ తేజోవలయం, మా సమూహానికి దగ్గరిగా వచ్చి ఒక అందమయిన యువకుడిలా ఆకృతి దాల్చింది. ఆయన బాబాజీ అని నాకు తక్షణమే అర్థమయింది. ఆయన లాహిరీ మహాశయుల్ని పోలి ఉన్నారు; అయితే తన శిష్యుడి కంటె చాలా వయసు తక్కువ వారిగా ఉండి నిగనిగలాడే పొడవైన జుట్టు కలిగి ఉన్నారు.

"లాహిరీ మహాశయులూ, మాతాజీ, నేనూ మహాగురువుల పాదాలకు ప్రణామం చేశాం. ఆయన దివ్యశరీరాన్ని తాకేసరికి నాలోని అణువణువూ పరమానందానుభూతితో పరవశమయింది.

" 'నేను నా రూపాన్ని విడిచి అనంత దైవవాహినిలోకి దూకుదామనుకుంటు న్నాను,' అన్నారు బాబాజీ.

" 'ప్రియ గురుదేవా, మీ ఆలోచన నేను ముందే తెలుసుకున్నాను. ఆ విషయమే ఈ రాత్రి మీతో మాట్లాడాలనుకున్నాను. మీరు శరీరాన్ని ఎందుకు విడవాలి?' ఆ మహితాత్మురాలు ఆయనవైపు ప్రార్థనా పూర్వకంగా చూశారు.

"నా ఆత్మసాగరం మీద నేను, కంటికి కనిపించే అల రూపాన్ని ధరిస్తే నేమి, కనిపించని అల రూపాన్ని ధరిస్తే నేమి? తేడా ఏముంటుంది?

---

* "పవిత్ర మాత." మాతాజీ కూడా అనేక శతాబ్దాలుగా జీవిస్తూ ఉన్నారు. ఆధ్యాత్మికంగా ఈమె, దాదాపు సోదరులందుకున్నంత ఉన్నత స్థితిని అందుకున్నారు. దశాశ్వమేధ ఘట్టం దగ్గర భూమిలో ఉన్న ఒక రహస్య గుహలో ఆనందపారవశ్యంలో మునిగి ఉంటారు.

"వెంటనే మాతాజీ, 'అమర గురుదేవా, అటువంటి తేడా ఏమీ లేనప్పుడు మీ రూపాన్ని ఎన్నటికీ విడవకండి,' అన్నారు ఛలోక్తిగా.*

" 'తథాస్తు,' అన్నారు బాబాజీ, గంభీరంగా. 'నా భౌతిక శరీరాన్ని ఎన్నటికీ విడవను. ఇది భూమిమీద కనీసం కొద్దిమందికి ఎప్పుడూ కనిపిస్తూనే ఉంటుంది. భగవంతుడు తన ఆకాంక్షను నీ నోటి మీదగా చెప్పించాడు.'

"ఆ మహానుభావుల సంభాషణను భయభక్తులతో వింటూ ఉండగా పరమ గురుదేవులు, ప్రసన్నంగా నావేపు తిరిగారు.

" 'భయపడకు రామగోపాల్, ఈ అమర వాగ్దాన ఘట్టానికి నువ్వొక సాక్షిగా ఉండి ధన్యుడివయావు,' అన్నారాయన.

"బాబాజీ మృదుమధురస్వరం ఆగిపోతూ ఉండగా ఆయన రూపమూ లాహిరీ మహాశయుల రూపమూ మెల్లగా పైకి గాలిలో తేలి వెనక్కి, గంగానది వేపు కదిలాయి. ఆ రాత్రిపూట ఆకాశంలో వారు అదృశ్యులవుతూ ఉండగా వారి దేహాల చుట్టూ కళ్ళు మిరుమిట్లు గొలిపే కాంతి పుంజం వెలుగొందింది. మాతాజీ రూపం గుహ దగ్గరికి తేలుతూ సాగి గుహలోకి దిగింది. రాతిపలక మళ్ళీ, కిందికి వచ్చి, కంటికి కనిపించని చేతులు కదిల్చినట్లుగా కదిలి ఆ గుహను మూసేసింది.

"అనంతమైన ఉత్తేజం పొంది నేను తిరిగి లాహిరీ మహాశయుల నివాసానికి దారి తీశాను. వేకువ సంజెలో ఆయనముందు మోకరిల్లుతూ ఉండగా గురుదేవులు భావగర్భితంగా చిరునవ్వు నవ్వారు.

" 'చాలా సంతోషం రామగోపాల్,' అన్నారాయన. 'బాబాజీనీ మాతాజీనీ దర్శనం చేసుకోవాలని నువ్వు తరచుగా వ్యక్తంచేస్తూ వచ్చిన కోరిక చివరికి అద్భుతంగా నెరవేరింది.'

"నడిరాత్రి వేళ నేను ఇక్కణ్ణించి వెళ్ళినప్పటినించి లాహిరీ మహాశయులు తమ వేదికమీంచి కదలలేదని నా సహాధ్యాయులు చెప్పారు

" 'నువ్వు దశాశ్వమేధ ఘట్టానికి వెళ్ళిన తరవాత ఆయన, అమరత్వాన్ని గురించి అద్భుతంగా ప్రసంగించారు,' అన్నాడొక శిష్యుడు. ఆత్మసాక్షాత్కారం

---

* ఈ సంఘటన నాకు థేలీజ్ కథను గుర్తుకు తెస్తోంది. ఈ ప్రముఖ గ్రీకు తత్త్వవేత్త జీవితానికీ మరణానికీ భేదం లేదని బోధించాడు. "అయితే మరి మీ రెందుకు చనిపోరు?" అని అడిగాడొక విమర్శకుడు. "రెంటికీ తేడా లేదు కనకనే," అని జవాబిచ్చాడట థేలీజ్

పొందిన వ్యక్తి ఒకే సమయంలో వేరువేరు చోట్ల, రెండు శరీరాలతోనో అంతకంటె ఎక్కువ శరీరాలతోనో కనిపిస్తూ ఉంటాడని ధర్మశాస్త్ర గ్రంథాలు చెప్పే సత్యాన్ని మొట్టమొదటిసారిగా పూర్తిగా అప్పుడే అవగాహన చేసుకున్నాను.

"ఈ భూమికి సంబంధించిన గుప్తమయిన దివ్యప్రణాళికలోని అధిభౌతి కాంశాలను లాహిరీ మహాశయులు, తరవాత నాకు వివరించారు," అంటూ ముగించారు రామగోపాల్‌గారు. "ప్రత్యేకించి ఈ ప్రపంచావధి పర్యంతం తమ శరీరాన్ని నిలుపుకొని ఉండటానికి భగవంతుడు నిర్ణయించిన వ్యక్తి బాబాజీ. యుగాలు వస్తూంటాయి, పోతూంటాయి - అయినప్పటికీ మరణంలేని ఈ మహాగురువులు,* ప్రపంచరంగం మీద శతాబ్దాల తరబడిగా సాగుతూండే నాటకాన్ని తిలకిస్తూనే ఉంటారు.

---

* "ఎవరయినా నా మాటను మన్నించినట్లయితే (అవిచ్ఛిన్నంగా క్రీస్తు చైతన్యంలో మునిగి ఉన్నట్లయితే) అతనికి మరణమే ఎదురుకాదు." (యోహాను 8.51 బైబిలు).

ఇలా అనడంలో ఏసుక్రీస్తు, భౌతికదేహంతో అమరజీవనం గడపడం గురించి చెప్పడం లేదు. దుర్భరమయిన అటువంటి నిర్బంధం, సాధువు సంగతి అలా ఉంచి, పాపికి విధించ దానికే ఎవరూ పాలుపడరు! క్రీస్తు ప్రస్తావించిన జ్ఞాని, మరణంలాంటి అజ్ఞాన నిద్రాపారవశ్యం లోంచి మేల్కొని శాశ్వత అమరత్వ సిద్ధి పొంది ఉన్నవాడు (43 అధ్యాయం చూడండి).

మానవుడి ప్రధాన ప్రకృతి నిరాకారమయిన సర్వవ్యాప్తమయిని ఆత్మ. నిర్బంధంగా, లేదా కర్మానుబంధంగా సంభవించే శరీరధారణ 'అవిద్య'కు అంటే అజ్ఞానానికి ఫలితం. చావుపుట్టుకలు రెండూ విశ్వంలోని మాయవల్ల సాక్షీభూతమయేవే నని హిందూ ధర్మశాస్త్రాలు తెలుపుతాయి. చావుపుట్టుకలన్నవి సాపేక్ష ప్రపంచంలోనే అర్థవంతమయినవి.

బాబాజీ ఒక భౌతిక శరీరానికి కాని ఈ గ్రహానికి కాని పరిమితులయి ఉన్నవారు కారు; భగవంతుడి సంకల్పం ప్రకారం ఈ లోకానికి ప్రత్యేక సేవా విధి నిర్వహిస్తున్నవారు.

స్వామి ప్రణవానందులవంటి మహాగురువులు (పే 326 చూడండి) కొత్త దేహాలు ధరించి ఈ లోకంలోకి తిరిగి రావడానికి కారణాలు వారికే తెలియాలి. ఈ లోకంలో, వారి జన్మలు కర్మసంబంధమయిన కఠిన నిర్బంధాలకు లోబడి ఉండేవి కావు. తమంతట తాము ఈ విధంగా తిరిగి రావడాన్ని 'వ్యుత్థానం' - అంటే మాయాంధకారం తొలగిపోయిన తరవాత మళ్ళీ భూలోక జీవితానికి తిరిగి రావడం - అంటారు.

సంపూర్ణంగా భగవత్సాక్షాత్కారం పొందిన గురువు, మామూలు రీతిలో చనిపోయినా, అద్భుత రీతిలో చనిపోయినా తన శరీరాన్ని తిరిగి పొంది భూలోకవాసులకు ప్రత్యక్షంగా కనిపిస్తూ ఉంటాడు

లెక్కకు అందనన్ని సూర్యమండలాలకు అధీశ్వరుడయిన పరమేశ్వరుడి సాయుజ్యం పొంది ఉన్న వ్యక్తికి భౌతిక శరీరాణువుల్ని సృష్టించటమన్నది కష్టమయినదేమీ కాదు.

"నా ప్రాణాన్ని తిరిగి పొందాలనే నేను విడుస్తున్నాను " అని ఉద్ఘాటించాడు క్రీస్తు "దాన్ని నా నుంచి ఎవ్వరూ తియ్యలేరు; నేనే దాన్ని విడుస్తున్నాను. దాన్ని అలా విడిచే శక్తి తిరిగి పొందే శక్తీ నాకున్నాయి." యోహాను 10:17-18 (బైబిలు).

అధ్యాయం : *34*

# హిమాలయాల్లో మహాభవన సృష్టి

"బాబాజీ మొట్టమొదటిసారిగా లాహిరీ మహాశయుల్ని కలుసుకున్న వృత్తాంతం, మైమరిపించే కథ; మరణంలేని మహాగురువుల గురించి వివరంగా తెలిపే వాటిలో అది ఒకటి."

ఒక అద్భుత కథకు ఆముఖంగా, ఈ మాటలు అన్నవారు స్వామి కేవలా నందగారు. ఆయన మొట్టమొదటిసారి ఈ కథ చెప్పినప్పుడు నేను అక్షరాలా మంత్రముగ్ధుణ్ణి అయాను. అనేక ఇతర సందర్భాల్లో కూడా ఈ కథ మళ్ళీ చెప్ప మని సౌమ్యమూర్తులయిన నా సంస్కృతం ట్యూటరుగారిని కోరాను; దరిమిలా, శ్రీయుక్తేశ్వర్‌గారు కూడా, వస్తుతః అవే మాటలు చెప్పారు. లాహిరీ మహాశయుల శిష్యులయిన వీరిద్దరూ ఈ అద్భుత కథను సూటిగా తమ గురుదేవుల నోటినించే విన్నారు.

"బాబాజీని నేను మొట్టమొదటిసారి కలుసుకున్నది, నాకు ముప్ఫై మూడో ఏట," అని చెప్పారు లాహిరీ మహాశయులు. 1861 శరత్కాలంలో నేను దానా పూర్‌లో ఉండేవాణ్ణి. గవర్నమెంటు మిలటరీ ఇంజినీరింగ్ డిపార్ట్‌మెంటులో ఎకౌంటెంట్‌గా పనిచేస్తూండేవాణ్ణి. ఒకనాడు పొద్దున మా ఆఫీసు మేనేజరు నన్ను పిలిపించాడు.

" 'లాహిరీ మన ప్రధాన కార్యాలయం నుంచి ఇప్పుడే ఒక తంతి వచ్చింది. నువ్వు రాణీఖేత్‌కు బదిలీ అవుతున్నావు; అక్కడ ఇప్పుడొక సైనిక స్థావరం* ఏర్పాటవుతోంది.'

---

* తరవాత మిలటరీ శానిటోరియం; 1861 నాటికే బ్రిటిష్ ప్రభుత్వం ఇండియాలో తంతి వార్తా విధానం నెలకొల్పింది.

"నేనొక బంట్రోతును వెంటబెట్టుకుని 500 మైళ్ళ ప్రయాణం ఆరంభించాను. గుర్రంమీదా బగ్గీమీదా ప్రయాణాలు సాగిస్తూ, ముప్ఫై రోజుల్లో హిమాలయ ప్రాంతంలో ఉన్న రాణీఖేత్ * చేరుకున్నాను.

"నా ఆఫీసు పనులు భారమైనవేమీ కావు. ఆ రమణీయ పర్వత ప్రదేశాల్లో తిరుగుతూ గంటలకి గంటలు గడిపేవాణ్ణి. ఆ ప్రాంతం మహామునుల నివాసం చేత పునీతమైందన్న జనశ్రుతి నా చెవిని పడింది. వాళ్ళని చూద్దామని నాలో గట్టి కోరిక కలిగింది. ఒకనాడు మధ్యాహ్నం అలా తిరగడంలో, నన్నెవరో పిలు స్తూండడం విని ఆశ్చర్యపోయాను. జోరుగా, ద్రోణగిరి పర్వతం ఎక్కుతూ పోయాను అడవిలో చీకటి ముసురుకుపోయేలోగా నేను వెనక్కి తిరిగి రాలేనేమో అన్న ఆలోచనతో ఒక్క రవ్వ దిగులు కలిగింది.

"చివరికి, చెట్లులేని ఒక వెల్లడి ప్రదేశానికి చేరాను; దానికి ఈ పక్కా ఆ పక్కా గుహలు కనిపిస్తున్నాయి. రాతిగొట్టు కొండ అంచుల్లో ఒకదానిమీద, పడుచు వయస్సాయన ఒకరు చిరునవ్వు నవ్వుతూ నించున్నారు; నాకు స్వాగతం చెబుతున్నట్టుగా చెయ్యి చాపారు. ఆయన రాగిరంగు జుట్టు ఒక్కటి మినహా యిస్తే, అచ్చూమచ్చూ నా పోలికలోనే ఉండడం చూసి ఆశ్చర్యపోయాను.

" 'లాహిరీ,† వచ్చేశావా!' అంటూ ఆ సాధువు, నన్ను ఆప్యాయంగా హిందీలో పలకరించారు. 'ఈ గుహలో విశ్రాంతి తీసుకో. నిన్ను పిలిచినవాణ్ణి నేనే.'

"పరిశుభ్రమైన ఒక చిన్న గుహలోకి ప్రవేశించాను; దాంట్లో చాలా ఉన్ని గొంగళ్ళూ కొన్ని కమండలాలూ ఉన్నాయి.

" 'లాహిరీ, ఆ ఆసనం జ్ఞాపకముందా నీకు?' అంటూ ఆ యోగి, ఒక మూల మడిచిపెట్టి ఉన్న గొంగడివేపు చూపించారు.

---

* రాణీఖేత్ అల్మోరా జిల్లాలో, నందాదేవి పర్వత పాదసీమలో ఉంది. ఈ పర్వతం హిమాలయ శిఖరాల్లో బాగా ఎత్తయిన వాటిలో ఒకటి (25, 661 అడుగులు).

† నిజానికి బాబాజీ లాహిరీ మహాశయుల్ని పిలిచింది, "గంగాధర్" అన్న పేరుతో; అది ఆయనకి పూర్వజన్మలో ఉన్న పేరు. గంగాధరుడు (అంటే, "గంగను ధరించినవాడు") శివ దేవుడి పేర్లలో ఒకటి. పురాణ కథలో చెప్పినట్టు, పావనగంగ స్వర్గం నుంచి అవతరించింది. దాని ఉద్వృత అవతరణ ధాటికి భూమి తట్టుకోడానికి శివుడు గంగను తన జటాజూటంలో బంధించి, అక్కణ్ణించి అనుకూల ప్రవాహంగా భూమి మీదికి వదలడం జరిగింది. "గంగాధర" శబ్దానికున్న అధిభౌతిక ప్రాముఖ్యం ఏమిటంటే : "వెన్నులో ఉన్న ప్రాణప్రవాహమనే "నది"ని అధీనంలో ఉంచుకున్నవాడు" అని అర్థం.

" ' లేదండి,' నా సాహసయాత్రలో ఎదురవుతున్న వింతకు నేను కొద్దిగా విస్మితుణ్ని అయి, 'నే నిప్పుడు చీకటిపడే లోగా వెళ్ళిపోవాలండి. పొద్దున ఆఫీసులో నాకు పని ఉంది,' అన్నాను.

"ఆ విచిత్ర సాధువు ఇంగ్లీషులో జవాబిచ్చారు, 'ఆఫీసును రప్పించింది నీ కోసం కాని, నిన్ను ఆఫీసుకోసం కాదు.'

"ఈ వనవాసి సాధువు ఇంగ్లీషు మాట్లాడ్డమే కాకుండా, క్రీస్తు* మాటల్ని అన్వయించి చెప్పడం విని నేను మూగబోయాను.

" 'నా తంతి పనిచేసినట్టు తెలుస్తోంది.' ఆ యోగి చేసిన వ్యాఖ్య నాకు అగమ్యంగా ఉంది; దాని అర్థమేమిటని అడిగాను.

" ' నేను చెప్పింది, నిన్నీ నిర్జన ప్రదేశాలకు రప్పించిన టెలిగ్రాం సంగతి నీకు రాణీఖేత్‌కు బదిలీ కావాలని నీ పై ఆఫీసరు మనస్సుకు నిశ్శబ్దంగా సూచించిన వాణ్ణి, నేను. ఎవరయినా, మానవజాతితో తన ఏకత్వాన్ని అనుభూతి కావించు కున్నప్పుడు అన్ని మనస్సులూ అతనికి ప్రసారణ కేంద్రాలవుతాయి; వాటి ద్వారా అతడు ఇచ్చానుసారంగా పనిచేస్తాడు,' అంటూ ఆయన, 'లాహిరీ, ఈ గుహ నీకు, తప్పకుండా తెలిసిందానిలాగే కనిపిస్తోంది కదూ?' అని అడిగారు.

" ' నేను దిమ్మెరబోయి మౌనం దాల్చి ఉండడంతో, ఆ సాధువు నా దగ్గరికి వచ్చి నా నుదుటిమీద మెల్లగా తట్టారు. ఆయన అయస్కాంత స్పర్శతో నా మెదడంతటా అద్భుతమైన ఒక విద్యుత్ప్రవాహం ప్రసరించింది; నా గతజన్మ తాలూకు మధురమైన బీజస్మృతుల్ని మేల్కొలిపింది.

" 'జ్ఞాపకం వచ్చింది!' పట్టలేని ఆనందంతో వెక్కివెక్కి ఏడవడం వల్ల నా గొంతు సగం పూడుకుపోయింది. 'మీరు నా గురుదేవులు బాబాజీ; ఎప్పటికీ నావారే! గతకాలపు దృశ్యాలు సుస్పష్టంగా నా మనస్సులో మెదులుతున్నాయి ఇక్కడ ఈ గుహలోనే గడిపాను, కిందటి జన్మలో చాలా ఏళ్ళు!' చెప్పనలవి కాని జ్ఞాపకాలు నన్ను ముంచెత్తేస్తూ ఉంటే, కన్నీళ్ళు నింపుతూ గురుదేవుల పాదాలను చుట్టేసుకున్నాను.

" 'నువ్వు నా దగ్గరికి తిరిగి వస్తావని ముప్ఫై ఏళ్ళు పైబడి నీ కోసం కాసుకొని ఉన్నాను.' బాబాజీ గొంతులో దివ్యప్రేమ తొణికిసలాడింది.

---

* "సబ్బత్ (విశ్రాంతి దినం) మనిషికోసం ఏర్పాటయింది కాని మనిషి సబ్బత్ కోసం కాదు." - (మార్కు 2:27 బైబిలు).

నువ్వు మరణానంతర జీవితపు కల్లోల తరంగాల్లోకి జారి అదృశ్యమయి పోయావు. నీ కర్మ అనే మంత్రదండం నిన్ను తాకింది; దాంతో నువ్వెళ్ళిపోయావు! నువ్వు నన్ను చూడలేకపోయినా, నీ మీంచి నా చూపెన్నడూ చెదరలేదు. మహిమాన్వితులైన దేవదూతలు ప్రయాణం చేసే తేజోమయ సూక్ష్మసాగరం మీద నిన్ను వెన్నంటే వచ్చాను. తల్లి పక్షి తన పిల్లలను కాపాడుకుంటూ ఉన్నట్టుగా - చిమ్మ చీకట్లో, తుపానులో, అల్లకల్లోలంలో, వెలుగులో నీ వెనకాలే ఉంటూ వచ్చాను. మానవోచితమైన మాతృగర్భవాస జీవితం నువ్వు పూర్తి చేసుకొని పసిపాపడుగా భూమిమీద పడ్డప్పటినించి నా కన్నెప్పుడూ నీ మీదే ఉంది. చిన్నతనంలో నువ్వు ఘుర్ణీ ఇసకదిబ్బల్లో పద్మాసనం వేసుక్కూర్చుని, నీ చిన్నారి ఒంటిని ఇసకతో కప్పేసుకుని ఉన్నప్పుడు, నేను అదృశ్యంగా అక్కడే ఉన్నాను. ఫలించిన ఈ శుభదినం కోసం ఓపికగా ఎదురుచూస్తూ, నెలలకు నెలలు, ఏళ్ళకు ఏళ్ళు నిన్ను కనిపెట్టుకొనే ఉన్నాను. ఇప్పటికి నువ్వు నా దగ్గరున్నావు! ఇదుగో నీ గుహ; పూర్వం నుంచీ నీకు ప్రియమయినది. నీ కోసం దీన్ని ఎప్పటికీ శుభ్రంగా, సిద్ధంగా ఉంచాను. పునీతమయిన నీ గొంగడి ఆసనం ఇదుగో; విశాలమవుతున్న నీ హృదయాన్ని దైవభక్తితో నింపడం కోసం నువ్వు నిత్యమూ కూర్చున్నది ఇక్కడే. నేను తయారుచేసి ఇచ్చిన అమృతాన్ని తాగడానికి నువ్వు తరచు ఉపయోగిస్తూ వచ్చిన గిన్నె ఇదుగో: చూడు ఈ ఇత్తడి గిన్నె ఎంత తళతళలాడేలా మెరుగుపెట్టి ఉంచానో! ఎందుకు? ఎప్పుడో ఒకనాడు నువ్వు మళ్ళీ దాంతో తాగుతావని. నాయనా, ఇప్పుడర్థమయిందా నీకు?'

" 'గురుదేవా, ఏం చెప్పగలను నేను?' అంటూ తడబడుతూ మెల్లగా అన్నాను. 'ఇటువంటి అమరప్రేమ గురించి ఎక్కడయినా, ఎవ్వరయినా విన్నారా?' నా శాశ్వత విధిని - జీవితంలోనూ మరణంలోనూ కూడా నావారైన గురుదేవుల్ని, ఆనంద తన్మయుణ్ణయి తదేకంగా చూస్తూ ఉండిపోయాను.

" 'లాహిరీ, నీకు పరిశుద్ధి అవసరం. ఈ గిన్నెలో ఉన్న నూనె తాగి, ఏటి ఒడ్డున పడుకో,' అన్నారు బాబాజీ. అన్ని సందర్భాల్లో బాబాజీ వ్యవహార జ్ఞానం ముందే ఉంటుంది, అనుకున్నాను,' పాత జ్ఞాపకాలతో చటుక్కున చిరునవ్వు రాగా.

"ఆయన చెప్పిన ప్రకారం చేశాను. చల్లటి హిమాలయ రాత్రి ముసురుతూ ఉన్నప్పటికీ నాలో, హాయి అనిపించే వెచ్చదనం వ్యాపించడం మొదలయింది. నేను ఆశ్చర్యపోయాను. ఏమిటో తెలియని ఆ నూనె దివ్యమైన ఉష్ణంతో రంగరించబడిందా?

"ఆ చీకట్లో, తీవ్రమైన గాలులు చెలరేగి భయంకరంగా సవాలు చేస్తున్నట్టు గర్జిస్తూ, చుట్టూ నన్ను కొరడాలతో కొడుతున్నాయి. గగాస్ నదిలోని చల్లని చిట్టిపొట్టి అలలు, రాతిగొట్టు ఏటిగట్టున కాళ్ళు చాపి వెల్లకిలా పడుకున్న నా ఒంటిమీదికి వచ్చి పడుతున్నాయి. దగ్గరిలో పులులు గాండ్రిస్తున్నాయి; అయినా నా గుండెలో ఎంతమాత్రం భయం లేదు; నాలో కొత్తగా పుట్టిన ఉజ్జ్వల శక్తి, అభేద్యమైన రక్షణ ఉందని హామీ తెలియజేసింది. చాలా గంటలు వేగంగా గడిచిపోయాయి వెల్లబారిన పూర్వజన్మ స్మృతులు నా గురుదేవులతో ఇప్పుడు కలిగిన ఉజ్జ్వల పునస్సమాగమంతో కలిసి పడుగుపేకల పనివరసగా అల్లుకు పోయాయి.

"ఏవో అడుగుల చప్పుడు దగ్గరవుతుండగా, ఒంటరిగా నేను చేస్తున్న ఆలోచనలకు అంతరాయం కలిగింది. ఆ చీకట్లో ఒక మనిషి నాకు చెయ్యి అందిచ్చి, నేను లేచి నిలబడ్డానికి సాయపడ్డాడు; తరవాత కొన్ని పొడిబట్టలు ఇచ్చాడు.

" 'రా అన్నా, గురుదేవులు నీ కోసం ఎదురు చూస్తున్నారు,' అన్నాడతను.

"అడవి గుండా అతడు దారి తీశాడు. దారిలో ఒక మలుపు దగ్గరికి మేము రాగానే దూరాన ఒక నిశ్చలకాంతితో కాళరాత్రి ఒక్కసారిగా కాంతివంత మయింది

" 'అది సూర్యోదయం కావచ్చునా?' అని అడిగాను. 'నిజంగా రాత్రి అంతా గడవలేదు కదూ?'

" 'ఇది అర్ధరాత్రి సమయం,' అన్నాడతను మృదువుగా నవ్వుతూ, దూరాన కనిపించే ఆ వెలుగు, అసదృశులైన బాబాజీ నీ కోసం ఈ రాత్రి సృష్టించిన బంగారు భవనం ధగద్ధగలు. సుదూరమైన గతంలో నువ్వొకసారి, మహాభవనం అందాలు చూసి ఆనందించాలన్న కోరిక వెల్లడించావు. మన గురుదేవులు ఇప్పుడు నీ కోరిక తీరుస్తున్నారు; ఆ విధంగా నిన్ను, నీ చిట్టచివరి కర్మాను బంధం నుంచి విముక్తుణ్ణి చేస్తున్నారు.'* తరవాత ఇంకా చెప్పాడతను, 'ఈ రోజు రాత్రి నీకు క్రియాయోగ దీక్ష ఇచ్చేచోటు, రమణీయమైన ఆ మహాభవనమే. నీ ప్రవాసం ముగిసినందుకు సంతోషిస్తూ నీ సోదరులందరూ కలిసి ఇక్కడ స్వాగతం చెబుతున్నారు. చూడు!'

"మా ఎదుట, కళ్ళు మిరుమిట్లు గొలిపే బ్రహ్మాండమైన ఒక బంగారు భవనం ఉంది. లెక్కలేనన్ని రత్నాలతో అలంకరించి ఉండి, సువిశాలమైన ఉద్యానవనాల మధ్య సుస్థితమై, నిశ్చలమైన జలాశయాల్లో ప్రతిబింబిస్తూ - అసదృశ మైన శోభతో

---

* కర్మసూత్రం ప్రకారం, మానవుడి ప్రతి కోరికా చివరికి తీరి తీరవలసిందే ఆత్మకు సంబంధించని కోర్కెలు ఈ విధంగా మానవుణ్ణి పునర్జన్మ చక్రానికి కట్టేసే గొలుసన్నమాట

విరాజిల్లుతున్న అద్భుతదృశ్యం! చాలా ఎత్తయిన కమానులకు గొప్పగొప్ప వజ్రాలూ, ఇంద్రనీలాలూ, పచ్చలూ సంకీర్ణ రీతిలో పొదిగి ఉన్నాయి. కెంపులతో ఎర్రబారి వెలుగొందుతున్న ద్వారాల దగ్గర, దివ్యతేజస్సు వెద జల్లుతున్న భవ్యమూర్తులు కొలువై ఉన్నారు.

"నా స్నేహితుడి వెనకాలే, విశాలమైన స్వాగత కక్ష్యలోకి ప్రవేశించాను. అగరు ధూపాలూ గులాబీల పరిమళాలూ గాలిలో తేలిపోతున్నాయి. మంద మందంగా వెలుగుతున్న దీపాలు వన్నెవన్నెల కాంతుల్ని వెదజల్లుతున్నాయి. కొందరు ఎర్రగా, కొందరు నల్లగా ఉన్న భక్తులు, చిన్నచిన్న బృందాలుగా కూడి అంతశ్శాంతిలో మునిగి మృదుస్వరంతో గానం చేస్తున్నారు; కొందరు నిశ్శబ్దంగా ధ్యానముద్రలో ఆసీనులై ఉన్నారు. స్పందనశీలమైన ఆనందం వాతావరణ మంతటా వ్యాపించింది.

"నేను ఆశ్చర్యపడుతూ ఉండగా నాకు దారి చూపిస్తున్నతను, సానుభూతితో చిరునవ్వు నవ్వుతూ ఇలా అన్నాడు : 'నీ కళ్ళకు పండుగగా, ఈ భవనం కళా వైభవాన్ని చూసి ఆనందించు. కేవలం నీ గౌరవార్థమే దీన్ని సృష్టించడం జరిగింది కనక.'

" 'అన్నా, ఈ భవనసౌందర్యం మానవ ఊహకు అతీతమైంది. దీని మూలంలో ఉన్న మర్మ మేమిటో దయచేసి వివరంగా చెప్పు.'

" 'సంతోషంగా చెప్తాను.' నా సహచరుడి నల్లటికళ్ళు జ్ఞానంతో మెరిశాయి. 'ఈ భవన సృష్టి విషయంలో వివరించడానికి వీలు కానిది ఏమీ లేదు. బ్రహ్మాండం యావత్తూ సృష్టికర్త ప్రక్షేపించిన భావనే. రోదసిలో తేలి ఆడుతున్న భూమి అనే ఈ బరువైన పిండం, దేవుడి కల. మానవుడు తన స్వప్నచేతనలో, సకలజీవ సమన్వితమైన సృష్టికి పునఃకల్పన చేసి ప్రాణంపోసినట్టుగానే దేవుడు, తన మనస్సులోంచే సర్వవస్తు సముదాయాన్నీ సృష్టిస్తాడు.

" 'ఈశ్వరుడు మొదట ఈ భూమిని ఒక భావంగా రూపొందించాడు. తరవాత దానికి జీవం ఇచ్చాడు; పరమాణుశక్తీ ఆ తరవాత పదార్థమూ పుట్టాయి. భూసంబంధమైన అణువుల్ని సమన్వయపరిచి ఘనగోళాకృతిగా రూపొందించాడు. దాని అణువులన్నీ దేవుడి సంకల్పం చేతనే దగ్గరగా కూడి ఉన్నాయి. ఆయన తన సంకల్పాన్ని ఉపసంహరించుకున్నప్పుడు భూమి అణువులన్నీ శక్తిగా పరివర్తన చెందుతాయి. అణుశక్తి, తనకు మూలకందమైన చైతన్యంలోకి తిరిగి వెళ్ళిపోతుంది. భూభావం, స్థూలత్వంలో నుంచి అదృశ్యమవుతుంది.

" 'కలగనేవాడి అవచేతనాపరమయిన ఆలోచన అతని స్వప్న వస్తువును రూపొందిస్తుంది. మెలుకువలో ఆ సంయోజక ఆలోచన ఉపసంహారమైనప్పుడు, ఆ స్వప్నమూ దాని మూలకాలూ కూడా లయమయిపోతాయి. మనిషి , కళ్ళు మూసుకుని ఒక స్వప్న జగత్తును సృష్టిస్తాడు; మేలుకోగానే అప్రయత్నంగానే

దాన్ని కరిగించేస్తాడు. ఇందులో అతను, దేవుడి మౌలికాదర్శాన్ని అనుసరిస్తాడు అదే విధంగా అతను విశ్వ చైతన్య జాగృతి పొందినప్పుడు, బ్రహ్మాండ స్వప్నరూప మైన విశ్వభ్రాంతిని కూడా అప్రయత్నంగానే కరిగించేస్తాడు.

" సర్వార్థ సాధకమైన అనంత సంకల్పంతో అనుసంధానం పొంది బాబాజీ మూలకఅణువుల్ని, సుసంయుక్తమైన ఏ రూపంలోనైనా సాక్షాత్కరించ వలసిందిగా ఆదేశించగలరు. క్షణమాత్రంలో నెలకొలిపిన ఈ బంగారు భవనం, ఈ భూమి ఎంత వాస్తవమయినదో అంత వాస్తవమయినది. బాబాజీ ఈ సుందర సౌధాన్ని తమ మనస్సులోంచి సృష్టించారు; దాని పరమాణువుల్ని తమ సంకల్పశక్తిచేత సుసంఘటితంగా నిలిపి ఉంచుతున్నారు - దేవుడి ఆలోచన ఈ భూమిని సృష్టించినట్టు, ఆయన సంకల్పం దీన్ని నిలిపి ఉంచుతున్నట్టుగానే. ఈ భవనం ప్రయోజనం తీరిపోగానే బాబాజీ దాన్ని అదృశ్యం చేసేస్తారు" అని చెప్పాడు.

"ఆశ్చర్యంతో నేను అవాక్కునై ఉండిపోగా, నాకు దారి చూపిస్తున్నారాయన. ఆ భవనం వేపు చెయ్యి చాపి చూపిస్తూ ఇలా అన్నాడు : 'అమూల్య రత్నాలతో అద్భుతంగా అలంకృతమై ధగద్ధగాయమానంగా ఉన్న ఈ రాజసౌధం, మానవ ప్రయత్నంతో నిర్మించింది కాదు; దాని బంగారమూ, రత్నాలూ కష్టపడి గనిలోంచి తవ్వినవేమీ కావు. ఇది మానవుడికొక గొప్ప సవాలుగా, ఘనరూపంలో దృఢంగా నిలిచి ఉంది.* బాబాజీ మాదిరిగానే, తనను దైవసంతానంగా అనుభూతం కావించు కున్నవాడు, తనలో మరుగుపడి ఉన్న అనంత శక్తులచేత ఏ లక్ష్యాన్నయినా చేరుకో గలడు. ఒక మామూలు రాతిలో కూడా బ్రహ్మాండమైన అణుశక్తులు† గుప్తంగా నిక్షిప్తమై ఉంటాయి; అదే విధంగా అత్యల్పుడైన మర్త్యుడు సైతం దివ్యశక్తికి ఉత్పాదకస్థానమే.'

"ఆ సాధువు, దగ్గరలో ఉన్న ఒక బల్లమీంచి నాజూకు పనితనం ఉట్టిపడే పూలపాత్ర (వాజ్) ఒకటి అందుకొన్నాడు; దాని పిడి, వజ్రాలతో మెరిసిపోతోంది 'మన మహాగురువులు అనేక లక్షల స్వతంత్ర విశ్వకిరణాల్ని ఘనీభవింపజేసి ఈ సౌధం నిర్మించారు,' అంటూ చెప్పసాగాడతను. 'ఈ పూలపాత్రా దీని వజ్రాలూ కూడా తాకి చూడు; ఇంద్రియానుభవ పరీక్షలన్నింటికీ నిలబడతాయివి.'

* "అలౌకిక ఘటన అంటే ఏమిటి? - అదొక మందలింపు. మానవజాతి మీద గుప్తమైన అధిక్షేపణ అది." - ఎడ్వర్డ్ యంగ్, 'నైట్‌థాట్స్'లో

† వైశేషిక, న్యాయదర్శనాలనే ప్రాచీన భారతీయ గ్రంథాల్లో, పదార్థ అణునిర్మాణ సిద్ధాంతాన్ని వివరించడం జరిగింది. "ప్రతి అణుగర్భంలోనూ, సూర్యకిరణంలోని అసంఖ్యాకమైన రజోకణాల మాదిరిగా విశాల జగత్తులు ఇమిడి ఉన్నాయి," - యోగవాశిష్ఠం

"పూలపాత్రను పరీక్షించాను; దాంట్లో పొదిగిన వజ్రాలు ఒక రాజు దగ్గర ఉండదగినవి. ధగధగ మెరిసే బంగారం గది గోడల్ని చేత్తో తడిమాను. నా మనస్సులో గాఢమైన సంతృప్తి వ్యాపించింది. గత జన్మలనుంచి నా అవచేతనలో ఉన్న కోరిక ఒకటి ఒకేసారి తీరినట్టూ నశించినట్టూ కూడా అనిపించింది.

"మహాప్రాసాదంలోకి దారితీసిన ఈ మిత్రుడు, అలంకారాలతో శోభిస్తున్న కమానులగుండా, నడవలగుండా కొన్ని గదుల్లోకి నన్ను నడిపించాడు; ఒక చక్రవర్తి ప్రాసాదంలో ఉండే రీతిగా గొప్ప ఉపకరణాలు అమర్చి ఉన్నాయి ఆ గదులు. మే మొక విశాలమైన హాలులోకి ప్రవేశించాం. దాని మధ్యలో ఒక సింహాసనం ఉంది; దానికి ఉజ్జ్వల వర్ణమేళనంతో దీప్తులు విరజిమ్మే రత్నాలు పొదిగి ఉన్నాయి. అక్కడ, పద్మాసనంలో ఆసీనులై ఉన్నారు, మహామహులు బాబాజీ. నిగనిగ లాడుతున్న నేలమీద, ఆయన పాదాలముందు మోకరిల్లాను.

"లాహిరీ, నువ్వింకా బంగారు భవనం కోసం కన్న కలలకోరికలతోనే ఆనంది స్తున్నావా?' నా గురుదేవుల కళ్ళు, వారి నీలమణుల్లాగే నిగనిగలాడు తున్నాయి. 'మేలుకో! నీ లౌకిక తృష్ణలన్నీ శాశ్వతంగా తీరబోతున్నాయి.' గూఢమైన ఆశీర్వచనాలు అస్పష్టంగా పలికారు. 'నాయనా, లే! క్రియాయోగం ద్వారా దైవరాజ్యంలోకి ప్రవేశించ డానికి దీక్ష తీసుకో.'

బాబాజీ చెయ్యి చాపారు; ఒక హోమాగ్ని కుండం వెలిసింది; దాని చుట్టూ పండ్లూ పూలూ అమిరి ఉన్నాయి. జ్వాజ్వల్యమానమైన ఈ అగ్నివేదికముందు, మోక్షకారకమైన యోగప్రక్రియాదీక్ష స్వీకరించాను.

"బ్రాహ్మ ముహూర్తంలో క్రతువు పూర్తి అయింది. ఆనంద తన్మయావస్థలో నాకు నిద్ర అవసరమనే అనిపించలేదు. అమూల్య నిధులతో, అద్భుత కళాఖండా లతో నిండి ఉన్న మహాసౌధంలోని గదులన్నిటిలోనూ తిరిగి, తరవాత ఉద్యాన వనాల్ని సందర్శించాను. దగ్గరిలో, నిన్నటి రోజున నేను చూసిన గుహల్నీ రాతిగొట్టు కొండ అంచుల్నీ గమనించాను. కాని అప్పుడివి, ఒక మహాసౌధాన్నీ పూలతోటల్నీ ఆనుకుని లేవు.

"చల్లటి హిమాలయ సూర్యరశ్మిలో అద్భుతంగా మెరిసిపోతున్న ప్రాసాదంలో మళ్ళీ అడుగుపెట్టి, నా గురుదేవుల సన్నిధికి చేరాను. ఆయన ఇంకా సింహాసనం మీద ఉపవిష్టులై, ప్రశాంత శిష్యగణంచేత పరివేష్టితులై ఉన్నారు.

" 'లాహిరీ, నీకు ఆకలి వేస్తోంది,' అంటూ బాబాజీ, 'కళ్ళు మూసుకో,' అన్నారు.

" నేను మళ్ళీ కళ్ళు తెరిచేసరికి, మనోహరమైన మహాసౌధమూ దాని ఉద్యాన వనాలూ అదృశ్యమయిపోయాయి. నా శరీరమూ బాబాజీ రూపమూ వారి శిష్యుల

రూపాలూ, అదృశ్యమైన మహాసౌధం స్థానంలో, ఎండపడుతున్న రాతిగుహల ద్వారాలకు దగ్గరిలోనే కటిక నేల మీద ఉన్నాయి. బంగారు భవనం మాయమయి పోతుందనీ దాంట్లో బందీలై ఉన్న పరమాణువులు విడుదలయి, తా ముద్భవించ డానికి మూలకందమైన ఆలోచనాసారరూపంలో లయమవుతాయని, నన్నిక్కడికి తీసుకువచ్చినాయన చెప్పిన సంగతి గుర్తు చేసుకున్నాను. నేను ఆశ్చర్యంతో స్తంభించినా, నా గురుదేవుల వంక సంపూర్ణ విశ్వాసంతో చూశాను. అలౌకిక అద్భుత ఘటనలు జరుగుతున్న ఈ రోజు ఇంకా ఏం ఆశించాలో నాకు తెలియలేదు.

" 'భవనాన్ని సృష్టించడానికి ఆశించిన ప్రయోజనం ఇప్పుడు నెరవేరింది,' అన్నారు బాబాజీ. నేలమీంచి ఒక మట్టిపాత్ర ఎత్తారు. 'అక్కడ చెయ్యి పెట్టి, నువ్వు కోరిన భోజనపదార్థం ఏదైనా సరే తీసుకో.'

"ఖాళీగా, వెడల్పుగా ఉన్న మట్టిపాత్రను ముట్టుకున్నాను; వెన్నపూసిన వేడివేడి లూచీలు [పూరీల మాదిరి రొట్టెలు], కూర, మిఠాయిలు కనిపించాయి. నే నవి తింటూంటే, ఎప్పటికప్పుడు ఆ పాత్ర నిండి ఉండడం గమనించాను. భోజనం అయిన తరవాత మంచినీళ్ళ కోసం చుట్టూ కలయజూశాను. మా గురుదేవులు, నా ఎదుట ఉన్న పాత్ర వేపే చూపించారు. అందులో ఉన్న భోజన పదార్థం అదృశ్య మయింది; దాని బదులు నీళ్ళున్నాయి.

" 'దైవ సామ్రాజ్యంలో ఐహికావసరాల్ని తీర్చే రాజ్యం కూడా కలిసే ఉంటుందని కొద్దిమంది మర్త్యమానవులే ఎరుగుదురు,' అన్నారు బాబాజీ. 'దైవ సామ్రాజ్యం భూమికి కూడా వ్యాపించి ఉంటుంది; కాని భూసామ్రాజ్యం స్వభావ రీత్యా భ్రాంతి మూలకమయినందువల్ల, దాంట్లో సత్యసారం ఉండదు.'

" 'ప్రియగురుదేవా, కిందటి రాత్రి మీరు, స్వర్గంలోనూ భూమి మీదా ఉన్న అందాలకు గల సంబంధాన్ని కళ్ళకు కట్టించారు!' మాయమయిన మహాసౌధాన్ని గురించిన జ్ఞాపకాలతో చిరునవ్వు నవ్వాను; నిజంగా, మామూలు యోగి ఎవరూ అతిమనోహర విలాస వైభవోపేతమైన పరిసరాల నడుమ పరమాత్మ మహత్తర మర్మాల అనుభవలబ్ధి కోసం దీక్షాస్వీకారం పొందలేదన్నది నిశ్చయం! దానికీ ఇప్పటి దృశ్యానికీ గల పూర్తి భేదాన్ని ప్రశాంతంగా తిలకించాను. ఆచ్ఛాదనలేని కటికనేల, ఆకాశపు పై కప్పు, ఆదిమకాలపు ఆశ్రయమిచ్చే గుహలు - ఇవి నా చుట్టూ ఉన్న దేవదూతల వంటి సాధువులకు రమ్యమయిన సహజ సన్నివేశాన్ని సమకూర్చాయనిపించింది.

"ఆనాటి మధ్యాహ్నం, గతజన్మ సాక్షాత్కారాల జ్ఞాపకాలతో పావనమయిన నా గొంగడి మీద కూర్చున్నాను. నా గురుదేవులు దగ్గరికి వచ్చి నా తలమీద

నిమిరారు. నేను నిర్వికల్ప సమాధిలోకి వెళ్ళి, అందులో అవిచ్ఛిన్నంగా ఏడు రోజుల పాటు ఉండిపోయాను. ఆత్మజ్ఞాన స్తరాల్లో ఒకదాని తరవాత ఒకటి దాటుతూ, సత్యస్వరూపుడి అమరసీమల్లోకి చొచ్చుకుంటూ పోయాను. మాయావరణాలన్నీ తొలగిపోయాయి; నా ఆత్మ, విశ్వాత్ముడి వేదికమీద సంపూర్ణంగా స్థిరపడింది.

"ఎనిమిదోనాడు నేను నా గురుదేవుల పాదాలమీద పడి, నన్ను ఎప్పటికీ తమకు దగ్గరగానే, తమ పవిత్ర వనభూమిలోనే ఉండనిమ్మని వేడుకున్నాను.

" 'నాయనా, ఈ జన్మలో నీ పాత్ర జనబాహుళ్యం కళ్ళ ఎదుట నిర్వహించాలి. ఈ జన్మకు పూర్వం అనేక జన్మలు నువ్వు ఏకాంత ధ్యాన సాధన భాగ్యం పొందావు; ఇప్పుడు మానవ ప్రపంచంలో కలిసి మసలాలి,' అన్నారు బాబాజీ నన్ను ఆలింగనం చేసుకుంటూ.

" 'నువ్వు వివాహితుడివయి, సామాన్య కుటుంబంతో, ఉద్యోగ బాధ్యతలతో ఉండేదాకా ఈసారి నువ్వు నన్ను కలుసుకోకపోవడంలో గంభీరమైన ప్రయోజనం ఒకటి మరుగుపడి ఉంది. హిమాలయాల్లో మా రహస్య బృందంలో చేరాలన్న ఆలోచనలు నువ్వు పక్కకి పెట్టాలి. నీ జీవితం, ఆదర్శ గృహస్థయోగికి నిదర్శనంగా సేవచేస్తూ నగర జన సమూహాల మధ్య గడవాలి.

" 'దిగ్భ్రమ చెందిన అనేకమంది లౌకిక స్త్రీ పురుషుల ఆక్రందనలు మహామహుల చెవుల్లో పడకుండా పోలేదు' అంటూ ఇలా చెప్పారాయన : 'మనః పూర్వకంగా అపేక్షించే అసంఖ్యాకులకు క్రియాయోగం ద్వారా ఆధ్యాత్మిక ఉపశమనం కలిగించడానికి నువ్వు ఎంపిక అయావు. సంసార బంధాలతో, భారమైన లౌకిక విధులతో చిక్కులుపడుతున్న లక్షలాది జనం, తమలాగే సంసారివైన నీ మంచి కొత్త ఆశ పొందుతారు. అత్యున్నతమైన యోగ ఉప లబ్ధులు సంసారికి అందరానివి కావని వాళ్ళు గ్రహించడానికి నువ్వు దారి చూపించాలి. ప్రపంచంలో కూడా, వ్యక్తిగత ప్రయోజనోద్దేశం కాని అనుబంధం కాని లేకుండా తన బాధ్యతల్ని నిష్ఠగా నిర్వహించే యోగి, నిశ్చయమైన ఆత్మజ్ఞానమార్గంలో పయనిస్తాడు.

" 'ప్రపంచాన్ని విడవాలని నిన్ను నిర్బంధించే అవసరం ఏదీ లేదు; ఎందుచేతంటే లోపల్లోపల నువ్వు, దానికి సంబంధించిన ప్రతి ఒక్క బంధాన్నీ పూర్వమే తెంపేశావు. నీ కుటుంబానికి, ఉద్యోగానికి, పౌర జీవనానికి, ఆధ్యాత్మిక జీవనానికి సంబంధించిన విధుల్ని నువ్వు అంతఃకరణ శుద్ధితో నిర్వర్తించడానికి ఇంకా చాలా సంవత్సరాలు మిగిలి ఉన్నాయి. దైవపరమయిన ఆశ అనే మధురమయిన కొత్త ఊపిరి సంసారుల శుష్క హృదయాల్లోకి చొరబడుతుంది. నీ సంతులిత జీవనం మంచి వాళ్ళు మోక్షమన్నది అంతస్సన్యాసం మీదే కాని బాహ్యసన్యాసం మీద ఆధారపడ్డది కాదని

అర్థం చేసుకుంటారు.'

"ఉన్నతమైన ఆ హిమాలయ ఏకాంత ప్రదేశాల్లో మా గురుదేవుల వాక్కులు వింటూ ఉంటే నా కుటుంబమూ, ఆఫీసూ, ప్రపంచమూ ఎంత దూరమో అని పించింది. అయినా ఆయన వాక్కుల్లో కఠోర సత్యం ధ్వనించింది; పావనమైన ఈ శాంతి ధామాన్ని విడిచి వెళ్ళడానికి అణకువగా అంగీకరించాను. యోగవిద్యను గురువునుంచి శిష్యుడికి ప్రసారణ చేసేటప్పుడు పాటించవలసిన సనాతన కఠిన నియమాల్ని బాబాజీ నాకు బోధించారు.

" 'యోగ్యులైన శిష్యులకు మాత్రమే క్రియాకీలకం ప్రసాదించు,' అన్నారు బాబాజీ. 'దైవాన్వేషణలో అన్నిటినీ త్యజించడానికి ప్రతిజ్ఞ పూనినవాడే, ధ్యాన యోగం ద్వారా పరమ రహస్యాల చిక్కుముళ్ళు విడదియ్యడానికి అర్హుడు.'

" 'గురుదేవా, మరుగుపడిన క్రియాప్రక్రియని పునరుద్ధరించి మీరు, మానవ జాతికి మహోపకారం చేసినట్టే, శిష్యరికానికి కావలసిన కఠిన నియమాల్ని సడలించి, ఆ లాభాన్ని పెంచరూ?' అని విన్నవించుకుంటూ బాబాజీ కేసి చూశాను 'చిత్తశుద్ధి గల అన్వేషకులందరూ మొదట్లోనే సంపూర్ణ అంతస్సన్యాసానికి ప్రతిజ్ఞ పూనలేక పోయినప్పటికీ, వారందరికీ కూడా క్రియాయోగం అందించడానికి నన్ను అను మతించవలసిందిగా ప్రార్థిస్తున్నాను. ప్రపంచంలో, మూడు విధాలైన క్లేశాలకీ* గురి అయ్యే పీడిత స్త్రీ పురుషులకు ప్రత్యేకమైన ప్రోత్సాహం అవసరం. వాళ్ళకి క్రియాయోగ దీక్ష అందకుండా చేసినట్లయితే వాళ్ళెన్నటికీ ముక్తిమార్గమే తొక్కక పోవచ్చు.'

" 'అలాగే కానియ్యి. ఈశ్వరేచ్ఛ నీ ద్వారా వ్యక్తమయింది. వినయంగా నిన్ను సహాయమడిగే వాళ్ళందరికీ క్రియాయోగ దీక్ష ఇయ్యి.' అని జవాబిచ్చారు దయా మయులైన గురుదేవులు.†

"కొద్దిసేపు మౌనం దాల్చిన అనంతరం, బాబాజీ ఇంకా చెప్పారు. స్వల్పమప్యస్య

* శారీరక, మానసిక, ఆధ్యాత్మిక క్లేశాలు ; ఈ మూడూ వరసగా, జబ్బు, మానసిక లోపాలు లేదా వైకల్యాలు, ఆత్మ విషయకమైన అవిద్య అన్న రూపాల్లో వ్యక్తమవుతుంటాయి

† మొదట్లో మహావతార బాబాజీ, ఇతరులకు క్రియాయోగ దీక్ష ఇవ్వడానికి లాహిరీ మహాశయుల కొక్కరికే అనుమతి ఇచ్చారు. తరవాత, యోగావతారమూర్తులైన లాహిరీ మహాశయులు, క్రియాయోగం ఉపదేశించడానికి తమ శిష్యుల్లో కొందరికి కూడా అధికారం

ధర్మస్య త్రాయతే మహతో భయాత్' అని భగవద్గీతలో* ఇచ్చిన గొప్పహామీని నీ శిష్యుల్లో ప్రతి ఒక్కరికీ వినిపించు.' ["ఈ ధర్మం (ఈ ధార్మిక ప్రక్రియ) ఏ కొద్దిపాటి అయినా ఆచరణలో పెడితే, అది నిన్ను పెద్ద భయం నుంచి (మహతో భయాత్) కాపాడుతుంది" - అంటే, జననమరణ చక్ర పరిభ్రమణలో సహజంగా ఉండే మహాక్లేశాల నుంచి కాపాడుతుంది].

"మర్నాడు ఉదయం నేను వీడుకోలు దీవెన కోసం గురుదేవుల పాదాల దగ్గర మోకరిల్లినప్పుడు, ఆయన్ని విడిచి వెళ్ళాలంటే నాలో ఎంత గాఢమైన అయిష్టత ఉందో ఆయన పసిగట్టారు.

---

ఇమ్మని కోరారు. బాబాజీ అంగీకరించారు; అంతే కాకుండా భవిష్యత్తులో క్రియాయోగ దీక్షా ప్రదానం క్రియాయోగ పథంలో ప్రగతి సాధించి, లాహిరీ మహాశయులనుంచి కాని ఆ యోగావతారుల అధికృత శిష్యులు ఏర్పరిచిన మార్గాలనుంచి కాని అధికారం పొందినవాళ్ళకి మాత్రమే పరిమితమై ఉండాలని ఆదేశించారు. యథావిధిగా అధికారం పొందిన క్రియాయోగ ఉపదేశకుల దగ్గర దీక్ష తీసుకున్న, భక్తివిశ్వాసాలు గల క్రియాయోగులందరి ఆధ్యాత్మిక సంక్షేమానికి జన్మజన్మాంతర బాధ్యత తాము స్వీకరిస్తామని బాబాజీ కనికరంతో అన్నారు యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా / సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ ద్వారా క్రియాయోగ దీక్ష తీసుకునేవాళ్ళు, క్రియాయోగ ప్రక్రియను తాము ఇతరులెవరికీ వెల్లడి చెయ్యం అని ఒక ప్రమాణపత్రం మీద తప్పనిసరిగా సంతకం చెయ్యవలసి ఉంటుంది. ఈ విధంగా, సులభమూ సునిశితమూ అయిన క్రియాయోగ ప్రక్రియ అధికారం పొందని ఉపదేశకుల మూలంగా మార్పులకూ వికారాలకూ లోనుకాకుండా పరిరక్షితమై మౌలిక, అవికార రూపంలో నిలిచి ఉంటుంది.

సామాన్య ప్రజలు క్రియాయోగంవల్ల లాభం పొందడానికని బాబాజీ, పురాతనమైన వానప్రస్థ సన్యాసాశ్రమ సంబంధమైన నిర్బంధాలు తొలగించినప్పటికీ దీక్ష కోరే వారికి ఎవరికయినా సరే క్రియాయోగ సాధనకు తయారుగా ప్రాథమిక ఆధ్యాత్మిక శిక్షణ కాలం ఒకటి లాహిరీ మహాశయులూ వారి ఆధ్యాత్మిక పరంపర (వై.ఎస్.ఎస్. - ఎస్ ఆర్.ఎఫ్. గురు పరంపర)లోని శిష్యులందరూ విధించాలని ఆయన ఆదేశించారు. క్రియాయోగం వంటి అత్యున్నత యోగ ప్రక్రియాసాధన అస్థిరమైన ఆధ్యాత్మిక జీవితానికి సరిపడేది కాదు. క్రియాయోగం ధ్యానప్రక్రియను మించినది, అదొక జీవిత మార్గం; అంచేత, దీక్ష పొందేవాడు కొన్ని కొన్ని ఆధ్యాత్మిక విధుల్ని నిషేధాల్ని మన్నించడం అవసరమవుతుంది. మహావతార బాబాజీ, లాహిరీ మహాశయ, స్వామి శ్రీయుక్తేశ్వర్, పరమహంస యోగానందగార్ల ద్వారా పారంపర్యంగా వచ్చిన ఈ బోధలను యోగదా సత్సంగ సొసైటీ, సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ విస్తృగా పాటిస్తున్నాయి. వై.ఎస్.ఎస్. - ఎస్. ఆర్. ఎఫ్. వారి పాఠాల ద్వారాను, వై.ఎస్.ఎస్. - ఎస్ ఆర్.ఎఫ్. వారి అధికారం పొందిన ప్రతినిధుల ద్వారాను క్రియాయోగానికి ఉపక్రమణగా నేర్పే హంసః (హాంగ్సా), ఓం ప్రక్రియలు, క్రియాయోగ పథంలో అంతర్భాగాలే. ఈ ప్రక్రియలు, ఆత్మసాక్షాత్కారం పొందడానికి చైతన్యాన్ని జాగృతం చేయడంలోనూ ఆత్మను దాస్యం నుంచి విముక్తం చేయడం లోనూ సమర్థమైనవి.

* అధ్యాయం II:40.

" 'మనకి ఎడబాటు లేదు నాయనా,' అంటూ ఆప్యాయంగా నా భుజం నిమిరారు. 'నువ్వు ఎక్కడున్నా, నన్నెప్పుడు పిలిచినా, తక్షణం నీ దగ్గర ఉంటాను అన్నారు.

"ఆయన చేసిన అద్భుతమైన ఈ వాగ్దానంవల్ల ఊరట చెంది కొత్తగా పొందిన దివ్యజ్ఞాన స్వర్ణంతో సంపన్నుణ్ణి అయి కొండ దిగుదల దారి పట్టాను. ఆఫీసులో నా తోటి ఉద్యోగులు నాకు మనసారా స్వాగతం పలికారు; పది రోజులుగా వాళ్ళు ఆ హిమాలయారణ్యాల్లో నేను దారి తప్పిపోయాననే భావించారు. త్వరలో మా ప్రధాన కార్యాలయం నుంచి ఉత్తరం వచ్చింది.

" 'లాహిరీ దానాపూర్ * ఆఫీసుకు తిరిగి రావాలి,' అని ఉంది. 'రాణీఖేత్ కు అతని బదిలీ పొరపాటున జరిగింది. రాణీఖేత్ విధులు చేపట్టడానికి మరో వ్యక్తిని పంపి ఉండవలసింది.'

"భారతదేశంలో ఈ బహుదూర స్థలానికి నన్ను రప్పించడానికి దారి తీసిన సంఘటనల, పరస్పర వ్యతిరేక దిశాభిముఖమైన గుప్త ప్రవాహాల్ని తలుచుకుంటూ చిరునవ్వు నవ్వుకున్నాను.

"దానాపూర్‌కు తిరిగి వచ్చే ముందు మురాదాబాద్‌లో ఉన్న ఒక బెంగాలీ కుటుంబంతో కొన్నాళ్ళు గడిపాను. అక్కడ నన్ను కలుసుకోడానికి ఆరుగురు వచ్చారు. ఆధ్యాత్మిక విషయాల మీదికి నేను సంభాషణ మళ్ళించేసరికి, నాకు ఆతిథ్యమిచ్చినాయన నిరాశగా ఇలా అన్నారు :

" 'ప్చ్, ఈ రోజుల్లో ఇండియాలో సాధువులే కరువయ్యారు!'

"దానికి నేను, 'బాబూ, ఈ గడ్డమీద ఇప్పటికీ ఉన్నారు మహామహులు!' అంటూ ఆక్షేపణ తెలిపాను.

"ఉత్సాహం పెల్లుబకడం వల్ల, హిమాలయాల్లో నా అలౌకిక అద్భుత అనుభవాల్ని వాళ్ళకి చెప్పాలన్న ఊపు వచ్చింది నాకు. ఆ మిత్రబృందం మర్యాదగానే అపనమ్మకం తెలియబరిచింది.

"వాళ్ళలో ఒకరు ఊరడింపుగా ఇలా అన్నారు : 'లాహిరీగారూ, పలచబడ్డ ఆ కొండగాలుల్లో మీ మనస్సు ప్రయాసకు గురి అయింది. మీరిప్పుడు చెప్పింది, ఏదో పగటి కల!'

"సత్యనిష్ఠమైన ఉత్సాహంతో ఊగిపోయి, ఉచితమైన ఆలోచన కొరవడి మాట్లాడాను. 'నేను కనక పిలిచినట్లయితే, నా గురుదేవులు ఇక్కడ, ఈ ఇంట్లోనే దర్శనమిస్తారు.'

* కాశీ దగ్గరున్న ఒక ఊరు.

'ప్రతి ఒక్కరి కళ్ళలోనూ ఆసక్తి మిలమిల్లాడింది; అటువంటి అద్భుతం చూడాలన్న ఉత్సుకత వాళ్ళలో కలగడంలో విడ్డూరం లేదు. కొంతమట్టుకు అయిష్టంగానే నేను, ప్రశాంతమైన ఒక గది, రెండు కొత్త ఉన్ని గొంగళ్లు కావాలని అడిగాను.

" గురుదేవులు ఆకాశం (ఈథర్) లోంచి భౌతికరూపం ధరిస్తారు, అన్నాను. తలుపవతల నిశ్శబ్దంగా ఉండండి; కాస్సేపట్లో పిలుస్తా మిమ్మల్ని.'

"మా గురుదేవుల్ని సవినయంగా ఆవాహనచేస్తూ ధ్యానస్థితిలో మునిగి పోయాను. చీకటి చేసిన గది, ప్రశాంతి కలిగించే పలచని వెలుతురుతో నిండి పోయింది; దాంట్లోంచి తేజోవంతమైన బాబాజీ ఆకృతి క్రమంగా వెలువడింది.

" 'లాహిరీ, ఇంత స్వల్ప విషయం కోసం పిలుస్తావా నన్ను?' గురుదేవుల చూపు కఠినంగా ఉంది. 'సత్యమన్నది హృదయపూర్వకంగా అన్వేషించేవాళ్ళ కోసం; వ్యర్థమైన కుతూహలం గలవాళ్ళకోసం కాదు. ఎవరయినా, చూసినప్పుడు నమ్మడం సులువే; అప్పుడిక కాదనడానికి ఏమీ ఉండదు. అతీంద్రియ సత్యాన్ని అనుభూతం చేసుకోడానికి యోగ్యులూ దాన్ని ఆవిష్కరించేవాళ్ళూ, స్వాభావిక భౌతికవాద పరమైన సంశయశీలతను జయించినవాళ్ళే.' ఆ తరవాత ఆయన గంభీరంగా, 'నన్ను వెళ్ళనియ్యి!' అన్నారు.

"నేను బతిమాలుకుంటూ ఆయన పాదాలమీద పడ్డాను. "పూజ్య గురుదేవా, ఘోరమయిన నా తప్పు తెలుసుకున్నాను; సవినయంగా మీ క్షమాపణ కోరు తున్నాను. నేను మిమ్మల్ని పిలవడానికి సాహసించింది, ఆధ్యాత్మికంగా గుడ్డి వాళ్ళయిన వీళ్ళ మనసుల్లో విశ్వాసం కలిగించడానికి. నా ప్రార్థన మన్నించి, మీరు ఎలాగా ప్రత్యక్షమయారు కనక, దయచేసి నా స్నేహితులకు ఆశీస్సులు ప్రసాదించ కుండా మాత్రం వెళ్ళకండి. వాళ్ళు అవిశ్వాసులే అయినప్పటికీ, చిత్రమైన నా ప్రతిజ్ఞావాక్యంలోని సత్యాన్ని శోధించడానికయినా కనీసం సుముఖంగా ఉన్నారు.'

" 'సరే, కొంచెం సేపు ఉంటాను. స్నేహితులముందు మీ మాట పోవడం నాకు ఇష్టం లేదు,' అన్నారు బాబాజీ. ఆయన ముఖం శాంతపడింది. కాని మృదువుగా ఇలా అన్నారు : 'నాయనా, ఇకనుంచి నేను నీకు అవసరమయినప్పుడే వస్తాను; నువ్వు పిలిచినప్పుడల్లా మాత్రం రాను.'*

---

* ఆత్మసాక్షాత్కార సాధన పథంలో లాహిరీ మహాశయుల వంటి జ్ఞానులైన మహా పురుషులు కూడా ఉత్సాహాతిశయానికి లోబడిపోయి క్రమశిక్షణకు గురి అవుతూ ఉంటారు దివ్యగురువైన కృష్ణుడు, భక్తాగ్రణి అయిన అర్జునుణ్ణి మందలించడం, భగవద్గీతలో చాలా సందర్భాల్లో చదువుతాం.

"నేను తలుపు తెరిచినప్పుడు మిత్రబృందంలో గంభీరమైన నిశ్శబ్దం ఆవరించింది. తమ కళ్ళని తామే నమ్మలేక నా మిత్రులు, గొంగడి ఆసనం మీద ఉన్న తేజోవంతమైన స్వరూపాన్ని తేరిపారి చూశారు.

" 'ఇది సామూహిక సమ్మోహనం!' అంటూ అట్టహాసంగా నవ్వాడొకతను. 'మాకు తెలియకుండా ఈ గదిలోకి ఎవరూ ప్రవేశించడం అసంభవం!'

"బాబాజీ చిరునవ్వు చిందిస్తూ ముందుకు వచ్చి, తమ శరీరంలోని వెచ్చని, గట్టి మాంసాన్ని ముట్టుకొని చూడమని ప్రతి ఒక్కరి దగ్గరికీ వెళ్ళారు. సందేహాలు పటాపంచలయిపోయి మా స్నేహితులు, దిగ్భ్రమతో కూడిన పశ్చాత్తాపంతో నేలమీద పడి సాష్టాంగ ప్రణామం చేశారు.

" 'హల్వా తయారుచేయించండి.' తమ భౌతిక వాస్తవికత విషయమై అక్కడివాళ్ళకి మరింత నమ్మకం కలిగించడం కోసం బాబాజీ ఈ కోరిక కోరారని నాకు తెలుసు. పాయసం ఉడుకుతూ ఉండగా దివ్య గురువులు, చనువుగా మాట్లాడారు. సంశయాళువైన ఈ 'థామస్'లు, భక్తశిఖామణులైన 'సెంట్ పాల్'ల మాదిరిగా మారిపోవడం గొప్పగా జరిగింది. మేము హల్వా తిన్న తరవాత, బాబాజీ ఒక్కొక్కరినే ఆశీర్వదించారు. హఠాత్తుగా ఒక్క మెరుపు మెరిసింది బాబాజీ దేహం తాలూకు ఋణవిద్యుదణు (ఎలక్ట్రానిక్) మూలకాలు తక్షణమే రసాయన విఘటనం చెంది, విస్తరించే బాష్పమయ కాంతిలా మారిపోవడం మేము కళ్ళారా చూశాం. దైవానుసంధానం పొందిన గురుదేవుల సంకల్పశక్తి, ఆయన శరీరంగా సంఘటితమై ఉన్న ఈథర్ పరమాణువుల మీద తనకున్న పట్టు సడలించింది; వెంటనే కోట్లాదిగా ఉన్న చిన్న ప్రాణకణికా విస్ఫులింగాలు (లైఫ్‌ట్రానిక్ స్పార్క్స్) అనంత ప్రాణాశయంలోకి అంతర్హిత మయాయి.

" 'మృత్యుంజయుల్ని నా కళ్ళతో నేను చూశాను.' వాళ్ళలో మైత్ర* అనే

* ఉత్తరోత్తరా, ఆత్మసాక్షాత్కార సాధనలో గొప్ప ప్రగతి సాధించిన కారణంగా మైత్ర మహాశయులుగా పేరు పొందిన వ్యక్తి. నేను హైస్కూలు చదువు పూర్తి చేసుకున్న కొత్తలో మైత్ర మహాశయుల్ని కలుసుకున్నాను; నేను కాశీలో ఆశ్రమవాసిగా ఉన్నప్పుడు ఆయన, మహా మండల ఆశ్రమాన్ని సందర్శించారు. మురాదాబాద్ మిత్రబృందం ముందు బాబాజీ సాక్షాత్కరించడం గురించి అప్పుడు చెప్పారాయన నాకు. "ఈ అలౌకిక అద్భుత ఘటన ఫలితంగా నేను లాహిరీ మహాశయులకు యావజ్జీవ శిష్యుణ్ణి అయాను." అని నాకు చెప్పారు. మైత్ర మహాశయులు

ఆయన పూజ్యభావంతో అన్నాడు. కొత్త జాగృతి కలిగించిన ఆనందంతో ఆయన ముఖబింబమే మారిపోయింది. 'చిన్న పిల్లవాడు నీటి బుడగలతో ఆడుకున్నట్టే పరమ గురుదేవులు దేశకాలాలతో ఆట ఆడుకున్నారు. స్వర్గ, భూలోకాల కీలకాలు చేతనున్న వ్యక్తిని చూశాను.'

"త్వరలోనే దానాపూర్ తిరిగి వచ్చాను. ఆత్మతత్త్వంలో దృఢంగా నిలదొక్కుకుని ఉండి గృహస్థ సంబంధమైన రకరకాల సంసార బాధ్యతలూ, ఉద్యోగ బాధ్యతలూ మళ్ళీ చేబట్టాను," అంటూ ముగించారు లాహిరీ మహాశయులు.

బాబాజీతో జరిగిన మరో సమాగమానికి సంబంధించిన కథ కూడా లాహిరీ మహాశయులు, స్వామి కేవలానందగారికీ శ్రీయుక్తేశ్వర్‌గారికీ చెప్పారు. ఆ సందర్భం, " నేను నీకు అవసరమైనప్పుడల్లా వస్తాను," అన్న వాగ్దానాన్ని పరమ గురుదేవులు నెరవేర్చిన అనేక సందర్భాల్లో ఒకటి.

"అలహాబాదులో కుంభమేళా జరుగుతున్న సన్నివేశమది," అని చెప్పారు లాహిరీ మహాశయులు తమ శిష్యులకు. "ఆఫీసు పనులనుంచి కొంచెం వెసులుబాటు దొరికినప్పుడు అక్కడికి వెళ్ళాను. ఈ పవిత్ర ఉత్సవానికి హాజరవడం కోసం దూరదూర ప్రదేశాలనుంచి వచ్చిన సన్యాసి, సాధుజనాల గుంపుల మధ్య తిరుగుతూ, ఒంటికి బూడిద పూసుకుని చేత్తో భిక్షాపాత్ర పట్టుకుని ఉన్న ఒక తపస్విని చూశాను. ఈ మనిషి మోసగాడిలా ఉన్నాడన్న ఆలోచన నా మనస్సులో పుట్టింది; బాహ్యవైరాగ్య చిహ్నాలు ధరించాడే కాని, దానికిసరిపడే అంతరంగం లేనివాడనిపించింది.

" నేనా తపస్విని దాటి వెళ్ళి వెళ్ళగానే, నా చూపు బాబాజీ మీద పడి ఆశ్చర్యపోయాను. ఆయన, తల అట్టకట్టేసిన ఒక సన్యాసి ముందు మోకరిల్లుతున్నారు.

"గురూజీ!" అంటూ ఆయన పక్కకి వెళ్ళాను. 'మీ రిక్కడ ఏం చేస్తున్నారు?'

" 'నేను ఈ సన్యాసి కాళ్ళు కడుగుతున్నాను; తరవాత ఈయనకు వంట గిన్నెలు తోమిపెడతాను.' బాబాజీ, చిన్న పిల్లవాడిగా నా వేపు చూసి చిరునవ్వు నవ్వారు; మనుషులు అధికులయినా అధములయినా, వాళ్ళ దేహాలయాలన్నిటిలోనూ సమానంగానే ఈశ్వరుడు నివసిస్తున్నట్టు చూడాలి కాని ఎవ్వరినీ నేను విమర్శించగూడదని తాము కోరుతున్నట్టు నాకు తెలియజేస్తున్నారని గ్రహించాను.

"మహాగురువులు ఇంకా ఇలా చెప్పారు, 'సాధువుల్లో జ్ఞానుల్నీ అజ్ఞానుల్నీ కూడా సేవించడం వల్ల నేను, అన్నిటికంటె ఎక్కువగా దేవుడికి సంతోషం కలిగించే - వినయ*మనే సర్వోత్తమ గుణాన్ని అలవరచుకుంటున్నాను.' "

* "స్వర్గంలోనూ భూలోకంలోనూ ఉన్నవాటిని చూడ్డానికి [ఆయన] తనను తాను తక్కువ చేసుకుంటాడు" - సామ్స్ 113.6 "తనను తాను గొప్పగా తలుచుకునేవాడల్లా నీచపడక తప్పదు : తనను తాను తక్కువ చేసుకునే వాడు గొప్పవాడు కాకమానడు."

మత్తయి 23 12 (బైబిలు)

అహంకారాన్ని ; లేదా మిథ్యామమత్వాన్ని తగ్గించడమంటే తన అనంత సత్తను ఆవిష్కరించుకోడమన్నమాట.

అధ్యాయం : 35

# లాహిరీ మహాశయుల పావన జీవనం

"ఈ ప్రకారం సర్వధర్మాన్నీ పాటించడం మనకు ఉచితం."* బాప్టిస్ట్ యోహాను (జాన్)తో అన్న ఈ మాటల్లోనూ, తనకు బాప్టిజం ఇమ్మని యోహాన్ని కోరడం లోనూ ఏసు, తన గురువుకు గల దివ్యాధికారాల్ని అంగీకరిస్తున్నాడు.

ప్రాచ్యదేశీయుడి దృక్పథం†తో పూజ్యభావంతో బైబిలు అధ్యయనం చేసిన మీదటా సహజావబోధంతో గ్రహించిన మీదటా, బాప్టిస్ట్ యోహాను పూర్వ జన్మల్లో క్రీస్తుకు గురువని నాకు నమ్మకం కుదిరింది. పూర్వ జన్మల్లో యోహాను ఎలిజా (Elijah) గానూ అతని శిష్యుడయిన ఏసును ఎలిషా (Elisha) గానూ బైబిలులో అనేక భాగాలు సూచిస్తాయి. (బైబిలు పాత నిబంధన గ్రంథంలో ఉన్న వర్ణక్రమ మిది. గ్రీకు అనువాదకులు ఈ పేర్లలో ఎలిజాను Elias అని, ఎలిషాను Eliseus అని రాశారు. ఇలా మార్చిన రూపాలే కొత్త నిబంధన గ్రంథంలో మళ్ళీ కనిపిస్తాయి).

పాత నిబంధన గ్రంథంలోని చివరి అంశం, ఎలిజా ఎలిషాల పునర్జన్మ గురించి ముందుగా భవిష్యత్‌సూచన చెయ్యడం : "చూడండి, ప్రభువు తాలూకు మహత్తర, భయంకర దినం రావడానికి ముందు, ఎలిజా ప్రవక్తను మీ కోసం పంపిస్తాను."‡

ఈ ప్రకారంగా "ప్రభువు... రావడానికి ముందు" పంపగా వచ్చిన యోహాను (ఎలిజా), క్రీస్తు రాకను చాటడానికి ఉపకరించే విధంగా, ఆయనకన్న కొద్దిగా

* మత్తయి 3.15 (బైబిలు)

† బైబిలు పాత నిబంధన గ్రంథమూ కొత్త నిబంధన గ్రంథమూ రాసినవాళ్ళు పునర్జన్మ సిద్ధాంతాన్ని అర్థంచేసుకున్నట్టూ దాన్ని అంగీకరించినట్టూ బైబిలు భాగాలు అనేకం వెల్లడిస్తాయి.

‡ మలాకి 4.5 (బైబిలు)

ముందుగా పుట్టాడు. యోహాను తండ్రి అయిన జకర్యాకు ఒక దేవదూత ప్రత్యక్షమైనది. అతనికి పుట్టబోయే కొడుకు యోహాను ఎలిజా (ఏలీయా) తప్ప మరొకరు కారని ధ్రువపరచడానికి.

"కాని దేవదూత అతనికి ఇలా చెప్పాడు; భయపడకు, జకర్యా. ఏమంటే నీ ప్రార్థన వినబడింది; నీ భార్య ఎలీసబెత్తు నీ కో కొడుకును కంటుంది; అతనికి నువ్వు యోహాను అని పేరు పెడతావు ....ఇశ్రాయేలీయుల సంతానంలో అనేక మందిని అతను, వాళ్ళ దేవుడివేపు తిప్పుతాడు. తండ్రుల హృదయాల్ని పిల్లలవేపు, అవిధేయుల్ని న్యాయపరుల జ్ఞానమార్గంవేపు తిప్పడానికీ ప్రభువు* ఆగమనంకోసం ఆయత్తమై ఉన్న ప్రజల్ని సిద్ధం చెయ్యడానికీ. 'ఏలీయా ఆత్మ తోనూ శక్తితోనూ' ఆయన రాకకు ముందే వస్తాడు.†

యోహానును ఏసు, ఎలిజా (ఏలీయా)గా రెండుసార్లు నిర్ద్వంద్వంగా గుర్తుపట్టాడు. "ఏలీయా ఇది వరకే వచ్చాడు; వాళ్ళది ఎరగరు... ఆయన బాప్తిస మిచ్చే యోహానును గురించి తమకు చెప్పాడని అప్పుడు శిష్యులు గ్రహించారు."‡ మళ్ళీ అంటాడు క్రీస్తు: "యోహాను కాలం వరకు ప్రవక్తలు ప్రవచించారు; ధర్మశాస్త్రం కూడా ప్రవచించింది. మీరు గ్రహించినట్లయితే, రావలసి ఉన్న ఏలీయా ఇతడే.' §

తాను ఏలీయా (ఎలిజా)** నన్న విషయం యోహాను ఒప్పుకోక పోవడంలో యోహానే వినయ వేషంలో ఉన్న తాను, మహాగురువైన ఎలిజా బాహ్యోత్కర్షతో వచ్చినవాణ్ణి కానని చెప్పడం అతని ఉద్దేశం. పూర్వజన్మలో తాను, తన మహిమ అనే "ఉత్తరీయాన్నీ" ఆధ్యాత్మిక సంపత్తినీ శిష్యుడైన ఎలిషాకు ఇచ్చేశాడు. "ఎలిషా అన్నాడు, - మిమ్మల్ని వేడుకుంటాను, మీ ఆత్మశక్తికి రెట్టింపు భాగం నాకు ప్రాప్తించేలా అనుగ్రహించండి అన్నాడు. దానికి అతను చెప్పాడు, నువ్వు కష్టమయింది అడుగుతున్నావు; అయినా, నీ నుంచి నన్ను తీసుకుపోతూండగా నువ్వు చూసేటట్లయితే నీ కోరిక నెరవేరుతుంది.... ఎలిజా మీది నుంచి పడ్డ ఉత్తరీయాన్ని అతను తీసుకున్నాడు."††

---

* లూకా 1 13-17 (బైబిలు)

† "ఆయన రాకకు ముందే," అంటే, "ప్రభువు రాకకు ముందే."

‡ మత్తయి 17 12-13 (బైబిలు)

§ మత్తయి 11·13-14 (బైబిలు)

** యోహాను 1·21 (బైబిలు)

†† II రాజులు 2.9-14 (బైబిలు)

ఆయన నిర్వహించే పాత్ర ఇప్పుడు తారుమారయింది; కారణమేమిటంటే, దైవపరంగా పరిపూర్ణత సిద్ధించిన ఎలిషా-ఏసుకు, ఎలిజా-యోహాను ప్రత్యక్ష గురువుగా ఉండవలసిన అవసరం ఇక మీదట లేదు. కొండమీద క్రీస్తు రూపాంతరం చెందినప్పుడు,* మోషే (మోసెస్)లో ఆయన చూసినది, తన గురువు ఏలీయాను. శిలువ మీద తన అంత్య సమయంలో ఏసు ఇలా అరిచాడు : 'ఏలీ, ఏలీ లామా సబక్తానీ?' "అంటే, నా దేవా, నా దేవా, నన్నెందుకు వదిలేశావు?" అని అర్థం. అక్కడ నిలబడి ఉన్నవాళ్ళలో కొందరు, అది విన్నప్పుడు, ఈయన ఏలీయాను పిలుస్తున్నాడు.. ఈయన్ని కాపాడ్డానికి ఏలీయా వస్తాడేమో చూద్దాం అన్నారు."†

కాలావధిలేని గురుశిష్య సంబంధం, యోహానుకూ ఏసుకూ ఉన్నట్టుగానే బాబాజీకీ లాహిరీ మహాశయులకూ కూడా ఉంది. మృత్యుంజయులైన ఆ పరమ గురుదేవులు, తమ శిష్యుడి జన్మలు రెంటికీ మధ్య వడివడిగా సుళ్ళు తిరిగిన లోతయిన అఖాత జలాల్ని ఈదుకుంటూ దాటి, పిల్లవాడిగానూ పెద్ద వాడిగానూ లాహిరీ మహాశయులు గడిపే జీవితక్రమానికి దారి చూపించారు. ఎన్నడూ విడిపోని బంధాన్ని బహిరంగంగా మళ్ళీ కూర్చడానికి, తమ శిష్యుడికి ముప్ఫైమూడో ఏడు వస్తేనేకాని సరైన కాలం రాలేదని బాబాజీ భావించారు.

రాణీఖేత్ సమీపంలో కొన్నాళ్ళు కలిసి ఉన్న తరవాత, స్వార్థరహితులైన గురుదేవులు, తమ ప్రియశిష్యుణ్ణి తమ దగ్గరే ఉంచేసుకోకుండా, బాహ్యమైన లోకకళ్యాణ సాధనకోసం లాహిరీ మహాశయుల్ని విడుదల చేశారు. "నాయనా, నేను నీకు అవసరమయినప్పుడల్లా వస్తాను." అటువంటి వాగ్దానంలోని అనంతమైన అంతరార్థాల్ని మర్త్యుడైన ఏ ప్రేమికుడు నెరవేర్చగలడు?

సమాజ సామాన్యానికి తెలియకుండానే, కాశీలో ఒక మారుమూల, 1861లో, మహత్తరమైన ఒకానొక ఆధ్యాత్మిక పునరుజ్జీవనం ఆరంభమయింది. పూలవాసనని ఎవ్వరూ అణిచిపెట్టలేరు; అలాగే, ఆదర్శ గృహస్థుగా ప్రశాంతంగా జీవిస్తున్న లాహిరీ మహాశయులు, సహజ సిద్ధమైన తమ మహిమను దాచి ఉంచలేక పోయారు. భక్త భ్రమరాలు, ఈ విముక్త సిద్ధపురుషుల దివ్యామృతాన్ని వెతుక్కుంటూ, భారతదేశంలో ప్రతిభాగం నుంచీ రావడం మొదలు పెట్టాయి.

లాహిరీ మహాశయుల్ని "ఎక్స్టాటిక్ బాబూ" (ఆనందమగ్నుడు) అని ఆప్యాయంగా పిలుస్తూ ఉండే ఇంగ్లీషు ఆఫీసు సూపరింటెండెంటు, ఈ ఉద్యోగిలో చిత్రమైన ఒక ఉత్కృష్ట పరివర్తనను తొందరగా గమనించినవారిలో ఒకడు.

---

* మత్తయి 17.3 (బైబిలు)

† మత్తయి 27.46-49 (బైబిలు)

"అయ్యా, మీరు దిగులుగా కనిపిస్తున్నారు. ఏమిటి ఇబ్బంది?" లాహిరీ మహాశయులు ఒకనాడు పొద్దున తమ యజమానిని సానుభూతిగా పలకరిస్తూ అడిగిన ప్రశ్న ఇది.

"ఇంగ్లండులో మా ఆవిడ ప్రమాదకరమైన జబ్బులో ఉంది. నేను ఆందోళనతో కుమిలిపోతున్నాను."

"ఆవిడ గురించి నేను మీకు కొంత సమాచారం తెస్తాను," అని లాహిరీ మహాశయులు, ఆయన గదిలోంచి వచ్చేశారు; ఒక ఏకాంత ప్రదేశంలో కొంతసేపు కూర్చున్నారు. తిరిగి వస్తూ, ఊరడింపుగా చిరునవ్వు నవ్వారు.

"మీ ఆవిడ మెరుగవుతున్నారు; ఇప్పుడు మీ కో ఉత్తరం రాస్తున్నారు." సర్వజ్ఞులైన ఆ యోగిపుంగవులు, ఉత్తరంలో కొన్ని భాగాలు ఉదాహరించారు.

'ఎక్స్టాటిక్ బాబూ, మీరు సామాన్య వ్యక్తి కాదని నాకు ముందేతెలుసు. అయినా మీరు, సంకల్పమాత్రంచేత దేశకాలాల్ని బహిష్కరించగల రన్నదే నమ్మలేకుండా ఉన్నాను."

చివరికి, అనుకున్న ఉత్తరం వచ్చింది. అందులో, తమ భార్య కోలుకోడాన్ని గురించిన శుభవార్త ఉండడమే కాదు, కొన్ని వారాల ముందు ఆ మహాయోగి పలికిన మాటలు కూడా అందులో అచ్చామచ్చా అలాగే ఉన్నాయి.

కొన్ని నెలల తరవాత, ఆయన భార్య భారతదేశానికి వచ్చింది. లాహిరీ మహాశయుల్ని కలుసుకుని పూజ్య భావంతో ఆయన్ని తదేకంగా చూసింది.

"కొన్ని నెల్లకిందట నేను, లండన్లో నా రోగశయ్య పక్కన చూసింది, దివ్య కాంతితో పరివేష్టితమై ఉన్న మీ రూపాన్నే. తక్షణమే నాకు జబ్బు పూర్తిగా నయమయింది! తరవాత కొద్ది కాలానికే, ఇండియాకు దీర్ఘమైన సముద్ర ప్రయాణం చెయ్యగలిగాను," అంది ఆమె.

ఆ మహాగురువులు, రోజు రోజుకూ ఒకరిద్దరికి క్రియాయోగ దీక్ష ఇస్తూ వచ్చారు. ఈ ఆధ్యాత్మిక విధులకూ ఉద్యోగ, కుటుంబ సంబంధమైన బాధ్యతలకూ తోడుగా ఈ మహాగురువులు, విద్యావిషయంలో ఉత్సాహభరితమైన ఆసక్తి కనబరిచారు. అనేక అధ్యయన బృందాలు ఏర్పరిచారు; కాశీలో బెంగాలీ టోలా బస్తీలో ఉన్న పెద్ద ఉన్నత పాఠశాలను అభివృద్ధిచెయ్యడానికి క్రియాశీలకమైన కృషి చేశారు. వారం వారం జరిగే సమావేశాల్లో ఈ గురుదేవులు, అనేకమంది జిజ్ఞాసువులైన సత్యాన్వేషకుల కోసం, పవిత్ర గ్రంథాల్ని వ్యాఖ్యానిస్తూ ఉండేవారు; ఈ సమావేశాలకు "గీతా అసెంబ్లీ" అని పేరు వచ్చింది.

బహుముఖమైన ఈ కార్యకలాపాల ద్వారా, లాహిరీ మహాశయులు "వృత్తి ఉద్యోగ, సామాజిక విధులు నిర్వర్తించిన తరవాత, భక్తియుక్తమైన ధ్యానానికి టైమెక్కడ ఉంటుంది?" అన్న సామాన్యమైన సవాలుకు సమాధానమివ్వడానికి ప్రయత్నించారు. మహనీయులైన ఈ గృహస్థ గురువుల సామరస్య సంతులిత జీవనం, వేలకొద్దీ స్త్రీ పురుషులకు ఉత్ప్రేరణ అయింది. స్వల్పమైన జీతం ఆర్జిస్తూ, మితవ్యయం చేస్తూ, నిరాడంబరంగా, సర్వజనసులభులైన ఈ గురువులు, క్రమ శిక్షణ గల ప్రాపంచిక జీవన మార్గంలో సహజంగా, సుఖంగా సాగారు.

పరమాత్ముడి స్థానంలో పదిలంగా కుదురుకొని ఉన్నప్పటికీ, లాహిరీ మహాశయులు, మనుషుల యోగ్యతల్లో తగతమాలతో నిమిత్తం లేకుండా, అందరి పట్లా పూజ్యభావం ప్రదర్శించేవారు. తమ భక్తులు ఎప్పుడు ప్రణామం చేసినా, ఆయన వాళ్ళకు ప్రతి నమస్కారం చేస్తూ వంగేవారు. పిల్లవాడి కుండేటంత వినయంతో ఆయన, తరచుగా ఇతరుల పాదాలు తాకుతూ ఉండేవారు. అయితే, గురువుపట్ల అటువంటి విధేయత చూపించడం సనాతనమైన ప్రాచ్య దేశ ఆచారమే అయినప్పటికీ, తమకు మాత్రం అటువంటి గౌరవం ఇవ్వడానికి ఆయన ఇతరులను అనుమతించడం అరుదు.

లాహిరీ మహాశయుల జీవితంలో విలక్షణంగా చెప్పుకోదగ్గ విషయం ఏమిటంటే, ప్రతి మతంవాళ్ళకీ క్రియాయోగ దీక్ష ఇవ్వడం. హిందువుఒక్కరే కాదు; ముస్లిములూ, క్రైస్తవులూ కూడా ఆయన ప్రముఖ శిష్యుల్లో ఉన్నారు. అద్వైతులూ ఇతర మతాలవాళ్ళూ లేదా వ్యవస్థితమైన ఏ మతానికీ చెందని వాళ్ళూకూడా ఈ జగద్గురువుల ఆదరం నిష్పక్షపాతంగా పొంది, ఉపదేశం అందుకునేవారు. ఆయన శిష్యుల్లో ఉన్నతస్థాయి నందుకున్నవాళ్ళలో ఒకడు అబ్దుల్ గఫూర్ ఖాన్; ఈయన ముస్లిం. తాము సర్వోన్నతమైన బ్రాహ్మణ కులానికి చెందిన వారయి లాహిరీ మహాశయులు, తమ కాలంలో ఉన్న కఠినమైన కుల దురభిమానాన్ని అంత మొందించడానికి సాహసోపేతమైన ప్రయత్నాలు చేశారు. అన్ని జీవితమార్గాల వాళ్ళు, సర్వవ్యాపకమైన గురుదేవుల రెక్కల నీడన ఆశ్రయం పొందేవారు. దైవప్రేరితులైన ప్రవక్తలందరి మాదిరిగానే లాహిరీ మహాశయులు, సమాజం నుంచి వెలి అయినవాళ్ళకీ దళిత జాతులవాళ్ళకీ ఒక కొత్త ఆశ కలిగించారు.

"నువ్వెవ్వరివాడివీ కావనీ, ఎవ్వరూ నీవారు కారనీ గుర్తుంచుకో. ఎప్పుడో ఒకనాడు నువ్వు హఠాత్తుగా ఈ ప్రపంచంలో ప్రతిదీ వదిలేసి పోవలసి ఉంటుందని తెలుసుకో- కాబట్టి దేవుడితో ఇప్పుడే పరిచయం చేసుకో," అని చెబుతూండేవారు మహాగురువులు, తమ శిష్యులకు. "ప్రతిరోజూ, దైవానుభూతి అనే

గాలిగుమ్మటంలో ఎగురుతూ, రాబోయే మృత్యువనే సూక్ష్మయాత్రకు తయారవు. మాయవల్ల నిన్ను నువ్వు, మాంసాస్థుల కట్టగా చూసుకుంటున్నావు; నిజానికది కష్టాలు కాపురం చేసే గూడు మాత్రమే.* ఎడతెరిపిలేకుండా ధ్యానం చెయ్యి; ఏ విధమైన క్లేశమూ లేని అనంతతత్త్వంగా, నిన్ను నువ్వు తొందరగానే చూసుకుంటావు. శరీరానికి బందీవై ఉండడం మానెయ్యి; క్రియాయోగమనే రహస్య కీలకాన్ని ఉపయోగించి, శరీరంనుంచి తప్పించుకొని పరమాత్మ సన్నిధిలోకి పారిపోవడం నేర్చుకో."

వివిధ శిష్యుల్ని, తమతమ మత విశ్వాసాలకు సంబంధించిన సత్సంప్రదాయ నిష్ఠకు కట్టుబడి ఉండమని గురుదేవులు ప్రోత్సహించేవారు. విముక్తికి సాధనానుకూలమైన ప్రక్రియగా క్రియాయోగానికున్న సర్వార్థసాధక స్వభావాన్ని నొక్కిచెబుతూ లాహిరీ మహాశయులు, తమతమ పరిసరాలకూ పెంపకానికీ తగినట్టుగా తమ జీవితాల్ని అభివ్యక్తం చేసుకొనే స్వేచ్ఛ తమ శిష్యులకు ఇస్తూండేవారు.

"ముస్లిం రోజుకు ఐదుసార్లు నమాజ్ † చెయ్యాలి," అని చెప్పేవారు గురుదేవులు. "హిందువు రోజుకు అనేకమాట్లు ధ్యానంలో కూర్చోవాలి. క్రైస్తవుడు దేవుణ్ణి ప్రార్థిస్తూ బైబిలు చదువుతూ రోజూ అనేక మాట్లు మోకాళ్ళ మీద వంగాలి."

ఈ గురువర్యులు సునిశితమైన వివేచనతో, తమ శిష్యుల్ని, వారి వారి సహజ ప్రవృత్తుల్ని బట్టి భక్తి, కర్మ, జ్ఞాన, రాజయోగ మార్గాల్లో నడిపించేవారు. సాంప్రదాయికమైన సన్యాసమార్గంలో ప్రవేశించదలిచిన భక్తులకు అనుమతి ఇవ్వడంలో ఈ గురువర్యులు చాలా నిదానం చూపేవారు. సన్యాసాశ్రమ విధుల్ని గురించి మొదటే బాగా ఆలోచించుకోమని ఎప్పుడూ హెచ్చరిస్తూ ఉండేవారు.

పవిత్ర గ్రంథాలగురించి సిద్ధాంత చర్చ మానమని ఆ మహాగురువులు శిష్యులకు చెబుతూండేవారు. "సనాతన దివ్యదర్శనాల్ని గురించి కేవలం చదవడంతోనే సరిపెట్టుకోకుండా, వాటిని సిద్ధింపజేసుకోడంలో నిమగ్నమయే వాడే జ్ఞాని." అన్నారాయన. "ధ్యానం ద్వారా మీ సమస్యల్ని పరిష్కరించుకోండి.‡ లాభంలేని, మతసంబంధమైన ఊహలకు బదులు, వాస్తవమైన దైవసంస్పర్శ మీద శ్రద్ధ నిలపండి. మీ మనస్సుల్లోంచి, దైవశాస్త్ర సంబంధమైన పిడివాదపు చెత్తకుప్ప

---

* "ఎన్ని రకాల చావులున్నాయి మన శరీరంలో! చావు తప్ప మరొకటి అందులో లేనేలేదు."
- మార్టిన్ లూథర్.

† ముస్లిముల ముఖ్యప్రార్థన.

‡ "సత్యాన్ని ధ్యానంలో అన్వేషించు; బూజుపట్టిన పుస్తకాల్లో కాదు.
చంద్రుణ్ణి చూడాలంటే ఆకాశంలోకి చూడు, నీటి మడుగులో కాదు." -పారశీక సామెత

తొలగించెయ్యండి; అపరోక్ష జ్ఞానమనే స్వచ్ఛమైన, ఉపశమనకారక మయిన జలాల్ని లోపలికి పారనివ్వండి. చురుకైన ఆంతరిక మార్గదర్శిత్వంతో మిమ్మల్ని అనుసంధానం చేసుకోండి; జీవితంలో ప్రతి సందిగ్ధస్థితికి దివ్యవాణి దగ్గర సమాధానం ఉంది. తనకి తాను చిక్కులు తెచ్చి పెట్టుకోడంలో మనిషి కున్న చాతుర్యానికి అంతులేనట్టు కనిపిస్తున్నప్పటికీ, అనంత సహాయ రూపుడైన భగవంతుడు, చాతుర్యంలో మనిషి కన్న తక్కువవాడేమీ కాడు."

గురుదేవుల సర్వవ్యాపకత్వం శిష్యబృందానికి ఒకనాడు ప్రదర్శితమయింది; ఆయన భగవద్గీతను వివరిస్తూ ఉండగా శిష్యులు వింటున్నారు. ప్రకంపనశీల మైన సృష్టి అంతటిలోనూ ఉన్న కూటస్థ చైతన్యానికి అర్థం వివరిస్తూ ఉండగా లాహిరీ మహాశయులు, హఠాత్తుగా ఎగుశ్వాసతో అరిచారు:

"జపాను తీరసముద్రంలో, అనేక ఆత్మల శరీరాల్లో నేను మునిగిపోతు న్నాను!"

మర్నాడు పొద్దున, టెలిగ్రాం ద్వారా వచ్చిన పత్రికా సమాచారం చదివారు శిష్యులు; అందులో, ముందు రోజున, జపాను సమీపంలో ఓడ మునిగి కొందరు చనిపోయారన్న వార్త ఉంది.

లాహిరీ మహాశయుల శిష్యుల్లో దూరాన ఉన్నవాళ్ళు చాలామంది ఆయన తమకు సమీపంలోనే ఉన్న సంగతి ఎరుగుదురు. "క్రియాయోగ సాధన చేసే వాళ్ళ దగ్గర నేను ఎప్పుడూ ఉంటాను," అని చెప్పేవారాయన, తమకు దగ్గరలో ఉండలేకపోతున్న శిష్యులకు ఊరటగా. "నిరంతరం విస్తరించే మీ ఆధ్యాత్మిక అనుభూతుల ద్వారా బ్రహ్మాండ నిలయానికి మీకు దారి చూపిస్తుంటాను."

ఆ మహాగురువుల ప్రఖ్యాత శిష్యులైన శ్రీ భూపేంద్రనాథ్ సన్యాల్,* పడుచు వయస్సులో ఉండగా 1892లో, కాశీకి వెళ్ళలేక, ఆధ్యాత్మిక ఉపదేశం కోసం గురువుగారిని ప్రార్థించారు. లాహిరీ మహాశయులు, భూపేంద్రునికి కలలో కనిపించి, దీక్ష ఇచ్చారు. తరవాత ఆయన కాశీ వెళ్ళి గురువుగారిని దీక్ష ఇమ్మ న్నారు. "నీ కిదివరకే దీక్ష ఇచ్చాను, కలలో," అని జవాబిచ్చారు లాహిరీ మహాశయులు.

శిష్యులెవరయినా తన లౌకిక బాధ్యతల్లో ఏది ఉపేక్షించినా, గురుదేవులు మెల్లగా అతన్ని చక్కదిద్దేవారు.

"శిష్యుడి లోపాలగురించి పదిమందిలో చెప్పక తప్పనప్పుడు కూడా, లాహిరీ మహాశయుల మాటలు సౌమ్యంగా, నయంచేసేలా ఉంటాయి," అని ఒకసారి

---

* శ్రీ సన్యాల్ 1962లో మరణించారు (ప్రచురణకర్త గమనిక)

చెప్పారు నాకు, శ్రీయుక్తేశ్వర్‌గారు. తరవాత విచారంగా ఇంకా ఇలా అన్నారు, "మా గురువుగారి బాణం మొనల్ని తప్పించుకోడానికి ఎన్నడూ ఏ శిష్యుడూ పారిపోలేదు." నేను నవ్వు ఆపుకోలేకపోయాను; వాడిగా ఉన్నా ఉండకపోయినా, నా గురుదేవుల ప్రతిమాటా నా చెవులకు సంగీతం లాంటిదని సత్యప్రమాణంగా వారికి నచ్చజెప్పాను.

లాహిరీ మహాశయులు క్రియాయోగాన్ని జాగ్రత్తగా నాలుగు క్రమోన్నత దీక్షలుగా విభజించారు.* సాధకుడు నిశ్చితమైన ఆధ్యాత్మిక ప్రగతి కనబరిచిన తరవాతే పై మూడు ప్రక్రియలూ ఉపదేశించేవారు: ఒకనాడొక శిష్యుడు, గురువు గారు తన విలువను సరిగా అంచనా వెయ్యడం లేదని గట్టి నమ్మకం ఏర్పరచు కొని, తన అసంతృప్తి వెల్లడించాడు.

"గురుదేవా, నేను రెండో దీక్షకు నిశ్చయంగా సిద్ధంగా ఉన్నాను." సరిగా ఇదే సమయంలో తలుపు తెరుచుకుంది; వినయ సంపన్నుడైన బృందా భగత్ అనే శిష్యుడు లోపల అడుగుపెట్టాడు. అతను కాశీలో ఒక పోస్ట్‌మాన్.

"బృందా, ఇలా నా పక్కన కూర్చో." మహాగురువులు అతనికేసి ఆప్యాయంగా చిరునవ్వు చిందిస్తూ చూశారు. "ఒక్కమాట చెప్పు; రెండో క్రియకు సిద్ధంగా ఉన్నావా?"

ఆ చిన్న పోస్ట్‌మాన్, గురుదేవులను వేడుకుంటున్నట్టుగా చేతులు జోడించాడు. "గురుదేవా, ఇంకే ఉపదేశాలూ నాకు వద్దండి! ఇంతకన్న పై ఉపదేశాల్ని ఎలా ఒంటబట్టించుకోగలను? ఈ రోజు, మీ దీవెనలు కోరడం కోసం వచ్చాను; ఏమంటే, మొదటి క్రియే నన్ను దైవపరమయిన మత్తులో నింపేసి నేను ఉత్తరాలు బట్వాడా చెయ్యలేకుండా చేసిందండి!" అన్నాడు భయంగా.

"అప్పుడే బృంద, ఆత్మసాగరంలో ఈదులాడుతున్నాడు." లాహిరీ మహాశయులన్న ఈ మాటలకు, ఆ రెండో శిష్యుడు తల వంచుకున్నాడు.

"గురుదేవా, పనిచెయ్యడం చేతకాక పనిముట్లకు వంకలుపెట్టే నాసిరకం పనివాణ్ణి నేను," అన్నాడతను.

వినయశీలుడైన ఆ పోస్ట్‌మాన్, చదువుకున్నవాడు కాడు; కాని తరవాత అతను క్రియాయోగం ద్వారా తన అంతర్దృష్టిని ఎంతవరకు అభివృద్ధి చేసుకున్నా

---

* క్రియాయోగంలో శాఖోపశాఖలు చాలా ఉన్నాయి. లాహిరీ మహాశయులు వాటిని పరిశీలించి నాలుగు ప్రక్రియల్ని - సాధనపరంగా అత్యధిక విలువకలవాటిని ఎంపిక చేశారు.

డంటే ధర్మశాస్త్ర విషయాలకు సంబంధించిన సమస్యలకు అతను చేసే వ్యాఖ్యానం కోసం అప్పుడప్పుడు పండితులు కూడా వస్తూ ఉండేవారు. పాపమూ పాండిత్యమూ రెండూ ఎరగని చిన్న బృందా, పండిత లోకంలో ప్రసిద్ధి పొందాడు.

లాహిరీ మహాశయులకు కాశీలో ఉన్న శిష్యులే కాకుండా, భారత దేశంలో దూరప్రాంతాల నుంచి కూడా వందలకొద్దీ శిష్యులు ఆయన దగ్గరికి వస్తూ ఉండేవారు. తమ కుమారు లిద్దరి అత్తవారిళ్ళకు వచ్చిన సందర్భాల్లో ఆయన, చాలా మాట్లు బెంగాలు వచ్చారు. ఆ విధంగా, ఆయన ఉనికివల్ల బెంగాలు, చిన్నచిన్న క్రియాయోగి బృందాల తేనెపట్టు అయింది. ముఖ్యంగా, కృష్ణనగర్, విష్ణుపూర్ జిల్లాల్లో అనేకమంది నిరాడంబర శిష్యులు ఈనాటికీ, ఆత్మధ్యాన పరమయిన అదృశ్యవాహిని ప్రవహిస్తూ ఉండేటట్టు చేస్తున్నారు.

లాహిరీ మహాశయుల దగ్గర క్రియాదీక్ష పొందిన అనేకమంది మహా పురుషుల్లో చెప్పుకోదగ్గవారు - కాశీలో ఉండే, ప్రఖ్యాతులు స్వామి భాస్కరానంద సరస్వతి, ఉన్నత మూర్తిమత్వం గల దేవఘర్ తపస్వి బాలానంద బ్రహ్మచారి. లాహిరీ మహాశయులు కొంతకాలంపాటు, కాశీలోని మహారాజ ఈశ్వరీ నారాయణ్ సింహ బహాదూర్ వారి కుమారుడికి ప్రయివేట్ ట్యూటరుగా పనిచేశారు. గురువుగారి ఆధ్యాత్మిక సిద్ధిని గుర్తించి, ఆ మహారాజా ఆయన కుమారుడూ కూడా వారి దగ్గర క్రియాయోగ దీక్ష తీసుకున్నారు; అలాగే మహారాజ యతీంద్రమోహన్ ఠాకుర్‌గారు కూడా దీక్ష తీసుకున్నారు.

లాహిరీ మహాశయుల శిష్యుల్లో పలుకుబడి గల లౌకిక పదవుల్లో ఉన్న కొందరికి, ప్రచారం ద్వారా క్రియాయోగి మండలిని విస్తృతం చెయ్యాలన్న కోరిక ఉంటుండేది. గురువుగారు దానికి అనుమతి ఇవ్వలేదు. కాశీరాజాకు వైద్యుడుగా ఉన్న ఒక శిష్యుడు - గురువుగారి పేరును "కాశీ బాబా" (కాశీలో ఉండే మహామహులు)*గా వ్యాప్తి చెయ్యడానికి వ్యవస్థాపరమైన కృషి ఒకటి ప్రారంభించాడు. గురువుగారు దాన్ని కూడా నిషేధించారు.

"క్రియాకుసుమ గంధాన్ని సహజరీతిలోనే వ్యాపించనివ్వండి," అన్నారాయన. "క్రియాబీజాలు, ఆధ్యాత్మికంగా సారవంతమైన హృదయక్షేత్రాల్లో తప్పకుండా మొలకెత్తుతాయి."

---

* లాహిరీ మహాశయులకు శిష్యులిచ్చిన ఇతర బిరుదులు 'యోగివర్' (యోగుల్లో శ్రేష్ఠులు), 'యోగిరాజ్' (యోగుల్లో రాజువంటివారు), 'మునివర్' (మునుల్లో శ్రేష్ఠులు); ఇవి కాక నేను చేర్చింది మరొకటి - 'యోగావతార్' (మానవరూపంలో జన్మించిన యోగవిద్య).

వ్యవస్థాపరమైన ఆధునిక మార్గం ద్వారా కాని, అచ్చుయంత్రం ద్వారా కాని ప్రచారంచేసే పద్ధతిని మహాగురువులు అవలంబించనప్పటికీ తమ సందేశ శక్తి, అడ్డూ ఆపూ లేని వరదవెల్లువలా పెల్లుబికి, తన ధాటితో మానవ మనస్సుల తీరాలను ముంచేస్తుందని ఆయనకు తెలుసు. పరివర్తనచెంది, పరిశుద్ధినందిన భక్తుల జీవితాలే, క్రియాయోగం అమర జీవశక్తికి ప్రత్యక్ష నిదర్శనాలు.

1886లో, అంటే రాణీఖేత్‌లో దీక్ష తీసుకొన్న ఇరవై ఐదేళ్ళ తరవాత, లాహిరీ మహాశయులు పెన్షను మీద పదవీవిరమణ చేశారు.* పగటిపూట కూడా ఆయన దొరకడంతో, శిష్యులు ఇతోధిక సంఖ్యలో రావడం ప్రారంభమయింది. మహా గురువు లిప్పుడు రోజు మొత్తంలో చాలాసేపు, ప్రశాంతంగా పద్మాసనబద్ధులై మౌనంగానే కూర్చుంటూ వచ్చారు. కొద్దిసేపు షికారుకు వెళ్ళడానికి కాని, ఇంట్లోనే ఇతర చోట్లకు వెళ్ళడానికి కాని ఆయన తమ గది విడిచి వెళ్ళింది చాలా అరుదు. గురుదేవుల దర్శనం కోసం, దాదాపు ఎడ తెరిపిలేకుండా, శిష్యులు ప్రశాంత ప్రవాహంలా వచ్చేవారు.

చూసేవాళ్ళకి సంభ్రమాశ్చర్యాలు కలిగేటట్టుగా, లాహిరీ మహాశయులకు అలవాటయిన శారీరక స్థితి - ఊపిరి లేకపోవడం, నిద్రలేకపోవడం, నాడీ గుండె కొట్టుకోడం మానెయ్యడం, గంటల తరబడి రెప్పపాటులేకుండా ఉండే ప్రశాంతమైన నేత్రాలు, ప్రగాఢమైన ప్రశాంతి పరివేషం వంటి మానవాతీత లక్షణాల్ని ప్రదర్శించేది. ఆత్మోద్ధరణానుభూతి పొందకుండా అక్కణ్ణించి వెళ్ళిన వాళ్ళు ఎవ్వరూ లేరు; దైవసాక్షాత్కారం పొందిన ఒక సత్పురుషుని మౌన ఆశీర్వాదం పొందామని వాళ్ళందరికి తెలుసు.

పంచానన్ భట్టాచార్య అనే శిష్యుడు కలకత్తాలో, "ఆర్యమిషన్ ఇన్స్టిట్యూషన్" అనే పేరుతో ఒక యోగకేంద్రం స్థాపించడానికి గురువుగారు ఇప్పుడు అనుమతించారు. ఈ కేంద్రం, యోగసంబంధమైన ఓషధులు† పంచిపెడుతూ ఉండేది. భగవద్గీత చౌకధరకు అమ్మడానికి అనువుగా బెంగాలులో మొట్టమొదట ప్రచురణ చేసింది ఈ కేంద్రమే. హిందీలోనూ బెంగాలీలోనూ ప్రచురించిన ఆర్యమిషన్ గీత ప్రతులు వేలాది ఇళ్ళలోకి ప్రవేశం పొందాయి.

---

* మొత్తం మీద ఆయన, ఒకే ప్రభుత్వ శాఖలో ముప్పై ఐదేళ్ళపాటు ఉద్యోగం చేశారు

† హిందూ వైద్యశాస్త్రాన్ని ఆయుర్వేదం అంటారు. వైదిక వైద్యులు సున్నితమైన శస్త్ర చికిత్సా పరికరాలు ఉపయోగించారు, ప్లాస్టిక్ సర్జరీ చేశారు, విషవాయువు ప్రభావాలకు విరుగుడు ఎలా వెయ్యాలో తెలుసుకున్నారు. సిజేరియన్ ఆపరేషన్లూ మెదడు ఆపరేషన్లూ చేశారు. మందుల

సనాతనాచారం ప్రకారం గురుదేవులు, వివిధ రోగాల నివారణకోసం ప్రజలకు సాధారణంగా వేప*నూనె ఇస్తూండేవారు. ఈ నూనె బట్టీపట్టి ఇమ్మని, గురుదేవులు ఏ శిష్యుణ్ణయినా కోరినట్లయితే, ఆ పని అతను సులువుగా నెరవేర్చగలిగేవాడు. అదే మరొకరెవరయినా ప్రయత్నిస్తే, చిత్రమైన ఇబ్బందులు ఎదురయేవి; అవసరమైన ప్రక్రియల్లో నూనె బట్టీపట్టడం అయిన తరవాత చూస్తే, ఆ ద్రవం దాదాపు అంతా ఆవిరయిపోయి ఉండేది. గురుదేవుల ఆశీస్సుకూడా దీనికి ఆవశ్యకమైన ఒక దినుసని దీనివల్ల స్పష్టమవుతోంది.

లాహిరీ మహాశయుల చేతిరాత, ఆయన సంతకం, బెంగాలీ లిపిలో, పైన చూడవచ్చు. పై పంక్తులు, ఒక శిష్యుడికి రాసిన ఉత్తరంలోవి; మహాగురువులు ఒక సంస్కృత శ్లోకాన్ని ఇలా అన్వయించారు: "కనురెప్పలు అల్లాడనంతటి ప్రశాంతస్థితి నందుకున్నవాడు 'శాంభవీముద్ర' సిద్ధింపజేసుకున్నవాడు."†

[ఎడమవైపు క్రిందుగా సంతకం] "శ్రీశ్యామాచరణ్ దేవ శర్మన్"

---

అంతశ్శక్తిని పెంపుచేయడంలో ఆరితేరారు. క్రీ.పూ. 4 శతాబ్దినాటి హిపోక్రేట్స్ అనే ప్రసిద్ధ గ్రీకు వైద్యుడు, తన మెటీరియా మెడికా [ఔషధ పదార్థ తత్త్వశాస్త్రం]లో చాలామట్టుకు హిందూ ఆధార గ్రంథాల్లోంచి ఎరువు తెచ్చుకున్నాడు.

* మార్గోసా చెట్టు. దాని ఔషధ విలువలు ఇప్పుడు పాశ్చాత్య దేశాల్లో కూడా గుర్తింపు పొందాయి. చేదుగా ఉండే వేపబెరడు ఒక టానిక్కుగా ఉపయోగిస్తారు; గింజలనుంచీ పళ్ళనుంచీ తీసిన నూనె, కుష్ఠు మరికొన్ని ఇతర వ్యాధులూ నయం చెయ్యడానికి వాడతారు.

† శాంభవీముద్ర అంటే, భ్రూమధ్యంలో చూపు నిలిపి ఉంచడం. యోగి, ఒకానొక ప్రశాంత మానసిక స్థితిని చేరుకున్నప్పుడు, అతని కనురెప్పలు కదలవు; అంతర్లోకంలో లీనమై ఉంటాడు.

ముద్ర ("చిహ్నం") అనేది మామూలుగా, వేళ్ళతోనూ చేతులతోనూ చేసే, ధార్మికాచార పరమైన ఒక చేష్టను సూచిస్తుంది. చాలా ముద్రలు నిశ్చితమైన నరాలమీద పనిచేసి ప్రశాంతత అలవరుస్తాయి. సనాతన హిందూ శాస్త్రగ్రంథాలు నాడుల్నీ (శరీరంలో 72,000 నాడీ మార్గాలు), మనస్సుతో వాటికిగల సంబంధాల్నీ సునిశితంగా వర్గీకరించాయి. అర్చనలోనూ యోగసాధన

చాలామంది మహాప్రవక్తలలాగే లాహిరీమహాశయులు కూడా తమకు తాముగా పుస్తకాలేమీ రాయలేదు కాని, పవిత్ర గ్రంథాలను తమ వ్యాఖ్యానాలతో వివిధ శిష్యులకు బోధించారు. మహాగురువుల మనుమలు, నా ప్రియమిత్రులు కీ.శే. ఆనందమోహన్ లాహిరీ ఇలా రాశారు:

"భగవద్గీతలోనూ మహాభారత ఇతిహాసంలో ఇతర భాగాల్లోనూ వ్యాసఘట్టాలు (వ్యాసకూటాలు; చిక్కుముడులు) ఉంటుంటాయి. ఈ వ్యాసఘట్టాల్ని ప్రశ్నించకుండా వదిలేస్తే, ఇట్టే అపార్థం చేసుకోడానికి వీలైన చిత్రమైన పురాణ కథలే కనిపిస్తాయి. ఈ వ్యాసఘట్టాల్ని వివరించకుండా వదిలేస్తే వేలకొద్దీ సంవత్సరాల ప్రయోగ అన్వేషణ అనంతరం మానవాతీతమైన ఓర్పుతో భారతదేశం పరిరక్షిస్తూ వచ్చిన ఒకానొక శాస్త్రం మనకు దక్కకుండా నశించినట్టే లెక్క!*

"పవిత్ర గ్రంథాల్లో శబ్దచిత్ర కల్పనాత్మకమైన చిక్కుల్లో తెలివిగా కనుమరుగు చేసి ఉంచిన మతశాస్త్రాన్ని, రూపకాది అలంకారాల ఆవరణ నుంచి తప్పించి లాహిరీ మహాశయులు వెలుగులోకి తెచ్చారు. వేదమంత్రాలు పూర్తిగా వైజ్ఞానిక ప్రాముఖ్యమున్నవన్న సంగతి ఈ మహాగురువులు నిరూపించిన మీదట, ఇప్పుడవి, అర్థంకాని మాటల గారడీ అనిపించడం మానేశాయి...

"విషయవాంఛల ముందు, మనిషి మామూలుగా నిస్సహాయుడై ఉంటాడని మనకి తెలుసు. కాని మనిషిలో క్రియాయోగం ద్వారా అధికతర శాశ్వతానంద చైతన్యం ఉదయించినప్పుడు ఈ విషయవాంఛల్ని అది శక్తిహీనం చేస్తుంది; వాటికి

---

లోనూ ఉపయుక్తమయిన నరాలకు. ఈ విధంగా శాస్త్రీయమైన ప్రాతిపదిక ఉంది. విగ్రహ శిల్పశాస్త్రంలోనూ ధార్మికాచారపరమైన భారతీయ నాట్యాల్లోనూ ఈ ముద్రలకు విస్తృతమైన భాష ఒకటి కనిపిస్తుంది.

* "క్రీ.పూ. మూడువేల ఏళ్ళనాటివని నిర్ణయించదగిన, సింధునదీ లోయలో పురాతత్త్వ పరిశోధన క్షేత్రాల్లో తవ్వి తీసిన, కొన్ని ముద్రికల మీద ధ్యానముద్రలో కూర్చుని ఉన్న ఆకృతులు కనిపిస్తున్నాయి. ఈనాటికీ యోగ సాధన విధానంలో వాడుకలో ఉన్న ఈ ముద్రల్నిబట్టి యోగశాస్త్ర మౌలికాంశాలు కొన్ని ఆనాటికే తెలిసి ఉన్నవని నిష్కర్ష చెయ్యడానికి వీలు కలుగుతోంది. భారత దేశంలో ఐదువేల ఏళ్ళకు పూర్వమే, అధ్యయనానుశీలన పద్ధతుల సహాయంతో సక్రమమైన ఆత్మపరిశీలన సాధనచేసేవారన్న నిర్ణయానికి రావడం హేతురహితం కాకపోవచ్చు." ప్రొఫెసర్ డబ్ల్యు నార్మన్ బ్రౌన్, అమెరికన్ కౌన్సిల్ ఆఫ్ లెర్నెడ్ సొసైటీస్, వాషింగ్టన్, డి సి, వారి బులెటిన్‌లో.

అయితే, హిందూ పవిత్ర గ్రంథాలు చూపించే ప్రమాణం, యోగశాస్త్రం భారతదేశంలో చెప్పనలవి కానన్ని వేల సంవత్సరాల నుంచి వర్ధిల్లుతూ ఉందని.

తాను లోలుడయే ఉద్దేశం మనిషిలో కనిపించదు. ఇక్కడ ఈ నివృత్తి, అంటే అధమ ప్రకృతి త్యజీకారం, ఒక ప్రవృత్తి, అంటే పరమానంద అనుభూతితో సమంగా ఒకే కాలంలో జరుగుతుంది. అటువంటి మార్గం ఒకటి లేనట్లయితే, కేవల నివృత్తి బోధకమైన నీతిసూత్రాలు మనకు నిరుపయోగ మవుతాయి.

"దృశ్యమాన విషయాలన్నిటి వెనకా ఉండేది అనంతం: అది మహాశక్తి సాగరం. ప్రపంచ కార్యకలాపాలమీద ఉన్న ఆసక్తి మనలో ఆధ్యాత్మిక జిజ్ఞాసాపరమైన జ్ఞానాన్ని చంపేస్తుంది. ప్రకృతి శక్తుల్ని ఉపయోగించుకోడం ఎలాగో ఆధునిక విజ్ఞానశాస్త్రం మనకి చెబుతుంది కనక, నామరూపాలన్నిటి వెనకా ఉన్న మహతీ ప్రాణశక్తిని అవగాహన చేసుకోడంలో విఫలమవుతాం. ప్రకృతితో మనకున్న అతిపరిచయంవల్ల దాని పరమరహస్యాల గురించి అవజ్ఞ ఏర్పడు తోంది; దాంతో మనకున్న సంబంధం, ప్రయోజనాపేక్షక వ్యవహారపరమైనది. ఒక రకంగా చెప్పాలంటే, అది మన ప్రయోజనాలకు ఉపకరించేటట్టుగా దానిచేత నిర్బంధంగా పనిచేయించుకోడానికి మార్గాలు కనిపెట్టడానికి మనం దాన్ని వేధిస్తూంటాం; మనం దాన్ని సొంతానికి వాడుకుంటాం; అయినా దాని మూలం మనకి తెలియ కుండానే ఉండిపోతోంది. విజ్ఞానశాస్త్రంలో, ప్రకృతితో మనకున్న సంబంధం, పొగరుబోతు యజమానికీ అతని నౌకరుకూ ఉండే సంబంధం లాంటిది; లేదా, తాత్త్విక దృష్టితో చెప్పేటట్లయితే ప్రకృతి, [న్యాయస్థానంలో] సాక్షి బోనులో బందీ లాంటిది. దాన్ని మనం అడ్డుపరీక్ష చేస్తాం, సవాలు చేస్తాం; మరుగుపడి ఉన్న దాని విలువల్ని తూచలేని, మానవుల తక్కెళ్ళలో దాని సాక్ష్యాన్ని సూక్ష్మాంశాలతో సహా తూస్తాం.

"అలా కాకుండా ఆత్మకు, అంతకన్న పై శక్తితో సంపర్కం ఏర్పడి ఉంటే ప్రకృతి, ఎటువంటి బాధకాని మానవ సంకల్పం కాని లేకుండా, దానంతట అది తల వంచుతుంది. ప్రకృతి మీద అప్రయత్నకమైన ఈ అధికారాన్ని, అవగాహన చేసుకోని భౌతికవాది, 'అలౌకిక ఘటనాత్మకం' (మిరాక్యులస్) అని అంటాడు.

"లాహిరీ మహాశయుల జీవితం నెలకొల్పిన ఆదర్శం, యోగం ఒకానొక మర్మవిద్య అన్న తప్పుడు అభిప్రాయాన్ని మార్చేసింది. క్రియాయోగం ద్వారా, ప్రతి మనిషి, భౌతికశాస్త్రపు యథార్థతలను అధిగమించి, ప్రకృతితో తనకున్న సంబంధాన్ని అర్థంచేసుకోడానికీ, దృగ్విషయాలన్నిటిపట్లా (అవి మార్మికమైనవైనా,

లేక దైనందిన సంఘటనలయినా) ఆధ్యాత్మిక పూజ్యభావాన్ని*అనుభూతం చెంద డానికీ ఒక దారి కనుక్కొంటాడు. ఒక వెయ్యేళ్ళ కిందట వివరణకు లొంగని అనేక విషయాలు ఈనాడు అలా అనిపించడంలేదనీ, ఈనాడు అంతుపట్టని విషయా లన్నవి మరో వందేళ్ళకు శాస్త్ర నియమబద్ధాలుగా మనకు అవగాహన కావచ్చునవీ మనం గుర్తుంచుకోవాలి.

"క్రియాయోగశాస్త్రం శాశ్వతమైనది. అది గణితశాస్త్రంలా సత్యమైనది కూడికలూ తీసివేతలూ వంటి సరళ సూత్రాల మాదిరిగా, క్రియాయోగ నియమం కూడా ఎన్నటికీ నశింపు కానిది. గణితశాస్త్రం మీద రాసిన గ్రంథాలన్నింటినీ తగల బెట్టెయ్యండి; తర్కబుద్ధిగలవాళ్ళు అటువంటి సత్యాల్ని ఎప్పుడూ తిరిగి కనుక్కుం టూనే ఉంటారు. యోగం మీదున్న పుస్తకాలన్నింటినీ నిషేధించండి; దాని మూల సూత్రాలన్నీ, నిర్మల భక్తి తదనుసారంగా నిర్మల జ్ఞానముగల ఋషి అవతరించి నప్పుడల్లా మళ్ళీ వెల్లడి అవుతూనే ఉంటాయి."

అవతార పురుషులందరిలో ఉన్నతస్థాయికి చెందినవారిలో ఒకరైన బాబాజీ "మహావతారు"లైనట్టు, విజ్ఞానం రూపుకట్టిన శ్రీయుక్తేశ్వరులను న్యాయత: "జ్ఞానావతారు"లని పేర్కొన దగినట్టుగానే లాహిరీ మహాశయులు "యోగావతారో స్వరూపులు.†

గుణాత్మక, పరిమాణాత్మక ప్రమాణాలు రెండిటి దృష్ట్యా, లాహిరీ మహా శయులు, సమాజం ఆధ్యాత్మిక స్థాయిని సమున్నతం చేశారు. తమ సన్నిహిత శిష్యుల్ని క్రీస్తు మాదిరి ఉన్నతమూర్తిమత్వానికి పెంచడానికి వారికున్న శక్తిని బట్టీ జనబాహుళ్యంలో సత్యాన్ని విస్తృతంగా వ్యాప్తి చేయడాన్ని బట్టి లాహిరీ మహాశయులు మానవజాతి రక్షకుల కోవలోకి వస్తారు.

ప్రవక్తగా ఆయన అద్వితీయత, యోగవిముక్తి ద్వారాల్ని మొట్టమొదటి సారిగా మానవులందరికోసం తెరుస్తూ, క్రియాయోగమనే ఒక నిర్దిష్ట పద్ధతిని

---

* "ఆశ్చర్యపోజాలని వాడూ, అలవాటుగా ఆశ్చర్యపోని (ఆశ్చర్యపోయి పూజించని) వాడూ - అతను అనేక రాయల్ సొసైటీలకు అధ్యక్షుడైనా, అన్ని ప్రయోగశాలల, వేధశాలల ప్రతీకల్ని వాటి ఫలితాలన్నీ ఒక్క తన బుర్రలోనే ఇముడ్చుకుని ఉన్నవాడైన - వెనకాల కన్నులేని కళ్ళజోడు లాంటివాడు." - కార్లైల్, 'సార్టర్ రిసార్టస్ లో.

† శ్రీయుక్తేశ్వర్‌గారు తమ శిష్యులైన పరమహంస యోగానందగారిని దివ్య ప్రేమావతా రులుగా పేర్కొన్నారు. పరమహంసగారి నిర్యాణానంతరం ఆయన ప్రధాన శిష్యులు, ఆధ్యాత్మిక వారసుడు రాజర్షి జనకానంద (శ్రీ జేమ్స్ జె లిన్) 'ప్రేమావతార్' బిరుదు ఆయనకు అర్పించారు (ప్రమురణకర్త గమనిక)

ఆచరణాత్మకంగా నొక్కిచెప్పడంలో ఉంది. ఆయన జీవితంలో గోచరించిన అలౌకిక ఘటనల సంగతి అలా ఉంచి, నిజంగా ఆ యోగావతారులు, యోగవిద్యలోని పూర్వపు జటిలతల్ని తగ్గించి సాధారణ బుద్ధికి అవగాహన అయేటట్టుగా ఫలవంతమైన సరళత్వాన్ని సాధించడం అద్భుతాలన్నిటికీ పరాకాష్ఠ.

అలౌకిక ఘటనల్ని గురించి ప్రస్తావిస్తూ లాహిరీ మహాశయులు తరచు ఇలా అనేవారు : "జనబాహుళ్యానికి తెలియని సూక్ష్మనియమాలు పనిచేసే తీరును తగినంత విచక్షణ లేకుండా బహిరంగంగా చర్చించనూ గూడదు, ప్రచురించనూ గూడదు." ఈ పుస్తకంలో నే నెక్కడయినా, ఆయన హెచ్చరికగా చెప్పిన మాటల్ని ఉల్లంఘించినట్టు కనిపించినట్టయితే, ఆయన నాకు ఆంతరికమైన హామీ ఇవ్వడమే కారణమని గ్రహించాలి. అయినప్పటికీ బాబాజీ, లాహిరీ మహాశయ, శ్రీయుక్తేశ్వర్ గార్ల జీవితాల్ని గ్రంథస్థం చేసేటప్పుడు నేను, కొన్ని కొన్ని అలౌకిక ఘటనలు మినహాయించడం మంచిదని అనుకున్నాను. క్లిష్టమైన దార్శనిక విషయాలతో వివరణాత్మక గ్రంథం కూడా ఒకటి రాయకుండా వాటిని చేర్చటం జరగనిపని.

గృహస్థ యోగిగా లాహిరీ మహాశయులు, ఈనాటి ప్రపంచం అవసరాలకు అనువయిన, ఆచరణానుకూల సందేశం ఒకటి అందించారు. ప్రాచీన భారత దేశంలో ఉన్న అద్భుతమైన ఆర్థిక, మతధార్మిక స్థితులు ఈనాడు లేవు. అందువల్ల యోగి భిక్షాపాత్ర చేత బుచ్చుకొని సంచారం చేసే తపస్విగా జీవించాలన్న పాతకాలపు ఆదర్శాన్ని ఆ మహాయోగి ప్రోత్సహించలేదు. దాని బదులు, ఇప్పటికే ఎంతో ఒత్తిడికి గురి అయి ఉన్న సమాజం మీద ఆధారపడి ఉండకుండా యోగి, తన బతుకు తాను బతకడానికి కావలసినది సంపాదించు కోడంలోనూ, తన ఇంట్లోనే ఏకాంతంగా ఒకచోట యోగసాధన చెయ్యడంలోనూ గల లాభాలు నొక్కి చెప్పారు. ఈ సలహాకు తోడుగా, హర్షదాయకమైన తమ ఆదర్శ బలాన్ని ఆయన జోడించారు. ఆయన ఆధునికులయిన, సర్వశ్రేష్ఠ ఆదర్శరూపులయిన యోగి. ఆయన జీవనమార్గం, ప్రపంచంలో అన్ని దేశాల్లోనూ ఉండే యోగసాధకులకు మార్గదర్శకంగా ఉండాలని బాబాజీ ప్రణాళికలో నిర్ణయమయింది.

కొత్తవాళ్ళ కొక కొత్త ఆశారేఖ! దైవసాయుజ్యం స్వయంకృషి ద్వారా సాధ్యం" అనీ, "అది దైవశాస్త్ర సంబంధమైన విశ్వాసాల మీదకాని విశ్వనియంత నిరంకుశ సంకల్పంమీద కాని ఆధారపడి ఉన్నది కాదు" అనీ యోగావతారులు ఉద్ఘాటించారు.

మానవుడి దివ్యత్వంమీద విశ్వాసమేర్పరుచుకోలేని వ్యక్తులు, క్రియాయోగ కీలకాన్ని ఉపయోగించి చివరికి, తమ సంపూర్ణ దివ్యత్వాన్ని దర్శిస్తారు.

అధ్యాయం : 36

# పాశ్చాత్య ప్రపంచం పట్ల బాబాజీ ఆసక్తి

"గురుదేవా, మీ రెప్పుడయినా బాబాజీని కలుసుకున్నారా?"

శ్రీరాంపూర్‌లో ప్రశాంతమైన ఒక వేసవి రాత్రి అది; ఆశ్రమం రెండో అంతస్తు బాల్కనీలో నేను శ్రీయుక్తేశ్వర్‌గారి పక్కన కూర్చుని ఉన్నప్పుడు, మా తలలకు పైన పెద్దపెద్ద నక్షత్రాలు మిలమిలా మెరుస్తున్నాయి.

"ఆ." నా సూటి ప్రశ్నకు గురుదేవులు చిరునవ్వు నవ్వారు; ఆయన కళ్ళు భక్తిప్రపత్తులతో ప్రకాశించాయి. "మూడుసార్లు ఆ అమర గురువుల దర్శనభాగ్యం కలిగింది. మేము మొదటిసారి కలుసుకోడం, అలహాబాదులో, కుంభమేళా సందర్భంలో."

చిరకాలంగా భారతదేశంలో జరిపే మతధార్మిక ఉత్సవాల్ని కుంభమేళాలంటారు. ఆధ్యాత్మిక లక్ష్యాల్ని అవి జనబాహుళ్యం దృష్టిలో ఎప్పుడూ నిలుపుతూ ఉంటాయి. శ్రద్ధాళువులైన హిందువులు, వేలాదిమంది సాధువుల్నీ, యోగుల్నీ, స్వాముల్నీ, తపస్వుల్నీ - అన్ని రకాలవాళ్ళనీ దర్శించుకోడానికి, ప్రతి పన్నెండేళ్ళకి ఒకసారి లక్షలకి లక్షలు వచ్చి చేరతారు. మామూలుగా ఎన్నడూ ఏకాంత స్థానాల్ని విడిచిరాని సాధువులు చాలామంది ఈ మేళాల*కు హాజరయి ప్రాపంచిక స్త్రీ పురుషులకు తమ ఆశీస్సులు అందిస్తారు.

"నేను బాబాజీని కలుసుకున్న నాటికింకా నేను స్వామిని కాలేదు," అంటూ కొనసాగించారు శ్రీయుక్తేశ్వర్‌గారు. "కాని అప్పటికి, లాహిరీ మహాశయుల దగ్గర క్రియాయోగ దీక్ష తీసుకున్నాను. 1894 జనవరిలో అలహాబాదులో జరిగే మేళాకు

* పే. 498 అధోజ్ఞాపిక చూడండి.

వెళ్ళమని నన్నాయన ప్రోత్సహించారు. నాకది మొట్టమొదటి కుంభమేళా అనుభవం. ఆ కోలాహలమూ ఆ జనప్రవాహమూ చూసి నేను కొద్దిగా దిగ్భ్రమ చెందాను. చుట్టూ గుచ్చిగుచ్చి చూశాను; తేజస్సుగల ఒక్క సద్గురువు ముఖమూ నాకు కనిపించ లేదు. గంగానది ఒడ్డున ఒక వంతెన దాటుతూ ఉండగా, దగ్గరలోనే నిలబడి ఉన్న ఒక పరిచయస్థుణ్ణి చూశాను; అతని భిక్షాపాత్ర ముందుకు చాపి ఉంది.

" 'ఈ మేళా అంతా గోలా గందరగోళమూ బిచ్చగాళ్ళూ తప్ప మరేం లేదు,' అనుకున్నాను నిరాశపడి. మనస్సును భిక్షాల మీదే నిలిపి పైకి ధర్మోపదేశాలు చేసే ఈ సోమరులకన్న మానవ కళ్యాణంకోసం విజ్ఞాన రంగాల్ని ఓర్పుతో విస్తరింప జేస్తున్న పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రవేత్తలు, దేవుడికి ఎక్కువ సంతోషం కలిగించడం లేదా?' అనిపించింది.

"నా ఎదురుగా వచ్చి ఆగిన పొడుగాటి ఒక సన్యాసి కంఠస్వరం, సమాజ సంస్కరణ గురించి నాలో రగులుతున్న ఆలోచనలకు అంతరాయం కలిగించింది.

" 'మహాశయా, మిమ్మల్ని ఒక సాధువు పిలుస్తున్నారండి,' అన్నాడతను.

" 'ఎవరాయన?'

" 'వచ్చి మీరే చూడండి.'

" 'కొంచెం వెనకాడుతూనే, ఆయన టూకీగా ఇచ్చిన ఈ సలహాని పాటించి ఒక చెట్టు దగ్గరికి వచ్చాను. ఆ చెట్టు కొమ్మల నీడన, ఆకర్షకమైన శిష్యబృందంతో ఉన్న ఒక గురువుగారిని చూశాను. మిలమిల మెరిసే నల్లకళ్ళతో, తేజస్వంతమైన అసాధారణ విగ్రహం గల ఆ గురువుగారు, నేను వస్తూండగా లేచి నించుని నన్ను కావలించుకున్నారు.

" 'స్వాగతం, స్వామీజీ,' అన్నారాయన ఆప్యాయంగా.

" 'అయ్యా, నేను స్వామిని కానండి,' అని ఒత్తి పలికాను.

" 'స్వామి అన్న బిరుదు ఎవరికి ఇమ్మని దైవపరంగా నాకు ఆదేశం వచ్చిందో వాళ్ళు దాన్ని పరిత్యజించరు.' ఆయన నాతో సౌమ్యంగానే మాట్లాడారు కాని, ఆయన మాటల్లో గాఢమైన సత్యనిష్ఠ ధ్వనించింది. తక్షణమే ఒకానొక ఆధ్యాత్మిక ఆశీర్వాద తరంగం నన్ను ముంచెత్తేసింది. సనాతన సన్యాసాశ్రమ స్థాయికి* హఠాత్తుగా నన్ను పెంచినందుకు చిరునవ్వు నవ్వుతూ, ఆ విధంగా

---

* ఉత్తరోత్తరా శ్రీయుక్తేశ్వర్‌గారికి, బుద్ధగయలోని మహంతుగారు అనుష్ఠానికంగా సన్యాస దీక్ష ఇచ్చారు.

నన్ను గౌరవించి, మానవరూపంలో ఉన్న మహామహులుగా, దేవదూతసదృశులుగా స్పష్టమవుతున్న ఆయన పాదాలకు ప్రణామం చేశాను.

" 'బాబాజీ - నిజంగా బాబాజీయే - చెట్టుకింద తమకు దగ్గరగా ఉన్న ఒక ఆసనం నాకు చూపించారు. ఆయన బలిష్ఠంగా, పడుచు వయస్సులో ఉన్నవారు; లాహిరీ మహాశయుల్ని పోలి ఉన్నారు. ఈ మహానుభావులిద్దరి రూపురేకల్లోనూ ఉండే అసాధారణమైన పోలికల్ని గురించి అంతకుముందు నేను తరచుగా వినే ఉన్నప్పటికీ అప్పుడా పోలిక నాకు తట్టలేదు. ఒక వ్యక్తి మనస్సులో ఏ నిర్దిష్ట భావమైనా తల ఎత్తకుండా నిరోధించే శక్తి బాబాజీకి ఉంది. ఆయన్ని నేను గుర్తు పట్టి భయభక్తుల్లో మునిగిపోకుండా, తమ సమక్షంలో పూర్తిగా సహజంగా ఉండాలని మహాగురువులు ఆశించారని స్పష్టమవుతోంది.

" 'కుంభమేళా గురించి ఏ మనుకుంటున్నావు?'

" 'స్వామీ, నాకు చాలా నిరాశ కలిగిందండి, -' అని చెప్పి, చటుక్కున ఇంకా ఇలా అన్నాను, 'మిమ్మల్ని కలుసుకునేటంత వరకు. ఏమిటో కాని సాధువులకీ ఈ సంక్షోభానికీ పొత్తు కుదిరినట్టు కనిపించడం లేదండి.'

" 'బాబూ,' అంటూ ప్రారంభించారు ఆ మహాగురువులు - ఆయన వయస్సుకు నేను దాదాపు రెట్టింపు వయస్సులో ఉన్నట్టు పైకి కనిపిస్తున్నప్పటికీ ఎక్కువమందిలో తప్పులున్నాయి కదాని అందరూ చెడ్డవాళ్ళు అని తీర్పు చెప్పకూడదు. ఇసుకా పంచదారల మిశ్రమంవలె ఈ భూమిమీద ఉన్న ప్రతీదీ మిశ్రమ స్వభావం కలిగినదే. పంచదార మాత్రమే తీసుకుని ఇసుకను ముట్టకుండా వదిలేసే తెలివైన చీమ మాదిరిగా ఉండు. ఇక్కడున్న చాలామంది సాధువులు మాయలో సంచరిస్తున్నప్పటికీ, దైవ సాక్షాత్కారానుభూతి గల కొద్ది మందివల్ల ఈ మేళా పునీతమయింది.'

"ఈ మహాగురువులతో నాకు సమాగమం జరిగినందువల్ల నేను త్వరగానే ఆయన అభిప్రాయంతో ఏకీభవించాను.

" 'అయ్యా, దూరాన ఉన్న యూరప్‌లోనూ అమెరికాలోనూ నివసిస్తూ వివిధ మతధర్మాల్ని అనుసరిస్తూ, ఇప్పటి మేళా లాంటివాటి నిజమైన విలువలు ఎరక్క, ఇక్కడ కూడిన చాలామంది కంటె తెలివిలో చాలా గొప్పవాళ్ళయిన ప్రముఖ పాశ్చాత్య విజ్ఞానశాస్త్రవేత్తల్ని గురించి నేను ఇంతవరకు ఆలోచిస్తూ ఉన్నానండి. భారతదేశపు సద్గురువులతో సమావేశాలవల్ల ఎక్కువగా లాభం

పొందగలవాళ్ళు వీళ్ళు. కాని భౌతిక విజయాల్లో ఉన్నతులే అయినప్పటికీ, చాలామంది పాశ్చాత్యులు, కఠోరమైన భౌతికవాదానికి కట్టుబడిపోయినవాళ్ళు. విజ్ఞానశాస్త్రంలోనూ తత్త్వశాస్త్రంలోనూ ప్రసిద్ధులైన ఇతరులు, మతంలోఉన్న సారభూతమైన ఏకత్వాన్ని గుర్తించరు. వాళ్ళ మతసిద్ధాంతాలు దాటశక్యంకాని అవరోధాలై, వాళ్ళని శాశ్వతంగా మననుంచి వేరు చేస్తున్నాయి.'

" 'పాశ్చాత్య ప్రపంచం గురించీ, ప్రాచ్య ప్రపంచం గురించీ కూడా నీకు ఆసక్తి ఉండడం గమనించాను.' బాబాజీ ముఖం, ఆమోదంతో వెలుగొందింది. 'నీ హృదయవేదన నేను అర్థం చేసుకున్నాను: విశాలమైన నీ గుండెలో మానవు లందరికీ చోటు ఉంది. అందుకే నిన్నిక్కడికి పిలిపించాను.'

" 'తూర్పు పడమర దేశాలు, కార్యకలాపాల్నీ ఆధ్యాత్మికతనూ మేళవించిన చక్కని మధ్యేమార్గాన్ని ఏర్పరచుకోవాలి,' అంటూ ఇంకా చెప్పారు బాబాజీ. 'భౌతిక అభివృద్ధి విషయంలో పడమటి దేశాలనుంచి భారతదేశం నేర్చుకోవలసింది చాలా ఉంది; దానికి బదులుగా, పడమటి దేశాలు తమ మత విశ్వాసాలకు యోగశాస్త్రీయమైన గట్టి పునాదులు ఏర్పరచుకోడానికి తోడ్పడే విశ్వజనీన పద్ధతుల్ని భారతదేశం నేర్పగలదు.

" 'స్వామీజీ, ప్రాచ్య పాశ్చాత్య ప్రపంచాల మధ్య ముందుముందు జరగ బోయే, సామరస్య పూర్వకమైన వినిమయంలో మీరు నిర్వహించ వలసిన పాత్ర ఒకటి ఉంది. మరి కొన్నేళ్ళకి, నేను మీ దగ్గరికి ఒక శిష్యుణ్ణి పంపుతాను; పాశ్చాత్య ప్రపంచంలో యోగవిద్యా వ్యాపనానికి మీరతన్ని తర్ఫీదు చెయ్యగలరు. ఆధ్యాత్మి కంగా అన్వేషణ సాగిస్తున్న, అక్కడి అనేక ఆత్మల ప్రకంపనలు వరదలా నా దగ్గరికి వస్తూంటాయి. అమెరికాలోనూ యూరప్‌లోనూ, జాగృతి పొందడానికి ఎదురుచూస్తున్న భవిష్యత్ సాధువుల్ని నేను చూస్తూ ఉన్నాను.' "

తమ కథనంలో ఈ అంశం దగ్గిర, శ్రీయుక్తేశ్వర్‌గారు, తమ దృష్టి పూర్తిగా నా మీద కేంద్రీకరించారు.

" 'నాయనా, అనేక సంవత్సరాలకు పూర్వమే, నా దగ్గరికి పంపుతానని బాబాజీ మాట ఇచ్చిన శిష్యుడివి నువ్వే," అన్నారు గురుదేవులు, పండు వెన్నెట్లో చిరునవ్వు చిందిస్తూ.

బాబాజీయే నాకు, శ్రీయుక్తేశ్వర్‌గారి సన్నిధికి దారి చూపించి నడిపించారని తెలిసి సంతోషించాను; అయినా నా గురువర్యులకూ నిరాడంబర ఆశ్రమ ప్రశాంతికీ

దూరంగా, ఎక్కడో దూరాన ఉన్న పాశ్చాత్య ప్రపంచంలో నా ఉనికిని ఊహించు కోడం నాకు కష్టమయింది.

"తరవాత బాబాజీ, భగవద్గీత గురించి మాట్లాడారు," అంటూ చెప్పసాగారు. శ్రీయుక్తేశ్వర్‌గారు. "గీతలో చాలా అధ్యాయాలకి నేను వ్యాఖ్యలు రాశానన్న సంగతి తమకి తెలుసునన్నట్టుగా, మెచ్చుకుంటూ కొన్ని మాటల్లో ఆయన సూచించడంతో ఆశ్చర్య చకితుణ్ణి అయాను.

" 'నా కోరిక మన్నించి, స్వామీజీ, మీరు మరో పని చేపట్టండి,' అన్నారు మహాగురువులు. క్రైస్తవ, హిందూ పవిత్ర గ్రంథాలకి మూలభూతంగా ఉన్న సమరస తను గురించి మీరో చిన్న పుస్తకం రాయరూ? ఉత్ప్రేరితులైన దైవ పుత్రులు అవే సత్యాల్ని ప్రవచించారనీ, మానవుల పాక్షిక భేదాలవల్ల వాటి ఏకత్వం ఇప్పుడు మరుగుపడిపోయిందనీ, సమానార్థక గ్రంథభాగాలు ఉదాహరిస్తూ నిరూపించండి.'

" 'మహారాజ్, ఎటువంటి ఆజ్ఞ! దాన్ని నెరవేర్చగలనా నేను?' అంటూ సంకోచపడుతూ సమాధానమిచ్చాను.

"బాబాజీ మృదువుగా నవ్వారు. 'నాయనా, నువ్వెందుకు సందేహిస్తావు?' అంటూ నాకు నమ్మకం కలిగించేలా అన్నారు. 'నిజానికి ఇదంతా ఎవరి పని? ఈ పనులన్నీ చేసేవాడు ఎవరు? ఈశ్వరుడు నా చేత ఏది చెప్పిస్తే అది సత్యమై తీరక తప్పదు.'

"ఆ సాధువు ఆశీస్సులవల్ల నేను ఆ శక్తి పొందినట్లు భావించి, ఆ పుస్తకం రాయడానికి ఒప్పుకున్నాను. నేను సెలవు తీసుకోవలసిన సమయం వచ్చిందని అనిపించి, మనస్సు ఒప్పకపోయినా, నా పత్రాసనం మీంచి లేచాను.

" 'నీకు లాహిరీ తెలుసా?' అని అడిగారు, మహాగురువులు. 'అతను మహాత్ముడు కదూ? మనం కలుసుకున్న సంగతి అతనికి చెప్పు.' ఆ తరవాత లాహిరీ మహాశయులకు అందించవలసిన వర్తమానం నాకు చెప్పారు.

"వీడుకోలుగా, నేను సవినయంగా వంగి నమస్కారం చేసిన తరవాత ఆ సాధువు, ప్రసన్నంగా చిరునవ్వు నవ్వారు. 'నీ పుస్తకం పూర్తి అయిన తరవాత నిన్నోసారి చూడ్డానికి వస్తాను,' అని మాట ఇచ్చారు. 'ప్రస్తుతానికి సెలవు.'

"ఆ మర్నాడు నేను కాశీ వెళ్ళడానికి రైలు ఎక్కాను. మా గురుదేవుల నివాసానికి చేరి, కుంభమేళాలో కనిపించిన అద్భుతయోగి కథ అంతా ఏకరువు పెట్టాను.

" 'అయ్యో, ఆయన్ని గుర్తుపట్టలేదా నువ్వు?' లాహిరీ మహాశయుల కళ్ళు నవ్వుతో నాట్యమాడుతున్నాయి. 'నువ్వు గుర్తుపట్టలేకపోయావని తెలుస్తోంది; అందుకాయన అడ్డుపెట్టారు నిన్ను. ఆయన అసదృశులయిన నా గురుదేవులు; దైవస్వరూపులైన బాబాజీ!'

" 'బాబాజీ!' అంటూ మారుపలికాను, ఆశ్చర్యచకితుణ్ణి అయి. యోగీశ్వరులు బాబాజీ! దృశ్యాదృశ్య రక్షకులు బాబాజీ! అయ్యో, గతాన్ని మళ్ళీ వెనక్కి రప్పించి ఆయన పాదపద్మాలకు భక్తితో మొక్కడానికి మళ్ళీ మరోసారి ఆయన సన్నిధిలో ఉండగలిగితే ఎంత బాగుండును!'

" 'ఫరవాలేదు,' అంటూ ఊరడింపుగా అన్నారు లాహిరీ మహాశయులు. 'నిన్ను మళ్ళీ చూస్తానని ఆయన మాట ఇచ్చారు.'

" 'గురుదేవా, దైవతుల్యులైన ఆ గురువులు మీకో వర్తమానం అందించమని చెప్పారు నాకు. "లాహిరీకి చెప్పు: ఈ జన్మకోసం నిలవచేసి ఉంచిన శక్తి ఇప్పుడు చాలా తక్కువ స్థాయిలో ప్రవహిస్తూ ఉంది; అది దాదాపు అయి పోయినట్టే." '

"గూఢార్థం గల ఈ మాటలు నేను అనీ అనడంతోటే లాహిరీ మహాశయుల విగ్రహం, పిడుగువచ్చి మీద పడ్డట్టుగా కంపించిపోయింది. ఒక్క లిప్తలో అంతా నిశ్శబ్దమైపోయింది; చిరునవ్వు చిందే ఆయన ముఖకవళిక ఊహించరానంత కఠినమైపోయింది. గంభీరంగా, నిశ్చలంగా కూర్చుని ఉన్న కొయ్యబొమ్మ మాదిరిగా, ఆయన దేహం వివర్ణమయింది. నేను భయభ్రాంతుణ్ణి అయాను. ఈ ఆనంద మూర్తి అంత ఆశ్చర్యకరమైన గాంభీర్యం ప్రదర్శించడం నా జీవితంలో అంతకు ముందెన్నడూ చూడలేదు. అక్కడున్న తక్కిన శిష్యులు భయం భయంగా చూశారు.

"మూడు గంటలు నిశ్శబ్దంగా గడిచిపోయాయి. అప్పుడు లాహిరీ మహాశయులు, తమకు సహజమైన ప్రసన్నతను తిరిగి పొంది, ప్రతి శిష్యుడితోటీ ఆప్యాయంగా మాట్లాడారు. ప్రతివారికీ మనస్సు తేలికపడింది.

"మా గురుదేవుల్లో వచ్చిన ఈ మార్పునుబట్టి, బాబాజీ సందేశం స్పష్టమైన ఒక సంకేతమనీ దాన్నిబట్టి లాహిరీ మహాశయులు తమ శరీరాన్ని త్వరలో విడిచి వెళ్ళిపోవలసి వస్తుందని తెలుసుకున్నారనీ నేను గ్రహించాను. గురుదేవులు తక్షణమే తమను తాము అదుపులో పెట్టుకుని, భౌతిక ప్రపంచంతో తమకు ముడిపడి ఉన్న చిట్టచివరి దారాన్ని తెంపుకొని చిరంతన పరమాత్మ తత్త్వంలోకి పలాయనం చేశారని ఆయన భీకర మౌనం నిరూపించింది. బాబాజీ సందేశం, ' నేను నీతో ఎప్పుడూ ఉంటాను' అని చెప్పడానికి ఆయన అనుసరించిన పద్ధతి.

"బాబాజీ, లాహిరీ మహాశయులూ సర్వజ్ఞులయినప్పటికీ నా ద్వారాకాని మరో మధ్యవర్తి ద్వారాకాని ఒకరికొకరు వర్తమానాలు పంపుకోవలసిన అవసరం లేవప్పటికీ ఆ మహానుభావులు, మానవ నాటకంలో ఒక పాత్ర నిర్వహించడానికి తరచుగా ఇతరులను అనుగ్రహిస్తూ ఉంటారు. అప్పుడప్పుడు తమ భావిదర్శనాల్ని మామూలు పద్ధతిలో వార్తావహుల ద్వారా తెలియజేస్తూ ఉంటారు; ఎందుకంటే, తమ మాటలు నెరవేరిన తరవాత, ఈ కథ వినే జనబాహుళ్యంలో ఇతోధికమైన దైవభక్తి కలిగించడానికి.

"త్వరలోనే నేను కాశీ నుంచి వచ్చేసి శ్రీరాంపూర్‌లో, బాబాజీ కోరిన పవిత్ర గ్రంథ రచనాకార్యక్రమానికి పూనుకొన్నాను," అంటూ ఇంకా చెప్పారు శ్రీయుక్తేశ్వర్ గారు. "నేను ఇలా పనికి పూనుకొన్నానో లేదో, ఆ అమర గురుదేవులకు అంకితంగా ఒక శ్లోకం రాయాలన్న ఉత్ప్రేరణ నాలో కలిగింది. అంతకు ముందెన్నడూ నేను సంస్కృత కవిత్వ రచనకు పూనుకోకపోయినప్పటికీ, మధురమైన పద్యపాదాలు అనాయాసంగా నా కలంలోంచి ప్రవహించసాగాయి.

"ప్రశాంత నిశీథ సమయంలో నేను, బైబిలునూ సనాతనధర్మ* శాస్త్ర గ్రంథాల్నీ సరిపోల్చి చూడడంలో నిమగ్నుణ్ణి అయాను. పావన మూర్తి ఏసు ప్రభువు వాక్కుల్నీ ఉదాహరిస్తూ, ఆయన ఉపదేశాలు వస్తుతః, వేదదర్శనాలతో ఏకీభవిస్తాయని నిరూపించాను. పరమగురువు†ల కృపవల్ల, ద **హోలీ సైన్స్** (కైవల్య దర్శనం)‡ అన్న నా పుస్తకం చాలా కొద్దికాలంలోనే పూర్తి అయింది.

"నా రచనా కార్యక్రమం ముగిసిన మర్నాడు పొద్దున, గంగలో స్నానం చెయ్యడానికి ఇక్కడ రాయ్‌ఘాట్ రేవుకు వెళ్ళాను," అంటూ చెప్పారు శ్రీయుక్తేశ్వర్

---

* అంటే, "శాశ్వతమైన మతం" అని అర్థం; వేదబోధల సమస్తానికి పెట్టిన పేరు ఇది అలెగ్జాండరు ఆధ్వర్యంలో పశ్చిమ భారతదేశం మీద దండెత్తిన గ్రీకులు సింధు (Indus) నదీ తీరాన ఉన్న ప్రజలను 'ఇండూస్' లేక 'హిందూస్' అని పిలిచినప్పటి నించీ 'సనాతన ధర్మం' హిందూమతంగా ప్రాచుర్యంలోకి వచ్చింది.

† 'పరమగురు' శబ్దం ఒకని గురువుయొక్క గురువుని సూచిస్తుంది ఆ విధంగా లాహిరీ మహాశయుల గురువైన మహావతార్ బాబాజీ శ్రీయుక్తేశ్వరులకి పరమగురువు.

విశ్వాసంతో క్రియాసాధన చేసే వై.ఎస్.ఎస్., ఎస్.ఆర్.ఎఫ్. సభ్యులందరి యొక్క ఆధ్యాత్మికాభివృద్ధికి బాధ్యత వహించే భారతీయ గురుపరంపరలో అత్యున్నత గురువు మహావతార్ బాబాజీ.

‡ భారతదేశంలో ఝార్ఖండ్ రాష్ట్రంలోని రాంచీలో ఉన్న యోగదా సత్సంగ సొసైటీ వారు దీన్ని ప్రచురించారు.

గారు. "రేవు నిర్మానుష్యంగా ఉంది; వెచ్చవెచ్చని ఎండలో ప్రశాంతిని అనుభవిస్తూ కొద్దిసేపు నిలకడగా ఉండిపోయాను. తళతళలాడే నీళ్ళలో ఒక్క మునుగు మునిగి ఇంటికి బయలుదేరాను. ఆ నిశ్శబ్దంలో వినవస్తున్న శబ్దమల్లా, నేను అడుగుతీసి అడుగువేస్తున్నప్పుడు, గంగలో తడిసిన బట్ట రెపరెపలాడుతూ చేస్తున్న చప్పుడే. ఏటి ఒడ్డున విశాలమైన పెద్ద మర్రిచెట్టున్న తావు దాటి కొంచెం వెళ్ళేసరికి, ఎందుకో వెనక్కి తిరిగి చూడాలన్న గట్టి ఊపు ఒకటి వచ్చింది. అక్కడ, మర్రిచెట్టు నీడన, కొద్దిమంది శిష్యుల నడుమ కూర్చుని ఉన్నారు మహామహులు బాబాజీ!

" 'అభినందనలు, స్వామీజీ!' నేను కలగనడం లేదని నమ్మకం కలిగించడానికి, మహాగురువుల కంఠస్వరం మధురంగా ధ్వనించింది. 'మీ పుస్తక రచన విజయవంతంగా ముగించడం గమనించాను. మీకు మాట ఇచ్చిన ప్రకారం, మీకు ధన్యవాదాలు చెప్పడానికి ఇక్కడున్నాను.'

"దడదడలాడుతున్న గుండెతో, ఆయన పాదాలముందు సాగిలపడ్డాను. పరమగురూజీ, మీరూ మీ శిష్యులూ, దగ్గరిలో ఉన్న మా ఇంటిని పావనం చెయ్యరూ?' అంటూ ప్రాధేయపూర్వకంగా విన్నవించుకున్నాను.

"పరమ గురువులు చిరునవ్వుతో నిరాకరించారు. 'వద్దు, నాయనా, చెట్ల నీడంటే ఇష్టపడే మనుషులం మేము; ఈ చోటు చక్కగా సుఖంగా ఉంది.'

" 'కాస్సేపు ఉండండి.' అంటూ ప్రాధేయపూర్వకంగా ఆయన వేపు చూశాను. 'కొన్ని ప్రత్యేకమైన మిఠాయిలు తీసుకుని చటుక్కున వచ్చా వస్తాను.'*

"కొద్ది నిమిషాల్లో నేను ఫలహారాల పళ్ళెంతో తిరిగి వచ్చేసరికి, విశాల వటవృక్షం నీడన ఆ దివ్యస్వరూపుల బృందం లేదు. రేవు చుట్టుపక్కలంతా గాలించాను; కాని ఆ సాధుబృందం గాలిరెక్కల మీద అదివరకే ఎగిరి పోయిందని నా హృదయానికి తెలుసు.

"నా మనసు తీవ్రంగా గాయపడింది. 'మళ్ళీ మేం కలుసుకున్నా కూడా, నేను బాబాజీతో మాటే ఆడను' అనుకున్నాను మనసులో. 'అంత హఠాత్తుగా ఆయన వెళ్ళిపోయి, నా మీద నిర్దయ చూపించారు.' నిజంగా ఇది ప్రణయ కోపం; అంతకిమించి మరేమీ లేదు. "మరి కొన్ని నెల్లకి నేను కాశీలో లాహిరీ మహాశయుల్ని దర్శించాను. నేను గదిలోకి ప్రవేశించగానే, మా గురువులు, పలకరింపుగా చిరునవ్వు నవ్వారు.

---

* గురువుల దర్శనం చేసుకున్నప్పుడు ఫలహారాలు సమర్పించకపోవడం భారత దేశంలో ఆయన్ని అగౌరవపరచడం కింద లెక్కకు వస్తుంది.

" 'రావయ్యా, యుక్తేశ్వర్' అన్నారాయన. 'నా గది గుమ్మంలో నువ్వు బాబాజీని చూశావా?'

" 'లేదండి' అని జవాబిచ్చాను, ఆశ్చర్యంగా.

" 'ఇలా రా.' లాహిరీ మహాశయులు, నా నుదుటిని మెల్లగా స్పృశించారు; వెంటనే చూశాను, తలుపు దగ్గర, ప్రఫుల్ల పద్మ సదృశులైన బాబాజీ సుందర రూపాన్ని.

"నా మనస్సుకు తగిలిన వెనకటి గాయం గుర్తుకు వచ్చింది; నేను ప్రణామం చెయ్యలేదు. లాహిరీ మహాశయులు ఆశ్చర్యచకితులై చూశారు నావేపు.

"అగాధమైన కళ్ళతో నా వేపే చూస్తున్నారు దివ్యగురువులు. 'నా మీద కోపంగా ఉంది నీకు.'

"ఔనండి, ఎందుకుండగూడదు?' అని జవాబిచ్చాను. 'గాలిలోంచి వచ్చారు మీ గారడివాళ్ళ జట్టుతో; ఆ పల్చటి గాలిలోకే మళ్ళీ మాయమయారు.'

" 'నేను నిన్ను చూస్తాననే చెప్పాను కాని, ఎంతసేపుంటానో చెప్పలేదు బాబాజీ మృదువుగా నవ్వారు. 'నువ్వు ఉత్సాహాతిరేకంలో ఉన్నావు. నీ అశాంతి గాలిదుమారంలోనే నేను ఎగిరిపోయానని నీకు నమ్మకంగా చెప్పదలుచుకున్నాను.'

"పొగడ్తలేని ఈ సంజాయిషీతో తక్షణమే తృప్తిపడ్డాను నేను. ఆయన పాదాలకు ప్రణామం చేశాను; ఆ పరమగురువులు దయతో నా భుజం తట్టారు

" 'అబ్బాయి, నువ్వింకా ఎక్కువగా ధ్యానం చెయ్యాలి," అన్నారాయన. 'నీ చూపు ఇంకా లోపరహితం కాలేదు - సూర్యకాంతికి మరుగున ఉన్న నన్ను చూడలేకపోయావు నువ్వు.' దివ్య వేణునాదం వంటి స్వరంతో ఈ మాటలు పలికి మరుగయి ఉన్న వెలుతురులోకి మాయమయ్యారు బాబాజీ.

"నా కడపటి కాశీ సందర్శనల్లో ఇది ఒకటి," అని ముగించారు శ్రీయుక్తేశ్వర్‌గారు. "కుంభమేళాలో బాబాజీ జోస్యం చెప్పినట్టుగానే, లాహిరీ మహాశయుల గృహస్థ అవతారం ముగింపుకి దగ్గర పడింది. 1895 వేసవిలో ఆయన దృఢ కాయానికి, వీపుమీద ఒక చిన్న కురుపు వేసింది. కురుపు కొయ్యడానికి ఆయన అడ్డుపెట్టారు; తమ శిష్యుల్లో కొందరి దుష్కర్మను తమ శరీరంలో అనుభవించి దాన్ని నశింపు చేస్తున్నారు. చివరికి కొందరు శిష్యులు పట్టుపట్టారు; దానికి ఆయన గూఢంగా జవాబు ఇచ్చారు:

" 'ఈ దేహం తాను పోవడానికి ఒక కారణం చూసుకోవాలి; మీరు ఏం



1935 డిసెంబరులో స్వామి శ్రీ యుక్తేశ్వర్ గారు జరిపిన చివరి సంక్రమణ ఉత్సవం
శ్రీ యోగానందగారు శ్రీరాంపూర్ ఆశ్రమ ఆవరణలో తమ గురుదేవుల ప్రక్కన (మధ్యలో) బల్ల దగ్గర కూర్చున్నారు.



శ్రీ శ్రీయుక్తేశ్వర్ గారు, శ్రీశ్రీ యోగానందగారు
ఒక ధార్మిక శోభాయాత్ర (ఊరేగింపు)లో, కలకత్తా, 1935



స్వామి కేశవానంద, శ్రీశ్రీ యోగానందగారు, రిచర్డ్ రైట్, కేశవానంద స్వామి ఆశ్రమంలో, బృందావనం, 1936



స్వామి శ్రీ శ్రీయుక్తేశ్వర్ సమాధి మందిరం, పూరి



శ్రీశ్రీ యోగానందగారు (మధ్యలో కూర్చున్నవారు)
శ్రీ యుక్తేశ్వర్‌గారితో (కుడివైపు నిలబడినవారు) శ్రీరాంపూర్ ఆశ్రమం 1935



**శాంకరిమాయి జియు,** త్రైలింగస్వామి యొక్క జీవించి ఉన్న ఏకైక శిష్యురాలు 1938 హరిద్వార్ కుంభమేళాలో - అప్పుడు ఈ యోగినికి 112 ఏళ్ళ వయస్సు (పే 366 చూడండి)



**పంచానన్ భట్టాచార్య**
శ్రీశ్రీ లాహిరీ మహాశయుల శిష్యులు



**స్వామి కృష్ణానంద,** 1936 అలహాబాదు కుంభమేళాలో ఆయన వద్ద మనోహరంగా ఓంకార నాదం చెయ్యడం నేర్చుకున్న శాకాహారి ఆడసింహంతో



స్వామి దయానంద, యోగానంద
మహామండలాశ్రమం, వారణాసి, ఫిబ్రవరి 7, 1936



రమణ మహర్షి, శ్రీశ్రీయోగానందగారు
శ్రీ రమణుల యొక్క అరుణాచల ఆశ్రమంలో



గిరిబాల
"నిరాహార యోగిని"



థెరిసా నాయ్‌మన్, పి.ఆర్.రైట్, శ్రీశ్రీ యోగానందగారు
ఐక్‌స్టాట్, బవేరియా, 1935



**మహాత్మాగాంధీ ఆశ్రమంలో, వార్ధాలో**

అంతకు ముందే గాంధీగారు రాసిన చీటీ (ఆ రోజు సోమవారం, మహాత్ములు మౌనం పాటించేరోజు) శ్రీ యోగానందగారు చదువుతున్నారు. 1935 ఆగస్టు 27వ శ్రీ యోగానందగారు గాంధీగారికి క్రియాయోగ దీక్ష ఇచ్చారు.



శ్రీశ్రీ ఆనందమయి మాత, ఆమె భర్త భోలానాథ్‌తో శ్రీశ్రీ యోగానందగారు

కలకత్తా, 1935



దక్షిణేశ్వర్‌లో గంగానది ఒడ్డున యోగదామఠం

వై.ఎస్.ఎస్. రిజిస్టర్డు కార్యాలయం, 1939లో శ్రీశ్రీ యోగానందగారిచే స్థాపించబడింది



పసిఫిక్ సముద్రతీరాన ఎన్సినీటస్ సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ ఆశ్రమం
విహంగ వీక్షణం





సెల్ఫ్-రియలైజేషన్ ఫెలోషిప్ 'సరోవరాలయం' మరియు గాంధి స్మారక ప్రపంచ శాంతి చిహ్నం,
పసిఫిక్ పాలిసేడ్స్, లాస్ ఏంజిలిస్, కాలిఫోర్నియా



శ్రీ శ్రీ రాజర్షి జనకానంద
(జేమ్స్ జె.లిన్) (1892-1955)
వై.ఎస్.ఎస్. / ఎస్.ఆర్.ఎఫ్. రెండవ అధ్యక్షులు



శ్రీ శ్రీ దయామాత

రాంచీలో

వై.ఎస్.ఎస్. / ఎస్ ఆర్.ఎఫ్. మూడవ అధ్యక్షులు



**శ్రీ శంకరాచార్య,** వై ఎస్.ఎస్/ఎస్ ఆర్.ఎఫ్ అంతర్జాతీయ కేంద్ర కార్యస్థానంలో పూరీ పీఠాధిపతి శ్రీ జగద్గురు శంకరాచార్య భారతీకృష్ణ తీర్థులవారు 1958లో లాస్ ఏంజిలిస్‌లోని ఎస్.ఆర్ ఎఫ్. అంతర్జాతీయ కేంద్ర కార్యస్థానాన్ని సందర్శించారు. వారి మూడునెలల అమెరికా పర్యటనను యోగదా సత్సంగ సొసైటీ / సెల్ఫ్-రియలైజేషన్ ఫెలోషిప్‌వారు ఏర్పాటు చేశారు



**శ్రీశ్రీపరమహంస యోగానందగారు భారత రాయబారికి స్వాగతమియ్యటం**

అమెరికాలోని భారత రాయబారి శ్రీ వినయరంజన్‌సేన్, లాస్ ఏంజిలిస్‌లోని సెల్ఫ్ రియలైజేషన్ కేంద్ర కార్యస్థానంలో శ్రీ యోగానందగారితో, 1952 మార్చి 4న - ఆ మహాయోగి మహాసమాధికి మూడు రోజులముందు. మార్చి 11న అంత్యక్రియల సందర్భంగా రాయబారి సేన్ ఇలా ప్రశంసించారు : "ఐక్యరాజ్యసమితిలో ఈనాడు పరమహంస యోగానందగారి వంటి వ్యక్తి ఒకరు ఉండి ఉంటే ప్రపంచం బహుశా ఇప్పటికంటె బాగా ఉండేదనుకుంటాను. నాకు తెలిసినంత వరకు భారత, అమెరికా ప్రజల్ని కలపడానికి వీరికంటె ఎక్కువగా కృషి చేసినవారు, ఎక్కువగా తమను అర్పించుకున్నవారు మరొకరు లేరు."



**శ్రీశ్రీ పరమహంస యోగానంద - "చివరి చిరునవ్వు"**

వీరి మహాసమాధికి ఒక గంట ముందు తీసిన ఫొటో: భారత రాయబారి వినయ్ రంజన్‌సేన్ గారి గౌరవార్థం కాలిఫోర్నియాలోని లాస్ ఏంజిలిస్‌లో 1952 మార్చి 7న ఏర్పాటైన విందులో తీసింది. ప్రేమమయమైన ఒక చిరునవ్వును ఫొటోగ్రాఫరు ఇక్కడ పట్టుకున్నాడు ఈ చిరునవ్వు శ్రీ యోగానందగారి లక్షలాది స్నేహితుల్లో విద్యార్థుల్లో శిష్యుల్లో ప్రతి ఒక్కరికీ వీడుకోలు దీవెనలా కన్పిస్తుంది. అప్పటికే అనంతంలోకి చూపుసారిస్తున్న కళ్లలో మానవ అనురక్తి, అవగాహన నిండి ఉన్నాయి.

సాటిలేని ఈ దైవభక్తుణ్ణి నాశనం చేసేశక్తి మృత్యువుకు లేకపోయింది. వీరి దేహంలో ఒక అద్భుతమైన మార్పులేని స్థితి ప్రకటితమైంది (చూ పే. 611).

వెయ్యదలుచుకున్నా నేను ఒప్పుకుంటాను.'

"కొద్ది కాలంలో, ఆ అసదృశ గురుదేవులు కాశీలో తనువు చాలించారు. ఆయన కోసం నేనిక ఆయన చిన్న గదికి వెళ్ళక్కరలేదు. నా జీవితంలో ప్రతి రోజూ ఆయన సర్వోపగత మార్గదర్శిత్వంతో ధన్యమవుతోంది."

చాలా ఏళ్ళ తరవాత, లాహిరీ మహాశయుల నిర్యాణాన్ని గురించి అద్భుతమైన వివరాలు అనేకం, ఉన్నత స్థితి నందుకొన్న, స్వామి కేశవానంద* అనే శిష్యుల నోటి మీదగా విన్నాను.

"మా గురుదేవులు శరీరాన్ని విడిచిపెట్టడానికి కొన్నాళ్ళముందు, నేను హరిద్వారంలో నా ఆశ్రమంలో కూర్చుని ఉండగా, నా ఎదుట ఆయన సాక్షాత్కరించారు.

" 'వెంటనే కాశీకి రా.' ఈ మాటలతో లాహిరీ మహాశయులు అదృశ్యమయారు.

" 'వెంటనే నేను రైలెక్కి కాశీకి బయలుదేరాను. మా గురుదేవుల ఇంట్లో చాలామంది శిష్యులు చేరి ఉన్నారు. ఆ రోజున† గురుదేవులు కొన్ని గంటల పాటు గీతను వ్యాఖ్యానిస్తూ ఉపన్యసించారు; ఆ తరవాత మాతో టూకీగా ఇలా అన్నారు :

" 'నేను ఇంటికి వెళ్ళిపోతున్నాను.'

"మాలో దుఃఖం కట్టలు తెంచుకుని వచ్చింది; వెక్కివెక్కి ఏడిచాం.

" 'కుదుటపడండి. నేను మళ్ళీ లేచి వస్తాను.' ఈ ముక్క అన్న తరవాత లాహిరీ మహాశయులు తమ ఆసనంమీంచి లేచారు; తమ శరీరాన్ని గుండ్రంగా మూడుసార్లు తిప్పారు; ఉత్తరంవేపు తిరిగి పద్మాసనం వేసుకున్నారు; అద్భుతంగా, మహాసమాధి‡లోకి వెళ్ళిపోయారు.

---

* నేను కేశవానందగారి ఆశ్రమాన్ని సందర్శించిన సందర్భం 505-06 పేజీల్లో వివరించడం జరిగింది.

† లాహిరీ మహాశయులు దేహత్యాగం చేసిన రోజు 26 సెప్టెంబరు 1895. మరి కొన్నాళ్ళలో ఆయనకి అరవై ఏడో ఏడు వచ్చేది.

‡ శరీరాన్ని మూడుసార్లు గుండ్రంగా తిప్పడం, ఉత్తరాభిముఖం కావడం వైదిక కర్మకాండలో భాగాలు; తమ భౌతిక కాయానికి అంతిమ ఘడియ ఎప్పుడు వస్తుందో ముందుగా తెలిసిన మహాగురువులు ఇలా చేస్తారు. చివరి ధ్యానంలో మహాగురువులు, ఓంకార విశ్వనాదంలో లయమవుతారు; ఈ చివరి ధ్యానాన్నే 'మహాసమాధి' అంటారు.

"భక్తుల కెంతో ప్రియమైన, లాహిరీ మహాశయుల సుందరదేహాన్ని గృహస్థోచితమైన కర్మకాండతో, పావన గంగాతీరాన మణికర్ణికా ఘట్టంలో దహనం చేశారు," అంటూ చెప్పారు కేశవానందగారు. "ఆ మర్నాడు పొద్దున పది గంటలకు, నేనింకా కాశీలోనే ఉండగా, నా గది ఒక మహత్తరమైన కాంతితో కమ్ముకుపోయింది ఆహా! లాహిరీ మహాశయుల రూపం, రక్తమాంసాలు నిండిన శరీరంతో నా ఎదురుగా నిలబడి ఉంది. అది అచ్చం, ఆయన వెనకటి శరీరంలాగే ఉంది కాని, దానికన్న ఇది తక్కువ వయస్సులో ఉన్నట్టూ దానికన్న తేజో వంతంగానూ ఉంది. గురుదేవులు నాతో మాట్లాడారు.

" 'కేశవానందా, నేనే. దహనమయిన నా శరీరం తాలూకు విఘటిత పరమాణువుల నుంచి నా రూపాన్ని కొత్త నమూనాగా సృష్టించి పునరుత్థానం కావించాను. గృహస్థుగా ఈ ప్రపంచంలో నా పని పూర్తి అయింది. కాని నే నీ భూమిని పూర్తిగా విడిచిపోను. ఇకనుంచి, బాబాజీతో హిమాలయాల్లో కొంతకాలం గడుపుతాను; ఆ తరవాత బాబాజీతో బ్రహ్మాండంలో.'

"ఆశీఃపురస్సరంగా నాతో కొన్ని మాటలు పలికి అంతర్ధాన మయారు, లోకాతీత గురుదేవులు. అద్భుతమైన ఉత్తేజంతో నిండిపోయింది నా గుండె క్రీస్తు, కబీర్*ల శిష్యులు, తమ గురుదేవుల్ని, వారి భౌతిక మరణానంతరం

---

* కబీరు, పదహారో శతాబ్దినాటి గొప్ప సాధువు. ఆయన అసంఖ్యాక శిష్యుల్లో హిందువులూ ముస్లిములూ ఉండేవారు. కబీరు నిర్యాణానంతరం ఆయన శిష్యులు, ఆయనకు అంత్యక్రియలు జరపవలసిన విధానం గురించి తగువులాడుకున్నారు. దానికి ఆగ్రహం కలిగిన ఆ గురువు, దీర్ఘనిద్రనుంచి లేచి, వాళ్లకి ఆదేశాలిచ్చాడు. "నా అవశేషాల్లో సగం ముస్లిం విధి ప్రకారం పాతిపెట్టండి " అన్నాడాయన. "మిగిలిన సగం హిందూ సంస్కారాన్నిబట్టి దహనం చెయ్యండి." తరవాత అదృశ్యమయాడు. అప్పుడు శిష్యులు, ఆయన శవంమీద కప్పిన గుడ్డ తీసేసరికి అక్కడ, అందమైన పూలబారు ఒకటి తప్ప ఇంకేమీ కనిపించలేదు. వాటిలో సగం తీసుకుని ముస్లిములు, మగ్హర్‌లో భక్తి శ్రద్ధలతో సమాధిచేశారు; వాళ్ళు ఇప్పటికీ ఆ సమాధికి మొక్కుతూ ఉంటారు. తక్కిన సగం, హిందూ సంస్కారానుసారంగా కాశీలో దహనం చేశారు ఆ స్థలంలో 'కబీర్ చ్యూరా' అనే మందిరాన్ని కట్టారు. భక్తులు వేలాదిగా దాన్ని దర్శిస్తారు.

కబీరు పడుచు వయస్సులో ఉండగా, మార్మిక మార్గంలో సూక్ష్మమైన జ్ఞానోపదేశం కావాలని కోరుతూ ఇద్దరు శిష్యులు ఆయన దగ్గరికి వచ్చారు. వాళ్ళకి ఆ గురువు టూకీగా ఇలా జవాబిచ్చాడు:

"కోఈ కహత్ దూరీ హై యహ్ కీ దూరక్ బాత్ నిరాసీ,
సో తేరో మన్ మోహీ విరాజే అమర్ పురుష్ అవినాసీ,
మోహిం సుని - సుని ఆవే హాసీ,
పానీ మే మీన్ పియాసీ."

సజీవరూపంలో దర్శించినప్పుడు ఎటువంటి ఆత్మోన్నతి అనుభూతమయిందో నాకూ అటువంటిదే అనుభూతమయింది.

"హరిద్వారంలో ఉన్న నా ఏకాంత ఆశ్రమానికి నేను తిరిగి వెళ్ళినప్పుడు, లాహిరీ మహాశయుల పవిత్ర చితాభస్మంలో కొంతభాగం కూడా తీసుకుని వెళ్ళాను. నాకు తెలుసు, దేశకాలావధులు గల పంజరంలోంచి ఆయన తప్పించుకు పోయారని, సర్వవ్యాపకతా విహంగం విముక్తమయిందని. అయినా, ఆయన చితాభస్మానికి సమాధి కట్టించడం నా మనసుకు ఊరట కలిగించింది," అంటూ చెప్పుకొచ్చారు కేశవానందగారు.

పునరుత్థానం చెందిన గురుదేవుల్ని దర్శించే భాగ్యం పొందిన మరో శిష్యులు, సాధుప్రవృత్తిగల పంచానన్ భట్టాచార్య*గారు. నేను కలకత్తాలో ఆయన ఇంటికి వెళ్ళి, గురుదేవులతో ఆయన గడిపిన అనేక సంవత్సరాల వృత్తాంతాన్ని ఆనందంగా విన్నాను. చివర, తమ జీవితంలోకల్లా అత్యద్భుతమైన ఘట్టం ఒకటి చెప్పారాయన.

"లాహిరీ మహాశయుల దహనం జరిగిన మర్నాడు పొద్దున పది గంటలకి, ఇక్కడ కలకత్తాలో, జీవద్విభవంతో నా ముందు ప్రత్యక్షమయారాయన."

" రెండు శరీరాల సాధువు" - స్వామి ప్రణవానందగారు కూడా తమ అతీంద్రియానుభూతిని నాకు వివరించారు. మా రాంచీ విద్యాలయాన్ని సందర్శించిన సందర్భంలో, ప్రణవానందగారు నా కిలా చెప్పారు.

"లాహిరీ మహాశయులు శరీరాన్ని విడిచి పెట్టడానికి కొన్నాళ్ళ ముందు, ఆయన దగ్గర్నించి నాకో ఉత్తరం వచ్చింది; నన్ను వెంటనే కాశీకి రమ్మని రాశారాయన, అందులో. అయితే, తప్పనిసరి ఆటంకంవల్ల నా ప్రయాణం ఆలస్యమయింది; వెంటనే బయలుదేరలేకపోయాను. నేను కాశీ ప్రయాణానికి సిద్ధమవుతూ

---

(దారి అంటూ చెప్పినప్పుడు దూరమనేది ఉంటుంది దానికి,
ఆయన దరిదాపులోనే ఉంటే, నీకో దారి అన్నదే అవసరం లేదు.
నాకు నవ్వొస్తూ ఉంటుంది,
నీళ్ళలో చేపకు దాహంగా ఉందని ఎవరైనా చెప్పగా విన్నప్పుడు!)

* పంచానన్ భట్టాచార్యగారు (పే. 416 చూడండి) బీహారులో ఉన్న దేవగఢ్‌లో, పదిహేడెకరాల తోటలో శివాలయం ఒకటి నిర్మించారు; అందులో లాహిరీ మహాశయుల తైలవర్ణ చిత్రం ఒకటి ప్రతిష్ఠించారు.

ఉండగా, పొద్దున పదిగంటల వేళ, మా గురుదేవుల ఉజ్జ్వల రూపాన్ని నా గదిలోనే చూసి ఆనందం పట్టలేకపోయాను.

" 'కాశీకి రావాలని తొందరెందుకు?' అన్నారు, చిరునవ్వు చిందిస్తూ 'నన్నింక అక్కడ చూడవు.'

"ఆయన మాటల్లో అర్థం నాకు స్ఫురించేసరికి, గుండె పగిలి వలవలా ఏడ్చేశాను; ఆయన్ని కేవలం అంతర్దర్శనంలోనే చూస్తున్నానని నమ్మి.

"గురుదేవులు ఓదార్పుగా నా దగ్గరికి వచ్చారు. 'ఇక్కడ, నా కండపట్టి చూడు,' అన్నారు. 'ఎప్పటిలాగే నేను జీవించి ఉన్నాను. దుఃఖ పడకు; ఎప్పటికీ నీతోనే ఉండడం లేదూ?' "

ఈ ముగ్గురు మహాశిష్యుల నోళ్ళనుంచీ అద్భుత సత్యాన్ని తెలిపే కథ బయల్పడింది : లాహిరీ మహాశయుల దేహం మంటలకు ఆహుతి అయిన మర్నాడు పొద్దున పది గంటలవేళ - రూపాంతరం చెందినప్పటికీ - వాస్తవమైన దేహంలో మూడు వేరువేరు నగరాల్లో, ముగ్గురు శిష్యుల ముందు ఆయన సాక్షాత్కరించారు

"నశ్వరమైన దీనికి అనశ్వరత సిద్ధిస్తే, మర్త్యుడు అమరత్వం సాధిస్తే అప్పుడు, మృత్యువును విజయం కబళించేసిందన్న లిఖిత సూక్తి రుజువవుతుంది. మరణమా, ఎక్కడ నీ కాటు? శ్మశానమా, ఎక్కడ నీ విజయం?*

---

* I కోరింథియులు 15·54-55 "చనిపోయిన వాళ్ళని దేవుడు లేపుతాడన్న సంగతి నమ్మలేని మాటగా ఎందుకనుకోవాలి మీరు?' - అపొస్తలుల కార్యాలు 26 8 (బైబిలు)

అధ్యాయం : 37

# నా అమెరికా ప్రయాణం

"అమెరికా! వీళ్ళు కచ్చితంగా అమెరికన్లే!" కొన్ని పాశ్చాత్య ముఖాల*తో నిండిఉన్న సువిశాల దృశ్యం నా అంతర్దృష్టికి గోచరించినప్పుడు నాకు కలిగిన భావం ఇది. రాంచీ విద్యాలయంలో సామానుగదిలో,† దుమ్ముపట్టి ఉన్న కొన్ని పెట్టెల వెనకాల కూర్చుని ధ్యానంలో మునిగి ఉన్నాను. కుర్రవాళ్ళకి కావలసిన ఏర్పాట్లు చూస్తూ సందడిగా గడిపిన ఆ సంవత్సరాల్లో, ఒక ఏకాంత స్థలం చూసుకోడమే నాకు కష్టంగా ఉండేది!

అంతర్దర్శనం కొనసాగింది; అపార జనసమూహం ఒకటి తదేకంగా నావేపు చూస్తూ నటీనట బృందం మాదిరిగా నా చైతన్య రంగస్థల వేదిక మీద అడ్డంగా సాగిపోయింది.

సామానుగది తలుపు తెరుచుకుంది; మామూలుగానే, కుర్రవాళ్ళలో ఒకడు, నేను దాక్కుని ఉన్న చోటు కనిపెట్టేశాడు.

"ఇలా రా, విమల్," అని ఉత్సాహంగా పిలిచాను. "నీకో వార్త చెప్పాలి: ఈశ్వరుడు నన్ను అమెరికాకి పిలుస్తున్నాడు!"

"అమెరికాకాండీ?" అంటూ ఆ అబ్బాయి, నా మాటల్ని మారు పలికాడు; "చంద్రలోకానికి" అని చెప్పానన్న భావం తన గొంతులో ధ్వనించేటట్టుగా.

---

* దరిమిలా నేను పాశ్చాత్య దేశాలకు వెళ్ళినప్పుడు చూసి, తక్షణమే గుర్తుపట్టిన అనేక ముఖాలు.

† శ్రీశ్రీ పరమహంస యోగానందగారు అమెరికా వెళ్ళిన సందర్భపు 75వ వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని, 1995లో రాంచీ ఆశ్రమంలో, యోగానందగారికి దివ్యదర్శనం కలిగిన సామానుగది ఉండిన స్థలంలో, ఒక భవ్యమైన స్మృతి మందిరం అంకితం చెయ్యబడింది. (ప్రచురణకర్త గమనిక)

"ఔను! కొలంబస్‌లాగే నేను అమెరికాని కనిపెట్టడానికి వెళ్తున్నాను. తను ఇండియా చూశాననుకున్నాడు; ఈ రెండు దేశాలకీ మధ్య తప్పకుండా ఒక కర్మాను బంధం ఉంది!"

విమల్ ఎగిరి చక్కాపోయాడు; కాస్సేపట్లో, ఈ రెండు కాళ్ళ వార్తాపత్రిక ఇచ్చిన సమాచారం విద్యాలయమంతకీ తెలిసిపోయింది.

దిమ్మెరపోయిన విద్యాలయ అధ్యాపకుల్ని పిలిపించి, విద్యాలయాన్ని వారికి అప్పగించాను.

"విద్యాబోధనలో లాహిరీ మహాశయుల యోగాదర్శాన్ని మీ రెప్పుడూ మనసులో ఉంచుకుంటారని నాకు తెలుసు. తరచు ఉత్తరాలు రాస్తూ ఉంటాను; దేవుడు సంకల్పిస్తే, ఎప్పుడో ఒకనాడు మళ్ళీ తిరిగి వస్తాను," అన్నాను.

చిన్నచిన్న కుర్రవాళ్ళ వేపూ, ఎండపడుతున్న రాంచీ భూముల వేపూ చూస్తూంటే నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. నా జీవితంలో ఒక నిర్దిష్ట అధ్యాయం ముగిసిందని నాకు తెలుసు; ఇకనుంచి నేను దూరదేశాల్లో ఉంటాను. నాకు అంతర్దర్శనం కలిగిన కొద్ది గంటల్లో రైల్లో కలకత్తాకు బయలుదేరాను. ఆ మర్నాడు అమెరికాలో మతధార్మిక ఉదారవాదుల అంతర్జాతీయ మహాసభ (International Congress of Religious Liberals)కు భారతదేశం నుంచి నన్ను ప్రతినిధిగా రమ్మని కోరుతూ పంపిన ఆహ్వానం అందుకున్నాను. ఆ సంవత్సరం అది, బోస్టన్‌లో, అమెరికన్ యూనిటేరియన్ ఎసోసియేషన్ ఆధ్వర్యంలో జరగవలసి ఉంది.

నా తల సుడిగుండంలో పడ్డట్టయి, శ్రీరాంపూర్‌లో శ్రీయుక్తేశ్వర్‌గారి సన్నిధికి చేరాను.

"గురూజీ, అమెరికాలో ఒక మతధార్మిక మహాసభలో మాట్లాడ్డానికి ఇప్పుడే నా కో ఆహ్వానం వచ్చింది. నేను వెళ్ళనా?"

"నీ కోసం తలుపులన్నీ తెరిచి ఉన్నాయి," అని టూకీగా జవాబిచ్చారు గురుదేవులు. "వెడితే ఇప్పుడే వెళ్ళాలి, లేకపోతే మరి లేదు."

"కాని, గురుదేవా, బహిరంగోపన్యాసాల గురించి నాకేం తెలుసండి? నేను ఉపన్యాస మిచ్చిందే అరుదు; అది కూడా ఇంగ్లీషులో ఎన్నడూ కాదు," అని దిగులుగా అన్నాను.

"ఇంగ్లీషయేది కాకపోయేది; యోగాన్ని గురించిన నీ మాటలు పడమటి దేశాలవాళ్ళు విని తీరవలసిందే."

నేను నవ్వాను. "బాగుంది, కాని పూజ్య గురూజీ, అమెరికన్లు బెంగాలీ నేర్చుకుంటారనుకోను! ఇంగ్లీషు భాషలో అడ్లు దాటుకుపోవడానికి నాకు కాస్త ఊపు వచ్చేటట్టు నన్ను ఆశీర్వదించండి."*

నాన్నగారి దగ్గర నా ఉద్దేశాలు బయటపెట్టేసరికి, ఆయన అదిరిపడ్డారు. అమెరికా, ఆయనకు నమ్మశక్యం కానంత దూరదేశంలా అనిపించింది; మళ్ళీ నన్నెన్నడూ చూడలేరేమోనని భయపడ్డారు.

"ఎలా వెళ్ళగలవు?" అని కఠినంగా అడిగారు. "నీ ఖర్చు ఎవరు భరిస్తారు?" నా చదువుకూ నా యావజ్జీవితానికీ అయిన ఖర్చులు ఆప్యాయంగా ఆయనే భరించడంవల్ల, ఆయన ప్రశ్న నా ప్రయత్నాన్ని రపీమని నిలిపేస్తుందని గట్టిగా ఆశించారాయన.

"ఈశ్వరుడు తప్పకుండా నా ఖర్చులకు డబ్బు సమకూరుస్తాడు." నేను ఈ జవాబు ఇస్తున్నప్పుడు, ఇలాంటి జవాబే చాలాకాలం కిందట ఆగ్రాలో అనంతన్నయ్యకి ఇచ్చానని తలుచుకున్నాను. తరవాత అట్టే కపటం లేకుండా ఇలా అన్నాను. "నాన్నగారూ, నాకు సహాయం చెయ్యమని బహుశా దేవుడే మీ మనస్సుకు తోపించవచ్చు."

"ఉహుఁ, ఎన్నటికీ అలా జరగదు!" అంటూ జాలిగా చూశారు నావేపు.

అందువల్ల, ఆ మర్నాడు నాన్నగారు ఒక పెద్ద మొత్తానికి రాసిన చెక్కు ఒకటి నా చేతికి ఇచ్చినప్పుడు నేను ఆశ్చర్యపోయాను.

"నేను నీ కీ డబ్బు ఇస్తున్నది, తండ్రిగా నా బాధ్యత నెరవేర్చడానికి కాదు; లాహిరీ మహాశయులకు విశ్వాసపాత్రుడైన శిష్యుడిగా మాత్రమే. ఇక ఆ పడమటి దేశానికి వెళ్ళు; జాతిమతభేదం లేని క్రియాయోగ బోధలు వ్యాప్తిచెయ్యి."

నాన్నగారు నిస్స్వార్థ దృష్టితో తమ వ్యక్తిగతమైన కోరికల్ని పక్కకి పెట్టగలిగి నందుకు నా హృదయం గాఢంగా చలించింది. నన్ను విదేశయాత్రకు పురిగొల్పినది సాధారణమైన కోరిక ఏమీ కాదని అంతకు ముందు రాత్రి ఆయనకు సరయిన అనుభూతి కలిగింది.

"బహుశా మళ్ళీ మనం ఈ జన్మలో కలుసుకోమేమో." అప్పటికే అరవై ఏడేళ్ళ వయస్సులో ఉన్న నాన్నగారు విచారంగా అన్నారు.

---

* శ్రీయుక్తేశ్వర్‌గారూ నేనూ మామూలుగా బెంగాలీలో మాట్లాడుకునేవాళ్ళం.

"ఈశ్వరుడు మళ్ళీ మరొక్కసారి మనని తప్పకుండా కలుపుతాడు," అంటూ సమాధాన మివ్వడానికి, అంతర్జ్ఞానానుభూతివల్ల కలిగిన దృఢవిశ్వాసం ఒకటి ప్రేరణ ఇచ్చింది.

అజ్ఞాతమైన అమెరికా తీరాలకు చేరుకోడానికి, గురుదేవుల్నీ నా స్వదేశాన్నీ విడిచి వెళ్ళే ప్రయత్నాల్లో ఉండగా, నాకు చాలా భయం వేసింది. "భౌతికవాది పాశ్చాత్య ప్రపంచం" గురించి నేను చాలా కథలు విన్నాను; సాధుసత్పురుషుల తపోబలంతో అనేక శతాబ్దాలుగా పునీతమవుతున్న భారతదేశానికి పూర్తిగా భిన్నమైన దీ ప్రపంచం.

"పాశ్చాత్య వాతావరణాన్ని ఎదుర్కోవాలంటే, ప్రాచ్యదేశంనుంచి వచ్చిన గురువు, హిమాలయాల చలిబాధలు తట్టుకోడానికి అవసరమైనదానికన్న ఎక్కువ దృఢంగా ఉండాలి!" అనుకున్నాను.

ఒకనాడు వేకువవేళ ప్రార్థన చెయ్యడం ప్రారంభించాను; ప్రార్థన చేస్తూ నేను చచ్చిపోయినా సరే, దేవుడి మాట వినేదాకా ప్రార్థన కొనసాగించాలన్న మొండి పట్టుదలతో కూర్చున్నాను. ఆయన ఆశీస్సులూ, ఆధునిక ఉపయోగితా వాదపు పొగమంచులో నేను దారి తప్పిపోనన్న హామీ, కావాలని కోరుకున్నాను. అమెరికా వెళ్ళడానికి నా మనస్సు సిద్ధంగానే ఉంది, కాని అంతకన్న గట్టిగా, దైవానుమతి సాంత్వన వినాలని తీర్మానించుకుంది.

వెక్కివెక్కి వచ్చే ఏడుపు ఆపుకోడానికి ప్రయత్నిస్తూ అదేపనిగా ప్రార్థన చేస్తూ వచ్చాను. జవాబేమీ రాలేదు. మధ్యాహ్నానికి నా ప్రార్థన పరాకాష్ఠకు వచ్చింది· వేదనాభారంతో నా తల తిరిగిపోతోంది. మరొక్కసారి ఏడిచానంటే, నా మనోవేదన మరింత గాఢమయి నా తల పగిలిపోతుందేమో ననిపించింది.

ఆ సమయంలో, మా గడ్పార్ రోడ్డు ఇంటి సింహద్వారం తడుతున్న చప్పుడు వినిపించింది. ఆ పిలుపు అందుకొని తలుపు తీశాను; సన్యాసులు కట్టుకొనే చిన్న అంగోస్త్రం కట్టుకున్న ఒక పడుచాయన ఎదురుగా కనిపించారు; ఇంట్లోకి వచ్చారు.

"ఈయన బాబాజీ అయి తీరాలి!" అనుకుని దిగ్భ్రమ చెందాను. ఏమంటే, నా ఎదురుగా ఉన్నాయనకి, పడుచుతనంలో ఉన్న లాహిరీ మహాశయుల మొక్కట్లు ఉన్నాయి. ఆయన నా ఊహకు జవాబిచ్చారు. "ఔను, నేను బాబాజీని." ఆయన మధురంగా హిందీలో మాట్లాడారు. "మన పరమపిత పరమేశ్వరుడు నీ ప్రార్థన విన్నాడు. 'నీ గురువుగారి ఆదేశాల్ని అనుసరించి అమెరికా వెళ్ళు. భయపడకు, నీకు రక్ష ఉంటుంది' అని నీతో చెప్పమని ఆయన నన్ను ఆజ్ఞాపిస్తున్నాడు."

స్పందనశీలమైన కొద్దిపాటి విరామం తరవాత, బాబాజీ మళ్ళీ నాతో మాట్లాడారు. "పాశ్చాత్య ప్రపంచంలో క్రియాయోగ సందేశాన్ని వ్యాప్తి చెయ్యడానికి నేను ఎంపికచేసినవాడివి నువ్వే. చాలాకాలం కిందట, ఒక కుంభమేళాలో నీ గురువు - యుక్తేశ్వర్‌ను కలిశాను. నిన్ను ఆయన దగ్గరికి శిక్షణకు పంపుతానని అప్పుడు ఆయనకి చెప్పాను."

నాకు నోట మాట లేదు; ఆయన ఉనికికి భయభక్తులతో ఉక్కిరిబిక్కిరి అయి, నన్ను శ్రీయుక్తేశ్వర్‌గారి దగ్గరికి పంపినవారు ఆయనేనని ఆయన నోటినించే విన్నందుకు గాఢంగా చలించిపోయాను. ఆ అమర గురువుల పాదాలముందు సాష్టాంగపడ్డాను. కృపాదృష్టితో ఆయన నన్ను లేవదీశారు. నా జీవితాన్ని గురించి అనేక విషయాలు చెప్పి, కొన్ని ఆంతరంగిక సూచనలు ఇచ్చి, భవిష్యత్తులో జరగబోయే కొన్ని రహస్య విషయాలు వెల్లడించారు.

"దైవసాక్షాత్కార సిద్ధికి తోడ్పడే శాస్త్రీయ ప్రక్రియ అయిన క్రియాయోగం, చివరికి అన్ని దేశాలకీ వ్యాపించి, అనంత పరమపిత అయిన పరమేశ్వరుణ్ణి గురించి మానవుడికి కలిగే వ్యక్తిగత అతీంద్రియ దర్శనంద్వారా, దేశాల మధ్య సామరస్యం కలిగించడానికి తోడ్పడుతుంది."

మహత్తర శక్తియుక్తమైన ఒక్కచూపుతో తమ విశ్వచైతన్యాంశాన్ని నాకు చూపించి నన్ను పునీతుణ్ణి చేశారు ఆ మహాగురువులు.

"దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా,
యది భాఃసదృశీ సా స్యాద్ భాస స్తస్య మహాత్మనః."*

(ఆకాశంలో ఒకేసారి వెయ్యిమంది సూర్యులు ఉదయించి నప్పటికీ కూడా, వారినుంచి వెలువడే కాంతి, మహాత్ముడి దివ్యప్రకాశానికి సాటి రాదు).

కాస్సేపట్లోనే బాబాజీ, గుమ్మం దగ్గరికి వెళ్ళబోతూ, "నా వెంట రావడానికి పూనుకోకు. నువ్వలా రాలేవు," అన్నారు.

"బాబాజీ, వెళ్ళిపోకండి; దయ ఉంచి వెళ్ళిపోకండి," అంటూ మళ్ళీమళ్ళీ ప్రాధేయపడ్డాను. "నన్ను మీతో తీసుకుపొండి!" "ఇప్పుడు కాదు. మరోమాటు." అన్నారాయన.

ఉద్రేకం పట్టలేక, ఆయన హెచ్చరికను లెక్కచెయ్యలేదు నేను. ఆయన వెంటపడి పోవడానికి ప్రయత్నం చెయ్యబోతే, నా పాదాలు నేలకు పాతుకుపోయి

---

* భగవద్గీత XI 12

ఉన్న సంగతి తెలిసింది. గుమ్మంలోంచి ఆప్యాయంగా నావేపు ఒక చూపు విసిరారు బాబాజీ. ఆశీస్సూచకంగా ఆయన చెయ్యి పైకెత్తి, తరవాత వెళ్ళి పోతుంటే నా కళ్ళు ఆయనమీదే నిలిచిపోయాయి, లాలసతో.

కొన్ని నిమిషాల తరవాత నా పాదాలకు స్వేచ్ఛ వచ్చింది. నేను మళ్ళీ కూర్చుని గాఢమైన ధ్యానంలోకి వెళ్ళాను; నా ప్రార్థనను మన్నించి సమాధానమివ్వడమే కాకుండా, బాబాజీతో సమాగమభాగ్యం నాకు కలిగించినందుకు, దేవుడికి నిర్విరామంగా కృతజ్ఞతలు తెలుపుకున్నాను. సనాతనులూ నిత్యయౌవన పూర్ణులూ అయిన మహాగురువుల స్పర్శతో నా శరీరం యావత్తూ పావనమయి నట్టనిపించింది. ఆయన్ని దర్శించాలన్న గాఢమైన కోరిక చిరకాలంగా నా మనస్సులో ఉంటూ వచ్చింది.

నేను బాబాజీని కలుసుకున్న ఉదంతం ఇప్పటిదాకా ఎవ్వరికీ చెప్పలేదు. నా మానవ జీవితానుభవాల్లో కల్లా దాన్ని అత్యంత పవిత్రంగా భావించి, నా గుండెలోనే దాచి పెట్టుకున్నాను. లోక ప్రయోజనాలపట్ల ఆసక్తిగల, ఏకాంత వాసులైన బాబాజీని నా కళ్ళతో నేను చూశానన్న సంగతి చెబితే, ఈ ఆత్మకథ చదివే పాఠకులు, ఆయన ఉనికి వాస్తవమేనన్న సంగతి నమ్మడానికి సుముఖ లవుతారన్న అభిప్రాయం నాకు కలిగింది. ఈ పుస్తకం కోసం, ఆధునిక భారత దేశపు ఈ "యోగి-క్రీస్తు" (యోగీశ్వరుల) వాస్తవ చిత్రాన్ని గీయడానికి నేనొక చిత్రకారుడికి సాయపడ్డాను.

అమెరికాకు బయలుదేరడానికి ముందునాటి రాత్రి, శ్రీయుక్తేశ్వర్‌గారి పవిత్ర సన్నిధిలో ఉన్నాను. "నువ్వు హిందువుల్లో పుట్టావన్న సంగతి మరిచిపో, అయినా అమెరికన్ల జీవిత పద్ధతుల్లోవి అన్నీ అలవరచుకోకు; రెండు దేశాల ప్రజల్లోనూ ఉత్తమమైనవి తీసుకో," అని చెప్పారాయన, తమకు సహజమైన ప్రశాంత జ్ఞానోపదేశ రీతిలో. " దేవుడి కుమారుడిగా, నిజమైన నీ ఆత్మస్వరూపం లోనే ఉండు. వివిధ జాతుల్లో, ప్రపంచమంతటా చెదురుమదురుగా ఉన్న నీ సోదరులందరి ఉత్తమ గుణాల్ని అన్వేషించి, వాటిని నీలో కలుపుకో."

ఆ తరవాత నన్ను ఆశీర్వదించారు : " దేవుణ్ణి అన్వేషిస్తూ విశ్వాసంతో నీ దగ్గరికి వచ్చేవాళ్ళందరికీ సహాయం లభిస్తుంది. నువ్వు వాళ్ళ వేపు చూస్తుంటే, నీ కళ్ళలోంచి వెలువడే ఆత్మ విద్యుత్ప్రవాహం వాళ్ళ మెదళ్ళలోకి ప్రవేశించి, వాళ్ళలో దైవస్పృహ ఇంకా పెరిగేటట్టు చేస్తూ వాళ్ళ భౌతికమైన అలవాట్లను మార్చేస్తుంది." చిరునవ్వు నవ్వుతూ ఇంకా అన్నారు, "చిత్తశుద్ధి గల ఆత్మల్ని బాగా ఆకర్షించే శక్తి నీకు ఉంటుంది. నువ్వెక్కడికి వెళ్ళినా - నట్టడవిలోనైనా సరే - నీకు స్నేహితులు దొరుకుతారు."

శ్రీయుక్తేశ్వర్‌గారి ఈ ఆశీస్సులు రెండూ సమృద్ధిగా ఫలించాయి. ఒక్క స్నేహితుడు కూడా లేని అమెరికా దేశానికి ఒంటరిగా వచ్చాను; కాని అక్కడ, కాలావధిలేని ఆత్మోపదేశాల్ని స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నవాళ్ళు వేలాదిమంది దొరికారు.

నేను 1920 ఆగస్టులో, 'ద సిటీ ఆఫ్ స్పార్టా' అనే ఓడలో భారతదేశం నుంచి బయలుదేరాను. ప్రపంచయుద్ధం ముగిసిన తరవాత అమెరికాకు బయలుదేరిన మొట్టమొదటి ప్రయాణికుల ఓడ అదే. ప్రభుత్వ కార్యాలయ నిత్యపరిపాటి వ్యవహారాల్లో కేవలం గుడ్డిగా అనుసరించే పద్ధతులవల్ల నా పాస్‌పోర్టు మంజూరు కావడానికి అనేకమయిన ఆటంకాలూ ఇబ్బందులూ, అలౌకిక అద్భుత రీతుల్లో తొలగిపోయిన తరవాతే నా ప్రయాణం టిక్కెట్టు బుక్ చేసుకోగలిగాను.

రెండు నెలలు పట్టిన ఆ ప్రయాణంలో, నా తోటి ప్రయాణికుడొకడు, నేను బోస్టన్ మహాసభకు భారతదేశ ప్రతినిధిగా వెళ్తున్న సంగతి తెలుసుకున్నాడు.

"స్వామి యోగానందా," అంటూ చిత్రమైన ఉచ్చారణతో సంబోధించాడు నన్ను; నేను, ఉత్తరోత్తరా అమెరికన్ల ఉచ్చారణలో నా పేరు పలకగా విన్న అనేక రకాల్లో అది ఒకటి. "వచ్చే గురువారం రాత్రి మీరు ప్రయాణికులకు ఒక ఉపన్యాసం ఇచ్చి అనుగ్రహించండి. 'జీవిత సంగ్రామం - దాన్ని ఎదుర్కోడం ఎలా?' అన్న విషయం మీద మాట్లాడితే మా కెంతో లాభంగా ఉంటుందనుకుంటాను," అన్నా డాయన.

అయ్యో! ఇప్పుడు నా జీవిత సంగ్రామాన్నే ఎదుర్కోవలసి వచ్చిందే - అని తెలుసుకున్నాను బుధవారం నాడు. నా భావాల్ని ఇంగ్లీషులో ఒక ప్రసంగంగా సమకూర్చాలని శతవిధాలా ప్రయత్నించి, ఆ అవస్థ పడలేక, చివరికి అన్ని సన్నాహాలూ విరమించుకున్నాను. నా ఆలోచనలు, జీనుకేసి చూసిన అడవి గుర్రప్పిల్లలాగ, ఇంగ్లీషు వ్యాకరణ నియమాలతో సహకరించడానికి మొరాయించాయి. అయితే, మా గురుదేవుల వెనకటి హామీల్నే పూర్తిగా నమ్ముకొని, గురువారం నాడు, ఓడలో ఉన్న సమావేశం హాలులో హాజరయిన శ్రోతల ఎదటికి వచ్చాను. వాగ్ధార ఏదీ నా పెదవుల దాకా రాలేదు; నోట మాటలేక, సభాసదుల ముందు అలాగే నిలబడిపోయాను. పదినిమిషాల పాటు సహన పరీక్షకి గురి అయిన తరవాత శ్రోతలు, నా అవస్థ కనిపెట్టి నవ్వడం మొదలెట్టారు.

ఆ సమయంలో, ఆ పరిస్థితి నాకయితే వినోదంగా ఏం లేదు; దాన్ని అవమానకరంగా భావించి, నిశ్శబ్దంగా గురుదేవులకు నా విన్నపం పంపాను.

"నువ్వు మాట్లాడగలవు! ఊఁ, మాట్లాడు!" అంటూ ఆయన స్వరం తక్షణమే నా అంతరంగంలో ధ్వనించింది.

వెంటనే, నా భావాలు ఇంగ్లీషుభాషతో స్నేహసంబంధం ఏర్పరచుకున్నాయి. నలభై అయిదు నిమిషాల తరవాత కూడా శ్రోతలు సావధానంగా ఉన్నారు. ఆ ఉపన్యాసమే, ఆ తరవాత అమెరికాలో నేను వివిధ సమావేశాల్లో ప్రసంగించ డానికి ఆహ్వానాలు సంపాయించి పెట్టింది.

ఆ తరవాత, నేను మాట్లాడిన దాంట్లో ఒక్క ముక్క కూడా నాకు జ్ఞాపకం లేదు. జాగ్రత్తగా వాకబుచేసిన మీదట, ప్రయాణికులు కొందరు చెప్పిన దేమిటంటే. "సంచలనం కలిగించే విధంగా, శుద్ధమైన ఇంగ్లీషులో మీరు ఉత్తేజకరమైన ఉపన్యాసం ఇచ్చారు." ఈ సంతోషకరమైన వార్త విని, దేశకాలావరోధాలన్నిటినీ సున్న చేస్తూ గురుదేవులు ఎప్పుడూ నాతోనే ఉన్నారన్న సంగతి మళ్ళీ కొత్తగా గ్రహిస్తూ, సరిగ్గా సమయానికి నాకు అందిచ్చిన సహాయానికి ఆయనకు సవినయంగా కృతజ్ఞతలు తెలుపుకొన్నాను.

తక్కిన నా సముద్ర ప్రయాణంలో అప్పుడప్పుడు, బోస్టన్ మహాసభలో ఎదురుకాబోయే ఇంగ్లీషు ఉపన్యాసమనే కఠిన పరీక్షగురించి భయాందోళనలు అనుభవించాను.

"ప్రభూ, నువ్వే నాకు ఏకైక స్ఫూర్తివి అయేలా అనుగ్రహించు," అని గాఢంగా ప్రార్థించాను.

మా ఓడ, 'ద సిటి ఆఫ్ స్పార్టా' సెప్టెంబరు చివరిలో, బోస్టన్ సమీపంలో రేవుకు చేరుకుంది. 1920 అక్టోబరు 6న, అమెరికాలో నా మొట్టమొదటి ప్రసంగంగా, మహాసభలో ప్రసంగించాను. శ్రోతల కది బాగానే నచ్చింది. 'అమ్మయ్య!' అని ఒక నిట్టూర్పు విడిచాను. ఉదార హృదయులైన, అమెరికన్ యూనిటేరియన్ అసోసియేషన్ కార్యదర్శి, మహాసభ కార్యకలాపాల గురించి ప్రచురించిన సమీక్ష*లో, కింది విధంగా వ్యాఖ్య రాశాడు.

"రాంచీ బ్రహ్మచర్యాశ్రమం నుంచి వచ్చిన ప్రతినిధి స్వామి యోగానంద ఈ మహాసభకు తమ సంఘం శుభాకాంక్షలు తీసుకువచ్చారు. ధారాళమైన ఇంగ్లీషులో, పటిష్ఠమైన వచస్సుతో, దార్శనిక స్వభావానికి సంబంధించిన 'మత శాస్త్రం' (ద సైన్స్ ఆఫ్ రెలిజియన్) అనే విషయం మీద ఉపన్యాసం ఇచ్చారు;

* న్యూ పిల్గ్రిమేజెస్ ఆఫ్ ద స్పిరిట్ (బోస్టన్ : బీకన్ ప్రెస్ 1921).

అధిక సంఖ్యాకులకు అందించడం కోసం, దీన్ని కరపత్ర రూపంలో ముద్రించడం జరిగింది. మత మన్నది విశ్వజనీనమనీ అది ఒక్కటేననీ అన్నారాయన. కొన్ని ప్రత్యేకమైన ఆనవాయితీల్నీ ఆచారాల్నీ మనం విశ్వజనీనం చెయ్యలేకపోవచ్చు; కాని మతంలో ఉన్న సామాన్య తత్త్వాన్ని విశ్వజనీనం చెయ్యవచ్చు; అందరూ దాన్ని సమానంగా అనుసరించి, మన్నించాలని కోరవచ్చు."

నాన్నగారు ఉదారంగా ఇచ్చిన చెక్కువల్ల, మహాసభ ముగిసిపోయిన తరవాత కూడా నేను అమెరికాలో ఉండగలిగాను. బోస్టన్‌లో అతి సామాన్య పరిస్థితుల్లో మూడు సంవత్సరాలు హాయిగా గడిచిపోయాయి. నేను బహిరంగ ఉపన్యాసాలిచ్చాను, తరగతుల్లో బోధించాను, 'సాంగ్స్ ఆఫ్ ద సోల్ ' (ఆత్మ గీతాలు) అన్న కవితా సంపుటి రాశాను. ఈ కవితా సంపుటికి*, 'సిటీ ఆఫ్ న్యూయార్క్ కళాశాల' అధ్యక్షులైన ఫ్రెడరిక్ బి. రాబిన్‌సన్ పీఠిక రాశారు.

1924లో నేను అమెరికాఖండ పర్యటన ప్రారంభిస్తూ, అనేక ప్రధాన నగరాల్లో వేలాది శ్రోతల సమక్షంలో ప్రసంగాలు చేశాను. సుందరమైన అలాస్కాలో విశ్రాంతిగా గడపడంకోసం సియాటిల్‌లో ఓడ ఎక్కాను.

విశాల హృదయులైన విద్యార్థుల సహాయంతో 1925లో, కాలిఫోర్నియాలోని లాస్ ఏంజిలిస్‌లో, మౌంట్ వాషింగ్టన్ ఎస్టేట్స్‌లో అమెరికన్ ప్రధాన కార్యాలయం స్థాపించాను. ఈ కార్యాలయ భవనం, నేను చాలా ఏళ్ళ క్రితం కాశ్మీరులో కలిగిన అంతర్దర్శనంలో చూసినదే. దూరదేశమైన ఈ అమెరికాలో జరిగే కార్య కలాపాల్ని తెలిపే ఫోటోలు శ్రీయుక్తేశ్వర్‌గారికి వెంటనే పంపాను. ఒక పోస్టుకార్డు మీద, ఆయన బెంగాలీలో సమాధానం రాశారు; దాన్ని ఇక్కడ అనువాదం చేస్తున్నాను.

11 ఆగస్టు, 1926

నా ప్రియవత్సా, ఓ యోగానందా!

నీ విద్యాలయమూ విద్యార్థులూ ఉన్న ఫొటోలు చూస్తుంటే నా జీవితానికి ఎంత ఆనందం కలుగుతోందో చెప్పడానికి మాటలు చాలవు. వివిధ నగరాల్లో ఉన్న నీ యోగ విద్యార్థుల్ని చూసి ఆనందంలో మునిగిపోతున్నాను.

స్తోత్ర గీతాల్లో, రోగనివారక స్పందనల్లో, రోగ నివారక

---

* లాస్ ఏంజిలిస్‌లోని సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ ప్రచురణ. 1939లో డాక్టరు రాబిన్‌సన్‌గారు సతీ సమేతంగా భారతదేశం వచ్చారు; ఒక యోగదా సత్సంగ సమావేశంలో గౌరవ అతిథులుగా పాల్గొన్నారు.

దైవప్రార్థనల్లో నీ పద్ధతులగురించి విని, నీకు హృదయపూర్వకమైన ధన్యవాదాలు చెప్పకుండా ఉండలేను.

బయటి గేటు, వంపులు తిరుగుతూ పైకి సాగే కొండదారి మౌంట్ వాషింగ్టన్ ఎస్టేట్స్‌కు దిగువున విశాలంగా వ్యాపించి ఉన్న రమణీయ ప్రకృతి దృశ్యం చూస్తుంటే, వాటివి నా కళ్ళతో నేను చూడాలని తహ తహలాడు తున్నాను.

ఇక్కడంతా సజావుగా సాగిపోతోంది. దేవుడి దయవల్ల, నువ్వెప్పుడూ ఆనందంగా ఉందువుగాక!

- శ్రీయుక్తేశ్వర్‌గిరి

ఏళ్ళకేళ్ళు చకచకా సాగిపోయాయి. నా కొత్త దేశంలో ప్రతి చోటా నేను ఉపన్యాసాలిచ్చాను. వందలకొద్దీ క్లబ్బుల్లో, కళాశాలల్లో, చర్చిల్లో, అన్ని రకాల శ్రోతల సమావేశాల్లోనూ ప్రసంగించాను. 1920-1930 మధ్య దశాబ్దిలో కొన్ని లక్షలమంది అమెరికన్లు నా యోగవిద్యా తరగతులకు హాజరయారు. వాళ్ళందరికీ నేను, 1929లో, ప్రార్థనలూ ఆత్మావలోకనలు గల కొత్త పుస్తకం ఒకటి అంకితం చేశాను; 'విస్పర్స్ ఫ్రం ఎటర్నిటీ'* అన్న ఈ పుస్తకానికి, ప్రఖ్యాత గాయని మేడమ్ ఎమిలీటా గలీ కుర్చీ పీఠిక రాశారు.

ఒక్కొక్కప్పుడు (మామూలుగా, నెలలో ఒకటో తారీఖున, సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ ప్రధాన కార్యాలయం మౌంట్ వాషింగ్టన్ సెంటర్ నిర్వహణకు అయిన ఖర్చుకు బిల్లులు చుట్టచుట్టుకుని వచ్చి పడ్డప్పుడు) భారతదేశపు నిరాడంబర ప్రశాంతికోసం ఉవ్విళ్ళూరుతూ దాన్ని తలుచుకునేవాణ్ణి. కాని ప్రతిరోజా, తూర్పు పడమటి దేశాలమధ్య అవగాహన విస్తరిస్తూ ఉండడం గమనించేవాణ్ణి; నా ఆత్మ ఆనంద తరంగితమయేది.

అనేక సందర్భాల్లో దైవం తనను నడిపించినట్టు అనుభూతి పొందిన "స్వదేశపిత," జార్జి వాషింగ్టన్ (తన "వీడుకోలు ప్రసంగం"లో) అమెరికాకు ఆధ్యాత్మికోత్తేజం కలిగించే మాటలు ఇలా అన్నాడు :

"స్వతంత్రమై, జ్ఞానసంపన్నమై, అద్యతన భావిలోనే ఘనత నందుకోగల దేశం మానవజాతికి అందించడానికి తగినది, సర్వదా సమున్నతన్యాయమూ లోకహితమూ నడిపించినట్టుగా నడుచుకొనే ప్రజల ఉదార, అతినవ్య ఆదర్శం (అంటే, అమెరికా ప్రజలు ఆ విధంగా మానవ జాతికొక ఆదర్శంగా నడుచు

* యోగదా సత్సంగ సొసైటీ, రాంచి ప్రచురణ.

కోవాలి). కాల, చరిత్రల గతిలో అటువంటి ప్రణాళికల వల్ల కలిగే ఫలితాలు, దానికి నిలకడగా కట్టుబడి ఉండడం వల్ల కోల్పోవలసి వచ్చే ఏ తాత్కాలిక ప్రయోజనాలకయినా సమృద్ధిగా పరిహారాన్ని అందిస్తాయన్న సంగతి ఎవరు శంకించ గలరు? భగవంతుడు ఒక దేశం శాశ్వత సౌభాగ్యాన్ని దాని సుగుణ సంపత్తితో ముడి పెట్టకుండా ఉంటాడా?"

వాల్ట్ విట్మన్ రాసిన 'అమెరికా స్తుతి' (హిమ్ టు అమెరికా)

("దౌ మదర్ విత్ దై ఈక్వల్ బ్రూడ్" లోంచి)

"నీ భవిష్యత్తులో నువ్వు,

స్త్రీ పురుషుల విస్తార, విజ్ఞతాయుత చింతనలో నువ్వు - నీ నైతిక, ఆధ్యాత్మిక క్రీడాకారుల్లో; దక్షిణం, ఉత్తరం, పడమర తూర్పుల్లో నువ్వు,

నీ నైతిక సంపదలో, నాగరికతలో (అప్పటిదాకా అతిగర్విష్ఠమైన నీ భౌతిక నాగరికత వ్యర్థంగా ఉండవలసిందే) నువ్వు,

నీ సర్వార్థసాధక, సర్వగ్రాహక ఆరాధనలో - కేవలం ఏ ఒక్క మతగ్రంథం లోనో, రక్షకుడితోనో ఉండిపోకుండా నువ్వు,

నీ రక్షకులు అసంఖ్యాకులు, నీ లోనే అంతర్నిహితులు, ఒకరి కొకరు సమానులూ ఒకరిలా ఒకరు దివ్యులూ...

ఇవన్నీ! ఇవన్నీ నీలో (తప్పక జరుగుతాయని) జోస్యం చెబు తున్నా నీ రోజు."

అధ్యాయం : 38

# గులాబీలమధ్య సాధువు, లూథర్ బర్బాంక్

" మొక్కల పెంపకాన్ని మెరుగు పరచడంలో, శాస్త్రజ్ఞానం మాట అలా ఉంచి, పనికివచ్చే ముఖ్యమైన కిటుకు ప్రేమ." ఈ విజ్ఞత వ్యక్తం చేసినవారు లూథర్ బర్బాంక్. కాలిఫోర్నియాలో శాంటా రోసాలో ఆయన తోటలో ఆయన పక్కగా నేను నడుస్తూ ఉండగా అన్న మాటలివి. తినడానికి పనికి వచ్చే నాగ జెముడు మొక్కల మడి దగ్గర ఆగాం మేము.

ఆయన ఇంకా ఇలా చెప్పారు : " 'ముళ్ళులేని' నాగజెముడు తయారు చెయ్యడానికి నేను ప్రయోగాలు నడుపుతూ ఉన్నప్పుడు, ప్రేమ స్పందనలు సృష్టించ డానికని, నేను తరచుగా మొక్కలతో మాట్లాడుతూ ఉండేవాణ్ణి. 'నువ్వేం భయ పడక్కర్లేదు,' అంటూ మొక్కకు చెప్పేవాణ్ణి. కాపుదలకోసం నీ కీ ముళ్ళ అక్కర్లేదు. నేను నిన్ను కాస్తాను.' క్రమంగా ఎడారుల్లో పెరిగే ఉపయోగకరమైన ఈ మొక్క, ముళ్ళులేని రకంగా మారింది."

ఈ అలౌకిక ఘటనకు నేను ముగ్ధుణ్ణి అయాను. "లూథర్‌గారూ, మౌంట్ వాషింగ్టన్ కొండమీద మా తోటలో నాటడానికి నాకు కొన్ని నాగజెముడు ఆకులు ఇవ్వండి," అని కోరాను.

దగ్గరలో ఉన్న ఒక పనివాడు, కొన్ని ఆకులు నాకు తుంచి ఇవ్వడానికి తయారయాడు. బర్బాంక్ అతన్ని ఆపారు.

"స్వామివారి కోసం నేనే వాటిని తుంచి ఇస్తాను." మూడు ఆకులు నాకు ఇచ్చారు. తరవాత వాటిని నాటాను. అవి క్రమంగా పెద్ద తోటగా వృద్ధి అవు తుంటే చూసి ఎంతో ముచ్చటపడ్డాను.

తాము సాధించినవాటిలో, చెప్పుకోదగ్గ మొదటి విజయం, పెద్ద రకం బంగాళాదుంప అని చెప్పారు, ఆ మహా ఉద్యానశాస్త్రవేత్త; ఆ బంగాళాదుంప ఇప్పుడు

ఆయన పేరుతోనే ప్రసిద్ధికెక్కింది. అకుంఠిత ప్రతిభా సంపత్తితో ఆయన, ప్రకృతి సిద్ధంగా ఉన్న మొక్కల్ని అంటుగట్టి మెరుగుపరిచి, కొన్ని వందల రకాలు ప్రపంచానికి అందించారు- టమాటా, మొక్కజొన్న, గుమ్మడికాయవంటి కూరగాయలు (స్క్వాష్), చెర్రీలు, రేగిపళ్ళు, నెక్టారైన్లు, బేరిపళ్ళు, గసగసాలు, లిల్లీలు, గులాబీలు మొదలైనవి ఆయన రూపొందించిన కొత్త బర్బాంక్ రకాలు.

లూథర్‌గారు నన్ను, ప్రసిద్ధమైన అక్రోటు (వాల్‌నట్) చెట్టు ముందుకు తీసుకువెళ్తూ ఉంటే నేను కెమేరా ఫోకస్ చేశాను; ప్రకృతి పరిణామాన్ని ప్రయత్న పూర్వకంగా త్వరితం చెయ్యవచ్చునన్న సంగతి ఆ చెట్టుతోనే నిరూపించారాయన.

"ఒక్క పదహారేళ్ళలోనే ఈ అక్రోటు చెట్టు, సమృద్ధిగా కాయలు పండించే స్థితికి చేరుకుంది. దోహదం జరక్కుండా, ప్రకృతి సహజమైన రీతిలో ఈ పరిణామం రావాలంటే, అంతకు రెట్టింపు కాలం పట్టేది.

బర్బాంక్‌గారి చిన్న పెంపుడు కూతురు, తన కుక్కతో ఆడుకుంటూ తోటలోకి వచ్చింది.

"అది నా మానవ వృక్షం." లూథర్‌గారు ఆ అమ్మాయివేపు ఆప్యాయంగా చెయ్యి ఊపారు. "ఇప్పుడు నేను మానవజాతిని బ్రహ్మాండమైన ఒక మొక్కగా చూస్తున్నాను. దాని అత్యున్నత ప్రయోజనాలు నెరవేరడానికి కావలసిన వల్లా - ప్రేమ, విశాలమైన ఆరుబయలువల్ల కలిగే ప్రకృతి సహజమైన లాభాలు, తెలివిగా అంటుగట్టడం, ఎంపిక. ఒక్క నా జీవితకాలంలోనే, వృక్షపరిణామంలో ఎటువంటి అద్భుత ప్రగతి గమనించానంటే, ప్రపంచంలో పిల్లలకు, సాదాగానూ హేతుబద్ధం గానూ జీవించడానికి సంబంధించిన నియమాలు కనక నేర్పితే, ఆరోగ్యవంతమూ సుఖవంతమూ అయిన ప్రపంచం రూపొందుతుందన్న ఆశాభావంతో, దానికోసం ఎదురుచూస్తూ ఉంటాను. మనం ప్రకృతి దగ్గరికీ ప్రకృతి దైవం దగ్గరికీ తప్పకుండా తిరిగి వెళ్ళాలి."

"లూథర్‌గారూ, ఆరుబయటి తరగతులూ ఆనందమూ నిరాడంబరతా గల వాతావరణమున్న మా రాంచీ విద్యాలయాన్ని చూస్తే మీరు సంతోషిస్తారు."

నా మాటలు, బర్బాంక్‌గారి హృదయాన్ని కదిలించాయి. ఆయనకు అత్యంత ప్రీతిపాత్రమైన విషయం - చిన్నపిల్లల విద్య. లోతయిన, ప్రశాంతమైన ఆయన కళ్ళలో ఆసక్తి తొణికిసలాడుతూ ఉండగా, నా మీద ప్రశ్నలవర్షం కురిపించారాయన.

చివరికి ఆయన ఇలా అన్నారు : "స్వామీజీ, మీ విద్యాలయం లాంటివే ముందు యుగాలకొక ఆశారేఖ. పిల్లల్ని ప్రకృతినుంచి విడదీసేసి, వాళ్ళలో వ్యక్తిత్వ వికాసాన్ని కుంటుపరిచిన, మన కాలపు విద్యావ్యవస్థలంటే నాకు వెలపరం పుడుతుంది. ఆచరణాత్మకమైన మీ విద్యాదర్శాలతో నేను మనఃపూర్తిగా ఏకీభవిస్తున్నాను

ఆ సాధుపురుషుని దగ్గర నేను సెలవు తీసుకునే సమయంలో ఆయన ఒక చిన్న పుస్తకం మీద సంతకంపెట్టి, దాన్ని నాకు బహూకరించారు.*

"ఇదుగో, 'ద ట్రెయినింగ్ ఆఫ్ ద హ్యూమన్ ప్లాంట్'† (మానవవృక్ష శిక్షణ) అన్న విషయం మీద నా పుస్తకం," అన్నారాయన. "శిక్షణలో కొత్త రకాలు - నిర్భయ ప్రయోగాలు అవసరమిప్పుడు. పండ్లలోనూ పూలలోనూ అత్యుత్తమమైనవాటిని సాధించడంలో, ఒక్కోసారి అతిసాహసంతో చేసిన ప్రయత్నాలు ఫలించాయి. అలాగే, పిల్లలకోసం విద్యాబోధన సంబంధమైన నవకల్పనలు కూడా ఇంకా బహు సంఖ్యాకంగా, సాహసికంగా తయారు కావాలి," అన్నారు.

ఆయన పుస్తకాన్ని ఆ రోజు రాత్రే గాఢమైన ఆసక్తితో చదివాను. ఆయన కన్ను, మానవజాతికి మహోజ్జ్వలమైన భవిష్యత్తును దర్శిస్తోంది. ఆయన ఇలా రాశారు: "ఈ ప్రపంచంలో అన్నిటికన్న మొండిప్రాణీ, మార్చడానికి వీలు కాకుండా ఉండేదీ, నిశ్చితమయిన కొన్ని అలవాట్లకు స్థిరపడ్డదీమొక్క. ఈ మొక్క యుగ యుగాలుగా తన వ్యక్తిత్వాన్ని నిలుపుకొంటూ వస్తున్న విషయం గుర్తుంచు కోవాలి; బహుశా, అనేక యుగాలకు పూర్వం రాళ్ళలో పుట్టి, సుదీర్ఘ కాలగతిలో కూడా ఏ విధమైన పెద్ద మార్పూ చెందకుండా ఉన్నది అదే కావచ్చు. ఇన్ని యుగాల ఆవృత్తిలో, మొక్క, అసమాన దృఢత్వంగల సంకల్పశక్తిని (ఉదాహరణకు అలా చెప్పాలను

* బర్బాంక్‌గారు, సంతకం చేసిన ఫొటో కూడా ఒకటి నాకు ఇచ్చారు. ఒకప్పుడు లింకన్ బొమ్మను అమూల్యంగా భద్రపరచుకున్న హిందూ వర్తకుడి లాగే, నేను దాన్ని భద్రపరుచుకున్నాను. అంతర్యుద్ధాల కాలంలో అమెరికాలో ఉన్న ఆ హిందువుకు లింకన్ మీద ఎంత అభిమానం ఏర్పడిందంటే, ఆ దాస్య విముక్తి ప్రదాత బొమ్మ ఒకటి సంపాదించేవరకు భారత దేశానికి తిరిగి రావడానికి అతనికి మనస్కరించలేదు. న్యూయార్కులో ఉండే డేనియల్ హంటింగ్‌టన్ అనే ప్రసిద్ధ చిత్రకారుడిచేత ఆయన బొమ్మ వేయించడానికి అనుమతి వచ్చేవరకు కదలనని ప్రెసిడెంట్ లింకన్ నివాసభవనం దగ్గర భీష్మించుకొని కూర్చున్నాడు. చివరికి ప్రెసిడెంట్ లింకన్ ఆశ్చర్యపోయి అనుమతి ఇచ్చాడు. బొమ్మ పూర్తి అయిన తరవాత ఆ హిందువు, విజయగర్వంతో దాన్ని కలకత్తా తీసుకువెళ్ళాడు.

† న్యూయార్క్ : సెంచరీ కంపెనీ 1922.

కుంటే) అలవరచుకోదంటారా? నిజానికి, కొన్ని రకాల తాటిచెట్లలాంటి మొక్కలు, ఎంతగా మార్పుకు లోనుకాకుండా ఉంటాయంటే, ఇంతవరకూ ఏ మానవశక్తీ వాటిని మార్చలేకపోయింది. మొక్క సంకల్ప శక్తితో పోలిస్తే మానవ సంకల్పశక్తి బలహీన మయినది. కాని, మొత్తం మొక్కకున్న యావజ్జీవ దృఢత్వం, కేవలం ఇంకో కొత్త జీవితో దాన్ని కలిపినంత మాత్రాన ఎలా విచ్ఛిన్నమయిందో చూడండి; సంకరకరణం వల్ల దాని జీవితంలో సంపూర్ణమూ శక్తిమంతమూ అయిన మార్పు తీసుకురావడం జరిగింది. దృఢత్వంలో ఆ విచ్ఛిన్నత వచ్చినప్పుడు దాన్ని ఓర్పుగా పర్యవేక్షిస్తూ ఎంపిక చేస్తూ ఆ మార్పును స్థిరపరిస్తే, కొత్తమొక్క కొత్తరీతిగా జీవిస్తుంది; పాతరీతికి తిరిగిపోదు. చివరికి దాని దృఢసంకల్పశక్తి విచ్ఛిన్నమై పరివర్తిత మవుతుంది.

"అదే, ఎంతో సంవేదనశీలంగానూ నమ్యంగానూ ఉండే శిశుస్వభావ విషయంలో అయితే సమస్య చాలా తేలికవుతుంది."

మహానుభావుడైన ఆ అమెరికా దేశీయుడివైపు అయస్కాంతంవైపు వలె ఆకృష్టుణ్ణి అయి నేను, ఆయన్ని కలుసుకోడానికి మళ్ళీమళ్ళీ వెళ్తూండేవాణ్ణి. ఒకరోజు పొద్దున నేను వెళ్ళేసరికి పోస్ట్‌మాన్, బర్బాంక్‌గారి అధ్యయన మందిరంలో, దాదాపు వెయ్యి ఉత్తరాలు పెట్టి వెళ్ళాడు. ప్రపంచం నలుమూలల నుంచీ ఉద్యాన శాస్త్రజ్ఞులు ఆయనకు ఉత్తరాలు రాశారు.

"స్వామీజీ, మీరుండడంవల్లనే నేను తోటలోకి రావడానికి నాకు కావలసిన వంక దొరికింది," అని ఉల్లాసంగా చెప్పారు లూథర్‌గారు. ఆయన ఒక పెద్ద డస్కు సొరుగు తీశారు; దాన్నిండా, విదేశీయాత్రలకు సంబంధించిన కరపత్రాలు వందలకొద్దీ ఉన్నాయి.

"చూడండి, ఇలాగే నేను ప్రయాణం చేస్తూ ఉంటాను. నా మొక్కలకీ, ఉత్తర ప్రత్యుత్తరాలకీ కట్టి పడేసినవాణ్ణి కావడం వల్ల అప్పుడప్పుడు ఈ బొమ్మల కేసి చూస్తూ విదేశయాత్రల మీద నాకున్న కోరిక తీర్చుకుంటూ ఉంటాను."

ఆయన గేటుముందు నా కారు ఆగి ఉంది. నేనూ లూథర్‌గారూ ఆ చిన్న ఊళ్ళో ఉన్న రోడ్ల వెంబడి కారులో తిరిగి వచ్చాం. అక్కడి తోటలు ఆయన సృష్టించిన శాంటారోసా, పీచ్ బ్లో, బర్బాంక్ గులాబీలతో ముచ్చటగొలుపుతున్నాయి. నే వక్కడికి వెళ్తూ వచ్చిన కొత్తల్లో ఒకసారి, ఆ మహాశాస్త్రవేత్త క్రియా యోగదీక్ష తీసుకున్నారు. "స్వామీజీ నేను దీక్షగా యోగసాధన చేస్తున్నాను," అన్నారాయన. యోగంలో వివిధ అంశాలగురించి ఆలోచనాత్మకమైన ప్రశ్నలనేకం వేసిన మీదట లూథర్‌గారు, మెల్లగా ఇలా వ్యాఖ్యానించారు.

"నిజానికి, పాశ్చాత్య ప్రపంచం ఇప్పటికీ ఇంకా అన్వేషించడం మొదలు పెట్టని బ్రహ్మాండమైన విజ్ఞాన నిధులు ప్రాచ్యప్రపంచానికి లభించి ఉన్నాయి."*

ప్రకృతి బర్బాంక్ గారికి తాను భద్రంగా దాచిపెట్టుకున్న అనేక రహస్యాల్ని విప్పి చెప్పింది. ప్రకృతితో ఆయన ఏర్పరచుకున్న సన్నిహిత సంబంధం వల్ల బర్బాంక్ గారికి అపరిమితమైన ఆధ్యాత్మిక భక్తి ప్రపత్తులు కుదిరాయి.

"ఒక్కొక్కప్పుడు, నేను అనంతశక్తి కి చాలా దగ్గరగా ఉన్నట్టు అనిపిస్తుం టుంది," అంటూ సిగ్గుపడుతూ నాకు చెప్పారాయన. సంవేదనశీలమైన ఆయన సుందరముఖం, వెనకటి జ్ఞాపకాలతో వెలుగొందింది. "అప్పుడు నేను, నా చుట్టూ ఉన్న రోగుల్నీ, జబ్బుపడ్డ చాలా మొక్కల్నీ నయం చెయ్యగలిగాను."

ఆయన తమ తల్లిగారి గురించి చెప్పారు. ఆమె చిత్తశుద్ధిగల క్రైస్తవ మహిళ. "ఆవిడ చనిపోయిన తరవాత చాలాసార్లు, అంతర్దర్శనాల్లో ఆవిణ్ణి చూసే భాగ్యం కలిగింది; ఆవిడ నాతో మాట్లాడింది," అన్నారు లూథర్ గారు.

మనస్సు వెనక్కి లాగుతున్నప్పటికీ మేము మళ్ళీ ఆయన ఇంటికేసీ, ఆయన కోసం కాసుకుని ఉన్న వెయ్యి ఉత్తరాల కేసీ మళ్ళాం.

"లూథర్‌గారూ, ప్రాచ్యపాశ్చాత్య ప్రపంచాల సత్యోపదేశాల్ని అందించడానికి వచ్చేనెల నేనొక పత్రిక ప్రారంభిస్తాను; నా పత్రిక కొక మంచి పేరు నిర్ణయించడంలో మీరు సాయం చెయ్యండి," అన్నాను.

రకరకాల పేర్ల గురించి మేము కొంతసేపు చర్చించుకున్నాం. చివరికి ఈస్ట్ - వెస్ట్† (తూర్పు-పడమర) అన్న పేరు మాకు ఒప్పుదల అయింది. మళ్ళీ

---

* సమాధి స్థితిలోకి వెళ్ళడానికి శ్వాసక్రియను నియంత్రించడానికి ఉపకరించే "ప్రాచ్య ప్రక్రియల్ని" పాశ్చాత్య విజ్ఞానశాస్త్రవేత్తలు "నేర్చుకోవాలి," అన్నాడు ప్రఖ్యాత ఇంగ్లీషు విజ్ఞాన శాస్త్రవేత్త, మరియు యునెస్కో డైరెక్టరు అయిన డా॥ జూలియన్ హక్స్లీ. "'ఏం' జరుగుతుంది? 'ఎలా' సాధ్యమవుతుందది?" అన్నాడాయన. 21 ఆగస్టు 1948 తేదీనాటి 'ఏసోసియేటెడ్ ప్రెస్' పత్రికలో ప్రచురించిన లండన్ వార్తలో ఇలా రాసి ఉంది: "ప్రాచ్యదేశాల మార్మిక విజ్ఞానాన్ని లోతుగా పరిశీలించడం మంచిదని డా॥ హక్స్లీ, కొత్తగా ఏర్పడ్డ మానసికారోగ్య ప్రపంచ సమాఖ్య (World Federation of Mental Health)కు సూచించాడు. "ఈ విజ్ఞానాన్ని శాస్త్రీయంగా కనక పరిశీలించినట్లయితే, మీ రంగంలో మీరు, ముందుకొక పెద్ద అంగ వెయ్యగలరనుకుంటాను," అన్నాడు.

† 1948లో దీనిపేరు 'సెల్ఫ్ రియలైజేషన్ మేగజైన్' అని మార్చడం జరిగింది.

"లూథర్ బర్బాంక్
శాంటారోసా, కాలిఫోర్నియా
యు.ఎస్.ఏ.

డిసెంబరు 22, 1924

స్వామి యోగానందగారి యోగదా విధానం పరీక్షగా చూశాను; నా ఉద్దేశంలో అది, మానవుడి శారీరక, మానసిక, ఆధ్యాత్మిక ప్రకృతుల్ని సమన్వయం చేసే శిక్షణకు ఆదర్శవంతమైనది. కేవలం బుద్ధివికాసానికే పరిమితం కాకుండా, శరీరాన్నీ సంకల్పాన్నీ అనుభూతుల్నీ కూడా తర్ఫీదు చేసే విద్య బోధించడానికి, "జీవించడమెలా"గో నేర్పే విద్యాలయాలు ప్రపంచ మంతటా స్థాపించాలని స్వామి వారి ఆశయం.

ధారణధ్యానాల సులభమైన శాస్త్రీయపద్ధతులవల్ల, యోగ విధానంలో ఉన్న శారీరక, మానసిక, ఆధ్యాత్మిక వికాస సాధనతో జీవితంలోని క్లిష్ట సమస్యలు చాలావరకు పరిష్కారం కావచ్చు; శాంతి, సౌహార్దం భూమిమీదికి అవతరించవచ్చు. సరైన విద్యను గురించి స్వామివారికున్న భావం స్పష్టమైన లోకజ్ఞానం; ఏ విధమైన మార్మికతా ఆచరణలో అననుకూలతా లేనిది. లేకపోతే అది నా సమ్మతి పొంది ఉండేది కాదు.

జీవన కళకు సంబంధించిన అంతర్జాతీయ విద్యాలయాలు స్థాపించాలని విజ్ఞప్తి చేసే స్వామివారితో నేను కూడా హృదయపూర్వకంగా కలవడానికి ఈ అవకాశం కలిగినందుకు సంతోషిస్తున్నాను; వీటిని స్థాపించినట్లయితే, (నూతన సహస్రాబ్ది ఆవిష్కరణకు తోడ్పడే) నాకు పరిచయమైన ఏ ఇతర విషయం మాదిరిగానైనా, ధర్మరాజ్య స్థాపనకు అవి చక్కగా తోడ్పడతాయి.

Luther Burbank

మేము ఆయన అధ్యయన మందిరంలోకి వెళ్ళిన తరవాత బర్బాంక్ గారు, "సైన్స్ అండ్ రెలిజియన్" (విజ్ఞానశాస్త్రం:మతం) గురించి తాము రాసిన వ్యాసం ప్రతి ఒకటి నాకు ఇచ్చారు.

"ఇది నా 'ఈస్ట్-వెస్ట్' పత్రికలో ప్రారంభ సంచికలో వస్తుంది," అన్నాను కృతజ్ఞతాపూర్వకంగా.

మా స్నేహం గాఢతరం అయినమీదట, బర్బాంక్‌గారిని నేను, నా "అమెరికన్ సెయింట్" (అమెరికా సాధువు) అనేవాణ్ణి. "ఇదుగో, ఏ కపటమూలేని మనిషిని చూడండి!* అన్న వాక్యం ఉదాహరించాను. వినయం, ఓర్పు, త్యాగం చిరకాలంగా అలవాటయి ఉన్న ఆయన హృదయం అంతుపట్టనంత లోతు. గులాబీల మధ్య ఉన్న ఆయన చిన్న ఇల్లు అతి నిరాడంబరమైనది; విలాసాల వ్యర్థత, కొద్దిపాటి వస్తువులవల్ల కలిగే ఆనందం ఆయనకు తెలుసు. శాస్త్రరంగంలో తమకు వచ్చిన కీర్తిని భరించడంలో ఆయన చూపే నమ్రత, పండే పండ్ల బరువుతో కిందికి వంగిన చెట్లను పదేపదే గుర్తుకు తెస్తుంది; పసలేని దాంభికంతో తల పైకి ఎగరేస్తూ ఉండేది గొడ్డుబోతు చెట్టే.

1926లో నా ప్రియమిత్రుడు గతించినప్పుడు నేను న్యూయార్కులో ఉన్నాను. కళ్ళ నీళ్ళు పెట్టుకొని, "అయ్యో! మరొక్కసారి ఆయన దర్శనానికి ఇక్కడ్నించి శాంటారోసా దాకా ఉన్న అంతా సంతోషంగా కాలినడకన వెడుదును కదా!" అనుకున్నాను. కార్యదర్శులకూ సందర్శకులకూ దూరంగా నేను, తలుపులు మూసుకొని, ఇరవై నాలుగు గంటలు ఏకాంతంగా గడిపాను.

ఆ మర్నాడు, లూథర్‌గారి ఫొటో ఒకటి పెద్దది ఎదురుగా పెట్టుకుని వైదిక కర్మకాండ జరిపించాను. నా అమెరికన్ శిష్యుల్లో కొందరు హిందూ వేషధారణ చేసి, పాంచభౌతిక తత్త్వాలకూ అవి అనంత సత్తలో తిరిగి లయమవడానికీ ప్రతీక లయిన పూలతో, నీళ్ళతో, నిప్పుతో శ్రద్ధాంజలి ఘటిస్తూ ఉండగా, మంత్ర పఠనం చేశారు.

బర్బాంక్ గారి భౌతికకాయం, శాంటారోసాలోని తమ తోటలో తాము స్వయంగా పాతిన లెబనాన్ సెడార్ (దేవదారు) వృక్షం కింద పూడ్చిపెట్టి ఉన్నప్ప టికీ, నా దృష్టిలో ఆయన ఆత్మ, విప్పారిన కళ్ళతో దారిపక్క పూసే ప్రతి పువ్వు లోనూ ప్రతిష్ఠితమై ఉంది. ప్రకృతి విశాలతత్త్వంలో కొంతకాలం ఉండడానికి

* యోహాను 1.47 (బైబిలు)

లూథర్‌గారు ఇక్కణ్ణించి వెళ్ళిపోయినా, ప్రకృతిలో వీచే గాలుల్లో ఆయన గుసగుస లాడడంలేదా, పొడజూపే తొలిపొద్దుల్లో ఆయన నడయాడడం లేదా?

ఆయన పేరిప్పుడు, సామాన్య వ్యవహారభాషా వారసత్వంలోకి వచ్చేసింది. వెబ్‌స్టర్ న్యూ ఇంటర్నేషనల్ డిక్షనరీలో "బర్బాంక్" అన్న శబ్దాన్ని సకర్మక క్రియగా చేరుస్తూ ఇలా నిర్వచించారు : (మొక్క) "సంకరకరణం" చేయు లేదా అంటుగట్టు. దాన్ని బట్టి, లాక్షణికార్థంలో, మంచి లక్షణాన్ని ఎంపికచేసి చెడ్డవాటిని తిరస్కరించి లేదా మంచి లక్షణాల్ని చేర్చి (ఒక ప్రక్రియగాగాని, సంస్థగాగాని, దేన్నయినా) మెరుగుపరచడం."

ఆ నిర్వచనం చదివిన తరవాత నేను కళ్ళనీళ్ళు పెట్టుకున్నాను; "ప్రియమైన బర్బాంక్, ఇప్పుడు మీ పేరే మంచితనానికి మారు పేరయింది!"

అధ్యాయం : 39

# శిలువ గాయాలున్న థెరిసా వాయ్‌మన్

"భారతదేశానికి తిరిగి వచ్చెయ్యి. నీకోసం పదిహేనేళ్ళు ఓపిక పట్టి ఎదురు చూశాను. త్వరలో నేను ఈ శరీరాన్ని వదిలి, అటుతరవాత నా కాంతిమయ నివాసానికి చేరుకుంటాను. యోగానందా, రా!"

ఒకనాడు మౌంట్ వాషింగ్టన్ ప్రధాన కార్యాలయంలో నేను ధ్యానం చేసుకుంటూ ఉండగా శ్రీయుక్తేశ్వర్‌గారి స్వరం నా లోచెవిలో వినిపించి నన్ను ఆశ్చర్య చకితుణ్ణి చేసింది. ఆయన సందేశం ఒక్క రెప్పపాటు కాలంలో పదివేల మైళ్ళు ప్రయాణించి, మెరుపులా నాలోకి దూసుకువచ్చింది.

పదిహేనేళ్ళు! ఔను, ఇప్పుడు నడుస్తున్నది 1935 అని గ్రహించాను; మా గురుదేవుల ఉపదేశాల్ని అమెరికాలో వ్యాప్తి చెయ్యడానికి పదిహేనేళ్ళు గడిపాను ఇప్పుడాయన నన్ను వెనక్కి పిలుస్తున్నారు.

తరవాత కొద్ది వ్యవధిలో, నా ప్రియమిత్రుడైన శ్రీ జేమ్స్ జె. లిన్‌కు నా అనుభవం చెప్పాను. ప్రతిరోజూ క్రియాయోగ సాధనవల్ల ఆయన పొందిన ఆధ్యాత్మికాభివృద్ధి గణనీయతనుబట్టి నే నాయన్ని తరచుగా ' సెయింట్ లిన్ (లిన్ ఋషి) అని పిలుస్తూండేవాణ్ణి. సనాతన యోగ పద్ధతి ద్వారా ఆత్మ సాక్షాత్కారం పొందే నిజమైన ఋషుల్ని పాశ్చాత్య దేశాలు కూడా తయారు చేస్తాయని బాబాజీ చెప్పిన జోస్యం నెరవేరడం, ఈయన్నీ మరికొందరు పాశ్చాత్యుల్నీ చూసినప్పుడు గ్రహించి సంతోషించాను.

నా ప్రయాణాల ఖర్చుకు తామే విరాళమిస్తామని పట్టుపట్టి, ఔదార్యం చూపించారు లిన్. ఆర్థిక సమస్య అలా పరిష్కారమవడంతో నేను, యూరప్ గుండా ఇండియాకు ఓడలో ప్రయాణం చెయ్యడానికి ఏర్పాట్లు చేసుకున్నాను.

1935 మార్చిలో, సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ సంస్థను, కాలిఫోర్నియా రాష్ట్ర చట్టాల ప్రకారం, చిరస్థాయిగా మనుగడ సాగించడానికి రూపొందించిన మతాంతశ్శాఖా రహితమైన, లాభార్జనరహితమైన సంస్థగా రిజిష్టరు చేయించాను. నా రచనలన్నిటి మీదా ఉన్న హక్కులతో సహా, నా కున్నవన్నీ సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్‌కు విరాళంగా ఇచ్చేశాను. అనేక ఇతర మత, విద్యాసంస్థల్లాగే సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్‌కూడా సభ్యులూ ప్రజలూ అందించిన ధర్మనిధుల మీదా విరాళాల మీదా ఆధారపడింది.

" నేను మళ్ళీ వస్తాను. అమెరికాని ఎన్నడూ మరిచిపోను," అని చెప్పాను నా విద్యార్థులకు.

ప్రేమాస్పదులైన మిత్రులు కొందరు లాస్ ఏంజిలస్‌లో నా కిచ్చిన వీడ్కోలు విందులో, వాళ్ళ మొహాలవేపు చాలాసేపు చూసి, కృతజ్ఞతతో ఇలా అనుకున్నాను, "ప్రభూ, ఏకైక ప్రదాతవు నువ్వేనన్న సంగతి గుర్తుంచుకున్నవాడికి, మర్త్యుల్లో స్నేహమాధుర్యం కొరవడ్డం ఉండదు."

1935 జూన్ 9న న్యూయార్కులో 'యూరోపా' అనే ఓడలో బయలు దేరాను. నాతోబాటు ఇద్దరు విద్యార్థులు వచ్చారు: నా కార్యదర్శి శ్రీ సి. రిచర్డ్ రైట్, సిన్సినాటీ వాస్తవ్యురాలైన ఒక పెద్దవయసావిడ మిస్ ఎట్టీ బ్లెట్ష్. అంతకు ముందు వారాల హడావిడికి భిన్నంగా, స్వాగతించదగిన రీతిలో సముద్ర యానపు రోజులు ప్రశాంతంగా గడిచాయి; చాలా ఆనందం పొందాము. అయితే మా విశ్రాంతి కాలం స్వల్పమే అయింది; ఆధునిక నౌకల వేగానికి విచారకరమైన లక్షణాలు కొన్ని ఉన్నాయి.

ఉత్సుకత ఉన్న యాత్రిక బృందాలన్నిటిలాగే మేమూ అతివిస్తారమూ ప్రాచీనమూ అయిన లండన్ నగరంలో బాగా తిరిగాం. నేను వచ్చిన మర్నాడు కాక్స్‌టన్ హాలులో ఏర్పాటయిన పెద్ద సభలో ఉపన్యాస మిమ్మని నన్ను ఆహ్వానించారు. అక్కడ సర్ ఫ్రాన్సిస్ యంగ్ హజ్బెండ్ నన్ను లండన్ శ్రోతలకు పరిచయం చేశారు.

మా బృందం స్కాట్లండ్‌లో సర్ హారీ లాడర్‌గారి ఎస్టేట్‌లో ఆయన అతిథులుగా హాయిగా ఒకరోజు గడిపాం. ఆ తరవాత మా బృందం ఇంగ్లీషు ఛానల్ దాటి యూరప్ ఖండంలో ప్రవేశించాం; నేను బవేరియాకు ప్రత్యేక యాత్ర చెయ్యాలని అనుకోడమే దానికి కారణం. కానర్‌స్రాత్‌లో ఉండే థెరిసా నాయ్‌మన్ అనే గొప్ప కాథలిక్ మార్మిక భక్తురాలిని దర్శించడానికి నా కిదే ఏకైక అవకాశమని భావించాను.

కొన్నేళ్ళ కిందట నేను, ఒక వ్యాసంలో థెరిసా గురించి ఇచ్చిన విస్మయం కలిగించే సమాచారం చదివి ఉన్నాను; అది ఏమిటంటే:

(1) 1898 గుడ్‌ఫ్రైడే నాడు జన్మించిన థెరిసా, ఇరవయ్యో ఏట ఒక ప్రమాదంలో గాయపడింది. ఆమె గుడ్డిదయింది; పక్షవాతం వచ్చింది.

(2) 1923లో, 'లిటిల్ ఫ్లవర్'గా పేరుగన్న సెంట్ థెరిసా ఆఫ్ లిస్యేకు చేసిన ప్రార్థనల వల్ల అలౌకిక రీతిలో ఆమెకు మళ్ళీ చూపు వచ్చింది ఆ తరవాత థెరిసా నాయ్‌మన్ అవయవాలకు తక్షణమే రోగ నివారణ జరిగింది.

(3) థెరిసా 1923 నుంచి అన్న పానీయాలు పూర్తిగా మానేసింది; కాని దైవప్రసాదంగా 'పలచని రొట్టె' ముక్క (వేఫర్) మాత్రం మింగుతుంది.

(4) 1926లో థెరిసా తలమీదా, రొమ్ముమీదా, చేతులమీదా, పాదాల మీదా క్రీస్తు పవిత్ర గాయాలు కనిపించాయి. ప్రతి శుక్రవారం* నాడూ ఆమె, మరణానికి పూర్వం క్రీస్తు అనుభవించిన బాధలన్నీ తన శరీరంలోనే పడుతూ, 'క్రీస్తు వ్యథ' (Passion of Christ) అనుభవిస్తుంది.

(5) సాధారణంగా, తన ఊళ్ళో వాడుకలో ఉన్న సరళమైన జర్మన్ భాష మాత్రమే తెలిసిన థెరిసా, శుక్రవారం సమాధి స్థితుల్లో పలికే పదబంధాల్ని, ప్రాచీన ఆరామయిక్ భాషారూపాలుగా పండితులు గుర్తించారు. అంతర్దర్శనాల్లో ఆమె, సముచిత సమయాల్లో హీబ్రూ కాని గ్రీకుకాని మాట్లాడుతుంది.

(6) మత ధర్మాధికారుల అనుమతితో థెరిసా చాలాసార్లు నిశిత శాస్త్ర పరీక్షకు నిలిచింది. ప్రొటెస్టెంట్ జర్మన్ వార్తా పత్రిక సంపాదకుడైన

* యుద్ధ సంవత్సరాలు మొదలుకొని థెరిసా, ఏడాదిలో కొన్ని పవిత్ర దినాల్లో తప్ప, ఆ 'వ్యథ', ప్రతి శుక్రవారం అనుభవించేది కాదు. ఆమె జీవితాన్ని గురించి వచ్చిన పుస్తకాలు ఇవి 'థెరిసా నాయ్‌మన్: ఎ స్టిగ్మాటిస్ట్ ఆఫ్ అవర్ డే' (మన కాలపు క్షతచిహ్నధారిణి : థెరిసా నాయ్‌మన్, 'ఫర్దర్ క్రానికిల్స్ ఆఫ్ థెరిసా నాయ్‌మన్' (థెరిసా నాయ్‌మన్ తదుపరి వృత్తాంతాలు) - ఈ రెండూ ఫ్రెడ్‌రిక్ రిటర్ వాన్ లామా రాసినవి; ఎ.పి. షింబర్గ్ రాసిన 'ద స్టోరీ ఆఫ్ థెరిసా నాయ్‌మన్' (1947); ఇవన్నీ విస్కాన్సిన్‌లోని మిల్వాకీలో ఉన్న బ్రూస్ పబ్లిషింగ్ కంపెనీ ప్రచురించింది; జోహానెస్ స్టెయినర్ రాసిన 'థెరిసా నాయ్‌మన్', న్యూయార్కులో స్టేటన్ ఐలండ్‌లోని ఆల్బాహౌస్ ప్రచురించింది.

> డా ఫ్రిట్జ్ గెర్లిక్, "కాథలిక్ బండారం బయటపెట్ట డానికి" కానర్ స్రాత్ వెళ్ళాడు కాని, చివరికి గౌరవ ప్రపత్తులతో ఆమె జీవిత కథ ఒకటి రాశాడు.

ఎప్పటిలాగే నేను, ప్రాచ్యపాశ్చాత్యాల్లో ఎక్కడయినా సరే, ఒక సాధువును కలుసుకోడమంటే ఎంతో కుతూహలపడేవాణ్ణి. మా యాత్రా బృందం జూలై 16న, కానర్‌స్రాత్ విచిత్ర గ్రామంలో అడుగుపెడుతూంటే నా కెంతో ఆనందం కలిగింది. బవేరియా రైతులు (మేము అమెరికా నుంచి తీసుకు వచ్చిన) ఫోర్డుకారునూ, అందులో ఉన్న రకరకాల మనుషుల్నీ - ఒక అమెరికన్ యువకుడూ, ఒక వృద్ధురాలూ, పొడుగాటి జుట్టును కోటు కాలరులోకి దోపుకొని ఉన్న, గోధుమ ఛాయగల తూర్పు దేశీయుణ్ణీ - చూసి చాలా కుతూహలం కనబరిచారు.

కాని దురదృష్టవశాత్తు పాతకాలంనాటి ఒక నుయ్యి పక్కన పూస్తున్న జెరేనియం పూలతో శుభ్రంగా, అందంగా ఉన్న థెరీసా కుటీరం, చడీ చప్పుడూ లేకుండా మూసి ఉంది. ఇరుగుపొరుగువాళ్ళు కాని, ఆ మాటకు వస్తే - పక్క నించి వెళ్ళిన పోస్ట్‌మాన్ కాని, మా కేమీ సమాచారం ఇవ్వలేకపోయారు. వాన పడ్డం మొదలయింది; ఇంక వెళ్ళిపోదామని అన్నారు మా సహచరులు.

"ఉహుం! థెరిసా దగ్గరికి దారితీసే ఉపాయం ఏదో ఒకటి తెలుసుకునే వరకు నే నిక్కడే ఉంటాను," అన్నాను మొండి పట్టుదలతో.

రెండు గంటలు గడిచాక కూడా మేము, విసుగు పుట్టించే వానలో మా కారులోనే కూర్చుని ఉన్నాం. "ప్రభూ! ఆమె ఇక్కణ్ణించి అదృశ్యమయినట్లయితే వన్నెందుకు తీసుకువచ్చావయ్యా ఇక్కడికి?" అంటూ నిష్ఠూరమాడుతూ నిట్టూర్చాను.

ఇంతలో ఇంగ్లీషు మాట్లాడే ఒకాయన మా పక్కన ఆగాడు; తన వల్ల ఏమైనా సహాయం కావాలంటే అడగమన్నాడు, మర్యాదగా.

"థెరిసా ఎక్కడుందో నాకు కచ్చితంగా అయితే తెలీదు. కాని ఆవిడ తరచుగా, ఇక్కడికి ఎనిమిది మైళ్ళ దూరంలో, ఐక్‌స్టాట్ యూనివర్సిటీలో విదేశభాషలు నేర్పే ప్రొఫెసర్ ఫ్రాన్జ్ వుట్జ్ గారింటికి వెడుతూ ఉంటుంది," అన్నాడాయన.

మర్నాడు పొద్దున మేము, ప్రశాంతమైన ఐక్‌స్టాట్ పట్నానికి వెళ్ళాం. డా॥ వుట్జ్ మమ్మల్ని సాదరంగా పలకరించారు, ఇంటిదగ్గర; "ఔను, థెరిసా ఇక్కడే

ఉంది." నిన్ను చూడ్డానికి ఎవరో వచ్చారని, మా గురించి ఆమెకు కబురు పంపా డాయన. కబురు తీసుకువెళ్ళినతను, ఆమె సమాధానంతో తిరిగి వచ్చాడు:

"తమ అనుమతి లేకుండా ఎవరినీ చూడవద్దని బిషప్పు నాకు చెప్పినప్పటికీ, భారతదేశపు భగవద్భక్తునికి నేను స్వాగతం చెబుతాను."

ఈ మాటలకు నేను గాఢంగా చలించి, డా వుట్జ్ వెంబడి, మేడమీది గదిలోకి వెళ్ళాను. శాంతి, ఆనందాల పరివేషంతో ప్రకాశిస్తున్న థెరిసా, వెంటనే లోపలికి వచ్చింది. ఆమె నల్లటిగౌనూ, మల్లెపువ్వులాటి తెల్లటి తలముసుగూ వేసుకుని ఉంది. అప్పటి కామె వయస్సు ముప్పై ఏడు అయినా కూడా అంతకన్న చిన్నదానిలా కనిపిస్తుంది; ఆమెలో శిశుసహజమైన స్నిగ్ధతా ఆకర్షణా ఉన్నాయి ఆరోగ్యంగా, తీర్చి దిద్దినట్టుగా ఉన్న రూపంతో, గులాబి చెక్కిళ్ళతో, ఉల్లాసంగా ఉన్న ఈమె, ఏమీ తినని సాధ్వి!

అతి మృదువైన కరచాలనంతో థెరిసా నాకు స్వాగతం చెప్పింది. ఒకరి నొకరం, దేవుని ప్రేమికులమని తెలుసుకొని మౌన భాషణాతోనే ముగ్ధుల మయాం డా। వుట్జ్, మాకు దుబాసిగా వ్యవహరిస్తామని దయతో అన్నారు. మేము కూర్చున్నాక, థెరిసా నావేపు సహజ కుతూహలంతో చూస్తోందని గమనించాను బవేరియాలో హిందువులు కనిపించడం అరుదన్న సంగతి స్పష్టమే.

"మీ రేమీ తినరా?" ఆమె నోటినించే జవాబు వినాలని నా కోరిక.

"ఉఁహుఁ, రోజూ పొద్దున ఆరింటికి ఒక్క హోస్ట్* తప్ప."

"ఆ హోస్ట్ ఎంత పెద్దగా ఉంటుంది!"

"కాయితమంత పలచగా, చిన్న నాణెమంత ఉరువులో ఉంటుంది,' అంటూ ఇంకా ఇలా అంది ఆమె, "అది నేను పవిత్రానుష్ఠాన కారణాల వల్ల తీసుకుంటాను; అది దైవార్పితమయింది కాకపోతే మింగలేను."

"ఆ ఒక్క దానిమీదా మీరు, నిండు పన్నెండేళ్ళపాటు జీవించి ఉండలేరన్నది నిశ్చయమే కదూ?

" నేను దేవుడి వెలుగువల్ల జీవిస్తున్నాను."

ఆమె జవాబు ఎంత స్పష్టంగా ఉంది! ఎంత ఐన్‌స్టైన్ పద్ధతిలో ఉంది!

---

* యుఖారిస్టిక్ పిండిరొట్టె రేకు.

"శక్తి, ఆకాశం (ఈథర్) నుంచీ సూర్యుడినించీ గాలినించీ మీ ఒంట్లోకి ప్రసరిస్తున్నట్లు మీరు అనుభూతి పొందుతారని నాకు స్పష్టమవుతోంది." చటుక్కున ఆమె ముఖంలో ఒక చిరునవ్వు విరిసింది. "నే నెలా జీవిస్తానో మీరు గ్రహించారని తెలిసి చాలా సంతోషిస్తున్నాను."

" 'మనిషి కేవలం రొట్టెవల్ల కాకుండా, దేవుడి నోటినించి వెలువడ్డ ప్రతి మాటవల్లా జీవిస్తాడు' అంటూ క్రీస్తు పలికిన సత్యానికి మీ పవిత్ర జీవితం నిత్య ప్రత్యక్ష నిరూపణం."*

నేను చేసిన వ్యాఖ్యకు ఆమె మళ్ళీ ఆనందం ప్రకటించింది. "అది నిజానికి అంతే. ఈనాడు నేనీ భూమిమీద ఉన్నానంటే, దానికున్న కారణాల్లో ఒకటి, మానవుడు కేవలం తిండి వల్లనే కాకుండా, దేవుడి అదృశ్యకాంతివల్ల బతగ్గల డని నిరూపించడానికి."

"తిండిలేకుండా బతకడమెలాగో మీరు ఇతరులకు నేర్పగలరా?"

ఆమె ఒక్కరవ్వ ఆశ్చర్యచకితురాలయినట్టు కనిపించింది. "అది నేను చెయ్యలేను; దేవుడు దాన్ని ఆశించడు."

నా చూపు, బలంగా నాజూకుగా ఉన్న ఆమె చేతులమీద పడే సరికి, థెరిసా, రెండు చేతుల వెనకాలా కొత్తగా నయమయిన గాయాల తాలూకు నల్పుదరం మచ్చలు నాకు చూపించింది. ప్రతి అరచేతిలోనూ కొత్తగా నయమయిన,

---

* 'మత్తయి' 4 4. మనిషి శరీరమనే బ్యాటరీ కేవలం స్థూలమైన ఆహారం (రొట్టె) వల్ల కాకుండా, స్పందనశీలక విశ్వశక్తి (మాట లేదా 'ఓం') వల్లనే పనిచేస్తోంది. ఆ అదృశ్యశక్తి, మజ్జా ముఖం అనే ద్వారంగుండా మానవ శరీరంలోకి ప్రసరిస్తుంది. శరీరంలోని ఈ ఆరోకేంద్రం. మెడకు వెనకాల, వెన్నుబాముకు సంబంధించిన ఐదు చక్రాలకూ (ప్రాణశక్తిని ప్రసరింపజేసే "చక్రాలు" లేదా కేంద్రాలు) పైన ఉంటుంది.

శరీరానికి సరఫరా అయే విశ్వప్రాణశక్తి (ఓం)కి ప్రధాన ప్రవేశద్వారమనే మజ్జాముఖం (మెడుల్లా), కనుబొమల మధ్య ఉండే ఒంటికన్నులోని కూటస్థ చైతన్య కేంద్రంతో ద్విముఖం (ద్విధ్రువత, పొలారిటీ)గా కలిసి ఉంది; ఆ ఒంటికన్ను మానవుడి సంకల్పశక్తికి స్థానం. అప్పుడు విశ్వశక్తి, మెదడులో ఉన్న ఏడో కేంద్రంలోకి వచ్చి చేరి అక్కడ నిలకడగా ఉండి అనంత శక్తుల్ని పుంజీభవింపజేసుకున్న ఆశ్రయంలా ఉంటుంది (దీన్నే వేదాల్లో, కాంతిరూపకమైన సహస్రార కమలంగా చెప్పారు). బైబిలులో ఓంకారాన్ని పరిశుద్ధాత్మ (హోలీఘోస్ట్)గా, లేదా సృష్టినంతనీ దైవపరంగా నిలిపి ఉంచే అదృశ్య ప్రాణశక్తిగా ప్రస్తావించడం జరిగింది. "ఏమిటీ? మీ దేహం, మీలో ఉన్న పరిశుద్ధాత్మకు ఆలయమనీ, అది మీకు దేవుడు అనుగ్రహించిందనీ, మీరు మీ సొత్తేమీ కారనీ మీకు తెలియదా?" I కొరింథీయులకు 6.19 (బైబిలు).

చంద్రవంక ఆకారంలోఉన్న, చిన్న గాయాన్ని చూపించింది. ఆ గాయం సూటిగా చేతిలో ఈ వేపు నుంచి ఆవేపుకి ఉంది. వాటిని చూసేసరికి, తూర్పుదేశాల్లో ఇప్పటికీ వాడుకలో ఉన్న పొడుగాటి చదరపు ఇనపమేకులు గుర్తుకు వచ్చాయి నాకు; వాటి కొసలు చంద్రవంక ఆకారంలో ఉంటాయి; అటువంటి మేకులు పడమటి దేశాల్లో ఎన్నడూ చూసిన గుర్తు లేదు.

ఆ సాధ్వి, వారంవారం తనకు అనుభవంలోకి వచ్చే సమాధి స్థితుల గురించి కొంత చెప్పింది. "నిస్సహాయురాలైన ప్రేక్షకురాలిగా, క్రీస్తు వ్యధనంతా గమనిస్తూ ఉంటాను." ప్రతివారం, గురువారం నడిరాత్రి నించి శుక్రవారం మధ్యాహ్నం ఒంటిగంట వరకు ఆమె గాయాలు విచ్చుకొని నెత్తురు ఓడుతుంది. మామూలుగా ఆమెకుండే 121 పౌన్ల బరువులో పది పౌన్లు తగ్గిపోతుంది. థెరిసా సానుభూతిపూర్వకమైన ప్రేమతో బాధపడుతూ ఉన్నప్పటికీ కూడా, వారంవారం కలిగే, ప్రభువు అంతర్దర్శనాల కోసం ఆనందంగా ఎదురుచూస్తూ ఉంటుంది

బైబిలు కొత్త నిబంధనలో గ్రంథస్థమైన ప్రకారం ఏసు జీవితమూ ఆయన్ని శిలువ వేయడమూ అన్నవాటి చారిత్రక యథార్థతను క్రైస్తవులందరికీ తిరిగి ధ్రువ పరచడానికీ ఆ గలిలీయ గురువుకూ ఆయన భక్తులకూ ఉండే శాశ్వతాను బంధాన్ని నాటకీయంగా ప్రదర్శించడానికీ దేవుడు ఆమె విచిత్ర జీవితాన్ని ఉద్దేశించాడని నేను వెంటనే గ్రహించాను.

ప్రొఫెసర్ వుట్జ్, ఆ సాధ్వితో తమకు గలిగిన కొన్ని అనుభవాలు చెప్పాడు

"థెరిసాతో సహా మేము చాలామందిమి, ప్రకృతి దృశ్యాలు చూడ్డంకోసం తరచుగా జర్మనీ అంతటా రోజుల తరబడి తిరుగుతూ ఉంటాం," అన్నాడా యన. "కొట్టవచ్చేటట్టు కనిపించే భేదం ఏమిటంటే - మే మందరం రోజుకు మూడేసిసార్లు భోజనాలు చేస్తూ ఉంటే, థెరిసా ఏమీ తినదు. అలసట అన్నదే అంటనట్టు గులాబీ పువ్వులా తాజాగా ఉంటుంది. మే మందరం ఆకళ్ళతో నకనకలాడుతూ, చొరబడ్డానికి దారి పక్క హోటళ్ళకోసం చూస్తూ ఉంటే, థెరిసా కులాసాగా నవ్వుతూ కూర్చుంటుంది."

ఆ ప్రొఫెసరుగారు, ఆసక్తి కలిగించేటటువంటి శారీరక విషయాలు కొన్ని వివరించారు. "థెరిసా తిండి తినదు కనక, ఆమె పొట్ట అక్కళించుకు పోయి ఉంటుంది. ఆమెకు మలమూత్ర విసర్జనలు లేవు. కాని ఆమెలో చెమట గ్రంథులు మాత్రం పనిచేస్తున్నాయి; చర్మం ఎప్పుడూ మృదువుగా దృఢంగా ఉంటుంది."

మే మింక సెలవు తీసుకునే సమయంలో, థెరిసా సమాధి స్థితిలోఉన్నప్పుడు చూడాలన్న కోరిక వెల్లడించాను.

"సరే, వచ్చే శుక్రవారం కానర్‌స్రాత్‌కు రండి," అన్నదామె సౌహార్దంతో. "బిషప్ మీకు అనుమతి పత్రం ఇస్తారు. మీరు నా కోసం వెతుక్కుంటూ ఐక్‌స్టాట్ దాకా వచ్చి కలుసుకున్నందుకు చాలా సంతోషం."

"థెరిసా నా చేతుల్ని మెల్లగా, చాలాసార్లు ఊపి, మా బృందంతో బాటు వీధి గుమ్మం దాకా వచ్చింది. శ్రీ రైట్, కారులో అమర్చి ఉన్న రేడియో మీట తిప్పాడు. ఆసక్తి నిండిన ముసిముసి నవ్వులతో ఆ సాధ్వి దాన్ని పరిశీలించింది. ఇక కుర్రవాళ్ళు తొంబలు తొంబలుగా పోగవడంతో ఇంట్లోకి వెళ్ళిపోయింది. ఆమెను ఒక కిటికీ దగ్గర చూశాం; ఆమె చిన్నపిల్ల మాదిరిగా మావేపు చెయ్యి ఊపుతూ తొంగిచూసింది.

ఆ మర్నాడు థెరిసా సోదరు లిద్దరితో ముచ్చటించాం. వాళ్ళు చాలా దయగలవాళ్ళూ కలుపుగోలు మనుషులూ. ఆ సంభాషణలో మాకు తెలిసింది ఏమిటంటే, ఆ సాధ్వి రోజుకు ఒకటి రెండు గంటలు మాత్రమే నిద్రపోతుంది. ఒంటిమీద అనేక గాయాలున్నా కూడా ఆమె మంచి చురుకుగా, సత్తువగా ఉంటుంది. ఆమెకు పక్షుల మీద ప్రేమ; చేపల పెంపకం తొట్టి ఒకటి చూసు కుంటూ వాటికి సంరక్షణచేస్తూ ఉంటుంది. తరచుగా తోటలో పనిచేస్తూ ఉంటుంది. ఆమె ఉత్తర ప్రత్యుత్తరాలు భారీగా సాగుతూంటాయి. ప్రార్థనల కోసం, రోగ నివారక ఆశీస్సులకోసం కాథలిక్ భక్తులు ఉత్తరాలు రాస్తూ ఉంటా రామెకు. ఆమె చలవవల్ల తీవ్రవ్యాధులు నయమయినవాళ్ళు చాలామంది ఉన్నారు.

ప్రార్థనద్వారా, ఇతరుల వ్యాధుల్ని తన ఒంటికి తెచ్చుకొని అనుభవించే శక్తి థెరిసాకు ఉందని, ఆమె తమ్ముడు ఫెర్డినాండ్ - సుమారు ఇరవై మూడేళ్ళ వాడు, నాకు చెప్పాడు. ఒకసారి, మత బోధకుడుగా జీవితం ప్రారంభించబోతున్న, తమ పారిష్ యువకుని గొంతు జబ్బు తనకు రావాలని ఆమె ప్రార్థించినప్పటినించి, ఆ సాధ్వి భోజనం మానేసింది.

గురువారం మధ్యాహ్నం మా బృందం, బిషప్ ఇంటికి వెళ్ళింది. ఆయన నా గిరజాల జుట్టువేపు ఆశ్చర్యంగా చూశాడు. మాకు కావలసిన అనుమతి పత్రం సంతోషంగా రాసి ఇచ్చాడు. దానికి రుసుమేమీ లేదు. చర్చివాళ్ళు ఈ నియమం పెట్టింది, ఊసుపోకకు వచ్చే పర్యాటకుల తొక్కిసలాట నుంచి థెరిసాను కాపాడ డానికే. అంతకు ముందటేళ్ళలో అయితే, శుక్రవారాల్లో వేలకొద్దీ జనం గుమి గూడుతూ ఉండేవాళ్ళు.

శుక్రవారం పొద్దున సుమారు తొమ్మిదిన్నరకి మేము కానర్ స్రాత్ చేరాం.

థెరిసా కుటీరంలో, పై కప్పుగా గాజు పలకలు అమర్చిన భాగం ఒకటి ఉందనీ, అది ఆమెకు సమృద్ధిగా వెలుతురు రావడానికి ఏర్పాటు చేసిందనీ గమనించాను తలుపు లిప్పుడు మూసి లేవు; ఆనందంగా స్వాగతం పలుకుతూ బార్లా తెరుచుకుని ఉన్నందుకు సంతోషించాం. సుమారు ఇరవై మంది సందర్శకులు బారుగా నిలబడి ఉన్నారు; ప్రతి ఒక్కరి చేతిలోనూ ఒక అనుమతి పత్రం ఉంది. మేమూ వారితో కలిశాం ఆమె అద్భుత సమాధి స్థితిని దర్శించడానికి చాలా దూరాలనుంచి అనేక మంది వచ్చి ఉన్నారు.

నే నామెను చూడడానికి వచ్చింది కేవలం, తాత్కాలికమైన కుతూహలాన్ని తృప్తిపరచుకోడానికి కాక, ఆధ్యాత్మిక హేతువులవల్ల వచ్చానన్న సహజావబోధంతో థెరిసా, ప్రొఫెసరుగారి ఇంట్లో నా మొదటి పరీక్షలో నెగ్గింది.

నా రెండో పరీక్ష ఏమిటంటే, మేడమీదున్న ఆమె గదిలోకి మెట్లెక్కి వెళ్తున్నప్పుడు నేను, ఆమెతో అతీంద్రియ భావగ్రహణ, దర్శనపరమైన అనుసంధాన స్థితి పొందడంకోసం, నన్ను నేను యోగసమాధిలోకి తెచ్చుకున్నాను. సందర్శకులతో నిండి ఉన్న ఆమె గదిలోకి ప్రవేశించాను. ఆమె తెల్లటి దుస్తులతో పక్కమీద పడుకొని ఉంది. నాకు సరిగా వెనకాల శ్రీరైట్ ఉన్నాడు. గుమ్మంలో అడుగుపెట్టి విచిత్రంగా, అత్యంత భయంకరంగా ఉన్న దృశ్యాన్ని చూసి విస్మయం చెంది అక్కడే ఆగిపోయాను.

థెరిసా కింది కనురెప్పల నుంచి నెత్తురు, అంగుళం వెడల్పు ధారగా పలచగా, ఎడతెరిపిలేకుండా స్రవించింది. ఆమె చూపు, నుదుటి మధ్యనున్న జ్ఞాననేత్రం వేపు కేంద్రీకరించి ఉంది. ఆమె తలకు చుట్టి ఉన్న గుడ్డ, [క్రీస్తు] ముళ్ల కిరీటం తాలూకుగాయాలనుంచి వచ్చిన నెత్తుటితో తడిసి ముద్దయింది. ఆమె గుండెమీదున్న తెల్లటి వస్త్రం మీద ఎర్రటి మరక అయింది. అనేక యుగాల కిందట సైనికుడి బల్లెపు పోటుతో చివరి అవమానాన్ని భరించిన క్రీస్తు శరీరంమీద గాయమయిన చోటనే, ఆమె కయిన గాయంనుంచి వచ్చింది ఆ నెత్తురు.

మాతృవాత్సల్యంతోనూ ప్రార్థనపూర్వకంగానూ చూపే చేష్టగా చాపి ఉన్నాయి థెరిసా చేతులు; ఆమె ముఖంలోని అభివ్యక్తి వ్యధాభరితంగానూ దివ్యంగానూ కూడా ఉంది. ఆమె చిక్కిపోయినట్టూ లోపలా బయటా కూడా అనేక రకాలుగా సూక్ష్మంగా మారినట్టూ కూడా ఉంది. ఏదో విదేశభాషలో గొణుగుతూ ఆమె, తన అధిచేతన దర్శనంలో గోచరిస్తున్న వ్యక్తుల్ని చూసి, కొద్దిగా వణుకుతున్న పెదవులతో మాట్లాడింది.

నేను ఆమెతో అనుసంధానమై ఉన్నందువల్ల ఆమె అంతర్దర్శనాల్లోని దృశ్యాల్ని చూడడం ప్రారంభించాను. అపహాస్యం చేస్తున్న జనసమూహం మధ్యలో

శిలువ కొయ్యలు మోసుకు వెళ్తున్న ఏసును గమనిస్తోందామె.* గాభరాగా చటుక్కున తల ఎత్తింది; ఆ క్రూరభారం కింద ప్రభువు పడిపోయాడు. అంతర్దర్శనం అదృశ్య మయింది. గుండె తరుక్కుపోయే జాలితో థెరిసా, బరువుగా తలగడ మీదకి వాలిపోయింది.

సరిగ్గా ఈ సమయంలో, నా వెనకాల దభీమని పెద్ద చప్పుడయింది. ఒక్క క్షణం తల తిప్పి చూశాను; సాగిలబడ్డ ఒక శరీరాన్ని ఇద్దరు మనుషులు పాయంపట్టి తీసుకువెళ్ళడం గమనించాను. అప్పటికింకా నేను గాఢమైన అధిచేతన స్థితిలోంచి బయటికి వస్తూన్నందువల్ల, పడిపోయిన మనిషిని వెంటనే పోల్చలేక పోయాను. మళ్ళీ నా కళ్ళని థెరిసా ముఖం మీద నిలిపాను. నెత్తుటి వాగులవల్ల, చావు దగ్గరపడ్డవాడి ముఖం పాలిపోయినంతగా పాలిపోయిన ఆమె ముఖం, ఇప్పుడు పరిశుద్ధతనూ పవిత్రతనూ ప్రసరింపజేస్తూ ప్రశాంతంగా ఉంది. అటు తరవాత నా వెనకాల శ్రీరైట్‌ను చూశాను. అతను చెంపకు చెయ్యి ఆన్చుకుని నిలబడ్డాడు; చెంపనుంచి నెత్తురు ఓడుతోంది.

"డిక్, పడిపోయినవాడివి నువ్వా?" అంటూ ఆదుర్దాగా అడిగాను.

"ఔనండి. ఆ భయంకర దృశ్యం చూసి మూర్ఛపోయాను."

"బాగుంది; తిరిగివచ్చి ఆ దృశ్యాన్ని మళ్ళీ చూసే ధైర్యం ఉంది నీకు," అన్నాను ఓదార్పుగా.

ఓర్పుగా కాసుకుని ఉన్న యాత్రికుల బారును గుర్తు చేసుకుని నేను శ్రీరైట్, మౌనంగా థెరిసాకు వీడ్కోలు చెప్పి ఆమె పవిత్ర సన్నిధి నుంచి బయటికి వచ్చాం.†

---

* నేను రావడానికి ముందు గడిచిన గంటల్లో థెరిసా క్రీస్తు జీవితంలోని తుది పది రోజుల అంతర్దర్శనాలూ అనేకం పొందింది మామూలుగా ఆమె సమాధి స్థితి 'కడపటి రాత్రి విందు (Last Supper) వెంబడి జరిగిన సంఘటనల దృశ్యాలతో మొదలయి శిలువమీద క్రీస్తు మరణంతోగాని అప్పుడప్పుడు ఆయన్ని సమాధి చెయ్యడంతోగాని ముగుస్తూ ఉంటుంది

† 1948 మార్చి 26 తేదీన జర్మనీ నుంచి వచ్చిన ఐ.ఎన్.ఎస్ వార్తలో ఇలా ఉంది: "ఈ గుడ్‌ఫ్రైడేనాడు ఒక జర్మన్ కర్షకస్త్రీ మంచం మీద పడుక్కొని ఉంది; శిలువ వేసిన మేకుల వల్లా ముళ్ళకిరీటంవల్లా క్రీస్తు శరీరం మీద ఎక్కడెక్కడినించి నెత్తురు ఓడిందో, ఆమె శరీరంలోని ఆ భాగాల్లో తలమీద, చేతులమీద, భుజాలమీద నెత్తుటి మరకలున్నాయి వేలకొద్దీ జనం, విస్మితులైన జర్మన్లూ, అమెరికన్లూ, తన కుటీరంలో మంచంమీద ఉన్న థెరిసా నాయ్‌మన్ పక్కనుంచి నిశ్శబ్దంగా నడుస్తూ సాగిపోయారు.

ఈ మహోన్నత చిహ్నధారిణి, 1962 సెప్టెంబరు 18తేదీన కానర్‌స్రాత్‌లో మరణించింది. (ప్రచురణకర్త గమనిక)

ఆ మర్నాడు మా బృందం దక్షిణ దిశకు సాగింది. రైలుబళ్ళ మీద ఆధారపడక్కర్లేకుండా, పల్లెపట్టుల్లో ఎక్కడ కావాలనుకుంటే అక్కడ మా ఫోర్డు కారును ఆపగలిగినందుకు సంతోషించాం. జర్మనీ, హాలండ్ ఫ్రాన్స్, స్విస్ ఆల్ప్సు గుండా మేము సాగించినయాత్రలో ప్రతిక్షణం మమ్మల్ని ఆనందభరితుల్ని చేసింది ఇటలీలో అసిసీకి ప్రత్యేకంగా ప్రయాణం పెట్టుకున్నాం; వినయ స్వరూపుడయిన సెంట్ ఫ్రాన్సిస్ గౌరవార్థం ఏర్పాటుచేసుకున్నదది. గ్రీసుతో మా యూరప్ పర్యటన ముగిసింది; అక్కడ మేము ఎథీనియన్ దేవాలయాలు సందర్శించాం; సాధుసత్తము డైన సోక్రటీస్,* తనప్రాణం తీసే విషం తాగిన ఖైదు కొట్టు చూశాం. ప్రతిచోటా, తమ కల్పనలను చలవ రాతిమీద సాక్షీభూతం కావించిన ప్రాచీన గ్రీకుల కళా కౌశలానికి ప్రతి ఒక్కరూ ముగ్ధు లవుతారు.

సూర్యకాంతితో ఉజ్జ్వలమైన మధ్యధరా సముద్రంమీద ఓడలో ప్రయాణం చేసి పాలస్తీనాలో దిగాం. ఆ పవిత్ర భూమిలో రోజుల తరబడి తిరుగుతూ, నా యాత్రకున్న విలువను బాగా తెలుసుకున్నాను. సున్నితమైన హృదయం గలవాడికి, క్రీస్తు మహిమ పాలస్తీనా అంతటా వ్యాపించి ఉన్నట్టు తెలుస్తుంది. బెత్లెహేములో, గెత్సెమేన్‌లో, కాల్వరీలో, పవిత్రమైన మౌంట్ ఆఫ్ ఆలివ్స్ దగ్గర, జోర్డాన్ నదీతీరంలో, గలిలీ సముద్రతటంలో భక్తిపురస్సరంగా, నేను ఆయన పక్కనే నడిచాను.

---

* సోక్రటీస్‌కూ ఒక హిందు మునికి జరిగిన వాగ్వాదాన్ని గురించి 'యూసేబియస్ లో ఒకచోట ఇలా చెప్పడం జరిగింది : "అరిస్టోజినస్ అనే సంగీతకారుడు భారతీయుల్ని గురించి ఈ కింది కథ చెప్పాడు భారతీయుల్లో ఒకడు ఏథెన్సులో సోక్రటీస్‌ను కలుసుకుని ఆయన తత్త్వం విషయవిస్తృతి ఏమిటని అడిగాడు. 'మానవ దృగ్విషయాల అనుశీలన' అని జవాబిచ్చాడు సోక్రటీసు దీని కా భారతీయుడు విరగబడి నవ్వాడు.

"దివ్య దృగ్విషయాల్ని ఎరగనప్పుడు, మానవ దృగ్విషయాల్ని ఎలా అనుశీలన చెయ్యగలడు మనిషి?" అన్నాడతను.

పాశ్చాత్య తత్త్వశాస్త్రాల్లో ప్రతిధ్వనించే గ్రీక్ ఆదర్శం : "మనిషీ, నిన్ను నువ్వు తెలుసుకో" (Man, know thyself) అని. హిందువు అనేది : "మనిషీ , నీ ఆత్మను తెలుసుకో" (Man, know thy Self) అని. "నేను ఆలోచిస్తాను, కనక నేను ఉన్నాను," అంటూ డెకార్ట్ (Descartes) అన్న వాక్యం తాత్త్వికంగా చెల్లదు. తార్కిక వివేచన శక్తులు, మానవుడి పరమ తత్త్వాన్ని వెల్లడించలేవు. మానవ మనస్సు, అది గుర్తించే దృశ్యమాన ప్రపంచం లాగే శాశ్వత పరివర్తనలో ఉన్నది; అంతిమ నిర్ణయాల్ని అది అందించలేదు. బుద్ధి సంబంధమైన సంతృప్తి అత్యున్నత లక్ష్యం కాదు. దేవుణ్ణి అన్వేషించేవాడే 'విద్య'ను నిజంగా ప్రేమించేవాడు; విద్య అంటే, మార్పుచెందని సత్యం. తక్కినదంతా 'అవిద్య'; అంటే సాపేక్ష జ్ఞానం.

మా బృందం, బర్త్‌మాంజర్ (పుట్టు గోలెం), యోసేపు వడ్రంగం కొట్టు, లాజరు గోరీ, మార్తా మేరీల ఇల్లు, కడపటి రాత్రి విందు జరిగిన హాలు సందర్శించింది. పురాతన చరిత్ర మా కళ్ళముందు బహిర్గతమయింది; దృశ్యం తరవాత దృశ్యంగా, యుగయుగాంతరాలు దర్శించడం కోసం ఒకప్పుడు క్రీస్తు ప్రదర్శించిన దివ్య నాటకాన్ని నేను దర్శించాను.

తరవాత ఈజిప్టు చేరాం; ఆధునికమైన కెయిరోనూ పురాతనమైన పిరమిడ్లనూ చూశాం. ఆ తరవాత ఓడలో, దీర్ఘమైన ఎర్ర సముద్రం దిగువకు, ఆ పైన విశాలమైన అరేబియా సముద్రం ఆవలికి ప్రయాణం చేశాం; చివరికి అదుగో, భారతదేశం!

అధ్యాయం : 40

# భారతదేశానికి తిరిగి రాక

కృతజ్ఞతాపూర్వకంగా భారతదేశపు భవ్య వాయువును మళ్ళీ శ్వాసిస్తున్నాను మా ఓడ 'రాజపుటానా,' 1935 ఆగస్టు 22 తేదీనాడు విశాలమైన బొంబాయి రేవుకు చేరి నిలిచింది. ఓడ దిగిన, మొదటి రోజు సైతం, నిర్విరామ కార్య కలాపాలతో నిండబోయే పై సంవత్సరం అనుభవాన్ని ముందే రుచి చూపించింది పూలమాలలతోనూ స్వాగతాభినందనలతోనూ, స్నేహితులు రేవు దగ్గర కూడారు మరి కాసేపట్లో తాజమహల్ హోటల్లో మా గదికి పత్రికా విలేకరులూ ఫొటో గ్రాఫర్లూ ఎందరో బృందాలుగా వచ్చి కలిశారు.

బొంబాయి నగరం నాకు కొత్త. పాశ్చాత్య దేశాలనుంచి వచ్చిన అనేక నవ కల్పనలతో, శక్తిమంతంగా ఆధునికం అయిన నగరంలా కనిపించింది. విశాలమైన వీధుల వెంబడి వరసగా ఒక రకం తాటి చెట్లు నిలిచి ఉన్నాయి; బ్రహ్మాండమైన ప్రభుత్వ భవనాలు ఆసక్తి కలిగించడంలో పురాతన దేవాలయాలతో పోటీ పడు తున్నాయి. అయితే, వినోద దృశ్యావలోకనానికి వినియోగించిన కాలం తక్కువ గురుదేవుల్నీ, ఇతర ఆత్మీయుల్నీ ఎప్పుడెప్పుడు చూస్తానా అని ఆతృతగా ఉన్నాను ఫోర్డు కారును సామాను రైలుపెట్టెలోకి ఎక్కించి, త్వరలోనే మేము ముగ్గురం కలకత్తా వేపు పోయే రైలులో వడివడిగా సాగిపోయాం.*

హౌరా స్టేషన్‌లోకి మేము చేరేసరికి మమ్మల్ని అభినందించడానికి జనం విరివిగా గుమిగూడినందువల్ల, కొంతసేపటిదాకా మేము బండిలోంచి దిగడమే సాధ్యం కాలేదు. కాశింబజారు యువ మహారాజా, మా తమ్ముడు విష్ణు స్వాగత సంఘానికి నాయకత్వం వహించారు. మా బృందానికి స్వాగతం ఇవ్వడంలో వారు చూపించిన ఆప్యాయత, ఘనత నేను ఎదురుచూసినవి కావు.

---

* వార్ధాలో మహాత్మాగాంధీని చూడ్డానికని దేశమధ్యంలో ఉన్న మధ్య పరగణాల్లో మా ప్రయాణం ఆపాం. ఆ రోజుల్ని గురించి 44 అధ్యాయంలో వివరించడం జరిగింది

కార్లూ మోటారు సైకిళ్ళూ బారుగా ముందు సాగుతూ ఉండగా, మృదంగాలూ శంఖాలూ ఆనందధ్వానాలు కావిస్తూ ఉండగా మిస్ బ్లెట్ష్, శ్రీరైట్, నేనూ ఆపాదమస్తకం పూలదండలతో నిండిపోయి, మెల్లగా మా నాన్నగారి ఇంటికి సాగాం.

వృద్ధులైన మా నాన్నగారు, చనిపోయినవాడు మళ్ళీ బతికి వచ్చినప్పుడు పట్టుకునేటంత గాఢంగా నన్ను కౌగలించుకున్నారు; ఆనందంతో నోట మాట లేకుండా ఒకరినొకరం చూసుకుంటూ చాలాసేపు అలాగే ఉండిపోయాం. తమ్ముళ్ళు, అక్కచెల్లెళ్ళు, మామయ్యలు, అత్తలు, బావలు, విద్యార్థులు, చిరకాల మిత్రులు నా చుట్టూ మూగేశారు; మాలో చెమ్మగిలని కన్ను ఒక్కటీ లేదు. నా జ్ఞాపకాల పురావస్తు భండారంలోకి చేరిపోయిన, ఆ ప్రేమ పూర్వక పునస్సమాగమ దృశ్యం మరవరానిదై నా గుండెలో స్పష్టంగా నిలిచిపోతుంది. శ్రీయుక్తేశ్వర్‌గారిని కలుసుకున్న సందర్భం వర్ణించడానికి నాకు మాటలు చాలవు; నా కార్యదర్శి చేసిన కింది వర్ణనతోనే సరిపెట్టుకుందాం :

"ఈ రోజు, గొప్ప ఉత్కంఠతో నిండిపోయి, యోగానందగారిని కారులో కలకత్తా నుంచి శ్రీరాంపూర్ తీసుకువెళ్ళాను," అని రాసుకున్నాడు శ్రీరైట్, తన ప్రయాణం డైరీలో.

"వింతవింత దుకాణాలు దాటి ముందుకు వెళ్ళాం. వాటిలో ఒకటి, యోగానందగారు కాలేజిలో చదివే రోజుల్లో, ఆయనకు ఇష్టమైన ఫలహారశాల. చివరికి, గోడల మధ్యగా సాగిన ఒక సన్న సందులోకి ప్రవేశించాం. చటుక్కున ఎడమవేపుకి ఒక్క మలుపు; అక్కడ మా కెదురుగా, గురుదేవుల ఇటుకలతో నిర్మించిన రెండంతస్తుల ఆశ్రమ భవనం. దాని ఇనుపచట్రం బిగించిన బాల్కనీ, పై అంతస్తు నుంచి ముందుకు చొచ్చుకు వచ్చింది. చుట్టూ ప్రశాంతమైన ఏకాంతం.

"గంభీరమైన నమ్రతతో, యోగానందగారి వెనకనే నడిచి ఆశ్రమం గోడల మధ్యనున్న ముంగిట్లో అడుగుపెట్టాను. గుండెలు దడదడా కొట్టుకుంటూ ఉండగా, పాత సిమ్మెంటు సీడీలు ఎక్కడం ప్రారంభించాం. ఇంతవరకు వేలాది సత్యాన్వేషకులు వాటిమీదగా నడిచి ఉంటారనడంలో సందేహం లేదు. మేము అడుగుతీసి అడుగు వేస్తుంటే మాలో ఉత్కంఠ పెరుగుతూ వచ్చింది. మా కెదురుగా మెట్లపైన, ఋషిసహజమైన ఉదాత్తగంభీర భంగిమలో నిలబడి, ప్రశాంతంగా దర్శనమిచ్చారు, మహామహులు స్వామి శ్రీయుక్తేశ్వర్‌గారు.

"వారి పవిత్ర సన్నిధిలో నిలిచే భాగ్యం కలిగినందుకు ధన్యుణ్ణి అయానన్న అనుభూతి కలుగుతూ ఉండగా నా గుండె ఎగిసి పడింది. యోగానందగారు

మోకాళ్ళ మీదికి వాలి, తల వంచి సర్వాత్మనా కృతజ్ఞతాంజలులు అర్పిస్తూ చేతులతో గురుదేవుల పాదాలు స్పృశించి, ఆ తరవాత వినయాంజలిగా తమ నుదుటికి తాకిస్తూ ఉండగా, ఉత్సుకతతో చూస్తున్న నా చూపును అలుక్కు పోయేటట్టు చేశాయి, కన్నీళ్ళు. తరవాత ఆయన లేచారు; అప్పుడు శ్రీయుక్తేశ్వర్ గారు ఆయన రెండు బుజాలూ హత్తుకొని కౌగలించుకున్నారు.

"మొదట్లో మాటలు పెకలలేదు; అయినా, ఆత్మకున్న మౌనభాషలో గాఢమైన అనుభూతి అభివ్యక్తమయింది. ఆత్మపునస్సమాగమంతో వారి కళ్ళు ఎలా మిలమిల మెరిశాయి! వాటిలో ఎంత ఆప్యాయత పెల్లుబికింది! ప్రశాంత మైన ఆ మండువాలో స్నిగ్ధతా స్పందన ఒకటి వ్యాపించింది; ఆ సన్నివేశాన్ని దీప్తిమంతం చెయ్యడానికి మబ్బుల్ని తప్పించేసుకున్నాడు సూర్యుడు.

"నేను ఆ పరమ గురుదేవుల ముందు మోకరిల్లి, నా అవ్యక్తప్రేమా ధన్యవాదాలూ అర్పించుకున్నాను; కాలగతిలోనూ సేవలోనూ రాటుదేరిన ఆయన పాదాల్ని తాకి దీవెనలందుకున్నాను. అప్పుడు లేచి, గాఢమైన అంతః పరీక్షతో రగులుతున్న అందమైన రెండు కళ్ళలోకి చూశాను; అవి ఆనందంతో వెలుగు తున్నాయి.

వారు కూర్చునే గదిలోకి ప్రవేశించాం. అందులో ఒక పక్క అంతా, మొదట వీధిలోంచి కనిపించిన బాల్కనీలోకి తెరిపిగా ఉంది. పరమ గురువులు గచ్చునేల మీద పరిచిఉన్న పరుపుమీద కూర్చుని ఒక పాత దివానుమీద ఆనుకొన్నారు. యోగానందగారూ నేనూ పరమ గురువుల పాదాల దగ్గర, తుంగ చాపమీద కూర్చున్నాం; మేము సుఖంగా కూర్చోడానికి చేర్లబడ్డానికి నారింజవన్నె దిండ్లు ఉన్నాయి.

"స్వాములవార్లిద్దరూ మాట్లాడుకునే బెంగాలీ సంభాషణ సారాంశం అర్థం చేసుకోడానికి ప్రయత్నించి విఫలమయాను. (ఎంచేతంటే, స్వామిజీ మహారాజ్ - ఆ పరమ గురువులను ఇతరులు అలాగే పిలుస్తారు - ఇంగ్లీషు మాట్లాడ గలవారూ, తరచు మాట్లాడేవారూ అయినప్పటికీ కూడా, వారిద్దరూ కలిశారంటే ఇంగ్లీషు ఉపయోగించరని కనిపెట్టాను). అయినా, స్వామిజీ మహారాజ్ ఋషిత్వాన్ని హృదయాహ్లాదకరమైన చిరునవ్వుద్వారా, మిలమిలలాడే కళ్ళద్వారా సులువుగానే దర్శించాను. సరదాకు అన్నా, గంభీరంగా అన్నా, ఆయన సంభాషణలో చటుక్కున గోచరించే లక్షణమేమిటంటే, చెప్పినదాంట్లో అధికారికత - ఇది ఋషి లక్షణం: తమకు దేవుడు తెలుసు కనక, తమకు తెలుసని తెలిసినవారి లక్షణం. వారి మహత్తరమైన జ్ఞానం, కార్యదీక్ష, నిశ్చయాత్మకత ప్రతిదాంట్లోనూ కళ్ళకు కడుతున్నాయి.

"ఆయన దుస్తులు నిరాడంబరంగా ఉన్నాయి; ఆయన పంచె, చొక్కా

ఒకప్పుడు కాషాయవన్నె అద్దినవే కాని, ఇప్పుడవి వెలిసిపోయిన నారింజ వన్నెలోకి దిగాయి. అప్పుడప్పుడు ఆయన్ని పూజ్యభావంతో పరిశీలిస్తూ నేను గమనించింది ఏమిటంటే - ఆయనది భారీ విగ్రహం, కసరత్తు చేసినట్టున్న శరీరం; సన్యాస జీవితంలో ఎదురయ్యే పరీక్షలవల్లా త్యాగాలవల్లా రాటుదేలినది. ఆయన దేహ భంగిమ రాజసం ఉట్టిపడేలా ఉంటుంది. ఆయన నిటారుగా ఠీవిగా నడుస్తారు. కులాసాగా నోటినిండా నవ్వే అలవాటు ఆయనకుంది; ఆ నవ్వుకూడా ఆయన రొమ్ములో లోతునించి వస్తుంది; దాంతో ఆయన ఒళ్ళంతా ఊగిపోయేటట్టు నవ్వుతారు.

"ఆయన గంభీరమైన ముఖములో ఒక దివ్యశక్తి కొట్టవచ్చినట్టు కనబడు తుంది. మధ్యలో పాపిడి తీసిఉన్న ఆయన జుట్టు నుదుటి చుట్టూ తెల్లగానూ, తక్కినచోట్ల నిగనిగలాడే బంగారు వన్నెనూ నలుపువన్నెనూ పోలిన చారలేర్పడి, చివర భుజాల దగ్గర కొసలు ఉంగరాలు తిరిగి ఉన్నాయి. ఆయన గడ్డం, మీసం స్వల్పమే; లేదా పలచబడిపోయి ఉండవచ్చు. అయినా ఆయన మొక్కట్లకు అవి అందం చేకూరుస్తున్నాయి. ఊర్ధ్వలోకాల్ని అన్వేషిస్తూ ఉన్నట్లు ఆయన నుదురు ఏటవాలుగా ఉంది. ఆయన నల్లటి కళ్ళచుట్టూ ఆకాశనీలం వన్నె వలయం ఏర్పడి ఉంది. ఆయనకు కొంచెం పెద్ద ముక్కే ఉంది; ఏమీ తోచ నప్పుడు దాన్ని చిన్న పిల్లవాడిలా వేళ్ళతో తాటిస్తూ, ఇటూ అటూ ఆడిస్తూ దానితో ఆడుకుంటూ ఉంటారు. విశ్రాంతిగా ఉన్నప్పుడు ఆయన మూతి కాఠిన్యాన్ని సూచించినా ఒక సూక్ష్మమైన మార్దవాన్ని కూడా కలిగి ఉంటుంది.

"ఇటూ అటూ పరకాయించి చూస్తూ, కొంత వరకు శిథిలావస్థలో ఉన్న ఆయన గది, యజమానికి భౌతిక సుఖాలపట్ల ఉన్న అనాసక్తిని సూచిస్తున్నట్టు గమనించాను. పొడవాటి ఆ గదికున్న తెల్ల గోడలు వాతావరణ ప్రభావానికి గురిఅయి, వెలిసిపోతున్న నీలిపూత చారల్ని కనబరుస్తున్నాయి. గదిలో ఒక చివర లాహిరీ మహాశయుల విశిష్టమైన బొమ్మ ఒకటి వేలాడుతోంది; దానికి భక్తితో అలంకరించిన ఒక పూలదండ ఉంది. అక్కడ యోగానందగారి పాత ఫోటో కూడా ఒకటి ఉంది; ఆయన మొదట బోస్టన్ వచ్చినప్పుడు, కాంగ్రెస్ ఆఫ్ రెలిజియన్స్‌కు వచ్చిన ఇతర ప్రతినిధులతో కలిసి నిలబడి ఉన్న ఫోటో అది.

"పాతకొత్తల మేలు కలయిక ఒకటి ఇక్కడ గమనించాను. కొవ్వొత్తి దీపాల గాజు చాందినీ ఒకటీ గోడమీద కాలెండరు ఒకటీ; వాడకపోవడంవల్ల ఆ చాందినీ నిండా సాలీళ్ళు గూళ్ళు కట్టేశాయి, ఇక్కడ గోడమీదున్నది అందమైన సరికొత్త కాలెండరు. గది అంతా శాంతిసౌఖ్యాల సుగంధాన్ని వెదజల్లుతోంది.

"బాల్కనీకి అవతల, మౌనంగా నిలబడి రక్షణ ఇస్తున్నట్టున్న, పొడుగాటి కొబ్బరి చెట్లను చూశాను.

"పరమగురువులు కేవలం తప్పట్లు కొడితే చాలు; పూర్తిఅయేలోగానే ఎవరో ఒక చిన్న శిష్యుడు హాజరవుతాడు. అట్టి శిష్యుల్లో సన్నటి ప్రఫుల్లుడు* ఒకడు. పొడువాటి నల్లటి జుట్టూ, మెరిసేకళ్ళూ, సమ్మోహకమైన చిరునవ్వూ కలవాడు అతను నవ్వినప్పుడు మూతికొసలు పైకి లేస్తాయి. కళ్ళు మెరుస్తాయి - సంజవేళ హఠాత్తుగా విదియ చంద్రుడూ నక్షత్రాలూ ప్రత్యక్షమయినట్టు!

"తమ 'శిష్యుడు' తిరిగి వచ్చిన సందర్భంగా స్వామి శ్రీయుక్తేశ్వరులకు కలిగిన ఆనందం సహజంగా గాఢమైనది; (తమ 'శిష్యుడి శిష్యు'ణ్ణి అయిన నా గురించి కూడా ఆయన కొంత మట్టుకు ఆసక్తి చూపిస్తున్నట్టు కనబడింది) అయినప్పటికీ, పరమగురువుల స్వభావంలో జ్ఞానానికున్న ప్రాబల్యం, అనుభూతిని బాహ్యంగా వ్యక్తీకరించకుండా ఆటంకపరుస్తుంది.

"యోగానందగారు ఆయనకు కొన్ని కానుకలు సమర్పించారు; శిష్యుడు తన గురువు దగ్గరికి తిరిగి వచ్చినప్పుడు అలా కానుకలు సమర్పించడం ఆచారం కనక. తరవాత కొంతసేపటికి మేము భోజనాలకు కూర్చున్నాం; అన్నం కూరలతో చక్కగా వండిన సాదా భోజనమది. 'చేత్తో తినడం' వంటి భారతీయాచారాలు కొన్ని నేను పాటిస్తున్నందుకు శ్రీయుక్తేశ్వర్‌గారు ఎంతో ముచ్చట పడ్డారు

"కొన్ని గంటలసేపు బెంగాలీ భాషలో సంభాషణలు సాగి, స్నిగ్ధమైన చిరునవ్వులూ ప్రసన్నమైన చూపులూ ప్రసరించిన తరవాత, మేము ఆయన పాదాల ముందు వాలి, ప్రణామం†తో సెలవు తీసుకున్నాం; ఆ పవిత్ర సమాగమం తాలూకు చిరస్మరణీయమైన అనుభూతితో కలకత్తాకు బయలుదేరాం. నేను ముఖ్యంగా, పరమగురువుల గురించిన బాహ్యవిషయ వర్ణనలే చేసినప్పటికీ, ఆయన ఆధ్యాత్మిక మహిమ నాకెప్పుడూ స్ఫృహలోనే ఉంది. వారి శక్తి నాకు అనుభూతమయింది. ఆ అనుభూతిని దివ్యమయిన ఆశీస్సుగా ఎప్పటికీ నిలుపుకొంటాను."

అమెరికానుంచి, యూరప్‌నుంచి, పాలస్తీనా నుంచి నేను శ్రీయుక్తేశ్వర్‌గారి కోసం చాలా కానుకలు తెచ్చాను. వాటిని ఆయన చిరునవ్వుతో స్వీకరించారు;

---

* గురుదేవుల దగ్గరికి తాచుపాము ఒకటి వచ్చినప్పుడు అక్కడున్న కుర్రవాడు ప్రఫుల్లుడే (పే. 148 చూడండి).

† అంటే, "సంపూర్ణమైన నమస్కారం." సంస్కృతంలో 'నమ్' అనే ధాతువుకు మొక్కడం లేదా వంగడం అనీ, 'ప్ర' అనే ఉపసర్గకు 'సంపూర్ణంగా' అనీ అర్థాలు; వాటితో వచ్చిన పదమిది

కాని ఏమీ వ్యాఖ్యానించలేదు. నా కోసమని నేను జర్మనీలో గొడుగూ చేతికర్రా కలిసిన బెత్తం ఒకటి కొనుక్కున్నాను. ఇండియాలో, ఆ బెత్తం గురుదేవులకు ఇవ్వాలని నిశ్చయించుకున్నాను.

"నిజంగా ఈ కానుకను మెచ్చుకుంటాను!" ఆప్యాయత కూడిన అవగాహనతో చూపు నావేపు సారించి, గురుదేవులు ఆనవాయితీ లేని ఈ వ్యాఖ్య చేశారు. నే నిచ్చిన బహుమతులన్నిటిలోకీ, సందర్శకులకు చూపించడానికి ఆయన ఎన్నుకున్నది ఈ చేతికర్ర.

"గురుదేవా, కూర్చునే గదికోసం కొత్త తివాసీ ఒకటి తెప్పించడానికి నాకు అనుమతి ఇయ్యండి." శ్రీయుక్తేశ్వర్‌గారి పులిచర్మం, చిరుగుల కంబడి మీద పరిచి ఉన్న సంగతి అంతకుముందు గమనించాను.

"నీకంత సరదాగా ఉంటే అలాగే కానియ్యి." గురుదేవుల గొంతులో ఉత్సాహమేమీ లేదు. "చూడు, నా పులిచర్మం చక్కగా, శుభ్రంగా ఉంది; నా చిన్న రాజ్యంలో నేనే రాజును. దీనికి అవతలున్నది, బాహ్య విషయాల మీద మట్టుకే ఆసక్తి ఉన్న విశాల ప్రపంచం."

ఆయన ఈ మాటలు అంటూంటే, ఏళ్ళు వెనక్కి దొర్లిపోయినట్టనిపించింది; చివాట్ల చిచ్చుల కొలిమిలో రోజా స్వర్ణశుద్ధి జరిగే బాలశిష్యుణ్ణే అయిపోయాను మళ్ళీ.

శ్రీరాంపూర్ నుంచి, కలకత్తానుంచి బయటపడగలిగిన వెంటనే నేను, శ్రీరైట్‌తో కలిసి రాంచీకి బయలుదేరాను. అక్కడ ఏం స్వాగతం! ఏం ఆనందోత్సాహం! నేను లేని ఈ పదిహేనేళ్ళలో విద్యాలయ పతాకాన్ని ఉవ్వెత్తున నిలిపి ఉంచిన, నిస్స్వార్థ బుద్ధిగల ఉపాధ్యాయుల్ని కావలించుకుంటూ ఉంటే, నా కళ్ళలో నీళ్ళు నిలిచాయి. అక్కడి ఆశ్రమవాసి విద్యార్థుల్లోనూ పగటి విద్యార్థుల్లోనూ ఆనందోజ్జ్వలమైన ముఖాలు ప్రసన్నమైన చిరునవ్వులూ చూస్తుంటే, జాగ్రత్తగా ఆ ఉపాధ్యాయు లిచ్చిన విద్యాలయశిక్షణకూ యోగశిక్షణకూ ఉన్న విలువకు సమృద్ధిగా దాఖలా కనిపించింది.

అయినా, దురదృష్టవశాత్తూ, రాంచీ సంస్థ దుర్భరమైన ఆర్థిక ఇబ్బందుల్లో ఉంది. రాచఫాయీకి తగ్గ విరాళాలెన్నో ఇచ్చిన కాశింబజార్ మహారాజా - సర్ మణీంద్రచంద్ర నందిగారు గతించారు; వారిచ్చిన కాశింబజార్ భవనాన్నే ఇప్పుడు

కేంద్ర విద్యాలయ భవనంగా మార్చడం జరిగింది. ప్రజాదరణ తగినంతగా లేకపోవడంవల్ల, విద్యాలయంలో ఉచితంగా, ఉదారంగా కల్పించే వసతులు అనేకం తీవ్రంగా దెబ్బతిన్నాయి.

నేను అమెరికాలో ఉన్న అన్నేళ్ళూ, అక్కడి వ్యవహార జ్ఞానమూ అడ్డంకు లెదురైనప్పుడు చూపవలసిన మొక్కవోని కార్యదీక్షా నేర్చుకోకుండా ఉండలేదు. క్లిష్ట సమస్యలతో కుస్తీపడుతూ రాంచీలో ఒక వారం రోజులు ఉండిపోయాను. తరవాత కలకత్తాలో ప్రముఖ నాయకులతోనూ విద్యావేత్తలతోనూ ఇంటర్వ్యూలు జరిగాయి. యువకుడైన కాశింబజారు మహారాజుతో చాలాసేపు మాట్లాడాను. ఆర్థిక సహాయంకోసం నాన్నగారిని అర్థించాను. ఇక చూడండి! కదలబారుతున్న రాంచీ విద్యాలయం పునాదులు చక్కబడ్డం మొదలయింది. సరయిన సమయంలో మా అమెరికా విద్యార్థుల నుంచి కూడా విరాళాలు వచ్చాయి.

నేను భారతదేశానికి వచ్చిన కొన్ని నెలల్లోనే, రాంచీ విద్యాలయం చట్ట బద్ధంగా నమోదు కావడం చూసి ఆనందించాను. చిరస్థాయిగా ఒక యోగ విద్యాకేంద్రాన్ని నెలకొల్పాలన్న నా జీవిత స్వప్నం సఫలమయింది. ఆ మహదాశ యమే నన్ను, 1917లో ఏడుగురు విద్యార్థులతో చిన్నగా మొదలుపెట్టడానికి పురికొల్పింది.

యోగదా సత్సంగ బ్రహ్మచర్య విద్యాలయం అన్న ఈ బడి, ప్రాథమిక భాషాబోధన స్థాయిలోనూ ఉన్నత పాఠశాలా విషయస్థాయిలోనూ జరిగే తరగతులు ఆరుబయట నడుపుతుంది. ఆశ్రమవాసి విద్యార్థులూ పగటి విద్యార్థులూ కూడా ఏదో ఒక రకం వృత్తివిద్యా శిక్షణ పొందుతారు.

స్వయంనిర్ణయాధికారం గల సంఘాలద్వారా, విద్యార్థులే తమ కార్యకలా పాల్ని క్రమబద్ధం చేసుకుంటారు. మాస్టరును బోల్తా కొట్టించడమంటే సరదాపడే పిల్లకాయలు, తమతోటి విద్యార్థులు పెట్టే కట్టుబాట్లనయితే సంతోషంగా అంగీకరిస్తారన్న సంగతి నేను, నా ఉపాధ్యాయ వృత్తిలో చాలా తొలిరోజుల్లోనే కనిపెట్టాను. ఎన్నడూ ఆదర్శవిద్యార్థిని కాని నేను, పిల్లల చిలిపి అల్లరికీ, వాళ్ళ సమస్యలకీ అన్నిటికీ సహజంగానే సానుభూతి చూపిస్తాను.

ఆటల్నీ పోటీల్నీ ప్రోత్సహించడం జరిగింది; హాకీ, ఫుట్‌బాల్ ఆటల అభ్యాసంతో మైదానాలు దద్దరిల్లుతూ ఉంటాయి. రాంచీ విద్యార్థులు ఆటల పోటీల్లో తరచుగా కప్పులు సంపాయిస్తూ ఉంటారు. సంకల్ప శక్తి ద్వారా - అంటే, ప్రాణశక్తిని

ఒంట్లో ఏ భాగానికయినా సరే మానసికంగా పంపడం ద్వారా - కండరాలకు మళ్ళీ సత్తువ చేకూర్చే యోగదా వ్యాయామ పద్ధతిని కుర్రవాళ్ళకు నేర్పుతారు. వాళ్ళు ఆసనాలూ, కత్తిసామూ, కర్రసామూ కూడా నేర్చుకుంటారు. ప్రథమ చికిత్సలో శిక్షణ పొందిన రాంచీ విద్యార్థులు, తమ రాష్ట్రంలో వరద, కరువు వంటి విపత్కర పరిస్థితులు వచ్చినప్పుడు ఎంతో సేవచేసి మెప్పు పొందారు. కుర్రవాళ్ళు తోటలో పనిచేసి వాళ్ళ కూరగాయలు వాళ్ళే పండించుకుంటారు.

రాష్ట్రంలో ఉన్న కోల్, సంతాల్, ముండా జాతులనే ఆదిమ గిరిజనుల తెగలవారికి ప్రాథమిక విద్యావిషయాలు బోధిస్తారు. దగ్గరి పల్లెల్లో ఆడపిల్లలకు మాత్రమే తరగతులు నడుపుతారు.

రాంచీ విద్యాలయం విశిష్ట లక్షణం క్రియాయోగ దీక్ష ఇవ్వడం. కుర్రవాళ్ళు ప్రతిరోజూ తమ ఆధ్యాత్మిక అభ్యాసాలు సాధనచేస్తూ ఉంటారు. గీతా పారాయణ చేస్తారు; నిరాడంబరత, స్వార్థత్యాగం, గౌరవం, సత్యం అన్న గుణాల్ని ఉపదేశం ద్వారానే కాకుండా ఆచరించి చూపించడమనే ఆదర్శం ద్వారా కూడా బోధించడం జరుగుతున్నది. దుఃఖాన్ని కలిగించేదాన్ని చెడుగానూ నిజమైన సుఖాన్ని ఇచ్చే పనులే మంచిగాను వాళ్ళకు నిర్దేశించడం జరుగుతుంది. చెడును విషం కలిపిన తేనెతో పోల్చవచ్చు; అది మనకు మోహం పుట్టిస్తుంది, కాని అందులో మృత్యువు పొంచి ఉంది.

ధారణ ప్రక్రియలు, శరీరానికీ మనస్సుకూ ఉండే అశాంతిని జయించడంలో అద్భుతమైన ఫలితాలు సాధించాయి. కంటికి ఇంపు కలిగించే రూపురేకలు గల తొమ్మిది పదేళ్ళ కుర్రవాడొకడు, నిశ్చల మనస్కుడై, రెప్పలార్పకుండా జ్ఞాననేత్రం వేపు చూపు సారించి, గంటకు పైగా అలాగే నిలిపి కూర్చుని ఉండడం రాంచీలో వింతేమీ కాదు.

పండ్లతోటలో ఒక శివాలయ ముంది. పూజ్యపాదులైన పరమ గురువులు లాహిరీ మహాశయుల విగ్రహం ఒకటి అక్కడ ఉంది. నిత్య ప్రార్థనలూ పవిత్ర గ్రంథబోధన తరగతులూ తోటలో మామిడిచెట్ల గుబురుల నీడన జరుగుతూ ఉంటాయి.

రాంచీ ఎస్టేట్‌లో ఉన్న యోగదా సత్సంగ సేవాశ్రమం భారత దేశంలోని వేలాదిమంది బీదవాళ్ళకు ఉచిత వైద్య సహాయం, శస్త్రచికిత్సా సదుపాయం చేస్తూంటుంది.

రాంచీ సముద్ర మట్టానికి 2,000 అడుగుల ఎత్తున ఉంది. వాతావరణం మందంగా, సమశీతోష్ణంగా ఉంటుంది. ఇరవయి ఎకరాల భూమిలో, దేశంలోని చక్కని తోటల్లో ఒకటిగా చెప్పదగ్గ ఒక పండ్లతోట కూడా ఉంది. అందులో ఐదువందల ఫలవృక్షాలున్నాయి - మామిడి, ఖర్జూరం, జామ, లీచీ, పనస.

రాంచీ గ్రంథాలయంలో అనేక పత్రికలూ, ఇంగ్లీషూ బెంగాలీ భాషల్లో రాసిన వేలకొద్దీ గ్రంథాలూ ఉన్నాయి; తూర్పు, పడమటి దేశాల వాళ్ళు విరాళంగా ఇచ్చినవవి. ప్రపంచ పవిత్ర గ్రంథాల సేకరణ గ్రంథరాశి కూడా అక్కడ ఉంది. పురాతత్త్వ, భూ విజ్ఞాన, మానవశాస్త్ర సంబంధమైన ప్రాముఖ్యం గల అమూల్య శిలల్ని చక్కగా వర్గీకరించి అమర్చిపెట్టిన పురావస్తు ప్రదర్శనశాల (మ్యూజియం) ఒకటి ఉంది: వాటిలో చాలామట్టుకు, వైవిధ్య సమృద్ధమైన ఈశ్వరుడి భూమి మీద నేను జరిపిన సంచారాల్లో సేకరించినవే.*

రాంచీ పాఠశాల మాదిరిగా ఆశ్రమవాస, యోగసాధన అవకాశాలు గల బ్రాంచి హైస్కూళ్ళు స్థాపించడం జరిగింది; అవి ఇప్పుడు బాగా వర్ధిల్లుతున్నాయి అవి ఏవంటే: మగపిల్లల కోసం లఖన్‌పూర్‌లో ఉన్న 'యోగదా సత్సంగ విద్యాపీఠం,' ఇస్మాలీచక్‌లో ఉన్న 'యోగ విద్యాలయం,' ఆశ్రమం - ఇవి పశ్చిమబెంగాల్లో పురులియా, మిద్నపూర్ జిల్లాల్లో ఉన్నాయి.†

---

* శ్రీశ్రీ పరమహంస యోగానందగారు సేకరించిన ఆ మాదిరి వస్తువులతో పాశ్చాత్య ప్రపంచంలో కూడా ఒక పురావస్తు ప్రదర్శనశాల ఉంది; అది కాలిఫోర్నియాలోని పసిఫిక్ పాలిసేడ్స్‌లో, సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ సరోవర మందిరంలో ఏర్పాటయి ఉంది (ప్రచురణ కర్త గమనిక).

ఉత్తరోత్తరా, మగపిల్లలకూ ఆడపిల్లలకూ కూడా ఉపకరించే విధంగా అనేక యోగదా విద్యాసంస్థలు దేశంలో చాలాచోట్ల ఏర్పడి, ఇప్పుడు బాగా వర్ధిల్లుతున్నాయి. ఈసంస్థలు కిండర్ గార్టెన్ స్థాయినించి కళాశాల స్థాయివరకు ఉన్నాయి. (ప్రచురణకర్త గమనిక).

† 'యోగదా' శబ్దం యోగ, దా అన్న రూపాలతో ఏర్పడింది. యోగమంటే కలయిక, సామరస్యం, సంతులనం; దా అంటే ఇచ్చేది. 'సత్సంగ' శబ్దంలో సత్ అంటే సత్యం· సంగమంటే స్నేహం.

'యోగదా' శబ్దం, 1916లో పరమహంస యోగానందగారు పెట్టిన పేరు; మానవ శరీరాన్ని విశ్వమూలశక్తి నుంచి తీసుకునే శక్తితో తిరిగి నింపే విధానాన్ని ఆయన కనిపెట్టినప్పుడు రూపొందిన పేరు.

శ్రీయుక్తేశ్వర్‌గారు తమ ఆశ్రమ వ్యవస్థకు 'సత్సంగం' అనే పేరుపెట్టారు; ఆయన శిష్యులు పరమహంస యోగానందగారు సహజంగా ఆ పేరే అట్టే పెట్టాలనుకున్నారు.

1939లో దక్షిణేశ్వరంలో గంగానదికి ఎదురుగా రాజప్రాసాదంలాంటి భవనంలో యోగదా మఠాన్ని స్థాపించడం జరిగింది. కలకత్తాకు ఉత్తరాన కొద్దిమైళ్ళ దూరంలోనే ఉన్న ఈ ఆశ్రమం, నగర వాసులకు శాంతి నిలయంగా ఉపకరిస్తుంది.

దక్షిణేశ్వర మఠం, యోగదా సత్సంగ సొసైటీకి భారతదేశంలో వివిధ ప్రాంతాల్లో దానికున్న విద్యాలయాలకూ కేంద్రాలకూ ఆశ్రమాలకూ ప్రధాన కార్యాలయం. యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా, సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ అంతర్జాతీయ ప్రధాన కార్యాలయానికి చట్టబద్ధంగా అనుబంధమై ఉంది: ఈ కార్యాలయం అమెరికాలో కాలిఫోర్నియాలోని లాస్ ఏంజిలిస్‌లో ఉంది. యోగదా సత్సంగ కార్యకలాపాల్లో, 'యోగదా సత్సంగ' అనే పుస్తకాన్ని ప్రచురించడం, భారతదేశంలో అన్ని ప్రాంతాల్లోనూ ఉన్న విద్యార్థులకు నెలనెలా పోస్టులో పాఠాలు పంపడం కూడా ఉన్నాయి. ఈ పాఠాలు శక్తిపూరణ, ధారణ, ధ్యాన ప్రక్రియల్ని వివరణాత్మకంగా బోధిస్తాయి. సంపూర్ణ విశ్వాసంతో వాటిని సాధన చేసినట్లయితే, అర్హులైన విద్యార్థులకు ముందు ముందు వచ్చే పాఠాల్లో బోధించే క్రియాయోగమనే ఉన్నత విద్యకు అవి అత్యవసర ప్రాతిపదిక ఏర్పరు స్తాయి.

యోగదా విద్యా, మత, ప్రజాహిత కార్యకలాపాలకు అనేకమంది ఉపాధ్యాయులూ కార్యకర్తల సేవాతత్పరతలు అవసరమవుతాయి. అలాటి వాళ్ళు అసంఖ్యాకంగా ఉన్నారు కనక, వాళ్ళ పేర్లు ఇక్కడ ఇవ్వడం లేదు; కాని వారిలో ప్రతి ఒక్కరికీ నా హృదయంలో ప్రేమాపూర్ణమైన స్థానముంది.

శ్రీరైట్, రాంచీ కుర్రవాళ్ళతో చాలా స్నేహాలు చేశాడు. సాదాపంచె కట్టుకొని వాళ్ళతోనే కలిసి కొన్నాళ్ళు ఉన్నాడు. బొంబాయి, రాంచీ, కలకత్తా, శ్రీరాంపూర్

---

యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా, చిరస్థాయిగా నిలిచి ఉండేటందుకుగాను రూపొందించిన, లాభాసక్తిలేని సంస్థ. ఆ పేరుకింద యోగానందగారు భారతదేశంలో తమ కృషివీ తాము నెలకొల్పిన సంస్థల్నీ రిజిస్టర్ చేయించారు. వాటి పాలన వ్యవహారాల్ని, పశ్చిమ బెంగాలులో దక్షిణేశ్వరంలో ఉన్న యోగదామఠంలో ఒక పాలక మండలి సమర్థంగా నిర్వహిస్తోంది. భారతదేశంలో అనేక ప్రాంతాల్లో వై.ఎస్.ఎస్. ధ్యానకేంద్రాలు అనేకం ఇప్పుడు వర్ధిల్లుతున్నాయి.

యోగానందగారు తమ సంస్థపేరు ఇంగ్లీషులోకి మార్చి పాశ్చాత్య దేశాల్లో, తమ సంస్థను 'సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్' పేర రిజిస్టర్ చేయించారు. శ్రీశ్రీదయామాత 1955 నుంచి యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా, సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్‌లకు అధ్యక్షురాలుగా ఉంటున్నారు. (ప్రచురణకర్త గమనిక).

- ఎక్కడికి వెళ్ళినా సరే, నా కార్యదర్శి తన సాహస కృత్యాల్ని ప్రయాణం డైరీలో రాస్తూ వచ్చాడు; వివరంగా వర్ణించే ప్రతిభ అతనికి ఉంది. ఒకనాడు సాయంత్రం నే నతన్ని ఒక ప్రశ్న అడిగాను.

"డిక్, భారతదేశాన్ని గురించి నీకు కలిగిన అభిప్రాయం ఏమిటి?"

"శాంతి," అన్నాడతను సాలోచనగా. "ఈ జాతి తత్త్వం శాంతి."

అధ్యాయం : 41

# దక్షిణ భారత విహారయాత్ర

"ఆ గుళ్ళోకి ప్రవేశించిన మొట్టమొదటి పాశ్చాత్యుడివి నువ్వే, డిక్. ఇదివరలో ఎంతోమంది ప్రయత్నం చేసి విఫలులయ్యారు."

నా మాటలకు శ్రీరైట్ ఆశ్చర్యపడినప్పటికీ తరవాత సంతోషించాడు. అంతకు ముందే మేము, దక్షిణ భారతంలో మైసూరు నగరాన్ని పరివీక్షించే ఒక కొండమీద ఉన్న సుందరమయిన చాముండీశ్వరి ఆలయం లోంచి బయటికి వచ్చాం. అక్కడ మేము, మైసూరు రాజవంశం వారి కులదేవత అయిన చాముండి స్వర్ణ, రజత పీఠాల ముందు మోకరిల్లాం.

శ్రీరైట్, కొన్ని గులాబి రేకుల్ని జాగ్రత్తగా చుట్టి పెట్టుకుంటూ, "ఈ విశిష్ట గౌరవానికి జ్ఞాపక చిహ్నంగా, పూజారి పన్నీటితో పవిత్రం చేసిన ఈ గులాబి రేకుల్ని ఎప్పటికీ దాచిపెట్టుకుంటాను," అన్నాడు.

నా సహచరుడూ నేనూ* మైసూరు రాజ్యం అతిథులుగా 1935 నవంబరు నెల గడుపుతున్న రోజులవి. మహారాజావారి వారసులు† యువరాజ శ్రీ కంఠీరవ నరసింహరాజ ఒడయరుగారు, ఉత్తమ సంస్కారవంతమూ అభ్యుదయశీలమూ అయిన తమ రాజ్యాన్ని సందర్శించవలసిందిగా నన్నూ నా కార్యదర్శినీ కోరారు.

గత పక్షంరోజుల్లో నేను, మైసూరు నగరంలోని పురమందిరంలోనూ మహారాజావారి కళాశాలలోనూ, విశ్వవిద్యాలయ వైద్యవిద్యాలయంలోనూ వేలాది పురజనుల్నీ విద్యార్థుల్నీ ఉద్దేశించి ఉపన్యాసాలు చేశాను. అలాగే బెంగుళూరు నేషనల్ హైస్కూలులోనూ, ఇంటర్మీడియట్ కాలేజిలోనూ, మూడువేలమంది సమావేశ మయిన చెట్టి టౌన్ హాల్లోనూ మహా జనసభల్లో ప్రసంగించాను. అమెరికాను

* మిస్ బ్లిట్ష్ కలకత్తాలో మా బంధువుల దగ్గర ఉండిపోయింది.

† యువరాజావారి అన్నగారిపేరు నాల్గవ శ్రీకృష్ణరాజేంద్ర ఒడయారుగారు.

గురించి నేను చిత్రించిన రూపం శ్రోతల్ని ముగ్ధుల్ని చేసిందో ఏమోకాని, ప్రాచ్య పాశ్చాత్య ప్రపంచాల ఉత్తమ లక్షణాల్ని వినిమయం చేసుకోడం వల్ల కలిగే పరస్పర లాభాల్ని గురించి నేను చెప్పినప్పుడల్లా హర్షధ్వనులు మాత్రం బ్రహ్మాండంగా వినవచ్చాయి.

శ్రీరైట్, నేనూ ఇప్పుడు ఉష్ణమండల ప్రశాంత వాతావరణంలో విశ్రాంతి తీసుకుంటున్నాం. మైసూరుగురించి తనకు కలిగిన భావాల్ని అతను ప్రయాణం డైరీలో ఇలా రాసుకున్నాడు:

"ఎప్పటికప్పుడు మార్పు చెందుతూ, ఆకాశంలో అడ్డంగా విస్తరించుకొని ఉండి, దేవుడి చిత్రరచనకు ఆధారమైన కేన్వాసు వేపు మైమరిచి చూస్తూ ఆనందోన్మత్తులమై అనేక క్షణాలు అలాగే ఉండిపోయాం. దానికి కారణం, ఆయన స్పర్శ ఒక్కటే జీవిత నవ్యతతో స్పందించే వన్నెల్ని సృష్టించగలగడం. మానవుడు కేవలం రంజక పదార్థాలతో ఆయన్ని అనుకరించడానికి ప్రయత్నించినప్పుడు ఆ వన్నెల పరువం నశించిపోతుంది. ఎందుచేతంటే ఈశ్వరుడు, తైలవర్ణాల్ని కాని రంజకపదార్థాల్ని కాని ఉపయోగించకుండా, వాటికన్న సులభంగానూ ప్రభావోత్పాదకంగానూ ఉండే, కేవలం కాంతికిరణాలనే సాధనాన్ని వాడడానికి పూనుకుంటాడు. ఇక్కడ ఒక్కసారి వెలుతురు చిమ్ముతాడు; అది ఎరుపును ప్రతిఫలిస్తుంది. మళ్ళీ కుంచె విదిలిస్తాడు; క్రమంగా నారింజ, బంగారువన్నెల కలగలుపులోకి దిగుతుంది. ఆ తరవాత ఆయన, నీటివంకాయవన్నె బరిసెతో మబ్బుల్ని తూట్లు పొడుస్తాడు; గాయం నుండి ఓడే నెత్తురులా ఎర్రటి వలయం లేక అంచు ఒకటి ఏర్పడుతుంది. ఈ విధంగా ఆయన, రాత్రీ పొద్దున్నా ఒకే విధంగా క్రీడిస్తూ ఉంటాడు. ఎప్పటికీ మారిపోతూ ఎప్పటికీ కొత్తగా, ఎప్పటికీ తాజాగానే ఉంటాయవి; వాటికి నకళ్ళు లేవు, నమూనాలు లేవు, అచ్చంగా అవే వన్నెలు ఉండడం అంతకన్న లేదు. పగటినించి రాత్రికీ రాత్రినించి పగటికీ భారతదేశంలో జరిగే మార్పులోని అందానికి సాటి మరెక్కడా లేదు. ఒక్కొక్కప్పుడు ఆకాశంలో భగవంతుడు తన రంగులపెట్టెలోని రంగులన్నిటినీ తీసుకొని ఆకాశంలోకి ఒక్కసారి విరజిమ్మి బ్రహ్మాండమైన బహువర్ణదర్శినిని భాసింపజేసాడు.

"మైసూరు నగరానికి 12 మైళ్ల దూరంలో ఉన్న భారీ కృష్ణరాజసాగర్ ఆనకట్ట* కు మేము చేసిన ఒక అద్భుత సాయంకాల సందర్శనాన్ని గురించి

---

* పట్టుపరిశ్రమకూ, సబ్బులు, చందనపు నూనె తయారీకి ప్రసిద్ధికాంచిన మైసూరు పట్టణ పరిసర ప్రాంతాలకు నీటి పారుదలకి ఉపయోగపడే ఈ ఆనకట్ట 1930లో నిర్మించబడింది.

చెప్పాలి. యోగానందగారు, నేనూ ఒక చిన్న బస్సు ఎక్కాం. బ్యాటరీకి బదులుగా, క్రాంకు తిప్పడానికి ఒక చిన్న కుర్రవాడు ఉన్నాడందులో. అస్తమిస్తున్న సూర్యుడు క్షితిజంలో, నలిగి మిగలముగ్గిన టమాటా పండులా అవుపిస్తున్నాడు. నున్నటి మట్టిరోడ్డు మీద బయలుదేరింది మా బస్సు.

"పొడుగాటి కొబ్బరిచెట్ల మధ్యగా, హాయి కలిగించే మర్రితోపుల గుండా, ఎటు చూసినా ఎదురయే వరిమళ్ళను దాటిపోతూ ముందుకు సాగింది, మా ప్రయాణం; దాదాపు ప్రతిచోటా, అడవిలో అల్లుకుపోయినంత దట్టంగా ఉన్నాయి చెట్లూ చేమలూ. ఒక కొండ కొమ్ముకు చేరి మానవ నిర్మితమైన బ్రహ్మాండమైన ఒక సరస్సును చూశాం. నక్షత్రాలూ కొబ్బరిచెట్లూ మొదలయినవి అందులో ప్రతిఫలిస్తున్నాయి. ఆ సరస్సు చుట్టూ అందమైన మిట్టతోటలూ విద్యుద్దీపాల పంక్తులూ శోభాయమానంగా ఉన్నాయి.

"ఆ ఆనకట్ట అంచుకు దిగువున, కళ్ళు మిరుమిట్లుగొలిపే దృశ్యం ఒకటి చూశాం: ఎగజిమ్మే నీటిబుగ్గల మీద వన్నెవన్నెల కాంతికిరణాలు ప్రసరిస్తూ ఉంటే, మిలమిలలాడే నీలివన్నె ఎరుపు, ఆకుపచ్చ, పసుపుపచ్చ వన్నెల జలపాతాలు ముదురు వన్నె సిరాలు వెలువరిస్తున్నట్టుగా ఉన్నాయి; రాజసం ఉట్టిపడే రాతి ఏనుగులు, ఏకధారగా నీటిని ఎగజిమ్ముతున్నాయి. (దీపాలు అమిర్చిన ఈ నీటి బుగ్గల్ని చూస్తున్నప్పుడు, షికాగోలో 1933లో జరిగిన వరల్డ్ ఫెయిర్‌లో అమిర్చినవి గుర్తువచ్చాయి నాకు). వరిపొలాలతో నిండి, నిరాడంబరులయిన ప్రజలుగల ఈ ప్రాచీన దేశంలో ఈ ఆనకట్ట, ఆధునికంగా విశిష్టత నందుకొన్నది. భారతీయులు మాకు ఎంత ప్రేమపూర్వకమైన స్వాగతం ఇచ్చారంటే, యోగానంద గారిని తిరిగి అమెరికాకు తీసుకు వెళ్ళడానికి నా శక్తి చాలదేమో అన్నంత భయం వేసింది.

"మరో అపురూపమైన సదవకాశం - నేను మొట్టమొదటిసారిగా ఏనుగు మీద సవారి చేయడం. యువరాజావారు నిన్న, తమ ఏనుగుల్లో ఒకదాని మీద సవారిచేసి ఆనందించడానికి మమ్మల్ని తమ వేసవి విడిది భవనానికి ఆహ్వానించారు. భారీ పరిమాణం గల ఏనుగుమీద పట్టుపరుపులతో ఒక పెట్టె మాదిరిగా అమిర్చి ఉన్న హౌదా మీదికి నేను ఒక నిచ్చెన సాయంచి ఎక్కాను. ఆ తరవాత ఊగులాటలూ, కుదుపులూ, నిట్టూర్పులూ, ఏదో లోయలోకి తోసేస్తున్నట్టుగా విసిరివేతలూ - గాభరా పడ్డానికి కాని సంభ్రమాశ్చర్యాలవంటివి ప్రకటించడానికి కాని అవకాశం లేనంతగా పులకించిపోయాను; అయితే ప్రియమైన నా ప్రాణాన్ని కాపాడుకోడానికి ఉగ్గబట్టుకొనే ఉన్నాను సుమా!"

చారిత్రక, పురాతత్త్వ ప్రాముఖ్యమున్న అవశేషాలు సమృద్ధిగా గల దక్షిణ భారతదేశం, నిశ్చితమైనప్పటికీ అనిర్వచనీయమైన ఆకర్షణ గల ప్రాంతం మైసూరుకు ఉత్తరాన, హైదరాబాదు రాజ్యం ఉంది; బ్రహ్మాండమైన గోదావరినది పారే అందమయిన పీఠభూమి ఇది. సువిశాలమై, సారవంతమై ఉన్న సమతల భూములూ, రమణీయమయిన నీలగిరులూ, సున్నపురాతితోనో గ్రనైట్‌రాతితోనో ఏర్పడ్డ నిర్జీవ పర్వతాల ఇతర ప్రదేశాలూ ఉన్నాయి ఇక్కడ. హైదరాబాదు చరిత్ర సుదీర్ఘమైన ఉజ్జ్వల గాథ. అది మూడువేల ఏళ్ళ కిందట ఆంధ్ర రాజుల ఏలుబడితో మొదలయి, క్రీ.శ. 1294లో ఆ ప్రాంతం ముస్లిం నవాబుల వంశాను గత పాలనలోకి పోయేవరకు హిందూ రాజవంశీయుల పాలనలోనే కొనసాగింది.

భారతదేశమంతటిలోకీ అత్యంత అద్భుతమైన వాస్తు, శిల్ప, చిత్ర కళా నైపుణ్యాల్ని ప్రదర్శించే కళాఖండాలు హైదరాబాదు రాజ్యంలో రాళ్ళను మలిచి నిర్మించిన ఎల్లోరా, అజంతాల ప్రాచీన గుహాలయాలు.* ఎల్లోరాలో ఒక పెద్ద ఏకాండి శిలను తొలిచి రూపొందించిన కైలాసనాథాలయంలో, ఏ మైఖేలేంజిలో లాంటివాడో భారీ పరిమాణాల్లో చెక్కిన దేవతా విగ్రహాలూ, మనుషుల బొమ్మలూ జంతువుల బొమ్మలూ ఉన్నాయి. ఇరవై ఐదు సన్యాసి మఠాలూ, ఐదు ఆలయాలూ గల ప్రదేశం అజంతా. రాతికొండను తొలిచి రూపొందించినవే ఇవన్నీ; వీటికి ఆధారంగా ఉన్నవి చిత్రాలంకృతమైన స్తంభాలు. చిత్రకారులూ శిల్పులూ వీటిమీద, తమ ప్రతిభకు అమరత్వం సిద్ధింపజేసుకున్నారు.

హైదరాబాదు నగరానికి ఉస్మానియా విశ్వవిద్యాలయం, బ్రహ్మాండమైన మక్కామసీదూ శోభ చేకూరుస్తున్నాయి. ఈ మసీదులో పదేసి వేలమంది ప్రార్థన కోసం వచ్చి చేరుతూంటారు.

సముద్ర మట్టానికి మూడువేల అడుగుల ఎత్తున ఉన్న మైసూరు రాజ్యం దట్టమైన ఉష్ణమండలారణ్యాలకు పేరెన్నిక గన్నది. ఈ అడవులు ఏనుగులకూ, దున్నలకూ, ఎలుగుబంట్లకూ, చిరుతపులులకూ, పులులకూ నివాసస్థానాలు ముఖ్య నగరాలైన బెంగుళూరూ మైసూరూ, ఎన్నో అందమైన పార్కులతోనూ సార్వజనిక విహార వనాలతోనూ పరిశుభ్రంగా, ఆకర్షకంగా ఉన్నాయి.

వాస్తుకళ, శిల్పకళ, మైసూరులో పదకొండో శతాబ్దినుంచి పదిహేనో శతాబ్ది వరకు పాలించిన హిందూరాజుల పోషణలో సర్వోన్నత పరిపూర్ణత సాధించాయి

---

* 1950లో రాష్ట్రాల సరిహద్దుల్ని మార్చిన తరవాత ఈ గుహలు ప్రస్తుతం మహారాష్ట్ర లో ఉన్నాయి.
- ప్రచురణకర్త గమనిక

విష్ణువర్ధన రాజు పాలనలో నిర్మాణం పూర్తి అయిన - పదకొండో శతాబ్ది మహోత్తమ సృష్టి - బేలూరు ఆలయాన్ని మించినది, సున్నితమైన చికిలిపనిలో సమృద్ధమైన రూపకల్పనలో ప్రపంచంలో మరొకటి లేదు.

ఉత్తర మైసూరులో కనిపించే శిలాశాసనాలు క్రీ.పూ. మూడో శతాబ్దినాటివి. అవి, భారతదేశం, ఆఫ్ఘనిస్తాన్, బలూచిస్తాన్‌లతో సహా విశాల సామ్రాజ్యాన్ని పాలించిన అశోక చక్రవర్తి* సంస్కృతిని దీప్తిమంతం చేసే దీపకళికలు. వివిధ భాషల్లో చెక్కిన అశోకుడి "ధర్మలిపులు," ఆయన కాలంలో సువ్యాప్తమై ఉన్న అక్షరాస్యతకు సాక్షిభూతాలుగా నిలుస్తాయి. 13వ శిలాశాసనం యుద్ధాల్ని ఇలా నిరసిస్తుంది. "ధర్మవిజయాన్ని తప్ప మరిదేన్నీ నిజమైన విజయంగా పరిగణించ కండి." రాజు నిజమైన ఘనత, తన ప్రజలు నైతికమైన అభివృద్ధి సాధించడానికి అతను చేసే సహాయంమీదే ఆధారపడి ఉంటుందని 10వ శిలాశాసనం ఘోషి స్తుంది. 11వ శిలాశాసనం "నిజమైన కానుక"ను నిర్వచిస్తూ, అది వస్తురూపమైనది కాక, సత్యవ్యాపన రూపమైన 'సత్తు' అని తెలియజేస్తుంది. 'దేవానాం ప్రియు' డైన ఆ చక్రవర్తి, 6వ శిలాశాసనంలో, ప్రజాహిత కార్యకలాపాల గురించి తనతో ముచ్చటించడానికి, "పగలు కాని, రాత్రికాని, ఏ సమయంలోనైనా సరే" తన దగ్గరికి రావచ్చునని ప్రజల్ని ఆహ్వానిస్తాడు. అంతే కాకుండా, తన రాజోచిత కర్తవ్యాన్ని చిత్తశుద్ధితో నిర్వర్తించడం వల్ల, "తోటి ప్రజలకు తాను తీర్చుకోవలసిన ఋణం నుంచి విముక్తి పొందుతున్నా"నని కూడా అంటాడు, అందులో.

అశోకుడు అజేయుడైన చంద్రగుప్త మౌర్యుడి మనుమడు. ఈ చంద్ర గుప్తుడు, అలెగ్జాండరు భారతదేశంలో నిలిపిన సైనిక పటాలాన్ని సర్వనాశనం చేసి, క్రీ.పూ. 305 లో సెల్యూకస్ ఆధిపత్యంలో దండెత్తి వచ్చిన మాసిడోనియా సైన్యాన్ని ఓడించినవాడు. చంద్రగుప్తుడు పాటలీపుత్రం†లో మెగస్తనీస్ అనే గ్రీకు

* అశోక చక్రవర్తి భారతదేశంలో వివిధ ప్రాంతాల్లో మత ధార్మిక స్తూపాలు (గుళ్ళు) 84 000 నిర్మించాడు. పద్నాలుగు శిలాశాసనాలూ పది శిలాస్తంభాలూ ఇప్పటికీ నిలిచి ఉన్నాయి. ప్రతి స్తంభమూ, ఇంజినీరింగ్, వాస్తు, శిల్ప కళలకు విజయ స్తంభం. ఈయన ఎన్నో జలాశయాలూ ఆనకట్టలూ పారుదల నీటి తూములూ కట్టించాడు; పెద్ద పెద్ద రహదారులూ చెట్ల నీడపడే రోడ్లూ వేయించి ప్రయాణికుల కోసం అక్కడక్కడ సత్రాలు కట్టించాడు; వృక్ష శాస్త్రాధ్యయనానికీ మందులకూ ఉపయోగపడే తోటలు వేయించాడు. మనుషులకోసం, జంతువులకోసం వైద్యశాలలు కట్టించాడు.

† పాటలీపుత్ర (ఇప్పటి పాట్నా) నగరానికి ఆకర్షవంతమైన చరిత్ర ఉంది. అది ఎటువంటి ప్రాముఖ్యంలేని దుర్గంగా ఉన్న రోజుల్లో, క్రీ.పూ. ఆరో శతాబ్దిలో బుద్ధభగవానుడు దాన్ని సందర్శించాడు. అప్పుడాయన ఇలా జోస్యం పలికాడు. "ఆర్యజనులు పాగినంత దూరం, వర్తకులు ప్రయాణించినంత దూరం, పాటలీపుత్రం అన్ని రకాల సామగ్రి వినిమయానికి

రాయబారిని తన ఆస్థానంలో ఆదరించాడు. మెగస్తనీస్, సుఖవంతమూ కార్యోత్సాహవంతమూ అయిన ఆనాటి భారతదేశాన్ని గురించి మనకు వివరాలు రాసి పెట్టాడు.

విజయధ్వజుడయిన చంద్రగుప్తమౌర్యుడు క్రీ.పూ. 298లో భారత ప్రభుత్వాధిపత్యాన్ని తన కొడుకు చేతుల్లో పెట్టాడు. దక్షిణ భారతానికి యాత్ర సాగించి తన జీవితంలో చివరి పన్నెండేళ్ళూ చేత కాసులేని సన్యాసిగా గడిపాడు; ఈనాడు మైసూరు రాజ్యంలో ఒక ఆలయంగా ఉన్న, శ్రవణబెళగోళ కొండ గుహలో ఆత్మసాక్షాత్కారం కోసం తపస్సు చేశాడు. ప్రపంచమంతటిలోకీ అత్యున్నత ఏకశిల శిలావిగ్రహమున్నది ఆ ప్రదేశంలోనే. భారీ పరిమాణంగల గట్టి రాతితో చెక్కిన ఈ విగ్రహం, గోమరేశ్వరమునిపేర క్రీ.శ. 983లో జైనులు ప్రతిష్ఠించినది

అలెగ్జాండరు భారతదేశం మీదికి దండెత్తి వచ్చినప్పుడు అతని వెంబడి వచ్చినవాళ్ళూ లేదా ఆ తరవాత వచ్చినవాళ్ళూ - గ్రీకు చారిత్రకులూ తదితరులూ - చిన్నచిన్న వివరాలతో సహా రాసిపెట్టిన వాటిలో ఆసక్తికరమైన కథలు ఉన్నాయి. ఏరియన్, డియోడరస్, ప్లూటార్క్, భూగోళశాస్త్రజ్ఞుడు స్ట్రాబో రాసిన వృత్తాంతాల్ని డా॥ జె.డబ్ల్యు. మెక్ క్రిండిల్,* ప్రాచీన భారతదేశ చరిత్రను వెలుగులోకి తేవడానికి అనువాదం చేశాడు. విఫలమైన అలెగ్జాండరు దాడిలో ప్రముఖంగా చెప్పుకోదగ్గ విషయం ఏమిటంటే, హిందూతత్త్వ శాస్త్రంలోనూ, యోగుల విషయంలోనూ, సాధుసంతుల పట్లా అతడు చూపిన గాఢమైన ఆసక్తి; అటువంటివాళ్ళు అప్పుడప్పుడు అతనికి తారసపడుతూ ఉండేవారు, లేదా అతడే గాఢమైన ఉత్సుకతతో వాళ్ళను వెతుక్కుంటూ వెళ్ళేవాడు. ఈ పాశ్చాత్య యోధుడు ఉత్తర భారతంలోని తక్షశిలకు చేరిన కొత్తలో, తక్షశిలలో గొప్ప సన్యాసిగా పేరుపొందిన దండామిస్‌ను తీసుకు రమ్మని ఓనెసిక్రిటోస్ (డయోజినస్ స్థాపించిన హెలినిక్ మతానుయాయి)ను పంపించాడు.

"విజయోభవ, బ్రాహ్మణ్యగురూత్తమా!" అన్నాడు ఓనెసిక్రిటోస్, దండామిస్‌ను ఆయన అరణ్యావాస ప్రదేశంలో దర్శించుకొని. "మహాబల సంపన్నుడైన జియస్ దేవుడి కుమారుడూ మానవమాత్రులందరికీ సర్వేశ్వరుడూ అయిన అలెగ్జాండరు

---

కేంద్రంగా, వారికి ముఖ్యనగరం అవుతుంది." (మహాపరి నిర్వాణ సూత్రం). రెండు శతాబ్దాల తరవాత పాటలీపుత్రం, చంద్రగుప్త మౌర్యుడి మహాసామ్రాజ్యానికి రాజధాని అయింది ఆయన మనుమడు అశోకుడు రాజధాని నగరానికి ఇతోధిక సంపన్నత, వైభవం చేకూర్చాడు.

* 'ఏన్షెంట్ ఇండియా' (ప్రాచీన భారతదేశం) ఆరు సంపుటాలు (కలకత్తా : చక్రవర్తి ఛటర్జీ అండ్ కంపెనీ, 15 కాలేజి స్క్వేర్, 1879; పునః ప్రచురణ 1927).

మిమ్మల్ని తన సన్నిధికి రమ్మంటున్నాడు. మీరు కనక మన్నిస్తే మీకు గొప్ప కానుకలిచ్చి సత్కరిస్తాడు; కాదంటే మీకు శిరచ్ఛేదన విధిస్తాడు!" అన్నాడు.

నిర్బంధ ధోరణిలో ఉన్న ఈ ఆహ్వానాన్ని, ప్రశాంతంగా అందుకొన్నాడు ఆ యోగి; అందుకొని, "తన పత్రశయ్యమీదినుంచి తల ఎత్తేపాటి ప్రయత్నం కూడా చెయ్యలేదు."

"అలెగ్జాండరు జియస్ కుమారుడయితే, నేనూ ఆయన కుమారుణ్ణే," అన్నాడాయన. "నాకున్నదాంతో నేను తృప్తిగానే ఉన్నాను కనక, అలెగ్జాండరు దేదీ నాకు అక్కర్లేదు. అతను మనుషుల్ని వెంట వేసుకుని భూమిమీదా సముద్రం మీదా వృథాగా తిరుగుతున్నాడు; ఆ తిరుగుళ్ళకు అంతు తెలియకుండా ఉన్నట్టు కనిపిస్తోంది."

"వెళ్ళి అలెగ్జాండరుకు చెప్పు - సర్వేశ్వరుడైన భగవంతుడు గర్వంతో చేసే పనుల కర్త కాడనీ కాంతికి, శాంతికి, జీవానికి, జలానికి, మానవ దేహానికి, ఆత్మకు సృష్టికర్త అనీ చెప్పు; మరణం మానవులందరికీ విముక్తి కలిగించినప్పుడు - వాళ్ళిక ఏ విధంగానూ దుష్టవ్యాధికి లోనుకానక్కరలేని స్థితిలో - ఆయన అందరినీ దగ్గరికి చేర్చుకుంటాడు. హత్యల్ని అసహ్యించుకునేవాడూ యుద్ధాలు రగిలించనివాడూ - ఆయనే నా ప్రణామాలందుకునే దేవుడు.

"అలెగ్జాండరు దేవుడేమీ కాడు, అతను కూడా చావుకు లోబడి తీరవలసిన వాడే కనక," అంటూ ఆ తపస్వి, తిరస్కార ధోరణిలో ఇంకా ఇలా అన్నాడు : "ఇంతదాకా ఆంతరిక విశ్వసామ్రాజ్య సింహాసనాన్ని అధిష్ఠించని అటువంటివాడు ప్రపంచాధిపతి ఎలా అవుతాడు? అతనింత వరకూ నరకంలోకి కూడా ప్రవేశించ లేదు. ఈ భూమిమీద, సువిశాల ప్రాంతాలమీద సంచరించే సూర్యుడి గమన రీతిని ఎన్నడూ ఎరగనైనా ఎరగడు. అనేక దేశాలు అతని పేరు విననైనా వినలేదు!"

ఈ విధంగా ఆ తపస్వి, "ప్రపంచానికి అధినాథుడు" అనిపించుకొన్నవాడి చెవులు గింగురులెత్తి పోయే విధంగా, ఎన్నడూ విననంత తీవ్రంగా ముక్కచివాట్లు పెట్టి, వ్యంగ్యంగా ఇంకా ఇలా అన్నాడు, "అలెగ్జాండరుకు ఇప్పుడున్న రాజ్యాలు అతని కోరికలకు తగినంత విస్తారంగా లేకపోయినట్లయితే, అతన్ని గంగానది దాటమను; అతని మనుషులందరినీ పోషించగల దేశాన్ని చూస్తాడు.*

---

* అలెగ్జాండరుకాని, అతని సేనానాయకులు కాని గంగానదిని ఎన్నడూ దాటలేదు. వాయవ్యం నుంచి గట్టి ప్రతిఘటన ఎదురవడం చూసి మాసిడోనియా సైన్యం, మరి ముందుకు పొచ్చుకొని పోమంటూ తిరుగుబాటు చేసింది; అలెగ్జాండరు భారతదేశాన్ని విడవక తప్పింది కాదు. తరవాత అతనికి పెర్షియాలో విజయాలు లభించాయి.

"అలెగ్జాండరు ఇస్తాననే కానుకలు నాకు పనికిరానివి;" దండామిస్ ఇంకా ఇలా అన్నాడు, "నేను కానుకగా తలిచేవీ నిజమైన విలువ ఉన్నవనీ గ్రహించేవీ నాకు రోజా తిండిపెట్టే మొక్కలూ నా దప్పిక తీర్చే నీళ్ళూను. ఆబగా కూడబెట్టు కున్న వస్తుసంపదలు, అవి కూడబెట్టిన వాళ్ళకి వినాశకరమైనవని రుజావవుతాయి; అజ్ఞానుల్ని పీడించే దుఃఖాన్నీ విసుగుదలనూ మాత్రమే కలిగిస్తాయవి.

"నే నయితే, అడవిలో ఉండే చెట్ల ఆకులమీద పడుకుంటాను. కాపలా కాసుకోడానికి నాకు ఏమీ లేదు; ప్రశాంతమైన నిద్రలో కళ్ళు మూసుకొని ఉంటాను; అలా కాకుండా, ప్రాపంచిక విలువ కలిగింది ఏదైనా నాకు ఉండి ఉంటే, దాని భారం నా నిద్రను తరిమేసేది. ఈ భూమి నాకు కావల్సిన ప్రతిదీ ఇస్తుంది, తల్లి తన పిల్లకు పాలు ఇచ్చినట్టే. నా ఇష్టంవచ్చిన చోటికి నేను పోతాను, భౌతికమైన జాగ్రత్తల బెడద ఏమీ లేకుండా.

"అలెగ్జాండరు నా తల నరికేసినా కూడా, నా ఆత్మను నాశనం చెయ్యలేడు. అప్పుడు, మౌనం దాల్చిన నా తల చిరిగిన బట్టలాంటి నా దేహమూ భూమిమీద ఉండిపోతాయి; వాటి మూలకాలు తీసుకున్నదే అక్కణ్ణించి. నే నప్పుడు ఆత్మరూపుణ్ణే అయి, దేవుడి దగ్గరికి పైకి పోతాను. మనల్ని అందరినీ మాంస కోశంలో ఉంచి కింద ఇక్కడున్నప్పుడు మనం తన ఆజ్ఞలకు బద్ధులమై బతుకు తామో లేదో నిరూపించడానికి మనని ఈ భూమిమీద వేసినవాడూ మనం ఇక్కణ్ణించి వెళ్ళిన తరవాత మన జీవితాల మంచి చెడ్డలకు మన దగ్గర సంజాయిషీ తీసుకునే వాడూ ఆయన. పాడుపనులన్నిటికీ న్యాయనిర్ణేత ఆయనే; అణిచివేతకు గురిఅయినవాళ్ళ మూలుగులు ఆ అణిచివేతదారుడికి శిక్ష విధిస్తాయి.

"అలెగ్జాండర్ని, సంపద కోరేవాళ్ళనీ చావుకు భయపడే వాళ్ళనీ బెదిరింపులతో భయపెట్టనియ్యి. బ్రాహ్మణుల ముందు అతని ఆయుధాలు శక్తిహీనమైనవి; మేము బంగారానికీ మనసుపడం, చావుకూ భయపడం. కనక నువ్వెళ్ళి అలెగ్జాండరుకు చెప్పు: నీదైన దేదీ దండామిస్‌కి అక్కర్లేదు. కనక, నీ దగ్గరికి రాడు. నీకు దండామిస్ దగ్గర్నించి ఏమైనా కావలిస్తే, నువ్వే రా అతని దగ్గరికి."

ఓనెసిక్రితోస్ సముచితంగా సందేశం అందించాడు; అలెగ్జాండరు చాలా శ్రద్ధగా విన్నాడు; "దండామిస్ ముసలివాడూ దిగంబరుడూ అయినప్పటికీ కూడా, అనేక రాజ్యాల్ని జయించిన తనకు ఏకైక విరోధిగా, తనను మించినవాడిగా తారసపడ్డందుకు, ఆయన్ని చూడాలన్న కోరిక, అంతకు ముందెన్నడూ కలగనంత ప్రబలంగా కలిగింది."

దార్శనిక ప్రశ్నలకు జ్ఞానపూర్ణమైన సమాధానాలు చెప్పడంలో పేరుగన్న బ్రాహ్మణ తపస్వుల్ని కొందరిని అలెగ్జాండరు తక్షశిలకు ఆహ్వానించాడు. అప్పటి వాగ్వివాదం వివరాలు ప్లూటార్క్ పొందుపరిచాడు; ప్రశ్నలన్నీ అలెగ్జాండరే తయారు చేశాడు.

"అసంఖ్యాకంగా ఉన్నవి ఏమిటి? బతికున్నవా, చచ్చిపోయినవా?"

"బతికున్నవి; చచ్చిపోయినవి లేనివే కనక."

"పెద్దపెద్ద జంతువుల్ని పుట్టించేది ఏమిటి, సముద్రమా భూమా?"

"భూమి; సముద్రం కేవలం భూమిలో భాగమే కనక."

"జంతువుల్లో అన్నిటికన్న తెలివయింది ఏమిటి?"

"మనిషికి ఇంతవరకు పరిచయం కానిది." (అజ్ఞాత మయిన దానికి మనిషి భయపడతాడు).

"మొదట ఉన్నది ఏది, దినమా రాత్రా?"

"దినం ఒక దినం ముందునించి ఉంది." ఈ జవాబుకు అలెగ్జాండరు ఆశ్చర్యం ప్రకటించాడు; బ్రాహ్మణుడు ఇంకా ఇలా అన్నాడు: "అసాధ్యమైన ప్రశ్నలకు అసాధ్యమైన సమాధానాలే అవసరం."

"మనిషి తనను ప్రేమపాత్రుడిగా చేసుకోడంలో ఉత్తమ పద్ధతి ఏమిటి?"

"తనకు గొప్పశక్తి ఉండి కూడా, తానంటే ఇతరులు భయపడేటట్టు చేసుకోకుండా ఉంటే మనిషి ప్రేమపాత్రుడవుతాడు."

"మనిషి దేవుడు ఎలా కావచ్చు?"*

"మనిషికి అసాధ్యమయింది చెయ్యడంవల్ల."

"బలవత్తరమయింది ఏది? బతుకా, చావా?"

"బతుకు; అది అనేక చెడ్డల్ని భరిస్తుంది కనక."

అలెగ్జాండరు తనకు గురువుగా, ఒక నిజమైన యోగిని భారతదేశం నుంచి తీసుకువెళ్ళడంలో కృతకృత్యుడయాడు. ఈయన పేరు కల్యాణ స్వామి (స్వామి

* ఈ ప్రశ్ననుబట్టి, ఆ "జియస్ కుమారుడికి," తానింకా పరిపూర్ణత సాధించలేదేమో నన్న సందేహం అప్పుడప్పుడు వస్తూ ఉండేదని మనం ఊహించవచ్చు.

స్ఫైన్స్); గ్రీకులు ఈయన్ని 'కలనోస్' అనేవారు. ఈ యోగి, అలెగ్జాం డరు వెంబడి పెర్షియా వెళ్ళాడు. ముందుగా చెప్పిన ఒక రోజున పెర్షియాలో సూసా అనేచోట కలనోస్, మాసిడోనియా సైన్యం యావత్తు చూస్తూ ఉండగా చితిలోకి ప్రవేశించి ముసలితనంతో పండిపోయిన దేహాన్ని విడిచిపెట్టేశాడు. ఈ యోగి, బాధకుకాని చావుకుగాని భయపడకపోవడం, తాను అగ్నికి ఆహుతి అవుతూ ఉంటే కూచున్న చోటినించి ఒక్కసారి కూడా కదలకపోవడం చూసి సైనికులు ఆశ్చర్యపోయిన సంగతి చారిత్రకులు నమోదు చేశారు. దహనానికి వెళ్ళే ముందు కలనోస్, తన సన్నిహిత సహచరుల్ని చాలామందిని ఆలింగనం చేసుకున్నాడు కాని అలెగ్జాండరుకు మాత్రం వీడ్కోలు చెప్పడం మానేసి ఆ హిందూ ముని, టూకీగా ఇలా చెప్పాడు:

"నిన్ను తరవాత బాబిలోన్‌లో చూస్తాను."

అలెగ్జాండరు పెర్షియా విడిచి వెళ్ళాడు; ఒక ఏడాది తరవాత బాబిలోన్‌లో చనిపోయాడు. అలెగ్జాండరు బతికున్నప్పుడూ చనిపోయేటప్పుడూ కూడా తాను హాజరుగా ఉంటానని చెప్పడానికి భారతీయ గురువు అనుసరించిన తీరే ఆ జోస్యం.

గ్రీకు చారిత్రకులు మనకోసం, భారతీయ సమాజాన్ని గురించి వివరణాత్మకంగానూ స్ఫూర్తిమంతంగానూ రాసిపెట్టారు. హిందూ ధర్మశాస్త్రం ప్రజల్ని కాపాడుతుందని చెబుతూ ఏరియన్, "వాళ్ళలో ఎవ్వడూ ఏ పరిస్థితిలోనూ బానిస కాగూడదు; అలా కాకుండా వాళ్ళు తమ స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తూ, మనుషులందరికీ ఉండే సమాన హక్కును గౌరవించాలి,'* అని అది నిర్దేశిస్తుందని అన్నాడు.

మరో గ్రంథంలో ఇలా ఉంది : "భారతీయులు అన్యాయపు వడ్డీ వ్యాపారం చేసి డబ్బు కూడబెట్టరు; అసలు అప్పు తీసుకోడమే తెలియదు వారికి. తప్పు

---

* భారతదేశంలో బానిసతనం లేకపోవడాన్ని గురించి గ్రీకు పరిశీలకులందరూ వ్యాఖ్యానించారు; హెలెనిక్ సమాజ వ్యవస్థకు పూర్తిగా భిన్నమైన లక్షణమిది.

ప్రొ॥ వినయకుమార్ సర్కార్ రాసిన 'క్రియేటివ్ ఇండియా' (సృజనాత్మక భారతదేశం) అన్న గ్రంథంలో భారతదేశం సాధించిన ప్రాచీన, ఆధునిక విజయాల సమగ్ర స్వరూపాన్ని అర్థశాస్త్రం, రాజనీతిశాస్త్రం, సాహిత్యం, కళ, సమాజతత్త్వశాస్త్రం అన్నవాటిలో ఉన్న ప్రత్యేకమైన విలువల్ని పేర్కొనడం జరిగింది. (లాహోరు : మోతీలాల్ బనార్సీ దాస్, ప్రచురణ కర్తలు, 1937, పుట 714).

చదవదగ్గ మరో గ్రంథం, ఎస్.వి. వెంకటేశ్వర రాసిన 'ఇండియన్ కల్చర్ త్రూ ఏజెస్ (యుగయుగాలుగా భారతీయ సంస్కృతి) (న్యూయార్కు : లాంగ్మన్, గ్రీన్ అండ్ కంపెనీ)

చెయ్యడం కాని, దాన్ని సహించడం కాని భారతీయుల వ్యవహార రూఢికి విరుద్ధం. అందేత వాళ్ళు కాంట్రాక్టులూ (ఒడంబడికలు) చేసుకోరు, జామీన్లూ అడగరు." జబ్బులు నయం చెయ్యడమన్నది సాదాగా, సహజమైన రీతుల్లో జరిగేదని చెబుతారు. "మందుల వాడకం కన్న పథ్యం చెయ్యడం వల్ల జబ్బులు నయమవుతున్నాయి. మలాములు, పాలాస్త్రి పట్టీలు ఎక్కువగా వాడే నివారణోపాయాలు. తక్కిన వాటినన్నిటినీ హానికరంగా భావిస్తారు." యుద్ధంలో పాల్గోడం, యోద్ధ కులజులైన క్షత్రియులకే పరిమితమయింది. "పొలంలో పనిచేసే రైతుకు శత్రువు హానిచెయ్యడు; ఆ వర్గంవాళ్ళను ప్రజాహితకారులుగా పరిగణించి వాళ్ళకు ఏ హానీ కలక్కుండా కాపాడ్డమే దానికి కారణం. ఆ విధంగా భూమి, ఎలాటి విధ్వంస చర్యకూ గురి కాకుండా ఉండి, భారీ ఎత్తున పంటలు పండిస్తూ జీవితాన్ని సంతోషంగా గడపడానికి కావలసిన అవసర వస్తువుల్ని ప్రజలకు అందిస్తుంది."

మైసూరులో ఎక్కడపడితే అక్కడ కనిపించే గుళ్ళు, దక్షిణ భారతదేశంలోని అనేకమంది సాధువుల్ని అనుక్షణం గుర్తుకు తెస్తాయి. వారిలో ఒకరు, తాయు మణవార్, మన కొక సవాలుగా ఈ కింది పద్యం రాశాడు:

"పిచ్చెత్తిన ఏనుగును అదుపు చెయ్యవచ్చు నువ్వు;
ఎలుగుబంటి పులి నోళ్ళు ముయ్యవచ్చు;
సవారి చెయ్యవచ్చు సింహంమీద, ఆడించవచ్చు తాచు పామును;
బతుకు తెరువు చూసుకోవచ్చు రసవిద్యవల్ల
ప్రపంచమంతా తిరగవచ్చు నువ్వు ఒకరి కంట బడకుండా;
దేవుళ్ళని బానిసల్ని చేసుకోవచ్చు, నిత్యయౌవనుడివై ఉండిపోవచ్చు;
నీటిమీద నడవవచ్చు; నిప్పులో బతకవచ్చు నువ్వు;
కాని మనస్సును అదుపుచేసుకోడ మన్నదే అన్నిటికన్నా
మంచిదీ, వాటికన్న మహాకష్టమయిందీను "

భారతదేశంలో బాగా దక్షిణాన సుందరమయిన, సారవంతమయిన తిరువాన్కూరు రాజ్యం ఉంది. అక్కడ రాకపోకలు నదులమీదా కాలవలమీదా సాగుతుంటాయి. వెనక ఎప్పుడో జరిగిన యుద్ధాలవల్లా చిన్నచిన్న జమీల్ని తిరువాన్కూరు రాజ్యంలో కలుపుకోడంవల్లా అంటిన పాపాల పరిహారంకోసం మహారాజు ప్రతి సంవత్సరం వంశానుగతంగా వచ్చే విధిని పాటించటం పరిపాటి. సంవత్సరానికి ఏభై ఆరు రోజులపాటు మహారాజు, వేదపఠనం వినడానికి ప్రతిరోజూ మూడేసి సార్లు దేవాలయానికి వెళ్తూ ఉంటాడు; లక్ష దీప హారతితో పాపపరిహార తతంగం ముగుస్తుంది.

భారతదేశానికి ఆగ్నేయతీరంలోఉన్న మద్రాసు ప్రెసిడెన్సీలో సమతల ప్రదేశంతో, విశాలంగా, సముద్రాన్ని ఆనుకొని మద్రాసు నగరమూ బంగారు నగరమనే కాంచీపురమూ ఉన్నాయి. ఈ కాంచీపురం క్రీస్తుశకం తొలి శతాబ్దాల్లో పాలించిన పల్లవ వంశరాజులకు రాజధాని. ఆధునిక మద్రాసు ప్రెసిడెన్సీలో మహాత్మాగాంధి అహింసా ధర్మాలు మంచి ప్రగతి సాధించాయి. తెల్లటి "గాంధి టోపీలు" ఎక్కడ పడితే అక్కడ కనిపిస్తున్నాయి. దక్షిణ ప్రాంతం మొత్తంమీద మహాత్ముడు, "అంటరానివాళ్ళ" కోసం అనేక దేవాలయ సంస్కరణలూ కుల వ్యవస్థా సంస్కరణలూ తీసుకువచ్చాడు.

గొప్ప ధర్మశాస్త్రవేత్త అయిన మనువు ఏర్పరిచిన కులవ్యవస్థ పుట్టు పూర్వోత్తరాలు మెచ్చుకోదగ్గవి. సహజ పరిణామరీత్యా మానవుల్ని నాలుగు గొప్ప వర్గాలుగా వింగడించవచ్చునని ఆయన స్పష్టంగా గమనించాడు: కాయకష్టం చేసి సమాజానికి సేవ చేసేవాళ్ళూ (శూద్రులు); ప్రజ్ఞతో, నేర్పుతో వ్యవసాయం, వర్తకం, వాణిజ్యం ఉద్యోగంవంటి వాటిద్వారా సేవ చేసేవాళ్ళూ (వైశ్యులు); పరిపాలన, కార్యనిర్వహణ రక్షణ దక్షత వంటివిగల పాలకులూ యోధులూ (క్షత్రియులు); చింతనాపరులూ ఆధ్యాత్మికోత్తేజం పొందినవాళ్ళూ దాన్ని అందించేవాళ్ళూ (బ్రాహ్మణులు) "ఎవరయినా ద్విజుడయినదీ కానిదీ నిర్ణయించేది పుట్టుకా కాదు, సంస్కారాలూ కావు, చదువూ కాదు, ఆభిజాత్యమూ కాదు; శీలం, నడవడికా మాత్రమే దాన్ని నిర్ణయించగలవు,"* అని చెప్పింది మహా భారతం. జ్ఞానం, సుగుణం, వయస్సు,

---

* "ఈ నాలుగు కులాల్లో ఒక దాంట్లోకి చేర్చడమన్నది, మొదట్లో, మనిషి పుట్టుక మీద ఆధారపడి ఉండేది కాదు; జీవితంలో అతడు సాధించడానికి ఎంచుకున్న లక్ష్యంవల్ల వెల్లడి అయే సహజ శక్తులమీద ఆధారపడి ఉండేది," అని 1935 జనవరి 'ఈస్ట్ - వెస్ట్' పత్రికలో తారామాత రాశారు "ఈ లక్ష్యం ఈ కిందివాటిలో ఏదయినా కావచ్చు : (1) 'కామం', కోరిక ఇంద్రియ వ్యాపారం మీద ఆధారపడి గడిపే జీవితం (శూద్రదశ). (2) అర్థం', లాభార్జన చేస్తూనే కోరికల్ని అదుపులో ఉంచుకోడం (వైశ్యదశ) (3) ధర్మం, స్వయం శిక్షణతోనూ బాధ్యతతోనూ సత్కర్మతోనూ కూడిన జీవితం (క్షత్రియదశ). (4) మోక్షం విడుదల, ఆధ్యాత్మికతతోనూ మతధర్మబోధనతోనూ కూడిన జీవితం (బ్రాహ్మణదశ). ఈ నాలుగు కులాలూ మానవులకు సేవ చెయ్యడానికి ఉపకరించే సాధనాలు ఇవి : (1) శరీరం (2) మనస్సు (3) సంకల్ప శక్తి (4) ఆత్మ

"ఈ నాలుగు దశలకూ శాశ్వత గుణాల్లో లేదా ప్రకృతి గుణాల్లో సామ్యం ఉంది. ఆ గుణాలు ఏవంటే, 'తమస్సు, రజస్సు, సత్త్వం': అవరోధం, క్రియాశీలత, విస్తరణ లేదా ద్రవ్యరాశి, శక్తి, జ్ఞానం. ఆ నాలుగు సహజ కులాలూ గుణాల్నిబట్టి ఈ విధంగా సూచితమవుతాయి (1) తమస్సు (అజ్ఞానం), (2) తమస్సు-రజస్సు (అజ్ఞానం, క్రియాశీలతల కలగలుపు) (3) రజస్సు-సత్త్వం (సత్కర్మ జ్ఞానం కలగలుపు), (4) సత్త్వం (జ్ఞానం). ఈ విధంగా ప్రకృతి ప్రతి మనిషిలోనూ ఉన్న ఒక గుణానికిగాని రెండు గుణాల కలగలుపుకు గాని ఉన్న ప్రాబల్యాన్ని బట్టి అతనికొక కులాన్ని నిర్దేశిస్తుంది సహజంగా ప్రతి మనిషిలోనూ ఈ మూడు గుణాలూ

బంధుత్వం లేదా, ఆఖరిది సంపదను బట్టి సభ్యులమీద గౌరవం చూపించమని మనువు సమాజాన్ని శాసించాడు. ధర్మకార్యాలకు వినియోగం కాకుండా కూడబెట్టి ఉంచే సంపదల్ని వేదకాలపు భారతదేశం ఎప్పుడూ ఏవగించుకొంటూ ఉండేది. ఔదార్యంలేని ధనసంపన్ను లకు సమాజంలో అధమశ్రేణే ఇవ్వడం జరిగింది.

అనేక శతాబ్దుల కాలగతిలో కులవ్యవస్థ గిడసబారి వంశానుగతమైన నిర్బంధంగా పరిణమించినప్పుడు, తీవ్రమైన దుష్ఫలితాలు ఉత్పన్నమయాయి. 1947 నుంచి స్వయంపాలన కావించుకొంటున్న భారతదేశం పుట్టుకనుబట్టి కాక, కేవలం సహజమైన అర్హతమీదే ఆధారపడ్డ సనాతన కులమూల్యాల్ని తిరిగి నెలకొల్పడానికి, నెమ్మదిగా నయినా కచ్చితంగా ప్రగతి సాధిస్తోంది. భూమి మీద ప్రతిదేశానికీ విలక్షణమైన దుఃఖకారక కర్మ అన్నది ఒకటి ఉంటుంది; జాగ్రత్తగా వ్యవహరించి దాన్ని గౌరవప్రదంగా తొలగించవలసి ఉంటుంది. బహుముఖ ప్రజ్ఞాన్వితమై, సుదృఢమైన ఉత్సాహంగల భారతదేశం, కుల సంస్కరణ భారాన్ని వహించడానికి సమర్థమైనదేనని నిరూపించుకుంటోంది.

శ్రీరైట్, నేనూ ఇంకొంతకాలం ఇక్కడ ఉండాలని ఉవ్విళ్ళూరేటంతగా ఆకట్టుకుంది మమ్మల్ని, దక్షిణ భారతదేశం. కాని కాలం, ఎంతో కాలం నుంచి మొరటుతనం అలవాటు కావడంవల్ల మాకు మర్యాదగా గడువులు పొడిగించడం మానేసింది. త్వరలోనే నేను, కలకత్తా విశ్వవిద్యాలయంలో జరుగుతున్న, భారతీయ దార్శనిక మహాసభ ముగింపు సమావేశంలో ప్రసంగించవలసి ఉంది. మైసూరు సందర్శన కార్యక్రమానికి చివరగా, ఇండియన్ ఎకాడమీ ఆఫ్ సైన్సెస్‌కు అధ్యక్షులైన

---

వివిధ విప్పత్తుల్లో ఉంటూనే ఉంటాయి. ఒక మనిషి కులాన్ని లేదా క్రమోన్నత పరిణామ హోదాను గురువు సరిగా నిర్ధారణ చెయ్యగలుగుతాడు.

"అన్ని జాతులూ అన్ని దేశాలూ, సిద్ధాంతపరంగా కాకపోయినా ఆచరణలోనైనా, కుల వ్యవస్థా లక్షణాల్ని కొంతవరకు పాటిస్తూనే ఉంటాయి. స్వేచ్ఛ అనే గొప్ప లైసెన్సు ఉన్నచోట, ముఖ్యంగా సహజకులాల్లో విపరీత శ్రేణుల మధ్య జరిగే అంతర్వివాహాల్లో, క్రమక్రమంగా జాతి క్షీణించిపోతూ, చివరికి నశిస్తుంది. 'పురాణ సంహిత'లో, అటువంటి సంగమాలవల్ల కలిగిన సంతానాన్ని కంచరగాడిద వంటి గొడ్డుబోతు సంకరజాతి పశువుతో పోల్చడం జరిగింది. కంచరగాడిద సంతానాన్ని కనలేదు. చివరికి, కృత్రిమ జాతులు అంతరించి పోతాయి. ఎన్నో గొప్పగొప్ప జాతులు నామరూపాలు లేకుండా నశించిపోయిన సంగతి, చరిత్రలో అనేక ప్రమాణాల వల్ల రుజువవుతుంది. ప్రాచీనమైన ఇతర జాతులు అనేకం సంపూర్ణంగా అదృశ్యమై పోగా, జాతి స్వచ్ఛతను కాపాడి, అనేక వేల రకరకాల పరిస్థితుల్లో దాని మనుగడను సురక్షితంగా సాగనిస్తూ విశ్శృంఖలతను అదుపులో పెట్టి మహామేధావుల్ని సృష్టించిన ప్రతిష్ఠ భారతదేశ కుల వ్యవస్థకు మాత్రమే దక్కింది."

సర్ సి.వి. రామన్‌తో జరిగిన సంభాషణకు ఆనందించాను. మహా ప్రతిభాశాలి అయిన ఈ హిందూ భౌతికశాస్త్రవేత్త, కాంతి విస్తరణలో ముఖ్యమైన "రామన్ ఇఫెక్ట్" కనిపెట్టినందుకు 1930లో నోబెల్ బహుమతి అందుకున్నారు.

ఒక పక్క మనస్సు వెనక్కు లాగుతూనే ఉన్నా, అసంఖ్యాకులైన మద్రాసు విద్యార్థులకూ మిత్రులకూ వీడుకోలు చెప్పి శ్రీరైటూ నేనూ ప్రయాణం సాగించడానికి పూనుకున్నాం. దారిలో మేము కొద్దిసేపు, సదాశివబ్రహ్మం*గారి స్మారకార్థం నెలకొన్న పవిత్రమైన చిన్న ఆలయాన్ని దర్శించడానికి ఆగాం. పద్దెనిమిదో శతాబ్దిలో జీవించిన ఈ మహాయోగి జీవితగాథ, అనేక అలౌకిక ఘటనలతో నిండి ఉన్నది. సదాశివబ్రహ్మంగారి స్మారకార్థం నేరూరులో అంతకన్న పెద్ద గుడి ఉంది; దీన్ని పుదుక్కోట రాజుగారు కట్టించారు. అనేక దైవీచికిత్సలకు సాక్షిగా నిలిచిన యాత్రాస్థల మిది. అప్పట్లో పరిపాలన చేసే యువరాజుకు మార్గదర్శకంగా ఉండడంకోసం 1750 లో సదాశివ బ్రహ్మంగారు రాసిన ధర్మోపదేశాల్ని, పుదుక్కోట రాజ్యాన్ని ఏలిన తరవాతి పాలకులు పవిత్రంగా భద్ర పరిచారు.

ప్రేమాస్పదులూ పరిపూర్ణ జ్ఞానసంపన్నులూ అయిన సదాశివబ్రహ్మంగారిని గురించిన అద్భుత కథలు అనేకం, ఈనాటికీ దక్షిణ భారత గ్రామాల్లో ప్రచారంలో ఉన్నాయి. ఒకనాడు కావేరీనది ఒడ్డున సమాధిలో ఉన్న సదాశివ బ్రహ్మంగారు హఠాత్తుగా ముంచుకు వచ్చిన వరదలో కొట్టుకుపోవడం కనిపించింది. ఆ తరవాత కొన్ని వారాలకు, కోయంబత్తూరు జిల్లాలో కోడుమూడి దగ్గర ఒక మట్టిదిబ్బకు అడుగున లోతుగా కూరుకుపోయి కనిపించారు. ఊరి వాళ్ళు పారలతో మట్టి తవ్వుతూ ఉండగా, ఆ పారలు ఒంటికి తగిలి, ఆ సాధువు లేచి చకచకా నడుచుకుంటూ వెళ్ళిపోయారు.

సదాశివబ్రహ్మంగారు ఒకసారి, ఒక వృద్ధ వేదాంత పండితుడ్ని శాస్త్ర చర్చలో భంగపరిచినందుకు గురువుగారిచేత చివాట్లు తిన్నారు; ఆ తరవాత ముని (మాట్లాడని సాధువు) అయారు. "అబ్బాయ్, నువ్వు నోటిని అదుపులో పెట్టు కోడం ఎప్పుడు నేర్చుకుంటావ్?" అన్నారు గురువుగారు.

---

* ఈయనకు గల ఆశ్రమోచితమైన బిరుదు స్వామి శ్రీసదాశివేంద్ర సరస్వతి. ఈ పేరుతోనే ఆయన పుస్తకాలు (బ్రహ్మ సూత్రాలకూ, పతంజలి యోగసూత్రాలకూ వ్యాఖ్యానాలు) రాశారు. ఆధునిక భారతీయ దార్శనికులు ఆయనను పూజ్యభావంతో చూస్తారు.

శృంగేరి పీఠాధిపతులుగా ఉండి కీర్తిశేషులైన శ్రీశ్రీచంద్రశేఖర భారతి స్వామివారు సదాశివ బ్రహ్మంగారిని కీర్తిస్తూ ఒక స్తోత్రం రాశారు

"మీ దీవెనలుంటే, ఇప్పుడు ఈ క్షణంలోనే నండి."

సదాశివుల గురువులు స్వామి శ్రీ పరమశివేంద్ర సరస్వతి ఈయన 'దహర విద్యాప్రకాశిక' అన్న గ్రంథానికి కర్తలు. ఉత్తర గీతమీద ఉత్కృష్టమైన వ్యాఖ్యానం కూడా రాశారు. ప్రాపంచిక మానవులు కొందరు, సదాశివబ్రహ్మంగారు దైవో న్మత్తత చెంది తరచుగా "సభ్యత విడిచి" రోడ్లమీద ఆడిపోతూండడం అవమా నంగా భావించి గురువుగారికి ఫిర్యాదు చేశారు. "స్వామీ, సదాశివుడు పిచ్చివాడి కంటె మెరుగేమీ కాదండి," అన్నారు వాళ్ళు.

కాని పరమ శివేంద్రులు ఆనందభరితులై చిరునవ్వు చిందించారు. "అయ్యో, తక్కినవాళ్ళకి కూడా ఈ పిచ్చి ఉంటే ఎంత బాగుండేది!" అన్నారు.

సదాశివుల జీవితం, భగవంతుడి అదృశ్య హస్తంతో జరిగిన అనేక అద్భుత, సుందరలీలలతో విలక్షణత నందుకొన్నది. ఈ లోకంలో అన్యాయంగా కనిపించేది చాలా ఉంది; కాని దైవభక్తులు, ఆయన చేసే తక్షణ న్యాయానికి అసంఖ్యాకమైన సందర్భాల్ని ధ్రువపరచగలరు. ఒకనాడు రాత్రి సదాశివులు ఎక్కడికో వెళ్తూ సమాధి స్థితిలో ఉండగా, ఒక సంపన్న గృహస్థు వడ్లగాదె దగ్గర ఆగారు. అక్కడ కాపలాకాస్తున్న ముగ్గురు నౌకర్లు ఆ సాధువును చూసి దొంగ అనుకొని కొడదామని కర్రలు ఎత్తారు. అంతే! వాళ్ళ చేతులు అలాగే కదల కుండా ఉండిపోయాయి. పైకెత్తి ఉన్న చేతులతో, చిత్రమైన విగ్రహాల్లా నిలబడి ఉన్న ఆ ముగ్గురూ, వేకువ వేళ సదాశివబ్రహ్మంగారు అక్కణ్ణించి వెళ్ళిపోయే వరకు అలాగే ఉండిపోయారు.

మరో సందర్భంలో, దారినపోయే ఒక మేస్త్రి ఈ మహాయోగిని బలవం తంగా తన పనిలోకి దింపాడు. అతని మనుషులు వంటచెరుకు మోస్తున్నారు. ఆ మౌనసాధువు సవినయంగా తనకిచ్చిన బరువు గమ్యానికి మోసుకువెళ్ళి అక్కడున్న పెద్ద కట్టెలగుట్ట మీద పెట్టాడు. వెంటనే ఆ గుట్ట అంతా భగభగా మండిపోయింది.

సదాశివబ్రహ్మేంద్రులు కూడా త్రైలింగస్వామిలాగే, బట్టకట్టుకునేవారు కారు. ఒకనాడు పొద్దున ఈ దిగంబరయోగి, పరాకుగా ఒక ముస్లిం సర్దారు గుడారంలోకి ప్రవేశించారు. ఇద్దరు ఆడవాళ్ళు బెంబేలుపడి కెవ్వున అరిచారు; సర్దారు కత్తి దూసి క్రూరంగా సదాశివుల చెయ్యి నరికేశాడు; చెయ్యి తెగిపడి పోయింది. సదాశివులు అదేమీ పట్టించుకోకుండా బయటికి వెళ్ళిపోయారు. ఆశ్చర్యమూ పరితాపమూ పెనవేసుకుపోగా ఆ ముస్లిం, నేలమీద పడిఉన్న చేతిని తీసుకుని సదాశివుల వెనకాలే వెళ్ళాడు. ప్రశాంతంగా ఆ యోగి, నెత్తురు ఓడుతున్న

మొండి బుజంలోకి ఈ చేతిని జోడించారు. అప్పుడు ఆ సర్దారు, తనకు ఆధ్యాత్మిక ఉపదేశం ఏమైనా చెయ్యమని సదాశివబ్రహ్మేంద్రుల్ని కోరగా, వేలితో ఇసకలో ఇలా రాసి చూపించారు:

"నువ్వు కోరేది చెయ్యకు; అప్పుడు నీకు నచ్చేది చెయ్యవచ్చు."

పరిశుద్ధ మనఃస్థితిని అందుకున్నవాడై ఆ ముస్లిం, పరస్పర విరుద్ధమైన ఈ సలహా, అహంకారాన్ని జయించడం ద్వారా ఆత్మవిముక్తి పొందడానికి దారి చూపిస్తుందన్న సంగతి అర్థం చేసుకున్నాడు. ఈ కొద్ది మాటల ఆధ్యాత్మిక ప్రభావం ఎంత గొప్పగా పనిచేసిందంటే, ఆ తరవాత ఆ యోధుడు యోగ్యుడైన శిష్యుడని పించుకొన్నాడు; అతని పాత అలవాట్లన్నీ పటాపంచలయి పోయాయి.

ఒకసారి ఊళ్ళో పిల్లలు, అక్కడికి 150 మైళ్ళ దూరంలో మధురలో జరిగే ఉత్సవం ఒకటి చూడాలని ముచ్చటగా ఉందని సదాశివుల దగ్గర అన్నారు. అప్పుడా యోగి, తమ ఒంటిని ముట్టుకోమని ఆ పిల్లలతో అన్నారు. అంతే! మొత్తం వాళ్ళందరూ కట్టకట్టుకుని ఒక్క క్షణంలో మధురకు రవాణా అయి పోయారు ఆ ఉత్సవానికి వచ్చిన వేలాది యాత్రికుల మధ్య హాయిగా తిరిగారు వాళ్ళు. కొద్ది గంటల్లో ఆ యోగి, తన వర్దీలో ఉన్న ఆ పిల్లల్ని మళ్ళీ, తమ సులభ ప్రయాణపద్ధతిలో ఇళ్ళకి చేర్చారు. మధురలో ఉత్సవ విగ్రహాల ఊరేగింపు గురించి పిల్లలు స్పష్టంగా చెప్పడం విని, ఆ పిల్లల చేతుల్లో మధుర మిఠాయి పొట్లాలు ఉండడం చూసి వాళ్ళ తల్లిదండ్రులు ఆశ్చర్యపోయారు.

నమ్మకంలేని ఒక యువకుడు, ఆ సాధువునూ ఆ కథనూ గేలిచేశాడు. తరవాత శ్రీరంగంలో ఉత్సవం జరిగే సమయంలో, అతను సదాశివ బ్రహ్మేం ద్రుల్ని సమీపించాడు.

"స్వామీ, మీరు పిల్లల్ని మధుర తీసుకువెళ్ళినట్టుగా నన్ను శ్రీరంగం ఉత్సవానికి తీసుకువెళ్ళగూడదా?" అంటూ అవినయంగా అడిగాడు.

సదాశివులు అతని కోరిక మన్నించారు; మరుక్షణంలో ఆ యువకుడు, ఎంతో దూరాన ఉన్న శ్రీరంగనగర జనసమ్మర్దంలో ఉన్నానని గమనించాడు. కాని పాపం! అతను తిరిగి వెళ్ళిపోవాలనుకున్న సమయానికి ఆ సాధువు ఎక్కడు న్నాడు? చివరికి, ఈదురో గోడామని కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి చేరాడతను.

దక్షిణ భారతంనుంచి వచ్చేముందు శ్రీరైటూ నేను శ్రీరమణ మహర్షి దర్శనానికి తిరువణ్ణామలై దగ్గరున్న అరుణాచలమనే పుణ్యగిరికి యాత్ర చేశాం. ఆ మహర్షి మమ్మల్ని తమ ఆశ్రమంలో ఆప్యాయంగా ఆదరించారు. పక్కనే

బొత్తిపెట్టి ఉన్న 'ఈస్ట్ - వెస్ట్' పత్రిక సంచికలవేపు చూపించారు. వారితోనూ శిష్యులతోనూ మేము గడిపిన కొద్దిగంటల కాలంలో వారు, చాలావరకు మౌనం గానే ఉన్నారు; వారి సౌమ్యముఖం దివ్యప్రేమనూ జ్ఞానాన్నీ ప్రసరింపజేస్తోంది.

బాధలు అనుభవిస్తున్న మానవులు, తాము మరిచిపోయిన పరిపూర్ణతా సిద్ధిని తిరిగి పొందడానికి - "నేను ఎవర్ని?" అన్న ప్రశ్న నిరంతరం వేసుకుంటూనే ఉండాలని ఉద్బోధిస్తారు శ్రీ రమణులు; ఇది నిజంగా గొప్ప ఆత్మవిచారం. భక్తుడు ఇతర ఆలోచనల్ని కఠోరంగా తిరస్కరించి తన సత్యాత్మలోకి బాగా లోతుగా వెళ్ళగలుగుతాడు; పక్కదారి పట్టించే ఇతర ఆలోచనల భ్రమలు ఇక ముసరడం మానేస్తాయి. ఈ దక్షిణ భారత మహర్షి ఇలా రాశారు:

"ద్వంద్వాలూ త్రిత్వాలూ దేన్నో ఒకదాన్ని పట్టుకు వేలాడతాయి
ఆధారం లేకుండా అవుపించవు అవెన్నడూ;
ఆ ఆధారంకోసం వెతికితే పడలిపోతాయవి
అక్కడే ఉంది సత్యం, అది చూసినవాడిక ఊగిసలాడడు."

అధ్యాయం : 42

# గురుదేవులతో చివరి రోజులు

"గురూజీ, ఈవేళ పొద్దున మీరు ఏకాంతంగా కనిపించినందుకు నాకు సంతోషంగా ఉంది."

పండ్లూ గులాబీల సుగంధ భారాన్ని మోసుకొని నే నప్పుడే శ్రీరాంపూర్ ఆశ్రమానికి వచ్చాను. శ్రీయుక్తేశ్వర్‌గారు నిర్లిప్తులై చూశారు నావేపు.

"ఏమిటి నీ ప్రశ్న?" తప్పించుకోడానికి చూసినట్టుగా గది అంతా కలయ జూశారు గురుదేవులు.

"గురూజీ, నేను మీ దగ్గరికి హైస్కూలు పిల్లవాడిగా వచ్చాను; ఇప్పుడు నేను పెరిగి పెద్దవాణ్ణయాను; ఒకటిరెండు వెంట్రుకలు కూడా నెరిశాయి. మొదట మనం కలుసుకున్న క్షణంనుంచి ఈనాటివరకు మీరు నా మీద మౌనంగా ఆప్యాయత కురిపిస్తూ వస్తున్నప్పటికీ, "నేను నిన్ను ప్రేమిస్తున్నాను," అని మీరు అన్నది, మనం మొదట కలుసుకున్న రోజున, ఒకే ఒకసారి అన్న సంగతి మీకు గుర్తుందా?" అంటూ ప్రాధేయపూర్వకంగా ఆయనవేపు చూశాను.

గురుదేవులు చూపు వాల్చుకున్నారు. "యోగానందా, మాటలులేని గుండె చక్కగా పదిలపరిచే స్నిగ్ధభావనల్ని పాడిపాడిగా ఉండే మాటల్లో పెట్టాలా?" అన్నారు

"గురూజీ, మీరు నన్ను ప్రేమిస్తున్నారని నాకు తెలుసు, కాని ఆ మాట మీరు చెప్పగా వినాలని నా చెవులు తపించిపోతున్నాయి."

"నువ్వు కోరుకున్నట్టే కానియ్యి. వైవాహిక జీవితంలో ఉన్న రోజుల్లో నేను యోగమార్గంలో తర్ఫీదు ఇయ్యడానికి, నాకు ఒక్క కొడుకు ఉంటే బాగుండునని తరచు తపిస్తూ ఉండేవాణ్ణి. కాని నువ్వు నా జీవితంలో అడుగుపెట్టాక తృప్తిపడ్డాను నీ లోనే నా కొడుకును చూసుకున్నాను." శ్రీయుక్తేశ్వర్‌గారి కళ్ళలో స్పష్టంగా

రెండు కన్నీటిబొట్లు నిలిచాయి. "యోగానందా, నేను నిన్నెప్పుడూ ప్రేమిస్తూ ఉంటాను."

"మీ సమాధానమే నాకు స్వర్గప్రవేశానికి అనుమతి పత్రం." ఆయన మాటలకు నా గుండెలో బరువు దిగిపోయినట్టు అనిపించింది. ఆయన భావావేశ రహితంగా, కుదురుగా ఉంటూండేవారని నాకు తెలుసు; అయినా, ఆయన మౌనానికి నేను తరచు ఆశ్చర్యపోతూ ఉండేవాణ్ణి. ఆయన్ని నేను పూర్తిగా తృప్తిపరచలేకపోయానేమోనని అప్పుడప్పుడు అనుకుంటూ ఉండేవాణ్ణి. ఆయనది చిత్రమైన స్వభావం; ఎప్పుడూ పూర్తిగా తెలిసేది కాదు; బయటి ప్రపంచానికి అందనంత లోతుగా, నిశ్చలంగా ఉండేది ఆయన ప్రకృతి. ఆ బయటి ప్రపంచం విలువల్ని ఆయన ఏనాడో అధిగమించారు.

తరవాత కొన్నాళ్ళకి నేను కలకత్తాలో ఆల్బర్ట్ హాల్లో అసంఖ్యాకులైన శ్రోతల సమక్షంలో ఒక సభలో ప్రసంగించాను. శ్రీయుక్తేశ్వర్‌గారు, సంతోష్ సంస్థానం మహారాజా, కలకత్తా మేయర్‌లతో బాటు సభావేదిక మీద కూర్చోడానికి అంగీకరించారు. గురుదేవులు నా దగ్గర వ్యాఖ్యానమేమీ చెయ్యలేదు; కాని ప్రసంగ సమయంలో నేను అప్పుడప్పుడు ఆయనవేపు చూస్తూ, ఆయన సంతోషిస్తున్నట్టు కనిపిస్తున్నారని భావించాను.

ఆ తరవాత, శ్రీరాంపూర్ కాలేజి పూర్వవిద్యార్థుల సభలో ప్రసంగించవలసి వచ్చింది. నేను పాత సహాధ్యాయుల్ని చూస్తుంటేను, వాళ్ళు తమ "పిచ్చి సన్యాసి"ని చూస్తుంటేను ఆనంద బాష్పాలు స్రవించాయి. ధారాళమైన వాగ్ధాటి గల మా తత్త్వశాస్త్రాచార్యులు, డా॥ ఘోషాల్‌గారు, నన్ను అభినందించడానికి ముందుకు వచ్చారు; కాలమనే రసవాదివల్ల వెనకటి మా అపార్థాలన్నీ తొలగిపోయాయి.

డిసెంబరు నెల చివరిలో శ్రీరాంపూర్ ఆశ్రమంలో చలికాలపు సంక్రమణోత్సవం జరిగింది. ఎప్పటి మాదిరిగానే, శ్రీయుక్తేశ్వర్‌గారి శిష్యులు ఎక్కడెక్కడివాళ్ళూ అక్కడ సమకూడారు. భక్తి సంకీర్తనలూ అమృతంలాంటి తియ్యటి గొంతుతో క్రిష్టోదా ఒక్కడూ పాడిన పాటలూ కుర్ర విద్యార్థులు వడ్డించిన విందు భోజనమూ కిటకిటలాడే ఆశ్రమ ప్రాంగణంలో ఆరుబయట నక్షత్రాల కింద గాఢంగా సంచలనాత్మకమైన గురుదేవుల ఉద్బోధా - ఎన్నెన్ని జ్ఞాపకాలు! ఎప్పుడో గతించిన ఏళ్ళ ఆనందమహోత్సవాలు! అయితే, ఈ రోజు రాత్రి ఒక కొత్త విశేషం ఉంది.

"యోగానందా, ఈ సమావేశంలో నువ్వు మాట్లాడు - ఇంగ్లీషులో. ఇబ్బడిగా అసామాన్యమైన ఈ కోరిక కోరుతుంటే, గురుదేవుల కళ్ళు మిలమిలలాడాయి, ఇంగ్లీషులో నా మొదటి ఉపన్యాసం జరగడానికి ముందు ఓడలో నేను పడ్డ అవస్థ తలిచారో ఏమో ఆయన. నా శ్రోతలకూ సోదర శిష్యులకూ ఈ కథ చెప్పి, గురుదేవులకు హృదయపూర్వకంగా జోహార్లు అర్పిస్తూ ముగించాను.

"అమోఘమైన వారి మార్గదర్శకత్వం నాకు, మహాసముద్రంలో ఓడమీదే కాదు, మహావిశాలమైన ఆదరభరితమైన అమెరికాదేశంలో నేనున్న పదిహేనేళ్లూ ప్రతిరోజూ నాకు లభిస్తూనే ఉంది," అని ముగించాను.

అతిథులు వెళ్ళిపోయిన తరవాత శ్రీయుక్తేశ్వర్‌గారు, ఒకప్పుడు తమ పక్కలో పడుకొని నిద్రపోవడానికి అనుమతించి (అది కూడా ఒక్కసారే, ఇలాటి ఉత్సవం ఒకటి జరిగిన తరవాత) నన్ను తీసుకువెళ్ళిన పడగ్గదికే రమ్మని పిలిచారిప్పుడు. ఈరోజు రాత్రి మా గురుదేవులు అక్కడ ప్రశాంతంగా కూర్చుని ఉన్నారు; వారి పాదసన్నిధిలో అర్ధచంద్రాకారంగా కూర్చున్నారు శిష్యులు.

"యోగానందా, నువ్విప్పుడే కలకత్తా వెళ్ళిపోతున్నావా? రేపు మళ్ళీ ఒక్కసారి రా ఇక్కడికి. నీకు చెప్పవలసిన సంగతులు కొన్ని ఉన్నాయి."

మర్నాడు మధ్యాహ్నం, ఆశీఃపూర్వకమైన చిన్న మాటలు కొన్ని పలికి శ్రీయుక్తేశ్వర్‌గారు, 'పరమహంస'* అనే ఉన్నత పరివ్రాజక బిరుదం నాకు ప్రసాదించారు.

ఆయన ముందు నేను మోకరిల్లుతూ ఉండగా ఇలా అన్నారు. "ఇప్పుడిది 'స్వామి' అన్న నీ వెనకటి బిరుదానికి బదులుగా వాడుకలోకి వస్తుంది." 'పరమహంసజీ'† అన్నది పలకడానికి నా పాశ్చాత్య శిష్యులు పడవలసిన పాట్లు తలుచుకుని నాలో నేను ముసిముసి నవ్వులు నవ్వుకున్నాను.

---

* 'పరమ', అత్యున్నత. 'హంస' తెల్లటి హంసను సృష్టికర్త అయిన బ్రహ్మకు వాహనంగా చెబుతాయి పురాణాలు. పవిత్రమైన ఈ హంసకు, నీళ్ళు కలిసిన పాలల్లోంచి నీళ్ళను వేరుచేసే శక్తి ఉందని చెబుతారు; అంచేత అది ఆధ్యాత్మిక వివేకానికి ప్రతీక అయింది.

'అహం-సః' (ఉచ్చారణలో, హంస) అంటే, "నేనే ఆయన" అని అర్థం శక్తివంతమైన ఈ సంస్కృత శబ్దాలకు శ్వాసవిశ్వాసలతో స్పందక సంబంధముంది. ఆ విధంగా మానవుడు ప్రతి శ్వాసలోనూ, "నేనే ఆయన్ని" అన్న తన ఉనికిని గురించిన సత్యాన్ని అనుకోకుండానే నొక్కి చెబుతుంటాడు.

† వాళ్ళు సాధారణంగా నన్ను 'సర్' అని సంబోధిస్తూ ఈ ఇబ్బంది తప్పించుకున్నారు

"భూమి మీద ఇప్పుడిక నా పని పూర్తి అయింది; ఇక నువ్వు కొనసాగించాలి," అన్నారు గురుదేవులు ప్రశాంతంగా. ఆయన కళ్ళు ప్రశాంతంగా, ప్రసన్నంగా ఉన్నాయి. నా గుండె భయంతో దడదడా కొట్టుకుంటోంది.

"పూరీలో మన ఆశ్రమం బాధ్యత తీసుకోడానికి ఎవరినయినా పంపు," అంటూ చెప్పారు శ్రీయుక్తేశ్వర్‌గారు. "నే నంతా నీ చేతుల్లో పెట్టేస్తున్నాను. నువ్వు ఈ జీవితనౌకనీ, సంస్థానౌకనీ విజయవంతంగా దైవతీరాలకు చేర్చ గలుగుతావు."

నేను కన్నీళ్ళు కారుస్తూ ఆయన పాదాల్ని చుట్టేసుకున్నాను; ఆయన లేచి ప్రేమపురస్సరంగా దీవించారు.

తరవాత గురుదేవులు తమ ఆస్తిని బందోబస్తు చెయ్యడానికి సంబంధించిన న్యాయశాస్త్రపరమైన వివరాలు నాతో ముచ్చటించారు; తాము పోయిన తరవాత, తమ రెండు ఆశ్రమాల్నీ ఇతర ఆస్తుల్నీ స్వాధీనం చేసుకోడం కోసం తమ బంధువు లెవరూ వ్యాజ్యమాడకుండా ఉండేలా కట్టుదిట్టం చెయ్యాలని ఆయన ఆత్రం; ఆ ఆస్తుల్ని కేవలం ధర్మకార్యాలకే వినియోగించేటట్టుగా పత్రం రాసిపో వాలని ఆయన కోరిక.

"ఈమధ్య గురువుగారు కిద్దర్‌పూర్ వెళ్ళడానికి ఏర్పాట్లు జరిగాయి కాని, వెళ్ళలేకపోయారు." నా సోదరశిష్యుడు అమూల్యబాబు ఒకనాడు మధ్యాహ్నం నాతో అన్నాడు; ఏదో కీడు జరగబోతున్నట్టు నాలో వణుకు పుట్టింది. నేను గుచ్చిగుచ్చి అడిగినమీదట శ్రీయుక్తేశ్వర్ గారు ఇలా చెప్పారు, "ఇంక నేను కిద్దర్‌పూర్ వెళ్ళేది లేదు." ఒక్కక్షణం గురుదేవులు, జడుసుకున్న పసివాడిలా వణికిపోయారు.

("మహామునుల్లో సైతం, దేహమనే ఇంటిమీద మమకారం, దాని సహజ ప్రకృతినిబట్టి పుట్టి* రవ్వంత ఉంటుంది," అని రాశాడు పతంజలి. మృత్యువును గూర్చి మా గురుదేవులు చేసే ప్రసంగాలు కొన్నిటిలో, "చాలా కాలం పాటు పంజరంలో పెట్టి ఉంచిన పక్షి, తలుపు తెరిచినప్పుడు, తనకు అలవాటయిన ఇంటిని విడిచి వెళ్ళడానికి వెనకాడుతుంది," అంటూండేవారు).

"గురూజీ, అంతమాట అనకండి! అలాటి మాటలు మరెన్నడూ నా దగ్గర అనకండి," అంటూ ఏడుస్తూ మనవి చేసుకున్నాను.

---

* అంటే, గతంలో పొందిన మరణానుభవాలనే పురాతన మూలాలనుంచి అని అర్థం. [స్వరసవాహీ విదుషోపి తథారూఢోభినివేశః]. ఈ సూత్రం పతంజలి యోగసూత్రాల్లో II 9 లో వస్తుంది.

శ్రీయుక్తేశ్వర్‌గారి ముఖం ప్రశాంత దరహాసంతో ప్రసన్నమయింది. ఎనభై ఒకటో పుట్టినరోజు రాబోతున్నా, ఆయన ఆరోగ్యంగానూ, బలంగానూ కనిపించారు.

మాటల్లో వెలువడకపోయినా, హృదయానికి అనుభూతమయే మా గురుదేవుల ప్రేమలో ప్రతిరోజూ ఓలలాడుతూ, ఆసన్నమవుతున్న మరణాన్ని గురించి ఆయన చేసిన రకరకాల సూచనల్ని నా మనస్సులోంచి తొలగించేశాను.

"గురుదేవా, అలహాబాదులో ఈ నెల కుంభమేళా* జరుగుతోందండి," అంటూ మేళా జరిగే తిథులు ఒక బెంగాలీ పంచాంగంలో గురుదేవులకు చూపించాను.

"నీకు నిజంగా వెళ్ళాలని ఉందా?"

నేను తమను విడిచివెళ్ళడం శ్రీయుక్తేశ్వర్‌గారికి ఇష్టంలేదన్న సంగతి పసిగట్టకుండా నేను, "ఒకసారి అలహాబాదులో జరిగిన కుంభమేళాలో మీకు బాబాజీ దర్శనభాగ్యం కలిగింది. బహుశా ఈసారి ఆయన్ని దర్శించే భాగ్యం నాకు కలగవచ్చు," అన్నాను.

"నువ్వు వారిని అక్కడ కలుసుకుంటావనుకోను." తరవాత గురుదేవులు మౌనం వహించారు, నా ఆలోచనలకు అడ్డురావడం ఇష్టంలేక.

ఆ మర్నాడు నేను కొంతమందిని వెంటబెట్టుకొని అలహాబాదుకు బయలుదేరుతుంటే, గురుదేవులు యథాప్రకారంగా ప్రశాంతంగా నన్ను ఆశీర్వదించారు. శ్రీయుక్తేశ్వర్‌గారి వైఖరిలో ఉన్న గూఢార్థాలు నాకు స్ఫురణలో లేకపోవడానికి కారణం, గురుదేవుల మరణాన్ని నిస్సహాయంగా చూస్తూ ఉండిపోవలసిన అనుభవం నాకు బలవంతంగా కలక్కుండా ఉండాలని భగవంతుడి ఇచ్ఛ. నా

---

* ప్రాచీన గ్రంథమైన మహాభారతంలో మతపరమైన మేళాల గురించి ప్రస్తావించడం జరిగింది. హ్యూయాన్‌త్సాంగ్ అనే చైనా యాత్రికుడు క్రీ.శ. 644లో అలహాబాదులో జరిగిన పెద్ద కుంభమేళాను గురించి రాశాడు. 'కుంభ మేళా' అన్నది ప్రతి మూడో సంవత్సరం వరసగా, హరిద్వారం, అలహాబాదు, నాసిక, ఉజ్జయిని క్షేత్రాల్లో జరుగుతూంటుంది. ఆ తరవాత మళ్ళీ హరిద్వారంలో జరిగే నాటికి పన్నెండేళ్ళ ఆవృత్తి పూర్తి అవుతుంది. వాటిలో ప్రతి పట్నం కుంభ మేళా జరిగిన తరవాత ఆరో సంవత్సరంలో 'అర్ధ కుంభమేళా' జరుపుకుంటుంది; ఆ ప్రకారంగా వివిధ పట్నాల్లో మూడేళ్ళకొకసారి కుంభమేళా, అర్ధ కుంభమేళా జరుగుతూ ఉంటాయి.

ఉత్తర భారతాన్ని ఏలిన హర్షుడు, రాజ ధనాగారంలో ఉన్న సంపదనంతనీ (ఐదేళ్ళలో కూడబెట్టినది) కుంభమేళాలో సన్యాసులకూ యాత్రికులకూ పంచిపెట్టాడని హ్యూయాన్ త్సాంగ్ చెబుతున్నాడు. హ్యూయాన్ త్సాంగ్ చైనాకు తిరిగి వెళ్ళేటప్పుడు వీడ్కోలు సందర్భంగా హర్షుడిచ్చిన అమూల్యాభరణాల్నీ బంగారాన్నీ అతడు కాదని, మత సంబంధమైన 657 రాత ప్రతులను అంతకంటె విలువయినవిగా భావించి తనతో తీసుకుపోయాడు.

జీవితంలో ఎప్పుడూ ఇలాగే జరుగుతోంది; నాకు అత్యంత ప్రియమైనవాళ్ళు మరణ సమయాల్లో, దేవుడు దయతలిచి, నేను ఆ సన్నివేశాలకు దూరాన ఎక్కడో ఉండేటట్టు ఏర్పాటు చేశాడు.*

మా బృందం 1936 జనవరి 23 తేదీన కుంభమేళా చేరింది. దాదాపు ఇరవై లక్షలమంది ఉన్న ఆ జనసందోహం కంటికి ఆకర్షకంగా ఉండడమే కాదు, మనసును ఉర్రూతలూగిస్తుంది; ఉక్కిరిబిక్కిరి చేస్తుంది. పరమాత్మ విలువ మీదా గాఢతరమైన భగవదాలంబన ప్రాప్తి కోసం లౌకిక బంధాల్ని విడిచిపెట్టిన సాధు సన్న్యాసులమీదా అధమాధమ స్థితిలో ఉన్న రైతుకు సైతం సహజసిద్ధమైన గౌరవం ఉండడం భారతీయుల విశిష్టత. కపటులూ నయవంచ కులూ నిజంగా ఉన్నారు; కాని భగవదాశీస్సులతో దేశాన్ని వెలుగొందించే కొద్దిమందికోసమని భారతదేశం అందరినీ గౌరవిస్తుంది. ఈ సువిశాల దృశ్యాన్ని చూసిన పాశ్చాత్యులకు జాతి జీవనాడినీ, కాలం తాకిడికి తట్టుకొంటూ భారత దేశం నిలుపు కొంటున్న అణచలేని జీవశక్తికి మూలమైన ఆధ్యాత్మిక వైభవాన్నీ అనుభూతి కావించుకోడానికి అద్వితీయ మైన అవకాశం కలిగింది.

మా బృందం మొదటి రోజంతా, కేవలం చూడడంతోనే గడిపింది. వేలకొద్ది యాత్రికులు, పాపపరిహార నిమిత్తం పావనగంగలో స్నానాలు చేశారు. బ్రాహ్మణ పురోహితులు శాస్త్రోక్తమైన పూజాపురస్కారాలు నిర్వర్తించారు. కొందరు యాత్రికులు మౌన సన్న్యాసుల పాదాల దగ్గర భక్తి పూర్వకంగా కానుకలు సమర్పించారు.; ఏనుగులూ, అందంగా అలంకరించిన గుర్రాలూ, మందగొడిగా నడిచే రాజపుటానా ఒంటెలూ బారులు బారులుగా సాగాయి; వాటి వెనక, వెండిబంగారా లతో చేసిన రాజదండాల్నీ పట్టు ముఖమల్ పతాకాల్నీ ఊపు తూండే దిగంబర సాధువుల చిత్రమైన ఊరేగింపు సాగింది.

గోచీలు మాత్రం పెట్టుకుని ఉన్న తపస్వులు, ప్రశాంతంగా చిన్న చిన్న గుంపులుగా కూర్చుని ఉన్నారు; వేడికీ చలికీ తట్టుకోగలిగేందుకు వీలుగా వారు, ఒంటికి బూడిద పూసుకుని ఉన్నారు. వారికి నుదుట ఉన్న చందనపు బొట్టు జ్ఞాననేత్రాన్ని సూచిస్తోంది. తల నున్నగా గీయించుకుని, కాషాయ వస్త్రాలు ధరించి, వెదురుకర్రా భిక్షాపాత్రా చేతపట్టుకున్న సన్న్యాసులు వేలకొద్దీ ఉన్నారు. వాళ్ళు నడుస్తున్నప్పుడూ శిష్యులతో వేదాంత చర్చలు చేస్తున్నప్పుడూ కూడా వాళ్ళ ముఖాలు, సన్న్యాసులకు సహజమైన ప్రశాంతతతో ప్రకాశించాయి.

---

* మా అమ్మ, అన్నయ్య అనంతుడు, అక్క రమ, గురుదేవులు, నాన్నగారు, ప్రేమాస్పదు లైన అనేకమంది ఇతరులూ చనిపోయినప్పుడు నేను దగ్గర లేను.

(నాన్నగారు కలకత్తాలో, 1942లో, ఎనభై తొమ్మిదో ఏట కాలం చేశారు.)

అక్కడక్కడ చెట్లకింద, మండుతున్న కొయ్యదుంగల గుట్టలచుట్టూ ఆకర్షణీయమైన సాధువులు* ఉన్నారు; వాళ్ళ జుట్టు జెడలు కట్టి తలమీద చుట్టచుట్టి ఉంది. వాళ్ళలో కొందరికి, కొన్ని అడుగుల పొడుగు గల గడ్డాలు ఉన్నాయి; వాటిని చుట్టచుట్టి ముళ్ళు వేసుకున్నారు. వాళ్ళు ప్రశాంతంగా ధ్యానంలోనయినా ఉంటారు, లేదా చెయ్యిచాపి దారినిపోయే జనాన్ని ఆశీర్వదిస్తూనయినా ఉంటారు.

బిచ్చగాళ్ళు, ఏనుగుల మీద సాగే మహారాజులు, వన్నెవన్నెల చీరలు కట్టుకుని గలగలలాడే గాజులతోనూ ఘల్లుఘల్లుమనే కడియాలతోనూ సాగే ఆడవాళ్ళు, వికారంగా చేతులు చాపుకొని ఉన్న ఫకీర్లు, యోగదండాల్ని పట్టుకువెళ్ళే బ్రహ్మచారులు, అంతరంగానందాన్ని గంభీరంగా దాచిపెట్టుకున్న వినయ సాధు మూర్తులు ఎందరో ఉన్నారు. ఈ కోలాహలాన్ని మించిపోయేటట్టుగా అదే పనిగా మోగే గుడిగంటల పిలుపు విన్నాము.

మేము మేళాకు వచ్చిన రెండో రోజున, నా సహచరులూ నేనూ వివిధ ఆశ్రమాల్లోకీ, తాత్కాలికంగా వేసిన గుడిసెల్లోకీ వెళ్ళి సాధుసత్పురుషులకు ప్రణామాలు చేశాం. మఠామ్నాయంలో 'గిరి' శాఖనాయకుని ఆశీస్సులు అందుకున్నాం - అగ్నితేజంతో నవ్వే కళ్ళూ బక్క పలచని ఒళ్ళూ గల తపస్వి ఆయన. ఆ తరవాత మరో ఆశ్రమానికి వెళ్ళాం; అక్కడి ఆశ్రమ గురువులు అప్పటికి తొమ్మిదేళ్ళుగా మౌనవ్రతంలో ఉన్నారు; పండ్లు మాత్రమే ఆయన ఆహారం. ఆ ఆశ్రమం హాలులో ఒక వేదిక మీద కూర్చున్న అంధసాధువు 'ప్రజ్ఞా చక్షువు'†; శాస్త్రాలు గాఢంగా అధ్యయనం చేసిన పండితుడాయన; అన్ని సంప్రదాయాల వాళ్ళూ ఆయన్ని ఘనంగా గౌరవిస్తారు.

నేను వేదాంతం గురించి హిందీలో సంగ్రహంగా ఒక ప్రసంగం చేసిన తరవాత, మేము ప్రశాంతమైన ఆ ఆశ్రమంలోంచి బయటికివచ్చి దగ్గరలో మరో స్వామిని సందర్శించాం. గులాబివన్నె చెక్కిళ్ళు, దృఢమైన భుజాలు కలిగి సుందరరూపులయిన ఆ సన్యాసిపేరు కృష్ణానందగారు. ఆయన దగ్గర పెంపుడు

* భారతదేశంలో ఉన్న కొన్ని లక్షలమంది సాధువుల్ని నియంత్రించడానికి ఏడుగురు నాయకులతో కూడిన కార్యవర్గం ఒకటి ఉంది: ఈ ఏడుగురూ భారతదేశంలో ఉన్న ఏడు పెద్ద విభాగాలకు ప్రతినిధులు. ప్రస్తుతం మహామండలేశ్వరులు - అంటే అధ్యక్షులు శ్రీశ్రీ జయేంద్రపురిగారు. ఈ సాధుపుంగవులు చాలా మితభాషులు; ఈయన తమ ప్రసంగాన్ని తరచుగా - 'సత్యం, ప్రేమ, పని' అన్న మూడు మాటలకే పరిమితం చేసుకుంటారు. ఇదే తగినంత సంభాషణ.

† (భౌతిక దృష్టి లేకుండా) "తన జ్ఞానంతోనే చూసే వ్యక్తి" అన్న అర్థం గల ఒక బిరుదు

ఆడసింహం ఒకటి పడుకొని ఉంది. ఆ అడవి జంతువు ఆ సన్యాసి ఆధ్యాత్మికా కర్షణకు లోబడి - ఆయన శరీర దార్ఢ్యానికి మాత్రం కాదని కచ్చితంగా చెప్ప గలను! - అన్నం, పాలూ తప్ప మాంసమేదీ ముట్టదు. పచ్చని జూలుగల ఈ జంతువుకు, దీర్ఘ గంభీర గర్జనలో ఓంకార నాదం చెయ్యడంనేర్పారు ఆ స్వామి - అదొక పిల్లిజాతి భక్తురాలు!

ఆ తరవాత చెప్పుకోదగ్గది, ఒక పండిత యువసాధువుతో జరిగిన సంభాషణ. దాన్ని గురించి శ్రీరైట్, తన యాత్రా దినచర్య పుస్తకంలో ఇలా రాశాడు:

" మేము ఫోర్డుకారులో, కిర్రుకిర్రుమనే బల్లకట్టు వంతెనమీద, దిగువ మట్టంలో ప్రవహిస్తున్న గంగానదిని దాటాం; ఆ జనసమ్మర్దంలో పాము పాకి నట్టుగా ముందుకు సాగి, సన్నసన్నటి వంకర సందుల్లోంచి వెళ్ళి, ఏటి ఒడ్డుకు చేరినప్పుడు, యోగానందగారు బాబాజీ, శ్రీయుక్తేశ్వర్‌గారూ కలుసుకున్న స్థలంవేపు చూపించారు. కాసేపటికి మేము కారులోంచి దిగి, సాధువులు వేసిన మంటలనుంచి దట్టంగా వస్తున్న పొగల్లోంచి జారుడు ఇసకమీద కొంతదూరం నడిచి, అడుసు మన్నూ గడ్డీ కలిపి వేసిన చిన్నచిన్న గుడిసెల సమూహానికి చేరాం. ఈ తాత్కాలిక ఆవాసాల్లో ఒకదాని ముందు ఆగాం. దానికి తలుపు లేదు; లోపలికి ప్రవేశించడానికి చిన్న ప్రవేశమార్గం ఉంది. కరపాత్రి అనే యువ సంచార సాధువు బసచేస్తున్నది అక్కడే; విశిష్టమైన ప్రతిభకు పేరు పొందిన వాడాయన. అక్కడ ఒక గడ్డిచాపమీద బాసెంపట్టు వేసుకుని కూర్చుని ఉన్నారు. ఆయనకున్న ఒకేఒక ఆచ్ఛాదన - పైపెచ్చు, ఆయనకున్న ఒకేఒక ఆస్తి - ఆయన బుజాల మీద కప్పుకున్న కాషాయవస్త్రం.

" మేము కాళ్ళూ చేతులూ నేలకు ఆనించి పాక్కుంటూ ఆ కుటీరం లోకి వెళ్ళి, ఆ జ్ఞానమూర్తికి ప్రణామం చేసేసరికి, దివ్యత్వం ఉట్టిపడే ఆ ముఖంలో చిరునవ్వు విరిసింది. ప్రవేశమార్గం దగ్గరున్న కిరసనాయిలు లాంతరు వింతగా అల్లల్లాడుతోంది; గుడిసె గోడలమీద నీడలు ఆడుతున్నాయి. ఆయన ముఖం, ప్రత్యేకించి ఆయన కళ్ళు, చక్కని పలువరుస తళతళ మెరుస్తున్నాయి. ఆయన హిందీ నాకు కొంచెం గందరగోళంగానే ఉంది గాని ఆయన కవళికలు భావ స్ఫోరకంగా ఉన్నాయి. ఆయన ఉత్సాహంతోనూ, ప్రేమతోనూ, ఆధ్యాత్మిక తేజంతోనూ నిండి ఉన్నారు. ఆయన గొప్పతనం విషయంలో ఎవ్వరికీ సంశయం కలగదు.

"భౌతిక ప్రపంచం పట్ల మమకారం లేని వ్యక్తి జీవితం ఎంత సుఖంగా ఉంటుందో : బట్టల సమస్య ఉండదు; రోజు విడిచి రోజు తప్ప అన్నం ముట్ట

కుండా, ఎన్నడూ భిక్షాపాత్ర పట్టకుండా ఉండడంవల్ల తిండికోసం వెంపర్లాడడం ఉండదు; ఎన్నడూ డబ్బుతో లావాదేవీలు లేకుండా, వస్తువులేవీ దాచిపెట్టు కోకుండా ఎప్పటికీ దేవుణ్ణే నమ్ముకుని ఉండడంవల్ల డబ్బుకు సంబంధించిన లంపటాలేవీ ఉండవు; పవిత్ర నదీతీరాల వెంబడి నడుచుకుంటూ సాగిపోవడం తప్ప ఎన్నడూ వాహనాలు ఎక్కకపోవడంవల్ల రవాణా సమస్యలేవీ ఉండవు; మమకారాలు పెరక్కుండా ఉండడంకోసం, వారంరోజుల కంటె ఎక్కువ ఎక్కడా ఉండడం జరగదు.

"అటువంటి వినయాత్ముడీయన! వేదాల్లో అసాధారణ పాండిత్యం గడించిన ఈయన, బెనారస్ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఏ. పట్టం, శాస్త్రి (శాస్త్రాల్లో పండితుడు) పట్టం గడించినవాడు. నేను ఆయన పాదాల దగ్గర కూర్చుని ఉన్నప్పుడు ఒకానొక మహత్తరానుభూతి నాలో వ్యాపించింది; నిజమైన భారత దేశాన్ని చూడాలన్న నా కోరికకు, ఆ అనుభవం ఒక సమాధానంగా కనిపించింది. ఆధ్యాత్మిక మహనీయులు గల ఈ దేశానికి నిజమైన ప్రతినిధి ఈయన."

కరపాత్రిగారిని, ఆయన సంచార జీవితం గురించి అడిగాను. "చలి కాలానికి మీకు అదనంగా బట్టలు లేవా?"

"లేవు, ఇది చాలు."

"మీరు పుస్తకాలు కూడా తీసుకువెడతారా?"

"ఉహుం, నేను చెప్పేది వినదలిచినవాళ్ళకి నా జ్ఞాపకంతోనే బోధిస్తాను."

"ఇంకా ఏం చేస్తారు?"

"గంగ ఒడ్డున తిరుగుతాను."

ప్రశాంతమైన ఈ మాటలు విన్నప్పుడు, ఆయన జీవితంలో ఉన్న నిరాడంబరత నాకు కూడా అలవడితే బాగుండునన్న తపన నన్ను వివశుణ్ణి చేసింది. అమెరికానీ, అక్కడ నా భుజాలమీదున్న బరువు బాధ్యతల్నీ గుర్తు చేసుకున్నాను.

"లేదు యోగానందా, ఇలా గంగ ఒడ్డున తిరిగే యోగం నీకు ఈ జన్మలో లేదు," అని ఒక్క క్షణం దిగులుగా అనుకున్నాను.

ఆ సాధువు, తమ ఆధ్యాత్మికానుభూతులు కొన్ని నాకు చెప్పిన తరవాత, నేను చటుక్కున ఒక ప్రశ్న వేశాను.

"మీరు వర్ణించినవి ఇవన్నీ శాస్త్రజ్ఞానంతో చెబుతున్నారా, మీ అంతరికా నుభవంతో చెబుతున్నారా?"

"పుస్తకాల్లో చదివింది సగం, అనుభవంలోది సగం," అంటూ చిరునవ్వుతో సూటిగా జవాబు ఇచ్చారు.

మేము కొంతసేపు ధ్యానమౌనంలో కూర్చున్నాం. ఆయన పవిత్ర సన్నిధి నుంచి తరలివచ్చిన తరవాత నేను శ్రీరైట్‌తో, "బంగారు గడ్డి సింహాసనం మీద కూర్చున్న మహారాజా ఈయన," అన్నాను.

ఆ రోజు రాత్రి మేళా మైదానంలో నక్షత్రాల కింద, పుల్లలతో కుట్టిన విస్తళ్ళలో భోజనాలు చేశాం. భారతదేశంలో గిన్నెలు, పళ్ళాలు కడిగే బెడదను కనీస స్థాయికి తగ్గించడం జరిగింది.

మనసుని ఆకట్టుకునే ఆ కుంభమేళాలో మరో రెండు రోజులు ఉన్నాం. తరవాత యమున ఒడ్డునే వాయవ్యంగా పయనించి ఆగ్రా చేరాం. మరోసారి తాజ్‌మహల్ చూస్తూ ఉండిపోయాను; ఆ పాలరాతి స్వప్నాన్ని నా పక్కన నిలబడి అబ్బురంగా తిలకించిన జితేంద్రుడు జ్ఞాపకం వచ్చాడు. అక్కణ్ణించి బయల్దేరి బృందావనంలో స్వామి కేశవానందగారి ఆశ్రమానికి వెళ్ళాం.

కేశవానందగారి కోసం వెళ్ళడంలో నా ఉద్దేశ్యం, ఈ పుస్తకంతో ముడిపడి ఉన్నది. నన్ను లాహిరీ మహాశయుల జీవిత చరిత్ర రాయమని శ్రీయుక్తేశ్వర్ గారు కోరిన కోరికను నే నెన్నడూ మరిచిపోలేదు. నేను భారతదేశంలో ఉన్న కాలంలో, అవకాశం దొరికినప్పుడల్లా, ఆ యోగావతారమూర్తి ప్రత్యక్ష శిష్యుల్నీ, బంధువుల్నీ కలుసుకుంటూనే ఉన్నాను. వాళ్ళతో జరిగిన సంభాషణలు రాసి పెట్టుకుంటూ, యధార్థ విషయాల్నీ తేదీల్నీ సరిచూసుకుంటూ, ఫొటోలూ పాత ఉత్తరాలూ పత్రాలూ సేకరించాను. నా 'లాహిరీ మహాశయ దస్త్రం' పెరగడం మొదలయింది. గ్రంథకర్తృత్వంలో నేను పడవలసిన పాట్లు ముందు ఉన్నాయని గ్రహించి డీలా పడిపోయాను. ఆ మహాగురువుల జీవితకథారచయితగా నా పాత్రను నేను సముచితంగా నిర్వహించగల సామర్థ్యం నాకు ప్రసాదించమని ప్రార్థించాను. లిఖిత వృత్తాంతంలో తమ గురువుగారిని తక్కువ చెయ్యడంకాని, తప్పుడు వ్యాఖ్య చెయ్యడంకాని జరుగుతుందేమోనని, ఆయన శిష్యుల్లో చాలా మంది భయపడ్డారు.

"దైవావతారుల జీవితానికి, పసలేని పలుకులతో ఎవ్వరూ న్యాయం చెయ్యలేరు," అని నా దగ్గర వ్యాఖ్యానించారు, పంచానన్ భట్టాచార్యగారు.

ఇతర సన్నిహిత శిష్యులు కూడా అదే విధంగా, ఆ యోగావతారుల్ని

అమర గురుదేవులుగా తమ గుండెల్లో దాచి పెట్టుకోడంతోనే తృప్తి పడ్డారు అయినప్పటికీ, లాహిరీ మహాశయులు తమ జీవిత చరిత్రను గురించి చెప్పిన జోస్యం నా మనస్సులో ఉండడంవల్ల, ఆయన బాహ్య జీవితానికి సంబంధించిన యథార్థ విషయాల్ని సేకరించి సత్యనిరూపణకు శక్తివంచన లేకుండా కృషి చేశాను

స్వామి కేశవానందగారు, బృందావనంలో ఉన్న తమ కాత్యాయనీ పీఠ ఆశ్రమంలో మమ్మల్ని ఆప్యాయంగా ఆహ్వానించారు. చక్కని తోటలో ఉన్న ఆ ఆశ్రమం, భారీఎత్తు నల్ల స్తంభాలతోను, ఇటికలతోను కట్టింది. ఆయన వెంటనే మమ్మల్ని, కూర్చునే గదిలోకి తీసుకువెళ్ళారు; అందులో లాహిరీ మహాశయుల పెద్ద ఫోటో ఒకటి ఉంది. ఆ స్వామికి తొంభయ్యో ఏడు దగ్గర పడుతోంది కాని, కండలు తిరిగిన ఆయన శరీరం బలాన్నీ ఆరోగ్యాన్నీ కనబరు స్తోంది. పొడుగాటి జుట్టు, మంచులాటి తెల్లటి గడ్డం, ఆనందంతో మిలమిల్లాడే కళ్ళు గల ఆయన, మూర్తీభవించిన యథార్థ ఋషిపుంగవులు. భారతీయ గురువుల గురించి రాసే నా పుస్తకంలో ఆయన్ని గురించి కూడా చెప్పదలుచు కున్నానని నేను ఆయనకు తెలియజేశాను.

"మీ పూర్వ జీవితాన్ని గురించి కొంచెం చెప్పండి." ప్రాధేయ పూర్వకంగా చిరునవ్వు నవ్వాను; మహాయోగులు సాధారణంగా మితభాషులు.

కేశవానందగారు వినమ్రతా భంగిమ ఒకటి చేశారు. "బాహ్యంగా ప్రముఖ మైనది ఏదీ లేదు. నిజానికి, నా జీవితమంతా హిమాలయాల్లో ఏకాంత ప్రదేశాల్లోనే గడిచి పోయింది. ప్రశాంతమైన ఒక గుహనుండి మరో గుహకు నడిచి వెళ్తూ ఉండేవాణ్ణి. కొద్దికాలం నేను హరిద్వారానికి అవతల, చిన్న ఆశ్రమం ఒకటి నడిపాను; దాని చుట్టూ పొడుగాటి చెట్లతోపు ఒకటి ఉండేది. ఎక్కడ పడితే అక్కడ తాచుపాములు విచ్చలవిడిగా ఉంటూండడంవల్ల యాత్రికులు అక్కడికి వచ్చేవారు కారు. అది ప్రశాంతమైన ప్రదేశం," అంటూ కేశవానంద గారు ముసిముసి నవ్వు నవ్వారు. "తరవాత, గంగకు వరదవచ్చి, ఆ ఆశ్రమాన్నీ తాచుపాముల్నీ కూడా ఊడ్చిపెట్టేసింది. అప్పుడు మా శిష్యులు ఈ బృందావన ఆశ్రమం కట్టడానికి నాకు తోడుపడ్డారు."

మా బృందంలో ఒకరు ఆ స్వామిని, హిమాలయాల పులుల బారి నుంచి ఎలా రక్షించుకోగలిగారని అడిగారు. కేశవానందగారు తల ఊపారు. "ఆ ఉన్నత ఆధ్యాత్మిక ప్రదేశాల్లో అడవి జంతువులు యోగుల్ని పీడించడమన్నది అరుదు. ఒకసారి నాకు, అడవిలో ముఖాముఖిగా ఒక పులి తారసపడింది. హఠాత్తుగా

నేను చేసిన ధ్వనికి ఆ జంతువు రాయిలా స్తంభించిపోయింది," అంటూ చెప్పి ఆ స్వామి, వెనకటి జ్ఞాపకాలతో మళ్ళీ ముసిముసిగా నవ్వారు.*

"అప్పుడప్పుడు నేను, కాశీలో ఉన్న మా గురువుగారిని దర్శించడానికి నా ఏకాంతవాసంలోంచి బయటికి వచ్చేవాణ్ణి. హిమాలయారణ్యాల్లో నేను అంతూ పొంతూ లేకుండా చేసే సంచారానికి గురువుగారు నన్ను వేళాకోళం చేస్తూండేవారు

" 'నీ అరికాళ్ళల్లో చక్రం ఉంది,' అన్నా రొకసారి ఆయన నాతో. 'పవిత్ర హిమాలయాలు నిన్ను ఆకట్టుకోడానికి కావలసినంత విశాలంగా ఉన్నందుకు సంతోషం.'

"చాలాసార్లు, మహాసమాధికి ముందూ తరవాతా కూడా, లాహిరీ మహాశయులు సశరీరులై నాముందు సాక్షాత్కరించారు. హిమాలయాల ఎత్తు, ఆయన చేరలేనిదేమీ కాదు!"

రెండు గంటల తరవాత మమ్మల్ని భోజనాల గదిలోకి తీసుకువెళ్ళారాయన. నేను లోపల గాభరాపడి నిట్టూర్పు విడిచాను. మరో పదిహేను వంటకాల భోజనం! భారతదేశం ఆతిథ్యాన్ని అందుకోడం మొదలయి ఏడాది నిండక ముందే నేను ఏభై పౌన్ల బరువు పెరిగాను! అయినప్పటికీ నా మీద గౌరవంతో ఏర్పాటుచేసిన అంతులేని విందుల్లో, శ్రద్ధగా వండిన వంటకాల్లో దేన్నైనా తిరస్కరించడం చాలా మొరటుతనం అనిపించుకుంటుంది. భారతదేశంలో (దురదృష్టవశాత్తు, మరెక్కడా కాదు!) బాగా లావెక్కిన సన్యాసిని ముచ్చటపడి చూస్తారు.

భోజనం అయిన తరవాత కేశవానందగారు నన్నొక మారుమూలకి తీసుకు వెళ్ళారు. "నీ రాక మేము అనుకోనిదేమీ కాదు," అన్నారాయన. "నీకో కబురు చెప్పాలి."

---

* పులుల్ని జయించడానికి చాలా పద్ధతులున్నట్టు కనిపిస్తోంది. ఫ్రాన్సిస్ బర్టిల్స్ అనే ఆస్ట్రేలియా దేశపు అన్వేషకుడు, భారతదేశంలో ఉన్న అడవులు తనకు "రకరకాలుగాను, అందంగాను, సురక్షితంగాను" కనిపించినట్టు రాశాడు. ఆయన రక్షాకవచం 'ఈగల కాయితం' (ఫ్లై పేపర్). "ప్రతిరోజూ రాత్రి నేను, నా శిబిరానికి చుట్టూ కొన్ని కాయితాలు పరిచి ఉంచేవాణ్ణి; దాంతో నిశ్చింతగా ఉండేవాణ్ణి," అని వివరించాడు. "దానికి కారణం, మన స్తత్వ సంబంధమయినది. పులి గొప్ప స్వాభిమానం గల జంతువు. అది ఈగల కాయితం దాకా వచ్చేవరకు, చుట్టూ తిరిగి గాండ్రిస్తూ మనిషిని సవాలు చేస్తుంది. తరవాత చల్లగా జారుకుంటుంది. దర్పాగల పులి ఏదీ కూడా, జిగురు కాయితం మీద చతికిలబడ్డ తరవాత మనిషి ఎదుటపడ్డానికి పూనుకోదు!"

నేను ఆశ్చర్యపోయాను. నేను కేశవానందగారి దర్శనానికి వెళ్తానని ఎవరికీ తెలియదు.

"కిందటేడాది నేను, బదరీనారాయణానికి దగ్గరలో ఉత్తర హిమాలయాల్లో తిరుగుతూ ఉండగా దారి తప్పిపోయాను. విశాలమైన ఒక గుహలో తల దాచు కోడానికి చోటు కనిపించింది. ఆ గుహలో రాతి నేలమీదున్న ఒక గుంటలో నిప్పులు కణకణా మండుతున్నా, గుహమట్టుకు ఖాళీగా ఉంది. ఈ ఏకాంత వాసంలో ఉండే ఆయన ఎవరా అని ఆలోచిస్తూ నేను, ఆ మంట దగ్గిర కూర్చున్నాను. గుహలోకి ప్రవేశించే దారిలో పడుతున్న ఎండమీద నా చూపు నిలిచిపోయింది.

" 'కేశవానందా, నువ్విక్కడున్నందుకు సంతోషం.' ఈ మాటలు నా వెనక నుంచి వినవచ్చాయి. నేను చటుక్కున వెనక్కి తిరిగి అదిరి పడ్డాను; బాబాజీని చూసి అప్రతిభుణ్ణి అయాను! ఆ మహాగురువులు గుహలో ఒక మూల, భౌతిక రూపంలో సాక్షాత్కరించారు. చాలా ఏళ్ళ తరవాత మళ్ళీ ఆయన్ని దర్శించి నందుకు అమితానందంలో మునిగి నేను ఆయన పవిత్ర పాదాలముందు సాష్టాంగ ప్రణామం చేశాను.

" ' నే నిక్కడికి పిలిచాను నిన్ను.' అంటూ చెప్పారు బాబాజీ. 'అంచేతే నువ్వు దారితప్పి, నా తాత్కాలిక వసతి అయిన ఈ గుహకి రావడం జరిగింది. మనం కలుసుకుని చాలా కాలమయింది; మళ్ళీ మరోసారి నిన్ను పలకరించడం నాకు సంతోషం.'

"ఆ అమర గురుదేవులు, ఆధ్యాత్మికంగా నాకు ఉపకారం చేసే కొన్ని మాటలతో నన్ను దీవించి, తరవాత ఇలా అన్నారు : "యోగానందకి నువ్వొక కబురు చెప్పాలి. అతను భారతదేశానికి తిరిగి వచ్చినప్పుడు నిన్ను చూడ్డానికి వస్తాడు. అతని గురువుకూ లాహిరీ శిష్యుల్లో ఇంకా బతికున్నవాళ్ళకీ సంబం ధించిన అనేక విషయాల్లో అతను మునిగి ఉంటాడు. అప్పుడు అతనితో చెప్పు అతను నన్ను చూడాలని ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు కాని, ఈసారి నే నతన్ని కలుసుకోననీ, మరో సందర్భంలో కలుస్తాననీ చెప్పు.' "

బాబాజీ పలికిన, ఈ ఓదార్పుతో కూడిన హామీ కేశవానందగారి నోట విని గాఢంగా చలించాను. నా గుండెలో ఉన్న మూగబాధ ఒకటి దీంతో తొలగి పోయింది; శ్రీయుక్తేశ్వర్‌గారు ముందే సూచించినట్టు, బాబాజీ నాకు కుంభ మేళాలో కనిపించనందుకు మరి నేను దిగులు పడలేదు.

ఆశ్రమ అతిథులుగా ఒక రాత్రి అక్కడ గడిపి, మర్నాడు మధ్యాహ్నం మేము కలకత్తాకు బయలుదేరాం, యమునానది మీదున్న వంతెనమీదుగా కార్లో

ప్రయాణం చేస్తూ, ఆకాశంలో సూర్యుడు నిప్పురాజేసినట్టుగా, నిజంగా అగ్నిదేవుడి వన్నెల కొలిమిలాగున్న బృందావన ఆకాశరేఖ అద్భుత దృశ్యాన్ని కింద నిలకడగా ఉన్న నీళ్ళలో ప్రతిఫలిస్తూండగా తిలకించి ఆనందించాం.

యమునాతీర సైకతాలు బాలకృష్ణుడి స్మృతులతో పునీతమైనవి. ఆ దైవావతారమూర్తికీ ఆయన భక్తులకూ ఎప్పటికీ ఉండే దివ్యప్రేమకు ప్రతీకగా ఆయన ఇక్కడ ముగ్ధమాధుర్యంతో గోపికలతో లీలా వినోదాల్లో మునిగి తేలాడు. చాలా మంది పాశ్చాత్య వ్యాఖ్యాతలు కృష్ణభగవానుడి జీవితాన్ని అపార్థం చేసుకున్నారు; కేవల వాచ్యార్థ గ్రహణపరుల్ని పవిత్ర గ్రంథాల్లోని ఆలంకారికాభివ్యక్తి కలవరపరుస్తూ ఉంటుంది. ఒక అనువాదకుడి రాతలో వచ్చిన హాస్యాస్పదమైన తప్పు దీనికొక ఉదాహరణ. మధ్యయుగంలో జీవించిన రవిదాసు అనే చర్మకారుడు ఆత్మద్రష్ట అయిన సాధువు. ఆయనకు సంబంధించిన కథ ఇది; అతడు మానవులందరిలోనూ మరుగుపడి ఉన్న ఆధ్యాత్మిక విభూతిని తన వృత్తికి సంబంధించిన సులువైన మాటలతోనే గానం చేశాడు:

> విశాల వినీలాకాశం నీడలో
> నివసిస్తాడు దేవుడు చర్మాంబరధారిగా.

రవిదాసు కవితకు ఒక పాశ్చాత్య రచయిత రాసిన అనాలోచిత వ్యాఖ్య విన్నప్పుడు, నవ్వు ఆపుకోలేక ఎవరయినా పక్కకి తిరిగి నవ్వుకుంటారు.

> "తరవాత అతడు ఒక గుడిసెవేసుకొని అందులో తాను చర్మంతో చేసిన ఒక బొమ్మ పెట్టుకుని పూజ చెయ్యడం మొదలు పెట్టాడు" అని రాశాడు.

రవిదాసు, మహానుభావుడైన కబీరుకు సోదర శిష్యుడు. రవిదాసు శిష్య శిఖామణుల్లో ఒకతె, చిత్తోడ్ రాణి. ఆమె ఒకసారి తన గురువుగారి గౌరవార్థం ఒక విందు ఏర్పాటుచేసి చాలామంది బ్రాహ్మల్ని భోజనానికి పిలిచింది; కాని వాళ్ళు, చెప్పులు కుట్టే అంత్యజుడి పక్కన కూర్చుని తాము భోంచెయ్యం అని అన్నారు. కాని దర్జాగా దూరంగా, మైలపడని అన్నం తినడానికి కూర్చునేటప్పటికి, ప్రతి ఒక్క బ్రాహ్మడికీ పక్కన ఒక్కొక్క రవిదాసు కనిపించాడు. ఈ సామూహిక దర్శనానుభవంవల్ల చిత్తోడ్‌లో, విస్తృతంగా ఆధ్యాత్మిక పునరుద్ధరణ జరిగింది.

మరి కొన్నాళ్ళకు మేము కలకత్తా చేరుకున్నాం. శ్రీయుక్తేశ్వర్ గారిని చూడాలని తహతహలాడుతూ ఉండగా, ఆయన శ్రీరాంపూర్ నుంచి వెళ్ళిపోయి ఇప్పుడు, దక్షిణదిశలో మూడువందల మైళ్ళ దూరంలో ఉన్న పూరీలో ఉన్నారని విని నిరాశపడ్డాను.

"వెంటనే పూరీ ఆశ్రమానికి రండి." ఈ టెలిగ్రాం కలకత్తా నివాసీ గురుదేవుల శిష్యుల్లో ఒకరూ అయిన అతుల్ చంద్రరాయ్‌గారికి మరో సోదర శిష్యుడు మార్చి 8న పంపించినది. ఈ సందేశవార్త నా చెవిన పడింది. నేను వ్యసనపడి, కింద మోకరిల్లి, మా గురుదేవుల ప్రాణం కాపాడమని దేవుడికి మొర పెట్టుకున్నాను. నాన్నగారి ఇంటి దగ్గర్నించి రైలుకు బయలుదేరబోతూ ఉండగా లోపలినించి ఒక దివ్యవాణి పలికింది.

"ఈ రాత్రి పూరీ వెళ్ళకు, నీ ప్రార్థన మన్నించడానికి వీలులేదు."

"ప్రభూ, గురుదేవుల ప్రాణం కాపాడమని పదేపదే నేను చేసే ప్రార్థనల్ని నువ్వు తిరస్కరించవలసి ఉంటుంది కనక, పూరీలో నాతో పెనుగులాటకు దిగడం నీకు ఇష్టం లేదు. అలాగయితే ఆయన, నీ ఆజ్ఞమేరకు ఉన్నతతర విధులు నిర్వహించడానికి తరలిపోవాలా?"

ఆంతరికమైన ఆదేశానికి తల ఒగ్గి, ఆ రోజు రాత్రి పూరీ ప్రయాణం మానుకున్నాను. మర్నాడు సాయంత్రం బండికి బయలుదేరాను; దారిలో ఏడు గంటల వేళ, నల్లటి సూక్ష్మమేఘం ఒకటి ఆకాశాన్ని కమ్మింది.[1] తరవాత మా బండి గర్జనచేస్తూ పూరీవేపు సాగుతూ ఉండగా, నా ఎదుట శ్రీయుక్తేశ్వర్‌గారి రూపం దర్శన మిచ్చింది. గంభీర భంగిమలో కూర్చుని ఉన్నారాయన. రెండు పక్కలా రెండు దీపాలు ఉన్నాయి.

"అయిపోయిందా అంతా?" అంటూ ప్రాధేయపూర్వకంగా చేతులు ఎత్తాను.

ఆయన తల ఊపారు. తరవాత మెల్లగా అదృశ్యమయారు.

మర్నాడు పొద్దున నేను పూరీ ప్లాట్‌ఫారం మీద నించుని - అప్పటికీ, అనుకున్నది జరగదని అనుకుంటూనే రవ్వంత ఆశ పట్టుకొని వేలాడుతూ - ఉండగా, నాకు తెలియని వ్యక్తి ఎవరో నా దగ్గరికి వచ్చాడు.

"మీ గురువుగారు పోయిన సంగతి విన్నారా?" మరో మాట ఏమీ అనకుండా వెళ్ళిపోయాడాయన; ఆయన ఎవరో, నన్ను ఎక్కడ కలుసుకోవలసిందీ ఆయనకి ఎలా తెలిసిందో నాకయితే తెలియలేదు.

మా గురుదేవులు ఆ దుర్వార్తను రకరకాలుగా నాకు అందించడానికి ప్రయత్నిస్తున్నారన్న సంగతి గ్రహించి కొయ్యబారిపోయి, నేను ప్లాట్‌ఫారం గోడమీద వాలిపోయాను. తిరుగుబాటుతో కుతకుతలాడుతున్న నా అంతరంగం ఒక అగ్నిపర్వతంలా ఉంది. నేను పూరీ ఆశ్రమానికి చేరేసరికి, దాదాపు స్పృహ తప్పి

పడిపోయే స్థితిలో ఉన్నాను. "గుండె చిక్కబట్టుకో. ప్రశాంతంగా ఉండు," అంటూ పదేపదే మృదువుగా చెబుతూ వస్తోంది అంతర్వాణి.

ఆశ్రమంలో గురుదేవుల భౌతికకాయం ఉన్న గదిలో అడుగుపెట్టాను. ఊహించలేనంత సజీవంగా, పద్మాసనంలో ఉంది ఆయన శరీరం; ఆరోగ్యం, సౌందర్యం ఉట్టిపడుతున్నాయి. చనిపోవడానికి కొన్నాళ్ళ ముందు, గురుదేవులకు కొద్దిగా జ్వరం వచ్చింది; కాని ఆయన అనంతధామంలోకి ఆరోహించడానికి ముందు రోజున, ఆయన శరీరానికి పూర్తిగా ఆరోగ్యం చేకూరింది. ప్రియమైన ఆయన దేహంవేపు నేను ఎన్నిసార్లు చూసినప్పటికీ, దాంట్లోంచి ప్రాణం పోయిందని అనిపించేటట్టే లేదు. ఆయన చర్మం నున్నగా మెత్తగా ఉంది. ముఖంలో ప్రశాంతమైన దివ్యానందం వ్యక్తమవుతూ ఉంది. మార్మికమైన పిలుపు వచ్చిన సమయంలో ఆయన, స్పృహతోనే దేహాన్ని విడిచిపెట్టారు.

"బెంగాల్ సింహం వెళ్ళిపోయింది," అంటూ వాపోయాను.

మార్చి 10న అంత్యక్రియలు జరిపాను. సన్యాసులకు విధించిన సనాతన పద్ధతి కర్మకాండ ప్రకారం శ్రీయుక్తేశ్వర్‌గారిని పూరీ ఆశ్రమం తోటలో సమాధి చెయ్యడం* జరిగింది. ఆ తరవాత, ఆయన శిష్యుల్లో దగ్గరలో ఉన్నవాళ్ళూ దూరాల్లో ఉన్నవాళ్ళూ మేష సంక్రమణ సందర్భంగా గురుదేవులకు శ్రద్ధాంజలి ఘటించడానికి వచ్చారు. కలకత్తాలో ప్రముఖమైన అమృత బజార్ పత్రిక, ఆయన బొమ్మ ఒకటి వేసి, ఆయన్ని గురించి ఇలా రాసింది:

> "81 సంవత్సరాల వయస్సుగల శ్రీమత్ స్వామి శ్రీయుక్తేశ్వర్ గిరి మహారాజ్ మరణ భండార కాండ మార్చి 21న పూరీలో జరిగింది. దీనికి చాలామంది శిష్యులు పూరీ వెళ్ళారు.
>
> "భగవద్గీత వ్యాఖ్యాతల్లో అగ్రేసరుల్లో ఒకరయిన స్వామి మహారాజ్, కాశీలో ఉండే యోగిరాజ్ శ్రీ శ్యామాచరణ్ లాహిరీ మహాశయుల శిష్యశిఖామణి. స్వామి మహారాజ్, భారతదేశంలో అనేక యోగదా సత్సంగ కేంద్రాలకు వ్యవస్థాపకులు. అంతేకాకుండా, ఆయన ప్రధాన శిష్యులైన స్వామి యోగానందగారు పాశ్చాత్య దేశాలకు

---

* హిందువుల అంత్యక్రియలకు సంబంధించిన కర్మకాండలో గృహస్థుల్ని దహనం చెయ్యాలని విధించారు; స్వాముల్ని ఇతర సంప్రదాయాల సన్యాసుల్ని దహనం చెయ్యకుండా నేలలో పూడుస్తారు (సందర్భానుసారంగా, వీటికి మినహాయింపులు ఉన్నాయి). సన్యాసుల శరీరాలు, సన్యాసదీక్ష తీసుకునే సమయంలో ప్రతీకాత్మకంగా, జ్ఞానమనే అగ్నిలో దగ్ధమై పోయినట్టు పరిగణిస్తారు.

వ్యాప్తిచేసిన యోగవిద్యా ఉద్యమానికి గొప్ప స్ఫూర్తి నిచ్చినవారు ఆయన. మహా సముద్రాలు దాటివెళ్ళి భారతీయ మహామహుల సందేశాన్ని అమెరికాలో వ్యాప్తి చెయ్యాలన్న స్ఫూర్తి, స్వామి యోగానందగారికి కలిగించినది. శ్రీయుక్తేశ్వర్‌గారి భవిష్యత్ దృష్టి. గాఢానుభూతి.

"భగవద్గీతకూ ఇతర పవిత్ర గ్రంథాలకూ శ్రీ యుక్తేశ్వర్‌గారు చేసిన వ్యాఖ్యానాలు ప్రాచ్య పాశ్చాత్యతత్త్వశాస్త్రాలమీద ఆయనకున్న అధికారానికి ప్రత్యక్ష సాక్ష్యాలు. అంతేకాకుండా అవి, తూర్పుదేశాలకూ పడమటిదేశాలకూ మధ్య నెలకొనవలసిన ఏకత్వ సాధనకు మార్గనిర్దేశకంగా నిలుస్తాయి. అన్ని మత విశ్వాసాల ఏకత్వాన్నీ నమ్మే శ్రీయుక్తేశ్వర్ మహారాజ్, మతంలో శాస్త్రీయ దృష్టి పొందుపరచడానికి వివిధ తెగల, సంప్రదాయాల నాయకుల సహకారంతో 'సాధుసభ' స్థాపించారు. మరణ సమయంలో ఆయన, సాధుసభ అధ్యక్ష స్థానానికి తమకు వారసులుగా స్వామి యోగానందగారిని నియమించారు.

"అటువంటి మహాపురుషుల మరణం భారతదేశానికి తీరని లోటు. ఆయన సాన్నిహిత్యం పొందే అదృష్టం కలిగినవారందరూ భారతదేశ సంస్కృతి లోని నిజమైన స్ఫూర్తినీ ఆయనలో మూర్తీభవించిన సాధననూ తమ అంతరంగాల్లో పొందుపరుచుకుందురు గాక!"

నేను కలకత్తాకు తిరిగి వచ్చాను. పవిత్ర స్మృతులుగల శ్రీరాంపూర్ ఆశ్రమానికి అప్పుడే వెళ్ళగలనన్న విశ్వాసం లేనందువల్ల, శ్రీరాంపూర్‌లో శ్రీయుక్తేశ్వర్‌గారి బాలశిష్యుడైన ప్రఫుల్లను పిలిపించి, అతను రాంచీ విద్యాలయంలో చేరడానికి తగ్గ ఏర్పాట్లు చేశాను.

"మీరు అలహాబాద్ మేళాకు బయలుదేరిననాడు పొద్దున్న, గురుదేవులు, రాతబల్లమీద భారంగా వాలిపోయారు," అని చెప్పాడు ప్రఫుల్ల:

" 'యోగానంద వెళ్ళిపోయాడు! యోగానంద వెళ్ళిపోయాడు!' అంటూ విలపించారాయన. తరవాత నిగూఢంగా ఇలా అన్నారు : 'మరో పద్ధతిలో చెప్పాలతనికి.' అప్పుడాయన గంటల తరబడి మౌనంగా కూర్చున్నారు."

ఉపన్యాసాలతో, తరగతులతో, ఇంటర్వ్యూలతో, పాత స్నేహితుల్ని తిరిగి కలుసుకోడంతో గడిచిపోయాయి ఆ రోజులు. పైకి నవ్వుతూ నిర్విరామమైన కార్యకలాపాలలో మునిగి ఉన్నా, నర్వానుభూతి సైకతాల దిగువున అనేక సంవత్సరాలపాటు మంద్రంగా ప్రవహిస్తూ వచ్చిన నా ఆనంద నదీ ప్రవాహం ఒక నల్లటి దిగులు వాగు వచ్చి కలవడంవల్ల కలుషితమయింది.

"ఆ దివ్యఋషి ఎక్కడికి వెళ్ళారు?" అంటూ నా అంతరంగ అఖాతాల్లోంచి నిశ్శబ్దంగా అరిచాను.

సమాధానం రాలేదు.

"గురుదేవులు, విశ్వప్రేమాస్పదులైన పరమాత్మలో పూర్తిగా ఐక్యంకావడమే మంచిది," అని నా మనస్సు నాకు నచ్చజెప్పింది. "అమరలోకంలో ఆయన శాశ్వతంగా విరాజిల్లుతున్నారు."

"ఆయన్ని మరెన్నడూ పాత శ్రీరాంపూర్ భవనంలో నేను చూడలేక పోవచ్చు," అని హృదయం విలపించింది. "ఇక మీదట, ఆయన్ని కలుసుకోడానికి నీ స్నేహితుల్ని తీసుకువచ్చి 'ఇదుగో చూడండి, భారత దేశ జ్ఞానావతారులు ఆయన,' అని సగర్వంగా చెప్పలేవు. "

మా బృందం జూన్ నెల తొలినాళ్ళలో బొంబాయినించి బయలుదేరి పాశ్చాత్యదేశాలకు వెళ్ళడానికి శ్రీరైట్ ఏర్పాట్లు చేశాడు. మే నెలలో కలకత్తాలో వీడ్కోలు విందులూ, ప్రసంగాలూ జరిగిన తరవాత మిస్ బ్లెట్ష్, శ్రీరైట్, నేనూ ఫోర్డు కారులో బొంబాయికి బయలుదేరాం. మేము అక్కడికి చేరిన తరవాత ఓడ అధికారులు మా ప్రయాణం రద్దు చేసుకోమన్నారు; మా ఫోర్డు కారుకు ఆ ఓడలో చోటు లేకపోవడమే దానికి కారణం; ఆ కారు మళ్ళీ మాకు యూరప్ లో అవసరమవుతుంది.

"పరవాలేదు," అన్నాను శ్రీరైట్‌తో విషాదంగా. "నేను మళ్ళీ ఒకసారి పూరీ వెళ్ళాలనుకుంటున్నాను," అని మనస్సులో ఇలా అనుకున్నాను, "మళ్ళీ మరోసారి నా కన్నీళ్ళు, గురుదేవుల సమాధిని తడపాలి."

అధ్యాయం : 43

# శ్రీయుక్తేశ్వర్‌గారి పునరుత్థానం

"కృష్ణభగవానుడు!" నేను బొంబాయిలో, రీజెంట్ హోటల్లో నా గదిలో కూర్చుని ఉండగా, ఆ అవతారమూర్తి దివ్యమంగళరూపం ఒక ఉజ్జ్వల దీప్తితో నాకు దర్శనమిచ్చింది. నేను ఎత్తైన మూడో అంతస్తులో ఉన్నాను; కిటికీ తెరిచి ఉంది; దాంట్లోంచి బయటికి చూస్తూ ఉండగా, వర్ణించశక్యంకాని ఆ అద్భుత దృశ్యం, వీధికి అవతలివేపు ఎత్తయిన ఒక భవనం పై కప్పుమీద హఠాత్తుగా నా కంట పడింది

చిరునవ్వు చిందిస్తూ, పలకరింపుగా తల ఆడిస్తూ, ఆ దివ్య మంగళ విగ్రహుడు నా వేపు చెయ్యి ఊపాడు. కృష్ణభగవానుడిచ్చిన సందేశాన్ని నేను సరిగా అర్థం చేసుకోలేకపోవడంవల్ల ఆయన ఆశీః సంకేతంతో అంతర్ధానమయాడు అద్భుతమయిన దివ్యానుభూతితో ఉత్తేజం పొందిన నాకు, ఏదో ఆధ్యాత్మిక సంఘటన జరగబోతున్నదన్న అభిప్రాయం కలిగింది.

నా పాశ్చాత్యదేశ యాత్ర తాత్కాలికంగా వాయిదా పడింది. మళ్ళీ మరోసారి బెంగాల్ వెళ్ళేలోగా బొంబాయిలో కొన్ని బహిరంగ సభల్లో నేను ఉపన్యాసాలివ్వ డానికి కార్యక్రమాలు నిర్ణయమయ్యాయి.

1936 జూన్ 19 తేదీ మధ్యాహ్నం మూడు గంటలకు - అంటే, శ్రీకృష్ణుడు దర్శనమిచ్చిన వారం రోజులకు - బొంబాయి హోటల్లో నేను మంచం మీద కూర్చుని ధ్యానం చేసుకుంటూ ఉండగా, ఒకానొక దివ్యకాంతి నాకు బాహ్యస్మృతి కలిగించింది. నేను కళ్ళు విప్పి ఆశ్చర్యంగా చూస్తూ ఉండగా, నా గదంతా ఒక విచిత్ర ప్రపంచంగా మారిపోయింది; సూర్యకాంతి ఒక దివ్యతేజస్సుగా పరిణామం చెందింది.

ఎదురుగా, రక్తమాంసాలతో నిండిన శ్రీయుక్తేశ్వర్‌గారి విగ్రహాన్ని చూసే సరికి ఆనంద తరంగాలు నన్ను ఉక్కిరిబిక్కిరి చేసేశాయి.

"నాయనా!" అంటూ వాత్సల్యం ఉట్టిపడేటట్టు పిలిచారు, గురుదేవులు, ఆయన ముఖంలో దివ్యదరహాసం వెలుగుతోంది!

జీవితంలో మొట్టమొదటిసారిగా నేను ఆయన పాదాలముందు మోకరిల్లనిది అప్పుడే; ఆబగా ఆయన్ని చుట్టేసుకోవాలని చటుక్కున ముందుకు ఉరికాను. ఎంత మహత్తరమైన మధుర క్షణం! అప్పటికి కొన్ని నెలలుగా నాలో గూడు కట్టుకుని ఉన్న విషాదం, ఇప్పుడు ఒక్కసారి వెల్లువలా వచ్చిపడుతున్న దివ్యానందంవల్ల ఇట్టే తేలిపోయినట్టు అనిపించింది.

"నా గురుదేవా, నన్ను విడిచిపెట్టి ఎందుకు వెళ్ళిపోయారు?" ఆనందం పట్టలేక, నా మాటలు తడబడుతూ వెలువడ్డాయి. "నన్నసలు కుంభమేళాకి ఎందుకు వెళ్ళనిచ్చారు? మిమ్మల్ని విడిచి వెళ్ళిపోయినందుకు నన్ను నేను ఎంత కసిగా తిట్టుకున్నానో తెలుసా?"

"నేను మొట్టమొదటిసారి బాబాజీ దర్శనం చేసుకున్న యాత్రాస్థలాన్ని చూడాలని నువ్వెంతో ఉవ్విళ్ళూరుతున్నావు; అంచేత నీ ఆశకు అడ్డు రాగూడదనుకున్నాను. అయినా నేను, నిన్ను విడిచి ఉన్నది కాస్సేపే; ఇదుగో, మళ్ళీ ఇప్పుడు నీ దగ్గర లేనూ?"

"అయితే గురుదేవా, ఇప్పుడిక్కడ ఉన్నవారు మీరేనా? ఆ గురుసింహాలేనా? పూరీ ఇసక పఱ్ఱలో పూడ్చిపెట్టిన శరీరం మాదిరి మరో దేహం ధరించి వచ్చారా మీరు?"

"నేను వాణ్ణే నాయనా, ఇది రక్తమాంసాలున్న శరీరం. నేను దీన్ని సూక్ష్మశరీరంగా చూస్తున్నప్పటికీ, నీ దృష్టి కిది భౌతికమైనదే. విశ్వాణువుల్లోంచి నేను పూర్తిగా కొత్త శరీరాన్ని సృష్టించుకున్నాను. ఇది ముమ్మూర్తులా, నీ స్వప్న లోకంలో, పూరీలో స్వప్నభూమిలో నువ్వు పూడ్చిపెట్టిన, విశ్వస్వప్న భౌతిక శరీరాన్ని పోలి ఉన్నదే. నిజం చెప్పాలంటే, నేను పునరుత్థానం చెందాను - భూమిమీద కాదుకాని, ఒక సూక్ష్మలోకంలో. అక్కడుండేవాళ్ళు, భూమిమీది మానవులకన్న ఎక్కువగా, నా ఉన్నత ప్రమాణాలకు నిలబడగలవాళ్ళు. ఎప్పటికో ఒకనాటికి, నువ్వూ నీ ప్రియతములూ అక్కడికి వచ్చి నాతోబాటు ఉంటారు."

"మృత్యుంజయులైన గురుదేవా, ఇంకా చెప్పండి."

గురుదేవులు చటుక్కున, ముచ్చటగా ముసిముసి నవ్వు నవ్వారు. "నాయనా, నీ పట్టు రవ్వంత సడలించవూ?" అంటూ అడిగారు.

"రవ్వంతే!" అప్పటిదాకా నే నాయన్ని, ఉడుంపట్టులా గట్టిగా పట్టేసుకుని

ఉన్నాను. పూర్వం ఆయన శరీరానికి విలక్షణంగా ఉంటూండే కొద్దిపాటి సహజ సుగంధమే ఇప్పుడు కూడా ఆయనకు ఉందని పసిగట్టాను. ఆయన దివ్యశరీర స్పర్శవల్ల కలిగిన ఆ ఆనందానుభూతి ఆనాడు ఆయనతో గడిపిన గంటలు తలుచుకున్నప్పుడల్లా, నా చేతుల్లోనూ అరిచేతుల్లోనూ జివ్వుమంటూ ఉంటుంది.

"భౌతిక కర్మను అనుభవిస్తూండే మానవులకు సహాయం చెయ్యడానికి భగవంతుడు, భూమిమీదికి ప్రవక్తలను పంపినట్లే, ఒక సూక్ష్మలోకంలో రక్షకుడిగా సేవచెయ్యమని భగవంతుడు నన్ను ఆదేశించాడు," అంటూ వివరించారు శ్రీయుక్తేశ్వర్‌గారు. "దాన్ని 'హిరణ్యలోకం' అంటారు. ఆ లోకంలో ప్రగతి పొందిన సాధకులు తమ సూక్ష్మలోక కర్మనుంచి విముక్తి పొందడానికీ సూక్ష్మలోక పునర్జన్మలు లేకుండా చేసుకోడానికి అక్కడ నేను సాయపడుతున్నాను. హిరణ్యలోక వాసులు ఆధ్యాత్మికంగా ఉన్నతమైన అభివృద్ధి సాధించినవాళ్ళు; వాళ్ళంతా భూమిమీద తమ పూర్వజన్మలో, మరణసమయంలో ఒంటిమీది స్పృహతో భౌతికకాయాన్ని విడిచి వెళ్ళిపోవడానికి వీలు కలిగించే, ధ్యానోపార్జిత మైన శక్తిని సాధించినవాళ్ళు. భూమి మీద 'సవికల్ప సమాధి' స్థితిని దాటి, ఉన్నతతరమైన 'నిర్వికల్ప సమాధి' స్థితిలోకి ప్రవేశించనిదే, ఏ మనిషీ హిరణ్య లోకంలోనికి ప్రవేశించ లేడు.*

"హిరణ్యలోకవాసులు అంతకు పూర్వమే, సాధారణ సూక్ష్మ మండలాల గుండా సాగివచ్చి అక్కడికి చేరి ఉంటారు; భూలోక ప్రాణులు దాదాపు అందరూ, మరణించిన తరవాత ఆ సూక్ష్మమండలాలకు చేరవలసిందే. అక్కడ, సూక్ష్మ లోకాల్లోని తమ పూర్వకర్మలకు సంబంధించి అనేక బీజాల్ని నశింపుచేసుకుని ఉంటారు. ఉచ్చస్థితిలోఉన్న భక్తులు తప్ప, తక్కిన వాళ్ళలో ఎవరూ, సూక్ష్మ మండలాల్లో అటువంటి ముక్తిదాయక కృషి ఫలప్రదంగా చెయ్యలేరు.† అప్పుడు,

---

* సవికల్ప సమాధిలో భక్తుడు, బ్రహ్మమూ తానూ ఒక్కరేనన్న అనుభూతి పొందుతాడు కాని, నిశ్చల సమాధి స్థితిలో తప్ప విశ్వచైతన్యాన్ని నిలుపుకోలేడు. అఖండమైన ధ్యానం ద్వారా అతను, నిర్వికల్ప సమాధి అనే ఉన్నత స్థితిని చేరుకుంటాడు; అప్పుడతను దైవానుభూతిని కోల్పోకుండానే ప్రపంచంలో స్వేచ్ఛగా తిరుగుతూంటాడు. చూడండి పే 308 అ

నిర్వికల్ప సమాధిలో యోగి, తన భౌతిక కర్మలోని - అంటే, భూలోక సంబంధమైన కర్మలోని - చివరి లేశాల్ని క్షయం చేసుకుంటాడు. అయినప్పటికీ అతనికి కొంత సూక్ష్మ కారణ కర్మలు అనుభవించవలసి ఉంటుంది; అంచేత, ఉన్నత ప్రకంపన మండలాల్లోని సూక్ష్మ లోకంలోనూ, కారణలోకంలోనూ దేహధారణ చెయ్యవలసి ఉంటుంది.

† ఎంచేతంటే చాలామంది, సూక్ష్మలోకాల్లో ఉన్న అందాన్ని చూసి ఆనందిస్తూ, కష్టపడి ఆధ్యాత్మిక కృషి చెయ్యాల్సిన అవసరం ఉందన్న సంగతే గమనించరు.

సూక్ష్మకర్మ లేశాలన్నిటినుంచీ తమ ఆత్మల్ని పూర్తిగా విముక్తం చేసుకోడానికి సాధకులు, హిరణ్యలోకంలో కొత్త సూక్ష్మశరీరాలతో తిరిగి పుట్టడానికి విశ్వ నియమంచేత ఆకృష్టులవుతారు. నేనున్నది, సూక్ష్మలోక సూర్యుడనీ స్వర్గమనీ చెప్పే ఈ హిరణ్యలోకంలోనే. అక్కడివాళ్ళకి సహాయం చెయ్యడానికి అంతకన్న ఉన్నతమైన కారణలోకంలోంచి వచ్చి, దాదాపు పూర్ణసిద్ధి పొందినవాళ్ళు కూడా హిరణ్యలోకంలో ఉన్నారు."

నా మనస్సు, మా గురుదేవుల మనస్సుతో పరిపూర్ణమైన అనుసంధానంలో ఉంది; మాటలతో మనస్సుకు హత్తించే చిత్రాల్ని ఆయన, కొంతవరకు వాక్కు ద్వారాను, కొంతవరకు భావాల బదలాయింపుద్వారాను నాకు తెలియజేస్తున్నారు. ఆ విధంగా నేను ఆయన భావచిత్రాల్ని గబగబా ఆకళించుకుంటున్నాను.

గురుదేవులు ఇంకా ఇలా చెప్పారు : "భగవంతుడు మానవుడి ఆత్మను వరసగా మూడు శరీరకోశాల్లో పొందుపరిచి ఉంచాడన్న సంగతి నువ్వు పవిత్ర గ్రంథాల్లో చదివావు - భావం, లేదా కారణ శరీరం; మానవుడి మానసిక, భావోద్రేక ప్రకృతికి స్థానమైన సూక్ష్మశరీరం; స్థూలమైన భౌతిక శరీరం. భూమిమీద మనిషికి భౌతిక జ్ఞానేంద్రియాలు ఏర్పడి ఉంటాయి. సూక్ష్మలోక వ్యక్తి, తన చేతనతోనూ అనుభూతులతోనూ ప్రాణకణిక (లైఫ్‌ట్రాన్)*లతో తయారైన శరీరంతోనూ పని చేస్తాడు. కారణ శరీరం ధరించినవాడు, భావాల ఆనందమయలోకాల్లో ఉండి పోతాడు. కారణలోకంలోకి ప్రవేశించడానికి తయారవుతున్న సూక్ష్మలోక జీవులతోనే నా పని."

"పూజ్య గురుదేవా, సూక్ష్మవిశ్వాన్ని గురించి ఇంకా చెప్పండి," శ్రీయుక్తేశ్వర్ గారు కోరినమీదట, నేను ఒక్కరవ్వ పట్టు సడలించినప్పటికీ, నా చేతులు మాత్రం ఇంకా ఆయన్ని చుట్టుకొనే ఉన్నాయి. నా దగ్గరికి రావడానికి యముణ్ణి చూసి ఎగతాళిగా నవ్విన మా గురుదేవులు, విధులన్నిటినీ మించిన పెన్నిధి!

"సూక్ష్మ శరీరులతో నిండిన సూక్ష్మగ్రహాలు చాలా ఉన్నాయి," అంటూ ప్రారంభించారు గురుదేవులు. "అక్కడ ఉండేవాళ్ళు ఒక గ్రహం నుంచి మరో

* శ్రీ యుక్తేశ్వర్‌గారు 'ప్రాణ' శబ్దం వాడారు; నేను దాన్ని లైఫ్‌ట్రాన్స్ అని [ఇంగ్లీషులోకి] అనువదించాను. హిందూ పవిత్ర గ్రంథాల్లో 'అణువు', 'పరమాణువు' అనే సూక్ష్మతర ఋణవిద్యుత్ కణ (ఎలక్ట్రానిక్) శక్తులనే కాక, ప్రాణాన్ని, అంటే, "సృష్టించే ప్రాణకణికా శక్తి"ని (క్రియేటివ్ లైఫ్‌ట్రానిక్ ఫోర్స్) కూడా ప్రస్తావించడం జరిగింది. అణువులూ ఋణవిద్యుత్ కణాలూ అచేతన శక్తులు; ప్రాణం స్వభావతః చేతనశక్తి. ఉదాహరణకు, శుక్ల శోణితాల్లో ఉండే ప్రాణకణికలు, కర్మానురూపంగా పిండం పెరుగుదలను నియంత్రిస్తాయి.

గ్రహానికి ప్రయాణం చెయ్యడానికి విద్యుత్తుకన్న, లేదా రేడియోధార్మిక శక్తులకన్న వేగంగా సాగే సూక్ష్మ 'విమానాల్ని', లేదా కాంతిపుంజాల్ని వాడతారు.

"వివిధములైన, వెలుగు, వన్నెల సూక్ష్మప్రకంపనలతో రూపొందిన సూక్ష్మ విశ్వం, భౌతిక విశ్వానికి కొన్ని వందలరెట్లు పెద్దది. భౌతిక సృష్టి యావత్తు, సూక్ష్మ మండలమనే ప్రకాశవంతమైన పెద్ద గాలిబుడగ కింద ఘనరూపమయిన ఒక చిన్న బుట్టలా వేలాడుతూ ఉంటుంది. రోదసిలో భౌతికమైన అనేక సూర్య గ్రహాలూ నక్షత్రాలూ సంచరించేటట్టుగానే లెక్కలేనన్ని సూక్ష్మ సౌర, నక్షత్ర మండలాలు కూడా ఉంటాయి. భౌతికమైన సూర్యచంద్రులకంటే సూక్ష్మసూర్య చంద్రులు ఎంతో అందంగా ఉంటారు. సూక్ష్మలోక తేజోమండలాలు తేజస్వంత మైన మేరు ప్రభామండలాన్ని (అరోరా బొరియాలిస్) పోలి ఉంటాయి. ఈ సూక్ష్మలోక సౌరమేరుప్రభ, మందకిరణ చంద్రమేరుప్రభ కన్న మిరుమిట్లు గొలుపుతూ ఉంటుంది. సూక్ష్మలోకంలో రాత్రీ పగలూ, భూమిమీది వాటికంటె దీర్ఘమైనవి.

"సూక్ష్మ ప్రపంచం అత్యంత ఆకర్షణీయమైనదీ పరిశుభ్రమైనదీ పరిశుద్ధ మైనదీ సువ్యవస్థితమైనదీ. నిర్జీవగ్రహాలూ చవిటి పర్రలూ అక్కడ లేనేలేవు భూలోకానికి కళంకప్రాయమైన సూక్ష్మజీవులు (బాక్టీరియా), పురుగులు, పాములు వంటివి అక్కడ ఉండవు. శీతోష్ణస్థితులూ ఋతువులూ భూలోకంలో మాదిరిగా ఉండవు; సూక్ష్మగ్రహాల్లో నిత్య వసంత ఋతువుతో సమశీతోష్ణస్థితి నిలిచి ఉంటుంది. అప్పుడప్పుడు, వెలుగులీనే తెలిమంచూ, వన్నె వన్నెల వెలుగుల వానలూ కురుస్తూ ఉంటాయి. సూక్ష్మగ్రహాల్లో మాణిక్య సరోవరాలూ, మిలమిల మెరిసే సముద్రాలూ, ఇంద్రచాప నదులూ సమృద్ధిగా ఉంటాయి.

"మామూలు సూక్ష్మవిశ్వంలో - అంటే, హిరణ్యలోకమనే సూక్ష్మతర సూక్ష్మ స్వర్గంలో అని కాదు - భూమినుంచి దాదాపు ఇటీవల వచ్చిన, కొన్నికోట్ల సూక్ష్మ జీవాత్మలు ఉంటాయి. అంతే కాకుండా, దేవతాశక్తులూ, మత్స్యకన్యలూ, చేపలూ, జంతువులూ, పిశాచాలూ, భూతాలూ, దైవాంశ సంభూతులూ, అదృశ్య శక్తులూ కూడా అసంఖ్యాకంగా ఉంటాయి. ఇవన్నీ కర్మల గుణాగుణాల్ని బట్టి వేరువేరు సూక్ష్మ గ్రహాల్లో నివసిస్తాయి. మంచిశక్తులకూ చెడ్డశక్తులకూ గోళాకార భవనాల్ని, లేదా స్పందనశీల ప్రాంతాల్ని సమకూర్చడం జరిగింది. మంచివి స్వేచ్ఛగా ప్రయాణం చేస్తాయి; కాని దుష్టశక్తులు పరిమిత మండలాలకు లోబడి ఉంటాయి. మనుషులు భూమిమీదా, పురుగులు మట్టిలోనూ, చేపలు నీళ్ళలోనూ, పక్షులు గాలిలోనూ ఉండేటట్టే, వివిధ శ్రేణుల సూక్ష్మలోక జీవులకు సముచితమైన స్పందన శీల నివాసాలు సమకూరి ఉంటాయి.

"ఇతర లోకాలనుంచి వెలివేసిన, పతిత దేవదూతల మధ్య ప్రాణకణి కాస్త్రాలు (లైఫ్‌ట్రానిక్ బాంబులు), లేదా మానసిక మంత్ర శక్తుల* ప్రకంపనశీల కిరణాలతో ఘర్షణ, యుద్ధం జరుగుతూంటాయి. ఈ జీవులు తమ దుష్కర్మను అనుభవిస్తూ నిమ్నతర సూక్ష్మ విశ్వంలోని అంధకారాచ్ఛన్న ప్రాంతాల్లో నివసిస్తూంటారు.

"అంధకారమయమైన సూక్ష్మ కారాగారానికి పైనుండే విశాల మండలాలన్నీ ప్రకాశమానంగా అందంగా ఉంటాయి. సూక్ష్మవిశ్వం భూమికన్న ఎక్కువ సహజంగా దైవసంకల్పంతోనూ పరిపూర్ణతా పరికల్పనతోనూ అనుసంధానం చెంది ఉంటుంది. సూక్ష్మలోక వస్తువు ప్రతీదీ ప్రధానంగా దైవసంకల్పంవల్లా పాక్షికంగా సూక్ష్మలోక జీవుల ఆహ్వాన సంకల్పంవల్లా ఆవిర్భవిస్తుంది. దేవుడు సృష్టించినదాన్ని దేన్నయినా మార్పేయడానికి కాని, దాని అందాన్నీ రూపాన్నీ అతిశ యింపజేయడానికి కాని వాళ్ళకి శక్తి ఉంటుంది. సూక్ష్మవిశ్వాన్ని తమ ఇచ్ఛాను సారంగా మార్చేసే స్వాతంత్ర్యమూ, లేదా మెరుగుపరిచే స్వాతంత్ర్యమూ హక్కూ భగవంతుడు తన సూక్ష్మలోక సంతానానికి ఇచ్చాడు. భూమి మీద ఒక ఘన పదార్థాన్ని ద్రవరూపంలోకి కాని, ఇతర రూపంలోకి కాని మార్చాలంటే సహజ ప్రక్రియద్వారా, లేదా రసాయన ప్రక్రియలద్వారా మార్చాలి. కాని సూక్ష్మ లోకపు ఘనపదార్థాల్ని కేవలం, అక్కడ నివసించేవాళ్ళ సంకల్పమాత్రంచేత, తక్షణమే సూక్ష్మద్రవాలుగానూ వాయువులు గానూ లేదా శక్తిగానూ మార్చడం జరుగుతున్నది.

"సముద్రంలోనూ నేలమీదా గాలిలోనూ జరిగే యుద్ధాలతో, హత్యలతో ఈ భూమి కళంకితమైపోయింది," అంటూ ఇంకా చెప్పసాగారు గురుదేవులు. "కాని, సూక్ష్మలోక రాజ్యాలకు సుఖప్రదమైన సామరస్యమూ సమానత్వమూ తెలుసు. సూక్ష్మలోక జీవులు తమ రూపాల్ని సంకల్పానుసారంగా సాక్షాత్కరింప జేయడం, అదృశ్యం చేయడం చేస్తూంటారు. పువ్వులుకాని, చేపలుకాని, జంతువులు కాని తాత్కాలికంగా, సూక్ష్మలోక మానవులుగా రూపాంతరణం చెందగలవు. సూక్ష్మలోక జీవులన్నీ స్వేచ్ఛగా ఏ రూపమయినా తాల్చి, ఒకదాంతో ఒకటి

---

* 'మంత్ర' శబ్దానికి ఏకాగ్రత అనే మానసికమైన ఫిరంగిలోంచి విడుదల అయిన బీజాక్షర మని అర్థం. 'మాంత్రిక' శబ్దం, దీనికి విశేషణరూపం. దేవాసురులకు మధ్య జరిగిన మాంత్రిక యుద్ధాల్ని పురాణాల్లో వివరించారు. ఒక అసురుడు [వృత్రాసురుడు] ఒకసారి, శక్తిమంతమైన ఒక మంత్రంతో ఒక దేవతను [ఇంద్రుణ్ణి] చంపదలుచుకున్నాడు. కాని, ఉచ్చారణలో అపస్వరం రావడంవల్ల అతని మానసికాస్త్రం బెడిసికొట్టి, ఆ రాక్షసుణ్ణే చంపేసింది.

సులువుగా భావసంపర్కం పెట్టుకోగలవు. స్థిరంగా, కచ్చితంగా ఉండే ప్రకృతి నియమం ఏదీ వాటిని నిర్బంధించదు. మాటవరసకు, ఏ సూక్ష్మలోక వృక్షాన్నయినా సూక్ష్మలోకపు మామిడిపండుకాని కోరుకున్న ఇంకో పండుకాని పువ్వుగాని - నిజం చెప్పాలంటే, మరే వస్తువునయినా కాని - సృష్టించి ఇమ్మని అడిగి తీసుకోవచ్చు. కొన్నికొన్ని కర్మసంబంధమైన ప్రతిబంధకాలు ఉన్నప్పటికీ, వివిధ రూపాల్ని కోరడం విషయంలో, సూక్ష్మలోకంలో విభేదాలు లేవు. ప్రతీదీ దేవుడి సృజనాత్మక కాంతితో స్పందిస్తూ ఉంటుంది.

"అక్కడి వాళ్లెవరూ స్త్రీ గర్భాన జన్మించినవారుకారు; సూక్ష్మలోకవాసులు తమ విశ్వసంకల్పశక్తి సహాయంతో ప్రత్యేక (అవయవ) నిర్మాణమూ, సూక్ష్మ శరీరమూ గల సంతానాన్ని సృష్టించుకుంటారు. కొత్తగా తనువు చాలించిన జీవి ఎవరైన ఒక సూక్ష్మలోక కుటుంబంలోకి, వారు ఆహ్వానించగా, వచ్చును.

"సూక్ష్మ శరీరం చలికికాని వేడికికాని ఇతర ప్రకృతి పరిస్థితులకు కాని లోబడదు. సూక్ష్మశరీరంలో సూక్ష్మమస్తిష్కం ఒకటి ఉంటుంది; సూక్ష్మశరీర నిర్మాణంలో, ఒక సూక్ష్మమెదడూ (వెయ్యి రేకుల కాంతి కమలం) మరియు సూక్ష్మ వెనుబాము (సుషుమ్న)లో జాగృతమైన షట్చక్రాలూ ఉంటాయి. ఈ సూక్ష్మ మెదడునించి హృదయం విశ్వశక్తినీ, కాంతినీ కూడ గ్రహిస్తుంది; గ్రహించి, వాటిని సూక్ష్మనాడుల్లోకీ, శరీరకణాలైన 'ప్రాణాణువు' (లైఫ్‌ట్రాన్స్)ల్లోకి పంపిస్తుంది.

"సూక్ష్మలోక జీవులు ప్రాణకణికాశక్తి వల్లా పవిత్ర మంత్ర ప్రకంపనల వల్లా తమ రూపాల్లో మార్పులు చేసుకొంటూ ఉంటారు.

"చాలా సందర్భాల్లో, సూక్ష్మశరీరం, ముందటి భౌతికరూపానికి అచ్చంగా ప్రతిరూపంలా ఉంటుంది. సూక్ష్మలోక వ్యక్తి ముఖమూ ఆకారమూ అంతకు ముందు భూమిమీద చేసిన మజిలీలో, అతని పడుచు ప్రాయంలో ఎలా ఉండేవో అలా ఉంటాయి. కాని అప్పుడప్పుడు, నా బోటివాడు ముసలిరూపే నిలపుకోవాలని తలుస్తాడు." యువతాసత్త ఉట్టిపడే గురుదేవులు, సవిలాసంగా ముసిముసి నవ్వులు నవ్వారు.

"సూక్ష్మమండలాలు, పంచేంద్రియ జ్ఞానంతో గ్రహించదగ్గ ఆంతరాళిక త్రిమితీయ భౌతిక ప్రపంచం మాదిరిగా కాకుండా, అన్నీ కలిసి ఉన్న సహజావ బోధమనే ఆరో జ్ఞానేంద్రియానికి గోచరమవుతాయి," అంటూ ఇంకా ఇలా చెప్పారు శ్రీయుక్తేశ్వర్‌గారు. "సూక్ష్మలోక వ్యక్తులు కేవలం, సహజావబోధానుభూతివల్ల చూస్తారు, వింటారు, వాసన చూస్తారు, రుచి చూస్తారు, తాకుతారు. వాళ్ళకి మూడు కళ్ళు ఉంటాయి, వాటిలో రెండు కొంతమట్టుకు మూసుకొని ఉంటాయి. మూడోది, ముఖ్యమైన సూక్ష్మనేత్రం; ఇది నుదుటిమీద నిలువుగా, తెరుచుకొని

ఉంటుంది. సూక్ష్మలోక మానవులకు కళ్ళు, చెవులు, ముక్కు, నాలుక, చర్మం అన్న బాహ్య జ్ఞానేంద్రియాలు అన్నీ ఉంటాయి; కాని వాళ్ళు, శరీరంలో ఏ భాగంతోనయినా సంవేదనలు పొందడానికి సహజావబోధమనే జ్ఞానేంద్రియాన్ని ఉపయోగించుకుంటారు. మాటవరసకి, వాళ్ళు చెవితోకాని, ముక్కుతోకాని, చర్మంతోకాని చూడగలరు. కళ్ళతోటికాని, నాలికతోటి కాని వినగలరు; చెవులతో కాని, చర్మం మొదలైనవాటితోకాని రుచి చూడగలరు.*

"మానవుడి భౌతిక శరీరం లెక్కలేనన్ని అపాయాలకు గురయ్యే విధంగా ఉంటుంది; అది ఇట్టే గాయపడుతుంది; లేదా అంగవైకల్యం పొందుతుంది. కాని ఆకాశతత్త్వ సంబంధమైన సూక్ష్మశరీరం అప్పుడప్పుడు కోసుకుపోవచ్చు, లేదా గాయపడవచ్చు; కాని అది ఇచ్ఛాశక్తి వల్ల వెంటనే నయమయిపోతుంది."

"గురుదేవా, సూక్ష్మలోక వ్యక్తులు అందరూ అందంగా ఉంటారాండీ?"

"సూక్ష్మలోకంలో, అందమనేది ఆత్మపరమయిన గుణమేకాని బాహ్య రూపం కాదు," అని జవాబిచ్చారు శ్రీయుక్తేశ్వర్‌గారు. "అంచేత, సూక్ష్మలోక వాసులు ముఖలక్షణాలకు ప్రాముఖ్యమియ్యరు. అయితే, సంకల్పమాత్రంచేత, నవీన సుందర సూక్ష్మశరీరాల్ని సృష్టించుకుని ధరించే హక్కు వాళ్ళకి ఉంది. భూమిమీది మనుషులు పండుగపబ్బాల్లో కొత్తదుస్తులు ధరించినట్లే, సూక్ష్మ లోకవాసులు కొన్ని సందర్భాల్లో ప్రత్యేకంగా కల్పించిన రూపాలు ధరిస్తారు.

"హిరణ్యలోకం వంటి సూక్ష్మగ్రహాల్లో, అక్కడివాడు ఎవరయినా ఆధ్యాత్మిక ప్రగతి ద్వారా విముక్తుడయి, తత్ఫలితంగా కారణ లోకానికి వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నప్పుడు సూక్ష్మ ఆనందోత్సవాలు జరుగుతాయి. అటువంటి సందర్భాల్లో, అగోచరుడైన పరమేశ్వరుడూ ఆయనలో లీనమైన సాధువులూ, ఆ ఉత్సవాల్లో పాల్గొనడానికి వారికి నచ్చిన దేహాలతో సాక్షాత్కరిస్తారు. ప్రభువు తన ప్రియ భక్తుణ్ణి సంతోషపెట్టడానికి కోరిన రూపం ధరిస్తాడు. భక్తుడు దేవుణ్ణి భక్తితో కొలిచి నట్లయితే ఆయన్ని జగన్మాతరూపంలో దర్శిస్తాడు. ఏసుక్రీస్తుకు దేవుణ్ణి గురించి చేసే భావనలన్నిటిలోకీ పితృభావనే ఎక్కువ ఆకర్షకంగా ఉండేది. సృష్టికర్త తాను సృష్టించిన ప్రాణుల్లో ప్రతి ఒక్కదానికీ ఇచ్చిన వ్యక్తిత్వం, ఆయన సర్వతో ముఖమైన ప్రజ్ఞ వెల్లడి కావాలని, ఊహించడానికి వీలుగానూ ఊహించడానికి వీలులేని విధంగానూ కోరికలు కోరుతుంది!" మా గురుదేవులూ నేనూ హాయిగా కలిసి నవ్వుకున్నాం.

* అటువంటి శక్తులకు ఉదాహరణలు, హెలెన్ కెలర్‌లా అరుదుగా కనిపించే వ్యక్తుల విషయంలో మాదిరిగా, భూమిమీద కూడా లేకపోలేదు

"ఇతర జన్మల్లోని స్నేహితులు, సూక్ష్మలోకంలో ఒకరినొకరు సులువుగా గుర్తుపడతారు," అంటూ శ్రీయుక్తేశ్వర్‌గారు, మధురమైన వేణునాదం వంటి స్వరంతో చెబుతూ వచ్చారు. "స్నేహానికి అమరత్వం ఉన్నందుకు ఆనందిస్తా వాళ్ళు. పార్థివ జన్మలో భ్రాంతిమయమైన వియోగాలు జరిగే విషాద సమయంలో తరచు శంకిస్తూ వచ్చిన, ప్రేమ అనశ్వరతను ఇప్పుడు అనుభూతం కావించు కుంటారు.

"సూక్ష్మలోక వ్యక్తుల సహజావబోధం, తెర చీల్చుకొని మానవ కార్యకలాపాల్ని గమనిస్తూ ఉంటుంది; కాని మానవుడు మాత్రం, అతని ఆరో జ్ఞానేంద్రియం కొంతమట్టుకు వికాసం చెంది ఉండకపోతే సూక్ష్మమండలాల్ని దర్శించలేడు. భూమిమీద ఉండేవాళ్ళు అనేక వేల మంది క్షణికంగా, ఒక సూక్ష్మలోకజీవినో, ఒక సూక్ష్మలోకాన్నో దర్శించినవాళ్ళే.*

"హిరణ్యలోకంలో ఉండే, ప్రగతి సాధించిన జీవులు సూక్ష్మలోకపు దీర్ఘమైన రాత్రింబగళ్ళలో సాధారణంగా ఆనంద సమాధిలో జాగృతులై ఉంటారు. విశ్వ పరిచాలనానికి సంబంధించిన క్లిష్ట సమస్యల్ని పరిష్కరించడానికీ తమ నివాసాల్ని వదలి భౌతిక సుఖాలకై వెంపర్లాడుతూ భూలోక యానానికి ఉద్యుక్తులైన ఆత్మల విమోచనకూ సహాయపడుతూ ఉంటారు. హిరణ్యలోక జీవులు నిద్రపోయేటప్పుడు, అప్పుడప్పుడు, కలలవంటి సూక్ష్మ అంతర్దర్శనాలు పొందుతూ ఉంటారు. వారి మనస్సులు సాధారణంగా అత్యున్నత నిర్వికల్ప ఆనందంలో సచేతనంగా ఉంటాయి.

"అయినప్పటికీ, సూక్ష్మవిశ్వంలోని అన్ని ప్రాంతాల్లో ఉండే వాళ్ళూ మనో వేదనలకు గురిఅవుతూ ఉండేవాళ్ళే. హిరణ్యలోకంవంటి గ్రహాలమీద ఉండే మహాభక్తుల సునిశిత మనస్సులు, సత్యవర్తనలో కాని సత్యదర్శనంలో కాని ఏదయినా పొరపాటు జరిగినట్లయితే తీవ్రమైన మనోవేదన పొందుతాయి. ఈ ప్రగతజీవులు తమ ప్రతి చర్యనూ ఆలోచననూ, ఆధ్యాత్మిక నియమ పరిపూర్ణత్వంతో అను సంధానం కావించుకోడానికి ప్రయత్నిస్తారు.

"సూక్ష్మలోకవాసులందరి మధ్య భావసంపర్కం పూర్తిగా, మానసిక ప్రసార (టెలిపతీ) సూక్ష్మ దూరదర్శనాల (ఆస్ట్రల్ టెలివిజన్) ద్వారా జరుగుతుంది. పలికిన మాటల్లోనూ, రాసిన మాటల్లోనూ భూమిమీద ఉన్న గందరగోళం, అపార్థం సూక్ష్మ లోకాల్లోని వారికి తెలియవు.

---

* భూమిమీద నిర్మలమైన మనస్సుగల పిల్లలు అప్పుడప్పుడు, దేవతల సుందర సూక్ష్మ శరీరాల్ని చూడగలుగుతారు.

పవిత్ర గ్రంథాలు నిషేధించిన మందుల ద్వారాను, మత్తుపానీయాల ద్వారాను ఎవరయినా, సూక్ష్మనరకాల్లోని జుగుప్సాకరమైన రూపాలు కనిపించేటంతగా మతిభ్రమణం కలిగించుకోవచ్చు.

"వెలుతురు కల్పించిన బొమ్మలవరస ద్వారా, సినిమా తెరమీద మనుషులు నిజంగా ఊపిరి తీసుకోకుండానే కదలడం, కార్యకలాపాలు సాగించడం చేస్తున్నట్టుగానే, కాంతే తమకు మూలమై తమను చైతన్యవంతుల్ని చెయ్యడానికి ఆక్సిజన్ ఏదీ అవసరంలేని సూక్ష్మలోక సమన్విత జీవులు నడుస్తారు, పనిచేస్తారు. మానవుడు ప్రధానంగా ఘన, ద్రవ, వాయు పదార్థాలమీదా గాలిలో ఉన్న ప్రాణ శక్తిమీదా ఆధారపడి ఉన్నవాడు; కాని సూక్ష్మలోకవాసులు ప్రధానంగా విశ్వ కాంతి మీదే ఆధారపడి బతుకుతారు."

"గురుదేవా, సూక్ష్మలోక వ్యక్తులు ఏమయినా తింటారండీ?" నేను ఆయన వివరణను మనస్సు, హృదయం, ఆత్మ అనే నా శక్తులన్నిటి గ్రాహకగుణంతోనూ ఆస్వాదిస్తున్నాను. అధిచేతనానుభూతులు శాశ్వతత్వంగలవి; ఇవి వాస్తవమైనవీ, మార్పులేనివీ; కాని క్షణికమైన ఇంద్రియానుభూతులు తాత్కాలికంగానూ సాపేక్షికంగానూ మాత్రమే నిజమైనవి; వాటి విషయంలో మానవుడికుండే జ్ఞాపకాలు త్వరగానే కరిగిపోతాయి. మా గురుదేవుల మాటలు నా మనఃఫలకం మీద ఎంత గాఢంగా ముద్రవేసుకున్నాయంటే, ఏ సమయంలో నయినా సరే, నా మనస్సును అధిచేతన స్థితిలోకి మార్చుకుని ఆ దివ్యానుభూతిని స్పష్టంగా తిరిగి పొందగలను.

"సూక్ష్మలోక భూముల్లో వెలుగు రేకల్లాటి కూరగాయలు సమృద్ధిగా ఉంటాయి," అని జవాబిచ్చారాయన. "సూక్ష్మలోకవాసులు కూరగాయలు తింటారు; సూక్ష్మలోకంలోని శోభాయమానమైన వెలుతురు ఫౌన్‌టెన్ను (నీటి బుగ్గలు) నించీ, సూక్ష్మనదులూ సెలయేళ్లలోనూ ప్రవహించే అమృతాన్ని పానం చేస్తారు. భూమిమీద సాధారణంగా, మానవుల అదృశ్య బింబాల్ని ఆకాశ తత్త్వం (ఈథరు)లోంచి రప్పించి టెలివిజన్ ద్వారా కళ్లకు కట్టించి - తర్వాత స్విచ్ నొక్కి మాయంచేసి - నట్టే దేవుడు సృష్టించిన ఆకాశతత్త్వంలో తేలే కూర గాయలూ, మొక్కలూ అగోచర సూక్ష్మప్రతిరూపాల్ని ఒక సూక్ష్మగ్రహంమీద, అక్కడుండే వాళ్ళ ఆదేశాల వల్ల రూపొందించవచ్చు. అదే విధంగా సూక్ష్మ జీవుల ఉద్దామకల్పనల ననుసరించి విశాల వనాల్ని సాక్షాత్కరింపజేయనూ వచ్చు; తిరిగి వాటిని ఆకాశ తత్త్వ సహజంగా అదృశ్యం కావించనూ వచ్చు. హిరణ్య లోకం వంటి స్వర్లోక మండలాల్లో ఉండేవాళ్ళు తిండి తినవలసిన అవసరం లేకుండా దాదాపు స్వేచ్ఛ పొందినప్పటికీ కూడా, కారణలోకంలో దాదాపు పరిపూర్ణతా సిద్ధి పొందిన జీవుల స్వేచ్ఛాయుత అస్తిత్వం, అంతకన్న ఉన్నత స్థితిలో ఉంటుంది; వాళ్ల ఏకైక ఆహారం ఆనందామృతమే.

"భూమినించి విముక్తుడైన సూక్ష్మలోక వ్యక్తి, భూలోకంలో వివిధ జన్మల్లో పొందిన తండ్రుల్నీ తల్లుల్నీ భార్యల్నీ భర్తల్నీ పిల్లల్నీ స్నేహితుల్నీ అనేక మందిని చూస్తాడు. వాళ్ళు సూక్ష్మ మండలాల్లోని వివిధ భాగాల్లో అప్పుడప్పుడు అవుపిస్తూ ఉంటారు.* అంచేత, ఎవరిమీద ప్రత్యేకాభిమానం చూపించాలో తెలుసుకోలేక పోతున్నాడు; ఈ విధంగా అతడు, అందర్నీ భగవంతుడి సంతానంగానూ ఆయన వైయక్తికీకృత అభివ్యక్తులుగానూ గ్రహించి, వాళ్ళందరిమీదా దివ్యమైన, సమానమైన ప్రేమ చూపిస్తాడు.

"తనకు ప్రియమైనవాళ్ళ బాహ్యరూపాలు మొత్తంమీద మారిపోయినప్పటికీ (కిందటి జన్మలో వాళ్ళ కొత్తగుణాల వికాసానికి అనుగుణంగా) సూక్ష్మలోక జీవి, ఇతర జీవనస్తరాల్లో ఒకప్పుడు తనకు ప్రియంగా ఉన్నవాళ్ళనందరినీ గుర్తుపట్టడానికి తన అమోఘ సహజావబోధాన్ని ఉపయోగించి, వాళ్ళని తమ కొత్త సూక్ష్మలోక నివాసాలకు ఆహ్వానిస్తాడు. సృష్టిలో ప్రతి అణువూ నశింప జేయరాని వ్యక్తిత్వం† ఏర్పడి ఉన్నది కనక, సూక్ష్మలోక మిత్రుడు ఏ దుస్తులు ధరించినప్పటికీ అతన్ని గుర్తుపట్టేస్తారు; భూమిమీద నటుడు ఏ మారువేషంలో ఉన్నప్పటికీ నిశిత పరిశీలనవల్ల అతన్ని గుర్తుపట్టగలిగేటట్టే.

"సూక్ష్మమండలాల్లో ఆయుఃప్రమాణం, భూమిమీద ఉన్నదానికన్న ఎక్కువ. ఓ మోస్తరుగా అభివృద్ధి సాధించిన ఒక వ్యక్తి సూక్ష్మజీవిత సగటు ఆయుః ప్రమాణం, భూ కాల ప్రమాణ ప్రకారం అయిదువందల ఏళ్ళనించి వెయ్యేళ్ళ వరకూ ఉంటుంది కొన్ని రకాల చేవమాను (రెడ్ ఉడ్) వృక్షాలు ఇతర వృక్షాల కన్న కొన్నివేలఏళ్ళు అధికంగా బతికే విధంగానూ, చాలామంది అరవై ఏళ్ళు నిండక ముందే చని పోతున్నప్పటికీ కొందరు యోగులు అనేక వందల ఏళ్ళు బతుకుతున్నట్టుగానూ, కొందరు సూక్ష్మలోకవాసులు సాధారణ సూక్ష్మలోక ఆయుర్దాయాన్ని మించి బతుకుతారు. సూక్ష్మలోకంలోకి వచ్చే 'సందర్శక' జీవులు వారి భౌతిక కర్మభారాన్ని బట్టి అధికకాలమో, స్వల్పకాలమో అక్కడ నివసిస్తారు; వారి భౌతికకర్మ నిర్ణీత సమయం లో వాళ్ళని భూమ్మీదకి లాక్కొస్తుంది.

---

* మానవుడు అందరినీ సమానంగా ఎందుకు ప్రేమించాలని ఒకసారి బుద్ధుణ్ణి ఒకరు అడిగారు. "ఎందుకంటే, ప్రతిమనిషికీ అసంఖ్యాకమైన వివిధ జన్మల్లో ఇతరుడు ప్రతి ఒక్కడూ (ఎప్పుడో ఒకప్పుడు, ఏదో ఒక రూపంలో - జంతురూపంలోకాని, మానవరూపంలోకాని) ప్రియమైనవాడు అయి ఉంటాడు కనక," అని ఆ దేశికోత్తముడు జవాబిచ్చాడు.

† అణువు మొదలు మానవుడివరకు జీవరాశుల సృష్టికంతకూ కావలసిన ఎనిమిది మూల తత్వాలు: మన్ను, నీరు, నిప్పు, గాలి, ఆకాశం, మనస్సు, బుద్ధి, వ్యక్తిత్వం (అహంకారం) (భగవద్గీత-VII.4)

"సూక్ష్మలోక జీవి జ్యోతిర్మయదేహాన్ని విడిచేసే సమయంలో యముడితో కష్టపడి పెనుగులాడక్కర్లేదు. అయినా ఈ జీవులు సూక్ష్మతరమైన కారణ శరీరంకోసం సూక్ష్మ రూపాన్ని విడవాలన్న ఆలోచన వచ్చేసరికి కొద్దిగా గాభరా పడతారు. సూక్ష్మలోకంలో, ఇష్టంలేని చావూ, జబ్బూ, ముసలితనమూ ఉండవు. ఈ భయాలు మూడూ భూలోకానికి పట్టిన శాపాలే; ఇక్కడ మనిషి, బతకడానికి గాలీ అన్నమూ నిద్రా అవసరమైన దుర్బల భౌతికకాయమే తానని దాంతో పూర్తిగా మమైకమయిపోవడానికి తనచేతనను అనుమతిస్తాడు.

"భౌతిక మరణంలో ఊపిరి పోతుంది; మాంస సంబంధమైన కణాలు విఘటనం చెందుతాయి. కాని, సూక్ష్మ శరీరమరణంలో ప్రాణకణికలు చెల్లా చెదరయి పోతాయి; అవి సూక్ష్మలోకజీవులకి ప్రాణసంఘటన కావించిన శక్తి తాలూకు ప్రత్యక్షీకృత ఘటకాంశాలు. భౌతిక మరణసమయంలో మనిషికి ఒంటిమీద స్పృహపోతుంది. సూక్ష్మలోకంలో ఉన్న తన సూక్ష్మశరీరం స్పృహకు వస్తుంది. నిర్ణీత సమయంలో సూక్ష్మలోక మరణాన్ని అనుభవించి తద్వారా మనిషి, సూక్ష్మలోక జననమరణాల స్పృహనుంచి భౌతిక జననమరణాల స్పృహకు సాగుతాడు. సూక్ష్మ స్థూల శరీరకోశాల ఆవర్తన చక్రాలు జ్ఞానం ఆర్జించని జీవులందరికీ అనివార్యమైన భవితవ్యాలు. పవిత్ర గ్రంథాల్లో స్వర్గనరకాల కిచ్చిన నిర్వచనాలు ఒక్కొక్కప్పుడు, ఆనందమయ సూక్ష్మలోకా ల్లోనూ నిరాశా జనకమైన భౌతికలోకాల్లోనూ కలిగిన అనేక అనుభవాల తాలూకు అవచేతనకన్న గాఢమైన జ్ఞాపకాల్ని మనిషిలో రేకెత్తిస్తాయి."

"గురుదేవా, భూమిమీదా సూక్ష్మ కారణ లోకాల్లోనూ సంభవించే పునర్జన్మల భేదాన్ని వివరంగా చెప్పరూ?" అని అడిగాను.

"మానవుడు ప్రధానంగా వైయక్తికీకృత ఆత్మగా, కారణ శరీరుడు," అంటూ వివరించారు మా గురుదేవులు. "ఆ శరీరం ముప్పై ఐదు తత్త్వాలతో (భావాలతో) కూడినది; దాన్ని రూపొందించడానికి మౌలిక ఆలోచనాశక్తులుగా, లేదా కారణ ఆలోచనాశక్తులుగా, దేవుడికి అవి అవసరమయ్యాయి; ఆ తరవాత ఆయన, వాటిలోంచి పంథొమ్మిది తత్త్వాలు తీసుకొని సూక్ష్మశరీరాన్నీ, పదహారు తత్త్వాలు తీసుకొని భౌతిక శరీరాన్ని నిర్మించాడు.

"సూక్ష్మశరీరంలో ఉండే పంథొమ్మిది తత్త్వాలూ మానసికమైనవీ, భావోద్రేక పరమైనవీ, ప్రాణకణికాపరమైనవీ. ఆ పంథొమ్మిది అంశాలూ ఏవంటే : బుద్ధి (తెలివి); అహంకారం; చిత్తం (అనుభూతి); మనస్సు (ఇంద్రియ స్పృహ); ఐదు జ్ఞానేంద్రియాలు - చూపు, వినికిడి, వాసన, రుచి, స్పర్శ [శబ్దస్పర్శరూప

రసగంధాలు] గ్రహించడానికి ఉపకరించే సూక్ష్మ ప్రతిరూపాలు; ఐదు కర్మేంద్రియాలు - ప్రజననానికీ విసర్జనకూ మాటకూ నడకకూ కాయిక కర్మలకూ ఉపకరించే సామర్థ్యాల మానసిక ప్రతిరూపాలు; ప్రాణశక్తి తాలూకు ఇంద్రియాలు ఐదు - శరీరంలో స్ఫటికీకరణ (Crystallizing), స్వాంగీకరణ (assimilating), విసర్జన (eliminating), జీవాణుపాక (metabolizing), ప్రసరణ (circulating) కార్యాలు జరిపేవి [ప్రాణాపానవ్యానోదానసమాన వాయువులు]. పంథొమ్మిది తత్త్వాల సూక్ష్మశరీర కోశం, పదహారు స్థూల రసాయన మూలకాలతో రూపొందిన భౌతిక శరీరం నశించిన తరవాత కూడా ఉంటుంది.

"దేవుడు వివిధ తత్త్వాల్ని తనలోనే భావన చేసుకొని వాటిని స్వప్నాల్లోకి ప్రక్షేపించాడు. ఆ విధంగా, అనంత సాపేక్షతా బృహదాభరణాలతో అలంకరించుకొన్న విశ్వస్వప్న మాయాసుందరి (Lady Cosmic Dream) ఆవిర్భవించింది. కారణ శరీరంలోని ముప్పైఐదు తత్త్వాల్లోనూ భగవంతుడు, మనిషి సూక్ష్మ శరీరం బాపతు పంథొమ్మిది తత్త్వాల్నీ, భౌతిక శరీరం తాలూకు పదహారు తత్త్వాల్నీ సర్వసంకీర్ణతాయుతంగా సమకూర్చాడు. స్పందనశక్తుల్ని ఘనీభూతం చేసి, మొదట మనిషి సూక్ష్మ శరీరాన్నీ చివరికి భౌతిక శరీరాన్నీ సృష్టించాడాయన. మౌలిక పారమ్య రూపుడయిన పరమేశ్వరుడు దిగ్భ్రమకారకమైన నానాత్వంగా పరిణమించడానికి కారణమయిన సాపేక్షతానియమం ప్రకారం కారణవిశ్వమూ కారణశరీరమూ సూక్ష్మవిశ్వానికీ సూక్ష్మదేహానికీ భిన్నంగా ఉంటాయి. అలాగే భౌతికవిశ్వమూ భౌతికదేహమూ కూడా స్వభావతః, సృష్టిలోని ఇతర రూపాలకు భిన్నంగా ఉంటాయి.

"రక్తమాంసాలతో కూడిన శరీరం, సృష్టికర్త నిశ్చిత, ప్రత్యక్షీకృత స్వప్నాలతో ఏర్పడినది. ఆరోగ్య అనారోగ్యాలూ కష్టసుఖాలూ లాభనష్టాలూ అన్న ద్వంద్వాలు భూమిమీద ఎప్పుడూ ఉంటాయి. మానవులకు త్రిమితీయ (three-dimensional) పదార్థంలో పరిమితీ ప్రతిరోధమూ తప్పవు. మనిషికి బతికుండాలన్న కోరిక, జబ్బువల్లనో మరే కారణాలవల్లనో తీవ్రంగా సడలిపోయినట్లయితే మరణం సంభవిస్తుంది; మాంసరూపమైన బరువైన బాహ్య కళేబరాన్ని తాత్కాలికంగా వదిలెయ్యవలసి వస్తుంది. అయితే ఆత్మ, సూక్ష్మ కారణ శరీరాల్లో ఆబద్ధమై ఉంటుంది.* ఈ మూడు శరీరాల్నీ కలిపి ఉంచే సంయోజక శక్తి కోరిక. తీరని కోరికల శక్తే మానవుడి బానిసతనానికి కారణం.

"భౌతిక వాంఛలకు మూలం అహంకారమూ ఇంద్రియ సుఖాలూ. ఇంద్రియానుభవ నిర్బంధం లేదా ప్రలోభం, సూక్ష్మలోక అనుబంధాలకు కాని కారణలోక అనుభూతులకు కాని సంబంధించిన వాంఛాశక్తికన్న ఎక్కువ శక్తి మంతమైనది.

* శరీరమన్నది, స్థూలమయినా సూక్ష్మమయినా, ఆత్మను ఆవరించి ఉన్న ఏ కోశాన్నయినా సూచిస్తుంది.

"సూక్ష్మలోక వాంఛలు, స్పందనరూప సుఖానుభవానికి సంబంధించినవి. సూక్ష్మలోక జీవులు వివిధ గోళాల ఆకాశ సంగీతాన్ని ఆలకించి సృష్టి అంతా పరివర్తనశీల కాంతి తాలూకు అనంతాభివ్యక్తులుగా కనబడ్డంవల్ల పరవశులై ఆనందిస్తారు. సూక్ష్మలోక జీవి వెలుగును వాసన చూస్తాడు, రుచి చూస్తాడు, తాకుతాడు. ఈ విధంగా సూక్ష్మలోకవాంఛలు అన్ని వస్తువుల్నీ అనుభవాల్నీ కాంతిరూపాలుగా, లేదా ఘనీభూత ఆలోచనలుగా, లేదా కలలుగా రూపొందించ డానికి సూక్ష్మలోక జీవికి ఉండే శక్తిని బట్టి ఉంటాయి.

"కారణలోక వాంఛలు అనుభూతివల్ల మాత్రమే నెరవేరతాయి. కారణ శరీరంలో మాత్రమే ఆబద్ధులై ఉండి, విముక్తప్రాయులైన జీవులు విశ్వాన్నంతనీ దేవుడి స్వప్నభావాలకు సిద్ధించిన ప్రత్యక్షరూపంగా దర్శిస్తారు; ఆలోచనమాత్రం చేతనే వాళ్ళు దేన్నయినా సాక్షాత్కరింప జెయ్యగలరు. కాబట్టి కారణ శరీరులు, భౌతిక ఇంద్రియ సుఖాన్నికాని, సూక్ష్మలోక ఆనందాన్నికాని స్థూలమైనదిగానూ, ఆత్మకు కలిగే సూక్ష్మతర సంవేదనలకు అవరోధకంగానూ పరిగణిస్తారు. కారణ శరీరులు తమకు కావలసినవి తక్షణమే సాక్షాత్కరింపజేసుకుని కోరికలు నశింప జేసుకొంటారు.* కారణ శరీరమనే నాజూకు ముసుగు మాత్రమే కప్పి ఉన్న వాళ్ళు, సృష్టికర్తలాగే విశ్వాల్ని సృష్టించగలరు. సృష్టి అంతా విశ్వస్వప్న జాలంతో రూపొంది నందువల్ల, కారణ శరీరమనే పలచని వస్త్రం ధరించిఉన్న ఆత్మ, వివిధ విస్తృత రూపాల్లో శక్తిని సాక్షాత్కరింపజేసుకొంటూ ఉంటుంది.

"సహజంగా కంటికి కనిపించని ఆత్మను దాని శరీరం చేతా వివిధ శరీరాల చేతా మాత్రమే గుర్తుపట్టడానికి వీలవుతుంది. శరీరం ఒకటి ఉందంటే, అది తీరని కోరికవల్ల ఏర్పడినట్టే లెక్క.†

"మానవుడి ఆత్మ, ఒకటో రెండో మూడో - శరీరమనే సీసాల్లో బంధించి ఉండి, అజ్ఞానమూ కోరికలూ అనే బిరడాలతో గట్టిగా బిగించి ఉన్నంతకాలం అతడు, పరమాత్మ సాగరంలో లీనం కాలేడు. చావు అనే సుత్తి దెబ్బతో స్థూల

* వెనకటి జన్మల్లో ఎప్పుడో, లాహిరీ మహాశయులకు ఒక మహాభవనం కోసం అవచేత నలో దాగిఉన్న ఒక్కకోరికా నెరవేరడానికి బాబాజీ తోడ్పడ్డట్టుగానే. దీన్ని 34 అధ్యాయంలో వివరించడం జరిగింది.

† "శరీరం ఎక్కడున్నా సరే, డేగలు దాని దగ్గరికి చేరతాయి, అన్నారాయన వాళ్ళతో." - లూకా 17.37. భౌతిక శరీరంలోనో, సూక్ష్మశరీరంలోనో, కారణ శరీరంలోనో - ఆత్మ ఎక్కడ ఆబద్ధమై ఉంటే అక్కడ - మానవుల ఇంద్రియపరమైన బలహీనతల్ని కాని, సూక్ష్మ కారణ శరీరాసంబంధాల్ని కాని అవకాశంగా తీసుకొని, కోరికలనే డేగలు ముసిరి, ఆత్మను బందీని చేస్తాయి.

భౌతికకాయం బద్దలయిపోయినప్పుడు సూక్ష్మ కారణ శరీరాలనే తక్కిన తొడుగులు రెండూ, సర్వవ్యాప్త ప్రాణమనే పరమాత్మతో సచేతనంగా లీనం కావడానికి వీలు లేకుండా ఆత్మను నిరోధించడానికి, ఇంకా మిగిలి ఉంటాయి. జ్ఞానం ద్వారా నిష్కామం అలవడినప్పుడు, దాని శక్తి తక్కిన కోశాల్ని రెండిటినీ ఛిన్నాభిన్నం చేసేస్తుంది. చివరికి, స్వల్పమయిన మానవాత్మ విముక్తమయి, అమేయ సమృద్ధ మయిన పరమాత్మతో ఐక్యమవుతుంది.''

ఉత్కృష్టమూ, అద్భుతమూ అయిన కారణలోకాన్ని గురించి మరికొంత చెప్పమని గురుదేవుల్ని అర్థించాను.

"కారణ శరీరం, చెప్పలేనంత సూక్ష్మమయినది,'' అన్నారాయన. "దాన్ని అర్థంచేసుకోవాలంటే ఎవరికయినా, తాము కళ్ళు మూసుకుని సూక్ష్మవిశ్వాన్నీ, భౌతికవిశ్వాన్నీ సమస్తాన్నీ - పైన పెద్ద ప్రకాశవంతమైన గాలి బుడగా, కింద గట్టి బుట్టతో - భావాల రూపంలోనే దర్శించడానికి కావలసిన మహత్తర ఏకాగ్రతా శక్తులు ఉండి ఉండాలి. అధిమానవసాధ్యమైన ఏకాగ్రతతో ఆ రెండు విశ్వాల్ని వాటి సంకీర్ణతలన్నిటితో సహా, కేవల భావాల్లోకి పరివర్తన చేయడంలో, లేదా పరిష్కారం చేయడంలో కృతకృత్యుడు కాగలిగితే అప్పుడతడు కారణ లోకాన్ని చేరి మనస్సుకూ పదార్థానికీ మధ్య సరిహద్దులో నిలబడతాడు. అక్కడతడు, ఘన ద్రవ వాయుపదార్థాలు, విద్యుత్తు, శక్తి, సర్వజీవులు, దేవతలు, మనుష్యులు జంతువులు, మొక్కలు, సూక్ష్మజీవులు మొదలైన, సృష్టిలోని వస్తువులన్నిటినీ చైతన్యరూపాలుగా దర్శిస్తాడు; అంటే, మనిషి కళ్ళు మూసుకొని తన దేహం భౌతిక నేత్రాలకు కనబడకుండా కేవలం భావంగా మాత్రమే ఉన్నా కూడా తా నన్నవాడు ఒకడు ఉన్నాడని గ్రహించినట్టుగానే అన్నమాట.

"మనిషి, ఊహాలో చెయ్యగలిగిందల్లా కారణ శరీరుడు వాస్తవంగా చేస్తాడు. కేవలం మనస్సులో, ఆలోచనలో మొదటి కొసనుంచి తుదికొసదాకా సాగడానికి కాని, ఒక లోకంనుంచి మరో లోకానికి మానసికంగా లంఘించడానికికాని, నిత్యత్వమనే కూపంలోకి అంతులేకుండా పడుతూ ఉండడానికికాని, నక్షత్ర మండలాల ముత్యాల పందిరిలోకి రాకెట్టు మాదిరిగా దూసుకుపోవడానికికాని, పాలపుంతలమీదా నక్షత్రాంతరాళాలోనూ సెర్చిలైటులా మిలమిల్లాడడానికికాని, అత్యంత విస్తారమైన మానవ కల్పనాశక్తికి సామర్థ్యం ఉంది. కాని కారణలోక జీవులకు అంతకన్న గొప్ప స్వేచ్ఛ ఉంది. భౌతిక అవరోధంకాని, సూక్ష్మ అవరోధం కాని, కర్మబద్ధతకాని లేకుండా వాళ్ళు, తమ భావాల్ని తక్షణమే మూర్తరూపంలో అనాయాసంగా ప్రత్యక్షీకరించుకుంటారు.

"భౌతికవిశ్వం మౌలికంగా ఋణవిద్యుత్కణాలతో (ఎలక్ట్రాన్‌లతో) ఏర్పడ్డది కాదని, అలాగే సూక్ష్మవిశ్వం మౌలికంగా ప్రాణకణిక (లైఫ్‌ట్రాన్)లతో ఏర్పడ్డది కాదని - నిజానికి ఆ రెండూ, సృష్టిని సృష్టికర్త నుంచి విడదియ్యడానికి మధ్యలో కలగజేసుకుంటున్నట్టు అనిపించే సాపేక్షతా నియమమనే మాయచేత ఖండితమై, విభాజితమైన భగవద్భావన తాలూకు సూక్ష్మతమ కణాలతో ఏర్పడ్డదనీ గ్రహిస్తారు, కారణలోకవాసులు.

"కారణలోకంలో ఆత్మలు, ఒకదాన్నొకటి ఆనందమయ పరమాత్మ తాలూకు వైయక్తికీకృత బిందువులుగా గుర్తుపడతాయి; వాటిచుట్టూ ఉండే వస్తువులన్నీ భావవస్తువులే, కారణశరీరులు, కేవలం భావాలయిన తమ దేహాలకూ ఆలోచనలకూ ఉండే తేడా గమనిస్తారు. మానవు డొకడు కళ్ళు మూసుకొని మిరుమిట్లు గొలిపే తెల్లటి వెలుగును కాని, మందమైన నీలివన్నె మసక వెలుతురును కాని చూడగలిగినట్టే కారణ శరీరులు, కేవలం ఆలోచనల్తో చూడగలరు, వినగలరు, వాసన చూడగలరు, రుచి చూడగలరు, తాకగలరు. వాళ్ళు విశ్వమానస శక్తితో ఏదైనా సరే సృష్టిస్తారు, లయం చేస్తారు.

"కారణ లోకంలో చావుపుట్టుకలు రెండూ భావనలోనే ఉంటాయి. కారణ శరీరులు నిత్యనూతన జ్ఞానం అనే అమృతంతోనే విందు చేసుకుంటారు. శాంతి అనే నీటి బుగ్గల్లోంచి పెల్లుబికి వచ్చింది తాగుతారు, అనుభూతి అనే దారిలేని నేలమీద తిరుగుతారు, ఆనందమనే అనంతసాగరంలో ఈదులాడతారు. అవిగో! వాళ్ళ ఉజ్జ్వల భావదేహాలు. అనంతత్వపు ఆకాశరూప ఉరఃస్థలిమీద కోటానుకోట్లుగా పరమాత్మ సృష్టించిన లోకాల్నీ, విశ్వాలనే తాజా బుడగల్నీ, జ్ఞాన తారకల్నీ, సువర్ణ నీహారికల చిత్రవర్ణ స్వప్నాల్నీ దాటి మునుముందుకు దూసుకు పోతున్నాయి.

"అనేక జీవులు కారణలోకంలో వేలకొద్ది సంవత్సరాలు ఉండిపోతారు. గాఢతరమైన ఆనందాతిరేకంవల్ల విముక్తాత్మ అప్పుడు స్వల్పమైన కారణ శరీరం లోంచి బయటికి వచ్చి కారణ విశ్వానికున్న విస్తారత అనే రూపాన్ని ధరిస్తుంది. భావాల వేరువేరు సుడిగుండాలూ ప్రత్యేకీకృత శక్తితరంగాలూ, ప్రేమా, ఆనందమూ, శాంతీ, సహజావబోధమూ, ప్రశాంతతా, స్వయంసంయమమూ, ఏకాగ్రతా - ఇవన్నీ కరిగి, పరమానంద సాగరంలో లీనమయిపోతాయి. అటు మీదట ఆత్మ, తానొక వైయక్తికీకృత తరంగంగా ఆనందానుభవం పొందదు; చిరంతన హాసం, ఆహ్లాదాలు, స్పందాలు అనే కెరటాలు గల విశ్వైక మహా సాగరంలో విలీనమయి పోతుంది.

"ఆత్మ, ఈ మూడు శరీరాల గూళ్ళనూ విడిచేసినప్పుడు, సాపేక్షతా నియమం నుంచి తప్పించుకొని, అనిర్వచనీయ నిత్యస్థితం అవుతుంది.* సర్వవ్యాపకత్వ మనే సీతాకోక చిలకను చూడు; దాని రెక్కలమీద నక్షత్రాలూ చంద్రబింబాలూ సూర్యబింబాలూ చిత్రించి ఉన్నాయి! పరమాత్మగా విస్తరించిన ఆత్మ, వెలుగు లేని వెలుగు, చీకటిలేని చీకటి, ఆలోచనలేని ఆలోచన ఉండే ప్రాంతంలోనే విశ్వసృష్టి అనే దైవ స్వప్నంలో కలిగిన ఆనందాతిశయంతో మత్తెక్కి ఉంటుంది."

"విముక్తాత్మ!" అంటూ విస్మయంతో పలికాను.

"చివరికి శారీరక భ్రాంతులనే మూడు ఘటాలలోంచీ బయటపడ్డ ఆత్మ తన వ్యక్తిత్వాన్ని కోల్పోకుండానే అనంతంలో ఏకమవుతుంది. క్రీస్తు ఏసుగా పుట్టడానికి పూర్వమే ఈ చరమస్వేచ్ఛ సాధించాడు. ఆయన భూలోక జీవితంలో మరణమూ పునరుత్థానమూ అనే మూన్నాళ్ళ అనుభవంతో సూచితమైన పూర్వ దశలు మూడింటిలోనూ ఆయన, పరమాత్మలో సంపూర్ణంగా ఉదయించడానికి కావలసిన శక్తిని సాధించాడు," అన్నారు గురుదేవులు.

"అభివృద్ధిచెందని మనిషి ఈ మూడు శరీరాల్లోంచీ బయటపడ్డానికి భూలోకం లోనూ సూక్ష్మలోకంలోనూ లెక్కలేనన్ని జన్మలు ఎత్తవలసి ఉంటుంది. ఈ చరమస్వేచ్ఛ సాధించిన గురువు, ఇతర మానవుల్ని దేవుడి దగ్గరికి తిరిగి తీసుకు రావడానికి, భూలోకానికి ప్రవక్తగా తిరిగి వెళ్ళాలని నిశ్చయించుకోవచ్చు; లేకపోతే నాలాగ, సూక్ష్మవిశ్వంలో ఉందామని అనుకోవచ్చు. అక్కడ రక్షకుడు, అక్కడి వాళ్ళ కర్మ† భారాన్ని కొంత తాను మోస్తూ వాళ్ళు సూక్ష్మవిశ్వంలో మళ్ళీ పుట్టవలసిన అవసరం లేకుండా చేసి, వాళ్ళు కారణ లోకమండలాలకు శాశ్వతంగా వెళ్ళేటందుకు సహాయ పడతాడు. లేదా విముక్తాత్ముడు, కారణలోకంలోకి ప్రవేశించి, అక్కడివాళ్ళు కారణశరీరంలో తమ జీవితకాలాన్ని తగ్గించుకొని కైవల్యప్రాప్తి పొందడానికి తోడ్పడతాడు."

---

* "అధిగమించి వచ్చినవాడు నా దేవుడుగుడిలో ఒక స్తంభమవుతాడు. ఇక మళ్ళీ బయటికి వెళ్ళడం ఉండదు (అంటే, మళ్ళీ ఇక జన్మ ఎత్తడం ఉండదు) ....అధిగమించి వచ్చినవాడికి నాతోబాటు నా సింహాసనం మీద కూర్చునే అవకాశం ఇస్తాను; నేనూ అలా అధిగమించి వచ్చి నా తండ్రితోబాటు ఆయన సింహాసనం మీద కూర్చున్నట్టుగానే" - రివలేషన్ 3.12, 21 (బైబిలు)

† ఇక్కడ శ్రీయుక్తేశ్వర్‌గారు సూచించింది ఏమిటంటే, భూమిమీద జన్మించినప్పుడు తాము, శిష్యుల కర్మ తేలిక అయేటట్లు చెయ్యడానికి అప్పుడప్పుడు రోగభారం వహించినట్టే కారణలోకంలో కూడా రక్షకులుగా తాము చేపట్టిన పవిత్రకార్యం హిరణ్యలోకవాసుల సూక్ష్మ కర్మలను కొంత తమమీద వేసుకొని, వాళ్ళు అంతకన్న ఉన్నతమైన కారణలోకంలోకి వెళ్ళ డానికి వీలుగా వాళ్ళ పరిణామాన్ని త్వరితం చెయ్యడానికి తోడ్పడిందన్న మాట.

"పునరుత్థానం చెందిన మహాత్మా! ఆత్మలు ఈ మూడు లోకాలకూ తిరిగి రావాలన్న నిర్బంధం కలిగించే కర్మనుగురించి ఇంకా తెలుసుకోవాలని ఉందండి." అన్నాను. సర్వజ్ఞులైన నా గురుదేవులు చెప్పేది ఎప్పటికీ అలా వింటూనే ఉండగలననిపించింది. ఆయన భూమిమీద గడిపిన జీవితంలో ఏ ఒక్కసారి నేనింత జ్ఞానాన్ని ఒంటబట్టించుకోలేకపోయాను. ఇప్పుడు మొట్ట మొదటి సారిగా, చావుబతుకుల చదరంగం బల్లమీదుండే నిగూఢమయిన అంతరాల్నిగురించి సుస్పష్టమూ సునిశితమూ అయిన జ్ఞానం పొందుతున్నాను.

"మానవుడు సూక్ష్మలోకాల్లో దీర్ఘకాలం ఉండడం సంభవించే లోగా, అతడు తన భౌతికకర్మను, లేదా కోరికల్ని పూర్తిగా అనుభవించాలి," అంటూ వివరించారు గురుదేవులు, ఆహ్లాదకరమైన కంఠస్వరంతో. "సూక్ష్మలోకాల్లో రెండు రకాల జీవులు ఉంటారు. భూలోక కర్మను ఇంకా క్షయం చేసుకోవలసిన వాళ్ళూ ఆ కారణంగా తమ కర్మ సంబంధమైన ఋణాన్ని తీర్చుకోడానికి స్థూలమైన ఒక భౌతికదేహంలో ఉండవలసినవాళ్ళూ భౌతిక మరణానంతరం, సూక్ష్మలోకానికి వచ్చే స్థిరవాసులుగా కాకుండా, తాత్కాలికంగా వచ్చే సందర్శ కులుగా మాత్రమే పరిగణించాలి.

"భూలోకంలో కర్మఫలానుభోగం పూర్తికాని జీవులకు సూక్ష్మలోకమరణం సంభవించిన తరవాత విశ్వభావాల ఉన్నత కారణమండలంలోకి వెళ్ళడానికి అనుమతి లభించదు. పదహారు స్థూలతత్త్వాలున్న తమ భౌతికదేహాన్నీ, పంధొమ్మిది సూక్ష్మతత్త్వాలున్న సూక్ష్మదేహాన్నీ వరసగా స్ఫురణలో ఉంచుకుని, భౌతికలోకానికీ సూక్ష్మలోకానికీ అటూఇటూ రాకపోకలు సాగిస్తూ ఉండాలి. అయితే భౌతికశరీరం నశించిన తరవాత ప్రతిసారీ, భూమినించి వచ్చిన, అభివృద్ధి చెందని జీవి, చాలామట్టుకు మరణ స్వప్నమనే గాఢసుషుప్తిలో ఉండి పోతాడు; అందమైన సూక్ష్మలోకం అతని స్ఫురణలో ఉండదు. అటువంటివాడు సూక్ష్మలోక విశ్రాంతి తీసుకున్న తరవాత అనుక్రమ శిక్షణకోసం భౌతికలోకానికి తిరిగి వెళ్తాడు. పదేపదే సాగే రాకపోకలవల్ల అతడు క్రమంగా, సులువుగా అర్థంగాని సూక్ష్మతత్త్వం గల లోకాలకు అలవాటు పడిపోతాడు.

"అది అలా ఉండగా, సూక్ష్మవిశ్వంలో మామూలుగా ఉంటున్న వాళ్ళు, లేదా చిరకాలంగా స్థిరనివాసులుగా ఉంటూ వచ్చినవాళ్ళు భౌతిక వాంఛలన్నిటినించీ విముక్తులయి, భూలోకపు స్థూల స్పందనలకు మళ్ళీ లోనుకావలసిన అవసరం లేనివాళ్ళు. అటువంటి జీవులకు సూక్ష్మ కారణ కర్మలుమట్టుకే అనుభవించవలసి

ఉంటుంది. సూక్ష్మలోకంలో మరణించిన తరవాత ఈ జీవులు అత్యంత సూక్ష్మతరమూ సుందరతరమూ అయిన కారణలోకానికి వెళ్తారు. విశ్వనియమం నిర్ణయించిన ప్రకారం కొంత జీవితకాలం గడిచిన తరవాత, ఈ ప్రగతి సాధించిన జీవులు హిరణ్యలోకానికో అలాంటి ఉన్నత సూక్ష్మ లోకానికో తిరిగి వచ్చి, సూక్ష్మలోక కర్మఫలావశేషాన్ని అనుభవించడానికి ఒక కొత్త సూక్ష్మ శరీరంలోకి ప్రవేశిస్తారు

"అబ్బాయి, నేను దైవాజ్ఞచేత పునరుత్థానం చెందానని, ఇప్పుడు నువ్వు పూర్తిగా గ్రహించవచ్చు," అంటూ ఇంకా చెప్పారు శ్రీయుక్తేశ్వర్‌గారు. "అయితే నేను రక్షకుడిగా పనిచేసేది, భూమినుంచి పైకి వచ్చిన సూక్ష్మలోకజీవుల్ని ఉద్ధరించడం కోసం కన్న, ముఖ్యంగా కారణలోకంనుంచి తిరిగివచ్చి సూక్ష్మలోకంలో పునర్జన్మ ఎత్తిన ఆత్మల్ని ఉద్ధరించడం కోసమని చెప్పాలి. భూమినుంచి వచ్చిన వాళ్ళు తమ భౌతిక కర్మావశేషాల్ని ఇంకా నిలుపుకొనే ఉన్నట్టయితే, హిరణ్యలోకం వంటి అత్యున్నత సూక్ష్మలోకానికి చేరలేరు.

"భూమిమీదుండే వాళ్ళలో చాలామంది, సూక్ష్మలోక జీవితంవల్ల కలిగే ఉత్కృష్ట ఆనందాల్నీ లాభాల్నీ హర్షించడానికి ఉపకరించే ధ్యానార్జిత అంతర్దర్శనాన్ని అలవరచుకోని కారణంగా, మరణానంతరం మళ్ళీ భూమిమీదుండే పరిమిత అపరిపూర్ణ సుఖాలకోసమే తిరిగిరావాలని కోరుకునేటట్టుగానే, చాలామంది సూక్ష్మలోక జీవులు, కారణలోకంలోని ఆధ్యాత్మికానందమనే ఉన్నతావస్థను ఊహించుకోలేక, తమ సూక్ష్మ శరీరాలు మామూలుగా విఘటనం చెందే సమయంలో, స్థూలతర అసహజ సూక్ష్మలోక సౌఖ్యాన్ని గురించిన ఆలోచనల మీదే మనసుపెట్టుకొని సూక్ష్మస్వర్గానికి తిరిగి రావాలని కోరుకుంటారు. సూక్ష్మ లోకంలో మరణించిన తరవాత, బహుసన్నని సరిహద్దుతో సృష్టికర్తనుంచి వేర్పాటుగా ఉన్న కారణ భావ జగత్తులో శాశ్వతనివాసం పొందగలిగే ముందు, అటువంటి వాళ్ళ భారీ సూక్ష్మలోక కర్మ క్షయం కావాలి.

"ఒక జీవి, కంటికి ఇంపుచేసే సూక్ష్మవిశ్వంలో లభించే అనుభవాలకోసం మరేమీ కోరికలు పెట్టుకోకుండా, తిరిగి అక్కడికి వెళ్ళాలన్న వ్యామోహానికి లోబడకుండా ఉండగలవాడయితేనే, అతడు కారణలోకంలో ఉండిపోతాడు. అక్కడ కారణకర్మను, లేదా వెనకటి కోరికల బీజాల్ని క్షయంచేసే పనిపూర్తిచేసి బద్ధమైన ఆత్మ, అవిద్య అనే మూడు బిరడాల్లోనూ చివరిదాన్ని బయటికి నెట్టేసి, కారణ శరీరమనే కడపటి సీసాలోంచి బయటపడి శాశ్వత పరబ్రహ్మంలో కలిసి పోతుంది.

"ఇప్పుడు తెలిసిందా నీకు?" గురుదేవులు మనోహరంగా చిరునవ్వు నవ్వారు.

"తమ దయవల్ల తెలిసిందండి; ఆనందంతోనూ కృతజ్ఞతతోనూ నోట మాట రావడం లేదండి."

ఒక పాటకాని, కథకాని విని అంతకుముందెన్నడూ నేను అంతస్ఫూర్తిమంతమైన జ్ఞానం పొందలేదు. హిందూ పవిత్ర గ్రంథాలు కారణ, సూక్ష్మ లోకాలగురించీ మానవుడి మూడు శరీరకోశాల్ని గురించీ ప్రస్తావించినప్పటికీ, పునరుత్థానం చెందిన మా గురుదేవుల ఆహ్లాదకరమైన సాధికారతతో పోల్చి చూస్తే, ఆ గ్రంథాల్లో చెప్పింది ఎంత దుర్వ్యాహ్యంగా, ఎంత అర్థరహితంగా ఉంటుందో అనిపించింది! ఆయన దృష్టిలో, "యాత్రికుడెవడూ తిరిగిరాని అన్వేషితదేశం,"* ఒక్కటీ లేదు!

"మానవుడి మూడు శరీరాలూ ఒకదాంట్లోకి ఒకటి చొచ్చుకుపోయి ఉంటాయన్న విషయం, అతని త్రిగుణాత్మక ప్రకృతి ద్వారా అనేక మార్గాల్లో వ్యక్తమవుతుంది," అంటూ చెప్పసాగారు గురుదేవులు. "భూమి మీద మానవుడికి జాగ్రదవస్థలో, దాదాపు ఈ మూడు వాహకాలూ స్పృహలో ఉంటాయి. రుచి చూడ్డం, వాసన చూడ్డం, తాకడం, వినడం, లేదా చూడ్డం వంటి ఇంద్రియానుభవాలు పొందాలని అతడు ఇంద్రియ భోగలాలసుడై తలపెట్టినప్పుడు, అతడు ప్రధానంగా తన భౌతిక శరీరంతో పని చేస్తున్నాడన్నమాట. అంతర్దర్శనం పొందడం, లేదా సంకల్పించడం అన్నవి అతడు ముఖ్యంగా సూక్ష్మశరీరంతో చేస్తున్నాడు. మనిషి ఆలోచిస్తున్నప్పుడు కాని అంతఃపరిశీలనలోనో ధ్యానంలోనో గాఢంగా మునుగుతున్నప్పుడు కాని అతని కారణశరీరానికున్న వ్యక్తీకరణ శక్తి వెల్లడి అవుతుంది; అలవాటు ప్రకారం కారణ శరీరంతో సంబంధం పెట్టుకొనేవాడికి ప్రతిభా సంబంధమైన విశ్వభావాలు ఏర్పడతాయి. అంటే, ఒక వ్యక్తిని 'భౌతిక మానవుడు'గా కాని, 'శక్తిమంతుడైన మానవుడు'గా కాని, 'ప్రజ్ఞాపరుడైన మానవుడు'గా కాని స్థూలంగా వర్గీకరించవచ్చు.

"మనిషి ప్రతిరోజూ సుమారు పదహారేసి గంటలసేపు భౌతిక వాహనంగా తనను భావించుకుంటూ ఉంటాడు. తరవాత నిద్రపోతాడు; కలలు కనేటట్టయితే, సూక్ష్మలోక జీవుల మోస్తరుగానే ఏ వస్తువునయినా అనాయాసంగా సృష్టిస్తూ సూక్ష్మ శరీరంలో ఉంటాడు. మానవుడి నిద్ర, కలలు లేకుండా చాలా గంటల సేపు గాఢంగా సాగినట్లయితే అతడు, తన చేతనను లేదా అహంకారతత్త్వాన్ని కారణ శరీరానికి బదిలీ చెయ్యగలుగుతాడు. అటువంటి నిద్ర పునర్నవీకరంగా ఉంటుంది. కలలు కనేవాడు తన సూక్ష్మశరీరంతో సంబంధం పెట్టుకుంటున్నాడు తప్ప కారణ

---

* హామ్లెట్ (III, దృశ్యం 1).

శరీరంతో కాదు; అతని నిద్ర పూర్తిగా పునర్నవీకరం కాదు."

శ్రీయుక్తేశ్వర్‌గారు అద్భుతమైన ఈ వ్యాఖ్యానం చేస్తూఉంటే, నేను ప్రేమ భావంతో గమనిస్తూ ఉన్నాను.

"గురుదేవా, మీ శరీరం అచ్చూమచ్చూ, నేను చివరిసారి పూరీ ఆశ్రమంలో చూసి వలవలా ఏడ్చినప్పటి శరీరంలాగే ఉందండి," అన్నాను.

"ఔను. నా కొత్త శరీరం, పాతదానికి పరిపూర్ణమైన నకలు. ఈ రూపాన్ని నేను సంకల్పానుసారంగా ఎప్పుడైనా సరే ప్రత్యక్షంచెయ్యడం, అదృశ్యం చెయ్యడం చేస్తూంటాను; భూమిమీద చేసిన దానికంటె కూడా తరచుగా చేస్తూ ఉంటాను. శీఘ్రంగా అదృశ్యం చెయ్యడం వల్ల నేనిప్పుడు కాంతిరథం (లైట్ ఎక్స్‌ప్రెస్) మీద ఒక గ్రహంనుంచి మరోగ్రహానికీ, నిజానికి సూక్ష్మలోకంనుంచి కారణలోకానికీ లేదా భూలోకానికీ, క్షణంలో ప్రయాణం చేస్తూంటాను," అంటూ మా గురుదేవులు చిరునవ్వు నవ్వారు. "ఈ రోజుల్లో నువ్వు చాలా వేగంగానే సంచారం చేస్తూ ఉన్నప్పటికీ, నిన్ను బొంబాయిలో పట్టుకోడం నా కేమీ కష్టం కాలేదు!"

"గురుదేవా, మీరు పోయినందుకు నే నెంత విలపించిపోయానో!"

"బాగుందోయ్! నేను పోవడమేమిటి? ఏ రకంగా? ఇందులో కాస్త తిరకాసు లేదూ?" శ్రీయుక్తేశ్వర్‌గారి కళ్ళు ప్రేమతోనూ వినోదంతోనూ మిలమిల్లాడు తున్నాయి.

"నువ్వు భూమిమీద కలగన్నావంతే; ఆ భూమిమీద నువ్వు నా స్వప్న శరీరాన్ని చూశావు," అంటూ ఇంకా చెప్పారాయన. "తరవాత నువ్వా స్వప్నబింబాన్ని సమాధి చేశావు. ఇప్పుడు నువ్వు చూస్తున్న శరీరం ఉందేం - ఇప్పటికీ నువ్వింకా గట్టిగానే చుట్టేసుకుని ఉన్నది - మాంసమయమైన ఈ నా సూక్ష్మతర శరీరం, భగవంతుడి మరో సూక్ష్మతర స్వప్నలోకంలో పునరుత్థానం చెందింది. ఎప్పటికో ఒక నాటికి ఈ సూక్ష్మతర స్వప్నశరీరమూ, సూక్ష్మతర స్వప్నలోకమూ కూడా గతిస్తాయి; అవి కూడా ఎప్పటికీ ఉండిపోయేవి కావు. కలల బుడగలన్నీ చివరికి, చరమ జాగరణ స్పర్శతో పగిలిపోక తప్పదు. అబ్బాయ్, యోగానందా, కలల్నీ వాస్తవాన్నీ విడమరిచి చూడు!"

వేదాంత*పరమైన ఈ పునరుత్థానభావన నన్ను ఆశ్చర్యంలో ముంచెత్తింది.

---

* చావుబతుకులు కేవలం భావనలోని సాపేక్షతలుగా బ్రహ్మమొక్కటే సత్యమని చెబుతుంది వేదాంతం; సృష్టి అంతా, లేదా ప్రత్యేక అస్తిత్వం, మాయ లేదా మిథ్య ఈ అద్వైత తత్త్వం శంకరుల ఉపనిషద్వ్యాఖ్యల్లో పరమోత్తమంగా అభివ్యక్తమయింది.

శ్రీయుక్తేశ్వర్‌గారు కొన్ని ఇతర విషయాలు కూడా వివరించారు; కాని వాటిని నే నిక్కడ వెల్లడించలేకపోతున్నాను. బొంబాయి హోటలు గదిలో ఆయన నాతో గడిపిన రెండు గంటలలోనూ నే నడిగిన ప్రతి ప్రశ్నకూ జవాబు ఇచ్చారు 1936 జూన్‌లో, ఆనాడు ఆయన ప్రపంచ భవిష్యత్తు గురించి పలికిన జోస్యాలు, కొన్ని ఈపాటికే ఫలించాయి.

"బాబూ, ఇప్పుడింక నిన్ను విడిచి వెళ్ళిపోవాలి మరి!" ఈ మాటలు వినడం తోటే, నేను చుట్టి ఉంచిన చేతుల్లో గురుదేవులు కరిగి పోతున్నట్టు లనిపించింది.

"నాయనా," అంటూ పిలిచినప్పుడు ఆయన కంఠస్వరం, నా ఆత్మాకాశం లోకి స్పందిస్తూ ప్రవేశించింది: "నువ్వు నిర్వికల్ప సమాధి ద్వారంలోకి ప్రవేశించి నన్ను ఎప్పుడు పిలిస్తే అప్పుడు, ఇవాళ్టిలాగే, రక్తమాంసాలున్న శరీరంతో నీ దగ్గరికి వస్తాను," అన్నారాయన.

ఈ దివ్యవాగ్దానం చేసి శ్రీయుక్తేశ్వర్‌గారు నాకు కనుమరుగయి పోయారు సంగీతంతో కూడిన ఉరుములా మారుమోగిన మేఘ గర్జన స్వరం ఒకటి ఇలా పలికింది: "అందరికీ చెప్పు! మీ భూలోకం దేవుడి కల అని నిర్వికల్ప సమాధిలో తెలుసుకున్నవాడల్లా హిరణ్యలోకమనే సూక్ష్మతర స్వప్నజనిత గ్రహానికి రాగలడు; అక్కడ నేను అచ్చం, భూమిమీదున్నప్పటి శరీరంలాటి శరీరంతోనే పునరుత్థానం చెంది ఉండడం గమనిస్తాడు. యోగానందా, ఈ మాట అందరికీ చెప్పు!"

వియోగదుఃఖమంతా మబ్బులా విడిపోయింది. కొంత కాలంగా, ఆయన మరణంవల్ల కలిగిన సంతాపం, శోకం నా మనశ్శాంతిని హరిస్తూ వచ్చాయి; కాని ఇప్పుడవి చిన్నబుచ్చుకుని పరారి అయ్యాయి. కొత్తగా ఏర్పడ్డ అంతులేని ఆత్మఛిద్రాలగుండా, దివ్యానందం ఒక నీటిబుగ్గలా ఎగజిమ్మింది. ఉపయోగంలో లేకపోవడంవల్ల ఏనాడో పూడుకుపోయిన ఈ చిల్లులు, ఒక్కసారి ఆనందపు వెల్లువ పోటెత్తేసరికి, పెద్దవయాయి. నా పూర్వజన్మలు, చలనచిత్రం మాదిరి క్రమమైన వరసలో నా లోపలి కంటికి అవుపించాయి. వెనకటి సత్కర్మ దుష్క ర్మలు రెండూ, గురుదేవుల దివ్యసందర్శనవల్ల నా చుట్టూ ప్రసరించిన విశ్వ కాంతిలో కరిగిపోయాయి.

నా ఆత్మకథలోని ఈ అధ్యాయంలో, మా గురుదేవుల ఆదేశాన్ని అనుస రించి శుభవార్త చాటాను; అయితే అది, జిజ్ఞాసారహితుల్ని మరోసారి చిరాకు పెడుతుంది. నేలమీద పొర్లాడడం బాగా ఎరుగును మనిషి; నిస్పృహ కలక్క పోవడం అతనికి అరుదు; అయినా ఇవి వికృతులు. మానవుడి సత్యస్వరూపంలో

భాగాలు కావు. అతడు సంకల్పించిన రోజున స్వాతంత్ర్యపథంలో అడుగు పెడతాడు. చాలాకాలంగా అతడు, అజేయమైన ఆత్మను లెక్కచెయ్యకుండా - "మట్టివి నువ్వు" అంటూ చెప్పే ఘోరమైన నిరాశావాదాన్ని చెవిని పెడుతూ వచ్చాడు.

పునరుత్థానం చెందిన మా గురుదేవుల్ని దర్శించే భాగ్యం కలిగిన వాణ్ణి నే నొక్కణ్ణే కాను.

శ్రీయుక్తేశ్వర్‌గారి శిష్యకోటిలో ఒక ముసలావిడ ఉండేది; ఆవిణ్ణి అందరూ 'మాఁ' [అమ్మ] అని పిలిచేవారు, ఆప్యాయంగా. ఆవిడ ఇల్లు పూరీ ఆశ్రమానికి దగ్గరిలోనే ఉండేది. గురుదేవులు పొద్దుటిపూట షికారుకు వెళ్ళేటప్పుడు తరచుగా ఆవిడ ఇంటి దగ్గర కాస్సేపు ఆగి, కబుర్లు చెప్పి వెళ్తూ ఉండేవారు. 1936 మార్చి 16 తేదీ సాయంత్రం మాఁ, ఆశ్రమానికి వచ్చి, గురువుగారిని ఓసారి కలుసుకోడానికి వచ్చాను అన్నది.

"అదేమిటి, గురుదేవులు వారంరోజుల కిందటేపోయారు కదమ్మా!" అన్నాడు, పూరీ ఆశ్రమం నిర్వహణ బాధ్యత తీసుకున్న స్వామి సేవానంద, ఆవిడవేపు విచారంగా చూస్తూ.

"అసంభవం!" అంటూ చిరునవ్వు నవ్వుతూ ఆక్షేపణ తెలిపిందావిడ.

"కాదమ్మా!" అంటూ గురుదేవుల్ని సమాధి చెయ్యడానికి సంబంధించిన వివరాలన్నీ చెప్పాడు సేవానంద. "రండి, ఆయన సమాధికి ఎదురుగా ఉన్న తోటకు తీసుకువెడతా మిమ్మల్ని."

మాఁ తల తిప్పింది. "ఆయనకి సమాధేమిటి! ఈవేళ పొద్దున పదింటికి ఆయన, మామూలుగా షికారుకు వెళ్తూ మా ఇంటిమీదుగా వెళ్లారు! పట్టపగలు, ఆరుబయట, నేను ఆయనతో చాలా నిమిషాలసేపు మాట్లాడాను.

" 'ఈవేళ సాయంత్రం ఆశ్రమానికి రా,' అన్నారాయన.

"వచ్చాను! పండబారిన ఈ ముసలి తలమీద ఆయన దీవెనలు కురిశాయి! ఈవేళ పొద్దున ఆయన మా ఇంటికి వచ్చింది ఎలాటి దివ్యదేహంతోనో నేను తెలుసుకోవాలని అనుకున్నారు, అమర గురుదేవులు!"

సేవానంద ఆశ్చర్యపోయి ఆవిడముందు మోకరిల్లాడు.

"మాఁ, మా గుండెలోంచి ఎంత దుఃఖభారం తీసేశావు తల్లీ! ఆయన పునరుత్థానం చెందారు!" అన్నాడతను.

అధ్యాయం : *44*

# గాంధీ మహాత్ములతో వార్ధాలో

"వార్ధాలో మీకు స్వాగతం!" గాంధీ మహాత్ముల కార్యదర్శి, మహాదేవ దేశాయి, మిస్ బ్లెట్‌ష్‌కూ శ్రీ రైట్‌కూ నాకూ సౌహార్దంతో నిండిన ఈ మాటలతో స్వాగతం చెబుతూ ఖద్దరు మాలలు వేశారు. మా చిన్న బృందం, ఆగస్టులో ఒకనాడు వేకువజామున, అప్పుడే వార్ధా స్టేషనులో దిగింది. బండిలో ఉన్న దుమ్ములోంచీ ఉక్కపోతలోంచీ బయటపడ్డందుకు మేము సంతోషించాం. మా సామాను ఒక ఎద్దుబండిలో వేయించి శ్రీ దేశాయితోనూ ఆయన వెంట వచ్చిన బాబా సాహెబ్ దేశ్‌ముఖ్, డా॥ పింగళే గార్లతో కలిసి మేము, ఒక తెరిపి మోటారు కారులో బయలుదేరాం. బురద గొట్టుకుపోయిన నాటురోడ్ల మీద కొంతసేపు ప్రయాణం చేసి "మగన్‌వాడి" చేరాం; భారతదేశ రాజకీయ ఋషి ఆశ్రమమది.

దేశాయిగారు మమ్మల్ని వెంటనే 'రాతగది'లోకి తీసుకువెళ్ళారు; అక్కడ గాంధీమహాత్ములు బాసెంపట్టు వేసుకుని కూర్చుని ఉన్నారు. ఒక చేతిలో కలం, మరో చేతిలో ఒక కాయితం ముక్క; ఆయన ముఖంలో హృదయాకర్షకమైన మధుర మందహాసం!

"స్వాగతం!" అని హిందీలో రాశారాయన. ఆ రోజు సోమవారం; వారానికో సారిగా ఆయన మౌనం పాటించే రోజు అది.

మేము కలుసుకోడం అదే మొదటిసారి అయినా, మేము ఒకరి నొకరం ఆప్యాయంగా చూసుకున్నాం. గాంధీమహాత్ములు 1925లో రాంచీ విద్యాలయాన్ని సందర్శించారు; అది ఆ విద్యాలయాని కొక గౌరవం. ఆ సందర్భంలో ఆయన, అతిథుల అభిప్రాయాల పుస్తకంలో, దయతో ప్రశంసా పూర్వకమైన మాటలు కొన్ని రాశారు.

100 పౌనుల స్వల్పకాయం గల ఆ పురుషునిలో శారీరక, మానసిక, ఆధ్యాత్మిక ఆరోగ్యాలు ప్రస్ఫుటమవుతున్నాయి. స్ఫుటమైన ఆయన ధూమ్రవర్ణ నేత్రాలు జ్ఞానంతో, చిత్తశుద్ధితో, వివేకంతో వెలుగొందుతున్నాయి: ఈ రాజనీతిజ్ఞులు న్యాయ, సాంఘిక, రాజకీయ పోరాటాలు అనేకం జయించారు. గాంధీగారు భారతదేశంలోని లక్షలాది జనహృదయాల్లో స్థానం సంపాదించుకున్నంతగా, ప్రపంచంలో మరే నాయకుడూ సంపాదించుకోలేదు. "మహాత్ముడు" అంటూ ఆయనకు వచ్చిన ప్రసిద్ధ బిరుదం, ప్రజలు స్వచ్ఛందంగా ఆయనకు అర్పించిన నివాళి. వాళ్ళ కోసమే ఆయన, తమ దుస్తుల్ని కొల్లాయిగుడ్డకు పరిమితం చేసుకున్నారు. చాలా వ్యంగ్యచిత్రాలకు ఎక్కిన ఆ కొల్లాయిగుడ్డ అంతకు మించినదేదీ ధరించజాలని దళిత జనబాహుళ్యంలో తామూ ఒకరమన్న భావనకు చిహ్నమయింది.

"ఆశ్రమవాసులు పూర్తిగా మీ సేవకు హాజరుగా ఉంటారు: ఏ పని కావాలన్నా దయచేసి వాళ్ళని అడిగి చేయించుకోండి." శ్రీ దేశాయి మమ్మల్ని రాతగది లోంచి అతిథిగృహానికి తీసుకువెళ్తూ ఉండగా, మహాత్ములు అప్పటికప్పుడు ఈ ముక్కలు రాసి, సహజ సౌమనస్యంతో నాకు అందించారు.

దేశాయిగారు మమ్మల్ని పండ్లతోటలగుండా, పూలతోటలగుండా నడిపించి జాలీ కిటికీలున్న ఒక పెంకుటింటికి తీసుకువెళ్ళారు. ముందరి దొడ్లో ఉన్న ఇంచుమించు ఐదడుగుల నూతిని, పశువులకు నీళ్ళు పట్టడానికి ఉపయోగిస్తారని చెప్పారు; ఆ పక్కనే ధాన్యం మార్చడానికి సిమ్మెంటు చక్రం ఒకటి ఉంది. మాకు ఒక్కొక్కరికి ఒక్కొక్కటి చొప్పున ప్రత్యేకంగా ఇచ్చిన చిన్న పడకగదుల్లో, వీలయినంత కనీసపు సామగ్రి మాత్రమే - నులకతాటితో అల్లిన ఒక్క మంచం మాత్రం ఉంది. వెల్లవేసిన వంటింట్లో ఒక మూల నీటి కుళాయి ఉంది; మరో చోట వండుకోడానికి ఒక పొయ్యి ఉంది. కాకుల అరుపులూ, పిచికల కిచకిచలూ, పశువుల అంబారవాలూ, రాళ్ళు కొట్టేటప్పుడయే టకటకచప్పుళ్ళూ - నిరాడంబరమైన పల్లెల్లో వినబడే శబ్దాలు మా చెవులకు సోకాయి.

శ్రీ రైట్ యాత్రాదినచర్య (ట్రావెల్ డైరీ) పుస్తకాన్ని గమనించి శ్రీ దేశాయి, దాన్ని తెరిచి, అందులో ఒక పేజీలో గాంధీమహాత్ముల యథార్థానుయాయులు (సత్యాగ్రహులు) అందరూ చేసే సత్యాగ్రహ*వ్రతప్రతిజ్ఞల్ని వరసగా రాశారు.

"అహింస: సత్యం: అస్తేయం (దొంగిలించకపోవడం): బ్రహ్మచర్యం: అపరిగ్రహం: కాయకష్టం: జిహ్వను అదుపులో ఉంచుకోడం:

* "సత్యానికి నిలబడి ఉండడం" అన్నది, ఈ సంస్కృతపదానికి అనువాదం. సత్యాగ్రహమన్నది గాంధీగారు నడిపిన ప్రసిద్ధ అహింసోద్యమం.

నిర్భయం అన్ని మతాలపట్లా సమానగౌరవం; స్వదేశీ (దేశంలో తయారైన వస్తువులే వాడడం); అంటరానితనం పాటించక పోవడం. ఈ పదకొండూ వినయవిధేయతలతో ప్రతిజ్ఞలుగా పాటించాలి "

(ఆ మర్నాడు గాంధీగారే స్వయంగా ఈ పేజీమీద సంతకం చేసి తేదీ కూడా వేశారు - ఆగస్టు 27, 1935).

మేము వచ్చిన రెండు గంటల తరవాత నన్నూ నా సహచరుల్నీ భోజనానికి పిలిచారు. మహాత్ములు అప్పటికే, ముంగిలికీ ఆయన పఠన మందిరానికీ మధ్యలో ఉన్న ఆశ్రమం వసారా కమాను కింద కూర్చుని ఉన్నారు. సుమారు ఇరవై ఐదు మంది సత్యాగ్రహులు కూర్చున్నారు; వాళ్ళకు ఎదురుగా ఇత్తడి కప్పులూ కంచాలూ పెట్టి ఉన్నాయి. అందరూ కలిసి ప్రార్థన చేశారు; తరవాత పెద్ద ఇత్తడి పాత్రలు తెచ్చి వాటిలోంచి, నెయ్యి వేసిన చపాతీలు తీసి వడ్డించారు; 'తాల్సరీ' (ఉడకబెట్టిన కూరగాయల ముక్కలు), నిమ్మకాయ మురబ్బా కూడా వేశారు.

మహాత్ములు చపాతీలు, ఉడకబెట్టిన బీట్ దుంపలు, కొన్ని పచ్చి కూరలు నారింజకాయలు తిన్నారు. కంచానికి ఒక పక్కన పెద్ద వేపాకు ముద్ద ఉంది; రక్తాన్ని శుభ్రపరచడంలో వేపాకు చెప్పుకోదగ్గది. ఆయన ఒక చెమ్చాతో కొంత విడదీసి దాన్ని నా కంచంలో పెట్టారు. బలవంతాన మా అమ్మ నా చేత ఆ చేగటు మందు మింగించిన చిన్నప్పటి రోజులు గుర్తుకు వచ్చాయి. నేను దాన్ని నోట్లో వేసుకుని మంచినీళ్ళతో బాటు గుటుక్కున మింగేశాను. కాని గాంధీగారు, అరుచి అనుకోకుండా, ఆ వేపాకుల ముద్ద కొద్దికొద్దిగా నమిలి తిన్నారు.

ఇచ్ఛానుసారంగా తమ మనస్సును ఇంద్రియాల మీంచి మళ్ళించే సామర్థ్యం మహాత్ములకు ఉందని ఈ చిన్న సంఘటనలో గమనించాను. కొన్నేళ్ళ కిందట ఆయనకు జరిగిన, బహుళ ప్రచారంలో ఉన్న గిలక (appendectomy) ఆపరేషను సంగతి గుర్తొచ్చింది నాకు. మత్తుమందు లేపీ తమకు అక్కర్లేదని ఆ సాధువు, బాధను గురించిన స్పృహ తమకు లేదన్న విషయాన్ని ఆయన ప్రశాంతమైన చిరునవ్వు వెల్లడిస్తోండగా, ఆపరేషను జరుగుతున్నంతసేపూ తమ శిష్యులతో కులాసాగా కబుర్లు చెప్పారు.

మధ్యాహ్నం గాంధీగారి ప్రముఖ శిష్యురాలైన మాడలీన్ స్లేడ్‌తో ముచ్చటించే అవకాశం కలిగింది; ఒక ఇంగ్లీషు నౌకా సేనాధిపతి కుమార్తె ఈమె; ఈ అమ్మాయి

పేరు ఇప్పుడు మీరా బెహెన్.* ఈమె తన రోజువారీ కార్యకలాపాల గురించి నిర్దుష్టమైన హిందీలో నాకు చెబుతున్నప్పుడు పుష్టిగా, ప్రశాంతంగా ఉండే ఆమె ముఖంలో ఉత్సాహం వెల్లివిరిసింది.

"గ్రామ పునరుద్ధరణ కృషి లాభదాయకమైనది! మాలో ఐదుగురం ప్రతి రోజూ పొద్దున 5 గంటలకు లేచి, దగ్గరిలో ఉన్న పల్లెలో వాళ్ళకి సేవచేసి సాధారణ ఆరోగ్య నియమాలగురించి వాళ్ళకు బోధిస్తాం. వాళ్ళ పాకీదొడ్లూ బురద మట్టితో నేసిన తాటాకు గుడిసెలూ శుభ్రం చెయ్యడం ఒక పనిగా పెట్టుకున్నాం. పల్లెటూరివాళ్ళు చదువురానివాళ్ళు; చేసి చూపిస్తే తప్ప వాళ్ళకి నేర్పడం సాధ్యం కాదు!" అంటూ కులాసాగా నవ్విందామె.

ఉన్నత కుటుంబంలో జన్మించిన ఈ ఆంగ్లవనిత చేత - మామూలుగా "అంటరానివాళ్ళు" మాత్రమే చేసే పాకీపని చేయించినది, నిజమైన క్రైస్తవ సహజమైన వినయం; అందుకు ఆమె నేను ప్రశంసాపూర్వకంగా చూశాను.

"నేను 1925లో భారతదేశం వచ్చాను," అని చెప్పిందామె. "ఈ దేశంలో, 'నేను నా ఇంటికే తిరిగి వచ్చాను' అనిపిస్తుంది. ఇప్పుడిక నా పాత జీవనసరళికీ పాత అభిరుచులకూ మారిపోవాలని అనిపించదు."

మేము కొంచెంసేపు అమెరికాగురించి మాట్లాడుకున్నాం. "భారత దేశాన్ని సందర్శించే అమెరికన్లు అనేకమంది, ఆధ్యాత్మిక విషయాల్లో కనబరిచే గాఢమైన ఆసక్తి గమనించి నే నెప్పుడూ సంతోషిస్తూ ఆశ్చర్యపోతూ ఉంటాను."† అన్నదామె.

---

* గాంధీ మహాత్ములు రాసిన ఉత్తరాలు కొన్ని ఈమె ప్రకటించింది. ఈమెకు గురువుగారు నేర్పిన స్వయంశిక్షణ వీటిలో వెల్లడి అవుతుంది ('గాంధీస్ లెటర్స్ టు ఎ డిసైపుల్,' హార్పర్ అండ్ బ్రదర్స్, న్యూయార్కు, 1950).

తరవాత ప్రచురించిన ఒక పుస్తకం (ద స్పిరిట్స్ పిల్గ్రిమేజ్, కోవర్డ్ - మెక్కాన్, న్యూయార్కు, 1960) లో మిస్ స్లేడ్, గాంధీగారిని వార్ధాలో కలుసుకున్న అనేకమందిని గురించి ప్రస్తావించింది. ఆమె ఇలా రాసింది : "ఇంతకాలం గడిచాక ఇప్పుడు నేను వాళ్ళందరినీ జ్ఞాపకం చేసుకోలేను; కాని ఇద్దరు మాత్రం మనస్సులో స్పష్టంగా నిలిచిపోయారు· టర్కీ దేశపు ప్రసిద్ధ రచయిత్రి హాలిద్ ఎదిబ్ హానుమ్, అమెరికాలో సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ సంస్థను స్థాపించిన స్వామి యోగానందగారు." (ప్రచురణకర్త గమనిక).

† మిస్ స్లేడ్ను చూస్తుంటే నాకు గుర్తు వచ్చిన మరో వ్యక్తి మిస్ మార్గరెట్ వుడ్రో విల్సన్; ఈమె అమెరికా అధ్యక్ష మహాశయుల పుత్రిక. ఈమెను నేను అమెరికాలో కలుసుకున్నాను. భారతదేశం మీద ఈమెకు గాఢమైన ఆసక్తి ఉండేది. తరవాత ఈమె పుదుచ్చేరి వెళ్ళింది. జీవితంలో చివరి ఐదేళ్ళూ ఈవిడ అక్కడే - ఆత్మద్రష్ట అయిన మహాయోగి, శ్రీ అరవింద ఘోష్ పాదసన్నిధిలో - సంతోషంగా శిక్షణ పొందుతూ గడిపింది.

మరి కాస్సేపట్లోనే మీరా బెహెన్‌కు రాట్నంతో చేతుల నిండా పనిపడింది. గాంధీ మహాత్ముల కృషివల్ల రాట్నాలిప్పుడు భారతీయ గ్రామాల్లో ఎక్కడపడితే అక్కడ కనిపిస్తున్నాయి.

కుటీర పరిశ్రమల పునరుద్ధరణను ప్రోత్సహించడానికి గాంధీగారికి బలమైన ఆర్థిక, సాంస్కృతిక కారణాలు ఉన్నాయి; కాని ఆయన ఆధునిక ప్రగతినంతనూ పిచ్చిగా ఖండించమని చెప్పరు. యంత్రాలు, రైళ్ళు, కార్లు టెలిగ్రాఫు ఆయన జీవితంలోనే ప్రముఖ పాత్రలు వహించాయి! ఆయన ప్రజాసేవ చేసిన కాలం, (రాజకీయ ప్రపంచంలోని వ్యవహార వివరాలతోనూ, కఠోర సత్యాలతోనూ ప్రతి రోజూ కుస్తీ పట్టిన - జైలులోనూ బయటా కూడా కలిపి - ఏభై ఏళ్ళ ఆ కాలం) ఆయన మనస్సంతులనాన్నీ, నిష్కాపట్యాన్నీ, మతిస్థిమితాన్నీ, చిత్రమైన మానవ జీవితాన్ని హాస్యధోరణిలో మెచ్చుకోడాన్ని పెంచడానికే దోహదపడింది.

మేము ముగ్గురం బాబా సాహెబ్ దేశ్‌ముఖ్‌గారి అతిథులుగా సాయంత్రం 6 గంటలకు భోజనాలు చేశాం; రాత్రి ఏడు గంటలకు మళ్ళీ మేము మగన్‌వాడి ఆశ్రమంలో ప్రార్థన వేళకి వెళ్ళి డాబా ఎక్కాం; అక్కడ ముప్ఫైమంది సత్యాగ్రహులు గాంధీగారి చుట్టూ కూర్చుని ఉన్నారు. ఆయన ఒక తుంగచాపమీద కూర్చుని ఉన్నారు. పాతకాలపు జేబు గడియారం ఒకటి ఆయన ముందు వేపు ఉంది. వాలుతున్న సూర్యుడు తాటిచెట్లమీదా మర్రిచెట్లమీదా చివరి వెలుగులు ప్రసరిస్తున్నాడు; రాత్రి రొద, కీచురాళ్ళ చప్పుళ్ళూ మొదలయాయి. వాతావరణం పూర్తిగా ప్రశాంతంగా ఉంది. నేను మైమరిచిపోయాను.

శ్రీ దేశాయి భజనకీర్తన ఒకటి పాడుతూ ఉండగా తక్కిన వాళ్ళంతా ఆయన పాడింది అందుకొని పాడుతున్నారు; తరవాత గీతా పారాయణ జరిగింది. ముగింపు ప్రార్థన నన్ను చెయ్యమని మహాత్ములు నాకు సంజ్ఞ చేశారు. ఆలోచనకూ ఆశయానికీ ఎటువంటి పొందిక ఉంది! ఎప్పటికీ మనస్సులో ఉండిపోయే స్మృతి: ఆకాశంలో అప్పుడే పొడిచిన చుక్కల కింద, వార్ధాలో మిద్దెమీద జరిగిన ధ్యానం.

కచ్చితంగా ఎనిమిది గంటల వేళకు గాంధీగారు మౌనం చాలించారు. ఆయన జీవితంలో సాధించవలసిన కఠోరమైన పనుల వల్ల కాలాన్ని సూక్ష్మ ప్రమాణాల్లో కేటాయించడం అవసరమయింది.

"స్వాగతం స్వామీజీ!" ఈసారి మహాత్ములిచ్చినది కాయితం మీద రాసి చూపించిన స్వాగతం కాదు. మేము అప్పుడే డాబామీంచి దిగి ఆయన రాత

గదికి వెళ్ళాం. అందులో చదరలు (కుర్చీలు లేవు), పుస్తకాలు, కాయితాలు, మామూలు కలాలు (ఫౌంటెన్ పెన్నులు కావు) ఉన్న పొట్టి డస్కు పెట్టె, ఒక మూల టిక్కుటిక్కుమనే పాత గడియారం ఉన్నాయి. శాంతి, భక్తి ప్రభలు సర్వత్ర వ్యాప్తమై ఉన్నాయి. గహ్వర సదృశమైన బోసి నోటితో గాంధీగారు సమ్మోహకరమైన చిరునవ్వు చిందిస్తున్నారు.

"చాలా ఏళ్ళ కిందట, నా ఉత్తర ప్రత్యుత్తరాల పని చూసుకోడానికి వ్యవధి కోసం, వారానికి ఒకరోజు మౌనం పాటించడం ప్రారంభించాను. కాని ఇప్పుడు, ఆ ఇరవై నాలుగు గంటలూ ప్రధాన ఆధ్యాత్మిక అవసరంగా పరిణమించాయి. నియత కాలికమైన మౌనం ఒక భాగ్యమే కాని చిత్రహింస కాదు." అని వివరించా రాయన.

నేను మనసారా అంగీకరించాను.* మహాత్ములు నన్ను అమెరికా గురించి, యూరప్ గురించి అడిగారు; భారతదేశాన్ని గురించి, ప్రపంచ పరిస్థితుల గురించి మేము చర్చించుకున్నాం.

"మహాదేవ్," శ్రీ దేశాయి గదిలో అడుగుపెడుతూ ఉండగా గాంధీగారు అన్నారు, "స్వామీజీ రేపు రాత్రి యోగాన్ని గురించి మాట్లాడ్డానికి టౌన్ హాల్లో ఏర్పాట్లు చేయించండి."

ఆ రాత్రికి నేను మహాత్ముల దగ్గర సెలవు తీసుకుంటూ ఉండగా ఆయన, ముందు చూపుతో, సిట్రోనెల్లా ఆయిల్ [ఒక రకం గడ్డి నూనె] సీసా ఒకటి నా చేతికి ఇచ్చారు.

"వార్ధా దోమలకి అహింస† సంగతేదీ తెలియదు స్వామీజీ?" అన్నారాయన, నవ్వుతూ.

మర్నాడు పొద్దున మేము తేనె పానకమూ పాలూ కలిపిన గోధుమ జావ తాగాం. గాంధీగారితోనూ సత్యాగ్రహులతోనూ భోజనానికి రమ్మని పదిన్నరకి మమ్మల్ని ఆశ్రమం వసారాలోకి పిలిచారు. ఈ రోజు వంటకాల్లో ఎర్రబియ్యం, కొత్తగా ఎంపికచేసిన కూరగాయలు, ఏలక్కాయ గింజలు కూడా ఉన్నాయి.

---

* నేను అమెరికాలో చాలా సంవత్సరాలనుంచి మౌనసమయాలు పాటిస్తూ నన్ను కలుసు కోడానికి వచ్చేవాళ్ళకూ నా కార్యదర్శులకూ వెరపు కలిగిస్తూ వచ్చాను.

† హాని చెయ్యకపోవడం గాంధీజీ జీవిత తత్త్వానికిది పునాది. అహింసను మూల గుణంగా మన్నించే జైనుల వల్ల ఆయన గాఢంగా ప్రభావితులయారు. హిందూ మతంలో ఒక శాఖ అయిన జైనమతాన్ని బుద్ధుడి సమకాలికుడైన మహావీరుడు, క్రీ.పూ 6 వ శతాబ్దిలో విస్తృతంగా వ్యాప్తి చేశాడు. మహావీరుడు ("గొప్ప నాయకుడు") అనేక యుగాల తరవాత వచ్చిన, తన వీరపుత్రులైన గాంధీగారిని చూచుగాక!

మధ్యాహ్నం ఆశ్రమ ప్రదేశంలో తిరిగాను. కొన్ని ఆవులు వదురూ బెదురూ లేకుండా మేత మేస్తున్న మైదానం వరకు తిరిగాను. గోరక్షణ అంటే గాంధీగారికి గాఢమైన ఆసక్తి.

"ఆవు అనేది నా దృష్టిలో, మానవులకన్న తక్కువ స్థాయిలో ఉన్న మొత్తం జంతు ప్రపంచం కింద లెక్క; మానవుడి సహానుభూతులను మానవేతరాలకు కూడా విస్తరింపజేస్తుందది," అని వివరించారు మహాత్ములు. "బతికే ప్రతి జీవిలోనూ తనను చూసుకోడానికి మానవుడు గోవును పూజించాలని పెద్దల ఆదేశం. సనాతన ఋషులు గోవును దైవసమానంగా భావించడం సహజమే. భారతదేశంలో మనిషికి ఆవు మంచి తోడు; అది సర్వసంపత్ప్రదాత్రి, అది పాలివ్వడమే కాకుండా, సేద్యానికి కూడా ఉపయోగపడుతోంది. గోవు కరుణ రసాత్మక కావ్యం; ఆ సాధుజంతువులో కరుణే కళ్ళకి కడుతుంది. మానవ జాతిలో లక్షలాది మందికి రెండో తల్లి అది. గోరక్షణ చేయడమంటే, భగవంతుడు సృష్టించిన మూగజీవాలన్నిటికీ రక్షణ ఇవ్వడమన్నమాట. సృష్టిలో నిమ్న శ్రేణివి నోరులేనివి కనక, వాటి అభ్యర్థన ఇంకా శక్తిమంతంగా ఉంటుంది."

వేలాది విషయాలమీద గాంధీజీ చక్కగా రాశారు. ప్రార్థన గురించి ఆయన ఇలా అన్నారు : "దేవుడి సహాయం లేకపోతే మనం ఎంత నిస్సహాయులమో మనకి ప్రార్థన జ్ఞాపకం చేస్తుంది. ప్రార్థన లేకపోతే ఏ ప్రయత్నమూ పూర్తి అయినట్టు కాదు; మనిషి చేసే అతిమంచి ప్రయత్నం కూడా వెనకాల భగవంతుని ఆశీస్సుగనక లేకపోతే ఎందుకూ పనికిరానిదని ఖచ్చితంగా గుర్తించాలి. మనం వినయంగా ఉండాలని సూచిస్తుంది ప్రార్థన. ఆత్మశుద్ధికి, అంతశ్శోధనకూ అది పిలుపు."

నైష్ఠిక హిందువుకు కొన్ని నిత్యకర్మలు విధించి ఉన్నాయి. ఒకటి 'భూత యజ్ఞం'; అంటే పశువులకు మేత పెట్టడం. సృష్టిలో అల్పమైన అపరిణత జీవుల పట్ల మనిషి తనకున్న బాధ్యతల్ని గ్రహించుకోవాలన్న దానికి ఇది ప్రతీక; ఆ అల్ప-పరిణత జీవరూపాలు, సహజాతపరంగా దేహస్పృహకు ముడిపడి ఉన్నవి. ఈ దేహస్పృహ-మాయ మానవుణ్ణి కూడా బాధిస్తుంది. అయితే అల్పపరిణత జీవ రూపాలకు, మానవజాతికి విశిష్టమైన ముక్తిదాయక 'వివేక' లక్షణం లేదు.

ఏ విధంగా మానవుడు ఉచ్చతర అదృశ్యజీవుల అసంఖ్యాక శుభాశీస్సుల వల్ల ఊరట పొందుతున్నాడో, అదే విధంగా దుర్బల జీవుల్ని ఆదుకోడానికి అతనిలోని సంసిద్ధతకు బలం చేకూరుస్తుంది భూతయజ్ఞం. అంతేకాకుండా, భూమిలోనూ సముద్రంలోనూ ఆకాశంలోనూ విచ్చలవిడిగా వ్యర్థమయిపోతున్న ప్రకృతి వరప్రసాదాల్ని పునరుజ్జీవింపజేయవలసిన బాధ్యత కూడా మానవుడి మీద ఉంది. ఆ విధంగా ప్రకృతికీ జంతువులకీ మనిషికీ సూక్ష్మలోక దేవతలకీ మధ్యనుండే

సంభావనారాహిత్యమనే పరిణామాత్మక అవరోధాన్ని విశ్వజ్ఞ ప్రేమతో చేసే నిత్య యజ్ఞాల ద్వారా దాటడం జరుగుతుంది.

మరో రెండు దైనిక యజ్ఞాలు - "పితృయజ్ఞం, నృయజ్ఞం." పితృయజ్ఞం, పితృదేవతలకు తర్పణాలు ఇవ్వడం. మానవుడు, నేటి మానవజాతి జీవనాన్ని దీప్తిమంతం చేసే జ్ఞానాన్ని ప్రసాదించిన గత తరాలకు తాను ఋణపడి ఉన్నానన్న సంగతి అంగీకరించడానికి చిహ్నమది. నృయజ్ఞం అంటే, ఆగంతకులకు గాని బీదవాళ్ళకుగాని అన్నం పెట్టడం. మానవుల విషయంలో ఇప్పుడు తనకున్న బాధ్యతలకూ సమకాలికుల విషయంలో తనకున్న విధులకూ అది చిహ్నం.

మధ్యాహ్నం పూట, చిన్నచిన్న అమ్మాయిలకోసం ఏర్పాటుచేసిన గాంధీగారి ఆశ్రమానికి వెళ్ళి నృయజ్ఞం చేశాను. శ్రీ రైట్ నాతోబాటు వచ్చాడు. కారులో పదినిమిషాల ప్రయాణం. పొడుగాటి వన్నెవన్నెల చీరలకు పైన కుసుమకోమల మైన కన్నెపిల్లల ముఖాలు! ఆరుబయట కొద్దిసేపు నేను హిందీలో ప్రసంగించాను. ప్రసంగం చివరిలో ఆకాశం చిల్లులు పడ్డట్టు దబ్బాటుగా వాన కురిసింది. నవ్వుకుంటూ నేనూ శ్రీరైట్ కారెక్కి 'వెండి రేకు'ల మధ్యగా కారు నడుపుకుంటూ మగన్‌వాడి వైపు జోరుగా సాగిపోయాం. ఉష్ణదేశపు వాన తీరూ, జోరూ అటు వంటివి!

మళ్ళీ అతిథిగృహంలో అడుగుపెడుతూ అక్కడి నిరాడంబరతా, ఆత్మ త్యాగానికి నిదర్శనాలూ చూసి, మళ్ళీ మరోమారు కొత్తగా విస్మయం చెందాను. గాంధీగారి 'అపరిగ్రహ ప్రతిజ్ఞ,' దాంపత్య జీవితంలో తొలికాలంలోనే ఆచరణ లోకి వచ్చింది. ఏడాదికి 60,000 రూపాయలకుపైగా ఆదాయం వచ్చే విస్తారమైన వకీలు వృత్తిని విడిచిపెట్టి మహాత్ములు, తమ సంపదను పేదవాళ్ళకు ఇచ్చేశారు.

త్యాగాన్ని గురించి సామాన్యంగా ఉండే అసమగ్రమైన అభిప్రాయాల్ని శ్రీ యుక్తేశ్వర్‌గారు సున్నితంగా వేళాకోళం చేస్తూ ఉండేవారు:

"బిచ్చగాడు సంపద ఏమీ త్యాగం చెయ్యలేడు," అనేవారు ఆయన. "'నా వ్యాపారం పడిపోయింది; నా పెళ్ళాం వదిలేసింది; నేను అన్నీ త్యాగం చేసేసి సన్యాసుల మఠానికి వెళ్ళిపోతాను,' అంటూ ఎవరయినా విలపిస్తున్నా రంటే, అతను చెబుతున్నది ఏ లౌకిక త్యాగం గురించి? సంపదనూ ప్రేమనూ అతనేమీ విడిచి పెట్టలేదు. అవే అతన్ని విడిచిపెట్టేశాయి!"

అందుకు భిన్నంగా, గాంధీగారిలాంటి సాధువులు, స్పష్టంగా భౌతికవస్తు త్యాగాలు చెయ్యడమే కాకుండా, తమ అంతరాంతర జీవిని సర్వమానవ వాహినిలో లీనంచేసి, అంతకన్న కష్టమైన స్వార్థబుద్ధినీ వ్యక్తిగత లక్ష్యాన్నీ త్యాగం చేశారు.

మహాత్ముల ధర్మపత్ని కస్తూరిబాయి. ఈమె విశిష్టురాలు. తన కోసం పిల్లలకోసం ఆయన తమ ఆస్తిలో భాగమేదీ కేటాయించి పెట్టనందుకు ఆమె ఆక్షేపించలేదు. చిన్నతనంలోనే పెళ్ళి అయిన గాంధీగారూ భార్యా నలుగురు కొడుకులు పుట్టిన తరవాత బ్రహ్మచర్యవ్రతం ప్రారంభించారు.* వారి దాంపత్య జీవనం ఒక గంభీరమైన రూపకం; అందులో ప్రశాంతనాయిక అయిన కస్తూరి బాయి, భర్త అడుగుజాడల్లో నడిచి జైలుకు వెళ్ళారు; మూడు వారాలపాటు ఆయన ఉపవాసాలు చేసినప్పుడు ఆమె కూడా చేశారు. ఆయన వహించే లెక్కలేనన్ని బాధ్యతల్లో ఆమె తమవంతు పూర్తిగా వహించారు. గాంధీగారికి ఆవిడ ఈ విధంగా జోహార్లు అర్పించారు :

> 'మీ యావజ్జీవిత సహచారిణిగా, సహాయకురాలిగా ఉండే మహదవకాశం పొందినందుకు మీకు ధన్యవాదాలు అర్పిస్తున్నాను మన దాంపత్యం కామ వాంఛ మీద కాకుండా, బ్రహ్మచర్యం (ఆత్మ నిగ్రహం) మీద ఆధారపడి ప్రపంచమంతటిలోకీ సర్వశ్రేష్ఠమైన దాంపత్యమయినందుకు మీకు ధన్యవాదాలు అర్పిస్తున్నాను భారతదేశం కోసం మీరు చేపట్టిన జీవిత కృషిలో నన్ను మీకు సమానురాలిగా పరిగణించినందుకు మీకు ధన్యవాదాలు అర్పిస్తు న్నాను జూదంలోనూ పందాల్లోనూ స్త్రీలోలత విషయంలోనూ మద్యపానం లోనూ పాటల్లోనూ తమకాలాన్నంతనీ వెచ్చించేసి, చిన్ననాటి ఆటవస్తువులంటే తొందరగా విసుగెత్తిపోయే చిన్న పిల్లవాడి మాదిరిగా భార్య అన్నా, పిల్లలన్నా విసుగెత్తేసే భర్తల్లో మీరు ఒకరు కానందుకు మీకు ధన్యవాదాలు అర్పిస్తున్నాను. ఇతరుల శ్రమను దోచుకుంటూ, ధాన్యం పండించడానికే తమ కాలాన్ని వినియోగించే భర్తల్లాంటివారు మీరు కానందుకు ఎంతగా ధన్యవాదాలు చెప్పుకోవాలి!

---

* గాంధీగారు, ద స్టోరీ ఆఫ్ మై ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్ అన్న పుస్తకం (అహమ్మదా బాద్ , నవజీవన్ ప్రెస్‌లో రెండు సంపుటాలు 1927 - 28) తమ జీవిత కథను కఠోరమైన నిష్కాపట్యంతో అభివర్ణించారు. ఈ ఆత్మకథ "మహాత్మాగాంధీ, హిజ్ ఓన్ స్టోరీ" గా సంక్షిప్త కరించబడింది సి ఎఫ్ ఆండ్రూస్ దానికి సంపాదకులు· జాన్ హేన్స్ హోమ్స్ దానికి ముందు మాట రాశారు. (న్యూయార్కు, మాక్మిలన్ కంపెనీ, 1930).

ప్రసిద్ధమైన పేర్లతోనూ అద్భుతమైన సంఘటనలతోనూ కిక్కిరిసిపోయే ఆత్మకథలు అనేకం, అంతరంగ విశ్లేషణ విషయంలో కాని, వికాసానికి సంబంధించిన ఏ దశను గురించి కాని, దాదాపు పూర్తిగా మౌనం వహిస్తాయి. "ఈయన చాలామంది ప్రసిద్ధ వ్యక్తుల్ని ఎరిగిన వాడే కాని, తనను తాను ఎన్నడూ తెలుసుకున్నవాడు కాడు," అన్నట్టుగా, ఒక రకమైన అసంతృప్తితో ఈ పుస్తకాలు పక్కకి పెట్టేస్తాడు చదువరి. గాంధీగారి ఆత్మకథ విషయంలో ఇలాటిది జరగడం అసంభవం; ఆయన తమ తప్పుల్నీ తమాషాల్నీ వ్యక్తి ప్రమేయంలేని సత్య సంధతతో బయటపెడతారు; ఏ యుగ చరిత్రలోనయినా ఇలాటిది జరగడం అరుదు

"లంచాలకన్న దేవుడికీ దేశానికీ మీరు అగ్రస్థానం ఇస్తున్నందుకూ మీకు దృఢవిశ్వాసబలం ఉన్నందుకూ భగవంతుడిమీద సంపూర్ణమైన ప్రగాఢ విశ్వాసం ఉన్నందుకూ మీకు ఎన్ని ధన్యవాదాలు చెప్పుకోవాలో! నా కన్న దేవుడికీ దేశానికీ అధిక ప్రాముఖ్యమిచ్చే భర్తకు భార్యనయి నందుకు నేను ఎంతగా ధన్యవాదాలు చెప్పుకోవాలి? మన జీవిత విధానాన్ని మీరు, అంత సంపన్న స్థితినుంచి అంత స్వల్పస్థితికి మారుస్తుంటే నేను సణుక్కొంటూ తిరగబడినప్పుడు, నా కుర్ర తనపు లోపాలకు మీరు ఓర్పు చూపినందుకు మీకు కృతజ్ఞురాలిని.

"చిన్నపిల్లగా ఉన్నప్పుడు నేను మీ తల్లిదండ్రుల ఇంట్లో ఉన్నాను: మీ అమ్మగారు గొప్ప ఉత్తమురాలు: ఆవిడ నాకు చక్కని తర్ఫీదు ఇచ్చారు: ధైర్య సాహసాలుగల భార్య ఎలా ఉండాలో, నాకు భర్త కాబోయే తమ కుమా రుడి ప్రేమనూ గౌరవాన్నీ ఎలా నిలుపుకోవాలో నేర్పారావిడ. ఏళ్ళు గడుస్తూ ఉండగా మీరు భారతదేశానికి అత్యంత ప్రియతమ నాయకులయారు ఇతర దేశాల్లో తరచు జరుగుతుండే మాదిరిగా, భర్త విజయ సోపానాలు ఎక్కినప్పుడు భార్యను విడిచిపెట్టేసే దుఃస్థితి నాకు కలుగుతుందేమోనన్న భయమేమీ లేదు మరణ సమయంలో సైతం మనం ఆలుమగలుగానే ఉంటామన్న సంగతి నాకు తెలుసు."

కస్తూరిబాయి చాలా సంవత్సరాలపాటు, ప్రజాద్రవ్యానికి కోశాధికారిణిగా పనిచేసేది. దైవస్వరూపులుగా ప్రజల మన్నన లందుకున్న మహాత్ములు, కొన్ని కోట్ల రూపాయిలు విరాళాలు సేకరించారు. గాంధీగారి సమావేశానికి వెళ్ళే ఆడవాళ్ళు నగలు పెట్టుకుని వెళ్తే, వాళ్ళ భర్తలకు బెరుకుగా ఉంటుందని భారతీయ గృహాల్లో నవ్వుకుంటూ కథలుకథలుగా చెప్పుకొనేవారు. దళిత జాతి ఉద్ధరణకు శ్రమించే గాంధీమహాత్ముల సమ్మోహక స్వరం, సంపన్నుల బంగారం గాజుల్నీ, వజ్రాలహారాల్నీ ఆకర్షించేసి, వాళ్ళ చేతులనుంచీ మెడల నుంచీ ఊడి చందాల బుట్టలో పడేట్టుచేస్తుంది.

ఒకనాడు, ప్రజానిధికి కోశాధికారిణి అయిన కస్తూరిబాయి, నాలుగు రూపాయిలు ఎలా ఖర్చయాయో లెక్క చెప్పలేకపోయింది. గాంధీగారు, ఆ నిధులకు సంబంధించిన లెక్కలు ఆడిట్ చేయించి ప్రచురిస్తూ, తమ భార్య నిర్వహణలో వచ్చిన నాలుగు రూపాయిల తేడానూ నిర్దాక్షిణ్యంగా ఎత్తి చూపించారు.

నేను ఈ కథ, నా అమెరికన్ విద్యార్థుల క్లాసుల్లో తరచుగా చెప్పేవాణ్ణి. ఒకనాడు సాయంత్రం హాలులో ఒకామె ఆగ్రహావేశంతో ఊగిపోయింది: "మహాత్ముడయేది, కాకపోయేది - ఆయనే కనక నా మొగుడయి ఉంటే - అనవసరంగా

చేసిన అటువంటి బహిరంగమైన అవమానానికి, మొహం మీద ఒక్క గుద్దు గుద్దేదాన్ని!" అంటూ అరిచింది.

అమెరికన్ భార్యలగురించి, భారతీయ భార్యలగురించి మా మధ్య సరదాగా కొంత వాగ్వాదం జరిగిన తరవాత, నేను ఇంకా పూర్తిగా వివరించడానికి పూను కున్నాను.

"గాంధీగారి భార్య, ఆ మహాత్ముణ్ణి తన భర్తగా కాకుండా గురువుగా భావించింది. చాలా చిన్న పొరపాట్లనయినా చక్కదిద్దే హక్కు గురువుకు ఉంది," అని స్పష్టం చేశాను. "కస్తూరిబాయిని బహిరంగంగా మందలించిన కొంత కాలానికి, గాంధీగారికి ఒక రాజకీయ నేరారోపణ మీద జైలుశిక్ష పడింది. ప్రశాంతంగా ఆయన ఆమెకు వీడుకోలు చెబుతూ ఉండగా ఆవిడ, ఆయన పాదాల మీద వాలింది. "గురుదేవా, నేను మిమ్మల్ని ఎప్పుడయినా నొప్పించి ఉంటే నన్ను క్షమించండి," అని ప్రాధేయపడింది.

వార్ధాలో ఆ రోజు మధ్యాహ్నం మూడు గంటలకు నేను, ముందుగా ఏర్పాటు చేసుకున్న కార్యక్రమం ప్రకారం, గాంధీగారి రాతగదిలోకి వెళ్ళాను తన భార్యను శిష్యురాలిగా చేసుకోడమనే అరుదైన అలౌకిక ఘటనను సాధించ గలిగిన సాధువు గాంధీగారు. ఎన్నడూ మరువురాని చిరునవ్వు చిందిస్తూ పైకి చూశారు ఆయన.

"మహాత్మాజీ," అంటూ ఆయన పక్కన, ఉత్తి చాపమీద కూర్చుంటూ, "అహింసకు మీ నిర్వచనమేమిటో చెప్పండి," అన్నాను.

"మనస్సులో కాని, చేతలో కాని ఏ జీవికీ హాని చెయ్యకుండా ఉండడం."

"చక్కని ఆదర్శమే! కాని, ఒక పిల్లవాణ్ణి కాపాడడానికో, తనని కాపాడు కోడానికో తాచుపామును చంపకూడదా - అని ప్రపంచం ఎప్పుడూ అడుగుతూ ఉంటుంది."

"నిర్భయం, అహింస అన్న నా ప్రతిజ్ఞల్లో రెండింటిని ఉల్లంఘించకుండా నేను తాచుపామును చంపలేను. అంతకంటె, ప్రేమ ప్రకంపనలో ఆ పామును శాంతపరచడానికి మానసికంగా ప్రయత్నిస్తాను. నా పరిస్థితులకు అనుగుణంగా ఉండాలి కదా అని, నేను నా ప్రమాణాల్ని దిగజార్చలేను." తమకు సహజమైన చిత్తశుద్ధితో గాంధీగారు ఇంకా ఇలా అన్నారు, "ఏ మాట కా మాటే చెప్పుకోవాలి - ఒక తాచుపామే కనక ఎదురయితే నేను నిబ్బరంగా ఇలా కబుర్లు చెప్పలేను!"

పథ్యం గురించి ఇటీవలే వెలువడ్డ పాశ్చాత్య గ్రంథాలు కొన్ని ఆయన బల్ల మీద ఉన్నాయి; నేను వాటిని గురించి వ్యాఖ్యానించాను.

"ఆహారం విషయం అన్నది ప్రతిచోటా ఎంత ముఖ్యమో సత్యాగ్రహోద్యమంలో కూడా అంత ముఖ్యం." అని ముసిముసిగా నవ్వుతూ అన్నారాయన. "సత్యాగ్రహులకు సంపూర్ణమైన నిగ్రహం ఉండాలని చెప్పేవాణ్ణి కనక, బ్రహ్మచారికి (బ్రహ్మచర్యం పాటించేవారికి) తగిన ఉత్తమ ఆహారం ఏమిటో కనుక్కోవడానికి ఎప్పుడూ ప్రయత్నిస్తూనే ఉన్నాను. ప్రజననకారక వికారాల్ని అదుపులో పెట్టుకోడానికి ముందు జిహ్వను జయించాలి. అర్ధాకలిగా ఉండడం కాని, అసమతుల ఆహారం తీసుకోడం కాని దానికి ఉపాయం కాదు. తిండికోసం లోపల ఉండే ఆత్రాన్ని మొదట జయించి ఆ తరవాత, అవసరమైన విటమిన్లు ఖనిజాలూ కేలరీలూ మొదలయినవన్నీ ఉండే సాత్త్విక ఆహారం తింటూ ఉండాలి సత్యాగ్రహి. ఆహారానికి సంబంధించిన బాహ్యాంతర జ్ఞానంవల్ల సత్యాగ్రహి శుక్లం, ఒంటికంతటికీ పనికివచ్చే జీవశక్తిగా ఇట్టే మారుతుంది."

మాంసానికి బదులుగా తినదగ్గ మంచి ఆహారపదార్థాల గురించి మాకు తెలిసిన సంగతులు తులనాత్మకంగా ముచ్చటించుకున్నాం, గాంధీగారూ నేనూ. "అవొకేడో (avocado) అద్భుతమైంది," అన్నాను నేను. "కాలిఫోర్నియాలో మా కేంద్రానికి దగ్గర, అవొకేడో తోపులు లెక్కలేనన్ని ఉన్నాయి."

గాంధీగారి ముఖంలో ఆసక్తి కనబడింది. "అవి వార్ధాలో పెరిగితే బాగుం డును. సత్యాగ్రహులు కొత్త ఆహారాన్ని మెచ్చుకుంటారు."

"లాస్ ఏంజిలిస్ నుంచి అవొకేడో మొక్కలు కొన్ని తప్పకుండా వార్ధాకు పంపిస్తాను," అని చెప్పి "గుడ్లు, మాంసకృత్తులు (ప్రోటీన్లు) ఎక్కువగా ఉండే ఆహారం; ఇవి సత్యాగ్రహులకు నిషిద్ధమైనవా?"

"బీజంలేని గుడ్లు నిషిద్ధం కావు," అంటూ, వెనకటి సంగతులు తలుచు కుని నవ్వుకున్నారు మహాత్ములు.

"చాలా ఏళ్ళు, నేను వాటి వాడుకను సమ్మతించలేదు. ఇప్పటికీ నేనయితే తినను. మా కోడళ్ళలో ఒక అమ్మాయి ఒకసారి, పోషకాహార లోపంవల్ల ప్రాణం పోయే స్థితికి వచ్చింది; ఆమె గుడ్లు తిని తీరాలని పట్టుపట్టాడు డాక్టరు. నేను ఒప్పుకోలేదు. దాని బదులు మరోటి చెప్పమన్నాను.

" 'గాంధీజీ, బీజంలేని గుడ్లలో శుక్లం ఉండదు; అందులో హింస ఏమీ ఉండదు,' అన్నాడాయన.

"అప్పుడు నేను సంతోషంగా అనుమతించాను. మా కోడలు ఆ గుడ్లు తినడానికి; తొందరగానే ఆమెకు మామూలు ఆరోగ్యం చేకూరింది."

అంతకుముందు రోజున గాంధీగారు, లాహిరీ మహాశయుల క్రియా యోగ దీక్ష తీసుకోవాలన్న కోరిక వెల్లడించారు. ఆయన చిత్తశుద్ధికీ జిజ్ఞాసాప్రవృత్తికీ నేను ముగ్ధుణ్ణి అయాను. దైవాన్వేషణ విషయంలో ఆయన చిన్నపిల్లవాడి మోస్తరు: "అలాటి వాళ్ళదే స్వర్గరాజ్యం," అంటూ ఏసుక్రీస్తు, పిల్లల్ని ప్రశంసించాడు - గాంధీగారిలో అటువంటి పరిశుద్ధ గ్రాహకత వెల్లడి అయింది.

నేను మాట ఇచ్చిన దీక్షాసమయం వచ్చింది. కొందరు సత్యాగ్రహులు - క్రియాయోగ దీక్ష తీసుకోదలిచిన శ్రీ దేశాయి, డా పింగళే మరికొందరు - గదిలోకి వచ్చారు.

నేను మొదట, ఆ చిన్న తరగతికి, శారీరకమైన యోగదా అభ్యాసాలు నేర్పాను. శరీరం ఇరవై భాగాలుగా ఉన్న సంగతి ఆంతరికంగా దర్శిస్తాం; ప్రతి భాగంలోకీ శక్తి వెళ్ళేటట్టుగా, సంకల్పం దాన్ని నిర్దేశిస్తుంది. కాస్సేపట్లోనే, నా ఎదుట ప్రతి ఒక్కరూ స్వయంచలన మానవయంత్రంలా ప్రకంపించడం చూశాను. గాంధీగారి శరీరంలో ఇరవై భాగాల్లోనూ ప్రకంపన ఫలితాన్ని చూడడం సులువే; చూసేవాళ్ళకి, ఆయన శరీర భాగాలు ఎప్పుడూ పైకి కనిపిస్తూనే ఉంటాయి! ఆయన చాలా సన్నగా ఉన్నా, వికార మనిపించేటంత బక్కగా ఉండరు; ఆయన ఒంటి మీది చర్మం నున్నగా, ముడతలు లేకుండా ఉంటుంది.*

తరవాత నేను, వాళ్ళకి ముక్తిదాయకమైన "క్రియాయోగ" ప్రక్రియ ఉపదేశించాను.

మహాత్ములు ప్రపంచమతాలన్నిటినీ శ్రద్ధాసక్తులతో అధ్యయనం చేశారు. జైనగ్రంథాలు, బైబిలు కొత్త నిబంధన గ్రంథం, టాల్‌స్టాయ్ సమాజ శాస్త్రీయ రచనలు - గాంధీగారి అహింసా సిద్ధాంతపరమైన దృఢవిశ్వాసాలకు ప్రధానమైన ఆధారాలు† ఈ మూడూ. ఆయన తమ అభిమతాన్ని ఇలా వ్యక్తం చేశారు:

> "బైబిలు కొరాను, జెండ్-అవెస్తా‡ అన్నవి వేదాలలాగే దైవప్రేరితాలేనని నమ్ముతాను; గురు సంప్రదాయాన్ని విశ్వసిస్తాను. కాని ఈ కాలంలో అనేక లక్షలమంది గురువు లేకుండానే పోవలిసి వస్తోంది. దానికి కారణం, పరిపూర్ణ పరిశుద్ధతా, పరిపూర్ణ విద్వత్తూ - రెండూ ఉన్నవారు చాలా అరుదైపోవడం. కాని ఎవరూ, తమ మతానికి

* గాంధీగారు, చిన్నవీ పెద్దవీ కూడా, చాలా ఉపవాసాలు చేశారు. ఆయన ఆరోగ్యం చాలా మంచిది. డయట్ అండ్ డయట్ రిఫార్మ్; నేచర్ క్యూర్; కీ టు హెల్త్ అన్న ఆయన పుస్తకాలు, భారతదేశంలో అహ్మదాబాదులో నవజీవన్ పబ్లిషింగ్ హౌస్ వాళ్ళ దగ్గర దొరుకుతాయి.

† థోరో, రస్కిన్, మాజినీ అన్న ఇతర పాశ్చాత్య రచయితల గ్రంథాల్ని కూడా గాంధీగారు విశితంగా అధ్యయనం చేశారు.

‡ క్రీ.పూ. సుమారు 1000లో జొరాస్టర్ పర్షియాకు ప్రసాదించిన పవిత్ర గ్రంథం.

సంబంధించిన సత్యాన్ని ఎప్పటికీ తెలుసుకోలేకపోతున్నామని నిరాశపడక్కర్లేదు. ఎంచేతంటే, తక్కిన గొప్ప మతాలన్నిటిలోని మౌలికాంశాలలాగే హిందూమత మౌలికాంశాలు కూడా మార్పు చెయ్యరానివీ సులువుగా తెలుసుకోగలిగినవీ

"ప్రతి హిందువులాగే నేనూ దేవుణ్ణి నమ్ముతాను ఆయన ఒక్కడేననీ నమ్ముతాను.పునర్జన్మ మోక్షం ఉన్నాయని నమ్ముతాను .... హిందూమతం మీద నాకున్న అభిప్రాయాల్ని గురించి, నా భార్యమీద నా కున్న అభిప్రాయాల్ని గురించి చెప్పగలిగిన దానికంటె ఎక్కువ చెప్పలేను. ప్రపంచంలో ఏ ఆడదీ స్పందింపజెయ్యలేనంతగా, ఆవిడ నన్ను స్పందింప జేస్తుంది అలాగని, ఆవిడ తప్పు లేవీ చెయ్యదని కాదు; నేను గమనించగలిగిన వాటికంటె ఎక్కువ లోపాలే ఆవిడలో ఉన్నాయని నేను తెగించి చెబుతాను. కాని తెగరాని బంధం ఒకటి ఉంది. అలాగే హిందూమతంలో లోపాలూ పరిమితులూ ఎన్ని ఉన్నప్పటికీ, అదంటే నేను స్పందిస్తాను. భగవద్గీత, తులసీదాసు రామాయణం కంటె ఇతరమైనదేదీ నన్ను ఆనందపరచలేదు. మొన్నొకసారి నేను తుది శ్వాస విడుస్తున్నానని భావించినప్పుడు, నాకు గీతే ఊరట కలిగించింది.

"హిందూ మతం ఒంటెత్తు మతం కాదు. ప్రపంచ ప్రవక్తలందరినీ పూజించడానికి అవకాశం దాంట్లో ఉంది * సామాన్యార్థంలో అది, ప్రచారక మతం కాదు. అది చాలా తెగల్ని తనలో లీనం చేసుకుం దవడంలో సందేహం లేదు; కాని ఈ లీనం చేసుకోడమన్నది పరిణా మాత్మకంగానూ అగోచరం గానూ జరిగింది. ప్రతి ఒక్కడూ తన విశ్వాసాన్నిబట్టి, లేదా ధర్మాన్ని†బట్టి దేవుణ్ణి కొలవాలని చెబుతూ, తద్వారా అన్ని మతాలతోనూ శాంతియుత సహజీవనం చేస్తుంది."

---

* ప్రపంచమతాల్లో హిందూమతం విశిష్టత ఏమిటంటే, అది ఎవరో ఒక గొప్ప వ్యవస్థాపకుడు ఏర్పరిచింది కాక, వ్యక్తి ప్రమేయంలేని వైదిక గ్రంథాల ద్వారా ఆవిర్భవించింది. ఆ విధంగా హిందూమతం అన్ని కాలాల అన్ని దేశాల ప్రవక్తల్నీ పూజ్యభావంతో కలుపుకోడానికి అవకాశమిస్తుంది పవిత్ర వేదగ్రంథాలు, మానవుడు చేసే ప్రతి పనికీ దైవనియమంతో సామరస్యం కలిగించే ప్రయత్నంలో సాధనాభ్యాసాలనే కాకుండా ముఖ్యమైన సాంఘికాచారాల్ని అన్నిటినీ కూడా క్రమబద్ధం చేస్తాయి

† నియమ (న్యాయ) పదం కన్న సమగ్రమైన సంస్కృత పదం; నియమానికి, లేదా స్వాభావిక ఋజువర్తనకు కట్టుబడి ఉండడం; ఏ ఒక సమయంలో నయినా మనిషి ఉండే పరిస్థితుల్లో, అతనికి సహజమైన కర్తవ్యం. మానవుడు పతనంనుంచి, బాధనుంచి తనను కాపాడుకోడానికి తోడ్పడే స్వాభావిక నియమ సముదాయమని, పవిత్ర గ్రంథాలు ధర్మాన్ని నిర్వచించాయి.

క్రీస్తుగురించి గాంధీగారు ఇలా రాశారు : "ఆయన కనక ఇప్పుడు మనుషుల మధ్య నివసిస్తూ ఉండి ఉంటే, ఆయన, 'నన్ను, ప్రభూ, ప్రభూ... అంటూ పిలిచే ప్రతి వాళ్ళూ కాక, నా తండ్రి ఇచ్ఛానుసారంగా నడుచుకొనేవాడు మాత్రమే,'* అని రాసినట్టు గానే, బహుశా తన పేరు కూడా ఎన్నడూ విని ఉండని అనేకమంది జీవితాల్ని దీవించి ఉండేవాడని నాదృఢవిశ్వాసం. ఏసుక్రీస్తు, తన జీవితం ద్వారా నేర్పిన పాఠంలో మహత్తర ప్రయోజనాన్నీ ఏకైక లక్ష్యాన్నీ మానవజాతికి తెలియ జేశాడు; మన మందరం ఆశించి ఉండవలసిన మహదాశయ మిది; ఆయన ఒక్క క్రైస్తవమతానికే కాదు, యావత్ప్రపంచానికీ సర్వదేశాలకూ సర్వ జాతులకూ చెందిన వాడని నా విశ్వాసం."

వార్ధాలో నే నున్న చివరి రోజు సాయంత్రం, టౌనుహాలులో శ్రీ దేశాయి ఏర్పాటుచేసిన సమావేశంలో ప్రసంగించాను. యోగశాస్త్రాన్ని గురించి నే నిచ్చే ఉపన్యాసం వినడానికి వచ్చిన జనం, సుమారు 400 మంది, ఆ గదిలో కిటికీల్లో కూడా కిక్కిరిసిపోయారు. నేను మొదట హిందీలోనూ తరవాత ఇంగ్లీషులోనూ ప్రసంగించాను. నిద్రపోవడానికి ముందు, మహాత్ముల దర్శనంకోసం మేము సకాలంలో ఆశ్రమానికి తిరిగి వచ్చాం; ఆయన ఆ సమయంలో ప్రశాంతంగా కూర్చుని ఉత్తర ప్రత్యుత్తరాలు చూసుకుంటున్నారు.

పొద్దుట అయిదు గంటలకు నేను నిద్ర లేచేసరికి, చీకటి ఇంకా తచ్చాడు తూనే ఉంది. పల్లె బతుకులో అప్పుడే కదలిక మొదలయింది; మొదట ఆశ్రమం గేటుదగ్గర ఒక ఎద్దుబండి, ఆ తరవాత నెత్తిమీద పెద్ద బరువు మోస్తున్న ఒక రైతును చూశాను. పొద్దుటి ఫలహారం అయిన తరవాత మేము ముగ్గురం, గాంధీగారి దగ్గర సెలవు తీసుకుంటూ ప్రణామాలు అర్పించడానికి వెళ్ళాం. ఆ సాధువు ఉదయ ప్రార్థనకు నాలుగు గంటలకే లేస్తారు.

"మహాత్మాజీ, సెలవు!" ఆయన పాదాలు ముట్టుకోడానికి నేను ముందుకు వంగాను.' "మీ సంరక్షణలో భారతదేశం క్షేమంగా ఉంది."

మనోహరమైన మా వార్ధా యాత్ర ముగిసిన తరవాత కొన్నేళ్ళు గడిచి పోయాయి. భూమి, మహాసముద్రాలు, ఆకాశం, యుద్ధంలో మునిగిన ప్రపంచంతో మలినమైపోయాయి. ప్రపంచ మహానాయకుల్లో గాంధీగారొక్కరే ఆయుధ బలానికి బదులుగా, ఆచరణానుకూలమైన అహింసను ప్రత్యామ్నాయంగా ప్రసాదించారు. కష్టనష్టాల్ని తీర్చడానికీ అన్యాయాల్ని తొలగించడానికీ గాంధీ మహాత్ములు అహింసా సాధనాల్ని చేబట్టారు. అవి ఎంత ఫలదాయకమైనవో పదేపదే నిరూపించు

* మత్తయి 7.21.

కున్నాయి. ఆయన తమ సిద్ధాంతాన్ని కిందిమాటల్లో చెప్పారు:

> "వినాశానికి నడుమ జీవితం కొనసాగుతూండడం చూశాను. కాబట్టి వినాశంకంటె పరమధర్మం ఒకటి ఉండితీరాలి. ఒక్క ఆ ధర్మంలో సువ్యవస్థితమైన సమాజమే అవగాహనకు అందుతుంది. జీవితం జీవన యోగ్యమవు తుంది.
>
> "జీవితధర్మం అదే అయినట్లయితే, మనం దాన్ని నిత్యజీవితంలో అమలులో పెట్టాలి యుద్ధాలు ఎక్కడ ఉంటే అక్కడ ప్రత్యర్థి ఎక్కడ ఎదురయితే అక్కడ మనం ప్రేమతో జయించాలి. ఒకానొక ప్రేమ సూత్రం నా జీవితంలోనే, విధ్వంస సూత్రం అందించనంత ఫలితాన్ని అందించింది.
>
> "భారతదేశంలో మనకు, ఈ సూత్రం పనిచెయ్యడం అత్యంత విశాల స్థాయిలో కళ్ళకు కట్టింది. అహింస 36 00 00 000 మందిలోకీ చొచ్చుకు పోయిందని నేను అనను; కాని అత్యంత స్వల్పకాలంలో ఏ ఇతర సిద్ధాంతమూ చొచ్చుకుపోనంతగా ఇది చొరబారిందని తప్ప కుండా చెబుతాను.
>
> "అహింసాత్మక మనఃస్థితి సాధించడానికి చాలా శ్రమతో కూడా శిక్షణ అవసరమవుతుంది సైనికుడి జీవితంలాగే అది. క్రమశిక్షణతో కూడిన జీవితం. మనోవాక్కాయాలు సరయిన సమన్వయం పొంది ఉన్నప్పుడే పరిపూర్ణ స్థితిని అందుకోడం జరుగుతుంది. సత్యాహింసల నియమాన్ని మన జీవితధర్మంగా చేసుకోవాలని నిర్ధారణ చేసుకుంటే, ప్రతి సమస్యా పరిష్కారానికి లొంగుతుంది."

ఆధ్యాత్మిక దృష్టి లేకపోతే ప్రజలు నశించిపోతారన్న సత్యాన్ని, భయంకరమైన ప్రపంచ రాజకీయ సంఘటనల పరంపర, నిర్దాక్షిణ్యంగా చూపిస్తోంది. మతం కాకపోతే విజ్ఞానశాస్త్రం, మానవజాతిలో భద్రతా రాహిత్యజ్ఞాన లేశాన్నీ సమస్త భౌతిక వస్తువుల అశాశ్వతత్వాన్నీ జాగృతం చేసింది. మానవుడిప్పుడు, అంతర్నిహితమైన తన మూలతత్త్వం దగ్గరికి - అంటే తనలో ఉన్న పరమాత్మ దగ్గరికి - కాకపోతే, నిజంగా మరెక్కడికి పోతాడు?

చరిత్ర తిరగేసినట్లయితే, మానవుడి సమస్యలేవీ పాశవిక శక్తిని ఉపయోగించడంవల్ల పరిష్కారం కాలేదని సహేతుకంగా ఎవరయినా చెప్పవచ్చు. మొదటి ప్రపంచయుద్ధం, దురంత భయానక కర్మను సృష్టించింది; అది రెండో ప్రపంచ యుద్ధంగా పరిణమించింది. ఇప్పటి దుష్కర్మ అనే పెద్ద మంచుగడ్డను కరిగించ గలిగింది, సోదరభావమనే ఎండవేడి మాత్రమే; లేనినాడు, అది మూడో ప్రపంచ యుద్ధంగా మారవచ్చు. ఇరవయ్యో శతాబ్దిలో అమంగళత్రయం! వివాదాల్ని పరిష్కారం చెయ్యడంలో మానవ వివేకానికి బదులుగా ఆటవిక తర్కాన్ని ఉపయో

గించినట్లయితే భూమిమీద మళ్ళీ ఆటవికతను సృష్టించినట్టే. జీవితంలో సోదరులు కాకపోతే, భయానక మృత్యువులోనే సోదరులవుతారు వాళ్ళు. అణుశక్తుల్ని కనిపెట్టడానికి దైవం, ప్రేమతో మనిషిని అనుమతించింది అటువంటి అవమానం తెచ్చుకోడానికి కాదు.

యుద్ధమూ నేరమూ ఎన్నడూ లాభించవు. విస్ఫోటక శూన్యత అనే పొగలోకి పోయిన కోట్లకొద్దీ డాలర్లు, ఒక కొత్త ప్రపంచాన్ని - రోగమన్నది దాదాపు లేకుండా, పేదరికం అసలే లేకుండా ఉండే ప్రపంచాన్నిరూపొందించడానికి సరిపోయి ఉండేవి. భయం, సంక్షోభం, కరువు, మహామారి విలయ తాండవం చేసే ప్రపంచం కాదు నెలకొనవలసింది; శాంతి, సౌభాగ్యం, విస్తరించే జ్ఞానం ఉండే విశాల ప్రపంచం.

గాంధీగారి అహింసావాణి, మానవుడి అత్యున్నత చేతనను స్పృశిస్తుంది. దేశాలు ఇకముందు మైత్రి ఏర్పరచుకోవలసినది చావుతోకాదు, బతుకుతో; నాశనంతో కాదు, నిర్మాణంతో; ద్వేషంతో కాదు, ప్రేమమయమైన సృజన శీలక అద్భుత చర్యలతో.

"ఎవరయినా హాని కలిగించినప్పుడు క్షమించాలి," అంటుంది మహాభారతం. "మానవుడు క్షమిస్తూ ఉండడంవల్లనే మానవజాతి మనుగడ సాగుతోందని చెప్పారు క్షమించడం పవిత్రత; క్షమవల్లనే విశ్వం సుసంఘటితమై ఉంది. క్షమ బలవంతుల బలం; క్షమ త్యాగం, క్షమ మనశ్శాంతి. క్షమ, సాధు స్వభావం ఆత్మ సంయమం గలవాళ్ళ గుణాలు. అవి శాశ్వత సద్గుణానికి చిహ్నాలు."

క్షమా-ప్రేమల ధర్మంలోంచి సహజంగా పుట్టిందే అహింస. ధర్మ యుద్ధంలో ప్రాణనష్టమే అవసరమయితే, జీసస్ మాదిరిగా, తన రక్తం ధారపొయ్యడానికి సిద్ధంగా ఉండాలి కాని, ఇతరుల రక్తం పారించడానికి కాదు," అని కంఠోక్తిగా చెప్పారు గాంధీగారు. "తత్ఫలితంగా, ప్రపంచంలో రక్తం చిందడం క్రమంగా తగ్గుతుంది."

ప్రేమతో ద్వేషానికీ, అహింసతో హింసకూ తట్టుకొని, ఆయుధాలు ధరించడం కంటె, నిర్దాక్షిణ్యంగా జరిగే ఊచకోతకు సిద్ధపడిన భారతీయ సత్యాగ్రహుల గురించి ఎప్పుడో ఒకనాడు మహేతిహాస గ్రంథాలు వెలువడకపోవు.... కొన్ని చారిత్రాత్మక సందర్భాల్లో ఏమి జరిగిందంటే ప్రత్యర్థులు అవమానం పొంది, తమ ప్రాణాలకన్న ఇతరుల ప్రాణాలకు ఎక్కువ విలువ నిచ్చే మనుష్యులు కంటబడడంతో గాఢంగా చలించిపోయి, తమ తుపాకులు కిందపారేసి పారిపోయారు.

"నా దేశానికి స్వాతంత్ర్యం సంపాదించడానికి రక్తపాతం కావించే మార్గాల్ని అనుసరించడం కంటె, అవసరమయితే కొన్ని యుగాలయినా కాసుకొని ఉంటాను." బైబిలు ఇలా హెచ్చరిస్తుంది: "కత్తి పట్టిన వాళ్ళందరూ కత్తికే ఎర

అవుతారు,"* అని. మహాత్ములు ఇలా రాశారు:

> "నేను జాతీయవాదినని చెప్పుకొంటాను; కాని నా జాతీయవాదం విశ్వమంత విశాలమయినది భూమిమీదున్న దేశాలన్నింటినీ తన ఒడిలోకి తీసు కుంటుందది † నా జాతీయతావాదంలో సర్వప్రపంచ సంక్షేమమూ ఇమిడి ఉంది. నా భారతదేశం ఇతర దేశాల బూడిద గుట్టలలోంచి పైకి లేవాలని కోరను నేను భారతదేశం ఏ ఒక్క మనిషినీ దోచుకోవాలని కోరను. భారతదేశం తన బలంతో ఇతర దేశాల్ని కూడా శక్తిమంతం చెయ్యగలగడానికి అది బలిష్ఠంగా ఉండాలని కోరతాను. ఈనాడు యూరప్‌లో ఒక్క దేశమయినా అలా లేదు; అవి ఇతర దేశాలకు బలం చేకూర్చవు
>
> "ప్రెసిడెంట్ విల్సన్ పధ్నాలుగు చక్కని అంశాలు రూపొందించి వాటిని పేర్కొన్నాడు కాని, 'ఇంతా చేసి, శాంతి సాధించడానికి మనం చేసే ప్రయత్నం విఫలమయిందంటే, మళ్ళీ చేబట్టడానికి మనకి ఆయుధాలు ఉండనే ఉన్నాయి, అన్నాడు. ఆ స్థితిని నేను ఇలా తిప్పి చెప్పాలనుకుంటున్నాను· "ఇప్పటికే మన ఆయుధాలు విఫలమ యాయి. ఇప్పుడిక కొత్తదారి వెతుక్కుందాం, సత్యమనే ప్రేమ దైవశక్తిని ఉపయోగించి చూద్దాం. అది ఉంటే మన కింకేమీ అక్కర్లేదు."

మహాత్ముల సందేశాల్ని వ్యాప్తి చేసే వేలాది నిజమైన సత్యాగ్రహుల్ని (ఈ అధ్యాయంలో తొలిభాగంలో ఉదాహరించిన పదకొండు కఠోర ప్రతిజ్ఞలూ తీసు కున్నవాళ్ళను) తర్ఫీదు చెయ్యడంవల్లా; అహింస వల్ల కలిగే ఆధ్యాత్మిక లాభాలనూ ఉత్తరోత్తరా భౌతిక లాభాలనూ అవగాహన చేసుకునేందుకుగాను భారత జన సామాన్యానికి ఓర్పుతో బోధించడంవల్లా; అన్యాయానికి సహాయం చేయడానికి నిరాకరించడం, ఆయుధాలు చేపట్టడంకన్న అవమానాల్నీ జైలు శిక్షనూ చావునూ సైతం సహించడానికి అంగీకారం అన్న అహింసాత్మక ఆయుధాల్ని ప్రజలకు అందించడంవల్లా; సత్యాగ్రహుల్లో వీరోచితమైన బలిదానానికి లెక్కలేనన్ని ఉదాహరణలు ద్వారా ప్రపంచ సానుభూతి సంపాదించడంవల్లా గాంధీగారు, అహింసకున్న ఆచరణానుకూల స్వభావాన్నీ, యుద్ధానికి దిగే అవసరం లేకుండా

---

* మత్తయి 26.52. బైబిలులో మానవుడి పునర్జన్మను గర్భితంగా సూచించిన అసంఖ్యాక మైన సందర్భాల్లో ఇది ఒకటి. జీవితంలోని జటిలతల్లో చాలావరకు కర్మసంబంధమైన న్యాయ సూత్రాల్ని అర్థం చేసుకోడంవల్లనే అవగాహన అవుతాయి. (పే 225 అధోజ్ఞాపిక చూడండి).

† మనిషికి తన దేశాన్ని ప్రేమించడంలో ఘనత ఉందనుకోగూడదు తన జాతిని ప్రేమించడంలో తాను ఘనత పొందాలి." - పారశీక సామెత.

వివాదాల్ని పరిష్కరించుకోడానికి తోడ్పడే, దాని గంభీర శక్తినీ నాటకసహజంగా చిత్రీకరించారు.

మరే దేశంలోనూ మరే నాయకుడూ, తుపాకి గుండ్ల ద్వారా తప్ప మరే విధంగానూ ఎన్నడూ తన దేశానికి సంపాదించని అనేక రాజకీయ పరిష్కారాల్ని ఇప్పటికే గాంధీగారు అహింసామార్గాల్లో సాధించారు. అన్ని తప్పుల్నీ అన్ని చెడుల్నీ నిర్మూలించడానికి అహింసా పద్ధతుల్ని రాజకీయ రంగంలోనే కాకుండా, భారతీయ సంఘ సంస్కరణ అనే సునిశిత సంకీర్ణ రంగంలో కూడా ప్రశస్తంగా ప్రయోగించడం జరిగింది. గాంధీగారూ ఆయన అనుచరులూ, హిందువులకూ మహమ్మదీయులకూ మధ్య చాలా కాలంగా సాగుతున్న వివాదాల్ని చాలా వాటిని పరిష్కరించారు. కొన్ని లక్షలమంది ముస్లిములు గాంధీగారిని తమ నాయకుడుగా భావించుకున్నారు. అంటరానివాళ్ళు ఆయన్ని, తమ కోసం నడుం కట్టిన నిర్భయ విజయవీరుడిగా పరిగణిస్తారు. "నాకు మరో జన్మ కనక ఉండేటట్లయితే నేను అంటరానివాళ్ళలో ఒక అంటరానివాడిగా పుట్టాలని కోరుకుంటాను; ఎంచేతంటే, దానివల్లే నేను వాళ్ళకి మరింత సార్థకమైన సేవ చెయ్యగలుగుతాను," అని రాశారు గాంధీగారు.

గాంధీమహాత్ములు నిజంగా "మహాత్ములే"; కాని ఆయనకి ఆ బిరుదు ఇవ్వాలన్న వివేకం చూపించినవాళ్ళు, కోట్లకొద్ది నిరక్షరాస్యులు. సాధుసత్తముడైన ఈ ప్రవక్త తన దేశంలోనే గౌరవం పొందారు. నిమ్నస్థాయి రైతు, గాంధీగారి పెద్ద సవాలు అందుకోడానికి పెరగగలిగాడు. మనిషిలో స్వభావసిద్ధమయిన ఔదార్యాన్ని గాంధీమహాత్ములు హృదయపూర్వకంగా విశ్వసిస్తారు. తప్పనిసరి అపజయాలు ఆయనకు ఎన్నడూ దిగ్భ్రమ కలిగించలేదు. "ప్రత్యర్థి తనను ఇరవై సార్లు దగా చేసినా, ఇరవై ఒకటోసారి కూడా అతన్ని నమ్మడానికి సిద్ధంగా ఉంటాడు సత్యాగ్రహి; ఎంచేతంటే, మానవ ప్రవృత్తి మీద అచంచల విశ్వాసం ఉండటమే అతని సిద్ధాంత సారం కనక," అని రాశారు గాంధీగారు.*

---

* అప్పుడు పేటరు ఆయన దగ్గరికి వచ్చి, "ప్రభూ, నా సోదరుడు నా విషయంలో ఎన్ని సార్లు పాపం చేస్తే నేను క్షమించాలి? ఏడు సార్లా? ఏసు ప్రభువు అతనికి చెప్పాడు, ఏడుసార్లే నని చెప్పను నీకు, ఏడుకు డెబ్భైరెట్ల సార్లంటాను." - మత్తయి 18 21-22 (బైబిలు). అంగీకార యోగ్యం కాజాలని ఈ సలహాను అర్థంచేసుకోడానికి నేను గాఢంగా ధ్యానించాను. "ప్రభూ అది సాధ్యమా?" అని ఆక్షేపణ తెలిపాను. అప్పుడు చివరికొక దివ్యవాణి జవాబిచ్చి, ఒక వెలుగు వెల్లువలో నన్ను ముంచెత్తింది. "ఓ మనిషీ, మీలో ప్రతివాణ్ణీ నేను రోజూ ఎన్ని సార్లు క్షమించడం లేదూ?"

"మహాత్మాజీ, మీరయితే అసాధారణ వ్యక్తులు. మీరు చేసినట్టే లోకం చెయ్యాలని ఆశించగూడదు," అన్నాడొక విమర్శకుడు ఆయనతో.

"శరీరాన్ని మెరుగుపరుచుకోగలం కాని ఆత్మకున్న గుప్తశక్తుల్ని మేల్కొల్పడం అసాధ్యమని మనని మనం ఎంత భ్రమ పెట్టుకుంటామో చూస్తే విడ్డూరంగా ఉంటుంది," అని జవాబిచ్చారు గాంధీగారు. "అటువంటి శక్తుల్లో ఏదయినా ఒకటి ఉన్నట్లయితే, మనలో అందరిలాగే నేనూ దుర్బల మర్త్యుణ్ణేననీ, నాలో అసాధారణమైనదేదీ వెనకకాని ఇప్పుడుకాని లేదనీ నిరూపించడానికే నేను ప్రయత్నిస్తున్నాను. ప్రతి పాటిమనిషి లాగే నేను కూడా సహజంగా తప్పులు చేసే సామాన్య వ్యక్తినే. అయితే నేను నా తప్పుల్ని ఒప్పుకొని, వాటిని సరిదిద్దుకోడానికి కావలసినంత వినయం ఉన్నవాణ్ణని అంగీకరిస్తాను. భగవంతుడి మీదా ఆయన మంచితనం మీదా నాకు అచంచలమైన విశ్వాసం, సత్యంకోసమూ ప్రేమకోసమూ అవ్యయమైన ఆకాంక్ష ఉన్నాయని ఒప్పుకుంటాను. కాని ఇది ప్రతి మనిషిలోనూ అంతర్నిహితంగా లేదా?" అంటూ ఆయన ఇంకా అన్నారు: "దృశ్యవిషయిక ప్రపంచంలో మనం కొత్త ఆవిష్కరణలూ నూతన కల్పనలూ రూపొందిస్తూంటే, ఆధ్యాత్మిక రంగంలో మన దివాళాకోరుతనాన్ని చాటి చెప్పు కోవాలా? అపవాదాల్ని ఒక సూత్రంగా చెయ్యడానికి వాటి సంఖ్యను గుణించుకుంటూపోవడం అసాధ్యమా? మనిషి ఎప్పుడూ మొదట మృగమయి ఆ తరవాతే మనిషి కావాలా?"*

విలియం పెన్, 17 శతాబ్దిలో పెనిసిల్వేనియా వలస స్థాపించడంలో విజయవంతంగా పనిచేసిన అహింసా ప్రయోగాన్ని అమెరికన్లు గుర్తుచేసుకోవచ్చు.

---

* గొప్ప ఎలక్ట్రికల్ ఇంజనీరుగా పేరు పొందిన ఛార్లెస్ పి. స్టీన్‌మెట్జ్‌ను శ్రీ రోజర్ డబ్ల్యు బాబ్సన్ ఒకసారి ఇలా అడిగాడట:

"వచ్చే యాభై ఏళ్ళలో మహత్తర అభివృద్ధి సాధించే పరిశోధన రంగం ఏమిటి?" దానికి స్టీన్‌మెట్జ్ "ఆధ్యాత్మిక మార్గాల్లో మహత్తరమైన ఆవిష్కరణ జరుగుతుందనుకుంటాను" అని జవాబిచ్చాడు. "మానవుల వికాసంలో మహత్తర శక్తి ఉందని స్పష్టంగా చరిత్ర ఉద్ఘాటించే బలం ఇక్కడ ఉంది. అయినా కూడా మనమిప్పటికీ దాంతో ఆడుకుంటున్నామే కాని, భౌతిక శక్తుల్ని అధ్యయనం చేసిన మాదిరిగా, దాన్ని ఎన్నడూ తీవ్రంగా అధ్యయనం చెయ్యలేదు. భౌతిక వస్తువులు సుఖాన్ని ఇవ్వవనీ స్త్రీపురుషుల్ని సృజనశీలంగానూ శక్తిమంతంగానూ చెయ్యడంలో అవి నిరుపయోగమైనవనీ ఎప్పటికో ఒకనాటికి ప్రజలు తెలుసుకుంటారు. అప్పుడు ప్రపంచంలో విజ్ఞానవేత్తలందరూ తమ ప్రయోగశాలల్ని ఇంతవరకు తడిమి కూడా చూడని దేవుణ్ణీ ప్రార్థననూ ఆధ్యాత్మిక శక్తుల్నీ అధ్యయనం చెయ్యడానికి వినియోగిస్తారు. ఆ రోజు వచ్చిననాడు ప్రపంచం, వెనకటి నాలుగు తరాల్లోనూ చూసిన ప్రగతికన్న ఎక్కువ ప్రగతిని ఒక్క తరంలోనే చూస్తుంది."

అప్పుడక్కడ, "కోటలు లేవు, సైనికులు లేరు, స్వచ్ఛంద సేనలు లేవు, ఆయుధాలు కూడా లేవు." కొత్తగా వలస వచ్చిన వాళ్ళకూ స్థానిక ఎర్ర ఇండియన్లకూ మధ్య సాగిన దారుణమైన సరిహద్దు పోరాటాల్లోనూ మారణ కాండల్లోనూ ఏ కష్టాలకూ గురికాకుండా ఉన్నవాళ్ళు, పెనిసిల్వేనియా క్వేకర్లు అనే ఒక తెగవాళ్ళు మాత్రమే. ఇతరుల్ని చంపేశారు; కొందర్ని ఊచకోత కోశారు; కాని వీళ్ళు క్షేమంగానే ఉన్నారు. క్వేకర్లలో ఒక్క ఆడది కూడా ఆపదకు గురి కాలేదు; క్వేకర్లలో ఒక్క పిల్లవాణ్ణి కూడా చంపలేదు; ఒక్క మగవాణ్ణి కూడా హింసించ లేదు." చివరికి క్వేకర్లు బలవంతాన రాష్ట్రపాలన విడిచిపెట్టవలసి వచ్చినప్పుడు, "యుద్ధం రగిలింది; కొందరు పెనిసిల్వేనియా వాసుల్ని చంపేశారు; క్వేకర్లనయితే ముగ్గురినే చంపారు; ఆ ముగ్గురూ కూడా, ఆత్మరక్షణకోసం ఆయుధాలు తీసుకు వెళ్ళగూడదన్న విశ్వాసం కోల్పోయి పతనమైనవాళ్ళు."

"మొదటి ప్రపంచ మహాయుద్ధంలో బలప్రయోగం ప్రశాంతి నెలకొల్ప లేక పోయింది," అని చెప్పాడు, ఫ్రాంక్లిన్ డి. రూజ్వెల్ట్. "జయమూ, అపజయమూ రెండూ ఒకేలాగ నిస్సారంగా ఉన్నాయి. ప్రపంచం ఆ పాఠం నేర్చుకొని ఉండ వలసింది."

"హింసాత్మకమైన ఆయుధాలు ఎక్కువయినకొద్దీ మానవజాతికి దైన్యం ఎక్కువవుతుంది," అని బోధించాడు లావోట్సు. "హింసకు లభించే విజయం సంతాపోత్సవంతో ముగుస్తుంది."

"నేను పోరాడుతున్నది ప్రపంచ శాంతికోసమే కాని మరి దేని కోసమూ కాదు," అని చాటి చెప్పారు గాంధీగారు. "భారతీయ ఉద్యమం, అహింసాయుత సత్యాగ్రహ ప్రాతిపదిక మీద సాగినట్లయితే అది దేశ భక్తికి కొత్త అర్థం ఇస్తుంది - అంతేకాదు, జీవితానికి కూడా నని నేను సవినయంగా మనవి చేస్తాను."

గాంధీగారి కార్యక్రమాన్ని అలవికాని కలలు కనేవాడి కల్పనగా కొట్టి పారేసే ముందు పాశ్చాత్య దేశాలు, సత్యాగ్రహాన్ని గురించి గలీలీ గురువు ఇచ్చిన నిర్వచనాన్ని గురించి ఆలోచించడం మంచిది.

"కంటికి కన్నూ పంటికి పన్నూ అని చెబుతూ ఉండడం మీరు విన్నారు; కాని నే నంటాను, నువ్వు చెడును [చెడుతో] ఎదిరించకు: అంతకన్న, ఎవరయినా నీ కుడి చెంపమీద ఒక్క పెట్టు పెడితే, అతనికి నీ రెండో చెంప కూడా చూపించు."*

* మత్తయి 5.38-9 (బైబిలు)

మనోహరమూ, కచ్చితమూనైన భగవత్కాల నిర్ణయానుసారంగా, ఇప్పటికే రెండు మహాప్రపంచ సంగ్రామాలతో నిర్వీర్యమూ, విధ్వంసమూనైన ఈ శతాబ్ది లోకి గాంధీ శకం విస్తరించింది. ఆయన జీవితపు రాతిగోడమీద దివ్యహస్తాక్షరాలు కనిపిస్తాయి - సోదరుల్లో ఇక మళ్ళీ రక్తపాతం జరగగూడదన్న హెచ్చరిక అది.

## గాంధీమహాత్ముల దస్తూరీ,
## హిందీలో

[illegible]

గాంధీమహాత్ములు యోగదా సత్సంగ విద్యాలయాన్ని సందర్శించారు. వారు దయతో, అతిథుల అభిప్రాయాల పుస్తకంలో ఈ కింది పంక్తులు రాశారు:

"ఈ సంస్థ నాకు ఎంతో నచ్చింది. ఈ విద్యాలయం రాట్నం వాడకాన్ని ఇంకా ఎక్కువగా ప్రోత్సహిస్తుందని ఎంతో ఆశిస్తున్నాను."

సెప్టెంబరు 17, 1925

(సంతకం) మోహన్‌దాస్ గాంధీ

## గాంధీ మహాత్ములకు స్మృత్యంజలి

"జాతిపిత అన్న పేరు ఆయనకు సార్థకమయింది· ఒక పిచ్చివాడు ఆయన్ని చంపాడు వెలుగు ఆరిపోయినందుకు కోటానుకోట్లు విలపించి పోతున్నారు... ఈ గడ్డ మీద వెలిగిన వెలుగు మామూలు వెలుగు కాదు ఆ వెలుగు ఈ దేశంలో వెయ్యేళ్ళు కనిపిస్తుంది ప్రపంచం దాన్ని దర్శిస్తుంది." 1948 జనవరి 30న న్యూఢిల్లీలో మహాత్మాగాంధీ హత్య జరిగిన కొద్దిసేపటికి భారత ప్రధాని అన్న మాటలివి

అంతకు అయిదు నెలలముందు భారతదేశం, శాంతియుతంగా దేశ స్వాతంత్ర్యం సంపాదించుకుంది. 78 ఏళ్ళ వయస్సుగల గాంధీ గారి పని పూర్తి అయిపోయింది. తమ రోజులు దగ్గర పడుతున్నాయని ఆయన తెలుసుకున్నారు ఆ విషాద సంఘటన జరిగిననాడు పొద్దున్న, "ఆభా, ముఖ్యమైన కాయితాలన్నీ ఇలా తీసుకురా," అని మనమరాలితో చెప్పారాయన. "నే నివాళ జవాబులు రాసెయ్యాలి. రేపనేది ఇక లేకపోవచ్చు." తమ చరమ భవితవ్య సూచనల్ని గాంధీగారు తమ రచనల్లో అనేకచోట్ల వెల్లడించారు

ఉపవాసాలతో చిక్కి శల్యమైన శరీరంలో మూడు పిస్తోలు గుండ్లతో మరణిస్తున్న మహాత్ములు మెల్లగా నేలకు వాలుతూ, మౌనంగా క్షమాదానం చేస్తూ హిందూ సంప్రదాయపద్ధతిలో నమస్కరిస్తూ చేతులు పైకి ఎత్తారు. జీవితంలో నటనే ఎరగని గాంధీగారు ఆ మరణ సమయంలో మహానటు లయారు. ఆయన నిస్స్వార్థ జీవితంలోని త్యాగాలన్నీ కలిసి, ప్రేమపూర్వకమైన ఆ చివరి భంగిమను చూపించ గలిగాయి.

ఆల్బర్ట్ ఐన్‌స్టైన్ మహాత్ములకు జోహార్లు అర్పిస్తూ ఇలా అన్నాడు: "ఇటువంటి వ్యక్తి ఒకరు - రక్తమాంసాలతో ఈ భూమిమీద నడిచారన్న సంగతి నమ్మలేని తరాలు కూడా రావచ్చు." రోమ్‌లో వాటికన్ నుంచి వచ్చిన సమాచారంలో ఇలా ఉంది: "ఆ హత్య ఇక్కడ మాకు ఎంతో సంతాపం కలిగించింది. క్రైస్తవ సద్గుణాలు మూర్తీభవించిన దేవదూతవంటి గాంధీగారి కోసం ప్రజలు విలపిస్తారు."

ఒక విశిష్ట సత్కార్యాన్ని సాధించడానికి భూమి మీదికి వచ్చిన మహాపురుషులందరి జీవితాలూ ఏదో ఒక ప్రతీకాత్మకమైన అర్థంతో ముడిపడి ఉంటాయి భారత సమైక్యం కోసం నాటకీయంగా సంభవించిన గాంధీగారి మరణం ప్రతి ఖండంలోనూ అనైక్యంతో చీలికలైపోయిన ప్రపంచానికి ఆయన సందేశాన్ని ప్రముఖంగా చాటి చెప్పింది ఆ సందేశాన్ని ఆయన భవిష్యత్తును సూచించే ఒక ప్రవక్త మోస్తరుగా ఇలా వెల్లడించారు:

"అహింస జనబాహుళ్యంలోకి వచ్చింది. అది జీవిస్తుంది. అది ప్రపంచానికి శాంతిదూత."

అధ్యాయం : 45

# బెంగాలీ "ఆనందమయి మాత"

"నిర్మలాదేవిని ఒక్కసారి చూడకుండా మాత్రం ఇండియా నుంచి వెళ్ళకండి. ఆవిడ భగవద్భక్తి గాఢమైనది. 'ఆనందమయి మా' గా ప్రసిద్ధి పొందారావిడ." మా మేనకోడలు అమియా బోస్ నిండు మనస్సుతో నావేపు చూస్తూ అన్నది.

"అలాగే! ఆ సాధ్విని తప్పకుండా చూడాలని నాకూ మనస్సులో ఉంది," అంటూ ఇంకా ఇలా అన్నాను: "దైవ సాక్షాత్కార సాధనలో ఆవిడ చేరిన ఉన్నత స్థితిని గురించి చదివాను. కొన్నేళ్ళ కిందట 'ఈస్ట్-వెస్ట్' పత్రికలో ఆవిణ్ణి గురించి ఒక చిన్న వ్యాసం వచ్చింది.

"ఆవిణ్ణి నేను దర్శించుకున్నాను," అంటూ ఇలా చెప్పింది అమియా: "ఆవిడ ఈమధ్య మా ఊరు - జెంషెడ్‌పూరు వచ్చారు. ఒక శిష్యుడి విన్నపాన్ని మన్నించి ఆనందమయి మాత, అవసాన దశలో ఉన్న ఒకతని ఇంటికి వెళ్ళారు. ఆవిడ అతని మంచం దగ్గర నించున్నారు; అతని నుదుటి మీద చెయ్యి వేసేసరికి అతని మరణవేదన అంతమయింది; వెంటనే జబ్బు మాయమయింది; తన ఆరోగ్యం మెరుగవడం చూసి ఆశ్చర్యపోతూ ఆనందించాడతను."

కొన్నాళ్ళ తరవాత ఆనందమయి మాత, కలకత్తాలో భవానీపూర్ పేటలో ఒక శిష్యుడి ఇంట్లో బసచేశారని విన్నాను. వెంటనే నేనూ, శ్రీ రైటూ కలిసి కలకత్తాలో మా నాన్నగారి ఇంటిదగ్గర్నించి బయలుదేరాం. మా ఫోర్డు కారు భవానీపూర్ ఇంటికి చేరువవుతూ ఉండగా, నా మిత్రుడూ నేనూ, వీధిలో ఒక అసాధారణ దృశ్యాన్ని గమనించాం.

ఆనందమయి మాత, టాపులేని ఒక కారులో నించుని ఉంది. ఆవిడ బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నట్టుంది. శ్రీరైట్ కొంచెం దూరంలో మా ఫోర్డు కారు ఆపి, ఆ ప్రశాంత జనసమూహం దగ్గరికి నాతో బాటు నడిచి వచ్చాడు. ఆ సాధ్వి మా వేపు చూసింది; కారులోంచి దిగి మావేపు వచ్చిందావిడ.

"బాబా, వచ్చేశావా!" అంటూ (బెంగాలీలో) ఉత్సాహాతిరేకంతో పలికి, నా మెడచుట్టూ చేతులు వేసి నా బుజంమీద తల ఆనించింది. ఆ సాధ్విని నేను ఎరగనని అంతకుముందే నేను శ్రీరైట్‌కు చెప్పి ఉండడం చేత, ఈ అసాధారణ స్వాగత ప్రకటన చూసి బ్రహ్మాండంగా ఆనందిస్తున్నాడతను. వందమంది శిష్యుల కళ్ళూ, రవంత ఆశ్చర్యంతో ఆప్యాయత వెల్లివిరుస్తున్న ఆ స్థిర దృశ్యం మీదే నిలిచిపోయాయి.

ఆ సాధ్వి ఉన్నత సమాధి స్థితిలో ఉన్నదన్న సంగతి నేను తక్షణమే గమనించాను. స్త్రీగా తన బాహ్యదేహం మీద స్పృహలేని ఆ సాధ్వి, తాను మార్పులేని ఆత్మనని ఎరుగును; ఆ స్థాయినుంచి ఆవిడ, మరో దైవభక్తుణ్ణి ఆనందంగా పలకరిస్తోంది. చెయ్యి పట్టుకుని నన్ను తన కారులోకి తీసుకువెళ్ళిందావిడ.

"ఆనందమయి మా, మీ ప్రయాణానికి ఆలస్యం చేస్తున్నాను!" అని నేను అభ్యంతరం చెప్పాను.

"బాబా, కొన్ని యుగాల తరవాత మళ్ళీ ఈ జన్మలో మొట్టమొదటిసారిగా నిన్ను కలుసుకుంటున్నాను!"* అన్నదామె. "అప్పుడే వెళ్ళిపోకు."

కారు వెనకసీట్లో కూర్చున్నాం ఇద్దరం. కాసేపట్లోనే ఆనందమయి మాత నిశ్చల సమాధి స్థితిలోకి వెళ్ళిపోయింది. ఆమె సుందరనయనాలు అర్ధనిమీలితాలయి ఊర్ధ్వలోకాభిముఖంగా నిలకడగా నిలిచిపోయాయి. సమీప దూరాల్లోగల ఆంతరిక స్వర్గరాజ్యంలోకి చూస్తున్నాయవి. "జయజయ జగజ్జననీ!" అంటూ మెల్లిగా జోహార్లు పలికారు శిష్యులు.

నేను భారతదేశంలో దైవసాక్షాత్కారం పొందిన పురుషుల్ని చాలామందిని చూశాను; కాని అటువంటి ఉన్నతస్థితినందుకున్న సాధ్విని అంతకుముందు ఎన్నడూ చూడలేదు.

ఆమె కోమల ముఖమండలం అనిర్వచనీయమైన ఆనందంతో మరింత మెరుస్తోంది; ఆమెకు ఆనందమయి మాత అన్నపేరు రావడానికి కారణం అదే. ముసుగు వేసుకోని తలకు వెనకాల విరబోసిన పొడుగాటి నల్లటి జుట్టు వేలాడుతోంది. ఎప్పుడూ తెరుచుకొనే ఉండే ఆమె జ్ఞాననేత్రానికి గుర్తుగా నుదుట ఎర్రటి గంధంబొట్టు ఉంది. చిన్న ముఖం, చిన్న చేతులు, చిన్న కాళ్ళు - ఆమె ఆధ్యాత్మిక పరిమాణానికి విరోధాభాసంగా ఉన్నాయి!

---

* శ్రీశ్రీ ఆనందమయి మాత 1896లో, తూర్పుబెంగాల్‌లో త్రిపుర జిల్లాలో ఖేవరా గ్రామంలో జన్మించారు (ప్రచురణకర్త గమనిక).

ఆనందమయిమాత సమాధి స్థితిలో ఉండగా, పక్కనున్న శిష్యురాలిని కొన్ని ప్రశ్నలు వేశాను.

"ఆనందమయి మాత భారతదేశంలో విరివిగా ప్రయాణాలు చేస్తారు; ఆవిడకి అనేక ప్రాంతాల్లో వందలకొద్దీ శిష్యులున్నారు." అని చెప్పింది శిష్యురాలు. "ఆవిడ సాహసించి చేసిన ప్రయత్నాలవల్ల వాంఛనీయమైన సంఘ సంస్కరణలు చాలా వచ్చాయి. ఆవిడ బ్రాహ్మణి అయినప్పటికీ కులభేదా లేవీ పాటించదు. ఆవిడకు జరగవలసిన సదుపాయాలు చూస్తూ మేము కొంత మందిమి, ఆవిడతో బాటు ప్రయాణాలు చేస్తూ ఉంటాం. మేము ఆవిణ్ణి తల్లిలా సాకాలి; ఆవిడకి ఒంటిమీద ధ్యాస ఉండదు. ఎవరూ పెట్టకపోతే అన్నం తినదు; అడగనూ అడగదు. ఆవిడ ముందు అన్నం పెట్టినా కూడా ముట్టుకోదు. ఆవిడ ఈ లోకంలోంచి అదృశ్యం కాకుండా ఉండటం కోసం, శిష్యులం మేమే మా చేతులతో తినిపిస్తాం. తరచుగా ఆవిడ, వరసగా కొన్ని రోజులపాటు దివ్య సమాధిలో ఉండిపోతారు; ఊపిరి ఆడడమే అరుదు; కళ్ళు రెప్పవాలకుండా ఉండిపోతాయి. ఆవిడ ముఖ్య శిష్యుల్లో ఒకరు, ఆమె భర్త. చాలా ఏళ్ళ కిందట, వాళ్ళ పెళ్ళి కాగానే, ఆయన మౌనవ్రతం పట్టారు."

పొడుగాటి జుట్టూ జేబురు గడ్డమూ విశాలమైన భుజాలూ చక్కని అంగ సౌష్ఠవమూ గల ఒకాయన్ని చూపించింది శిష్యురాలు. గుంపు మధ్యలో ప్రశాంతంగా నించుని ఉన్నారాయన; భక్తితత్పరత చూపే శిష్యుడి మాదిరిగా చేతులు జోడించుకొని ఉన్నారాయన.

అనంత ఆనందసాగరంలో ఒక్కసారి మునిగి పుణ్యస్నానం చేసిన ఆనంద మయి మాత, ఇప్పుడు తన చేతనను భౌతిక ప్రపంచం మీద కేంద్రీకృతం చేస్తోంది.

"బాబా, నువ్వెక్కడ బసచేశావో చెప్పు." ఆవిడ కంఠస్వరం స్పష్టంగా, శ్రావ్యంగా ఉంది.

"ప్రస్తుతం కలకత్తాలోనో, రాంచీలోనో; కాని త్వరలో తిరిగి అమెరికా వెళ్ళి పోతున్నాను.

"అమెరికానా?"

"అవునమ్మా. ఆధ్యాత్మిక అన్వేషణ సాగించేవాళ్ళు భారతీయ సాధ్వీమణిని చిత్తశుద్ధితో మెచ్చుకుంటారు. నువ్వు కూడా వస్తావా?"

"బాబా తీసుకువెడితే వస్తా."

ఈ సమాధానంతో, దగ్గరున్న శిష్యులు గాభరాపడుతూ ముందుకు వచ్చారు.

"మేము ఇరవైమందికి పైగా ఎప్పుడూ ఆనందమయి మాతతో ప్రయాణం చేస్తూ ఉంటాం," అని దృఢంగా చెప్పారొకరు. "ఆవిడ లేనిదే మేం బతకలేం. ఆవిడ ఎక్కడికి వెడితే అక్కడికి మేమూ వెళ్ళవలసిందే."

ప్రయాణికుల సంఖ్య దానంతట అది పెరిగిపోయే ఇబ్బంది ఎదురయి నందువల్ల, మనస్సు పీకుతూనే ఉన్నా, నా ఆలోచనను విరమించుకున్నాను!

"కనీసం రాంచీ అయినా రావాలి, శిష్యులతో," అన్నాను ఆ సాధ్విదగ్గర సెలవు తీసుకుంటూ. "నువ్వే ఒక దివ్య శిశువువయినందువల్ల నా విద్యాలయంలో ఉన్న పిల్లల్ని చూసి ఆనందిస్తావు."

"బాబా ఎప్పుడు తీసుకువెడితే అప్పుడు సంతోషంగా వస్తాను."

తరవాత కొంత కాలానికి రాంచీ విద్యాలయానికి, ఆ సాధ్వి ఆగమన సందర్భంగా పండుగ కళ వచ్చింది. కుర్రవాళ్ళు ఏ పండుగ రోజన్నా ఎదురు చూస్తుంటారు - పాఠాలు ఉండవు; గంటలకు గంటలు ఎడతెరిపి లేకుండా సంగీతం; దానికి రసపట్టుగా ఒక విందు!

"జయ్! ఆనందమయి మా కీ జయ్!" ఆ సాధ్వీమణి బృందం విద్యాలయ ద్వారంలో అడుగుపెడుతూ ఉండగా, ఉత్సాహం ఉరకలు వేస్తున్న అనేక పసి గొంతుల్లో ఈ నినాదం మోగిపోయింది. బంతిపూలవాన, తాళాల చప్పుళ్ళు, నిండుగా పూరించిన శంఖాలు, మద్దెలల మోతలు! ఆనందమయి మాత చిరునవ్వు చిందిస్తూ, పరుచుకున్న ఎండతో ఆహ్లాదకరంగా ఉన్న విద్యాలయ భూమిలో హాయిగా విహరించింది; ఆవిడ ఎప్పుడూ హృదయంలో ఎక్కడికయినా తీసుకు పోగలిగే స్వర్గాన్ని నిలుపుకొని సంచరిస్తూ ఉంటుంది.

"ఇక్కడ అందంగా ఉంది," ఆనందమయి మాతను నేను ప్రధాన భవనం లోకి తీసుకువెళ్తున్నప్పుడు ఆవిడ దయతో అన్న మాటలివి. పసిపాపలా చిరునవ్వు నవ్వుతూ నా పక్కన కూర్చుంది. ఆవిడ ఎవరికయినా ప్రేమాస్పదులందరిలోకీ అతి దగ్గరిదాన్ని అనిపించేటట్టు చేస్తుంది; అయినా ఆవిడచుట్టూ దూరత్వ పరివేషం ఎప్పటికీ ఉంటూనే ఉంటుంది- భగవత్స్వరూపమైన సర్వవ్యాపకత్వంలో విరోధా భాసంగల వేర్పాటు ఇది.

"నీ జీవితాన్ని గురించి కొంచెం చెప్పమ్మా."

"బాబాకి తెలుసు, అదంతా; మళ్ళీ చెప్పడమెందుకు?" ఒక చిన్న జన్మ తాలూకు వాస్తవ చరిత్ర ఏమంత తెలుసుకోవలసింది కాదని ఆమె భావిస్తున్నట్టు స్పష్టమవుతుంది.

నేను మెల్లగా మరోసారి మనవిచేసి నవ్వాను.

"బాబా, చెప్పడానికి ఆట్టే లేదు," అంటూ ఆవిడ, అవసరంలేదని సూచిస్తున్నట్టుగా చేతులు విస్తరించింది. "నా చేతన ఎన్నడూ ఈ తాత్కాలిక శరీరంతో ముడిపడి ఉండలేదు. బాబా, నేను* ఈ భూమి మీదికి రాక ముందు 'నేను దాన్నే.' చిన్నపిల్లగా ఉన్నప్పుడు 'నేను దాన్నే.' పెరిగి పెద్దదాన్ని అయాను; అయినా 'నేను దాన్నే.' నా పుట్టింటివాళ్ళు ఈ శరీరానికి పెళ్ళి ఏర్పాట్లు చేసినప్పుడు కూడా 'నేను దాన్నే.'

"బాబా, మీ ఎదుట ఇప్పుడూ 'నేను దాన్నే.' ఆ తరవాత అనంత విశ్వంలో నా చుట్టూ సృష్టినర్తనం మారినప్పటికీ 'నేను దాన్నే.'

ఆనందమయి మాత ధ్యానస్థితిలో మునిగిపోయింది. ఆమె శరీరం రాయిలా కదలిక లేకుండా అయిపోయింది; ఎప్పుడూ తనను పిలుస్తూండే లోకానికి పరుగుతీసింది. ఆమె కళ్ళ నీలపు మడుగులు నిర్జీవంగా తేజోవిహీనంగా కనిపించాయి. సాధువులు తమ చేతనను భౌతిక శరీరంలోంచి తొలగించినప్పుడు తరచు ఈ మాదిరిగా అవుపిస్తూ ఉంటుంది; అప్పుడా శరీరం ఆత్మ రహితమైన మట్టి ముద్దకు మించి ఉండదు. మే మిద్దరం సమాధి స్థితిలో ఒక గంటసేపు కూర్చుని ఉన్నాం. ఒక చిన్న హాసరేఖతో ఆవిడ ఈ లోకానికి తిరిగి వచ్చింది.

"ఆనందమయి మా, దయ ఉంచి నాతోబాటు తోటలోకి రండి. రైట్‌గారు ఫొటోలు తీసుకుంటారు."

"అలాగే బాబా. నీ ఇష్టమే నా ఇష్టం." ఆవిడ చాలా ఫొటోలకు నించున్నప్పుడు, ఆవిడ కళ్ళలో మార్పులేని దివ్యతేజస్సు అలాగే ఉండిపోయింది.

భోజనం వేళ అయింది! ఆనందమయి మాత తన గొంగడి ఆసనంమీద కూర్చుంది. ఆమెకు అన్నం తినిపించడానికి పక్కనే ఒక శిష్యురాలు. పసిపిల్ల

* శ్రీశ్రీఆనందమయి మాత తన నెప్పుడూ "నేను"అని ప్రస్తావించదు. "ఈ దేహం" అని కాని, "ఈ అమ్మాయి" అని కాని, "మీ బిడ్డ" అని కాని వినయంగా, డొంక తిరుగుడు మాటలు వాడుతుంది. అంతే కాకుండా, తాను ఎవరినీ "శిష్యుడు" అని కాని "శిష్యురాలు" అని కాని చెప్పదు. వ్యక్తి ప్రమేయం లేని జ్ఞానంతో ఈవిడ, జగజ్జననిగా మానవు లందరిమీదా దివ్యప్రేమను కురిపిస్తుంది.

మాదిరిగా ఆ సాధ్వి, శిష్యురాలు నోటికి అన్నం ముద్ద అందించినప్పుడు అణకువగా మింగింది. ఆనందమయి మాత, కూరలకీ మిఠాయిలకీ తేడా ఏమీ గుర్తించలేదని స్పష్టమయింది.

పొద్దు కుంకుతుండగా ఆ సాధ్వి తన బృందంతో బయలుదేరి వెళ్ళింది. వర్షిస్తున్న గులాబి రేకుల మధ్య ఆమె, పసివాళ్ళని దీవిస్తూ చేతులు పైకి ఎత్తింది. వాళ్ళ ముఖాలు, ఆవిడ సునాయాసంగా మేల్కొల్పిన ఆప్యాయతతో మెరుస్తున్నాయి.

"నీ ప్రభువును నువ్వు సంపూర్ణ హృదయంతో, సంపూర్ణ ఆత్మతో, సంపూర్ణ మనస్సుతో, సంపూర్ణ బలంతో ప్రేమించాలి," అంటూ ప్రకటించాడు క్రీస్తు. "ఇది మొట్టమొదటి ఆజ్ఞ."*

ఆనందమయి మాత, అల్పమైన ప్రతి అనుబంధాన్నీ తెంచుకొని ప్రభువుకొక్కడికే తన విధేయత చూపించింది. పసిపాపలాంటి ఈ సాధ్వి మానవ జీవితపు ఏకైక సమస్యను - అంటే, భగవంతుడితో ఐక్యస్థితి ఏర్పరచుకోడమనే సమస్యను - పండితుల మాదిరిగా సూక్ష్మేక్షికలతో కాకుండా, సునిశ్చిత విశ్వాసపరమైన తర్కంతో పరిష్కరించారు.

లక్షోపలక్షల విషయాలతో పొగచూరిపోయిన ఈ శుద్ధ సరళత్వాన్ని మానవుడు మరిచిపోయాడు. దేవుడిపట్ల అనన్యమైన ప్రేమను తిరస్కరించి ప్రపంచ దేశాలు, బాహ్యమైన ఔదార్యాలయాలపట్ల ఆడంబరయుతమైన ఆదరంతో తమ నాస్తికతను కప్పిపుచ్చే ప్రయత్నం చేస్తున్నాయి. మానవతా దృష్టితో చేసే ఉపకారాలు, మనిషి దృష్టిని క్షణకాలంపాటు తనమీంచి మళ్ళించేటట్టు చేస్తాయి కనక - అవి మంచివే; కాని మొదటి ఆజ్ఞగా ఏసుక్రీస్తు ప్రస్తావించిన జీవిత ప్రధాన బాధ్యతనుంచి అతనికి విముక్తి ప్రసాదించవు. దేవుణ్ణి ప్రేమించాలన్న ఉద్ధారక కర్తవ్యం, తన ఏకైక సంరక్షకుడు†ఉచితంగా ప్రసాదించిన గాలిని తొలి ఊపిరిగా మానవుడు తీసుకున్నప్పుడే ఏర్పడింది.

---

* మార్కు 12:30

† "కొత్తగా, ఇంతకన్న మేలుగా ఉండే ప్రపంచాన్ని సృష్టించాలన్న ఆకాంక్ష అందరికీ కలుగుతుంది. మీరు అటువంటి విషయాల మీదికి మనస్సు పెట్టకుండా అంతకన్న పరిపూర్ణమైన శాంతి లభించే అవకాశం ఉన్న దైవచింతన మీద మనస్సు నిలపండి. దైవాన్వేషకుడు, లేదా సత్యాన్వేషకుడు, కావడం మానవుడి విధి." - ఆనందమయి మాత.

రాంచీ విద్యాలయ సందర్శన తరవాత మరో సందర్భంలో నేను ఆనంద మయి మాతను చూసే అవకాశం కలిగింది. కొన్ని నెలల తరవాత ఆవిడ శ్రీరాంపూర్ స్టేషను ప్లాట్‌ఫారం మీద తమ శిష్యబృందంతో, బండికోసం ఎదురు చూస్తోంది.

"బాబా, నేను హిమాలయాలకు వెళ్ళిపోతున్నాను," అని చెప్పింది ఆవిడ. "కొందరు దయాపరులు డెహ్రాడూన్‌లో మాకో ఆశ్రమం కట్టించారు."

ఆవిడ బండి ఎక్కుతుండగా - గుంపు మధ్యలో ఉన్నా, రైల్లో ఉన్నా, విందు ఆరగిస్తున్నా, మౌనంగా కూర్చుని ఉన్నా ఆమె కళ్ళు భగవంతుడిమీంచి మళ్ళేవి కావని గమనించి నేను ముగ్ధుణ్ణి అయాను. నాలో ఇప్పటికీ, అమేయ మాధుర్యం గల ఆమె కంఠస్వరం ప్రతిధ్వని వింటూనే ఉంటాను:

"చూడు, ఇప్పుడూ ఎప్పుడూ కూడా ఆ నిత్యాత్మతో ఏకమై ఉండి నేను ఎప్పటికీ దాన్నే."

అధ్యాయం : 46

# నిరాహార యోగిని

"సార్, ఈ ఉదయం మనం ఎక్కడికి వెళ్తున్నాం?" శ్రీరైట్ ఫోర్డు కారు నడుపుతున్నాడు; రోడ్డు మీంచి చూపు నావేపు మళ్ళించి మెరిసేకళ్ళతో ప్రశ్నార్థకంగా చూశాడు. రోజురోజుకీ తాను బెంగాలులో ఏ ప్రాంతం కనుక్కోబోతున్నాడో అతనికి బొత్తిగా తెలిసేది కాదు.

"దేవుడు తలిస్తే, ఇప్పుడు మనం, ప్రపంచంలో ఎనిమిదో వింత చూడ్డానికి వెళ్తున్నాం - పలచని గాలి మట్టుకే భోంచేసే యోగినిని చూడ్డానికి వెళ్తున్నాం!"

"థెరిసా నాయ్‌మన్‌ను చూసిన తరవాత - వింతలే వింతలు!" అయినా శ్రీ రైట్ కుతూహలంగా నవ్వాడు; పైగా కారువేగం పెంచాడు కూడా. అతని యాత్రా దినచర్య పుస్తకం [డైరీ]లోకి ఎక్కడానికి అసాధారణమైన ముడిసరుకు మరింత దొరకబోతోంది. సామాన్య పర్యాటకుడి డైరీ కాదది.

రాంచీ విద్యాలయం దాటి అప్పుడే బయటికి వచ్చాం; ఆ రోజు సూర్యుడి కంటె ముందే మేలుకున్నాం. మా బృందంలో, మా కార్యదర్శీ నేనూ కాక, మరో ముగ్గురు బెంగాలీ స్నేహితులు కూడా ఉన్నారు. ఉల్లాసకరమైన చల్లగాలి పీల్చు కున్నాం; అది పొద్దుటిపూట దొరికే సహజమధువు. వేకువజామునే పనులకు బయలుదేరే రైతుల మధ్యనుంచి రోడ్డుమీద మెల్లగా సాగే ఎడ్లబండ్ల మధ్యనుంచి కారు మెలకువగా నడిపించాడు మా డ్రైవరు. పెద్ద పెద్ద మూపురాలు కలిగిన ఆ బండెద్దులు, హారను ధ్వనితో చొచ్చుకువచ్చే ఈ అపరిచిత వాహనానికి రోడ్డు మీద హక్కుని అంత సులువుగా ఇచ్చేవికావు.

"సార్, ఈ నిరాహార యోగినిని గురించి ఇంకా తెలుసుకోవాలని ఉందండి మాకు."

"ఆవిడ పేరు గిరిబాల," అని చెప్పాను నా సహచరులకు. "ఆవిణ్ణి గురించి చాలా ఏళ్ళకిందట, స్థితిలాల్ నంది అనే పండితోత్తములు చెప్పగా విన్నాను.

ఆయన మా తమ్ముడు విష్ణుకు చదువు చెప్పడానికి తరచుగా గడ్పార్ రోడ్డు వీధిలో మా ఇంటికి వస్తూండేవారు.

" 'గిరిబాలను బాగా ఎరుగుదును,' అని చెప్పారు స్థితిబాబు. 'తిండి తినకుండా బతకడానికి ఆవిడ ఒక యోగప్రక్రియ సాధన చేస్తుంది. ఇచ్ఛాపూర్* దగ్గర ఉన్న నవాబ్ గంజ్‌లో, మాకు పొరుగింట్లోనే ఉండేది ఆవిడ. ఆవిణ్ణి సన్నిహితంగా పరిశీలించడం నే నొక పనిగా పెట్టుకున్నాను. ఆవిడ ఏదైనా తిన్నట్టు కాని, తాగినట్టు కాని నా కెన్నడూ కనిపించలేదు. చివరికి నా ఆసక్తి ఎంతగా పెరిగిందంటే, నేను బర్ద్వాన్ మహారాజు† దగ్గరికి వెళ్ళి, ఒక పరీక్ష జరిపించమని అడిగాను. ఆ కథ విని ఆయన ఆశ్చర్యపోయి, ఆవిణ్ణి తమ రాజమందిరానికి ఆహ్వానించారు. ఆవిడ, ఆయన పెట్టే పరీక్షకు ఒప్పుకొని, ఆయన ఇంట్లోనే, తాళం పెట్టిన ఒక వాటాలో రెండు నెలలపాటు ఉంది. తరవాత మరోసారి రాజమందిరానికి వెళ్ళి ఇరవై రోజులపాటు ఉంది; మూడో పరీక్ష పదిహేను రోజులు జరిగింది. ఈ మూడు కఠిన పరీక్షల ద్వారా, ఆవిడ నిరాహార స్థితిలో ఉంటుందని తాము నిస్సందేహంగా నమ్ముతున్నట్టు మహారాజావారు నాకు స్వయంగా చెప్పారు.'

"స్థితిబాబు చెప్పిన ఈ కథ ఇరవై ఏళ్ళకు పైగా నా మనస్సులో నాటుకు పోయింది," అంటూ ఇలా చెప్పి ముగించాను. "నేను ఆ యోగినిని కలుసుకోక ముందే కాలప్రవాహం ఆవిణ్ణి కబళించెయ్యదు కదా అని, అప్పుడప్పుడు అమెరికాలో అనుకుంటూ ఉండేవాణ్ణి. ఈపాటికి చాలా వృద్ధురాలై ఉంటుందావిడ. ఇప్పుడు ఎక్కడ ఉంటోందో, అసలు బతికుందో లేదో కూడా నాకు తెలియదు. కాని, ఇంకొన్ని గంటల్లో మనం పురులియా చేరతాం; ఆవిడ సోదరుడికి ఒక ఇల్లుంది అక్కడ," అన్నాను.

పదిన్నరకి మేము గిరిబాలగారి సోదరుడు, లంబోదర డేతో ముచ్చటిస్తున్నాం; ఆయన పురులియాలో వకీలు.

"మా అక్కయ్య బాగానే ఉంది. ఆవిడ ఒక్కొక్కప్పుడు ఇక్కడ నా దగ్గరే ఉంటూంటుంది; కాని ప్రస్తుతం, బియూర్‌లో మా ఇంట్లో ఉంటోంది." లంబోదర బాబు మా ఫోర్డు కారు వేపు సంశయంగా చూశారు. "స్వామీజీ, బియూర్‌దాకా లోపలికి ఇంతవరకు ఏ కారూ చొచ్చుకు వెళ్ళలేదనుకుంటాను. మీ రందరూ ఎడ్లబండి కుదుపులకు సిద్ధపడ్డమే మంచిదనుకుంటాను."

* ఉత్తర బెంగాలులో.

† మహారాజ రాజశ్రీ సర్ విజయచంద్ మహతాబ్. ఇప్పుడు గతించారు. గిరిబాల విషయంలో ఆ మహారాజు జరిపించిన మూడు పరీక్షలకూ సంబంధించిన లిఖిత ఆధారం కొంత, ఆయన కుటుంబికుల దగ్గర ఉండడం ఖాయం.

మా బృందంలో అందరూ డెట్రాయిట్‌కే గర్వకారణమైన మా ఫోర్డు కారు పట్ల, ఏకగ్రీవంగా విశ్వాసం ప్రకటించారు.

"ఈ ఫోర్డు అమెరికా నుంచి వచ్చినది," అని చెప్పాను ఆ వకీలుకు. "బెంగాలు నడిబొడ్డుతో పరిచయం చేసుకునే అవకాశం దానికి లేకుండా చెయ్యడం విచారకరమైన విషయం!"

"గణేశుడు* మీకుతోడు వచ్చుగాక!" అన్నారు లంబోదరబాబు, నవ్వుతూ. మర్యాదగా ఇంకా ఇలా అన్నారు: "మీ రెప్పటికయినా అక్కడికి చేరడమే జరిగితే, గిరిబాల మిమ్మల్ని చూసి సంతోషిస్తుందన్నది ఖాయం. ఇప్పుడావిడ డెబ్భయ్యో పడిలో పడబోతోంది; అయినా ఆరోగ్యం దివ్యంగా ఉంది."

"అయ్యా, ఒక్క మాట చెప్పండి; ఆవిడ ఏమీ తినరన్నది పూర్తిగా నిజమేనా?" మనస్సులో భావాల్ని బయలుపరిచే కిటికీల్లాంటి ఆయన కళ్ళలోకి సూటిగా చూశాను.

"అది నిజం." ఆయన చూపు నిష్కల్మషంగా, విశ్వసనీయంగా ఉంది. "ఏభై ఏళ్ళలో ఆవిడ ఒక్క ముద్దకూడా అన్నం తినగా నేను చూడలేదు. ఈ ప్రపంచం హఠాత్తుగా అంతమయినా నేను ఆశ్చర్యపోను కాని, మా అక్కయ్య అన్నం తింటోందంటే ఆశ్చర్యపోతాను!"

ప్రపంచంలో ఈ రెండు విశ్వసంఘటనలూ జరిగే అవకాశం లేదు కనక, ఇద్దరం ముసిముసి నవ్వులు నవ్వుకున్నాం.

"గిరిబాల తన యోగసాధనలకు, అలవి కాని ఏకాంతం కోసం ఎన్నడూ ఎదురు చూడలేదు," అంటూ సాగించారు లంబోదరబాబు. "ఆవిడ జీవితమంతా, మా ఇంట్లోవాళ్ళ మధ్యా స్నేహితుల మధ్యా గడిచింది. ఆవిడ విచిత్ర స్థితికి వాళ్ళందరూ అలవాటుపడిపోయారు. గిరిబాల ఏదైనా తినాలని హఠాత్తుగా నిర్ణయించుకుంటే, వాళ్ళలో ఆశ్చర్యపోనివాళ్ళు ఒక్కరూ ఉండరు! హిందూ వితంతువుకు తగినట్టుగా మా అక్కయ్య, సహజంగా విశ్రాంతి జీవితం గడుపు తూంటుంది. కాని పురులియా లోనూ బియూర్‌లోనూ ఉన్న మా వాళ్ళందరికీ ఆవిడ, అక్షరాలా 'అసాధారణ' స్త్రీ అన్న సంగతి తెలుసు."

ఆ సోదరుడి చిత్తశుద్ధి స్పష్టంగా కనిపిస్తోంది. మా చిన్న బృందం, ఆయనకు మనసారా ధన్యవాదాలు చెప్పి బియూర్‌కు దారి తీసింది. ఒక వీధిలో ఉన్న దుకాణం

* "ఆటంకాల్ని తొలగించేవాడు," భాగ్యదేవత.

దగ్గర లూచీలూ (రొట్టెలు) కూరా కొనుక్కోడానికి మేము ఆగాం. శ్రీ రైట్, నిరాడం బరమైన హిందూ పద్ధతిలో వేళ్ళతో తింటూండగా, ఊళ్ళో పిల్లలు చుట్టూ మూగి, అతని వేపు కళ్ళప్పగించి చూస్తున్నారు.* ఆ మధ్యాహ్నం మాకు చాలా శ్రమ కలిగించ బోయే - ఆ సంగతి మాకు అప్పటికి తెలియదనుకోండి - ప్రయాణ ప్రయాసకు తట్టుకునేలా బలం చేకూర్చుకోడానికి వీలుగా మాకు కరకరా ఆకళ్ళు వేశాయి.

ఇప్పుడు మా దారి, ఎండకు మాడిన వరి పొలాల గుండా, తూర్పుగా (బెంగాలు) బర్ద్వాన్ విభాగంలోకి సాగింది. రోడ్లకు ఎడాపెడా దట్టమైన చెట్లు బారులు తీర్చి ఉన్నాయి. మైనాలూ కంఠం మీద చారలుండే బుల్‌బుల్ పిట్టలూ పాడే పాటలు, పెద్ద గొడుగుల్లాంటి కొమ్మలున్న చెట్ల సందుల్లోంచి వినవస్తున్నాయి. అడపా తడపా ఒక ఎడ్లబండి కనిపిస్తోంది. వాటి కొయ్య చక్రాల ఇనప పట్టాలూ, బండి ఇరుసూ చేసే, 'రినీ, రినీ, మంజా, మంజా' కీచు ధ్వని, మనోవీథిలో నగరాల సిమెంటు రోడ్లమీద కారుటైర్లు చేసే 'స్విష్, స్విష్' శబ్దానికి పూర్తి విరుద్ధంగా వినిపించింది.

"డిక్, ఆపు!" అంటూ చటుక్కున నేను అనేసరికి, ఫోర్డు కారు, దానికి అభ్యంతరం చెబుతున్నట్టుగా ఒక్క కుదుపు కుదిపింది. "బరువు మొయ్యలేక పోతున్న ఆ మామిడిచెట్టు మనని కేకేసి పిలుస్తోంది చూడు!"

మే మయిదుగురం చిన్నపిల్లల్లా, ఆ మామిడిపళ్ళు పడ్డ నేలమీదికి ఉరికాం; పండ్లు ముగ్గి ఉండడంవల్ల ఆ చెట్టు ఘనంగా రాల్చింది.

"ఎన్నో మామిడి పళ్ళు ఎవరికంటా పడకుండా నేలమీద రాలిపోవడానికే పుట్టాయి; రాతిగొట్టు నేలమీద తమ మాధుర్యాన్ని వ్యర్థం చేసుకోడానికే పుట్టాయి," అంటూ ఉదాహరించాను.†

"అమెరికాలో ఇల్లాంటిదేమీ ఉండదు కదండి, స్వామీజీ?" అంటూ నవ్వాడు, నా బెంగాలీ విద్యార్థుల్లో ఒకడు, శైలేశ్ మజుందార్.

"ఉండదు," అని ఒప్పుకున్నాను, మామిడిపండ్లతోనూ తృప్తితోనూ నిండి. "పడమటి దేశాల్లో వీటిని ఎంత పోగొట్టుకున్నానో! మామిడిపండ్లులేని స్వర్గం హిందువు ఊహకే అందదు!"

---

* శ్రీయుక్తేశ్వర్‌గారు అంటూండేవారు : "భగవంతుడు మనకి భూదేవి ఫలాలు ఇచ్చాడు. తిండిని చూడ్డం, వాసన చూడ్డం, రుచి చూడ్డం మనకి ఇష్టం - హిందువుకు దాన్ని తాకడం కూడా ఇష్టం!" భోంచేసేటప్పుడు ఇంకెవరూ దగ్గర లేకుండా ఉన్నట్లయితే దాన్ని 'వినడానికి' కూడా అభ్యంతరం ఉండదు.

† ఆంగ్లకవి థామస్ గ్రే రాసిన 'ఎలిజీ...'ని అనుసరించి. -ప్రచురణకర్త గమనిక.

ఒక రాయి విసిరి చిటారు కొమ్మనున్న చక్కటి పండు ఒకటి రాలగొట్టాను.

ఉష్ణదేశపు ఎండకు వెచ్చగిలిన అమృత ఫలాన్ని కొరుక్కుతింటున్న వాణ్ణల్లా మధ్యలో ఆగి, "డిక్, కెమేరాలన్నీ కారులో ఉన్నాయా?" అని అడిగాను.

"ఉన్నాయండి; సామాన్ల అరలో ఉన్నాయి."

"గిరిబాలగారు నిజమైన యోగిని అని కనక రుజువయితే, ఆవిణ్ణి గురించి పడమటిదేశంలో రాస్తాను. అటువంటి ఉత్ప్రేరక శక్తులు గల హిందూయోగిని - ఈ మామిడిపళ్ళలో చాలావాటి మాదిరిగా - అజ్ఞాతంగా పుట్టి గతించి పోగూడదు."

అరగంట గడిచాక కూడా, నే నింకా ఆ శాంతిధామంలోనే విహరిస్తున్నాను.

"సార్, ఫొటోలకి కావలసినంత వెలుతురు ఉండాలంటే పొద్దుకుంకముందే మనం గిరిబాలగారి దగ్గరికి చేరుకోవాలండి," అన్నాడు రైట్. ఆ తరవాత చిన్నగా చిరునవ్వు నవ్వుతూ, ఇంకా ఇలా అన్నాడు: "పడమటివాళ్ళంతా సంశయ మనస్కులు; ఫొటోలు లేకపోయినట్లయితే ఆవిణ్ణి గురించి చెప్పేది వాళ్ళు నమ్మ తారని అనుకోడానికి వీల్లేదు!"

ఈ జ్ఞాన శకలం వివాద రహితమైనది; జిహ్వాకర్షణ నుంచి నేను వెనక్కి తిరిగి మళ్ళీ కారులోకి వచ్చి కూర్చున్నాను.

"నువ్వన్నది నిజం, డిక్," అంటూ నిట్టూర్చాను, కారులో అడుగుపెడుతూ. "పడమటివాళ్ళ వాస్తవికతాభిమానాన్ని మన్నించడం కోసం నా మామిడిపండ్ల స్వర్గాన్ని త్యాగం చేస్తాను; ఫొటోగ్రాఫులు తప్పకుండా కావాలి!"

వృద్ధాప్యంలో కనిపించే అవలక్షణాల్లా, మొహంమీది ముడతల్లాటి గాళ్ళ తోనూ, సెగ్గడ్డల్లా గట్టిపడ్డ బంకమట్టితోనూ మరింత ప్రయాసపెడుతూ వచ్చింది, దారి. శ్రీరైట్, ఫోర్డుకారును ఇంకా సులువుగా నడపడానికి వీలుగా, మేము అప్పుడప్పుడు దిగి వెనకనించి తోస్తూ వచ్చాం.

"లంబోదర బాబుగారు నిజమే చెప్పారు. కారు మన్ని మొయ్యడం లేదు, మనమే కారును మోస్తున్నాం!" అన్నాడు శైలేశ్.

దూరాన ఒక పల్లె కనిపించేసరికి, ఈ దిగడాల్లోనూ ఎక్కడాల్లోనూ మాకు కలుగుతున్న విసుగు మరుగుపడుతూ వచ్చింది; ప్రతి పల్లే, చిత్రమైన నిరాడంబరత చూపే దృశ్యం.

"మా దారి మలుపులు తిరిగి, అడవి నీడలో ఒదిగి ఉంటున్న పాతకాలపు నిర్మల గ్రామాలగుండా, తాటితోపులగుండా సాగింది," అంటూ శ్రీరైట్, తన

యాత్రా దినచర్యపుస్తకంలో, 1936 మే 5 తేదీ పుటలో రాసింది ఇలా ఉంది. "బురదమట్టితో కట్టిన ఈతాకు గుడిసెల గుంపులు చాలా ఆకర్షకంగా ఉన్నాయి; గుడిసెల తలుపుల మీద దేవుడి పేర్లలో ఒకటి, అలంకారంగా రాసి ఉంటుంది. దిసమొలలతో ఉన్న చిన్న పిల్ల కాయలు చాలామంది, అమాయకంగా ఆడుకుంటున్నారు; తమ పల్లెలోకి పిచ్చిగా దూసుకు వస్తున్న, నల్లగా పెద్దగా ఉన్న, ఎడ్లులేని బండిని తేరిపారి చూస్తున్నారు; లేదా చెల్లాచెదురుగా పారిపోతున్నారు. ఆడవాళ్లు నీడల్లోంచి తొంగి చూస్తున్నారు; మగవాళ్లు రోడ్డు పక్క చెట్లకింద బద్ధకంగా విశ్రాంతి తీసుకుంటూ ఏమీ పట్టనట్టు ఉన్నా వాళ్ళ చూపుల వెనక కుతూహలం ఉంది. ఒకచోట పల్లెప్రజలు ఒక పెద్ద చెరువులో కులాసాగా స్నానాలు చేస్తున్నారు (బట్టలు మార్చుకోడానికి, పొడిబట్ట ఒంటికి చుట్టుకొని తడిబట్టలు కిందికి జార విడుస్తున్నారు). ఆడవాళ్ళు పెద్దపెద్ద ఇత్తడి బిందెలతో ఇళ్ళకి నీళ్ళు తీసుకు వెళ్తున్నారు.

"దారి మిట్టపల్లాలుగా ఉండడంతో మాకు బలే తమాషాగా ఉంది; మేము ఎగిరెగిరిపడుతూ, ఊగిసలాడిపోతూ, వాగుల్లో పడి, నిర్మాణం పూర్తికాని ఒక కాలిబాటకు చుట్టు తిరిగి, పొడి ఇసక ఉన్న నదీగర్భాలకు అడ్డబడి జారుతూ, చివరికి సాయంత్రం 5:00 గంటల ప్రాంతానికి మా గమ్యస్థానం - బియూర్‌కు చేరుకున్నాం. బంకూరా జిల్లాలో ఉన్న ఈ కుగ్రామం దట్టమైన హరితవృక్షాల ఒడిలో మరుగుపడి ఉంది; వానాకాలంలో వాగులు పొంగి వెల్లువలై పారుతూ ఉండగా, పాముల్లాంటి రోడ్లు విషంవంటి బురద కక్కుతూ ఉన్నప్పుడు ప్రయాణి కులు ఆ ఊరు చేరలేరు, అని చెప్పారు.

"ఊరి బయట ప్రత్యేకంగా ఒక స్థలంలో ఉన్న దేవాలయంలో అర్చన ముగించుకొని ఇంటిముఖం పట్టిన భక్తబృందంలో ఒకర్ని మాకు దారి చూపించ మని అడుగుతూ ఉండగా ఒంటిమీద అంతంత మాత్రంగానే బట్టలున్న కుర్రవాళ్ళు ఒక డజనుమంది మమ్మల్ని గిరిబాలగారి ఇంటికి తీసుకువెళ్లామన్న ఉత్సాహంతో కారుకు రెండు పక్కలా మూగేశారు.

"కొన్ని మట్టిగుడిసెలకు నీడనిస్తున్న ఈతచెట్లతోపు వేపు సాగింది మా దారి; కాని మేము అక్కడికి చేరేలోగా మా ఫోర్డు కారు ఒక్క క్షణం ఒరిగి, పైకి ఎగిరిపడింది. ఆ సన్నటిదారి చెట్లచుట్టూ, చెరువులచుట్టూ గుట్టలమీదుగా, గుంటల్లోకి లోతైన గాళ్ళులోకీ సాగింది. గుబురు పొదలమీద కారు లంగరు వేసినట్టయి, తరవాత ఒక గుట్టమీదికి దేకింది. మేము మెల్లగా, జాగ్రత్తగా ముందుకు సాగాం. ఇంతలో హఠాత్తుగా దారి అటకాయించిపోయింది; బండిదారి

మధ్యలో మొక్కల గుబురు ఒకటి ఉంది. అంచేత చుట్టు తిరగడం అవసర మయింది. ఒక ఏటవాలు రాతిచట్టు మీంచి కిందకి, ఎండిపోయిన ఒక చెరువులోకి దిగింది కారు. అక్కణ్ణించి కారు బయటపడ్డానికి, కొంత గీకడం, నరకడం, పారతో చెలగడం అవసరమయాయి. దారి ఎక్కడికక్కడ, ముందుకు పోవడానికి వీలులేకుండా ఉంది; అయినా మా యాత్ర సాగవలసిందే. వందల కొద్ది పిల్లలూ తల్లిదండ్రులూ తేరిపారి చూస్తూండగా, ఉపకార బుద్ధిగల కుర్రవాళ్ళు పారలు తెచ్చి అడ్డంకులు తొలగించేశారు. (గణేశుడి ఆశీస్సుల మహిమ!)

“కాస్సేపట్లో మేము, రెండు పాతగాళ్ళ గుండా మెల్లగా దారి చేసుకుంటూ పోతుంటే, ఆడవాళ్ళు గుడిసెల గుమ్మాల దగ్గర నించుని కళ్ళు విప్పార్చుకొని చూస్తున్నారు. మగవాళ్ళు మా పక్కగానూ వెనకగానూ వస్తూంటే, పిల్లలు పెద్ద ఊరేగింపుగా వచ్చి చేరుతున్నారు. ఈ రోడ్లమీద సాగిన మొట్టమొదటి కారు, బహుశా మాదే కావచ్చు; ఇక్కడ, ‘ఎద్దుబండ్ల సంఘం’ సర్వశక్తిమంతంగా ఉండి ఉండాలి! పురాతనమైన ఏకాంతాన్నీ పవిత్రతనూ చెడగొడుతూ సూటిగా కోటలాంటి తమ గూడెంలోకి చొచ్చుకువచ్చే కారును అమెరికా వాడొకడు నడుపుతూ ఉండగా సాగివస్తున్న మా బృందం ఎంతో సంచలనం కలిగించిం దనడంలో సందేహం లేదు.

“ఒక సన్న సందు దగ్గర ఆగి, వంద అడుగుల దూరంలోఉన్న గిరిబాలగారి పూర్వీకుల ఇంటిని చూశాం. గతుకుల రోడ్డుమీద నానాపాట్లూ పడుతూ చేసిన మా దూరప్రయాణం ముగిసిన తరవాత, ఒక విధమైన కార్యసాఫల్యానందం అనుభవించాం మేము. ఇటికలతోనూ సున్నంతోనూ కట్టిన ఒక పెద్ద రెండం తస్తుల భవనం దగ్గరికి వెళ్ళాం; ఆ భవనం చుట్టూ ఉన్న గుడిసెల ముందు అది కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది. ఆ ఇల్లు ఇప్పుడు మరమ్మతుల్లో ఉంది; దాని చుట్టూ వెదుళ్ళతో కట్టిన పరంజా ఉంది.

“ఆత్రంగా ఎదురు చూడ్డంతోనూ అణుచుకున్న ఆనందంతోనూ మేము భగవంతుడి క్షుధారహిత స్పర్శతో పునీతురాలైన వ్యక్తి ఇంటిముందు నిలిచాం తలుపులు తెరిచి ఉన్నాయి. పిన్నలూ పెద్దలూ, బట్టలు కట్టుకోనివాళ్ళూ కట్టు కున్నవాళ్ళూ అదే పనిగా మాకేసి కళ్ళప్పగించి చూస్తున్నారు; కొద్దిపాటి కుతూహల మున్న ఆడవాళ్ళూ మగవాళ్ళూ మగపిల్లలూ ఈ అపూర్వ దృశ్యాన్ని తిలకిస్తూ మా వెంట ఉన్నారు.

“కొద్దిసేపట్లోనే ఒక పొట్టి మనిషి గుమ్మంలో కనిపించింది. ఆవిడే గిరిబాల! లేత బంగారువన్నె పట్టుపంచె కట్టుకొని ఉన్నారావిడ. భారతీయులకు సహజమైన

విధంగా సవినయంగానూ జంకుతూనూ ముందుకు వచ్చారు; స్వదేశివస్త్రం పై మడత లోంచి తొంగి చూశారు. ఆవిడ కళ్ళు తలమీది ముసుగు నీడల్లోంచి మంటలేని నిప్పుల్లా మెరిశాయి. దయామయమైన ఆవిడ ముఖం చూసి అకృష్టుల మయాం - లౌకిక అనుబంధంతోమలినం కాకుండా ఆత్మదర్శనమూ అవగాహనా ఉట్టిపడే ముఖమది.

"ఆవిడ వినయపూర్వకంగా దగ్గరికి వచ్చి, మేము 'స్టిల్' కెమేరాతోనూ 'మూవీ' కెమేరా*తోనూ కొన్ని ఫొటోలు తీసుకోడానికి అంగీకరించారు. భంగిమల సర్దుబాటుకూ వెలుతురుపడే ఏర్పాటుకూ సంబంధించిన మా ఫొటో టెక్నిక్‌లను ఆవిడ, సిగ్గుపడుతూ ఓరిమితో సహించారు. చివరికి మేము, ఏభై సంవత్సరాలకు పైగా అన్నపానాలు లేకుండా జీవించినట్టు తెలుస్తున్న - ప్రపంచంలోని ఏకైక మహిళ ఫొటోలు అనేకం, భవిష్యత్ తరాలవారికోసం తీశాం. (థెరీసా నాయ్‌మన్ అయితే 1923 నుంచే ఉపవాసం చేస్తోంది). ఒదులుగా జారుతున్న బట్ట పూర్తిగా కప్పుకొని, గిరిబాలగారు మా ముందు నించుని ఉంటే, ఆవిడ ముఖ కవళిక అత్యంత మాతృసహజంగా ఉంది; కళ్ళు వాల్చుకొని ఉన్న ముఖం, చేతులు, కురచ పాదాలూ తప్ప, ఆవిడ శరీరం ఇంకేమీ కనిపించలేదు. అరుదైన ప్రశాంతి, అమాయకత్వం ఉట్టిపడే ముఖం - చిన్న పిల్లకుండే మాదిరి వెడల్పాటి, వణికే పెదవి, స్త్రీ సహజమైన ముక్కు, సన్నగా మిలమిల మెరిసే కళ్ళు, రవ్వంత చిరునవ్వూ."

గిరిబాలగారి గురించి శ్రీరైట్‌కు కలిగిన అభిప్రాయమే నాకూ కలిగింది. ఆవిడ వేసుకున్న లేతవన్నె ముసుగులాగే, ఆధ్యాత్మికత ఆవిణ్ణి ఆవరించింది. ఒక గృహస్థురాలు సన్యాసికి ప్రణామం చేసే ఆచారం ప్రకారం ఆవిడ నాకు ప్రణామం చేశారు. ఆవిడలోని నిరాడంబరమైన ఆకర్షణా ప్రశాంతమైన చిరునవ్వూ, మధుర మైన గంభీరోపన్యాసం కన్న కూడా మిన్నగా మాకు స్వాగతం చెప్పాయి. ఒళ్ళంతా దుమ్ముకొట్టుకు పోయి కష్టపడి చేసిన ప్రయాణం బడలిక అంతా మరిచిపోయాం.

ఆ సాధ్వి, వరండాలో బాసెంపట్టు వేసుకుని కూర్చున్నారు. ఒంటిమీద వయోభారం కనిపిస్తున్నా, బక్కచిక్కిపోలేదు; బూడిద వన్నెలో ఉన్న ఆవిడ చర్మం స్వచ్ఛంగా, ఆరోగ్యంగా ఉంది.

"అమ్మా ఈ యాత్ర చెయ్యాలని నేను పాతికేళ్ళకు పూర్వం నుంచి ఆత్రంగా అనుకుంటూ వచ్చాను! మీ పావన జీవనాన్ని గురించి స్థితిలాల్ నంది బాబుగారి దగ్గర విన్నాను," అంటూ బెంగాలీలో చెప్పాను.

---

* శ్రీరైట్, శ్రీరాంపూర్‌లో చివరి ధనుర్మాస సంక్రమణోత్సవ సందర్భంగా శ్రీయుక్తేశ్వర్ గారి చలన చిత్రాలు కూడా తీశాడు.

"ఔను," అంటూ తల ఊపారావిడ. "ఆయన నవాబ్‌గంజ్‌లో మా పక్కింట్లో ఉండేవారు; మంచివారు."

"ఈ మధ్యకాలంలో నేను మహాసముద్రాలు దాటి వెళ్ళాను; కాని ఎప్పుడో ఒకనాడు మిమ్మల్ని చూడాలన్న సంగతి ఎన్నడూ మరిచిపోలేదు. మీ రిక్కడ చాలా అజ్ఞాతంగా నిర్వహిస్తున్న దివ్యలీలను, లోపలి దివ్యామృతాన్ని చాలా కాలంగా మరిచిపోయిన ప్రపంచానికి ఘనంగా వెల్లడి చెయ్యాలి."

ఆ సాధ్వి ప్రశాంతమైన ఆసక్తితో చిరునవ్వు నవ్వుతూ, ఒక్క నిమిషం కళ్ళు పైకి ఎత్తారు.

"బాబాకే బాగా తెలుసు," అంటూ వినమ్రంగా జవాబిచ్చారు.

ఆవిడ అన్యథా భావించనందుకు నేను సంతోషించాను; యోగులూ యోగినులూ ప్రచారానికి ఎలా స్పందిస్తారో ఎవరికీ ఎన్నడూ తెలియదు. గాఢమైన ఆత్మపరిశీలన నిశ్శబ్దంగా సాగించాలన్న కోరికతో, వారు ప్రచారాన్ని నియమప్రకారం తిరస్కరిస్తారు. అన్వేషణ మనస్కుల ప్రయోజనంకోసం తమ జీవితాల్ని బహిరంగంగా ప్రదర్శించడానికి సరయిన సమయం ఆసన్నమైనప్పుడు, వాళ్ళకొక అంతఃప్రేరణ కలుగుతుంది.

"అయితే అమ్మా, అనేక ప్రశ్నలతో మిమ్మల్ని విసిగిస్తున్నందుకు క్షమించండి. దయచేసి, మీకు ఇష్టమైనవాటికే జవాబు లివ్వండి; మీ మౌనాన్ని కూడా అర్థం చేసుకుంటాను నేను," అంటూ కొనసాగించాను.

ఆవిడ ప్రసన్నంగా చేతులు చాపారు. "నాలాంటి సామాన్య వ్యక్తి తృప్తికరమైన సమాధానాలు ఇవ్వగలిగినంత మట్టుకు, సంతోషంగా ఇస్తాను."

"అఁహఁ. మీరు సామాన్యులు కారు!" అని మనఃపూర్తిగా అభ్యంతరం చెప్పాను. "మీరు మహితాత్ములు!"

"నే నందరికీ వినమ్రదాసిని." ఆవిడ చిత్రంగా ఇంకా ఇలా అన్నారు, "వంట చెయ్యడమన్నా, వడ్డన చెయ్యడమన్నా నాకు ఇష్టం."

"తిండి తినని సాధ్వికి ఇది విడ్డూరమైన కాలక్షేపమే," అనుకున్నాను.

"అమ్మా, మీ నోటినించి వినాలని ఉంది; ఒక్క మాట చెప్పండి; మీరు అన్నం తినకుండానే ఉంటున్నారా?"

"అది నిజం." కొన్ని క్షణాలు ఆవిడ మౌనం వహించారు; ఆ సమయంలో ఆవిడ, మనస్సులో ఏవో లెక్కలు వేసుకుంటూ సతమతమవుతున్నారన్న సంగతి, ఆ తరవాత చేసిన వ్యాఖ్యానాన్నిబట్టి తెలిసింది.

"పన్నెండేళ్ళ నాలుగు నెల్ల వయస్సునుంచి ఇప్పటి అరవై ఎనిమిదేళ్ళ వరకు - యాభై ఆరు ఏళ్ళ పై చిలుకుగా నాకు అన్నపానాలు లేవు."

"తినాలని మీ కెప్పుడూ అనిపించలేదా?"

"అన్నంకోసం ఆర్తి కలిగితే తినవలసి ఉండేది." రోజుకు ముప్పొద్దుల తిండి చుట్టూ ప్రదక్షిణలు చేసే ప్రపంచానికి అతి బాగా తెలిసిన ఈ స్వతస్సిద్ధ సత్యాన్ని ఎంత హుందాగా సరళంగా చెప్పిందీవిడ!

"కాని మీరు ఏదో ఒకటి ఆహారంగా తీసుకుంటూనే ఉంటారేమో!"

నా కంఠస్వరంలో కొద్దిగా ఆక్షేపణ ధ్వనించింది.

"తప్పకుండా!" చటుక్కున అర్థం చేసుకుంటూ చిరునవ్వు నవ్వారు ఆవిడ.

"గాలిలోంచీ సూర్యకాంతి*లోంచీ వచ్చే సూక్ష్మతర శక్తులవల్లా, మజ్జాముఖం ద్వారా మీ శరీరాన్ని పునర్నవం చేసే విశ్వకాంతివల్లా పుష్టి కలుగుతోంది మీకు."

"బాబాకు తెలుసు," అంటూ మళ్ళీ ఒప్పుకున్నారావిడ; ఆవిడ తీరు సౌమ్యంగా, సరళంగా ఉంది.

---

* "మనం తినేది వికిరణ జీవశక్తి, మన తిండి చాలా పరిమాణాల శక్తి," అంటూ 1933 మే 17వ మెంఫిస్‌లో జరిగిన వైద్యశాస్త్రవేత్తల సమావేశంలో, క్లీవ్‌లాండ్ వాస్తవ్యులైన డా॥ జార్జి డబ్ల్యు. క్రైల్ చెప్పాడు. ఆయన ఉపన్యాసంలోని కొన్ని భాగాలు విలేకరులు ఇలా రాశారు:

"శరీరంలోని విద్యుద్వలయమైన నాడీమండలానికి విద్యుత్ ప్రవాహాల్ని పంపే అత్యంత ముఖ్యమైన ఈ వికిరణ జీవశక్తి, సూర్యకిరణాలవల్ల ఆహారంలో సమకూరుతుంది పరమాణువులు సౌరమండలాలు అంటాడు క్రైల్. పరమాణువులు చుట్టుకుపోయిన అనేక స్ప్రింగుల మాదిరిగా, సూర్యకిరణాలు నిండిఉన్న వాహకాలు. అసంఖ్యాకమైన అణుప్రమాణాల శక్తిని ఆహారంలో తీసుకుంటాం అణువులు ఒకసారి మానవశరీరంలోని ప్రోటోప్లాజం (జీవపదార్థం) లోకి ప్రవేశించిన తరవాత వాటి సూర్యకాంతి కొత్త రసాయనిక శక్తినీ కొత్త విద్యుత్ప్రవాహాల్ని సమకూరుస్తుంది. 'మీ శరీరం అలాంటి అణువులతో ఏర్పడ్డది', అంటాడు డా॥ క్రైల్. 'అవే మీ కండరాలూ మెదళ్ళూ కళ్ళూ చెవులూలాంటి జ్ఞానేంద్రియాలూను."

మానవుడు నేరుగా సౌరశక్తివల్ల ఎలా జీవిస్తాడో, శాస్త్రవేత్తలు ఎప్పుడో ఒకనాడు కనిపెడతారు. "సృష్టిలో, సూర్యకాంతి గ్రాహకశక్తి ఏదో ఒక విధంగా ఉన్నట్టుగా మనకు తెలిసిన ఒకే ఒక పదార్థం, క్లోరోఫిల్ (పత్రహరితం)," అంటూ న్యూయార్క్ టైమ్స్‌లో రాశాడు, విలియం ఎల్. లారెన్స్. "సూర్యకాంతిలో ఉన్న శక్తిని ఇది గ్రహించి, మొక్కలో నిలవచేస్తుంది. ఇది లేకపోతే ప్రాణం నిలవదు. బతకడానికి మనకు కావలసిన శక్తిని మనం, శాకాహారంలో నిలవఅయి ఉన్న సౌరశక్తి నుంచి పొందుతాం; మనం ఆ శాకాహారమైనా తింటాం, శాకాహారం తినే జంతువుల మాంసమైనా తింటాం. బొగ్గునుంచికాని, నూనెనుంచికాని మనకు వచ్చే శక్తి, అనేక లక్షల సంవత్సరాల కిందటి వృక్షాల క్లోరోఫిల్ నిక్షిప్తంచేసుకున్న సౌరశక్తి. మనం క్లోరోఫిల్ ద్వారా సూర్యుడివల్ల బతుకుతున్నాం."

"అమ్మా, బాల్యజీవితం గురించి చెప్పండి. భారతదేశానికంతకూ ఆ మాటకు వస్తే - సముద్రాల అవతల ఉన్న మన సోదర సోదరీమణులకు కూడా గాఢమైన ఆసక్తి కలిగిస్తుంది."

గిరిబాలగారు స్వాభావిక గాంభీర్యాన్ని పక్కకి పెట్టి కులాసాగా సంభాషణ సాగించారు.

'అలాగే," ఆవిడ స్వరం మెల్లగా, దృఢంగా ఉంది. "నేను ఈ అడవి ప్రాంతంలో పుట్టాను. అలవికాని ఆకలి ఉండడం తప్ప నా బాల్యంలో చెప్పుకో వలసింది ఏదీ లేదు.

"తొమ్మిదేళ్ళ వయస్సప్పుడు నాకు పెళ్ళి నిశ్చయమయింది."

" అమ్మాయ్, నీ వాపిరిగొట్టుతనాన్ని అదుపులో పెట్టుకోవే! అత్తవారింట్లో కొత్తవాళ్ళ మధ్య ఉండే సమయం వచ్చినప్పుడు, నువ్వు తిండి తినడం తప్ప మరేమీ చెయ్యకపోతే వాళ్ళు ఏమనుకుంటారు?' అంటూ హెచ్చరిస్తూ ఉండేది తరచు, మా అమ్మ.

"ఆవిడ ఊహించిన ప్రమాదం రానే వచ్చింది. నేను నవాబ్ గంజ్‌లో మా అత్తవారింటికి వెళ్ళేసరికి నా వయస్సు పన్నెండేళ్ళే. నా తిండిపోతు అలవాట్ల గురించి మా అత్తగారు, పొద్దున, మధ్యాహ్నం, రాత్రి కూడా నన్ను అవమానిస్తూనే ఉండేవారు అయితే, ఆవిడ తిట్లు నాకు దీవెనలయాయి; నాలో నిద్రాణంగా ఉన్న ఆధ్యాత్మిక ప్రవృత్తులు ఒక్కసారి మేలుకున్నాయి. ఒకనాడు పొద్దున ఆవిడ చేసిన హేళన చాలా నిర్దాక్షిణ్యంగా ఉంది.

" 'నేను బతికున్నంతకాలం, మళ్ళీ ఇక అన్నం ముట్టనని మీకు నిరూపి స్తాను,' అని చటుక్కున బదులిచ్చాను.

"మా అత్తగారు వెటకారంగా నవ్వారు. 'అలాగా!' అన్నారావిడ. 'మితిమించ కుండా తిని బతకలేనిదానివి అసలే తినకుండా ఎలా బతుకుతావే?'

"ఈ వ్యాఖ్యానం, జవాబు చెప్పడానికి వీలయినది కాదు. అయినా నా హృదయంలో ఒక వజ్రనిర్ణయం జరిగింది. ఒక ఏకాంతస్థలంలో కూర్చుని పరమేశ్వరుణ్ణి ప్రార్థించాను.

"పరమేశ్వరా, తిండివల్లకాకుండా నీ వెలుగువల్ల బతకడం ఎలాగో నాకు నేర్పే గురువు నొకరిని నాకు ప్రసాదించు," అంటూ ఎడతెరిపి లేకుండా మొరపెట్టుకున్నాను.

"ఒకానొక దివ్యానందం నన్ను ఆవేశించింది. ఆ ఆనందపారవశ్యంతో

నేను లేచి, నవాబ్‌గంజ్ గంగాఘట్టానికి బయలుదేరాను. దారిలో, మా అత్తవారింటి పురోహితులు తారసపడ్డారు.

" 'మహాశయా, నేను తిండి తినకుండా బతకడం ఎలాగో చెప్పండి,' అని, ఆయన్నే నమ్ముకొని అడిగాను.

"ఆయన జవాబు చెప్పకుండా, నావేపు తేరిపారి చూశారు. చివరికి ఓదార్పు ధోరణిలో మాట్లాడారు. 'అమ్మాయ్, ఈ రోజు సాయంత్రం గుడికి రా; నీ కోసం ప్రత్యేకమైన వైదిక విధి ఒకటి జరుపుతాను.'

"ఈ అస్పష్టమైన సమాధానం కాదు నేను ఆశించింది; ముందుకు సాగి, ఏటి రేవుకు వెళ్ళాను. ప్రాతఃకాల సూర్యకిరణాలు నీళ్ళలోకి దూసుకుపోతున్నాయి; ఏదో పవిత్ర దీక్ష తీసుకోడాని కన్నట్టు, గంగలో స్నానం చేసి పునీతురాల్ని అయాను. చుట్టుకున్న తడిబట్టతో గంగ ఒడ్డునుంచి వస్తూంటే, ఆ పట్టపగటి వెలుతురులో, నా గురుదేవులు నాకు ఎదురుగా ప్రత్యక్షమయారు.

" 'చిట్టితల్లీ,' అంటూ ఆప్యాయంగా పలకరించారు. 'నీ అత్యవసర ప్రార్థన మన్నించి, నీ కోరిక నెరవేర్చడానికి దేవుడు ఇక్కడికి పంపిన గురువును నేను. చాలా అసాధారణమైన ఆ ప్రార్థనకు ఆయన గుండె కరిగిపోయింది! ఈనాటి నించి నువ్వు సూక్ష్మకాంతివల్ల జీవిస్తావు. నీ శరీరాణువులు అనంతవాహినితో పునర్నవం చెందుతూంటాయి.' "

గిరిబాలగారు మౌనం వహించారు. నేను, శ్రీరైట్ పెన్సిలూ పుస్తకమూ తీసుకుని, అతనికి తెలియడానికి కొన్ని సంగతులు ఇంగ్లీషులోకి అనువాదం చేశాను.

ఆ సాధ్వి కథ కొనసాగించారు. ఆవిడ మధురస్వరం, వినిపించీ వినిపించనట్టుగా ఉంది. "రేవు నిర్మానుష్యంగా ఉంది. నా గురుదేవులు ఇతరులెవరూ మమ్మల్ని ఇబ్బంది పెట్టకుండా ఉండడానికని, మా చుట్టూ కాపుదలగా ఒక కాంతి పరివేషాన్ని కల్పించారు. మర్త్యులమాదిరిగా స్థూలమైన ఆహారాలమీద ఆధారపడకుండా, శరీరానికి స్వేచ్ఛ ప్రసాదించే ఒకానొక 'క్రియా' పద్ధతి నాకు ఉపదేశించారు. ఆ ప్రక్రియలో ఒకానొక మంత్రమూ,* సగటు మనిషి సాధన చేసే దానికన్న

* శక్తియుతమైన ప్రకంపనశీలక మంత్రం. సంస్కృతంలో మంత్ర శబ్దానికి, "మనన సాధనం" అన్నది అనువాదం. అది, "సృష్టిలో ఒక నైశారిక ప్రాతినిధ్యం వహించే ఆదర్శవంతమైన అశ్రవ్య ధ్వనుల సముదాయం." ఒక మంత్రాన్ని మాటల రూపంలో ఉచ్చరించినప్పుడు, అది

కష్టతరమైన ఒక శ్వాసనియంత్రణాభ్యాసం ఉంటాయి. మరే మందూ గారడీ ఇందులో లేవు. ఆ 'క్రియ'కు మించి మరేం లేదు."

నాకు అనుకోకుండా, పత్రికారచనా విధానం అలవరిచిన అమెరికా పత్రికా రచయిత ధోరణిలో, గిరిబాలగారిని అనేక విషయాల గురించి ప్రశ్నించాను; అవి పాశ్చాత్యులకు ఆసక్తి కలిగిస్తాయని నా అభిప్రాయం.

ఆవిడ కొద్దికొద్దిగా ఇలా చెబుతూ వచ్చారు : "నా కెన్నడూ పిల్లలు కలగలేదు; చాలా ఏళ్ళ కిందట నేను వితంతువునయాను. నాకు నిద్ర, మెలకువ రెండూ సమానమే కనక, చాలా తక్కువసేపు నిద్రపోతూంటాను. పగటిపూట నా ఇంటిపనులన్నీ చేసుకొని రాత్రిపూట ధ్యానం చేస్తాను. ఋతువు తరవాత ఋతువు మారుతూ వస్తున్నప్పుడు, వాటి మార్పు నాకు కొద్దిగానే అనుభూత మవుతుంది. నే నెప్పుడూ జబ్బుపడలేదు; ఏ వ్యాధీ నా అనుభవంలో లేదు. ప్రమాదవశాత్తు గాయపడ్డప్పుడు కొద్దిగా నొప్పి కలుగుతుంది. నాకు శారీరకమైన మలమూత్రాది విసర్జనలు లేవు. గుండె కొట్టుకోడాన్నీ ఊపిరి ఆడడాన్నీ నేను అదుపులో ఉంచుకోగలను. అంతర్దర్శనాల్లో తరచుగా నేను, నా గురుదేవుల్నీ ఇతర మహాత్ముల్నీ చూస్తూంటాను."

"అమ్మా, మీరు, తిండిలేకుండా జీవించే విధానాన్ని ఇతరులకెందుకు నేర్పగూడదు?" అని అడిగాను.

ప్రపంచంలో తిండిలేక మాడే కోట్లాది ప్రజల మేలుకోసం నేను పెట్టుకొన్న మహత్తరమైన ఆశలు ఇట్టే భగ్నమయిపోయాయి.

"ఉహుఁ," అంటూ తల తిప్పారావిడ. "ఈ రహస్యం ఎవరికీ వెల్లడించ గూడదని గట్టిగా ఆదేశించారు, నా గురుదేవులు. భగవంతుడి లీలారూప జగన్నాటకంలో నేను జోక్యం చేసుకోడం ఆయన అభిమతం కాదు. తిండి తినకుండా ఉండడం ఎలాగో, నేను కనక చాలామందికి నేర్పేసినట్టయితే, రైతులు నా కేమీ ధన్యవాదాలు చెప్పరు! తియ్యతియ్యని పండ్లు నిరుపయోగంగా నేలమీద పడి ఉంటాయి. దైన్యం, ఆకలి, చావు అన్నవి, జీవితానికి నిజమైన అర్థాన్ని అన్వేషించడానికి, చివరికి మనను తరిమే కర్మసంబంధమైన కొరడాలుగా కనిపిస్తాయి."

---

విశ్వపరిభాష అవుతుంది. (వెబ్‌స్టర్స్ న్యూ ఇంటర్నేషనల్ డిక్షనరీ). ధ్వనికి ఉండే అన్ని శక్తులూ ఓంకారం నుంచి వచ్చినవి: అదే "శబ్దం", లేదా విశ్వవ్యయంచలవయంత్రం తాలూకు సృజనాత్మక మర్మర ధ్వని.

"అమ్మా, తిండి తినకుండా బతకడానికి మీరొక్కరే ఎంపిక చెయ్యబడడం వల్ల ప్రయోజనమేముంది?" అని మెల్లగా అడిగాను.

"మానవుడు ఆత్మ అని నిరూపించడానికి." ఆవిడ ముఖం జ్ఞాన దీప్తితో వెలుగొందింది. "అతడు దివ్యమైన ప్రగతి సాధించడం ద్వారా అన్నంవల్ల కాక భగవంతుని శాశ్వత కాంతివల్ల బతకగలుగుతాడు అని నిరూపించడానికి."*

ఆ సాధ్వి గాఢమైన ధ్యానస్థితిలోకి వెళ్ళారు. ఆవిడ దృష్టి అంతర్ముఖ మయింది; ఆవిడ కళ్ళలోతులు అభావసూచకాలయాయి. శ్వాసలేని ఆనంద సమాధి స్థితికి నాందిగా, ఆవిడ ఒక రకమైన నిట్టూర్పు విడిచారు. కొంతసేపు ఆవిడ ఆంతరిక ఆనంద స్వర్గంలోని నిరాక్షేపణీయమైన రాజ్యానికి పరుగు తీశారు.

చీకటి ముసిరింది. నిశ్శబ్దంగా నీడల్లో కూర్చున్న అనేకమంది గ్రామీణుల తలలమీదుగా ఒక కిరసనాయిలు దీపం కాంతి మినుకు మినుకుమంటోంది. రయ్యిన దూసుకువచ్చే మిణుగురు పురుగులూ, దూరాన గుడిసెల్లో ఉన్న చమురు లాంతర్లూ, మృదువైన నల్లటి ముఖమల్ చీకటిపైన చిత్రమైన కాంతి డిజైన్లు అల్లుతున్నాయి. ఇక, బాధాకరమైన వీడుకోలు సమయం; మందకొడిగా, విసుగెత్తించేలా సాగే ప్రయాణం ముందుంది మాకు.

---

* గిరిబాలగారు సాధించిన నిరాహారస్థితి, పతంజలి 'యోగసూత్రాలు' II : 31లో పేర్కొన్న యోగశక్తి ["కంఠకూపే క్షుత్పిపాసా నివృత్తిః"]. ఆవిడ, వెన్నులో ఉన్న సూక్ష్మశక్తుల తాలూకు ఐదో కేంద్రమయిన 'విశుద్ధ చక్రాన్ని' సంయమం చేసే ప్రాణాయామ ప్రక్రియ ఒకటి చేస్తారు. గొంతుక్కి వెనకాలవైపు ఉండే విశుద్ధచక్రం, శరీర కణాల అణువుకూ అణువుకూ మధ్య ఉండే అంతరాల్లో వ్యాపించి ఉండే, ఐదో తత్త్వమైన 'ఆకాశాన్ని' సంయమం చేస్తుంది. ఈ చక్రంమీద మనస్సును కేంద్రీకరింపజేసిన యోగి, ఆకాశశక్తివల్ల జీవించగలుగుతాడు.

ధెరిసా నాయ్‌మన్, భౌతికమైన ఆహారంవల్లకాని నిరాహార జీవనానికి ఉపకరించే శాస్త్రీయ యోగ ప్రక్రియ తాలూకు అభ్యాసాలవల్లకాని బతకలేదు దీనికి వివరణ, నైయక్తిక కర్మ తాలూకు గజిబిజిలో మరుగుపడి ఉంది. ఒక ధెరీసా నాయ్‌మన్‌కు కాని, ఒక గిరిబాలకు కాని, అనేక పూర్వజన్మల దైవాంకిత జీవనం ఉండి ఉంటుంది. కాని బాహ్యాభివ్యక్తికి వాళ్ళవాళ్ళ మార్గాలు వేరువేరుగా ఉంటాయి. తిండిలేకుండా జీవించిన క్రైస్తవ సాధువుల్లో (వాళ్ళు కూడా ఏసుక్రీస్తు క్షతచిహ్నా ధారిణులైన స్టిగ్మాటిస్ట్ లే) చెప్పుకోవలసిన వాళ్ళు : షీడామ్ వాస్తవ్యురాలైన సెంట్ లిడ్వినా, రెంట్ వాస్తవ్యురాలైన పుణ్యశీల ఎలిజబెత్, సీనా వాస్తవ్యురాలైన సెంట్ కాథరైన్, డొమినికా లాజారీ, ఫోలిగ్నో వాస్తవ్యురాలైన పుణ్యశీల ఏంజిలా, 19 శతాబ్ది లూయిస్ లాటో. సమైక్యంకోసం ప్రగాఢమైన అభ్యర్థన చేసి స్విట్జర్లాండ్ రాజ్యసమాఖ్యను కాపాడిన, 15 శతాబ్ది నాటి సన్యాసి ఫ్లూ వాస్తవ్యుడైన సెంట్ నికోలస్ (బ్రూడర్ క్లాస్) ఇరవై ఏళ్ళపాటు నిరాహారిగా ఉండిపోయాడు.

"గిరిబాలగారూ, మీ జ్ఞాపకార్థం నాకు ఏదైనా ఇయ్యండి - మీ చీరల్లోది, ఒక చిన్న పేలిక," అని అడిగాను. ఆ సాధ్వి కళ్ళు విప్పుతూ ఉండగా.

వెంటనే ఆవిడ, ఒక బనారసు పట్టుబట్ట ముక్క ఒకటి తీసుకువచ్చి ఇచ్చి, సాష్టాంగ ప్రణామం చేశారు.

"అమ్మా," అంటూ గౌరవ పురస్సరంగా అన్నాను, "మీ బదులు నన్నే మీ పవిత్ర పాదాల్ని ముట్టుకోనియ్యండి!"

అధ్యాయం : 47

# పడమటికి నా తిరుగు ప్రయాణం

"నేను భారతదేశంలోనూ అమెరికాలోనూ యోగశాస్త్ర పాఠాలు చాలా చెప్పాను; కాని ఒక హిందువుగా, ఇంగ్లీషు విద్యార్థులకు క్లాసులు నడుపుతున్నందుకు అపూర్వమైన ఆనందం కలుగుతోందని చెప్పాలి."

నా లండన్ క్లాసు విద్యార్థులు ప్రశంసాసూచకంగా నవ్వారు; రాజకీయ సంక్షోభాలేవీ మా యోగశాంతిని భంగపరచలేదు.

భారతదేశం ఇప్పుడు పవిత్ర స్మృతి మాత్రమే అయింది. అది 1936లో సెప్టెంబరు నెల; లండన్‌లో ఉపన్యాసమిస్తానని పదహారు నెలల కిందట ఇచ్చిన మాట నిలబెట్టుకోడానికని ఇప్పుడు నేను లండన్ వచ్చాను.

ఇంగ్లండు కూడా, అమరమైన యోగ సందేశాన్ని అందుకోవాలన్న ఉత్సుకతతో ఉంది. పత్రికావిలేఖరులూ న్యూస్ రీల్ కెమేరామెన్, గ్రాస్‌వెనార్ హౌస్‌లో నా బసకు వచ్చి ముసిరేశారు. వరల్డ్ ఫెలోషిప్ ఆఫ్ ఫెయిత్స్ తాలూకు బ్రిటిష్ జాతీయ మండలివాళ్ళు, వైట్‌ఫీల్డ్ కాంగ్రిగేషన్ చర్చిలో సెప్టెంబరు 29న ఒక సమావేశం ఏర్పాటుచేశారు. ఆ సమావేశంలో నేను, "సత్సంగం మీద విశ్వాసం నాగరికతను ఎలా రక్షిస్తుంది?" అన్న బరువైన విషయం మీద మాట్లాడాను. కాక్స్‌టన్ హాలులో రాత్రి 8 గంటలకు జరిగిన ఉపన్యాసాలు శ్రోతల్ని ఎంత అధిక సంఖ్యలో ఆకర్షించాయంటే, వాళ్ళలో బయట మిగిలిపోయినవాళ్ళు, విండ్‌సర్ హౌస్ ఆడిటోరియంలో తొమ్మిదిన్నర గంటలకు జరిగే నా రెండో ఉపన్యాసం కోసం వేచి ఉన్నారు. ఇలా రెండు రాత్రిళ్ళు జరిగింది. ఆ తరవాత జరిగిన యోగవిద్యా తరగతుల్ని శ్రీరైట్, మరో హాలుకు మార్చవలసినంత పెద్దగా పెరిగింది సంఖ్య.

ఇంగ్లీషువాళ్ళ పట్టుదల ఆధ్యాత్మిక బంధుత్వంలో ప్రశంసనీయంగా వ్యక్తమయింది. నేను ఆ దేశాన్ని విడిచి వచ్చిన తరవాత, లండన్ యోగ విద్యార్థులు నిష్ఠగా సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ కేంద్రాన్ని ఏర్పరచుకొని, ఘోరయుద్ధం

జరుగుతున్న సంవత్సరాల్లో కూడా నియమ ప్రకారంగా వారానికోసారి ధ్యాన సమావేశాలు ఏర్పాటు చేసుకున్నారు.

ఇంగ్లండులో మరుపురాని రోజులు; కొన్నాళ్ళు లండన్‌లో నగర విహారం, తరవాత సుందరమైన పల్లెప్రాంతాల సందర్శన. బ్రిటిష్ చరిత్రలో నిలిచిపోయిన మహాకవులవీ వీరులవీ జన్మస్థలాలూ సమాధులూ చూడ్డానికి నేనూ, శ్రీరైట్ నమ్మకంగా పనిచేసే ఫోర్డుకారునే ఉపయోగించాం.

మా చిన్న బృందం అక్టోబరు చివరిలో, "బ్రేమన్" ఓడలో సౌదాంప్టన్ నుంచి అమెరికాకు బయలుదేరింది. న్యూయార్కు రేవులో ఉన్న గంభీరమైన శ్టాచూ ఆఫ్ లిబర్టీ కంటబడేసరికి మా గుండెలు ఆనందంతో ఎగిసిపడ్డాయి.

మా ఫోర్డుకారు, సనాతన భూముల్లో పడ్డ అవస్థలవల్ల ఒక రవ్వ దెబ్బ తిన్నప్పటికీ దృఢంగానే ఉంది; ఇప్పుడది అమెరికా ఖండం ఒకవైపు నించి మరొక వైపుకి చురుగ్గా ప్రయాణం చేస్తూ కాలిఫోర్నియా వైపు సాగింది. 1936 ముగుస్తుందనగా, మౌంట్ వాషింగ్టన్ కేంద్రానికి చేరాం.

లాస్ ఏంజిలిస్ కేంద్రంలో ప్రతీ ఏటా సంవత్సరాంతం సెలవల్లో క్రిస్మస్ ఉత్సవాలు - డిశంబరు 24నాడు వరసగా ఎనిమిది గంటలపాటు జరిగే సామూహిక ధ్యానంతో 'ఆధ్యాత్మిక క్రిస్మసు',* మర్నాడు 'విందు'తో సామాజిక క్రిస్మసు - జరుగుతాయి. ఈ ముగ్గురు ప్రపంచ యాత్రికులకూ పునరాగమన సందర్భంగా స్వాగతం చెప్పడానికి దూర దూరాల్లో ఉన్న నగరాల్నించి ప్రియ మిత్రులూ విద్యార్థులూ రావడంవల్ల ఈ సంవత్సరం ఉత్సవాలు ఇతోధికంగా జరిగాయి.

క్రిస్మస్‌నాటి విందులో, ఆ శుభసందర్భం కోసం పదిహేను వేల మైళ్ళ నుంచి తెచ్చిన నాజూకు వస్తువులు ఎన్నో ఉన్నాయి: కాశ్మీరు నుంచి గుచ్చీ

---

* 1950 సంవత్సరం నుండి ఈ దీర్ఘ ధ్యానం డిశంబరు 23న జరపబడుతోంది. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న సై ఎస్.ఎస్/ఎస్ ఆర్.ఎఫ్ సభ్యులందరూ ఇదే రీతిగా వారి వారి ఇళ్ళల్లో కాని ధ్యాన కేంద్రాల్లో కాని క్రిస్మసుని జరుపుకుంటారు; క్రిస్మసు పండగదినాల్లో ఏదో ఒక రోజు గాఢమైన ధ్యానం, ప్రార్థనల్లో గడుపుతారు. పరమహంస యోగానంద గురుదేవులు ప్రారంభించిన ఈ వార్షిక సాంప్రదాయం వల్ల ఎంతో ఆధ్యాత్మిక లాభం కలిగిందని, ఆశీస్సు లభించిందని, చాలామంది తెలియజేశారు.

యోగానందులు మౌంట్ వాషింగ్టన్ కేంద్రంలో ఒక ప్రేయర్ కౌన్సిలు (ప్రార్థన మండలి)ని కూడా స్థాపించారు. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న వై.ఎస్.ఎస్/ఎస్ ఆర్.ఎఫ్. ప్రేయరు సర్కిల్‌కి ఇది కేంద్రకము (న్యూక్లియసు). తమ తమ ప్రత్యేక సమస్యల్ని పరిష్కరించుకోడానికి లేక పరిహరించడానికి ప్రార్థనలు కోరే వారందరికోసం ప్రతినిత్యం అక్కడ ప్రార్థనలు చేస్తారు.

(ప్రచురణకర్త గమనిక)

పుట్టగొడుగులు, డబ్బాల్లో పెట్టిన రసగుల్లాలు, మామిడితాండ్ర, అప్పడాలు, ఐస్‌క్రీం గుబాళింపుకోసం వెయ్యడానికి తెచ్చిన కేవడా పూలనూనె. ఆనాటి సాయంత్రం మేము, కళ్ళు మిరుమిట్లు గొలిపే పెద్ద క్రిస్మస్ చెట్టు చుట్టూ చేరాం; దానికి దగ్గరిలోనే సుగంధం వెదజల్లే సైప్రస్ కొయ్యదుంగలతో మండుతున్న నిప్పుగూడు ఉంది.

ఇక కానుకలందించే సమయం! నేల నాలుగు చెరగులనుంచీ తెచ్చిన కానుకలు - పాలస్తీనా, ఈజిప్టు, భారతదేశం, ఇంగ్లండు, ఫ్రాన్సు ఇటలీ దేశాల నుంచి తెచ్చినవి. అమెరికాలోని ప్రేమాస్పదుల కోసం ఉద్దేశించిన ఈ నిధుల్ని, ఏ దొంగ చేతికీ చిక్కకుండా కాపాడ్డం కోసం, వాటిని భద్రపరిచిన పెట్టెల్ని ప్రతి విదేశపు కూడలిలోనూ శ్రీరైట్ ఎంత శ్రమ తీసుకుని లెక్కపెడుతూ ఉండేవాడో! పుణ్యభూమి పాలస్తీనా నుంచి పవిత్రమైన ఆలివ్ ధాతుఫలకాలు, బెల్జియం హాలండ్‌ల నుంచి నాజూకు లేసులూ కసీదాలూ, పెర్షియన్ తివాసీలూ సున్నితంగా నేసిన కాశ్మీరు శాలువలూ, మైసూరు నుంచి తెచ్చిన గంధపుచెక్క పళ్ళాలు, మధ్య పరగణాలనుంచి "నంది కంటి" రాళ్ళు, ఏనాడో గతించిన భారతీయ రాజవంశాల వాళ్ళ నాణేలూ, రత్నఖచితమైన పూల కూజాలూ కప్పులూ సూక్ష్మచిత్రాలూ, గోడలకు వేలాడదీసే పటచిత్రాలూ, పూజా పరిమళ ద్రవ్యాలు, డిజైన్లు అద్దిన స్వదేశీ నూలు అద్దకం బట్టలు, లక్క సామగ్రీ, మైసూరు దంతం నగిషీ సామగ్రీ, మొనదేలిన పొడుగాటి పెర్షియన్ చెప్పులూ, అపురూప చిత్రరచనగల రాతప్రతులూ, ముఖమల్ బట్టలూ, బ్రొకేడ్లూ, గాంధీ టోపీలూ, పింగాణీ పాత్రలూ, ఇత్తడి సామానూ, ప్రార్థనకు కూర్చోడానికి వేసుకొనే గొంగళ్ళూ - ఒకటేమిటి, మూడు ఖండాలనుంచి కొల్లగొట్టుకు వచ్చిన సామగ్రి వాటిలో ఉంది.

చెట్టుకింద పేర్చిన పెద్ద గుట్టలోంచి అందంగా ఆచ్ఛాదన చేసి పెట్టిన పెట్టెలు తీసి ఒకదాని తరవాత ఒకటి పంచిపెట్టాను.

"సిస్టర్ జ్ఞానమాతా!" మృదుస్వభావమూ గాఢమైన ఆత్మదర్శనమూ కలిగిన సాధువర్తనురా లీమె; నేను దేశంలో లేని సమయంలో మౌంట్ వాషింగ్టన్ కేంద్రం నిర్వహణభారం వహించిన ఈ అమెరికా మహిళకు పొడుగాటి పెట్టె ఒకటి అందించాను.

ఉల్లిపొర కాయితాలు విప్పి, బంగారు జరీగల బనారసు పట్టుచీర ఒకటి పెట్టెలోంచి పైకి తీసిందావిడ.

"థాంక్యూ సార్; ఇది భారతదేశం వైభవాన్ని కళ్ళకు కట్టిస్తోంది."

"మిస్టర్ డికిన్సన్!" తరవాతి కానుక, నేను కలకత్తా బజారులో కొన్నది. "డికిన్సన్‌గారి కిది బాగా నచ్చుతుంది," అనిపించింది నాకు, కొంటున్నప్పుడు. ప్రియశిష్యుడైన శ్రీ ఇ.ఇ.డికిన్సన్ 1925లో మౌంట్ వాషింగ్టన్ కేంద్రాన్ని స్థాపించి నప్పటినించి ప్రతి క్రిస్మస్ మహోత్సవానికి హాజరవుతున్నాడు.

ఈ పదకొండో వార్షికోత్సవంలో, ఆయన నా ఎదుట నిలబడి పొడుగాటి పెట్టెకు కట్టి ఉన్న రిబ్బన్లు విప్పుతున్నాడు.

"వెండికప్పు!" భావోద్రేకంతో పెనుగులాడుతూ ఆయన, పొడుగాటి వెండి కప్పు కేసి తేరిపారి చూశాడు. దిమ్మెర పోయినట్టు అయి దూరంగా ఒక కుర్చీలో కూర్చున్నాడు. శాంటా క్లాస్‌గా నేను నిర్వహిస్తున్న పాత్రను కొనసాగించేముందు, నేను ఆయనవేపు చూసి ఆప్యాయంగా చిరునవ్వు నవ్వాను.

కానుకలన్నీ ప్రసాదించే దేవుణ్ణి తలుచుకుని కృతజ్ఞతాపూర్వకంగా ప్రార్థన జరపడంతో సాయంకాల కార్యక్రమం ముగిసింది; ఆ తరవాత సామూహికంగా క్రిస్మస్ గీతాల బృందగానం జరిగింది.

తరవాత ఒకసారి శ్రీ డికిన్సనూ నేనూ ఇష్టాగోష్ఠిగా ముచ్చటించుకున్నాం.

"సార్, నాకు వెండికప్పు ఇచ్చినందుకు మీ కిప్పుడు ధన్యవాదాలు చెప్పు కుంటున్నాను," అన్నాడాయన. "క్రిస్మసు నాటిరాత్రి మాట్లాడ్డానికి నా నోటమాట రాలేదు."

"ఆ కానుక మీకోసం ప్రత్యేకంగా తెచ్చాను."

"ఆ వెండికప్పు కోసం నేను నలభైమూడేళ్ళుగా ఎదురుచూస్తున్నానండి! అదో పెద్ద కథ; ఇంతకాలం దాన్ని నా గుండెల్లోనే దాచిపెట్టుకున్నాను." శ్రీ డికిన్సన్ సిగ్గుపడుతూ నావేపు చూశాడు. "ఈ కథ నాటకీయంగా మొదలవు తుంది: నేను మునిగిపోతున్నాను. మా అన్నయ్య తమాషాకి నన్ను ఒక నీళ్ళ మడుగులోకి నెట్టేశాడు. అది పదిహేనడుగుల లోతుంది. నెబ్రాస్కా పట్నంలో ఉందది. అప్పటికి నాకు ఐదేళ్ళే. నేను రెండోసారి నీళ్ళలో మునిగిపోతూండగా, కళ్ళు మిరుమిట్లు గొలిపే వన్నె వన్నెల వెలుతురు ఒకటి కనిపించింది; చుట్టు పక్కలంతా ఆ వెలుతురుతో నిండిపోయింది. దాని మధ్యలో ఒక మనిషి ఆకారం కనిపించింది. ఆయన కళ్ళు ప్రశాంతంగా ఉన్నాయి; ఆయన చిరునవ్వు నాకు అభయమిస్తున్నట్టు ఉంది. నా శరీరం మళ్ళీ మూడోసారి మునకవేస్తూ ఉండగా మా అన్నయ్య స్నేహితుల్లో ఒకతను, సన్నగా పొడుగ్గా ఉన్న విలో చెట్టుకొమ్మ ఒకటి అందుకుని బాగా కిందికి వంచాడు; నిస్సహాయ స్థితిలో ఉన్న నేను, దాన్ని వేళ్ళతో గట్టిగా పట్టేసుకున్నాను. పిల్లలందరూ కలిసి నన్ను ఒడ్డుకెక్కించి ప్రథమచికిత్స చేశారు.

"పన్నెండేళ్ళ తరవాత - పదిహేడేళ్ళ వయస్సులో - నేను మా అమ్మతో కలిసి షికాగో వెళ్ళాను. 1893 సెప్టెంబరు నెల అది. వరల్డ్ పార్లమెంట్ ఆఫ్ రెలిజియన్స్ (ప్రపంచ మత మహాసభ) అన్న మహాసభలు జరుగుతున్న రోజులవి. ఒక పెద్ద వీధిలో నేనూ మా అమ్మా కలిసి వెళ్తూ ఉండగా నేను మళ్ళీ ఉజ్జ్వలమైన ఒక పెద్ద మెరుపు చూశాను. మాకు కొన్ని అడుగులముందు, నింపాదిగా నడుచుకుంటూ వెళ్తున్నాయన ఒకరు కనిపించారు. కొన్నాళ్ళ కిందట నాకు అంతర్దర్శనంలో కనిపించినవారు ఆయనే. ఒక పెద్ద సభామందిరానికి చేరి, గుమ్మం దాటి అదృశ్యమయారు.

" 'అమ్మా, అమ్మా! నేను మునిగిపోతున్న సమయంలో కనిపించి నాయన ఆయనే నమ్మా!' అని అరిచాను.

"అమ్మా నేనూ గబగబా ఆ భవనంలోకి చొరబడ్డాం; ఆయన ఉపన్యాస వేదిక మీద కూర్చుని ఉన్నారు. ఆయన భారతదేశం నుంచి వచ్చిన స్వామి వివేకానందగారు* అని త్వరలోనే తెలుసుకున్నాం. ఆయన ఆత్మోత్తేజం కలిగించే ప్రసంగం చేసిన తరవాత, ఆయన్ని కలుసుకోడానికి నేను ముందుకు వెళ్ళాను. అప్పటికే మేము పాతస్నేహితులమయినట్టు, ఆయన నావేపు చూసి మృదువుగా చిరునవ్వు నవ్వారు. నేను చిన్నవాణ్ణి అవడంవల్ల నా మనస్సులో ఉన్న భావాల్ని ఎలా చెప్పాలో తెలియలేదు; కాని ఆయన నాకు గురువుగా ఉంటానని ఆయనే చెబుతారేమోనని ఆశపడ్డాను. ఆయన నా ఆలోచన పసిగట్టారు.

" 'కాదు నాయనా, నేను నీ గురువును కాను.' అందమైన కళ్ళతో నా కళ్ళలోకి గుచ్చిగుచ్చి చూశారు వివేకానందగారు. 'నీ గురువు తరవాత వస్తాడు. ఆయన నీకో వెండికప్పు ఇస్తాడు,' అన్నారు. తరవాత కొంతసేపు ఆగి చిరునవ్వు నవ్వుతూ, 'నువ్విప్పుడు భరించగలవాటికన్న అధికంగా ఆశీస్సులు కురిపిస్తాడాయన,' అన్నారు.

"మరి కొద్దిరోజుల్లో నేను షికాగో నుంచి వచ్చేశాను," అంటూ చెప్పసాగాడు శ్రీ డికిన్సన్. "వివేకానంద అనే ఆ మహావ్యక్తిని నేను మళ్ళీ ఎన్నడూ చూడలేదు. కాని ఆయన పలికిన ప్రతి పలుకూ నా అంతశ్చేతనలో చెరగని అక్షరాల్లా ముద్ర పడిపోయింది. ఏళ్ళు గడిచిపోయాయి; కాని నా గురువెవరూ కనిపించలేదు. 1925లో ఒకనాటి రాత్రి నా గురువును పంపమని ప్రభువును గాఢంగా ప్రార్థించాను. కొన్ని గంటల తరవాత, శ్రావ్యమైన మృదుసంగీత ధ్వనులతో నాకు మెలకువ వచ్చింది. పిల్లంగోవులూ ఇతర వాద్యపరికరాలూ పట్టుకున్న దేవతల బృందం

* క్రీస్తువంటి మహామహులైన రామకృష్ణ పరమహంస ముఖ్యశిష్యులు.

ఒకటి నా కంటికి అవుపడింది. గాలిలో దివ్యసంగీతం నింపుతూ ఆ దేవతలు మెల్లగా అదృశ్యమయారు.

"మర్నాటి సాయంత్రం, మొట్టమొదటిసారిగా, ఇక్కడ లాస్ ఏంజిలిస్‌లో మీ ఉపన్యాసం ఒకటి విన్నాను; దేవుడు నా ప్రార్థనను మన్నించాడని అప్పుడు తెలుసుకున్నాను."

ఇద్దరం ఒకరివేపు ఒకరు చూస్తూ మౌనంగా చిరునవ్వు నవ్వుకున్నాం.

"ఇప్పటికి పదకొండేళ్ళబట్టి నేను మీ క్రియాయోగ శిష్యుణ్ణి," అంటూ కొనసాగించాడు శ్రీడికిన్సన్. "అప్పుడప్పుడు ఆ వెండికప్పు సంగతి తలుచుకునే వాణ్ణి; వివేకానందగారి మాటలు కేవలం ఆలంకారికంగా అన్నవేమోనని నన్ను నేను సమాధానపరుచుకుంటూ ఉండేవాణ్ణి.

"కాని క్రిస్మస్‌నాటి రాత్రి మీరు ఆ చెట్టుదగ్గర, నా చేతికి పెట్టె అందిస్తూ ఉండగా, నా ఈజీవితంలో మూడోసారి, కళ్ళు మిరుమిట్లు గొలిపే ఆ కాంతి పుంజాన్ని మళ్ళీ చూశాను. మరుక్షణంలో, నా గురువుగారు ఇచ్చిన కానుక - నలభైమూడు సంవత్సరాల కిందటే వివేకానందగారు భవిష్యత్ దర్శనం చేసిన కానుక - వెండికప్పు నా కంటబడింది!"*

---

* శ్రీ డికిన్సన్ స్వామి వివేకానందగారిని 1893 సెప్టెంబరులో కలుసుకున్నారు - పరమహంస యోగానందగారు పుట్టింది అదే సంవత్సరం (జనవరి 5న) యోగానందగారు మళ్ళీ పుట్టినట్టూ భారతీయ దర్శనశాస్త్రాన్ని బోధించడానికి ఆయన అమెరికా వెళ్ళబోతున్నట్టూ వివేకానందగారికి తెలుసునని దీనివల్ల స్పష్టమవుతున్నది.

శ్రీ డికిన్సన్ 89ఏళ్ళ వయస్సులో కూడా మంచి ఆరోగ్యంగా, చురుకుగా ఉంటూ 1965లో 'యోగాచార్య' అనే బిరుదు పొందారు· లాస్ ఏంజిలిస్‌లో సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ ప్రధాన కార్యాలయంలో ఏర్పాటయిన ఉత్సవంలో ఈ బిరుదు ప్రదానం జరిగింది

ఈయన తరచుగా పరమహంసగారితో కలిసి చాలాసేపు ధ్యానం చేస్తూ ఉండేవారు క్రియాయోగ సాధన ఎన్నడూ మానకుండా, రోజుకు మూడుసార్లు చేస్తూండేవారు.

యోగాచార్య డికిన్సన్ 1967 జూన్ 30న పోయారు ఇంకో రెండేళ్ళకు పోతారనగా ఈయన ఎస్ ఆర్.ఎఫ్ సన్యాసుల సమావేశంలో ప్రసంగించారు. ఆ సందర్భంలో, పరమహంసగారికి చెప్పడం మరిచిపోయిన ఆసక్తికరమైన అంశం ఒకటి శ్రోతలకు చెప్పారాయన. యోగాచార్య డికిన్సన్ ఇలా అన్నారు: "స్వామి వివేకానందగారితో మాట్లాడ్డానికి నేను ఉపన్యాసవేదిక దగ్గిరికి వెళ్ళినప్పుడు, నేను ఆయనకు నమస్కరించేలోగానే ఆయన ఇలా అన్నారు.

" 'అబ్బాయ్, నువ్వు నీళ్ళకి దూరంగా ఉండాలి.' " (ప్రచురణకర్త గమనిక)

అధ్యాయం : 48

# కాలిఫోర్నియాలోని ఎన్సినీటస్‌లో

"గురూజీ, మీకు ఆశ్చర్యం కలిగించే ఒక సంగతి! మీరు విదేశాలకు వెళ్ళినప్పుడు మేము ఈ ఎన్సినీటస్ ఆశ్రమం నిర్మించాం; మీరు తిరిగి వచ్చిన శుభసందర్భంగా అందించే 'స్వాగత బహుమానం' ఇది." శ్రీలిన్, సిస్టర్ జ్ఞాన మాత, దుర్గా మా, మరికొందరు భక్తులూ ముసిముసిగా నవ్వుకుంటూ నన్నొక ద్వారంగుండా, చెట్లనీడ పరుచుకున్న దారి వెంబడి నడిపించారు.

నీలి సముద్రంలోకి ప్రవేశించబోయే బ్రహ్మాండమైన తెల్ల ఓడమాదిరిగా ముందుకు పొడుచుకువచ్చిన ఒక భవనాన్ని చూశాను. మొదట నోట మాట రాలేదు; ఆ తరవాత "ఆహాలూ, ఓహోలూ". అటుతరవాత సంతోషాన్నీ కృతజ్ఞతనూ వ్యక్తం చెయ్యడానికి మనిషికున్న చాలీచాలని పదజాలంతో నా ఆనందాన్ని వ్యక్త పరుస్తూ ఆశ్రమమంతా పరిశీలించాను - అసాధారణంగా విశాలంగా ఉన్న పదహారు గదులు; ప్రతి గదీ మనస్సును ఆకట్టుకొనేటట్టు తీర్చిదిద్ది ఉంది.

పై కప్పు నంటేటంతగా ఎత్తయిన పెద్దపెద్ద కిటికీలుగల బ్రహ్మాండమైన హాలు, పచ్చలూ మాణిక్యాలూ నీలాలూ అందంగా అమర్చినట్టుగా పచ్చిక, సముద్రం, ఆకాశంగల వేదికమీద నిలిచినట్టుగా ఉంది. హాలులో పెద్ద నిప్పు గూటికి పైనున్న బడ్డీ మీద క్రీస్తు, బాబాజీ, లాహిరీమహాశయులు, శ్రీయుక్తేశ్వర్ గార్ల బొమ్మలు అమర్చి ఉన్నాయి; ప్రశాంతమైన ఈ పాశ్చాత్యదేశపు ఆశ్రమం మీద వారు ఆశీస్సులు కురిపిస్తున్నట్టు అనిపించింది నాకు.

ఆ హాలుకు సూటిగా కింద, కొండ ముందు భాగంలోనే అనంతమైన ఆకాశానికీ సముద్రానికీ ఎదురుగా ధ్యానగుహలు రెండు నిర్మించి ఉన్నాయి. పైన పచ్చిక బయళ్ళలో సూర్యస్నానానికి అనువుగా ప్రత్యేక ప్రదేశాలూ ప్రశాంత మైన పొదరిండ్లకూ, గులాబీతోటలకూ ఒక యూకలిప్టస్ తోటకూ, పండ్లతోటకూ వెళ్ళే నాపరాయిపరిచిన దారులూ ఉన్నాయి.

"సాధువుల ఉత్తమ, వీరోచితాత్మలు ఇక్కడికి వచ్చుగాక!" (ఆశ్రమ ద్వారాల్లో ఒకదానిమీద వేలాడదీసిన, వివాహంకోసం ఒక విన్నపం లో ఇలా ఉంది; ఇది 'జెంద్-అవెస్తా'లోంచి ఎంపికచేసినది); "వారు మాతో చెయ్యీ చెయ్యీ కలిపి సాగుతూ, భూమిలా సమృద్ధమై, ఆకాశంలా ఉదాత్తమైన తమ శుభాశీస్సులు మాకు అందిస్తూ ఉందురు గాక!"

కాలిఫోర్నియాలో ఎన్సినీటస్‌లో ఉన్న పెద్ద ఎస్టేటు, శ్రీ జేమ్స్ జె.లిన్, సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్‌కు ఇచ్చిన కానుక. శ్రీ లిన్ 1932 జనవరిలో దీక్ష తీసుకున్నప్పటినించి నిష్ఠగా సాధన చేస్తూ వస్తున్న క్రియాయోగి. (విస్తృతంగా చమురు వ్యాపారం చేసే సంస్థకు అధిపతిగా, ప్రపంచమంతటిలోకీ బృహత్తరమైన అన్యోన్య అగ్నిభీమా వినిమయ సంస్థకు అధ్యక్షుడుగా) అంతులేని బాధ్యతలుగల అమెరికా వ్యాపారస్తుడు శ్రీ లిన్; అయినప్పటికీ ఈయన, ప్రతిరోజూ చాలాసేపు గాఢంగా క్రియాయోగ ధ్యానం చెయ్యడానికి వీలు చేసుకుంటారు. అటువంటి సంతులిత జీవితం గడుపుతూ ఈయన, అచంచల ప్రశాంతిని ప్రసాదించే సమాధిస్థితిని అందుకొన్నారు.

నేను భారతదేశంలోనూ యూరప్‌లోనూ ఉన్న కాలంలో (జూన్ 1935 నుంచి అక్టోబరు 1936 వరకు) శ్రీ లిన్,* ఎన్సినీటస్ ఆశ్రమ నిర్మాణాన్ని గురించిన సమాచారం నాకు అందకుండా ఆపడానికి, కాలిఫోర్నియా నుంచి నాతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవాళ్ళతో కలిసి, ప్రేమపూర్వకంగా పన్నాగం పన్నారు. ఆశ్చర్యం, ఆనందం!

అమెరికాలో ఉన్న తొలిరోజుల్లో నేను, సముద్రపు ఒడ్డున ఒక ఆశ్రమం నిర్మించడానికి అనువయిన చిన్న స్థలంకోసం కాలిఫోర్నియా తీరాన్ని గాలించాను. అనుకూలమైన ప్రదేశం కనిపించినప్పుడల్లా నా ప్రయత్నాన్ని విఫలం చెయ్యడానికి ఏదో ఒక ఆటంకం తప్పకుండా వస్తూ ఉండేది. ఇప్పుడు ఎన్సినీటస్‌లో ఆహ్లాదకరమైన అనేక ఎకరాల భూమిని తిలకిస్తూ, "సముద్రతీరంలో ఒక ఆశ్రమం"† అంటూ చాలా కాలం కిందట శ్రీయుక్తేశ్వర్‌గారు చెప్పిన జోస్యం ఫలించడం సవినయంగా చూశాను.

---

* పరమహంసగారి మహాసమాధి తరవాత శ్రీ లిన్ (రాజర్షి జనకానంద) సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్‌కు అధ్యక్షులుగా సేవచేశారు. గురువుగార్ని గురించి శ్రీ లిన్ ఇలా అన్నారు : "సాధు పుంగవుని సాంగత్యం ఎంత దివ్యమైనదవి! నా జీవితంలో లభించినవాటన్నిటిలోకీ, పరమహంస గారు నా మీద కురిపించిన దీవెనలే విలువయినవిగా గుండెలో పదిలపరుచుకుంటాను." శ్రీలిన్ 1955లో మహాసమాధి చెందారు. (ప్రచురణకర్త గమనిక).

† పే. 152 చూడండి.

కొన్ని నెలల తరవాత, 1937 ఈస్టర్‌లో, కొత్త ఆశ్రమప్రదేశంలోని పచ్చిక బయలులో మొట్టమొదటి ఈస్టర్ ప్రభాతసేవ జరిపాను. సనాతన పారశీక పురోహితులలా, అనేక వందలమంది విద్యార్థులు, ప్రతి నిత్యం అద్భుతంగా, ఆకాశంలో తూర్పున ఉదయించే సూర్యబింబాన్ని భక్తిపరవశులయి తిలకించారు. పడమటివేపు, గంభీర ప్రస్తుతితో ఘోషిస్తూ ఉంది పసిఫిక్ మహాసముద్రం; దూరాన పయనిస్తున్న తెల్లటి చిన్న పడవ, ఒంటిగా ఎగురుతూ పోతున్న ఒక సముద్ర పక్షి. "క్రీస్తూ, నువ్వు పునరుత్థానం చెందావు!" వాసంత రవిబింబంతో మాత్రమే కాదు, పరమేశ్వరుడి శాశ్వతోషస్సుతో.

అనేక మాసాలు ఆనందంగా గడిచిపోయాయి. పరిపూర్ణ సౌందర్యాకీర్ణమైన ఎన్సినీటస్‌లో, చాలాకాలం కిందట నేను పథకం వేసుకున్న, 'కాస్మిక్ ఛాంట్స్' (విశ్వగీతాలు)* రచన పూర్తి చేశాను. భారతీయ గీతాలు చాలావాటికి ఆంగ్ల పదాలూ, పాశ్చాత్య స్వరసంకేతాలూ సమకూర్చాను. వాటిలో కొన్ని : శంకరాచార్యుల వారి "నిర్వాణషట్కం" (నో బర్త్ నో డెత్); సంస్కృత మంత్రం "బ్రహ్మానందం పరమ సుఖదం" (హిమ్ టు బ్రహ్మ); టాగూరు రాసిన "మందిరే మమ కే ఆసిల్న ఛే?" (హూ ఈజ్ ఇన్ మై టెంపుల్?); ఇవి కాక నేను సొంతంగా కూర్చిన పాటలు కొన్ని : "ఐ విల్ బి దైన్ ఆల్వేస్" (నే నెప్పుడూ నీ వాడిగా ఉంటాను), "ఇన్ ద లాండ్ బియాండ్ మై డ్రీమ్స్" (నా కలల కావలి లోకంలో), "కం ఔట్ ఆఫ్ ద సైలెంట్ స్కై" (మౌన గగనం నుంచి వెలుపలికి రా), "కం లిసెన్ టు మై సోల్ సాంగ్" (రా, నా ఆత్మగానం ఆలకించు), "ఇన్ ద టెంపుల్ ఆఫ్ సైలెన్స్" (శాంతి మందిరంలో).

ప్రాచ్యదేశాల కీర్తనలకు పాశ్చాత్యుల ప్రతిస్పందన ఎలా ఉంటుందో వివరిస్తూ నా మొట్టమొదటి ప్రముఖ అనుభవాన్ని ఉల్లేఖిస్తూ ఆ పాటల పుస్తకానికి తొలిపలుకు రాశాను. సందర్భం ఒక బహిరంగోపన్యాసం; కాలం, ఏప్రిల్ 18, 1926; స్థలం, న్యూయార్కులో కార్నెగీ హాలు.

"ఓ గాడ్ బ్యూటిఫుల్" (హే హరిసుందర!) అన్న పూర్వ కాలపు కీర్తన ఒకటి పాడమని శ్రోతల్ని అడుగుదామనుకుంటున్నాను," అని ఏప్రిల్ 17న,

---

* యోగదా సత్సంగ సొసైటీ ప్రచురణ. ఈ "కాస్మిక్ ఛాంట్స్" పుస్తకంలోని అనేక పాటలు యోగానందులు పాడగా, రికార్డు చేశారు. ఈ కేసెట్లు రాంచీలోని యోగదా సత్సంగ సొసైటీలో దొరుకుతాయి. (ప్రచురణకర్త గమనిక)

శ్రీఆల్విన్ హన్సికర్ అనే అమెరికన్ విద్యార్థికి చెప్పాను.*

ప్రాచ్యదేశాల పాటలు అమెరికన్లకు సులువుగా అర్థంకావని, నేనన్నదానికి అభ్యంతరం చెప్పాడు శ్రీ హన్సికర్.

"సంగీతం సర్వప్రపంచ భాష," అని జవాబిచ్చాను. "ఆ ఉదాత్త కీర్తనలో ఉన్న ఆత్మోత్తేజక భావాన్ని అనుభూతి కావించుకోడంలో అమెరికావాళ్ళు విఫలం చెందరు."

మర్నాడు రాత్రి, "ఓ గాడ్ బ్యూటిఫుల్' అన్న పాటలోని భక్తి పూరితమైన స్వరాలు ఒకేసారి మూడువేల కంఠాల్లోంచి వెలువడి, గంటసేపటికి పైగా విన వచ్చాయి. ప్రియమైన న్యూయార్కువాసులారా, విసుగు తెలియని మీ హృదయాలు సరళమైన ఈ కీర్తన గానంలో ఆనందతరంగితాలయాయి. భగవంతుడి దివ్యనామాన్ని ప్రేమతో గానం చేసిన భక్తులకు ఆ రాత్రి, దివ్యమహిమవల్ల జబ్బులు నయ మయాయి.

1941లో, బోస్టన్ ఉన్న సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ కేంద్రాన్ని చూడడానికి వెళ్ళాను. బోస్టన్ కేంద్రం నాయకుడైన డా ఎం.డబ్ల్యు. లూయిస్ నాకు, కళాత్మ కంగా అలంకరించిన ఒక మందిరంలో బస ఏర్పాటుచేశాడు. డా॥ లూయిస్ చిరునవ్వు చిందిస్తూ ఇలా అన్నాడు: "గురూజీ, మీరు అమెరికాలో ఉన్న తొలి రోజుల్లో ఈ నగరంలో, స్నానాల గది లేని ఒంటిగదిలో ఉన్నారు. అయితే, బోస్టన్ నగరంలో విలాసవంతమైన నివాసాలు కూడా కొన్ని ఉన్నాయన్న సంగతి మీకు తెలియాలని అనుకున్నాను!"

---

* గురునానక్ పాటలోని పదాలు ఇలా ఉంటాయి.

హే హరి సుందర, హే హరి సుందర
వనా వనామే శ్యామల శ్యామల
గిరీ గిరీ మే ఉన్నత ఉన్నత
సరితా సరితా చంచల చంచల
సాగర సాగర గంభీర హే హరి ॥ హే హరి ॥

సేవక జనకే సేవ సేవకర
ప్రేమికజన కే ప్రేమ ప్రేమకర
దుఃఖిజనోంకే వేదన వేదన.
యోగిజనోంకే ఆనంద హే హరి ॥ హే హరి॥

హే హరిసుందర హే హరిసుందర
తేరే చరణ్‌పర్ సిర్ నమో.

కాలిఫోర్నియాలో అనేక సంవత్సరాలు వివిధ కార్యకలాపాలతో కులాసాగా గడిచిపోయాయి. ఎన్సినీటస్‌లో సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ కోలనీ* ఒకటి 1937లో ఏర్పడింది. కోలనీలో జరిగే అనేక కార్యకలాపాలు, సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ ఆశయాల్ని అనుసరించి శిష్యులకు బహుముఖమైన శిక్షణ ఇస్తాయి. ఎన్సినీటస్, లాస్ ఏంజిలిస్ కేంద్రాల్లో ఉండేవాళ్ళ కోసం పండ్లూ కూరగాయలూ పండించే తోటలు పెంచడం జరుగుతున్నది.

ఈశ్వరుడు సమస్త దేశజనుల్నీ ఒకే రక్తంతో సృష్టించాడు.† "ప్రపంచ సోదరత్వం" అన్నది పెద్ద మాటే; కాని మానవుడు తనను ప్రపంచ పౌరుడిగా పరిగణించుకొని తన సానుభూతులను విధిగా విస్తరింపజేసుకోవాలి. "ఇది నా అమెరికా, నా ఇండియా, నా ఫిలిప్పైన్స్, నా యూరప్, నా ఆఫ్రికా" వగైరాలు నిజంగా అర్థంచేసుకున్నవాడు సుఖమయ జీవనానికి అవకాశం పొందకుండా ఉండడు.

శ్రీ యుక్తేశ్వర్‌గారి దేహం, భారతదేశంలో తప్ప మరెక్కడా నివసించనప్పటికీ, ఆయన ఈ సోదరభావ సత్యాన్ని ఎరుగుదురు:

"ప్రపంచం నా నివాసభూమి."

---

* ఇప్పుడిది బాగా వర్ధిల్లుతున్న ఆశ్రమకేంద్రం. ఇక్కడి భవనాల్లో అసలు ప్రధాన ఆశ్రమమూ, సన్యాసులకూ సన్యాసినులకూ వేరువేరు ఆశ్రమాలూ భోజన సదుపాయాలూ, సభ్యులకూ స్నేహితులకు ఆకర్షవంతమైన ఏకాంత స్థలమూ ఉన్నాయి. రాజమార్గంవేపు ఉన్న విశాల భూమికి అభిముఖంగా వరసగా తెల్లటి స్తంభాలున్నాయి; వీటికి మకుటాయమానంగా స్వర్ణదళాల లోహ పద్మాలున్నాయి. భారతీయ కళలో పద్మం, మెదడులోని "వెయ్యిరేకుల వెలుగుల తామరపువ్వు" అనే విశ్వచేతనాకేంద్రానికి (అంటే, సహస్రారానికి) చిహ్నం.

† యాక్ట్స్ 17.26 (బైబిలు)

అధ్యాయం : 49

# 1940-1951 మధ్యకాలం

"నిజానికి మేము, ధ్యానం విలువ గ్రహించడమే కాకుండా, మా అంత శ్శాంతిని ఏదీ భంగం చెయ్యజాలదని తెలుసుకున్నాం. గత కొద్దివారాలుగా, మా ప్రార్థన సమావేశాలు జరుగుతున్న సమయాల్లో, మేము విమాన దాడి హెచ్చరికలు విన్నాం, ఆలస్యంగా పేలే బాంబుల చప్పుళ్ళు ఆలకించాం. అయినప్పటికీ మా విద్యార్థులు సమావేశమయి, చక్కని మా ధ్యాన కార్యక్రమంలో పాల్గొని పూర్తిగా ఆనందిస్తున్నారు."

ఈ ధైర్య సందేశలేఖ రాసినవారు, లండన్ ఎస్.ఆర్.ఎఫ్. కేంద్రం నాయకుడు. రెండో ప్రపంచ యుద్ధంలోకి అమెరికా ప్రవేశించక ముందటి సంవత్సరాల్లో యుద్ధ బీభత్సం చెలరేగుతున్న ఇంగ్లండు నుంచీ యూరప్‌దేశాల నుంచీ నాకు వచ్చిన అనేక ఉత్తరాల్లో అది ఒకటి.

లండన్ నుంచి వెలువడ్డ ప్రాచ్య జ్ఞానగ్రంథమాల (ద విజ్డం ఆఫ్ ది ఈస్ట్ సిరీస్) ప్రఖ్యాత సంపాదకుడు డా॥ ఎల్. క్రాన్మర్-బింగ్, 1942లో నాకు ఇలా రాశాడు:

"నేను 'ఈస్ట్-వెస్ట్'* పత్రిక చదివినప్పుడు, మనం, పైకి రెండు భిన్న లోకాల్లా కనిపించేవాటిలో ఉంటూ, ఎంత దూరస్థుల్లా గోచరిస్తూ ఉండేవాళ్ళమో గ్రహించాను. అందం, క్రమం, శమం, శాంతి లాస్ ఏంజిలిస్ నుంచి హోలీ గ్రెయిల్ (పవిత్ర పానపాత్ర) ఆశీస్సులతోనూ ఉపశమనం తోనూ నిండిన ఓడ, ముట్టడిలో చిక్కుకున్న నగరపు రేవుకి చేరినట్టుగా - నాకు సమకూరుతున్నాయి.

"తాటితోపు, విశాల సాగరసీమలూ, పర్వతదృశ్యాలతో ఎన్సినీటస్‌లో ఉన్న ఆలయం, వాటినన్నిటిని మించి, ఆ ఆలయానికి సంబంధించిన ఆధ్యాత్మిక భావసంపన్నులైన స్త్రీపురుషుల సౌభ్రాత్రం - ఏకత్వ భావనలో లీనులై, సృజనా

---

* ఈ పత్రిక ప్రస్తుతనామం "సెల్ఫ్- రియలైజేషన్".

త్మక కృషిలో నిమగ్నులై, దైవచింతనలో పరిపూర్ణులైన జనాన్ని - నేను ఒక కలలో మాదిరిగా చూస్తున్నాను.... వేకువకోసం వాచ్‌టవర్ మీద కాసుకొని ఉండి ఈ ఉత్తరం రాస్తున్న ఒక సామాన్య సైనికుడు, సత్సంగ సభ్యులందరికీ శుభాకాంక్షలు పంపుతున్నాడు."

సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ కార్యకర్తలు, కాలిఫోర్నియా హాలీవుడ్‌లో 'చర్చ్ ఆఫ్ ఆల్ రెలిజియన్స్' [సర్వధర్మ సమన్వయ ఆరాధన మందిరం] ఒకటి నిర్మించి 1942లో ప్రారంభోత్సవం జరిపారు. తరవాత మరో ఏడాదికి, కాలిఫోర్నియాలోని శాన్‌డియాగోలో ఒకటి, 1947లో లాంగ్ బీచ్‌లో ఒకటి ఎస్.ఆర్. ఎఫ్. ఆలయాలు స్థాపించడం జరిగింది.*

లాస్ ఏంజిలిస్‌లోని పసిఫిక్ పాలిసేడ్స్ ప్రాంతంలో, ప్రపంచం మొత్తం మీద అందమైన ఎస్టేటుల్లో ఒకటై, పుష్పాకీర్ణమై, అద్భుతమైన ప్రాంతం ఒకటి 1949లో సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్‌కు ప్రదానం చెయ్యబడింది. పదెకరాల 'ఆ స్థలం, పచ్చవన్నె కొండలు చుట్టిఉన్న వర్తులాకార సహజ రంగస్థలం. కొండ కిరీటంలో నీలకాంతమణిలా మెరిసే ఒక సహజ సరోవరం వల్ల ఆ సంస్థానానికి 'సరోవరాలయం' (లేక్‌ష్రైన్) అన్న పేరు వచ్చింది. అక్కడ చిత్రమైన డచ్చి గాలిమరల ఇంట్లో ప్రశాంతమైన ఒక ప్రార్థనాలయం ఉంది; ఒక దిగుదల తోట దగ్గర, పెద్ద నీటిచక్రం ఒకటి నిదానంగా తిరుగుతూ గానంచేస్తూ ఉంటుంది. చైనానుంచి వచ్చిన రెండు పాలరాతి విగ్రహాలు - ఒకటి బుద్ధుడిది, రెండోది క్వాన్ యిన్‌ది (క్వాన్‌యిన్, జగన్మాతకు చైనావారు కల్పించిన మూర్తి)- ఆ స్థానాన్ని అలంకరించాయి. సౌమ్యమైన ముఖమండలంతో, జీరాడుతున్న బట్టలతో ఉన్న నిలువెత్తు క్రీస్తు విగ్రహం ఒకటి, ఒక జలపాతానికి పైనున్న కొండమీద ఉంటుంది; రాత్రిపూట దానికి బ్రహ్మాండంగా దీపాలంకరణ చేస్తారు.

సరోవరాలయం దగ్గర, గాంధీమహాత్ముల ప్రపంచశాంతి స్మారక చిహ్నం (మహాత్మాగాంధీ వరల్డ్ పీస్ మెమోరియల్) ఒకటి 1950లో, అమెరికాలో ఎస్.ఆర్.ఎఫ్. ముప్ఫయ్యో వార్షికోత్సవ† సందర్భంగా ఏర్పాటయింది. భారతదేశం

---

* లాంగ్‌బీచ్ ప్రార్థనాలయం 1967 నాటికి బాగా పెరిగింది. ఆ సంవత్సరంలో ప్రార్థన సమావేశం, కాలిఫోర్నియాలోని ఫులర్‌టన్‌లో ఏర్పాటయిన, విశాలమైన సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ ఆలయానికి మారింది. (ప్రచురణకర్త గమనిక)

† ఈ వార్షికోత్సవం జరిగేటప్పుడు నేను, 1950 ఆగస్టు 27వ లాస్ ఏంజిలిస్‌లో పవిత్రమైన గులాబి - దీపోత్సవం ఒకటి నిర్వహించాను; అప్పుడే 500 మంది విద్యార్థులకు క్రియాయోగ దీక్ష ఇచ్చాను.

నుంచి పంపిన, గాంధీమహాత్ముల చితాభస్మంలో కొంతభాగం, వెయ్యేళ్ళ నాటి ఒక రాతిపెట్టె (sarcophagus) లో భద్రపరచడం జరిగింది.

1951లో హాలీవుడ్‌లో సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ కేంద్రం ఒకటి ఏర్పాటయింది. కాలిఫోర్నియా లెఫ్టినెంట్ గవర్నర్, శ్రీ గుడ్విన్ జె.నైట్, కాన్సల్ జనరల్ ఆఫ్ ఇండియా, శ్రీ ఎం. ఆర్. అహూజా, నాతోబాటు ప్రారంభోత్సవ ప్రార్థన సమావేశాల్లో పాల్గొన్నారు. ఈ కేంద్రం స్థానంలోనే 'ఇండియా హాలు' ఉంది, ఇది 250 మంది కూర్చోడానికి వీలయిన సమావేశ సదనం.

వివిధ ఎస్.ఆర్.ఎఫ్. కేంద్రాలకు కొత్తగా వచ్చే వాళ్ళు తరచుగా, యోగవిద్య గురించి తదుపరి పరిజ్ఞానం కలిగించమని కోరుతూంటారు. ఒక్కొక్కప్పుడు నాకు ఈ ప్రశ్న వినవస్తూ ఉంటుంది: "కొన్ని సంస్థలు నొక్కి వక్కాణిస్తున్నట్టుగా, యోగవిద్య, దగ్గరలో ఉన్న గురువు మార్గదర్శకత్వంలో సాధన చెయ్యవలసిందే తప్ప, అచ్చులో వచ్చింది చదువుకొని సరిగా అధ్యయనం చేసి ఫలితాలు సాధించడానికి వీలు కాదన్నది నిజమేనా?" అని.

అణుయుగంలో, యోగవిద్యను, యోగదా సత్సంగ పాఠాల*మాదిరి బోధన పద్ధతిలో నేర్పవలసిందే; లేకపోతే విముక్తిదాయకమైన ఆ శాస్త్రం మళ్ళీ, ఎంపిక చేసిన కొద్దిమందికే పరిమితమయిపోతుంది. ప్రతి విద్యార్థీ దివ్యజ్ఞానంతో పరిపూర్ణతాసిద్ధి పొందిన ఒక గురువును దగ్గర పెట్టుకుని ఉంటే, నిజంగా అది అమూల్యమైన వరమే; కాని ప్రపంచంలో "పాపులు" చాలామంది, సాధువులు కొద్దిమంది. అటువంటప్పుడు మరి, నిజమైన యోగులు రాసిన బోధనలను తమ ఇళ్ళలో చదువుకోకపోయినట్లయితే, జనబాహుళ్యానికి యోగవిద్య ఎలా సాయపడుతుంది?

దానికి ప్రత్యామ్నాయమేమిటంటే, 'సగటు మనిషి'ని ఉపేక్షించి, అతనికి యోగశాస్త్ర పరిజ్ఞానం కలిగించకుండా వదిలెయ్యడం. నవశకానికి నిర్ణీతమైన దైవప్రణాళిక ఆ మాదిరిది కాదు. చిత్తశుద్ధిగల క్రియాయోగులందరినీ తమ లక్ష్యసాధనకు చేసే కృషిలో పరిరక్షిస్తూ మార్గదర్శకత్వం వహిస్తూ ఉంటానని బాబాజీ

---

* క్రియాయోగశాస్త్ర పద్ధతిలో ధ్యానించడం, ఆధ్యాత్మిక జీవితం గడపడం ఎలాగో బోధించి, వ్యాప్తి చేసేందుకు శ్రీశ్రీపరమహంస యోగానంద స్థాపించిన సంస్థ, రాంచిలోని యోగదా సత్సంగ సొసైటీ వారినుండి ఈ సమగ్రమైన, ఇంటివద్దనే చదువుకోదగిన, పాఠసంపుటి లభిస్తుంది

మాట ఇచ్చారు.* మానవులు, పరమేశ్వరుని సంతానంగా తమ హోదాను పునః స్థాపన చేసుకోడానికి సరయిన కృషి చేసినప్పుడు, వాళ్ళకోసం శాంతి సౌభాగ్యాల లోకం కాసుకొని ఉంటుంది; ఆ లోకాన్ని అవతరింపజేయడానికి అవసరమైన క్రియాయోగులు, పదుల్లో కాదు; లక్షల్లో ఉండాలి.

పాశ్చాత్య ప్రపంచంలో సెల్ఫ్ రియలైజేషన్ సంస్థ ఒకటి - "ఆధ్యాత్మిక మధుకోశం" - స్థాపించే కర్తవ్యం నాకు విధించినవారు, శ్రీయుక్తేశ్వర్‌గారూ, మహావతార్ బాబాజీవారు. ఈ పవిత్ర ధర్మాన్ని సఫలం కావించడంలో కష్టాలు ఎదురుకాకపోలేదు.

"నిజం చెప్పండి పరమహంసగారూ, కృషి ఫలించిందంటారా?" అంటూ ఒకనాడు సాయంత్రం, శాన్‌డియాగో ఆలయం నాయకుడైన డా॥ లాయిడ్ కెనెల్, నన్ను టూకీగా ఇలా ప్రశ్నించాడు. ఆయన అడగ దలిచింది ఏమిటో నేను అర్థంచేసుకున్నాను. "మీరు అమెరికాలో హాయిగా ఉన్నారా? యోగవిద్యా వ్యాప్తిని అరికట్టాలని చూసే అప్రాజ్ఞులు ప్రచారంచేసే అబద్ధాల మాట ఏమిటి? దిగ్భ్రమలూ, హృదయవేదనలూ, నడిపించలేని ధ్యానకేంద్రనాయకులూ, బోధనకు అలవికాని విద్యార్థులూ, మాట ఏమిటి?" అని అడుగుతున్నాడన్నమాట.

"దేవుడి పరీక్షకు గురి అయేవాడు ధన్యుడు!" అని జవాబిచ్చాను. "నా మీద బరువు మోపాలని అప్పుడప్పుడు గుర్తుచేసుకుంటూ వచ్చాడాయన." అప్పుడు నేను విశ్వాసపాత్రులందరినీ, అమెరికా హృదయాన్ని దీపింపజేసే ప్రేమనూ, భక్తినీ, అవగాహననూ తలుచుకున్నాను. మెల్లగా ఒత్తిపలుకుతూ, నే నింకా ఇలా చెప్పాను: "కాని నా జవాబు, ఔననే; వెయ్యిసార్లు చెబుతాను ఔనని! ఆధ్యాత్మిక బంధమనే ఏకైక శాశ్వత బంధంలో సన్నిహితమై ఉన్న, ప్రాచ్య పాశ్చాత్యఖండాల్ని రెండింటినీ చూడాలని నేను కన్న కలలకన్న కూడా మిన్నగా, నా కృషి ఫలిస్తూ వచ్చింది."

పాశ్చాత్యదేశాల విషయంలో గాఢమైన ఆసక్తి చూపించిన భారతీయ మహాగురువులు ఆధునిక పరిస్థితుల్ని బాగా అర్థంచేసుకున్నారు. దేశాలన్నిటి

---

* పరమహంస యోగానందగారు కూడా, ఈ జీవితం ముగిసిన తరవాత 'క్రియావంతులు' (సెల్ఫ్ రియలైజేషన్ ఫెలోషిప్ / యోగదా సత్సంగ సొసైటీ ఆఫ్ ఇండియా పాఠాలు చదివి క్రియాయోగదీక్ష తీసుకున్న విద్యార్థులు; పే 401 అధోజ్ఞాపిక చూడండి) అందరి ఆధ్యాత్మిక ప్రగతినీ పైనుంచి గమనిస్తూనే ఉంటామని ప్రాచ్య పాశ్చాత్య దేశాల్లోని తమ శిష్యులకు చెప్పారు. ఈ చక్కటి వాగ్దానంలోని సత్యం, ఆయన మహాసమాధి జరిగిన నాటినించి ఈనాటి వరకు, ఆయన సర్వాంతర్యామి మార్గదర్శిత్వం తెలిసి వచ్చిన క్రియాయోగులు అనేకమంది రాసిన ఉత్తరాల్లో రుజువయింది. (ప్రచురణకర్త గమనిక)

లోనూ ప్రాచ్య, పాశ్చాత్యాల విశిష్ట సద్గుణాల సమన్వయం ఇంకా బాగా జరగనిదే ప్రపంచం మెరుగుపడదని వారికి తెలుసు. ప్రతి భూగోళార్ధానికీ రెండోది ఇవ్వ గలిగిన వాటిలో సర్వోత్కృష్ట అంశాలు చాలా అవసరం.

ప్రపంచయాత్ర చేసినప్పుడు నేను, ప్రజల బాధల్ని* గమనిస్తూ ఎంతో దిగులుపడ్డాను. ప్రాచ్యదేశాల్లో బాధ అన్నది ముఖ్యంగా, భౌతిక తలంలోది; పాశ్చాత్యదేశాల్లో అది ముఖ్యంగా ఆధ్యాత్మిక తలంలోది. అసంతులిత నాగరికత బాధాకరమైన ఫలితాల్ని దేశాలన్నీ అనుభవిస్తున్నాయి. భారతదేశమూ తక్కిన తూర్పుదేశాలూ అమెరికావంటి పడమటి దేశాల లోకవ్యవహార దక్షత అలవరుచు కోవడంవల్ల గొప్పగా లాభం పొందగలవు. అందుకు భిన్నంగా, పాశ్చాత్యులు, జీవితానికున్న ఆధ్యాత్మి ప్రాతిపదికను, ముఖ్యంగా మానవుడికి దేవుడితో స్నేహంతో కూడిన ఐక్యానుసంధానం జరగడంకోసం పురాతనకాలంలో భారతదేశం రూపొం దించిన శాస్త్రీయపద్ధతుల్ని గాఢంగా అవగాహన చేసుకోవలసిన అవసరం ఉంది.

సర్వసమగ్ర నాగరికత అనే ఆదర్శం అసంభవమైన ఊహ ఏమీ కాదు. అనేక వేల సంవత్సరాలపాటు భారతదేశం, ఆధ్యాత్మిక తేజస్సుకూ విస్తారమైన భౌతిక సంపత్తికీ కాణాచిగా ఉండేది. భారతదేశం సుదీర్ఘ చరిత్రలో, గత 200 సంవత్సరాల పేదరికమూ కర్మానుసారంగా కలిగిన తాత్కాలిక అవస్థ. "భారతదేశ సంపదలు"† అన్నది, శతాబ్దాల తరబడిగా ప్రపంచంలో వినవస్తున్న నానుడి. సమృద్ధి అన్నది - భౌతికమూ ఆధ్యాత్మికమూ కూడా - విశ్వధర్మం లేదా సహజ

---

* ఆ స్వరం సముద్రఘోషలా నన్ను చుట్టుముట్టింది:

"విధ్వంసమై నీ భూమి
శకలాలుగా చెదిరిపోయిందా?

అవిగో, అన్నీ నీకు దూరంగా పారిపోతున్నాయి
నువ్వు నాకు దూరంగా పోతున్నావు కనక:

నీ దగ్గర్నించి తీసుకున్నవన్నీ నేను,
నీకు హాని కలిగించాలని కాదు,

వాటిని నువ్వు నా చేతులమీదుగా పొందజూడాలని.
పసివాడిలా పొరబడి నువ్వు
ఏవి పోయాయని తలుస్తున్నావో, వాటినన్నిటినీ భద్రపరిచాను ఇంట్లో.
లే, నా చెయ్యి బిగబట్టుకో, రా ఇక!"

- ఫ్రాన్సిస్ థాంప్సన్, 'ద హౌండ్ ఆఫ్ హెవెన్' లో

† భారతదేశం 18 శతాబ్దివరకు ప్రపంచంలో అన్ని దేశాలకన్న సంపన్న దేశమని చారిత్రక ఆధారాలు నిరూపిస్తున్నాయి. పైగా, తొలికాలపు ఆర్యులు ఆసియాలో మరోచోటినించో, యూరప్ నుంచో భారతదేశం మీదికి "దండెత్తి వచ్చా" రంటూ చెప్పే ఇప్పటి పాశ్చాత్య చారిత్రక సిద్ధాంతాన్ని హైందవ సాహిత్యంలో కాని, సంప్రదాయంలో కాని ఏదీ నిరూపించడానికి

ఋజువర్తన అనే ఋతానికి ప్రత్యక్షాభివ్యక్తి. దైవానికికాని, సుసంపన్నమైన ప్రకృతి అనే, ఆయన దృగ్విషయదేవతకు కాని పిసినారితనం లేదు.

పారంపర్యంగా వచ్చే ప్రతిజన్మలోనూ మానవుడు, భౌతికపరిస్థితుల ద్వారానూ

---

ఉపకరించదు. ఊహాప్రాయమైన ఈ ప్రయాణం మొదలైన స్థానాన్ని పండితులు నిర్ధారణ చేసి చెప్పలేకపోతున్నారు; ఈ సంగతి స్పష్టంగా తెలుస్తూనే ఉంది. భారతదేశం హిందువులకు బహుపురాతన కాలంనుంచి నివాసస్థానంగా ఉంటూ వస్తున్నదన్న విషయాన్ని సూచిస్తూ వేదాల్లో ఉన్న అంతస్సాక్ష్యాన్ని, అవినాశ్ చంద్ర దాస్‌గారు రాసిన 'ఋగ్వేదిక్ ఇండియా (ఋగ్వేదకాలపు భారతదేశం) అన్న గ్రంథంలో వివరించడం జరిగింది. ఇది చాలా అసాధారణమైన గ్రంథం: హాయిగా చదివిస్తుంది; దీన్ని 1921లో కలకత్తా విశ్వవిద్యాలయంవాళ్ళు ప్రచురించారు భారత దేశం నుంచి వలసపోయినవాళ్ళు యూరప్‌లోనూ ఆసియాలోనూ వివిధ ప్రదేశాల్లో స్థిరపడి, ఆర్యభాషనూ జానపదవిజ్ఞానాన్నీ వ్యాప్తిచేస్తూ వచ్చారని ప్రొఫెసర్ దాస్ వాదం. ఉదాహరణకు, లిథూనియా భాషకు చాలా విధాలుగా, సంస్కృతంతో పోలిక కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. సంస్కృతమేమీ రాని కాంట్ అనే తాత్త్వికుడు, లిథూనియా భాషకుగల శాస్త్రీయమైన నిర్మాణాన్ని చూసి అప్రతిభుడయాడు. "భాషాశాస్త్రానికే కాకుండా చరిత్రకు కూడా సంబంధించిన అనేక రహస్యాల్ని ఛేదించే కీలకం అందులో ఉంది," అన్నాడాయన.

భారతదేశ సంపదలగురించి ప్రస్తావిస్తూ బైబిలు (II క్రానికల్స్ 9 21, 10), "తార్షిష్" ఓడలు, "బంగారం, వెండి, దంతం, కోతులు, నెమళ్ళు" మాత్రమే కాకుండా అల్గం (చందనం) చెట్లకొయ్య రత్నాలు కూడా " ఓఫిర్ (బొంబాయి సముద్రతీరంలో ఉన్న సోపారా) నుంచి తెచ్చి సాలమన్ రాజుకు ఇచ్చాయని చెబుతోంది. గ్రీకు రాయబారి మెగస్తనీస్ (క్రీ పూ 4 వ శతాబ్ది), భారతదేశ సౌభాగ్యాన్ని గురించి వివరంగా రాసి పెట్టాడు రోమన్లు, అప్పట్లో బ్రహ్మాండ మైన నౌకాబల సంపన్నంగా ఉన్న భారతదేశం నుంచి చేసుకునే దిగుమతుల నిమిత్తం, ఏడాదికి ఐదు కోట్ల సెస్టెర్సులు (5 000,000 డాలర్లు) ఖర్చు పెట్టేవారని ప్లినీ (క్రీ.శ. 1 శతాబ్ది) అంటాడు.

సుసంపన్నమైన భారతీయ నాగరికతగురించి, సువ్యాప్తమైన విద్యను గురించి, అద్భుతమైన ప్రభుత్వపాలన గురించి చైనా యాత్రికులు వివరంగా రాశారు. ఫా-హియాన్ (ఐదో శతాబ్ది) అనే చైనా పురోహితుడు, భారతదేశ ప్రజలు హాయిగా, విశ్వాసపాత్రులుగా, భోగభాగ్యాలతో వర్ధిల్లుతున్నారని చెబుతున్నాడు. శామ్యూల్ బీల్ (Samuel Beal), 'బుద్ధిస్ట్ రికార్డ్స్ ఆఫ్ ద వెస్టర్న్ వరల్డ్' అనే పేరుతో, పాశ్చాత్య ప్రపంచ బౌద్ధ లిఖిత పత్రాల గురించి (ఇక్కడ భారతదేశమే చైనావాళ్ళకు "పాశ్చాత్య ప్రపంచం ') రాసిన గ్రంథం చూడండి· ట్రబ్నర్ లండన్ అలాగే థామస్ వాటర్స్ (Thomas Watters), 'ఆన్ యువాన్ చ్వాంగ్స్ ట్రావెల్స్ ఇన్ ఇండియా ఎ.డి 629-45' అనే పేరుతో, యువాన్ చ్వాంగ్ భారతదేశ యాత్రలగురించి రాసిన గ్రంథం రాయల్ ఏషియాటిక్ సొసైటీ ప్రచురణ, కూడా చూడండి.

కొలంబస్ 15 శతాబ్దిలో నూతన ప్రపంచాన్ని కనిపెట్టే సందర్భంలో, నిజానికి అతడు అన్వేషిస్తున్నది, భారతదేశానికి మరింత దగ్గరి వర్తకమార్గం. భారతదేశం నుంచి ఎగుమతి అయే - పట్టుబట్టలు, మసుపన్నని బట్టలు ("నేసిన గాలి", "కంటబడని పొగమంచు" అన్న వర్ణనలకు సరిగా తగినవి), నూలు అద్దకం బట్టలు, బ్రోకేడ్లు, కసీదాలు, కంబళ్ళు, కత్తులూ

వాటిమీద ఆధిపత్యం ద్వారానూ పరమాత్మను అభివ్యక్తం చెయ్యడానికి వీలయిన అనంతమైన మార్గాల్ని ఇంకా సంపూర్ణంగా తెలుసుకోడానికని ఈ భూమికి అకృష్టుడయాడని హిందూ పవిత్ర గ్రంథాలు ఉద్బోధిస్తున్నాయి. ప్రాచ్యపాశ్చా

చాకులూ వంటి కోత సామగ్రి, దంతం, దంతం నగిషీ సామగ్రి, పరిమళ తైలాలు ధూప సామగ్రి, చందనంకర్ర, మట్టి పాత్రలు, ఓషధులు, లేపనాలు, నీలిమందు, బియ్యం, మసాలా వస్తువులు, పగడాలు, బంగారం, ముత్యాలు, కెంపులు పచ్చలు వజ్రాలూ కొనుక్కోవాలన్న లాలస, యూరప్‌కు అనేక శతాబ్దాలపాటు ఉండేది

విజయనగర సామ్రాజ్య మంతటా కనిపించే అతులిత వైభవాన్ని చూసినప్పుడు తమకు కలిగిన ఆశ్చర్యాన్ని గురించి పోర్చుగల్లు ఇటలీదేశాల వర్తకులు రాసిపెట్టారు. ఆ సామ్రాజ్య రాజధాని వైభవాన్ని వర్ణిస్తూ, అరేబియా రాయబారి రజాక్, "భూమిమీద దానికి సమానమైన చోటు మరేదీ కంటికి కనబడలేదు, చెవికి వినబడలేదు," అంటూ రాశాడు

భారతదేశ సుదీర్ఘ చరిత్రలో మొట్టమొదటిసారిగా 16 శతాబ్దిలో, దేశమంతా హైందవేతరుల పాలనలో పడింది. టర్కీదేశపు బాబరు 1524లో భారతదేశం మీద దాడిచేసి ముస్లిం రాజవంశాన్ని స్థాపనచేశాడు. ఈ ప్రాచీన భారతదేశంలో స్థిరపడ్డ కారణంగా కొత్తరాజులు, ఇక్కడి సంపదల్ని బయటికి తీసుకువెళ్ళలేదు. అంతఃకలహాలవల్ల బలహీనమైపోయినప్పటికీ సంపన్నమైన భారత దేశం, 17 శతాబ్దిలో యూరప్ దేశాలకు ఎర అయింది; చివరికి ఇంగ్లండు పాలకదేశంగా పరిణమించింది. 1947 ఆగస్టు 15న భారతదేశం ప్రశాంతంగా స్వాతంత్ర్యం పొందింది.

చాలామంది భారతీయులకున్నట్టుగానే నాకు కూడా, 'ఇప్పుడిక చెప్పవచ్చు' వనిపించే కథ ఒకటి ఉంది. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో, కాలేజిలో నాకు తెలిసిన యువకులు కొందరు నా దగ్గరికి వచ్చి, ఒక విప్లవోద్యమానికి నాయకత్వం వహించమని నన్ను కోరారు దానికి జవాబుగా, "మన ఆంగ్ల సోదరుల్ని చంపడంవల్ల భారతదేశానికి మేలేమీ జరగబోదు. దీనికి స్వాతంత్ర్యం వచ్చేది, ఆధ్యాత్మిక శక్తివల్లే కాని, తుపాకిగుండ్ల ద్వారా కాదు," అని చెబుతూ దాన్ని నిరాకరించాను. ఆయుధాలు తీసుకువస్తున్న జర్మనీ ఓడల్ని నమ్ముకున్నారు మా స్నేహితులు; వాటిని బ్రిటిష్‌వాళ్ళు, బెంగాలులో డైమండ్ హార్బర్ దగ్గర అటకాయించడం జరుగుతుందని నేను వాళ్ళకి చెప్పాను. అయినప్పటికీ ఆ యువకులు తమ పథకాలు సాగించారు కాని, చివరికి నేను చెప్పినట్టే జరిగింది. కొన్నేళ్ళ తరవాత మా స్నేహితులు జైలునుంచి విడుదల అయారు. వాళ్ళలో చాలామంది హింస మీద తమకున్న దృఢ విశ్వాసాల్ని వదలుకొని, గాంధీ మహాత్ముల ఆదర్శవంతమైన రాజకీయోద్యమంలో చేరారు. చివరికి, "యుద్ధాన్ని" శాంతి మార్గాన జయించిన భారతదేశ విజయాన్ని వాళ్ళు కళ్ళారా చూశారు.

దురదృష్టవశాత్తు దేశం, భారత పాకిస్తానులుగా చీలిపోవడం, ఆ తరవాత దేశంలో కొన్ని చోట్ల - కొద్దికాలమే అయినా - రక్తపాతం జరగడం అన్నవి, ఆర్థిక కారణాల వల్ల జరిగినవే కాని, ప్రధానంగా మతోన్మాదంవల్ల జరిగినవి కావు. (పొరపాటున, అప్రధాన కారణాన్ని ప్రధాన కారణంగా చూపెట్టడం జరుగుతోంది). పూర్వకాలంలో మాదిరిగానే ఇప్పటికీ కూడా, అసంఖ్యాకులైన హిందువులూ ముస్లిములూ సామరస్యంగా ఇరుగుపొరుగుల్లోనే నివసిస్తున్నారు. ఈ ఉభయ మతానుయాయుల్లోనూ అనేకమంది, "మతశాఖారహిత" గురువైన కబీరు (1450-1518)కు

త్యాలు రెండూ ఈ మహాసత్యాన్ని వివిధ మార్గాల్లో తెలుసుకుంటున్నాయి; తాము కనిపెట్టిన వాటిని అవి ఒకదానితో ఒకటి సంతోషంగా పంచుకోవాలి. భగవంతుడికి భూమిమీద గల తన సంతానం - దారిద్ర్యం, రోగం, ఆత్మజ్ఞానరాహిత్యం లేని ప్రపంచ నాగరికతను సాధించడానికి ప్రయత్నిస్తూ ఉంటే సంతోషంగా ఉంటుందన్న విషయంలో సందేహానికి తావు లేదు. మానవుడికి తన దివ్యశక్తుల విషయంలో ఏర్పడ్డ మరుపే (తన స్వతంత్రేచ్ఛను* దుర్వినియోగం చేసినందువల్ల కలిగిన ఫలితం) ఇతర రకాల బాధలన్నిటికీ మూలకారణం. మానవత్వారోపితమైన "సమాజం" అనే ఊహకు వర్తింపచేసిన చెడులకు, వాస్తవానికి 'ప్రతి మనిషి'నీ† బాధ్యుణ్ణి చెయ్యవచ్చు. ఆదర్శరాజ్యం (Utopia) అనేది పౌర సద్గుణంతో పుష్పించే ముందు ప్రతి హృదయంలోనూ మొలకెత్తాలి. ఆంతరిక సంస్కరణలు సహజంగా

---

శిష్యులయారు; ఈనాటి వరకు కూడా ఆయనకు లక్షలాది మంది అనుయాయులుగా ఉంటూ వస్తున్నారు ('కబీర్ పంథీలు ) అక్బరు చక్రవర్తి ముస్లిం పాలనకాలంలో భారతదేశమంతటా మతవిశ్వాస స్వాతంత్ర్యం వీలయినంత ఎక్కువగా ఉండేది. ఈనాటికీ 95% మంది నిరాడంబర జనుల్లో తీవ్రమైన మతవైషమ్యం లేదు. నిజమైన భారతదేశం, ఒక గాంధీమహాత్ముణ్ణి అర్థం చేసుకొని ఆయన్ని అనుసరించగల భారతదేశం కనిపించేది, అశాంతితో నిండిన పెద్ద నగరాల్లో కాదు: 70,000 ప్రశాంతమైన పల్లెల్లో; అక్కడ పంచాయతుల (స్థానిక పాలన మండలుల) ద్వారా సరళంగా, న్యాయంగా పరిపాలన జరగడమన్నది అత్యంత ప్రాచీనకాలంగా సాగుతూ వస్తున్న సంప్రదాయం. కొత్తగా స్వాతంత్ర్యం పొందిన భారతదేశానికి ఈనాడు ఎదురవుతున్న సమస్యల్ని కాలక్రమంలో, మహాపురుషులు పరిష్కరిస్తారు; అటువంటివాళ్ళని భారతదేశం కనక పోవడం లేదు.

* "స్వేచ్ఛగా సేవిస్తాం మనం
స్వేచ్ఛగానే ప్రేమిస్తాం కనక; మన సంకల్పంలో ఉంది
ప్రేమించడమో మానడమో; ఇందులోనే, మనం నిలిచినా కూలినా.
కొందరు పతనమయారు, అవిధేయతకు పాల్పడి పతనమయారు
ఆ నాకంనుంచి లోతయిన నరకంలోకి. ఎంత పతనం!
ఎంత ఉన్నతానంద స్థితినించి ఎంత విషాదస్థితికి·" -మిల్టన్, 'పేరడైజ్ లాస్ట్'

† దృగ్విషయిక లోకాలన్నీ రూపొందడానికి కారణమైన దైవలీల-ప్రణాళిక, సృష్టించబడ్డ వానికీ స్రష్టకూ అన్యోన్యాశ్రయ సంబంధమైనది. మానవుడు దేవుడికివ్వ గలిగిన ఒకే ఒక కానుక ప్రేమ; ఆయన అపార కృపకు పాత్రుడు కావడానికి అదొక్కటి చాలు. "మీరు నావన్నీ దొంగిలించేశారు, మొత్తం ఈ దేశవాసులందరూ! నా మందిరంలో ఆహారముండే టందుకు పదోవంతు "పన్ను"లన్నీ ఈ గిడ్డంగికి తీసుకురండి; ఇప్పుడే ఇక్కడే పరీక్షించండి, అన్నాడు అతిథుల దేవుడు (యెహోవా). నేను మీ కోసం స్వర్గమందిరం కిటికీలు తెరుస్తానో లేదో, మీకు ఆశీస్సు కురిపిస్తానో లేదో! దాన్ని [ఆశీస్సును] స్వీకరించడానికి మీకు చాలినంత చోటే ఉండదు." - మలాకీ 3 9-10 (బైబిలు)

బాహ్యమైన వాటికి దారి తీస్తాయి. తనను తాను సంస్కరించుకున్నవాడు వేలాది జనాన్ని సంస్కరిస్తాడు.

మానవుడికి ఊర్ధ్వగతికి ఉత్ప్రేరణ కలిగిస్తూ, కాలపరీక్షకు నిలిచి ఉన్న ప్రపంచ పవిత్ర గ్రంథాలన్నిటి సారమూ ఒక్కటే. నా జీవితంలో అన్నిటికన్న ఆనందంగా గడిపిన కాలాల్లో ఒకటి, బైబిలు కొత్త నిబంధన గ్రంథంలో కొంత భాగానికి 'సెల్ఫ్ రియలైజేషన్' కోసం నేను నా వ్యాఖ్యానం చెబుతూ రాయించ డంలో గడిచింది. ఇరవై శతాబ్దాలపాటు హానికరమైన అపార్థానికి గురిఅయిన క్రీస్తు మాటల్లో అనేకమైనవాటి నిజమైన అర్థాల్ని తరచి చూడ్డంలో నాకు దారి చూపించమని ఆయన్ని గాఢంగా ప్రార్థించాను.

ఒకనాడు రాత్రి, నేను మౌనప్రార్థనలో మునిగి ఉన్నాను. ఎన్సినీటస్ ఆశ్ర మంలో నేను కూర్చునే గది, ఇంద్రనీలమణి కాంతితో నిండిపోతూ వచ్చింది. పుణ్యమూర్తి ఏసుప్రభువు తేజోమయరూపాన్ని దర్శించాను. ఆయన, పలచని గడ్డంతో, మీసకట్టుతో, సుమారు పాతికేళ్ళ యువకుడిలా కనిపించాడు; మధ్యలో పాపిడి తీసిఉన్న నల్లటి పొడుగాటి జుట్టుకు వెనక, ధగధగ మెరిసే బంగారు వన్నె తేజఃప్రభ ఏర్పడి ఉంది.

ఆయన నేత్రాలు శాశ్వత అద్భుతకాంతితో ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నాయి; నేను చూస్తూ ఉండగానే అవి అనంతరీతులుగా మారిపోతున్నాయి. ఆయన అభివ్యక్తిలో ప్రతి ఒక్క దివ్యపరిణామంతో, ఆయన అందించిన జ్ఞానాన్ని నేను, సహజావబోధం ద్వారా అవగాహన చేసుకున్నాను. ఆయన భవ్యదృష్టిలో, అనేక కోట్ల లోకాల్ని భరించే శక్తి నాకు అనుభూతమయింది. ఆయన నోటిదగ్గర ఒక పవిత్ర పానపాత్ర (Holy Grail) ప్రత్యక్షమయింది; అది కిందికి దిగుతూ నా పెదవుల దగ్గరికి వచ్చి, మళ్ళీ తిరిగి ఏసుక్రీస్తు దగ్గరికి వెళ్ళిపోయింది. కొన్ని క్షణాల తరవాత ఆయన మధురమైన వాక్కులు పలికారు; అవి, నా గుండెలోనే పదిలపరుచుకోవలసినంత వ్యక్తిగతమైనవి.

1950 లోనూ 1951 లోనూ నేను, కాలిఫోర్నియాలో మొజావే ఎడారి దగ్గర ఉన్న ఒక ప్రశాంతమైన ఆశ్రమంలో చాలాకాలం గడిపాను. అక్కడే నేను భగవద్గీత అనువాదం చేసి, యోగంలో వివిధ మార్గాల్ని చూపించే వివరమైన వ్యాఖ్యానం* ఒకటి రాశాను.

---

* "**గాడ్ టాక్స్ విత్ అర్జున**: ద భగవద్గీత - ద రాయల్ సైన్స్ ఆఫ్ గాడ్-రియలైజేషన్' అన్న పేరుతో సెల్ఫ్‌రియలైజేషన్ సంస్థ ఈ గ్రంథాన్ని ప్రచురించింది. భారతీయులకు అత్యంత ప్రియమైన శాస్త్రగ్రంథం భగవద్గీత. (పరమాత్మకి ప్రతీక అయిన) శ్రీకృష్ణభగవానుడికి (ఆదర్శ

భారతదేశపు పవిత్ర గ్రంథాల్లోకల్లా సర్వోత్కృష్టమైన ఈ మహాగ్రంథం, ఒక యోగప్రక్రియను (భగవద్గీతలో చెప్పిన ఒకే ఒకటి; దాన్నే బాబాజీ సులువుగా 'క్రియాయోగం' అన్నారు), కంఠోక్తిగా రెండు*సార్లు ప్రస్తావిస్తూ, ఆచరణ సాధ్యమూ నీతిపరమూ అయిన ఉద్బోధను ప్రసాదించింది. మన స్వప్నలోక మహాసాగరంలో ఊపిరి అనేది, మానవరూపాలూ తదితర భౌతిక వస్తురూపాలూ అనే వైయక్తిక తరంగాల చైతన్యాన్ని ఉత్పాదించే ఒక విశిష్ట మాయామేయ ఝుంఝు. మానవుణ్ణి, తన ప్రత్యేక అస్తిత్వమనే బాధాకరమైన స్వప్నంలోంచి మేల్కొలపాలంటే కేవలం తాత్త్విక, నైతిక జ్ఞానం ఒక్కటి చాలదని తెలుసుకొని, కృష్ణభగవానుడు, యోగి తన శరీరాన్ని స్వాధీనంచేసుకొని ఇచ్ఛానుసారంగా, శుద్ధశక్తిగా మార్చడానికి వీలయిన పవిత్రశాస్త్రాన్ని ఉపదేశించాడు. ఈ అద్భుత యోగశక్తి సామర్థ్య నిరూపణావకాశం, అణుయుగానికి మార్గదర్శులైన ఆధునిక శాస్త్రవేత్తల సైద్ధాంతి కావగాహనకు అతీతమైనదేమీ కాదు. అన్ని రకాల పదార్థమూ శక్తిగా మార్చడానికి వీలయినదని రుజువయింది.

అందరు మానవులూ యోగశాస్త్రాన్ని ఉపయోగించుకోవచ్చు కాబట్టి, హిందూ పవిత్ర గ్రంథాలు యోగశాస్త్రాన్ని కీర్తించాయి. ఔపచారిక (formal) యోగపద్ధతులు ఉపయోగించకపోయినప్పటికీ, శ్వాసయొక్క రహస్యం - మహా భక్తులైన కొందరు హైందవేతర మార్మికుల విషయంలో జరిగినట్టు - అప్పుడప్పుడు వెల్లడి అయినమాట వాస్తవమే. క్రైస్తవ, ముస్లిం మతాలవంటి ఇతర మతాల అనుయాయులైన సాధువులు కొందరు ఊపిరిలేకుండా, కదలిక లేకుండా సమాధి (సవికల్ప సమాధి)† స్థితిలో ఉండగా, నిజంగా గమనించడం జరిగింది. ఆ స్థితి రానిదే ఏ ఒక్కడూ, దైవసాక్షాత్కార సాధనలో ప్రథమ దశలలోకి ప్రవేశించలేడు. (అయితే సాధువు, అత్యున్నతమైన 'నిర్వికల్ప సమాధి'కి చేరిన తరవాత మాత్రం, అతడిక తిరుగులేకుండా ఈశ్వరుడిలో ప్రతిష్ఠితుడై ఉంటాడు - అతడు ఊపిరి తీసుకోకపోయినా, తీసుకుంటున్నా, నిశ్చలంగా ఉన్నా, పనిచేస్తున్నా సరే).

---

భక్తునికి ప్రతీక అయిన) అర్జునుడికి మధ్య జరిగిన సంభాషణ అది : సత్యాన్వేషులందరికీ ఎప్పుడూ పనికివచ్చే, ఆధ్యాత్మిక మార్గదర్శకత్వం చేసే మాటలు. గీత ముఖ్యసందేశమేమిటంటే, మానవుడు దేవుణ్ని ప్రేమించడం ద్వారానూ జ్ఞానంద్వారానూ నిస్సంగత్వంతో కూడిన సత్కర్మాచరణ ద్వారానూ మోక్షం పొందవచ్చునని. (ప్రచురణకర్త గమనిక)

* భగవద్గీత IV 29, V.27-28

† 26 అధ్యాయం చూడండి. సవికల్ప సమాధిలో ఉండగా కనిపించిన క్రైస్తవ మార్మికుల్లో చెప్పుకోదగినావిడ, అవిలా వాస్తవ్యురాలైన సెంట్ తెరిసా. ఆవిడ శరీరం, కదపడానికి వీలులేకుండా ఎంత స్థిరంగా బిగిసిపోయేదంటే, వాళ్ళ మఠంలో, ఆవిణ్ణి చూసి ఆశ్చర్యపోయిన సన్యాసినులు, ఆవిడ భంగిమను మార్చడానికి కాని, బాహ్యస్పృహ కలిగించడానికి కాని అశక్తులయేవారు.

బ్రదర్ లారెన్స్ అనే 17 శతాబ్ది క్రైస్తవ మార్మికుడు, ఒక చెట్టును చూస్తుండడం వల్ల తనకు, దైవసాక్షాత్కారంలో తొలి అనుభూతి కలిగిందని చెప్పాడు. దాదాపు మనుషులందరూ చెట్టును చూసినవాళ్ళే; కాని చెట్టుద్వారా, చెట్టును సృష్టించినవాణ్ణి దర్శించినవాళ్ళు అరుదు. చాలామంది, నిర్నిరోధమైన భక్తి శక్తుల్ని ఆవాహన చెయ్యడంలో బొత్తిగా పనికిరానివాళ్ళు; కాని ప్రాచ్యదేశాల్లోనయితేనేమి, పాశ్చాత్య దేశాల్లోనయితే నేమి, అన్ని మతమార్గాల్లోనూ కనిపించే కొద్దిమంది 'ఏకాంతు' లకు - అంటే, ఏకైక హృదయాభిలాషగల సాధువులకు మాత్రమే ఆ శక్తి అప్రయత్నంగా అలవడింది. అయినప్పటికీ ఆ కారణంగా సామాన్య మానవుడికి* దైవానుసంధానావకాశం లేకుండా పోలేదు. ఆత్మస్మర ణకు అతనికి కావలసినవల్లా, క్రియాయోగ ప్రక్రియా, నిత్యజీవితంలో నైతిక నియమపాలనా, "ఈశ్వరా, నిన్ను తెలుసుకోడానికి తపించిపోతున్నాను!' అంటూ, చిత్తశుద్ధితో మొరపెట్టుకోగల సామర్థ్యమూ.

ప్రతిరోజూ సాధన చెయ్యడానికి వీలయిన ఒక శాస్త్రీయ పద్ధతి ద్వారా దైవానుసంధాన మార్గం, యోగంలో ఉండే విశ్వజనీన ఆకర్షణ; ఉన్నతమైన గాఢభక్తి సగటు మనిషి భావపరిధిలో అతీతమైనది కనక.

భారతదేశంలో గొప్ప జైనగురువుల్ని "తీర్థంకరులు" (మార్గదర్శులు) అంటారు; అలా అనడానికి కారణం, దిగ్భ్రమలో మునిగిఉన్న మానవజాతి, సంసార కర్మ చక్రభ్రమణంలో జననమరణాల పునరావృత్తి అనే తుపాను సముద్రాల్ని దాటిపోవడానికి వీలయిన దారిని వాళ్ళు చూపిస్తారు కనక. 'సంసారం' (వ్యుత్పత్తి అర్థం ప్రకారం దృగ్విషయక ప్రవాహంతో బాటు 'ప్రవహించడం') కనీస నిరోధ మార్గాన్ని అనుసరించడానికి మనిషిని ప్రేరేపిస్తుంది. "కాబట్టి ప్రపంచానికి స్నేహితుడైనవాడల్లా దేవుడికి శత్రువు."† దేవుడికి స్నేహితుడవాలంటే మానవుడు, ప్రాపంచిక మాయాజాలాల్లో, తనలో ఎప్పుడూ దౌర్బల్యానికి దోహదంచేసే దుష్కర్మ ఫలాల్ని తప్పకుండా జయించాలి. కఠోర కర్మ సూత్రాన్ని గురించిన జ్ఞానం, దాని బంధాలనుంచి విడివడి, చరమ విముక్తికి మార్గం కనుక్కోడానికి చిత్తశుద్ధితో అన్వేషించేవాణ్ణి ప్రోత్సహిస్తుంది. మానవుల కర్మదాస్యం, మాయవల్ల అంధకార

---

* "సామాన్యమానవుడు" ఎక్కడో ఒకచోట, ఎప్పుడో ఒకప్పుడు ఆధ్యాత్మిక కృషి ఆరంభించవలసిందే. "వెయ్యిమైళ్ళ ప్రయాణం ఒక్క అడుగుతోనే మొదలవుతుంది," అన్నాడు లావో-ట్జు. "మంచిని గురించి, 'అది నా దగ్గరికి రాదు' అని మనస్సులో ఎవరినీ అనుకోనియ్యకు. ఒక్కొక్క నీటిబొట్టుతోనే కుండ నిండుతుంది; బుద్ధిమంతుడు కొద్దికొద్దిగా ప్రోగు చేసుకుంటు న్నప్పటికీ చివరికి మంచితో నిండిపోతాడు." అంటూ బుద్ధుడు చెప్పింది పోల్చి చూడండి.

† జేమ్స్ 4·4 (బైబిలు)

మయమైన మనస్సుల్లోని కోరికల్లో పాదుకొని ఉంది కాబట్టి, యోగి ప్రమేయం పెట్టుకునేది మనోనిగ్రహంతోనే.* కర్మసంబంధమైన అజ్ఞానం తాలూకు వివిధ కోశాల్ని విసర్జించిన తరవాత మానవుడు, తనను స్వస్వరూపంలో దర్శిస్తాడు.

భూమిమీద మానవుడి మజిలీకి ఏకైక ప్రయోజనం జీవన్మరణాల నిగూఢ రహస్యాన్ని ఛేదించడమే; ఈ నిగూఢ రహస్యం, శ్వాసతో గట్టిగా ముడిపడి ఉంది. ఊపిరి లేకపోవడమంటే, చావు లేకపోవడం. ఈ సత్యాన్ని తెలుసుకొని, భారతదేశపు సనాతన ఋషులు ఊపిరికి ఏకైక కీలకాన్ని కనిపెట్టి, ఊపిరి లేకుండా ఉండడానికి సంబంధించిన సునిశిత, సహేతుక శాస్త్రం ఒకటి రూపొందించారు.

ప్రపంచానికి అందించడానికి భారతదేశం దగ్గర మరేదీ లేకపోయినా రాజోచితంగా ఇయ్యగల 'క్రియాయోగం' ఒక్కటే చాలు.

శరీరానికీ ఆత్మకూ మధ్య సూక్ష్మమైన లంకెగా పనిచేయడానికి దేవుడు ఊపిరిని కల్పించాడన్న సంగతి హీబ్రూ ప్రవక్తలకు బాగా తెలుసన్న విషయాన్ని వెల్లడించే ఘట్టాలు కొన్ని బైబిలులో ఉన్నాయి. 'జెనిసిస్'లో ఇలా ఉంది: "ప్రభువైన దేవుడు నేలమీది మట్టిలోంచి మనిషిని చేసి అతని ముక్కుల్లోకి ప్రాణ వాయువు ఊదాడు. అప్పుడు మనిషి, జీవించే ఆత్మ అయాడు.† మానవ శరీరం, "నేలమీది మట్టి"లో కూడా కనిపించే రసాయనిక, ఖనిజ పదార్థాలతో ఏర్పడినది. అజ్ఞాన మానవుల్లో, ఊపిరి (వాయురూపశక్తి) ద్వారా శరీరానికి ఆత్మ ప్రసరణ చేసే ప్రాణశక్తి ప్రవాహాలే కనక లేకపోయినట్లయితే, రక్త మాంసాలు గల మానవదేహం, తన కార్యకలాపాల్ని ఎన్నడూ కొనసాగించగలిగి ఉండేది కాదు; శక్తినీ చలనాన్నీ

---

* "యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా,
యోగినో యత చిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః.
యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి.
సుఖమాత్యంతికం యత్తద్ బుద్ధిగ్రాహ్యమతీంద్రియం,
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః.
యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః,
యస్మిన్స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే.
తం విద్యాద్దుఃఖ సంయోగవియోగం యోగసంజ్ఞితం
స నిశ్చయేన యోక్తవ్యో యోగోనిర్విణ్ణ చేతసా.
- భగవద్గీత VI 19-23

† జెనిసిస్ 2:7 (బైబిలు)

ప్రదర్శించగలిగీ ఉండేది కాదు. మానవ శరీరంలో పంచప్రాణాలుగా, అంటే సూక్ష్మ ప్రాణశక్తులుగా పనిచేసే ప్రాణశక్తి ప్రవాహాలు సర్వవ్యాప్తమయిన ఆత్మతాలూకు ఓంకార ప్రకంపనకు అభివ్యక్తులు.

ఆత్మ అనే మూలస్రోతస్సు నుంచి వెలువడి మాంసకణాల్లో ప్రకాశించే ప్రాణం ప్రతిబింబం, లేదా సత్యాభాసం ఒక్కటే, మానవుడికి తన శరీరంతో అనుబంధం ఉండడానికి కారణం; సహజంగా అతడు ఒక మట్టిముద్దకు ఆదర పూర్వకంగా నివాళి అర్పించలేడు. ఎవరయిన ఒకరు తన భౌతికరూపమే తానని తప్పుగా గుర్తిస్తున్నారంటే, దానికి కారణం, ఆత్మనుంచి వచ్చే ప్రాణశక్తి ప్రవాహాలు - మానవుడు కార్యాన్నే [ఫలితాన్నే] కారణంగా అపార్థంచేసుకునే టంత గాఢమైన శక్తితో, ఊపిరి ద్వారా మాంసంలోకి ప్రవేశించడం - శరీరానికి సొంత ప్రాణం ఒకటి ఉందని దేహారాధనపరత్వంతో ఊహించడం.

మానవుడి చేతనస్థితి, శరీరశ్వాసల స్పృహ. నిద్రలో చురుకుగా ఉండే అతని అవచేతనస్థితి, శరీర శ్వాసలనుంచి మానసికంగానూ తాత్కాలికంగానూ కలిగే వేర్పాటుతో ముడిపడి ఉన్నది. "మనుగడ" అనేది శరీరంమీదా శ్వాసమీదా ఆధారపడి ఉందన్న భ్రాంతినుంచి విముక్తి పొందినది అతని అధిచేతన స్థితి.* దేవుడు ఊపిరి లేకుండానే జీవిస్తాడు; అతని రూపంలోనే తయారైన ఆత్మ, ఊపిరిలేని స్థితిలోనే మొట్టమొదటిసారిగా తన ఉనికిని తాను తెలుసుకుంటుంది.

పరిణామాత్మక కర్మవల్ల ఆత్మకూ శరీరానికీ ఉన్న ఊపిరి లంకెను తెంపి నప్పుడు "చావు" అనే హఠాత్పరిణామం సంభవిస్తుంది. భౌతిక కణాలు వాటికి సహజమైన శక్తిహీనతను తిరిగి పొందుతాయి. అయితే క్రియాయోగికి ఈ ఊపిరి లంకె, కర్మఫలావశ్యకమైన కఠోర ప్రమేయంవల్ల కాకుండా, శాస్త్రీయ విజ్ఞానం వల్ల ఇచ్ఛానుసారంగా విడివడుతుంది. యథార్థ అనుభవం ద్వారా యోగి, వస్తుతః తాను శరీరం కాదన్న విషయం ముందే ఎరిగి ఉంటాడు; భౌతిక దేహం మీద

* నీ నరనరాల్లో సముద్రమే ప్రవహించనంతవరకు, నువ్వు ఆకాశాంబరధారివై నక్షత్రజాల కిరీటాన్ని ధరించి యావత్ప్రపంచానికీ నువ్వే ఏకైక వారసుడిగా నిన్ను దర్శించుకోనంతవరకు - అంతకన్న మిన్నగా, ప్రతి ఒక్కడూ నీలాగే ఏకైక వారసులయినవాళ్ళు ఉన్నారు కాబట్టి పిసినిగొట్టువాళ్ళు బంగారాన్నీ, రాజులు తమ రాజదండాల్నీ చూసుకొని ఆనందించేటట్టుగా నువ్వు దేవుణ్ణి కీర్తిస్తూ సంబరపడుతూ ఆనందానుభూతి పొందేవరకు... నీ నడకా, నీ బల్లా నీకు పరిచయమై ఉన్నంతగా, అన్ని యుగాల్లోనూ దైవలీలలతో నీకు పరిచయం కలిగేటంత వరకు, ప్రపంచ సృష్టికి మూలమైన ఛాయామాత్ర శూన్యంతో నీకు అత్యంత సన్నిహితంగా పరిచయం ఏర్పడేటంతవరకు నువ్వు ఈ లోకంలో సమ్యగానందానుభూతి ఎన్నడూ పొందలేవు." - థామస్ ట్రాహెర్న్, 'సెంచరీస్ ఆఫ్ మెడిటేషన్స్' [ధ్యాన శతకాలు]లో.

భరోసా ఉంచడంలో మనిషి పొరపడుతున్నాడన్న సంగతి మృత్యుదేవత ప్రత్యేకించి అతనికి వేలెత్తి చూపనక్కరలేదు.

జన్మ తరవాత జన్మ చొప్పున ప్రతి మనిషీ తన దైవత్వ లక్ష్యం వేపు సాగుతూనే ఉంటాడు (అతని నడక ఎంత అడ్డాదిడ్డిగా ఉన్నా, అతని పద్ధతిలో అతను నడుస్తాడు). మానవుడి పురోగతిలో ఆటంకం కానటువంటి మృత్యువు, అతడు తన మాలిన్యాన్ని క్షాళనం చేసుకోడానికి వీలయిన సూక్ష్మలోకపు అనుకూలతరమైన పరిసరాన్ని అతనికి సమకూరుస్తుంది. "మీ గుండెలో గాభరా కలగనివ్వకండి... నా తండ్రి ఇంట్లో చాలా భవనాలున్నాయి."* ఈ లోకాన్ని వ్యవస్థీకరించడంలో భగవంతుడు తన ప్రతిభను వ్యయం చేసేసుకున్నాడనడానికి కాని, పరలోకంలో వీణలు మీటే పని తప్ప, మనసత్తా పరీక్షించేలా, మనకి ఆసక్తికరమైన విషయాలు ప్రస్తావించడనికాని అనుకోడానికి ఏమాత్రం అవకాశం లేదు.

మరణం అనేది మనుగడను మట్టుపెట్టేదీ జీవితం నుంచి చరమ పలాయనమూ కాదు; అమరత్వానికి ద్వారమూ కాదు. ప్రాపంచిక సుఖాల్లో మునిగి తన ఆత్మనుంచి పలాయనమైనవాడు, సూక్ష్మలోకపు సూక్ష్మాకర్షణల మధ్య దాన్ని తిరిగి వశం చేసుకోలేడు. అక్కడతడు కేవలం సూక్ష్మతర అనుభూతులనూ, మౌలికంగా ఒకటే అయిన సుందరమైన, మంచివైన ఇతోధిక సంవేదన శీలమైన అనుభవాల్నీ కూడబెట్టుకుంటాడు. సంఘర్షించే ఆ మానవుడు, ఈ స్థూల ప్రపంచమనే దాగర మీదే, ఆధ్యాత్మిక అభిన్నత అనే అక్షయ సువర్ణాన్ని సుత్తితో సాగగొట్టాలి. దురాశాపూరితమైన మృత్యువుకు స్వీకారయోగ్యమూ ఏకైక బహూకృతీ అయిన - కష్టపడి సంపాదించిన బంగారు నిధిని చేతబెట్టుకొని మానవుడు, భౌతిక పునర్జన్మల ఆవృత్తుల నుంచి చరమ విముక్తి సాధిస్తాడు.

చాలాకాలంపాటు నేను పతంజలి యోగసూత్రాలనూ, హిందూ దర్శన శాస్త్రానికి సంబంధించిన గూఢార్థమయమైన ఇతర గ్రంథాలనూ బోధించడానికి, ఎన్సినీటస్‌లోనూ లాస్ ఏంజిలిస్‌లోనూ తరగతులు నిర్వహించాను.

"దేవుడసలు ఆత్మనూ శరీరాన్నీ ఎందుకు కలపాలి?" అంటూ ఒకనాడు సాయంత్రం, తరగతిలో ఒక విద్యార్థి అడిగాడు. "సృష్టి అనే పరిణామశీలకమైన నాటకానికి నాంది పలకడంలో ఆయన ఉద్దేశించిన ప్రయోజనం ఏమిటి?" అనేకమంది ఇతరులు కూడా అలాటి ప్రశ్నలు వేశారు; వాటికి పూర్తిగా సమాధానాలు చెప్పడానికి తత్త్వవేత్తలు ప్రయత్నించి విఫలులయారు.

---

* యోహాను 14 1-2 (బైబిలు)

"కొన్ని రహస్యాల్ని అనంతకాలంలో ఛేదించడానికి వదిలిపెట్టు," అంటూండే వారు శ్రీయుక్తేశ్వర్‌గారు, చిరునవ్వు నవ్వుతూ. "మానవుడి పరిమిత తార్కిక శక్తులు, ఎవరివల్లా సృష్టికాని (స్వయంభువు) కేవల పరబ్రహ్మకు గల అనూహ్యమైన ఉద్దేశాల్ని ఎలా అవగాహన చేసుకోగలుగుతాయి?*

"దృశ్య జగత్తులో కార్యకారణ నియమంచేత బద్ధుడైన మానవుడిలో ఉన్న వివేకశక్తి, ఆద్యంతరహితుడూ కారణరహితుడూ అయిన దేవుడి చిక్కుముడిని చూసి గాభరాపడుతుంది. మానవుడి వివేకం సృష్టి రహస్యాల్ని భేదించలేకపోయి నప్పటికీ భగవంతుడే భక్తుడికోసం, ప్రతి రహస్యాన్నీ చివరికి వెల్లడి చేస్తాడు."

జ్ఞానంకోసం చిత్తశుద్ధితో తపన చెందేవాడు, దైవపథకంలోని ఓనమాలు కొన్ని సవినయంగా సాధనచేస్తూ అన్వేషణ ప్రారంభిస్తాడు; అంతేకాని జీవితపు "ఐన్‌స్టైన్ సిద్ధాంతం" తాలూకు సునిశిత గణిత రేఖాచిత్రం తనకు ముందే కావాలని కోరడు.

"మానవుడెవడూ (అంటే, కాలం అనే మాయ†కు సంబంధించిన సాపేక్షతలు గల మర్త్యుడెవడూ) ఎన్నడూ దేవుణ్ణి చూడలేదు; పరమపిత హృదయ స్థానంలో ఉన్న ఏకైక ఔరసపుత్రుడు (అంటే, ఓంకార ప్రకంపన ద్వారా భౌతిక దృగ్విషయాల్ని

---

* "నా ఆలోచనలు నీ ఆలోచనలు కావు నీ మార్గాలూ నా మార్గాలు కావు, అన్నాడు ప్రభువు భూమికన్న ఆకాశం ఎత్తులో ఉన్నట్టే నా మార్గాలు నీ మార్గాలకన్న ఉన్నతమైనవి, అలాగే నీ ఆలోచనలకన్న నా ఆలోచనలూను." యెషయా 35.8-9. 'ద డివైన్ కామెడీ'లో డాంటే ఇలా ధ్రువపరిచాడు.

"ఆయన కాంతిలో ప్రకాశమానమైన
ఆ స్వర్గంలో నేను ఉండివచ్చాను అక్కడ నేను చూసినవి చెప్పాలంటే
తిరిగి వచ్చినవాడికి, దాని నేర్పూ లేదు, ఎరుకా లేదు;
చిరకాంక్షితవస్తువైనవాడికి అది చేరువవుతున్నప్పుడు
మన బుద్ధి ఎంత గాఢంగా ఆనందమగ్నమవుతుందంటే,
తాను వచ్చిన దారిని అది మళ్ళీ పట్టుకోలేదు
అయినా, ఆ దివ్యరాజ్యాన్ని గురించిన జ్ఞానమేదైనా
భద్రపరచుకోడానికి జ్ఞాపకశక్తిలో ఉన్నంతవరకు
ఈ పాట ముగిసేవరకు నా గానానికి విషయమవుతుంది."

† వెలుగులోంచి చీకటిలోకీ మళ్ళీ చీకటిలోంచి వెలుగులోకీ సాగుతుండే ప్రపంచ దివారాత్ర చక్రం, సృష్టిమాయతో లేదా పరస్పర విరుద్ధ స్థితులతో ముడిపడి ఉన్నదన్న విషయాన్ని ఎప్పుడూ గుర్తుచేస్తూనే ఉంటుంది. (రోజులో సంధికాలాలైన సూర్యోదయ, సూర్యాస్తమయ సమయాల్ని, ధ్యానానికి శుభప్రదమైనవని అందుకే భావిస్తారు. యోగి, ఈ ద్వంద్వరూపాత్మక ఆవరణాన్ని ఛేదించుకొని అతీంద్రియ ఏకత్వాన్ని దర్శిస్తాడు.

అన్నిటినీ నడిపించే ప్రతిబింబిత కూటస్థ చైతన్యం, లేదా బహిర్ముఖంగా ప్రక్షేపించిన పూర్ణసిద్ధజ్ఞానం, ఏకత్వ వైవిధ్యాన్ని వ్యక్తీకరించడానికి 'హృదయస్థానం' నుంచి లేదా అస్పష్టదైవం అగాధాల్లోంచి వెలువరిచినటు వంటిది) ఆయన ఉనికిని ప్రకటించాడు" (రూపొందించాడు, లేదా సాక్షాత్కరింపజేశాడు).*

"నిజంగా, నిజంగా చెబుతున్నాను మీకు," అంటూ వివరించాడు ఏసుక్రీస్తు, "తండ్రి చేస్తుండగా చూస్తున్నది తప్ప కొడుకు తనంతట తాను ఏమీ చెయ్యలేడు; ఆయన చేసేది ఏదయినాసరే కొడుకు కూడా చేస్తాడు (కనక) "†

దృగ్విషయిక లోకాల్లో దేవుడు తనంతట తానుగా ప్రదర్శించే త్రిగుణాత్మక ప్రకృతిని హిందూ పవిత్ర గ్రంథాల్లో ప్రతీకాత్మకంగా చెప్పడం జరిగింది - సృష్టికర్తగా బ్రహ్మ, స్థితికారకుడుగా విష్ణువు, లయకారకుడుగా శివుడు. ఈ మూర్తిత్రయం కార్యకలాపాలు ప్రకంపనశీల సృష్టి అంతటా అనంతంగా ప్రకటితమవుతూనే ఉన్నాయి. కేవల పరబ్రహ్మ మానవుడి మనోగోచర శక్తులకు అతీతమైంది కనక, నైష్ఠిక హిందువు ఆయన్ని త్రిమూర్తుల పావనరూపాల్లో ఆరాధిస్తాడు.‡

అయితే భగవంతుడి విశ్వ సృష్టి - స్థితి - లయ కారక స్వరూపం ఆయన పరమావస్థ కాని, కనీసం ఆయన మూలప్రకృతి కాని కాదు (ఎంచేతంటే సృష్టి అన్నది ఆయన లీల, సృజనశీల క్రీడ).§ నియమబద్ధమైన అణుప్రవాహంలో వ్యక్తమయిన ఆయన బాహ్యప్రకృతి, ఆయన్ని బయల్పరచకుండా కేవలం వ్యక్తీకరించడం మట్టుకే చేస్తుంది కనక, త్రిమూర్తుల రహస్యాలనన్నిటినీ గ్రహించి నప్పటికీ కూడా, ఆయన అంతర్నిగూఢ మూలస్వరూపాన్ని అవగాహన చేసుకోడం

---

* యోహాను 1 18 (బైబిలు)

† యోహాను 5 19 (బైబిలు)

‡ 'సత్, తత్, ఓం' లేదా, పిత పుత్రుడు, పరిశుద్ధాత్మ అనే త్రయ రూప పర్యాయికి భిన్నమైన భావన ఇది. బ్రహ్మ - విష్ణు - శివులు పరమేశ్వరుడి త్రయభావాన్ని - స్పందన శీలమైన సృష్టిలో అంతర్నిహితమై ఉన్న కూటస్థ చైతన్యమనే 'తత్' ను లేదా పుత్రుణ్ణే సూచిస్తారు. త్రిమూర్తుల "భార్యలు" గా చెప్పే 'శక్తులు', స్పందన ద్వారా విశ్వాన్ని నిలిపే ఏకైక మూలకారణశక్తి అయిన 'ఓం' కారానికి లేదా, పరిశుద్ధాత్మకు సంకేతాలు. (125, 190, 254 పేజీల్లోని అధోజ్ఞాపికలు చూడండి )

§ "ఓ ప్రభూ... అన్నిటినీ నువ్వు సృష్టించావు అవన్నీ నీ ఆనందం కోసం సృష్టి అవుతు న్నాయి." - రివలేషన్ 4 11 (బైబిలు).

సాధ్యం కాదు. "కొడుకు తండ్రి దగ్గరికి చేరినప్పుడే"* ఈశ్వరుడి చరమ ప్రకృతి తెలుస్తుంది. విముక్త మానవుడు ప్రకంపనశీల లోకాల్ని అధిగమించి ప్రకంపన రహిత మూలతత్త్వంలోకి ప్రవేశిస్తాడు.

పరమ రహస్యాల్ని వెల్లడిచెయ్యమని కోరినప్పుడు గొప్ప ప్రవక్తలందరూ మౌనం వహించారు. "సత్యమంటే ఏమిటి?"† అని పిలేట్ అడిగినప్పుడు, క్రీస్తు జవాబు చెప్పలేదు. పిలేట్‌లాంటి బుద్ధివాదులు ఆడంబరంగా వేసే పెద్దపెద్ద ప్రశ్నలు, తీవ్రమైన జిజ్ఞాసతో వేసినవి కావడం అరుదు. అలాటి వ్యక్తులు సాధారణంగా, ఆధ్యాత్మికమైన విలువల‡ గురించి దృఢవిశ్వాసం లేకపోవడమన్నది "నిష్కపట మనస్తత్త్వానికి" గుర్తుగా పనికిమాలిన పొగరుబోతుతనంతో మాట్లాడుతూ ఉంటారు.

"సత్యానికి సాక్షిని కావాలన్న ధ్యేయంతోనే నేను పుట్టాను; ఈ కారణంవల్లే నే నీ లోకంలోకి వచ్చాను. సత్యానికి కట్టుబడ్డ ప్రతివాడూ నా స్వరం వింటాడు." ఈ మాటల్లో క్రీస్తు ఎంతెంతో ఇమిడ్చి చెప్పాడు. దేవుడి పుత్రుడు కేవలం తన **జీవితం** వల్ల "సాక్షిగా నిలుస్తాడు." అతడు సత్యరూపుడవుతాడు; అతడు దాన్ని వివరించడానికి కూడా పూనుకుంటే, అది ఉదారంగా చేసిన అత్యుక్తి అవుతుంది.

సత్యమన్నది ఒక సిద్ధాంతం కాదు, తత్త్వశాస్త్రంలో ఉన్న చింతనా విధానం కాదు, బుద్ధిపరమైన అంతర్జ్ఞానమూ కాదు. సత్యమనేది, 'వాస్తవా'నికి కచ్చితమైన అనురూపం. మానవుడి దృష్టిలో, సత్యం, ఆత్మరూపమైన తన వాస్తవ ప్రకృతిని గురించిన అచంచల జ్ఞానం. ఏసుక్రీస్తు, తన జీవితంలో ప్రతిచర్య ద్వారా, ప్రతిమాట ద్వారా, తన అస్తిత్వ సత్యం - ఈశ్వరుడే తనకు మూలమన్న సంగతి - తనకు తెలుసునని నిరూపించాడు. తనను సర్వవ్యాప్తమైన కూటస్థ చైతన్యంగా పూర్తిగా గుర్తించుకొన్న అతడు, సులువుగా తుదిపలుకుగా ఇలా చెప్పాడు; "సత్యానికి కట్టుబడ్డ ప్రతివాడూ నా స్వరం వింటాడు," అని.

---

* యోహాను 14 12

† యోహాను 18 38

‡ "మంచిని ప్రేమించు; అదొక్కటే స్వేచ్ఛగా ఉన్నది;
అదే నేర్పగలదు నీకు, ఎలా పైకి పోవాలో
తరంగిత ఘంటానాదం కన్న పైకి;
ఆ మంచే నీరసమై ఉంటే,
స్వర్గమే దానికోసం కిందికి వంగుతుంది." - మిల్టన్, 'కేమస్'

బుద్ధుడు కూడా అధిభౌతిక పరమతత్వాన్ని వివరించడానికి నిరాకరించాడు; భూమిమీద మానవుడికున్న కొద్ది క్షణాలనూ, నైతిక ప్రకృతిలో పరిపూర్ణత సాధించడానికి వినియోగించడం మంచిదని పొడిమాటల్లో చెప్పాడు. చైనాదేశపు మార్మికుడు లావో-ట్జు సరిగా చెప్పాడు. "తెలిసినవాడు దాన్ని చెప్పడు; చెప్పిన వాడికి అది తెలిసి ఉండదు." భగవంతుడి చరమరహస్యాలు "చర్చకు పెట్టడానికి వీలయిన" విషయాలు కావు. ఆయన గూఢ సంకేతలిపిని అర్థం చేసుకోడమన్నది, మనిషి మరో మనిషికి నేర్పలేని కళ; ఇక్కడ దేవుడొక్కడే గురువు.

"నిశ్చలంగా ఉండి, నేను దేవుణ్ణని తెలుసుకో."* తన సర్వవ్యాపిత్వాన్ని ఈశ్వరుడు ఎప్పుడూ డాంబిక ప్రదర్శనకు పెట్టడు; స్వచ్ఛమైన నిశ్శబ్దంలోనే (మౌనస్థితుల్లోనే) ఆయన వినిపిస్తాడు. సృజనాత్మక ఓంకార ప్రకంపన విశ్వమంతటా ప్రతిధ్వనించే ఆది నాదబ్రహ్మం. తనతో అనుసంధానం పొందిఉన్న భక్తుడికోసం, గ్రహణానుకూలమయిన పదాలుగా, అప్పటికప్పుడు మార్పు చెందుతుంది.

మానవ హేతుబుద్ధి గ్రహించుకోగలిగినంతవరకు, సృష్టికి గల దివ్యప్రయోజనాన్ని వేదాల్లో వివరించడం జరిగింది. ప్రతి మనిషీ ఆత్మగా, భగవంతుడు సృష్టించిన వాడేననీ, ఆ ఆత్మ తన కేవల వ్యక్తిత్వాన్ని తిరిగి పొందేముందు, అనంతత్వానికున్న ఒకానొక ప్రత్యేక లక్షణాన్ని విశిష్టంగా అభివ్యక్తం చేస్తుందనీ ఋషులు చెప్పారు. ఆ విధంగా, దేవుని వ్యక్తిత్వంలో ఒక అంశాన్ని పొందిన మానవులందరూ దేవుడికి సమానంగా ప్రీతిపాత్రులు.

ప్రపంచదేశాలకు పెద్దన్న అయిన భారతదేశం ప్రోదిచేసుకున్న జ్ఞానం సర్వ మానవాళికీ చెందే వారసత్వం. యావత్ సత్యంలాగే వైదిక సత్యం, భగవంతుడిదే కాని, భారతదేశానిది కాదు. వేదాల దివ్యగంభీర సత్యాల్ని గ్రహించుకోగల పరిశుద్ధ పాత్రలవంటి మనస్సులుగల మహాఋషులు సర్వమానవాళికీ సేవ చెయ్యడానికి ఈ భూమిమీద పుట్టిన మానవజాతి సభ్యులే కాని, ఎక్కడో మరో లోకంలో పుట్టినవారు కారు. సత్యనిష్ఠమైన లోకంలో జాతినిబట్టి కాని, దేశాన్నిబట్టి కాని చూపించే భేదభావాలు అర్థంలేనివి; అక్కడ కావలసిన ఏకైక యోగ్యత, దాన్ని అందుకోడానికి ఆధ్యాత్మిక అర్హత మాత్రమే.

దేవుడంటే ప్రేమ; సృష్టికి ఆయన నిర్ణయించిన ప్రణాళిక ప్రేమలోనే పాదుకో గలదు. ఆ చిన్న ఆలోచన, పాండిత్యమండితమైన తర్కవితర్కాలకన్న ఎక్కువగా మానవ హృదయానికి ఊరట కలిగించడం లేదా? సత్యగర్భంలోకి

* సామ్స్ 46 10 (బైబిలు)

చొచ్చుకుపోయిన ప్రతిసాధువూ దివ్యమైన విశ్వప్రణాళిక ఒకటి ఉంటుందనీ అది సుందరమైనదనీ ఆనందమయమయినదనీ ధ్రువపరుస్తాడు. దేవుడు తన ఉద్దేశాన్ని యెషయా ప్రవక్తకు ఈ మాటల్లో చెప్పాడు:

"నా నోటినుంచి వెలువడ్డ మాట (సృజనాత్మకమైన ఓంకార నాదం) నా దగ్గరికి వృథాగా తిరిగి రాదు; నేను ఆశించినది చేస్తుందది. నేను దాన్ని దేంట్లోకి పంపితే, అది వర్ధిల్లుతుంది. అతడు ఆనందంగా బయటికి వెళ్తాడు. అతన్ని శాంతితో ముందుకు నడిపించడం జరుగుతుంది. కొండలూ గుట్టలూ నీ ముందు విరిగిపడుతూ గానం చేస్తాయి; భూమి మీది చెట్లన్నీ చప్పట్లు కొడతాయి."*

"నువ్వు ఆనందంగా బయటికి వెళ్ళాలి; నిన్ను శాంతితో ముందుకు నడిపించడం జరుగుతుంది." కష్టజీవులైన ఇరవయ్యో శతాబ్ది మనుషులు ఆ అద్భుత వాగ్దానాన్ని ప్రగాఢమైన ఆకాంక్షతో వింటారు. దాంట్లో ఉన్న సంపూర్ణ సత్యం, దివ్య ఔరసత్వాన్ని తిరిగి స్వాధీనంలోకి తెచ్చుకోడానికి దృఢసంకల్పంతో శ్రమించే ప్రతి దైవభక్తుడూ సాక్షాత్కరింపజేసుకోగలిగింది.

ప్రాచ్యపాశ్చాత్యదేశాల్లో క్రియాయోగం నిర్వహించే పాత్ర ఇప్పుడిప్పుడే మొదలయింది. మానవ దైన్యాన్ని అంతనూ జయించడానికి నిర్దిష్టమైన, శాస్త్రీయమైన ఆత్మసాక్షాత్కార సాధన ప్రక్రియ ఒకటి ఉందని మానవులందరూ తెలుసుకోవాలి!

ధగధగ మెరిసే రత్నాల మాదిరిగా భూమి అంతటా వ్యాపించి ఉన్న వేలాది మంది క్రియాయోగులకు ప్రేమపూర్వకమైన భావతరంగాల్ని ప్రసారం చేస్తూ, కృతజ్ఞతతో నేను తరచు అనుకుంటూ ఉంటాను:

"ఈశ్వరా, ఈ సన్యాసికి పెద్ద సంసార మిచ్చావుకదయ్యా!"

---

* యెషయా 55.11-12, (బైబిలు)

# జీవితంలోనూ మరణంలోనూ కూడా యోగి

పరమహంస యోగానందగారు అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోని కాలిఫోర్నియా రాష్ట్రంలో, లాస్ ఏంజిలిస్ నగరంలో, 1952 మార్చి 7 తేదీన, భారత రాయబారి మాన్యశ్రీ వినయ్ రంజన్ సేన్‌గారి గౌరవార్థం జరిగిన విందులో ముగింపు ప్రసంగం చేసిన తరవాత 'మహాసమాధి' (యోగి చివరిసారిగా సచేతనంగా శరీరాన్ని విడిచిపోవడం) చెందారు

ఈ జగద్గురువులు యోగవిద్య విలువను జీవితంలోనే కాకుండా మరణంలో కూడా ప్రదర్శించారు. ఆయన చనిపోయిన కొన్ని వారాల తరవాత కూడా ఆయన ముఖం అమరత్వమనే దివ్యతేజస్సుతో ప్రకాశించింది.

లాస్ ఏంజిలిస్‌లోని ఫారెస్ట్ లాన్ మెమోరియల్ పార్క్ మార్చురీ (శవాల్ని భద్రపరిచే చోటు; ఇక్కడ మహాగురువుల భౌతికకాయాన్ని తాత్కాలికంగా ఉంచటం జరిగింది) డైరెక్టరు శ్రీ హారీ టి. రోవ్, సెల్ఫ్-రియలైజేషన్ ఫెలోషిప్ సంస్థకు రాసిన ప్రమాణిత పత్రంలోని కొన్ని భాగాలు కింద పొందుపరుస్తున్నాం:

"పరమహంస యోగానందగారి మృతదేహం మీద కంటికి కనబడే క్షయత్వ చిహ్నాలేవీ లేకపోవడం మా అనుభవంలో అత్యంత అసాధారణమైన విషయం.... చనిపోయిన ఇరవై రోజుల తరవాత కూడా ఆయన భౌతికకాయంలో శారీరక విఘటనం కనబడలేదు.... ఆయన చర్మంమీద బూజుపట్టిన దాఖలా ఏమీ కనిపించలేదు; ఆయన శరీర కణజాలాలు (టిష్యూస్) ఎండిపోవడం ఏమీ గోచరించలేదు. ఇంత పరిపూర్ణమైన శరీర సంరక్షణ మా శవాగార చరిత్రలో, మాకు తెలిసినంతవరకు సాటిలేనిది.... యోగానందగారి శవాన్ని స్వీకరించినప్పుడు శవాగార సిబ్బంది, శరీర క్షయానికి సంబంధించిన మామూలు క్రమగత పరిణామ చిహ్నాల్ని, శవపేటిక మీద ఉన్న గాజుమూతలోంచి గమనించవచ్చునని భావించారు. ఒక్కొక్క రోజు గడుస్తున్న కొద్దీ పరిశీలనలో ఉంచిన ఈ శరీరంలో మార్పేమీ రాకపోవడంతో మా ఆశ్చర్యం పెరుగుతూ వచ్చింది. యోగానందగారి శరీరం, అద్భుత నిర్వికారస్థితిలో ఉన్నట్టు కనిపించింది.... ఏ సమయంలోనూ కూడా ఆయన శరీరం నుంచి దుర్వాసన వెలువడలేదు.

"యోగానందగారి భౌతిక రూప దర్శనం, మార్చి 7 తేదీన ఎలా ఉందో, శవపేటిక మీద కంచుమూత పెట్టి మూసిన, మార్చి 27 తేదీ వరకు అచ్చంగా అలాగే ఉంది. ఆయన చనిపోయిననాటి రాత్రి ఎంత తాజాగా, ఎంత నిర్వికారంగా కనిపించారో, మార్చి 27న కూడా అలాగే కనిపించారు. ఆయన దేహం అసలు, కంటికి కనిపించే శారీరక విఘటనానికి గురి అయిందని చెప్పడానికి మార్చి 27న ఏ దాఖలా కనిపించలేదు. ఈ కారణాలవల్ల పరమహంస యోగానందగారి వృత్తాంతం మా అనుభవంలో అద్వితీయమైనదని మళ్ళీ చెబుతున్నాం."

# తపాలా బిళ్ళ




1977లో, పరమహంస యోగానందగారి 'మహాసమాధి' 25వ వార్షికోత్సవ సందర్భంగా వారి గౌరవార్థం భారత ప్రభుత్వం ఈ ప్రత్యేక స్మారక తపాలా బిళ్లను విడుదల చేసింది. దానితోపాటు ప్రచురించిన కరపత్రంలో ఈ క్రింది విషయాలున్నాయి:

"పరమహంస యోగానందగారి జీవితంలో దేవునిపట్ల ప్రేమ - మానవజాతికి సేవ అనే ఆదర్శం పూర్తిగా వ్యక్తమయింది.... వారి జీవితంలో ప్రధాన భాగం భారతదేశానికి వెలుపల గడిచినప్పటికీ, మన దేశపు గొప్ప సాధువుల్లో ఆయనకు సముచిత స్థానం ఉంది. సర్వదేశాల ప్రజలను ఆత్మయాత్రా పథంలోకి ఆకర్షిస్తూ, ఆయన ప్రారంభించిన కృషి అవిరళంగా అభివృద్ధి చెందుతూ ప్రకాశిస్తోంది."

# యోగదా సత్సంగ సొసైటి ఆఫ్ ఇండియా

వ్యవస్థాపకులు : శ్రీశ్రీ పరమహంస యోగానంద

అధ్యక్షురాలు : శ్రీశ్రీ దయామాత

## ఆశయాలూ ఆదర్శాలూ

దేవుడితో వైయక్తికమయిన అపరోక్షానుభూతి సాధించడానికి తోడ్పడే నిర్దిష్ట శాస్త్రీయ ప్రక్రియల పరిజ్ఞానాన్ని అన్ని దేశాల్లోనూ వ్యాప్తి చేయడం.

జీవితానికి ప్రయోజనం, మానవుడి పరిమిత మర్త్యచేతనను దైవ చేతనగా స్వయంకృషితో పరిణామం చెందేటట్లు చేయడమేనని బోధించడం.

ఏసుక్రీస్తు బోధించిన మూల క్రైస్తవంలోనూ శ్రీకృష్ణభగవానుడు బోధించిన మూల యోగంలోనూ సంపూర్ణ సామరస్యం, మౌలికమయిన ఏకత్వం ఉన్నాయని వెల్లడించడం; ఈ సత్యసూత్రాలు వాస్తవ మతాలన్నింటికీ సమానమయిన శాస్త్రీయ ప్రాతిపదికలని నిరూపించడం.

నిజమయిన మతవిశ్వాస మార్గాలన్నీ నిర్దేశించే ఏకైక దివ్యమైన రాజమార్గాన్ని చూపించడం; ప్రతినిత్యం శాస్త్రీయమయిన పద్ధతిలో, భక్తిపూర్వకంగా చేసే భగవద్ధ్యానమే ఆ రాజమార్గం.

శారీరక వ్యాధి, మానసిక వైకల్యాలు, ఆధ్యాత్మిక జ్ఞానరాహిత్యం అనే మూడు రకాల బాధలనుంచి మానవుణ్ణి విముక్తుణ్ణి చేయడం.

"నిరాడంబర జీవనం, ఉన్నత భావనం" ప్రోత్సహించడం; ప్రపంచ ప్రజలందరి ఏకత్వానికి దేవుడితో బాంధవ్యమనే శాశ్వత ప్రాతిపదిక ఉందని బోధించి వాళ్ళలో సోదరభావం వ్యాప్తిచేయడం.

శరీరంకన్న మనస్సుకూ మనస్సుకన్న ఆత్మకూ ఆధిక్యం ఉందని నిరూపించడం.

చెడును మంచితోనూ విచారాన్ని సంతోషంతోనూ క్రూరత్వాన్ని దయ తోనూ అజ్ఞానాన్ని జ్ఞానంతోనూ జయించడం.

విజ్ఞానశాస్త్రానికీ మతానికీ ఆధారభూతమయిన సూత్రాల ఏకత్వాన్ని అనుభూతం చేసుకొని, దానిద్వారా ఆ రెంటినీ ఏకం చేయడం.

తూర్పు, పడమటి దేశాల మధ్య సాంస్కృతిక, ఆధ్యాత్మిక అవగాహన పెంపొందాలనీ వాటి సునిశిత విశిష్టలక్షణాల వినిమయం జరగాలనీ ఉద్బోధించడం.

మానవజాతిని విస్తృతమయిన తన ఆత్మగానే గ్రహించి సేవ చేయడం.

# *Books and Audio Cassettes by Sri Sri Paramahansa Yogananda*

## BOOKS BY PARAMAHANSA YOGANANDA

- Man's Eternal Quest
- The Divine Romance
- Journey to Self-realization
- Wine of the Mystic
- The Science of Religion
- Whispers from Eternity
- Scientific Healing Affirmations
- Metaphysical Meditations
- The Law of Success
- How You Can Talk With God
- Sayings of Paramahansa Yogananda
- God Talks With Arjuna: *The Bhagavad Gita (A New Translation and Commentary)*

## AUDIO RECORDINGS OF PARAMAHANSA YOGANANDA

- Beholding the One in All
- The Great Light of God
- Chants and Prayers
- Awake in the Cosmic Dream
- Songs of My Heart
- Be a Smile Millionaire

## OTHER BOOKS FROM YOGODA SATSANGA SOCIETY

- The Holy Science *by Sri Sri Swami Sri Yukteswar Giri*
- Only Love *by Sri Sri Daya Mata*
- Finding the Joy Within You: Personal Counsel for God-Centered Living *by Sri Sri Daya Mata*
- God Alone: The Life and Letters of a Saint *by Sri Gyanamata*
- "Mejda": Sri Sri Paramahansa Yogananda — His Family and Early Life *by Sananda Lal Ghosh*

Some of the above-mentioned books are also published in Bengali, Gujarati, Hindi, Kannada, Malayalam, Marathi, Oriya, Tamil and Telugu. For a complete list of books and audio cassettes, write to Yogoda Satsanga Society of India at the address given below. Also available are black-and-white and color pictures of Sri Sri Paramahansa Yogananda.

*Available at your local bookstore or from:*

Yogoda Satsanga Society of India
Paramahansa Yogananda Path, Ranchi 834 001, Jharkhand
Tel. (0651) 2460071, 2460074, 2461578

# పదసూచిక

1 ప్రాచ్యనామాలు చాలా వరకు మొదటి పేరుతో అకారాది క్రమంలో ఇవ్వబడ్డాయి· ఉదాహరణకు భగవతీ చరణ్ ఘోష్ భ' క్రింద ఇవ్వబడింది

పాశ్చాత్యనామాలు (వారి) ఇంటిపేరుతో 'అ కారాది క్రమంలో ఇవ్వబడ్డాయి. ఉదాహరణకు జేమ్స్ జె లిన్ 'ల' క్రింద ఇవ్వబడింది.

2. సంఖ్య తరువాత 'ప' ఉంటే ఆ విషయం గురించి విశేషంగా, విపులంగా చెప్పబడిన ప్రధాన పుటలు సూచిస్తుంది.

సంఖ్య తరువాత ఉన్న అ' ఆ పేజీలో ఉన్న 'అధోజ్ఞాపిక' ను సూచిస్తుంది.

## అ

## క

## గ



## ఘ



## చ



## ఛ



## జ

## న



## ప

## మ

## య

## వ

## శ

## ష



## స

## హ




గ్రంథాలయ సంస్థ
A C.No. 137 221
హైదరాబాద్-500032

# Yogoda Satsanga Lessons

The *Yogoda Satsanga Lessons* are unique among Paramahansaji's writings in that they give his step-by-step instructions in yoga techniques for God-realization. The simple yet highly effective methods taught in the Lessons enable one to harmonize and recharge the body with life energy; to awaken the unlimited power of the mind, and, above all to achieve direct, personal experience of God through the *Kriya Yoga* science of meditation.

In addition, the Lessons cover a broad range of other subjects — offering inspiration and practical guidance for living every day in greater harmony with oneself and others and for coping with the multitude of problems that seem so pressing in today's world. A few of the many topics covered are :

- **Strengthening the Power of Will for All-Round Success**
- **Creating Harmony in Family Life & Marriage**
- **Freeing Yourself From Bad Habits**
- **The Art of Getting Along With Others**
- **Banishing Fear, Worry, & Stress**
- **How to Weave God into Your Daily Life**
- **Spiritualizing Business**
- **Life After Death**
- **Finding & Expressing Unconditional Love**
- **How to Build World Unity**
- **Understanding Karma & Reincarnation**
- **Yoga Principles of Rejuvenation & Healing**

*For free Introductory Literature please write or call*

YOGODA SATSANGA SOCIETY OF INDIA
Paramahansa Yogananda Path Ranchi 834 001 Jharkhand
Tel (0651) 2460071 2460074 2461578

ఈ ఆత్మకథ ఏకకాలంలో ఒక పరిశీలన, ఒక పద చిత్రణ. మానవ అస్తిత్వపు అంతిమ మర్మాలను, మరిచిపోలేని రీతిలో నిశితంగా, పరిశీలించే బహుళాదరణ పొందిన ఈ ఆత్మకథ, మన కాలపు ఆధ్యాత్మిక మహాపురుషుల్లో ఒకరి ఆకర్షణీయమైన వ్యక్తిత్వచిత్రణ కూడా. పరమహంస యోగానందగారు ఆకట్టుకునే నిజాయితీతోనూ, ధారాళమైన వాక్పటిమతోనూ, హాస్యయుతంగానూ, ఉత్తేజకరమైన తమ జీవిత కథని చెబుతారు. అద్భుతమైన ఆయన బాల్యానుభవాలూ, జ్ఞాని అయిన ఒక గురువుకోసం యవ్వనంలో ఆయన చేసిన అన్వేషణలో తారసపడిన అనేకమంది సాధుసంతులతో అనుభవాలూ, దైవసాక్షాత్కారం పొందిన గురుదేవుల ఆశ్రమంలో పది సంవత్సరాలు సాగిన శిక్షణా, ప్రపంచ వ్యాప్తంగా సత్యాన్వేషకులకి బోధచేస్తూ గురువుగా ఆయన గడిపిన అనేక సంవత్సరాల కాలం- అన్నీ ఇందులో వివరించబడ్డాయి. రమణమహర్షి, ఆనందమయిమాత, (రామకృష్ణ పరమహంస శిష్యుడూ, సాధుశీలి అయిన) మాస్టర్ మహాశయ, మహాత్మాగాంధి, రవీంద్రనాథ్ టాగూర్, జగదీశ్‌చంద్ర బోసులతో ఆయన సమాగమ వివరాలు కూడా ఇందులో పొందు పరచబడ్డాయి.

ఆధునిక ఆధ్యాత్మిక గ్రంథరాజముగా కొనియాడబడిన ఈ పుస్తకం 21 భాషల్లోకి అనువదించబడింది. అనేక కళాశాలల్లో విశ్వవిద్యాలయాల్లో పాఠ్యగ్రంథంగా, పఠనీయ గ్రంథంగా విస్తృతంగా దీన్ని ఉపయోగిస్తున్నారు. ఒక జీవిత కాలపు మనోహరమైన గ్రంథ పఠనానుభవంగా ఒక యోగి ఆత్మకథను వేలాది పాఠకులు పేర్కొన్నారు.

"ఆంగ్లంలోకాని, మరే ఇతర ఐరోపా భాషలో కాని 'యోగం' గురించి ఇటువంటి చక్కటి వర్ణన ఇంతవరకు రాలేదు." -కొలంబియా యూనివర్శిటీ ప్రెస్, అమెరికా

"ఈ మహర్షి 'ఆత్మకథ' సమ్మోహకమైనది.' -ద టైమ్స్ ఆఫ్ ఇండియా

"ఒక ఆధ్యాత్మిక విప్లవాన్ని తీసుకువచ్చే శక్తి ఈ ప్రముఖమైన జీవిత చరిత్రకు ఉన్నదని మనం ఎంచాలి." -ష్లేస్విగ్-హోల్‌స్టీనిష్ టాగస్ పోస్టు, జర్మనీ

"మనస్సుయొక్క ఆత్మయొక్క కిటికీలను తెరిచే పుస్తకం." -ఇండియా జర్నల్

Rs. 100.00

*Autobiography of a Yogi* (Telugu)